అనువాద వాఙ్మయము - 1
చరిత్ర

# భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర

## ద్వితీయ భాగము

ఆంగ్ల రచన
శ్రీ తారాచంద్

అనువాదము
ఆచార్య భూపతి లక్ష్మీనారాయణరావు




తెలుగు అకాడమి
హైదరాబాదు-29
1973

BHARATA SWATANTRYODYAMA CHARITRA, PART-II (History of the Freedom Movement in India); *English Original* : Sri Tarachand – *Translation* : B. Lakshminarayana Rao ; First Edition, 1973, pp. xx + 656.



*First Edition 1973*
*Copies : 3,000*

Published by TELUGU AKADEMI, HYDERABAD-500023 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional languages at the University level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.



Price : Rs. **22.25**

PRINTED IN INDIA
Text at Murali Printers, Kanchar Bazar, 3-3-723/24, Secunderabad.
Cover at the A. P Text-book Press, Mint Compound,
**Hyderabad-500004, Andhra Pradesh.**

# పీఠిక

పందొమ్మిదో శతాబ్దంలో జరిగిన ఆంగ్ల ప్రభావముయొక్కసంఘట్టనకు, భారతదేశంలో ఎటువంటి ప్రతిక్రియ ఉత్పన్నమయిందనే విషయాన్ని, ఈ భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర ఏడవ సంపుటి వివరిస్తుంది. ఈ రాపిడి, ప్రధానంగా రాజకీయ సంబంధమయింది. దేశంలో ప్రాచీనంగా నెలకొనివుండిన మధ్యయుగపు అభిప్రాయాలకు భిన్నమూ, విలక్షణమూ అయిన ఆధునిక భావోత్సాహంతో అభిషిక్తులైన వ్యక్తులు, ఈ ఆంగ్ల రాజకీయ ప్రభావాన్ని, ప్రవర్తింపచేసినారు. రాజకీయాల విషయంగా వీరిది శిల్ప రచనాత్మకదృష్టి. కనుకనే, సాంఘికములైన వివిధకార్యశక్తులన్నిటిలోనూ, ఈ రాజకీయశక్తి అభివ్యాప్తిచెంది, వాటిని ప్రవర్తింపచేస్తూ ఉన్నతమైన పాత్ర గ్రహించింది. ఆంగ్ల రాజకీయ ప్రభావ మీవిధంగా, భారత జీవితంపై సువ్యాప్తంగానూ, సుగాఢంగానూ తాకింది. దీనివల్ల లాభదాయకమూ, నష్టకరమూ ఐన రెండు పరిణామాలూ ఏర్పడినవి.

పాశ్చాత్య దేశాలతో ఏర్పడిన ఈ సంఘాతం కారణంగా, సిద్ధించిన పరిణామాలు రెండూ పరస్పర వ్యతిరేకాలు. మన ప్రాచీన సంప్రదాయాలూ,- విలువలూ, అభిప్రాయాలూ, ఆచారవ్యవహారాలూ, సంస్థలూ,- హేతువాద సిద్ధాంతాలను అనుసరించిన విమర్శకు గురిఐనవి. హేతుబద్ధంగా కనబడని వాటినీ, అహితమని తోచిన వాటినీ, పరిత్యజించుటకో, లేక సంస్కరించుటకో పూనుకోవడం జరిగింది. పాశ్చాత్య సంఘాతం వల్ల కలిగిన వినాశకర పరిణామమిది. మరొక వైపు, భారతజాతిలో అగాధమై ఇమిడియున్న చైతన్యంలో నుండి దీనికి ప్రతివచనం వెలువడింది. సహస్రాబ్దాలుగా వ్యక్తి జీవితాన్నీ, సంఘ జీవితాన్నీ ఉత్తేజనపరుస్తూ భారతీయ సంస్కృతికీ, దానివ్యక్తిత్వానికీ, అవిచ్ఛిన్నతకూ వైలక్షణ్యమై నిలిచిన జీవితసూత్రాల అసదృశ స్వభావాన్ని పునఃప్రకాశనముగావించి పునరుజ్జీవింపచేయుటకూ, నూతన భారతజాతియొక్క పునర్నిర్మాణానికీ, రాజకీయ స్వాతంత్ర్యము ప్రథమ ఉపాధి అయింది. పరప్రభుత్వ ప్రాబల్యం ఈ విధంగా భారతజాతి నవచైతన్య పునర్వికాసానికి హేతువయింది.

ఆధునిక ఆశయాల ప్రాబల్యంవల్లనూ, కార్యాత్మక సంచలనంయొక్క ఒత్తిడివల్లనూ దేశంలో గొప్పపరివర్తనం కలిగింది. సాంఘికమత సంస్కారాది ఉద్యమాలూ, ప్రజ్ఞావంతమైన జ్ఞాన సమీకరణమూ, సాహిత్యాభివ్యక్తి, ఆర్థికమూ రాజకీయమూ ఐన మార్పు,- ఇవన్నీ పై పరివర్తనను వ్యక్తపరచే చిహ్నాలు. పందొమ్మిదోశతాబ్దపు పూర్వభాగంలో అప్పుడే ఉదయిస్తున్న ఈ ఆధునికతా ప్రభావాన్ని గమనించి, ప్రాచీన సంప్రదాయ బద్ధులైనవారు మిక్కిలిగా ఆందోళన పడినారు. అతి ప్రాచీనమైన-తమ సంస్కారానికీ ఆర్థికరాజకీయ మతసంబంధములైన, వ్యవస్థలకూ,- అన్నిటికీ ఈ పాశ్చాత్య సామ్రాజ్యవాదం గొప్ప విపత్తుగా పరిణమిస్తుందని వీరు భావించినారు.

ఇటువంటి విపర్యాసకరమైన భవితవ్యతను తొలగించడానికై, ప్రాచీన సంప్రదాయస్థులు ప్రబలమైన ప్రతిక్రియకు పూనుకొన్నారు. కాని, వారి కృషి నిష్ఫలమయింది. మొదటిరోజుల్లో

జరిగిన తిరుగుబాట్లు, భిన్నప్రదేశాలలో ఛిద్రఛిద్రంగా వెలువడినవేకాని, సుసంఘటితమైనవి కావు కడపటికివి 1857లో జరిగిన సంక్షోభాంతమైన విప్లవంగా ఉచ్చస్థాయి నందుకొన్నాయి

ఈలోగా, నవభారతం రూపొందుతూ వచ్చింది వైయక్తికమూ అవిచ్ఛిన్నమూ అగు భారతీయ సంస్కృతి నాధారంగా చేసుకొని నాయకులు జాతీయైక్యనిర్మాణానికి పూనుకొన్నారు రాజకీయమైన ప్రత్యేకతతో కూడిన సాంస్కృతిక సమైక్యము, అనేది భారత చరిత్రలో ఇంత వరకూ వస్తూఉన్న ప్రత్యేక లక్షణము సంస్కృతి విషయకమైన సామరస్యాన్ని దృఢపరచడమూ, శాశ్వతమూ సువ్యవస్థితమూ ఐన రాజకీయ సమైక్యమును నెలకొల్పడమూ - ప్రస్తుత ప్రయత్నంగా ఏర్పడింది

భారత జాతీయతా వికాసానికి రూపకల్పన జరిగింది, పందొమ్మిదోశతాబ్దపు ఉత్తరార్థంలో తొలిరోజుల్లో ఈ ఉద్యమం బలహీనంగానూ ఆత్మవిశ్వాసరహితంగానూ ఉండింది సంఘంలోని మధ్యతరగతులవారిపై ఈ ఉద్యమ ప్రభావం ప్రసరించింది ప్రచారంలో ఐక్యము లేకపోయింది ప్రయోజనాల విషయంలోనూ, లక్ష్యాల విషయంలోనూ, రాజకీయాలకూ మతవిషయాలకూ గల వైవిధ్యాన్ని వీరు గుర్తించలేక పోయిరి బ్రిటిష సామ్రాజ్యంయొక్క వ్రేలుపట్టుకొనే, నడుస్తూవచ్చింది ఉద్యమము

రాజకీయ సంస్కరణ విషయంలో బ్రిటిష్ రాజనీతిజ్ఞులు ఎన్నో హామీలను ఇచ్చినారు ధారాళమైన వాగ్దానాలు చేసినారు మనవారు నిష్కపటులూ అనుభవంలేనివారూ కావడంచేత, బాహ్యరూపమే అంతరంగమని భ్రమించి, బ్రిటిష్‌వారి హామీలనూ వాగ్దానాలనూ విశ్వసించి ఒప్పుకొన్నారు సామ్రాజ్య ప్రయోజనాలకు జాతీయాకాంక్షలతో పొందిక కుదరదన్న విషయాన్ని వారు గ్రహించలేక పోయిరి ఉద్యమంగా రూపొందిన జాతీయసంకల్పము ఈ విధంగా ప్రథమదశలో, తనలక్ష్యాలపట్ల అస్తవ్యస్తంగానూ, ఆ లక్ష్యసాధనంలో దాస్యానుకారిగానూ ఉండింది ఈలోగా, స్వాతంత్ర్య సమరారంభానికి కడపటి మెట్టుగా, సాంఘిక ఆర్థికాభివృద్ధి ప్రయత్నాలు జరుగుతూవచ్చినవి ఒకవైపు ప్రజానికంయొక్క దుస్థితి పెరుగుతూనే ఉండగా మధ్యతరగతివారి ప్రాబల్యమూ పలుకుబడీ ఎక్కువవుతూ వచ్చినవి భారతదేశం అనుభవిస్తూన్న దుస్థితి ఎట్టిదో మధ్యతరగతులవారు అవగాహన చేసుకొన్నారు ఆ దుస్థితిని తొలగించడానికి, వారింతవరకూ అవలంబిస్తూ వచ్చిన విధానములెట్లు నిరర్థకములైనవో కూడా నెమ్మదిగా అర్థమయింది పందొమ్మిదోశతాబ్దంలో కలిగిన క్షామ పరంపరలు ఏవిధంగా ప్రజానీకాన్ని చెప్పరాని దుస్థితికి గురిచేసినాయో, వారు గుర్తించినారు ప్రజానీకంయొక్క స్థితి ఎంత హతాశంగా ఉన్నదన్నదానికి ఈ దుస్థితి ప్రబల కారణమయింది

మరొకవైపున, జాతీయచైతన్యోదయ సూచకంగా మత, సాంఘిక సంస్కరణోద్యమాలూ, సాహిత్యకళారంగాల్లో పునరుజ్జీవన ప్రయత్నాలూ, జరుగుతూ వచ్చినాయి అస్వాతంత్ర్యతాంధకారంనుండీ, తత్ఫలితమైన దుస్థితినుండీ ప్రజలనుద్ధరించి, వారి జీవితాన్ని ఆశాపూరితంగాచేసే స్వాతంత్ర్య భానూదయానికి ఈ ఉద్యమాలు సూచకాలు

కానీ, పాలకులు భారత జాతీయతను గుర్తించడానికిగాని, ప్రజానీకముయొక్క దుస్థితిని గూర్చి గమనించడానికి గాని పూనుకోలేదు "అఖండమైన స్వతంత్ర భారతదేశము ఎప్పుడూ లేదు, ఇప్పుడూలేదు, దేశంలో ఒకభాగంకూడా స్వతంత్రమై ఉండలేదు." అని, సర్ జాన్‌స్ట్రాచి

అభిప్రాయం వెల్లడి చేసినాడు. పాలకుల ఈ ఉదాసీనభావమే భారత ప్రజలకూ, పరప్రభుత్వానికీ మధ్య ఏర్పడిన సంఘర్షణకు ప్రధానకారణమయింది. పందొమ్మిదో శతాబ్దాంతంవరకూ కూడా, ఈ సంఘర్షణ చాలవరకు అసమ్మతి వాక్యరూపంలోనూ, అనంగీకార పత్రాలరూపంలోనూ జరుగుతూవచ్చింది. అర్జీలే, ఉపన్యాసాలూ, పత్రికారచనలూ, ఆందోళనలూ, ఉద్రేకపూరితములైన సభలు, తీర్మానాలూ, అర్జీలూ, – వీటిరూపంలో నడిచింది ఈ సంఘర్షణ. ఆ నాటికి ప్రచారంలోఉన్న రాజ్యాంగ సూత్రాలననుసరించే, ఈ రాజకీయపు పోరాటం సాగుతూ వచ్చింది. సాధ్యమైనంతవరకు పాలకులకు విసుగు తెప్పించని మార్గంలో మనవులద్వారా, వారి వివేచనకు వ్యావహారిక దక్షతకు అనుగుణంగా పోవడమే, ఆ నాడు ఉద్దిష్టమైన మార్గము. పందొమ్మిదో శతాబ్దపు చతుర్థభాగం నాటికి బ్రిటనుకు అంతర్జాతీయ వ్యవహారాల్లో నిర్వివాదమైన ప్రబల నాయకత్వం సిద్ధించింది. దానిలో బ్రిటను సామ్రాజ్య తత్త్వం ఇతోధికంగా పునరుజ్జీవిత మొందింది. సామ్రాజ్యంలోని ఒక భాగమైన శ్వేతవర్ణ రాజ్యాలు, మాతృదేశంలో సరిసమానమైన అధినివేశప్రతిపత్తి గల రాజ్యాలుగా ఏర్పడడానికి అర్హతను సంపాదించుకొనుచున్నవి. కాని, అశ్వేత జాతులతోను (Coloured races) భిన్న సంస్కృతి గల ఇతర జాతులతోనూ కూడిన సామ్రాజ్య ద్వితీయభాగాన్ని బ్రిటను సామ్రాజ్య మహాసౌధముయొక్క-మహోన్నతినీ ప్రతిష్ఠనూ, మోయడానికి తగిన అవస్థాపనగా (Infra Structure) తయారు చేస్తూ వచ్చినారు. కర్జన్ (Curzon) పరిపాలన క్రింద, సామ్రాజ్యాడంబరము భారతదేశంలో గగన శిఖరాన్నందుకొంది. తత్ఫలితంగా, తీవ్రప్రతిక్రియ, రూపందాల్చింది; యుద్ధోద్యతమైన జాతీయతాశకం ప్రవేశించడం అనివార్యమయింది. శతాబ్దం తిరగడంతో, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర నూతనరంగంలో ప్రవేశించి, ఇరవైయవ శతాబ్దంలో ఫలసిద్ధి పొందేంతవరకూ సాగుతూనే వచ్చింది. ఆ విషయాన్ని మూడవ సంపుటిలో వివరిస్తాము. ఈ చరిత్రలో ప్రాధాన్యం వహించింది నూతన విషయ పరిశోధనంకాదు. ఇదివరకే తెలిసియున్న విషయాన్ని వ్యాఖ్యానించడమే ప్రధానము. వ్యాఖ్యానించటము అనేది సహజంగా, వైయక్తికాభిప్రాయాలను ప్రదర్శించే ప్రయత్న మనడంలో సందేహంలేదు. చరిత్ర రచన కాధారములైనవి, కాలంలో జరిగిన వాస్తవ విషయాలు. ఈ ముడిపదార్థములతోనే రచన జరుగుతుంది. ఈ వాస్తవ విషయాలనాధారంగా చేసుకొనే, వ్యాఖ్యానం జరుగవలసి ఉంటుంది ఐతే, విషయాలను ఏర్చి సంగ్రహించడము, వాటిని వ్యవస్థీకరించడము, వాటికి సరియైన విలువ కట్టడమూ, అనేవి చరిత్రకారుని ఇష్టము, నిర్ణయము, ఆసక్తి అనువాటిపై ఆధారపడి ఉంటాయి. విషయాలను ఏర్చి, సంగ్రహించు కొనటములోకానీ, చారిత్రక దృక్పథంలోకానీ, ఏ ఇద్దరు చరిత్రకారులకూ, ఏకాభిప్రాయం ఎప్పుడూ కుదరదు. "చరిత్రకారుని వ్యాఖ్యానముకంటె విలక్షణమూ భిన్నమూ ఐన, చరిత్ర విషయక మూల బీజములుంటాయని నమ్మడం, విపరీతమైన భ్రాంతి." అని E. H. Carr, పలికినాడు. "ఇదమిత్థమైన వాస్తవాన్ని (నిజాన్ని) ఉద్దేశించి, ఎంత శ్రద్ధాసక్తులతో ప్రయత్నించినా విశేష చారిత్రాంశములకంటె, భిన్నమూ విలక్షణమూ, అయిన వాస్తవిక చరిత్ర ఎట్టిదో మనకు తెలియదు; తెలుసుకోడానికి వీలుకాదు." అని హెచ్చరించిన ఛార్లెస్ A. Beard వాక్యములో ఎంతో సత్యముంది.

చరిత్ర రచనలో తుది సిద్ధాంతమనేది ఉండదని నాకు బాగా తెలుసు. Sir George-

Clark చెప్పినట్లుగా నా రచనకూడా కాలాంతరంలో రద్దవుతుందనీ మరీమరీ కొత్తచరిత్రలు వస్తాయనీ ఆశిస్తాను. ఐనా, మానవజాతి పరిణామచరిత్రలో ఆకర్షణీయమూ, ప్రాసదాయకమూ ఐన, ఒక ఘట్టానికి సంబంధించిన ఉద్రేకపూరితాలైన సంఘటనాలను, సహేతుకంగాను, అవిరుద్ధంగాను ఇచ్చట ప్రదర్శించినానని విశ్వసిస్తున్నాను.

స్నేహితులూ, సహోద్యోగులూ అమూల్యమైన సహాయాన్ని సహకారాన్ని నా కీ కార్య నిర్వహణలో ఇచ్చినారు. Dr. K. K. Datta, Prof. Muhammad Habib, Dr. Nihar Ranjan Roy, Dr. Bisweswar Prasad, Prof. Nilakantha Sastry, వీరందరూ వ్రాతప్రతిని చదివి అభివృద్ధికరములూ, ప్రయోజనకరములూ, ఐన సలహాల నిచ్చి నందులకు వారికెంతో రుణపడి యున్నాను. మనఃపూర్తిగా ఇచ్చిన వారి సహాయానికి నేనెంతో కృతజ్ఞుణ్ణి.

నా సహోద్యోగులైన Dr. V. G. Dighe, Dr. R. K. Parmu, Dr. B. M. Bhatia, తమ శక్తి సామర్థ్యాలను పూర్తిగా ఈ పనిలో వినియోగించినారు. ఆర్థిక పరిస్థితులకు సంబంధించిన ప్రకరణాలను రచించడంలో Dr. Bhatia అమూల్యమైన సహాయాన్ని ఇచ్చినారు. Dr. Dighe మరియు Dr. Parmu గారిచ్చిన సహాయము కూడా మిక్కిలి విలువైనది. గ్రంథ భాగానికి కావలసిన విషయాన్ని సేకరించడము, అన్వయాంశాలను సరిచూడడము, చారిత్రకాంశాలను పరిశోధించడము,– ఈ పనులన్నింటినీ వీరు నిర్వహించి నారు. Dr. Dighe గ్రంథ సూచికను కూడా తయారు చేసినారు. వీరికి ఇతోధికమైన నా ధన్యవాదాలు. సహకరించిన వారికందరికీ రచయిత రుణపడియున్నాడు. అట్లు సహకరించిన వారిలో– ఢిల్లీ జాతీయ గ్రంథాలయాధ్యక్షులు శ్రీ Y. M. Mulay, జాతీయ పత్రాగారాధ్యక్ష ఉపాధ్యక్షులైన Sri K. D. Bhargava, Sri S. Roy మరియు, వారి సహోద్యోగులు – మరువకూడనివారు.

అతి ప్రయాసతో కూడినట్టిదీ, కష్టతరమూ ఐన, టైపు ప్రతి తయారుచేసే బాధ్యత నా కార్యదర్శి Sri B. R. Ajmani, వహించినారు.

వారందరికీ నా ధన్యవాదాలు. కాని చరిత్రలోని విషయాలకు వారెవ్వరూ బాధ్యులు కారు. వివరించిన విషయం, వివరించినరీతి – వీటి బాధ్యత నాదే.

తారాచంద్.

# భూమిక

స్వాతంత్ర్యానంతరం దేశకాల పరిస్థితుల దృష్ట్యా కళాశాలలో గూడా విద్యాబోధన మాతృభాషలోనే జరపడం అభిలషణీయమని అధిక సంఖ్యాకులైన విజ్ఞులు, విద్యావేత్తలు, అధికార అనధికార ప్రముఖులు భావించినారు. తత్పర్యవసానంగా మన రాష్ట్రంలో మొదట ఇంటర్మీడియట్ స్థాయిలో, ఆ తరవాత డిగ్రీస్థాయిలో తెలుగును బోధనభాష చేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలు ప్రగతిశీలమైన చర్యలు తీసుకోవడం జరిగింది. ఈ సందర్భంలో విద్యార్థులకు, అధ్యాపకులకు అవసరమైన పాఠ్యగ్రంథాలు (Text-books), పఠనీయ గ్రంథాలు (Reading material) ప్రచురించే బాధ్యత తెలుగు అకాడమికి లప్పగించినారు.

ఈ బాధ్యతను విజయవంతంగా నిర్వహించడంలో ఉండే సాధకబాధకాలు సహృదయులకు తెలియనివికావు. మొదటిసారిగా తెలుగులో వివిధ శాస్త్రవిషయాలపై గ్రంథరచన చేయించవలెనంటే సమర్థులైన రచయితలను, సంపాదకులను నియమించి, వారు సకాలంలో నిర్దుష్టమైన వ్రాతప్రతులను మాకు అందించే విధంగా కార్యక్రమాలను రూపొందించి నడపడము వారికి సముచితరీతిని పారిభాషిక పదాలను అందించడము, పుస్తకాలకు అవసరమైన చిత్రాలు తయారు చేయించడము, మొదలైన పనులన్నిటిని సక్రమంగా సమన్వయించవలె. తరవాత అందంగా ముద్రించవలె. అప్పుడే విద్యార్థులకు సకాలంలో పుస్తకాలను అందజేయడం సాధ్యమవుతుంది. ఈ అన్నింటికీ మాకు లభించిన వ్యవధి చాలా తక్కువ అనే విషయంతో పాటుగా మన రాష్ట్రాన్ని సంక్షోభస్థితి ఆవరించి ఉన్నదనే సంగతి కూడా అందరికి తెలిసినదే. అయినా, శక్తియుక్తులన్నిటినీ కేంద్రీకరించి అకాడమి చాలావరకు విజయవంతంగానే ఆ సవాలును ఎదుర్కొనగలిగింది.

విశ్వవిద్యాలయ స్థాయిలో తెలుగులో శాస్త్రగ్రంథాలను ప్రచురించే కార్యక్రమాన్ని మేము మూడు దశలుగా విభజించుకొన్నాము. అవి :-

1. మౌలికమైన పాఠ్య, పఠనీయ గ్రంథాలు (Original text-books and reading material) ప్రచురించడం.
2. ఆంగ్లభాషలో ఉన్న కొన్ని ప్రామాణిక శాస్త్రగ్రంథాలకు తెలుగు అనువాదాలను ప్రకటించడం.
3. కొన్ని శాస్త్రాంశాలపైన మౌలికాలైన బృహద్వ్యాసాలు (Monographs) రచింపచేసి ప్రకటించడం.

వీటిలో మొదటి అంచెగా ఇంటర్మీడియట్, డిగ్రీస్థాయి పాఠ్య, పఠనీయగ్రంథాల ప్రచురణ దాదాపు ముగియ వచ్చింది.

ఇంటర్మీడియట్ స్థాయిలో మొత్తం 12 శాస్త్రాలలో రమారమి 60 మౌలికమైన పాఠ్య గ్రంథాలు ప్రచురించడమే కాకుండా, రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో అధ్యాపకుల ప్రతినిధులను సమావేశపరిచి, ఆ యా గ్రంథాలను కూలంకషంగా విమర్శింప జేసినాము. చర్చా ఫలితాలను నిపుణుల, సంపాదకుల, రచయితల దృష్టికి తెచ్చిన మీదట ఆయా గ్రంథాలను పరిష్కరించి ముద్రించినాము.

డిగ్రీస్థాయిలో 21 శాస్త్రాలలో దాదాపు 300 మౌలికమైన పఠనీయ గ్రంథాల ప్రచురణ కూడా మేము చేపట్టినాము. మూడు విశ్వవిద్యాలయాలలోను అమలులోఉన్న పాఠ్య ప్రణాళికలను సమన్వయపరిచి, కొందరు సామాన్యవిషయం (General study) గా, మరి కొందరు ఐచ్ఛిక విషయం (Optional or elective) గా చదివే శాస్త్రవిషయాలను సంబద్ధంచేసి గ్రంథాలు తయారుచేయించవలసివచ్చింది. ఇంతవరకు మొదటి, రెండవ సంవత్సరాలలో కావలసిన దాదాపు 200 పుస్తకాలను వెలువరించడం జరిగింది. తక్కిన గ్రంథాల ప్రచురణ కూడా త్వరలోనే పూర్తి కాగలదని ఆశిస్తున్నాము. పూర్తి అయిన వెంటనే వీటిని కూడా క్షుణ్ణంగా పునర్విమర్శించే కార్యక్రమాన్ని రూపొందించడం జరుగుతుంది.

ఉన్నత పాఠశాలస్థాయిలో కూడా విద్యార్థుల పరిశ్రమ పాఠ్యగ్రంథాలకు మాత్రమే పరిమితం కారాదనీ, ఆయా పాఠ్యాంశాలమీద విస్తృతాధ్యయనం (Extensive study) చేయించడం అత్యావశ్యకమనీ విద్యావేత్తల అభిప్రాయం. అటువంటప్పుడు కళాశాల స్థాయిలో విస్తృతాధ్యయనం ఎంత ముఖ్యమో వేరే చెప్పనక్కరలేదు. ఈ విస్తృతాధ్యయనానికి ప్రామాణిక గ్రంథాలు విరివిగా లభింపజేయడం అకాడమి ధ్యేయం. ఈ దృష్టితోనే కొన్ని ప్రామాణిక గ్రంథాల అనువాదాలు, కొన్ని ముఖ్య శాస్త్రాంశాలపై బృహద్వ్యాసాలు ప్రచురించవలెనని అకాడమి తలపెట్టింది. ఒక పక్క పఠనీయ గ్రంథాలను సిద్ధం చేయిస్తూనే ఇందుకు కూడా ప్రయత్నాలు ఆరంభించినాము. దీనివల్ల తెలుగులో శాస్త్రవిద్యాభ్యాసం చేసే విద్యార్థికి, శాస్త్రబోధనచేసే అధ్యాపకునకు ఎంతో మేలు సమకూరగలదని మా విశ్వాసము.

మేము చేపట్టిన అనువాదాల కార్యక్రమం ఈ విధంగా ఉంది – శాస్త్రగ్రంథాలు అనువాదం చేయగోరే వారిని ఆయా శాస్త్రాలలో ఎన్నుకొన్న ఒకటో రెండో ప్రామాణిక గ్రంథాలలోనుంచి కొన్ని పుటలు అనువదించి పంపవలసినదిగా మేము కోరినాము. ఆ విధంగా వచ్చిన నమూనా అనువాదాలను నిపుణులైన విశ్వవిద్యాలయాచార్యులకు పంపి ఎన్నిక చేయించినాము. ఒక్కొక్క గ్రంథానికి, విస్తృతినిపట్టి, ఒకరినిమించి అనువాదకులు ఉండవచ్చు. కాని ఒక్కొక్క గ్రంథానికి ఒక్కొక్క పర్యవేక్షకుడు మాత్రమే ఉంటాడు. ఆయా ప్రత్యేక గ్రంథాలలో ఉండే సాధకబాధకాలను దృష్టిలో ఉంచుకొని ఈ పర్యవేక్షకులను నియమించడం జరిగింది.

ఉన్నతవిద్యా బోధనభాషగా తెలుగు సుప్రతిష్ఠితం కావలెనన్న కోర్కెతో శక్తివంచన

లేకుండా మేము చేస్తున్నపని విజయవంతం చేయడంలో మాకు ఎంతోమంది అండదండలు లభించినాయి. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల ఔదార్యము, అకాడమి పాలకవర్గం చేదోడువాదోడు, విశ్వవిద్యాలయాల తోడ్పాటు ; వివిధ కళాశాలాధికారులు, అధ్యాపకులు, రచయితలు, నిపుణులు, సంపాదకులు, ముద్రాపకులు, బ్లాక్ మేకర్స్ అందజేస్తున్న సహాయ సహకారాలు, విధి నిర్వహణలో మా ఉద్యోగి బృందం చూపుతున్న శ్రద్ధాసక్తులు - ఇవన్నీ మా విజయ హేతువులే. వీరందరికీ మా కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ప్రచురణలో మాకు తోడ్పడిన ముఖచిత్ర రచయిత శ్రీ ఎ. సత్యంగారికి మా కృతజ్ఞతలు.

అప్పుడప్పుడు అంతో ఇంతో మారుతూ ఉండే పాఠ్య ప్రణాళికలను దృష్టిలో ఉంచుకొని, మా ప్రచురణలపై సహృదయులైన విజ్ఞులు, అనుభవంగల అధ్యాపకులు చేసే సూచనలను గమనించి, సముచితరీతిని ఈ గ్రంథాలను పరిష్కరించి పునర్ముద్రించే విషయంలో మేమెప్పుడూ సావధానులమయ్యే ఉన్నాము. మునుపటివలెనే మునుముందు కూడా విద్యార్థులు, అధ్యాపకులు, విజ్ఞులు మాకు సహాయసహకారాలను అందించగలరనే మా విశ్వాసము.

# ప్రవేశిక

మౌలానా అబుల్ కలాం అజాద్ ప్రోత్సాహప్రోద్బలాలతో ఈ గ్రంథ రచనకు, ప్రచురణకు, భారత ప్రభుత్వము పూనుకొన్నది. ఈ విషయంపై కొన్ని గ్రంథాలిదివరకే వెలువడినవి. ఐనా, ఈ గ్రంథరచనకు గల ఒక విశిష్ట ప్రయోజనాన్ని బట్టి దీనికి ప్రాశస్త్యం సిద్ధించింది.

భారతదేశ స్వాతంత్ర్య సంపాదనకు కాంగ్రెసు ఉద్యమమే ప్రథమ ప్రయత్నమనే భావం సాధారణంగా వ్యాప్తిలో ఉన్నది. చరిత్రాధ్యయనం చేసిన కొంతమందికి తప్ప, స్వాతంత్ర్యోద్యమ పూర్వ చరిత్ర ఇతరులకు తెలియదు. వర్తకానికై భారతదేశం ప్రవేశించిన ఆంగ్లేయులు, ప్లాసీ యుద్ధం తర్వాత రాజ్య సంపాదనకు పూనుకొన్ననాడే స్వాతంత్ర్య సంఘర్షణ బీజములు దేశంలో క్షిప్తములైనవి. ఈ బీజాలంకురించి, మొక్కలై పెరిగి, విరుద్ధ పరిస్థితులకు, విరుద్ధ వాతావరణానికి నశించిపోక, వృక్షాలుగా స్థిరపడటానికి కొంత కాలం పట్టింది. అది సహజమే. దేశ ప్రజలు చాలకాలం వరకు మేల్కొలేదు. మధ్యయుగ కాలం నుండీ కూడా భారతదేశ ప్రజ నిద్రాణావస్థలో ఉండిపోయింది. విదేశ దండయాత్రలు భారతదేశానికి కొత్తవి కావు. మహమ్మద్ గజినీ, మహమ్మద్ ఘోరీ, గ్రీకులు, పర్షియనులు, మున్నగు వారందరూ ఇదివరకే దేశాన్ని కొల్లగొట్టినారు. కొందరు విదేశీయులు భారతదేశాన్ని జయించి, ఇచ్చటనే నిలిచిపోయి, ఈ దేశాన్ని తమ మాతృభూమిగా చేసుకొన్నారు. బాబరు వంశీయులైన మొఘలు లట్టివారే. పూర్వము జరిగిన ఈ దండయాత్రల వల్ల దేశం నష్టపడిన మాట వాస్తవమే. కాని, చాలవరకు, ఆ దండయాత్రలు తాత్కాలికములైనవి. కనుక, వాటి తర్వాత, దేశము తన పూర్వ పద్ధతిలో సాగుతూనే ఉంది మొఘలు సామ్రాజ్యం, దేశంలోని ఒక భాగమే కావడం వల్ల, స్వాతంత్ర్యం నశించి పోయినదనే భావం ప్రజలలో ఏర్పడలేదు. హిందూ ముస్లిము సంస్కృతులు రెండూ, ఒక విధమైన కలయికకు లోనై పోయినవి. దేశంలోని భిన్న మతస్థుల వారి సంప్రదాయాలకు, ఆచార వ్యవహారాలకు, లోపం కలుగలేదు. రాజ్యాన్ని పరిపాలించేవారు, హిందువులైనా, ముస్లిములైనా, సామ్రాజ్య ప్రజానీకం స్థితి ఒకే విధమై ఉండడం వల్ల రాజకీయాల విషయంలో ప్రజలు ఉదాసీనులై ఉండిరి.

కాని, బ్రిటీషు వారి దేశాక్రమణ వల్ల కలిగిన పరిస్థితులు వేరు. బ్రిటీషు వారు భారతదేశం పట్ల వహించిన దృక్పథమే ఇందుకు కారణము. దేశాన్ని జయించి, చేతనైనంత దోచుకొని పోలేదు ఆంగ్లేయులు. లేదా, ఇచ్చటనే నిలిచిపోయి, ప్రజలతో ఐక్యమై, భారతదేశాన్ని తమ దేశంగా చేసుకోనూ లేదు. భారత దేశీయులు, వీరి దృష్టిలో, సంపూర్ణ మానవులు కారు. మానవ జాతి పరిణామ దశలోని అధమ స్థాయిలో ఉన్న వారు భారతదేశీయులని వీరి విశ్వాసము. వీరిని సంస్కరించి, ఉద్ధరించడం దైవ సంకల్పమని, ఆ సంకల్పాన్ని నెరవేర్చడం తమ కర్తవ్యమని భావించినారాంగ్లేయులు. కాని, కార్యతః అట్టి మహా కార్యాన్ని సాధించడమె

వీరి అభిప్రాయం కాదు. సామ్రాజ్య నీతిచే పోషింపబడినది ఆంగ్లజాతి. భారతదేశం వంటి అసంస్కృత దేశాలను ఆక్రమించి, అందలి ఉత్పత్తి సాధనాలన్నిటినీ ఉపయోగించుకొని, తమ మాతృదేశమైన ఇంగ్లాండును పోషించడం, బ్రిటీషు మహాసామ్రాజ్యాన్ని ప్రపంచంలో అఖండ వైభవంతో స్థాపించడం, వీరి ఆశయము. ఈ ఆశయ సిద్ధికై, భారతదేశము యొక్క రాజకీయ, ఆర్థిక, భావ, వ్యక్తి స్వాతంత్ర్యాలను నశింప జేయవలసి వచ్చింది. తత్పరిణామంగా, పాలకులకు, పాలిత ప్రజకు ఘర్షణ ఏర్పడడం సహజమే.

రాజకీయ స్వాతంత్ర్యం భంగం కావడం వల్ల ముఖ్యంగా నష్టపడిన వారు దేశీయ ప్రభువులు, రాజులు, సర్దారులు. బెంగాలు పన్నుల వసూలును గుత్తకు తీసుకొన్న ఆంగ్లేయులు క్రమంగా, రాజ్యాలను ఆక్రమించుకొంటూ వచ్చినారు. 'తోడేలు-గొర్రెపిల్ల' సామ్యాన్ని అనుసరించి ఒక్కొక్క రాజ్యాన్నే కబళిస్తూ వచ్చినారు. బెంగాలు, బనారసు, ఔధ్, పంజాబ్, రాజపుటానా, సింధ్, ఝాన్సీ, మున్నగు రాజ్యాల ఆక్రమణలన్నీ ఇందుకు నిదర్శనాలు. లక్ష్మీబాయి, బేగం హజరత్ మహలుల వీర సాహస ప్రయత్నాలు చరిత్ర విదితాలే. తమకు వ్యతిరేకులని తోచిన రాజకుమారుల ననేకులను దేశ నిర్వాసము గావించడం-మున్నగు బ్రిటీషు వారి చర్యలన్నీ చరిత్రకెక్కినవే. మహారాష్ట్ర రాజ్యము, రజపుత్ర రాజ్యాలు, దక్కనులోని రాజ్యాలు,- అన్నీ బ్రిటీషు వారికి వశమైపోయినవి. కడపటి ఢిల్లీ సార్వభౌమునికి బ్రిటీషు వారు కలిగించిన అవమానకరమైన స్థితి-హృదయ విదారకమయింది. ఈ విధమైన అన్యాయాక్రమణలు, అవమానాలు,- భారత కులీన వర్గాలలో ద్వేష భావాన్ని కలిగించడం అసహజం కాదు. దేశీయుల ద్వేషాన్ని ఆంగ్లేయులీ విధంగా సంపాదించుకొన్నారు. సామ్రాజ్యాహంభావము, జాతి దురహంకారము వీరి ప్రవృత్తికి ప్రేరణాలు.

ఆర్థిక స్వాతంత్ర్యనాశం వల్ల, వర్తకులు, వ్యవసాయదార్లు బ్రిటీషు పాలనకు వ్యతిరేకులైరి. వీరు ప్రవేశపెట్టిన భూమి పరిష్కార విధానాలు, రైతువారీ పద్ధతులు, మధ్యస్థ దలారీ పద్ధతి, క్షేత్ర విభజన పద్ధతి, బేరీజు పరిష్కారము, వేలం పద్ధతి,-మున్నగునవన్నీ, రైతు వర్గాన్ని దురవస్థకు పాల్పరచినవి. పూర్వ గ్రామీణ వ్యవస్థ భగ్నమయింది. చేతి పరిశ్రమలన్నీ నాశనము కావడంతో, అసంఖ్యాకులైన కార్మికులకు, శిల్పులకు, జీవనోపాధి నశించి పోయింది. ముక్తశుల్కాలైన మాన్యాలను లాగుకోవడంతో విద్వాంసులైన హిందువులు, మౌల్వీలు జీవనోపాధిని గోల్పోయిరి. తలకు మించిన పన్నుల బేరీజు వల్ల, జమీందారులూ, భూస్వాములూ, రైతులూ కూడా వినష్టమై పోయిరి. ఆంగ్లేయులు స్వయంగా చిల్లర వర్తకానికి పూనుకొని గ్రామ సీమలలోని చిన్న వర్తకులకు కూడా, కూడులేకుండా చేసిరి. పన్నులను వసూలు చేయడంలో, వీరి ఏజెంట్లు పెట్టిన యమయాతనలు దుస్సహమైనవి.

దేశీయ పరిశ్రమలను నశింపజేయడమే కాక, నూతన పరిశ్రమల అభివృద్ధిని ఆటంక పరచిరి. ఇంగ్లాండు పరిశ్రమలకు ఆవశ్యకాలైన ముడి సరకులను ఉత్పన్నం గావించడం, ఇంగ్లాండు యంత్రాగారాలలో తయారైన వస్తువులను వినియోగించుకోవడం, మాత్రమే భారతదేశము నిర్వర్తింప వలసిన సామ్రాజ్య కర్తవ్యము. కనుక వ్యావసాయికంగానూ, పారిశ్రామికంగానూ, దేశాన్ని వలస రాజ్యంగా తయారు చేసుకొన్నారు. సామ్రాజ్య విస్తరణకు జరిపిన యుద్ధాల ఖర్చులన్నీ భారతదేశంపై త్రోసినారు. ఇంతేకాక, ఇండియా, సాలుకు

3 కోట్లు, మొదలు 4, కోట్లు పౌనులదాకా ఇంగ్లాండుకు కప్పంగా చెల్లించవలసి వచ్చింది. ఈ ద్రవ్య నిస్స్రావానికి ప్రతిఫలం లేదు. దీని భారం కూడా, పర్యవసానంలో మోయవల సింది రైతులే. ఈ విధంగా దేశం రక్తాన్ని పీల్చి, రైతు వర్గాన్నీ, వర్తక వర్గాన్నీ నశింపజేసి, బ్రిటీషు ప్రభుత్వం, ఈ వర్గాల వారికి ద్వేషాన్ని కలిగించింది.

నైతికంగానూ, స్వాభావికంగానూ దేశీయులు ఉన్నతోద్యోగాలకు యోగ్యులు కారనే మిషపై, విద్వాంసులైన వారిని పరిపాలనాధికారం నుండి బహిష్కరించిరి. సివిలు సర్వీసు లోనూ, మిలిటరీ సర్వీసులోనూ కూడా, భారతీయులను అధోస్థితికి తెచ్చిరి. రాజవంశంలోని వారికి కూడా మిలిటరీ అధికార పదవికి అర్హత లేకుండా పోయినది. దేశీయసైనికులను నీచంగా చూస్తూ వచ్చినందువల్ల భారత సైన్య భాగానికి కూడా పాలకుల పట్ల అసహ్య మేర్పడింది.

ఆంగ్లేయులంతతో ఆగలేదు. క్రిశ్చియను మిషనరీలకు ప్రోద్బలమిచ్చి, మతప్రచారాన్ని ఆరంభింపజేసినారు. హిందూ, ముస్లిం మతాలు రెండూ నిరసన తిరస్కారాలకూ, నిందా దూషణలకూ, పాల్పడినవి. దేశీయుల సంప్రదాయాలు, ఆచారములు మాత్రమేకాక, పూజార్హ మైన ప్రతి వ్యవస్థా తిరస్కారానికీ, నిరసనకూ గురి అయింది. దానితో ప్రారంభమయింది భారతీయ ప్రతిక్రియ. రాజారామ్‌మోహన్‌రాయ్, రెనడే, రాధాకాంతదేవ్, కేశవచంద్రసేన్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, దయానంద సరస్వతి, తిలక్, అరవిందఘోష్ మున్నగు మహనీయులందరూ బ్రిటీషు ప్రభుత్వానికి ఎదురు నిలిచిరి. పవిత్ర సంస్థకు చెందిన ముస్లిము ఉలమాలు విదేశీయులకు విరోధులై నిలిచిరి. ఈ పరిస్థితులలో, బ్రిటీషు పాలకుల నాశ్రయించి, సద్యఃఫలాలకై ఆశించిన వారు కూడా లేకపోలేదు.

బ్రిటీషువారనుసరించిన పై విధాలన్నిటి కంటెను అధికమైన వైషమ్యాన్ని తెచ్చిపెట్టింది, ఆంగ్లేయుల ప్రవర్తన. జీవనోపాధికై ఇండియాకువచ్చిన ప్రతి దరిద్ర ఆంగ్లేయుడు కూడా, తానే దేశానికి ప్రభువనే భావంతో ప్రవర్తించినాడు. ఉన్నతవర్గాల దేశీయులు కూడా వీరి దుర్జన ప్రవృత్తికి లోనుకావలసి వచ్చింది. సామాన్య ప్రజలు వీరి దృష్టిలో పశుతుల్యులు. కొరడాలతో కొట్టడం, తిట్టడం, హింసించడం,- ఆంగ్లేయ నీచవర్గాలవారికొక విధమైన సంతుష్టిని కలిగిస్తూ ఉండినవి. న్యాయ స్థానాలుకూడా ఈ దుర్జనులకు రక్షణనిచ్చింది దేశీయుని చంపి నందుకై, ఆంగ్లేయ దోషికి 30 రూపాయల జరిమానా. పావలా దొంగిలించినందుకై దేశీయు నకు యావజ్జీవ అండమాను శిక్ష. ఇది, వీరి న్యాయపరిపాలన. ఈ విధంగా, రాజవంశాలు, కులీన వంశాలు, విద్యావంతులు, వర్తకులు, వ్యవసాయదార్లు, రైతులు, శ్రామికులు, దేశం లోని ప్రజానీకమంతా బ్రిటీషు పరిపాలనకు వ్యతిరేకమై నిలిచింది. స్వాతంత్ర్య సంపాదనకై గావించిన మొదటి ప్రయత్నమే 1857 నాటి విప్లవము. మన మిదివరలో, బ్రిటీషుపరిపాలన కాలంలో- చదువుకొన్న (మనచే చదివించిన) కృతకచరిత్రలన్నీ వాస్తవ విషయాలను కప్పి పుచ్చినవి. ఈ మహావిప్లవాన్ని 'సిపాయీల తిరుగుబాటు' అని చెప్పి నిజస్థితిని మరుగు పరచి నవి. బ్రిటీషువారిని దేశంనుండి వెడలకొట్టి, భారతీయ రాజ్యాన్ని స్థాపించటానికై కావించిన మహాప్రయత్నమిది. దేశంలోని రాజవంశాల వారందరూ దీనిలోచేరి, తమ జీవితాలను బలి గావించినారు. ఎనభైఏండ్ల వయోవృద్ధుడైన బహదూర్‌షా ఈ విప్లవానికి కీలకస్థానమై తన

సర్వస్వాన్ని అర్పించినాడు. ఢిల్లీ పతనానంతరం ఇతని కుమారులిద్దరినీ ఇతని ఎదుటనే కాల్చి చంపినారు బ్రిటీషువారు. ఇతని కడపటి కుమారుడు ఫిరోజ్ షా, 20 ఏండ్ల వయస్సు లోనే తన జీవితాన్ని విప్లవానికంకితం కావించి, అత్యద్భుత నైపుణ్యంతో చాలాకాలం పోరాడి, కడపట, నేపాలు అరణ్యాలలోకి వెళ్ళిపోయినాడు. విక్టోరియారాణి ప్రకటించిన క్షమాభిక్షను తిరస్కరించి, స్వతంత్ర వ్యక్తిగనే తన జీవితాన్ని నిర్వాసంలో గడపినాడు. పీష్వాల వంశస్థు డైన నానాసాహెబు కూడా, ఈ విధంగానే, బ్రిటీషు సైన్యాలను సాధ్యమైనంతవరకు నాశనం గావించి, నేపాలు మరు భూములలోకి వెళ్ళిపోయినాడు. 'నేను బ్రతికి ఉన్నంతవరకూ మీకు నేను శత్రువునే' అని ఇతడు గావించిన శపథాన్ని నిలబెట్టుకొన్నాడు. 80 ఏండ్ల వృద్ధుడైన తాతియాతోపు బ్రిటీషు సైన్యాలతో నడిపిన అతి సాహస యుద్ధాలు వీరగాథలై వెలసినవి. కుట్రతో అతనిని బంధించవలసి వచ్చింది. నిశ్చింతుడై, ఉరికంబమునెక్కి, ఉచ్చును స్వయంగా మెడలో తగిలించుకొన్న మహావీరుడితడు. వయోవృద్ధుడైన బాబూ కున్‌వార్ సింగ్ శౌర్య సాహసాలు, వ్యూహనిర్మాణ చాతుర్యము శత్రువుల ప్రశంసలకు కూడా పాత్రమైనవి. 'బీహారు సింహ' మని ప్రఖ్యాతుడైన ఈ మహాయోధుడు యుద్ధగాయాలవల్ల మరణించినాడు. ఢిల్లీ సేనలను "అపారమైన శక్తి సామర్థ్యాలతో, అప్రతిహతమైన ధైర్యసాహసాలతో" నడిపిన బఖ్త్‌ఖాన్ శత్రువుల ప్రశంసలకు పాత్రుడైన మహావీరుడు. ఝాన్సిలక్ష్మీభాయి యుద్ధభూమిలో మరణించింది. ఔధ్‌నవాబు రాణీ – బేగం హజరత్ మహల్ దీర్ఘకాలం స్వయంగా యుద్ధం సాగించి, క్షమాభిక్షను, విదేశీయ పాలకుల పింఛనును కూడా తిరస్కరించి, నేపాలు దేశంలో స్వాతంత్ర్యంలో తన జీవిత శేషం గడిపింది. సాధువులు, కొండజాతులవారు, మౌల్వీలు, శంకర మతానుయాయులైన సన్యాసులు, ప్రజలు,– అందరూ విప్లవంలోచేరి నష్టపడినవారే. ఉత్తర భారతమంతా విప్లవాగ్నిచే ఆవరింపబడింది. దీనిని బ్రిటీషు చరిత్రకారులు 'సిపాయీల తిరుగుబాటు' అనే మాటతో కప్పిపుచ్చినారు.

విప్లవానంతరం, బ్రిటీషు పరిపాలన స్వభావం పూర్తిగా మారిపోయింది. పాలకుల ప్రతీకారవాంఛ తీవ్రమయింది. కలిసిన వంశాల ఆస్తులన్నీ ప్రభుత్వము హరించివేసింది. సంపన్న వర్తకుల ధనమంతా పరహస్తగతమై పోయింది. సైన్య పునర్వ్యవస్థీకరణంతో భారతదేశీయ సైన్యం అన్నివిధాలా దుర్బలం గావింపబడింది. విద్యావ్యాప్తి ప్రయత్నాలు వెనుకబడినవి. ప్రభుత్వ వ్యయ భారమింకా అధికమై రైతులను నేలమట్టం గావించింది. దారిద్ర్యంవల్ల ప్రజలకు కూటికి కరవై క్షామపరిస్థితులు, అంటువ్యాధులు, తరచైనవి. ఆంగ్లేయుల దురహంకార ప్రవృత్తి పెచ్చు పెరిగింది.

అట్టి పరిస్థితులలో ప్రారంభమయింది ప్రజల స్వాతంత్ర్య దీక్ష. హిందూ సంఘంలోని విద్యావంతులు, ఇస్లాము సంప్రదాయ వర్గం వారు, పత్రికలు, సంఘసంస్కర్తలు,–అందరినీ రాజకీయ స్వాతంత్ర్యం ఆవశ్యకమనే తీవ్ర భావం ఆవేశించింది. సంవిధాన రీత్యా రాజకీయాం దోళన ప్రారంభమయింది. ప్రజానాయకులు, సంస్కర్తలు, మత సంస్థలు, పత్రికలు, యువ కులు,–అందరూ కార్య దీక్షను కైకొన్నారు. దాదాభాయి నౌరోజీ, బదురుద్దీన్ త్యాబ్జీ, సురేంద్రనాథ్ బెనర్జీ, మున్నగు దేశనాయకులందరూ తమ జీవితాలను దేశసేవకు అంకితం గావించినారు. అరవింద ఘోష్, వివేకానంద, స్వామివంటి మహనీయుల ఉత్తేజక శక్తి కూడా

స్వాతంత్ర్యోద్యమానికి లభించింది రాజకీయ సంస్కరణలకై ప్రభుత్వాన్ని ఒత్తిడి గావింప సాగినారు ప్రజానాయకులు. క్రమంగా, ఈ ప్రయత్నం విస్తృతమై అఖిల భారత జాతీయ కాంగ్రెసు సంస్థగా రూపొందింది

ఈ విధమైన భారత స్వాతంత్ర్య సమరాన్ని ప్రామాణికంగా వర్ణిస్తుంది ఈ గ్రంథము. వర్ణించిన ప్రతి విషయాన్నీ ప్రబల సాక్ష్యంతో నిరూపించడం వల్ల ఈ గ్రంథ రచనకు విశిష్టత ఏర్పడింది. ప్రజా జీవితానికి సంబంధించిన మత, సాంఘిక, ఆర్థిక, విద్యా, సారస్వత విషయాదు లన్నిటిలోనూ, ఈ స్వాతంత్ర్య భావము ఏ విధంగా, ఉత్పన్నమై వికసించినదీ, చక్కగా వివరింపబడినది. దీనికి తోడ్పడిన మహనీయుల ఉదారాశయాలు, వారు గావించిన ఆత్మత్యాగము, ఎట్టివో తెలుసుకోవలసిన ఆవశ్యకమెంతైనా ఉన్నది. ఇట్టి ఉత్తమ గ్రంథాన్ని దేశభాషలో-అందునా ప్రజా భాషలో-ప్రచురించుటకు ప్రభుత్వమూ, తెలుగు అకాడమి పూనుకోవడం ప్రశంసనీయమైన విషయము.

అనువాదానికి ఉపయోగింపబడిన భాష, సరళమైన ప్రజా భాష. కఠిన పదాలు, సమాసాలు సాధ్యమైనంత వరకు పరిహరింపబడినవి. ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన ప్రకరణంలో కొన్ని సాంకేతిక పదాల ఉపయోగం మాత్రం తప్పనిసరి అయింది. అవి కూడా స్వల్పమే. కనుక, సాధారణమైన తెలుగు భాషా పరిచయమున్న వారందరూ ఈ గ్రంథాన్ని సులభంగా ఉపయోగించుకోగలరని మా విశ్వాసము.

వి. లక్ష్మీనారాయణరావ్

# 1
# ప్రతికూలత, విప్లవములు

## I. బ్రిటిష్ పరిపాలనపై అసంతృప్తి

ప్లాసీయుద్ధవిజయంతో బ్రిటీషువారి భారత జైత్రయాత్ర ఆరంభ మయింది. 1764లో ఢిల్లీ సార్వభౌముడు బక్సారుయుద్ధంలో ఓడిపోయినాడు. బెంగాల్, బీహార్, ఒరిస్సారాష్ట్రాలను బ్రిటీషువారి అధీనంచేస్తూ 1765లో వాటిపై అధికారాన్ని న్యాయబద్ధమైన సనదుతో (సమ్మతిపత్రాన్ని) కైవసం చేసినాడు. 1772లో వారన్ హేస్టింగ్స్ ఈ ప్రాంతాలపై అధికారాన్ని స్వయంగావహించి, బ్రిటీషుపరిపాలనా విధానాన్ని అమలుజరిపే కట్టుదిట్టాలు చేసెను. సుసంఘటితములుకానట్టి ప్రభుత్వాలూ, కొద్ది స్వాతంత్ర్యంతో కూడు కొన్న సామంతరాజ్యాలూ, అనేకములున్నాడు దేశంలోఉండేవి. మొగల్ సార్వ భౌముని అధికారం అప్పటికే చాలాభాగం నశించినప్పటికీ, ఈ పై ప్రభుత్వాలు చాలవరకు అతని అధీశతను ఆచారప్రకారం అంగీకరించియుండినవి. ఈప్రభుత్వాలూ జమీందారీలూ పరస్పరమూ ఆత్మవినాశకరమైన కలహాలను సాగిస్తూనేవచ్చినవి. తారతమ్య దృష్టిలో ఈ ప్రభుత్వాలు పెద్దవే. మరాఠుల రాజ్యంవంటి కొన్ని ప్రభుత్వాలకు దేశంలో విశాలభూభాగంపై అధికారంఉండేది. కాని, వాటిలో ఏదానికి రాజకీయంగా సుస్థిరత్వంకానీ, ఆర్థికసంపన్నతకానీ లేదు. అంతరంగిక సంఘర్షణలతో, పార్టీల భేదాభిప్రాయాలతో, వ్యక్తిగతమైన అసూయలతో వీరు విచ్ఛిన్నులై ఉండిరి. వాస్తవానికి కంపెనీవారికి సహాయపడడంలో, వీరే ఒకరితో ఒకరు పోటీపడుచుండినారు.

"దూరాలోచనలేనివారై, తాత్కాలికములైన ద్వేషాలను సాధించుకో డానికీ, తమ అత్యాశలను పూర్తిచేసుకోడానికి పూనుకొని, ఈ రాజులు, సర్దా రులు, తమ శాశ్వతమైన స్వాతంత్ర్యాన్ని కోల్పోయినారు." అని మాల్కామ్ (Malcolm) సూచించినాడు. ఆశ్చర్యంగొలిపే సాహసపరాక్రమమెంత ఉన్నా, ఎంతో అభిజాత్యమున్న గొప్పవారమని చెప్పుకొన్నా వాస్తవానికి వారు బలహీనులు. కనుకనే అతిసులభంగా రూపుమాసిపోయినారు. ఈస్టిండియాకంపెనీ వారి సైన్యంలో నిలవడం వలనకే, వారు నిలిచియుండడం జరిగింది. యుద్ధంలో వారి వినాశము శీఘ్రంగా జరిగింది. ప్రతిదండయాత్రలోనూ, వారి సైనిక సామూహ్యత ప్రదర్శితమయింది; చాలవరకు ప్రతియుద్ధంలోనూ అపజయాన్ని

పొందినారు. ఈవిధంగానే మైసూర్, హైదరాబాద్, ఔధ్, మొదలైన విశాల రాజ్యాలున్నూ, మరాఠా, జాట్, సిక్కుల భూభాగాలున్నూ, బ్రిటీషువారి అధీనమైపోయినాయి.

బ్రిటిషువారెంత విశాలభూభాగంపైన విజయాలు సాధించినా, అఖండ రాజ్య మేర్పడలేదు. ప్రజానీకానికి శాంతికూడా లభించలేదు. రాజులూ, సర్దారులనూ లొంగదీసినంతమాత్రాన పలు ముఖాలుగా వ్యాపించియున్న భూస్వాముల దుర్నీతివ్యవహారం తొలగించినని చెప్పలేము. తమ ఆధిపత్యాన్ని వదులుకోడానికేమాత్రమూ ఇష్టపడని ఈ దుర్నీతిప్రభుత్వాలు, పరప్రభుత్వం చేస్తూన్న కొత్త వ్యవహారపాలనా పద్ధతులకు విముఖతనూ అయిష్టతనూ ప్రదర్శిస్తూవచ్చినవి.

బ్రిటిష్‌విజేతలు పూనుకొన్నకార్యం సాఫీగా జరగకపోవడానికి దేశీయ ప్రభుత్వాల బలహీనతే ప్రబల హేతువయింది. దీర్ఘకాలం నడుస్తూ వచ్చిన అతి శ్రమతో కూడిన ఈ పోరాటము, ఈస్ట్‌ఇండియా కంపెనీ వారి ఆదాయాన్ని అమితంగా నష్టపెట్టింది. ఒక్కొక్క విజయాన్ని సాధిస్తూ, పరిపాలనా యంత్రాన్ని నెలకొల్పుతూ వస్తూఉండగా, వెంటవెంటనే, కుత్సితములైన రాజకీయ ప్రతిఘటనలు తలెత్తడం జరుగుతూ వచ్చింది. ఈ రాజులూ, జమీందారులూ తమ తమ అధిపతులపై భక్తివిశ్వాసాల విషయంలో చంచలులై ఉన్నప్పటికీ, విదేశ పాలకులకు, సులభంగా లొంగి పోవడానికి సుముఖులుగా లేరు. రైతులపై తమకున్న ఆధిపత్యాన్ని విదేశపాలకులు అంతరింప చేయడమూ, మోయరాని ధనరూపమైన బరువును తమపై మోపడమూ, మొదలైన విధానాలు ఈ రాజులకు నచ్చలేదు. పైగా, విదేశీయమైన న్యాయస్థాన పరిపాలన విధానానికి, తమ్ముతా లోబరచడంతో, సామాన్య ప్రజలు తమ అధికారాన్ని త్రోసిపుచ్చి, స్వతంత్రులు కావడమూ, సాంఘికంగా ఒక విప్లవాన్ని లేవదీయడమూ జరిగింది. ఈ కారణాలవల్ల ఈ సామంతులూ, జమీందారులూ బ్రిటిషు పాలనను ప్రతిఘటిస్తూ వచ్చిరి.

ఈ విధంగా ప్లాసీ యుద్ధమూ, 1857 లోని ప్రతిఘటనా (Revolt), కల్లోలమూ, జరిగిన అనంతర శతాబ్దంలో, – బ్రిటిషుపాలనా వ్యాప్తికి అడ్డుపడిలి, వరుసగా విద్రోహాలూ, సంక్షోభాలూ జరిగినాయి. ఆక్రమించి స్వాధీనపరచు కొన్న అనంతరము ప్రతి ప్రాంతంలోనూ ప్రతిఘటనలూ ప్రతిక్రియా రూప చర్యలూ, అలజడులూ, ఉత్పన్నమౌతూ వచ్చినవి. వీటిలో, – భూస్వాములూ, రైతులూ, పాల్గొన్నట్టే, జమీందారీసైన్యము నుండి తొలగింపబడిన సిపాయీలూ, మత నిర్వాహకులూ, ప్రభువుల సేవనుండి తొలగింపబడిన ఆశ్రితులు కూడా చేరినారు. ఈ కల్లోలాలు ఆక్రమితమైన ప్రాంతాలకు మాత్రమే పరిమితము కాలేదనడం కూడా విశదమే. తమకు కంపెనీ సైన్యంలో సరియైన ఆదరణ లభింపక పోవడంవల్ల, అసంతృప్తి వెలువరిస్తూ సిపాయిలు కూడా తరుచు తిరుగుబాటు చేస్తూనే వచ్చినారు.

దేశంపై నూతన వ్యవస్థ ఈ విధంగా వ్యాప్తి చెందుతూ ఒక నూతన

సామాజిక వర్గము, సంఘంలో రూపొందుతూ ఉండగా, ప్రాచీన వ్యవస్థకు చెందిన వేర్వేరు సంస్థలు నశించిపోకుండా ఉంచడానికి గట్టి ప్రయత్నాలు జరుగుతూనే ఉన్నవి. కాని, ఆ ప్రయత్నాలేవీ సఫలంకాలేదు.

## II. బెంగాలులోనూ, తూర్పు భారతంలోనూ జరిగిన కల్లోలాలు

*మీర్‌కాసీమ్ గావించిన ప్రతిఘటన* (Revolt) · బెంగాల్, బీహార్, ఒరిస్సా ప్రాంతాల స్వాధీనంతో బ్రిటిషుపరిపాలన చరిత్ర ఆరంభమౌతుంది. ఈ పాలనకు ఎదురు తిరిగిన ప్రతిఘటనోత్సాహం తొలిసారిగా ఈ ప్రాంతంలో కలగడం సహజమే. మీర్‌జాఫర్‌ను 1760లో పదవినుంచి తొలగించి అతని స్థానంలో బెంగాల్‌నవాబ్ నాజిలగా, నియమింపబడిన మీర్‌కాసీమే బ్రిటీష్‌పాలనను మొదట ధిక్కరించినవాడు. అతని పిరికితనమూ అతడెప్పుడూ యుద్ధానికి ఉత్సహించకపోవడమూ,- అనే అతని స్వభావాలే నవాబ్ పదవికి తగిన యోగ్యతలుగా వారన్‌హేస్టింగ్స్ నిర్ణయించినాడు. కాని హేస్టింగ్స్ అభిప్రాయం, తప్పని, మీర్‌కాసీం రుజువుచేసినాడు. తన ప్రజల క్షేమంవిషయంలో, గాఢమైన ఆసక్తినీ అనుకోని స్వాతంత్ర్యోత్సాహాన్నీ అతడు ప్రదర్శించినాడు.

శుల్కరహితంగా దేశంలో, వర్తకంచేసే అవకాశాలకోసం ఇంగ్లీషువర్తకులు, న్యాయవిరుద్ధంగా నిర్భంధంచేయడం మీర్‌కాసీమ్ తిరస్కరించినాడు. అంగీకరించినట్లయితే దేశవర్తకులూ, జమీందారులూ దరిద్రులైపోవడమూ, దేశం పాడైపోవడమూ, జరుగుతుందని అతడు గ్రహించెను. కలకత్తా మండలి (Council) తనకు విముఖంగా ఉండడంతో మీర్‌కాసీం హతాశుడై సాహసించవలసి వచ్చింది. అక్లేర్పడిన పోరాటంలో, ఔధ్‌నవాబైన షుజా-ఉద్-దౌలా, షాఆలం సార్వభౌముడూ తనకు సహాయంచేయగా, ఐక్యసేనాముఖం ఏర్పరచి, శత్రువు నెదుర్కొన్నాడు. కాని ఈ మిత్ర సైన్యాలు సుశిక్షితమైన కంపెనీవారి సేనావాహినికి దీటుకావు. కాపున, 1764 బక్సారుయుద్ధంలో మిత్రసైన్యం గౌరవభంగికరమైన అపజయాన్ని పొందింది. తరువాత, తన జీవితాంతం (1777) వరకూ మీర్‌కాసీం దేశద్రిమ్మరిగా జీవితం వెళ్లబుచ్చవలసి వచ్చింది.

ఐనా, మీర్‌కాసీం అధికారం కూలిపోవడంతో బ్రిటిషుపరిపాలనకు ప్రాతికూల్యం అంతంకాలేదు. బెంగాలు జిల్లాలన్నిటనూ, గంగానదికి దక్షిణంవైపు బీహార్‌జిల్లాలోనూ, ఛోటానాగపూర్ జిల్లాలోనూకూడా, విద్రోహాలూ (Rebellions), అవ్యవస్థాచర్యలూ—— (Disorders), తరచు ఉప్పతిల్లుతూనే ఉన్నాయి. సంప్రదాయసిద్ధమై ఉన్న రాజకీయవ్యవస్థను విధ్వంసమొందించడము, నిష్ఠురమైన, భూరాజస్వ విధానము, (Land revenue-శిస్తు) పై కల్లోలములకు మూలకారణాలు. అదీకాక, సంప్రదాయసిద్ధములైన దేశీయాచారవ్యవహారములలో, బ్రిటీషువారు కలుగజేసుకోవడమూ, పరిచితముకాని న్యాయపద్ధతిని దేశంలో నెలకొల్పడమూ అనేవి ప్రజానీకంయొక్క అసంతృప్తికి మిక్కిలి దోహదం చేసినవి. ఉత్తరబెంగాల్, రంగపూర్, దినాజ్‌పూర్, జిల్లాలలో అతి

భారమైన పన్నులు విధించడమూ, రైతులనుండి నిర్బంధంగా శిస్తులు వసూలు చేయడమూ,- ఇత్యాది పీడనచర్యలు 1783లో బాహాటమైన తిరుగుబాటుకు దారితీసినాయి. ఈ తిరుగుబాటును అణచడానికి సైనికబలాన్ని ఉపయోగించ వలసి వచ్చింది.

బీర్‌భూమ్, బిష్ణుపూర్ రాజులపట్ల, నిష్ఠురంగా వ్యవహరించడమూ, గందరగోళ స్థితి ఏర్పడడము, శిస్తులను అధికంగా పెంచడమూ,- అనే కారణాలవల్ల సంక్షోభము బెంగాలులో అతివ్యాప్తంగా, అసంతృప్తి ఏర్పడింది. ఈ అవ్యవస్థితిని అవకాశంగా తీసుకొని, దుండగీడులు 1789లో దోపిడీలు సాగించారు. ప్రారంభించిరి. దీనితో పరిపాలనావ్యవస్థ శిథిలమయింది. కట్టకడపటికి, మళ్ళీ క్రమపాలన స్థాపితమయింది. కాని ఈ అలజడులవల్ల ఏర్పడిన దుష్ఫలితం మాత్రం, చాల కాలం వరకూ, అనుభవింపక తప్పలేదు.

*కొండజాతులవారి తిరుగుబాటు :* సర్వశారణ్యమయములైన విశాల ప్రాంతాలు కొండజాతులకును ఆదిమజాతులకును, నివాసస్థానాలుగా ఉండేవి. వాటిలో పాలన సాగిస్తూ ఉండిన చిన్న చిన్న రాజులలో, కొందరు తాము రజపుత్ర వంశమువారమనీ, అతిప్రాచీనములైన వంశజులమనీ వాదించేవారు. బెంగాలును జయించిన తురుష్కరాజులకంటే ప్రాచీనమైనవి తమ వంశములని వీరి వాదన. బెంగాలు పాలన నియమాలననుసరించిన పరిపాలనా విధానాన్ని ఈ ప్రాంతంలో నెలకొల్పడం చాల కష్టమయింది. అట్లు నెలకొల్పే ప్రయత్నము ఈ రాజుల అయిష్టతకూ, అడ్డుబాటుకూ కారణమయింది.

చువారుల *తిరుగుబాటు :* ఆదిమజాతులు నివసిస్తూన్న ప్రదేశాలలో అవ్యవస్థితి నిరంతరమై ఉండేది. జంగల్ మహల్స్‌కు చెందిన చువారుజాతుల వారి మధ్య, పదేపదే అలజడులు రేగుతుండేవి. పడమటి జిల్లాలనుండి దక్షిణ బీహారుపైనా, ఛోటానాగపూర్ ఒరిస్సాలపైనా, ఈ అలజడులు ప్రాకేవి. అట్లే, సింగభూమ్‌లోనున్న హోస్ (Hos) జాతులవారూ ఛోటా నాగపూర్ ప్రాంతపు కోలులూ, ముండాలునూ, మన్‌భూమ్ ప్రాంతపు భూమిజీలూ, రాజ్ మహల్ పర్వతప్రాంతీయులైన సంతాలులూ,- నిరంతరమైన అలజడులకు కారకులు. ఒరిస్సాలోని ఖోండ్‌జాతులూ, అస్సాముప్రాంతపు ఖాసీలూ, విపరీతమైన కల్లోలాలను రేపినారు.

క్షామమూ, అరణ్యమృగాలవల్ల కలిగినసష్టమూ, సంపన్నుల శిస్తుల పెంపకమూ, దాక్షిణ్యరహితమైన పన్నుల వసూలు,- ఇవన్నీకూడా ఆర్థిక దుస్థితికి, సాంఘికమైన అసంతృప్తికి తోడుపడినాయి. సైన్యాలనుండి తొలగించబడిన సిపాయీలు, పూర్తిగా నష్టపడినరైతులు, జీవనోపాధులను కోల్పోయిన కార్మికులూ,- అందరూ బందిపోటు దొంగలముఠాలుగా ఏర్పడి, గ్రామాలపై దాడిచేసి దోచుకొని, ప్రజలను భయభ్రాంతులను గావించినారు. తత్ఫలితంగా, సంఘర్షణలు తప్పనిసరి ఐనాయి; తీవ్రమైన యుద్ధాలు జరిగినాయి.

చునార్‌లు, భూమ్‌జీ జాతులు, బెంగాలు మిడ్నాపూర్ జిల్లాలో నివసించే వారు. మన్ భూమికి, బారా భూమికి చెందిన మహల్, బారాభూమి, ఆ ప్రదేశంలోనే ఉండేవి. మిడ్నాపూర్ జిల్లా 1760 లోనూ, మహల్ 1765 లోనూ బ్రిటిష్ పరిపాలనలో చేరిపోయినాయి. కాని అచ్చటి జమీందారులు మొండిగా ఎదురు తిరిగినారు. ధాల్ భూమిప్రభువైన, జగన్నాధ్‌ధాల్, 1768 లో బ్రిటిష్ వారి పాలనకు విరోధంగా పోరాట మారంభించినాడు. ఈ పోరాటంలో ఇత డవలంబించింది భూదాహకవిధానము. (Scorched earth policy).

చువార్ జాతులవారినితడు తన సైనికనాయకత్వం క్రిందికి తీసుకొన్నాడు. కైలపాల్, ధోల్కా బొరాభూమ్ రాజులు ఈ ప్రతిఘటనోద్యమంలో చేరినారు. నవాబ్‌గంజ్, ఝూరియా జమీందారులు శిస్తుచెల్లించటం ఆపివేసిరి. కల్లోల యుక్తమైన ఈ పరిస్థితులు సుమారు ముప్పై సంవత్సరములవరకూ జరుగుతూ వచ్చి, తుదకు తమంతట అవే శాంతించినాయి.

కాని, 1832 లో, గంగా నారాయణ్, ఈ జాతులవారితో చేరి కొత్త విప్లవాన్ని లేవదీసినాడు. బారాబజార్‌లోని సర్కారు కార్యస్థానాలపై దాడి చేసి, బారాబజారును పట్టుకొన్నాడు. తర్వాత, సింగభూమ్ నివాసులైన హోస్ జాతి వారిని కూర్చుకొని తీవ్రమైన దురవస్థను తెచ్చి పెట్టగా, దానిని అణచి వేయడానికి సైనికకార్యాచరణం అవసరమయింది. ఆ యుద్ధంలో చాలా నాయకులు హతులైనాగూడా, విద్రోహులు నిరుత్సాహపడక ప్రతిఘటిస్తూ వచ్చిరి. ప్రభుత్వ సైన్యాలు కొల్హాన్‌ను స్వాధీనం చేసుకొనేంతవరకూ ఈ ప్రతిఘటన సాగింది.

ఛోటానాగపూర్, సింగభూములకుచెందిన హొస్ జాతులవారు తమకు పూర్వం జరిగిన అపకారానికి ప్రతిక్రియచేయడానికి పూనుకొన్నారు. 1773లో పోరహాట్, ఖారాస్వాన్, సారేకేలా రాజులు విద్రోహుల శరణార్థుల విషయమై యుద్ధాలు చేయవలసివచ్చింది. ఐతే, ఖారాస్వాన్, సారేకేలారాజులకు గౌరవ భంగం కలిగించే ఉద్దేశముతోను, స్వాతంత్ర్య ప్రియులైన హొస్‌జాతివారి నణగ ద్రొక్కే ఉద్దేశముతోను, పోర్‌హాట్‌రాజు బ్రిటీషుపాలనకు లోబడి, సామంత పదవిని స్వీకరించినాడు. అతడు బ్రిటిషువారి సహాయము కోరడమూ, బ్రిటీషు సైన్యాలు కొల్హాన్ ప్రవేశించి, చైబాసావరకూ చొచ్చుకొని పోవడమూ జరి గింది. కాని, హోస్ జాతివారు భీకరంగా పోరాడుతూ, రెండు సంవత్సరాల కాలం (1820-22) ధాల్‌భూమ్, ఖామంఘాటీ ప్రాంతాలను ధ్వంసంచేసి, ఛోటా నాగ్‌పూర్‌లోనికి చొచ్చుకొని పోయినారు. 1827 వరకు, నిరంతరంగా యుద్ధం సాగిస్తూవచ్చిన ఈ హోసులు, కడపట బలవంతంమీద లొంగిపోవలసి వచ్చింది. ఐనా, అప్పటికీ శాంతిభద్రతలు పూర్తిగా ఏర్పడలేదు. 1831 లో, ఛోటా నాగపూర్ ప్రాంతపు, ముండాజాతులు ఎదురుతిరిగి, హోస్‌జాతులతో చేరడంతో ఛోటానాగ్‌పూర్, సింగభూమ్, మన్‌భూమ్ ప్రాంతాలలో మరలా విప్లవాలు చెలరేగినాయి.

**కోల్ విప్లవాలు :** కోల్ జాతులవారి గ్రామాలను వారి గ్రామయజమాని

(ముండాలు) నుంచి తప్పించి, పరప్రాంతాలవారైన సిక్కులకు, ముస్లిములకు అధీనంచేయడంవల్ల కోలులు ఎదురు దిరిగినారు. ఈ ఉత్పాతం మొదట, రాంచీలో ఆరంభమై, క్రమంగా సింగభూమ్, హజారీబాగ్, పలమూప్, మన్ భూమ్ పశ్చిమప్రాంతాలకు ప్రాకింది. ఈ ఉత్పాతాన్ని అణచివేయడానికి విస్తృతమైన సైనికకార్యాచరణం, అవసరమయింది.

*సంతాల్ విప్లవాలు :* హజారీబాగ్, మన్ భూమ్ ప్రాంతాలనుండి రాజమహల్ పర్వతప్రాంతానికి వలస వచ్చినవారు సంతాలులు. 1836 నాటికి, వీరు ధమనికో ప్రదేశంలోని నాలుగువందల గ్రామాలకుపైగా ఆక్రమించుకొని, నివసింపసాగిరి. వారు సరళజీవులు. పన్నుల అధికభారంవల్ల రుణదాతలపై ఆధారపడవలసి వచ్చింది. సరళస్వభావులైన వీరు, రుణదాతల వంచనతంత్రాలకు సులభంగా బలియైనారు. పన్నులు వసూలుచేసే అధికారులుకూడా, వీరి విషయంలో కఠినంగా ప్రవర్తించిరి. వీరిని పనికి నియమించుకొన్న రైల్వే అధికారులు వీరికి జీతాలివ్వకపోవడమేకాకుండా, పైపెచ్చు, వారి స్త్రీల నవమానపరచిరి. ఉద్రేకకారకములైన ఈ చర్యలు వీరిలో తీక్ష్ణక్రోధాన్ని రగుల్కొల్పినాయి. ఇంధనానికి ఆజ్యం పోసినట్లుగా, దివ్యజ్ఞానం కలవాడని చెప్పుకొనే ఒక మతోన్మాది వీరిని మరింత రెచ్చగొట్టినాడు. సర్కారు ఉద్యోగులు అసత్యవాదులు, నీతిభ్రష్టులు కావడంవల్లనూ, మహాజనులు (MahJans) పీడించి, ప్రజలరక్తాన్ని పీలుస్తూ ఉండడంవల్లనూ, పోలీసుల అత్యాచారాలవల్లనూ, దేవుడు కోపించి బ్రిటీషువారినుండి దేశాన్ని విముక్తిచేయ బూనినాడని, ఈమతోన్మాది సంతాలులను నమ్మించినాడు. ఈలోగా, తమకు జరుగుతూ ఉన్న బాధలు పెచ్చుపెరుగుతూ ఉన్నాయి, కనుక, 1855 లో, సంతాలుల విప్లవం ఆరంభమయింది. కాని, వారి విల్లులూ, అమ్ములూ, తుపాకుల ఎదుట నిలువలేక, వారు లొంగిపోవడం జరిగింది. సంతాలుల విషయంలో ఒక ప్రత్యేకపాలన విధానం, అవసరం, అని ప్రభుత్వం గ్రహించింది. తత్ఫలితంగా 'సంతాల్ పరగణాలు' అనే కొత్త జిల్లా ఏర్పడింది.

*ఒరిస్సా జమీందారుల విప్లవము :* 1803లో కంపెనీవారు ఒరిస్సాను తమ రాజ్యంలో సంయోజితం చేసుకొన్నారు. ఐతే, ఒరిస్సా సరదారులు దీనికి సమాధానపడలేదు. ప్రముఖభూస్వాములలో ఒకడైన ఖుర్దారాజు 1804లో, ప్రతిఘటించి నిలిచినాడు. కాని, పిమ్మట లొంగిపోక తప్పించుకొనాడు. పిమ్మట, పాయికులు (Paiks) అని వ్యవహరింపబడుతూఉన్న పదాతిసైనికదళం రెవెన్యూ కలెక్టరుకూ, పోలీసుదళానికి, ఎదురు దిరిగి, నిలిచింది. వారి నాయకుడైన జంగ్బంధు, బన్ పూర్ పైపడి సర్కారు కోశాగారాన్ని కొల్లగొట్టి, ఖుర్దాలోని భవనాలను కాల్చివేసెను. సర్కారుద్యోగులు పారిపోగా, కొంతకాలం వరకూ ఆ భాగంలో బ్రిటీషుపరిపాలనయొక్క ఆనవాళ్ళుకూడా కనబడకుండా పోయినాయి. 1817 సంవత్సరాంతానికి బ్రిటీషువారు ఖుర్దాను మరల, ఆక్రమించుకొన్నారు. కాని, పూరి (Puri) ఇంకా ప్రతిఘటిస్తూనే నిలబడింది. సైనిక

శాసనాన్ని అమలులోకితెచ్చి, ఈ తిరుగుబాటును అణచివేయవలసి వచ్చింది. ఇట్లు, కట్టకడపట, క్రమవ్యవస్థ మరల స్థాపితమయింది. చాలకాలము వెంటబడి, తరుముతూ రాగా, కట్టకడపట జగబంధు 1825లో ఆత్మసమర్పణ గావించినాడు. కాని, ఆ ప్రాంతంలో అతడెక్కువ పలుకుబడికలవాడు కనుక, బ్రిటీషు వారతనికి విశ్రాంతి వేతనమిచ్చి కటక్‌లో, నివసించడానికి అనుమతించిరి.

*ఖోండ్ విప్లవాలు:* సామంతరాజ్యమైన బాద్, గంజామ్ జిల్లాలచే పరివేష్టితమై, అంగూల్‌కు నైరుతిదిక్కుగా వ్యాప్తమైయున్న ఖోండ్‌మల్స్ అనే పర్వతప్రదేశము, ఖోండుల నివాసస్థానము. మదరాసు ప్రభుత్వం 1815లో, గుమ్‌సూర్ రాజైన, ధనంజయభారీని పట్టుకొని, ఖుర్దాసంస్థానాన్ని స్వాధీనం చేసుకొన్నది. ఆరాజు, పర్వతప్రాంతాలకు పరుగెత్తుకొనిపోయి ఖోండుల సహకారాన్ని ఆశ్రయించగా, 1835లో బ్రిటీషువారు, పాలనాధికారాన్ని తమ స్వాధీనం చేసుకొన్నారు. 1836లో, ఖోండులు 'దొరబిసాయీ' నాయకత్వం, కింద, బ్రిటిషు పరిపాలన నెదిరించి నిలిచిరి. కాని, అధిక సైన్యబలాన్ని సమకూర్చుకొని, బ్రిటిష్‌వారు ఆ తిరుగుబాటును అణచివేసిరి. 1847లో, ఖోండులు మళ్లీ ప్రతిఘటించి నిలబడగా, వారి నాయకుడైన చక్రబిసాయీ, దేశాన్ని సంక్షోభంతో ముంచివేసినాడు. బాద్, ఖోండమలుల ప్రాంతంనుండి, గుంసూరు ప్రాంతాలవరకూ, ఈ తిరుగుబాటు కల్లోలం పాకింది. అంగూల్ రాజా, మరియు ఇతర సరదారులూ ఈ విద్రోహులతో సానుభూతికలవారే, కాని, బ్రిటిష్‌వారి ఒత్తిడివల్ల చక్రబిసాయీని తమ ప్రాంతాలనుండి పంపివేయవలసి వచ్చింది. ఐనా, బ్రిటిషు ప్రభుత్వానికింకా విశ్వాసం కలుగకపోవటంవల్ల, అంగూల్ రాజాను పదవీచ్యుతునిచేసి, అతని సంస్థానాన్ని తమ రాజ్యంలో చేర్చుకొన్నారు. పర్వతప్రాంతాలలో తలదాచుకొన్న చక్రబిసాయీ ఆరుసంవత్సరాలదాకా నెమ్మదిగా ఉండినాడు. కాని, 1854లో మరల బ్రిటీషువారికి, తొందర కలిగించడం ఆరంభించినాడు. ఖోండుల రక్షణ అతనికి లభించకుండాచేసే ఉద్దేశంతో, చక్రబిసాయీ గత్యంతరం లేక ఖోండ్‌మల్ ప్రాంతాన్ని వదలి పోవలసివచ్చింది. ఇట్లు పలాయితుడైన బిసాయీ దేశద్రిమ్మరిగా తిరుగుతూ, కట్టకడపట, కనబడకుండా పోయినాడు.

అనేక సంవత్సరాలుగా పోరాటం సాగిన తర్వాత ఈ తిరుగుబాటును నిగ్రహించడం జరిగింది. 1855 లో, ఇంకొకసారి తిరుగుబాటు జరిగింది. ఖోండ్‌మల్ ప్రాంతాన్ని మదరాసు ప్రభుత్వాధికార క్షేత్రం నుండి తప్పించి, కటక ప్రభుత్వం క్రిందికి తేవడంతో, ఈ తిరుగుబాటు అంతమయింది. రాజాను పట్టుకొని, ఖైదీగా హజారీబాగ్‌కు, పంపిరి.

*అస్సాములో విప్లవము:* ప్రాచీనమైన అహోమ్ సంస్థానం, బెంగాల్‌కు ఈశాన్యపు సరిహద్దులలో ఉండేది. 1824 లో బర్మాయుద్ధము ఉత్పన్నము కాగా, బ్రిటిష్‌వారి సైనికదళం, అహోమ్‌రాజ్యం మీదుగా నడిచిపోయి బర్మాసైన్యాన్ని వెడలగొట్టడం జరిగింది. బర్మాయుద్ధము ముగియడంతోనే తమ

సైన్యాలను అహోమ్‌రాజ్యం నుండి, వాపసు తీసుకొంటామనీ, పరిపాలన ఇచ్చే ఏర్పాటుపై బ్రిటీషు రక్షణాధికారం క్రింద వారి రాజ్యాన్ని వారికే మళ్ళీ అప్పగిస్తామనీ, బ్రిటిష్‌వారు దేశరాజులకూ, అక్కడి కులీన వర్గాలవారికీ మాట ఇచ్చినారు. కాని, ఈహామీలను బ్రిటీషువారు ఏమీ పాటించలేదు, సైన్యాన్ని, పన్నులు వసూలు చేయడానికి, పాలన వ్యవస్థను నెలకొల్పడానికి, ఏర్పాట్లు గావించి సాగిరి. మరిన్నీ, అస్సాము న్యాయస్థానం యొక్క అధికారాలను, ప్రభుత్వ హక్కులను, తీసివేసినారు. తత్ఫలితంగా, అహోమ్‌లలోని కులీనవర్గం వారిలో అసంతృప్తి, కలతా, ఏర్పడినాయి.

అస్సాము ప్రజలు, రాజవంశపు వారైన గోమ్‌ధర్ కొన్‌వార్‌ను 1828 లో, తమ దేశానికి రాజుగా నిర్ణయించుకొని, అహోమ్‌లలోని, కులీనవర్గం వారి సహకారంతో రంగపూర్‌పై నడిచినారు. అహోమ్ ప్రభుత్వం యొక్క మాజీమంత్రి ధనంజయబార్, గోహైన్, రాజ్యపు ఇతర అధికారులు కూడా, ఈ సాహసోద్యమంలో నాయకులుగా పాల్గొన్నారు. ఈ ఉద్యమం 1820 లో, నిగ్రహింపబడింది. ఉద్యమ ప్రయత్నమింకా పరిపక్వదశకు రాలేదని, రుజువయింది. గోమ్‌ధార్ బ్రిటిష్‌వారికి ఆత్మార్పణ గావించుకొన్నాడు. అతనికి ఏడుసంవత్సరములు ఖైదు విధించినారు.

1830 లో, మరియొకసారి తిరుగుబాటు ప్రయత్నం జరిగింది. సరిహద్దు జాతులవారైన ఖామ్‌టీలు, సింగపోలు, నాగాలు, ఖాసీలు, గారోలూ - మున్నగు సరిహద్దుజాతుల వారంతా, ఏకకట్టుగా నిలిచి, బ్రిటిష్ వారిని ఎదిరించడానికై, ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినారు. రూప్‌చంద్ కొనార్‌ను తమ రాజుగా నిలబెట్టినారు. పియాలీబర్‌ఫుఖాన్, జెపురామ్ ధులియబారువాలున్నూ, ఇతర కులీనవంశ నాయకులున్నూ ఏకమై, చిన్నసైన్యాన్ని సమకూర్చుకొని, రంగపూర్‌పై నడిచినారు. కాని వీరి ప్రయత్నాలన్నీ బ్రిటిష్ వారికి ఇంతకుముందే తెలిసి ఉండడంవల్ల, వీరందరూ పట్టుబడి, రాజవిద్రోహులుగా శిక్షింపబడిరి. పియాలీబర్‌ఫుఖాన్ జెపోరామ్ ధూలియాబారువాలు, మరణ శిక్షకు గురిఐనారు. తక్కినవారు పదునాలుగేండ్ల దేశనిర్వాస శిక్షకు పాల్పడినారు. వారి ఆస్తి సమస్తమూ బ్రిటీషువారు స్వాధీనం చేసుకొన్నారు. 1833 నాటికి, తాము చేసినది సరికాదని గుర్తించిన బ్రిటీషు ప్రభుత్వం, వీరికి కొంత న్యాయం జరిపింది. అస్సాము పైభాగాన్ని సర్ మహారాజాపురందరసింగ్ నరేంద్రకు అప్పజెప్పి, రాజ్యంలో కొంత భాగాన్ని అస్సాము రాజుకు, వాపసు ఇచ్చివేసినారు.

*ఖాసీతిరుగుబాట్లు* : పశ్చిమఖాసీ పర్వతాల్లో, కహిమాఖాస్ సామ్రాజ్యం అని, వ్యవహరింపబడుతూ ఉండిన ఒక చిన్నరాజ్యం, తిరత్‌సింగ్ పాలనలో ఉండేది. ఆ రాజ్యం నేడు నొవాంగ్‌ఖాలో రాజ్యంగా, గుర్తింపబడింది. అతడు విశ్వాసపాత్రుడైన ఉత్తమప్రభువు. ఖాసీ పర్వతాల కొకవైపున ఉన్న కామరూపూ, మరియొక్కవైపునఉన్న సిల్‌హెట్టూ, బ్రిటిష్‌వారి అధీనంలో ఉండేది.

బర్మాకు సైనికదళాలను తరలించుకొని పోవడానికి అనువుగా, అస్సామునూ సిల్ హెట్ నూ కలుపుతూ ఒక రహదారిని నిర్మించవలెనని బ్రిటిషువారి ఆశయము. నోంగ్ ఖాల్ లో రహదారిని నిర్మింపచేయడానికి అనుమతి ఇవ్వవలసిందిగాకోరి, బ్రిటిష్ ప్రతినిధి డేవిడ్‌స్కాట్, తిరత్‌సింగ్ నెట్లో ఒప్పించినాడు. గొప్ప సంఖ్యతో సేనలూ, వాటి అనుయాయిదళాలూ, రహదారిని నిర్మించే మిషపై రాజ్యంలో ప్రవేశించినారు. ఖాసీలకు బెదురు పుట్టింది.

బ్రిటిషువారు, పన్నులు విధించడానికి ప్రయత్నిస్తున్నారనే పుకార్లు (ప్రవాదాలు) ఖాసీల సంశయాలను దృఢపరచినాయి. 1829 లో కొంత సిబ్బందిని వెంట తీసికొని, నోంగ్ ఖాలోలోని బ్రిటిషు తెగపై పడినారు. ఇతర నాయకులుకూడా ఇతనితో చేరి, గొరిల్లా పద్ధతి యుద్ధాన్ని చాలకాలం సాగించి నారు.

గారోలూ, ఖామ్ప్టీలు, సింగ్‌ఫోలూ తమకు తోడ్పడగా, ఖాసీలు ఈశాన్యపు సరిహద్దు ప్రాంతాలను కైవసంచేసుకోడానికి సిద్ధంగా ఉన్నారు. పరాక్రమవంతుడైన తమ నాయకుని అధ్వర్యంలో ఈ పర్వతజాతి సైనికులు జరిపిన సాహసయుద్ధం, శత్రువుల ప్రశంసలకుకూడా పాత్రమయింది. దీన్ని గమనించి, బ్రిటీషువారు, తిరత్‌సింగ్‌ను తమ పక్షం తిప్పుకోడానికి ప్రయత్నించి నారు. కాని, తన రాజ్యాన్ని ఎట్టిషరతులూ లేకుండ (బేషరతుగా) అప్ప జెప్పితేకాని, రాజీ కుదరదన్నాడు తిరత్‌సింగ్. కాని, పరస్పరం సమానముకాని బలాల కెంతకాలం పోరాటం సాగుతుంది? కడపట అసాధారణ యుద్ధవీరుడైన తిరత్‌సింగ్ లొంగిపోవలసి వచ్చింది. అతనిని ఢక్కాకు తరలించుకొని పోయినారు బ్రిటీసువారు. బ్రిటీషు పాలనాధికారికి లోబడి, వారి చెప్పుచేతల్లో అతడు నడవ డాని కంగీకరిస్తే, అతని పూర్వపదవి మళ్లీ అతనికి లభిస్తుందని, ఆశ గొల్పినారు. కాని, తిరత్‌సింగ్ వారికోరికను తిరస్కరించినాడు. దాస్యంలో రాజుగా జీవించ డానికంటే స్వతంత్రుడైన సాధారణమానవుడుగా మరణించడమే శ్రేయమని అతడు బదులు పలికినాడు.

1834లో ఈ స్వతంత్రవీరుడు, నిర్వాసంలోనే మరణించినాడు. దీనితో బ్రిటీషువారు దేశమంతటినీ ఉపశమన విధానంతో నిర్వహించడ మారంభిం చినారు.

## III నేపాలీ పన్నుగడలు

బ్రిటిషువారికి విరుద్ధంగా వివిధప్రదేశాలలో గుప్తంగా జరుగుతూఉన్న పన్నుగడలకు ఇరుగుపొరుగు దేశాలనుండి,- అందులో ముఖ్యంగా నేపాలునుండి. ప్రోద్బలం లభించింది. గూర్ఖాపాలకుల ఆధిపత్యంక్రింద నేపాల్ ఐక్యరాజ్యంగా ఏర్పడిన నాటినుంచి బ్రిటిషు వారా దేశపు వ్యవహారాల్లో, ఆసక్తిచూపుతూ వచ్చినారు. 1814 నాటికి ఉత్తరభారతదేశంలోని బ్రిటిషుప్రాంతాల సరిహద్దుల వరకూ నేపాలురాజ్యం విస్తరించింది. దీనితో ఈ ఇరుపక్షాలవారికీ యుద్ధం

ఏర్పడడమూ, నేపాలుసైన్యం అపజయంపొందడమూ జరిగింది. ఐనా,- సుగౌలీ సంధిపత్రంపై 1816 సంవత్సరం, నవంబర్ ఇరవై ఎనిమిదవరోజు సంతకాలు జరిగినాయి.

ప్రతిష్ఠాభంగకరమైన ఈ అపజయమూ, తత్ఫలితంగా, బ్రిటీషు రాయబారికి నేపాలీ దర్బారులో ప్రవేశం లభించడమూ, గూర్ఖాల హృదయాలను దహిస్తూవచ్చినాయి. ఖట్మండ్‌లోని బ్రిటీషురాయబారితో వీరేర్పరచుకొన్న సంబంధాలు అల్పమైనవే. ఐనా, బ్రిటీషువారిపై పగతీర్చుకోవాలని పన్నుగడలు జరుపుతూనే వచ్చినారు. అందులో సఫలీకృతులు కావడానికి, భారతదేశరాజుల సాహాయ్యము అవసరమయింది. కనుక, బ్రిటీషువారితో విరోధమున్నవారని తామనుకొన్న రాజులవద్దకు ఈ విషయమై, రాయబారులను పంపించినారు. భారతదేశంలో రాజులకు బ్రిటీషువారిపట్ల ఎంతో అసంతృప్తి ఏర్పడి ఉంటుంది. కాబట్టి, నేపాలీవారి ఈ స్నేహసహాయ ప్రస్తావనలను ఆదరంతో ఎదుర్కొడానికి వారు సుముఖులై ఉన్నారు.

త్వరగానే బ్రిటిషువారు ఈ పన్నుగడల విషయం తెలుసుకొన్నారు. మద్రాసులో సేకరింపబడిన ప్రత్యక్ష ప్రమాణాల ఆధారంగా, హైదరాబాదులోని బ్రిటీషు విదేశమంత్రిగా నుండిన, ఇండియా ప్రభుత్వపు తాత్కాలిక కార్యదర్శి ఈ క్రిందివిధంగా సూచించినాడు. "మన ప్రయోజనాలకు ఏదోవిధంగా హాని కలిగించే ఉద్దేశంతో, పన్నుగడలు జరుపడానికై ఒక దేశీయరాజుల సంయోజనం ఏర్పడి ఉన్నదనే విషయం నిస్సందేహం, అని నా నిశ్చితాభిప్రాయము."

ఆవారాజ్యంకూడా మనకు విరుద్ధభావంతో ఉన్నదని ప్రకటన మందింది. గూర్ఖాప్రభుత్వం మనకు హానిచేయడానికి చాలకాలంగా ప్రయత్నిస్తూఉంది. జోధ్‌పూర్ ప్రభువు - లేదా - ఆ రాజ్యాన్ని నడుపుతూఉన్న రాజకీయపక్షం, మన అధికారాన్ని, ధిక్కరించింది. సితారారాజు మనకు బహిరంగ శత్రువే. గయక్‌వాడ్ మనపక్షం వాడైనా మనకు విముఖుడే. ఇక, దక్షిణంలో శక్తివంతమైన ఒక కక్షవారు మనకు విరుద్ధంగా కుట్రలుపన్నుతూ ఉన్నారు." అని ఆయన వివరించినాడు.

స్థితిగతులీ విధంగా అనుకూలముగా యున్న సందర్భంలో బ్రిటీషు వారి పట్ల దేశంలో నెలకొనియున్న వైముఖ్యాన్నీ, అసంతుష్టినీ, తమ ప్రయోజనం కొరకు నేపాలు ప్రభుత్వం ఉపయోగించుకోవడంలో ఆశ్చర్యపడవలసినది లేదు. పంజాబుమహారాజా రంజిత్‌సింగ్, ఉదయపూరు రాజా, జోద్‌పూర్ రాజా, నాగపూరువాడైన అప్పాసాహేబ్ భోంస్లే, షహాపూర్ మహారాజా, జైపూర్‌రాజా, కాశీ పుణ్యక్షేత్ర దేవాలయాన్ని నేపాలు బర్మారాయబారుల రహస్య సమావేశ ప్రదేశంగానూ, రక్షక స్థానంగానూ, ఏర్పరచియున్న అస్సాము ప్రభువు, బుందేల్‌ఖండు రాజైన పన్నా, బర్మా, ఆవా, ల రాజులు,- వీరందరికీ నేపాలు ప్రభుత్వం గూఢచారులనూ, రాయబార పత్రాలనూ, పంపించినారు. వీరిలో - ఉదయపూరునకు ప్రయాణంచేస్తూ ఉండిన రాయబారి బన్సరాజును, బ్రిటిషు అధికారులు పట్టు

కోవడమూ, అతని సామానులలో ఏడుజాబులు (ఉత్తరాలు) దొరకడమూ జరిగింది. హెరాట్‌లో దండయాత్రలు సాగిస్తూ ఉండిన పర్షియనుల వద్దకు కూడా నేపాలువారు రాయబారిని పంపించినారు.

"పూర్వమెప్పటికంటే కూడా అధికంగా, నేపాలు ప్రభుత్వం కుట్రలు పన్నడంలో ప్రవృత్తమై ఉన్నది. గోసాయీలూ, పండితులూ, హార్‌కార్‌లూ,- వీరందరికీ నిర్వహింపవలసిన కార్యభారాలు నిర్ణయింపబడినాయి. నేపాలు దేశీయ ప్రజ తెండోప తండాలుగా అవిచ్ఛిన్నంగా, సమతల ప్రదేశాలు చేరుకొంటూ ఉన్నాయి. గతమాసంలో, సుమారైదు వందలమంది, యాత్ర, వ్యాపారము, ఉద్యోగమూ అనే మిషలతో కాశీచేరుకొన్నారు. అంతకంటే అధిక సంఖ్యాకులు పాట్నాకువెళ్ళినారనికూడా అనుమానము. ఇంతకు ముందు ఏ సంవత్సరములోనూ నేపాలీలు ఇంత ఎక్కువ సంఖ్యలో వచ్చినదిలేదని", పోలీసు వారి ప్రకటన.

అవిచ్ఛిన్నంగా ప్రయత్నాలు సాగుతూఉన్నా రాణాజంగ్ బహదూర్ అధికారంలోనికి వచ్చేంతవరకూ ఈ పథకాలేవీ క్రియారూపంగా ఫలవంతం కాలేదు. ఖట్‌మండ్‌లోని రాయబారికి, భారతదేశంలోని అధికారులకు వీటి విషయము, సంపూర్ణంగా తెలిసేఉంది. సమైక్యంతో రాజులందరూచేరి క్రియారూపమైన చర్యకు పూనుకొనంతవరకూ, హిందువులు, ముస్లిములు, ఈ చర్యలో చేరనంత వరకూ, బ్రిటిషు పరిపాలనకేవిధమైన అపాయమూ లేదని, బ్రిటీషు సమాచార శాఖ, తమ ప్రభుత్వానికి అభయవాక్య మిచ్చింది.

## IV. ముస్లిములలో సంచలనాలు

బ్రిటీషువారిపట్ల గాఢమైన అసంతుష్టి, ప్రబలమైన ద్వేషమూ, బెంగాలు ముస్లిములలో ఏర్పడడం సహేతుకమైనదే. మొగల్ సామ్రాజ్య ప్రాతినిధ్యమైన నిజామత్‌ను పడగొట్టడంవల్ల, ఉన్నతవర్గాలవారు దెబ్బతిన్నారు. అల్లే, పరిపాలనా వ్యవస్థను ఆంగ్ల విధానంగా మార్చడము, ముస్లిము అధికారులున్న పదవులలో బ్రిటీషువారిని నియమించడము, ముస్లిములు అనుభవిస్తూ ఉండిన జమీందారీ భూభాగాలను పెక్కింటిని ఇతరాధీనంచేయడము - అనే మార్పులు ఉన్నతవర్గం ముస్లిముల కెక్కువ కష్టము కలుగజేసినాయి. నవాబుసైనికదళాలను విడగొట్టడంతో మధ్యతరగతులవారు నష్టపడినారు. అదేవిధంగా గ్రామీణమైన పోలీసు సిబ్బందిని ఎత్తివేయడంవల్ల అధికసంఖ్యాకులకు జీవనోపాధి నశించింది. విద్యావంతులైన ముస్లిములకు జీవనోపాధిగా సుండిన మాన్యాలను (ఈనాము) వాపసుతీసుకోవడముకూడా ద్వేషానికొక ముఖ్యహేతువయింది. చేనేత పరిశ్రమలను నాశనం చేయడంతో, సామాన్యప్రజలు తమ వృత్తినీ, జీవనోపాధినీ గోల్పోయినారు. దీనికి తోడుగా, బ్రిటిషువారి ముక్త్యారులు (Agents) హిందూ ముక్త్యారులు, నీలిమందు పండించే పాశ్చాత్యులు - సామాన్యజనాన్ని ఎక్కువగా పీడిస్తూ వచ్చినారు.

ఇదికాక, తమ మతసూత్రాలకు విరుద్ధములైన విదేశీయుల ఆచారవ్యవహా-

రాలు, ముస్లిముల మతభావాలకు సహింపరాని ఆఘాతాలైనాయి. క్రిష్టియను మిషనరీల కార్యకలాపాలూ, విపరీత దురభిమానంతో కూడిన ప్రభుత్వోద్యోగుల నడవడికలూ, భరింపరానివైనాయి. ఈ విధంగా రాజకీయ, ఆర్థిక, సాంఘిక, మతవిషయకములైన అంశములన్నీ ముస్లిములలో అశాంతి బయలుదేరడానికి దోహదం చేసినాయి. అట్లుత్పన్నమైన అశాంతి పలురూపాలుగా ప్రవర్తిల్లింది.

బ్రిటిష్‌వారలకు ఎదుర్కొనవలసిన కష్టపరిస్థితులలో ముస్లిము ఫకీరులు వర్తింపజేసిన ఉద్యమము అసాధారణమైనది. ఈ ఫకీరుల దళానికి నాయకుడైన మజ్నూమ్‌షా 1766-77లో, బెంగాలులోని భిన్నప్రదేశములలో కల్లోలములు కలుగజేసినాడు. ఖట్‌మండ్‌కు దక్షిణాన మక్వాన్‌పూరులోను, నేపాల్ తరాయిలోనూ, వీరు కార్యస్థానా లేర్పరచుకొన్నారు. బెంగాలులో వీరి కార్యాచరణానికి, బోగ్రాజిల్లాలోని మదార్‌గంజ్, మహాస్థానులు ప్రధానకేంద్రాలయినాయి. మహాస్థానులో వీరొక కోటను కూడా నిర్మించినారు. ఈ ఫకీరుల దళాలు దేశంపై తిరుగుతూ, జమీందారులనుంచి, రైతులనుంచి తమ ఉద్యమానికి చందాలను వసూలుచేస్తూ, ప్రభుత్వాధికారాన్ని ధిక్కరిస్తూవచ్చిరి. గ్రామీణప్రజలు వీరికి ఆశ్రయమిచ్చి ఆహారపదార్థాలను సరఫరాచేసినారు. 1778లో మజ్నూమ్‌షా మరణానంతరం ఇతని కుమారుడు చిరాగ్ ఆలీషా, అతని అనుయాయులూ 1788-90 ప్రాంతంలో బెంగాలు ఉత్తరపుజిల్లాల మీదుగా తమదళాన్ని నడిపించినారు. భవానీ పాఠక్, మరియు దేవీచౌదరాణీ అనే వీరకాంత,- ఇతర స్వాతంత్ర్యవీరులు, తోడ్పడగా వీరు తమ ఉద్యమాన్ని ప్రవర్తింపజేసిరి. బ్రిటీషువారి కర్మాగారాలపైబడి, అందలి వస్తు సామగ్రినీ, ధనాన్నీ మాత్రమే కాక ఆయుధాలనూ, మందుగుండు సామగ్రినికూడా దోచుకొన్నారు. శీఘ్రమే, వీరు, తమ అనుయాయకవర్గాన్ని, బాగుగా పెంపొందించుకొన్నారు. కంపెనీవారి సైన్యాలతో చిన్నచిన్న యుద్ధాలు సాగిస్తూ, శిస్తు వసూలు జరుగకుండా ఆటంకపరుస్తూ, 1793 నుండి 1800 వరకూ, వీరు యుద్ధం సాగించినారు. కాని, సువ్యవస్థితంగా ఏర్పడిన ప్రభుత్వాన్ని ఎంతోకాలము ఎదిరించి నిలువలేకపోయినారు. కాగా, నేపాల్ మహారాజాతో బ్రిటీషువారు ఒడంబడికచేసుకొని, బెంగాలురాజ్యపరిపాలన సువ్యవస్థగా నడవడానికి తగిన నియమాలను (Regulations) వరుసగా జారీచేయడంతో, ఈ ఫకీరుల దళాలు క్రమేణా తమ స్వాధీనంలోకి వచ్చినాయి. ఐనా - చాలా ఏండ్ల పర్యంతం వారి పలుకబడి చెల్లుతూవచ్చింది. నిజానికి, ప్రజలకీ సర్దారులపట్లా - లేదా - దళనాయకులపట్లా ఎక్కువ గురుత్వమున్నది. వారిని హాకీములనీ, పాలనాధికారులనీ, వ్యవహరిస్తూ ఉండగా, బ్రిటీషుప్రభుత్వానికి ప్రజలపై తగిన అధికారంకానీ, పలుకుబడికానీ, కలుగలేదు. ప్రజల రక్షణార్థం, తాముచేసే ప్రయత్నాలకు ప్రజల సహకారం ఏ మాత్రమూ లభించేదికాదు, అని, 1810 ప్రాంతంనాడు కూడా మింటో ప్రభువు ఒప్పుకొన్నాడు.

బెంగాల్ పంథీశాఖకు నాయకుడైన, టీపూ (Tipu) కూడా ఈవిధంగానే తరువాతికాలంలో, అధికార ధిక్కారం లేవదీసినాడు. 1775 ప్రాంతంలో, ఇతని

తంత్రి కరంషా, సుసాంగ్ పరగణాలో స్థిరపడి, సత్యసంధతా,సర్వసమానత్వమూ, భ్రాతృత్వమూ, అనే సిద్ధాంతాలను ప్రచారం గావించినాడు. అతని అనుయాయులలో హిందువులు, ముస్లిములు, గారోలూ, హాంజోగులూ కూడా ఉన్నారు. 1813లో కరంషా మరణానంతరం అతని కుమారుడు టీపూ సాయుధబలాన్ని సమకూర్చుకొని, జమీందారుల నెదిరించేటట్లు రైతులను పురికొల్పినాడు. 1825లో అతడు షెర్‌పూర్ జమీందారుపై బడి, జమీందారుయొక్క అధికార స్థానమైన, గార్‌జారిపాను ముట్టడించినాడు. న్యాయపరిపాలనకై ఒక న్యాయాధికారినీ, ప్రభుత్వప్రశాసనకై మేజిస్ట్రేటు కలెక్టర్లనూ, నియమించి, తాను రాజదర్బారునుకూడా నడిపింపసాగినాడు. కొన్ని సంవత్సరాలకాలం అతడు, తన స్వతంత్రాధికారాన్ని ప్రవర్తింపజేసినాడు. కాని, 1831 నాటికి మైదానాల్లోని అతని అనుయాయులూ, 1833 నాటికి పర్వతప్రాంతాలలోని అనుయాయులూ కూడా, నిర్మూలింపబడిరి. టీపూ 1852లో మరణించినాడు.

బ్రిటీషు ప్రభుత్వవిరుద్ధంగా, మతావేశ ప్రధానమై జరిగిన సంచలనాల్లో ఫరైజీలు (Farizis) ప్రవర్తింపజేసిన సంచలన మొకటి. తూర్పు బెంగాలులో ఫరిద్‌పూరుకు చెందిన హాజీషరియతుల్లా, 1781-1840 లో, మత సంబంధమైన ఆచారవ్యవహారాలను సంస్కరించడానికై ఒక కార్యక్రమాన్ని ప్రచారంగావించినాడు. కాలక్రమంగా వచ్చిచేరిన విరుద్ధాంశాలను తొలగించి, ఇస్లాము మతాన్ని విశుద్ధంగా చేయడం ఇతనికోరిక. అట్లే, సాంఘికరాజకీయ విసయాల్లో కూడా విశేషపరిణామం అవసరమని ఇతడు వాదించినాడు. స్వలాభం ప్రధానంగా, రైతులను శుష్కింపజేసే జమీందారీ విధానాన్ని ఇతడు ఖండించినాడు. అట్లే, బ్రిటీషు వారిని పారద్రోలి బెంగాలులో ముస్లిం పరిపాలనను నెలకొల్పాలని ఇతడాశించినాడు. జనప్రియంగా, 'దాదూమియా' అని వ్యవహరింపబడుతూ ఉండిన, ఇతని కుమారుడు మహమ్మద్ మొహసీర్, పన్నుల నిరాకరణోద్యమాన్ని లేవదీసినాడు. వృద్ధులూ, అనుభవజ్ఞులూ ఐనరైతులతో గ్రామన్యాయ స్థానాలు ఏర్పరచి, వ్యవహారాలను పరిష్కారముగావించే ఏర్పాట్లుచేసినాడు. అట్లే జమీందారులు శిస్తువసూలుకై చేస్తూఉన్న ఒత్తిడిని ఎదుర్కొడానికి రైతులకు సహాయపడినాడు. 1838 నుండి 1857 వరకు, అతని ఉద్యమాలు నిరంతరంగా కొనసాగుతూ వచ్చినాయి. ఢిల్లీవలీలుల్లా సంస్థకు చెందిన, కార్యచాలకుల నాయకుడైన సయ్యద్‌అహమ్మద్ సహీద్, బెంగాలు ముజహీదుల నాయకుడూ, ఇతనితో సహకరించి ప్రోద్బలమివ్వటంతో, ఫరైజీఉద్యమం బలవత్తరమయింది. ఇస్లాము చరిత్రయొక్క తొలిరోజులందాచరణలో నున్న, విశుద్ధమైన తరీకా - ఇ - మహమ్మదీయా, అనే నిష్ఠా వ్యవస్థను నెలకొల్పడం, ఇతని ఆశయము. అతని శిష్యులైన, తీతూనిజాం అనేపేరుతో వ్యవహరింపబడుతున్న మీర్‌మిథాన్ ఆలీయా, విలాయత్ ఆలీ, ఇనాయత్ ఆలీలు, బెంగాలులో ఈ ఉద్యమం, నిర్వహించినారు. రైతుల నెక్కువగా పీడిస్తూ ఉండిన జమీందారులలో హిందువులెక్కువ. తీతూనిజాం, వారిపై దాడి నడిపినాడు. కాని, 1831 లో

ప్రభుత్వం జరిపిన శీఘ్రదండయాత్ర ఇతనిని అణచివేసింది. ఐనా, 1869-70 లో నీలిమందుకు సంబంధించిన కల్లోలాలు చెలరేగునంతవరకూ, ఫరైజీలు జమీందారులను ఎదిరించి పోరాడుతూనే ఉన్నారు. "బెంగాలు ప్రభుత్వంలోని ప్రతి జిల్లా కూడా, వాస్తవికమైన లపాయానికీ అపాయశంకకూ గురియైనదని, ఈ విషయాలవల్ల వ్యక్తమౌతున్నది." అని బెంగాల్ లెఫ్టినెంటు గవర్నరు, ప్రభుత్వానికి నివేదించినాడు.

సన్న్యాసుల ప్రతిఘటన : ప్రాథమికదశలో జరిగిన తిరుగుబాట్లన్నిటిలోనూ అతివిచిత్రమైనది సన్న్యాసులు లేవదీసినది. ఎనిమిదవ శతాబ్దంలో అద్వైతమతాన్ని బహుళప్రచారం గావించిన శ్రీ శంకరాచార్యులవారి అనుయాయులీ సన్న్యాసులు. శంకరులవారి శిష్యకోటిలో పదివర్గాలవారున్నారు. ఇట్లు తిరుగుబాటు ప్రవర్తింపజేసినవారు 'గిరి' అనే వర్గానికి చెందినవారు. సైనికశిక్షణ వారెప్పుడు పొందినారో తెలుసుకోవడము సాధ్యముకాదు. ఐనా, ప్రప్రథమంగా, అక్బరు కాలమునాటికే వారు యుద్ధసన్నద్ధులుగా తీరియుండిరని తెలుస్తున్నది. మధుసూదనసరస్వతి అనునతడు క్షత్రియులను సన్న్యాసివర్గంలోచేర్చటాని కారంభించినాడని, ఫార్ ఖాన్ వ్రాతలనుబట్టి వ్యక్తమౌతుంది. సాయుధులైన నాగా జాతివారున్నూ, గిరిసన్న్యాసులున్నూ పదునెనిమిదవ శతాబ్దపు యుద్ధాలలో పోరాడియుండిరి మరాఠీలతో పోరు సలుపుతున్న అహమ్మద్ షా అబ్దాలీకి సహాయంగా, పానిపట్ పై దాడి సలిపిన ఔధ్ నవాబు యొక్క సైన్యంలో ఈ గోసాయీల సాయుధ దళం ఒకభాగమై ఉండింది. బ్రిటీషువారిని బెంగాలు నుంచి తరిమి వేయడానికి జరిగిన బక్సారు యుద్ధములో, గోసాయీ హిమ్మత్ గిరి నాయకత్వాన ఐదువేలమంది సన్న్యాసులు మీర్ ఖాసిం పక్షంలో యుద్ధం చేసినారు. మరాఠాసర్దారులూ, హోల్కారులూ, సింధియాలూ, రాజపూట్ రాజులూ కూడా సన్న్యాసులకు, తమ తమ సైన్యాల్లో ఉద్యోగాలిచ్చినారు.

బెంగాలులో బ్రిటిషుప్రభుత్వం స్థాపితమైన అనంతరం, సన్న్యాసులు బెంగాలు వ్యవహారాల్లో జోక్యం కలుగజేసుకోవడ మారంభమయింది. కంపెనీ వారి పరిపాలనావిధానం ప్రజానీకానికి భరింపరాని దుస్థితిని తెచ్చిపెట్టింది. భూమిపన్నుల విషయంలో బ్రిటిషువారవలంభించిన విధానము, పన్నులు వసూలు చేయడంలో వారు చూపిన కాఠిన్యము,- జమీందారులనూ రైతులనూ కార్మికులనూ కూడా సర్వనాశనమొనరించినాయి. అంతలో 1770లో ఏర్పడిన క్షామం బెంగాలును దుర్భరమైన దుర్వ్యవస్థాదుస్థితులలో ముంచివేసింది. ఈ పరిస్థితులలో అరాజకమూ, అధికారధిక్కారమూ అనేవి తప్పనిసరి. క్షామపీడితులైన కర్షకులు చేరగా సన్న్యాసుల జట్టులు, ఫకీరులజట్టులు బాగా పెరిగి,- పదివేల సంఖ్యలో బయలుదేరి, క్రింది బెంగాలులోని ఊడ్పుకళ్ళాలపై (Harvest fields) బడి, దోపిడిచేసి, కాల్చి ధ్వంసంచేసినారని, 1773లో ఫోర్టు విలియం అధ్యక్షుడుకూడా, డైరెక్టర్లపాలన సభకు తెలియజేసినాడు. పుణ్యక్షేత్రాలను దర్శించడానికి పోవడంలో సన్న్యాసులపై ఆంక్షలు విధించడము, బెంగాలులో వారి

కార్యకలాపాలను అరికట్టడము, అనే నిర్బంధాలు సన్యాసుల ప్రతిఘటన చర్యలకు మూలకారణాలు. 1763వ నాటికే, సన్యాసులు కర్మాగారాల దోపిడి కారంభించినారు. పిమ్మట, పెద్దజట్లుగా ఏర్పడి బ్రిటిషుసైన్యాల నెదిరిస్తూ వచ్చినారు. హఠాత్తుగా ఒక్కొక్క జిల్లాపైబడి, ప్రజలనుంచి విరాళాలను లాగుకొని, శీఘ్రగతిలో ఎక్కడివారక్కడ చెదరిపోతూ ఉండేవారు. వారిని వెంబడించడానికి సిపాయిదళాలను ప్రభుత్వం పంపింది. కాని బాహాటమైన పోరాటానికి సన్యాసిదళాలు తలపడలేదు. అంతేకాక, అనేక సందర్భాల్లో సిపాయిలు కూడా ప్రభుత్వం పట్ల భక్తివిశ్వాసాల్లో పూర్తి ఆసక్తి చూపెనవారు కారు. కనుక, ప్రభుత్వ సైన్యాలు దుర్గతికి లోనైనాయి.

సన్యాసుల ఈ కార్యకలాపాలు క్రమంగా ఆగిపోయినాయి. సాయుధమైన దాడులను బెంగాలులో ప్రవర్తింపజేయడం రాను రాను కష్టతరమని వారు గుర్తించినారు. అధికారులదృష్టి దేశంలోని ఇతర భాగాల్లో జరుగుతూఉన్న వ్యవహారాలపైకి మరలింది. దక్కనులో జరుగుతూన్న అన్యోన్య వినాశక సంఘర్షణలు, బీహారురాజస్థానాలలోని అవ్యవస్థలు, వీరిదృష్టి నాకర్షించినాయి. అర్ధశతాబ్దకాలం సంక్షోభాత్మక చరిత్రను ఈవిధంగా, తీవ్రంగా నడిపి, వీరు, పందొమ్మిదో శతాబ్దం మధ్యకాలంనాటికి, రంగంనుండి తొలగిపోయినారు. అతిసాహసాత్మకములూ, శౌర్యవంతములూ అయిన వీరి స్మారకచిహ్నాలు మాత్రము నిలిచి ఉన్నాయి.

## VI. మదరాసు రాజధానిలో కలిగిన ఉత్పాతాలు

బెంగాలులో జరిగిన విషయాలకు అనుగుణంగా భారతదేశపు ఇతర ప్రాంతాల్లోకూడా ప్రచలన రూపంలో ప్రతిధ్వనులు వెలువడినాయి. బ్రిటిషువారు తమ ఆధిపత్యాన్ని నెలకొల్పిన ప్రదేశాలన్నిటిలోనూ సంచలనానికి ఒకే అంశాలు కారణములైనాయి. ఆయాప్రాదేశిక వ్యవస్థలననుసరించి ఈ అసంతృప్తీ, వైముఖ్యమూ (అప్రీతి) భిన్నవిధాలుగా ప్రదర్శితమైనప్పటికీ, ఈ పరిస్థితుల కారణాలు సదృశములైనవే.

మదరాసు రాజధానిలో బ్రిటీషువారు శిస్తుల వసూలు విషయంలో, రైతువారీ విధానాన్ని అమలు జరిపిరి. దీనితో రైతులకు ప్రభుత్వంతో సమక్షమైన సంబంధం ఏర్పడి, మధ్యస్థులు లాభంపొందే అవకాశం లేకపోయింది. భూస్వాములకు దాసులపై ఉన్న అధికారంవంటి అధికారం ఈ విధానంవల్ల ప్రభుత్వానికి రైతులపై ఏర్పడిందనీ, తత్ఫలితంగా రైతుల జీవనానికి కావలసిన పంటను మాత్రమే వదలి తక్కిన దానిని గ్రహించే అవకాశం ఏర్పడిందనీ"; R. C. Dutt (R. C. దత్) వివరించినాడు. రైతులకు తాము పండిస్తున్న భూములపై హక్కు ఏమాత్రమూలేదు; మరియు, అతడు చెల్లించవలసిన శిస్తు సంవత్సర సంవత్సరమూ పంటనుబట్టి, మారుతూఉండింది. ఇట్టి కష్టాలకు రైతు లోనైయున్న అనిశ్చిత స్థితిలో వ్యవసాయ విధానాలను బాగుపరచే అవ

కాశాలకు వీలులేకపోయింది. ఐనా, సాధారణ పరిష్కారానికి లోనైయున్న (General settlement) జాగీరులను కొందరు పాళెయగార్లు తమఆధీనం చేసుకొన్నారు. ఈపాళేయగార్లే, బ్రిటిషు పరిపాలనన్ని వ్యతిరేకించినవారు.

*విజయనగరంరాజా ప్రతిఘటన :* చికాకోల్ జిల్లాలో సువిశాలమైన జమీందారీ విజయనగరము. ఈ జమీందారే ప్రప్రథమంగా బ్రిటిష్ వారికి ఎదురు తిరిగినవాడు. ఫ్రెంచి వారికీ ఆంగ్లేయులకూ యుద్ధం జరుగుతూ ఉన్న అలజడి సమయంలో విజయనగరంరాజా, విశాఖపట్నం, కాశింకోట, శ్రీకాకుళం, పర్లాకిమిడి పరిసరప్రాంతాలను పట్టుకొన్నాడు. 1765 లో, ఈస్టిండియా కంపెనీ ఉత్తర సర్కారుల అనుదానాన్ని (Grant) పొందిన తర్వాత, విజయనగరం రాజా మూడులక్షల రూపాయల పేష్కష్ ఇవ్వవలసిందిగా కోరినారు. ఈకోరికను రాజాగారు మన్నించకపోవడంతో అతని జమీందారీని బ్రిటిషువారు స్వాధీనం చేసుకొన్నారు. తన సైన్యం తోడ్పాటుతో రాజా 1794 లో బ్రిటిషు వారిని ప్రతిఘటించినాడు; కాని యుద్ధంలో హతుడైనాడు. పిమ్మట కంపెనీ వారు వివేకంగా ప్రవర్తించి, సఖ్యవిధానాన్నవలంబించిరి. పేష్కష్‌ను తగ్గించడమేకాక, హతుడైన రాజుయొక్క కుమారుని జమీందారుగా నియమించినారు.

తిన్నెవెల్లి, పంజలంకుంబీ, శివగిరి, రామ్‌నాడ్ పాళెయగార్లు కూడా, తమ అశాంతినీ, ప్రాతికూల్యమునూ సూచించినారు. 1801లో దక్షిణప్రాంతములలోని దిండిగల్, మలబార్ పాళ్యములలో సంచలనము బయలుదేరింది. ఈవిధంగా వ్యతిరేకించినవారు పాలంకోట, ట్యూటికోరిన్ దుర్గాలను పట్టుకొన్నారు. కాని, ఈ ప్రతిఘటనను అణచివేయడంతో పాళెయగారుల దుర్గాలు వశమైనవి; విద్రోహులు నిరాయుధులు గావింపబడిరి. ఆ తర్వాత, దత్తమండలాలలోనూ (Ceded districts) (1801-1805) ఉత్తరార్కాటులోనూ (1803-1805) పర్లాకిమిడి (1813-1814)లోనూ, జరిగిన తిరుగుబాటులు విఫలమైనాయి.

1830-34లో, వీరభద్రరాజు, విజయనగరరాజగు జగన్నాథరాజు, ప్రతిఘటించడానికి సిద్ధమైయున్నారు. గంజాంజిల్లాలోని గుంసూర్ జమీందారు, కర్నూలు పాళెయగారైన నరసింహారెడ్డికూడా, 1835-37 నుండి 1846-47 వరకూ, బ్రిటిషు ప్రభుత్వాన్ని ఎదిరిస్తూనే వచ్చిరి.

1796లో, వైనాడులోని కేరళవర్మరాజా (పైచీరాజా) ఒక కల్లోలాన్ని లేవదీసినాడు. అది, రాజధానియంతటా వ్యాపించింది. 1805లో అతని మరణానంతరమే అది శాంతించింది.

*దివాన్ వేలుతంపీ యొక్క తిరుగుబాటు :* 1805లో, తిరువాన్కూరుపై సహకారీ సంబంధవిధానాన్ని (Subsidiary alliance) విధించడంవల్ల, తిరువాంకూరు దర్బారుకు అసంతృప్తి కలిగింది. కాగా, బ్రిటిషుప్రభుత్వంతో సంబంధాలు చిగిసిపోయినవి. బ్రిటిష్‌వారికి చెల్లించవలసిన సైనిక సహాయ ద్రవ్యం ఆపివేయడం వల్ల, బాకీపడింది. దివాన్‌కున్నూ, స్థానికాధికారికిన్నీ కలహమేర్పడటంతో నాయరు సైన్యదళం ఎదురుతిరిగి, బ్రిటిషుపాలనను ప్రతిఘటించింది. బ్రిటిషు

సైన్యము ఆ తిరుగుబాటును అణచివేయగా, రాజా లొంగవలసివచ్చింది. దివాన్ ఆత్మహత్యగావించుకొన్నాడు.

*ధోండీవాఫ్ ప్రతిఘటన :* 1799లో, మైసూరులోని శ్రీరంగ పట్టణం వశం కావడంలో, టిప్పుసుల్తాను కారాగారంలో నుండిన రాజకీయ ఖైదీలు విడుదల ఐనారు. వారిలో, ధోండ్‌జీవాఫ్, ఒకడు. బ్రిటీషువారిపట్ల అసంతుష్టితో నున్నవారి నందరినీ అతడు తనతో చేర్చుకొన్నాడు. కొందరు కిల్లాదార్లు కూడా అతనితో ఏకమైనారు; బిదనూర్ చుట్టుపక్క జిల్లాలలో విరాళాలుకూడా వసూలు చేసినారు. అతనినీ అతనిసహాకారులనూ శివమొగ్గా, షికార్‌పూరులవద్ద బ్రిటిషు వారు ఓడించగా, ధోండ్‌జీ మహారాష్ట్ర రాజ్యంలోనికి తప్పించుకొనిపోయినాడు. ఆర్థర్ వెల్లెస్లీ అతనిని, వెంటతరిమినాడు. అత్యధికమైన శత్రుబలాల నెదురించి శౌర్యోత్సాహాలతో పోరాడి, దోండ్‌జీ 1800, సెప్టెంబర్, 10వ తేదీనాడు మరణించినాడు.

మైసూరు రాజును అనాదరంగా చూడడంవల్లను జమీందారులను పీడించడం వల్లను, 1831లో రైతులు అసంతృప్తులై ఎదురుతిరిగే సందర్భ మేర్పడింది. శాంతిని మళ్ళీ నెలకొల్పడానికి బ్రిటిషుసైన్యాన్ని ప్రయోగింపవలసి వచ్చింది.

కూర్గురాష్ట్రంలో, ప్రభువగు వీరరాజా, కంపెనీ ప్రభుత్వానికి విరుద్ధుడైనాడు. జనరల్ ఫ్రేజర్ విడుదలచేసిన ఒక ప్రకటనమూలంగా వీరరాజా 1834 మార్చి 15 తేదీనాడు గాధీనుండి తొలగింపబడినాడు.

## VII. దక్కనులో ఏర్పడిన ఉత్పాతాలు

***రాజామహీపత్‌రామ్ ప్రతిఘటన :*** 1800లో నిజాంఆలీఖాన్ ఒనర్చుకొన్న సంధి ఒడంబడిక ప్రకారం, దక్కనులో, నిజాముకు స్వతంత్ర స్థానం నశించి బ్రిటిషువారి సామంతుడైనాడు. మిత్రస్థితి ఏర్పడింది. ఈ కష్టస్థితి దక్కనులోని ప్రబలులైన సర్దారులకు నచ్చలేదు. 1803లో నిజాం ఆలీఖాన్ అనంతరం రాజ్యానికి వచ్చిన సికందరుఝా, ఈ ఒడంబడికకు విముఖుడుకాగా, మరాఠీలతో బ్రిటిషువారికేర్పడిన యుద్ధములో ఇతడు బ్రిటిషువారికి సహాయపడలేదు. నైజాము కత్యంత ఆప్తుడు, బీరారు గవర్నరుఐన, రాజామహీపత్‌రామ్, బ్రిటిషువారి శత్రువర్గ-నికి తోడ్పడినాడు. దౌలతాబాద్, ధారూర్, బిద్నాపూర్ ఖిల్లాదార్లు, బ్రిటిషుసైన్యాలపట్ల తమ శత్రుత్వం బాహాటంగా వ్యక్తమొనర్చినారు. నైజాము, అతని ఉద్యోగులు, బ్రిటిషువారిపట్లఅసూయా, అవిశ్వాసము, అసహ్యాభావమూకలవారై హోల్కారుతోను, సింధియాతోను రహస్యంగా ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతూన్నారనే నిందారోపణకు గురిఅయినారు. ఈస్టిండియా కంపెనీవారు దక్కనులో స్థావరంగా నిలిపిఉంచిన సైనికదళాలు బ్రిటిషుపట్ల అసంతుష్టములై యుండినవి. గొప్పవంశస్థులైన రాజారావ్‌రంభా నింబాల్‌కరూ, నూర్ - ఉల్-ఉమరా, - ఇత్యాదులు అసంతుష్టితోనున్న ఈ

సైనికులపట్ల సానుభూతి కలవారనే అనుమానంతో, వారిని బ్రిటిషువారు, దేశం నుంచి వెళ్ళగొట్టినారు.

బ్రిటిషువారి స్థానికమంత్రి, సిండెన్ హామ్; నైజాము ప్రధానమంత్రి, బ్రిటిషువారికి అభిమాని అయినవాడు మీర్ ఆలం. మహీపత్ రామును అధికారం నుండి తొలగించి, అతనికి నైజాముపైనున్న పలుకుబడి నశించునట్లు ప్రతిక్రియ చేయవలసిందని బ్రిటిషువారుకోరి, మీర్ ఆలంను సమ్మతింపజేసినారు. ఇది కారణంగా రాజామహీపత్ రామ్, 1808లో ఎదురుతిరగడమూ, రాష్ట్ర రాజకీయ వ్యవహారాల నుండి, బ్రిటిషువారు అతనిని తొలగించడమూ జరిగింది. అయినప్పటికీ కూడా, సికందర్ ఝాకు బ్రిటిషువారిపైగల విరోధం తగ్గిపోలేదు. ఈ విషయమెట్లున్నా బ్రిటిషువారి ప్రయోజనాలను రక్షించడంలో అత్యంతమైన ఆసక్తిగలవాడైన చందూలాల్ కు రాష్ట్రవ్యవహారాలలో పలుకుబడి ఏర్పడింది. అప్పటినుంచి సర్కారువ్యవహారాల్లో జోక్యంకలిగించుకోవడము, వాటిలో ఆసక్తి చూపడమూ, నైజాము మానుకొన్నాడు. 1820లో అతని మరణానంతర మతని కుమారుడు నసీర్-ఉద్-దౌలా, అధికారానికి వచ్చినాడు. ఉద్వేగవంతుడూ, స్వతంత్ర శీలుడూ అయిన, అతని సోదరుడు,- ముబారీజ్-ఉద్-దౌలా, బ్రిటిష్ వారికి విరుద్ధంగా జరిగే కార్యకలాపాలకు కేంద్రస్థానమైనాడు.

*ముబారీజ్-ఉద్-దౌలా, ప్రతిఘటన* : ఇదే సమయంలో - సయ్యద్ అహమద్ బరేల్వీ, ముస్లిం మతసంస్కరణవిషయంగా, 'జిహాద్' అనే ధార్మిక యుద్ధాన్ని ప్రవర్తింపజేసిన ఉద్యమము, భారతదేశమంతటా వ్యాపిస్తూ ఉండె.... ముబారీజ్-ఉద్-దౌలా, ఈ ఉద్యమానికి దక్కనులో ప్రబలమైన ప్రోత్సాహ సహాయాల నిచ్చినాడు.

ఈ కార్యాచరణాలన్నిటినీ సూక్ష్మంగా గమనిస్తూ, ఉన్న హైదరాబాదులోని స్థానికమంత్రి, ముబారీజ-ఉద్-దౌలాను, గోలకొండదుర్గంలో నిర్బంధంలో ఉంచడానికి తగిన ఉత్తర్వును నైజామునుండి గ్రహించి, అతనిపైగల అభియోగాన్ని విచారణచేయడానికై ఒక ఆయోగసంఘాన్ని (Commission) నియమించినాడు. భారతదేశంలోని ఇతరరాజుల సహాయంతో, బ్రిటిషుపరిపాలనను పడద్రోయడము, ఉద్ గిర్ దుర్గాన్ని సుదృఢంగా ఏర్పాటుచేయడము, ఆయుధాలను మందుగుండుసామగ్రిని సేకరించడము, నాయిబ్-ఉల్-ముస్లిమీన్ అనే బిరుదుతో గౌరవింపబడిన ముబారీజ్-ఉద్-దౌలా నాయకత్వం క్రింద ధార్మిక యుద్ధపతాకోత్సవము నెరపడము,- అనే విద్రోహచర్యలకై, ముబారీజ్-ఉద్-దౌలా, అతని అనుయాయులు కుట్రపన్నినారనే అభియోగాలు రుజువైనవి. ఈ విచారణఫలితంగా, 1840లో ముబారీజ్-ఉద్-దౌలాను గోలకొండ దుర్గంలో రాష్ట్రఖైదీగా నిర్బంధంలో ఉంచడానికి, అతని సహచరులను రక్షణలో (Custody) ఉంచడానికీ, ఉత్తర్వు జారీఅయింది. ఏ విధమైనా బ్రిటిషు అధికారాన్ని ధిక్కరించి, ప్రతిఘటించి నిలిచిన ఈ రాజకుమారుడు 1854లో, నిర్బంధంలో ఉండగనే మరణించినాడు.

ఇట్లు ఉన్నతపదవులలోనివారు గావించిన వ్యతిరేక ప్రయత్నాలుమాత్రమే కాక, చిన్నచిన్న సర్దారులూ, భూస్వాములూ, లేవదీసిన ప్రతిఘటన లనేకములు. 1818లో ఖేర్ ప్రాంతపు బంజారాలకు నాయకత్వంవహించి నడిపించిన ధర్మాజీ ప్రతాపరావూ, అనేకవత్సరాలు తిరుగుబాట్లను నడిపించిన హోట్‌కార్ నాయకులైన, సవాస్‌ఖాన్‌సాజీలు, రాయచూరుజిల్లాకు జమీందారుగాఉండి, నైజాము అధికారాన్ని ధిక్కరించి, కొబ్బల్ దుర్గాన్ని స్వాధీనంచేసుకొన్న వీరప్పా, 1820లో నైజాముకు పన్నుల నాపివేసిన బీదర్ జిల్లా ఉద్గిరు దేశముఖులూ,- ఇత్యాదులు వారిలో ముఖ్యులు.

*రామోసీ ప్రతిఘటన* : పశ్చిమభారతంలో పీష్వాను 1818 లో, నిష్కర్షగా ఓడించిన అనంతరం, మరాఠాసీమలో సక్రమవ్యవస్థను పునఃప్రతిష్ఠించడము సులభసాధ్యంకాలేదు. నూతనపరిపాలన వ్యవస్థ రైతుల కెక్కువ ఒత్తిడిని కలుగజేసింది. భారతీయుల పరిపాలనకాలంలో స్వతంత్రులుగా వదలివేయబడిన పర్వత జాతులవారికి బ్రిటీషుపరిపాలన యొక్క బలప్రభావపు తాకిడితగిలింది. దీనిని వారు ప్రతిఘటించి నిలిచినారు. వారిలో, ప్రధానంగా, ఉమాజీనాయక్, అతనికి ప్రోత్సాహమిచ్చిన శాస్త్రాత్రియం బక్‌జీ సావంత్, తోరణదుర్గం ప్రాంతపు పర్వతాలలో 1827—28 కాలంలో, పర్వతీయుల ప్రతిఘటన కార్యక్రమాలను నడిపించినారు. కాని, కొంతకాలానికి వారు పట్టుబడి, శిక్షింపబడిరి. ఈ విధంగానే కొల్హాపురసంస్థాన ప్రయోజనాన్నుద్దేశించి, తిరుగుబాటును లేవదీయబూనిన దాదాజీ దౌలత్‌రావు ఘోర్పాడే ప్రయత్నాలు కూడా విఫలమైనాయి.

సతారా రాజ్యపదవినుండి తొలగించబడిన రాజాప్రతాపసింగును మరల పదవిలో ప్రతిష్ఠించడానికై కృషిచేస్తున్న నింబాజీ, లేక నరసప్ప, (నరసింగరావ్ దత్తాత్రేయపేట్‌కర్) లేవదీసిన ఉపప్లవము, ఈ సందర్భంలో, గమనింపదగిన ముఖ్యవిషయము. అరబ్బీ, రోహిల్లాల సైన్యాన్ని సమకూర్చే కార్యంనిమిత్తం (జీతపు) కూలిసైనికులైన (Condottieri) సలింబీన్‌ఆబూద్ (కొహారాన్) తాలిబ్-బీన్-ఆలీ అనే ఇరువురు అరబ్బులను, నియమించినాడు. పిమ్మట వారితో దేవదుర్గం (రాయచూర్) మీదుగా బాదామీపైనడచి, దుర్గాన్ని వశపరచుకొని, దానిపై సతారారాజ్య పతాకాన్ని ప్రతిష్ఠించినారు కాని, దీర్ఘకాలం దండయాత్రలు జరిపిన అనంతరం, 1841లో, ఆ ఉపప్లవాన్ని అణచివేయడం జరిగింది.

*గడ్‌కారీ తిరుగుబాటు* : 1844లో కొల్హాపూరులో ఒక ఉత్పాతంలేచింది. 1837లో, షహాజీమరణంతో, అప్పటికింకా యుక్తవయస్కుడు కాని శివాజీని, సింహాసనంపై నిలిపినారు. రాజ్యవ్యవహారాలు నడపడానికై, దాజీకృష్ణ పండిత్ మంత్రిగా నియమింపబడినాడు. భూమిపన్నుల వసూలు విధానంలో, గావించిన మార్పులవల్ల అతడు ప్రజల అభిమానాన్ని గోల్పోయెను. దుర్గాలను పడగొట్టి వేసే ఉద్దేశంతో, వాటిని స్వాధీనపరచుకోడానికీ, వంశపారంపర్యంగా వాటి నంటిపెట్టుకొని యుండిన, గడ్‌కారీలను తీసివేయడానికీ, వారనుభవిస్తూవచ్చిన

మాన్యాలను మమ్లత్‌దారులు ((Mamlatdars) పర్యవేక్షణ క్రిందికి తేవడానికి ప్రయత్నించినాడు.

రాజ్యంలోని తక్కినవర్గాలవారు గడ్‌కారీలపట్ల ఎక్కువ సానుభూతి చూపుచుండినారు. ఈ కారణాలు తిరుగుబాటుకు కారణమైనాయి. సామన్‌ఘడ్, భుదార్‌ఘర్, కోటలను గడ్‌కారీలు ఆక్రమించుకొన్నారు. ఈ విప్లవకారులను అణచివేసి మరల శాంతిని నెలకొల్పడంలో బ్రిటీషువారెంతో శ్రమించి, ధనాన్ని వ్యయంచేయవలసి వచ్చింది.

అదే సంవత్సరం, అదివరకే అసంతుష్టితో ఉద్రేకం చెందుతూ ఉన్న సామంత్‌వాడీలో కల్లోలం బయలుదేరింది. ఆ రాష్ట్ర సర్దారులలో ఒకడైన ఫోండ్‌సావంత్ నాయకత్వంక్రింద వెలువడిన ప్రతిఘటనమే ఇందుకు కారణం. చిన్నవయస్కుడైన రాజకుమారుడు అన్నాసాహేబునూ, అనేకుల నితరసర్దారులనూ, దేశాయీలనూ తనవెంటబెట్టుకొని, ఫోండ్‌సావంత్ కొన్ని దుర్గాలను పట్టుకొన్నాడు. బ్రిటీషుసైన్యాలతనిని ఈ దుర్గాలనుండి వెళ్ళగొట్టగా, తన అనుయాయులతో కూడా, గోవాకు తప్పించుకొనిపోయి అచ్చటినుండి, సామంత్‌వాడులో కల్లోల స్థితిని కలిగిస్తూవచ్చినాడు. దీనికి నాయకులైన సర్దారులను, దేశాయీలను, తమకు అప్పజెప్పవలసిందిగా, బ్రిటీషువారు పోర్చుగీసువారిని అర్థించి, ఒప్పించిరి. ఐనా, ఫోండ్‌సావంత్‌ను,అన్నాసాహేబును అప్పజెప్పడానికిమాత్రం పోర్చుగీసువారు అంగీకరించలేదు. అప్పజెప్పబడిన తక్కినవారు రాజద్రోహం నేరంకింద, భిన్నకాల కారాగార శిక్షలకు గురిఅయినారు.

## VIII. గుజరాతు, సౌరాష్ట్రాలలో జరిగిన ప్రతిఘటనలు

గుజరాత్ సౌరాష్ట్రాలలోకూడా, అసంతుష్టి ఈవిధంగానే రూపందాల్చింది. 1835లో, కెప్టన్ ఔట్‌రామ్ (Captain outram) ఈ ప్రాంతాన్ని చూడడానికి వచ్చినప్పుడు, అచ్చటి సరదారులు ప్రభుత్వానికి ఎదురుతిరిగి ఉండిరి. "ఈ విద్రోహనాయకులను ప్రధానంగా బలపరుస్తున్నవారు, మనల నెదిరించడానికి తగిన ఆత్మవిశ్వాసాన్ని వీరికి కలిగిస్తున్నవారు, కలహాలను పురికొల్పుతున్నవారు,- ముఖ్యంగా విదేశీయులైన కూలిసైనికులు (Mercenaries). కలహాలను, పోరాటాలను తామే స్వయంగా సృష్టించి, లేవదీసి, వాటిమూలంగా ఈ కూలి సైనికులు బ్రతుకుతున్నారని", క్యాప్టెన్ ఔట్‌రామ్ వ్రాసినాడు. "ఈ కూలి సైనికులు చాలవరకు మక్‌రాణీలు (Muckranees), సింధీలు, సీదీలు, గోసాయిలు, అరబ్బులూ,- ఐఉన్నారని" కూడా ఇతడు వివరించినాడు. "ఎంత సునాయాసంగా, దండనభీతి అనేది ఏ మాత్రమూలేకుండా, గుజరాతు దేశీయులు బ్రిటీషుఅధికారులను అవమానపరుస్తూ, దోచుకొంటూ ఉన్నారో గమనింపవలసిన విషయము. దీన్ని శీఘ్రమే అరికట్టనపోతే, ఈ ప్రాంతంలో బ్రిటీషువారి హాయాము (అధికారం) దిగజారిపోక తప్పదు. బ్రిటీషువారిపట్ల విముఖులూ, అభిమానంలేనివారూ ఐన లక్షలాది దేశీయులమధ్య నిలిచియున్న, అత్యల్ప

సంఖ్యాకులైన బ్రిటీషువారి అధికారం నామమాత్రావశేషమే." అని కూడా ఇతడు వెల్లడిచేసినాడు.

*వాఘేరా ప్రతిఘటన :* పైనపేర్కొన్న నివేదిక, కచ్‌లో [1815 మొదలు 1832 వరకు] జరిగిన అలజడులను గురించింది. అదికాక, ఓఖామండల్‌లో బ్రిటీషు పరిపాలన నెలకొల్పిన ఆరంభదశ నుండీ కూడా, వాఘేరాలు, ఈ అధికారాన్ని ఎదురిస్తూనే వచ్చినారు. బరోడా, గయక్‌వాడ్ విధించిన ముల్క్‌గిరి శుల్కాలు (Levies) వాటిని నిర్బంధగా వసూలు చేయడంలో బ్రిటీషు వారతనికిచేసిన సహాయము, - ఇవి వాఘేరాల, అసంతృప్తికి ప్రధానములైన హేతువులు. సూరత్‌లో పారంపర్యంగా ప్రతిఘటన సాగుతూనే ఉంది. ఉప్పుపై పన్ను విధించడము, తూకాల, కొలతల, ప్రమాణీకరణము, మొదలైన అనిష్ట విధానములను ప్రవేశపెట్టడము, పట్టణవాసులు ప్రతిఘటించినారు. వర్తకు లంగళ్ళను మూసివేసినారు. ప్రభుత్వోద్యోగులను వెలవేసినారు, వేలకొలది సంతకాలతో అర్జీలను తయారుచేసి, ప్రభుత్వానికి పంపినారు. తుదకు, విధిలేక ప్రభుత్వం ఈ అనిష్టకరములైన విధానాలను రద్దుపరచింది.

*భిల్లుల తిరుగుబాటు :* ఖాందేశ్‌లోనూ ఔరంగాబాదుజిల్లా పర్వత ప్రాంతంలోనూ నివసిస్తున్న భిల్లులు ఆదిమజాతివారు. ఉత్తర భారతం నుండి దక్కనులోకి ప్రవేశమిచ్చే పర్వతపు లోయలపై వీరి కధికారముండేది. రజపుత్ర ప్రభువులపట్ల వీరికెక్కువ స్నేహానురాగాలూ, భక్తివిశ్వాసాలూ, ఉండినవి.

పదునెనిమిదవ శతాబ్దం కడపటి భాగంలో, వీరెక్కువ దుస్థితికిలోనైనారు. మరాఠాయుద్ధాలు, పిండారీల విధ్వంసక చర్యలు, దుష్పరిపాలన, క్షామము, - ఇవి వీరి ప్రాంతాన్ని నాశంచేసినాయి. ఈ అన్నిటికీ పైపెచ్చు, వీరి ప్రాంతం 1818లో బ్రిటీషు ఆక్రమణకు లోనయింది. వీటివల్ల విప్లవం చెల రేగింది. ఈ విప్లవం, ముప్పైసంవత్సరములదాకా, రాజుతూనే వచ్చింది. కాని, తీవ్రమైన సైన్య కార్యకలాపంతోపాటు, న్యాయసమ్మతమైన సఖ్యసమాధాన విధానములు కూడా అవలంబించడంతో కడపటికి, ఈ తిరుగుబాటు అంతమయింది.

*కోలీ తిరుగుబాట్లు :* సహ్యాద్రిశ్రేణి వ్యాపించియున్న కొండ ప్రాంతంలో నివసిస్తూ ఉన్న కోలులు, భిల్లులు, ఇరుగు పొరుగువారు. స్వాభావికంగా కోలులు ఉద్రిక్తులూ కలహశీలురు. దుర్గాలకు రక్షణసేనగా, వీరిని నియమించడం పరిపాటి. కాని, దుర్గాలను బ్రిటీషువారు పడగొట్టడంతో వీరికి ఉద్యోగం లేక పోయింది. తత్ఫలితంగా, తీవ్రమైన అసంతుష్టి ఏర్పడి, 1828, 1839, 1844-48, లలో జరిగిన ప్రతిఘటనలకు దారితీసింది. ఐనా 1850 నాటికి వీరిని లొంగదీయడంలో, ప్రభుత్వం కృతార్థమయింది.

## IX. రాజపుటానాలో కలతలు

రాజపుటానాలో స్వతంత్రరాజులు ఇరువది సుండికిపైగా ఉన్నారు. వారి మధ్య చిరకాలంగా నెలకొనియున్న అనైక్యమూ, పరస్పర స్పర్ధలూ కారణంగా, దేశం, పలుకష్టాలకు గురియైంది. [illegible] సూచనలు, స్పర్ధలు, పాలకుల వివాదాలు వారి స్వాతంత్ర్యాన్ని [illegible], వారి ప్రతిష్ఠకు భంగం కూడా కలిగించినాయి. 18వ శతాబ్దంలో రాజపుటానా, మహారాష్ట్రులకు సామంత రాజ్యంగా ఏర్పడింది. రాజపుత్రుల ఈ విధంగా లోబరచుకోడానికి మహారాష్ట్రులు జరిపిన దాడులవల్ల, దేశం [illegible] లోనయింది. బ్రిటీషువారి మధ్యవర్తిత్వంవల్ల రాజపుత్రులపై మహారాష్ట్రుల ఒత్తిడి కొంత తగ్గింది, కాని, పరిస్థితి మారలేదు. మహారాష్ట్రుల ఆధిపత్యానికి బదులు, బ్రిటిష్ వారి ఆధిపత్యం తమపై ఏర్పడింది. బ్రిటీషు అధికారానికి లోబడడం, మహారాష్ట్రుల దోపిడీ విధానానికి లోబడడంకంటే, ఒక విధంగా, నయమనే చెప్పవచ్చును. కాని, స్వయం పరిపాలన పోగొట్టుకోవడ వల్ల, ఆత్మాభిమానం దెబ్బతిన్నది. దీనికితోడుగా, నూతన పరిపాలన విధానాన్ని ప్రవేశపెట్టడము, వారు చిరకాలంగా రక్షించుకొంటూ వచ్చిన ఆచార వ్యవహారాలను రద్దుచేయడము, బ్రిటీషువారి మద్దతుగల రాజులదర్పప్రాభవమూ, – ఇవి రజపుత్రులు సహింపరానివైనాయి. అల్లే, బ్రిటీషు వారు తమ దేశంలో నెలకొల్పిన సేనా శిబిరాలు, తమ పరాధీన స్థితికి స్మారక చిహ్నాలై నిలిచినాయి. తమ సంప్రదాయములు, మతవ్యవస్థా కూడా, నిర్మూలింపబడే ప్రమాదమేర్పడి యున్నదనే సంశయం, వీరిని బాధిస్తూవచ్చింది. ఈ పరిస్థితి [illegible] అసంతృప్తినీ, కలతనూ రేపింది.

జోధ్‌పూర్ మహారాజైన మాన్‌సింగు, బ్రిటీషువారికి విరుద్ధంగా జరిగే ఆందోళనకు, కేంద్రస్థానమైనాడు. కాని, తన నిస్సహాయస్థితివల్ల విసుగూ అసహ్యమూకలిగి, సింహాసనం పరిత్యజించడమే మంచిదని నిశ్చయించినాడు. కోటారాజ్యపు జాలారామ్, మహారావ్ కిషన్‌సింగులు ఒనర్చిన ప్రయత్నాలు, మీవార్, మార్వార్, జాగీర్దారులొనర్చినకుట్రలూ,– ఇవన్నీ రాజపుటానా ఎంత సంక్షుబ్ధమై ఉండినదో సూచిస్తున్నవి. విద్రోహాచర్యలపట్ల, ఉత్సాహంపైన గన్యాలు, ఎట్లు ప్రజామోదాన్నిపొందినవి అనే విషయం కవిరాజ బంకీదాస్ రచించిన వీరగాథల్లోను, మహాకవి సూర్యమల్ మిశ్రారచనల్లోను వ్యక్తమవుతుంది.

## X. ఉత్తరప్రదేశ్‌లో ఏర్పడిన కలతలు

బీహారుకు, పంజాబుకు మధ్యనున్న ఉత్తరభారత భాగం [1765కూ1805] బ్రిటీషువారి రక్షణాధికారం కిందికివచ్చింది. ఆరంభదశలో, ఔధ్‌నవాబులు బ్రిటీషువారి ఆదేశప్రకారంగా, దోబ్ ప్రాంతంలో ఎక్కువభాగాన్ని పరిపాలించినారు. తక్కినప్రాంతం, మరాఠుల సర్వాధికారంలో ఉండేది. మూడవ మరాఠా

యుద్ధం తర్వాత, దోబ్ ప్రాంతంనుంచీ బుందేల్ ఖండ్‌నుంచీ, మహారాష్ట్రులు తొలగింపబడినారు. ఆ విధంగానే, నవాబులపాలనలోనుండిన రాజ్యభాగం కూడా తగ్గించినారు. 1856 నాటికి, ఆ ప్రాంతం అఖండంగా బ్రిటిష్‌వారి ప్రత్యక్షాధికారంలోకి వచ్చింది.

బ్రిటీషువారి జోక్యము, వారి ఆదేశాలు, ఔధ్ నవాబులకు విసుగు పుట్టిస్తూవచ్చినాయి. దీనివల్ల, రెండుప్రభుత్వాల మధ్య నిరంతరంగా తగాదాలేర్పడుతూ వచ్చినాయి. ఔధ్‌లో ఏర్పడిన క్లిష్ట పరిస్థితులన్నిటికీ ముఖ్యకారణం, బ్రిటీషువారేర్పరచిన అస్వాభావికమైన పరిపాలన వ్యవస్థ. పరిపాలన యొక్క బాధ్యత పూర్తిగా నవాబుల తలపైయుండగా, నిజమైన అధికారం బ్రిటీషువారి హస్తగతమైఉండినది. తుదకు, 1856లో, ఔధ్ రాజ్యాన్ని బ్రిటీషువారు తమ రాజ్యంలో కలుపుకోవడం, అనివార్యమయింది. ఈ మధ్యకాలంలో జరిగినవిషాదకర సంఘటనలు అసంఖ్యాకములు.

*గోరఖ్ పూరులో జరిగిన ప్రతిఘటన :* ప్రప్రథమంగా, ఈ సంఘటనలను ప్రేరేపించినవాడు కంపెనీవారి అధికారియైన కర్నల్ హ్యానే(Hannay).1778లో ఔధ్ నవాబితనిని తన కొలువులోనికి తీసికొని గోరఖ్ పూర్, బహరేచ్, బస్తీ జిల్లాల పరిపాలన అతనికప్పగించినాడు. తన కప్పగించిన ఈ ప్రదేశంలో ఘోరమైన విధంగా, దుష్పరిపాలనసాగించి, ఈ పాశ్చాత్యుడు అమితధనాన్ని మూటగట్టుకొన్నాడు. పన్నులు వసూలుచేసే హక్కును ఇతడు కంట్రాక్టరులకు గుత్తకు ఇవ్వగా, వారు అతిభారమైన పన్నులువేసి, హింసాకాండ నెరపి, రైతుల రక్తం పిండినారు. పల్లెలను దోపిడీచేసినారు.

అంతకుముందు సమృద్ధమై ఉండిన దేశం మూడు సంవత్సరములలోపుగనే దుస్థితికి వచ్చింది; నిర్జనమయింది.నిరాశల వలన పుట్టిన సాహసంతో, ప్రజలుతిరుగబడినారు. ఘాగ్రానదికి తూర్పుననివసించే జమీందారులు యుద్ధసన్నద్ధులై, గోరఖ్ పూర్, బెల్వాల్, దోమారియాగంజ్ దుర్గాలనుపట్టుకొని, రాకపోకల నరికట్టినారు. ఔధ్ బేగములపైనా, బనారసు ప్రభువైన మహారాజా చైత్‌సింగ్ పైనా, కల్పించిన ఆరోపణలను నమ్మడానికి వ్యక్తిగతములైన కారణాలు ఏవో హేస్టింగ్సుకుఉండినాయి. అందువల్ల, ఈ విద్రోహచర్యలతో, బేగములకును, చైత్‌సింగుకును సంబంధమున్నదని కర్నల్ హ్యానే చెప్పగానమ్మి, వాటి నణచివేయడానికై అతితీవ్రములు, దురంతములు ఐన చర్యలను నడిపించినాడు. ఫలితంగా, ఔధ్ ప్రాంతమంతా బీడుభూమికి సమానంగా నాశమైపోయింది.

*వజీర్ అలీ ప్రతిఘటన :* కంపెనీగావించిన ఏర్పాటునుబట్టి ఔధ్, కంపెనీవారి మిత్రరాజ్యము, కంపెనీ వారి పూర్వ పశ్చిమరాష్ట్రాల మధ్య రక్షక రాజ్యంగా (Buffer state) నిలిచింది. కంపెనీ వారి నియమాలను అనుసరించడానికీ, అధికంగా పెంచిన సైన్యసహాయ ధనాన్ని ఇవ్వడానికీ ఔధ్‌నవాబు నిరాకరించినాడు. బ్రిటీషువారి ప్రయోజనాలకు విరుద్ధమైన ప్రయత్నాలితడు చేస్తున్నాడని, కాబూల్ మరాఠా సర్దారులతోనూ, ముస్లిమురాజులతోనూ,-

అందునూ ప్రధానంగా గ్వాలియరు, సింధియా, కాబూల్ [illegible]తో కలసి, ఒక శత్రుకూటాన్ని ఏర్పరస్తున్నాడనీ అనుమానించి 1799 లో ఇతన్ని పదవి నుండి తొలగించినారు. ముర్షీదాబాదు నవాబులు, దక్కను నవాబులు ఈ కుట్రతో చేరియున్నారు. లక్నో విడిచి కలకత్తా వెళ్ళవలసిందిగా వజీర్ ఆలీని ఆజ్ఞాపించడంతో విప్లవం బయలుదేరింది. బ్రిటీషు సైన్యాలు ముట్టడించగా, వజీర్ ఆలీ పలాయితుడైనాడు; కాని అతన్ని పట్టుకొని వెల్లూరుకు [illegible] పంపివేసినారు.

*రోహిల్లా ప్రాంతంలో ప్రతిఘటన* : 1801 ఔధ్ నవాబు రోహిల్ ఖండ్ ప్రాంతాన్ని కంపెనీ వారి ఆధిపత్యం క్రిందికి మార్చివేసినాడు. అట్లుగావించిన ఆరంభదశలోనే ప్రజానీకంయొక్క అసంతృప్తి వెలువడింది. ఈ మార్పువల్ల రోహిల్లా సర్దారుల హోదా అంతరించింది. తమ ఆశ్రితులతో సమానమైనస్థితి ఏర్పడడం ఈ సర్దారులకు అవమాన కరమయింది. శిస్తుల విషయమైన విధానము, నూతన పరిపాలన విధానము, న్యాయవిధానము వీరి అసంతృప్తికి ప్రధాన హేతువులయినాయి. బరైలీ పట్టణంలో చౌకీదార్లను నరిగాచే నిమిత్తం పోలీసు పన్నును విధిస్తూ [1814 లో] పదహారవ వినియమం క్రింద దానిని అమలు జరిపిరి. విప్లవం, వెంటనే బయలుదేరడానికి ఇది ముఖ్యకారణము. ఈ విషయమై ప్రజలు తమ అసమ్మతిని సూచిస్తూ గావించిన ఆక్షేపణలు విన్నవారులేరు. పైగా వారు పూజ్యభావంతో గౌరవిస్తూఉన్న ముఫ్తీని కొట్టడంకూడా జరిగింది. దీనితో ప్రజలగుంపు ఉద్రిక్తమై, పూర్తిగా హద్దుదాటి వ్యవహరించింది. ఈ ప్రతిఘటనను ఎదుర్కోవడం దండనాధిపతి (Magistrate) సి. [illegible] సాధ్యంకాక పోగా సైన్యాన్ని రప్పించ వలసివచ్చింది.

*హత్రాస్ దయారామ్* : అలిఘర్ జిల్లాలో జరిపిన శిస్తుల విధానము, చిన్న జమిందారులకెంతో దుస్థితిని కలిగించింది. బ్రిటీషువారు నియమించిన అధికమైన శిస్తులనువారు చెల్లింపజాలకపోయిరి. బాకీసొమ్మును రాబట్టుకోడానికి జమీనులను వేలంవేసిరి. ఈకారణంగా నిరుద్యోగులైన సైనికసిబ్బంది, బ్రిటీషు వారికి అవిధేయులైన భూస్వాములు ఏకమై, అవ్యవస్థనూ అరాజకస్థితినీ, కలిగించినారు. మేవాటీలూ బధిక్కులూ (Badhiks) గుంపులు గుంపులుగా బయలుదేరి, ఈ పరిస్థితిని మరింతతీవ్రం గావించిరి. హత్రాస్‌కు తాలూకుదారైన దయారామ్, పెక్కుగ్రామాలకు యజమాని. ఎత్తైనప్రాకారాలతో, కందకంతో, సురక్షితమైయున్న ఒకదుర్గం, ఇతని వాసస్థానము. ఈ దుర్గాన్ని పడగొట్టవలసిందని, సైనిక సిబ్బందిని విడదీసివేయవలసిందనీ బ్రిటీష్‌వారితన్ని ఆజ్ఞాపించినారు. ఆ ఆజ్ఞను పరిపాలింపజేయడానికై, ఒక సమగ్రమైన సైన్యదళాన్ని పంపినారు. ఇంత వరకూ భారతదేశంలో ఎప్పుడూ చూడనివిధంగా, సమకూర్చబడిన శక్తివంతమైన ఫిరంగీసమూహాన్నెదిరించి, దుర్గరక్షకసైన్యము, ఎంతోకాలం నిలవజాలక పోయింది. కాగా, బ్రిటీషువారి హస్తగతమయింది దుర్గము. కాని, దయారామ్ తప్పించుకొనిపోయినాడు. తుదకు, జీవితభృతి (Pension) ఇచ్చేషరతుపై అతడు

బ్రిటిష్‌వారికి ఆత్మార్పణ గావించుకొన్నాడు.

అసంతృప్తి, ప్రతిఘటనభావము, బ్రిటీషుపాలన ఆరంభంనుంచీ వివిధ ప్రాంతాల్లో అంతర్జ్వాలంగా రగులుతూనే ఉండినవి. సందర్భాలనుబట్టి, మాటి మాటికి కార్యరూపంగా బహిర్గతమయిందని, సంక్షిప్తమైన ఈపరిశీలనవలన వ్యక్త మవుతుంది. బ్రిటిషు ప్రాంతమందంతటా ఒక్క అంశాలే ఈ అసంతుష్టికి కారణము లైనవి. శిస్తువసూలుచేసే సమయంలో భూస్వాముల అధికారం తగ్గిపోయింది. అధికమైన ఆర్థికభారం ప్రాంతాలపై పడింది. ఇవి, ప్రజలవ్యతిరేకతకు ప్రబల హేతువులు. ఈ ప్రభుత్వవిధానాలు సాంఘిక ఆర్థికవ్యవస్థలో గొప్పవిప్లవాన్ని తెచ్చి పెట్టింది. జమీందారుల హక్కులకు, రైతులహక్కులకు, భంగం కలిగించింది. మరియు, చిరకాలంగా నిలిచియున్న ఆర్థికస్థితి కలతచెందింది. ఇవి కారణములుగా జమీందారులు రైతులుకూడా ఎదురుతిరగడం సహజపరిణామము. ఇట్లు, ప్రతిఘటన కారణాలంతటా సదృశ్యములైనవే. ఐనా, ఆయా ప్రాంతాలలోని భిన్నపరిస్థితులనుబట్టి, ప్రతిఘటనకూడా భిన్నరూపాలలో వ్యక్తమయింది. ఈ తిరుగుబాట్లు స్థానికములైనవిగానో, వర్గసంబంధములైనవిగానో జరిగినాయి. కాని, సుసంఘటితములు కాకపోవడమూ, ఐక్యములేకపోవడమూ, కారణంగా- అణచివేయబడినాయి.

## XI. వలీఉల్లాహీ ఉద్యమము

ఇదే కాలావధిలో బ్రిటీషువారి ఆధిపత్యాన్నెదిరించిన ఉద్యమాలన్నిటి లోను ముస్లిము శాఖవారు లేవదీసిన 'జహాద్' అనే ధార్మిక యుద్ధోద్యమం ప్రబలమయింది. ఉత్తర్ ప్రదేశ్‌లోని రేబరేలీ జిల్లా వాస్తవ్యుడైన సయ్యద్ అహమద్ ఈ ఉద్యమానికి నాయకుడు. మహమ్మద్ ప్రవక్త వంశీయులమని చెప్పుకొనే ఒకప్రసిద్ధ దైవజ్ఞ కుటుంబములో ఇతడు జన్మించినాడు. స్వభావ సిద్ధంగానే సరళమైన పటుత్వంలేని దుర్బలవ్యక్తి ఇతడు. జీవితాన్ని మతసేవకు అంకితం చేయవలసిందని హెచ్చరిస్తూ ఉన్న స్వప్నదృశ్యాల నితడు భావించు కుంటూ ఉండేవాడు.

వలీఉల్లా స్థాపించిన ఇస్లాము పునరుజ్జీవన సంస్థయొక్క వాతావరణ ప్రభావానికి ఇతని సహజోద్రేక పూరితమైన మనస్సు, లోనయింది. వలీఉల్లా (1703-62) అనంతరం అతని కుమారుడు అబ్దుల్ అజీజ్ (1746-1823), ఒక 'ఫత్వాము' అనేశాసనాన్ని జారీచేస్తూ, భారతదేశపు, దార్-ఉల్-ఇస్లాము జీవితం ఎప్పుడో నశించిందన్నాడు.

ఇటువంటి నేమిష్ఠమూ (Puritanical), ఇస్లాము పునరుజ్జీవికమూ ఐన వాతావరణంలో, సయ్యద్ అహమ్మద్‌యొక్క మనోభావాలూ, ప్రవృత్తులూ తదనుగుణంగా పెంపొందినాయి.

ఐనా, భగవత్సాయుజ్యంవల్ల సిద్ధించే అనిర్వచనీయమైన అనుభవస్థితికై ప్రయత్నించేసే భావనమయదృష్టి కాదితనిది. కార్యరూపమైన ప్రవృత్తికై

ఇతని హృదయం లవాతవాలాడింది. మహమ్మద్ ప్రవక్తయొక్క అడుగుజాడల్లో నడిచి, తరీకా-ఇ-మహమ్మదీయా అనే విధానాన్ని పునరుజ్జీవింపజేయడం, ఇతని ఆశయము. అడుగునబడియున్న ముస్లిము జాతిని ప్రబోధించడానికై త్రివిధమైన కార్యక్రమాన్నితడు ప్రవర్తింప జేసినాడు. భగవంతుని సందేశాన్ని మహోజ్జ్వలంగా కీర్తించడం, వాక్కునందూ క్రియయందూ విశ్వాసోత్సాహ చైతన్యాన్ని ప్రదర్శించడం, ధార్మిక యుద్ధాన్ని ప్రవర్తింపజేయడం-అనేవి ఇతడు బోధించిన మూడుసూత్రాలు. కార్యపరుడైన ఇతడు, క్రియారూపమైన ఉద్యమానికే, ఉన్నత స్థానమిచ్చినాడు. దైవప్రార్థన, స్వపాప నివేదన (Confession), భిక్షాదానము ఉపవాస వ్రతము, పుణ్యస్థలయాత్రా, - అనే పంచమత స్తంభాలన్నిటిలోనూ ఆఖరుదే భగవంతుని పూజా విధానాల్లో ఎక్కువ పుణ్యప్రదమైనదని ఇతని అభిప్రాయము.

1808 నాటికి, విద్యాభ్యాసం పూర్తికావడంతో సయ్యద్ అహమ్మద్, స్వగృహాన్ని చేరుకొని, వివాహం చేసుకొన్నాడు. పిమ్మట, తాను ఏర్పరచుకొన్న ధ్యేయాన్ని అన్వేషిస్తూ పర్యటనం చేస్తూ, అమీర్ ఖాన్ స్వతంత్ర పరిపాలనలో ఉండిన టోంక్ ప్రాంతాన్ని చేరుకొన్నాడు. అమీర్ ఖాన్ యొక్క సైన్యంలో చేరి అతని యుద్ధాల్లో పాల్గొని, యుద్ధవిషయకమైన పన్నుగడలు, వ్యూహరచనాది విశేషాలు మొదలైన సైనిక విషయాల్లో, తగిన శిక్షణను సంపాదించుకొన్నాడు. కాని, 1817లో అమీర్ ఖాన్, బ్రిటీషువారిక్రింద సామంత స్థితి నంగీకరించడంతో, సయ్యద్ అహమ్మద్ అతని సేవను విరమించుకొన్నాడు.

టోంక్ నుండి వెనుకకు వచ్చినతర్వాత ఇతడు ఉత్తరప్రదేశ్ పశ్చిమ జిల్లాల పర్యటన మారంభించెను. మీరట్, ముజఫర్ నగర్, సహారన్ పూర్ జిల్లాలోని ముఖ్యపట్టణాలను గ్రామాలను, చూచినాడు. రెండవసారి పర్యటనలో తూర్పుజిల్లాలైన అలహాబాద్, బనారస్ కాన్పూరు, లక్నోలనూ, మూడవసారి పర్యటనలో రోహిల్ ఖండునూ, ఇతడు సందర్శించినాడు.

అతడు సందర్శించిన ప్రతిచోటా, ప్రజలతనికి అత్యుత్సాహంతో స్వాగతమిచ్చి, మితంలేని ఆతిథ్యం ఏర్పాటుచేసినారు. ప్రజలసంఖ్యాకులుగా అతని మతోపన్యాసాలను విన్నారు. ఇస్లాము సిద్ధాంతాలనతడు ఖురానుబోధనల ననుసరించి, ఉపదేశించినాడు. ఏకైకుడైన భగవంతునితో ఇతరమైన దానికి సంబంధము కల్పించడం, లేదా భగవంతుని శక్తిసామర్థ్యాది గుణగణాలు ఇతరవ్యక్తుల కంటగట్టడం, అత్యంతపాపమనే అంశాన్నితడు నొక్కివివరించినాడు. దీనినే ముస్లిములు షిర్క్ (Shirk) అనే పాపంగా వ్యవహరిస్తారు. దేవదూతలూ (Angels),దయ్యాలూ, ఆధ్యాత్మికవిద్యాగురువులూ, బోధకులూ, ప్రవక్తలు, సిద్ధులూ,- మొదలైనవారు, మానవునికీ భగవంతునికీ మధ్యవర్తులనడము, వారు మానవుణ్ణి కష్టపరంపరనుండీ రక్షించి, కోరికలను తీర్చుదురనడము,- ఇత్యాదులను ముస్లిములు విశ్వసింపరాదని అతడు హెచ్చరించెను. ముస్లిమైనవాడెవ్వడూ అట్టివ్యక్తులను ఆశ్రయించరాదనీ, వారి కోపతాపాలకేమాత్రము భయపడరాదనీ,

ఇతరప్రాణులన్నీ ఎట్టి నిస్సహాయస్థితిలోనున్నవో మహాత్ములమని అనుకొంటున్న వీరందరూ, కూడా అట్టి నిస్సహాయస్థితిలోనే ఉన్నారనీ, ఇతడు వివరించినాడు. తరువాతికాలమున ఇస్లాములో ప్రవేశించిన నూతన విషయాల (బిదాత్) నన్నిటినీ విసర్జించవలెననీ, మహమ్మద్ ప్రవక్తచూపిన నియమాలను యధావిధిగా అన్ని విషయాలలోనూ, పాటించవలసిందనీ, (సున్నత్) - ఇతడు బోధించెను. సయ్యద్ అహమ్మద్ అనుసరిస్తూఉన్న సామాన్య జీవన విధానమూ, ఉజ్జ్వలమైన అతని అభినివేశమూ, సుదృఢమైన విశ్వాసమూ, స్వార్థరాహిత్యమూ, నమ్రతా, - అనే గుణాలు అతనితో పరిచయమేర్పడిన అందరి హృదయాలనూ, వశపరచుకొన్నాయి. కాబట్టి, - ఇతడొనర్చిన ప్రయత్నం, సఫలముకాగలదనే ఆశ ఏర్పడింది. ఇతన్ని అనుసరించడానికి, అందరూ భక్తియుక్తంగా ప్రమాణాలు గావించినారు.

జెహాద్ ప్రారంభించే దానికి ముందుగా, మక్కాయాత్రచేసి రావలెనని సంకల్పించినాడు. 1821 జూలై నెలలో అతడు రేబరైలీ నుండి కలకత్తా బయలుదేరినాడు. 1822 మే, నెలలో మెదీనాచేరిన సమయానికతని వెంట ఎనిమిదివందల అనుయాయులున్నారు. రేబరైలీ నుండి బయలుదేరినప్పుడతని వద్ద డబ్బే మాత్రమూలేదు. ఐనా-యాత్రకు ఖర్చైన ధనం, - డెబ్బై, ఎనభై వేలదాకా - అతని యందనురక్తులైనవారూ, శిష్యులూ, విరాళాలుగా సమకూర్చినదే. సుమారు రెండు సంవత్సరాల తర్వాత (29 ఏప్రిల్ 1824) నాటికి అతడు ఇల్లుచేరుకొన్నాడు.

అరేబియా పర్యటనంవల్ల అతడు గ్రహించింది, అబ్దుల్ వహాబ్ ప్రచారం చేసిన మత సంప్రదాయంకాదు. ముస్లిముజాతుల భంగపాటు చరిత్రా, తూర్పు దేశాలపై శీఘ్రంగా వ్యాపిస్తూఉన్న పాశ్చాత్యదేశాల ఆధిపత్యమూ, అతడవగాహన చేసుకొన్నాడు. ఇదివరకూ భావనావీధిలో ఆదర్శప్రపంచంలో, కలలు కంటూ ఉన్న సయ్యద్ అహమ్మద్, నిజస్థితిని ఈ విధంగా గ్రహించిన తర్వాత తన హృదయాన్ని ధార్మికయుద్ధ విషయమై వజ్రసదృశంగా చేసుకొన్నాడు. ఇస్లాముకు శత్రువులైనవారి నెదిరించడానికి, ఇదివరకూ ముస్లిములు పరిపాలించుచుండిన రాజ్యాలను మరల స్వాధీనంచేసుకోడానికి, ఇతడు దృఢసంకల్పుడైనాడు. ఇండియాచేరిన వెంటనే, తన ఈ ఉద్యమాన్ని నిర్వహించడానికి ఏర్పాట్లు చేయసాగినాడు. భారత చరిత్రలో ఇంతవరకెప్పుడూ జరుగనట్టిదీ, బ్రిటిషు పరిపాలనను ఏబది సంవత్సరాల పర్యంతం ప్రతిఘటించి, విప్లవ చైతన్యాన్ని సజీవంగా నిలిపినదీ, ఐన, ఒక ఉద్యమాన్నితడు లేవదీసెను.

1. శత్రువుల నెదుర్కొడానికి తగిన యుద్ధపరికరాలను, చాలినంత సైన్యాన్ని సమకూర్చడము.

2. సైన్యాన్ని నడపడానికి తగిన యోగ్యతగల నాయకుణ్ణి నిర్ణయించడము.

3. తమ సైన్య దళాలకు తగురక్షణ నియ్యగల, ముస్లిము ప్రాంతాన్ని ఎన్నుకోవడము – అనేవి, జహాద్ ప్రవర్తనకు అవసరములైన లక్ష్యాలు.

ముస్లిములను వందలు వందలుగా చేర్చుకోవడంతోను, సయ్యద్ అహమద్‌ను తమ ఇమాముగా నిర్ణయించుకోవడంతోను, మొదటి రెండు ప్రయోజనాలూ సిద్ధించినాయి. కాని, మూడవప్రయోజనం ఇండియా సరిహద్దుల్లో సిద్ధించలేదు. కాబట్టి, భారతవశ్చిమోత్తర ప్రాంతము జిహాదు ప్రవర్తనాని కనుకూలమైన ప్రదేశంగా నిర్ణయింపబడింది. సరిహద్దు ప్రాంతాల్లోని జాతుల్లో మతోన్మాదం ఎక్కువగా ఉండడంవల్ల ముస్లిములు, ఈ మతోన్మాదాన్ని ఉపయోగించగలిగినారు. మరిన్నీ, అరేబియాదేశపు అబ్దుల్ వహాబ్ స్థాపించిన ఇస్లాము మతప్రచారమిందుకు సహాకరించింది.

ఈ సరిహద్దుల ప్రాంతానికి, ఇండియానుండి, విశ్వాసపాత్రులైన దళాన్ని పంపడం (హిజరత్), ప్రథమ ప్రయత్నము. స్త్రీలతో, పిల్లలతో కూడిన ఒక ఐదారుమందిని, 5000వేల రూపాయల ధనసహాయముతో పశ్చిమోత్తర ప్రాంతానికి, పంపడం జరిగింది. 1826 జనవరి 17వ తేదీనాడు ఈయాత్ర, రాయబరేలీ నుండి, సయ్యద్ అహమ్మద్ ఇస్మేల్, అబ్దుల్ హైదర్ లతో కూడిన మౌలవీ సంఘంతో, బయలుదేరింది. ఈ మౌలీలు సయ్యద్ అహమ్మద్‌కు బంధువులుగా, ముఖ్యులైనవారున్నూ. వీరు మొదట మకాముచేసిన ప్రాంతం, గ్వాలియరు. ఇచ్చట, వీరిని గ్వాలియరు మహారాజా కలుసుకొన్నాడు. వీరియాత్ర, కేంద్రము, సేనాముఖము, కుడిభాగము, ఎడమభాగము, సైన్యానుగాములు, అని విభజింపబడింది.గ్వాలియరునుంచి, మొదట టోంక్ ప్రాంతానికి, పిమ్మట అజ్మీరుకూ, తర్వాత రాజపుటానా మీదుగా సింధుకూ, సాగునించినారు. హైదరాబాద్ సింధులో, ఈ మతోద్రిక్తులు, తమ మతస్థులను కలుసుకొన్నారు. సింధుప్రాంతపు అమీరులు తమతో చేరతారని ఆశించినారు. కాని, సింధుప్రాంతం వారి భయంవల్ల నిరుత్సాహులై, షికార్‌పూర్ చేరుకొన్నారు.ఇచట సయ్యద్ అహమ్మద్, అక్కడి సర్దారులనూ, ఉలామానూ జిహాద్‌లో తమతో చేరవలసిందిగా కోరినాడు. కాని వారు కూడా, ఇందుకు ఉత్సాహంచూపిన వారుకారు, పిమ్మట, బెలూచిస్తానులోని, మరుభూములనూ, పర్వతప్రాంతాలనూదాటి, బోలన్ ఘాటు మీదుగా క్వెట్టా చేరుకొన్నారు. ఇచ్చటినుండీ వారు ఖాందహార్, ఘజినీ, కాబూల్ ప్రాంతాల మీదుగానడిచి, 1826 నవంబర్ 20వనాటికి, పెషావర్ చేరుకొన్నారు. ఈ ప్రయాణంలో వీరు దాదాపు పదినెలల్లో మూడువేలమైళ్లు ప్రయాణం చేసినారు.

ఇదే ఒక అద్భుతావహమైన కార్యము. కాని, సయ్యద్ అహమ్మద్ యొక్క ఆశయాలు ప్రయత్నాలు గుర్తెరిగియున్న బ్రిటీషుప్రభుత్వం, తమ రాష్ట్రాల మీదుగా నడచిపోతూఉన్న ఈ చిన్నసైన్యాన్ని చూస్తూకూడా, నముకు పట్టనట్లుండడం, మరింత ఆశ్చర్యకరమైన విషయము. సయ్యద్ అహమ్మద్ ప్రవర్తింపచేయబోయే ధార్మికయుద్ధం బ్రిటీషువారిపై కాదనీ, పంజాబులో మహారాజా

రంజిత్‌సింగ్ యొక్క సిక్కు రాష్ట్రంపై దాడి జరుగబోతుందనీ, బ్రిటీషువారికి ముందే తెలిసియుండినదేమో ? రంజిత్‌సింగ్‌పై యుద్ధం పశ్చిమోత్తర ప్రాంతం నుండి ఏర్పడితే బ్రిటిష్‌వారికెట్టి అభ్యంతరమూ లేదు. పోగా, అదివారికి లాభకరమే. సింధునట్లెజు ప్రాంతాలపై, కన్నుంచియున్న రంజిత్‌సింగ్ దృష్టి పశ్చిమోత్తరంగా మరలడం బ్రిటీషువారికి మంచిదే. సయ్యాద్ అహమ్మద్ యొక్క సైన్యం, శీఘ్రంగానే పెషావరు నాక్రమించడంతో, అతని ప్రతిష్ఠ పెరిగింది. సెహోద్ నడపఠాని కనువైన కార్యస్థానంగా, ఛర్‌సద్దా పట్టణాన్ని నియమించుకొన్నారు. ఇచ్చటినుండి సిక్కులపై ధార్మికయుద్ధానికి బహిరంగ ప్రకటన జేసినారు. సరిహద్దుప్రాంతజాతులు, వారిని తమ ధర్మయుద్ధ సైన్యంలో చేరవలసిందిగా ఆహ్వానించినారు. సరిహద్దుజాతులవారు చేరడానికి ఔత్సుక్యం చూపినారు. కాని, సర్దారులు, ఇందులకాసక్తి చూపక, వెనుదీసినారు.

ఐనప్పటికీ, సయ్యాద్ అహమద్ ఇమాంగానూ సైన్యాధ్యక్షుడుగానూ గుర్తింపబడినాడు. ఇమాంమహ్‌దీ, ఇమాంహుమాం, అమీర్-ఉల్-ముస్లిమీన్, ఖలీఫా, అనే బిరుదులతో అతన్ని వ్యవహరించినారు. తనస్థానము ఈవిధంగా అంగీకరింపబడడంతో అనాగరికులైన సరిహద్దుజాతులవారిలో సంస్కరణలు ప్రవేశపెట్టడానికీ, మత రాజకీయసంబంధమై ఒక ప్రబలసంఘంగా వారిని సమకూర్చడానికీ ప్రయత్నమారంభించినాడు. వారి ఆదాయంలో దశాంశం (Tithe) ఉషర్ పన్నుగానూ, జకత్ అనే భిక్షలూ (Alms), ఇవ్వవలసిందని వారి నాదేశించినాడు. అదే విధంగా, తమ వివాదాల నన్నిటినీ, ఇమాంచే నియమింపబడిన కాజీలకు విన్నవించుకొని, వారి ఆదేశాలను పాటింపవలసిందిగా వారిని ఆదేశించినాడు.

వారి వర్గాల్లోని వివాహవిధానాలు న్యాయసమ్మతమైనవి కావని నిర్ణయించి, ఇండియా నుండి తనతోవలసవచ్చినవారికీ పఠానుకన్యలకూ వివాహాలేర్పాటు చేసినాడు. వారిలో వంశపరంపరంగా వస్తూఉన్న వైరాలూ, పరస్పర కలహలూ, అసూయలూ, అనేవి ఇస్లామిక భాతృత్వాన్ని బలహీనపరచేవి కనుక, వాటిని నిరసించి, త్యజించవలసిందిగా ఆదేశించినాడు.

కాని, ఐక్యసిద్ధికై జరిపిన ఈ సంయోజక ప్రయత్నాలు విఫలంకావడం, తన ప్రయోజనానికి పెద్దదెబ్బ. సంస్కరణ విధానాలు ప్రాంతజాతులవారికి అసహ్యకరములైనాయి. దశాంశాల వసూళ్ళవల్ల (Tithes), ముల్లాలకు లభిస్తూ ఉండిన మామూళ్ళు నిలిచిపోయినాయి. అందుచే వారు వ్యతిరేకులైనారు. జాతి నాయకులైన ఖానులూ, సర్దారులూ, వాస్తవానికి అతి స్వార్థపరులు, ఇంద్రియలోలురు, ద్రవ్యాశకు సులభంగా లోబడేవారున్నూ. స్త్రీబలాత్కారణా, దౌర్జన్యమూ, అసభ్యప్రవర్తనా,- అనే వాటితో కూడిన జీవితానికి శతాబ్దాలుగా, అలవాటుపడినవారు. కనుక, మతబోధనలు వీరి విషయంలో నిష్ఫలమైనాయి. కాని, వారి సిబ్బందిలోని సామాన్యజనులు దారిద్ర్యానికి, మూఢవిశ్వాసాలకు, లోనైన మతోన్మాదులు కావడంవల్ల, మత గురువుల బోధనలను వినడానికీ, యుద్ధంలో చేరడానికి సంసిద్ధులై ఉండిరి. ఈ ధర్మయుద్ధంలో చేరడంవల్ల పుణ్యము

మాత్రమేకాక, దోపిడిలో ధనంకూడా లభిస్తుందని వీరి ఆశ.

పరిస్థితులిట్లు నిరుత్సాహాకరంగా ఉన్నా, ఒక్కసారి వెలిగింపబడిన ధార్మికయుద్ధజ్యోతి అర్ధశతాబ్ద కాలంవరకూ ఆరకుండా మండుతూనే ఉంది. పంజాబులోని సిక్కు-రాజ్యంపై పడడం ఈ యుద్ధంలోని ప్రథమదశ.

ఇరుపక్షాలవారికీ చిన్నచిన్న యుద్ధాలనేకాలు జరిగినాయి. అందులో ముఖ్యమైనది 1831 లో జరిగిన బాలకోట్ యుద్ధము. ఈ యుద్ధంలో ధార్మిక యుద్ధపక్షం దుర్భరమైన అపజయాన్ని పొందింది. సయ్యద్ అహమ్మదూ, షామహమ్మద్ ఇస్మాయిల్ – ఇరువురూ ఇందులో హతులయినారు.

ఇమాం కనబడకపోవడము ఉద్యమానికి పెద్ద ఆఘాతం; కాని సయ్యద్ అహమ్మద్ ఇండియాలో ఇదివరకే చేసియున్న సువిధానము, సరిహద్దు ప్రాంతంలోని ఈ ఉద్యమం శిథిలమైపోకుండా రక్షిస్తూ వచ్చింది. సరిహద్దుప్రాంతానికి తరలిపోకపూర్వమే, ఈ ఉద్యమప్రయోజనంకోరకై, కార్య నిర్వాహక కేంద్రాలనూ ప్రతినిధులనూ, సుసంఘటితంగా ఏర్పాటుచేసి యున్నాడు. ఇండియా ముస్లిములను జహాద్‌కు సిద్ధం చేయడమూ, విరాళాలను, యుద్ధసైనికులను ప్రోగుచేసి సరిహద్దుప్రాంతానికి పంపడమూ, అనేకాగ్యక్రమము, అవిచ్ఛిన్నంగా సాగుతూనేవచ్చింది. దక్కను హైదరాబాద్, మదరాసు, బెంగాలు, బొంబాయి, ఉత్తర ప్రదేశ రాష్ట్రాలలో, ఈ కార్యనిర్వాహక సంస్థలేర్పడి ఉన్నాయి. ఈ ఉద్యమాలకంతటికీ, పాట్నా కేంద్రస్థానము. ధనం సేకరించడానికి, రాకపోకలను నడపడానికి, ప్రతినిధులు, నియుక్తులై ఉన్నారు. కేంద్రస్థానం చేరిన ధనవిరాళాలూ, సైనికులూ, సరిహద్దుప్రాంతానికి రవానాచేయబడినాయి. ధనం, ప్రతినిధులద్వారాను, హుండీలు సరిహద్దు పట్టణాలలోని సాహుకార్ల ద్వారాను (సాధారణంగా వీరు హిందూకిరార్లు) పంపబడేవి. కొత్తగా చేరిన సైనికులు చిన్నచిన్న గుంపులుగాబయలుదేరి, ఉత్తరప్రదేశ్, పంజాబుప్రాంతాల మీదుగా వెళ్ళేవారు. మార్గంలోని థానేశ్వర్, రావల్‌పిండి, తావరస్థలాలు. ప్రయాణీకులను, ఆహారపదార్థాలను, యుద్ధసామగ్రిని, గమ్యస్థానానికి పంపడాని కేర్పాట్లు జరిగినాయి.

ఇండియా వివిధప్రాంతాల ముస్లిములు ధనసంచయాన్ని, స్వయంసేవకు లనూ (వాలంటీర్లు) జమచేసి పంపేవారు.అందులోనూ, ఇండియా క్రిందిప్రాంతా లలో ఈ కార్యనిర్వహణం అత్యంతమూ, సుసంఘటితమై ఉండింది. ప్రతి గ్రామంలోనూ ఒక మతబోధకుడుండేవాడు. ఇస్లాము మతస్థులందరూ మసీదులో కలిసి, మతోపన్యాసాన్ని ఆలకించేవారు. మతసంస్కరణావశ్యకము, ధార్మిక యుద్ధావసరము, బోధిస్తూ భూమిలోనూ సరిహద్దుప్రాంతాలలోనుకూడా, ధార్మిక యుద్ధచైతన్యాన్ని ఈ విధంగా పోషిస్తూ వచ్చినారు.

సయ్యదుకు అత్యంత సన్నిహితుడై యుండిన మౌల్వీమహమ్మద్‌కాసిం పానీపతి, సితానాకువచ్చి, అచ్చట సయ్యద్‌అహమ్మద్‌కు అనురక్తుడై ఉండిన, సయ్యద్ అక్బర్‌షాతో కలసి కార్యక్రమం నడిపింపసాగినాడు. సయ్యద్

మహమ్మద్ మరణవార్త అసత్యమని ఇండియాలోని అన్ని కార్యకేంద్రాలకూ అతడు తెలియజేసెను. పాట్నా కేంద్రానికి నాయకులైన మౌల్వీలు విలాయత్ ఆలీయూ, ఇనాయత్‌ఆలీయూ దీనిని విశ్వసించినవారై, యుద్ధాన్ని మరల సాగించడానికై సరిహద్దు ప్రాంతానికి వెళ్ళినారు.

రంజిత్‌సింగు మరణము, మొదటి ఆంగ్ల సిక్కుల యుద్ధమూ, (1845), బ్రిటిష్ వారిస్థితిని పంజాబులో బలవత్తరంగా చేసినవి. మత యుద్ధోన్మాదులిప్పుడు తమ యుద్ధాన్ని బ్రిటిష్‌వారిపై జరిపినారు. అట్లు జరిగిన యుద్ధాల్లో పలు మార్లు వీరోడిపోయినప్పటికీ, లొంగిపోలేదు. ప్రభుత్వమిప్పుడు వారిపై, రెండు వైపుల నుంచీ కార్యక్రమచర్య ఆరంభించింది. ఇండియాలోని ముస్లిముల చర్యలను గమనించడానికీ, ధనసంచయాన్నీ, సైనికదళాలనూ సరిహద్దు ప్రాంతానికి సరఫరా చేస్తూ ఉన్న కేంద్రాలను నాశంచేయడానికీ, విశిష్టమైన పోలీసు దళాన్ని ప్రభుత్వం ఏర్పరచింది. దానితోపాటు సుశిక్షితమైన సైనిక సిబ్బందినీ, శీఘ్రగతి గల సాయుధ దళాలనూ, ముస్లిము సైన్యాన్ని నశింపజేయడానికై, సరిహద్దు ప్రాంతానికి పంపించినారు.

1850, 1863 ల, మధ్యకాలంలో ఇట్టి, సాయుధ బలాలిరువది దండ యాత్రలు జరిపినాయి. వాటిలో అరువదివేలమంది సైనికులు పాల్గొన్నారు. 1858లో, ముస్లిముల సైన్యాన్ని సితానానుండి తరిమివేసినారు. ఇట్లు తరిమి వేయబడిన ముస్లిములు, మొదట మల్కాలో స్థావరమేర్పరచుకొని, పిమ్మట త్వరలోనే సితానాను కైవసం చేసుకొన్నారు.

1863 లో, సర్ నెవేలీ చేంబర్లిన్, నాయకత్వంలో, ఈ ముస్లిములను శిక్షించడానికై, ఒక మహాసైన్యం బయలుదేరింది. కాని, ప్రాంతజాతులవారీ సైన్యాన్ని అంబేలా లోయలోనుండి వెలువడనివ్వక, కొన్ని వారాల కాలం ఆపి వేసి, ఎక్కువ సైన్యనష్టం కలిగించిరి. ఈ విషమపరిస్థితినుండి తప్పి బయటపడ డానికై, పంజాబులోని సైన్యాన్నంతటినీ పైకతీసికొని రావలసి వచ్చింది. కట్టకడపటికి, సైన్య చర్యవల్ల సాధ్యంకాని విజయాన్ని, బ్రిటీషు రాజనీతి సాధించింది. సరిహద్దు ప్రాంతాలవారితో ముస్లిము లేర్పరచుకొని యుండిన కూటమిని, ఛిన్నంగా విడగొట్టి, బ్రిటీషు సైన్యము, మల్కాను దగ్ధం చేసింది. ఐనా, అణచ డానికి సాధ్యులుకాని వీరులు మరల ప్రతిఘటించి నిలిచిరి. యుద్ధచర్యవల్ల వీరి నణచివేయడమిట్లు సాధ్యము కాకపోగా, పోలీసుచర్యనూ, న్యాయవిధానా న్ననుసరించిన అభియోగాలనూ వరుసగా ప్రవర్తింపజేసింది ప్రభుత్వము.

అప్పటికి మౌల్వీలు, విలాయత్ ఆలీ ఇనాయత్ ఆలీలు, మరణించి యుండడంవల్ల, వారి సోదరుడు యాహ్యా ఆలీ పాట్నాలోని కార్యక్రమాన్ని నడిపిస్తూ ఉన్నాడు మౌల్వీలు ఫరహత్ ఆలీ, అహమ్మదుల్లా-లు అభినివేశంతో యాహ్యాఆలీకి సహకరిస్తున్నారు. ఉద్యమాన్ని తీవ్రంగా కొనసాగించడంలో వారు తమకుగల సాధనసంపత్తినంతనూ ఉపయోగించిరి. మతసంస్కరణాన్ని, ధార్మికయుద్ధాన్ని, ఉద్బోధిస్తూ పుస్తకాలూ, కరపత్రాలూ ప్రచురితమైనాయి.

రక్షణనివ్వడానికి, దాగియుండడానికి, అనుకూలించే పర్వాట్లతోకూడిన ఒక కట్టడాన్ని పాట్నాలోని సదిక్‌పూర్‌లో నిర్మించుకొన్నారు. శాఖోపశాఖలుగా విస్తరించిన ఒక వ్యవస్థను గ్రామసీమల్లో నెలకొల్పినారు. మతబోధకులూ, శిస్తు వసూలుదార్లూ, విరాళాలు వేసుకొనే నిత్యవ్యవహారములుకూడిన నెలవులను (Settle-ments) వివిధకేంద్రాలలో నెలకొల్పిరి. పాట్నానుండి సరిహద్దుప్రాంతంవరకూ మార్గమంతటా, ధనాన్ని సైనికజనాన్ని గ్రోగుచేసి, పైకి పంపే ఏర్పాట్లుండేవి.

ఈ ఉద్యమాన్ని అణచివేయడానికై ప్రభుత్వం బహుముఖమైన కార్యాచరణాన్ని ప్రవర్తింపజేసింది. ఈ ఉద్యమ నిర్వాహకులలో అతిసమర్థులై యుండిన నిర్వాహకులను,- యాహ్యాఆలీ, విలాయత్ ఆలీ శిష్యుడైన మహమ్మద్ జాఫర్, మహమ్మద్ షాఫీ అనే కంట్రాక్టరూ,- ఇత్యాదులపై (1863-64) అంబాలా న్యాయస్థానంలో అభియోగములు నెరపి, సుదీర్ఘమైన కారాగార శిక్షలను విధించిరి. కొంతమందిని అండమాన్ ద్వీపాలకు పంపించినారు.

1865లో, పాట్నాలో ఇట్టి అభియోగం మరొకసారి జరిగింది. బ్రిటిషుపాలనకు విరుద్ధంగా యుద్ధం ప్రకటించినారన్న అభియోగం, యాహ్యా ఆలీ సోదరుడైన అహమ్మదుల్లాపైనా, మరికొందరిపైనా ప్రకటించినారు. వారందరికీ యావజ్జీవ కారాగారశిక్షవిధించి, దేశాంతరం పంపినారు. దీని తర్వాత, బెంగాలు ప్రాంతంలోని మాల్దాలోనూ రాజ్‌మహల్‌లోనూ, ఇట్లే అభియోగాలకు గురియై 1870లో, అనేకులు ముజాహిదులు యావజ్జీవశిక్షను పొందినారు. 1871లో పాట్నాలో జరిగిన రెండవ అభియోగవిచారణలో వహాబీల విద్రోహోద్యమం పూర్తిగా భగ్నమయింది. ఈ విచారణలో- ప్రధానులైన ఐదుగురు మౌల్వీలు దేశాంతరవాస శిక్షకు గురిఅయినారు.

ప్రభుత్వం, ప్రచారం ద్వారా తమ చర్యను బలపరుచుకొన్నది. ఉద్యమం నుండి విడిపోవడానికింకా వెనుకాడుతున్న వారిని ప్రభుత్వ పక్షం చేర్చుకోడానికిగాను, ఈ ఉద్యమాన్ని ఖండించే మత నిర్ణయ పత్రాలను - ఫత్వాలను - తెచ్చినారు. మెక్కాలోని ముఫ్తీ, ఈ ఉద్యమవాదులను గర్హించేటట్లు చేసింది ప్రభుత్వము. ఇండియాలో షియాశాఖవారు జిహాద్ ప్రచారాన్ని వ్యతిరేకించినారు. జిహాద్ ఉద్యమం అనవసరమైనదని, ఉత్తర ప్రాంతపు ఉలామా వ్యక్తం చేసినాడు. ఇండియా ఇస్లాము మందిరము - (దారూ-ఉల్-ఇస్లాము) కావడం వల్ల దేశంలో ప్రతిఘటన లేవదీయడం న్యాయవిరుద్ధమైనదని, కలకత్తా ఉలామా ఉద్ఘోషించాడు. కలకత్తాలోని మహమ్మదీయ సాహిత్య సంఘం ఒక చర్చ జరిపి, బ్రిటీషు ప్రభుత్వానికి విరుద్ధంగా ధార్మికయుద్ధం నెరపడం న్యాయవిరుద్ధమని, ఒక కరపత్రికను ప్రచురించింది. ప్రసిద్ధ పండితులుగా గణింపబడిన జౌన్‌పూర్ మౌల్వీ ఇత్యాదులు ఈ అభిప్రాయాన్ని బలపరచిరి.

ఈ కార్యకలాప ఫలితంగా ధార్మికయుద్ధ సంఘం ఛిద్రమయింది. 1864 అనంతరం, పేరు మాసిపోయినప్పటికీ, సరిహద్దుప్రాంతంలో మాత్రం చాలకాలం

వరకూ, ప్రవర్తిస్తూనే ఉండింది. సయ్యద్అహమ్మద్ లేవదీసిన ఈ ఉద్యమంవల్ల గ్రహించవలసిన అంశాలున్నాయి. పండితుల సహాయంతో మతధర్మశాస్త్రజ్ఞుల (ఉలేమాలు) నాయకత్వంతో, దరిద్రులైన ప్రజల సహకారత్వంతో ప్రభుత్వానికి విరుద్ధమైన విప్లవాన్ని లేవదీయడం సాధ్యమనే విషయాన్ని, ఇది రుజువు చేసింది. అంతేకాక, పోలీసుదళం అప్రమత్తమైయున్నా, సైనిక దళం ముందుగానే జాగ్రత్త తీసుకొంటూఉన్నా కూడా, ఇట్టి విప్లవోద్యమాన్ని తీవ్రంగా అర్ధశతాబ్దకాలంవరకూ జరపడం సాధ్యమని కూడా వ్యక్తంచేసింది. పర్యవసానంలో ఉద్యమం విఫలం కావడానికి కారణంవేరు. మతాభినివేశమూ, అత్యున్నత నిశ్చితాభిప్రాయాలూ, నియమబద్ధమైన సంకల్పమూ, అతి సాహసప్రవృత్తీ, త్యాగశీలమూ దృఢశక్తీ, - ఇత్యాదులుమాత్రమే చాలవు. వీటితోబాటు వ్యవస్థాకల్పన చాతుర్యము, యుద్ధనిర్వహణ చాతుర్యము ఉన్నాకూడా, ఆధునిక జాతీయతా శక్తులపై, విజ్ఞానశాస్త్రంపై, ఏర్పడిన ప్రబల సామ్రాజ్యాన్ని ప్రతిఘటించడం సాధ్యం కాదనేవిషయం వ్యక్తమౌతుంది.

సయ్యద్ అహమ్మద్ను అతని అనుయాయులను ఉత్తేజపరచిన అభిప్రాయాలు చాల పాతకాలపువి. ఎప్పుడో విస్మరింప బడినవి. ఏడవశతాబ్దంలో అరబ్బులందు వ్యాప్తంలో ఉన్న, జీవితవిధానాలను పునరుద్ధరించడం వీరి ప్రయత్నము. చరిత్రనుంచి గ్రహింపదగిన గుణపాఠాలను వివిధసంస్థల పరస్పర ప్రభావ శక్తిని, కాలదేశాలకు మానవవ్యవహారాలపై యుండే ప్రభావము, - ఎటువంటివో వీరు గుర్తించలేదు. నీతి మతాలకు సంబంధించిన ప్రాథమికసత్యాలను, ఎప్పటికప్పుడు ప్రవాహపరివర్తనం చెందుతూఉన్న సాంఘిక ఆర్థికవ్యవస్థలను, సంతత పరిణామాన్ని పొందుతూఉన్న ఆచారప్రవర్తనలను - గ్రహింపక, ప్రాచీనమతమే పరమ తత్త్వమని, సార్వకాలికమని, ఘోషించినారు. ప్రాదేశిక, ఆర్థిక, రాజకీయ సంబంధములైన పందొమ్మిదో శతాబ్దంలోని స్థితిగతులను, వ్యవస్థలను, తిరస్కరించడంవల్లనే తుదకు వీరికి నిరాశా, భంగపాటూ, సిద్ధించినాయి. సయ్యద్ అహమ్మద్, తన వ్యక్తిగతములైన నీతిమతాభిప్రాయాలను సరిహద్దు జాతుల వారిపై విధింపబూనడంతో, వారితనికి విరుద్ధులైనారు. తానారంభించిన ధార్మిక యుద్ధం "జిహాద్", పరస్పరనాశమైన కలహంగామారింది.మరియూ, ఇండియాలో అత్యధికసంఖ్యాకులైన ఇతరవర్గాలవారిని, తన రాజకీయ పునర్నిర్మాణ ప్రయత్నాలలో చేర్చుకొనకపోవడంవల్ల, అతనివర్గం వేరుపడి పోయింది. కావున ఉద్యమారంభమే తప్పుత్రోవలో నడిచింది.

సయ్యద్ అహమ్మద్యొక్క ఉద్యమం విఫలమయింది. కాని అది విశేష పరిణామాలను తెచ్చిపెట్టింది. భారతసంఘంలో మతవిషయకమైన విభేద భావాలకు ప్రోద్బలం కలిగించింది. భారతదేశంలో హిందువుల సాహచర్యంలో నివసించడంవల్ల, ముస్లిము సంఘంలో ఏర్పడిన అచారవ్యవహారాలనన్నింటినీ,- [అవి మంచివీ, చెడ్డవీ అనే విచక్షణ, ముఖ్యమైనవా లేక స్వల్పమైనవా అనే గమనముకానీ లేక] - తప్పక విసర్జించవలెనని, అతని తీవ్రాభిప్రాయము. అట్లు వీటి

నన్నిటినీ విసర్జించి, మహమ్మద్ ప్రవక్తనాటికాలపు అరబ్బుల ఆచారాలను మాత్రమే, పాటించవలెనని, ముస్లిములనుద్బోధించినందువల్ల, ఈ రెండు మత వర్గాలవారికిగల, అంతరం పెద్దదికావడం తప్పనిసరి. ఈ ఉద్యమం మూలంగానే ఒక భావవాహిని బయలుదేరి, సంఘంలో ప్రత్యేకప్రతిపత్తులను ఆకాంక్షించే ప్రవృత్తిని బలపరచింది.

సయ్యద్ మహమ్మద్ యొక్క ఉద్యమంవల్ల, ముస్లిముల [illegible] ప్రచారానికి బలం చేకూరింది. భారతచరిత్రలో ఒక నూతన ఉత్సాహం ఉప్పొంగింది. బ్రిటీషువారు ఢిల్లీ సామ్రాజ్యాధిపతులు కావడంతో రాజులూ, నవాబులూ తమ రాజకీయ నాయకత్వాన్ని గోల్పోయిరి.

లేఖకులు, మతగురువులు రాజకీయనాయకులుగా ప్రవర్తించజొచ్చినారు. ఈ మార్పుతో, రాజకీయాలు మతోద్ధత్యానికి లోనయినాయి. కానీ, సయ్యద్ అహమ్మద్ ఉద్యమం, ముస్లిములలో స్వాతంత్ర్యాభిలాషను, సజీవంగా నిలిపింది. ఈ తర్వాత, బ్రిటిషువారికి విరుద్ధంగా జరిగిన పోరాటాలన్నింటియందును మౌల్వీలు శక్తివంతమైన సహాయాన్నిచ్చినారు అట్టిదే 1857 సం., విప్లవం.

## XII. సిపాయీల తిరుగుబాటు

వ్యావసాయిక దుస్థితి, మతభావనలను గలిగిన ఆఘాతమూ, విదేశ ప్రభుత్వంపట్ల ఏర్పడియున్న, విరోధభావాన్ని ఉద్రేకపరచినాయి. కర్షకులూ, భూస్వాములూ, అరణ్యజాతుల నాయకులూ, వారి భృత్యవర్గమూ,- వీరితో కూడియున్న గ్రామీణవర్గాలనుద్రేకపరచడానికి, ప్రతిఘటనలు బలపడడానికి ప్రధానకారణాలైనాయి. కంపెనీవారి కొలువులో సేవచేస్తూ, వారి ప్రయోజనార్థమై పోరాడుతూ, దాస్యశృంఖలలను విదేశీయుల [illegible] రిస్తూ ఉన్న సిపాయిలు, అసంతుష్టులు కావడానికి కూడా, ఇవే కారణాలు. సైన్యపుకొలువులో తమ పరిస్థితి దుర్భరమగుచుండడం, ఈ వ్యతిరేక భావాన్ని మరింత రెచ్చగొట్టింది.

మొట్టమొదటి ఈ తిరుగుబాటు 1764లో జరిగింది. మీర్ కాసిముతో పోరుతూఉన్న మద్రాసుసైన్యమునుండి ఒకదళం (Battalion) పూర్తిగా చెదిరి పోయి, నవాబుపక్షపు సైన్యంలో చేరడానికి ప్రయత్నించింది. కాని, కంపెనీ విశ్వాసానికి పాత్రులైన సైనికులు వెంటనే వీరిని బంధించి, సైనికశిక్ష (Court martial) విధించినారు. ఇరువది నలుగురిని ఫిరంగిముఖంలో బంధించి, కాల్చి, బూడిదగావించినారు.

1806లో వెల్లూరులో జరిగిన తిరుగుబాటు ఇంతకంటె తీవ్రమయింది. 1796లో జరిగిన సైనికపునర్వ్యవస్థీకరణ, బ్రిటీషు సైనికోద్యోగుల అధికారాలను పెంచింది. కాని, క్రమశిక్షణను భంగపరిచింది. ఉద్యోగులలో చాలమంది విశ్రాంతి వేతనలాభాలనుపొంది, ఇంగ్లాండుకు వెడలిపోయి నారు. కాగా, మిగిలిన ఉద్యోగస్థులు, అనుభవంలేనివారు కావడంవల్ల తమ సైని

కుల మనస్సులను గ్రహించినవారు కారు; తమ సైనికదళాలపై వీరి కభిమానం కూడా లేదు. 1799 నాటికి, బ్రిటీషువారు టిప్పుసుల్తానుపైనా, మరాఠీలపైనా జరిపిన ఉద్రేకకరములైన యుద్ధాలు ముగిసి, బ్రిటీషువారికి భారతదేశంలో అత్యంతమైన ఆధిపత్యం ఏర్పడింది. సైనికోద్యోగు లత్యుత్సాహపూరితులై సైన్య స్థితిని బాగుపరచే విధానాలకు పూనుకొనిరి. క్రొత్తదుస్తులూ, మర్యాదలూ డ్రిల్లూ (Drill) ఇత్యాదులలో వినూత్నతను బలవంతంగా ప్రవేశపెట్టినారు. గడ్డాలు తీసి వేయడం, చెవులదుద్దులను విసర్జించడం,- ఈ మార్పులన్నీ సిపాయీలు అవలంబించ వలసివచ్చింది. రుమాలుకుబదులు క్రొత్తతరహా టోపీని (Stiff hat) దానిపై చర్మపు తురాయినీ (Cockade) ధరించడం,- ఈ మార్పులలో ఒకటి. పందిచర్మంతోకానీ, లేదా ఆవుచర్మంతో కానీ ఈ తురాయీలు తయారైనవి. సిపాయీల మనోభావాలకెట్టి బాధకలుగుతున్నదో అనే విషయాన్ని గమనించకుండా తెచ్చిపెట్టిన, ఈ వినూత్నపద్ధతులు, సిపాయీల హృదయాలలో పలువిధములైన శంకలను ఉత్పాదింప చేసినవి; వారి అనుమానాలను తీవ్రమొనర్చినవి. చాలకాలంగా సహిస్తూవచ్చిన సంకటాలకు ప్రోద్బలమూ, తీవ్రతా ఏర్పడింది. ఇంగ్లీసు ఉద్యోగులు తమపట్ల చూపుతున్న మొరటుతనం, బాధాకరమయింది. అదేకాక, భారతీయ సైనికోద్యోగులపట్ల బ్రిటీషుసైనికులు ప్రదర్శిస్తున్న అగౌరవప్రవర్తన ఇండియనులకు హృదయ విదారకమయింది. సాధారణమైన మాటలూ, సామాన్యప్రవర్తనాకూడా అర్థగర్భితములై, విపరీతభావాలనూ, వక్రార్థాలనూ స్ఫురింపజేసినవి. మరియూ, స్వకీయ ప్రాంతములనుంచీ, గృహములనుంచీ, సుదూరములైన ప్రదేశములలో కొలువుచేయడం సైనికులకు అతిభారంగా తోచింది. ఈ విధమైన అశాంతీ, మనోగతమైన ఒత్తిడీ కూడా, కర్ణాటక దక్కనుప్రాంతాలలో ఏర్పడినవి.

ప్రళయానికంతా సిద్ధంగా ఉంది బ్రిటీషువారి అధీతుణక్రింద వెల్లూరు దుర్గంలో ఉన్న టిప్పుసుల్తాను కుమారు లీ దాహకపరిస్థితిని ప్రజ్వలింపజేసినారు. 1806లో మే నెలలో ఒకసైనికదళం ఎదురుదిరిగింది. కాని, దాన్ని అణచివేయడమూ, విప్లవనాయకులను కొరడాశిక్షకు గురిచేసి క్రమశిక్షణను పునః నెలకొల్పడమూ కూడా జరిగిపోయింది. కొంతకాలం పరిస్థితి చల్లగానే ఉండింది; కాని జూలై 10వ తేదీన కొత్త సంక్షోభముపై కుబికింది. మధ్యరాత్రి సమయంలో, భారతీయసైనికులు విజృంభించి, కావలివారిని ముక్కలుగాకోసి, రక్షణాధికారిని చంపి, ఉద్యోగస్థులను కొందరిని కాల్చి, దీన్ దీన్, అనే నినాదాలతో, మైసూరు ప్రభుత్వపు వ్యాఘ్రచిహ్నధ్వజాన్ని, కోటబురుజులపై నెలకొల్పిరి. అంత, సిపాయీలు క్రమశిక్షణాన్నంతా విస్మరించినారు. దౌర్జన్యమైనగుంపు తమతో చేరడంతో, దోపిడిచర్యలూ హత్యాకాండా ఆరంభమైనాయి. బ్రిటీషు అధికార నిర్మూలనమనే తమ ప్రధాన ప్రయోజనం ఈ దౌర్జన్య ప్రవృత్తిలో అడుగంటి పోయింది.

ఈ తిరుగుబాటు విషయం ఆర్కాటులోనున్న బ్రిటీషువారికి తెలియగానే

గిల్స్పీ (Gillespie) ఆధిపత్యంలో ఒక సైన్యం బయలుదేరి, వెల్లూరు దుర్గాన్ని చేరుకొన్నది. సైనికులు కోటగోడల పైకెగబ్రాకి, దుర్గకవాటాలను తెరవగా, అశ్వారూఢులైన సైనికులదళం, లోనికి ప్రవహించింది. అప్పుడక్కడ గిలో నుండిన ఇండియను సిపాయీలు వీరి నెదిరించలేకపోగా, వందలు వందలుగా, హతులైనారు. కోటగోడపైనెక్కి తప్పించుకొనిన వారు పోగా, మిగిలినవారు హతాశులై, దయాభిక్షను ప్రార్థించినారు. తిరుగుబాటు అణగారిపోయింది. ఈ ద్రోహం సంక్షోభమెంత హఠాత్తుగా బయలుదేరిందో, అంత శీఘ్రముగానే సద్దుమణిగింది.

వెల్లూరు ప్రతిఘటనానంతరం, త్వరలోనే, అసంతుష్టిని చూపిన బెంగాలు సైన్యంకూడా 1824లో ఎదురుతిరిగింది. ఇచ్చటకూడా, సైనిక శ్రేణిలో కొత్తగా పెట్టిన అనిష్టకరమైన నూతనవిధానాలూ, అధికారం సంపూర్ణంగా, ఉన్నతాధికారుల హస్తాల్లో కేంద్రీకరించి ఉండడమూ, కారణాలుగా, సిపాయీలకూ, వారిపై ఉద్యోగులకూ, మధ్యగల అంతరం ఎక్కువయింది. ఆ నేలలో బర్మాతో ఏర్పడిన యుద్ధకారణంగా బ్రిటీషుప్రభుత్వం, క్లిష్టములైన పనులను భారతీయ సైనికులపై మోపవలసిన అగత్యమేర్పడింది. వీటన్నిటిలోనూ భారతదేశపు సరిహద్దుల నతిక్రమించి,సముద్రంమీదుగా విదేశంపోవడం అనేది, మతవిషయకంగా సిపాయీలకు అసహ్యకరమైనది. బర్మావాతావరణం పూర్తిగా తమకు కొత్తది. అందలి ప్రజల భాషా, ఆచారవ్యవహారాలూ భిన్నమైనవి. అట్టి క్రొత్తపరిస్థితుల్లో, విదేశంలో నిలిచి యుద్ధం చేయడమనేది వీరికి రుచించలేదు.

రవాణాసౌకర్యములు లేనందువల్ల, సిపాయీలు తమ సామానులను తామే మోసుకొని పోవలసిందిగా, ఆజ్ఞ అయింది. సిపాయీల సహనం, దీనితో పూర్తిగా నశించింది. బత్తెపుఖర్చులు సరిపోకపోవడం అనేది కూడా వారి ఇష్టానికి వ్యతిరేకంగా ఉండటంతో, ఇస్తేతప్ప తాము బర్మా వెళ్ళమని 47 వ రెజిమెంటు నిరాకరించింది. కఠినులైన సైన్యాధిపతి ఈ తిరుగుబాటును, అణచివేయడానికి దృఢనిశ్చయుడైనాడు. రెండు విదేశీయ సైన్యదళాలనూ, ఒక విదేశీయపు ఫిరంగులశాఖనూ వెంటబెట్టుకొని, బ్యారక్పూరుపై నడిచినాడు. బర్మాకు తరలడమో, లేక. ఆయుధాలను అర్పించివేయడమో చేయవలసిందిగా 47 వ కాల్బలదళాన్ని, ఆజ్ఞాపించినాడు. వారీ ఆజ్ఞను పాటించలేదు. అంతతో వారిపై, ప్రళయాగ్నివర్షం కురిపించినాడు సైన్యాధిపతి. హతశేషులైనవారిని సైన్యవిచారణకు గురిచేసి, ఉరిదీసినాడు. 47వ పదాతిదళమిట్లు బ్రిటీషు సైన్యంనుంచి శాశ్వతంగా నిశ్శేషమైపోయింది.

తరువాతి రోజుల్లో, బెంగాలులో ఇతర సైనికదళాలుకూడా తమ అనిష్టతను సూచిస్తూ వచ్చినవి. మొదటి ఆఫ్ఘను యుద్ధంలో కలిగిన ఘోరవిపత్తులు బ్రిటీషువారి ప్రతిష్ఠను భంగపరచినవి. బ్రిటీషువారి అధికారం శీఘ్రముంగా శిథిలమై పోతుందనీ, వారు ఇండియా విడిచిపెట్టిపోవుదురనీ, వాదాలు బజార్లలో ప్రచారమౌతూ వచ్చినవి. సహేతుకములు కావనితోచిన ఆజ్ఞలను పాలించను స్థితిలో లేరు సైనికులు. ఇట్టి పరిస్థితులలో బ్రిటీషు ప్రభుత్వం సైనికులకు విసుగుదల పుట్టించడం దురదృష్టకరమైన విషయము. సింధులోని అమీరు

లతో జరిగిన యుద్ధాల్లో, సైనికులకు జీతాలతోపాటు రెట్టింపు బత్తెపు ఖర్చులను, ఇదివరకు ఇచ్చియుండిరి. ఆ యుద్ధంలో తమకు విజయం చేకూరి, సింధు ప్రాంతం తమ అధీనమైన వెంటనే, ఈ బత్తెపుఖర్చులను ఆపివేయడం జరిగింది. ఇది సిపాయీలను ఉద్రిక్తులను చేసింది. తత్ఫలితంగా, వారు ఆజ్ఞలను ధిక్కరించినారు.

1844 ఫిబ్రవరిలో ఫెరోజ్‌పూర్‌లోని 34 వ దళం సింధు ప్రాంతంలోనికి నడవడానికి తిరస్కరించినది. 7వ బెంగాలు అశ్వికదళమూ, 64వ పదాతిదళమూ కూడా ఈ పద్ధతిలో అనుసరించినవి. తిరుగుబాటు గావించిన ఈ దళాలను వెనుకకు నురల్పక తప్పిందికాదు. కాని, తిరుగుబాటును ఉత్పాదించిన నాయకులు మాత్రం శిక్షితులైరి.64వ దళముయొక్క ప్రతిష్ఠాచిహ్నమైన జెండాను తీసివేయించిరి. 34వ దళం పూర్తిగా తీసివేయబడింది. బెంగాలీ పటాలాల స్థానాల్లో, మదరాసు, బొంబాయి సైన్యాలను నెలకొల్పినారు. ఐనా, బెంగాలు సైన్యంలో క్రమశిక్షణమాత్రం, బాగా సడలిపోయింది.

ఇట్లు సింధులో చెలరేగిన సంక్షోభం పూర్తిగా చల్లారకముందే బీహారులో కల్లోలం బయలుదేరింది. పాట్నా, ఇదివరకే ముస్లిముల జిహాద్‌కు, కేంద్రంగా ఉండినది కంపెనీవారి కొలువును త్యజించి తమ ధార్మికయుద్ధంలో చేరవలసిందిగా, ముస్లిము సైనికులను మౌల్వీలప్పుడుద్బోధిస్తూ, ఆశగొలుపసాగినారు. సిక్కులతో సన్నిహితమైయున్న యుద్ధం కారణంగా, ప్రభుత్వం తూర్పు సైనిక కేంద్రాలలోని, దళాలను తరలించుకొనిపోయి, పశ్చిమోత్తర సరిహద్దుప్రాంత సమీపంలో జమచేస్తూ వచ్చింది.

ఈ సమాచారం ప్రచారంకావడంతో, సైనికులలో అలజడి కలిగింది. అంతట రహస్యంగా, సంప్రదింపులు జరిగినవి. కంపెనీవారి కొలువును విడిచిపెట్టి వచ్చినట్టయితే, ఢిల్లీ ప్రభువు కొలువులో ఉద్యోగం తప్పక ఇప్పిస్తామని, సైనికులకు హామీ ఇచ్చి, ఆశలు కల్పించినారు. ఈ రహస్య కార్యకలాపాన్నిగూర్చి, బ్రిటీషు సేనానాయకునికీ, అతని ద్వారా ప్రభుత్వానికీ, సందేశం పంపడం జరిగింది. అపరాధులైన వారిని పట్టుకొని, ప్రభుత్వము శిక్షించింది మత విషయాల్లో ప్రభుత్వము, జోక్యంకలుగజేసుకోబోదనీ, వారికట్టి ఉద్దేశమేమాత్రమూ లేదనీ, హామీయిస్తూ, బెంగాల్ గవర్నరు బహిరంగప్రకటనద్వారా తెలియజేసినాడు. ఇంతలో సిక్కులతో జరిగినయుద్ధంలో బ్రిటీషువారికి చేకూరిన విజయాలు వారి ప్రతిష్ఠను నిలబెట్టడంతో, అలజడి శాంతించింది.

ఆ పిమ్మట, ఈకల్లోలానికి, పంజాబు, రంగస్థల మయింది. సిక్కులపై యుద్ధంలో భారతసైన్యం, విజయ ప్రతిష్ఠను సంపాదించుకొంది. కాని, యుద్ధానంతరం, భత్యపు ఖర్చులు తీసివేయడంతో, సిపాయీలకు పెద్దనష్టం కలిగింది. యుద్ధ విజయం వీరికిట్లు లాభకరం కాకపోగా, పైపెచ్చు దుఃఖాన్ని తెచ్చి

పెట్టింది. ఈ విధంగా దెబ్బతిన్న పటాలాలు పరస్పరం కలిసి సంప్రదించుకొని, సైనిక స్థావరాలకు సందేశహారులను పంపినారు. ఆజ్ఞలను ధిక్కరించడానికి నిర్ణయించుకొన్నారు. రావల్ పిండిలోని 22 వ పటాలం జీతం పుచ్చుకోవటం నిరాకరించింది. వజీరాబాద్, జీలం స్థావరాల్లోని వారూ అదే విధంగా జీతం నిరాకరించినారు. సేనాధిపతి సర్ ఛార్లెస్ నేపియర్, స్వయంగా ఆ ప్రాంతాల్లో పర్యటనం గావించినాడు. అనేకసైనిక దళాలకూటమి ఏర్పడినట్లున్నదని, అధిక వేతనాలపై తప్ప, ఈ సైనికవర్గాలు పంజాబు సైన్యంలో పనిచేయవని, ప్రత్యక్ష నిదర్శనాలనుబట్టి గ్రహించినాడు. విప్లవ వాతావరణం సిద్ధమైనట్లు. బాహాటంగా, అది మొదట వజీరాబాదులోనూ, పిమ్మట 66వ పటాలమున్న గోవింద్ ఘర్‌లోనూ చెలరేగింది. కాని, నేపియర్, కాలవిలంబం చేయకుండా, అతిక్రూర ప్రతిక్రియలను ప్రవర్తింపజేసి, ఈ సంక్షోభాన్ని అణచివేయగలిగినాడు. నిత్య కర్చుల నష్టానికి పరిహారంగా, అధికవేతన విధానాన్ని స్థిరపరచి, సైనికుల అసంతృప్తిని తగ్గించినాడు. దోబ్‌నదీ మధ్యప్రాంతంలోనున్న, బ్రాహ్మణ సైనికులను తొలగించి, వారి స్థానంలో గూర్ఖాలను నియమించినాడు.

బ్రిటీషు పరిపాలన కాలంలో ప్రథమ శతాబ్దం, పెరిగిపోతున్న దుస్థితికీ అసౌఖ్యానికీ ఆకరమయింది. వీరి పూర్వపు భారతపాలకులూ, తమ జీవితంలోని చైతన్యమూ, అంతటితో నశించిందనే ఆశారహితమైన భావానికి ప్రజలులోనైరి. వారి జీవితానందానికాధారములైన ఉన్నతాశయ సాధనావకాశాలూ, ఉచిత సాహసావకాశాలూ, వారికిక లేకపోయినాయి.

భారతీయుని భవిష్యత్తు, ఆశారహితమయింది. తమ స్వదేశంలోనే తమను బానిసస్థితికి, పాల్పరచినారు విదేశీయులు. భారతీయులు నిర్మించిన సువిశాల సౌధాల్లో, రాజప్రాసాదాల్లో, పరులు సకల సౌఖ్యాలనుభవిస్తూ ఉండగా, దేశస్థులైన భారతీయులు ఈ ప్రాసాదాల నంటిపెట్టుకొని యున్న కుటీరాల్లో, చలికి వణకుతూ, బ్రతుకవలసి వచ్చింది. వర్తమానస్థితీ, భవిష్యత్తూ,- రెండూ సంశయగ్రస్తములై ఉండగా, తన బ్రతుకుపై సర్వాధికారం వహించిన విదేశ ప్రభువుకు భారతీయుడు దూరమునుండే కపటవినయం చూపవలసిన స్థితి ఏర్పడింది. అతని భావినిగూర్చిన, శాసనప్రణాళికలు, రచించడంలో అతనికి స్థానంలేదు. అధికారమూ, ఆధిపత్యమూగల స్థానాలనుంచీ, బహిష్కృతుడు. ఈ విధంగా భారతీయుడు, రాజకీయంగా గౌరవహీనమైన విధేయస్థితికీ, నైతికభంగకరమైన క్షుద్రస్థితికీ, దిగజారినాడు. చరిత్రలో, భారతీయున కెప్పుడూ, ఇట్టి హృదయవేధకమైన, దీనస్థితి ఏర్పడి యుండలేదు.

ఈ దాస్యశృంఖలాలను త్రెంపి, బైటపడడానికి ప్రబలప్రయత్నం కావించినాడు. శతాబ్దకాలం జరిగిన ప్రతిఘటనలూ, కల్లోలాలూ, విప్లవాలూ, అతని స్వాతంత్ర్య సంపాదనేచ్ఛకు నిదర్శనాలు. కాని, ఇతడొనర్చిన ప్రయత్నాలందులకు చాలినవికావని, అపజయాలే సాక్ష్యమిస్తున్నవి. మధ్యయుగాల సాంఘిక

వ్యాప్తులకు సంబంధించిన, అసమగ్రజ్ఞానంతో ఈ ప్రయత్నాలు జరిగినవి. అందులోనూ, దేశంలో విడివిడిగా, జరిగినవి ఈ ప్రయత్నాలు. ఈ లోపాలవల్ల, ఈ స్వాతంత్ర్యోద్యమాలు సఫలములు కాలేకపోయేడు. ఈ మధ్యయుగ సంబంధమైన ఉద్యమాల పరిణామరూపంగా విజృంభించిన 1857వ విప్లవం, కడపటిది. ఐనా, ఈ విప్లవం, పూర్వపు విప్లవాలకంటె విలక్షణమైనది. పూర్వపు విప్లవాలను తెచ్చిన అన్ని కారణాలూ, అన్ని ప్రేరణోత్సాహాలూ, ఉద్దిష్టప్రయోజనాలూ, ఇందులో ఇమిడియున్నాయి. అంతేకాక, ఈ మహోద్యమం చాలవరకు అఖండ భారతదేశానికి వ్యాప్తమయింది.

# 2
# 1857 లో జరిగిన విప్లవము

## I. ఈస్టిండియా కంపెనీ పరిపాలనా స్వభావము

డల్‌హౌసీ పదవీచ్యుతి (విరమణ) నాటికి, భారతదేశంలో బ్రిటీషురాజ్యము, సహజసిద్ధములైన అవధులవరకూ వ్యాపించి ఉండింది. తూర్పుపడమరలుగా, ఇర్రవాడీనుంచి సింధునది వరకున్నూ, దక్షిణోత్తరంగా హిందూమహాసముద్రం మొదలు హిమాలయాలవరకున్నూ ఈ రాజ్యము విస్తరించింది. ఈ విధంగా జయించిన ఈ విశాల భూభాగంపై, బ్రిటీషువారి సామ్రాజ్య ప్రతినిధులు రెండు ప్రయోజనాలు సాధించగల ఒక పరిపాలనా విధానాన్ని ఏర్పరిచారు. పదునెనిమిదో శతాబ్దంలో, దేశంలో వ్యాప్తమై ఉండిన అరాజకత్వాన్ని అంతం చేయడమూ, ప్రజలప్రాణాలకూ, వారి ఆస్తులకూ భంగం కలగని విధంగా శాంతి పరిస్థితిని నెలకొల్పడమూ, దేశంలో వివిధ వర్గాల ప్రజలలోనూ, రాజకీయంగా ఐక్యభావం కలిగే పరిస్థితుల నేర్పరచడమూ, - అనేది వారి ప్రయోజనాల్లో మొదటిది. బ్రిటీషువారికి విస్తృతిలో అద్వితీయమైన సామ్రాజ్యము లభించడమూ, తమ మాతృదేశమైన బ్రిటను అనే చిన్న ద్వీపానికి ప్రపంచంలో ప్రబల సామ్రాజ్యాన్ని కలిగించే ధనమూ, ద్రవ్యసాధన మూలసంపత్తి సిద్ధించడమూ, - అనేది రెండవ ప్రయోజనము. ధన సంపాదనా, వర్తక ప్రాబల్యమూ ధ్యేయాలుగా, వాణిజ్య శక్తులప్రేరణంతో, పదునారో శతాబ్దంలో ఆరంభమైన బ్రిటీషువారి సాహసోద్యమము తుదకు, చరిత్రలో కనీవినీ ఎరుగనట్టి, విశిష్ట రాజ్యరూప సిద్ధిగా పరిణమించింది.

అసాధారణమైన ఈ పరిణామము మూడు దశావస్థలలో జరిగింది. ప్రథమ దశలో కంపెనీ వారి కార్యకలాపాలు కేవలం వ్యాపారానికి మాత్రమే సంబంధించినవి. తమతోపోటీ చేస్తూన్న విదేశీయ వర్తకులతో యుద్ధసన్నద్ధులై, వాణిజ్య సర్వాధికారాన్ని (Trade monopoly) స్థిరపరచుకోవడమూ, పిమ్మట రాజకీయప్రాబల్యాన్ని దేశంలో సంపాదించుకోవడమూ, - అనే విషయాలు రెండవ దశలోనివి.

ప్లాసీ యుద్ధంతో ఆరంభమైన తృతీయ దశలో, కంపెనీ, వర్తకాన్ని రాజ్యసంపాదనతో ముడిపెట్టి, ఆ రెండింటిలోనూ, తాను కలలో కూడా చూడనంతటి కార్యసిద్ధిని పొందింది. సమృద్ధమైన సహజ మూలాంశాలతో, కాయకష్టానికి వెనుదీయని సాధువులైన అతులాంది రైతులతో, కార్మికులతో,

ఒప్పినవిశాల భూభాగాన్ని సంపాదించుకొంది. బెంగాలు ప్రాంతం నుంచి నిర్బంధంతో లాగినపన్నులు తరువాతి రాజ్యసంపాదనకు సహకరించడమే కాక, లాభకరమైన విదేశవ్యాపారం పెట్టుబడికి, ద్రవరూప ధనరాశిగా ఉపకరించింది. ఈ విధంగా భాగస్వాములు (వాటాదార్లు, Share holders)చందాలు వేసుకొన్న స్వల్పమైన మూలధనంతో, అల్పాల్పమైన స్వజననష్టంతో, ఈస్ట్ ఇండియా కంపెనీ, భారతదేశంలోని అధికభాగాన్ని తన అధీనంలోకి తెచ్చుకొంది.

వర్తక స్వభావ ప్రవృత్తులకు స్వస్తిచెప్పి, కంపెనీ రాజ్యపాలనకు పూను కోవడంతో, వర్తకంవల్ల సిద్ధించే లాభాలను పంచుకొనే అవకాశము ఆంగ్లేయు లందరికీ కలిగింది.ఇందువల్ల తనకేర్పడిన నష్టాన్ని కంపెనీ, ఇతోధికరాజ్యసంపా దనతో సరిదిద్దుకొంది. ఇంతవరకూ విదేశీయ సైన్యాలతో ఏర్పడిన పోరాటాల లోనూ, అసమర్థులూ అమిత వ్యయపరులూ ఐన భారతీయరాజులతో జరిగిన యుద్ధాలలోనూ, కంపెనీవారికి లాభోద్దేశము ప్రధానమయింది అదీకాక, రాజ్య సంపాదనకాంక్ష ఆపరానిదయింది.అంతేకాదు, దానిని సంపాదించగల సౌలభ్యాసు- సారవంతాలైన భారతదేశ భూభాగాలను ఇంకా అధికంగా, తమవశం చేసుకోవ డానికి, ప్రేరకశక్తి అయింది. ఆదాయాన్ని వృద్ధి చేసుకోవలెననే కోరికతో సమానంగా పొదుపుదనం చేయవలెననే వివేచన[కొంతవరకు అవివేకంగా]-కూడా వీరిని ఆవేశించింది.

హేస్టింగ్స్ ప్రభువూ, ఎల్లెన్‌బరో, డల్‌హౌసీ,- వీరు సాగించిన దురా క్రమణ యుద్ధాలూ, భారతరాజులపాలన సక్రమంగా లేదనేమిషపై వశపరచు కొనిన రాజ్యాలూ, దత్తతల నంగీకరింపక స్వాధీనపరచుకొన్న సామంత రాష్ట్రాలూ- ఇవన్నీ బ్రిటీషురాజ్యకాంక్షకు సాక్ష్యాలు.

"రాష్ట్రాలసంఖ్యను పెంచడం, రాష్ట్రాలనుంచివచ్చే రాబడిని పెంచడం"- అనేగి ఆంగ్లేయుల రాజనీతి, అన్నవిషయాన్ని డిస్‌రేలీ గ్రహించినాడు. ఈ విధానాన్నే మెట్‌కాఫ్ కిందివిధంగా వివరించినాడు.

"భారతదేశ మధ్యసీమలో రాజ్యభాగం పెంచడంవల్ల, రక్షించుకోవలసిన సరిహద్దుప్రాంతం సంకుచితమౌతుంది. అంటే, బెంగాలూ తదితర రాష్ట్రాల సైన్యా లతో ఘర్షణ పడవలసిన అవసరం తక్కువౌతుంది. అదీకాక, నూతన రాజ్యభాగాల వల్ల వచ్చేపన్నులు సైన్యపోషణకుపకరించి, మన కిదివరకేర్పడి ఉన్న ఆర్థిక కష్టాలను తొలగిస్తుంది. కాబట్టి, రాజ్యసంపాదన ప్రయత్నం హానికరమనే అభి ప్రాయాన్ని సదలిపెట్టి, న్యాయబద్ధంగా సాధ్యమైనంత రాజ్యాన్ని, సంపా దించుకోవడమే శ్రేయస్కరము. అది, మన ప్రాబల్యానికీ, సుస్థితికీ అవసరము"

లాప్స్ (Lapse policy) సిద్ధాంతానికి,- అంటే కాలగతిపట్టిన రాజ్యాల పట్ల అవలంబించవలసిన నీతి నిర్మాతఅయిన డల్‌హౌసీ, 1848, ఆగస్టు 30వనాడు కింది విధంగా వ్రాసినాడు;

"న్యాయమైన అవకాశం లభించిననాడు మన అధీనంలోకి ఇదివరకే వచ్చిఉన్న రాజ్యాలను, మనం సుస్థిరం చేసుకొనే విధానాన్ని వ్యతిరేకిం

చడం ఎవరికీ సాధ్యంకాదని నా అభిప్రాయము. [illegible] వల్ల, మధ్య లోనే కాలగతిపట్టిన (వారసులు లేరనే కారణం, [illegible]) [illegible] లను స్వాధీనం చేసుకోవడంవల్ల, వాటి మధ్యవర్తిత్వం [illegible] వాటివల్ల ఏర్పడే చిక్కులుకూడా తొలగిపోతాయి." ఈ విధంగా, [illegible] లభించినపుడల్లా దేశీయప్రభువులను అంతరింపజేసే రాజ్యసూత్రాన్ని [illegible] ప్రకటించినాడు.

దేశీయ ప్రభువుల పరిపాలన అక్రమంగానూ, సహించరాని [illegible] కూడుకొన్నదిగానూ ఉన్నదనే మిషతో, పాలకుల పీడాకరచర్యలవల్ల ప్రజలు దుర్భర దుస్థితిలో మగ్గిపోతున్నారనే వాదాన్ని ఆధారంగా చేసుకొని, తాము అవలంబిస్తున్న రాజ్య సంయోజన విధానము న్యాయసమ్మతమైనదని బ్రిటిషు వారు తమకు తాము సమర్థించుకొన్నారు. కాని, బెర్నార్డ్ షా వ్రాసిన, అతి దృశమైన ఈ మాటలు సత్యస్థితిని బాగా వ్యక్తంచేస్తాయి : "ప్రతి ఆంగ్లేయుడూ కూడా, అతనికి ప్రపంచాధిపత్యాన్ని సిద్ధింపజేసే ఒక మహత్తర దివ్యశక్తితో జన్మిస్తాడు. అతనికే వస్తువైనా అవసరమైనప్పుడు తాను దానిని వాంఛిస్తున్నా డని అనుకోడు. ఆ వస్తువు లున్నవారిని జయించి వాటిని గ్రహించడం తన పరమ కర్తవ్యమూ, నైతిక ధర్మమూ, అనే దృఢవిశ్వాసం తన మనస్సులో ఏర్పడేటంత వరకూ,— చాలా ఓర్పుతో నిరీక్షిస్తూ ఉంటాడు. కాని, ఆ విశ్వాసము ఎట్లాఏర్పడుతుందో ఎవరూ చెప్పలేరు. ఆపై అతన్ని ఆపడం సాధ్యంకాదు. అతడంతట, గొప్ప వంశస్థునివలె, తనకిష్టమైన విధంగా ప్రవర్తిస్తాడు; తానుకోరిన వాటిని లాక్కొంటాడు. తన ప్రయోజనాన్ని సాధించుకోవడంలో, చిల్లర అంగడి వానివలె, పట్టువదలని శ్రద్ధతో, పాటుపడతాడు. అతనికి సహజ సిద్ధాలై ఉన్న సుదృఢమైన మతవిశ్వాసమూ, బలవత్తరమైన నైతిక బాధ్యతావివేకమూ,— ఇత్యాదులు, అటువంటి పట్టుదలను కలిగిస్తాయి. తన ప్రవృత్తిని నైతికంగా సమర్థించుకోవడంలో ఇతనికి, తడబాటెప్పుడూలేదు. ఎంతటి దుష్కార్యంకానీ, సత్కార్యంకానీ, చేయడానికి పూనుకోని ఆంగ్లేయుడు కనబడడు. ఐనా, తాను చేసే కార్యము తప్పు అని తలచే ఆంగ్లేయుడూలేడు. దేశభక్తి సూత్రాలను సమర్థించుకొంటూ, ఇతరులతో పోరాడుతాడు; వాణిజ్య సూత్రాల నాధారంగా చేసుకొని, దోచుకొంటాడు. సామ్రాజ్యవాదం ఆధారంగా ఇతరులను బానిసలుగా చేస్తాడు. శౌర్యసూత్రాల ననుసరించి బలహీనులను పీడిస్తాడు. రాజ విశ్వాస న్యాయాన్ని అనుసరించి తన రాజును బలపరుస్తాడు; ప్రజాప్రభుత్వ వాదాన్ని పురస్కరించుకొని, ఆరాజునే శిరచ్ఛేదన చేస్తాడు. 'స్వధర్మము' అనేమాట అతడు వల్లించే సూత్రవాక్యము. కాని, స్వప్రయోజనానికి విరుద్ధంగా, స్వధర్మానికి ప్రాధాన్యమిచ్చే దేశం నశింపక తప్పదనే విషయాన్ని ఎప్పుడూ అతడు విస్మరించడు." ఈ వాక్యాలు సత్యప్రదర్శకాలు.

రాజ్య సంయోజనాల (Annexations) వల్ల కంపెనీ ఆదాయం బాగా వృద్ధి అయింది. దానితోపాటు వ్యయం కూడా పెరిగింది. తమకు రావలసిన

లాభాంశాలు (Dividends) సన్నగిల్లుతాయనే శంకతో, డైరెక్టర్లు ఖర్చులు తగ్గించవలసిందిగా ఆదేశించినారు. కాని, దానివల్ల ఫలితాలు ఎట్లా ఉంటాయో వారు ఆలోచించలేదు. దేశీయ ప్రభువుల కిస్తూ ఉండిన గౌరవవేతనాలను (Pension-ఫింఛనులు) తొలగించడమో, లేదా తగ్గించడమో ఈ పొదుపు విధానంలో చేరిఉన్నాయి. మృతుడైన మహారాజా రంజిత్‌సింగు పత్నియైన రాణీజిందన్‌కౌర్ వార్షిక వేతనాన్ని 15000 పౌనులనుంచి 1200 పౌనులకు తగ్గించడమూ,- రెండవ పీష్వాబాజీరావుకు దత్తపుత్రుడైన నానాసాహేబ్‌కూ, ఝాన్సీరాణీ లక్ష్మీబాయికి ఇస్తూఉండిన గౌరవవేతనాలను తీసివేయడమూ,- దక్షిణభారతంలోని కర్ణాటక, తంజావూరి వంశాలవారి నామమాత్ర సార్వభౌమత్వాన్ని రద్దు పరచడమూ,- బ్రిటీషువారి పొదుపు ఉద్యమంలో ప్రత్యక్ష గోచరము లయ్యే నిదర్శనాలు.

ఇదివరలో, తమకు సహాయంచేసిన కారణంగా దేశీయప్రభువులు కొందరి కిచ్చియున్న జాగీరులనూ, ఇనాములనూ, వాపసు తీసికోవడంవల్ల కూడా, కంపెనీ ఆదాయం పెరిగింది.

సాంఘిక సంక్షేమ విధానాల విషయంలోకూడా ఈ మిత వ్యయచర్యలు తీసుకొన్నారు. 1813లో అత్యల్పమైన 10,000 పౌనులధనం మాత్రమే విద్యా విధానానికై మంజూరు చేసినారు. ఆరోగ్యరక్షణ, వైద్యశాఖ, క్షామోపశాంతి,- ఇత్యాదులు పేరుకే నిర్ణయాలు జరుగలేదు. విద్యకై నిర్ణీతమైనకొద్ది ధనం కూడా సంవత్సరాల తరబడి ఖర్చు కాక మిగిలిపోయింది.

సైన్యపు ఖర్చువిషయంలో చేసిన పొదుపుఅత్యధికం.భారతదేశాన్ని జయించడం సిపాయీల సాహాయంతో. దేశంలోన్యాయమూ,సక్రమవ్యవస్థా నడిపే భారమంతా సిపాయీలపై నిలిచింది. ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్, సింధు, బర్మాలలో పోరాడిందంతా సిపాయీలే. క్రిమియాలో యుద్ధం సాగించడానికి వారిని పంపే ప్రతిపాదన, కూడా, ఒకటి ఉండనేఉంది. ప్రతి యుద్ధరంగంలోనూ వారు ప్రదర్శించిన విశ్వాసానికీ, ధైర్యశౌర్యాలకూ, క్రమశిక్షణకూ, కావలసినంత నిదర్శనముంది. తిన్న అన్నానికి విశ్వాసపాత్రులై, అధికారులకు విధేయులై ప్రభువుల యందు బద్ధప్రీతులై ఉన్నవారు సిపాయిలు. కాని, వీరు తక్కువజీతంపై కొలువు చేయడం మాత్రమే, కంపెనీవారికి కావలసింది. జీవనోపాధిగా మాత్రమే వీరు కొలువుచేస్తున్నారనీ, కనుక రాజకీయంగా వీరివల్ల తమకెట్టి ఆపదా కలుగబోదనీ మాత్రమే తలంచినారు.

విదేశసైనికునికయ్యే ఖర్చులో మూడవవంతు మాత్రమే సిపాయిపోషణకు ఖర్చు అవుతూ ఉంది అనే విషయం, కంపెనీవారిచే బాగా గుర్తింపబడింది. కనుక, 1856 లో సైన్యం మొత్తం 300,000 మంది సైనికులలో, 23000 వేలమంది రాజదళాల (Royal regiments) సైనికులూ, మరి 23000 విదేశీయ సైనికులూ మాత్రమే ఉన్నారు. తక్కిన వారందరూ ఇండియను సిపాయీలే. ఈ పరిస్థితి గమనిస్తే, కంపెనీవారు తమ భవిష్యత్తును విధివశంలో వదలిపెట్టినా

రనే చెప్పవలసి వస్తుంది. సామ్రాజ్యరక్షణకూ, దాని విస్తరణకూ అవసరమైన ఇంతటి గొప్పసైన్యాన్ని ఒక పక్కన పోషిస్తూ, ఇంకో పక్క ప్రభుత్వ విత్తాన్ని సుస్థిరంచేస్తూ, వాణిజ్యలాభాలనూ, పెట్టుబడులనూ సంరక్షించుకోవడం ఎట్లా? అనే చిక్కు బ్రిటీషు రాజనీతిజ్ఞులను పీడిస్తూనే వచ్చింది. రాజప్రతినిధులు (Governor generals) ఈ విషయంలో సంశయగ్రస్తులై, ఇరువైపులూ మొగ్గుతూనే ఉన్నారు. రెండు పక్షాలలోనూ ప్రధానంగా ఎంచవలసింది మిన వ్యయసమస్యే.

సివిల్ సంస్థకు సంబంధించిన వ్యవస్థలోకూడా ఇట్టి సమస్యే గోచరించింది. బ్రిటీషు అధికారుల సంఖ్య చిన్నదే. కాని, అధికారమూ, నిర్దేశనియంత్రణలూ,- అన్నీ వారి అధీనంలోనే ఉన్నాయి. వారి వేతనాలు, ప్రపంచమంతటిలోనూ అధిక మైనవి. అధికసంఖ్యాకులైన అధీనోద్యోగులందరూ (Subardinate officers) అత్యల్పవేతనం పుచ్చుకొంటున్న భారతీయులే. పరిపాలన వ్యవస్థలో వీరికిచ్చిన స్థానంకూడా సామాన్యమైనదే. ఐనా, ప్రభుత్వ కార్యనిర్వహణమంతా వీరి సహా యంతోనే నడుస్తూ ఉంది.

ఆర్థికప్రయోజనమే ప్రధానాశయంగా ఏర్పడిన సామ్రాజ్యము ప్రపంచ చరిత్రకు కొత్తకాదు. కాని, స్వధర్మాభిమానులమనే (Self righteous) అభి మానంతో, సంతుష్టులై ఉన్న ఆంగ్లేయులు, తమ సామ్రాజ్యంయొక్క మాన వతా సమస్యపైనా, తత్పరిణామాలపైనా దృష్టి సారించినవారుకారు. కాలాంత రంలో స్వపరిపాలక ప్రభుత్వం ఏర్పడవచ్చునని, కొద్దిమంది సూచించినమాట వాస్తవమే. కాని, రెండువందలయేండ్ల పరిపాలన కాలంలో ఎన్నడూ, ఆంగ్లే యుల కార్యక్రమాలేవీ అట్టి ప్రయోజనాన్ని ఉద్దేశించినవికావు. వారి కట్టి అభి ప్రాయమున్నదనే సూచనలుకూడా కనపడవు.

అస్వాభావికమైన ఈ పరిపాలనావ్యవస్థ ఆంగ్లేయప్రముఖులలో కొందరిని కలత చెందించిందికూడా నిజమే. కాని, బ్రిటీషుపాలనను నిరవధికంగా కొనసా గించే విషయానికి భిన్నమైన ఏ ఇతరమార్గాన్నీ వారు యోచించలేక పోయినారు.

***తుపానుకు పూర్వము ప్రశాంతస్థితి :*** డల్‌హౌసీ పరిపాలన అనంతరము అతని స్థానంలో క్యానింగ్ (Canning) నియమితుడైనాడు. అతడు ప్రాచీన సాహిత్యంలో గొప్పపండితుడు. రోమను ప్రభుత్వాన్ని ఎదిరించిన క్యారక్టటస్ (Charactatus) అనే బ్రిటీషు సేనానాయకునిపై అతడు రచించిన లాటిను (Latin) కవితకు, ఆక్స్‌ఫర్డ్‌లో విద్యార్థిగానున్న కాలంలోనే, బహుమానం లభించింది. అతని గౌరవార్థం కంపెనీ డైరెక్టర్లు ఏర్పాటుచేసిన వీడ్కోలు విందులో, ఆదరవాక్యాలకు బదులుపలుకుతూ, అతడుచేసిన ఉపన్యాసం, అసాధారణమైనది. ఆనాడు, బ్రిటీషు ప్రభుత్వం ఎదుర్కొంటూ ఉన్న అల జడులూ, కల్లోలాత్మక సంశయాలూ ఆ ఉపన్యాసంలో ప్రతిఫలించినాయి. ప్రభుత్వపు ఉపప్రతినిధికి (Pro consul) సహజమైన ఆత్మప్రత్యయంతో ఉప

న్యాస ధోరణి ఆరంభమయింది. "సమగ్రసంపదతో విలసిల్లుతూ (15 కోట్ల ప్రజానీకంతో కూడి) ఉన్న ఒక విశాల దేశము శాంతి-సుఖంగా, సమాధాన యుతంగా, పరదేశ ప్రభుత్వానికీ, విదేశీయుల పరిపాలనకూ లోబడి ఉండడమనే విషయము ప్రపంచ చరిత్రలో జరగని విషయం. ఈ రాజకీయ భావదృశ్య మితనిని పరవశునిగ ఁవించింది." - ఇట్లా ఆరంభించినవాడు, శీఘ్రమే సంశయగ్రస్తుడై నాడు. ఆత్మప్రత్యయం సడలటాచ్చింది. భవిష్యత్తు అంధకారమయమై గోచ రించింది అతని ఉపన్యాసమప్పుడు గంభీరంగానూ, నిగ్రహంతోనూ నడిచింది. "సంగతులేవిధంగా పరిణమిస్తాయో చెప్పలేను. యుద్ధకార్యాచరణమనే ఆపదకు మనం, గురి కాము అనే ఆశిస్తున్నాను."పిమ్మట భీకరధోరణిలో చెప్పసాగినాడు. "భారతీయాకాశంలో - ఇప్పుడు ప్రశాంతత ఉన్నా - చిన్న మేఘము ఒకటి ఏర్పడవచ్చు. మొదట అది చిన్నదే ఐనా, క్రమక్రమంగా పెద్దదై, కడపట కుంభ వృష్టికురిపించి మనలను ముంచివేయవచ్చు. మనకెంత అనిష్టమైనా, యుద్ధచర్య తీసుకోవడం అవసరమైతే, విశుద్ధాంతః కరణంతో, మనం తీసుకోవలసి ఉంటుంది. అట్టి కఠిన చర్యతో, పోరాటం సుశీఘ్రంగానూ ఫలవంతంగానూ ముగుస్తుందన డంలో సందేహంలేదు." అని ఈ విధంగా తీవ్రంగా పలికినాడు.

భారతదేశాన్నిగూర్చిన పూర్వోత్తర సందర్భపత్రాలను (Dossier) ఇతడు పరిశీలించినాడుకదా! ఐతే, భారతసామ్రాజ్య నిజస్థితి ఇతనికి అవగాహన అయిందాఅని మనకు సందేహం కలుగుతుంది.

మాతృభూమి అయిన రోము కతిదూరంలోఉండిన ప్రాంతాలపై సామ్రా జ్యాధికారం జరుపుతూఉండిన రోముసామ్రాజ్యమూ, తాము జయించిన దేశా లలో స్థిరవాసం కల్పించుకొని పరిపాలించిన నార్మను సామ్రాజ్యము కూడా, ఒకప్పుడు, బ్రిటనును దాస్యంలో నిలిపి ఉంచినవి కదా! అది అతనికి బాగా తెలిసిన విషయమేకదా! ఇండియాలోని బ్రిటను సామ్రాజ్యానికిన్నీ, పూర్వపు ఈ రెండు సామ్రాజ్యాలకున్నూగల తరతమ భావమెట్టిదో ఇతడెందులకు పరిశీలించ లేదో,- అని ఆశ్చర్యం కలుగుతుంది.

ప్రపంచ చరిత్రలో సామ్రాజ్యాల పరిణామాన్ని గూర్చిన ఇతని ఆలోచన లెట్టివో, అతడు సూచించి ఉండలేదు. కాని, ఇండియాలో, సార్వజనీనమైన అసంతుష్టి సార్వత్రికంగా ఏర్పడి ఉన్నదనీ, అది ఎప్పుడో ఒకప్పుడు భయంకర రూపంలో బయటపడుతుందనీ, అతడు గ్రహించినాడనడం మాత్రం నిజం. ఇండి యాలో ఏర్పడుతూఉండిన ఈ ప్రమాదకరమైన పరిస్థితికి హేతువులు ఆసామ్రా జ్యస్వభావంలోనే అంతర్భూతములై (నిహితాలై)ఉన్నాయి. నార్మను ప్రభువులు బ్రిటనులో ప్రవర్తించినవిధంగా ఇండియా బ్రిటీషుఅధికారులు ప్రవర్తింప లేక పోవచ్చు. సందర్భములూ, దేశపరిస్థితులూ పూర్తిగా వేరు కావడంవల్ల, అట్టిది సాధ్యం కాలేకపోవచ్చు. కాని, రోము సామ్రాజ్యచరిత్రను, సరిగా అర్థం చేసు కొని, ఇండియాపట్ల తమ దృక్పథాన్ని, దిద్దుకొనక పోవటానికి కారణాలు కన బడవు ఇంగ్లాండుప్రజల సౌఖ్యానికై భారతదేశాన్ని, పాడి గేదెగా పరిగణించి,

పీల్చి పిప్పిచేయడానికి మారుగా, భారతీయుల ఆర్థికాభివృద్ధియందైనట్లు కొంతైనా ఆదరం చూపకపోవడానికి కారణం కానరాదు. ప్రజోపయోగ ప్రయోజనాలేవీ గమనింపబడలేదు. ఈ పరిస్థితివల్ల, దేశంలో వ్యాప్తిచెందుతూ వచ్చిన హేయభావ ద్వేషభావాల పరిణామాన్ని 1857లో చవిచూడవలసి వచ్చింది.

## II. సంక్షోభ స్వభావము

బ్రిటిషుచరిత్రకారులు 1857లో జరిగిన ఉత్పాతాన్ని తిరుగుబాటు (Mutiny) అని వ్యవహరించినారు. ఈ విధంగా వ్యవహరించడానికి మొదలు పెట్టింది ప్రభుత్వమే. అప్పటి ఇండియా కార్యదర్శియైన స్టాన్లీప్రభువు, 1857 సంఘటనలను గురించి, పార్లమెంటుకు వ్రాస్తూ "తిరుగుబాటు" (Mutiny) అనే పదాన్ని వాడినాడు. తక్కిన ఆంగ్ల రచయితలు దీన్నే అనుసరించినారు. చార్లెస్‌బాల్, జి. డబ్ల్యూ. ఫారెస్ట్, టి. ఆర్. హోమ్స్, ఎమ్. ఇన్నెస్, జే. డబ్ల్యూ.- కేయీ, టీ. ఎఫ్. మ్యాక్‌మన్, జీ. బీ. మ్యాలిసన్, వి. ఎ. డన్‌కాఫ్, రాబర్ట్సు ప్రభువూ, మరియూ ఇతరులు కూడా, "తిరుగుబాటు" అన్న పదంతోనే ఈ సంక్షోభాన్ని వర్ణించినారు.

అయినా, ఈ పదం భ్రాంతి మూలకమైనది. భారతీయ సైన్యం ఈ విప్లవంలో అధికంగా పాల్గొనిందనడంలో సందేహంలేదు. ఇతర రాష్ట్రాలలోని సైనిక దళాలలో కూడా అసంతృప్తి, అప్రీతి ఉన్నా, ఈ విప్లవానికి ప్రధానంగా బెంగాలు సైన్యం ప్రధానంగా ఉత్తేజన మిచ్చియున్నదనే విషయంకూడా నిస్సందేహమైనదే. కాని, ఈ ఉత్పాతం కేవలం సైన్యానికి మాత్రమే సంబంధించినదనడం సత్యంకాదు. "తిరుగుబాటు" అనే వ్యవహారం – ఈ ఉత్పాతానికి సరిగా వర్తించదు. "సక్రమంగా ఏర్పరుపబడియున్న వ్యవస్థకూ, క్రమ శిక్షణకూ లోబడి యుండక దానిని ధిక్కరించడం" అనే నిర్వచనంలోకి ఈ ఉత్పాతము రాదు. సైనిక క్రమశిక్షణను అతిక్రమించిన సాధారణ విషయాలకు భిన్నమైనవి దీని కారణాలు.

ఈ ఉత్పాతం యొక్క నిజ స్వభావాన్ని డిస్రేలీ (Disraeli) గుర్తించినాడు. 1857 జూలై 27వ నాడు, కామన్స్ సభలో మాట్లాడుతూ, ప్రభుత్వము యొక్క అభిప్రాయాన్ని ఖండిస్తూ, ఈ ఉత్పాతం 'జాతీయ విప్లవమనీ', సైనికుల తిరుగుబాటు కాదనీ ఉద్ఘాటించినాడు. పిమ్మట, 1857 సెప్టెంబర్ 30 వ నాడు, ఐల్స్‌బరీలో (Aylesbury) ఉపన్యసిస్తూ, "ఇండియాలో జరిగిన దౌర్భాగ్యకరములైన ఉద్యమాలను గూర్చి, ప్రభుత్వము, ఆదిలో ఇచ్చిన అభిప్రాయం సహేతుకంకాదని పరిస్థితులనుబట్టి తెలుస్తూ ఉన్నదనీ, ఈ సత్యము సార్వత్రికంగా ఆమోదింపబడింది అనీ- అతడు నొక్కి చెప్పినాడు. "ప్రథమంలో జరిగింది అల్పసంఘటనమైన విషయమనీ, అది అకస్మాత్తుగా జరిగిందనీ మనము

అభిప్రాయపడడం తప్పు. వాస్తవానికది, మానవజాతి చరిత్ర పరిణామంలో ఒక యుగంగా పరిగణింపదగింది. రాజనీతి నిపుణులూ, ప్రపంచజాతులూ గమనించి ఆదరించవలసిన విషయమిది".—అని అతడు వ్యక్తంచేసినాడు.

1858 లో బోర్డ్ అధ్యక్షుడుగా ఏర్పడిన ఎల్లెన్‌బరో, ఔధ్ ప్రాంతం లోని తాలూకుదారీలను స్వాధీనంచేసుకోవడంపై క్యానింగు ప్రభువును నిందిస్తూ,- "ఔధ్ ప్రాంతంలో జరిగిన ప్రతికూల విధానాలు - (Hostilities), ప్రబలమైన యుద్ధవిధానాన్ననుసరించినట్టివే కాని సాధారణమైన తిరుగుబాట్లుకావు." అని వ్రాసినాడు.

ఈ విషయాన్ని బాగా పరిశీలించిన పిమ్మట, జస్టిన్ మ్యకార్తీ (Justin Macarthy) ఈ క్రిందివిధంగా వ్రాసినాడు. "ఇండియా ఉత్తరభాగంలోనూ, పశ్చిమోత్తరభాగంలోనూ చాలా ప్రదేశాల్లో బ్రిటీషు ప్రభుత్వానికి విరుద్ధంగా, దేశీయజాతులు విద్రోహచర్యను నడిపించినవి. ఆ విద్రోహము ఏవిధంగానూ, కేవలం సైన్యపు తిరుగుబాటు కాదు. సైనిక సంతాపాలూ, జాతీయమైన అసూయమూ, మతవిషయకమైన ఉన్మాదమూ,- ఇవన్నీ బ్రిటీషువారి భారతదేశ ఆక్రమణపట్లగల విరుద్ధభావంతో ఐక్యమైనాయి. దేశీయప్రభువులూ, దేశీయసిపాయిలూకూడా ఈ ఉద్యమంలో ఉన్నారు. ముస్లిములూ, హిందువులూకూడా, తమ పురాతన మతద్వేషాలను త్యజించి, క్రిస్టియను శత్రువుకు విరుద్ధంగా నిలిచినారు.

సంఘటనల అభివృద్ధి ఈ విధంగా జరిగిందని ఛార్లెస్‌బాల్ వివరించినాడు. "కట్టకడపటికి, విప్లవప్రవాహం తీరాలనుకూడా ముంచి, భారతదేశంయొక్క నైతిక జీవిత వ్యవస్థను మలినమొనర్చింది. ఈ విప్లవ వాహిని త్వరలో విజృంభించి, దేశంలోని విదేశజాతిని ముంచి, నశింపజేస్తుందనీ, విదేశదాస్య శృంఖలాలనుండి విముక్తిపొందిన దేశము, దేశభక్తి ప్రేరణతో, ఒక దేశీయప్రభువుయొక్క సార్వభౌమత్వాన్ని అంగీకరించి, శాంతిస్తుందనీ, అందరూ ఆశించినారు. ఉద్యమ మిప్పుడు దేశంలోని సమగ్రజనానీకంయొక్క తిరుగుబాటుగా విశిష్టరూపాన్ని ధరించింది.

ఇద్దరు ఫ్రెంచి రచయితలు తమ పక్షపాతరహితమైన స్వతంత్రాభిప్రాయాలను, ఈ విధంగా వివరించినారు. "భారతసంధ్యాఘంటికలు త్వరలో మ్రోగనున్నవి. దేశప్రజలందన్నివర్గాలవారిలోనూ అసంతుష్టి, వ్యతిరేకతా, ప్రబలంగా వ్యాప్తమై యున్నవి. ప్రజలందరూ సిపాయీల ప్రయోజనాలతో ఏకీభవించి, కార్యదీక్షకు సిద్ధపడుతున్నారు."

బహదూర్ షాపై తెచ్చిన అభియోగాన్ని 'న్యాయాధిపతి - ప్రభుత్వప్రతినిధిన్యాయవాది' గా విచారణ జరుపుతూ, మేజర్ హ్యారియట్ (Major Harriet) అభియోగపత్రాలను సమగ్రంగా సమీక్షించి, నిష్కర్షమైన అభిప్రాయాన్ని ఈ క్రిందివిధంగా వెల్లడిచేసినాడు;- "ఈకుట్ర, - ఆదినుండికూడా - సిపాయీలకు మాత్రమే సంబంధించిందికాదు. నిజానికి, దీని ఉద్భవానికి సిపా

యీలు కారకులు కారు. రాజప్రాసాదంలోనూ, పట్టణంలోనూకూడా ఈ కుట్ర, పూర్వమే శాఖోపశాఖలుగా విస్తరించి ఉండినది.

"పౌరులలో అంతటా, అసంతుష్టి, అశాంతి, ప్రబలంగా వ్యాపించి యుండింది. సైనికస్థానాల్లో సిపాయీలు ఎదురు తిరగడానికంటే ముందే, నగరంలోని వివిధప్రదేశాలలో పౌరులు చెలరేగినారు".— అని విన్సెంట్ స్మిత్తు (Vincent smith) కూడా అంగీకరింపక తప్పిందికాదు.

కానింగు (Canning) ప్రభువుకూడా తన అభిప్రాయాన్ని మార్చుకొన్నాడు. బ్రిటనులోని ఇండియా సెక్రటరీకి వ్రాస్తూ అతను,- "మతమనే మిషపై బ్రాహ్మణులున్నూ, రాజకీయోద్దేశాల కారణంగా, మహమ్మదీయులున్నూ, "ఈ విద్రోహాన్ని రెచ్చగొట్టినారని" తెలిపియున్నాడు. "సిపాయీలతిరుగుబాటు అనే పదాన్ని వాడడమే క్యానింగు, మానివేసినాడనీ, అంతటినుండీ దానిని 'విద్రోహము' అనే వ్యవహారిస్తూ వచ్చినాడనీ,- కాయే (Kaye) తెలిపి యున్నాడు.

కనుక, 1857లో జరిగిన సంఘటనలను 'సిపాయీల తిరుగుబాటు' అని వ్యవహరించడం అసంగతమైనది. ఐతే, "భారతజాతీయ స్వాతంత్ర్యసమరము." అని దానిని వ్యవహరించడం సుసంగతమేనా?

బ్రిటీషు అధికారంపై జరిపిన ఈ యుద్ధానికి జాతీయభావం ప్రేరక శక్తికాలేదని, అంగీకరించక తప్పదు. 1857 నాటికి భారతదేశము రాజకీయంగా ఒకజాతిగా ఏర్పడకపోవడమే, దీనికి కారణం. హిందువులూ, ముస్లిములూ కూడా ఈ ఉద్యమంలో చేరి సహకరించినారనడం వాస్తవమే. కాని, ఈ రెండు వర్గాలవారి నాయకులూ, వారి అనుయాయులుకూడా వ్యక్తిగతస్వభావ విశ్వాసాలకులోనై ఇందులో పాల్గొన్నారేకాని, [illegible]లకూ సాధారణమైన మాతృదేశంపట్ల భక్తివిశ్వాసాలను పురస్కరించుకొని కాదు. ఎట్లైనా, పరదేశ ప్రభుత్వదాస్యంనుండీ భారతదేశాన్ని విముక్తిచేయడానికై జరిగింది, ఈ 1857వ సంక్షోభము,- అనే విషయం తథ్యము. దేశీయ ప్రభువర్గంవారి ఆత్మగౌరవానికీ, ప్రతిష్ఠకూ పాశ్చాత్యులు గొప్ప ఆఘాతం కలిగించినారు. ఇంతవరకూ సాంఘిక జీవనంపైనా, సామాజిక ప్రవృత్తిపైనా, తమ ప్రభావ ప్రాబల్యాలను నెరపుతూ, పరిపాలన వ్యవస్థాభారాన్ని వహిస్తూవచ్చినవారు ఈ దేశీయప్రభువర్గంవారు. అట్టి పరిస్థితుల్లో విదేశీయుడు ప్రవేశించి, దుర్భరమైన శుల్కవిధానాన్ని, అనిష్టకరమైన ఆర్థికవిధానాలనూ ప్రజానీకంపై రుద్ది, వారికళలనూ, పరిశ్రమలనూ నాశనంజేసి, వారితో విరోధము తెచ్చిపెట్టుకొన్నాడు.

ఆగ్రా కమీషనర్, హార్వీ (Harvey), 1857 నవంబరు 17వ నాడీక్రింది విధంగా పైవారికి నివేదించినాడు. "1857వ నాటి విప్లవము, ఆరంభ విజృంభణ మందునూ, ప్రవృత్తియందునూకూడా, ప్రత్యేకము ముస్లిములకు సంబంధించింది కాదు; హిందువులు ప్రత్యేకంగా ఉపక్రమింపజేసిందికాదు. విప్లవం బయలు దేరడానికి తగిన కారణాలు పుష్కలంగా, ఆదినుండీ ఉండనే ఉన్నాయి. సంద

ర్భాలూ, తగిన అవకాశమూ, వంచనాత్మకమైన అనృత ప్రచారమూ - ఇవి ముస్లిము సైనికులను రెచ్చగొట్టగా, తమ మత సంప్రదాయాలకు జరిగిన అవమానానికి ప్రతిక్రియ చేయడానికి ఉద్యమించినారు. అదే విధంగా, హిందువులలో బహుళప్రచారం గావింపబడిన రహస్యగర్భిత ప్రవాదం, బ్రిటీషువారికి ఇదివరకే వ్యతిరేకులైయున్న వారిని తిరుగుబాటుకు పురిగొల్పింది. తత్పరిణామంగా విప్లవము చెలరేగింది."

ట్రెవిల్యన్ (Trevelyan) అనే చరిత్రకారు డిచ్చిన ప్రమాణంకూడా ఈ విషయాన్ని ధృవపరుస్తూ ఉన్నది. "ఉన్నత వర్గాలవారూ, అధమవర్గాలవారూ, ధనికులూ, దరిద్రులూ,- వీరందరికీ కూడా, రాజకీయంగా తమ పరిస్థితిని బాగు చేసుకోవడమే ఏకైకాశయ మయింది. తమ పూర్వపు ఔన్నత్యాన్ని మరల సంపాదించుకొనే అవకాశానికై ఎదురుచూచినారు ఉన్నతవర్గాలవారు. దేశీయ ప్రభుత్వము ఏర్పడడంతో, తమకు ధనసంపాదనావకాశాలూ, ప్రత్యేక విశిష్టతా సంపాదన మార్గాలూ ఏర్పడునసే ఆశతో క్రింది వర్గాలవారు ఎదురు చూస్తున్నారు.

జరుగుతూఉన్న భారతదేశ విలయాన్ని (విచ్ఛేదాన్ని) అరికట్టి, దేశం కోల్పోయిన గౌరవస్థితిని పునఃప్రతిష్ఠించడానికై చేయబడిన ప్రయత్నమే-మధ్య యుగ విధానపు తుదిప్రయత్నం - ఈ 1857వ సంవత్సరపు విప్లవమనీ,- అది సాధారణమైన సైనికుల తిరుగుబాటుకాదనీ, సమగ్రావలోకనంవల్ల నిశ్చయ మయింది. దేశంలోని పూర్వపువ్యవస్థ క్షీణదశలో ఉండినదనడం వాస్తవమే. ఈ వ్యవస్థలో రాజకీయవిధానం శక్తివంతమైన సంస్థంగా ఏర్పడి యుండలేదు. ఇది పూర్వవ్యవస్థలోని గొప్పలోపం. కనుకనే, విదేశీయ దురాక్రమణాన్ని అడ్డగింప లేకపోయింది. ఐనా, రాజధానీ పట్టణాలకు బయటనున్న ప్రాంతాల్లో ఈ వ్యవస్థ యొక్క ప్రతిష్ఠ నిలిచేఉండింది. విలయనసమర్థమైన పాశ్చాత్యాధికారశక్తి, ఇంత వరకూ, భారతీయ సాంఘికవ్యవస్థలో తీవ్రమైన ఎట్టిమార్పునూ కలిగించి యుండ లేదు. ఉన్నతవర్గాలవారే ప్రజానాయకులుగానూ, ప్రజల ప్రయోజనాలను సాధించే ప్రతినిధులుగానూ, ఇంకా, పరిగణింపబడుతూ ఉండిరి.

1857వ విప్లవము, పూర్వసంప్రదాయబద్ధులైన, హిందూముస్లిము ప్రముఖుల కందరికినీ సంబంధించిన ఉద్యమము. రాజులూ, భూస్వాములూ, యుద్ధ సైనికులూ, పండితులూ, మౌల్వీలూ,- వీరందరికీ సర్వసాధారణంగా వర్తిల్లిన ఉద్యమమిది. ఢిల్లీ సార్వభౌముడూ, ఔధ్ ప్రభువూ, కొందరు నవాబులూ రాజులూ, తాలూకుదార్లూ, జమీందార్లూ, సైనికదళాలలోని పఠాను,(వలాయి తీలు) ముఘల్, రజపుత్ర, ఉత్తరఖండ బ్రాహ్మణ వర్ణాలవారూ, సైనికశాఖ లోని మౌల్వీలూ,- ఈ అందరితోనూ ఏర్పడింది ప్రధానవిద్రోహ సంఘము. ఇందులోని వివిధ మతవర్గ విభేదాలనుబట్టి, ప్రాదేశికంగా ఈ ఉద్యమము, ఎంత వ్యాప్తమైయుందోగమ్యమాన మౌతుంది. ఉద్యమంలో భాగస్థులైన ఈ వర్గాల వారి ఉద్దేశాలు కూడా, సువ్యక్తములైఉన్నాయి. ఈ వివిధవర్గాలలోని కొందరు

కారణాంతరాలవల్లనూ, విశేషపరిస్థితులవల్లనూ క్రియారూపంగా ఉద్యమంలో పాల్గొనక పోయినప్పటికీ,- దేశంలోని ఈ వర్గాలవారందరూ, ఏదోవిధంగా అసంతుష్టికి లోనై యుండి, బ్రిటీషువారి పట్ల అప్రియులై యుండినారనడం నిస్సందేహము.

ఈ విద్రోహసైన్యానికి, సర్దారులూ, జమీందారులూ నాయకత్వం వహింపగా, కంపెనీవారి, నియత, అనియత సైన్యభాగాలూ (Regular and Irregular), దేశీయరాజుల సైన్యాలూ, యుద్ధ ప్రవర్తక ముఖ్యాంగంగా ఏర్పడినవి. వీరి ఆశ్రితులూ, రైతులూ, సైన్యాసహాయక శాఖగా రూపొందింది. సంప్రదాయాలూ, కష్టనిష్ఠూరాలూ వీరందరికీ సమానమే. తమకు కలిగిన దుస్థితి విషయంలో పరస్పరం సానుభూతి గల తమ ప్రభువులు పదవులనూ రాజ్యాలనూ గోల్పోవడము, వీరందరికీ బాధ కలిగించింది. ఉన్నత వర్గాలవారు అధికారాన్నీ, జమీనులనూ, సైనికాధికారాలనూ, పాలనాధికారాలనూ పోగొట్టుకొనిన కారణంగా, ఇతరులు ఉద్యోగావకాశాలనూ, పలుకుబడితో కూడిన ప్రయోజక స్థానాలనూ గోల్పోయినారు. పండితులూ, మత ధర్మ శాస్త్రజ్ఞులూ, కవులూ, కళాకారులూ, కార్మిక కుశలులూ, అందరూ పోషకులు లేని వారైనారు. వంశపరంపరగా యుద్ధవ్యాపారమే వృత్తిగా ఉన్న వర్గాలవారికి జీవనోపాధి పోయింది. తత్కారణంగా, వారు, ఈస్టిండియా కంపెనీ వారి సైన్యంలో చేరవలసి వచ్చింది. ఉద్యమ నాయకులు బ్రిటీషు ప్రభుత్వంపై తెచ్చిన నిందారోపణ పత్రాలు ఈ విషయాన్ని ధ్రువపరుస్తున్నాయి. 1857 ఆగష్టు 25 వ నాడు బహదూర్ షా విడుదలచేసిన సార్వజనిక ప్రకటనలో (మానిఫెస్టో)—"ఈ ఆధునిక యుగంలో, నాస్తికులూ విశ్వాసఘాతుకులూ ఐన ఆంగ్లేయుల క్రౌర్యానికీ, హింసాచర్యకూ గురియై హిందూస్థాన్ ప్రజలైన హిందువులూ ముస్లిములూ కూడా నశించి పోతున్నారన్న సంగతి అందరికీ విదితమయిందే." అని ఘోషించి, బ్రిటీషువారిపై మోపిన నిందలను ఐదు ప్రధాన వర్గాలుగా వివరిస్తాడు.

I. *జమీందారుల విషయమై* : అతి భారమైన చెల్లింపరాని పన్నులను విధించడం; పన్నుల బాకీని రాబట్టుకోడానికై జమీనులను యాలంవేసి వారిని అవమాన పరచడం; స్టాంపు ఖర్చులతోనూ, కోర్టుఫీజులతోనూ కూడిన విశేష వ్యయాత్మకమైన న్యాయస్థానవిచారణలను దీర్ఘకాలం సాగదీసి, జమీందారులను నాశనము చేయడం, అనేనిందలు బ్రిటీషువారిపై ఉన్నవి.

II. *వర్తకుల విషయమై* : సున్నితమూ, విలువగలవియూ ఐన,-నీలి మందు, వస్త్రములు, ఇతరవిదేశ వ్యాపారవస్తువులు, మొదలైన వాటి వ్యాపార మంతా తమ అధీనంచేసుకొని, చిల్లరవస్తువుల అమ్మకం మాత్రమే ప్రజలకు విడిచిపెట్టడమూ; చిల్లర వర్తకంపై కూడా సుంకాలు, స్టాంపు ఫీజులూ, రాహదారీలు (Tolls), చందాలు విధించి లాభంపొందడం;- ఇత్యాది విధానాలవల్ల వర్తకులను నాశంగావించిన ఆంగ్లేయులను నాస్తికులనీ, విశ్వాస

ఘాతకులనీ బహదూర్‌షా ఖండించినాడు.

III. *ఉద్యోగవిషయమై* : సివిల్, మిలిటరీ ఉద్యోగాలలో తక్కువ జీతాలపై నియోగింపబడిన భారతీయులకెవ్వరికీ, గౌరవమూ, బలుకుబడీ లేకుండా చేసినారు. ఈ రెండు శాఖల్లోనూగల గౌరవపదవులన్నిటినీ అత్యధిక వేతనాలపై ప్రత్యేకం ఆంగ్లేయులనే నియమించడం జరిగింది.

IV. *కర్మకారులవిషయమై* : ఇంగ్లాండులో తయారైనవస్తువులను దిగుమతిచేసి ప్రవేశపెట్టడంతో, నేతపనివాండ్లూ, దూదిపనివాండ్లూ (Catton dressers), వడ్రంగులూ, కమ్మరులూ, చర్మారులూ (చమ్మారులూ (Shoe-makers) మున్నగు కర్మకారులందరికీ జీవనోపాధిపోయింది. ఈ వృత్తుల నన్నిటినీ బ్రిటీషువారాక్రమించడంతో, కర్మకారులందరూ భిక్షుకులైపోయినారని బహదూర్‌షా వర్ణించినాడు.

V. *పండితులు, మౌల్వీలూ, ఇతర విద్యావంతుల విషయమై* : పండితులూ, మౌల్వీలూ, హిందూముస్లిము మతసంప్రదాయాలకు రక్షకులు. పాశ్చాత్యులు ఈ రెండు వర్గాలవారికినీ ప్రత్యక్షశత్రువులు. కనుక విద్యావంతులైన వారు కూడా ఈ ధార్మికయుద్ధంలో తప్పక భాగం వహిస్తారు

బ్రిటీషు పరిపాలనలో ఏర్పడిన రాజకీయ, ఆర్థిక, ఉపద్రవాలెటువంటివో,- ఈ ప్రకటన విశదపరచింది. ఉన్నతవర్గాలవారైన,- జమీందారులు, పెద్ద వ్యాపారస్థులు, సివిల్ మిలిటరీ ఉద్యోగులు, హైందవముస్లిము విద్వాంసులు,- వీరందరూ అనుభవిస్తూ ఉండిన బాధ ఎట్లీ విప్లవానికి ప్రధానకారణమయిందో ఈ ప్రకటన వల్ల వ్యక్తమయింది.

బహదూర్‌షా ప్రకటనలలోచేసిన ఆరోపణలన్నిటినీ సమర్థిస్తూ, నానా సాహేబ్, ఫ్రెంచిసార్వభౌమునికి జాబులు వ్రాసినాడు. ఇంగ్లీషు ప్రభుత్వం గావించిన అన్యాయాలలో కొన్నిటిని ఈ క్రింది విధంగా వాటిలో వివరించినాడు.

"కపటంతోనూ, మోసంతోనూ, మహారాష్ట్ర రాజ్యాలను వశంచేసుకోవడము,-రెండవ బాజీరావుకూ అతని వారసులకూ ఇస్తూఉండిన గౌరవ వేతనాలను తీసివేయడము,- కుతంత్రాలతోనూ మాకియవెల్లీ పద్ధతులతోనూ (Machinations), భారత దేశపు రాజులను పదచ్యుతులను గావించడము,- విదేశీయన్యాయస్థానాలను నెలకొల్పి, ఆస్తిపరులను అధికవ్యయంతో కూడిన కోర్టు వ్యవహారాల్లోకి లాగి, నాశనంచేయడము,-పవిత్రములైన ధర్మశాస్త్రాలకు విరుద్ధములైన శాసనాలను జారీచేయడమూ,- మతాభినివేశాలను బాధించే శాసనాలను ప్రవేశపెట్టడమూ,- భూస్వాములపై అత్యధికమైన పన్నునూ, వారి పొలాల్లో పండిన ధాన్యాదులపై సుంకములు విధించడమూ;-న్యాయ విమర్శ రహితంగా, యుక్తిచాతుర్యంతోజరిపిన బ్రిటీషువారి చర్యలకులోనై రెండు వందలమంది దేశీయ ప్రభువులు బలికావడమూ;-నాగ్‌పూర్ రాజాతో చేసుకొన్న ఒడంబడికనూ, ఇచ్చిన వాగ్దానాలనూ త్రోసిపుచ్చి, అతని రాజమందిరం

రాన్ని దోచుకొని, అందలి అమూల్యములైన వస్తువులను యాలంవేయడమూ;- ఢిల్లీ సార్వభౌమునికీ, సింధు, దక్కను రాజులకూ గావించిన దురవమానమూ;-మహారాజా రంజిత్‌సింగ్ కు వారసుడూ, అవయస్కుడూ (Minor) ఐన దిలీప్ సింగ్‌ను పదవినుండి తొలగించడమూ;-ఒడంబడికలకూ, కరారులకూ విరుద్ధంగా ఔధ్ రాజును రాజ్యచ్యుతుణ్ణి చేయడమూ,-స్త్రీలను మానభంగము చేయడమూ;- దేవాలయాలనూ మసీదులనూ నాశంచేయడమూ,- హైందవ సంప్రదాయాలైన దత్తస్వీకార, సహగమనాదుల విషయంలో జోక్యంకలిగించు కోవడమూ,- దేవాలయాలకూ, దానధర్మ సంస్థలకూ పోషణార్థం నిర్ణయమై యుండిన మాన్యాలనూ నిధులనూ లాగుకోవడమూ,- ఈ అన్నిటికంటెను ముఖ్యంగా, భారతీయుల పూజావిధాన సంప్రదాయాలను భ్రష్టపరచడమూ,- ఇత్యాది దురంతములన్నీ సహింపరానివైనాయి. కాగా, సిపాయీలు ఐక్య కంఠంతో,- "ఆంగ్లేయులు మా సహాయంతోనే భారతదేశంలోని రాజ్యాలనన్నిటినీ గెలుచుకొన్నారు. ఆంగ్లసైనికులుచేసిన ఘనకార్యమేమీ లేదు. మా ప్రాణాలను ధారపోసి, జీవితాలను బలియిచ్చి, గావించిన యుద్ధమంతటికీ ఫలితం, మా మతాన్నీ, పూజావిధానాలనూ, సంప్రదాయాలనూ కోల్పోవడానికేనా ? మా శక్తిసామర్థ్యాలు మిగిలియున్నంతవరకూ ఈ పోరాటము సాగిస్తూనేఉంటాము"- అని ఉద్ఘోషించినారు. ఈ విషాదకరగాథను నానాసాహేబ్ ఒక్క వాక్యంలో సంగ్రహపరచినాడు. "బ్రిటీషు ప్రభుత్వమొనర్చిన అప్రమాణాలూ, అన్యాయాలూ ఐన చర్యలు సూర్యునికిరణాలవలె సర్వదిశావ్యాపకములై, ఉన్నాయి." అన్నాడతడు.

1857 జూలై 5వ నాడు, ఔధ్ మహారాణీ హాజరత్ మహాల్ ప్రాతినిధ్యంక్రింద సింహాసనంపై నిలుపబడిన బిర్జిస్ కాదిర్ (Birjis Qader) విప్లవమెట్లు న్యాయసమ్మతమైనదో సమర్థిస్తూ ఒక ప్రకటన గావించినాడు. ఆ ప్రకటన ఈ క్రింది విధంగా వివరించింది.

(1) ప్రతి మానవునికీ ప్రియతమమైన విషయాలు, నాలుగు : అవి,- (a) మతమూ - భక్తివిశ్వాసాలూ, (b) అభిమానమూ - గౌరవప్రతిష్ఠలూ, (c) ఆత్మజీవితమూ - బంధువర్గమూ, (d) ఆస్తి - అని హిందూ ముస్లిము లందరికీ తెలిసిన విషయమే. భారతీయుల పరిపాలనలో ఈ నాలుగూ రక్షితములైనవి. మత విషయాలలో ఎవ్వరూ జోక్యం కలుగజేసుకోలేదు. ప్రతివ్యక్తీ, తన మత విశ్వాసాల ననుసరించినాడు. ప్రతివ్యక్తియొక్క గౌరవమూ, కేవలం అతనికి సంబంధించిన విషయంగా రక్షింపబడింది. సయ్యద్, షేక్, మొఘల్, పఠాను, వర్గాల్లోని ముస్లిములెవరైనా, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, కాయస్థ వర్గాల హిందువులలో ఎవరైనాసరే, వివక్షలేక మాననీయులైన వ్యక్తులు (Ashraf) వారివారి యోగ్యతాస్థానాలననుసరించి, గౌరవమర్యాదలకు, పాత్రులైనారు. వీధులూడ్చువారూ, (చుర్హా), చర్మారులూ (Charmar), పకేవారూ (ధానక్), తలారులూ (పాసీ) - మొదలైన నీచోద్యోగాల్లో ప్రవ

ర్తించేవారెప్పుడూ, మాననీయులైన ఉన్నతవర్గాలవారితో సమానస్థానం కోరలేదు. ఐనా,- ఏ ఒక్క వ్యక్తికికూడా - ఉన్నతవర్గంకానీ, నీచవర్గంకానీ,- దేశంలో ప్రాణభీతి కలుగలేదు. తప్పుచేసినాడనే కారణంపైకానీ, నేరంచేసినాడనే కారణంపైకానీ ఎవరి ఆస్తినీ ఏ దేశీయప్రభుత్వమూ లాక్కోలేదు.

కాని, ఆంగ్లేయులీ నాలుగు మానవజీవనసూత్రాలకూ విరోధులు. హిందూ ముస్లిములందరూ తమతమ, మతాలను విసర్జించి, క్రీస్తుమతంలో చేరవలెననేది వీరి కోరిక. వారి పరిపాలనాకాలంలో వేలకువేలుగా ప్రజలను క్రీస్తుమతంలో కలుపుకొన్నారు; ఇంకనూ ఇతరులు కలుస్తూ ఉన్నారు. ఉన్నతవర్గాలలోని మాననీయులను, వీధులూడ్చువారికీ చర్మకారులకూ సమానమైన అధోగతి కీడ్చి, అవమాన పరిచారు. వాస్తవంగా పరిశీలిస్తే - ఆంగ్లేయులకు నీచవర్గాలవారిపైనే అభిమానమూ, ఆదరమూ అధికం. ఒక నీచవర్గంవాని పిర్యాదుపై, ఎంతటివానినైనా,- నవాబునైనా, రాజానైనా - బంధించి అవమానపరుస్తారు. ఆంగ్లేయులు ప్రవేశించిన ప్రతిప్రాంతంలోనూ, ఉన్నతవర్గాల పురుషులను ఉరిదీయడం, వారి స్త్రీలనూ బిడ్డలనూ చంపడం, పరిపాటి అయింది. ఆంగ్లసైనికులు విచ్చలవిడిగా స్త్రీలపై అత్యాచారాలు జరుపుతున్నారు. ఇండ్లను త్రవ్వి, చరాస్తులను దోచుకొని, ప్రజలను బికారులుగా చేస్తున్నారు."

ఇట్లు ముగ్గురు ప్రధాననాయకులు వెలువరచిన మూడు ప్రకటనలూ కూడా, 1857లో జరిగిన విప్లవానికి దేశీయసైనికుల కష్ట నిష్ఠూరాలుమాత్రమే కారణాలు కావనీ, ఉన్నతవర్గాలలో సర్వసాధారణమై నెలకొనియుండిన అసంతుష్టి ప్రధానమైన హేతువనీ, విశదం చేస్తున్నవి. అట్లే, ఏ ఒక్కమతానికి గానీ సంబంధించిన సంఘర్షణకూడా కాదిది. మతసంప్రదాయాలకూ, పూజావిధానాలకూ సంబంధించిన భావాలుమాత్రమే, ఈ ఉద్యమాన్ని ప్రేరేపించినవి కావు. భారతదేశంనుండి పాశ్చాత్యపాలనను నిర్మూలించడానికై ఏర్పడిన రాజకీయోద్యమ మిది. బలాత్కారంతో గ్రహింపబడిన తమ పూర్వపుస్థానాన్నీ, పదవినీ, మరల సంపాదించుకోడానికై, పూర్వపువ్యవస్థకు చెందిన నాయకులు ప్రాణాలకు తెగించి, చేసిన ప్రయత్నం ఈ విప్లవోద్యమం.

ఔట్‌రాముకూ, హెన్రీలారెన్సుకూ, ఛార్లెస్-క్రెవిలియనుకూ స్నేహితుడైన స్కాట్‌లెండ్ దేశపు ఫాదిరి (మతప్రచారకుడు), ఆ విప్లవ దినాల్లో ఇండియాలో ఉండినవాడు. దీనికి సంబంధించిన వాస్తవవిషయాలను సేకరించే అవకాశాలితని కెక్కువగా ఉండినవి. కాబట్టి, ఈ విప్లవస్వభావాన్ని గూర్చి ఇతడిచ్చిన సాక్ష్యం అమూల్యమైనది. 1857 అక్టోబర్ 6వ తేదీనా డితడు, డాక్టర్ ట్వీడీకి (Dr. Tweedie convener of the free church of scotland's foreign mission committe) జాబువ్రాస్తూ. "రాతుసమైన ఈ విప్లవం, ప్రధానంగా రాజకీయసంబంధమైనదనీ, అంగికంగా మాత్రమే మతసంబంధమైనదనీ, నాకు ఆదియందే కల్గినవిశ్వాసము వాస్తవమైనదని దృఢపడింది."- అని నిష్కర్షగా అభిప్రాయ మిచ్చియున్నాడు.

III. బ్రిటిషు ప్రభుత్వంపై అపాదన (దోషారోపణ)

ఈ మహోద్యమ నాయకులు బ్రిటీషుప్రభుత్వంపై మోపిన ఆరోపణ లన్నిటినీ చరిత్ర సమర్థిస్తూఉంది. మొగలు సార్వభౌముని విషయం పరిశీలిద్దాం. 1803 నాటినుండి మొగలు సార్వభౌముడు బ్రిటీషు రక్షణాధికారంలో ఉండినాడు. ఇంతవరకూ, అతనిప్రతిష్ఠా, ప్రథమస్థానమూ గౌరవింపబడుతూ వచ్చినవి. గవర్నర్ జెనరల్‌ను ఉద్దేశించినప్పుడతడు, "ప్రియపుత్రుడు," "విశ్వాసపాత్రుడైన భృత్యుడు," అని వ్యవహరించేవాడు. గవర్నరు జనరలుల అధికారముద్రలపై "విధేయుడైన భృత్యుడు" (ఫిదావీ)అని గుర్తింపబడి యుండేది. క్రమంగా ఈ విషయంలో మార్పుగలుగుతూ వచ్చింది. ఆమ్‌హెర్‌స్ట్ (Amherst), "మీ సార్వభౌమత్వం నామమాత్రమైనది; మిమ్ములను 'రాజు' అని వ్యవహరించడము మర్యాదకొరకు మాత్రమే" అని చెప్పి సార్వభౌమునికి నజర్ (Nazr) అర్పించే సమయంలో బ్రిటిషుప్రతినిధి లేచి నిలబడడము మానివేసినాడు. బహదూర్‌షా తన అధికార యోగ్యతలనూ, హక్కులనూ వదలివేయవలిసిందిగా, ఆక్‌లెండ్ (Auckland) కోరినాడు. నజరుల నర్పించడమూ, గౌరవవస్త్ర ప్రదానమూ, దర్బారు నడపడమూ,-అనే రాజలాంఛనాలను అతడు ఆపించివేసినాడు. దివాన్-ఈ-ఖాస్, మరియూ దివాన్-ఈ-ఆమ్, మూసివేయించినాడు. లాల్ ఖిల్లా (Red fort)లో నివసించడము మానివేయవలసిందనీ, సార్వభౌమ బిరుదును ప్రమాణపూర్వకంగా విసర్జించవలసిందనీ, వారసుని ఎన్నుకొనే విషయంలో అతనికి గల స్వతంత్రాధికారము విడనాడవలసిందనీ, బహదూర్‌షాను నిర్బంధపరచినాడు. అవమర్యాదనిట్లు ప్రదర్శించడంలో డల్‌హౌసీ, ఇంకొకమెట్టు పైకి పోయినాడు. ఈ విషయమై రస్సెల్ (Russel), క్రిందివిధంగా వివరించియున్నాడు. "విప్లవారంభానికంటే పూర్వపురోజులనుండీ కూడా, సార్వభౌముని పరిస్థితి దుర్భరంగానూ, శోచనీయంగానూ ఉండింది. రాజనగరు వాస్తవానికి, ఖైదుతో సమానమైన స్థితికివచ్చింది. సార్వభౌమునికి నామమాత్రంగా మిగిల్చిన, దిక్కుమాలిన విశేషాధికారాలు, అతడు పోగొట్టుకొన్న మహోన్నత పదవిని పరిహసిస్తూ ఉన్న చిహ్నాలుగా కనబడుతున్నాయి. తన అనంతరము పీఠిని కూడా, తన వారసులకు దక్కకుండా చేస్తారని ఢిల్లీసార్వభౌముడు గుర్తించినాడు. తాము నిర్మించుకొన్న నగరులోకూడా తమ్మునివసింపనీయరనీ, దుర్గప్రాకారాదులు దాటి, ఎచ్చటనో, నిర్వాసంలో బ్రదుకును వెళ్ళబుచ్చవలసి ఉంటుందని కూడా, అతనికి తెలుసు. రాజబంధువులకు ప్రభుత్వంలో ఉద్యోగావకాశాలు నిరాకరించినాము. దారిద్ర్యంలో, అప్పుల్లో, కుములుతూ వారు రాజనగరు పొలిమేరల్లోనే (హద్దుల్లోనే), అవమానకరమైన స్థితిలో కృశించునట్లుగా విధింపబడినారు. అట్టి దుస్థితివారికి కలిగించి, పిమ్మట మనమే వారిని సోమరులనీ, తుచ్ఛులనీ ఇంద్రియలోలురనీ, నిరసిస్తూ వచ్చినాము. సైన్యంలో ఉత్తమాధికారావకాశాలనుంచి వారిని బహిష్కరించినాము. ఇతర ఉద్యమ ప్రయత్నాల కెట్టి అవకాశమూ వారికి లేకుండా నిరోధించినాము. గౌరవప్రదముతైన అభ్యు

చయమార్గాలేవీ వారికి లేకుండా అరికట్టినాము. అట్టి పరిస్థితుల్లో వారిని బంధించిన మనమే,- వార్తాపత్రికల్లోనూ, తుదకు, భోజనశాలల్లోనూకూడా, వారిని గూర్చి దుర్భాషణలు ప్రచారంచేసినాము. ఈ రాజవంశీయులు, సోమరులు, అలసులు, విషయలంపటులు;- ఇత్యాది విశేషణాలను విచ్చలవిడిగా ప్రయోగిస్తూ, నిందించినాము." ఇవి బ్రిటీషు చరిత్రకారుని (Russel) వాక్యాలు.

లాల్ ఖిల్లా (Red fort) వాసియైన బహదూర్ షా, ఈ విధంగా నామమాత్రవిశిష్టుడే ఐనా, ఇతర దేశీయప్రభువులితనిని, ఉన్నతంగా గౌరవింపక పోలేదు. అసమగ్ర స్వాతంత్ర్యంతో మాత్రమే పాలకులుగా ఉన్న - నైజామ్, బెంగాల్ నవాబ్, పీష్వా, మరాఠా సర్దారులూ సింధియా, హోల్కార్, రజపుత్రప్రభువులు,- వీరందరూకూడా, బహదూర్ షాకు సన్మానంచేసి, నజరుల నర్పించి, అతనివల్ల బిరుదులనూ, సన్మానవస్త్రాలనూ పొందడానికెంతో ఉత్సాహం ప్రదర్శిస్తూనే ఉన్నారు. అతడు ప్రస్తుతం అధికారహీనుడైయున్నా, సాధనోపాయరహితుడైయున్నా వారికి, అతనిపట్ల గౌరవమేమాత్రమూ తగ్గలేదు. మొగలు రాజవంశంలో, మహోన్నత సార్వభౌములైన బాబర్, అక్బర్, షాజహానులకు వారసుడు బహదూర్ షాఅనే, అభిమానాన్ని ఎవరూ మరచినవారుకారు. సింహాసనస్థుడై యుండిన మొగల్ వంశీయుని పదవీచ్యుతునిగావించి, ఈ విధమైన దుస్సహావమానాలకు గురిచేసి, మొగల్ వంశాన్నే అంతరింపజేయబూనిన బ్రిటీషువారిపట్ల, సర్వులూ,- హిందువులూ, ముస్లిములూ, రాజులూ, ప్రజలూ, కూడా—తమ అసహ్యాన్ని, ఆగ్రహాన్ని, ప్రదర్శించినారనడంలో, ఆశ్చర్యానికే మాత్రమూ అవకాశంలేదు.

అదీకాక, బహదూర్ షా తమకు దత్తంచేసిన బెంగాల్ దివానీని ఒకప్రక్క అనుభవిస్తూ. న్యాయసమ్మతంగా తమకు ప్రభువైన బహదూర్ షాకు విధేయులై యుండకపోవడమూ, అతనివల్ల తమకుచేకూరిన అధికారాన్ని, ఆదాయాన్ని, అతనిపై దురాక్రమణ జరపడానికుపయోగించి, అతనిని భంగపరచడమూ, అవమానించడమూ, అనే విషయాలు అత్యంతమూవారి అపచారబుద్ధికీ, కృతఘ్నతకూ, ప్రత్యక్ష నిదర్శనాలు. ఇక, వారి విశ్వాసఘాతకత్వాన్ని గురించి ఏమి చెప్పను? 1803లో, మార్క్విస్ ఆఫ్ వెల్లస్లీ, సార్వభౌముడైన, షాఆలంకు, ఏవిధమైన హామీఇచ్చినాడో చూడుడు. "తమ ఘనతకూ, తమ రాజకుటుంబముయొక్క ఘనతకూ తగినవిధంగా, తమ సౌఖ్యజీవితానికీ,హాయికీ, దోహదంచేసే విధంగా, గౌరవశ్రద్ధలు తమపట్ల నిరంతరం బ్రిటీషుప్రభుత్వం ప్రదర్శిస్తూ ఉంటుందని, తమ ఘనతకు భరవసా ఇస్తున్నాను. మరియూ, తమ ఘనతకూ, తమకుటుంబమునకూ, అనుయాయులకూ, జీవితసౌఖ్యానికి తగిన పూర్వ నిబంధనను బ్రిటీషుప్రభుత్వము ఏర్పాటుచేస్తుందనికూడా, నేను భరవసా ఇస్తున్నాను." ఇవి వెల్లస్లీ ఇచ్చిన హామీపత్రములోని వాక్యాలు.

వెల్లస్లీ పత్రాన్ని మొఘులు సార్వభౌమునికి పంపుతూ, లేక్ (Lake) ఈ క్రిందివిధంగా వ్రాసినాడు. "తమ ఘనత ఇచ్చే ఆదేశాలను పరిపాలించడం

గౌరవప్రదమైన ఒక విశిష్టాధికారంగా భావిస్తూ, తమ ఘనతపట్ల రాజభక్తి సన్ని విధాల ప్రదర్శిస్తూ, తమ ఆజ్ఞలను పాలించడానికి శ్రద్ధతో ఎదురుచూస్తున్నారని". ఇవన్నీ, కపటభాషణములని బ్రిటీషురాజప్రతినిధుల తరువాతి ప్రవర్తనలనుబట్టి వ్యక్తమయింది. ఢిల్లీసార్వభౌముని పేరుప్రతిష్ఠలను తమ దురాక్రమణలకు ఆధారంగా చేసుకోవడమే వారి ప్రధానాశయము. బలవంతంగా ఆక్రమించి వశపరచుకొన్న తమ చర్యను సమర్థించుకోడానికి సార్వభౌముని పేరు ఉపకరించింది.

ప్రత్యేకం తమ పేరుమీదుగానే, రాజ్యాక్రమణం జరిపితే, అంతర్జాతీయములైన సమస్యలు ఏర్పడుననీ, ఫ్రెంచిప్రభుత్వానికి జవాబు చెప్పవలసిఉంటుందనీ వీరు ముందుగనే గుర్తించినారు. కనుకనే, తమ రాజ్యాక్రమణ దౌర్జన్యాన్ని ఢిల్లీసార్వభౌముని పేరుతో జరుపుతో వచ్చినారు. అనంతరం, దేశంలో తమ అధికారాన్ని సుస్థిరంచేయడానికి తమ సైన్యము సమర్థమైయున్నదని గ్రహించిన మీదట, తామిదివరలో గావించిన వాగ్దానాలూ, ఒడంబడికలూ, పరిత్యజించినారు. కంపెనీడైరెక్టర్లు, ఈ విషయమై తమ పాలనసీతిని ఈ విధంగా ప్రకటించినారు.— "ఢిల్లీసార్వభౌమునినుంచి ఏవిధమైన అధికారముద్రనూ ఆశించకుండానే, ఆధిపత్యాన్ని సాగించడానికి, మనము సంపూర్ణసమర్థులమైయున్నాము. కాబట్టి సుస్థిరమైన మన అధికారసమర్థనకై ఢిల్లీరాజుయొక్క అనుమతిని కోరడమనే ఆపదకు సాహసించవలసిన అవసరంలేదు".

ఔధ్‌నవాబుకు కూడా ఇదే దుర్గతి కలుగజేసినారు. వారన్ హేస్టింగ్సు కాలమునుండీ గూడా, బ్రిటీషు అధికారానికీ, ఔధ్‌కూ మధ్యనున్న సంబంధాలు, చరిత్రలో ఒక దుఃఖకరమైన ఘట్టంగా ఏర్పడినాయి. బక్సార్ యుద్ధకాలము నుంచే (1764), ఔధ్‌నవాబులు బ్రిటీషువారి ఒత్తిడికిలోనై ఉన్నారు. క్రమంగా, నవాబుల అధికారాలు తగ్గుతూ వచ్చినాయి. కాని, వారి బాధ్యతలు ఎప్పటివలెనే నిలిచినాయి. 1768 లో, నవాబ్ షుజా-ఉద్-దౌలాను, అతని సేనలు 35000 కు మించనివ్వకూడదని బ్రిటీషువారాదేశించినారు. అది తప్పనిసరిగా అంగీకరించవలసి వచ్చింది. అంతేకాక, యుద్ధశిక్షణనివ్వడమూ, వారికి యుద్ధపరికరాల నివ్వడమూ, ఆంగ్లేయసైనికులననుసరించి, పదివేల మంది పరిమితిని దాటరాదని కూడా నిర్బంధించినారు. తర్వాత, కంపెనీ వారికి తెలియకుండా, నవాబు ఇతరరాజులతో ఏవిధమైన ఉత్తరప్రత్యుత్తరాలు కూడా, జరుపకూడదని, అతనిని నిషేధించినారు. ఈ విధంగా నవాబును తమ అధీనస్థితిలోకి త్రోసివేసినారు. బ్రిటీషు సైన్యపోషణ నిమిత్తం, సాలుకు డెబ్బైయారు లక్షలు ధనం యివ్వవలసిందిగా, 1798 లో, సాదత్-అలీ-ఖాన్ నవాబును కోరినారు. తననిస్సహాయస్థితి భరింపరానిది కాగా, రాజ్యపదవి నుండి విరమిస్తానని నవాబు బెదిరించాడు. కాని, అంతతో అతని రాజవంశాధికారం అంతంకాగలదనే విషయాన్ని నిర్దాక్షిణ్యంగా, వివరించినారు. బ్రిటీషు వారి షరతును అంగీకరించవలసి వచ్చింది. మిగిలియున్న తనపరిపాలనాకాలాన్ని అతడు ప్రజోపకారకములైన ప్రయత్నాల్లో గడపివేసినాడు. కోశాగారాన్ని

పరిపుష్టం గావించి, రాష్ట్రవ్యవహారాలను సమర్థంగానడిపించినాడు. ఔధ్ ప్రాంతంలో పర్యటనం గావించిన బిషప్ హేబర్ (Bishop Heber) "కంపెనీ వారి ప్రాంతాలలో వలెనే ఔధ్ ప్రాంతం కూడా, జన బాహుళ్యంతోనూ, వ్యావసాయక సుస్థితితోనూ కూడి ఉన్నదని" వ్రాసియున్నాడు. బ్రిటీషు ప్రాంతలోని పరిసర జిల్లాలలోకంటే, ఔధ్ సీమలోని సంపద అధికము. పన్నులు తేలికకావడమూ, తదాదాయం ప్రాంతంలోనే వ్యయంకావడమూ ఇందులకు కారణము".-అని ఇర్విన్ (Irwin) వివరించినాడు.

సాదత్ ఆలీ అనంతరం రాజ్యానికి వచ్చిన-ఘాజీ-ఉద్దీన్ హైదర్, (Ghaziuddin Hyder), హేస్టింగ్స్ అభిప్రాయాన్ననుసరించి "రాజు"అనే బిరుదు కొప్పుకున్నాడు. ఢిల్లీ సార్వ భౌముని ప్రతిష్ఠను కళంకిత మొనర్చడానికి బ్రిటీషు వారవలంబిస్తున్న విధానాల్లో ఇది ఒకటి. బ్రిటీషువారి నేపాల యుద్ధానికి సహాయంగా 35 లక్షల ధనం హైదర్ ఇవ్వవలసి వచ్చింది. పరిపాల కుడుగా ఘాజీ ఉద్దీన్ హైదర్, అసమర్థుడని తేలింది. అతని కుమారుడు నసీరుద్దీన్ అంతకంటే అసమర్థుడైనాడు.

1837 లో, నసీరుద్దీన్ మరణానంతరము, అతని స్థానంలో వచ్చిన మహమ్మదాలీషాపై బ్రిటీషువారొక, క్రొత్త ఒప్పందాన్ని బలవంతంగా విధించినారు. 1801 లో జరిగిన ఒప్పందాన్ని ఇది మార్చివేసింది. తరువాత రాజ్యానికి వచ్చిన అమ్‌జద్ ఆలీ కాలంలో పరిస్థితు లింకనూ విషమించినాయి. సర్ హెన్రీ లారెన్స్ (Sir Henry Lawrence) తానే కారణాన్ని వివరిస్తాడు. "లోపము, ప్రభుత్వం పాటిస్తూ ఉన్న పద్ధతిలోనే ఉన్నది; దాన్ని ప్రవర్తింప జేసేసాధనాల్లో కాదు. ఎన్ని విధాలగానో మనం జోక్యం కలుగజేసు కొన్నాము,-ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ కూడా కలుగజేసు కొన్నాము; చర్యతీసుకొనీ, తీసుకోకుండా కూడా కలుగజేసి కొన్నాము. కాని, మన జోక్య మన్ని విధాలా నిష్ఫలమయింది. అగత్యములూ, అవసరములూ ఐన సంద ర్భాల్లో ఔదా సీన్యం వహించియుండి, అల్ప విషయాల్లో జోక్యంకలుగ జేసు కోవడమే మనం చేసిన పెద్ద తప్పు. లక్నో దర్బారుతో మనం చేసిన రాయ బారాల్లో ఒకనిష్కర్షమైన రాజనీతివిధానము లేకపోవడం, మరియొక ప్రత్యక్ష మైన దురదృష్టం. దేశీయ ప్రభువూ, ఆతని మంత్రీ ఏకమై, విదేశీయ సైన్యాల సాహాయ్యంతో, బ్రిటీషు స్థానికమంత్రి యొక్క ఆజ్ఞాప్రకారంగా స్థాపించిన పరిపాలన విధానంకంటే, దుష్టమైన పరిపాలన విధానం ఎక్కడా లభించదు"

ఈ విధంగా వివరించిన పిమ్మట, లారెన్స్ ఈ క్రింది విధంగా యుక్త సూచన చేసినాడు. "(బెంటింకు ప్రభువు 1831 జూలైలో కంపెనీ డైరెక్టర్ల సభకు పంపిన వివరణ పత్రికలో, కొన్ని నియమాలను అతడు సూచించినాడు). బెంటింకు ప్రతిపాదించిన నియమాలననుసరించి రాష్ట్రపరిపాలన సాగించడం అవసరము. సాధ్యమైనంత వరకూ రాజ్యపరిపాలన దేశీయమై ఉండవలెను. కంపెనీ వారి కోశానికి దేశం నుండీ ఒక్క రూపాయి కూడా చేరరాదు. ఔధ్

ప్రాంతంలో పరిపాలన ప్రత్యేకం రాజు ప్రయోజనార్థంగా కాక, అతనికీ, అతని ప్రజలకూ, ప్రయోజనార్థంగా జరుగవలసి ఉన్నది."

ఔధ్ ప్రాంతాన్ని కలుపుకోడానికిదివరకే నిశ్చయించుకొని ఉన్న డల్ హౌసి, ఈ హితవాక్యాలను త్రోసిపుచ్చి, వజీద్ ఆలీని సింహాసన భ్రష్టుని గావించెను. ఈ చర్యతో దేశమంతటా విరోధమూ, ఆగ్రహమూ ఒక్క సారిగా చెలరేగినవి. నవాబు లోపాలెట్టివైనా, దేశంలోని, ఉత్తమోత్తమ ప్రాంతము విదేశీయుల హస్తగతము కావడం, దేశంలో ఎవ్వరికీ నచ్చలేదు. రాజులు, తాలూకుదార్లు, ఉద్యోగులు, ఔధ్ నవాబు యొక్క ఆశ్రితులు, సైనికులు–హిందూ ముస్లిములు–అందరిలోనూ బ్రిటీషువారిపై ద్వేషమూ, భయభ్రాంతీ ఉత్పత్తిల్లినవి. బ్రిటీషువారి యొక్క వాగ్దానాలపై నమ్మకము పూర్తిగా విధ్వంసమయింది. ఈ రాజ్యసంయోజనాన్ని (Annexation) గూర్చి 'కేయ్' (Kaye) ఇచ్చిన నిర్ణయం ముఖ్యంగా గమనింపదగింది. "ఈ చర్యవల్ల భారతీయుల మనస్సులలో గాఢమైన దుర్భావము ఉద్భవించినదనడంలో సందేహము లేదు. ఈ చర్యకు వెనుకనున్న 'మానవత్వ'మనే ఉద్దేశము, మనము పొందిన లాభాల కారణంగా కళంకిత మయింది. ప్రజాక్షేమమే ఆశయమని బాహ్యంగా ప్రదర్శిస్తూ–స్వప్రయోజనాలను సాధించుకొంటూ ఉన్న మన ప్రవర్తన అంతా బూటకమనీ, నెపము మాత్రమే అనీ ప్రజలు చక్కగా అర్థం చేసుకొన్నారు."

"లక్షలాదిప్రజల దుర్భరస్థితికి ఆధారమైఉన్న నవాబుపరిపాలన సాగనివ్వడాని కింకా, బ్రిటీషుప్రభుత్వం సహాకరిస్తూ రావడం దేవుని దృష్టిలోనూ, మానవుని దృష్టిలోనూ కూడా పాపమే"— అనే నెపంతో, 1856 ఫిబ్రవరీ 13వ నాడు నవాబ్ వజీద్ ఆలీ యొక్క రాజ్యాన్ని బ్రిటీషువారు కబళించినారు.

ఔధ్ రాజ్యాన్ని చీఫ్ కమీషనరు రాష్ట్రంగా ఏర్పాటు చేసినారు. మొదటి చీఫ్ కమీషనరుగా నియమితుడైన లారెన్స (Lawrence), అన్ని వర్గాల ప్రజలలోనూ కలిసి, తిరుగుతూ, వారి హృదయ భావాలను గ్రహించడానికి పూనుకొన్నాడు. బ్రిటీషుప్రభుత్వంపట్ల వారికి రాజభక్తి లేదని అనుమానించినాడు. 1857 మే, 2వ తేదీన, అతడీ విధంగా వ్రాసినాడు:–

"సైన్యంలోని ఫిరంగులదళం యొక్క విశ్వాసాన్ని అనుమానించడానికి అవకాశాలు లేవు. ఐనా, అందులోని దేశీయాధికారులకు, అసహ్యం కలిగించిన చర్యలు జరిగినాయి. నేను తెలిసికొన్నంతవరకూ,— ఈ విరోధభావమనేది ఎక్కువగా హిందూసిపాయీలలో వ్యాప్తమైఉంది. మహమ్మదీయులు శీఘ్రమే, అధికోత్సాహంతో, భీషణవిద్రోహచర్యకు పూనుకోగలరు. మనం దేశీయులను మనతో సమానంగాచూచే అంతవరకూ,– అందులోనూ ముఖ్యంగా, మనతో సరిసమాన మైన హృదయభావాలూ, అభ్యుదయాశయాలూ, సామర్థ్య దౌర్బల్యాలను గ్రహించేశక్తీ– ఇత్యాదుల విషయంలో మనవంటివారే ఐన దేశీయసైనికులను మనతో సమానంగా చూచే అంతవరకూ మనము నిర్భయంగా ఉండలేము."

లోపలనే కుములుతూ ఉండిన ప్రతీకారాగ్ని, 1857 (May) మే నెల

శివనాడు, భగ్గుమంది. మీరట్‌లోని సిపాయీ లెదురుతిరుగక పూర్వమే, ఏడవ ఔధ్ సేనాదళం ఎదురు తిరిగింది. క్రొత్తగావచ్చిన తుపాకీతోటాలను (Cartridge) పంటితో కొరకడం నిరాకరించి, సిపాయీలు తుపాకులను క్రిందపారవేసి, పలాయనమొనర్చిరి. దానితో, భారతసామ్రాజ్యాన్ని రక్షించుకోడానికి ఆంగ్లేయులు మరల యుద్ధానికి దిగవలసి ఉంటుందని లారెన్స్‌కు దృఢాభిప్రాయం కలిగింది.

పంజాబు సరిహద్దుప్రాంతం కావడంవల్ల, దానిని ఎక్కువశ్రద్ధతో, చూడవలసి వచ్చింది. 1830 కాలంలో, పశ్చిమ ఆసియాలోని సందర్భాలు బ్రిటీషు సామ్రాజ్యానికి ఒక క్రొత్తపరిస్థితిని తెచ్చిపెట్టినవి. ఇరానుదేశాన్ని, రష్యా ఓడించి, టర్క్‌మాన్‌షాయ్ (Turkmanchai) ఒడంబడికను నిర్బంధంపై తీసుకొని, 1828 కాకేసస్ ((Cacsus కాక్‌సస్) ప్రాంతాన్ని ఆక్రమించి, క్యాస్పియను (Caspian) సముద్రపుప్రాంతంలో తన ఆధిపత్యాన్ని నెలకొల్పుకొంది. అది జరిగిన సుమారు రెండేడ్లకు పామర్‌స్టన్ (Palmerston) గాభరాపడి, పందొమ్మిదో శతాబ్దమంతనూ బ్రిటీషురాజనీతి ప్రముఖులను కలవరం చెందించిన ఒక పైశాచికభీతిని (Bogey) లేవదీసినాడు. రష్యాయొక్క వ్యాప్తి భారత దేశంవరకూ రాకుండాచేయడం, బ్రిటీషు విదేశాంగ విధానంయొక్క ప్రధానావసరమయింది. అట్లే, రష్యన్ సామ్రాజ్యానికీ, భారతసామ్రాజ్యానికీ మధ్య తటస్థ రాజ్యాలను (Buffer states) ఏర్పరచడం బ్రిటీషురాజనీతికి గొప్ప కర్తవ్యమయింది.

రష్యా పురికొల్పగా, ఇరాను దేశము ఆఫ్గనుస్థానుపై తనకు గల స్వత్వాన్ని (Claim) ప్రతిపాదించింది. తనకు కలిగిన నష్టాన్ని ఈ విధంగా, ఇరాను పూర్తి చేసుకోదలచింది. ఇరానుకు, ఇండియా సరిహద్దు ప్రాంతాలలో కలిగినఈఉద్దేశం, ఇండియాలోని బ్రిటీషుఅధికారులకు మనశ్శాంతి లేకుండాచేసింది.

రంజిత్‌సింగ్ మరణానంతరం అంతఃకలహాలకు లోనైయున్న పంజాబు రాష్ట్రం, బ్రిటీషు వారికి ఇపుడింకనూ ఎక్కువ ఆందోళన కారణమయింది. వారి పన్నుగడలు సిక్కులను పురికొల్పగా, యుద్ధము జరిగి, తుదకు పంజాబు బ్రిటీషువారి హస్తగతమయింది. ఇట్లు యాభై వేల చదరపు మైళ్ళ విస్తృతిగల సారవంతమైన పంటభూమీ, నలభై లక్షల మంది దృఢగాత్రులైన రైతులూ, బ్రిటీషు పరిపాలనలోకి వచ్చి చేరినారు.

పంజాబు రాష్ట్రానికి అపజయంతో పాటు, తీరని అవమానం కూడా జరిగింది. రాజ్యం నుండి తొలగింపబడిన దలీప్‌సింగ్‌ను, బ్రిటీషు వారు క్రీస్తుమతంలో చేర్చి, ఇంగ్లాండుకు ప్రవాసం పంపించినారు. లాహోర్ దర్బార్ యొక్క ఆస్తులను యాలం వేసినారు. బ్రిటీషు కిరీటాన్ని అలంకరించ డానికై కోహినూర్ వజ్రాన్ని ఇంగ్లండుకు పంపించినారు. అమృతసరులోని సిక్కుల స్వర్ణమందిరాన్ని (Golden Temple) చూడ డానికై వచ్చిన డల్‌హౌసీ ప్రభువు, పాదరక్షలతోనే, ఆ మందిర పవిత్రప్రదేశాలలో నిశ్శంకగా తిరిగినాడు.

నాగపూరును బ్రిటీషు రాజ్యంలో కలుపుకోవడం, వీరిదర్పానికి

స్వేచ్ఛావృత్తికి మరి యొక్క ప్రత్యక్ష నిదర్శనము. డల్‌హౌసీ, తన జ్ఞాపక సూచికలో (Minute) "న్యాయముతోనూ వివేకముతోనూ కూడిన విధానాన్ని వదలి, దయాదాక్షిణ్య భావాలతో కూడిన విధానాన్ని అనుసరించడం, అనే దాన్ని విమర్శాత్మకమైన నా నిర్ణయ జ్ఞానము ఎంతమాత్రమూ అంగీకరించదు", అని ఈ నాగ్‌పూర్ సంయోజన విషయమై వివరించినాడు. ఇట్లు డల్‌హౌసీ నిర్ణయించుకొన్న విధానంలోని అంతరార్థము వాస్తవంగా ఎట్టిదో, బ్రిటీషు పార్లమెంటులో ఉపన్యసిస్తూ డిస్‌రేలీ వ్యక్తము గావించినాడు. అట్లు విశదపరచడంలో ఆయన, డల్‌హౌసీ వ్రాసిన సూచికనే ఆధారంగా గ్రహించియుండడం గమనింపదగింది, "నాగ్‌పూర్ ప్రాంతాన్ని మన రాజ్యంలో కలుపుకోవడంతో ఎనభై వేల చదరపు మైళ్ళ విస్తృతిగల భూభాగమూ, దాని నుండీ వచ్చే నలభై లక్షల ఆదాయమూ, ఆ భాగంలోని నలభై లక్షల జనభా,- ఇదంతా మనకు లభిస్తుంది. ఈ భూభాగం బ్రిటీషు భాగంతో కలిసి, హైదరాబాదు నైజాము యొక్క ప్రాంతాన్ని పూర్తిగా చుట్టివేస్తుంది." విస్తారంగా ప్రత్తి పండించే బీరారు ప్రాంతం డల్‌హౌసీకి ఎక్కువ ఆశగొల్పింది. ఇట్టి దురాశకులోనై, కల్నల్ లో (Col Low), విలియమ్ మ్యాన్‌సెల్ (William mansel) గావించిన సదుపదేశాలను గ్రహించలేదు. ప్రజల మనఃభావాలనూ, న్యాయవివక్షతనూ గమనించక పోవడం దుష్టపరిణామాన్ని కలిగిస్తుందని వారు చెప్పినా వినక, డల్‌హౌసీ, మహారాష్ట్ర రాజ్యమును అంత మొందించినాడు.

సింధుదేశాక్రమణము, తుచ్ఛమైన క్రౌర్యానికి, ... తార్కాణము. ఈ క్రౌర్యప్రవర్తకుడైన, నేపియర్ (Napier) ఈ దురంతాన్ని బాహాటంగా బయటపెట్టినాడు;— "సింధుదేశాన్ని ఆక్రమించడానికి మా కేమాత్రమూ అర్హత, హక్కూ, లేదు; ఐనా, మేమాక్రమించి తీరుతాము. అట్లుచేయడం, తుచ్ఛమైన పోకిరీతనమైనాకూడా మాకు చాలా లాభదాయకమూ, ప్రయోజనకరమూ ఐనది." దొంగసంతకాలతో వ్యవహారపత్రాలను సృష్టించి, వాటి ఆధారంగా అమీర్లపై దోషారోపణలు నెరపి, యుద్ధాని కుపక్రమించినారు బ్రిటీషువారు. ఆడంబరములైన తమ జాతీయ వస్త్రాలనే ధరించి—— (తలపాగాలూ ఇత్యాదులూ) పురాతనములైన కత్తులనూ, బల్లెములనూ మాత్రమే ఉపయోగిస్తూ, అతిశౌర్య సాహసాలతో పోరాడిన ఈ అమీరు సైన్యాలను, బ్రిటీషుతుపాకులు రక్తప్రవాహంలో ముంచెత్తివేసినాయి. బ్రిటీషు వారు గావించిన ఈ పిచ్చిసాహసానికీ, వీరి పరిహాస జల్పపూరిత ప్రవృత్తికీ వెనుక దాగియున్న ప్రబలప్రయోజన మెటువంటిదో పామర్‌స్టన్ (Palmerston) బహిరంగ మొనర్చినాడు,— "సంభవనీయమైన రష్యన్ సిక్కుల కలయికను భారతభూమికి సుదూరంగా ఉంచడమే-మనముఖ్యోద్దేశము". అని ఇతని వాదము. దేశీయరాజులకు సంప్రదాయసిద్ధమై యున్న, దత్తస్వీకారాధికారాన్ని నిరాకరించి, ఇతర రాజులనేకులను పదవులనుండి తొలగించినారు. వారి గౌరవభృతులను కూడా తీసివేసినారు. ఈ విధంగా,- సతారా, రాయచూర్, నల్‌దుర్గ్,

కర్ణాటక, తంజావూరు, ఝాన్సీ, కరోలీ, సంభల్‌పూర్,- మున్నగు రాజ్యాల వంశాల వారందరినీ తొలగించి, ఆ ప్రాంతాలనూ, వారి ఆస్తులనూ వశపరచుకొన్నారు.

***భూస్వాములైన, కులీనులపై జరిపిన క్రూరచర్యలు :*** రాజుల తర్వాత బ్రిటీషువారి కుచర్యలకులోనైనవారు కులీనవంశస్థులు, సభ్యవర్గంవారైన తాలూకుదార్లు, జమీందార్లు, ఉన్నతశ్రేణి ప్రభుత్వోద్యోగులు, ఇత్యాదులు. ఈ వర్గంవారిని నిశ్శేషంగా నశింపజేయ బూనుకొన్నది బ్రిటీషుప్రభుత్వం. రాజుకూ, రైతుకూ మధ్యగల తేడాను ఎంతమాత్రమూ గుర్తించకపోవడమే, ఆనాటి రాజనీతి విధానంగా ఏర్పడింది." పెద్దరాజ్యాలను రూపుమాపే విధానము యొక్క పరిణామంలోని ఒకభాగమే, ఉన్నతవర్గాలవారి నాశనంకూడా. భారతీయ పరిపాలనవిధానాన్ని కూలద్రోసి, ఆస్థానంలో బ్రిటీషు నమూనాపై, బ్రిటీషు ఉద్యోగులతోకూర్చిన పౌరసైనిక సంస్థలను నెలకొల్పడంవల్ల, భారతీయ పాలకవర్గంలోని వారికి తావు లేకపోయింది.

కంపెనీ వారు నెలకొల్పిన భూమిశిస్తు విధానం కూడా ఇట్టిదే కావడం వల్ల ఉన్నత వర్గాలలోని వారి కెక్కడా ఆస్కారం లేక పోయింది. శాశ్వత వ్యవస్థాపిత క్షేత్రాలలో (Permanent Settlement areas),- పూర్వం నివసిస్తూ ఉండిన కుటుంబాలను తొలగించి, క్రొత్త తరహా భూస్వాములను నియమించినారు. రైతువారీ ప్రాంతాలలోని భూస్వాములు పూర్తిగా మాయమై పోయినారు. మరాఠాయుద్ధాల అనంతరమున్నూ, ఔధ్ నవాబు రాజ్యాన్ని ఒప్పగించిన పిమ్మటనూ,- "సమర్థులైన ఆంగ్ల ప్రబుద్ధులలో చాల మందికి భారతీయోన్నత వర్గాలలో సభ్యులని, గణింపబడిన వారెవరిపైనా సదభిప్రాయంకానీ, సహాన భావంకానీ లేదు. అందునూ ముఖ్యంగా ఉత్తర ఖండంలోని సభ్యసమాజం వారిని, ఆంగ్లేయులు సహించ లేక పోయినారు. వీరు విశాలమైన సానుభూతీ, విస్తృతియైన మానవత్వమూ కలవారే. ఐనా కూడా, దేశీయసభ్యతా వర్గాన్ని నశింపజేయడం తప్పక న్యాయసమ్మతమైనదని వీరి నిశ్చితాభిప్రాయము. కాబట్టి, ఆ వర్గంవారిపట్ల ఏ ఇతర సద్భావమూ వీరి హృదయాలలో ప్రవేశించలేదు.

***పశ్చిమోత్తర ప్రాంతాలూ,-ఔధు ప్రాంతమూ :*** దేశపు ఉపరిప్రాంతాల్లో, అధికార స్వామ్యము కల్గిన మూడు వర్గాలుండేవి. (1) జమీందార్లు, (2) తాలూకుదార్లు, (3) ముక్తకుల్క (మాఫీభాటక్) పట్టాదార్లు. మొదటి వారితో గావించుకొన్న ఏర్పాట్లు నిష్కర్షమైన సూత్రాల ననుసరించినవి కావు. ఐనప్పటికీ, భూమిపై ఖర్చులుపోగా, నికరంగా తేలిన పూర్తి ఆస్తిపై ప్రభుత్వానికి అర్హత కలదని ప్రభుత్వం వ్యాఖ్యానించింది. 1822 లో, మొత్తం జమాబందీ మూల్యంలో (భాటక మొత్తం) ఆరుభాగాల్లో, ఐదుభాగాలు ప్రమాణమైన భూమిశిస్తుగా నిర్ణయించినారు. 1833 లో దానినే, మూడు భాగాల్లో రెండుభాగాలని మార్చినారు. 1833 కూ, 1842 కూ మధ్య ఈ

విషయంలో జరిపిన నిర్ణయాలు, తప్పకుండా భూస్వాములనందరినీ నదును చేసి వేస్తాయని," పశ్చిమోత్తరప్రాంతం లెఫ్టినెంటు గవర్నరుగానుండిన టి. సి. రాబర్ట్‌సన్ (T. C. Robertson) అభిప్రాయపడినాడు. పాలకవర్గాలవారికీ, స్వయంగా పొలందున్ని పండించేవారికీ మధ్య, ఎట్టి అంతరమూ కనబడనీయకుండా, సంఘోపరి భాగాన్ని పూర్తిగా చదునుచేసి వేయటానికై ఉద్దేశించిన ప్రయత్నమిది, అని అతడు గ్రహించినాడు. పరిపాలనావిధానంలో దేశ్యస్థుల ఎట్టి మధ్యస్థ సంస్థయొక్క సహకారం కూడా ఉండకూడదనే ఈ ప్రయోగం, ప్రమాదకరమైనది. మనం కార్యరూపంలో పెట్టిన ఈ విధానాలన్నీ కుంజా అట్టి ప్రమాద స్థితిని తెచ్చిపెట్టునట్టివే అని నాకు తోస్తుంది."

1855లో, పన్నుల బేరీజు (పన్నుల నిర్ధారణ (Assessment) నవాగాన్ పూరునియమాల ననుసరించి, 50 శాతానికి కుదింపబడింది. ఈ పన్నుపద్ధతి, ఔధ్, మధ్యప్రాంతాలు, పంజాబు,- తర్వాత,- మద్రాసు, బొంబాయి రాష్ట్రాలలో కూడా వర్తించింది. కాని, సందర్భాలు మితిమీరిపోయిన తర్వాత వచ్చిన ఈ ఉపశమన చర్యకు, 1857లో వచ్చిన ఉపద్రవంపై ఎట్టి ప్రశమన ప్రభావమూ లేకపోయింది. అమితములైన ఈ శిస్తులను వసూలుచేయడంలో అవలంబింపబడిన విధానాలు అతి దుఃఖకరములైనవి. దీనివలన ఏర్పడిన పరిణామాన్ని (Kaye)కేయ్ ఈ విధంగా వర్ణించినాడు. "కనుచూపు మేరవరకూ విస్తరించియున్న పంట పొలాలకు అధికారులైన భూస్వాములు, మనము ప్రవేశపెట్టిన ఈ శిస్తువిధానం కారణంగా, మట్టిగుడిసెల కాపులుగా కృశించిపోయినారు. వంటకుండలుమాత్రమే వారి ఆస్తిగా మిగిలినాయి".

ఔధ్‌లోని తాలూకుదార్లకు నిర్వివాదమైన మిరాసీ హక్కులుండేవి. భూములపై స్వామ్యాధికారము వహించియున్న పురాతన భూస్వాముల కులీన వర్గం వీరిది. ఔధ్ ప్రాంతాన్ని సంయోజనపరచుకొన్న (కలుపుకొన్న) 1856 నాటికి, ప్రాంతంలో మూడింట రెండవభాగం వారి స్వామ్యమై ఉండినది. కాని, బ్రిటిషువారు వీరిని "పన్నులు వసూలుచేసే మధ్యవర్తులుగా" మాత్రమే పరిగణించినారు. రాజస్వవ్యవస్థాధికారుల (Settlement officers) వాదాన్నిబట్టి "తాలూకుదారులు దురహంకారులూ, వంచకులూను. తాలూకుదార్లను తీసివేయడం, పులిని కాల్చివేయడంతో సమానమైన మహాకార్యమని, ఈ అధికార్లలో కొందరి యువకుల అభిప్రాయము. వారి అభిప్రాయానుగుణంగానే జరిగింది. వారు గావించిన ఈ సమగ్ర నిర్మూల విధానాన్ని చూచి, ఈ చర్యకు విరుద్ధులైన వారు కూడా 'సెబాస్' అని మెచ్చుకోవలసిన వారైనారు. ఈ మహోద్ధతమైన సమతలీకరణము, సర్వాన్నీ, మూలధాతుపులస్థితిలోనికి విచ్ఛిన్నం చేసింది; ఆదిమమానవుడైన 'ఆడమ్'ను (Adam) త్రవ్వి పైకి తీసింది".

హోమ్స్ చెప్పిన (Holmes) విధంగా "ప్రసిద్ధుడైన రాబర్ట్ మెర్టిన్స్ బర్డ్ (Robert Mertins Bird) వ్రాతలచే ప్రేరితులైన ఈ అధికారులు అమితసంఖ్యాకులకు అమితమైన సౌఖ్యాన్ని అభివృద్ధి చేసేభావంతో ఆవిష్టులై,

తాలూకుదార్లను పనికిరాలిన సోమరులక్రింద జమకట్టినారు. తదనుగుణంగా వారి అధీనంలోనున్న భూభాగంలో ప్రతి అడుగుకూ వారికిగల స్వామ్యాన్ని, అధికార పత్రాలద్వారా సమర్థించవలసిందని కోరుతూవచ్చినారు. ఆ అధికార పత్రాలు, తమ ఆంగ్లేయన్యాయవాదికి సంతృప్తి నివ్వకపోతే, ఆ భూములు బ్రిటీషువారికి చెంది పోతూవచ్చినాయి".

ఈ విషయాన్నిగురించి, కేయ్ (Kaye), - "రాజస్వవ్యవస్థ అనే చీపురుకట్ట, శేషించియున్న కులీన భూస్వాముల నందరినీ, వారి శ్రీమంత స్వత్వ స్థానములనుండి బైటికి ఊడ్చివేసింది; వారి భూములకు న్యాయసమ్మతంగా, కాపుయజమానులనే ఒక తెగవారు వారసులని గుర్తింపబడింది". అని వ్రాసినాడు.

దృష్టాంతంగా, 577 పల్లెలపై అధికారం వహించి, సాలుకు 20,000 పౌనులు శిస్తురూపంగా ప్రభుత్వానికి చెల్లిస్తూ ఉంగిన మహారాజామాన్‌సింగ్‌కు ఆరు పల్లెలను మాత్రమే వదలి, తక్కిన భూభాగాన్ని ప్రభుత్వం, అధీనం చేసుకొంది. అతడు చెల్లించవలసినశిస్తు 300 పౌనులకు తగ్గింపబడింది. మరియొక తాలూకుదారు, తన అధీనంలో నుండిన 378 గ్రామాలలో 266 నీవిధంగా గోల్పోయినాడు. మరియొకడు తన స్వామ్యంలోని 204 గ్రామాలలో 155 ను పోగొట్టుకొన్నాడు.

శిస్తులేకుండా అనుభవిస్తూ వచ్చిన పట్టా భూములను ప్రభుత్వం పునర్గ్రహణము చేయడం, ఈ వర్గంవారికి కష్టస్థితిని కల్గించిన రెండవ విధానము. రాష్ట్రానికి యోగ్యమైన సేవచేసిన కారణంగా వీరి పూర్వీకులకు లభించి, వారసులకు సంక్రమించినవి ఈ మాన్యాలు. మొఘల్ సామ్రాజ్యం క్షీణదశలో ఉండిన అవ్యవస్థాకాలంలో, కొన్ని మాన్యాలు అక్రమంగా కొందరికి లభించి యుండడం కూడా సంభవమే. కాని, మొత్తం అన్ని మాన్యాలనుగూర్చి విచారణ జరగడానికి ఆజ్ఞ అయింది. తత్ఫలితంగా జరిగినది, కేయ్ (Kaye) వ్రాతలో వ్యక్తమౌతుంది. "పునర్గ్రహణాధి కారిని (Resumption officer) సమగ్రాధికారంతో, దేశంపై విశృంఖలంగా వదలడం జరిగింది. స్వామ్యపత్రాలను (Titles or Title deeds) ప్రదర్శించి, వాటి ప్రామాణికతను ప్రభుత్వాధికారికి సంతృప్తికరంగా రుజువు చేయవలసిందని కోరినారు. ఏ కలతా లేకుండా, ఇంతకాలం నుంచీ తమ అనుభవంలోనున్న మాన్యాలకు, ఇన్ని ఏండ్లతరువాత, ప్రమాణాన్ని రుజువు చేయవలసిందని కోరడం, నిజంగా ఘోరం. ప్రత్యక్షంగా అనుభవంలో ఉండడంకంటె వేరే సాక్ష్యమేది? అంతతో, (రక్తపాతంతోటి) రౌద్రప్రభుత్వమారంభమయింది. ఆ పిమ్మట జరిగిన సంఘటనాన్ని, 'మొత్తంగా జప్తీచేసి కోవడం , అని నిస్సందేహంగా వర్ణించవచ్చును.

ఈ విధంగా మాన్యాలను గోల్పోయిన వారిలో చాలమంది విద్వాంసుల వర్గానికి చెందినవారు. పండితులై , గురువులుగా మత సంబంధమైన ఆరాధనలు జరుపుతూ, మత సంస్థలను నెరవేరుస్తూ ఉన్న ఉలేమాల (Ulamas) పోష

ణార్థమై నియోగింపబడిన మాన్యాలన్నీ ఈ విధంగా ఆక్రమించుకోవడంతో, వారి జీవనోపాధికీ, వారి హక్కులకూ, భంగం కలిగింది. దీనివల్ల వారి హృదయాలు వ్యాకులములై, కడుపులుమండి, వీరికి తీవ్రశత్రుత్వాన్ని కలిగించడం ఒక ముఖ్యపరిణామము. ప్రజలు చెలరేగి, బ్రిటీషుప్రభుత్వాన్ని ధిక్కరించడంలో మౌల్వీలు ఎక్కువగా దోహదం చేసినారనడం బాగా విదితమైన విషయమే.

బ్రిటీషువారు ప్రవేశపెట్టిన ఈ పన్నుల విధానం, చిన్న భూస్వాములకు కూడా పీడాకరమయింది. వాస్తవానికి, చిన్న భూస్వాముల సంఖ్యే ఎక్కువగా ఉండేది. రజపుత్రులు, బ్రాహ్మణులు, జాట్‌లు, గుజార్,–మున్నగు కులాల వారందరూ, చిన్న జమీందారీ వర్గంలో ఉన్నారు. పూర్వపు ప్రభువులు శాసనబద్ధంగా ఇచ్చిన పట్టాహక్కులపై, జరిగిన ఈ దాడి స్వామ్యదారులైన చిన్న భూస్వాములకు మాత్రమేకాక, సిపాయిలకు కూడా, తీవ్రకష్టాలను కలిగించింది. సిపాయీలు, చాల వరకు, ఈ చిన్న భూస్వాముల కుటుంబాల నుండి వచ్చిన వారే. భూములపై వచ్చే ఆదాయము, కుటుంబపోషణకు చాలనందువల్ల, ఆ కుటుంబాలలోని యువకులు సైన్యంలో చేరి, పొట్టపోసుకోవలసి వచ్చింది.

*రైతువర్గం వారికి కలిగిన అసంతృప్తి, విసుగు* : రైతువర్గం వారికి గూడా స్వాస్థ్యం లేక పోయింది. "గంగానదికి అవతల నున్న పరగణాలలో విప్లవానికి దోహదంచేసిన కారణాలు వేరు. చాలవరకు, మత విషయాలకి సంఘటనలతో సంబంధంలేదు. ఈ ప్రాంతం, బ్రిటీషువారికి దత్తుగకాక పూర్వం, పెద్ద తాలూకాలలోని గ్రామాలన్నీ ఠాకూర్ కుటుంబాల స్వామ్యములై ఉండేవి. స్వాభావికంగా అమిత వ్యయపరులైన పాతజమీందారులు, దోపిడీ జీవనానికి అలవాటు పడినవారు. వారి అతివ్యయకరమైన జీవనమే వారి వినాశానికి కారణమయింది. మన పరిపాలనకూ శాసనాలకూ గురియై, వారి ఆస్తిపాస్తులన్నీ జప్తీ ఐపోయినవి. ఐనప్పటికీ, రైతులకూ బీదవర్గాల వారికీ ఈ జమీందారులపై ఉండిన భక్తి గౌరవాలేమీ తగ్గలేదు; ఆస్తులను జప్తులో కొన్నవారిపై అభిమానమూ ఏర్పడలేదు. కాలంకూడా ఈ విషయంలో మార్పుతేలేక పోయింది. పూర్వపు జమీందారులూ, వారి కుటుంబాలూ, గ్రామవాసులలో అధికమైన పలుకుబడికలవారై ఉంటూ వచ్చినారు. అనేక సందర్భాలలో బీదవర్గాలవారు వీరికి ఒక విధమైన కప్పము చెల్లిస్తూ ఉండడమూ, దానికి ప్రతిఫలంగా వారి సహాయాన్ని పొందడమూ జరుగుతూ ఉండేది".

"ఆస్తులను జప్తులో కొన్నవ్యక్తి, సాధారణంగా, పట్టణంలో నివసిస్తూ, తన గ్రామాన్ని చూడడానికి వచ్చేవాడు. పన్నులు వసూలు చేసుకోవలసిన హేయకర సందర్భాలలోనూ, తన నిర్ణయాలను నిర్బంధంగా జరిపించే సందర్భాలలోనూ మాత్రమే రాకతప్పేదికాదు. కాబట్టి, గ్రామస్థులు తమ జమీందారుల పక్షంలో ఉండి, వారిని సమర్థించే వారు. పరిస్థితులీ విధమై ఉండగా, తమ పూర్వపుస్థితిని మరల సంపాదించుకోడానికై సైనికుల విప్లవోద్యమము, దివ్య

మైన అవకాశమయింది. ప్రథమంగా, పాశ్చాత్యులకు చెందిన ప్రతిదాన్నీ దోచుకోవడానికీ, నశింపజేయడానికీ పూనినారు. అంత, తమ పూర్వపు మాన్యాలను వశంచేసుకొన్నారు".- 1857 వ నాటికి మహా విప్లవ సంఘటనలను గూర్చి, ప్రభుత్వము ప్రచురించిన వృత్తాంత కథనము ఈ విధంగా ఉంది.

రైతువారీ ప్రాంతాల్లో కూడా, పరిస్థితులింత దుర్భరంగానే ఉండినవి. బొంబాయి రాజధానిలోని మిరాసిదార్లు తమకు వంశపరంగా సంక్రమించిన భూములను అనుభవిస్తూ, నిష్కర్షమైన భూమిపన్నును చెల్లిస్తూ ఉన్నంతకాలమూ, వారి ఆస్తిని గ్రహించడానికి ప్రభుత్వానికధికారంలేదు. ఐనా, బ్రిటీషు ప్రభుత్వం, ఈ మిరాసిదార్లందరినీ, నిర్మూలించివేసింది.

మొత్తం పంటలో 55 వ శాతం, ప్రభుత్వంవారికి చెల్లించవలసిన, కిస్తుగా, ప్రింగల్ (Pringle) 1824-28 కాలంలో నిర్ణయించెను. దీని పరిణామంగా, వ్యవసాయదార్లు తమ పొలాలను వదలివేయడమూ, విశాలంగా పంటపొలాలు బంజర్లుగా పర్యవడడమూ జరిగింది. 1835 లో పై తప్పు కొద్దిగా సవరింపబడింది. ఐనా, సర్ జార్జ్ క్లార్క్ (Sır Geoge Clark) పార్లమెంటు ఎదుటనుంచిన సాక్ష్యాన్నను సరించి,-"రైతువారీ ప్రాంతాల్లోని ప్రజల పరిస్థితి పాపర్ల (Paupers-రిక్తులు-దివాలా తీసినవారు) పరిస్థితియై" ఉన్నది. 1817-1835 మధ్య కాలంలో పంటపొలాల ఆదాయం ద్విగుణీ కృతం-(రెండింతలు) అయింది. 868,000 పౌనులనుండి, 1,5,35,000 పౌనులకు పెరిగింది ఆదాయం.

మదరాసులో కూడా పరిస్థితులింతకంటే భిన్నమైనవి కావు. 1820 లో ప్రారంభించిన రైతువారీ పరిష్కారం 1827 లో పూర్తి అయింది. రమేశదత్ చెప్పినదాన్ని (Ramesh Dutt) అనుసరించి, దీనిపరిణామము "మదరాసు రాజధాని, ముప్పది సంవత్సరాల దీర్ఘకాలం అనుభవించిన వ్యావసాయక దుస్థితికీ, అధికార క్రౌర్యానికీ, సదృశమైనది, ఇండియాలోని ఏ ప్రాంతంలోనూ, ఏ యుగంలోనూ కానరాదు."

తరువాతి కాలంలో జరిగిన రైతువారీ పరిష్కారాలవల్ల పరిస్థితులలో ప్రయోజనమైన మార్పు ఏదీ కలుగలేదు. "వ్యవసాయదారుడు 'దినకూలి, దిన వెచ్చంగా' బ్రతుకుతూ, అప్పులపానికి; సర్వదా రుణపడి యున్నాడు." అని 1852-53 లో తెలిపినాడు.

ఉత్తర ఖండంలోని ప్రజలు విప్లవోద్యమంలో పాల్గొన్నట్లుగా, మద్రాసు బొంబాయి ప్రాంతాలవారు చేయలేదు అంతమాత్రంతో వీరికి బ్రిటీషు ప్రభుత్వంపట్ల అసంతృప్తి ద్వేషమూ, లేదని కాదు. కారణంవేరు. రైతువారీ పరిష్కారం మూలంగా, బొంబాయిలోని మిరాసుదార్లూ, మద్రాసు ప్రాంతంలోని పాళెయగార్లూ, జమీందార్లూ, చాలావరకూ తొలగింపబడిరి. అందువల్ల, ఈ రెండు ప్రాంతాలలోనూ ఉద్యమ నిర్వహణకు నాయకులు లేకపోయినారు. అందువల్ల-ప్రజలకు నాయకత్వం లోపించింది.

బ్రిటీషువారిపట్ల గల అసంతుష్టి, ద్వేషమూ, దేశమంతటా సర్వసాధా-

రణమే ఐనా, దేశంలోని కొన్ని ప్రాంతాలలోని కొన్ని వర్గాలలో ఈ భావము అధికమై యుండిన దనడము వాస్తవమే. ఆయా ప్రదేశాల్లోని విభిన్నమైన భూమిపన్ను వ్యవస్థా విధానమే, ఇందుకు కారణము. కాలక్రమేణంగా ... (పన్ను నిర్ణయం) మారుతూ ఉన్న జమీందారీ విధానపు ... ప్రాంతాలలో పన్నుల పునర్నిమర్శవల్ల అతి... పరిస్థితులను ... ప్రజలు, ఆర్థిక దుస్థితులకు గురియై, పీడాకారమైన ప్రభుత్వాన్ని పడగొట్టడానికి అధికోత్సాహం ప్రదర్శించినారు. తక్కువ పేరీజును నిష్కర్షగా, శాశ్వతంగా ఏర్పరచియున్న ప్రాంతాలలోని ప్రజలు ఎదురు తిరగడానికి ఉద్రిక్తులు కాలేదు.

పంటభూముల పరిపాలనా విషయంలో అనేక ప్రయోగములకు (Experiments) గురియైన బెంగాలు ప్రాంతము, ప్రాథమికదశల్లో అపరిమితమైన కష్టాలకూ, దుఃఖాలకూ, లోనయింది. కాని, శాశ్వత పరిష్కారం జరిగిన అనంతరము, పూర్వపు కష్టపరిణామాలు క్రమంగా క్షీణించిపోవడంతో పరిస్థితులు తేలిక ఐనాయి. 1930 ప్రాంతంలోని భూస్వాములు అభ్యుదయమైన యుగంలో ప్రవేశించినారు. 1857 ప్రాంతంలోని ఆదాయము వారికి ... కలిగించింది. ఈ వర్గాలకుచెందిన యువకులు ఇంగ్లాండులోని ... విశ్వవిద్యాలయాలలోను ప్రవేశించగలిగినారు. విద్యాభ్యాసానంతరం, ఉద్యోగ సంపాదన విషయంలోకూడా వారికి కష్టం కలుగలేదు. ప్రభుత్వపు కొలువు లోనో, లేదా, స్వతంత్రమైన వృత్తులలోనో, వారికి అవకాశం దొరికింది.

క్రొత్తగా వచ్చిన భూస్వాములు వివిధ కులాలనుంచి వచ్చినవారు. పరిపాలనా విధానంకానీ, యుద్ధ విధానంకానీ, ఎరుగనివారు వీరు. విదేశీయ ప్రభుత్వాన్ని వీరంగీకరించినారు. పూర్వపు ప్రభువులస్వేచ్ఛా ... పరిపాలనా విధానానికి భిన్నమైన, సక్రమమూ, క్రమబద్ధమూ ఐన విదేశ ప్రభుత్వపు వ్యవస్థను, వీరు శ్రేష్ఠమైనదిగా గ్రహించినారు. నవాబుల స్వామి ... పునరుద్ధరించడానికి వీరు విముఖులు. విద్రోహంపట్ల వీరికి సానుభూతిలేదు. కలకత్తా పత్రికయైన "హిందూ స్వదేశాభిమాని" తన అభిప్రాయాన్ని ఈ విధంగా వ్యక్తంచేసింది.

ప్రకృతినిబట్టీ, విద్యాసంప్రదాయాన్నిబట్టీ కూడా, ఈ ప్రాంతాలలోని ప్రజలు విద్రోహచర్యకు బూనుకొన్న సైన్యంలో చేరేవారు కారు. దేశంలోని శాంతి భద్రతలకు భంగం కలిగించేవారిపట్ల, వీరి కాదరాభిమానాలు లేవు. అట్టి వారికి రక్షణకూడా వీరివల్ల లభింపదు. సైన్యానికి నాయకత్వంవహించి, యుద్ధ రంగానికి నడిచి, కీర్తిప్రతిష్ఠలు సంపాదించే ఆశయము, బెంగాలీలకు సహజంగా లేదు. మహోద్దేశసాధనకై ఆత్మబలిగావించి, నిరాధారమైన జీవితానికి ... ధర్మవీరులు కూడా కారు. వారనుసరించే ఆశయాలూ, సాధించే విషయాలూ కూడా నాగరిక జీవితసంబంధులు. సుస్థిరమూ, సర్వతోముఖసమర్థమూ ఐన బుద్ధిమంతులు కనుక, వీరు సమస్యలను గాఢంగానూ, దూరదృష్టితోనూ పరిశీలించ గలరు. తమ ప్రశాంతజీవితవిధానానికీ, మానసికాభిరుచులకూ, బ్రిటీషుపరిపాలన

అత్యంతమూ అనుకూలమైనదని వీరి భావము. విజితజాతివారైన తమ స్థితికి అనురూపమైన విధంగా, ఉచ్చయ స్థితిని తాము సాధించుకోవచ్చునని వీరి ఆశ. శాసనబద్ధంగానూ, రాజ్యాంగానుసారంగానూ, విజ్ఞప్తులుగావించి బ్రిటీషు వారి సద్భావాన్నీ, నిష్పక్షపాతబుద్ధినీ లోగొనవచ్చుననీ, పిమ్మట సార్వభౌమ మండలిలోనో-లేదా-పార్లమెంటులోనో, తమ ప్రతినిధులకు స్థానం కల్పించ వచ్చుననీ వీరి ఆశ. అట్టి పరిస్థితి ఏర్పడి సదవకాశం సిద్ధించగానే తాము కూడా విదేశపాలకులతో సమానమైన ప్రతిపత్తిని పొందగలమనీ భావించినారు. పిమ్మట, ఏషియా అంతటిలోనూ సువిశాలమైనదీ, సుస్థిరంగా నెలకొల్పబడినదీ ఐన, భారత సామ్రాజ్య వ్యవహారాలను నడిపే గౌరవాన్నీ, బాధ్యతనూ, తాము కూడా విదేశపాలకులతో సహా, సమానంగా పొందగలమని, వీరి ఆశ. ప్రస్తుతం జరుగుతున్న కల్లోలాల కారణంగా దేశమెంత అవ్యవస్థితికి వచ్చిందీ, ఎంత వెనక్కి తగ్గిందీ,-అనే విషయాన్ని, తక్కిన ప్రాంతాలవారికంటే ఎక్కువగా వీరే గ్రహించినారు.

*మధ్య ప్రాంతాలు :* 1818లో మహారాష్ట్ర రాజ్యాన్ని, పడగొట్టడంతో, ఉత్తర ప్రాంతాలుగా ఏర్పడియున్న రాజ్యాలు బ్రిటీషువారికి చేజిక్కినవి. వెంటనే, భూమిపన్నుల పరిష్కార విషయమైన కార్యక్రమం ఆరంభమయింది. ప్రభుత్వానికి చెల్లింపవలసిన బేరీజుమొత్తం అధికమైనది కావడమూ, పునర్విమర్శనాకాలము (Period of Revision) అల్పం కావడమూ,-అనేవి ఈ పరిష్కార విధానంలోని ముఖ్యాంశాలు, 'మాల్ గుజార్లు' అని వ్యవహరింప బడే భూస్వాములు, ఈ భూములకు అధికారులుగా నియమితులైనారు. అమ్మకమూ, తాకట్టు పెట్టడమూ,-అనే విశేషాధికారాలుకూడా, వారికి ఇదివరలో ఉన్న అధికారాలకు చేర్చడం జరిగింది. అతి ఘోరమూ, హేయమూ ఐన పద్ధతిలో నిర్ణయమైన పన్నులను వసూలుచేయడంలో, క్రూరవిధానం పాటించినందువల్ల, ఇతర ప్రదేశాలలో సాధారణంగా జరిగిన పరిణామమే, ఇక్కడ కూడా ఏర్పడింది హోషంగాబాద్, సియోనీ జిల్లాలలో బేరీజుమొత్తం సాలుకు 1825 నాటికి, 2277 పౌనులనుండి, 13877 పౌనులకు-పెరిగింది. ఇంత అధికమైన శిస్తు వసూలు సాధ్యం కాకపోవడంతో, దానిని 6192 పౌనులకు తగ్గించవలసివచ్చింది. తగ్గింపబడిన ఈ మొత్తంకూడా, మహారాష్ట్రుల పాలనలో, నియమింపబడిన మొత్తానికంటే, మూడురెట్లు అధికమైనది. నరసింగ్‌పూర్, దమోహ్, సాగర్, నర్మదా, ప్రాంతాలలో జరిగిన కథకూడా ఇదే. 1838లో నాగ్‌పూర్‌ను సంయోజనపరచుకొన్న తర్వాత, - ఆ ప్రాంతంలోకూడా ఈ విషయమే సాగింది.

హింసాకాండ, క్రౌర్యమూ, ఆస్తి విలువలు క్షీణించడము, ప్రాంతాలు నిర్మానుష్యంకావడము, దుష్టపరిపాలన,-ఇత్యాదులన్నీ జిల్లాలలోకూడా సాధారణములైనవని, వృత్తాంతాలు వచ్చినాయి. అసంతుష్టి, ద్వేషమూ, అన్నివైపుల వ్యాపించినాయి. ఈచర్యలదుష్పరిణామ ఫలాన్ని,1857లో అనుభవించడంజరిగింది.

*పంజాబ్ :* 1849లో, పంజాబ్ రాజ్యాన్ని చివరకు, బ్రిటీషువారు తమలో కలుపుకొన్న తరువాత, భూమి పరిష్కారానికి పూనుకొన్నారు. భూమి పన్నులను అధికంగా నియమించడంవల్ల ఇతర ప్రాంతాలలో ఎట్టి పరిణామం కలిగినది అనే విషయం, వీరి ప్రత్యక్షానుభవంలోనిదే. కనుక, పంజాబులో, భూమి పన్నుల పరిష్కారాన్ని, ఎక్కువ మెలకువతో జరిపించినారు. భూములు కొలవడం, పంటలను మదింపు (మతింపు–Valuation) చేయడం, శిస్తులు రీజు వేయడం (Assessment), – మొదలైనవన్నీ గ్రామకరణాల సహాయంతోనూ, గ్రామ సంఘాల ప్రతినిధుల సాహాయ్యంతోను జరిపించినారు. 1850లోని పన్నుల వసూలు, సిక్కుల ప్రభుత్వం నాటికంటే 25 శాతం, తక్కువగా నిర్ణయమయింది. 1857-58 సంవత్సరపు నివేదిక, – "రైతువర్గాలవారు సుఖంగానూ, నిమ్మళంగానూ ఉన్నారు. పరిస్థితు లెవరికీ ఇబ్బందులు కలుగజేయుటలేదు. మార్పుకోసం ఎవ్వరూ, ఎదురుచూడడంలేదు." — అని పరిపాలన విధానం ఫలితార్థాన్ని వివరించింది.

విప్లవ దినాల్లో పంజాబు ప్రాంతము, ఇతర ప్రాంతాలకంటే ఎక్కువ శాంతితో ఉండడానికి కారణము, ఆ ప్రాంతపు పన్నుల భారము తేలికకావడమే అని చెప్పవచ్చు.

*హింసాకాండను ప్రయోగించడము :* పన్నులు వసూలు చేయడంలో ప్రభుత్వం హింసాకాండాను ఉపయోగిస్తున్నదని, ఎలియట్ (Elliot), నార్టన్ (Norton), స్టోక్స్ (Stokes), అనే ప్రముఖులు 1855లో తెలియజేసినారు. పన్నుల వసూళ్ల సందర్భంలోనూ, పోలీసు కేసులదర్యాప్తు సందర్భాలలో, కూడా, ప్రజలను హింసాకాండకు గురిచేస్తున్నారనీ, అందువల్ల ప్రజలు చాలా బాధలకు లోనైయున్నారనీ, కంపెనీవారిపై చేయబడిన ఆరోపణ తీవ్రమైనది. ఈ విషయమై ఒక దర్యాప్తు సంఘాన్ని, ఏర్పరచవలసిందని కోరుతూ, 1854 జూలై 11వ తేదీ, బ్లాకెట్ (Blocket) కామన్సు సభలో ప్రతిపాదించినాడు. "విధింపబడిన పన్నులు అతి దుర్భరమైనవి కావడంవల్ల, దౌర్భాగ్యులైన రైతులు చెల్లింపజాలక, రాక్షస నిర్బంధ విధానాలకు లోనై, నేలమట్టమైపోయినారని," అతడు వివరించినాడు. "పన్నులు వసూలు కాకపోగా, ప్రభుత్వ విధానము సహింపరాని హింసాయంత్రంగా మారిపోయి, శోషించియున్న రైతుజనాన్ని పీల్చి పిప్పిచేసింది. ఈ విధానానికి లోనైన ప్రజలస్థితి హృదయవిద్రావకమైయున్నది. అప్పులభారంతో క్రుంగిపోయి, దిక్కులేనివారై, రోతపుట్టించే దారిద్ర్యంతోనూ, దుఃఖభారంతోనూ, వస్తులతోనూ, అటమటిస్తూ, దైహికంగానూ మానసికంగానూ, కూడా, రైతులు భూమిపై చాపకట్టుగా కూలిపోయినారు." డ్యాన్‌బీ-సేమర్ (Danby seymour) అనే సభ్యుడు ఈ విషయమై మాట్లాడుతూ, "ఎనిమిది షిల్లింగులుమాత్రమే ఉన్న వ్యక్తినుంచీ, ఏ విధానైనా, పది షిల్లింగులు రాబట్టడమే, మదరాసు ప్రభుత్వం యొక్క ఘనమైన ఉద్దేశం అనడం నిజము. ఆవిధంగా రాబట్టడం సర్వదా సాధ్యంకాకపోవడంతో, పూర్వ

శతాబ్దపు ఆరంభదశలో ప్రయోగించిన హింసాకాండకు సదృశమైన, హింసాత్మక విధానాన్ని ప్రయోగించి, తమ మహోద్దేశాన్ని, సాధించుకోవలసి వచ్చింది". అని దోషారోపణ గావించినాడు. "భూములు సారవంతమైనవి కాక పోలేదు. కాని, పన్నులభారము అమితంకావడంవల్ల, భూములను సాగుచేసికూడా రైతు ఏ మాత్రమూ లాభం పొందలేక పోయినాడు." అని జాన్ బ్రైట్ (John bright) విశదంచేసినాడు. అత డీ విషయాన్ని రుజువుచేస్తూ, ఆంగ్లేయు లిచ్చిన సాక్ష్యాన్నే ప్రమాణంగా ఉద్ఘాటించాడు. జిల్లాకలెక్టర్లూ, కూడా ఆంగ్లేయులే. పన్నులవసూలుకై హింసాకాండ ప్రయోగింపబడిందని వారుకూడా వ్రాసియున్నారు. ఈ చర్చలో పాల్గొంటూ, ఆట్వే (Mr. Otway), థియోబాల్డ్ (Mr. Theobald) అనే కలకత్తా బారిస్టర్, తనకు వ్రాసినదాన్ని ఉదాహరిస్తూ, "అన్ని విధాలైన దుర్మార్గాలూ, దుష్కార్యాలూ, అధికార దుర్వినియోగాలూ, ఇండియాలో పెచ్చు పెరిగిఉన్నాయి. హింసాకాండ జరుగుతూ ఉన్నదని మీరు కనిపెట్టిన విషయము నాకేమాత్రమూ క్రొత్తకాదు. కలకత్తాలోని ప్రతి పోలీసు చెరసాలలోనూ జరుగుతూఉన్న విషయమిది, అని నా విశ్వాసము. ఇతర పట్టణాల్లోనూ, గ్రామసీమల్లోనూ, కూడా, ఇది ధారాళంగా జరుగుతూ ఉండడం నేను స్వయంగా ఇంతకుముందే చూచినాను." అనే సత్యాన్ని బయట పెట్టినాడు.

బ్లాకెట్ తెచ్చిన ప్రతిపాదన ఐదు వోట్లతేడాతో (మాత్రమే) ఓడిపోయింది. అంతట, ఆల్బర్ మార్ల్ ప్రభువు (Earl of Albermarle),-ఇండియా ప్రజల కష్టస్థితులను తొలగించ వలసిందిగా కోరుతూ, 1855 జూలై 16 వ తేదీనాడు, ఒక అర్జీని దాఖలు చేసినాడు. మదరాసు రాజధానిలో హింసాకాండ జరిగిందన్న ఆరోపణను గూర్చి, దర్యాప్తు జరపడానికై నియమింపబడిన కమీషనర్ల నివేదికను (Report) పరిశీలించవలసిందని ఆల్బర్ మార్ల్ ప్రభువు తన అర్జీలో, కోరినాడు. రెవిన్యూ, పోలీసు శాఖల్లో, అవలంబించ బడుతూ ఉన్న హింసాకాండ యొక్క స్వభావాన్నీ, పద్ధతులనూ, వ్యక్తం గావించిన ఈ నివేదిక, తన తుదినిర్ణయాన్ని వివరిస్తూ, "దేశీయులైన రెవిన్యూ అధికారులూ, పోలీసు అధికారులూ, అలవాటుగా జరుపుతూ ఉన్న వ్యక్తి హింస (Personal Violence), జులుం,-ఇవి రాజధాని అంతటా వ్యాప్తమై ఉన్నవి. పన్నుల వసూళ్ళలోనూ, పోలీసు కేసులసందర్భాల్లోనూ, కూడా, ఇది సర్వత్రా జరుగుతూ ఉంది". అని నిష్కర్షగా అభిప్రాయమిచ్చింది.

ఈ విషయాలనుగూర్చి నిష్పాక్షికంగా గమనించి, విచారించిన మార్టిన్ (Commander Martin) అనే ఫ్రెంచి సేనాధిపతి, "1857 లో ఉప్పతిల్లిన ఘోరచర్యలవల్ల, ఆంగ్లకుటుంబాలనేకాలు దుఃఖాక్రాంతం కావడానికి, కంపెనీ వారి చర్యలే కారణాలు. ఈ దురంతాలకు కంపెనీవారే బాధ్యులని చెప్పక తప్పదు. బ్రిటీషు ప్రభుత్వంపై తిరుగుబాటు చేసిన విద్రోహుల క్రూరచర్యల పట్ల యూరోప్ ఖండమంతా ఆగ్రహం ప్రదర్శించిందికదా ! ఆ చర్యలను

లేకెత్తించిన మూలకారణమేది ? కంపెనీ వారి కార్యప్రవర్తకులు (Agents) తమపై జరిపిన క్రౌర్యానికీ, దౌర్జన్యానికీ బదులుగా, కసిదీర్చుకోటానికై జరిగిన ప్రతీకారం కాదా ఈ విద్రోహప్రవృత్తి?" అని మార్టిన్ ప్రశ్నించినాడు. విప్లవము బయలుదేరడానికి సుమారు ఒక సంవత్సరం పూర్వమే, ప్రభుత్వము ఒక విచారణను జరిపింది. భయానకమైన హింసా విధానం, సార్వత్రికంగా, వరుసగా, భారతీయులపై జరుగుతూనే ఉన్నదనీ, ఈ హింసా కాండకు స్త్రీలు కూడా గురియౌతున్నారనీ, ఆ విచారణనుబట్టి వ్యక్తమయింది. హోవార్డ్ (Howard), విల్బర్‌ఫోర్స్ (Wilberforce) లను, మాతృదేశమైన ఇంగ్లాండు, దురంతమైన ఈ విషయాన్ని ఒప్పుకోవలసి వచ్చింది. సాహసప్రాయులు, అగ్రగాములు కూడాను, అతి హేయమయినట్టి హింసా చర్యలను, భారతీయులపై,- స్త్రీ పురుష వివక్షలేక-జరిపినారు బ్రిటిషు కంపెనీవారి ఉద్యోగులు. ఈ విషయాన్ని వివరించిన నివేదికను అంగీకరింపక తప్పిందికాదు.

*పరిపాలన సంస్థనుంచి భారతీయుల బహిష్కారం :* ఉన్నత వర్గాల వారిలో ద్వేషభావాన్ని, అసంతుష్టిని రగుల్కొల్పిన కారణాలలోకెల్లా, అనేకాలున్నాయి. ప్రభుత్వపరిపాలన కార్యక్రమాలన్నించి, అధికారంతో కూడిన స్థానాల నుంచీ భారతీయులను పూర్తిగా బహిష్కరించడం, ఈ కారణాల్లో ప్రధానమైనదని, సయ్యద్ అహమ్మద్‌ఖాన్ అభిప్రాయపడినాడు. "దేశపాలనలో, ప్రజలకు పలుకుబడి ఉండడం అత్యంతావసరము. అట్టి పద్ధతివల్లనే ప్రభుత్వం సుస్థిరంగా ఏర్పడడమూ, సక్రమంగానూ, శ్రేయస్కరంగానూ పరిపాలన వ్యవహారాలు నడవడమూ, జరుగగలవనే విషయం ప్రపంచమంతటా, అంగీకరింపబడిన సత్యము. పరిపాలనాధికారులు అవలంబించే విధానాలలోని గుణదోషాలను ఎత్తిచూప వలసిన వారు దేశంలోని ప్రజలే. దుష్టవిధానాల పరిణామం మితిమీరిపోయి, ప్రతిక్రియావస్థ దాటిపోయే లోపుగనే, ప్రభుత్వము ప్రజల అభిప్రాయాన్ని గమనించడం అవసరము. పరిపాలనలో ప్రజలకు స్థానంలేనంత వరకూ, అట్టిది సాధ్యంకాదు. అందునా, మతమూ, సంప్రదాయాలూ, ప్రవర్తనరీతులూ, మర్యాదలు, స్వభావ ప్రకృతులు, అలవాట్లు,- ఇత్యాది విషయాల్లో పూర్తిగా విభిన్నమైన పరప్రభుత్వము, ప్రజల సహకారం లేక, పరిపాలన సాగింపజాలదు. శాసనసభల్లో భారతీయులకు స్థానమివ్వకపోవడానికి సమాధానంలేదు. దానిని మనం సమర్థించలేము. భారతీయులకు శాసన సభలలో ప్రవేశమియ్యక పోవడంవల్ల, కలిగిన ఆపద ఇది యొక్కటేకాదు. మనము అమలు జరిపిన శాసనాలలోనూ, వినియమాలలోనూ, గల లోటుపాట్లేట్టివో, తెలుసుకో లేక పోవడం, ఒక నష్టము. అంతేకాక, ప్రజల ఆశయాలు, ఉద్దేశాలు, తాత్పర్యాలు, నిజంగా ఎలాంటివై యుండెనో గ్రహించే అవకాశం ప్రభుత్వానికి లేక పోయింది. అట్లే, ప్రభుత్వం యొక్క ప్రయత్నాలనన్నిటినీ, ప్రజలు అపార్థంచేసుకోడానికి కూడా, ఈ విధానం అవకాశం కలుగజేసింది. ఇది, మొదటి దాని కంటెను, విపరీతమైన పరిణామం."

## IV. భారతీయులపట్ల దుర్జన ప్రవర్తన.

భారతీయులపట్ల బ్రిటీషువారి ప్రవృత్తిమారడం, ఇందులకు మరియొక కారణం. నెపోలియనుతోడి యుద్ధాలలో బ్రిటీషువారికి విజయంలభించడమూ, పారిశ్రామిక విప్లవంపల్ల సిద్ధించిన వైభవమూ, మెధాడిజమ్ (Methodism) ఇవాంజెలికాలిజమ్ (Evangelicalism) మున్నగు మత సంస్థలవ్యాప్తీ, సాంఘిక వర్తనములందునూ, నైతికస్థాయిలోనూ కలిగిన అభివృద్ధీ,- ఇవి కారణాలుగా బ్రిటీషువారిలో ఈ మార్పు వచ్చింది. ఇతరులందరిలోనూ ఆంగ్లేయుడే శ్రేష్ఠుడనే భావాన్నీ, జాతీయాహంకారాన్నీ, ఉత్తేజన పరచుటకివన్నీ జతయైతోడ్పడినవి.

యూరోపియన్ అధికారులు భారతీయ జాతులపట్ల చూపిన అయోగ్య ప్రవర్తనను "వ్యక్తిత్వ చైతన్యములున్న ఏ జాతికూడా, ఒక గంటకాలం కూడా సహించియుండ జాలదని" బాల్ (Ball) అనే ఆయన వచించినాడు ఒక భారతీయ రచయితవ్రాతలనుంచీ ఉదాహరిస్తూ, ఆయన "ఇంగ్లీషు అధికారులలో అధిక సంఖ్యాకులు-సివిల్ మిలిటరీ శాఖలు రెండింటిలోని వారు కూడా-తమ క్రింది ఉద్యోగస్థులనూ, ఆశ్రితులనూ, సేవకులనూ, సిపాయీలనుం, మాత్రమేకాక, దేశంలోని ప్రజల నందరినీ కూడా, దూషణవాక్యాలతో అవమానిస్తూ వచ్చినారు." "పాలకులకూ, పాలిత ప్రజలకూ మధ్య ఒక అంతర మేర్పడి, దినదినంగా ఇంకా పెద్దదవుతూ, దుర్ఘటమైన పరిస్థితిని తెచ్చిపెట్టింది. మరిన్నీ-కంపెనీవారి సిలిల్ మిలిటరీ అధికార్లు ప్రదర్శిస్తూవచ్చిన, దురహంకారమూ, మాటల తీరులోనూ ప్రవర్తనలోనూ చూపుచుండిన దుడుకు తనమూ,-ఇత్యాది దౌర్జన్యం, విద్యావంతులతోనూ శ్రీమంతులతోనూ జరపవలసిన వ్యవహార సందర్భాలలో కూడా - ప్రదర్శిస్తూ ఉన్నారు. కాబట్టి, ఇరు పక్షాల్లోనూ సద్భావంకానీ విశ్వాసంకానీ ఏర్పడేసూచన కూడా లేకపోవడం, సహజపరిణామమే." అన్న సత్యాన్ని సమర్థించినాడు

ఇండియా ప్రభుత్వ కార్యదర్శియైన స్టాన్లీప్రభువు (Lord Stanley), ఆడిస్కూంబ్ కళాశాల (Addiscombe college) లోని ఉన్నతవంశీయులైన సైనికవిద్యార్థుల యెదుట ఉపన్యసిస్తూ, (1858 డిసెంబర్ 10వ తేదీ) భారత దేశంలో, పాశ్చాత్యులు ప్రదర్శిస్తూఉన్న అతిగర్వ దురహంకారాలను గూర్చీ, దురహం భావంతో 'తెచ్చిపెట్టుకొన్న' శ్రేష్ఠతాప్రవృత్తిని గూర్చీ, సూచన గావించి, వారిని ఆ విషయమై హెచ్చరించినాడు.

ఇంతకు పూర్వమే, 1818 నాటికే, గవర్నర్ జనరల్ హేస్టింగ్సు ప్రభువుకు వ్రాస్తూ, మన్రో,- "పరదేశవిజేతలు దేశీయులపై బలప్రయోగము గావించి యుండడమూ, పలుమార్లు అధిక క్రౌర్యాన్ని ప్రయోగించి యుండడమూ కూడా చరిత్రలో జరిగింది. కాని, మనం భారతీయులను తిరస్కరించిన విధంగా వారెవ్వరూ ప్రవర్తింపలేదు. భారతజాతి సర్వమూ విశ్వాసానికి అర్హముకాదనీ, సత్యప్రవర్తన వారి ప్రకృతిలోనేలేదనీ, మనము చేయలేనట్టి నీచపు పనులలో నియోగింపబడుటకు మాత్రమే వారు తగుదురనీ,- మనం ఆ జాతిని నిందించిన

విధంగా మరెవ్వరూ ఏ దేశంలోనూ చేయలేదు. మన అధికారం క్రిందపడిన ఒక జాతియొక్క శీలస్వభావాన్ని ఈ విధంగా హీనంగా చూడడం అయోగ్యం మాత్రమేకాక, అవివేకమైనది కూడా," అని ఆయన ఘోషించినాడు.

మరిన్ని, మనం దేశీయులకు, భ్రష్టస్థితి కల్పించి యుండడమే మన పాలనవిధానంలో ఉన్న గొప్పచెడుగు. మూఢవిశ్వాసాలు కలవారనీ, తెలివి తక్కువవారనీ, అసత్యప్రవృత్తికి లోబడేవారనీ, భ్రష్టులైనవారనీ, వారినిగూర్చి మనము అభిప్రాయమేర్పరచుకొన్నాము. మనము వారి బాగునుద్దేశించినవారమే కాని, తగని అత్యుత్సాహం ప్రదర్శిస్తున్నాము.కనుకనే,- నీతిభ్రష్టులని మనము పరిగణిస్తూఉన్న దేశీయులకు పరిపాలన విధానంలో ఏమాత్రం భాగం కల్పించడానికి వెనుకదీయడమే కాదు, భయకంపితుల మౌతున్నాము. విశ్వాసయోగ్యులైనవి, తగినవేతనం కలవీ ఐన పదవులన్నిటినుండీ వారిని బహిష్కరించినాము. అల్పాదాయాల్పమైన భృతిగల, అతి నీచస్థానాలలో వారినుంచినాము. ఇట్టి స్థానాలు వారికివ్వడంకూడా మన అత్యవసరాన్నిబట్టే. పాశ్చాత్యులు ఆ స్థానాలలో నిలిచి నిగ్రహించుకోలేరు. కనుకనే దేశీయులకు వాని నంటగట్టినాము. హీన జాతికి చెందిన ప్రాణివర్గంగా మాత్రమే వారిని మనము చూస్తున్నాము. మనమే వారి నిట్టి నీచస్థితికి తెచ్చినాము. తరవాత, మనమే వారిని అలక్ష్యంలో చూస్తూ, గొప్పపదవులకు వారు తగనివారని గర్హిస్తున్నాము".— అని బ్రిటీషువారి ప్రవర్తనను విమర్శించినాడు.

బ్రిటీషుప్రభుత్వం ఇండియాను పరిపాలిస్తూ ఉన్న విధానాన్ని గూర్చి, ఆంగ్లప్రభువుల సభలో (House of Lords Feb. 1857) చర్చిస్తూ, మార్క్వస్ ఆఫ్ క్లారిన్‌కార్డ్ (Marquis of clarincarde),- "భారతదేశాన్ని పరిపాలిస్తూ ఉన్న విధానమంతా, దేశీయులను కేవలం నీచస్థితికితెచ్చి, వారిని కపటులుగానూ, క్షుద్రజనంగానూ, కుయుక్తి పరులుగానూ చేయడానికి మాత్రమే తగినదిగా ఉన్నదని" ఉద్ఘాటించినాడు.

*హిందూమతంపట్లనూ, సంప్రదాయాలపట్లనూ బ్రిటీషుప్రభుత్వం చూపిన తిరస్కార భావము :* భారతీయులపట్ల బ్రిటీషువారికిగల తిరస్కారభావం, మత సంప్రదాయాలపై కూడా ప్రాకింది. హిందూమతమందలి తాత్త్వికభాగాన్నీ, వ్యవహారభాగాన్నీకూడా, అన్నివిధాలా దూషిస్తూ, క్రైస్తవమిషనరీలు, పెద్దగా ఆర్భాటం చేస్తూవచ్చినారు. సివిల్ మిలిటరీ సంస్థలకుచెందిన అధికార్లు కూడా దీనిలో కలుగచేసుకొని, క్షుద్రమతారాధకులైన (Pagans) భారతీయులను అధోగతినుంచి రక్షించడం తమ కర్తవ్యమనే భావంతో, జీససు సువార్తా ప్రచారానికి పూనుకొనిరి. ఇండియాలోని మతసంస్థల విషయమైన వీరి అజ్ఞాన దౌర్భాగ్యమే ఇందుకు కారణము. ఆబే దుబాయి (Abbey duboi) రచించిన గ్రంథాన్నిగూర్చి తన అభిప్రాయాన్ని తెలియజేస్తూ, విలియం బెంటింక్ (William Bentinck),- "భారతీయుల ఆచార వ్యవహారాలనుగూర్చి నేను

బాగా పరిశీలించి తెలుసుకొన్న విషయమిది. బాహ్యంగా వ్యక్తమైయున్న ఏవో కొన్ని అంశాలూ, చిహ్నాలూ మాత్రమే మనం గమనించినవి. ఇవి అందరికీ సులభంగా, అతిశీఘ్రంగా గోచరిస్తాయి. కాని అవి అప్రధానములైనవి. భారతీయుల ఆలోచనా ప్రవృత్తి, కుటుంబజీవితమూ, పూజావిధానాలూ,-వీటి స్వభావపరిశీలనవల్లనే ఆ జాతియొక్క వాస్తవ స్వరూపము, మనకు వ్యక్తమౌతుంది. ఆ ముఖ్యవిషయ జ్ఞానమే మనకులోపించింది. వారి భాష మనకు సరిగా తెలియదు....వారి గృహపరిచయం మనకులేదు. వారి కుటుంబజీవిత మెట్టిదో మనం గమనించలేదు." అని తెలియజేసినాడు.

మైకేల్ ఎడ్వర్డ్స్ (Michael Edwards) ఈ క్రింది విధంగా సూచించినాడు. "పదునెనిమిదో శతాబ్దంలో బ్రిటీషువారికీ భారతీయులకూ, మధ్యగల సంపర్కము, సమానస్థాయిలో నున్నవారికె పరస్పరం ఏర్పడే సంబంధం వంటిది; సమానాధి కారంగల వారి కుండే మైత్రివంటిది. కాని, ఆ శతాబ్దాంత కాలానికి, ఈ సంబంధం బిగిసిపోయింది; ఈ మార్పు బాహ్యంగా గోచరమయింది కూడా. క్రమంగా అది వికటించి, 1857 నాటి తిరుగుబాటుకు దారి తీసింది. ఆంగ్లేయులలో అధికార భావంపెరుగుతూ రాగా, వారు దేశీయులను దూరంగా ఉంచుతూ వచ్చినారు. ప్రజలకూ అధికారులకూ ఉండవలసిన సంబంధసంసర్గాల అవకాశం తగ్గింది. జయింపబడిన జాతి వారిని నిరసన భావంతో చూడడమూ, వారి యెడ తిరస్కారాన్ని ప్రదర్శించడమూ అనేవి, సార్వభౌమ ప్రభుత్వము యొక్క ఆనుషంగికమైన దుర్లక్షణాలు. ఆ లక్షణాలే పాలకవర్గం వారైన ఆంగ్లేయులలో పెచ్చుపెరుగుతూ వచ్చినవి. తాము పరిపాలిస్తూఉన్న దేశంలోని ప్రజలనుంచి విడివడిపోయి, ప్రత్యేకంగా నివసిస్తూ వచ్చినారు. నేపియర్స్ (Napiers) గావించిన;- "మనం వారితో పూర్తిగా కలిసిపోయి,ఒక ఐక్యజాతిగా ఏర్పడేంతవరకూ, భారతీయులకు సమస్తపాలన విషయాల్లోనూ భాగం కలిగించండి."-అనే హితబోధను వీరు గణించలేదు.

వివిధ వర్గాల ప్రజలయొక్క రాజకీయ ఆర్థిక కష్టాలే, విప్లవానికి ప్రధాన హేతువులైనాయి. తమ మతం దెబ్బతింటుందనే సంశయము కూడా, కల్లోలానికి ప్రబలమైన మూలాధారమయింది. భారతీయుల జీవితాని కంతటికీ,మతమే చైతన్యశక్తి; వారి మనుగడకు అదియే ఆధారం. అట్టి మత జీవితం నుంచి వెలుపలికిడ్చివేయబడిన హిందువుకానీ, ముస్లిముకానీ, నిలువలేడు. 'లంగరూ, చుక్కానీ లేని పడవ' విధంగా, అతని జీవితం నిరాధార మౌతుంది. ప్రకృతి సిద్ధంగా తనకు తెలిసియున్న, రూఢియైన, పరిసరాలను వదలి, అజ్ఞాతమూ, అపరిచితమూ, ఐన, నూతన జీవితంలో దూకడం కంటే, భయానకమైనది మరియొకటిలేదు. ఆ విషయంగా ఊహించడం కూడా అతనికి అసహ్యాకరము.

*క్రైస్తవ మిషనరీల ప్రచారము :* "ప్రభుత్వము పూనుకొన్న కార్యక్రమాలూ, మిషనరీల కార్యకలాపాలూ, ప్రభుత్వోద్యోగుల ప్రకటనలూ, అన్నీ ఏకమై, పాలకులు భారతప్రజను క్రీస్తుమతంలో కలిపివేస్తారనే భావాన్ని కలిగించి

నవి;" - అని సయ్యద్ అహమద్‌ఖాన్, విశదం గావించినాడు.

క్రైస్తవ మిషనరీలు భారతదేశంలో స్థిరనివాసం ఏర్పరచుకోవడానికి, ప్రభుత్వము 1813 లో అనుమతి ఇచ్చింది. ఆనాటి నుండి, మిషనరీల మత ప్రచారము ఎక్కువవుతూ వచ్చింది. క్రీస్తుమత బోధకులు, పోలీసు బందోబస్తును కూడా వెంటదీసుకొని, సంతబజార్లలోనూ, వీధులలోనూ తిరుగుతూ, ప్రచారము చేసేవారు. "మిషనరీలు తమ క్రీస్తు మతాన్ని ప్రచారము చేయడంలో ఒకక్రొత్తపద్ధతిని కూడా ప్రవేశపెట్టినారు. ప్రశ్నోత్తరములతో, సులభమైన చిన్న పుస్తకాలను ప్రచురించి ప్రజలలో పంచిపెట్టడం ఆరంభించినారు. ఎవ్వరూ పిలువకుండానే, తమకు తామే, క్రీస్తు మత ప్రచార నిమిత్తము, ముస్లిముల మసీదులకూ, హిందువుల ఆలయాలకూ తరచు వెళ్లేవారు. ప్రభుత్వాధికారుల భయంవల్ల దీని నెవ్వరూ కాదనలేకపోయిరి. కొన్ని జిల్లాల్లో, మిషనరీల బాగోగులను చూడడానికై, చప్రాసీలు, జవాన్లు, పోలీసులు కూడా వీరిననుసరించేవారు. తమమతాన్ని గూర్చి బోధించడంతో మాత్రమే సంతృప్తి పడినవారు కారు ఈ మిషనరీలు. హిందూముస్లిముల మతాలవారి భక్తి విశ్వాసాలకు పాత్రులైన పూజ్యవ్యక్తులనూ, పుణ్యక్షేత్రాలనూ, అత్యంత గౌరవ హీనంగా పేర్కొంటూ, వినేవారి కసహ్యమైన బాధనూ, ఆగ్రహాన్ని కలిగిస్తూ వచ్చినారు. ప్రభుత్వంపట్ల, ప్రజలహృదయాల్లో, విషబీజాలను ఈ విధంగా చల్లి నారు మిషనరీలు.

ప్రభుత్వమవలంబించిన విధానాల్లో, ప్రజలకు అనిష్టదాయకమైనవి,- సహగమన ఉన్మూలనము, విధవాపునర్వివాహము, క్రీస్తుమతంలోకి మారిన వారికి ఆస్తిహక్కు విధించడం, భిన్నకులాల ఖైదీలకందరికీ ఏకంగా భోజనశాలలను నిర్బంధించడం, రైల్వేలలో, కులభేదాలను పరిగణింపక పోవడం, సముద్రాలను దాటి విదేశాలలో కూడా కొలువు చేయవలసిన షరతును సిపాయీలపై విధించడమూ, పూరీ జగన్నాథంవంటి హిందూ దేవాలయాల పరిపాలనను ప్రభుత్వము స్వయంగా వహించడమూ,-ఇత్యాదులు. ఈ విధానాలన్నీ, నైతికవ్యవస్థనూ పరిపాలన దక్షతనూ, పెంపొందించేవి, అని సమర్థించవచ్చు. సంస్కారవంతులైన భారతీయులు వీటిలో కొన్నింటని ఆమోదించినారు కూడా. కాని, ఈ విధానాల వల్ల పూర్వాచారపరుల భావాలకు, తీవ్రమైన ఆఘాతం కలిగింది. భారతీయుల ఆమోదమూ, అంగీకారమూలేకుండా, అమలు జరిగినవి కావడంవల్ల, ఈ విధానాలు విదేశప్రభుత్వము నిర్బంధంగా, తమ సంఘంపై రుద్దినవనే అభిప్రాయము వీరి కేర్పడింది.

విద్యాసంస్థలో, పండితులకూ, మౌల్వీలకూ ఇంతవరకూ ఉండిన ఏకస్వామ్యాన్ని (Monopoly) నూతన విద్యావిధానము పోగొట్టింది. అంతేకాక, యువక హృదయాల్లో ప్రవేశపెట్టిన వినూత్నాభిప్రాయాల కారణంగా, భారతీయ మతాచారాలూ విశ్వాసాలూ, నిరసనకూ తిరస్కారభావానికీ గురికావడం జరిగింది. దేశంలో విద్యావిధానాన్ని నెలకొల్పడంలోనూ, నిర్వహణంలోనూ

మిషనరీలకెక్కువ ప్రాబల్యం ఉండడంవల్ల ఈ నూతన విద్యాసంస్థలు మత పరివర్తన కేంద్రాలని సంశయించ డానికి అవకాశము కలిగింది.

మిషనరీలు ఈ విధంగా హిందూ ముస్లిము మతాలను, వెటకారంగా పరిహసిస్తూ, బహిరంగంగా దూషిస్తూ, ప్రజలలో ఆగ్రహద్వేషాలను రగులు కొల్పుతూ వచ్చినారు. ఐనా, క్రిష్టియను పాలకుల అధికారానికి లోబడియున్న ప్రజలు, తమ విరుద్ధభావాలను వ్యక్తంచేయలేక పోయినారు. పైగా, సివిల్ మిలిటరీ అధికార్లు కూడా దీనిలో కలుగజేసికొని, అత్యుత్తమమైనవిగా తాము భావిస్తూన్న క్రీస్తు బోధనల ప్రచారానికి సువిశేష వక్తలుగా. (Evangelists), పనిచేయడానికి బూనుకొనిరి. రెవరెండ్, ఎమ్. ఎడ్మండ్ (Rev. M. Edmund), 1855 లో, కలకత్తానుండి ఒక కరపత్రాన్ని విడుదలచేసినాడు. అందులో, "ప్రజలందరూ సమగ్రంగా, ఏకైకమైన మతాన్ని, అవలంబించవలెనా లేదా, అనే విషయాన్ని గూర్చి, ఆలోచించవలసిన అవసరము ఏర్పడింది రైలు మార్గాలూ, స్టీమరులూ, టెలిగ్రాఫు విధానమూ,-ఇవన్నీ కూడా ప్రపంచంలోని ప్రజల కందరికీ ఐక్యత కూరుస్తూ ఉన్నాయి. దృష్టిగోచరంకాని, ఊహాకల్పిత మైన ఒకానొక దేవుని దయపై ఆధారపడి, ప్రతిదేశమూ, తనకుతోచిన భిన్న మార్గంలో నడుస్తూ, భావిగతిని చూచుకొంటూ ఉన్న ప్రస్తుత విధానము, సహేతుకమైనదని విశ్వసించవచ్చునా ? లేదా, అందరినీ సృష్టించిన, ఏకైకుడగు భగవంతుడు, తన కుటుంబంలోని భిన్నభాగాలవారి ప్రస్తుత భావి సౌఖ్యాల సంపాదనకై భిన్న భిన్న మార్గాలనూ, సాధనలనూ, ఏర్పరచియుండెనని చెప్ప వచ్చునా ? అట్టి దేమాత్రమూ నిజంకాదు. క్రిష్టియను మత మొక్కటే, భగవంతుడు స్వయంగా ప్రకాశిత మొనర్చగా, మనకు లభించిన మతము. ప్రస్తుత ప్రపంచంలోను, భావి ప్రపంచంలోనూ, కూడా మనకు సౌఖ్యాన్ని, సిద్ధింపచేయగలిగింది ఇది ఒక్కటే భావి ప్రపంచపు పరిస్థితులు కూడా ఎట్టివో ఈ మత మొక్కటే ప్రకాశితం గావించింది. ఈ మతము మనకెంతో శుభాన్ని చేకూర్చింది. ఇతరులు కూడా ఈ మతం ద్వారా అట్టి శుభాన్ని పొందడానికి, మనము ప్రోత్సహించవలసి ఉన్నది. వారా విధంగా బాగుపడడం, మనకోరిక. ఇండియాలోని క్రైస్తవ మందిరాలన్నీ (Churches) భారత ప్రజలతో నిండి యుండవలెననీ, విదేశీయులు మాత్రమేకాక, దేశీయ ప్రజలు కూడా, క్రమ నియమంగా క్రైస్తవ సువార్తను చాటిస్తారనీ మా ఆశయము. మరిన్ని విదేశీయు లైన స్త్రీపురుషులందరూ, తమ పాప పశ్చాత్తాప ప్రకటనగావించుకొని, తద్వారా భగవంతుని కలిసికోడానికి సిద్ధులు కాగలరనీ, వారి పిల్లలు మన క్రీస్తు మందిరాలలో నీతి మార్గాన్ని, సత్య ప్రవర్తననూ నేర్చుకొంటారనీ మేము ఆశిస్తున్నాము." అని తన ఉద్దేశాన్ని సుస్పష్టం గావించినాడు.

## V. సిపాయీల కష్టాలు

బ్రిటీషువారి అపకారచర్యలవల్ల ఉన్నతవర్గాల వారి హృదయాలు క్లేశ

పడుతున్నట్లే, బెంగాలు సైన్యంలోని సిపాయీల హృదయాలు కూడా బాధ పడుచుండినవి. సైన్యంలో బ్రాహ్మణులూ రజపుత్రులూ ఎక్కువభాగంగా ఉన్నారు. అదికాక, వారికి ప్రత్యేకమైన కష్టాలుకూడా ఉన్నాయి. అసంతృప్తికరములైన ఉద్యోగనియమాలూ, మతసంప్రదాయాలపై అతిక్రమణము, ప్రతిష్ఠకూ ఆత్మగౌరవానికీ భంగకరమైన తిరస్కారచర్యలు,- ఇవి వాటిలో ప్రధానములైనవి.

ఉద్యోగపరిస్థితుల విషయంలో, ముఖ్యంగా అభివృద్ధికీ, వేతనానికీ సంబంధించిన సమస్యలు తీవ్రములైనవి. తమసేవకు, ప్రభుభక్తి విశ్వాసాలకు పొందిన ఈ సమస్య వీరి కెక్కువ కష్టము కలిగించింది. బ్రిటీషువారు తమ నిలుకడకోసం ఫ్రెంచివారితోనూ, దక్కను ప్రభువులతోనూ దక్షిణభారతంలో పోరాడుతూ ఉన్న పూర్వపురోజుల్లో, భారతసైనికులకు అధికారస్థానాలను సంపాదించుకొనే అవకాశం ఉండేది. వారట్టి స్వతంత్రాధికారస్థానాల్లో, యూరోపుదేశ సైనికులనూ, దేశీయసైనికులనుకూడా నడిపించియుండిరి. బెంగాలు విజయము తర్వాత, బ్రిటీషుసైనికాధికారులను అధికంగా ప్రవేశపెట్టడంవల్లనూ, కారన్‌వాలీసు(Cornwallis) నిర్బంధంగా తెచ్చిపెట్టిన ఆంగ్లీకరణవిధానం (Anglicisation)వల్లనూ, భారతీయసైనికుల అభివృద్ధిమార్గాలు పూర్తిగా అస్తగింపబడినాయి. అంతతో,- నియోజిత అధికారపదవులను (Commissioned officer) పొందే అవకాశ మీ విధంగా నశించిపోగా, భారతీయులు సామాన్య సైనికస్థితిలోనే, నిలిచిపోవడం జరిగింది. మొఘలు సార్వభౌముని సైన్యానికీ, ఇతర భారతరాజుల సైన్యాలనూ, అత్యుత్తమశ్రేణికి చెందిన సేనాధిపతులను సమకూర్చియుండిన భారతీయ సైనిక శాఖకు ఈ పరిస్థితి, అవమానకరమూ, గౌరవహీనమూ ఐనది. బ్రిటీషు ప్రభుత్వములో తమకు ఏర్పడిన అప్రధానస్థితి మరువరానిదయింది.

వేతనానికి సంబంధించిన సమస్య, ఇంతకంటెనూ క్లిష్టమైనది. ప్రథమంగా వీరి విషయంలో నిర్ణయింపబడిన మూలవేతన క్రమము స్వల్పమైనది. యూరోపియను సైనికులకు నియమితమైన వేతనం వీరికంటే పలురెట్లు పెద్దది. అదికాక, భారతీయ సైనికులు గౌరవనీయములైన ఉన్నత వర్గాలనుండి వచ్చినవారు. వీరికి తమసైనిక వృత్తియందు అభిమానము అధికము కావడమేకాక, నైతిక ప్రవృత్తిలోనూ, వృత్తి నిర్వహణలోనూ, ఉన్నత ప్రమాణాలను పాటించేవారు. ఇందుకు వ్యతిరేకంగా, యూరోపియను సైనికునికి అతని సంఘంలోనే గౌరవంలేదు; అతని నైతిక ప్రవృత్తికూడా హీనమయిందే. ఇరు వర్గాలవారికి గల వైదృశ్యం (Disparity) ఇట్లు ప్రత్యక్షంగా గోచరిస్తూ ఉండగా, వేతనాల విషయంలో గలిగిన అవమానం బాధాకరమయింది. ఈ భిన్నజాతుల వారి జీవన ప్రమాణాలలోగల భేదాన్నిబట్టి, మూలవేతన నిర్ణయాన్ని ఒకవేళ సమర్థింప బూనుకొన్నా, ప్రతి యుద్ధానంతరమూ, తమ వేతన విషయంలో జరిగే అనిశ్చితములూ, విచిత్రములూ, ఐన, మార్పులకు సమాధానము కనబడదు. సర్ హెన్రీ లారెన్స్ (Sir Henry Lawrence) ఈ విషయమై వ్రాస్తూ - "సైన్య సంస్థకు

అవసరములైన విషయాలలో అతి ప్రధానమైనది, సరళమైన, వేతన స్మృతి గ్రంధము. (Paycode). ప్రతిశాఖలోనూ, ప్రతి తరగతికి, సంబంధించిన వేతనాన్ని నిష్కర్షగా తెలిపే, ఇట్టి స్మృతి, అన్నిసందర్భాలలోనూ, తప్పక ఉండవలసింది. ఈ విషయంలో, సందేహానికి కాస్పదం ఉండకూడదు. ప్రస్తుతం అంతా సందేహ గ్రస్తంగానే ఉంది. కాని, వేతన విమర్శ వినియనముల సంపుటాలకు మాత్రం కొదువలేదు." అని ఈ లోపాన్ని ఎత్తిచూపినాడు.

ఒక ప్రాంతాన్ని జయించి, తమ భూభాగంలో సంయోజనపరచుకొనే అంతవరకూ, సైనికులకు ఇస్తూవచ్చిన బత్తెపుఖర్చులను, ఆ వెంటనే తీసివేసి, జయించిన ప్రాంతాలలో ఆ సైనికులనే తక్కువజీతాలపై నియమించడం—అనే విధానం సైనికుల హృదయాల్లో, చిచ్చుపెట్టక మానదు. 7 రూపాయలు వేతనంగా పుచ్చుకొంటున్న సిపాయి, తన భోజనంఖర్చుకై మూడున్నర, ఇతర అవసరాలకై రెండున్నర ఖర్చుపెట్టక తప్పదు. పోగా, అతికష్టంమీద అతనికి మిగులుతున్నది, ఒకటి, లేక ఒకటిన్నర, రూపాయి.స్వగృహానికెంతోదూరంలో కొలువుచేస్తూ ఉన్న సిపాయికి, అదనంగా బత్తెపుఖర్చు లభించినట్టయితే,- కొంత భాగం తన కుటుంబానికి పంపగలిగే అవకాశముంది. ఇంతమాత్రపు ఆశతోనే అతడు సైన్యంలో చేరినాడు కదా! కాని అట్టి చిన్న అవకాశాన్ని కూడా, బ్రిటీషుప్రభువులు అతనికి లేకుండా చేసినారు.

శాంతి సమయాలలో, సదా ఉడికిస్తూ ఉన్న ఈ అసంతుష్టికి తోడుగా, మరొక ఆఘాతాన్ని కలిగించినారు. ఆఫ్గనిస్థాన్, బర్మాదేశాల్లో, పోరాడడానికై బ్రాహ్మణ రజపుత్రసైనికులను పంపించడానికి ప్రభుత్వంచేసిన, అవిచారమూలకమూ, దాక్షిణ్యరహితమూ ఐన నిర్ణయం, ఈ సైనికుల మతనిష్ఠకు భంగకరమైనది. పైగా, ప్రభుత్వం వీరితో గావించుకొన్న ఒడంబడికకు విరుద్ధమైనది కూడా. ముస్లిముల మధ్యలో నివసిస్తూ, వారి చేతి ఆహారాదులను భుజించడం, తమ ప్రాచీనాచారాలకు అసంగతమూ, అసహ్యమూ ఐనది. మరియూ, సముద్రాలను దాటిపోవడం, ధర్మపరిత్యాగంతో సమమైన పాపము. ఈ రెండింటిలో ఏది జరిగినా కూడా, తమ సాంఘిక జీవితానికంతకూ మూలకందమై యున్న కులము నశిస్తుంది. ఇట్టి ఆఘాతాన్ని కలిగించింది, బ్రిటీషుప్రభుత్వము.

ద్రవ్యసంబంధములైన చిక్కులూ, మత సంబంధంగా అధికారులు కల్పించిన ఉద్రేకకారణాలూ, సిపాయిలను కలతచెందించినాయి. కాగా, భారతీయులను క్రైస్తవమతంలో చేర్చుకోడానికి బ్రిటీషు వారుద్యమించినారనే వదంతులను వీరు నమ్మడం, అసంభవంకాలేదు. క్యానింగు ప్రభువుకు తన నివేదికను పంపుతూ, సర్ హెన్రీ లారెన్స్ "దేశీయుల నందరినీ బలవంతంగానో, కపటోపాయాలతోనో, క్రీస్తుమతంలో కలపడానికి బ్రిటీషుప్రభుత్వము పదిసంవత్సరాలనుండీ ప్రయత్నాలు జరుపుతూ ఉన్నదని, ఔధ్ ఫిరంగిదళంలో పనిచేస్తూఉన్న, శీలవంతుడైన ఒక జమేదార్ దృఢంగా విశ్వశిస్తున్నాడని" వివరించి యున్నాడు.

అంతమాత్రమేకాక, 'తెల్లదొరలు'- నియోజిత వర్గంలోనివారూ, ఇత

రులుకూడా - దేశీయసైనికులపట్ల ప్రదర్శిస్తూ ఉన్న నిరసనభావమూ, దుష్ప్రవర్తనా, తీవ్రమైన క్రోధాన్ని రగులుకొల్పినవి.

తన కుమారుడు విప్లవంలోచేరియున్నా కూడా, తన ప్రభుభక్తిని విడువక, కంపెనీ సైన్యంలో సుబేదారుగా పని చేస్తూ ఉండిన సీతారామ్, ఈ విషయంలో సాక్ష్యమిచ్చినాడు. "యూరోపియన్ సార్జెంట్లలో (Seargents) అనేకులు, తమ అభిప్రాయాలను వ్యక్తం చేయలేనివారు; సిపాయీలు గ్రహించే విధంగా ఆజ్ఞలను తెలుపజాలని అసమర్థులు. ఇట్టి వారు, నీచమూ, హేయమూ ఐన మాటల నుపయోగించి సిపాయీలను తిట్టడమూ, కొట్టడమూ, పిడికిలితో పొడవడమూ, చేస్తూ ఉంటారు. ఫిర్యాదులు అనేకంగా పెట్టినా కూడా, పై అధికారియైన అడ్జుటెంట్ (Adjutant), సార్జెంట్ల పక్షము వహిస్తూ వచ్చినాడు. వారి చర్యలను నివారించిన వారూ లేరు; పరిస్థితులను చక్కబరచిన వారూ లేరు."

నియోజిత అధికారుల ప్రవర్తన కూడా, ఈ విధమైనదే. సిపాయీలను ఒక నీచ జంతువుగా మాత్రమే వారు చూడగలిగినారు. "తిట్టడమూ, కొట్టడమూ, 'నిగ్గర్' అనే పదంతో వ్యవహరించడమూ, వారికి పరిపాటి అయింది." యువకులైన అధికారులు, ఈ విధమైన నీచప్రవర్తనను ఒక మర్యాదగా గ్రహించి పాటిస్తూ వచ్చినారు. సిపాయిని ఒక నీచజంతువు క్రింద జమకట్టి ప్రవర్తించడం, తమ ఆధిక్యతకూ, చైతన్యోత్సాహాలకూ నిదర్శనము, అని భావించినారు ఈ ఆంగ్లయువకులు. లెఫ్టినెంట్ కల్నల్ విలియమ్ హంటర్ ఇచ్చిన సాక్ష్యం ఈ విషయాన్ని ధృవపరుస్తుంది. నియోజిత అధికార వర్గానికి చెందని యూరోపియను అధికారుల అయోగ్య ప్రవర్తననుగూర్చి హంటర్ (Hunter), "ప్రస్తుతం నడుస్తూ ఉన్న విధానంలో, - ఇండియను ఆఫీసర్లను ఎప్పుడూ వెనకనే ఉంచుతూ, వారిని అందరికంటే చిన్నవాడూ, అనుభవశూన్యుడూ ఐన యూరోపియన్ సబాల్టర్న్ అధికారానికి లోబరుస్తూ ఉండడం పరిపాటి అయింది. అంతే కాక, నియోజిత వర్గానికి చెందని (Non-commissioned) అధికారుల నిత్య దూషణవాక్యాలకు [illegible], భారతీయాధికారులను గురిచేయడం, సైనిక [illegible] మిక్కిలి వ్యతిక్రమమైనది."

ఈ విధానంలో, అధికారులకూ, వారి క్రిందనున్న సిపాయీలకూ, పరస్పరం సత్సంబంధాన్ని ఏర్పరచడం సాధ్యం కాలేదు. వాస్తవానికి, ఈ రెండు వర్గాలవారూ వేర్వేరు ప్రపంచాలలో ఉన్నవారు. దేశీయులైన అధికారులకూ, సైనికులకూ దూరంగా నివసించేవాడు యూరోపియన్ అధికారి. ఉద్యోగ సంబంధమైన వ్యవహారాల అనంతరం,- వీరిమధ్య ఎట్టి సాంఘిక సంసర్గమూ ఉండేదికాదు. సైన్యవ్యవస్థలో (1824) మార్పు తెచ్చిన అనంతరం, అధికారికీ సైనికులకూగల సంబంధము మరింత దూరమయింది. స్టీమర్లను ప్రవేశపెట్టడంతో, యూరోపు ప్రయాణాలకు ఎక్కువ సౌకర్యం ఏర్పడింది. ఈ సౌకర్యంవల్ల, యూరోపియను అధికారుల దృక్పథమూ, స్వార్థప్రయోజనాలూ ఎక్కువగా

మార్పుచెందినవి. తన సైన్యంపట్ల శ్రద్ధా, సైనికులవిషయంలో సంసర్గమూ తక్కువౌతూ వచ్చినవి. అల్లే, ఇండియాలోని తన ఉద్యోగుల విషయంలో కూడా ఆసక్తి తగ్గింది. తనజాతి స్త్రీ [illegible] కలిసిఉండే [illegible]న్ని ప్రయాణసౌకర్యాలు కలిగించడం ఇందుకు కారణం. సర్వే, పురనిర్మాణసంస్థ, రాజకీయసంస్థ,- ఇత్యాది సివిల్ వ్యవస్థలలోనికి సైనికోద్యోగులను తీసుకోవడం వల్ల, సైనికసంస్థయొక్క శక్తిసామర్థ్యాలు తగ్గుతూవచ్చినవి. క్రమశిక్షణ క్షీణించడమూ, అధికారులపట్ల గౌరవం తగ్గడమూ కూడా జరిగింది.

యూరోపియను అధికారుల క్రమశిక్షణకూడా సడలడంవల్ల, పరిస్థితి ఇంకా విషమించింది. వేతనాల, గ్రాసాల - విషయంలో వారు అత్యాశాపరులు. ఖర్చుల విషయంలో, అమితవ్యయపరులై, భావిదృష్టిలేనివారై, ప్రవర్తిస్తూ ఉండిరి. జీతబత్తెముల విషయంలో ప్రభుత్వముయొక్క ఆజ్ఞలనుకూడా పాలింపకుండిరి. వారి ప్రవర్తన, తిరస్కారభావాన్ని కలిగించడమేకాక, సిపాయీలకు చెడ్డ ఆదర్శంకూడా అయింది. అధికారుల మాటలకు విలువ లేకపోవడమూ, వారి వాగ్దానములపట్ల విశ్వాసము నశించడమూ జరిగింది శ్రద్ధానిష్ఠలకు భంగం జరిగిన సందర్భాలుకూడా పెక్కులు. బెంగాలు సైన్యంనుంచి విశ్రాంతి గొన్న, ఒక అధికారి వివరించినట్లుగా,- "ఇండియాలో జరిగిన తిరుగుబాట్లన్నీ- బెంగాలులోనూ ఇతర ప్రదేశాలలో కూడా- మనలో మొదట ఆరంభమైన క్రమశిక్షణ రహిత ప్రవర్తనవల్లనే ఉద్భవిల్లినవి అన్ని సందర్భాల్లోనూ, ఒడంబడికలకూ, సిపాయీల హృదయభావాలకూ, ఆరోగ్యవ్యవస్థకూ, వారి బాగోగులకూ- విరుద్ధములైన మన విధానాలే కారకములైనాయి."-

జావా, వెల్లూర్, బ్యారక్‌పూర్ లలో జరిగిన వ్యతిరేకచర్యలూ, 1843, 1844 సంవత్సరాలలో బెంగాలులోనూ, మదరాసులోనూ ఉత్పన్నములైన కష్టసంఘటనలూ, పంజాబులో 1849-50లో జరిగిన తిరుగుబాట్లూ,- ఇవన్నీ దీనికి దృష్టాంతాలు.

*కంపెనీ సైన్యాలు కూర్పబడిన పద్ధతి :* ఆయుధ సైనికుల విషయంలో, బెంగాలు సైన్యాధిపత్యం కిందనున్న స్థావరాలన్నీ కలతలకు లోనైనాయి. మూడు సైనికవర్గాలుగా ఏర్పరచిన వీటిలో, బెంగాలువర్గం చాల పెద్దది. బంగాళాఖాతం మొదలు, ఆఫ్గనిస్థాన్ వరకూగల విశాలప్రాంతంపై అంతటా, ఈ వర్గానికధికారము ఉండినది. ఏడుప్రాదేశిక సైనికవర్గాలకధికారియైన సైన్యాధిపతి అధీనానికి ఈ ప్రాంతమంతా, లోబడింది. ప్రతి ప్రాదేశికవర్గంలోనూ, బ్రిగేడియర్ల అధికారంలో ఉన్న ప్రథమ, ద్వితీయకక్షలకు చెందిన ప్రదేశా లనేకములుండినవి.

బెంగాలు సైన్యాధికారి స్వాధీనంలో, 1,10,000 మందితోకూడిన పదాతిదళమూ, పది, పన్నెండువేల ఆశ్వికదళమూ, వివిధాయుధధారులైన ముప్పదివేలమంది యూరోపియను సైనికులూ, ఉండేవారు. భారతీయ సైన్యభాగంలో, ఎనిమిది - పది శాతం ముస్లిములు, తక్కినభాగము హిందువులు.

బెంగాల్, ప్రాదేశిక మండలాల్లో ఒకటి. కలకత్తాచుట్టూ, మూడు

ప్రధాన సైనిక స్థావరాలూ (Contonments), అస్సాము సరిహద్దులనూ, తూర్పు పర్వత ప్రభువులనూ గమనిస్తూ ఉండడానికి నియమించిన, మూడు చిన్నస్థావరాలూ, ఈ మండలంలో ఉండేవి. ప్రధానములైన, బ్యారక్‌పూర్, బర్‌హాంపూర్, దండం, - స్థావరాల్లో మొత్తం ఐదు పదాతి దళాలూ, ఒక అనియమిత అశ్వదళమూ, ఒక ఇండియన్ విధ్వంసక దళమూ (Battery), చిన్న సైన్యరక్షణలో ఉన్న తుపాకుల స్థానమూ, ఉండినవి. చిటగాంగ్, ఢక్కా, జల్‌పైగురి, - లలోని చిన్నస్థావరాలలో మొత్తం ఆరు భారతీయ పదాతి దళాలుండేవి.

బీహార్ రెండవప్రాదేశిక మండలంగా ఏర్పడింది. దానికి దినాపూర్ ముఖ్యస్థానము. దాని అధీనంలో ఉన్న ఏడు సైనిక స్థావరాలలోనూ, మొత్తం ఐదుపదాతి దళాలూ, అనియతములైన రెండు ఆశ్విక దళాలూ, ఒక యూరోపియను బటాలియనూ (Battallion), ఒక యూరోపియను తుపాకి దళమూ ఉండినవి. పశ్చిమోత్తర ప్రాంతంలో కాన్పూర్, మీరట్‌లలో ఏర్పడిన రెండు సైన్యాధికారాలలోనూ, మొత్తం, ఇరవై సైనిక స్థావరాలు కలవు. కనీసం పది రెజిమెంట్లు (Regiments) వాటిలో నెలకొన్నాయి. వాటిలో, అస్వల్పక సంఖ్యాకమైన, అనియత ఆశ్విక దళమూ, కొంత సిక్కు సైన్యమూ, కొన్ని ఫిరంగుల బటాలియనూ, మందుగుండు సామగ్రి స్థానాలూ, ఉండినవి.

దీనికింకనూ పశ్చిమంగానున్న ప్రదేశంలో సైన్యసాంద్రీకరణము(Concentration) ఇంకనూ ఉత్కృతకంగా, వృద్ధిగావింపబడింది. సిర్‌హిండ్, లాహోర్, పెషావర్‌లు కేంద్రాలుగా మూడు సైన్యాధికార ప్రదేశాలు ఏర్పడినవి. వాటిలో ఇరవై సైన్యస్థావరాలుండినవి. ముప్పదికిపైగా పదాతిదళాలూ, ఆశ్వికదళము తోనూ ఫిరంగి దళముతోనూ కూడిన గొప్ప సైన్యభాగమూ,- మొత్తం 65,000 దేశీయసైన్యము, వీటిలో ఉండినది. యూరోపియను సైన్యంలో చాలా భాగం పంజాబుకుగాను, నియమితమైనది. కొన్ని బ్యాటరీలతోసహా, కలకత్తా ఢిల్లీలకు మధ్యనిలిపియున్న నాలుగు యూరోపియను బటాలియన్లు మినహా, తక్కిన యూరోపియను సైన్యమంతా—— 15000 సైనికులు—— పంజాబులో ఉండింది. తొమ్మిదికిపైగా, యూరోపియను దళాలూ, అధికసంఖ్యలో ఆశ్విక తుపాకిదళమూ, ఫీల్డు బ్యాటరీలూ,- ఇవన్నీ, మీరట్ పెషావర్లకు మధ్యప్రదేశంలో సిద్ధపరచినారు.

మధ్యభారతంలోనూ, రాజపుటానాలోనూ, కంపెనీవారికి పెద్దసైనిక దళాలుండినవి. అందులో, - అనియతమైన ఆశ్వికదళమూ, ఇండియను ఫీల్డు బ్యాటరీలూ, దేశీయప్రభువుల సైన్యాలూ కూడా ఉండేవి. గ్వాలియరు, అన్నింటిలోనూ గొప్ప సేనా స్థావరము. అందులో 8000 మంది సైనికులూ, రెండు ఆశ్విక దళాలూ, పది పదాతి వర్గాలూ, నాలుగు ఫిరంగి దళాలూ, ఉండినవి. జబల్‌పూర్, మ్హౌ (Mhow), నగోద్‌లలో,-ఒక్కొక్క దానిలోనూ ఒక్కొక్క సైనికదళమూ, రెండు పదాతిదళాలూ, ఆశ్వికదళమూ, ఫిరంగులూ

కూడా, ఉండినవి. దియోలీ, బీవార్, ఎరిన్‌పూరా, ఖేర్వారాలలో, చిన్న దళాలుండినవి. అజ్‌మీర్‌లో, మందుగుండు సామగ్రితో కూడిన ఆయుధశాలలు ఉండినవి.

బెంగాలు సైన్యంయొక్క రాకపోకల విషయంలోనూ, సైన్యాల రవాణాల విషయంలోనూ, - రైలుమార్గాలు లేనిచోట్ల, నదీమార్గాలే ప్రాధాన్యం వహించినవి. గంగా, యమునా, సింధునదులూ, ఓడలరాకపోకల కనుకూలములైన ఉపనదులూ, ఉత్తరభారతదేశంలో ప్రధానమార్గాలు. కాబట్టి, సేనాస్థావరాలూ, ఆయుధశాలలూ, ఆ నదుల ప్రవాహమార్గాల్లో నెలకొల్పబడినవి.

బెంగాలు సైన్యాన్ని సంయోగపరచడంలో, ఉన్నతవర్గాల హిందూ ముస్లిములకు, ఎక్కువ ప్రాధాన్యం కలిగింది. బొంబే, మదరాసు సైన్యాల కూర్పు ఇట్టిదికాదు సింధుతోచేరిన బొంబాయి సేనాధిపత్యంలో, 26,000 సైనికులతోనూ, బెలూచీ సైనికదళాలతోనూ కూడిన, 23 సేనాస్థావరాలుండేవి. ఈ సైన్యంలో మూడవవంతు హిందూ ముస్లిములు, మూడవవంతు మహారాష్ట్రులు, పోగా మిగతభాగము, తగ్గుకులాలవారు,—ముఖ్యంగా మహార్లు-ఉండే వారు. ఉన్నతకులాల మహారాష్ట్రులైన బ్రాహ్మణులూ, ప్రభులూ, సారస్వతులూ సేనలో చేరినవారు కారు.

మదరాసు సైన్యము, స్థానికంగా ఏర్పడింది. అందులో సిపాయిలు వివిధములైన తెగలకూ, కులాలకూ చెందినవారు. యోధవంశాల వర్గము(Warrior class) మదరాసులో లేకపోవడమూ, బ్రాహ్మణులు సైనికవృత్తిలో చేరకపోవడమూ, కారణాలుగా, మదరాసు సైన్యంలో చాలభాగము, తగ్గుకులాల హిందువులతోనూ, ఉత్తరభారతం నుంచి వచ్చిన ముస్లిములతోనూ, కూర్పబడింది.

మద్రాసులోను, బొంబాయిలోను సైన్యాలసంయోగము (కూర్పు), మూడవవంతు ముస్లిములతోనూ, రెండుభాగాలు హిందువులతోనూ జరిగింది.

*క్రొవ్వు బూసిన తోటాలు :* విప్లవాన్ని లేవదీయడంలో, క్రొవ్వుబూసిన తూటాలు ప్రధాన పాత్రవహించినవనడం, పెద్ద అతిశయోక్తి. 'దండం' లోని తుపాకుదళానికి అధికారియైన మేజర్ బాంటీన్ (Major Bontein), ఈ విషయమై సాక్ష్యమిస్తూ "క్రొవ్వుబూసిన తూటాల విషయమై దేశీయసైనికులు చాల ఉద్రిక్తులై ఉన్నా, తాను వారిని మైదానంలో జమకూర్చి నిలిపినప్పుడు, అందులోని రెండువంతుల సైనికులు, క్రమబద్ధంగా, దేశీయ నియతాధికారులతో సహా, ముందుకువచ్చి నిలబడినారు. అత్యంతమూ, గౌరవప్రదర్శకమైన విధంగా తమకు ఈ విషయంలో ఉన్న ఆక్షేపణ ఎలాంటిదో విన్నవించుకొన్నారు. సర్వోచ్చ సభలో (Supreme council) సభ్యుడైన 'జెనరల్‌లో' (Genral low), ఔధ్ ప్రాంతపు అనియమిత పదాతిదళాన్ని గూర్చి వ్రాస్తూ,- "ఈ సైన్యదళంలోని ఎక్కువభాగము, ఈ తూటాలను, నోటితో కొరకడానికి నిరాకరించింది. ప్రభు-

త్వంపైనా, అధికారులపట్లా వారికి భక్తివిశ్వాసాలూ అభిమానమూ లేకపోవడం ఇందుల కే మాత్రమూ కారణం కాదు. కొవ్వు బూసిన తూటాలను నోటితో స్పృశించడంవల్ల, తప్పక కులభ్రష్టులౌదుమనీ, తమ భావిగుణశీలాలకు భంగం కలుగుననీ, వారికున్న వాస్తవమైన, నిష్కపటమైన సంశయమే, ఇందుకు హేతువు."— అని వివరించినాడు.

అయినా, సిపాయి అనుభవిస్తూ ఉండిన కష్టపరంపరలో కొవ్వుపూసిన తూటా ఒకటి మాత్రమే. దీనిని ప్రవేశపెట్టడం, అనతికిదివరకే ఉండిన సందేహాలనూ, వ్యాకులత్వాన్నీ, ఇతోధికం చేసింది. అప్పటికేర్పడి యుండిన పరిస్థితులనుబట్టి, "బెంగాలు సైన్యస్థితి తిరుగుబాటుతో సమానమైనది."— అనడం వాస్తవమైన విషయము. తద్భిన్నంగా ఉండడానికి అవకాశంలేదు! దేశీయ సైనికుడు జీవన భృతికొరకే, సైన్యంలో చేరినాడు. కొంతవరకూ, తన కులసంప్రదాయాన్ని అనుసరించి యుద్ధవృత్తిలో ప్రవేశించినాడు. మరిన్నీ, తన కిదివరలో జీవనోపాధిని గల్పించియుండిన దేశీయప్రభువుల సైన్యాలు నశించినవి. కంపెనీ వారి సైన్యంలో జీతమూ, కడపట పింఛనూ (విశ్రాంతి వేతనము) లభించే అవకాశాలూ ఏర్పడి యున్నాయి. అదీకాక, తన కిదివరలో అభ్యాసమైయుయున్నవిద్య, యుద్ధవిద్య. ఈ కారణాలవల్ల అతడు కంపెనీవారి కొలువులో చేరినాడు. యుద్ధంలో కంపెనీవారికి చేకూరిన విజయాలు, సిపాయికి ఆత్మప్రత్యయ భావాన్ని కలుగజేసినవి. తొలిరోజుల్లో, అతనికి తక్కిన వారందరితో సమానస్థానమూ, ఆదరణా, లభించినవి. తత్ఫలంగా, అతనిలో వ్యక్తిగతమైన భక్తివిశ్వాసాలూ, పరస్పరమైత్రీ భావమూ, ఉత్పన్నమైనాయి. కాని, సైనికవిధానంలో దుష్టమైన పరివర్తనం రావడంతో, పరిస్థితి విపరీతమయింది. యూరోపియనుకూ, భారతీయునకూ, పరస్పరం వైముఖ్యం పెరిగింది.

భారతీయుని ప్రతిష్ఠ దెబ్బతిన్నది. భారతీయ రాజకుటుంబాలు దుస్సహావమానాలకు లోనైనవి. కులీన వంశీయుల ప్రాభవాన్నంతా నశింపజేసినారు. విదేశీయుని దుష్టబలం ముందు, ప్రజానీకము సాష్టాంగపడవలసి వచ్చింది. ప్రాచీనాధికారస్థానములన్నీ శిథిలము గావింపబడినవి. ప్రాచీన వ్యవహారవిధానాలన్నీ, మరుగుపడిపోయినాయి. మత, భాషా, సంస్కృతులకు విరుద్ధులైన విదేశజాతికి చెందిన కొత్తవ్యక్తులు, దేశంలో పుట్టిపెరిగిన ప్రజలపై, దురాధికారం చెలాయిస్తూ, దురహంకారంతో తిరస్కారాన్ని తలపై రుద్దుతూ వచ్చినారు. అట్టి అసహ్యపరిస్థితిలో, పౌరులూ, సైనికులూకూడా ఉద్రిక్తులై, పరదేశపాలకులపై యుద్ధానికి పూనడంలో ఆశ్చర్యమేమున్నది? విప్లవప్రవృత్తికి దేశం సర్వమూ సిద్ధమై యున్నది.

విజితులైన దేశంవారికి, పరప్రభుత్వము సహజంగానే అసహ్యకరమైనట్టిది. బ్రిటీషువారికి ఈ ప్రకృతిసత్యము, తెలియకపోలేదు. సర్ జాన్ షోర్ (Sir John Shore) దీనిని గుర్తించే,- "బ్రిటీషు పరిపాలనవిధానంవల్ల లాభమేదైనప్పటికీ, పరప్రభుత్వాధికార ప్రాబల్యంవల్ల, సిద్ధించే చెడుగు, ఆ లాభాన్నంత

టినీ పూర్తిగా కిందు పరుస్తుంది" అని వ్రాసినాడు.

మెకాలే (Macaulay) "పరదేశీయుడు మోపిన దాస్యభారము, తక్కిన భారములన్నిటికంటె దుర్భరమైనది" అని నుడివియున్నాడు. జాన్‌స్టూవర్ట్‌మిల్ (John Stuart Mill) అనే తాత్త్వికుడు "దేశప్రజలు తమకొరకుతామై ఏర్పరచుకొన్న ప్రభుత్వానికొక ప్రయోజనమూ, వాస్తవికతా, ఉన్నవి. ఒకదేశం వారు మరియొక దేశప్రజలపై ప్రభుత్వాన్ని నెలకొల్పి నిర్వహించడమనేది మిథ్య. ఒక జాతివారు మరొకజాతిని, స్వప్రయోజనార్థం కుందేళ్ళపొలంగా (Warren), చేసుకోవచ్చు. (కుందేళ్ళను పెంచడాని కేర్పరచిన పొలం - Warren).

విజితదేశాన్ని, ఒక వేడుకమృగముల తోటగాసూ, మానవపశువుల ఆవరణంగానూ, స్వార్థలాభానికై, వేడుకకై మార్చవచ్చు. కాని, విజితదేశప్రజల బాగును కర్తవ్యంగా బూనిన ఏ ప్రభుత్వమూ, తాను స్వయంగా పరిపాలన చర్యకు పూనుకోదు". అని సిద్ధాంతం చేసినాడు [పరిపాలనా విధానమంతా దేశవాసుల అధీనమై ఉండవలెననడం ఈ సిద్ధాంతముయొక్క సారాంశము ]

## VI. విప్లవాభివృద్ధి

విప్లవప్రచండాగ్ని ఒక్కుమ్మడి ప్రజ్వరిల్లి దేశాన్ని సంక్షోభమొనర్చింది. దానివేడి ప్రతిప్రాంతానికీ, వ్యాపించింది. ఇంతటి పర్యాప్తమైన రాజకీయ సంక్షోభం కలగడం భారతదేశచరిత్రలో వినూత్నమైన అద్భుతవిషయము. విజేతలు పూర్వం మన దేశంపై దండయాత్రలు సాగించినారు ; రాజ్యాలను కూలద్రోసినారు. కాని వాటివల్ల జరిగిన కలత, జీవితపు పైపై భాగాన్ని మాత్రమే స్పృశింపగలిగింది. పరదేశాక్రమణవల్ల ఏర్పడిన రాజకీయపరివర్తనము, చాలవరకు, స్థానికమైనట్టిది. నాదర్‌షా, అహమద్ అబ్దాలీల దండయాత్రలలో, పంజాబుప్రాంతము ప్రచలితమైనప్పుడు, తక్కిన దేశమంతా సంక్షుబ్ధం కాలేదు. శాంతియుతంగానే నిలిచి యుండినది. బ్రిటీషువారు బెంగాలును జయించి సిరాజ్-ఉద్-దౌలాను పడద్రోసిన సందర్భంలో, లక్నో, ఢిల్లీ, లాహోర్, హైదరాబాద్, పూనా, మద్రాసు ప్రాంతాలలో ఏమాత్రమైన అలజడీ ఏర్పడలేదు. నదీమధ్యసీమల్లో (Doab), జాటువర్గంవారు (Jats), ప్రతిఘటన గావించినప్పుడుకూడా, ఇతర ప్రాంతాలు, వాటి ప్రభావానికి లోనుకాలేదు ఔరంగజేబుతో మహారాష్ట్రులు సాగించిన పోరాటము, శక్తివంతమైన ఒక సామ్రాజ్యముతో, ఒక ప్రాంతంవారు ప్రత్యేకంగా జరిపిన సంఘర్షణమాత్రమే అయింది. దీని ప్రభావము, మహారాష్ట్ర ప్రాంతందాటి వ్యాపించలేదు. పందొమ్మిదోశతాబ్దపు ప్రథమార్థంలో కలిగిన ఉత్పాతాలూ, కల్లోలాలూ, సార్వత్రికములైనవి కావు; వేర్వేరుగా ఆయా ప్రదేశాలలో జరిగినవిమాత్రమే.

కాని, 1857 లో కలిగిన ఉత్పాతంయొక్క ప్రకృతిస్వభావాలు, వాటికంటె చాల విలక్షణమైనవి. బ్రిటీషు అధికారాన్ని ఎదిరించి తిరస్కరించే ఉద్యమ

మంలో, అధికవిస్తారమైన దేశభాగమంతా, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, భాగం వహించింది. ఆవేశోద్రేకాలు సర్వసాధారణమైన దేశమంతటా సువ్యాప్తమైనవి. ఈ తిరుగుబాటు, కొన్ని ప్రాంతాలలో, బాహాటమైన రక్తపాతంతో కూడిన యుద్ధరూపం దాల్చింది. అందులో లక్షలాదిగా ప్రజలు, వేలాదిగా సైనికులు కూడా కలిసినారు. ఇతరప్రాంతాలలో సాయుధమైన విప్లవం జరిగింది. మరి కొన్ని ప్రదేశాలలో పౌరులకల్లోలాలు ఉత్పన్నమైనాయి. పరిపాలకులకు చింతా వ్యాకులముగాను, విప్లవశంకగాను కలిగించని ప్రాంతము లేదు.

బెంగాలు మొదలు పంజాబువరకూ ఉత్తరఖండమంతా బాహాటంగా ఎదురు తిరిగింది. ఇతర ప్రాంతాలలో, ఆయా ప్రదేశాల ప్రత్యేక సందర్భాలను బట్టి, బాహాటమైన ప్రకోపాతం జరుగకపోయినప్పటికీ, అసంతృప్తి, అశాంతి, సర్వసాధారణమై గోచరిస్తూనే ఉండినవి. పాశ్చాత్య విద్యాభ్యాసానికిలోనై, క్రొత్తగా సృష్టిలోకి వచ్చిన, మధ్యతరగతి వర్గమొక్కటే మాత్రమే విప్లవానికి సహాకరించనిది. కాని, వారతి స్వల్పసంఖ్యాకులు, రాజధాని పట్టణాలలో నివసించేవారూ మాత్రమే. వీరినిగురించి, ట్రవిలియన్ (Trevelyan)— "బ్రిటీషు వారి కుత్తుకలు కోయడాన్ని గురించి కాదు వీరి ఆలోచన ప్రయత్నము. భారతీయులపై జరిగే అభియోగ విచారణలలో, జూరీ (Jury) సభ్యులుగా బ్రిటీషు వారితో సహచరించడమో, లేదా, న్యాయాధిపతి స్థానాలాక్రమించడమో, వీరి ఆశయము. పంజాబు, నేపాల్, ప్రాంతాలలోని రాజకీయపరిస్థితులను గూర్చి వీరు విచారించినవారు కారు. ముద్రణ సౌకర్యాలనుగూర్చి, స్వాతంత్ర్యవాదోపవాదావకాశాలనుగూర్చి, ఆడంబరమైన ఆంగ్లోపన్యాసాలివ్వడం, వీరి కార్యక్రమము. దీని నిర్వహణకై, వీరు, చర్చాసంఘాలను కూడా సమలోకాము ఏర్పరచుకొని యుండిరి."— అని వెటకారంగా విమర్శించినాడు.

పరిస్థితులిటువంటివి కావడంవల్ల, విద్యావంతులైన బెంగాలీలు విప్లవానికి విముఖులై, ఉద్యమంయొక్క పిలుపు నందుకోలేదు. కాని, ఉత్తరభారత సైనికులతో కూర్పబడిన సైన్యం కావడంవల్ల, అది బ్రిటీషుప్రభుత్వానికి ఎదురు తిరిగింది. కలకత్తాకు 16మైళ్ళ దూరంలోనున్న బ్యారక్‌పూర్ స్థానంలో, 1857, మార్చి 29వ నాడు, మంగల్‌సింగ్ అనే సిపాయి, సైనిక వ్యూహాన్ని అతిక్రమించి నిలబడి, తమ మత సంరక్షణార్థము ఎదురు తిరిగి పోరాడవలసిందని, తన సహచరులను హెచ్చరించినాడు ఆ పిమ్మట, కలకత్తాలో ఉత్పాతాలు కలుగుతున్నవనే శంక, కొన్ని నెలల పర్యంతం వ్యాప్తమైయుండినది. యూరోపియనులు నిరంతరమైన భయభ్రాంతులకులోనై యుండిరి. కలకత్తాకు వెలుపల, బీర్‌భూమ్, బంకూరా, జెస్సోర్, కృష్ణగర్, మాల్డా, ఢక్కా, ఫరిద్‌పూర్, బాకర్‌గంజ్, టిప్పేరా, సిల్‌హెట్, చిటగాంగ్, ఖాసీ, జైంతియా పర్వతాలు— ఇత్యాది ప్రదేశాల్లో సైనికవిజృంభణాలు జరిగినవి. భయోత్పాతం ప్రబలింది.

అస్సాం : 1833 నాటినుండి అస్సాములోని సంఘటనలు వేగంగా ప్రవర్తిల్లినవి. అస్సాముదేశపు కడపటి ప్రభువైన పురందరసింగునుంచి రాష్ట్రాన్ని

బ్రిటీషువారు దౌర్జన్యంగా, లాక్కొన్నారు. బ్రిటీషుపరిపాలనా విధానాన్ని, రాష్ట్రింపై బిగించి, ప్రజలను క్రూరంగా అదిమిపెట్టి, ఏడ్పించినారు. మంత్రిగా ఉండిన మణిరామ్‌దత్తా, 1853లో, బ్రిటీషుప్రభుత్వానికి తమ స్థితిగతులను మనవి చేసుకొంటూ, "ప్రభువులైనవారు, రుజుమార్గంలో నడుస్తూ, న్యాయసమ్మత మైన పద్ధతిలో, ప్రజల క్షేమాన్ని గుర్తిస్తూ, పరిపాలన నడపవలెనని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ఈ సూత్రా లేమాత్రమూ, ఇప్పుడు పాటింపబడడంలేదు. పైగా, వాటికి విరుద్ధమైన విధంగా, పరిపాలన జరుగుతూఉంది. ఈ కర్తవ్యలో పాలనూ, పాపాచరణలకూ, తగిన ప్రతిఫలాన్ని, జీవితపు సరిహద్దులలోపుననే, తప్పక అనుభవించవలసి ఉంటుంది". అని హెచ్చరించి, పూర్వపు దేశీయపరిపాలన విధానాన్ని, పునః నెలకొల్పవలసిందిగా కోరినాడు. కాని, ఈ మనవిని, స్థానికాధి కారులూ, గవర్నర్ జెనరలూ, కూడా త్రోసిపుచ్చినారు.

1857లో, విప్లవం చెలరేగినప్పుడు, మణిరామ్, కలకత్తాలో ఉండినాడు. సదుద్దేశంతో తాను గావించిన మనవులు తిరస్కరింపబడడంతో, విసిగినవాడై, తన అదృష్టాన్ని విద్రోహుల అదృష్టంతో ఐక్యం గావించినాడు. ఇతడు పంపిన సందే శాలనందుకొన్న, ప్రాచీనకులీనవంశీయులు, ఏకీభావంతో, 1857, శుక్లాష్టమి నాడు విప్లవోద్యమాన్ని, ఆరంభించడానికీ, అస్సాము కడపటి ప్రభువుకుమారు డైన కందర్పేశ్వరసింగును సింహాసనంపై నిలపడానికీ నిశ్చయించిరి.

కాని, ఒక వార్తాహరుని అజాగ్రత్తవల్ల, ఈ తంత్రాంగం, బయటపడింది. వెనువెంటనే ప్రభుత్వం దీన్ని అణచివేసే ప్రయత్నంచేసింది. రాజనగరులోనే, కందర్పేశ్వరసింగును బందీగా పట్టుకొన్నారు. మణిరామును కలకత్తాలో ఖైదు చేసినారు. మణిరామ్‌పైనా, పియాలీ బారువాపైనా, విచారణసాగించి, ఇరు వురినీ ఒక్కసారే 1858, ఫిబ్రవరి 26వ తేదీ, ఉరదీసిరి. ఇతరులు వేర్వేరుకాలాల కారాగారశిక్షకు గురియైరి. తమ స్వాతంత్ర్యాన్ని పునః సంపాదించుకోడానికై అస్సాము కులీనవంశీయులు గావించిన ప్రయత్నము, ఈ విధంగా విఫలమయింది.

***ఒరిస్సా :*** ఒరిస్సాలోని పరిస్థితులువేరు బ్రిటీషు వారా ప్రాంతాన్ని 1803లో, సంయోజితపరచుకొన్న తర్వాత, మూడింట రెండువంతుల, ఒరియా జమీందార్లను, పూర్తిగా నిర్మూలించివేసి, ఆ ప్రదేశాల్లో, బెంగాలీ జమీందా ర్లను నెలకొల్పిరి. కర్షకవర్గంవారికి కూడా ఎక్కువ ఒత్తిడి కలిగింది. అందులో ముఖ్యంగా, ఇదివరకూ ఒరిస్సాపాలకుల రాణువసైన్యంగా (ప్రజాసైన్యం) ఉండిన 'పాయికులు' అనేవారిని, బ్రిటీషుప్రభుత్వం యొక్క నీచకింకరులు (Underlings) అణగద్రొక్కి, బలాత్కారంగా డబ్బు వసూలుచేస్తూ, పీడించి నారు. గుంసూర్, బాద్, అంగూల్ ప్రాంతాలలోని ఒరిస్సాప్రభువులు, బ్రిటీషుప్రభుత్వపు అధీశతను ధిక్కరిస్తూ ఉన్నందువల్ల, దశాబ్దాలుగా ఒరిస్సా ప్రాంతం, కల్లోలానికి లోనై ఉండినది. ఆ ప్రాంతంలో నివసిస్తూ ఉన్న 'ఖోండులు' అనే ఆదిమజాతులవారు కూడా బ్రిటీషుప్రభుత్వము కలిగించిన బాధలకు గురియై, ఎదురుతిరిగి యున్నారు.

ఈ విధంగా, అసంతుష్టికి లోనైయున్న వర్గాలన్నీ చేతులు కలపడంతో, 1857లో విషమపరిస్థితి ఏర్పడింది. హాజారీబాగ్ కారాగారంలో ఖైదీలుగా ఉండిన, సురేంద్రసాహీ, ఉజ్జల్‌సాహీ, అనే సంభల్‌పూర్ రాజకుమారులను విద్రోహులైన సిపాయిలు విడుదల చేసినారు.

ఇట్లు నియుక్తులైన ఈ రాజకుమారులు విప్లవోద్యమంలో నాయకులైనారు. విప్లవసూచకమైన పతకాన్ని ప్రతిష్ఠించి, బ్రిటీషు అధికారాన్ని తిరస్కరించిరి. సంభల్‌పూర్ పరిసరప్రాంతమంతా, తాత్కాలికంగా, ఈ ప్రతియోధ సైన్యానికి హస్తగతమయింది. 1862వ సంవత్సరం నాటికిగానీ, సురేంద్రసాహీ లొంగిపోలేదు. అతనిని దేశాంతరవాసం పంపడం జరిగింది. ఆ తర్వాతనుండీ, భూస్వాములూ, రైతులు కూడా తమ రాజును సింహాసనస్థుని మరల ప్రతిష్ఠింప వలసిందని కోరుతూ, బ్రిటీషుప్రభుత్వానికి మహజర్లు పంపుతూనే వచ్చినారు.

పర్లాకిమిడీ జమీందారీలో, గంజాం జిల్లా ప్రాంతపు 'సవరులు' అనే ఆటవిక జాతివారు తిరగబడి, రాధాక్రిష్ణ దండసేనయొక్క నాయకత్వంకింద ప్రతిఘటన గావించిరి. కుటియాఖోండుల తిరుగుబాటు కూడా జరిగింది.

*ఛోటా నాగపూర్ :* ఛోటా నాగపూర్, ఆ కాలంలో, బెంగాలులోని భాగము. పలమావ్, హాజారీబాగ్, రాంచీ, సింగభూమ్, మన్‌భూమ్, సంభల్‌పూర్ జిల్లాలలో తిరుగుబాట్లు జరిగినాయి. ఈ ప్రతియోధులు చేస్తూ వచ్చిన దాడులను తిరుగగొట్టడం, అచ్చటచ్చట ఉదయిస్తున్న ప్రతిఘటనలను ఆపడం, హక్కులేని అధికారపదవులకై ప్రయత్నిస్తున్న కపటులను అణచివేయడం, సాయుధులైన దోపిడిగాండ్రను వెంటాడి నశింపజేయడం, ఆకస్మిక దాడులవల్ల, గోల్పోయిన ప్రాంతాలను మరల వశపరచుకోవడం, తమకు కలిగిన బాధలకు ప్రతీకారం గావించడం,- ఇత్యాది అతికష్టసాధ్యమైన కార్యక్రమానికి బ్రిటీషు ప్రభుత్వము పూనుకోవలసినంతటి తీక్ష్ణమైన పరిస్థితి రాష్ట్రంలో ఏర్పడింది.

బ్రిటీషు ప్రతిరోధకమైన ఈ ఉద్యమంలో చేరినవారిలో, ఆదిమజాతుల వారూ, భూస్వాములూ ముఖ్యులు. తిరుగుబాటొనర్చిన సైనికులకూ, విరోధ భావంతో ఉన్న జమీందారులకూ కూడా, లక్ష్యమొక్కటే అయింది. బాబూ కున్‌వార్‌సింగ్ యొక్క సైన్యంతో తమ సైన్యాన్ని కలపడం వీరి ప్రధానోద్దేశము. పొరహాత్ రాజా, నాయకుడుగా నడిపిస్తూఉన్న సింగభూమ్‌కోలులూ, పలమావ్ ప్రాంతపు ఖేరో, ఖైర్‌వార్ జాతులూ కూడా, బ్రిటీషువారికి వ్యతిరేకించి నిలిచి, పెక్కు మాసాల దాకా, గొరిల్లా యుద్ధాన్ని సాగిస్తూ వచ్చినారు.

*ఉత్తర భారతదేశము :* బెంగాలు సరిహద్దునుంచి పంజాబు ప్రాంతం వరకూ, విస్తరించియున్న సువిశాలమైన మైదానంలో, విప్లవము ఎక్కువవ్యాప్తి చెందింది. ఈ విప్లవము వ్యాపించిన దూరాన్నీ, అది ఆవరించిన పరిధినీ కించ పరచి వాదించే విమర్శకులు కూడా, ఒక సత్యాన్ని అంగీకరించక తప్పింది కాదు. సువిస్తృతమైన ఈ మైదానప్రాంతంలోనైనా, విప్లవము, సార్వజనికమైన ఉద్యమ రూపాన్ని పైకొన్నది, అనే విషయము వాస్తవమని ఒప్పుకోక తప్పదు. ఔధ్,

రోహిల్‌ఖండ్, బుందేల్‌ఖండ్ ప్రాంతాల్లో,- అలహాబాద్, ఆగ్రా, మీరట్, సైనికదళాలున్నూ, పశ్చిమబీహారులోని ప్రజానీకము అత్యధికభాగమున్నూ, బ్రిటీషు ప్రభుత్వాన్ని ఎదిరించి నిలబడినవి. ఈ పౌరుల తిరుగుబాటూ సైనికుల తిరుగుబాటూ కూడా, ఒకే సమయంలో జరిగియుండడం గుర్తించదగినది.

ఈ విషయమై, డా. ట్వీడీకి (Dr. Tweedie) —— 1857, డిసెంబర్, 10వ దినం,—— వ్రాసిన డఫ్ (Duff) ఈ విప్లవ స్వభావాన్ని చక్కగా అవగాహన చేసుకొన్నాడు. "ఇది విప్లవమనడం నిజము. ఐనా, ఈ విప్లవము ఇటీవల సంభవించిందీ కాదు; పుట్ట గొడుగువంటి క్షుద్రమయిందీ కాదు, అనే వాస్తవాన్ని కొత్తగా లభించిన ప్రతిసాక్ష్యమూ బలపరుస్తూ ఉన్నది. హిందువులనూ, ముస్లిములనూ కూడా అస్వాభావికమైన సమ్మేళనంగా కూర్పగలిగిన ఈ విప్లవము, అసాధారణమైనట్టిది. ఔధ్ ప్రాంతపు ప్రజానీకమంతా స్పష్టంగాపోషిస్తూ, ఆదుకొంటూ ఉన్న ఈ విప్లవానికి, ప్రత్యక్షుంగానూ, పరోక్షుంగానూ, కూడా, పరిసర ప్రాంతాలన్ని- సగం భాగానికి పైగా- తమ సానుభూతి సహకారాలను అందజేస్తున్నాయి."—— అని అతడు విశదపరచియున్నాడు.

*బీహార్* : ఈ మైదానపు తూర్పుభాగమైన బీహారులో విప్లవ ప్రథమ సూచనలు రోహినీవద్దనూ, సంతాల్ పరగణాలలోనూ గోచరించినవి. ఈ రెండు ప్రదేశాలలోనూ దేశీయసైన్యము అధికారులపై బడింది. అసంతుష్టిలో, కుములుతూ ఉన్న బీహారుప్రాంతమంతా, శీఘ్రమే, బాహాటంగా విజృంభించింది. గంగ కవతలి ఒడ్డున ఉత్తరజిల్లాలలోనూ- పూర్ణియానుండి చంపరాన్ వరకూ తూర్పువనూ, సర్వత్రా చాలకాలంగా పొగరాజుకొంటూ ఉండిననిప్పులు, ఒక్కసారిగా భగ్గుమన్నాయి. షహాబాద్, పాట్నా, గయా, జిల్లాలు ఈ విప్లవాగ్ని ప్రజ్వలనానికి కేంద్రములైనవి. జగదీశపురపు బాబూ కున్‌వార్‌సింగూ, అతని మరణానంతరం అతని తమ్ముడు అమార్‌సింగూ, విద్రోహసైన్యాన్ని నడుపుతూ వచ్చినారు. కొంతకాలం వరకూ, బీహారు భాగాలలో బ్రిటీషు అధికారాన్ని కూలపడద్రోసి, వీరు తమ అధికారాన్ని నెలకొల్పినారు.

సిపాయీలలో ఉత్పన్నమైన ఈ విప్లవము, శీఘ్రమే పౌర జనానీకానికి కూడా వ్యాప్తమయింది. ఒక బ్రిటీషుసైన్యాధికారి,—— "ప్రథమంలో సైనికుల తిరుగుబాటుగా పైకి గోచరిస్తూ వెలువడిన కల్లోలము, అమితవేగంతో తన స్వభావాన్ని మార్చుకొని, జాతీయవిప్లవంగా సిద్ధించింది. బీహారులోని రజపుత్ర గ్రామాలూ, బనారస్, ఆజింఘర్, గోరఖ్‌పూర్‌జిల్లాలూ, నదీ మధ్యసీమలు సమగ్రమూ, అలహాబాద్, కాన్‌పూర్, మీరట్, ఆగ్రా ప్రాంతభాగాలూ, రోహిల్‌ఖండ్, ఔధ్‌ప్రాంతసీమలూ, అన్నికూడా మన పరిపాలనను త్రోసివేసి, మనపై యుద్ధాన్ని ప్రకటించినవి."—— అని వ్రాసినాడు. పాట్నాభాగానికి కమీషనరుగా నుండిన శామ్యుయెల్స్ (Samuells) బెంగాలు ప్రభుత్వానికి వ్రాస్తూ "షహాబాదులో బయలుదేరిన ఉద్యమము జాతీయవిప్లవ ప్రతిష్ఠకు అర్హమైన స్థితికి వచ్చింది."—— అని నివేదికలో తెలిపినాడు. "ఛుప్రాకు పడమరనున్న జిల్లాల

లోని ప్రజలు బాహాటమైన విప్లవాన్ని లేవదీసినారు."— అని టెయిలర్ (Teyler) ప్రభుత్వానికి తెలియజేసినాడు.

బీహారులో హిందూముస్లిములు చేతులుచేతులు కలిపి యుద్ధంచేసినారు. 1845-46లో ప్రభుత్వానికి విరుద్ధంగా వీరుపరస్పరం సహకరించియుండినారు. 1857 లో విప్లవము ఉత్పన్నంకావడంతో, వీరుమళ్ళీ ఐక్యమైతో ఎదిరించినిలిచినారు. ఈఐక్యత పాలకులకు నచ్చలేదు; హిందూముస్లిముల ఐక్యము వారి అభిరుచులకు విరుద్ధమైనట్టిది. హిందువులకుగలిగిన కష్టాలను ముస్లిములుఉపయోగించుకొని, ఈకుట్రను లేవదీసినారని బ్రిటీషువారు అభిప్రాయపడినారు. కాని, బీహారులోమాత్రమేకాక, దేశపుఇతర ప్రాంతాలలోకూడా, ఈ రెండుమతస్థుల వారూ ఏకమై సమానంగా, యుద్ధచర్యలు బూనుకోవడం గొప్ప విశేషమైన విషయము. బీహారువిషయమై, పాట్నాకమీషనరు టెయిలర్ (Teyler) ఇదివరకే దీనిని ధ్రువపరచి యున్నాడు. పూర్వముండిన పోలీసు సిబ్బందిని తీసివేసి క్రొత్తగా సిబ్బందిని ఏర్పరచవలెననీ, "ఆ క్రొత్త సిబ్బందిలో రజపుత్రులకూ, బ్రాహ్మణులకూ, ముస్లిములకూ ప్రవేశం కల్పించరాదని," ఇదివరకే ఆయన ప్రభుత్వానికి సలహా ఇచ్చియున్నాడు. బీహారులో ఉత్పన్నమైన విప్లవంయొక్క సాధారణ స్వభావాన్ని గమనించి, బ్రిటీషు ప్రభుత్వము, ఉత్తర దక్షిణ బీహారుప్రాంత మంతటా సైనికశాసనాన్ని అమలులో పెట్టింది.

మౌల్వీలు, పండితులుకూడా విప్లవోద్యమాన్ని ప్రోత్సాహం పరచినవారే. పాట్నా విభాగంలో, పీర్ ఆలీవంటి ముస్లిము నాయకులు విప్లవాగ్నిలో ఆజ్యం పోసినారు. జమీందారు వర్గంలో, హిందువులూ ముస్లిములూ కూడా [illegible]రిపక్షం చేరినారు. సద్దిక్ పూర్ మౌల్వీలు, నమీదార్ ఖాన్ వారసులు, నర్హత్ జమీందారు, నవాడా ప్రాంతంలోని హిందూముస్లిం భూస్వాములు, జహనాబాద్ రాజగీర్, అమర్తు, అమానాలోని రెండుమతాల భూస్వాములు,— ఇత్యాదు లందరూ కలిసి, ఏకకట్టుగా బ్రిటీషు అధికారాన్ని ఎదిర్చినారు.

బీహారు నాయకులందరిలోకీ ప్రముఖవ్యక్తి, వృద్ధుడైన బాబూకున్వార్ సింగ్. షహాబాద్ జిల్లాలోని జగదీశ్ పూర్ వాస్తవ్యుడితడు. విప్లవోద్యమాని కంతకూ ఇతడు కేంద్రస్థానము. అతని శౌర్యసాహసాలూ, వ్యవస్థాపనా చాతుర్యమూ,— వ్యూహనిర్వహణ వివేకమూ,— ఇత్యాదులు శత్రువుల మెప్పునుకూడా పొందినవి. పీర్ ఆలీ, యూసుఫ్ ఆలీ, ఇమాముద్దీన్, మొదలైన నాయకుల అధీనంలోఉన్న సైన్యవర్గాలన్నీ కున్వార్ సింగ్ కు సహకరించినవి. అదేవిధంగా, ఢిల్లీనుండివచ్చి తమతోచేరిన ఆలీకరీం, వారిస్ ఆలీ, మున్నగు నాయకుల దళాలు కూడా ఇతనికి తోడ్పడినవి. దినాపూర్ లో సైన్యం తిరుగుబాటు చేసిన సందర్భంలో, సైనికులు, ఢిల్లీపాదుషాపరంగా, రణగర్జనలు గావిస్తూ, కున్వార్ సింగును తమ సేనాధిపతిగా, ప్రకటించినారు. బీహారును కేంద్రంగా చేసుకొని, యుద్ధకార్యక్రమాలను, రీవా, బందా, కాల్పి ప్రాంతాలవరకూ నడిపించినాడు కున్వార్ సింగు. మరిన్ని— కాన్ పూర్ జిల్లాలో బ్రిటీషువారికి విరుద్ధంగా

పోరాడుతూ ఉండిన నానాసాహేబుకు సహాయముచేసినాడు. కాన్‌పూర్‌నుండి లక్నో వెళ్ళి, అనంతరం బీహారుకు తిరిగివచ్చి, అందే, 1858లో జరిగిన యుద్ధంతో పరాక్రమోపేతంగాపోరాడి, వీరస్వర్గాన్ని చేరుకొన్నాడీస్వతంత్రయోధుడు.

**ఉత్తరప్రదేశ్** : ఆనాడు- 'పశ్చిమోత్తర ప్రాంతాలూ- ఔధ్' - అని వ్యవహరింపబడుతూఉండిన ఉత్తరప్రదేశ్‌లో, విప్లవచైతన్యము అతిభయావహంగా ఉండినది. మొగల్ సామ్రాజ్యానికి హృదయపేటికా, భారతీయ సైనికులకు గృహారామమూ, ఐనది ఈ ప్రాంతము. హిందువుల పుణ్యక్షేత్రాలూ, ప్రాచీనకాల మధ్యకాలాలకు సంబంధించిన సాంస్కృతిక కళాక్షేత్రాలూ ఈ ప్రాంతంలో ఉన్నాయి. ఢిల్లీ, ఆగ్రా, లక్నో, మధుర, అయోధ్య, ప్రయాగ్, బనారస్,- ఇత్యాది ప్రదేశాలన్నీ మరపురాని భారతీయుల పురాతనజీవితాన్ని, స్మృతికితెచ్చే ప్రదేశాలు, ఈ ప్రాంతంలో నెలకొని ఉన్నాయి. భారతీయుల సోత్సాహోత్కంఠులతో సంగతములై యున్న ఈ ప్రదేశాలన్నీ, వారు సాధించిన మహత్కార్యములకు సాక్ష్యములై నిలిచియున్నాయి. భారతదేశంయొక్క, ప్రాచీనాధిపత్యానికీ, ప్రాభవానికీ. లాల్ ఖిల్లా (Red fort) ఒక స్మారక చిహ్నమై నిలిచిఉంది.

ఉత్తరప్రదేశంలోని ఎనిమిది భాగాల్లో, ప్రతి ప్రాంతమూ కూడా తీక్ష్ణమైన ఉద్రేకానికి లోనై ఉంది. అనేకప్రదేశాల్లో బ్రిటీషుపరిపాలన కార్యకారి కాక, పూర్తిగా లోపించింది. అస్వాస్థ్యమూ, కల్లోలమూ, సువ్యాప్తమై ఉండినవి. 1857, మే 10 వ నాడు ఉత్పన్నమైన తిరుగుబాటు, ప్రాంతమంతటా జరుగవలసిన ప్రతిభటనకు సంకేతమయింది. సైనికదళాలు లేనిప్రదేశాల్లో పౌరవర్గంవారు విప్లవానికి నాయకత్వం వహించినారు. తక్కిన ప్రదేశాలలో సిపాయిదళాలు విప్లవోద్యమాన్ని లేవదీయగా, పౌరవర్గంవారు దాన్ని వెంటనే అనుసరించి ప్రవర్తించినారు.

పౌరవర్గంలో, విప్లవనాయకులు, భూస్వాముల శాఖనుంచీవచ్చినవారు. గుజార్లూ, జాటులూ, రంఘారులూ మున్నగువారిందులో ముఖ్యులు. కాని, రజపుత్రులూ, చౌహానులూ, బాయీలూ, బచ్‌గోటీలూ, గౌరులూ, పన్‌వారులూ, ఇత్యాదులు,—ప్రాంతమంతటా చెదిరియుండి, ఈ ఉద్యమానికి ప్రదానంగా ఆధారమైనారు. మౌల్వీలూ, పండితులూ, బీహారులోవలెనే, ఇందుసూ, ప్రజలను విప్లవోద్యమానికి పురికొల్పడంలో ప్రధానపాత్ర వహించినారు.

ప్రతిచోటా, విద్రోహులు అత్యధికసంఖ్యలో బ్రిటీషు అధికారాన్ని ధిక్కరిస్తూవచ్చినారు. సైన్యంలోని సిపాయీలు మాత్రమేకాక, దేశీయప్రభువుల సేవలోనూ సర్దారులసేవలోనూఉండిన,అసంఖ్యాకులైన సైనికులూ, భూస్వాముల ఆశ్రితులుకూడా ఈ విప్లవంలో చేరిపోయినారు. ఢిల్లీముట్టడిలో వీరిసంఖ్య 40 వేలు నుండీ, 60 వేలవరకు ఉండినట్లు మెటాకాఫ్ (Metcalfe) అంచనావేసినాడు. కాన్‌పూర్‌లో నానాసాహేబు నాయకత్వంక్రింద 58000 మంది అనుయాయు

లుండినారు. అందులో 20 వేలమంది సైనికశాఖలోనివారు. ఖాన్‌బహదూర్ ఖాన్ ఆధిపత్యంలో అనేక సహస్రాల రజపుత్రులూ, రోహిల్లాలూ ఉండినారు. ఫైజుబాద్ జిల్లాలలో, శంకర్‌పూర్ సర్దారైన రాణాబేనీ మధోసింగ్ అధీనంలో 15వేలమంది సైనికులున్నారు. మొత్తం 80 వేలమంది పోరాడినారు.

గోరఖ్‌పూరు విభాగంలో, గజధర్ సింగ్ నాయకత్వంలో 51 వేలమంది సైనికులు, తరై అరణ్యాలలో నిలిచి, బ్రిటీషుప్రభుత్వాన్ని ఎదిరించినారు. గోరఖ్‌పూర్ నజీంఐన మహమ్మద్ హుసేన్‌ఖాన్, పదిపంద్రెండువేలదాకా సైన్యాన్ని నడిపించినాడు. అందులోసగభాగం సిపాయీలు. స్వయంగా పోరాటంలో పాల్గొంటూఉన్నవారిసంఖ్య ఐదులక్షలకుపైగా ఉన్నదనడం అతిశయోక్తి ఏమాత్రమూకాదు. ఈ సైనికసంఖ్య అల్పమనలేముకదా!

భూస్వాములందరూ విప్లవంలో చేరలేదనడమూ వాస్తవమే. వారిలో పలువురు బ్రిటీషువారిపట్ల భక్తివిశ్వాసములు కలవారు. మరికొందరు మధ్యస్థంగా నిలిచియుండి, గెలిచిన వారిపక్షము చేరేవారు. అట్లున్నప్పటికీ, అనేకులు విప్లవోద్యమంలో చేరినారనడంలో, ఏమాత్రమూ సందేహంలేదు. గోరఖ్‌పూర్‌కు చెందిన మీర్ మహమ్మద్ హసన్, సుల్తానుపూరుకు చెందిన మెహదీహసన్,— మొదలైనవారు ఇందుకు దృష్టాంతాలు. వీరి కార్యక్రమాలు, అనుష్ఠితో సమమవౌతున్న, అనేక హిందూ ముస్లిముప్రభువులను విప్లవోద్యమంలో చేరడానికి ఉత్సాహపరచినవి. ముఖ్యంగా, బహరైచ్, గోండా, సుర్దా, ఫైజాబాదు ప్రాంతాల్లో అత్యధికమైన కల్లోలాన్ని లేవదీసినారు. బందాలో "విప్లవోద్యమానికి అంకితంకాని గ్రామమొక్కటి కూడా లేదు".

ఢిల్లీ : విప్లవసూచక ఘంటానినాదం మీరట్‌లో మ్రోగడంతో 1857, మే 10వ నాడు విప్లవసైన్యం ఢిల్లీకి నడిచింది. న్యాయసమ్మతమైన తన భారత సార్వభౌమ పదవిని మరల చేపట్టవలసిందిగా బహదూర్‌షాను, సైనికులు ప్రార్థించినారు. అందులోగల అపాయపరిస్థితి తెలిసియున్నా, తన సందేహాలను త్రోసివేసి, అతడు ముళ్ళకిరీటాన్ని ధరించటానికి ఒప్పుకొన్నాడు. బహదూర్‌షా గావించిన ఈ సూచన ప్రబల ఉత్తేజకమయింది. బ్రిటీషువారి ఆడంబరమూ, న్యాయవిరుద్ధమైన వారి ఆధిపత్యమూ, బైటపడినవి. న్యాయరీత్యా, నైతికరీత్యా కూడా, బ్రిటీషువారొనర్చింది అన్యాయాక్రమణమని స్పష్టమయింది.భారత సార్వభౌముడు వీరికి 'బెంగాలు దివానీ' అప్పచెప్పడం,– పన్నులు వసూలుచేసే అధికారం మాత్రం ఇవ్వడమే. కనుక బ్రిటీషువారు, సార్వభౌముని కొలువులోని అధికారులుమాత్రమే. ప్రభునిష్ఠాపరులై యుండవలసిన బ్రిటీషువారు, ఆ నీతిని విడనాడి, తమకు విరోధులై దౌర్జన్యంనెరపి, విశ్వాసఘాతకులైనారు. బ్రిటీషు పరిపాలనపట్ల తిరస్కారభావమూ, దానిని నిర్మూలించవలెననే ఆవేశమూ, ఝంఝామారుతంగా బయలుదేరి, దేశం అన్నివైపులా వ్యాపించింది. దేశీయసైనికులున్న సేనాస్థావరాలన్నిటిలోనూ, దేశంలోని పట్టణ గ్రామసీమలన్నింటనూ, దీనిప్రభావం కార్యకారి అయింది.

ఉత్తరభారత మధ్యసీమలోని విప్లవము అఖండమైన ప్రజాఉద్యమంగా పరిణమించింది. ఔధ్‌తో సహా ఉత్తర ప్రదేశం సమస్తమూ, బీహారులో పెక్కు జిల్లాలూ, ఛోటానాగ్‌పూర్, మధ్యభారతము, మాల్వా, బుందేల్‌ఖండ్, మధ్య ప్రాంతము, – అన్నీ కూడా యుద్ధానికి సిద్ధపడినాయి. యుద్ధమూ, ఘాతుక చర్యలూ, అన్నిప్రదేశాలలోనూ జరిగినవి. క్రోధావేశాలు నిరంకుశంగా ప్రవర్తిల్లినవి; బీభత్సములైన ఘోరచర్యలు జరిగినవి. ప్రాంతంలోని అందరి దృష్టీ ఢిల్లీపై కేంద్రీకరింపబడియున్నది. బహదూర్‌షా, రాజ్యాధిపత్యాన్ని వహించడంతో, బ్రిటిషు ప్రభుత్వ నిర్మూలనకు బూనుకొన్న వారందరూ ఏకమై, ఏకైక ప్రయోజనంతో ముందుకు నడిచినారు. విప్లవసైన్యవర్గాలు ప్రథమావేగంలో, ఢిల్లీకి నడిచినారు. తాము ముఘల్ సార్వభౌముని ప్రతినిధులమనీ, నియోగులమనీ, విప్లవనాయకులు తామే ప్రకటించుకొనిరి.

బ్రిటీషువారు ఢిల్లీని ముట్టడించడమూ, ఆ ముట్టడి రెండు నెలలదాకా (మే 11 నుండి సెప్టెంబరు 20 వరకూ) సాగడమూ జరిగింది. ఈ ముట్టడికాలంలో ఢిల్లీ కోటలో జరిగినచరిత్ర, విభిన్నములూ,పరస్పరవిరుద్ధములూ,ఐన ఉదంతాలతో సమ్మిశ్రితమైనది. వీరోచితశౌర్య సాహసప్రవృత్తి ఒకచోట, స్వామిద్రోహకార్యాచరణం మరియొకచోట – ప్రవర్తిల్లినవి. పౌరపరిపాలనలోనూ, యుద్ధకార్యాచరణలోనూ దినదినం ఎక్కువగుతున్న కష్టపరంపరలూ, ప్రధాన మంత్రివర్గం వారి భేదాభిప్రాయాలూ, వారి విభిన్నములైన సలహాలూ, విప్లవనాయకుల పర్వతోపమానమైన నిశ్చలస్థితీ, – ఇత్యాది విలక్షణాంశాలతో ఏర్పడింది నాటి చరిత్ర. ఢిల్లీలో ఐక్యమునూ, క్రమ వ్యవస్థనూ నెలకొల్పడానికి ప్రయత్నిస్తూ, ముట్టడిని భగ్నంచేయడానికి తగిన తీవ్రప్రయత్నాలనుగూర్చి యోచిస్తూ, బహదూర్‌షా, అధిక చింతాభారాన్ని సహిస్తూ, తనబాధ్యతను నిర్వహిస్తున్నాడు. ప్రభుత్వకార్యకలాపాలను నిర్వహించడానికీ, సమస్తములైన పౌర, సైనిక వ్యవహారాలలో నిర్ణయాలు తీసికొనడానికీ, సమర్థమైన ఒక సంఘం నియమింపబడింది. ఈ సభలో సైన్య ప్రతినిధులూ, పౌరాధికార ప్రతినిధులూ కూడా కలరు.

ప్రథమంలో, రాజకుమారులే సైనికాధిపత్యం వహించినారు. కాని, జూలైలో బరైలీనుండి బఖ్త్‌ఖాన్ రావడంతో ప్రధాన సైన్యాధిపత్యం అతనికిచ్చినారు. కాని, అన్ని విషయాల్లోనూ సమానతలేని రెండు పక్షాలవారికి జరుగుతున్న యుద్ధమిది. బ్రిటీషువారి సైన్యం, సుసంయోజితమూ, సువ్యవస్థమూ, ఐనట్టిది. ఆయుధబలాలూ, ఇతర పరికరాలూ, దినదినం వారికి వృద్ధి అవుతూ ఉన్నాయి. విప్లవసైన్యము కోటపరిసరాలకు మాత్రమే బంధింపబడి, అనుభవం చాలని అధికారులచే నడపబడుతూ ఉంది. దిన దినం వ్యయమైపోతూఉన్న ఆయుధ పరికరాలూ, యుద్ధసామగ్రీ లభించే అవకాశంలేదు. ప్రతిబంధకాలిన్ని ఉన్నా, ఢిల్లీసైన్యం ధైర్యశౌర్యాలతో ముట్టడిని ఎదుర్కొని నిలిచి, ముట్టడించియున్న బ్రిటీషు సైన్యాలపై పలుమార్లు దాడిసాగించింది. ఒక

సందర్భంలో, కోటపై ముట్టడిసాగిస్తూన్న బ్రిటీసు సైన్యమే ముట్టడికి లోనయింది. కాని, బ్రిటీషు వారికి పంజాబునుండి సహాయకబలం అధికంగా రావడంతో, పరిస్థితులు తారుమారైనాయి. పర్యవసానంగా ఢిల్లీ లొంగి పోయింది.

పరిసర జిల్లాల భావిగతి, ఢిల్లీ భావిగతిపై ఆధారపడినట్టిది. గుర్‌గామ్ జిల్లాలోని సరదార్లూ, ప్రజలూ, తమ జీవితాలను ఢిల్లీసార్వభౌముని పక్షానికి అంకిత మొనర్చియుండిరి. ఢిల్లీ సార్వభౌముని పక్షంలో నిలబడిన హిస్సార్, రోహతక్ జిల్లాలుకూడా, ఆవిధంగానే బ్రిటీషువారికి లొంగిపోయినాయి.

*ఢిల్లీ వెలుపల జరిగిన విప్లవాలు :* ఢిల్లీలో ఆరంభమైన విప్లవాగ్ని ప్రవృద్ధి చెంది, చుట్టూప్రసరిస్తూ, దేశాన్నంతటినీ ఆక్రమించింది. మొదట, అది ఢిల్లీ పరిసరజిల్లాలను ఆవరించింది. మేనెల 11, 12 తేదీలలో, గర్‌ధానా, భాగపత లలో ప్రతిఘటనలు జరిగినాయి. 13వ తేదీ, రూర్కీని విముక్తం గావించినారు. 26 వ తేదీనాడు బులందషార్‌లో మొఘల్ గవర్నరును నియమించినారు. మే 14, – ముజఫర్‌నగరూ, మే 20, – ఆలిఘరూ, జూన్ 30, – సహరాన్‌పూరూ, – విప్లవంలోచేరినవి. రాష్ట్రంలోని పశ్చిమ ప్రాంతాలలో అనేకవిధాలవిధంగా విప్లవాత్మకమై పోయినవి. రోహిల్ ఖండులో, మేనెలలో ఆరంభమయింది విప్లవము. ఆనెలకడపటిదినం, ఖాన్ బహదూర్ ఖాన్, పరిపాలనాధికారాన్ని వహించినాడు. బరైలీలో విప్లవమారంభించడంతో, – రాంపూర్, మురాదాబాద్, అమ్రోహా, బిజనోర్, బదాయూన్, షాజహాన్‌పూర్ – ప్రాంతాలలో కూడా తిరుగుబాట్లు బయలుదేరినవి. ఫరూకాబాదులో, నవాబ్ తఫజ్జుల్ ఖాన్ పరిపాలనను సిపాయీలు అంగీకరించినారు. ఫత్తేగర్, సీతాపూర్‌లు కూడా అతని ఆధిపత్యాన్ని ఒప్పు కొన్నారు.

ఆగ్రా : ఆగ్రా, మధురా, మైన్‌పురి, ఎటావాజిల్లాలు ఆగ్రావిభాగం లోనివి. ఆరాష్ట్రానికి ముఖ్యనగరమైన ఆగ్రా, – లెఫ్టినెంటు గవర్నరు నివాస స్థానము. ఢిల్లీనుండి వార్తలు రావడంతో ఈ ప్రాంతంలో సంక్షోభ సూచనలు గోచరించినాయి. అలిఘర్, బులందషార్‌లో జరిగిన సంఘటనలు, మైన్‌పూర్ లోనూ, (May 23), ఎటావాలోనూ (May 20), విప్లవాన్ని లేవదీసినవి. శీఘ్రమే ఆగ్రా, విప్లవ సైన్యానికి హస్తగతమయింది. భరత్‌పూర్ సైన్యాలు జూలై తొలిరోజుల్లో తిరుగుబాటుచేసినవి. ఆగ్రా సమీపంలోని సస్సియా వద్ద, బ్రిటీషు సైన్యాలను ఓడించినవి. విప్లవసైన్యము (జూలై-5.) లెఫ్టినెంట్ గవర్నరూ, బ్రిటీషు నివాసులూ ఆగ్రాదుర్గంలో, దాగుకోవలసివచ్చింది. మేనెల ఆఖరుకు, హత్రాస్, మధురా, తత్పరిసర ప్రాంతాలూ, బాహాటమైన విప్లవాన్ని సాగించినవి.

అలహాబాద్ విభాగము, ముందుగనే విప్లవ ప్రభావానికి గురిఅయింది. ఇచ్చట ఇరుపక్షాలవారు కూడా, అతి గర్హణీయము (అతినింద్యము) లైన చర్య లను గావించినారు. జూన్ తొలిరోజుల్లో, ఒక విప్లవము అలహాబాదులో ఉద్భవన్న

మయింది. శీఘ్రమే మౌల్వీఅయాకత్ అలీ, ఆధిపత్యము వహించడంతో గ్రామ సీమలంతటా, విప్లవాగ్నిజ్వాలలు వ్యాపించినవి. "పుట్టుకతో సాలెవాడూ, వృత్తిలోబడిపంతులూఐన, ఈ మౌల్వీ, పవిత్రజీవిత విధానము కారణంగా గ్రామంలో గౌరవాన్ని సంపాదించుకొన్నాడు. విప్లవము వ్యాపించడంతో, చైల్ పరగణాల ముస్లిం జమీందారు లితనిని తమకు నాయకుడుగా నియమించుకొని, ఢిల్లీ సార్వభౌముని పేరిట అతనిని జిల్లా గవర్నరుగా ప్రకటించి, ముఖ్య పట్టణంపై దాడిసలిపినారు. ఫతేపూర్, బందా, హామీర్‌పూర్, ఇవన్నీ శీఘ్రమే విప్లవోద్యమంలో చేరిపోయినవి.

కాన్‌పూర్ : కంపెనీవారి సైన్యంలో ఒక విభాగానికి స్థావరమైన కాన్‌పూర్‌లో ఘోరముతైన భీభత్సచర్యలు అత్యుగ్రంగా జరిగినవి. మే 14వ నాటి నుండీ కూడా పరిస్థితులు ఉద్రిక్తములై యున్నవి. సిపాయీలు కుటుంబాలను తమ గ్రామాలను పంపివేయడంకూడా జరిగింది. 'ఈద్' పర్వంరోజున(May 24) విప్లవమారంభించవచ్చునని అధికారులూహించినారు. కాని, కార్యరూపంలో అది, జూన్ 4వ తేదీనాడుపక్రమించింది. విప్లవసైనికులు కోశాగారాన్నీ, ఆయుధశాలనూ, ప్రభుత్వకార్యాలయాన్నీ స్వాధీనంచేసుకొని, ఖైదీలను విడుదలచేసి, ఢిల్లీకి తరలడానికి పూనుకొన్నారు. నానాసాహేబు నాయకుడుగానూ, అజీముల్లా అననికి ప్రధానసలహాదారుగానూ, ఎన్నుకొనబడిరి. కల్యాణపూర్ వరకూ ప్రయాణంగావించిన తర్వాత, కార్యక్రమాన్ని, మార్చినారు నాయకులు. కాన్‌పూర్‌కు మరలి పోవలసిందిగా, సైన్యాన్ని ఆదేశించినారు. ఈ విప్లవసైన్యము, వీలర్ (Wheeler) యొక్క శిబిరంపైబడి ఆక్రమణ సాగించినారు. మూడు వారాల అనంతరం బ్రిటీషు సైన్యం లొంగిపోవలసివచ్చింది. నానాసాహేబును పీష్వాగా ప్రకటించినారు.

ఝూన్సీ : బుందేల్‌ఖండ్ మహారాష్ట్ర రాజ్యంలోని ఒక భాగము. మహారాష్ట్రప్రభువులు పాలిస్తూవచ్చిన ఝూన్సీ, బందా, ప్రాంతాలు రెండూ అందులోనివే. ఝూన్సీప్రభువైన, గంగాధరరావుకు సంతానంలేదు. అతడు 1854లో, మరణించడంతో డల్‌హౌసీప్రభువు, ఒడంబడికకు విరుద్ధంగా ప్రవర్తించి, ఆ రాజ్యాన్ని బ్రిటీషురాజ్యంలో కలుపుకొన్నాడు. ఇది అన్యాయాక్రమణమని, గంగాధరరావు పత్నియైన లక్ష్మీబాయి, ఆక్షేపణ గావించింది. కాని, ఆమె ప్రయత్నము నిష్ఫలమయింది. కనుక మహారాష్ట్రుల హృదయాలలో ద్వేషభావము, సహజంగా ఏర్పడింది. ఇంతలో, దేవాలయాలకు నియమితమైయుండిన దానశాసనాలు (Grants) పాలింపబడకపోవడంతో, ద్వేషభావము పెచ్చు పెరిగింది. ఆశాభంగం, అతిసాహసానికి దారితీసింది. జూన్ 4వ తేదీనాడు సిపాయీలు, లక్ష్మీబాయి కొలువులోనుండిన, లక్ష్మణరావ్ అనే బ్రాహ్మణుని ప్రేరణపై, తిరుగబడి, బ్రిటీషు అధికారులనాక్రమించి, దౌర్జన్యంతో కొందరిని హత్యగావించినారు. తమ రాజ్యానికి లక్ష్మీబాయిని రాణీగా, ప్రకటించిరి. విప్లవసైన్యానికిమె వీరోచితమైన ప్రోత్సాహమూ, ఉత్తేజనమూ కలిగించి, సాహసపరాక్ర

మాలతో బ్రిటీషు సైన్యంతో పోరాడి, యుద్ధభూమిలోనే మరణించింది.

పీష్వావంశంలోనివాడైన బందానవాబు విప్లవసైన్యంలో తన జీవితాన్ని అంకితంచేసి, తుదకు తన రాజ్యాన్ని గోల్పోయినాడు.

*బనారస్ :* పశ్చిమోత్తరప్రాంతంలో, తూర్పు చిట్టచివరలో నున్నది బనారస్ విభాగము. హిందువులకు విశిష్టమైన పుణ్యస్థలం కావడమేకాక, బనారసు, మహారాజాయొక్క పదవీస్థానంకూడా. ఢిల్లీసార్వభౌము కుటుంబం వారిలో కొందరికది, నివాసస్థలంగా ఉండినది. మేనెల ప్రథమంలోనే బ్రిటీషు అధికారులు నగరం విడిచిపెట్టి, చునార్‌కు పలాయనస్తులై పోవలెనని, నిశ్చయించుకొని యుండిరి. కాని, శాంతిభంగకరమైన పరిస్థితులేవీ లేకపోవడంవల్ల, తమ పలాయన ప్రయత్నాన్ని మానుకొన్నారు. మే 21వ తేదీ విప్లవము ఆరంభమయింది. జూన్ 4వ తేదీనాడు, సిపాయీల ఆయుధాలను, ప్రభుత్వంవారు, వెనుకకు తీసుకున్నారు. దీనితో తిరుగుబాటు వెంటనే జరిగింది. ప్రభుత్వము సైనిక శాసనాన్ని ప్రకటించింది. ఐనా, గ్రామసీమలు జిల్లాలు విప్లవసైన్యం చేతుల్లోనే నిలిచిపోయినవి. "గ్రామసీమల సాంఘికజీవితంలో ఒక మహోద్యమము, ఉద్భవింపనున్నదనే సూచనలు బాహ్యప్రవృత్తిలో గోచరించుచుండినవి."

అజంఘర్, అప్పటికే, విప్లవాగ్నిజ్వాలల మధ్యలో నున్నది. జాన్ పూర్‌లో, జూన్ 5వ తేదీ, ఒక ఉత్పాతం కలిగింది. లూధియానానుండి వచ్చిన సిక్కు సేనాదళము, దానిలో పాత్రవహించింది. గోరఖ్‌పూర్‌లోని సిపాయీలు, జూన్ 6వ తేదీనాడు, అధికారుల ఆజ్ఞలను ధిక్కరించిరి. మరుదినం తెల్లవారు కారాగారపు తలుపులను బద్దలుకొట్టడానికి ప్రయత్నించగా, సిపాయీలు కోశాగారాన్ని స్వాధీనపరచుకోడానికి ఉద్యమించినారు. కాని, గూర్ఖాసైన్యం రావడంతో, వారి ప్రయత్నాలు విఫలములైనవి. సిపాయీలు తమ ఆయుధాలను అర్పించివేయవలసి వచ్చింది. ఐనా, జిల్లా ఇంకను కల్లోలాత్మకంగానే ఉన్నది. ఘాజీపూరులో విప్లవము ఉత్పన్నమయింది; సింగాహీలో సిపాయిలు ఎదురుతిరిగి సైన్యాన్ని వదలిపోయినారు. ఆగస్టునాటికి పరిస్థితి ఇంకనూ విషమించింది. బ్రిటీషువారు గోరఖ్‌పూరును నిలుపుకోలేక, వదలిపోయినారు. పిమ్మట, కున్‌వార్‌సింగ్, ఝంఝామారుత సదృశంగా నడిపించిన దండయాత్రల ధాటికి నిలువలేక, బ్రిటీషువారు అజంఘర్‌ను మళ్ళీ విడిచిపోవలసి వచ్చింది.

*ఔధ్-మరియూ లక్నో ముట్టడి :* ఔధ్ రాజ్యాన్నిదివరకే బ్రిటీషువారు తమలో కలుపుకొన్నారు. దురాశాపరులూ, సర్వభక్షకులూ ఐన బ్రిటీషు అధికారుల దుశ్చర్యలమూలంగా ఆ ప్రాంతము, అతికష్టములపాలయింది. ఈ అధికారులు "గంభీరములైన రాజప్రాసాదములను అశ్వశాలలస్థితికి, కుక్కలదొడ్లస్థితికి తీసుకొని వచ్చినారు. సుకుమారులైన రాజకన్యలనూ, వారి సఖీజనాన్నీ, దాసీజనాన్నీ,-నిర్దాక్షిణ్యంగా, అసహాయస్థితిలో, వారి ఇండ్లనుంచి వెడలగొట్టినారు. కళామందిరాలనూ, కోశాలనూ, బలాత్కారంగా ప్రవేశించి, పాడుచేసినారు. రాజకుటుంబంవారికి స్వంతమైన చరాస్తి నంతటినీ యాలం వేయించినారు. రాజవంశీ

యులకు అగౌరవాన్ని, అవమానాన్ని కలిగించే అధమాధమచర్యల నెన్నో గావించినారీబ్రిటీషు అధికారులు.రాజకుటుంబంవారికి కలిగించిన అవమానంకంటే, ఎక్కువ అవమానాన్ని మనకు, ఈ చర్యలు కలిగిస్తున్నాయి."-అని అధికారులపై మోపిన అభియోగపత్రం తెలుపుతుంది.

ఈ ఆరోపణలనుగూర్చి విచారణ జరుపుటకై, క్యానింగు పూను కొన్నాడు. కాని, లక్నోలో నుండిన అతని ప్రతినిధి, ఈ ప్రయత్నాన్ని వ్యర్థం గావించినాడు. దానితో, ద్వేషభావమింకను తీక్షమయింది.

వజీద్ఆలీషాను పదవీ భ్రష్టునిగావించి, ప్రవాసం పంపడం, ప్రజలలో క్రోధాగ్నిని ప్రజ్వలింపజేసింది. ఈ పరిస్థితిని ఉపయోగించుకోడానికి, సమర్థులైన వ్యక్తులు లేకపోలేదు. వారిలో ప్రధానుడూ, అగ్రగామీ ఐనవాడు మౌల్వీ అహమదుల్లాషా. ఇతడు 1856-57 శీతకాలంలో ఉత్తర ప్రాంతాలలో పర్యటన గావించి, ప్రజలను ధార్మిక యుద్ధానికి పురిగొల్పినాడు. లక్నోలోనూ, ఔధ్ జిల్లాలలోనూ గొప్పసభలలో ఉపన్యసించినట్లు తెలియవస్తుంది. నానాసాహేబూ, అజీముల్లాం కూడా, లక్నోకువచ్చి, పరిస్థితులను గమనించినారు. వారంతట, ఔధ్ జిల్లాలలో కూడా పర్యటనం గావించినారు. ఏప్రిలు 30వ తేదీ,-సిపాయీలు అధికార్లను ధిక్కరించినారు.కాని, వెంటనేవారిని నిరాయుధులను గావించడంతో, విప్లవప్రయత్నము ఆగిపోయింది. ఢిల్లీనుండివచ్చిన వార్తలు హెచ్చరించడంతో, ఇచ్చటి అధికార్లు ముందుగనే తగుజాగ్రత వహించిరి. ఐనా, మేనెల కడపటి వారంలో విప్లవమొక్కసారిగా విజృంభించింది. సిపాయీల విప్లవము 30వ తేదీ, ఆరంభమయింది. విప్లవాగ్ని లక్నోను పూర్తిగా ఆవరించి, సీతాపూర్కూ (జూన్ 3), మహమ్మూదిక్ (జూన్ 4), లఖీమ్‌పూర్ ఖేరీకి (జూన్ 4), ఫైజాబాదుకు (జూన్ 8), బహ్‌రైచ్‌కూ (జూన్ 9), సుల్తాన్‌పూర్‌కూ (జూన్ 9), గోండాకు (జూన్ 10)-శీఘ్రమే వ్యాపించింది. ఈ విధంగా, మాసం పూర్తి కాక పూర్వమే, ఔధ్‌లోని ప్రతి జిల్లాలోనూ, విప్లవకారుల కార్యక్రమం నడిచింది.

లక్నోలో, 11 వత్సరముల బాలుడైన బిర్జిస్-ఆలీ,- వజీద్ ఆలీ కుమారుడు-అతని తల్లియైన హజరత్ మహల్ రాజ్యభారంలో, 'వాలీగా' ప్రకటింపబడినాడు. హిందూ ముస్లిము సలహాదారుల సంఘంతో పరిపాలన నిర్వహణం ఏర్పాటయింది. బ్రిటీషు స్థానిక మంత్రి యొక్క నివాసస్థానాన్ని, బ్రిటీషువారు, సుదృఢంగా బలపరచుకొని, సహాయకసేనకై, ఎదురు చూస్తు న్నారని విప్లవనాయకులకు తెలిసింది. అట్టి సహాయకసేనలు, లక్నోప్రవేశించ కుండా అరికట్టడమూ, ముట్టడిలో నున్న బ్రిటీషువారికి ఆహారలోపం కలిగించి లొంగదీసు కోవడమూ,-అనే సైనిక విధానాన్ని, దేశీయ సైన్యము అవలంబిం చింది. స్థానికమంత్రి నివాసానికై, 1857, జూన్ మధ్యలో ఆరంభమైన పోరాటం, 1858, మార్చి 21 వరకూ, సాగింది. ఈ మధ్యకాలంలో జయాప జయాలు ఇరుపక్షాల వారికీ, కలిగినాయి. కాని, కడపట, బ్రిటీషుసహాయక

సైన్యం లక్నో ప్రవేశించి, ఆక్రమించింది. ఐనా, కడపటి వరకూ కూడా, మౌల్వీ అహమదుల్లాషా ధైర్యంతో పోరాడుతూనే వచ్చినాడు. ఏనుగునారోహించి, యుద్ధభూమిలో తిరుగుతూ, హజరత్ మహల్ స్వయంగా, తన సైనికులకు ప్రోత్సాహం కలిగించింది. లక్నో బ్రిటీషు వారి వశమైన పిమ్మట, మౌల్వీ అహమదుల్లాషా, గొరిల్లా యుద్ధవిధానాన్నారంభించినాడు. ఒకప్పుడు రోహిల్ ఖండ్‌లో యుద్ధంచేస్తూ, వెంటనే ఔధ్‌లో ప్రత్యక్షమౌతూ, ఒక ప్రదేశం నుంచి మరియొక ప్రదేశానికి తిరుగుతూ, ఈ విధంగా ధార్మిక యుద్ధం నడుపుతూ వచ్చి, కడపట, ముహమ్మాదీలో స్వతంత్ర స్థావర మేర్పరచు కొన్నాడు. కాని, పొవేన్ (Powain) రాజా, ఇతనిని ద్రోహంగా హత్యగావించినాడు. బేగం హజరత్ మహల్, బ్రిటీషు సేనలకు లొంగిపోలేదు. వెన్నాడుతున్న సైన్యంతో యుద్ధము సాగిస్తూనే, ఆమెతుదకు, నేపాలుకు తప్పించుకొని పోయింది.

లక్నోతరువాత ప్రధానమైన నగరం, ఔధ్ ప్రాంతంలోని ఫైజాబాద్. అచ్చట 22వ దేశీయ పదాతిదళముతోనూ, 15వ అనియత అశ్వికదళముతోనూ, దేశీయ తుపాకిదళముతోనూ, అశ్విక విధ్వంసక యంత్రాలతోనూ, పూర్తిసైన్యము ఫైజాబాదులో ఉండినది. ఈ సైన్యము బ్రిటీషు అధికారాన్ని త్రోసివేసింది. ఆజంగర్, బనారస్, ప్రాంతాలలోని విప్లవదార్లువచ్చి ఈ సైన్యశాఖతో కలిసిరి. తాలూకుదార్లుకూడా, వీరికి మద్దతు ఇచ్చినారు. మౌల్వీ అహమద్‌షా, విప్లవోద్యమానికి అవసరమయిన ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని కలిగించినాడు. బ్రిటీషువారి సైన్యానికీ, తమసైన్యానికీ అన్నివిధములా వ్యత్యాసము అధికంగా ఉన్నప్పటికీ, లెక్కింపక, విప్లవవీరులు అధిక శౌర్య సాహసాలతో పోరాడినారు. కాని, లక్నో పడిపోవడంతో, వీరి ప్రతిఘటన సడలిపోయింది.

విప్లవమారంభమైన దశలో, బ్రిటీషు ప్రభుత్వము పూర్తిగా, నిశ్చైతన్యమైపోయింది. నదీమధ్యప్రాంతమంతా (Doab)వీరి ఆధిపత్యాన్ని త్రోసిపుచ్చింది. కానీ, విప్లవనాయకులలో పరస్పరసహకారం లేకపోవడంవల్ల, తామొనర్చిన మహావిప్లవ ప్రయత్నఫలాన్ని అందుకోలేకపోయినారు. అదృష్టం చిన్న చూపు చూచింది.

గంగానదీ లోయలకు వెలుపలనూ, పశ్చిమభాగంలోనూ, బ్రిటీషువారికి కష్టం కలిగిస్తున్న కేంద్రాలు పెక్కులుండినవి.

*పంజాబ్ :* మీరట్‌లో, జరిగిన ఉత్పాతమూ (మే 10), ఢిల్లీకి సిపాయీల ప్రయాణమూ (మే 11) స్వతంత్రాధికారం బహదూర్‌షా వహించడమూ – అనే సంఘటనలు వెంటనే, పంజాబు వ్యవహారాల్లో మహత్తరమైన విషమపరిస్థితిని కలిగించినవి. బ్రిటీషురాజ్యంలో కలుపుకోవడం, ఇటీవలనే జరిగిన విషయము. కనుక, ఓడింపబడిన సిక్కుసరదారులూ, ఉద్యోగరహితులైన సిక్కుసైనికులూ, ఏవిధమైన ప్రతిక్రియకు పూనుకొంటారో, బ్రిటీషువారు ఊహించలేకపోయినారు. ఆఫ్ఘనుల ప్రవృత్తికూడా బ్రిటీషువారికి సంబంధించిన ముఖ్య విషయమే. ఇదివరలో రంజిత్‌సింగు జయించియుండిన సరిహద్దు ప్రాంతమూ,

పెషావరూ, ఇప్పుడు బ్రిటీషు వారి అధీనంలో ఉన్నాయి. సిక్కు-రాజ్యాన్ని కూలద్రోసి వీరు వాటిని వశపరచుకొన్నారు. విప్లవపరిస్థితులవల్ల బ్రిటీషువారికి కలిగిన క్లిష్టస్థితిని తమ ప్రయోజనార్థం ఉపయోగించుకొని, తాము పోగొట్టు కొన్న ప్రాంతాలను మరల స్వాధీనపరచుకోడానికి, ఆఫ్ఘనులు ప్రయత్నించ వచ్చును. బరైలీ, సయ్యద్ అహమ్మద్ లేవదీసిన ధార్మికయుద్ధాగ్ని (జిహాద్) పరిసరప్రాంతాల్లో ఇంకా మండుతూనే ఉంది. దానిని దాహకాగ్నిగా ప్రజ్వలింప జేయడం సులభమే. అదికాక, ప్రాంతజాతులవారిలో, దుర్దములైన వర్గాల వారున్నారు. పశ్చిమోత్తరంలోని రంఫారులూ, తూర్పుప్రాంతంలోని కొండజాతుల వారూ ఇట్టివారే. హిస్సార్, రేవారి, గుర్‌గాం ప్రజలుకూడా తమకు విరుద్ధు లైన శత్రువులే.

పై ప్రాంతాలలో, విప్లవాన్ని ప్రథమంగా ప్రవర్తింపజేసినవారు హిందూ స్థానీ సిపాయి వర్గాలవారు. పంజాబులోకూడా, ఈ సైనికులు దట్టంగాచేరి యున్నారు. వీరందరూ, అనేకయుద్ధాల్లో కీర్తిని ఆర్జించియుండిన శ్రేష్ఠులైన సైనికులు. కాని, విప్లవం పంజాబులో అప్పటికే పరిణతస్థితికి వస్తున్నదనీ, విప్లవంపట్ల వీరు సానుభూతి కలవారనీ, బ్రిటీషు వారు అనుమానింప సాగినారు.

ఈ విధంగా, పంజాబులోని పరిస్థితి చాల విషమమైనది. కాని, సట్లెజు నదికి ఇవతలనున్న, సిక్కు-సరదారులు బ్రిటీషు వారికి సహాయపడడంలో దృఢ నిశ్చయులైన వారు. పశ్చిమ జిల్లాల ముస్లిములు కూడా వీరికనుకూలురే. కాశ్మీర్ మహారాజైన గులాబ్‌సింగు బ్రిటీషు పక్షం వహించునట్లుగా, వంచన వాక్యాలతో బుజ్జగింపబడినాడు. పంజాబులో బ్రిటీషువారి భవిష్యత్తు కాశ్మీర్ మహారాజు యొక్క దయాదాక్షిణ్యములపై ఆధారపడి ఉన్నది. ప్రాచీన, సిక్కు కులీనవర్గం వారు, తమకు కలిగిన సమగ్రాపజయంవల్ల, స్తబ్ధులైనారు. తత్కారణంగా, ఆ వర్గం శిథిలావస్థలో ఉన్నది. గొప్ప గొప్ప భూస్వాములు పంజాబులోలేరు. ముఘల్ సామ్రాజ్యము కానీ, పఠాను విజేతలు కానీ, స్థానిక సర్దారుల కట్టి అధికారాన్ని కల్పించియుండలేదు. కనుకనే, ఔధ్ ప్రాంతంలోని తాలూకుదార్లకూ, బెంగాలులోని జమీందారులకూ ఉండినట్టి విశాలమైన అధికారం పంజాబు సర్దారుల కేర్పడలేదు. కావున, వారు భూస్వాములుగా వృద్ధిబొందలేదు.

ఉద్యోగరహితులైన సిక్కు-సైనికులకు ఐక్యము కూర్పగలిగిన నాయకుడులేడు. సహాయార్థము పంజాబు సర్దారులకు వారు గావించుకొన్న ప్రార్థనలు గమనింపబడలేదు. కొన్ని సంవత్సరాలుగా ఏర్పడియుండిన శాంతి పరిస్థితిని ఉపయోగించుకొని ప్రజలకు బ్రిటీషు పరిపాలనపట్ల, ఆసక్తీ, ఇష్టమూ కలుగు నట్లు చేసినారు సమర్థులైన కొందరు బ్రిటీషు అధికారులు. ఈ విధంగా, పూర్వం బ్రిటీషు వారిపై ఉండిన ద్వేషభావాన్ని, తమ చాకచక్యంతో, చల్లబరచినారు. ముందుగనే తగు జాగ్రత్తవహించి, ప్రజలను నిరాయుధులుగా చేసి యుండిరి.

రావల్‌పిండి, ఝీలం, సయాల్‌కోట్, అమృత్‌సర్, గురుదాస్ పూర్,- ఈ స్థావరాలన్నిటిలోనూ ఈ విధానాన్నే అనుసరించినారు. ఖేలాత్-ఇ-ఘిల్జే స్థావరంలోని హిందూస్థానీ సైనిక దళంతప్ప, తక్కిన స్థావరాల్లోని సైనికు లందరూ ఈ విధంగా, నిరాయుధులైనారు. రైఫలులు (Rifles) ధరించిన బ్రిటీషు పదాతిదళాన్నీ, ఫిరంగులనూ ఎదుటబెట్టి, సిపాయీలను బెదరించడంతో, ఆయుధాలను క్రింద బెట్టక తప్పిందికాదు.

కాని, విజయమింకా సులభదూరంలో లేదు. తొమ్మిదో అనియత ఆశ్విక దళము ఎదురు తిరిగింది. ఆఫ్ఘనిస్థాన్‌లో కీర్తిప్రతిష్ఠలు సంపాదించుకొన్న సైనిక దళమిది. మిక్కిలి విశ్వాసపాత్రమైన దగుటచే ఢిల్లీకి పంపించడానికి కూడా అధికారులు పూనియుండిరి. కాని, భారతీయుల విప్లవోద్యమంతో వీరికి సాను భూతి కలదని తెలియడంతో, వీరిని వెంటనే పంజాబుకు మరలి వెళ్ళవలసిందని ఆజ్ఞాపించినారు. కాలాబాగ్ చేరినవెంటనే, ఈ సైనికవర్గం తిరుగుబాటుచేసింది. వారి నాయకుడు, వజీర్‌ఖాన్, "ఈ సైన్యశాఖకంతటికీ వృద్ధుడూ, పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొన్న రిసాల్‌దార్." ఝూంగ్ ప్రదేశం సమీపించునప్పటికి, వీరిని వెన్నంటిన బ్రిటీషు సైన్యం వచ్చి, మీదపడింది. రిసాల్‌దారూ, అతని సైనికులూ నిశ్శేషంగా హతమార్చబడిరి.

మీర్‌మియాన్ స్థావరంలో, దేశీయ ఆశ్వికదళం జీనులను అప్పగించ డానికి నిరాకరించింది. నిరాయుధీకరణం జరుగనున్న ఉదయమే బయలుదేరి ఫెరోజ్‌పూర్ వెళ్లింది. వీరివెంట, నిరాయుధీకరణ మొనర్చిన సైన్యవర్గాలలోని 1400 మంది సైనికులు కూడా ఉన్నారు. ఫెరోజ్‌పూర్‌లోని యూరోపియను లతో యుద్ధమొనర్చి, వారిలో నూరు మందిని చంపివేసిరి.

మీర్‌మియాన్ స్థావరంలోని హిందూస్తానీ సిపాయీలను నిరాయుధులు గావించడం, పంజాబు ఇతర ప్రదేశాల్లోని సిపాయీలలో భయాన్నీ, అనిష్టాన్నీ కలుగజేసింది. అనేకులు తమ నిస్సహాయస్థితిని గుర్తించిరి. కాని, కొందరు ఆయుధవిసర్జనకు ఎదురు తిరిగిరి. ఢిల్లీచేరే ఉద్దేశంతో, వారు తమ శిబిరాలను వదలి బయలుదేరిరి. కాని, ఎంతో దూరంలో ఉన్న ఢిల్లీని ఎట్లు చేరగలరు? బ్రిటీషు వారు వెంటాడి, మార్గంలో ఆ సైనికులను రూపుమాపినారు. 26 వ దేశీయ సైనికులపై రాక్షసమైన శిక్షాదండన విధించిరి. రెండు వందల ఎనభై రెండు మంది సైనికులను, పరుగెత్తిపోతున్న వారిని, పట్టుకొని అజ్నాలా తీసుకొనివచ్చి మరణ శిక్షకు గురిచేసినారు. పది పది జట్టులుగా వారిని విడదీసి, వారిపేళ్ళను గుర్తుచేసుకొని, మరణదండన నిర్వహించే సైనికదళాని కెదుట నిలిపి, కాల్పించిచంపినారు. వారిని చేతులు విరచికట్టి, బలిపశువులను వధ్య శాలకు గొనిపోయినట్లు తీసికొని పోతుండగా, ఆ సిపాయిలలో, శాంతంగా కొందరు, పాటలు పాడుతూ కొందరూ, మృత్యువు నెదుర్కొన్నారు. ఈ విధంగా 282 మంది భారతీయ సైనికుల వధ పూర్తిగావించినారు, బ్రిటీషు ప్రభువులు. బురుజులో బంధింపబడి యుండిన మిగతా 45 మంది సైనికులూ

వెలుపలికిరాలేదు. తలుపులు బద్దలుచేసి, లోపలికిపోయి చూడగా వారందరూ అప్పటికే, చాల వరకు, మరణించియున్నారు. (శత్రువుల చేతి చావుకంటే ఆత్మహత్యే గౌరవప్రియమని ఎంచినారు కాబోలు!)

హిందూస్థాని సైనికదళాంలో కంగరా, యుగ్య... స్థానం ...యుంట. వారి స్థానాల్లో, కొత్తగా చేర్చుకోబడిన సిక్కులు, అఫ్రిదీలు, ఖట్టకులు, మొహమ్మాండులు చేరినారు. కాని పంజాబులోని విప్లవోద్యమం, కేవలం సైన్యానికి సంబంధించింది మాత్రమే కాదు

కూర్లు పర్వతాల్లో, రాజాప్రతాపసింగూ, అతని అనుచరుడు వీరసింగూ ఒక ఉత్పాతాన్ని లేవదీసిరి. కాని, బ్రిటీషు ప్రభుత్వము వారిని ఖైదు చేసి, ఉరి శిక్షవిధించినారు. సైన్యము నుంచి బహిష్కరింపబడిన ... , ... స్థావరంలోని 14 వ. పదాతి దళమూ, సియాల్ కోట్ 46 వ. దళమూ, మియాన్ మీర్ 26 వ. శాఖా,- వీరందరూ, జమ్మూ పర్వతప్రాంతాలకు తప్పించుకొని పోయిరి. వారు పోరాటం సాగించడానికి నిశ్చయించుకొన్నారు. రావీనదినిదాటి, బారిదోబ్ కాలువను ముఖ్యస్థానమైన మధోపూర్ ప్రవేశించిరి. కాని, అందలి సిక్కు... ... వీరిని తరిమివేసింది. సయాల్ కోట్లోని స్థానాన్ని ఆక్రమించుకొని, గ్రామసీమలకు వ్యాపించిరి. "విప్లవసైనికుల తుపాకి గుండ్లను పక్కకు మరల్చిన దేవునిదయవల్ల యూరోపియనులు బ్రతికిపోయినటు పడినారు."

3000 చదరపు మైళ్ళవిస్తారంగల ముల్తాను జిల్లాలో నివసించే ఖుర్రాలూ, ఖట్టీలూ, హట్టులూ, సతవానులూ, మరి ఇతర ముస్లిము తెగలవారూ, ఇరవై మున్నైవేలవరకూ జతపడి, విప్లవంకలిగించినారు. బహవాల్ పూర్ నుండీ, ఫెరోజ్ పూర్ నుండీ, వీరికి ఆయుధసామగ్రిలభించింది. వీరిపై పంపబడిన ... సైన్యం ఓడింపబడింది. అనియత అశ్వికదళం కూడా వెనుదిరిగి, ... ... సత్రంలో (సరై) తల దాచుకోవలసి వచ్చింది. ఆ పిమ్మట, విప్లవదారులు గోగేర్ మరుభూముల్లోకి వెళ్ళిపోగా, బ్రిటీషు సైన్యం, వారిని చుట్టుముట్టి నాశ మొనర్చింది.

సింధ్ : సింధులోని అమీరులను బ్రిటీషువారు పదచ్యుతి... విధానము ప్రజలలో అమితమైన మనఃక్షోభనూ, ద్వేషాన్నీ కలిగించింది. ఆకారణంగా సింధు ప్రాంతం విప్లవోద్యమంలో చేరడం జరిగింది. భారత్ రాజవంశీయుడైన షహజాదా పీర్ మహమ్మద్, ఫించను పుచ్చుకొన్న పిమ్మట, షికార్ పూరులో ఉండినాడు. ఆలీఖాన్ కూడా ఫించను పుచ్చుకొన్న నాయకుడే. వీరూ, ఇమాంబక్ష్ అనే మరియొక సర్దారూ కలిసి, సింధు ప్రాంతంలో బ్రిటీషు ప్రభుత్వాన్ని పడద్రోయ డానికి ప్రయత్నించిరి. కాని, వారి ప్రయత్నము విఫలమయింది.

రాజస్థాన్ : 18 వ శతాబ్దంలో, రాజపుటానాలోని పరిస్థితులు కలతలతో కూడి యుండినవి. ప్రధానసంస్థానవారి మధ్య పరస్పరం ఏర్పడియున్న కలహలూ,

అసూయలూ కారణంగా, దేశం క్షీణదశలో ఉండినది. అసంఖ్యాకములైన చిన్న చిన్న రాజ్యాలూ జాగీర్లూ కాక, నాలుగు ప్రధానములైన రాజ్యాలు రాజస్థాన్‌లో ఉండినవి.

మేవారు సిసోదియా వంశం ప్రాచీనమైనది. రజపుత్రులలో వారికి ప్రాధాన్యమూ, ఔన్నత్యమూ కలదు. కాని, ఇంత గౌరవ ప్రతిష్ఠలున్న వారైనా, సిసోదియాలు ప్రత్యేకంగా జీవిస్తూ, తక్కిన వంశాల వారి వ్యవహారాల్లో జోక్యం కలుగజేసుకోకుండా నిలిచినారు. ఢిల్లీరాజకీయాలకు కూడా దూరంగా నిలిచిరి. 1857 లో, మహారాణా సరూప్‌సింగు ఉదయపూర్ ప్రభువు. జయపూర్ కచ్‌వాహా వంశంవారు, విశాలమైన రాజ్యాన్ని ఏర్పరచుకొని యుండినారు. మహారాజా రామ్‌సింగ్ రాజ్య వ్యవహారాలకు ప్రభువు. ఈ వంశంలోని మరి యొక శాఖవారు ఆల్వారులో రాజ్యాన్ని పరిపాలించేవారు.

జోధ్‌పూర్, మహారాజా తఖ్త్ సింగ్ రాథోడ్ పరిపాలనలో ఉండింది. కాని, అతడు రాజవంశానికి చెందిన వాడు కాడనే కారణంతో ప్రజలతనిపై అభిమానం చూపిన వారుకారు. మాన్‌సింగ్ ఆధిపత్యంలో, జోధ్‌పూర్ దృఢమైన స్వతంత్రరాజవంశంగా కీర్తిప్రతిష్ఠలను సంపాదించుకొని యుండినది. బ్రిటీషు వారితో హోల్కారుకు జరిగిన యుద్ధంలో, జోధ్‌పూర్‌వారు జస్వంతరావు హోల్కారుకు సహాయపడి యుండిరి. అట్లే, సింధు అమీరులకునూ, నాగపూర్ ప్రభువైన అప్పాసాహెబుకూ కూడా పీసు, బ్రిటీషు వారికి విరుద్ధంగా, సహాయమొనర్చియున్నారు. ప్రస్తుత ప్రభువైన తఖ్త్‌సింగు రాథోర్‌పై, బ్రిటీషు ప్రభుత్వము తమ స్థానిక మంత్రిని (Resident) తెచ్చి నిలపడంతో మహారాజాకు విసుగు జనించి, రాజ్యపాలన నుంచి విరమించుకొని, ఏకాంత వాసంలో నిలిచిపోయినాడు. బుందీలోనూ, కోటాలోనూ ఉన్న రాజులు హాడారాజపుత్ర వంశీయులు. పిండారీ నాయకుడైన అమీర్ ఖాన్ వంశీయుడు టాంక్ (Tonk) ను పరిపాలిస్తూ ఉండినాడు.

ఈ ప్రధాన రాజ్యాలుకాక, రాజస్థాన్‌లో ఇంకనూ పెక్కులు చిన్న రాజ్యాలుండేవి. ఇది కాక, ప్రధానరాజ్యాలకు నామమాత్రంగా లోబడి, చాల వరకు స్వతంత్రంగా పరిపాలిస్తున్న జాగీరుదార్లు అనేకులు కలరు. దురదృష్టం వల్ల, ప్రధానరాజవంశాలకూ, ఈ జాగీరుదార్లకూ మధ్య, సఖ్య సంబంధాలు బాగుండలేదు. జాగీరుదార్లకు విరుద్ధంగా రాజులను బలపరచడం, బ్రిటీషు వారి రాజనీతి. జాగీరుదార్ల ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలుగజేసుకొని, ప్రజలపై వారికి గల కట్టుబడి అధికారాన్ని (Feudal control) తగ్గిస్తూవచ్చినారు బ్రిటీషు వారు. కనుక, తమకు ప్రత్యక్షప్రభువులైన రాజుల పట్లా, వారి వెనుకనున్న బ్రిటీషు వారిపట్లా, జాగీరుదార్లు అసంతుష్టి కలవారై యుండిరి.

ఇట్టి సందర్భాల్లో రాజుల పరిస్థితి కష్టతరమయింది. మహారాష్ట్రులు

గావించి యుండిన దోపిడీలవల్లనూ, వారు తమపై మోపిన కప్పమువల్లనూ, ఇదివరకే పడరాని కష్టాలు పడినవారు వీరు. కనుక, బ్రిటిషువారు మహారాష్ట్రుల నోడించడంతో, వీరు మళ్ళీ స్వేచ్ఛగా ఊపిరిపీల్చుకో సాగినారు. బ్రిటీషువారి సర్వాధికారాన్ని, ఇష్టంతో అంగీకరించినారు. కాని, యజమానుల విధంగా మారడంవల్ల కలిగిన పరిస్థితి ఎటువంటిదో త్వరలో వీరికి తెలియవచ్చింది. ధనాన్ని దోచుకోవడంలో బ్రిటీషువారు, మహారాష్ట్రులకే మాత్రమూ తీసిపోలేదనీ, ధనసంచయవిధానాన్ని మాత్రం క్రమబద్ధంగా ఏర్పాటు కొన్నారనీ గ్రహించినారు. దీనికి తోడుగా, బ్రిటీషువారు రాజుల అధికారాన్ని నిర్దాక్షిణ్యంగా తగ్గించి వేయడం, మరింత సహించరానిదయింది. దేశాన్ని ముంచి వేస్తూ ఉన్న బ్రిటిషువారి శక్తినెదిరించడం కూడా కష్టమైనదే.

రాష్ట్రాల మధ్యసీమలలో నెలకొల్పియున్న సేనాస్థావరాలు, తమ రాజ్యాల స్వాతంత్ర్యానికే భంగం కలిగించేవిగా ఉన్నాయి. తాము ప్రజల నుండి గ్రహించుచుండిన సైనికశుల్కాలను తీసివేయడంతో, బ్రిటీషు అధికారాన్ని ఎదిరించి నిలిచేశక్తి సామర్థ్యాలు కూడా వీరికి లేక పోయినవి. మరిన్ని, తమ ఆచార వ్యవహారాల్లో బ్రిటీషు ప్రభుత్వము కలుగ జేసుకోవడంతో, తమ తమ సంప్రదాయాలకు కూడా, రక్షణ ఉండదనే భయసందేహాలు వీరిమనస్సులలో ఏర్పడినవి. 1857 కు పూర్వము, మాన్‌సింగ్ బ్రిటీషువారిపట్ల ప్రదర్శించిన అవిధేయతా తిరస్కారాలూ, దుంగార్‌పూర్ ప్రభువైన జస్వంత్ సింగును బ్రిటీషువారు పదవి భ్రష్టుని గావించడమూ, జోధ్‌పూర్‌లో ఉండిన లడ్‌లో (Mr. Ludlow) పై భీమ్‌జీ గావించిన ఆక్రమణమూ, జయపూర్‌లో జరిగిన క్యాప్టన్ బ్లేక్ (Captain Blake) హత్యా,- ఇత్యాది సంఘటనలు కష్టపరిస్థితులను కలిగించినవి. సికార్, ఖయాలీ, ఖేత్రీప్రాంతాలలో తిరుగుబాట్లు జరిగినవి. మేవార్, మార్వార్, శేఖావతి జాగీరుదార్లూ, ఏకరజనమూ కూడా అసంతుష్టులై ఉన్నారు. బంకీదాస్‌వంటి వీరగాథా రచయితలూ, సూర్యమల్ మిశ్రాన్ వంటి పండితులూ, ప్రజల భావాలను ఉద్రేకపరచినారు.

ఈ రజపుత్రరాజులమధ్యగల పరస్పర భేదభావాలపైననూ, రాజులకూ జాగీరుదార్లకూ మధ్యగల విరోధాలపైననూ మాత్రమేకాక, బ్రిటీషువారు తమ సైన్యశక్తిపై ఎక్కువగా ఆధారపడియున్నారు. వీరికి అజమీరులో దేశీయ సైనికబృందం రక్షిస్తున్న పెద్ద మందుగుండు స్థావరమూ, నసీరాబాద్, నీమచ్ లలో రెండు ప్రధానములైన సేనాస్థావరాలూ, ఎరిన్‌పురా, దియోలీ, ఓసాలలో చిన్న సైనికస్థావరాలూ, ఉండినవి.

రాజపుటానా ప్రాంతం, నామమాత్రంగా పశ్చిమోత్తర ప్రాంతపు లెఫ్టినెంటు గవర్నరు ఆధిపత్యంలో ఉన్నా, వాస్తవానికి అధికారాన్ని ప్రవర్తింప జేస్తున్నవాడు, గవర్నర్ జెనరల్ యొక్క ప్రతినిధి. ఉదయపూర్, జయపూర్, జోధ్‌పూర్, కోటాలలోని ప్రతినిధులకుకూడా, రాజపుటానాపై అధికారము ఉండేది.

మీరట్‌లో ఉత్పన్నమైన విప్లవసమాచారం రాజపుటానాలో తెలియగానే, సేనాస్థావరాలలోని భారతీయసైనికులు, భారతప్రభువుల సైన్యంలో ఉండిన రజపుత్రవీరులు, జాగీరుదార్లూ - అందరూ విప్లవోద్యమధ్వజాన్ని ప్రతిష్ఠించినారు. సామాన్య ప్రజానీకంకూడా, వీరికి సహకారాన్నీ, సానుభూతినీ ఇచ్చింది. మొట్టమొదటి తిరుగుబాటు మే 28వ దినం, నసీరాబాద్‌లో జరిగింది. దీన్ని అనుసరించి, జూన్ మూడవదినం, నీమచ్‌లో విప్లవం, బయలువెడలింది. ఆపై, కల్లోలం, రాష్ట్రంలో వ్యాపించింది. అజమీరుపై దాడి జరుగబోతున్నది. ఆబూపై దాడి జరిగింది. ఎరిన్‌పురాలో సిపాయీలెదిరించి నిలబడినారు. షహజాదా ఫిరోజ్‌షా, మండసోరును వశపరచుకొన్నాడు. జోధ్‌పూర్‌లో, ప్రజానీకంలో దృఢంగా నెలకొని ఉండిన అసంతుష్టిని, ఖాకీసాధువులు రెచ్చగొట్టినారు. ఈ సాధువులు ఊరినుండీ ఊరికి పర్యటనంగావిస్తూ ప్రజలను విప్లవానికి పురికొల్పిరి. జోధ్‌పూర్ రాజనగరుకూడా వీరికాహ్వాన మిచ్చింది. కాని, కల్లోలాలకంతటికీ ప్రధానకేంద్రాలు, జోధ్‌పూర్‌కు సామంతరాజ్యాలైన కోటా, అయువాలు.

ఎర్నిపురాలోని జోధ్‌పూర్ సైనికదళంతో ఆరంభమయింది విప్లవము. జాగీరుదార్లు వెంటనే వారితో కలిసినారు. అయువా జాగీర్దారైన రావుహూర్ కుశాల్‌సింగ్ తన దౌర్భాగ్యాన్ని విప్లవోద్యమభాగ్యంతో చేర్చివేసినాడు. మేవార్, మార్వార్ జాగీరుదార్లూ, అసోప్, అలానియావా, గులార్, రూపనగర్, సాలుంబార్ జాగీరుదార్లూ, ఇతర సరదార్లూ ఇతనికి సహాయం వచ్చిరి. జోధ్‌పూర్ మహారాజు తమపై పంపిన సైన్యాన్ని ఓడించి, తమ కష్టస్థితిగతులను సార్వభౌమునికి విన్నవించుకోడానికై, పలువురు ఢిల్లీ ప్రయాణమైనారు. మార్గంలో, నర్నూల్ వద్ద ఏర్పడిన యుద్ధంలో వారికి పరాజయం కలిగింది. సెప్టెంబరులో జరిగిన ఢిల్లీపతనంతో వీరు పూర్తిగా ధైర్యాన్ని కోల్పోయిరి.

రాజస్థానమంతటిలోనూ, బ్రిటీషు ప్రభుత్వాని కత్యంతమూ వ్యతిరేకమైన విప్లవకేంద్రం కోటా. రాజకీయప్రతినిధియైన మేజర్ బర్టన్ (Major Burton) హత్యగావింపబడినదిప్రదేశంలోనే. అధికారులుగా ఉండిన జైదయాళూ, అతని సోదరుడు హార్‌దయాళూ, ఉద్యమానికి, నాయకత్వం వహించిరి. స్థానికమంత్రి యొక్క నివాసాన్ని ముట్టడించి, మహారావును నిర్బంధంలో ఉంచిరి. ఇట్టి కల్లోల పరిస్థితులు కొన్ని నెలలపర్యంతం సాగినాయి. కడపట, జెనరల్ రాబర్ట్స (General Roberts) 5500 మంది బ్రిటీషు సైనికులతోనూ, కరోలీనుండి వచ్చిన సహాయకసైన్యంతోనూ, విప్లవసైన్యంపై బడి, అమితమైన సైన్యనష్టం కలిగించి, ఓడించినాడు. విప్లవనాయకులను దయారహితంగా, క్రూరంగా, నాశం గావించెను. జైదయాళును ఫిరంగిముఖంతో కట్టి, ముక్కలుముక్కలుగా, కాల్పించినాడు. విప్లవోద్యమంతో సానుభూతి కలవారని అనుమానింపబడిన వర్తకులపైనా, శిల్పులపైనా అత్యధికమైన పన్నులను విధించినాడు.

కార్యకారియైన విప్లవాన్ని ఈ విధంగా అణచివేసినా, విప్లవకారులకు

రజపుత్రులు సహాయం చేస్తూనే వచ్చినారు. తాత్యాతోపు నాయకునకు రాజస్థానం ఆశ్రయమిచ్చింది. సలుంబార్, కోఠారియా సర్దారులు రక్షణార్థం వచ్చిన విప్లవకారులను ఆదరించినారు.

**మధ్య భారతము :** శివాక్, ఛోటానాగపురముల మధ్య చెదిరియున్న, చిన్నవి పెద్దవి అయిన రాజ్యాలు ఒక వైపునా, రాజపుటానా మరియొకవైపునా గల ప్రాంతం మధ్యభారత ఏజెన్సీ. దీని కుత్తరంవైపు భాగం ఉత్తర ప్రదేశ్. ఈ విధంగా ఈ ఏజెన్సీ విభాగాన్ని, విప్లవాత్మకములైన ప్రాంతాలు చుట్టుముట్టి ఉన్నాయి. ఏజెన్సీలోని ప్రధాన సైనిక కేంద్రాలు,- గ్వాలియర్, ఇండోర్, భోపాల్,- లో ఉన్నవి. విప్లవానికి సంబంధించిన సమాచారం తెలియగానే, ఈ ప్రదేశాల్లోని దేశీయ సైనికులు, తమ ప్రభువుల విముఖభావాన్ని కూడా లెక్కింపక, తమ సహచరులైన విప్లవకారుల సహాయార్థం నిలబడినారు. పెక్కు జిల్లాలలో కల్లోలము బయలుదేరింది. సాగర్, జబల్‌పూర్, నరసింగపూర్, హోషంగాబాద్, నౌగాంగ్, నాగపూర్, మొదలైన ప్రాంతాలలో విప్లవోత్పాతాలు చెలరేగినాయి. ఆ ప్రదేశాలలో ఎదురు తిరిగిన భారతీయ సైనికులకు, బనపూర్ రాజా, గోండ్ రాజా, షకార్ షా మొదలైన ప్రభువుల తోడ్పాటు లభించింది.

గ్వాలియరు మహారాజా బ్రిటీషువారికి విశ్వాస పాత్రుడు. బ్రిటీషు ప్రభుత్వం యొక్క మహత్తర శక్తిసామర్థ్యాలను ఇతడు ఇటీవలనే కలకత్తాలో దర్శించి వచ్చినాడు. 'బ్రిటీషు రాజ్'-పై ఇతనికి నమ్మకం ఏర్పడింది. కాని, విప్లవసైనికులతో రక్తసంబంధాలూ, కులసంబంధాలూగల గ్వాలియరు సైనికులు విప్లవకారులను అభిమానించక తప్పరు. వీరి సంఖ్య ఎనిమిదివేలకు మించి యున్నది. ఝాన్సీలో బ్రిటీషువారు తమ వారిపై జరిపిన సామూహిక సంహారచర్యను (Massacre) గూర్చి విన్నంతనే, వీరావేశపరులై విప్లవానికి పూనుకొన్నారు. కాని, వారికి కలిగిన విజయమెంతోకాలం నిలువలేదు. బ్రిటీషు సైన్యము వారి నోడించి, గ్వాలియర్ మహారాజును మరల రాజ్యంలో నిలబెట్టింది.

భోపాల్ రాజకుటుంబంలోని సర్దారులూ, సంస్థానాధిపతులూ, తమ పరిపాలకురాలైన సికందర్ బేగంపట్ల, అభిమానులుకారు. కావున, ప్రక్కనున్న బ్రిటీషు ప్రాంతాలలో కలిగిన విప్లవము, వారికి అనపేక్షిత లాభమయింది. ఈ సదవకాశాన్ని పూర్తిగా వినియోగించుకొని, వీరు విప్లవకారుల పక్షము వహించినారు. (విలాయితీలనూ)- పఠానులనూ, రాజ్యసైన్యాన్ని రెచ్చగొట్టి బ్రిటీషు వారిపై, మత విషయకమైన ధార్మిక యుద్ధము పలుమార్లు సాగింపజేసినారు.

గవర్నర్ జెనరల్ ప్రతినిధిగా నుండిన కల్నర్ డ్యూరాండ్ (Colonel Durand), మధ్యభారతంలో జరిగిన విప్లవాన్ని గూర్చి ఈ క్రింది విధంగా వివరించెను (1857 ఆగస్టు 18)- "సక్రమ వ్యవస్థను పునః నెలకొల్పడానికి, అరాజకీయ స్థితిని అన్నిచోట్లా నిర్మూలించడానికి, మనకున్న శక్తి చాలదు; నిర్బంధచర్యతీసుకోడానికి తగిన పరికరములు తక్కువ. మన గ్వాలియరు

చిన్నవాణ్ని త్రోసివేసి, అతని ఉత్తరాధికారి మరణించిన తరువాత (1848) ఆ రాజ్యాన్ని తమ బొంబాయి రాష్ట్రంలో కలుపుకొన్నారు బ్రిటిష్ అధికారులు. ఇనాం కమీషనువారి కార్యకలాపాలవల్ల మరాఠా దక్షిణ ప్రాంతం నిరాశతో బాధపడుతూ ఉన్నది. 1844 లో జరిగిన తిరుగుబాటుకు ప్రతీకారంగా బ్రిటిషువారు విధించిన నష్టపరిహార భారం మోయలేక క్రుంగిపోతున్నది కొల్హాపూర్. ఇట్టి పరిస్థితులలో—"సైరాస్య ధూపంతో తెగించియున్న సువర్ణావకాశాలు అతిసాహసానికి పూనుకోవడానికి ఏ అల్పసంఘటన ఐనా చాలు." ఆ విధంగానే జరిగి, వీరు విప్లవానికి తెగించినారు.

అసీర్‌గర్, బర్హాన్ పూర్, ఔరంగాబాద్, బెల్గాం, కొల్హాపూర్, బొంబే-లలోని భారత సైనికులూ, అసంతుష్టితో ఉన్న ముస్లిములూ, విప్లవం కలిగించడానికి తంత్రాంగం పన్నిరి. సతారాలో ఉన్న రంగోబాపూజీగుప్తే, శివాజీ వంశానికి విశ్వాసపాత్రుడైన వృద్ధుడు. అతడు, రమోషీ, మాంగ్, కోలీ, ప్రాంతాల నుండి యువకులను సైనికులుగా ప్రోగుచేసి, మరాఠా సర్దారులలో కొందరిని కూడా గ్రహించి, తన ఉద్యమంలో చేర్చుకొన్నాడు. ప్రస్తుతమున్న పాలకులను తొలగించి, ప్రతాపసింగు కుమారుడైన షాహూను సింహాసనమెక్కించడం ఇతని ఆశయము. కుంధాల్‌కు చెందిన నానాదరమోషి, కాశీరాజా, కరాడ్‌కు చెందిన దౌలత్‌రావ్ హరిపావార్, కొల్హాపూరుకు చెందిన ...త్యా ఫడ్నీస్,-ఇంకనూ ఇతరులు, గుప్తేకు సహాయపడడానికి మాట ఇచ్చినారు. ఈ ఉద్యమానికంతకూ శివరామ్‌కులకర్ణి చైతన్యశక్తి. రంగరావు బాపూజీ కుమారుడైన సీతారాంకు ఉద్యమ కార్యక్రమాన్ని పర్యవేక్షణ చేసే బాధ్యతను అప్పగించినారు. దురదృష్టంవల్ల ఈ తంత్రాంగాన్ని ద్రోహులెవరో బైటపెట్టినారు. తత్పరిణామంగా, ఈ కుట్రలోచేరిన వారందరినీ బ్రిటీషువారు చంపినారు.

కొల్హాపూర్, బెల్గాం, ధారవార్లలో కూడా అసంతుష్టి అధికంగా వ్యాప్తమై ఉండినది. కాన్‌పూరులో నానాసాహేబు గావించిన విప్లవాన్ని గూర్చి విన్న దేశీయ సైనికులు, తీవ్రంగా ఉద్రిక్తులైనారు. విప్లవం జూలై 31 వ తేదీ ఆరంభమయింది. కొల్హాపూరును స్వాధీనం చేసుకోవడానికి రెండు సార్లు ప్రయత్నించినారు సిపాయీలు. కాని ప్రయత్నం ఫలించలేదు. తరువాత, డిసెంబరులో జరిగిన ప్రయత్నము కొంత వరకూ సఫలమయింది. పట్టణాన్ని ఆక్రమించి, కోట తలుపులను బంధించి వేసినారు. కాని, బ్రిటీషు సైన్యము తలుపులను పగులగొట్టి, పట్టణాన్ని మాత్రమే కాక, రాజనగరును కూడా ఆక్రమించుకొన్నారు. రాజా సోదరుణ్ణి ఖైదీగా సింధుప్రాంతానికి పంపినారు. బెల్గాంలో, ఒక మునిషీ విప్లవాన్ని రెచ్చగొట్టినాడు. కాని, విప్లవకార్యక్రమమారంభింపక పూర్వమే, బ్రిటీషు వారికి వార్త అందింది. అంతతో ప్రయత్నము అణగారి పోయింది.

బొంబాయిలో మూడు భారతీయసేనావర్గాలుండినవి. మొహర్రం సందర్భంలో విప్లవాన్ని ఆరంభించవలెనని వారు పన్నుగడ పన్నియుండిరి. కాని,

పోలీసు డిప్యూటీ కమీషనర్,- ఫార్జెట్ (Forjett) అప్రమత్తుడై యుండి, కుట్రను ఆరంభదశలోనే అణచివేసినాడు.

ఇనాం కమీషనువారి చర్యలు కారణంగా అలజడికి లోనై యున్న నర్గుండ్ సర్దారు, సాయుధుడై ఎదురు తిరిగి బ్రిటీషువారి క్రోధ క్రౌర్యాలకు గురియైనాడు. సావంత్‌వాడీ ప్రాంతపు దేశాయీలు, ఎదురు తిరిగి, తమ అరణ్య దుర్గాలలో నిలిచి బ్రిటీషు ప్రభుత్వాన్ని ధిక్కరించిరి. కాని, కడపటికి వారు కూడా లొంగిపోవలసి వచ్చింది.

కట్టుబాటుతో ప్రజలందరూ కార్యక్రమాన్ని నడపకపోవడమూ, బ్రిటీషు అధికారులు అప్రమత్తులై యుండి, సమయోచితచర్య తీసుకోవడమూ,-అనే కారణాలవల్ల, విప్లవాగ్ని విస్తారంగా వ్యాపించలేదు. దక్షిణ మరారా ప్రాంతంలో జరిగిన కల్లోలము స్వల్పమైన సంఘటన. అది, కేవలం కొద్దిమంది సర్దారులకూ, భూస్వాములకూ, ఉత్తరభారతమునుండి వచ్చిన సిపాయీలకు మాత్రమే సంబంధించిన తిరుగుబాటు. పూర్బీయ సైనికులను (ఉత్తరభారతం సైనికులు) మరాఠులతోను, మహార్లతోనూ, పొత్తుగలిపే సామాన్యాంశములు లేవు. కావున, పూర్బీయ సైనికులు విప్లవానికి పూనుకొన్నప్పుడు, మరారులు వారితో చేరక పోయిరి.

బొంబాయిలోని వ్యాపారవర్గం వారికీ, ఆంగ్ల విద్యాభ్యాసంచేసిన విద్యావంతుల వర్గానికీ విప్లవోద్యమంపట్ల సానుభూతిలేదు.

*ఎదురు తిరిగిన హైదరాబాద్, మదరాసులు :* ఢిల్లీ మొఘల్ సార్వభౌమునితో తమకుగల సానుభూతి కారణంగా, నైజాము రాజ్యంలోని ముస్లిములు మిక్కిలి అలజడికి లోనై యుండిరి. మౌల్వీలు ధార్మిక యుద్ధాన్ని రెచ్చగొట్టుచుండిరి. తత్ఫలితంగా, రోహిల్లా సైన్యమూ, వారితో సహానుభూతిగల ఇతరులనేకులూ, ఏకమై, బ్రిటీషు స్థానికమంత్రి నివాసం పై నడిచినారు. కాని, యువకుడైన నైజామూ, అతని వృద్ధిమంత్రియైన సాలార్‌జంగూ, బ్రిటీషు వారికి భక్తిపరులై ఉండినందువల్ల, తిరుగుబాటును త్వరలోనే అణచివేసినారు.

మదరాసు రాజధానిలో అసంతుష్టి ఏ మాత్రమూ తక్కువకాదు. కాని, అందు నాయకత్వం లోపించింది. దేశీయ సైనికులందరూ తక్కువ కులాల వారే కనుక, అగ్రజాతులవారికి జరిగిన అన్యాయంపట్ల, వారి కేమాత్రమూ సానుభూతి కలుగలేదు. అదికాక, రైతువారీ విధానంవల్ల పరిపాలన సంప్రదాయాలు గల వర్గంవారు ఇదివరకే నిర్మూలింపబడియుండిరి. ఆంగ్లవిద్య నభ్యసించిన వర్గం వారు, విప్లవోద్యమాన్ని అభ్యుదయ విరుద్ధమైనదిగా భావించినవారు కనుక, దానికి వారు స్వభావసిద్ధంగానే వైరులు.

ఐనప్పటికీ, మొఘల్ పరిపాలన ఢిల్లీలో మరల స్థాపితమైనదని తెలియడంతో, దక్షిణదేశంలోని ప్రజలు ఉద్రిక్తులైనారు. ముస్లిము సైనికులు ఆనంద పరవశులైరి. ముస్లిము పౌరులయొక్క వైఖరి కొంత దిగులు పుట్టించేదిగానే ఉండినది. కర్నూల్, కడప, మలబార్ ప్రాంతాలు అధిక సంఖ్యాకమైన ముస్లిం-

కాబట్టి, ఇండియా కంపెనీ-దురుద్దేశంతోనూ, అత్యాశతోనూ, స్వార్థపరత్వం తోనూ, బలాత్కార సంగ్రహణం (Extortion) తోనూ, భారతదేశ పరిపాలనను సాగించిందనేమాట ఏ మాత్రమూ అపవాదంకాదు." (ఇది ఆంగ్లేయ ప్రధానాధి కారి స్వయంగా ఇచ్చిన సాక్ష్యము.)

భారత ప్రజలపై శతాబ్దంపైగా నడిపిన ఇట్టి పరిపాలన కారణంగా, దేశమంతా విషమమైన విపత్పరిణామాని లోనయిందని- అలెగ్జాండర్ డఫ్- (Alexander Duff) చక్కగా వివరించినాడు- "అనేక వేల ప్రదేశాలలో విప్లవము కార్యకారి కాకపోవడానికి, మనం ముందుగనే జాగ్రత వహించి యుండడమూ, విధి అన్యథాతలంచ డమూ మాత్రమే కారణములైనవి, అనే సత్యాన్ని సర్వులూ గుర్తించినారు. జాత్యంధుల విషయమూ, చూచుట కిష్టంలేక, కన్నులు మూసుకొన్నవారి విషయమూ మాత్రమే వేరు. విప్లవం బాహాటంగా జరగని ప్రదేశాలలో కూడా, అత్యంతమైన అసంతుష్టి, ద్వేషభావమూ, ద్రోహబుద్ధి- విస్తారంగా ఉండిన వనడం తథ్యము. తత్కారణంగా, అధికారులు శంకాపరులూ, భీతాహులూ, ఐ, ఉండిరనడమూ నిజమే."

బ్రిటీషు పరిపాలకుల ఆత్మసంతుష్టితో హృదయాలకు హత్తుకొని యుండిన సర్వాధికారభ్రాంతి, 1857 విప్లవంతో పటాపంచలయింది. ఎంతటి ప్రజానీకాన్ని పశుబలంతో విధేయస్థితిలో నిలుపడం సాధ్యమేకాని, వారి భక్తి విశ్వాసాలను నిర్బంధంతో సంపాదించలేమనే సత్యాన్ని, బ్రిటీషు వారికి విప్లవోద్యమము, విశదం గావించింది.

విస్తృతంగా వ్యాప్తమైన ఈ మహోద్యమ స్వభావాన్ననుసరించి రెండు విషయాలను గమనించవలసి యున్నది. విప్లవప్రణాళిక, దాని సమన్వయము, అనేవి ఈ ప్రశ్నలు. దేశీయులైన్య భాగాలకు విప్లవోద్యమ విషయము కొంత వరకు తెలిసియుండినదని ఊహించడానికి, రక్తారవిందములతో (Red Lotus) తయారైన చపాతీలను (రొట్టెలను) సిపాయీలకు పంచిపెట్టడము ఒక నిదర్శన మౌతుంది. అజీముల్లా ఖాన్, నానాసాహేబు యొక్క ముఖ్య సలహాదారునూ ఔధ్‌లో ప్రధాన పాత్రవహించిన మౌల్వి అహమ్మదుల్లాషా, ప్రసిద్ధుడైన మౌల్వి ఫజల్-ఇ-హాక్ ఖైరాబాదీ-, మొదలైన వారు, సైనికులతో పర్పాచుకొన్న సంబంధాన్నిబట్టి, సమైక్యముతోకూడిన, సమగ్ర ఉద్యమానికి ప్రయత్నాలు జరిగినవని చెప్పవచ్చును. ఇరాను ప్రభువైన షాతోనూ, రష్యాతోనూ, ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగినవనే కథకు ఆధారాలు కానరావు. కాని, భారత దేశంలోని ఇతర రాజులతోనూ, సర్దారులతోనూ. భారతీయ సైన్యవర్గంతోనూ బహదూర్‌షా, ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపియున్నాడనడానికి ప్రబలమైన సాక్ష్యం కావలసినంత ఉన్నది.

దేశంలోని సైనిక స్థావరాలన్నిటిలోనూ, ఒక్కసారిగా విప్లవాన్ని ఆరంభించడానికి ఉద్దేశించియుండిరనికూడా ప్రవాదాలుండినవి. ఉత్తరభారతంలో అత్యుష్ణమైన దినం, మే నెల 31వ తేదీ. ఆనాడు, విప్లవోద్యమానికి అనువైన

సమయమనీ, విదేశీయులైన ఆంగ్లేయ శక్తి అత్యుగ్ర పరిస్థితిలో నిలిచి పోరాడ లేరనీ, ఆ సమయం నిశ్చితమయింది. కాని మీరట్‌లోని సిపాయీలు, నిశ్చిత కాలానికి, మూడువారాల ముందుగనే ఎదురుతిరగడంతో, బహదూర్‌షా, నిరుత్సాహులైనట్లు తోస్తుంది. అకాలంలో ఉత్పన్నమైన ఆ విప్లవంలో చేరడానికి, అతడు వెనుదీయడం సహేతుకమైనదే.

అనేక సందర్భాలలోనూ, సంఘటనలలోనూ విప్లవ నాయకులు పరస్పరంచూపిన సహకారభావాన్నిబట్టికూడా, విప్లవోద్యమానికొక ప్రణాళిక ముందుగనే ఏర్పడియుండినదని నిశ్చయించవచ్చు. కాన్‌పూర్ దండయాత్రలో, షహజాదా ఫిరోజా, గ్వాలియరు సైన్యాలూ, బాబూ కున్‌వార్‌సింగూ, ఇతరులూ, నానాసాహేబుకు తోడ్పడడం, ఇందుకొక నిదర్శనము. రాజస్థానులోని రాజులనూ, నవాబులనూ, సర్దారులనూ, పంజాబు, ఉత్తర భారతాల్లోని రాజులను కూడా, తనతో చేరవలసిందిగా బహదూర్‌షా ఆహ్వానించినాడు. కాని, వారు ఆసక్తి ఎక్కువగా చూపినవారుకారు. దేశంలోని వివిధభాగాలకు ఈ విషయంలో సమన్వయం ఉండినదనే వాదాన్ని ఉర్దూ పత్రికలు సమర్థించినాయి. ఆ పత్రికలకు దేశం వివిధ భాగాల్లో వ్యాప్తిఉండడంవల్ల, ఢిల్లీలోనూ, ఇతర కేంద్రాలలోనూ, జరిగిన సంఘటనలను ప్రచారం చేయడానికి అవి ఎక్కువగా ఉపయోగించినవి. వృద్ధుడైన బహదూర్‌షా ఢిల్లీ సార్వభౌమ పదవిలోఉన్నది నామమాత్రమే ఐనా, దేశచరిత్రకు సంబంధించిన ఈ విషమ పరిస్థితిలో మొఘలు సార్వభౌముని పేరుకొక అద్భుతశక్తి ప్రాభవమూ, సిద్ధించినవి. ఇంతకు పూర్వము, నూరు సంవత్సరాలుగా, దేశాన్ని కలతపెట్టిన ప్రాచీన కలహాలన్నీ, తాత్కాలికంగానైనా, విస్మృతములైనవి. గౌరవ ప్రతిష్ఠల ప్రదర్శనమూ, రాజభక్తి, విధేయతా శపథాలూ, మరల క్రొత్తగా స్థిరపరచబడినవి. వజీద్ ఆలీషాయొక్క పూర్వీకుడు, ఢిల్లీ సార్వభౌముని అధికారాన్ని-ఇంతకుపూర్వమే, ధిక్కరించి, స్వతంత్ర ప్రభువుగా ప్రకటించుకొనియుండెను. ఐనా, ఇప్పుడు, వజీద్ ఆలీషా కుమారుడైన బిర్జిస్‌కాదర్ వాలీపదవి నధిష్ఠించిన వెంటనే, 'ఢిల్లీ సార్వభౌముని అధికారానికి బద్ధుడననీ, సార్వభౌముని ఆజ్ఞలను శిరసావహింతుననీ' ప్రకటన గావించెను.

హాఫిజ్‌రహమత్ ఖాన్, ఇదివరలో ఒక స్వతంత్ర రాజ్యాన్ని నదీమధ్య ప్రదేశంలో (Doab) ఏర్పరచుకొని యుండెను. అతని మనుమడు ఖాన్‌బహదూర్‌ఖాన్, ఇప్పుడు రోహిల్ ఖండ్‌పై పరిపాలనాధికారాన్ని వహించిన వెంటనే, అతడు ఢిల్లీ సార్వభౌముని రాజ ప్రతినిధినని ప్రకటనగావించెను. యుద్ధవ్యాపారములం దితడు అతినిపుణుడు, బ్రిటీషువారి సైన్యశక్తిబలాలను చక్కగా ఎరిగినవాడు. ఆ బలాన్ని ఎదుర్కొనడానికీ, దానిని ఓడించడానికీ, ఇతడు పన్నాగం పన్నినాడు. అతడు ప్రచురించిన ఈ క్రింది ఆజ్ఞాపత్రంద్వారా, ఈ విషయము వ్యక్తమౌతుంది.

"కాఫిరుల నియతసైన్యాలను బాహాటంగా ఎదిరించడానికి ప్రయత్నించ

మదరాసులోని విప్లవసైనికులు "ఢిల్లీపాదుషా జిందాబాద్" అనే విజయ నినాదాలు గావించినారు. హైదరాబాదులోనూ, పంజాబులోనూ దేశీయసైనికులను నిరాయుధులుగా జేసి, సైన్యంనుండి తీసివేసిరి. అట్లు ఉద్యోగభ్రష్టులైన వారిలో అనేకులు ఢిల్లీకి ప్రయాణమైనారు. నానా సాహేబ్ పీష్వా అధికారాన్ని వహించడం, రాజపుటానా మధ్యభారత మహారాష్ట్ర ప్రాంతాలలోని సర్దారులకు ఆనందాన్ని కలుగ జేసింది.

ఐనప్పటికీ, విప్లవోద్యమానికై గావించిన పూర్వ ప్రణాళిక అల్పమైన దని అంగీకరించక తప్పదు. వివిధ శక్తులకూ వర్గాలకూ క్రమబద్ధమైన వ్యవస్థ నేర్పరచి, దానిని నడపడానికి తగిన సామర్థ్యము కల నాయకుడు లభించలేదు. విప్లవసైనికులు ధైర్యవంతులూ, వీరోచితత్యాగాలకు సంసిద్ధులూ కావడం నిజమే. కాని క్రమశిక్షణలేని గుంపుగా మాత్రమే ఏర్పడినారు. దండయాత్రకు సరియైన ప్రణాళిక వారికి లేక పోయింది. తాముపక్రమించుచున్న మహా ప్రయత్న మెంత అపారమైనదో వారికి తెలియదు. యుద్ధనిర్వహణలో అవసరములైన చాతుర్యోపాయాలూ, ఉద్యమానికి కావలసిన భండారమూ, యుద్ధపరికరాలూ లేనివారు వీరు. ఉద్యమవ్యవస్థాపరిపాలనా, సైన్యవ్యవస్థా పరిపాలనా కూడా, తాము పూనుకొన్న ఉద్యమావసర పరిస్థితికి సమానమైనవి కావు. విప్లవాలనేకములు పలుచోట్ల జరిగినవి. కాని, ఇవన్నీ, ఏకైకమైన ఆశయాన్ని సాధించడాని కేర్పడిన ఒక మహావ్యవస్థలో, భాగాలుగా ఏర్పడలేదు.

ఈ మహావిప్లవము, రెండేండ్ల కాలము, క్రమవిరహితంగా, విభిన్న మార్గాల్లో నడిచింది. కీర్తిప్రతిష్ఠలు తెచ్చిన సంఘటనలూ, కళంకాపాదకములైన చర్యలూ, కూడా, ఈ ఘట్టంలో చేరినవి. ఉదాత్తమైన శౌర్యమూ, సర్వోత్కృష్టమైన ఆత్మార్పణమూ, అతిసాహసంతో కూడిన శత్రునిగ్రహమూ, దాస్యానికి మారుగా వీరమరణానికి సిద్ధపడడమూ,-ఇత్యాది ఉదాత్తవీరోచిత వృత్తము లెన్నో జరిగినవి. కాని వాటికి వ్యతిరేకంగా, పిరికిపందలకు తగిన క్రౌర్యమూ, ద్రోహమూ, అసమర్థతా, పిరికితనమూ, అవివేకమూ,—ఇత్యాదులతో కూడిన చర్యలూ జరిగినవి. ఆశయవిషయంలో స్థైర్యమూ, ఉద్యమంపట్ల భక్తి విశ్వాసాలూ, దుష్కరములైన పరిస్థితులను ఎదుర్కొవడంలో రాజనీతిజ్ఞతా, శత్రువుల వ్యూహాలనూ పన్నాగాలను విఫలము గావించడంలో సమయస్ఫూర్తీ, యుద్ధవ్యాపారమును నడపడంలో నైపుణ్యమూ,-ప్రదర్శించిన స్త్రీ పురుషులు ఉద్యమనాయకులలో ఉండినారు. దీనికి వ్యతిరేకంగా,-భయం వల్లనూ, స్వలాభాన్నాశించీ, ఉద్యమంలో చేరిన వారనేకులుండిరనడం కూడా ఒప్పుకోక తప్పదు. తమ ప్రయోజనం కొరకు, సహచరులకు ద్రోహంచేయడానికి కూడా, వీరు వెనుతీసినవారు కారు. వీరిదుష్ప్రవర్తనవల్ల దేశానికి అపకీర్తి, అప్రతిష్ఠా కలిగినవి; భారత జాతికి అపవాదు ఏర్పడింది. ఈ దుష్ప్రవర్తనను మృతకల్పమైనదిగా భావించి, విస్మరించడం శ్రేయస్కరము.

కాని, తమ మాతృభూమిని పరదేశ దాస్యశృంఖలాలనుంచి విముక్తి గావింపడానికై తమ సర్వస్వాన్నీ అర్పించిన, ఉదాత్త సేవాతత్పరులైన స్త్రీ పురుషులను, చరిత్ర విస్మరింపజాలదు.

ఢిల్లీ రాజకుటుంబము, తన ఉదాత్తవంశ సంప్రదాయములకు అనుగుణమైన విధంగా, ఒక వీరుణ్ణి, ఈ సమరోద్యమానికి అంకితం చేసింది. వయసులో చిన్నవాడైనా,- (విప్లవకాలానికి అతనికి ఇరువదివత్సరముల వయస్సు మాత్రమే) ఫిరోజ్ షా రాకుమారుడు, పుట్టుకతోనే ప్రజానాయకుడు. స్వాతంత్ర్య పతాకాన్ని, అతడు, మండసార్‌లో ప్రతిష్ఠించి పోరాడుతూ, బ్రిటీషు సైన్యాన్ని మధ్యప్రాంతాలలోనే నిలిపియుంచినాడు. బ్రిటీషు వారచ్చటనుంచి తరిమివేయగా, ఉత్తర ప్రదేశంలో ప్రత్యక్షమై, అతడు రోహిల్ ఖండుపైనా ఔధ్‌పైనా దండయాత్రలు సాగించెను. అక్కడ అపజయము సిద్ధింపగా, తన సైన్యాన్ని రాజపుటానాలోని, తాంత్యాతోపుతో చేర్చి, దుర్ఘటములైన పరిస్థితుల్లో పోరాడుతూ, వెన్నాడుతున్న బ్రిటీషు సైన్యాన్ని తప్పించుకొంటూ, సిరోంజ్ అరణ్యాలలోనికి తప్పించుకొనిపోయినాడీ యువకవీరుడు. ఇంతలో విప్లవోద్యమము, శిథిలమైపోయింది. తమ అధికారానికి లోబడిపోయిన వారికందరికీ 'సర్వక్షమాదానం' చేస్తామని విక్టోరియా రాణి ప్రకటించడమూ, ఆ వాగ్దానము సువిస్తరంగా ప్రచారంచేయడమూ జరిగినవి. కాని, ఫిరోజ్‌షా అత్యంతమైన కష్టపరిస్థితులలోనున్నా, తన ఆత్మగౌరవాన్నీ, వ్యక్తి స్వాతంత్ర్యాన్నీ, తన వంశ ప్రతిష్ఠనూ,-బలిచేయడానికీ, అవమానప్రదమైన నీచమైన, అస్వతంత్ర జీవితాన్ని, సంపాదించుకోవడానికీ అంగీకరించలేదు. సమానధైర్యశాలియైన ఈ వీరునకు, తన దేశంయొక్క గొప్ప భవిష్యత్తును గురించిన విశ్వాసమెప్పుడూ సడలలేదు. ప్రవాసంలోనే ఈ సార్వభౌమ పుత్రుడు మరణించినాడు.

హాఫీజ్ రహమత్ ఖాన్ మనుమడైన ఖాన్ బహదూర్ ఖాన్, డెబ్బైఏండ్ల వృద్ధుడైనవాడు కూడా, రోహిల్ ఖండులో, ఢిల్లీ రాజప్రతినిధి పదవి నంగీకరించి, హిందూ ముస్లిము ప్రజలను రాజనీతి పరిజ్ఞానంతో, వివేకంతో పరిపాలించినాడు. కావున రెండు మతాలవారి మధ్య భేదాభిప్రాయాన్నీ, ద్వేషాన్నీ, కలిగించడానికి బ్రిటీషువారొనర్చిన ప్రయత్నాలన్నీ విఫలమైనవి. బరైలీని చుట్టుముట్టిన, నాలుగు దళాల బ్రిటీషు సైన్యాన్ని ఓడించి, రోహిల్ ఖండ్ ప్రాంతాన్ని అతి నైపుణ్యంతో రక్షించినాడు. కాని, కడపట, బ్రిటీషు బలాలు అధికం కాగా, ఇతడు 'తారై' అరణ్యాలలోనికి వెనుదిరుగ వలసి వచ్చింది. ద్రోహ విధానంతో అతన్ని పట్టుకొని, బ్రిటీషువారు ఉరిదీసినారు. కట్టకడపటికి కూడా శత్రువులకు లొంగకుండా, వారి నెదిరిస్తూ వచ్చిన ఈ వీరుడు దేశభక్తుడుగనే మరణించినాడు.

వజీద్ - ఆలీ - షా ధర్మపత్ని యైన హాజరత్ మహల్, ఒక వీరనారి. ఆమె ఔధ్‌లో, జరిపిన విప్లవోద్యమము, చిరస్మరణీయమైనది. పదనొండేండ్ల వాడైన తన కుమారుని (బిర్జిస్ కాదర్) పక్షంగా, ఈమె సర్వోత్తమాధికారాన్ని

వహించి పరిపాలన ఆరంభించింది. విప్లవోద్యమానికి ఈమె, హృదయకేంద్రంగా ఏర్పడింది. పరిపాలన విధానాన్ని సక్రమంగా వ్యవస్థపరచడమేకాక, ప్రభుత్వ వ్యవహారాలను నడపడానికై, సమర్థులైన వ్యక్తులను నియమించింది. అంతేకాక, బ్రిటీషు స్థానికమంత్రి నివాసంపై జరిగిన ముట్టడినికూడా, ఈమే స్వయంగా నడిపింది. శత్రుసైన్యాల బలమధికంకావడంతో, లక్నో వదలవలసిరాగా, ఈమె, మౌల్వీ అహమ్మదుల్లాషాకు తోడ్పడడానికై, షాజహాన్‌పూర్ వెళ్ళింది. కాని, పట్టణాన్ని పట్టుకొనే ప్రయత్నం విఫలంకాగా, నేపాలు సరిహద్దులలోని అరణ్యాలను ఆశ్రయించి, ఆత్మరక్షణ గావించుకొంది. స్వాతంత్ర్యమనే ఉత్తమాశయానికై పోరాడి, ఓడిపోయిందీమె. యుద్ధంలో అపజయం పొందిందేకాని, గౌరవప్రతిష్ఠలను గోల్పోలేదు. బ్రిటీషువారిచ్చిన గౌరవభృతిని (పించను) కూడా తిరస్కరించి, ఈ వీరనారి విదేశంలో జీవితంగడపి, తన ఉన్నతస్థితిని గుర్తింపని పరిస్థితిలో, లోకాన్ని వీడింది.

'బీహారు సింహ'మని సార్థకనామధేయుడైన కున్‌వార్‌సింగు, ప్రకృతిదత్తములైన సైన్యాధిపత్య లక్షణములతో ఒప్పిన మహావ్యక్తి, నిజమైన రసపుత్రప్రభువు. నిష్కల్మషహృదయుడూ, సౌహార్దహృదయుడూ, దీనరక్షకుడూ ఐన ఇతడు, తన రైతులకూ ఆశ్రితులకూ దైవసదృశుడు, బ్రిటీషు ప్రభుత్వానికి అప్రతిహతుడైన శత్రువు. జూన్ 12వ నాడు 'రోహిణి' లో జరిగిన సిపాయీల తిరుగుబాటు, ఎనభై ఏండ్ల వృద్ధుడైన కున్‌వార్‌సింగుకు, యుద్ధాహ్వానసూచక శంఖారావమయింది. షహాబాద్ జిల్లాలో బ్రిటీషు అధికారాన్ని త్రోసివేసి, తన ప్రభుత్వాన్ని నెలకొల్పినాడు. పిమ్మట శత్రువు కలిగించిన ఒత్తిడివల్ల తన అధికారాన్ని నిలద్రొక్కుకోలేక, ఇతడు తనసైన్యాన్ని 'రోహతాస్' కొండలలోకి నడిపించుకొనిపోయి, అచ్చట నిలిచి, బ్రిటీషువారి రాకపోకల నడ్డగించినాడు. అంత, మిర్జాపూర్ అరణ్యాలలోనుండి ప్రయాణం సాగించి, రీవా వెళ్ళి, ఆ రాజుయొక్క సహాయాన్ని అర్థించినాడు. ఇచ్చట విఫలుడై, మొదట బందాకునూ, పిమ్మట కాల్పీకినీ వెళ్ళినాడు

నానాసాహేబుతో కలిసి, కాన్పూరుపై దాడిచేయడం ఇతని ఉద్దేశము. కాని, ఈ ఉద్దేశం నెరవేరకపోవడంవల్ల, లక్నో వెళ్ళినాడు. లక్నో ఇతనిని అత్యంత గౌరవంతో ఎదుర్కొంది. తర్వాత, ఇతడు ఆజంఘర్‌పైనడిచి, బ్రిటీషు సైన్యాన్ని ఓడించి, పట్టణాన్ని ఆక్రమించినాడు. అధికసంఖ్యాకమైన సహాయక శత్రుసైన్యం రావడంతో, పట్టణాన్ని ఖాళీచేసి, ఘాజీపూర్‌వద్ద గంగానదినిదాటి బీహార్ మరల ప్రవేశించినాడు. తన నివాసస్థానమైన జగదీశ్‌పురంవద్ద, శత్రువులకు నిష్ఠురమైన అపజయాన్ని కలిగించడం' ఇతడు గావించిన వీరకార్యములలో కడపటిది. బ్రిటీషువారు అధికమైన సైన్యనష్టాన్ని పొందినారు. బ్రిటీషు సేనానాయకుడూ, ఇతరాధికులు పెక్కురూ, ప్రాణాలను గోల్పోయినారు. కొన్ని ఫిరంగులు కూడా, కున్‌వార్‌సింగుకు లభ్యమైనాయి. కాని, క్షతగాత్రుడైన బీహారుసింహం ఇంకా జీవించడం, విధికి ఇష్టంలేదు కాబోలు. అసాధారణములైన

శ్రమతో కూడిన కార్యభారంవల్లనూ, కడపటియుద్ధంలో తగిలిన తీవ్రమైన గాయాలవల్లనూ, బలహీనతనొంది, ఈ మహావీరుడు 1858 ఏప్రిల్, 20వ తేదీ అస్తంగతుడైనాడు ఐనా, అతని సోదరుడైన అమీర్ సింగు, విప్లవనాయకత్వాన్ని వహించి, 1859 డిసెంబరువరకూ యుద్ధం సాగిస్తూవచ్చినాడు.

తాత్యాతోపు మరియొక అప్రతిహతుడైన వీరుడు. (మొదట ఇతని పేరు రామచంద్రపాండురంగ)మహారాష్ట్రుల ప్రాచీనమైన గొరిల్లా యుద్ధ పద్ధతీ, ఎత్తుగడలూ, ఇతనికి జన్మతః సిద్ధించినవి. బ్రిటీషువారితో ఇతడు రెండేండ్ల పర్యంతం జరిపిన నిరంతరమైన (అసమాన బలాలమధ్య జరిగిన) యుద్ధాల్లో, గొప్ప యుద్ధ నైపుణ్యాన్ని, చాకచక్యాన్ని సుస్పష్టంగా ప్రదర్శించినాడు. విద్యుద్వేగంతో, ఇతడు ప్రదేశంనుంచి ప్రదేశానికి పయనిస్తూ, విప్లవాగ్నిని రగుల్కొల్పుతూ, శత్రువుల వ్యూహాలకు ప్రతిక్రియగావించి, వాటిని ధ్వంసం చేస్తూ, ఛలయుద్ధాన్ని (Pitched battle) పరిహరిస్తూ, అపజయం తర్వాత తప్పించుకొనిపోతూ, వెంటాడిన సైన్యాన్ని కనుగప్పుతూ,- తన యుద్ధచర్యను సాగించినాడు. మధ్యభారతం నుంచీ రాజపుటానాకూ, మరల వెనుకకూ, ఈ విధంగా పదేపదే తనను గమనించుచుండునట్లుగా, బ్రిటీషుసైన్యాన్ని కట్టిపెట్టినాడు. అపజయ మతని ఉద్రేకాన్ని తగ్గించలేదు; ప్రాణభీతీ, వినాశమూ, అనేవి అతని ఉద్యమదీక్షను కుంఠితమొనర్చలేదు. కాని, అతనికి కలిగిన చావు విషాదకరమైనగాథ. అతని మిత్రుడే అతనికి ద్రోహంచేసి, పట్టిఇచ్చినాడు. తాత్యాతోప్, బ్రిటీషుప్రజలలో ఒకడుకాడు. కనుక అతనిపై ఏ బ్రిటీషున్యాయస్థానానికీ అధికారంలేదు. ఐతేనేమి? ఒక బ్రిటీషున్యాయస్థాన మతనిపై విచారణజరిపి, మరణశిక్ష విధించింది. అసదృశ స్థైర్యశాలియైన తాత్యాతోప్, ఉరిని స్వయంగా, కంఠంలో తగిలించుకొని, తడబడని అడుగులతో ఉరిమానును (Gallows) ఆరోహించినాడు.

బుందేల్ ఖండులో విప్లవోద్యమానికి నాయకురాలు రాణీ ఝాన్సీ లక్ష్మీబాయి. ఆమెజీవితానికి స్మృతి చిహ్నాలుగా, అనేకములైన ఉదాత్త వీర గాథలూ, కావ్యాలూ, రచితమైనవి. ఆమె యొనర్చిన సాహసకృత్యాలు, దేశమంతటా గ్రామ సీమల్లో, వీరోత్సవాలు నెలకొల్పినవి. "అసాధారణమైన శక్తిమంతురాలూ, యువతీ, దయాభిక్షనెప్పుడూ వేడనట్టిదీ, ఆదర్శ విషయంలో చలించనట్టిదీ ఐన, రాణి" బ్రిటీషు వారి మొరటు భావాలవల్లనూ, నిరాధారములూ, అనవసరములూ ఐన బ్రిటీషు వారి సంశయాలకారణంగానూ, విప్లవానికి తెగించవలసి వచ్చింది. బ్రిటీషు సైన్యాలు ఝాన్సీని, అన్యాయంగా చుట్టుముట్టడం, ఆమె కోపాగ్నిని రగుల్కొల్పింది. "వీధి నుంచి వీధికి, ఇంటి నుంచి ఇంటికీ, గదినుంచి గదికీ, యుద్ధం భీకరంగా సాగింది. ఝాన్సీ సైనికులు పులుల వలె పోరాడినారు". దుర్గం స్వాధీన మయ్యేలోపున ప్రతి సైనికుడూ ముక్కలు కావలసి వచ్చింది. కాని, రాణీ తప్పించుకొని, కాల్పీ వెళ్ళిపోయింది. కాల్పీ కూడా శత్రువుల వశమైనప్పుడు, రాణీ, ఆమె సహచరుడైన తాత్యాతోపూ,

ధైర్యంతోనూ, భావి దృష్టితోనూ గ్వాలియరును, ఆక్రమించినారు. ఈ యుద్ధము,- స్మరణీయమైన ఆర్కాటు ఆక్రమణవలె,- స్వోపజ్ఞతోనూ, సాహసముతోనూ, నిర్వహించబడింది. గ్వాలియరు, వారి వశమయింది, కాని చాల కాలం వారి అధీనంలో ఉండలేదు. బ్రిటీషు సైన్యా లన్నిదిక్కుల నుంచి దట్టంగా పట్టణంపై పడుతున్నవి. కావున, తన సేనాసమూహంతో రాణీ, బైటికిపోయి, కోతాకిసరై నుంచి గ్వాలియరుకు వచ్చే మార్గాన్ని రక్షించ బూనుకొన్నది. అచ్చట జరిగిన యుద్ధోదంతమూ, లక్ష్మీబాయి వీరోచితమరణమూ, బ్రిటీషు చరిత్రకారుడైన మ్యాలిసన్ (Malleson) మాటల్లో వర్ణించడం ఉత్తమమైన పద్ధతి.

"పురుషుని దుస్తులు ధరించి, అశ్వాన్ని ఆరోహించి, ఝాన్సీరాణీ, తన సైన్యానికి ఉత్సాహం గొలుపుతూ, రోజంతా రణరంగంలో తిరుగుతూ ఉండడం, అందరూ చూస్తున్న విషయము.అంగుళమంగుళమూ, బ్రిటీషు సైన్యం ముందుకు జరుగుతూ, రణరంగాగ్ర భాగాన్ని చేరుతూ ఉండగా, బ్రిటీషు సేనానాయకుడైన స్మిత్ (Smith) దేశీయసైన్యంపై పడవలసిందిగా ఆశ్వికసైన్యాన్ని ఆజ్ఞాపించెను. ఝాన్సీరాణి, బ్రిటీషు ఆశ్వికదళాన్ని, స్థైర్యంతో ఎదుర్కొన్నది. ఆమె సహచరులూ, సైన్యమూ, ఆమెను అనుసరించక పోవడంతో, ఆమె ఆరోహించిన అశ్వము, ఆమె స్వాధీనంకాక, వారితో కూడా ఆమెను రణరంగం నుంచి తీసుకొని పోయింది. ఆమె అనుయాయులతో బాటు ఆమెకూడా తప్పించుకొనిపోయి యుండేదే. కాని, ఆమె గుర్రము, సేనా స్థావరానికి సమీపమందున్న కాలువను దాటుతూ, కాలుజారి కిందబడింది. ఆమెను వెంటాడుతున్న బ్రిటీషు హుసార్ (ఆశ్విక దళంలోని వాడు) పురుషవేషంలో నున్న ఆమెను గుర్తించలేక, నరికివేసెను. అంతతో ఆమె కిందబడి మరణించింది. ఆరాత్రి, ఆమె అనుయాయులు, బ్రిటీషువారామె శవాన్ని కూడా అగౌరవపరచడానికి అవకాశమివ్వకుండా, ఆమెదేహాన్ని తీసుకొనిపోయి, దహనంచేసినారు. ఝాన్సీలక్ష్మీబాయి యొక్క శౌర్యమూ, స్వాతంత్ర్య దీక్షా, భారతదేశంలో చిరస్థాయిగా నిలిచినవి."

వీరు మాత్రమేకాక, బ్రిటీషు ప్రభుత్వాన్ని ఎదిరించడంలో శౌర్యసాహసాలు ప్రదర్శించి, ప్రతిఘటన వ్యవస్థను ఏర్పరచి, విప్లవాన్ని నడిపినవారనేకులున్నారు. మాతృదేశస్వాతంత్ర్యసమరచరిత్రలో వీరిపేర్లు మరువరానివి. ఢిల్లీ సేనలకు నాయకుడై, పరిపాలన సంఘాన్ని నిర్వహించిన బఖ్త్‌ఖాన్, అట్టివారిలో ఒకడు. "అపారమైన శక్తిసామర్థ్యములూ, అప్రతిహతమైన ధైర్యమూ, దృఢనిశ్చయమూ, విప్లవవీరులందరిలోనూ ఉత్తమయుద్ధవీరుడూ", అని శత్రువుల ప్రశంసలకు కూడ పాత్రుడైన అహమ్మదుల్లాషా మరియొక మహావ్యక్తి. మౌల్వీ లియాకత్ ఆలీ, బీదస్థాయిలోనుండి వచ్చినవాడైనా, ఢిల్లీ సార్వభౌముని పేరిట అలహాబాదు పట్టణాన్ని సక్రమంగా పరిపాలించినవాడు.

బహదూర్‌షా సార్వభౌముడూ, నానాసాహేబూ,- ఈ ఉద్యమరంగంలో ప్రధానపాత్రలు. భారతచరిత్రలో ప్రసిద్ధిచెందిన రెండు రాజవంశాల

వారసులు వీరు. రెండు శతాబ్దాలకాలము, తన కీర్తివైభవాలను ప్రపంచమంతటా మారుమ్రోగునట్లు గావించిన ఢిల్లీసామ్రాజ్యాన్ని, బహదూర్ షా పూర్వులు ప్రతిష్ఠతో పాలించినారు. మహారాష్ట్రరాజ్యపతాకాన్ని 'అట్టాక్' నుండీ 'కావేరి' వరకూ కొనిపోయిన పీష్వాలవంశములోనివాడు నానాసాహేబు. కాని, దుర దృష్టంవల్ల ఈ ఇరువురిని గురించీ, చరిత్రకారులు భిన్నాభిప్రాయాలకు లోనైరి.

బహదూర్ షా, నానాసాహేబు లిరువురుకూడా, స్వభావసిద్ధంగా మహా వీరులవర్గానికి చెందినవారుకారు. వారికి విప్లవోద్యమంలో ఏర్పడిన నాయకత్వం పరిస్థితులకారణంగా వచ్చినదేకానీ, కోరి తెచ్చిపెట్టుకున్నది కాదనడం మాత్రం వాస్తవమే.

విప్లవోద్యమానికి నాయకత్వము వహించవలసిన సందర్భమేర్పడినప్పుడు, బహదూర్ షాకు ఎనభై వత్సరాలవయస్సు. తన జీవితాన్నంతా, లాల్ ఖిల్లాలోని నగరులో, చాలవరకూ, ఏకాంతవాసంలో గడపినవాడితడు. అతడు సార్వభౌమ పదవికి వచ్చినప్పటినుంచీ, కోటలోనే దర్బారులను నడిపిస్తూ వచ్చినాడు. అతని ఖర్చులకుగాను, బ్రిటీషువారు, ప్రతిసంవత్సరం ఇస్తూఉన్న గౌరవభృతిపై ఆధారపడి ఉన్నవాడు. రాజ్యపరిపాలన వ్యవహారాల్లో అతనికి అనుభవము లేదు. పేరునకుమాత్రం రాజుగాకాలం గడుపుతున్నవాడు. ఐనా, ప్రజ్ఞా నైపుణ్యాలు లేనివాడుకాడు. హిందీభాషలోనూ, ఉర్దూలోనూకూడా చక్కని కవిత్వము వ్రాయగలిగిన వాడు. కవులకూ, విద్వాంసులకూ ఇతని ఆదరం లభించింది.

అట్టిపరిస్థితులలో, ఇంతటి వృద్ధాప్యంలో బహదూర్ షా విప్లవోద్యమ నాయకత్వము వహించడం, అత్యాశ్చర్యకరమైన విషయము.అపారములైన బాధ్యతలతోనూ, వ్యాకుల కారణములైన సంఘటనలతోనూ కూడిన, ఈ మహోద్యమ నాయకత్వాన్ని నిర్వహించడం, వయస్సులో ఇతనికంటెను చిన్నవారికి కూడా సాధ్యమైనది కాదు. ఐనా, విపత్కరమైన విప్లవ జీవితయాత్రలో ప్రవేశించిన తరు వాత, ఒక్కసారికూడా ఇతడు వెనుదిరిగి చూడలేదు. ఇది ప్రశంసార్హమైన విష యము. వివిధవర్గాలకూ, భిన్నమతాలకూ చెందిన తన ప్రజలలో సఖ్యభావమును, సమైక్యము నెలకొల్పడంలోనూ, చుట్టడికిలోనై యున్న ప్రజల స్థైర్యాన్ని రక్షిస్తూ, వారికి ధైర్యాన్ని, ఉత్సాహాన్ని, కలిగించడంలోనూ, పర్యవసానం వరకూ కూడా యుద్ధాన్ని సాగించడానికి సైన్యాన్ని ప్రోత్సహించడంలోనూ, ఇతడు తన శక్తిసామర్థ్యాలనంతనూ వినియోగించి ఉండడం, అన్నిటికంటెను ఎక్కువగా ఆశ్చర్యాన్ని కలిగించిన విషయము. కాని, ఇతడెదుర్కొంటున్న సైన్యము తలకు మించినది. యుద్ధపర్యవసానమూ, ఇతని తదనంతర జీవితమూ విషాదాంతములైనవి. ఇతని కుమారులను ఇతని ఎదుటనే కాల్చి చంపినారు బ్రిటీషుపాలకులు. తన ఇంటికీ, దేశానికీ సుదూరమైన బర్మాలో, తన ధర్మపత్ని మాత్రమే సహచారిణిగా, చివరిరోజు లితడు గడుపవలసి వచ్చింది.

పేష్వాయైన రెండవబాజీరావుకు నానాసాహేబు దత్తపుత్రుడు. బ్రిటీషు వారి సామంతుడైన పిమ్మట, బాజీరావుకు దాస్యశృంఖలాలు హృదయదాహక ములైనవి. నానాసాహేబు, ఆ కాలంలో స్వేచ్ఛాపరుడైన రాజవంశీయుడుగా ప్రవర్తిస్తూ, సామాజిక జీవనంతోనూ, వినోదాలతోనూ, సంతోషప్రదర్శనాల తోనూ, కాలంగడిపేవాడు. విప్లవమారంభం కావడంతో ఇతడు సంధిగ్ధావస్థకు లోనైనాడు. మొదట ముభావంతోనే విప్లవోద్యమంలో తన జీవితాన్ని కలిపి నాడు. విప్లవనాయకులితనిని తమ రాజకీయాధిపతిగా గుర్తించినప్పటికీ, వాస్త వానికి అధికారం ఇతరులచేతులలో నడిచింది. అపజయాల పరంపరలు నేపాలు పరిసరాలదాకా తరిమినాకూడా, ఇతడు లోబడటానికి అంగీకరించలేదు. "నా బొందిలో ఊపిరి ఉన్నంతవరకూ మీకూ నాకూ యుద్ధం తప్పదు. నేను యుద్ధంలో హతుడైనా, ఖైదీగా మీకు చిక్కినా, నన్ను మీరు ఉరిదీసినాకూడా, ఈ నా నిశ్చ యం తప్పదు. నేను నిర్వహించవలసిన కర్తవ్యమంతటిని, నేను ఖడ్గంతోనే నిర్వ హిస్తాను." అని శపథంగావించి, నిలుపుకొన్నాడు, నానాసాహేబు. ఆ తర్వాత ఈ శూరుడు, నేపాలు అరణ్యాలలో కలిసిపోయినాడు.

విప్లవం విఫలమయింది. విప్లవచర్యకు ప్రతిక్రియగా బ్రిటీషువారు నాయ కుల ప్రాణాలను హరించినారు. వారి స్వాతంత్ర్యాన్ని, ఆస్తులనూ, స్వవశంచేసి కొన్నారు. పక్షపాత భావానికీ వక్రగతికీ లోనైన చరిత్రకారులు,- విప్లవనాయ కులు ఘోరములైన అమానుషచర్యలను జరిపినారని, నిరాధారములైన అపవాదు లను వారిపై మోపినారు. విప్లవోద్యమ చరిత్రను కళంకిత మొనర్చే సంఘ సంహారాలను ఏ విప్లవనాయకులూ ప్రవర్తింపచేయలేదు. పరప్రభుత్వభారాన్ని తొలగించటం మాత్రమే వారి ఆశయమై ఉండినది. అప్పుడు జరిగిన హేయ కరములైన చర్యలన్నీ, మతావేశానికి,ప్రాణభీతికీలోనైన కొందరు సిపాయీలూ, కారాగారాల నుండి విడివడిన ఖైదీలూ, దేశంలోని ఇతర దుండగీడులూ,- ధనాశతోనూ, క్రోధావేశంతోనూ గావించినవే. అట్టి పరిస్థితులలో కూడా, దయార్ద్రహృదయంతో, ప్రశంసార్హంగా ప్రవర్తించిన భారతీయు లెందరో కలరు.

బ్రిటీషు సేనపై నాయకత్వం వహించిన అధికార్లు జరిపిన, అమానుషము లైన ఘాతుక చర్యలను గూర్చి పేర్కొనడం బాధకలిగిస్తుంది. విశ్వసించడానికి కూడా సాధ్యముకానట్టి లాఘవంతో, అవివేకంతో, విచారణలు కూడా జరుపక, సామూహిక హత్యాకాండను వారు నిస్సంకోచంగా జరిపినారు. సామాన్యము లైన మానవత్వాన్ని కూడా గమనించక, తమహస్తగతులైన విప్లవ వీరులను అవమానకరములైన, నీచములైన, హేయములైన దండనలకు గురిచేసినారు. గ్రామాలు గ్రామాలు, నిశ్శేష మొనర్పబడినవి. బ్రిటీషు అధికారులూ, వారి ఆజ్ఞలను నిర్వహించే వ్యక్తులూ, విద్యావిహీనులైన క్రమశిక్షణలేని సామాన్య తుచ్ఛజనం కాదు కదా! తమ మతాధిక్యమునూ, తమ సర్వోత్కృష్ట నాగరి కతనూ ప్రశంసించుకొనుచున్న బ్రిటీషు ప్రభుత్వం వారు గావించిన పాషండ

చర్యలివి. ఈ విషాదఘట్టం, వారినైతిక దారిద్ర్యాన్ని, మానవ స్వభావ శూన్యతనూ, సుస్పష్టము గావించింది.

విప్లవము విఫలంకావడం ఎప్పుడో నిశ్చితమైపోయింది. కేవలం ప్రతిషేధాలే అందుకు ప్రేరకములైనవి. స్పష్టమైన, నిర్మాణాత్మక భావంవల్ల, ఏర్పడినదికాదు విప్లవోద్యమము. ఉత్తమమైన సాంఘిక వ్యవస్థను ఏర్పరచడం కానీ, ప్రజాహితకరమూ, సుస్థిరమూ, ఐన, రాజకీయ విధానాన్ని సృష్టించడం కానీ, విప్లవాశయాలుకావు. కేవలం తాత్కాలికమైన భావోద్వేగంతో బయలు వెడలిన ప్రయత్నమేకాని, ప్రజాభిప్రాయాలలో కలిగిన శాశ్వతమైన పరిణామంవల్ల ఉత్పన్నమైనదికాదు. ఒక్కసారిగా ఉప్పతిల్లిన, ప్రాసంగిక సంఘటనము కావడం వల్ల సువ్యవస్థితమూ, సుస్థిరమూ, ఐన మూలాధారము ఉద్యమానికి లేకపోయింది. సుబద్ధమైన ప్రణాళిక, కార్యక్రమము, ధనము, ఉద్యమానికి ఆధారములుగాలేవు. పరప్రభుత్వాన్ని, త్రోసివేయడం అనే కోరిక ఒక్కటే విప్లవకారులకు ఐక్యము గూర్చిన విషయము. కాని, విప్లవకారుల భావాలూ, యోచనలూ, పూర్తిగా మధ్యయుగపు పరిస్థితుల ప్రభావమునకు లోనైనవి. కనుక, ఉద్యమమంతా వ్యక్తిగతమైన భావావేశంతోనే నడిచింది.

ఇండియాలోనున్న పాశ్చాత్యసైనికులనూ అధికార్లనూ, నశింపజేయడంతో పరప్రభుత్వం నశిస్తుందని వీరు అభిప్రాయపడినారు. ఆ విధంగానే పాశ్చాత్యులు తీసివేసిన పదవులూ, అధికారాలూ తమ పూర్వపుప్రభువులకు మరల లభించడమే, స్వాతంత్ర్యమని వీరు తలచినారు. తమకు శత్రువులైన బ్రిటీషు వారేర్పరచిన రాజకీయవ్యవస్థయొక్క స్వరూపస్వభావాలు వీరికర్థంకాలేదు. కొంతమంది వ్యక్తులను నశింపజేయడంతో ప్రభుత్వవిధానమంతా ఒక్కసారిగా శిథిలమై పడిపోతుందన్న వీరి అభిప్రాయము, అజ్ఞానమూలకమైనది. హిందూ ముస్లిమువర్గాల పరస్పర సహకారము అవసరమనే విషయము వీరికి అస్పష్టంగా మాత్రమే గోచరమయింది. కాని, అన్యోన్యమైన భావైక్యముతో సుసంఘటితమైనప్పుడే ప్రజలు ఒక్కజాతిగా ఏర్పడుదురనే సత్యం, వీరు గుర్తింపలేదు. స్వతంత్రములైన వివిధవర్గాలవారి తాత్కాలిక సఖ్యసహకారాలు మాత్రమే చాలవు. దేశమందలి అన్నివర్గాలూ మిళితమై జాతియొక్క వివిధాంగాలుగా, సుసంఘటితమై, ఉత్తమ రాజకీయవ్యవస్థగా రూపొందితేనే తప్ప, ఆధునాతనమైన ప్రబల ప్రభుత్వాన్ని, ఎదుర్కొవడం సాధ్యంకాదనే విషయము విప్లవకారులకు తెలియదు.

పోరాటం సాగించడంలో వారికిగల ఆశయము న్యాయమైనదే; గొప్పదే. కాని, దానికి పూనుకొన్న సమాజ శీలస్వభావవైలక్షణ్యము, అందుకు చాలినది కాదు. విప్లవకారులకు క్రమశిక్షణ తక్కువ. వారి భక్తివిశ్వాసాలుకూడా దృఢమైనవి కావు. బుద్ధిశక్తిలోనూ, విజ్ఞానవిషయంలోనూ వీరు శత్రువుతో సమానమైనవారు కారు. శత్రువుల యుద్ధవిధానము, విజ్ఞానశాస్త్రంపై ఆధారపడి, అభివృద్ధి చెందినట్టిది. వారి యోచనలూ, పన్నాగాలూ, కార్యక్రమాలూ, సునిశిత

మైన తార్కిక విమర్శనూ, కార్యకారణసంబద్ధమైన హేతుసూత్రాలనూ, అనుస రించినట్టివి. యుద్ధనిర్వహణ చాతుర్యములోనూ, వ్యూహరచనలోనూ, బ్రిటీషు సైన్యము దేశీయసైన్యముకంటె, ఎంతో శ్రేష్ఠమైనది. బ్రిటీషు సేనాధిపతులు సమగ్రమైన శిక్షణ పొందినవారు; అనేకరకములైన యుద్ధాల స్వానుభవము, ఎక్కువగా కలవారు. ఇంతటి సువ్యవస్థితమైన సైన్యశాఖను, వెనుకనుండి నడుపు చున్నది, సుస్థిరమూ, సుసంబద్ధమూ ఐన ఇండియా ప్రభుత్వము. ఈప్రభుత్వానికి, కావలసినంత ధనసంచయాన్నీ, సైనికసిబ్బందినీ ఎప్పటికప్పుడు సరఫరా చేయ డానికి, ఇగ్లాండు ప్రజలూ, ప్రభుత్వమూ, వెనుక సిద్ధంగా ఉన్నారు. కావున, కంపెనీవారి పరిపాలనలోని కేంద్రశాఖలు పనిచేయుచున్నంత కాలము, రాజ్యం యొక్క అంచులలోని కొన్నిభాగాలు పోయినా, ప్రభుత్వ జీవితము దెబ్బతినదు. దేశాంతరంనుంచీ, ధనమూ సైన్యమూ సహాయకంగా లభించుచున్నంత వరకూ, ఇండియాలోని బ్రిటీషుప్రభుత్వ దుర్గము, సుస్థిరముగా నిలిచి యుండగలదు. చుట్టూ రేగుతున్న తాత్కాలికములైన తుఫానులు ఈదుర్గాన్ని చలింపచేయలేవు. జీర్ణావస్థలోనున్న పాతవ్యవస్థ, తనపూర్వపు వైభవాన్ని మరల సంపాదించడానికై గావించిన చరమప్రయత్నమే 1857 వ నాటి విప్లవము. ఆవిప్లవము చల్లారిపోవ డంతో, నూతనశక్తుల ప్రవృత్తికీ, నూతనసమాజం ఉద్భవించడానికీ, తగిన పరి స్థితి ఏర్పడింది.

# 3

# ఇండియా మధ్యతరగతుల వారు

## I. సాంఘిక స్వరూపంలో జరిగిన పరివర్తనము

ఇండియాకు మొదటవచ్చిన పాశ్చాత్యవర్తకులు, నూతన నాగరికతకు ప్రతినిధులైనవారు. వారు పూనుకొన్న ఆర్థికోద్యమంయొక్క ఆశయాలూ, పద్ధతులూ,- వారి వ్యాపార ప్రయత్నాలూ, వారవలంబించిన విధానాలూ,- భారతీయుల వ్యాపారవిధానాలకు భిన్నమైనవీ, అపరిచితములైనవీను. భిన్నమైన సాంఘిక రాజకీయ వ్యవస్థలతో కూడియున్న యూరోపు దేశాలనుండి వచ్చిన వారు ఈ వర్తకులు. నీతి నియమాలూ, ఆచార వ్యవహారాలూ, మత సంస్కారాలూ, మనోభావాలూ, అభిప్రాయాలూ,- ఈ అన్ని విషయాల్లోనూ వారికీ భారతీయులకూ, అంతరమెక్కువ. పాశ్చాత్యవర్తకులూ, మత ప్రచారకులూ, భారతదేశాన్ని ప్రవేశించడమూ, వారిలో ప్రజలకు సంపర్కం ఏర్పడటమూ కారణాలుగా, దేశ సాంఘిక జీవితంలో ఒక పరివర్తనమారంభమయింది. విదేశీయులతో వ్యాపారమూ, పరిచయమూ, ఎక్కువైనకొద్దీ, పరివర్తనంకూడా, వేగాన్నీ విస్తృతినీ, పొందుతూవచ్చింది. 18వ శతాబ్దంలో బ్రిటీషువారు బెంగాలును జయించి స్థిరపడడంతో, ఈ పరివర్తనలో నూతనదశ ఆరంభమయింది. పాశ్చాత్య నాగరకతాప్రభావం దేశంలోని రాజకీయాల్లోనూ సంఘ జీవితంలోనూ, ఆర్థిక వ్యవస్థలోనూ, సంస్కారవిషయంలోనూకూడా, దృఢంగానూ, విస్తరంగానూ వ్యాపించింది.

ప్లాసీ యుద్ధానికి పూర్వమే, ఈ మార్పు ఆరంభమయింది, కాని, ప్రథమంలో అది స్వల్పంగానూ, నెమ్మదిగానూ జరిగింది. 1757 నుండి 1833 వరకూగల కాలంలో, పరివర్తనం సుస్పష్టమయింది; వేగంగానూ జరిగింది. కొత్త సమాజానికి రూపురేఖ లేర్పడినాయి. కొత్తభావాలూ, భాషలూ కూడా ప్రజల మనస్సులలో, కుములుతూ ఉండినవి. ఇండియాలోని వివిధ ప్రాంతాలు, ఈ కాలంలో-ఒకదానికొకటి దగ్గర ఐనవి. వివిధ సాంఘిక వర్గాల వారి ప్రాచీనప్రాధిపత్యము, శిథిలమౌతూ వచ్చింది. వర్ణవిభాగం సడలజొచ్చింది. సంప్రదాయ బద్ధమైయుండిన గ్రామీణ ఆర్థిక స్వయం సమర్థతా, ప్రత్యేకతా అనేవి తొలగినవి.

పరివర్తన ప్రభావానికి ప్రథమంగా గురియైన ప్రాంతం బెంగాలు. తర్వాత, దేశంలోని ఇతర ప్రాంతాలుకూడా, బ్రిటీషు పరిపాలనలోనికి రావ

డంతో, ఈ విధమైన పరివర్తనకు లోనౌతూ వచ్చినాయి. కడపటికి, దేశమంతా పూర్తిగా, ఒక రాజకీయ వ్యవస్థలో ఏకమైపోయింది. జాతీయభావము, దేశంలో అభివృద్ధిపొందడానికి అవసరమైన పరిస్థితినీ, రాజకీయమైన ఐక్యతనూ కలిగించింది. బ్రిటీషుపరిపాలన కారణంగా కలిగిన సాంఘిక పరివర్తనము, జాతీయభావాభివృద్ధికి మరొక సాధనము. పూర్వమేర్పడియుండిన సాంఘిక వర్గాల నుంచి ఇప్పుడు కొత్తవర్గాలు ఏర్పడజొచ్చినవి. సంపద, విద్య, ఉద్యోగము, వృత్తి,–ఇత్యాది విషయాల్లో భేదమున్నా అందరికీ సమానములైన కొన్ని లక్షణాలు వీరినొక నూతనవర్గంగా ఏర్పరచినవి. ఈ వర్గంవారు నూతనములైన ఆశయాలనూ, ఉత్కాంక్షలనూ, వ్యక్తులపట్ల నూతన భావాలనూ, సాంఘిక రాజకీయ ప్రవృత్తులనూ, అలవరచుకొన్నారు. ఈ వర్గమే 'మధ్య తరగతి' అని వ్యవహరించబడుతూ వచ్చింది. పుట్టుకలోనూ, రచనావిధానంలోనూ, తాత్త్వికదృష్టిలోనూ, ఈ మధ్యతరగతివర్గం (Bourgeoisie.), – విలక్షణమైనది మధ్యయుగంనాటి, భారతీయ మధ్యతరగతివర్గానికి కూడ, ఇది భిన్నమైనది.

ఒక్క విషయంలో మాత్రం, ఈ భారతదేశపు మధ్యతరగతికీ, పాశ్చాత్య దేశపు మధ్యతరగతికి సాదృశ్యమున్నది. యూరోపు దేశాల్లోని మధ్య తరగతులవారు, స్వామిభృత్యపరిపాలనను (Feudalism) అంతమొందించినారు. రాజుల నిరంకుశ ప్రభుత్వాన్ని, చర్చియొక్క ఆధిపత్యాన్నికూడా తొలగించుకొన్నారు. వ్యక్తి స్వాతంత్ర్యమూ ఆక్షేపరహితమైన పై పోటీవిధానమూ, మూలధన విధానమూ, – ఇత్యాదిసూత్రాలను పెంపొందించుకొన్నారు భారతదేశంలోని మధ్యతరగతులవారు, ఆర్థికరంగంలో ఇట్టి అభివృద్ధికర విధానాలను ఏర్పరచుకోలేకపోయినారు. కాని, రాజకీయరంగంలో మాత్రము వీరు అనుసరించిన విధానము, పాశ్చాత్యదేశాలలోని, మధ్య తరగతులవారి విధానంతో సరితూగుతుంది. జాతీయభావాన్ని ప్రజానీకంలో వ్యాపింపచేయడం, జాతీయ స్వతంత్రోద్యమాన్ని ఏర్పరచడం, తుదకు పరప్రభుత్వపాలననుంచి దేశాన్ని విముక్తిగావించడం, – అనే వాటికి సంబంధించిన కీర్తి వీరికే చెందుతుంది.

## II. మధ్య తరగతియొక్క పుట్టుక

భారతదేశంలో, మధ్యతరగతివర్గం, రెండు మార్గాలననుసరించి జరిగింది. పూర్వపుపాలక వర్గాన్ని నశింపజేయడం ఒకటి. క్రొత్తరకపు భూస్వాములూ, వర్తకులూ, విద్యావంతులూ, అభివృద్ధిలోనికి రావడం రెండవది. పూర్వపరిపాలక వర్గం నశించడానికి కారణము, బ్రిటీషువారి ఆక్రమణ. నూతనవాణిజ్యవర్గం ఏర్పడటం, పాశ్చాత్యవర్తక విధాన ఫలితంగా జరిగింది. బ్రిటీషు పరిపాలనావిధానం వల్లనూ, పాశ్చాత్య విద్యావిధానంవల్లనూ, కొత్తరకపు భూస్వాములూ, విద్యావంతులూ ఏర్పడినారు.

పాశ్చాత్యులు భారతదేశంలో ఆరంభించిన, వివిధోద్యమాల కారణంగా ఏర్పడింది, మధ్యతరగతివర్గము. కావున, నూతనంగా స్థాపితములైన మద్రాసు,

బొంబాయి, కలకత్తా నగరాలలో, ఈ మధ్యతరగతి ఏర్పడటం సముచితంగానే ఉంది. అట్లే, బ్రిటీషువారి వర్తకవ్యవహారములకూ, పరిపాలనకూ, అనుకూలంగా తర్వాత ఏర్పడిన పట్టణాలలోకూడా, ఈ మధ్యతరగతి వృద్ధిచెందింది. రాజధానీ నగరాలు అన్ని విధాలా నూతనమైనవి. వర్తకానికీ, పరిశ్రమలకూ మాత్రమే అవి కేంద్రాలుకావు. ఇంగ్లాండులోని నమూనాపై ఏర్పరచిన, పురపాలక వ్యవస్థలు ఈ నగరాలలో ఉండటంవల్ల, అందలి ప్రజల జీవితవ్యవహారాలకు తగిన సౌకర్యాలు సిద్ధమైనవి. సర్కారు వ్యవహారాల్లోనూ, ఆర్థిక వ్యవహారాల్లోనూ ఆ నగరాలు, పాశ్చాత్య పద్ధతులను అనుసరించినవి. అందలి నివాసుల మనోభావాలు, అభిప్రాయాలు, వృత్తి, విద్యాభ్యాసము,–ఇవన్నీ ఆ నగరజీవిత ప్రభావానికి లోనైనాయి. ప్రవృత్తిలోనూ, నడవడికలోనూ, వారియందు ద్వైవిధ్యం, గోచరిస్తూవచ్చింది. ప్రాక్పశ్చిమ సంస్కృతులూ, భావాలూ, అభిప్రాయాలూ, రెండూ వారి జీవితంలో కలిసినాయి. ఇట్లు, పట్టణవాసులైన మధ్యతరగతివారు, విశ్వాసాల విషయంలోనూ, ప్రవర్తన విషయంలోనూ, గ్రామజనుల జీవిత విధానాలకు వేరుపడిపోయిరి.

ఈస్టిండియా కంపెనీవారి పోషణశ్రద్ధలలో అభివృద్ధికి వచ్చిన నగరాలన్నిటిలోనూ, కలకత్తాకు ఏర్పడిన ప్రాధాన్యం విశేషమైనది. వ్యాపారస్థులకూ, బ్యాంకర్లకూ, సాంకేతిక శాస్త్రజ్ఞులకూ, కలకత్తా నివాసస్థానమయింది. పరిశ్రమలకు, అంతర్దేశీయ వ్యాపార, విదేశీయ వ్యాపారాలకు కేంద్రంగానూ, ఏర్పడింది కలకత్తా.యూరోపియుల భావాలు, పద్ధతులు, ఆచారాలు, సంస్థలు,–మున్నగువాటిని గురించిన పరిజ్ఞానము, కలకత్తానుంచి, బెంగాలులోని ప్రజలకు వ్యాప్తమయింది. రాజకీయ విభేదాలవల్లనూ, రాజ్యవారసత్వ సంబంధములైన యుద్ధాలవల్లనూ, మహారాష్ట్ర దండయాత్రలవల్లనూ, కల్లోలాలేర్పడిన పరిస్థితులలో, చుట్టుపట్లప్రాంతాలవారికి కలకత్తా ఆశ్రయస్థానమయింది. బ్రిటీషువారి నివాస స్థావరాలు, బీదవారికి అనేకులకు జీవనాన్ని కల్పించినవి. కలకత్తాలోని ప్రముఖ జాతీయులుకొందరు, తమ దేశీయులనేకులను ప్రోత్సహించి, కలకత్తాలో నివాసమేర్పరచుకొనేటట్లు చేసినారు. లక్ష్మీకాంత్ మజుందారూ, తర్వాత మహారాజా నబకృష్ణదేవూ, బ్రాహ్మణులనేకులను ఆహ్వానించి కలకత్తాలో నిలిపిరి. సటగోన్, హాలీసహార్, బటోర్ నుండీ వర్తకులువచ్చి ఇందు నిలిచిపోయిరి. ఏజెంట్లూ, దలాలీదార్లూ (Brokers), మధ్యవర్తులూ, శిల్పులూ, కార్మికులూ, సాంకేతిక శాస్త్రజ్ఞులూ, కూలివాండ్రూ,–ఇత్యాదు లసంఖ్యాకులు ఉద్యోగములకొరకూ, లాభ సంపాదనకూ, కలకత్తావచ్చి చేరినారు. వర్తకులలో, బటోర్ నుంచి వచ్చిన సేట్లూ, బైశాఖులూ, ముందుగావచ్చిన వారు. 'సూతానూటీ'లో వారొక గుడ్డల బజారును స్థాపించినారు.

తత్ఫలితంగా కలకత్తా, వేగంగా అభివృద్ధికి వచ్చింది. 'పన్ను వసూలు గుత్తను' కంపెనీవారు తీసుకొన్నప్పుడు, కలకత్తా జనాభా పదివేలకు లోపుగనే ఉండింది. 1756 నాటికి జనాభా, లక్షాపాతిక వేలకు పెరిగింది. ప్రథమంలో

పక్కా ఇండ్లు లేవు. 1756 నాటికి, వివిధ వీధులలోనూ, సందుల్లోనూ సుమారు ఐదువందల ఇండ్లు ఏర్పడినవి. జమీనుపై బాడుగ, సంవత్సరానికి మూడువందల నుంచి, 16,000కు పెరిగింది. మొత్తం ఆదాయము ఐదువందలనుంచి, యాభై వేలకు వృద్ధి అయింది.

*యూరోపియను వ్యాపారమూ మధ్యతరగతి అభివృద్ధి :* బెంగాలులోని మధ్య తరగతివారి అభివృద్ధికీ, ఇంగ్లీషువారి వ్యాపార రాజకీయ కార్యకలాపాలకూ, సన్నిహితమైన సంబంధమున్నది. వారు నిర్వహించవలసిన కార్యభారాన్ని అనుసరించి, మధ్యతరగతివారి శీల స్వభావాలు ఏర్పడినవి. కంపెనీవారి వ్యాపార విధానాలలోనూ, ఉద్దేశాలలోనూ, కలిగిన మార్పులనుబట్టి దానికి అనుగుణంగా మధ్య తరగతివారి అభివృద్ధీ, జీవితవ్యవస్థా ఆధారపడినవి. ఈ వర్గం పొందిన పరిణామాన్ని అర్థంచేసుకోవడానికి, కంపెనీవారి చరిత్రనూ, దాని అభివృద్ధి దశలనూ, సంగ్రహంగా వివరించడం అవసరము.

కంపెనీ కార్యకలాపంలో ప్రథమదశ, కేవలం వ్యాపారానికి సంబంధించినది. 1757లో జరిగిన ప్లాసీయుద్ధంతో ఆ దశ అంతరించింది. బెంగాలు స్వాధీనంతో, వ్యాపారసంస్థ, పరిపాలన సంస్థగా త్వరలో మారిపోయింది. ఈ పరివర్తనకు, ప్లాసీ యుద్ధకాలంనుంచీ, 1785లో హేస్టింగ్సును తీసివేయునంతవరకూ గల ముప్ఫై సంవత్సరాల కాలం పట్టింది. మూడవదశలో, బ్రిటీషు పరిపాలన, భారతదేశంలో సుస్థిరమైన వ్యవస్థగా ఏర్పడింది. అంతతో, (1833) కంపెనీవారి వ్యాపార కార్యకలాపము, ఆపివేయబడింది. కంపెనీయొక్క చరమదశ, 1858లో, విప్లవానంతరము అంతమయింది.

కంపెనీవారు వర్తకం అభివృద్ధి చేసుకొంటూ ఉండిన మొదటిరోజుల్లో, దేశీయుల సహాయాన్ని, సహకారాన్ని, ఉపయోగించుకోవలసిన అవసరం, వారికేర్పడింది. వ్యాపారము విస్తృతి అవుతూ రాగా, ఇంకనూ ఎక్కువగా, భారతీయులను తమ వ్యాపార వ్యవహారాల్లోనికి తీసుకోవలసివచ్చింది. కంట్రాక్టర్లు, దాద్నివర్తకులు, ఏజంట్లూ, లేదా, బనియాలూ, షరాఫులూ (Money changers), సహాయులూ, సేవకులూ,-ఇత్యాది వివిధములైన ఉద్యోగాలలో వారు ప్రవేశించినారు. ఈ ప్రథమదశలో, ఆంగ్లవర్తకులకు భారతీయులతోటి సాంగత్య సంపర్కాలు ఆవశ్యకములైనవి. కంపెనీవారు,-దేశీయములైన సరకులను జమచేయడంలో, దలాలీ పద్ధతిని అవలంబించినారు. [ఒక నిర్ణీతమైన కాలంలో, నిర్ణీతమైన సరకును, నిర్ణీతమైన ధరకు ఒదిగించడం – ఈ పద్ధతి (Putting out system)]. కనుక, మధ్యవర్తులైన దలాలీ వర్తకులు అవసరమైనారు.

ఈ పద్ధతి భారతదేశానికి కొత్తదికాదు. కాని, దేశీయ పరిస్థితులకు అనుగుణంగా, కంపెనీ, విధానాన్ని కొంత మార్చవలసివచ్చింది.

కంపెనీవారు, మధ్యవర్తులైన దాద్నివర్తకుల ద్వారా, సరకులు తయారు

చేసే కార్మికులను కలుసుకోవలసివచ్చింది. ఇంగ్లీషు వర్తకులు విదేశీయులు కావడంవల్లను, వారికి భారతదేశంలోని కార్మిక పరిస్థితులూ, ప్రజల భాషా, తెలియనందువల్లను ఈ మధ్యవర్తుల నేర్పరచుకోవడం, తప్పనిసరి అయింది. అమ్మకం అప్పగించవలసిన సరకు విలువలో, 10 నుండి 70 శాతందాకా డబ్బును, కంపెనీ వారివద్దనుంచి, దాద్నీవర్తకుడు ముందుగనే (advance) పుచ్చుకొనేవాడు. ఇతర విక్రయదారుని పట్లకూడా, ఇదే పద్ధతి అవలంబించేవాడు. [కంపెనీ ఉద్యోగులలోకూడా, కొందరు, ఈ విధమైన వ్యాపారాన్ని సాగించి, తమ ఆదాయాన్ని పెంచుకొనే వాడుక ఉండేది.] దలాలీ వర్తకుడు, ఆపై నేతగాండ్రకూ, ఇతర వస్తువులను ఉత్పాదించే కార్మికులకూ, సంచాకారములిచ్చి (earnest money), సరకులను సకాలంలో అప్పగించే కంట్రాక్టు పత్రాలు వ్రాయించుకొనేవాడు. తయారైన సరకులు పొరంగులలో (Depots)., జమచేసి కొఠారాలలో (godowns), నిలువచేసేవారు. విక్రయదారులక్కడ సరకుల నాణ్యాన్నీ, మొత్తాన్నీ పరీక్షించి, నచ్చినచో కొనడమూ, నచ్చకపోతే త్రోసివేయడమూ జరిగేది. అంగీకరించబడిన సరకులను ఆపై, ఎగుమతికై కలకత్తాలోని గిడ్డంగులకు (Ware House) పంపించేవారు.

దాద్నీవర్తకులు దలాలులనూ, దలాలులు చిన్న ఏజెంట్లనూ కూడా ఏర్పరచుకొనేవారు. గ్రామాలకుపోయి, కార్మికుల నుంచి సరకులను జమకూర్చడమూ, సరకుల నాణ్యాన్ని పరిశీలించడమూ, ధరలు నిర్ణయించడమూ,- ఇత్యాది కార్యాలను చేసేవారు. దేశీయ వర్తకులకూ, వారి దలాలులకూ, లాభం సంపాదించుకొనే అవకాశాలీవిధంగా ఏర్పడినాయి. సరకుల మొత్తం విలువలపై, వారికి సక్రమంగానే 2 మొదలు 4 శాతంవరకూ, దళ్లాళి (Commission) లభించేది. కాని, దీనికి తోడుగా వారు, ఇరుపక్షాలనుంచీ కూడా ఎక్కువ రుసుం లాగేవారు. బీదతనంవల్లా, బేరమాడటం తెలియకా, కార్మికులు నిస్సహాయులై, ఈ దలాలీవర్తకుల చేతుల్లో, చిక్కుకొన్నారు. ఇంకొక ప్రక్క, బ్రిటీషు వర్తకులకు దేశీయ వ్యవహారాల పరిచయం లేనందువల్లనూ, ఇతరదేశవర్తకుల పోటీవల్లనూ, మధ్యవర్తులైన దాద్నీవర్తకులపై వీరు ఆధారపడవలసి వచ్చింది. నిర్దయులైన దాద్నీలు, కుయుక్తితో వ్యాపారాన్ని సాగించడంలోనూ, అత్యాశతో లాభాలను లాగడంలోనూ, యూరోపులోని, పూర్వపు సాహస వర్తకులకే మాత్రమూ తీసిపోలేదు.

ఈ విధంగా వీరు దేశంలో క్రమవృద్ధిచెందుతున్న మధ్య తరగతికి అస్థిపంజరంగా ఏర్పడినారు. కంపెనీ వారు, రాజకీయాధిపత్యాన్ని వహించక పూర్వపురోజుల్లోనే, ఈ వర్తకులకు వ్యాపారం గొప్పగా సాగుతూ ఉండింది. ఉదాహరణకు,-1751-52 లో 10,58,756 రూపాయల విలువగల సరకులకు ఒప్పందం జరిగి, 3,52,054 రూపాయల విలువగల సరకును, నగదుకు కొనడం జరిగింది. ఈ కొనడమూ, అమ్మకమూ కూడా దాద్నీవర్తకులద్వారానే, జరిగింది.

ఇండయాలోని ఈ మధ్యవర్తుల అధికలాభానికి అవకాశం ఇంకొక విధంగా

కూడా, ఏర్పడింది. అభివృద్ధి చెందుతూ ఉన్న విదేశీయ వ్యాపారం, ఆ మార్గాల్లో ఒకటి. సంవత్సరానికి 253,000 పౌనుల విలువగల సరకులు, 1667-74 లో విదేశముల నుంచి దిగుమతి కాగా, 1667-81 కాలం నాటికి, దిగుమతులు సాలుకు 447,710 పౌనుల వరకూ పెరిగినవి. 1708 తర్వాత ఈ దిగుమతుల దశాబ్దిక విలువ అధికమయింది. 1707-1717 దశాబ్దాన్ని ఆధారశాతంగా (Base = 100) తీసుకొనగా, దిగుమతుల మూల్యసూచీ, తర్వాతి దశాబ్దాల నాటికి 150. కి. మారింది. తరువాతి దశాబ్దాల్లో, క్రమంగా, 153, 185, 219- వరకూ పెరుగుతూ వచ్చింది.

అదేకాలంలోనే,-1707 నుంచి 1757-ఇండియా నుంచి జరిగిన ఎగుమతుల విలువ, రెట్టింపు అయింది. 1708 లో, 100 గా ఉండిన మూల్యసూచీ, 1757 నాటికి 193 కు పెరిగింది.

వ్యాపార మీ విధంగా, అభివృద్ధి అగుచుండటంవల్ల కంపెనీ వారికీ, ఇతర విదేశీయ వర్తకసంఘాలకూ, భారత వర్తకుల సేవాసహాయాల అవసరము అధికమయింది. ఆ కాలానికి స్థాపితములై యున్న వ్యాపార సంస్థలు ఈ అవ సరాన్ని తీర్చలేక పోయినవి. ఇదివరలో వర్తక వ్యాపార వ్యవహారాల్లో అను భవం కానీ, సంప్రదాయం కానీ లేనట్టికుటుంబాలు కూడా, అనేకములు, ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని, వ్యాపారరంగంలో ప్రవేశించినవి. కొత్తగా ప్రవేశించిన వీరు, నూతనమైన మధ్య తరగతిలో మొదట ప్రధాన స్థానాన్ని ఆక్రమించినారు.

మారకం వర్తకులూ, షరాఫులూ మున్నగు వారు మధ్య తరగతిలో రెండవ భాగం. దేశీయవర్తక విధానంలో వీరు అత్యవసరమైన భాగంగా ఏర్పడిరి. విదేశవర్తకులకూ, దేశీయ వర్తకులకూ కూడా, తమ వ్యాపార కార్యక్రమంలో, ప్రపంచంలోని వివిధదేశాల చెలామణీ (Currency) ద్రవ్యాన్ని ఉపయోగించ వలసిన అవసరం కలిగింది. దేశీయములైన సరకులను కొనడంలో వాటికి బదులుగా, విదేశవర్తకులు తమదేశపు నాణ్యాలనూ, (Species), లేదా బంగారునూ, ఇవ్వవలసి వచ్చింది. ఈ విధంగా, వెండిబంగారాలూ, పలువిధములైన విదేశనాణ్యాలూ, ఇండియా వర్తక వీధిలోనికి (Market) వచ్చినవి. ఈ వస్తువులనూ. నాణ్యా లనూ, ప్రామాణిక చెలామణీ ద్రవ్యంగా మార్చడానికి, ఒక ప్రత్యేక సంస్థ యొక్క ఆవశ్యకమేర్పడింది. ఇంతే కాక,-దేశంలో తొమ్మిది వందలకు తక్కువ కాని, భిన్న భిన్న నాణ్యాలు చెలామణిలో ఉండినవి, వీటన్నిటితోనూ వర్త కులు కలతచెందుతూ ఉండినారు. నాణెములను పరీక్షించడం, తూకం వేయడం, వన్నెచూడటం (Assaying),-మొదలైనవి సాంకేతిక విధానాలు. కనుక, ఈ కార్యాలు మారకం వర్తకుల వృత్తి ఐనది. ఈ విషయమెంత క్లిష్ట మైనదీ, ఆనాడు చెలామణిలో ఉండిన నాణ్యాల సూచికనుబట్టి వ్యక్తమౌతుంది.

బెంగాలు సిక్కా రూపాయలు, మదరాసు ఆర్కాటు రూపాయలు, బొంబాయి రూపాయలు,- అన్నివేర్వేరు తూకాలూ, వేర్వేరు విలువలూగలవి.

బెంగాలు బంగారు మొహారు, మదరాసు నక్షత్రమూ ముగ్గురు మూర్తుల పగోడాలు, వేర్వేరు సార్వభౌముల హయాములో అచ్చైన బంగారు వెండి నాణ్యాలు, సోనాత్ రూపాయలూ,-మొదలైనవి దేశీయములై నట్టివి. ఇక, డచ్ వారి రిక్స్‌డాలరు; స్పానిష్‌డాలరు, జర్మన్ క్రౌన్, డచ్ ఫ్లారిస్, ఫ్రెంచిలివర్, పోర్చుగీస్ మిల్‌రీస్,- మున్నగునవి, విదేశీయనాణ్యాలు. ఇట్టి పరిస్థితులు మారకం వ్యాపారానికీ, దానివల్ల సిద్ధించే లాభాలకూ, మంచి విస్తృతమైన అవకాశం ఏర్పడింది. బ్యాంకింగు విధానాన్నీ, వడ్డీ వ్యాపారాన్నీ కూడా దీనికి జతపరచి, వర్తకులు తమ లాభావకాశాలను ఇంకను వృద్ధిగావించుకొన్నారు. దేశంలోని వ్యాపారాభివృద్ధితో, ఈ వర్గంవారుకూడా ఇతరవర్తకుల వలెనే, ఎక్కువ లాభాన్ని పొందుతూ వచ్చిరి. వీరి అవసరంకూడా అభివృద్ధి పొందుతూ వచ్చింది; వీరిలో అనేకులు గొప్ప ధనవంతులైనారు. తరువాతి కాలంలో, యూరోపియను వర్తకకార్యాలయాలు ఏర్పడునంతదాకా, ఈ విధానం లాభకారిగా జరిగింది.

కొన్ని ప్రత్యేకములైన సరకులను దేశంలో అమ్మడానికి ఏకైక స్వామ్యాన్ని (Monopoly) కంపెనీ వారివల్ల పొందిన వర్తక వర్గంకూడా, మధ్యతరగతివారిలో ఒకశాఖ. మృదువైన జంతుచర్మాలు, కుంకుమ సిందూరాలూ, టపాకాయలూ, పొగాకు, గాంజా, పాత ఇనుము, గుగ్గిలము, నార,- మొదలైన వస్తువుల క్రయ విక్రయములనుచేసే వర్తకులు కూడా ఈ వర్గంలోని భాగమే. కొందరు, సారాయితయారుచేయడానికి ఆజ్ఞాపత్రాలు సంపాదించినారు. తారులో (కీలు) తడిపిన పీచుతో పడవల రంధ్రాలను మూయడమూ, ఇనుప పెట్టెలను బాగుచేయడమూ,-ఇట్టిపనులను కూడా చేసేవారు.

సాంకేతిక నిపుణులు కూడా వీరిలో ఒక వర్గం. ఉత్పత్తిని అధికంచేయడానికై కంపెనీవారు ప్రవేశపెట్టిన నూతన విధానాలలో పాల్గొన్న భారతీయుల వర్గం ఒకటి ఏర్పడింది. ముడిపట్టు (Raw silk) యొక్క రంగును నాణ్యము చేయడానికై, కంపెనీ వారు, అద్దకపుపనివాండ్రను తెచ్చినారు. వారితో, పడుగు తయారు చేసేవారూ, నేతగాండ్రూ కూడా వచ్చిరి.

తరువాతి కాలంలో, ప్రత్తి, నీలిమందు, చక్కెర పరిశ్రమలను అభివృద్ధి పరిచే విధానాలు ప్రవేశించినవి. వాటి ముడిపదార్థాలను ఉత్పత్తి చేయడంలోనూ, సరకులను తయారుచేసే విధానాల్లోనూ నూతన పద్ధతులను ప్రవేశపెట్టిరి. పడవలను మరమ్మతు చేయడమూ, హుగ్లీనదిని సర్వేచేసి పటములను (Maps or charts) రచించడమూ, మరి ఇతరములైన కార్యక్రమాలూ, అరంభించిరి. అందుతో, నూతన విషయాలను నేర్చుకోవడానికీ, సాంకేతిక విజ్ఞానాన్ని ప్రయోగించడానికీ అవకాశాలేర్పడినవి. ఇంజినీరింగువంటి సాంకేతిక ఉద్యోగాలలోనూ, ఓవర్‌సీర్లు, సూపర్ వైజర్లు, మానేజర్లు, ఇన్‌స్పెక్టర్లు, డెప్యూటీలు, అసిస్టెంటులు,-ఇత్యాది ఉద్యోగాలలోనూ, కొందరు దేశీయులు ప్రవేశించినారు. చాలమంది దేశీయులు దుబాసీలు (Interpreters) గా కూడా చేరిరి. (ద్విభాషీ

దుబాసీ). దేశీయులు పలువురు, యూరోపియను అధికారులకూ, వారి కుటుంబాలకూ, దలాలీలుగానూ, బనియాలగానూ, మధ్యవర్తులై పనిచేయడానికి పూనుకొన్నారు.

పన్నులు వసూలుచేయడం, భూములను గుత్తకివ్వడం, శిస్తులను ఏర్పరచడం, - మొదలైన వివిధపరిపాలన విధులను నెరవేర్చేవారుకూడా, మధ్యతరగతి వర్గంలో ఒకభాగం. 1757 వ. సంవత్సరం మొత్తం ఆదాయం కలకత్తాలో, లక్షరూపాయలకు మించింది.ఇండియా ప్రభుత్వంలోని అధికారాలతో, కంపెనీవారి వ్యవహారాలను నడిపే వకీళ్ళు, కంపెనీతో సన్నిహిత సాహచర్యం గలవారు. వీరుకాక, ఇంకనూ దివానులూ, జమీందారీ న్యాయస్థానాలలోని సలహాదార్లూ, నల్లజమీందార్లని వ్యవహరింపబడుతూవచ్చిన ఇంగ్లీషు కలెక్టర్ల దేశీయులైన అసిస్టెంట్లూ, కూడా, వీరిలో ఉండిరి. విదేశవర్తక సంఘాల్లో ప్రముఖస్థానాన్ని ఏర్పరచుకొన్న ఈస్ట్ఇండియా కంపెనీలోనూ, ఇతర విదేశవర్తక సంస్థలలోనూ, వివిధములైన వ్యవహారాలనూ, కార్యక్రమాలనూ నడుపుతూ వచ్చిన ఈ మధ్యతరగతి వర్గాలవారు, పద్దెనిమిదో శతాబ్దం ప్రథమార్ధకాలానికి, ప్రాముఖ్యం, వహించినారు. మధ్య తరగతిగా ఏర్పడుచుండిన, ఈ భిన్నవర్గాల సంఖ్యను సరిగా అంచనావేయడము దుష్కరమైన ప్రయత్నము. కాని, వర్తకులూ, వ్యాపారస్థులూ, ఏజెంట్లూ ఇత్యాది వర్గాలవారు ఎక్కువ సంఖ్యాకులని మాత్రం, నిశ్చయించవచ్చును. వ్యాపారముయొక్క విషయ సంగ్రహణం ఆధారంగా, ఈ వర్గంయొక్క అభివృద్ధిని స్థూలంగా నిశ్చయించవచ్చు. కంపెనీలోనూ, వారి పరంగానూ ప్రత్యక్షంగా పనిచేస్తూ ఉన్నవారి వాస్తవిక సంఖ్యను తెలియడం కష్టంకాని, ఈవర్గంయొక్క అభివృద్ధి మార్గాలను తెలుసుకోవచ్చు. సరకుల ఎగుమతి దిగుమతుల అభివృద్ధికినీ, వాటికి సంబంధించిన వ్యాపార, పరిపాలనా కార్యక్రమాల అభివృద్ధికినీ, అనుగుణమై, దేశీయోద్యోగుల సంఖ్యాభివృద్ధి కూడా జరుగుతూవచ్చిందని ఊహించవచ్చును. 1708 నుండి 1757 వరకూ, ఇంగ్లాండులో అమ్ముడుపోయిన భారతదేశపు సరకుల మొత్తాన్నీ, తూర్పుదేశాల సరకుల మొత్తాన్నీ, బట్టి, ఎగుమతులు రెండురెట్లు పెరిగినవని తెలుస్తుంది. ఉత్పాదక వస్తువులలో, నేతగుడ్డలు ప్రధానమైనవి టీ, కాఫీ బెంగాలు ముడిపట్టూ, సురేకారమూ (పెట్లుప్పు) మిరియాలూ, నీలిమందూ, చక్కెరా, జనుపనారా,-మొదలైనవి ఇతరములు. ఈ ఎగుమతులకు బదులుగా, ఇంగ్లాండు, రూకలనూ, ఇండియాలో అమ్ముడుకావలసిన సరకులనూ, పంపుతూ ఉండినది. వారీవిధంగా పంపిన విలువ, ఎగుమతి వస్తువులకు మూడోవంతుమాత్రమే. ఉదాహరణకు,- 1708-17 దశాబ్దకాలంలో, 966, 253 పౌనుల విలువగల సరకులూ, 3,360,122. పౌనుల విలువగలరూకలూ, ఇండియాలోనికి దిగుమతి ఐనవి. 1748-57 దశాబ్దానికిదిగుమతులు, 2,531,245 పౌనులు, 5,644,245 పౌనులూ ఐనవి. పద్దెనిమిదో శతాబ్దం మొదటిభాగంలో, ఇండియాకు దిగుమతిచేసిన సరకుల విలువ 160 శాతమూ, రూకలవిలువ 68 శాతమూ పెరిగింది.

ఈస్ట్ ఇండియాకంపెనీవారి వాణిజ్యానికి తోడుగా, ఇతర ఆంగ్లవర్త కులూ, వ్యాపారానికి ధనాశవల్ల సాహసంతో పూనుకొన్న ఆంగ్లేయులూ, అధికారంలేకనే, మధ్యవచ్చి చేరినవారూ కూడా, వ్యాపారం సాగిస్తున్నారు. మరిన్ని, పోర్చుగీస్, డచ్, ఫ్రెంచి, డేనులు,- ఇత్యాది దేశాలుకూడా, వ్యాపారం సాగిస్తున్నాయి. ఇక, ఆసియాలోని ఆఫ్ఘనులూ, మధ్యఆసియావారూ, ఇరేనియన్లూ, అరబ్బులూ, ఆర్మీనియన్లూ,— చేరి వ్యాపారాన్ని పెద్దది చేసినారు.

దేశంలోపలి వ్యాపారమూ, పరిశ్రమా, వృద్ధికావడానికి విదేశవ్యాపారం, ప్రోద్బలమయింది. తత్ఫలితంగా, సముద్రతీర వాణిజ్యం, అధికంగా ఉత్పన్నమయింది. రహదారులద్వారానూ, నదులమీదుగానూ, జరుగుచుండిన బెంగాలు భూమార్గవాణిజ్యం ఇంకనూ విస్తృతమయింది. ఈ విధంగా భిన్నవర్తక విధానాలనేకముచేరి, దేశంలోని వ్యాపారవర్గంవారి ప్రాబల్యాన్ని, అధికమొనర్చినవి.

వాణిజ్యాభివృద్ధి, దేశంలోని మధ్యతరగతివర్గ ప్రాబల్యానికి కారణం కావడం మాత్రమే కాదు. ఈ వర్గంలోనివారికి, విదేశీయసంస్థలతోనూ, వారి పద్ధతులతోనూ, సంసర్గసాహచర్యాలు ఏర్పడడంవల్ల, వారిలో నూతన మనోభావాలుదయించడానికి కూడా ఇది కారణమయింది. వాణిజ్యంలో, ఉమ్మడి వాటా విధానము భారతీయులకు క్రొత్తగా, అనుభవంలోనికి వచ్చింది. ఇందులోని వాటాదార్లు కేవలం లౌకిక అనుబంధాలతోమాత్రమే, ఒక సంఘంగా ఏర్పడినారు. అంతేకాని, వీరి కూటమికి, మతమూ కులమూ, కుటుంబసంబంధమూ, ఇత్యాదులతో ప్రసక్తేలేదు. పాశ్చాత్యవాణిజ్య విధానాలూ, లెక్కలపద్ధతీ, అభివృద్ధికరములైన ఉత్పత్తివిధానాలూ, వీరి నెక్కువగా ఆకర్షించినవి.

వాణిజ్యపరిశ్రమల్లోవలెనే, పరిపాలనారంగంలో కూడా, కలకత్తా, బ్రిటీషువారి ఉద్యమాలకు కేంద్రస్థానమయింది. పాశ్చాత్యదేశాలలోని, సంస్థాప్రవృత్తమైన వ్యవస్థ, కలకత్తాలో ఏర్పడింది. కలకత్తాలోని బ్రిటీషుస్థావర పరిపాలాన్ని, ఒక సంఘముయొక్క సలహాపై, అధ్యక్షుడు నడిపేవాడు. ఆ సంఘంలో, కమిటీలు, ఉపవర్గాలూ, మొదలైన కార్యనిర్వాహక అంగాలన్నీ ఉండినవి. 1726లో, కలకత్తా పురపాలకసంస్థ,- అధ్యక్షునితోను, (Mayor), తొమ్మిదిమంది ప్రధాన పౌరులతోను (Alderman)-స్థాపితమయింది. వివిధములైన పరిపాలనవ్యవహారాలను నడపడానికి, అధ్యక్షన్యాయస్థానం, ఏర్పడింది. ప్రత్యేకములైన కర్తవ్యాల నిర్వహణకై (బోర్డులు) అధికారసంస్థలను ఏర్పరచిరి. దేశవాసుల వ్యవహారములను విచారణ గావించడానికి జమీందారీ కచ్చేరీ, నెలకొల్పబడింది. జమీందారు (English collector) తనక్రిందనున్న, దేశీయోద్యోగుల సహాయంతో,- పరిపాలన వ్యవహారాలనూ, రాజవ్యవహారాలనూ, న్యాయపాలన వ్యవహారాలనూ, నడిపేవాడు.

ఈ అభివృద్ధి కార్యక్రమాల ప్రభావము బ్రిటీషువారి సాహచర్యంలోకి వచ్చిన దేశీయులపై ప్రసరించింది. వాణిజ్యరంగంలోనూ, పరిపాలనాసంస్థలలోనూ పనిచేయుచుండిన దేశీయులందరూ, దీని ఆకర్షణకు లోనైనారు. ఇట్టి నూతన

దేశీయవర్గము కలకత్తాలో మొదట ఏర్పడడం సహజమైనదే. వర్తకమూ, పరిపాలన వ్యవస్థా, దేశంలోని వివిధభాగాలకు వ్యాపించడంతో వాటి కార్యక్రమాలలో, నియుక్తులైన దేశీయులలోకూడా, అట్టి నూతనభావాలు ఉత్పన్నమైనవి. తత్పరిణామంగా, దేశంలో, నూతన సాంఘిక ఆర్థిక అభిప్రాయాలకు బద్ధమైన, ప్రత్యేకవర్గం ఏర్పడింది.

*కలకత్తా పెరుగుదల :* మధ్యతరగతులవారి అభివృద్ధిని, కలకత్తా పెరుగుదలే సూచిస్తుంది. సిరాజ్ ఉద్ దౌలా ఆక్రమించునాటికే (1756), లక్షాపాతిక వేల జనాభాతో కూడియున్న పట్టణం కలకత్తా. పూర్వం, పూరిగుడిసెలతో నిండియుండిన ప్రదేశం, అనేకముఖాలుగా వ్యాపించిన వీధులతోనూ, సందుగొందులతోనూ, చక్కగా ఇటుకలతో కట్టబడిన ఇండ్లతోనూ, అందంగా పెంచబడిన తోటలతోనూ, కూడిన పట్టణంగా ఏర్పడింది. వాటిలో అనేకములు ధనవంతులైన ఈ నూతనవర్గంవారివి.

## III. నూతన వర్గంలోని కులవైవిధ్యమూ, సాంఘికంగా వారి దృక్పథమూ

సామాజికవ్యవస్థ దృష్ట్యా, ఈ నూతనవర్గం వారిలో కలిగిన ముఖ్యమైన పరివర్తనం, కులమతముల విషయమైనట్టిది. ప్రాచీనవర్గంవారి దృక్పథంకంటే, వీరిది భిన్నమూ, విలక్షణమూ, ఐనది. కేవలం సామాజిక వ్యవస్థకుచెందిన కులధర్మాలనూ, ఆర్థికపరిస్థితులకు సంబంధించిన వ్యవహారాలనూ వేరుపరచి, ప్రవర్తించడం,- వీరు తెచ్చిన ముఖ్యమైనమార్పు.

నూతనమైన ఈ మధ్యతరగతి, కేవలం వైశ్యకులంవారితోనూ, పూర్వపు వర్గంతోనూ మాత్రమే ఏర్పడినదికాదు. అన్నివిధములైన కులాలవారూ, వర్తక సంస్థలలోనూ, పరిపాలనోద్యోగాలలోనూ, చేరుతూవచ్చినారు. ఉన్నత కులాలవారైన బ్రాహ్మణులూ, కాయస్థులూ, 'వైద్యులూ', తక్కువ కులాలలోని సువర్ణవణికులూ, సద్గోపులూ, చాకలివారూ,- కూడా, అన్నివిధములైన వృత్తులలోనూ, ప్రవేశించినారు. కులతత్త్వాల ప్రాబల్యానికి లోనైన సమాజవ్యవస్థలో ఒక సంచలనం బయలుదేరింది. సహపంక్తి భోజనమూ, కులాంతరవివాహాలూ, చాలకాలంవరకూ జరగకపోయినా,- ఇతర విషయాలపట్ల, పట్టణప్రదేశాల్లో కుల భేదాలు సమసిపోయినవి.

జీవన సౌకర్యాలను ఏర్పరచడంలోనూ, జీవనవిధానాలలోనూ, గమనింప తగినమార్పులు కలిగినవి. పెద్దనగరాల్లో, బ్రిటీషువారికత్యంత సాహచర్యంలో నివసిస్తున్న భారతీయులు, యూరోపియనులవంటి ఇండ్లలోనూ, వారి నమూనాపై ఏర్పడిన తోటలమధ్య గృహాలలోనూ, నివసించడం, అభిలషించినారు. గృహనిర్మాణంలోనూ, ఆసనశయ్యాదుల కూర్పులోనూ, గృహపరికరాల విషయంలోనూ, యూరోపియనుల అభిరుచులూ, పద్ధతులూ అవలంబింపబడుతూ వచ్చినవి. కత్తి చాకు సామగ్రి (Cutlery), పిస్తోలులు, కళ్ళజోళ్ళు, బల్లలూ-

కుర్చీలు, టేబల్లులు, పింగాణీసామగ్రి,- మొదలైనవన్నీ భారతీయుల గృహా లలో ప్రవేశించి, నూతనాభిరుచులను వ్యక్తపరుస్తున్నవి.

క్రొత్తగా సంపన్నుడైన భారతీయుడు (Nouveanriche) తాను సేవిస్తూ సహాకరిస్తూఉన్న, పాశ్చాత్యులను అనుకరించడానికి ఆరంభించినాడు. ఇంతతో, ప్రాచీనవర్తకుల ప్రవర్తన, అలవాట్లూ మాయమైనవి. భయభక్తులతోనూ, వినయ విధేయతలతోనూ, రాజులకూ, రాజాధికారులకూ భయపడుతూ, తత్కారణంగా తన డబ్బును వెలికి కనబడనీయకుండా భద్రపరచుకొంటూ, ప్రవర్తించినాడు,మధ్య యుగాల్లోని వర్తకుడు. ఇప్పుడు నూతనంగా సృష్టిలోనికివచ్చిన వర్తకుడు, తన సంపదనూ, ధనాన్నీ, ఆడంబరంతో ప్రదర్శించడం ఆరంభించినాడు. పల్లకీలలో తిరగడము, కోచిబండ్లనూ, గుర్రపుబండ్లనూ పోషించడము, పలువురు పనివాం డ్లచే, సేవచేయించుకోవడము,- మొదలైనవన్నీ ఆరంభించినాడు. పలువురు ధన వంతులకు,- అందునూ ముఖ్యంగా యూరోపియనులకు- తన భవనంలో విందు లిస్తూ, వారియెదుట తన ప్రాముఖ్యాన్ని ప్రదర్శించేవాడు. వ్యాపారవిషయంలో అతనికెట్టి నియమాలూ, శంకలూలేవు. ఏ విధంగానైనా డబ్బు సంపాదించడమే అతని లక్ష్యము. వ్యాపారాన్నీ, వృత్తినీ, ఎన్నుకోవడంలో కూడా అతడేవిధ మైన సంప్రదాయాన్నీ పాటించలేదు. శీఘ్రకాలంలో అధికలాభాన్ని తెచ్చే ఏ వ్యాపారంలోనైనా చురుకుగా ప్రవేశించినాడు.

క్రొత్త వాతావరణంలో ఈవిధంగా అభివృద్ధిచెంది, పెరిగిన ఈ వ్యక్తులు, తమ నూతనస్థానంపట్ల, అభిమానము వహించడం సహజమే. తమకు సౌఖ్య సంపదలనూ, ప్రాధాన్యాన్నీ కలిగించిన పరిస్థితులపట్ల పక్షపాతము వహించ డమూ స్వాభావికమే. తమ పూర్వపు జీవితవ్యవస్థపై అభిమానము క్రమంగా తగ్గుతూ వచ్చింది. తమ ప్రస్తుత జీవితపరిస్థితులతో పోల్చిచూస్తే, పూర్వవ్యవస్థ పూర్తిగా పాతగిల్లిపోయినదిగానూ, వ్యవహారదూరమైనదిగానూ, వారికి గోచ రించింది. తత్పరిణామంగా, కంపెనీవారికి ముఘల్ ప్రభుత్వంతో, సంఘర్షణ ఏర్పడిన సందర్భంలో, వీరు కంపెనీవారితో సహకరించినారు. కంపెనీ వారి క్రమపరిపాలనలో, తమకేర్పడిన శాంతియుతమైన జీవితమే, ముఘల్ సార్వ భౌముని స్వచ్ఛంద ప్రభుత్వముకంటె మేలైనదిగా, వీరికి తోచింది. జాతీయ భావమనేదీ, దేశభక్తి అనేదీ,- ఇంకనూ వీరికి దృష్టిగోచరంలోలేదు. తమకు వ్యక్తి గతంగా ప్రస్తుతం దొరుకుతున్నలాభమే వారి మనోభావాలలో ప్రాధాన్యం వహించింది.

చరిత్రలో అంతటా, బ్రిటీషు పరిపాలనకారణంగా ఎట్టి లక్షణాలూ, పర్యవ సానాలూ, ఏర్పడినవో, బెంగాలులో కూడా, ఆరోజులలో అట్టి పరివర్తనమే కలిగింది. కొద్దిమందిని మాత్రమే ప్రోత్సహించి, వారికి అభ్యుదయం కలిగించ డమూ, అనేకులను నిర్లక్ష్యంతో గమనించకపోవడమూ,- అనేది బ్రిటీషు పరిపా లనయొక్క ప్రధానలక్షణము. విద్యావంతులలోనూ, మధ్యతరగతి వారిలోనూ, సాంఘిక విజ్ఞానవిషయమైన సంస్కారభావాలను పెంపొందింపజేసిన బ్రిటీషు

ప్రభుత్వము, దేశపుఆర్థిక, రాజకీయ విషయాలలో ఏవిధమైన అభ్యుదయాన్ని కలిగించుటకూ పూనుకోలేదు. ఆర్థికంగానూ, రాజకీయంగానూ ప్రజలు అభ్యుదయాన్ని పొందితేనేతప్ప, వారు మధ్యయుగాల జీవిత విధానాన్నిదాటి, నూతన జీవితరంగంలో ప్రవేశించలేరన్న సత్యము విస్మరింపబడింది.

## IV. మదరాసులోనూ, బొంబాయిలోనూ కలిగిన పరివర్తనము

బెంగాలులో ఏర్పడుతున్న మార్పులే, మదరాసు, బొంబాయి, ప్రాంతాలలో కూడా,- అంత ఎక్కువగా కాకపోయినా,- జరుగుతూవచ్చినవి.

మదరాసు స్థావరము కలకత్తా కంటె, అర్ధశతాబ్దానికి పూర్వమే ఏర్పడియున్నది. అంతేకాక' సముద్రతీర ప్రదేశమది. ఉత్తర దక్షిణాలకూ, తూర్పు పడమరలకూ, ప్రసరించే రహదారులు కూడా, అనేక సౌకర్యాలకు ఆస్పదమైనాయి. ఇట్టి అనుకూల పరిస్థితులున్నప్పటికీ, పాశ్చాత్యప్రభావము ఈ పట్టణంపై, కలకత్తాపై వలె, ప్రసరించలేదు.

ఈ ప్రాంతంలోని, రాజకీయ పరిస్థితి అనుకూలంగా లేకపోవడము, కారణాల్లో ఒకటి. పద్దెనిమిదో శతాబ్దం కడపటికిగానీ, బ్రిటీషువారు తమ పరిపాలనను ఇందు నెలకొల్పలేకపోయినారు. బెంగాలులో వలెకాక, ఈ ప్రాంతంలోని తీరప్రదేశానికి దూరమున్న భాగమంతా దేశీయప్రభువుల పాలనలో ఉండినది. పద్దెనిమిదో శతాబ్దాంతము వరకూ, ఈ పరిస్థితి మారలేదు. అప్పటికి, కంపెనీవారి ఆశయాలూ, విధానాలూ ఎక్కువగా మార్పు చెందినవి. కావున, బెంగాల్ దివానీని బ్రిటీషువారుగైకొన్న తరువాతి సంవత్సరాలలో బెంగాలులో ఏర్పడిన అరాజకత్వకల్లోలాలూ, వక్రగతిలో ప్రవర్తిల్లిన సామ్రాజ్య విధానమూ, మదరాసులో జరుగలేదు. అదికాక, మదరాసులోని సామాజిక పరిస్థితులు కూడా, బెంగాలులో వాటికంటే, భిన్నమైనవి. మదరాసు కూడా కలకత్తావలె క్రొత్తగా ఏర్పడిన పట్టణమనడం వాస్తవమే. కాని, సంప్రదాయంగా, వ్యాపారస్థులుకాని వారుకూడా, వర్తకవ్యవహారాల్లో ప్రవేశించడానికి అవకాశము కలకత్తాలో ఏర్పడింది. మదరాసులోని పరిస్థితివేరు. మదరాసు పట్టణాన్నిచేరుకొన్న ప్రజలు ఎక్కువ దృఢంగా సంప్రదాయాలకు బద్ధులైనవారు. సాంఘికమైన పరివర్తనానికి, సులభంగా లోబడేవారుకారు. అగ్రవర్ణాలవారికీ, తదితరులకూ మధ్య ఏర్పడియున్న తగాదాలూ, కంపెనీవారి వర్తక వ్యవహారాలలో బ్రాహ్మణులకు అవకాశం కలిగిన కారణంగా, ఇతర వర్గాలలో కలిగిన అసూయాద్వేషభావాలూ, ఈ ప్రాంత స్వభావానికి సూచకములు. సాంఘిక విషయాలపట్ల మదరాసు ప్రాంతంలో ఉన్న సంప్రదాయదీక్ష, ఉత్తర దేశంలో లేదు.

సాంఘికపరిస్థితులూ, రాజకీయవ్యవస్థా ఈ విధంగా భిన్నములైయున్నా, మదరాసులో కలిగిన పరివర్తనము, స్వభావంలోనూ, ప్రయోజనంలోనూ, బెంగాలులో జరిగిన దానితో సదృశమైనట్టిదే. పోర్చుగీస్, డచ్, డేన్, ఫ్రెంచి, బ్రిటీషు,- మున్నగు విదేశాలవర్తకులు స్థాపించిన కర్మాగారాలూ, విదేశీయ

వాణిజ్యాభివృద్ధీ, బెంగాలులోవలెనే, ఇచ్చటకూడా, సదృశములైన సాంఘిక పరిణామాలనే కలుగజేసినవి.

'ఫోర్ట్ సెంట్ జార్జ్' దుర్గాన్ని, నిర్మించిన తరువాత బ్రిటీషువారు వాణిజ్యాన్ని అభివృద్ధి చేసుకోవడంలో, నిమగ్నులైయుండిరి. బెంగాలులో అవలంబించిన వర్తకవిధానాలనే ఇందునూ, అనుసరించిరి. వ్యాపార విషయంలోనూ, సంపాదించుకొన్న భూభాగాలను పరిపాలించే విధానంలోనూ, వారి ఆవశ్యకాలూ, అవసరాలూ, బెంగాలులోవంటివే. వ్యాపారాన్ని సాగించడానికీ, పట్టణాలలోనూ గ్రామాలలోనూ పరిపాలనవిధానాన్ని నిర్వహించడానికీ, దేశీయుల అవసరము వారికి, తప్పనిసరియైనది. ఈఅవసరాల ఫలితంగా, అధికార పదవులనూ, ధనాన్నీ సంపాదించుకొన్న ఒక నూతన అస్వతంత్రవర్గము,- బెంగాలు మధ్యతరగతివంటిది,- ఇక్కడకూడా ఏర్పడింది.

దేశంలో ఉత్పత్తిఅయ్యే సరకులను సమకూర్చడానికీ, ఇంగ్లాండునుంచీ దిగుమతియైన సరకులను దేశంలో విక్రయించడానికీ, కంపెనీవారు బెంగాలులో దాధ్నీవర్తకులను, నియోగించినారు. మదరాసులో, 'ప్రధానవర్తకుడు' అనే సంస్థను ఏర్పరచినారు. మదరాసులో ఈ ప్రధానవర్తకుడు, ఇతర వర్తకులతోనూ ఏజెంట్లతోనూకలిసి, కంపెనీవారికి కావలసిన సామగ్రిని సమకూర్చిగస్తూ, ఇంగ్లాండునుంచి వచ్చిన రూకలనూ, సరకునూ దేశంలో విక్రయంచేసేవాడు. కంపెనీవారినుండి, కొంతద్రవ్యాన్ని ముందుగా తీసుకొని, సరకులుత్పత్తిచేసే,- నేతగాండ్రూ, అద్దకంవాండ్రూ, అచ్చొత్తేవారూ, మొదలైన కార్మికులకు అందజేసేవారు. కంపెనీవారి వర్తకమేకాక,- కంపెనీ ఉద్యోగులలో కొందరూ, మధ్య వచ్చిచేరిన ఇతరులూ, కూడా, తమ స్వంతవ్యాపారం సాగించుతూ ఉండడంవల్ల, కార్యక్రమం అధికమయింది. కావున ప్రధానవర్తకులు ఇతర వర్తకులను కూడా, తమతో చేర్చుకొని, వ్యవహారాలను నడిపేవారు. కంపెనీవారి పరంగానూ, ఇతరఉద్యోగుల పరంగానూ, వర్తకకార్యాలను నిర్వహిస్తూఉన్న దేశీయ వర్తకుడు 'దుబాష్' అని వ్యవహరింపబడేవాడు. రెండుభాషలూ అతనికి తెలియడంవల్ల, అతనికి పేరు సిద్ధించింది. వర్తకులలోనుండి, కొందరిని 'ఇజారా' దార్లగాఎన్నుకొని, తములపాకులకూ, పొగాకుకూ, సంబంధించిన ఏకస్వామ్యాధికారాన్ని, వారికిచ్చేవారు. కంపెనీవారి భూములపై గుత్తలను వసూలుచేయడానికి కొందరూ, సారాయి తయారుచేయడానికి కొందరూ, అధికారాలు తీసుకొనేవారు.

మదరాసు చరిత్ర ప్రథమదశలో దుబాషీలు, ఎక్కువ ప్రాధాన్యము వహించినారు. పాశ్చాత్యులకూ, దేశీయులకూ మధ్య, భాషాంతరీకరణంచేసే వారుగా మొదట ఆరంభించి, వీరు క్రమంగా వ్యాపారంలో ప్రవేశించి, దలాలీ వర్తకులైనారు. వర్తకవిధానంలో, మధ్యవర్తులుగా ఉన్న వీరు, ఎక్కువ పలుకుబడినీ, గౌరవాన్నీ, సంపాదించుకొనిరి.

దేశీయులనేకులు, కంపెనీవారి ఉద్యోగాలలో ప్రవేశించినారు. నగరం-

లోని అధికారస్థానాలలో ప్రధానమైనవి మూడు. (1) అధికారి: - సక్రమవ్యవస్థను నెలకొల్పడమూ, పన్నులను వసూలుచేయడమూ, దండనాధికారిగా అభియోగాలను సత్రంలో విచారణగావించడమూ,-అనేవి ఇతని కర్తవ్యాలు. (2) అధికారికి సహాయుడైన కరణము - లేదా కనకపిళ్లే. (3) ప్రధానతలవరి:- పెద్దనాయకుడు. పట్టణాన్ని గమనిస్తూ, వీధులలోనూ జాతరలలోనూ భద్రత నేర్పరచడమూ, దొంగలనుపట్టి విచారణకు తేవడమూ, ఇతనికర్తవ్యాలు.

కొందరు దేశీయులు, రాజులదర్బారులలో రాయబారులుగానూ, మరి కొందరు కోర్టులవ్యవహారాల్లో వకీళ్ళుగానూ, నియోగింపబడుతూ వచ్చిరి. పరిపాలనసంస్థలలో, కొందరికి ఉద్యోగాలూ, బ్రిటీషువారు స్థాపించిన సంస్థలలో కొందరికి స్థానాలూ, లభించినవి. 1689 లో, న్యాయవిచారణసభ స్థాపితమయింది. దానికి గవర్నర్ 'న్యాయాధిపతి - న్యాయవాది'. అతనికి సహాయులైన నలుగురు న్యాయాధిపతులలో ఒకడు, దేశీయుడు. అదేవిధంగా, మదరాసు పురపాలకసంఘంలో ముగ్గురుదేశీయులు 'ఆల్డర్‌మన్' పదవులలో నుండిరి. దేశీయులను, సైన్యంలో చేర్చుకొని, వారిని భారతీయ సైనికాధికారుల ఆధిపత్యంలో ఉంచడంతో, మరియొక ప్రధానమైన పరిపాలనశాఖ, ఏర్పడింది.

సంప్రదాయసిద్ధంగా ఏర్పడియున్న వ్యాపారవర్గంవారికినీ, ఇతరులకునూ, ధనసంపాదనకు, పలుకుబడి సంపాదనకు, మదరాసురాజధాని, అవకాశాలను కల్పించింది. ఇక్కడి పరిస్థితులు బెంగాలులో కంటె భిన్నములైనవి. ఐనా, బ్రిటీషువారి వ్యాపారంలో కలిగిన అభివృద్ధి, మధ్యతరగతి సృష్టికి, ప్రోద్బలమిచ్చింది. ఇండియాలో బ్రిటీషు ప్రభుత్వం ఏర్పడడానికి పూర్వమే మద్రాసు రాజధాని, వాణిజ్యంలో బెంగాలుకంటె, ముందుండినదని, బెంగాలు మదరాసు రాజధానులలోని వాణిజ్యపు లెక్కలను పోల్చడంవల్ల విశదమౌతుంది,—

| | బెంగాలు | మదరాసు |
|---|---|---|
| 1703-1717 | £. 933,139 | 1936,275 |
| 1718-1727 | 1558,692 | 1865,208 |
| 1728-1737 | 1574,794 | 2150,019 |
| 1738-1747 | 2346,386 | 2495,249 |
| 1748-1759 | 2662,454 | 3123,150 |
| మొత్తం | 9974,465 | 11569,901 |

*ఆర్థికాభివృద్ధి, బొంబాయిలో నూతన ప్రజావర్గము:* 1534లో, గుజరాత్ బహదూర్‌షా పోర్చుగీసు వారికిచ్చియుండిన బొంబాయి ద్వీపం, 1661 లో, బ్రిటీషు వారికి దత్తమైనది. దానిని వారు, సంవత్సరానికి పదిపౌనుల గుత్తఇచ్చే ఏర్పాటుపై, కంపెనీకి గుత్తకిచ్చినారు. బొంబాయి, కంపెనీవారి గుత్తాధికారంలో ఉంటూ, బ్రిటీషు ప్రభుత్వపు ఆధిపత్యానికి, లోబడియుండే ఏర్పాటు

గావింపబడింది. బ్రిటీషువారి పరిపాలనలో, నగరం శీఘ్రాభివృద్ధి చెందినది. మొదట చిన్న స్థావరంగా ఉన్నట్టిది త్వరలో, అనేక జాతుల వారితో కూడిన, మహాపట్ట ణంగా సిద్ధించింది. 1668 లో. 10వేలు మాత్రమే ఉన్న జనాభా, 1675. నాటికి అరవై వేలూ, 1701 నాటికి లక్షాయాభై వేలూ, అయింది. సంఖ్యా విషయకంగా కలిగిన అభివృద్ధికంటే, ప్రధానమైనది అందలి నివాసుల, స్వభావప్రకృతులలో జరిగిన పరివర్తనం. కంపెనీ వారికి స్వాధీనం చేయబడిన దశలో, బొంబాయి ద్వీపంలో కోలీలు, భండారీలు, అని వ్యవహరింపబడే ఆదిమవాసులు, కొద్ది మంది పోర్చుగీసువారు, 'టోపాజీ' లనబడెడి పోర్చుగీసు సంకరజాతులు, క్రిందికులాల నుండి మతాంతరులైన క్రిస్టియన్లు, కున్బీలు, ధేరులు, మహార్లు, వలసవచ్చిన హిందూముస్లిములు, ఒకరిద్దరు పార్శీలు,- నివాస మేర్పరచుకొని ఉండేవారు. ఇంగ్లీషువారు వాణిజ్య వ్యాపారాల కిచ్చిన ప్రోత్సాహకారణంగా, నేతగాండ్రు, శిల్పులూ, వర్తకులూ, అధికసంఖ్యాకులుగా వచ్చి, ఒక నూతన వర్గంగా నెల కొనిరి. వలసవచ్చిన వీరందరూ, శీదవారుకారు. గుజరాతునుండి బనియా వర్తకులూ, పరిసరప్రదేశాలనుండి బంజారాలూ, బంగారు పనివాండ్రూ, కమ్మరులూ, శిల్పులూ, మొదలైనవారునూ, వచ్చిచేరిరి. పార్శీలువచ్చి, ఇందు నెలకొనడము, ముఖ్యంగా గమనింపదగిన విషయము.

ఈవిధంగా, ద్వీపంలోని ప్రాచీన నివాసులైన- ద్రావిడ పూర్వజాతి కావచ్చు— వారికితోడు, సముద్రతీరభూములనుండి మాత్రమేకాక, ప్రజలు, ఉత్తరదక్షిణ ప్రాంతాలనుండీ, ద్రావిడులూ, మహారాష్ట్రులూ, గుజరాతీలూ, కూడా వచ్చిచేరిరి. వీరుమాత్రమేకాక, విదేశీయులైన అబిసీనియన్లూ అరబ్బులూ, మడగాస్కరులోని దాసజనులూ (Slaves), ఇచ్చటికివచ్చి, నివాసమేర్పరచు కొన్నారు. హిందూముస్లిము, పార్శీ, క్రిస్టియను మతాలన్నిటికీ, బొంబాయిలో, మంచి ప్రాతినిధ్యం ఏర్పడింది. భారతదేశంలోని వర్తకవర్గం వారిలో, గుజరా తీలూ, భాటియాలూ, పార్శీవర్తకులూ, బొంబాయియొక్క సామాజిక, ఆర్థి కాభివృద్ధికి, ఎక్కువగా సహకరించినారు.

పందొమ్మిదో శతాబ్దారంభంలో, బొంబాయిలోఉండిన భారతీయవర్తక వర్గాలవారు, మిల్ బర్న్ (Milburn) పట్టికలో వివరింపబడియున్నారు. దానిని బట్టి, పార్శీలు పదహారుగురూ, హిందువులు పదునైదుగురూ, ముస్లిములు నలు గురూ, పార్శీచైనీలు ఇరువురూ, ఆరుగురు పార్శీపడవ నిర్మాతలూ, ఉండినట్టు తెలుస్తుంది. పడవల స్వంతదార్లైన ఆరుగురి పార్శీలపేర్లూ, ఒక ముస్లిము స్వంత దారునిపేరూ, ఆ పట్టికలో పేర్కొనబడినవి.

పద్దెనిమిదోశతాబ్దంలో, బొంబాయి వ్యాపారం చాల శీఘ్రంగా అభివృద్ధి అయింది. 1708-1717, 1748-55 దశాబ్దాల మధ్యకాలంలో, దిగుమతియైన సర కుల విలువ 10 లక్షల పౌనులనుండి 20 లక్షల దాకా పెరిగింది. సంపన్నులైన వ్యాపారస్థులకు బొంబాయి నిలయస్థానంగా సిద్ధించింది. ఆ వర్గంలోనివారు భిన్న మతాలవారూ, భిన్నజాతులవారూ ఐ యుండినా, ఆర్థికప్రయోజనం, అందరికీ

సమానమైనదే.

బొంబాయి అభివృద్ధి చెందిన విధానము, మదరాసు కలకత్తాలనుసరించిన విధానాలకంటే భిన్నమైనది. మదరాసు కలకత్తాలు, దేశాంతర్గత, దేశాంతర వాణిజ్యానికి సముద్రతీర స్థానాలుగా ఉండడంమాత్రమే కాక, దేశీయ పరిశ్రమలకు కేంద్రాలుకూడా ఐనవి. ఆ ప్రాంతాల్లో, ఉత్పత్తిచెందిన సరకులను నిలువ చేసేవారు. బొంబాయి, సరకులను రవాణాచేసే తీరప్రదేశము మాత్రమే పలు ప్రదేశాలనుండి రేవుకువచ్చిన సరకులను భిన్నప్రదేశాలకూ, దేశాలకూ రవాణా చేసేవారు. బొంబాయిలో, సరకు లేవీ ఉత్పత్తి కావడంలేదు. అదికాక, మదరాసు కలకత్తాలలోని ప్రజలు, చాలవరకు మిశ్రితజనం కారు. బొంబాయిలోని విషయం వేరు. వలసవచ్చిన వారసంఖ్యాకులు కావడంవల్ల ఆ ప్రజలలో, భిన్నజాతులూ భిన్నమతాలూ చేరినవి.

*నాగరకత ఏర్పడడమూ, సంఘసంప్రదాయాల్లో మార్పు:* కలకత్తా, మదరాసు, బొంబాయి నగరాల అభివృద్ధి సమానమార్గాల్లోనే నడిచింది. ఈ మూడు నగరాలలోనూ ఆంతరంగికాభివృద్ధి ప్రయత్నమే కాక, వీటికి పరస్పర సంబంధాన్నిగూర్చే ప్రయత్నంకూడా ప్రారంభమయింది. తీరప్రదేశవాణిజ్యము విస్తరించడంతో, భారతీయవర్తకులకు దానితో ఎక్కువ సంబంధమేర్పడింది. బెంగాలీ, మదరాసీ, పార్సీ, గుజరాతీ వర్తకులు పరస్పర సాహచర్యాన్ని కూర్చుకొన్నారు. తమ అందరికీ సమానమైయున్న వర్తకప్రయోజనం వారిచే గుర్తింపబడింది.

వాణిజ్యకేంద్రాలైన ఈ నగరాల అభివృద్ధి కేవలం బాహ్యమైనది మాత్రమే కాదు. ప్రాక్పశ్చిమ ఖండాలకు మధ్య ఏర్పడిన సాహచర్యసంపర్కాల కారణంగా ఉద్భవమైన క్రొత్తశక్తుల పరిణామాన్ని సూచించేది ఈ అభివృద్ధి. యూరోపుదేశాలకూ భారతదేశానికి మధ్య జరుగుచుండిన వాణిజ్యవ్యవహారాలకు ఈ నగరాలు, కేవలం కేంద్రాలుమాత్రమే కావు. వాణిజ్యవిధానాలలో ఒక క్రొత్తపద్ధతీ, నూతనమైన ఒక సాంఘిక ఆర్థికవ్యవస్థా, నూతన జీవనవిధానమూ, కొత్తవర్తకపద్ధతులూ,- వీటికి, ఈనగరాలు నిదర్శనములుగా పెంపొందినవి. భారతీయవర్తకులు విదేశవర్తకులతో సహకరించి, నూతనంగా ఏర్పడిన అవకాశాలను పురస్కరించుకొని ధనాఢ్యులైరి. కాలానుగుణంగా మారడానికి ఇష్టపడని ప్రాచీన సంప్రదాయస్థులవర్గము క్రమంగా క్షీణిస్తూ వచ్చింది. వ్యాపారంలోనూ, పరిశ్రమల్లోనూ ఉద్యోగాలలోనూ, వివిధములైన వృత్తులలోనూ క్రొత్తగా ప్రవేశించినవారు ఈ ప్రాచీనుల స్థానాన్ని ఆక్రమించుకొంటూ వచ్చిరి.

ప్రాచీన హిందూ సమాజంలో, వృత్తులూ, ఉద్యోగాలూ, కులాన్ని వంశాన్నిబట్టి, జన్మతః నిర్ణయమై ఉండేవి. నూతన పరిస్థితులలో, వృత్తి, ఉద్యోగ విషయాల విషయంలో, కులబంధాలూ జాతి బంధనాలూ తొలగినవి. సంప్రదాయంగా వర్తక వ్యాపారాలకు చెందని వ్యక్తులు కూడా, అనేకులు, వాణిజ్య వృత్తిలో ప్రవేశించినారు.

*ప్రాచీనకులీనవర్గమూ, వ్యాపార సంస్థ క్షీణించడము:* మధ్యతరగతి వర్గముయొక్క పరిణామంలో, తరువాతి దశ నిష్కర్షమూ, ప్రధానమూ, ఐనట్టిది. ఈ దశ, 1757 వ, నాటి ప్లాసీ యుద్ధం నుండీ ఆరంభమౌతుంది. బ్రిటీషు వారికి కలిగిన విజయము, నూతన సామాజిక ప్రవృత్తులను బలపరచి, భారతదేశ ఆర్థిక వ్యవస్థలోనేకాక, భారతీయ సామాజిక వ్యవస్థలో కూడా ఒక విప్లవాన్ని కలిగించింది.

బెంగాలులోని ముఘల్ ప్రభుత్వాన్ని కూలద్రోయడమేకాక, ఆ ప్రభుత్వంయొక్క అధికారాన్నీ, అది సమాజంలో ఏర్పరచియుండిన ప్రభు ప్రాపకాన్నికూడా, బ్రిటీషురాజ్యం, నశింపజేసింది. ప్రభుసేవపై ఆధారపడి యుండిన అధికార వర్గాల వారు, తమ పదవులనూ, విశేషహక్కులనూ గోల్పోయి నారు. అంతతో, భారత సంఘానికి సారభూతమై యుండిన, ప్రముఖ సంఘము లోపించింది.

భూస్వాములు, తమ అధికారాలనూ, రాజకీయ కర్తవ్యాలనూ విరిగొట్టు కొన్నారు. న్యాయపరిపాలనకూ ఆర్థిక విషయాలకూ, పరిపాలన విధానానికీ సంబంధించిన బాధ్యతలను వహించియుండినవారు, బహిష్కృతులు గావింపబడిరి. రాజకీయాధికారానికి, ఇదివరకూ కేంద్రములై యుండిన స్థానాలన్నీ నిర్మూలింపబడినవి. ఈ విధంగా భారత సామాజిక వ్యవస్థ అంతా కూకటివ్రేళ్ళతో పెళ్ళగింపబడినది. రాజకీయ వ్యవస్థలో పొందుపడియుండిన అగ్రవర్గాలవారు ఈ విధంగా నిర్మూలింపబడడంతో, సమాజంలోని మూడు భాగాలకూ దెబ్బ తగిలింది. రాజకీయ పరిపాలన భాగమైన అగ్రవర్గంవారి స్థానాన్ని, విదేశీయులాక్రమించిరి. అనగా, దేశపరిపాలన సమస్తమూ బ్రిటీషు వారి 'స్వల్ప జనాధిపత్యం' యొక్క హస్తగతమయింది. పూర్వపు వ్యాపారవర్గంలోని కొంత భాగము, విదేశ వ్యాపారంపై ఆధారపడియున్న నూతన వాణిజ్య వర్గంలో చేరిపోయి, నూతన మధ్యతరగతిశాఖకు, మూలంగా ఏర్పడింది. భిన్నులైయున్న కర్షకులూ, శిల్పులూ, సామాన్య-కార్మిక జనంతో చేరి, సమాజంలోని అధమ వర్గంగానే,-కష్టజీవులుగానే నిలిచిపోయిరి. దేశీయమైన ప్రజ, సమస్తమూ, ఈ విధంగా రెండు వర్గాలుగా ఏర్పడింది. వివిధములైన వృత్తులనూ, ఉద్యోగాలనూ అవలంబించిన,- పైన వివరింపబడిన,- మధ్యతరగతి వారొకభాగం. గ్రామాలలోనూ, పట్టణాలలోనూ, పొట్టకూటికై కష్టించే అధికజనాభా భాగం, రెండవది. సమర్థులైన వ్యక్తులతో కూడిన మొదటిశాఖ క్రమంగా ధనవంతమయింది. పల్లెలలోనూ పట్టణాలలోనూ కష్టించే సామాన్యజనంలో ఏర్పడిన రెండవశాఖ, దినదినానికీ ఎక్కువౌతున్న దారిద్ర్యంతో క్రుంగిపోతూనే ఉంది. మధ్యతరగతి బాగుపడింది, కాని, మొత్తంమీద ప్రజల పరిస్థితి క్షీణించి, దీనావస్థకు వచ్చింది. పరస్పర విరుద్ధములైన ఈ పరివర్తనములు, సాంఘికాచార వ్యవహారాలనూ, నైతిక ప్రవృత్తి భావప్రవృత్తులనూ, కలత చెందించినవి.

వ్యవసాయవిషయంలో, బాహ్యవిషయాలకు సంబంధించిన ఒప్పందాలూ,

కరార్లూ పాటింపబడినా, పూర్వవ్యవస్థయొక్క స్వభావాన్నీ, ఆశయాన్నీకూడా, పూర్తిగా మార్చివేసింది నూతనవిధానం. బ్రిటీషువారి యుద్ధవిజయంవల్ల కలిగిన ఫలితాలలో ఇదియొకటి. జమీందారులు, జాగీరుదార్లు, తాలూకుదార్లు, మరి ఇతరులైన భూస్వాములు,- మొదలైన కులీనవర్గాలతో ఏర్పడిన ప్రాచీన వ్యవస్థ, ప్రధానంగా ప్రజాసేవకై ఏర్పడినసంస్థ. ఐనా, పద్దెనిమిదోశతాబ్దంలో ఈ ఉన్నతాశయము మరుగుపడి పోయినదనడం వాస్తవమే. కానీ, నూతనంగా ఏర్పడిన విధానంలో భూస్వామ్యసంస్థ, కేవలం వ్యాపారసంస్థగా, రూపొందింది. లాభసంపాదనమే ప్రధానోద్దేశం కావడంతో, క్షేత్రవ్యవహారాల్లో ప్రజాసేవ, దేశసేవ అనే భావాలు లోపించినాయి. నూతనజమీందారు, కేవలం 'వర్షాశన జీవిగా' (Rentier = గుత్తలపై - లేదా - కౌలుపై బ్రతికేవాడు.) తయారైనాడు.

వాణిజ్యంలోనూ, పరిశ్రమల్లోనూ, ఏర్పడిన విప్లవంవల్ల, అధిక ప్రమాణంతో కూడిన వ్యాపారమంతా,- అందునూ విదేశవాణిజ్యంతో సంబంధించినట్టిది.—— పరదేశీయుల హస్తగతం కావడం ఆరంభించింది. స్వతంత్రంగా వ్యవహరిస్తూఉన్న పెద్దవర్తకులూ, బ్యాంకర్లూ, ద్రవ్యసహాయకులూ, (Financiers), తొలగింపబడినారు. కాని, ఏజెంట్లతోనూ, చిన్న కంట్రాక్టర్లతోనూ, సహాయకులతోనూ, సాధారణవర్తకులతోనూ కూడిన, ఒక మధ్యశ్రేణి వర్తకసంఘాన్ని ప్రభుత్వంవారు ఏర్పరచిరి. ప్రాచీనకాలమందు నెలకొన్న గృహపరిశ్రమలు క్షీణించడంవల్లనూ, విదేశవర్తకులతో ఏర్పడిన పోటీవల్లనూ, భారతీయవాణిజ్యశాఖలోని అగ్రవర్గంవారికి దుస్థితికలిగింది.

*వ్యాపారవర్గంవారి హాని - వృద్ధులు :* అంతర్దేశీయవ్యాపారమూ, సముద్రతీరవ్యాపారమూ, విదేశవాణిజ్యమూ - [యూరోపియను - ప్రాగ్దూర దేశాలూ] అని, బెంగాలులో మూడు వాణిజ్యశాఖ లుండినవి. 1757 ప్రాంతం వరకూ, అంతర్దేశీయవ్యాపారమంతా పూర్తిగా దేశీయులచేతుల్లోనే నడిచింది. ఇతరభూభాగాలమీదుగనూ, సముద్రంమీదుగనూ, దిగుమతియైన సరకులను దేశీయవర్తకులు కొని, బెంగాలులో, ఉత్పత్తియైన సరకులను, దేశంలోని వివిధ ప్రాంతాలకూ, విదేశాలకూ, ఎగుమతిచేసేవారు. ఎగుమతికి కావలసిన సరకులను సమకూర్చుడంలో, దేశీయవర్తకులు విదేశవర్తకులకు సహాయపడేవారు.

సముద్రవర్తకం సాగిస్తూ ఉండిన అరబ్బులనూ, ఇతర విదేశవర్తకులనూ ఇండియా సముద్రాలనుంచి పారదోలి, బ్రిటీషువారు తమ ఆధిపత్యాన్ని సముద్రాలపై ఏర్పరచుకొనినందువల్ల, సముద్రతీరవ్యాపారమూ, సముద్రాంతర వ్యాపారమూ, ఇప్పటికి చాలభాగం, విదేశీయుల అధీనంలోకి వచ్చింది. భారత దేశపు తూర్పుపడమర సముద్రతీరాలలోగల రేవుపట్టణాలలో, చాలవరకు, కర్మాగారాలను కూడా, స్థాపించినారు. ఐనా, 1757 వరకూ, యూరోపియను వర్తకులవాణిజ్యం, తీరవ్యాపారానికీ, విదేశవ్యాపారానికీ మాత్రమే నియమితమైయుండింది. తీరువసుంకాల (Customs duties) విషయంలో, ఇదివరకే, వీరు దేశీయప్రభువులనుండి దిగుమతులపై 'రియాయితీలను' (Concessions), పొంది

యుండినారు. కంపెనీవారి దస్కతులున్న (Certificates) సరకులను, దేశీయ, ప్రభుత్వంయొక్క సుంకపు అధికార్లు పనిశీ చేయడానికి వీలు లేదు. ఇది భారతదేశపుప్రభువు లిచ్చిన 'రియాయితీల'కు నిదర్శనము. ఆ సరకులపై వారు సుంకం చెల్లింపరు. ఈవిధంగా, విదేశవ్యాపారము ఎక్కువ లాభదాయకమై సంవత్సరం సంవత్సరం, వృద్ధికాజొచ్చింది.

1757 కు తర్వాత, ఈస్టుఇండియా కంపెనీయొక్క స్థితిలో, ఒక్కసారిగా పెద్దమార్పు కలిగింది. ఇంతవరకూ తాను వ్యాపారం సాగిస్తూఉన్న దేశంపై తనకు ఆధిపత్యం ఏర్పడింది. విజయంకలిగించిన మత్తువల్ల నల టరిగించె. శీఘ్రంగానూ, సులభంగానూ ధనసంపాదన కలిగించే అవకాశం ఎంతో పెరుగ్గా వగా ఆకర్షించింది. కాబట్టి, కంపెనీ ఉద్యోగులు నవాబుతో తామొనర్చుకొన్న ఒడంబడికలనూ, ఒప్పందాలనూ త్రుటిలో త్రోసిపుచ్చి, నవాబును తిరస్కరించి, దేశప్రజల ప్రయోజనాలపట్లా, బాగోగులపట్లా, నిర్దయగాను, అంతర్దేశీయ వ్యాపారంలో బలాత్కారంగా ప్రవేశించిరి.

1765లో, కంపెనీడైరెక్టర్ల సభకువ్రాస్తూ క్లైవ్ (Clive), "ధనంపైగల అత్యాశ, తత్సాధనావకాశాలు, లభించినప్పుడు, వాటి నుపయోగించుకోవడం, తన ధనాశను తీర్చుకోవడం,- ఆశ్చర్యంకాదు. కాని, మీ ఆధిపత్యాన్ని నిర్వహించేవ్యక్తులు, తమకుగల అధికారాన్ని ఉపయోగించుకొని, దేశాన్నిపీడించి, దోచుకొంటూఉండడం, కేవలం సాధారణమైన అధికార దుర్వినియోగం మాత్రమే కాదు. సర్వభక్షకులైన వీరి తీరని ఆకలిని, సాధారణమైన లంచగొండితనం తృప్తి పరచజాలదు"- అని తన ఏవగింపును వ్యక్తముగావించినాడు.

వెరెల్స్టు (Verelst) అనే ఆంగ్లేయుడీవిషయమై,- "ధనాశారూపమైన, అపారమైన తృష్ణ, మన ఉద్యోగులనందరినీ అత్యంతంగా, ఆవేశించింది. ఆ ఆవేశ ప్రాబల్యానికిలోనై వీరు, దేశప్రభుత్వంపట్ల న్యాయాన్నీ, దేశంపట్ల తమ కర్తవ్యాన్నీ గమనింపలేని అంధులైయున్నారు." అని వివరించినాడు.

మీర్‌జాఫర్ పంపిన విన్నపపత్రాలూ, మీర్‌కాసీం చేసిన ఆక్షేపణలూ నిరర్థకములైనాయి. మీర్‌కాసీం,- "ప్రతి పరగణాలోనూ, ప్రతిపల్లెలోనూ కర్మాగారాలలోనూ కూడా, బ్రిటీషువారి ఏజెంట్లు, ఉప్పు, తమలపాకులూ, నెయ్యి, బియ్యమూ, ఎండుగడ్డి, వెదుళ్ళూ, చేపలూ, కూరగాయలూ, అల్లమూ, చక్కెరా, పొగాకూ, అపీమూ, ఇంకనూ ఇతర వస్తువుల క్రయవిక్రయాలు జరుపుతూ ఉన్నారు." అని వివరించినాడు. నాలుగువందలకుపైగా కర్మాగారాలను బ్రిటీషువారు నెలకొల్పియున్నారు. వారి ఏజెంట్లు, వర్తకవ్యవహారాల్లో జోక్యం కలుగజేసుకోవడం మాత్రమేకాక, జమీందారులను అవమానపరుస్తూ, కర్షకులనూ చేతపనివాండ్రనూ పీడిస్తున్నారు. తమవద్దనుండి సరకులను అధిక ధరలకు కొనవలెనని బాధిస్తున్నారు. ప్రజలసరకులను తమకు బజారుధరలకంటే 30-40 శాతం తగ్గించి అమ్మమంటున్నారు."

నవాబుగావించిన దోపాడోపణలు నిజమైనవని వారన్ హేస్టింగ్సుకూ,

వాన్‌సిటార్ట్‌కూ (Vansittart) కూడా విశ్వాసం కలిగింది. కాని, కంపెనీసభలోని అధిక సంఖ్యాకులు, న్యాయానికంటే అత్యాశకే, ఎక్కువ ప్రాధాన్యాన్ని, అభిమానాన్నిచూపి, ఆరోపణలను త్రోసివేసిరి. దానితో మీర్‌కాసీం, అందుకు ప్రతిక్రియగా, దేశీయవర్తకులపై నియమించి యుండిన సుంకాలను తీసివేసి, వారి భారాన్ని తగ్గించి, ఇంగ్లీషు వర్తకులతో సమానమైన వ్యాపారపరిస్థితులను వారికి కల్గించినాడు. తన ప్రజా ప్రయోజనాలను రక్షించడానికై తీసుకొన్న ఈ సక్రమ చర్యవల్ల, మీర్‌కాసీం, సింహాసనాన్ని విడువవలసివచ్చింది. ఇతని తర్వాత రాజ్యానికి వచ్చినవారు, గత్యంతరంలేక, మరల సుంకాలను దేశీయులపై విధించ వలసి వచ్చింది దీనితో దేశీయ వర్తకులు నశించిపోవడమేకాక, భారతప్రభుత్వపు ఆదాయానికి కూడా నష్టము కలిగింది.

బ్రిటీషు ఉద్యోగుల స్వంత వ్యాపారము అక్రమమైనదని, కంపెనీ డైరెక్టర్లు, తుదకు, గ్రహించినారు. ఈ వ్యాపారాన్ని ఒక సంఘం ద్వారా జరపడానికి క్లైవ్ పూనుకొన్నాడు. డైరెక్టర్లు, నిష్కర్షమైన, ఖండితమైన ఆజ్ఞ పంపడంవల్ల ఈ సంఘాన్ని మూసివేయవలసివచ్చింది. కాని, దొంగవ్యాపారం మాత్రం ఆగిందికాదు. కంపెనీలోని పెద్దపెద్ద అధికార్లందరికీ ఈ వ్యాపారంలో, భాగముండినది. బ్రిటీషు ఉద్యోగులు అవలంబిస్తూ ఉన్న ఈ దొంగ వ్యాపారము తక్కిన యూరోపియనులకు ఆదర్శంగా ఏర్పడి, వారు కూడా ఇందులో దిగినారు. కంపెనీ ఉద్యోగులు కూడా వారితో ఏకీభవించి, తమ ప్రయోజనాన్ని కూడా సాధించుకొన్నారు. ఇంగ్లీషువారు తమకుచేసిన సహాయానికి ప్రతిఫలంగా (Quid Pro Quo), వీరు, ఇంగ్లీషువారు సంపాదించిన లాభాలను, వారి ఇండ్లకు చేర్చడానికి సహకరించిరి. ఈ విధంగా, పాశ్చాత్యులందరూ ఏకమై, దేశీయ వర్తకులను వినాశస్థితికి తెచ్చినారు.

ఇట్లు, 1757 అనంతరం, ఇంగ్లీషువారి విదేశ వాణిజ్యం, అంతర్దేశీయ వ్యాపారంతో మిళితమైపోయింది. అదే విధంగా, కంపెనీయొక్క అధికారయుత మైన వ్యాపారము, కంపెనీ ఉద్యోగుల దొంగవ్యాపారంతో చేరిపోయింది. ఇట్లేర్పడిన పరిస్థితి, కంపెనీవారి ప్రయోజనానికీ, స్వతంత్రులైన దేశీయవర్తకుల ప్రయోజనానికీ కూడా, హానికరంగా పరిణమించింది. కాని, స్వంతంగా వ్యాపారం సాగిస్తూఉండిన యూరోపియనులూ, దేశీయులైన వారి ఏజెంట్లూ బాగుపడినారు. ఇట్లు బాగుపడినదేశీయులు, కంపెనీ వారి 'గోమాస్తాలూ', స్వంతవర్తకుల 'బనియాలూ', - అనేవారు.

వ్యాపారానికి కావలసిన పెట్టుబడిని సమకూర్చుకొనే విధానంలో, కంపెనీ వారు గావించిన మార్పుకారణంగా, వర్తకవిధానంలో మధ్యవర్తుల ఉత్పత్తి, కీటక సదృశంగా, సమృద్ధమయింది. 1753 నాటికే, కంపెనీవారు తమ పూర్వపు వ్యాపారవిధానాన్ని విడిచివేసినారు. దేశీయవర్తకులు అతిస్వతంత్రులనీ, కచ్చితంగా బాకీలు వసూలుచేసేవారనీ, ఒప్పందాలను పాలించడానికి సుముఖులు కారనీ, కంపెనీ అధికారులూ, వారి సేవలోనున్న దాద్నీవర్తకులు కూడా

గ్రహించియుండిరి. కంపెనీవారి వ్యాపారనిబంధనలు అసంతృప్తికరములైనవనీ, వారిచ్చేదలాలీ చాలినదికాదనీ, ఇంగ్లీషువర్తకుల ప్రవర్తన, డచ్చి, ఫ్రెంచివర్తకుల వలెకాక, అహంకారయుతమైనదీ. లోభభూయిష్ఠమైనదీ,- అని, దేశీయవర్తకుల అభిప్రాయము. 1749లో, వీరిలో కొందరువర్తకులు, సరకుల విలువలో ఎక్కువ భాగము ముందుగనే ఇస్తేతప్ప, పెట్టుబడికి సరిపోయే సరకులను సరఫరాచేయు మని తిరస్కరించి యుండిరి. గుడ్డలధరలను నిర్ణయించడంలో ఉత్పత్తిదారులతో ఈ వర్తకులు ఏకమౌతున్నారనీ, కంపెనీవారి వ్యాపారప్రయోజనాలను గమ నించకుండా, తమ స్వంతవ్యాపారాన్ని సాగించుకొంటున్నారనీ, తమకు పోటీ దారులైన, డచ్చివారికి, సరకులను సమకూరుస్తున్నారనీ,- వీరిపై ఆరోపణలు గావించినారు ఇంగ్లీషువర్తకులు.

కనుక, 1753లో, స్వతంత్రుడైన దాధ్నివర్తకుణ్ణి తొలగించి, ఆస్థానంలో గోమాస్తాను, కంపెనీ ఏర్పరచుకొంది. వేతనంపుచ్చుకొంటూ, తమ ఏజెంటుగా మాత్రమే పనిచేయవలసినది అతని కర్తవ్యం. సరకులకు కావలసిన పెట్టుబడులన్నీ ఆతనిద్వారానే జరిగేవి. అతడు, సరకులను 'ఔరంగులలో' నగదిచ్చి కొని, కొఠ్ఠా లలో వాటిని వేర్పరచి, వింగడించి, తర్వాత కలకత్తాలోని గిడ్డంగులకు పంపేవాడు.

క్రొత్తగా నియోగింపబడిన గోమాస్తాలుకాక, 'బనియా' లని వ్యవహ రింపబడే, ఇంకొకవర్తకవర్గం కూడా, కంపెనీ ఉద్యోగులకూ, ఇతర యూరోపి యను వర్తకులకూ, వారి వ్యాపారవ్యవహారాలలోనూ, కుటుంబ కార్యనిర్వహణ లోనూ, సహాయపడుతూ ఉండేవారు. ఈ బనియాలు, వీరి కొలువులో పనిచేస్తూ, వీరికొరకై అన్ని విధములైన వ్యవహారాలనూ నడిపేవారు.

ఈ బనియా, తన పాశ్చాత్యస్వాములకు, దుబాసీగా, లెక్కల గుమా స్తాగా, ప్రధానకార్యదర్శిగా, దలాలీపెద్దగా, ఇబ్బందులలో డబ్బు సమకూర్చే వాడుగా,-అంతేకాక, అన్నివిధాలా ఆంతరంగికమిత్రుడుగా, సేవచేసేవాడు. అతని యజమాని వ్యాపారమంతా అతడే నిర్వహించేవాడు. కార్యకర్త, రుణదాత, ఉంపుడుకత్తె - వీరందరికీ కలిసి ఒక వ్యక్తిపై ఉన్న ప్రభావంకంటే, ఎక్కువైన పలుకుబడి ప్రభావాలు, ఈ బనియాకు, అతని యజమానిపై ఉండినవి. అంతేకాక, తన యజయాని ప్రయోజనాలకు అనుకూలించేటట్లుగా వ్యవహారాలను నడిపే వాడు. తన యజమాని బాహాటంగా ఒప్పుకోడానికి వీలులేనట్టి కార్యాలనూ, వానికి తగిన ప్రయత్నాలనూ సమర్థించడానికికూడా, ఈ బనియా పూను కొన్నాడు.

బనియా ఉద్యోగం, మంచిఆదాయాన్నీ, పలుకుబడినీ, కలుగజేసింది. యూరోపియనులతో సాహచర్యమూ, పలుకుబడీ, తన సంఘంలో గౌరవస్థానం కలిగించినవి. తన యజమాని దస్కతు ఆధారంగా, తీరువసుంకాలు లేకుండా వ్యాపారం సాగించే అవకాశమూ,- సౌకర్యాలూ, ఈ ఉద్యోగాన్ని సంపాదించిన వ్యక్తికి సిద్ధించేవి. ఈ విశేషప్రయోజనాలను గుర్తించి, శ్రేష్ఠమైన హిందూ

సంఘంలోనివారుకూడా, ఈ కొలువులో ప్రవేశించినారు. పెక్కుసందర్భాల్లో, లంచాలు ఇచ్చికూడా ఈ ఉద్యోగాన్ని సంపాదించుకొనేవారు.

ఇంగ్లీషు కంపెనీ ప్రాపకాన్ని పోగొట్టుకొన్న దాఢీ వర్తకుడు, ఫ్రెంచి, డచ్చి, అమెరికన్ మొదలైన, ఇతర విదేశీయులకు సరకులను సమకూరుస్తూ, తన వ్యాపారాన్ని సాగించుకొన్నాడు. అమెరికా స్వాతంత్ర్యసమరందాకా, అమెరికనులుకూడా, ఇండియాలో వర్తకం సాగించినారు. అంతర్దేశీయవ్యాపారాన్ని పెంచుతూ, కంపెనీవారు, మార్కెట్టులో విడుదలచేసిన రుణపత్రాలపై చట్టాల వ్యాపారంసాగిస్తూ,కంపెనీవారి సార్వజనికరుణాలకు, ఎక్కువవడ్డీపై అప్పలిస్తూ, తనకు కంపెనీవారు కలిగించిన నష్టాన్ని పూడ్చుకొన్నాడు,దాఢీవర్తకుడు.

1757కు పూర్వం, నవాబులు నిర్బంధపరచిన నియమనముల కారణంగా, కంపెనీ ఉద్యోగుల స్వంత వ్యాపారం పరిమితమై ఉండినది. కంపెనీవారి దిగుమతి ఎగుమతి సరకులపై మాత్రమే, సుంకము విధింపబడలేదు. కనుక, అంతర్దేశీయ వ్యాపారాన్ని కానీ, వర్తకులు స్వంత వ్యాపారానికై కొన్న సరకులను కానీ, ఈ నియమనాలు బాధించలేదు. 1757 తర్వాత, ఇంగ్లీషు వర్తకులు, కంపెనీవారి సరకులనూ, స్వంత వ్యాపారస్థుల సరకులనూ కూడా, క్రయ విక్రయ మొనర్చే స్వాతంత్ర్యాన్ని,-తామే-వహించి, వ్యాపారం సాగించడానికి ఆరంభించినారు. ఈ విధంగా, అన్నివిధములైన వర్తక వ్యాపారాలూ, వీరిహస్తగతమైనాయి. తత్కారణంగా వీరి ఏజెంట్లుగా వ్యవహరిస్తున్న గోమాస్థాలకూ, బనియాలకూ, తమవ్యాపార వ్యవహారాలు సాగించడానికి విశాలమైన, అపరిమితమైన అవకాశం ఏర్పడింది. కంపెనీ వారిసరకులపై సుంకాలనూ, పరిశోధన పరీక్షలనూ తొలగించి రక్షించే నిమిత్తం, 'దస్తకు'లనే ఉత్తర్వులను గ్రహించి, వాటిని అన్ని విధములైన వ్యాపారాలకూ, అక్రమంగా, ఉపయోగిస్తూ వచ్చినారు.

కంపెనీ అధ్యక్షుడు మొదలు చిన్న గుమాస్తా వరకూగల ఉద్యోగులందరూ, తమ జన్మహక్కుగా ఈ ఉత్తర్వులను ఉపయోగించుకొని, దేశాన్ని దోపిడి చేయడం ఆరంభించిరి. తమ స్వంత డబ్బుతో ఈ వ్యాపారాన్ని వీరు సాగిస్తూఉన్నా, తమ యజమానుల పేరిటఉన్న ఉత్తర్వులు-దస్తకులు-వీరి వ్యవహారాలకు రక్షణకల్పించినవి. చెలామణికి పనికివచ్చే పత్రాల రూపంగా (Vendible Notes) కూడా, ఈ ఉత్తర్వులు క్రయ విక్రయాలకు, కొన్ని సమయాల్లో ఉపయోగింపబడుతూ, వచ్చినవి. ఒక్కొక్క ఉత్తర్వు ధర, 25 రూపాయలు మొదలు 200. రూపాయలదాకా, సందర్భాన్నిబట్టి,-చెలామణిలో ఉండింది. ఇట్టి 'దస్తకుల' దుర్వినియోగంవల్ల స్వంతవ్యాపారము విపరీతంగా పెరిగింది; బెంగాలువ్యాపార కార్యకలాపాల్లో, దేశీయుల వంతు కూడా అధికమయింది. ఈ వ్యవహారరంగంలో, దేశీయునికిగల స్థానం, అప్రధానమైనదే ఐనప్పటికీ, అది ఎక్కువలాభాన్ని అతనికి సమకూర్చింది.

ఇండియా వ్యాపారసంస్థలో, కలిగిన మార్పూ, వ్యాపారంలో కలిగిన అభివృద్ధీ, అనేకములైన ఫలితాలను కలిగించినవి. హైదరాలీతోనూ, అతని

కుమారుడైన టిప్పుసుల్తాన్‌తోనూ, ఏర్పడిన యుద్ధాలు, ఈ పరిణామాల్లో ఒకటి. మలబారు తీరంలోనూ, కోరమాండల్ తీరాల్లోనూ, బ్రిటీషువారి కేర్పడుచుండిన ప్రాబల్యం, ఈ రాజులను, రెచ్చగొట్టింది. యూరోపియన్ నౌకల అభివృద్ధీ, దేశీయుల నౌకానిర్మాణ పరిశ్రమాభివృద్ధీ, మరియొక పరిణామము. ఈ పరిశ్రమకు బొంబాయి ఆదిమస్థానము, ఆదర్శమూ అయినది. మొట్టమొదటి నౌకానిర్మాతయైన లాల్ జీవాడియా (1735) యొక్కయూ, ఇతర పార్సీల యొక్కయూ, ప్రథమ ప్రయత్నంవల్లనూ, వారు ప్రదర్శించిన స్థైర్యం, సాహసాలవల్లనూ, ఈ పరిశ్రమ వృద్ధికి వచ్చింది. దేశంలోని నౌకాదళంలో అధిక భాగం, సూరత్; దామన్, బొంబాయి రేవులలో నిర్మితమయింది. తరువాత, సుమారు 1760. ప్రాంతంలో, బెంగాలులోకూడా ఈ పరిశ్రమను ప్రారంభించింది. బెంగాలు ప్రథమనావ 1769లో సముద్రప్రవేశం, చేసింది. అమెరికాయుద్ధం ఈ పరిశ్రమకు క్రొత్త ప్రోద్బలాన్నిచ్చింది. ఐదువందలటన్నుల నావ,- 'నోనేసూచ్' (Nonesuch), 1781లో హుగ్లీనదిలోకి ప్రవేశించింది. 1781-1803 మధ్య కాలంలో, 56 పడవలూ, 92 స్నోలూ, (Snows), నిర్మితమైనవి. ఆ శతాబ్దం పూర్తియగునాటికి, ఇండియాలో నిర్మింపబడిన వెయ్యినూటపదమూడు (1113) టన్నుల బరువుగల నావలు సముద్రములపై ప్రయాణం సాగిస్తూ ఉండినవి. బెంగాలులోని నావికానిర్మాణ పరిశ్రమ, పూర్తిగా, బ్రిటీషువారి ఏకస్వామ్యాధికారంలో ఉండినది. తత్కారణంగా దేశీయసరకుల, విదేశవాణిజ్యం, అంతా, సహజంగా, వీరి హస్తగతమయింది. పశ్చిమాశియాదేశాలకూ, చైనాకు సరకులను ఎగుమతిచేసే వాణిజ్యంలో, యూరోపియనులకు ప్రబలస్థానం ఏర్పడింది. ఎక్కువ ఆదాయకరమైన ఈ పరిశ్రమనుండీ, దేశీయులు చాలవరకు తొలగింపబడినారు. బెంగాలు ప్రాంతమూ, తూర్పుసముద్రతీరమూ పశ్చిమసముద్రతీరమూ,- అనే ఈ మూడుభాగాలూ పరస్పరం సాహచర్య సంబంధాలు కల్పించుకోవడము.- మరియొక పరిణామము. వివిధభాగాల్లోని రేవుపట్టణాలమధ్య ముక్తవ్యాపారము (Free trade) నెలకొల్పడం కారణంగా, మూడు ప్రాంతాలూ ఆర్థికంగా ఏకమైనవి. బెంగాలుకూ పశ్చిమతీరానికీ మధ్య, సముద్రతీరవ్యాపారం అభివృద్ధి చెందింది. బర్మా మలయాదేశాలతో జరిగే ఎగుమతివాణిజ్యానికి మదరాసు, కేంద్రస్థానంగా ఏర్పడడమేకాక, ఈస్టిండీస్‌తోనూ, చైనాతోనూ జరిగే ఎగుమతులకు కూడా, ఇది కేంద్రమయింది. ఐనా, ఈ వాణిజ్యాభివృద్ధివల్ల లాభంపొందిన వారు యూరోపియను వర్తకులేకాని భారతీయులుకారు.

ఈ విధంగా ఏర్పడిన పరిస్థితులు బెంగాలులోని ఆర్థికవ్యవస్థను హానికలిగించినవి. కంపెనీవారి వ్యాపారప్రయత్నాల స్వభావము మారింది. ఇండియానుండి ఎగుమతిచేసే సరకులను ఇదివరలో, ఇంగ్లాండునుంచీ దిగుమతిచేసే బంగారంతో కంపెనీవారు కొంటూ ఉండేవారు. ఇప్పుడా విధానాన్ని వదలి, బెంగాలు 'సుభా' నుండి వసూలైన పన్నులడబ్బుతో సరకులను కొనడం ఆరంభించిరి. ఈ

విధంగా తమ వ్యాపారానికై ఉపయుక్తమైన దేశద్రవ్యం, సాలుకు 10-15 లక్షల పౌనుల విలువగలదని అంచనా వేయబడింది. కొద్ది సంవత్సరాల్లోనే, దేశంలోని ఆదాయపు నిలువఅంతా భారతదేశంలో బ్రిటీషురాజ్య విస్తరణకై వెచ్చింపబడింది. ఈ విధంగా దేశంయొక్క ఆదాయాన్నంతా తమ ప్రయోజనానికై వినియోగించుకొన్నపిమ్మట, తమ వ్యాపారార్థము, సార్వజనికములైన రుణాలద్వారా డబ్బు సమకూర్చడమారంభించిరి. ఈ రుణము ప్రతిసంవత్సరం పెరుగుతూ వచ్చింది.

కంపెనీవారి ఈనూతన విధానంవల్ల, ఇంగ్లాండునుంచి దిగుమతి అగుచుండిన రూకలమొత్తమూ, బంగారమూ, తగ్గిపోతూ వచ్చింది. ఆకాలంలో ప్రచారంలోఉండిన ఆర్థికతత్త్వాన్నిబట్టి, ఇంగ్లాండునుండీ రూకలనూ, బంగారాన్నీ ఇండియాకుపంపడము, ఇంగ్లాండుకు హానికరమని, వారభిప్రాయపడుచుండినారు. కంపెనీవారి నూతనవిధానము, తమ వ్యాపారనిర్వహణకు మరయొకమార్గాన్ని చూపింది. అత్యంతావసరపరిస్థితి ఏర్పడితేతప్ప, రూకలనూ బంగారునూ ఇండియాకు పంపగూడదని, నిశ్చయించుకొన్నారు. 1756-57 లో, ఇండియాకు దిగుమతియైన బంగారువిలువ 800,000 పౌనులు. మరుసటి సంవత్సరంలోనే అది సగమయింది. 1781 నాటికి, ఈ దిగుమతి 15,000 పౌనుల కనిష్ఠదశకు వచ్చింది. బెంగాలులోనికి దిగుమతి అగుచుండిన వెండిని (రూకలరూపంలో) ఈ విధంగా అరికట్టడమేకాక, బెంగాలులోని వెండిన్నిసైతం, దేశాంతరం, పంపించడమారంభమయింది. బెంగాలు ప్రభుత్వపు కోశాగారంలోని వెండినంతా చైనాకు ఎగుమతి చేసిరి. 'వెరిలెస్ట్' వివరించినదాన్నిబట్టి,- ప్లాసీ యుద్ధానికిపూర్వం "భారతీయకర్షకుడు సుఖంగా జీవిస్తూ ఉండినాడు. శిల్పులకు ప్రోత్సాహ ముండినది. వర్తకుడు ధనవంతుడైనాడు. రాజులు సంతుష్టితో ఉండిరి. కాని, (1757-85) కాలంలో, దేశస్థితి స్వరూపము పూర్తిగా మారిపోయింది. నిర్వక్రమైన సామ్రాజ్యతత్త్వం ఆకాలంలో ప్రవృత్తమై, దేశంలో అంధకారయుగాన్ని సృష్టించింది."

*దేశీయమైన బ్యాంకింగు విధానం క్షీణించడం:* ఇండియాదేశపు విదేశవ్యాపార విధానము మారడంవల్ల, దేశీయులైన బ్యాంకర్లూ, ద్రవ్యమారకపు వర్తకులూ క్షీణించడము, మరియొక దుష్టపరిణామము. పూర్వపు ఆర్థిక వ్యవస్థలో వారికొక స్థానమూ, పరస్పర ప్రయోజనకరమైన అవసరమూ, ఉండినవి. దేశములో అంతటావసూలైన ఆదాయద్రవ్యాన్ని వారు కేంద్రకోశంలో, జమచేసేవారు. హుండీలనూ, పరపతి పత్రాలనూ, ఇస్తూ, వ్యాపారం సాగడానికి సహాకరించేవారు. అవసరమైన సందర్భాల్లో, జమీందారులకూ, ప్రభుత్వానికీ, వర్తకులకూ కూడా, వీరు, అప్పులు ఇచ్చేవారు. భిన్నములైన చెలామణి నాణెములను మార్చడమనే ఆవశ్యకాన్ని తీరుస్తూ, హుండీ దలాలుగా, ఉపకరించేవారు. 18వ శతాబ్దంలో బెంగాలులో ఉండిన బ్యాంకర్లందరిలోనూ ప్రధానమైనది 'జగత్ సేఠుల' నెలకొల్పిన బ్యాంకు. ఈబ్యాంకువారు నవాబుయొక్క చెలామణీ విధానాన్ని నిర్ణయిస్తూ ఉండేవారు.

ఇండియాలోని వ్యాపారపరిస్థితులనుబట్టి, ప్రతి సంవత్సరమూ బంగారును అధిక మొత్తంలో, తెప్పించు చుండిన కంపెనీవారు, దానిని చెలామణి నాణెముల రూపంలో మార్చడానికి, షరాఫులకు 'బట్టా'- లేక, మారకపు పట్టం, ఇవ్వవలసి ఉండేది. ఇది వారికి ఇష్టంలేదు. కనుక, ప్రమాణనాణెములను, ముద్రించే అనుజ్ఞను సంపాదించి, చెలామణీ నాణెములను తయారుచేయడానికి పూనుకొనిరి. తొలుతగా ఈ పద్ధతిని, మదరాసులో ఆరంభించిరి. 1756 వరకూ, బెంగాలులో ఈ ప్రయత్నానికి అనుజ్ఞ లభించలేదు. కాని, 1763 నాటికి, చెలామణీ విషయకమైన అవసరం తగ్గిపోయింది. మీర్‌కాసీం నవాబును, సింహాసన భ్రష్టునిగావించి, పరిపాలనపై సంపూర్ణమైన అధికారాన్ని వహించడంతో, జగత్ సేఠులకు చెలామణీ విధానంలో ఉండిన ప్రాబల్యం పోయింది.

పరిస్థితులను క్రమబద్ధంచేసే ఉద్దేశంతో, వారన్ హేస్టింగ్సు, కలకత్తాలో నున్న టంకశాల (Mint) తప్ప తక్కిన వాటినన్నింటినీ మూయించివేసి, దేశమంతటికీ సమానంగా ఉండే ఏకైకమైన, చెలామణీనాణెములను తయారు చేయించడానికి పూనుకొన్నాడు. కాని ఇతని ప్రయత్నం విఫలమయింది. కలకత్తా టంకశాల ఒక్కటే, దేశానికంతకూ కావలసియున్న నాణెముల మొత్తాన్ని ముద్రించలేక పోయింది. తత్ఫలితంగా, దేశపు అంతర్భాగాల్లోని భూస్వాములూ, రైతులూ, ఇతర చెలామణి నాణ్యాలపై, అత్యధికమైన 'బట్టా' ఇచ్చి, తమకు అవసరమైన ప్రమాణనాణ్యాలను సంపాదించుకోవలసి వచ్చింది. ప్రతి జిల్లాలోనూ చెలామణిలోఉన్న నాణ్యాలకు సంబంధించిన ప్రత్యేకమైన చిక్కులు కూడా ఉండినవి. "ప్రాంతాలలో అంతటా, ప్రతిజిల్లాలోనూ, ప్రతి పరగణాలోనూ కూడా, భిన్నభిన్నములైన చెలామణీ నాణ్యాలుండినవని," 1787 ప్రాంతంలో కూడా కలెక్టర్లు తమ నివేదికలలో తెలియజేసినారు. షరాఫులు ఈ పరిస్థితిని, తమ లాభాలకు ఉపయోగించు కొన్నారు. దేశంలోని రూకల చెలామణిలో అధికారాన్ని సంపాదించుకొని, ప్రతి జిల్లాలోనూ తమ ఏజెంట్లను నెలకొల్పి, ప్రాంతంయొక్క ఆర్థికస్థితిపై, గొప్ప ప్రాబల్యాన్ని వీరు సిద్ధింపజేసుకొనిరి. జమీందారులకు రైతులు చెల్లించవలసిన పన్నులను సకాలంలో సిక్కా రూపాయలలో చెల్లించుటకు తగిన ఏర్పాట్లు వీరుచేయడం, జమీందారులకు, తప్పక, సహాయంగా పరిణమించింది. దీనికి ప్రతిఫలంగా, జమీందారు పరంగా తాము సర్కారుకు చెల్లించిన ధనంపై వీరికి, వడ్డీ ఇచ్చే ఏర్పాటు జరిగింది. షరాఫుల నుండి ఈ విధంగా పుచ్చుకొన్న అప్పును, ఒప్పందం ప్రకారం నిర్ణీతకాలంలో చెల్లించకపోతే, జమీందారు నష్టపరిహారం ఇవ్వవలసి ఉండేది.

దేశంలోని ద్రవ్యమారక విధానాన్ని స్థిరపరచడానికై హేస్టింగ్సుచేసిన మరియొక ప్రయత్నం, హుజూరీమల్ దివాన్‌చందుల అధ్వర్యంలో జెనరల్ బ్యాంకును నెలకొల్పడం. (1773) రాజస్వములూ, పన్నులూ చెల్లించేదానికి, ఇది ఎక్కువగా సహకరిస్తుందని అతని ఉద్దేశం. ఈ పద్ధతివల్ల కలెక్టర్లకు వచ్చే ఆదాయం తగ్గింది. అందుతో, వారు దీనికి విరుద్ధులై, తమ ఆక్షేపణను వెలిబుచ్చి

నారు కంపెనీ డైరెక్టర్ల, ఆదేశంపై, ఈ బ్యాంకును 1775లో, మూసివేయవలసి వచ్చింది.

దేశంయొక్క అంతర్భాగాలనుంచీ రాజస్వాలనూ, పన్నులనూ, కేంద్రానికి జమచేయడానికి, షరాఫుల వర్గం తగినట్టి ఏజెన్సీకాదు. జగత్ సేఠుల అనంతరము, ఇతర దేశీయబ్యాంకర్లు కూడా, ఈ కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వహించడానికి సమర్థులుకాలేదు.

ఈ పరిస్థితికి కారణాలు లేకపోలేదు. బెంగాలులో సాధారణంగా వ్యాపారం క్షీణించడంవల్ల బ్యాంకింగు వ్యవహారం దెబ్బతినింది. ఇది మొదటికారణము. హేస్టింగ్సు పరిపాలనలో యూరోపియను వర్తకులు తమ స్వంత బ్యాంకింగు విధానాన్ని ఏర్పరచుకోవడము, రెండవకారణము. 1770లో, 'అలెగ్జాండర్ కంపెనీ' వారు, హిందూస్తాన్ బ్యాంకును స్థాపించిరి. కంపెనీ ఉద్యోగులు తమ డబ్బుతో వీరికి సహాకరిస్తూ వచ్చిరి. స్వంతవ్యాపారం తగ్గుతూ రావడంతో, ఈ ఉద్యోగులు కొందరు తమ ఉద్యోగాలకు స్వస్తిచెప్పి, ఏజెన్సీ వ్యాపారంలో ప్రవేశించిరి. మరికొందరు, తాము నిలువచేసుకొన్న డబ్బును, మిత్రులద్వారా, ఎజెన్సీవ్యాపారంలో ప్రవేశపెట్టి, లాభం పొందుతూ వచ్చిరి. ఈ విధంగా అభివృద్ధిపొందిన యూరోపియనుల బ్యాంకులు, ఇండియన్ బ్యాంకర్ల వ్యాపారాన్ని నశింపజేసినవి. దీనితో, హేస్టింగ్సుయొక్క ఉద్దేశం నెరవేరింది. తాను సాధింపలేకపాయిన ప్రయోజనం, యూరోపియన్ల స్వంత బ్యాంకింగు విధానము సాధించింది.

మధ్యతరగతి వారి చరిత్రలో, [1757-85 మధ్యకాలంలో] వీరి అభ్యుదయమూ, వినాశమూ కూడా,- రెండూ ఒకేకాలంలోనే- జరుగుతూ వచ్చినవి. వీరిలోని ప్రాచీనవర్గాలవారు కొందరు, తమ సంప్రదాయసిద్ధములైన వృత్తులను విడిచిపెట్టి, ఆర్థికదుస్థితికిలోనైరి. ఇతరులు, అవకాశాలను ఉపయోగించుకొని, ఆర్థికంగానూ, సామాజికంగానూ, ఉన్నతస్థాయిని అందుకొనిరి. పూర్వపు వర్తక సంఘంవారు ఈస్టిండియా కంపెనీకి, కంట్రాక్టర్లుగా పనిచేయడం మానియుండిరి. ఆ వర్గంలోని వారిప్పుడు, కేవలం కంపెనీవారి సరకులను జమచేసే, వర్తకపు ఎజెంట్లస్థితికి వచ్చినారు. ఉప్పుపైనా, అపీముపైనా,ఏకైకస్వామ్యాన్ని, కంపెనీ ఇదివరకే సంగ్రహించుకొన్నది. సూరేకారాన్ని బీహారులో తయారుచేసే ఏకైకాధికారాన్ని, క్లైవు, మీర్ జాఫర్ నుండి గ్రహించినాడు. వీటి కారణంగా, ఇండియాలోని అంతర్దేశీయ వ్యాపారం, అస్తవ్యస్తమై, అవ్యవస్థకులోనయింది. ఎగుమతిసరకుల్లో నీలిమందు ప్రధానవస్తువుగా ఏర్పడడంతోనే, యూరోపియనులు దీనికి సంబంధించిన ఒడంబడికలను (Contracts) పూర్తిగా తమ స్వంతం, చేసుకొన్నారు. ఇప్పటికి ఇండియా మధ్యతరగతివారికి, విస్తృతమైన సముద్రతీర వాణిజ్యంలో ఏమాత్రమూ, భాగంలేకుండా బిపోయింది. ఏజెంట్లుగా పనిచేయడమూ, కంపెనీవారి బాండ్లనూ (Bonds), రుణపత్రాలనూ మారకం చేయడమూ, వివిధములైన నాణ్యాలను మారకంచేయడమూ,- అనేవి మాత్రమే

ఇప్పుడీవర్గంవారి వ్యాపారములైనవి. దేశీయులైన మధ్యవర్తులద్వారా వ్యాపారం సాగించడం కంపెనీవారు ఆపివేయడంతో, (1769), మధ్యతరగతి వారి వర్తకావకాశాలు మరింత కుంటుపడినవి. "పూర్వం ధనవంతులై యున్నవారు, తమ ఆస్తిని వ్యాపారంలో పెట్టి క్షీణించిపోయినారు." అని వివరించిన వెరలెస్ట్ వాక్యాన్నిబట్టి, పరిణామమెట్టిదో గ్రహించవచ్చును. దేవుని దయవల్ల, వీరికి మరొకమార్గం గోచరించింది. భూములపై తమ ధనాన్ని పెట్టుబడిగా ఉపయోగించడానికి ఆరంభించిరి.

*వ్యావసాయకార్థికవ్యవస్థలో మార్పు,- మధ్యతరగతి భూస్వామి వర్గపు అభివృద్ధి :* బ్రిటీషువారు ప్రవేశపెట్టిన, భూమిశిస్తు విధానంవల్ల బెంగాలులోని వ్యావసాయిక, ఆర్థికవ్యవస్థలో ఎట్టి పరిణామం కలిగిందో, మరలా వివరింపనవసరం లేదు. ఐనా, విప్లవాత్మకములైన సామాజిక పరివర్తనము లెట్టివో చక్కగా గ్రహించడానికై, ప్రధానవిషయాలను మాత్రమే పేర్కొంటున్నాను. కలకత్తా, గోవిందపూర్, సుతానుటీ,- అనే మూడు గ్రామాల జమీందారీ అధికారాన్ని సంపాదించుకొన్న పిమ్మట, బ్రిటీషువారికి, భారతీయుల భూమి పరిపాలన విధానంతో పరిచయ మేర్పడింది. తర్వాతికాలంలో, ఇంకనూ ఎక్కువ గ్రామాలను జమీందారీ శిస్తుపద్ధతిపై తీసుకొన్నారు. 1757 లో, ఇరువదినాల్గు పరగణాల జిల్లా వీరికి ఈ విధంగానే అప్పగించబడింది. ఫ్రాంక్‌లండ్ (Frank land) అనే జమీందారుని నియోగించి, కంపెనీవారు పన్నుల నతనిద్వారా వసూలుచేసేవారు. అత్యధికమైన ఆదాయాన్ని గ్రహించవలెననే ఆశతో, సార్వజనికమైన వేలం (Auction) ద్వారా, పొలాలను రైతుల కప్పగించేపద్ధతిని అవలంబించిరి. దేశానికి వినూత్నమైన ఈ విధానం, దురంతమైన పరిణామాన్ని కలిగించింది. "భారతదేశాచార వ్యవహారాలకు విరుద్ధమైన ఈ విధానము, ప్రజలకు అమిత బాధాకరమైనదని దేశీయులా క్షేపించిరని" వెరిలెస్ట్, తెలిపియున్నాడు. వేలం పద్ధతిలో, గుత్తకియ్యబడిన పొలాలు, జూదరులతో సమానులైన చట్టా వ్యాపారులచేతుల్లోకి వచ్చినవి. వీరు అధికలాభోద్దేశంతో, కర్షకులను నానా విధములైన క్రూరహింసలకు గురిచేసి, పలువిధములైన కృత్రిమాలను గావించిరి. పూర్వపు జమీందారులను కంపెనీవారు విశ్వసించలేదు. కాగా, జమీందారులు రైతుల నుండి వాస్తవంగా గ్రహించుచుండిన పన్నులు ఎంతో, తెలిసికొనుటకై నూతన పద్ధతుల నారంభించిరి. కంపెనీ ఉద్యోగులు స్వయంగా పరిశీలించడంవల్ల పరిస్థితుల నిజస్వరూపం, తెలియలేదు. పూర్వపు లెక్కలను పరీక్షించడమూ పొలాలను కొలిపించడమూ, అనేవి ఎక్కువకాలం తీసుకొనే పద్ధతులు. కనుక స్వయంగా వ్యవసాయం చేయించడము, సులువైన మార్గంగా తోచింది. కాని ఈవిధంగా, స్వంత వ్యవసాయానికి పూనుకొన్న వ్యక్తులు స్వలాభాన్ని మాత్రమే చూచుకొన్న కంపెనీ వారి సేవకులూ, బనియాలూ. వీరు, జమీందారులను మించిన జమీందార్లుగా తయారై, మధ్యయుగాలనాటి నుంచీ, దేశంలో నెలకొనియున్న, భూమిస్థిరాస్థి వ్యవస్థను భగ్నంగావించిరి. ఈ విధంగా, ప్రాచీన

జమీందారీ పరిపాలన రంగంలోకి, ఒక నూతన సమాజ వర్గం ప్రవేశించింది.

ఒక జిల్లాలోని పరిమితక్షేత్రంలో జరిగిన ఈ పరిణామం, బెంగాలులోని అన్ని ప్రాంతాలకూ వ్యాపించింది. బర్ద్వాన్, మిడ్నాపూర్, చిటగాంగ్ జిల్లాలను కంపెనీ వారికి గుత్తకిస్తూ, (1760) మీర్‌కాసీం ఒక షరతును విధించినాడు. పూర్వము నుండీ ఆ జిల్లాలలోనున్న జమీందారులనూ, ఇజారీదార్లనూ, తొలగించడానికి వీలులేదన్న షరతు, గుత్తపత్రంలో చేర్చినాడతడు. ఐనా, లక్ష్య పెట్టక, బర్ద్వాన్‌లోని కంపెనీప్రతినిధి, వేలంపద్ధతిలో పొలాలను గుత్తకిచ్చే విధానాన్ని ప్రవేశపెట్టెను. దానిఫలితం వినాశకరమైనది. పూర్వపు జమీందారులు కానీ, ధనవంతులూ శీలవంతులూ ఐన ఇతరులు కానీ, వేలంలో పాల్గొనదలచుకోలేదు. తత్ఫలితంగా, సుక్షేత్రాలన్నీ కంపెనీవారి గుమాస్తాలకూ, రెవిన్యూశాఖలోని లెక్కల గుమస్తాలకూ వశమైనవి. వీరిని వెరెలస్టు "అత్యంతమూ సర్వ భక్షకులైన తుచ్ఛులు" అని పేర్కొన్నాడు. కంపెనీవారి ఉద్యోగులైన జాన్‌స్టన్, టోవెల్, హీ, బోల్ట్స్ - అనే వ్యక్తులు వేలంలో పొలాలు తీసుకొన్న వారిలో కొందరు.

కంపెనీ వారవలంబించిన ఈ విధానాన్ని అనుకరించి, నవాబ్‌మీర్‌కాసీం, తన పరిపాలనలోఉన్న భూభాగంలో, ఈ వేలం విధానాన్ని ప్రవేశపెట్టినాడు. ఉన్నతపదవులలోని ఇంగ్లీషు అధికారుల దురాశవల్లనూ, నవాబునుంచి కానుకలనూ, పరిహారాలనూ, వారు, పదేపదే కోరుచుండడంవల్లనూ, మీర్‌కాసీం ఆర్థికపరిస్థితి క్లిష్టమయింది. కంపెనీఉద్యోగులు సాగించుచుండిన స్వంతవ్యాపారం కూడా, నవాబుకెంతో నష్టం కలిగించింది. కనుక, తనకు కలిగిన ఈ అధిక నష్టాన్ని సరిదిద్దుకోడానికై, భూములనుండీ ఎక్కువ ఆధాయాన్ని లాగవలసి వచ్చింది. ఇదివరకూ ఉండిన మధ్యవర్తులను తొలగించి, 'అమీలు'లను నియమించి, వారికీ విషయంలో అధికారమిచ్చినాడు. కానుంగోలను తీసివేసినాడు. వారు వ్రాసియుంచిన శిస్తులెక్కలనూ, భూసంబంధములైన ఇతర పత్రాలనూ, గణింపలేదు. కనుక, భూములపై నియమింపబడే బేరీజు, దోపిడిగా మారింది. ఇంగ్లీషు వారి దురాశకారణంగా, ఏర్పడిన ధనహీనతనుబట్టి, మీర్‌కాసీం అవలంబించిన ఈ విధానం, బెంగాలులో దుష్ప్రవృత్తికి కారణమై, గ్రామీణార్థిక వ్యవస్థనంతటినీ తారుమారు గావించింది.

అతని తరువాత పరిపాలన సాగించిన బ్రిటీషువారు, ఈ దుర్భర విధానాన్ని సాగించడమేకాక, బేరీజును అధికం కావించి, అతిక్రూరంగా వసూలు చేసుకొన్నారు. 1764 లో, భూములను మూడేండ్ల గుత్త పద్ధతిలో వేలంవేసి, ఆస్తిపాస్తులుగానీ, శీలప్రవర్తనలుగానీ, లేని వారికి భూముల నప్పగించినారు. వెరెలస్టు "అసంఖ్యాకులైన రాక్షస ప్రవృత్తిగల హింసకులు, స్వచ్ఛందులై, దోపిడిగావించి, రైతులను దీనావస్థకు దెచ్చి, తమ మొదటి వత్సరపు బేరీజును కంపెనీకి చెల్లింపగలిగినారు." అని వ్రాసియున్నాడు. రెండవ వేలములో, భూములలో, మూడింట, రెండు భాగాలు మాత్రమే, గుత్తకు పోయినవి. అవికూడా,

యూరోపియను ఆఫీసర్లూ, బనియాలూ, ఇతరులపేర్లతో గుత్తకు గైకొన్నవే. కర్షకుడు భరింపరాని కష్టాలకు లోనైనాడు. బెంగాలు 'దివానీసి' కంపెనీ గైకొన్న తరువాత, ఈ కష్టస్థితి ఇంకా ఎక్కువైనది. దేశంలో ఇంకనూ అధికమైన సంపదఉన్నదనే భావము, కంపెనీ వారి నావేశించింది. దాని నెట్లైనా, గ్రహించి, కంపెనీ వాటాదారులనూ, ఉద్యోగులనూ, ఇంగ్లండునూ, ధనవంతం చేయడానికి, పూనుకొన్నారు. పూర్వపు దేశీయ ప్రభుత్వంలోని అధికారుల సత్యసంధతపట్లా, విశ్వాసంపట్లా వీరికి నమ్మకంలేదు. జమీందారులూ, ఇజారాదార్లూ, కానుంగోలూ, అమీలులూ, చౌదరీలూ, వీరికి నమ్మకస్థులు కాలేదు. కేవలం అత్యంతమైన దురాశా, అపనమ్మకమూ మాత్రమే, వీరి భావాలను లోగొన్నవి. ఐనా, ప్రథమదశలో, పూర్వపు అధికారుల సేవలనూ, సహాయమున్నీ, మినహాయించడానికి, వీరికి సాధ్యంకాలేదు. దేశీయులైన ఈ అధికారులు కూడా, తమ నూతన యజమానులను సంతృప్తిపరిస్తేనే తప్ప, తమ ఉద్యోగములు నిలువవని గుర్తించిరి. కంపెనీవారు తాము నిర్ణయించిన, అత్యధికమైన బేరీజుమొత్తాలను వసూలుచేసికోడానికై, మొదట అమీలులను నియోగించినారు. గుత్తదారులను పీడించి, డబ్బు వసూలుచేయడానికై, క్రింది భృత్యులను నియోగించే సర్వాధికారంకూడా, వారికిచ్చినారు. ఇదిచాలక, 1769 లో, ఈ అమీలులపైన, పర్యవేక్షకులను (Supervisors) నియమించినారు. సర్కారుద్యోగులు గుత్తకు తీసికొన్న భూములను విడిచిపెట్టవలసిందని, వారిని ఆదేశించినారు. ఇన్నిమార్పులు గావించినా,- దుస్థితి కంతకూ మూలకారణమైన "దుర్భరమైన బేరీజు" (Heavy Assessment) మాత్రం, స్పృశింపబడక, అట్లే నిలిచినది. 1755 లో, అలీవర్దీఖాన్ గావించిన బేరీజు మొత్తం,- భూమిశిస్తూ రుసుమూకలిసి,- 1,76,81,446. రూపాయలు. ఇందులో వసూలైనది, తక్కువే. కాని, కంపెనీవారు 1770-71. ఈమ సంవత్సరంలో నిష్కర్షగా వసూలుచేసికొన్న మొత్తం, 1,94,61,864. రూపాయలు.

బెంగాలులోని, దుస్థితికంతటికీ కారణం, సంవత్సర సంవత్సరం, జరిగిస్తూ ఉండిన స్వల్పకాలపు గుత్తపద్ధతీ, గుత్త వసూలుచేసేవిధానమూ,- ఐయున్నవని. వారన్ హేస్టింగ్సు, 1772లో, పంచవార్షిక గుత్తవిధానాన్ని ఆరంభించెను. ఛార్లెస్‌గ్రాంట్ వివరించినట్లుగా "దేశంలో గుప్తమైయున్న మూలద్రవ్యము అధికంగా ఉన్నదనే దృఢభావంతోనూ, అధికం గావింపబడిన పన్నుల భారాన్ని ప్రజలకు సౌలభ్యంతో అంటగట్టవచ్చుననే ఉద్దేశంతోనూ, బెంగాలులోని భూములను పంచవార్షిక గుత్తవిధానంపై, వేలంవేయడానికి నిశ్చయింపబడింది. భూముల నుండి నిష్కర్షగా లభించే ఆదాయమెంత ఐ ఉంటుందో తెలుసుకోడానికై, సార్వజనికవేలం విధానము, నిర్ణయమయింది. కలకత్తా బనియాలూ, డబ్బుతో వ్యవహారాలను నడిపేవారూ, సాహసవ్యాపారులూ మాత్రమే, ఎక్కువ డబ్బుకు భూములను గుత్తకు తీసుకొన్నారు.

శిస్తులు వసూలుచేసే యంత్రాంగము కూడా మారిపోయింది. అమీలులు

1770 లోనే తొలగింపబడిరి. తరువాతికాలంలో 'కలెక్టర్లు' అని వ్యవహరింపబడిన పర్యవేక్షకులు (Supervisors), దివానుల సహాయంతో ఈ కర్తవ్యాన్ని వహించిరి. 1773లో, కలెక్టర్లుకూడా ఈ పనినుండి తప్పించి, ప్రాంతీయసభలను నెలకొల్పి, ఆ సభలకు సహాయపడడానికి ఏజెంట్లను నియోగించిరి.

వారన్ హేస్టింగ్సు గావించిన ఈ నిర్ణయము పలువర్గాల కట్టుబడిదార్లను (Tenure holders) బాధించింది. స్వయంగా వ్యవసాయంచేస్తున్న వారిలో మూడువర్గాలుండినవి. (1) గ్రామంలో నివసిస్తూ తమ స్వంతభూములను సేద్యం చేసేవారు (ఖుద్‌కష్ట్). భూస్వామికి వీరు భూమి బాడుగను (భాటా) ఇచ్చేవారు. (2) వేరొకగ్రామంలో నివసిస్తూ, బాడుగకు తీసుకొన్న ఇతర గ్రామాల భూములను సేద్యంచేసేవారు. (పైష్‌కష్ట్). (3) భూములను గుత్తకు తీసుకొని వ్యవసాయం సాగించేవారు (ఖలార్).

కొన్నిభూములు ప్రభుత్వానివి. (ఖాల్సా). వీటిని ప్రభుత్వం, స్వయంగా కానీ, జాగీరుదార్లద్వారాగానీ, పర్యవేక్షణ గావించేది. ఈ జాగీరుదార్లు పన్నుల ఆదాయంలోనుంచి తమ వేతనాన్ని - లేక - భత్యపుఖర్చులనూ మినహాయించుకొని, మిగిలినదాన్ని, ప్రభుత్వానికి అందజేసేవారు.ఇక, వంశానుగతంగా తమకు సిద్ధించిన భూములను అనుభవిస్తూ, ప్రభుత్వానికి కప్పం కట్టుతూఉండిన జమీందారీలు రెండవవర్గము. జమీందారీలనుంచి, భాగాలను ఏర్పరచి, వాటిని ఉపజమీందార్ల అధీనంలోనూ, జాగీరుదార్ల అధీనంలోనూ నిలిపిన తాలూకా భూములు (Taluqua estates) కూడా కలవు. భూముల్లో కూడా, రెండు వర్గాలుండినవి. హుజూరీ భూముల శిస్తులు, కేంద్రప్రభుత్వానికి స్వయంగా చెల్లింపబడేవి. రెండవ వర్గమైన, మజ్కూరీ భూములు, పూర్వపు జమీందారుల అధికారంలోనే ఉండినట్టివి. ఇవికాక, దానధర్మాలకై నియమితములైన భూములు, మతసంబంధమైన పూజావిధానములకూ, సాంస్కృతిక కార్యకలాపాలకూ వేర్పరుపబడినవి. ఈ భూములపై ఏవిధమైన పన్నులభారమూ లేదు. (లాఖరాజ్). కాని, నూతనమైన గుత్తవిధానం, ఈ వ్యవస్థనంతనూ, కలతచెందించి, ప్రభుత్వానికీ, మధ్యవర్తులకూ, రైతులకూ, పూర్వముండిన సంబంధాన్నంతటినీ, నాశంచేసింది. జమీందార్లూ తాలూకాదార్లూ, చట్టూవ్యాపారులూ, అందరూ గుత్తదార్లైపోయినారు. తమ స్వంతభూములను నిలుపుకొన్న జమీందార్లు కూడా, కంపెనీవారు వ్రాయించుకొన్న ఒప్పందాలను పాటించడానికి అసమర్థులైరి. కాగా, వారి భూములు సజావాలులకు (Agents) అప్పగింపబడినవి. ఈ సజావాలులు, అధమస్థితినుండి వచ్చిన నీచులు. జమీందార్లపట్లా, రైతులపట్లాకూడా, కఠినంగానూ, అగౌరవంగానూ ప్రవర్తించినారు. రాజషాహీ రాణీయైన భవానీదేవి, దులాల్‌రాయ్, అమృత్‌సింగ్ అనే గుత్తదార్లపై గావించిన ఫిర్యాదులునూ, పూర్ణియా సంస్థానంవారు, హుజూరీమల్‌పైననూ, మదన్‌దత్తాపైననూ, వారి ఏజెంట్లపైననూ, గావించిన ఫిర్యాదులూ ఇందుకు నిదర్శనాలు. అనేక సంస్థానాల్లో గుత్తలవసూలు పూర్తికాలేదు. బేరీజు అత్యధికం కావడమే ఇందుకు కారణము. గుత్తలను తగ్గించడమూ,

కొన్నిచోట్ల ఉపశమింపజేయడమూ, కూడా, జరగకతప్పింది కాదు.

గుత్త విధానం కారణంగా తాలూకాదార్లు, జమీందార్ల ఆధిపత్యము నుండి విడివడి, స్వతంత్రులవుతూ వచ్చిరి. జమీందార్లు తమ సంస్థానాల్లోని సొంత భూములకు తామే, గుత్తదార్లు కావడంకూడా తటస్థించింది. గుత్తకు తీసికొన్న పొలాలను మరియొకరికి బదిలీచేయడానికి ఇదివరకూ వీలుండేదికాదు. కంపెనీ వారిప్పుడు ఆనియమాన్ని తీసివేసి, తమగుత్తదార్లకు, బదిలీచేసే అధికారాన్ని కలుగజేసిరి. ఈ వ్యవహారాలు గుత్తదారుని స్వంతవ్యాపారాలుగా, కంపెనీ వారు పరిగణించినారు. దీని కారణంగా, పూర్వపు సంస్థానాలు ముక్కలు ముక్కలై పోయి, క్రయవిక్రయాలకు-అనువైన బజారు సరకుల క్రిందికి వచ్చినవి. ఇట్టిపరిస్థితి, కంపెనీ కొలువులోని ఉద్యోగులకూ, బనియాలకూ, లాభ కరంగా పరిణమించింది. సిల్హెట్ కలెక్టరైన థ్యాకెరే, మాంఘిర్ కలెక్టరైన బేట్మన్, మరి ఇతరులూ, తమ తమ జిల్లాలలోని పొలాలను, దొంగపేరుల తోనూ, తమ 'నల్లఏజెంట్ల' పేరులతోనూ, గుత్తకు తీసుకొన్నారు.

ఇంగ్లీషువారికీ, దేశీయులకూ కూడా, గుత్త భూముల విధానంవల్ల, లంచాలకు మంచి అవకాశం లభించింది. దక్షిణ్షహాపాజ్పూర్లోని, ఉప్పుకొఠా రుల విషయంలో కుతంత్రాలు జరిపి, లక్ష రూపాయలు సంపాదించుకొన్నారు. సర్క్యూట్ కమిటీవారు కూడా ఈ విధంగానే బాగుపడిరి. దేశీయులలో, కాంతు బాబు (హేస్టింగ్సుయొక్క బనియా) 42,432 రూపాయలనూ, శాంతిరామ్ సిన్హా (Middleton మిడల్టన్ యొక్క దివాన్) 47,000 రూపాయలనూ, భవానీమిత్రా (గ్రహాంయొక్క దివాన్) రాజషాహీ రాణీభవానీ దత్తపుత్రుడైన రాజారామక్రిష్ణావద్దనుండి 34,000 రూపాయలనూ, దర్బారు ఖర్చులక్రిందనూ పుచ్చుకొన్నారు.

ఈభూమి పరిష్కారాల ఆధారంగా, కంపెనీ అధికారులు సంపాదించు కొన్న మొత్తం 42 లక్షలని అంచనావేసినారు. అధికంగా ఉన్న బేరీజు మొత్తా లను చెల్లించలేమనేమిషపై, గుత్తదార్లు, శిస్తు విమోచనాన్ని అర్థించడం ఆరం భించినారు. ఇట్టి విమోచనాలను ఆమోదించడం తమకూ లంచాలరూపంగా లాభ కరమే కావడంవల్ల, విమోచనపు ఉత్తర్వులను సంతోషంతో జారీచేసినారు. వీరందరూ కుట్రలోని భాగస్వాములే కావడంవల్ల, వ్యవహారం సవ్యంగానే జరిగి పోయింది. కొందరు వాస్తవంగా గుత్తదార్లే. కానీ, తక్కినవారంతా నామ మాత్రానికి గుత్తదార్లై, తక్కినవారికి పొలాలను అప్పగించినవారు. కొందరు బనియాలు జమీందారులకు జామీను వహించినారు. డబ్బు సకాలంలో చెల్లించని పట్ల, బనియాలు గుత్తదార్ల అధికారాన్ని వహించిరి. అంతతో జమీందార్లే వీరిక్రింద గుత్తదార్లుగా పర్వడవలసివచ్చింది.

రైతులదుస్థితి అంతులేనిదయింది. సానుభూతికీ, దయకూ కూడా, అవకాశం లేని పరిస్థితి, వారిది. తమలాభానికి భంగం కలిగించే విషయాన్ని దేనినీ గుత్తదార్లు సహించేవారుకారు. కంపెనీవారినుండి పొందిన అమీల్నామాలు (Commissions)

వీరికి విశేషాధికారం కలుగజేసినవి. ఇదివరలో ఉండిన జమీందారీ పట్టాలను వెనుకకు తీసుకొని, క్రొత్తపట్టాలనిచ్చే అధికారం, వీరికి లభ్యమైనందువల్ల, జమీందారులు కేవలం నామమాత్రావశిష్టులై, భత్యపు ఖర్చులను (ముషైరా) పుచ్చుకొనే ఆశ్రితుల దుస్థితికి వచ్చినవారైరి. భూమిస్వామ్యములకుం, హక్కులకూ సంబంధించిన రికార్డులనూ, వసూళ్ళూ, నిలవబాకీలూ, మున్నగువానికి సంబంధించినలెక్కలనూ, సక్రమంగా వ్రాసిఉంచుతూ ఉండిన కానుంగోలు, భూవ్యవహారాల వ్యవస్థలో ముఖ్యులైనవారు శిస్తులజమలూ, డిమాండులూ, ఆస్తుల స్వామ్యానికి బదిలీకి సంబంధించిన వివరాలూ,- ఇత్యాదులనన్నిటిని వీరే వ్రాసియుంచేవారు. నూతన విధానంలో వీరి ప్రాముఖ్యం తొలగిపోయింది; వీరి ఉద్యోగాలూ పోయినవి. అంతతో, భూస్వాములపై ఇంతవరకూ ఉండిన అభ్యంతరాలూ, నిరోధాలూ తొలగిపోయినవి. ఈ విధంగా కానుంగోల పర్యవేక్షణనుండి ముక్తులైన పటవారీలు, గుత్తదారుల ఏజంట్లతో ఏకమై, అక్రమంగా డబ్బు గడించుకోడానికీ, రైతులను పీడించడానికీ ఆరంభించిరి. జమీందారుల ఒత్తిడికి లోనైన ఏజెంట్లూ, జిల్లర ఉద్యోగులూ, రైతులను నిర్బంధపరుస్తూ, డబ్బుకై బలాత్కరింపసాగిరి.

గుత్తేదారీ విధానంవల్ల గ్రామీణార్థికవ్యవస్థ కూలిపోనున్నదనీ, తద్ద్వారా, ప్రభుత్వపు ప్రధానాదాయమార్గం తెగిపోగలదనీ గ్రహించిన హేస్టింగ్సు, 1776లో, ఒక అమీనీసంఘాన్ని ఏర్పరచి, ఈ విషయాన్ని సమగ్రంగా పరిశీలించి, నివారణోపాయాలను సూచించవలసినదిగా, ఆదేశించినాడు. వారి సలహాననుసరించి, గుత్తేదారీవిధానం ఆపివేయబడింది. పూర్వపు జమీందారీ పద్ధతి పునః స్థాపితమయింది. కాని, ఈ లోపుగనే, జరుగవలసినంత హానీ జరిగిపోయింది. ప్రాచీన సంప్రదాయాను సరమైన జమీందారీ వ్యవస్థను పునః ప్రతిష్ఠగావించడము సాధ్యంగా కనబడలేదు. అందుకు కారణము లనేకములు.

ప్రథమంగా, ప్రాచీనకాలంనుండీ నిరంతరంగావస్తూ, జమీందారీ వ్యవస్థకు ప్రాణాన్నీ, ప్రతిష్ఠనూ కూర్చుచుండిన అత్యవసరములైన అంశములు నష్టమైనవి. ప్రజల ప్రాణాలనూ, వారి ఆస్తిపాస్తులనూ రక్షించేబాధ్యత, ఇప్పుడు జమీందారుకులేదు. గ్రామప్రజల్లో కలిగిన వివాదాలనూ, వ్యాజ్యెములనూ విచారణ గావించడానికిగానీ, ప్రజల హక్కులను, స్వామ్యలను రక్షించడానికిగానీ, అధికారమతనికి లేనిదయింది. గ్రామీణ సమాజాన్నంతటినీ, సుసంఘటితం చేసి, ఒక గ్రామకుటుంబంగా చేసేశక్తి జమీందారుడు కోల్పోయినాడు రైతుల నుంచి, పన్నులను వసూలుచేసి, తన భాగాన్ని మినహాయించుకొని, తక్కిన సర్కారు భాగాన్ని ప్రభుత్వానికి అందజేసే వ్యక్తిమాత్రమే అతడిప్పుడు. అట్టి అప్రధాన స్థితిని కంపెనీ వారతనికి కలిగించినారు. జమీందారు, తమకు ఆదరాన్నిచ్చి, తమ బాగోగులను గమనించే ఉదార వ్యక్తి, అనే అభిప్రాయం, నశించింది. పూర్వపు విధానంలో, ప్రజలలో జమీందారు కూడా ఒకడై, వారిసంతోషాల్లో, కష్టాల్లో

తాను కూడా భాగం పంచుకుంటూ, వారిపరంగా, అందరికోరకు, ఉత్సవాలనూ, జాతరలనూ, ఏర్పాటుచేస్తూ, వారి సాంస్కృతిక, విద్యావిషయక, కార్యకలాపాలను పోషిస్తూ, వారికి గౌరవనీయుడైన ప్రముఖుడుగా ఉండేవాడు.

మరియూ, అతని చేతులలోనున్న రాజకీయాధిపత్యం విదేశీయుల పం_స్త గతమగుటతో, అతని ప్రతిష్ఠకు భంగం కలిగింది. విదేశీయుల రాజకీయాధికారం ప్రజలవల్ల సిద్ధించిందికాదు, పరప్రభుత్వంవల్ల ఏర్పడినట్టిది. గుత్తేదారు విధానాన్నవలంబించడంవల్ల, దేశీయ వ్యావసాయికవ్యవస్థ, మూలమట్టంగా కదిలిపోయింది. గుత్తేదారులు జమీందారుపై అధికారం చలాయింపసాగిరి. అతని ఆశ్రితుల అభిమానం, నూతనులైన యజమానుల పాలయింది. తాలూకాదార్లు ప్రభుత్వానికి స్వయంగా శిస్తు చెల్లించసాగనికారంభించిరి.

అంతేకాక, కంపెనీవారు నిర్ణయించిన అధికమైన శిస్తులు జమీందారుని కూలద్రోసినవి. జమీందారీలూ, తాలూకుదారీలూ, ఈ భారాన్ని సహించలేక పోయినవి. తత్కారణంగా, సంస్థానాలు చిన్నచిన్న ముక్కలై, బనియావర్గానికి చెందిన గుత్తేదారుల చేతులలోనికి, శిస్తువసూలు ఉద్యోగుల చేతులలోనికి, రుణదాతల చేతులలోనికి పోయినవి. జమీందారులకు ఈ విధంగా కలిగిన దారిద్ర్యంకారణంగా, వారి ప్రయోజనమూ, పలుకుబడీ. పరపతీ సమాజంలో నశించిపోయినవి.

భూమిశిస్తు పరిపాలన యంత్రాంగంలో మాటిమాటికీ గావించిన మార్పులూ, బేరీజుకట్టడంలోనూ, వసూలుచేయడంలోనూ, కలిగినమార్పులూ, వ్యావసాయిక వ్యవస్థను చలింపచేసినవి. భూమి సంబంధమైన స్వామ్యం కేవలం వ్యక్తిపరమైనదిగా భావించడమూ, ఈ భావాన్ని న్యాయస్థానాలుకూడా సమర్థించడమూ, ముఖ్యకారణాలుగా, పూర్వపు వ్యవస్థ తన స్థైర్యాన్ని గోల్పోయింది. భూముల తాకట్టూ (తనఖా), అమ్మకమూ, బదిలీ,- ఇవి సాధారణవ్యవహారములై పోయినవి. సరఫరా- అవసరాల ('సప్లై, డిమాండుల') ఆవశ్యకాన్ని, అవసరాన్నిబట్టి, భూములు అమ్ముడుబోయే వస్తువుల స్థితికి వచ్చినవి.

1777లో, ఏర్పరుపబడిన జమీందారీపద్ధతి, ప్రాచీనవ్యవస్థకు ఛాయా సదృశమైనది మాత్రమే. గుత్తేదారులను తొలగించి, సాధ్యమైనంతవరకు, భూములు మరల జమీందారుల స్వాధీనంలోనికి, వచ్చినవి. అనుభోగకాలావధికి సంబంధించిన పరతులను గుర్తించి వారికి 'సన్నదుల' నిచ్చిరి. కాని, శిస్తుల చెల్లింపు పూర్తికాక, బాకీపడినపట్ల, పొలంలో కొంతభాగాన్ని అమ్మి, సర్కారుబాకీని తీర్చే పరతులను సన్నదులో చేర్చినారు. మరియు, భూముల నిర్వహణం, చక్కగా జరుగకపోతే, ప్రభుత్వం ఏజెంట్లను (సజావాలా) నియోగించి, శిస్తులు వసూలు చేయుదురనే నిబంధనకూడా దానిలో ఉన్నది.భూముల శిస్తులను బేరీజుకట్టడంలో, గత మూడు సంవత్సరాల వసూలు, మొత్తంలో, మూడవభాగం ఆధారంగా నియమితమయింది. కాబట్టి, పూర్వపు సంవత్సరాల్లో అధిక బేరీజు నిర్ణయం, అట్లే నిలిచిపోయింది. దానిని గుర్తింపక పోవడంవల్ల, శిస్తులభారం తగ్గలేదు. కనుక

స్క్రమంగా, నిర్ణీతసమయానికి ప్రభుత్వానికి శిస్తుకట్టడానికై, జమీందార్లు మళ్లీ రుణదాతలపై ఆధారపడవలసి వచ్చింది. భూములను తాకట్టుపెట్టికాని, లేక గుత్త కిచ్చికాని, అవసరమైన డబ్బును సమకూర్చుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. జమీం దారుని కష్టపరిస్థితుల నెరింగినవారైనప్పటికీ, వర్తకులు అతనికి అప్పులివ్వడానికి ఒప్పుకొన్నారు. దేశమందంతటా, వ్యాపారం సన్నగిల్లి యుండడంవల్ల, తమ ధనాన్ని మరొకమార్గంలో వినియోగించే అవకాశంలేక, వారు జమీందారుకు అప్పులిచ్చినారు.

1777 నుండీ, 1785 వరకూ, వంశపరంపరగా వారసులుగా వచ్చిన భూస్వాములను, ప్రభుత్వము, న్యాయరీత్యా గుర్తించి, ప్రతిసంవత్సర పరిష్కారం ప్రకారం భూములను వారి స్వాధీనం గావించింది. ప్రభుత్వానికి ఇవ్వవలసిన శిస్తును చెల్లిస్తూ, ఇతరనిబంధనలను పాటిస్తూ, ఉన్నంతవరకూ వారికి శాశ్వత స్వామ్యం ఉన్నట్లు గుర్తింపబడునని, నియమం గావించినారు.

1781 లో, ప్రాంతీయసభలను తీసివేయడమూ, కలెక్టర్లను మరల ఆ స్థానాల్లో నియోగించడమూ, అనేది, వారన్ హేస్టింగ్సు పరిపాలన విధానంలో గావించిన కడపటి మార్పు. భూమిపరిష్కారాల పర్యవేక్షణకై ఐదుగురు సభ్యులతో కూడిన ఒక సంఘాన్ని - రెవిన్యూకమిటీ - ఏర్పరచి, కలకత్తా దాని కార్యస్థానంగా నియమించినారు. ఆ కమిటీవారు సమావేశమై, చర్చించి గావిం చిన ప్రథమ నిర్ణయము, శిస్తులజేరీజును 26 లక్షలు పెంచడము. అవధికాలం కడప టికి, - ప్రభుత్వంవారు తలచినంత శిస్తు మొత్తము వసూలు కాలేదు. భూమి శిస్తు విధానం దేశానికొక తీవ్రమైన జబ్బుగా పరిణమించింది. దీనికి కారణాలనేక ములు. సాధ్యమైనంత ఎక్కువగా ఆదాయాన్ని, శిస్తులమూలంగా, సంపాదించ వలసిన అత్యవసరం కంపెనీకి ఏర్పడింది. కనుక 'కారన్ వాలీసు' శిస్తుల జేరీజును అత్యధికంగా పెంచవలసి వచ్చింది. పైగా, శిస్తుల వసూలుకై, అతడు గావించిన ఏర్పాట్లు నిర్బంధముతోనూ, బలాత్కారంతోనూ, కూడినట్టివి.తర్వాత, కుటుం బంలోని జేష్ఠపుత్రునికి మాత్రమే ఆస్తిపై హక్కుగలదనే నియామాన్ని రద్దుచే యడం, మూడవమార్పు. ఈ మార్పువల్ల, భూమి చిన్న చిన్న చీలికలుగా ఏర్పడిపోయే పరిస్థితి ఏర్పడింది. భూస్వామ్యమునకు, సంబంధించిన ప్రధానమూల సూత్రం, మార్చివేయడం జరిగింది. ఈ మార్పువల్ల భూమిపైగల స్వామ్యము, సర్వతంత్ర స్వాతంత్ర్యంగా, సిద్ధించింది. భూమిని సాగుచేసి అనుభవిస్తున్న రైతుల ఆస్తులను జప్తుచేయడానికీ, అమ్మడానికీ కూడా, భూస్వామికి అధికారం ఏర్ప డింది. ఈ మార్పు కడపటిది.

పరిపాలన విధానంలో కారన్‌వాలీస్ అవలంబించిన విధానములన్నిటికీ, దేశీయునిపట్ల అతనికిగల అవిశ్వాసమే మూలకారణము. "మన పాలనలోఉన్న ప్రజలకు అత్యంతమైన సౌఖ్యాన్నికూర్చడమే మన ఆశయము. కాని, దేశపాలన విషయంలో, నియమనాలను (Regulations) చేయడంలో దేశీయులు పాల్గొన డము. నేను తలపజాలని విషయము,- అని అతడు ఖండితంగా వ్రాసియుంచి

నాడు. అతడు స్థాపించిన పరిపాలన విధానంలో, సమస్తములైన ఆర్థిక, పరిపాలక విధానాల వినియమాలనూ, శాసనాలనూ కల్పించే బాధ్యత, పూర్తిగా బ్రిటిషువారికే అప్పగించినాడు. వాటిని నిర్వహించే అధికారస్థానాలలో కూడా బ్రిటిషువారినే నియోగించినాడు. "సక్రమబద్ధులైన పలువురు యూరోపియనులతో కూడిన సంస్థయొక్క సాహాయ్యముంటేనే తప్ప, అమూల్యమూ, అత్యంత ప్రయోజనకరమూ ఐన, ఈ రాజ్యభాగము మన అధికారాధిపత్యాలలో స్థిరపడజాలదు."— అని అతడు డైరెక్టర్లసభకు వ్రాసియున్నాడు. ఈ విధానము, సివిల్ సర్వీసు అధికారులపట్లా, సైనికాధికారాలపట్లా కూడా వర్తింపజేసినారు.

బెంగాలును జయించి, ఆక్రమించడంతోనే, అగ్రాధికారాలన్నీ, చాలవరకు, కంపెనీవారి బ్రిటీషు అధికారులకు అప్పగింపబడినవి. 1765 నుండీ, 1786 వరకూ జరిగిన పరివర్తన, మధ్యదశలో అధికారపదవులలో ఉండిన భారతీయులనందరినీ, క్రమంగా తొలగించి, ఆ స్థానాల్లో బ్రిటీషువారిని, నియమించింది. కట్టకడపటికి అట్టి పెద్ద పదవులనుండీ, భారతీయులను పూర్తిగా బహిష్కరించడం మాత్రమేకాక, అనేకములైన క్రింది ఉద్యోగాలకు కూడా, అవకాశం లేకుండా చేసింది.

కారన్‌వాలీసు యొక్క ప్రభుత్వవిధానమంతా రెండు అభిప్రాయాలపై ఆధారపడింది. ఆసియావారికంటే, బ్రిటీషువారు అన్ని విధాలా సర్వోత్కృష్టులని ఇతడు నమ్మడము, ఒకటి. ఈ సూత్రాన్ననుసరించి, సర్వమూ ఆంగ్లీకృతమైననే తప్ప, ప్రజల ప్రయోజనానికి సమర్థమైన ప్రభుత్వము ఏర్పడజాలదనడము, రెండవది. బాధ్యతతోకూడిన పదవులలో భారతీయులను నియోగించడంవల్ల బ్రిటీషు సామ్రాజ్యానికి ఎప్పటికైనా ముప్పు కలుగుతుందనే భయం, ఎల్లప్పుడూ ఉన్నదే. "ఇట్టి ముఖ్యపదవులకు బెంగాలీలు యుక్తమైనవారు కార"ని అతడు బాహాటంగా ప్రకటించినాడు కూడా.

ఐనా, క్రింది ఉద్యోగాలన్నటిలోనూ, యూరోపియనులను నియోగించడము, ఆర్థికంగానూ, ఇతర కారణాలవల్లనూ కూడా, సాధ్యమైనదికాదు. బ్రిటీషువారు స్థాపించిన ప్రభుత్వవిధానాన్ననుసరించి, ఇదివరలో భూస్వాముల అధీనంలో ఉండిన, పరిపాలన కర్తవ్యాలన్నీ ప్రభుత్వం నిర్వహించవలసి వచ్చింది. న్యాయపాలనము, పోలీసుపరిపాలన, శిస్తుసంబంధపరిపాలన, న్యాయస్థానపాలన, పౌరనిర్మాణవ్యవస్థ,- ఇత్యాదులకు సంబంధించిన పాలనశాఖలలో, క్రింది ఉద్యోగు, లసంఖ్యాకంగా అవసరమైనారు. నెలకు 250 రూపాయలకు మించని,- అమీను, మునసిఫ్, తానేదార్, తహసీల్దార్, మరి ఇతర- ఉద్యోగాలన్నిటికీ చిన్న ఉద్యోగస్థుల ఆవశ్యక మేర్పడింది. కనుక, దివాన్, నయాబ్‌దివాన్, గోమాస్తా, పెద్ద గుమాస్తా, శిరస్తాదార్, మున్షీ, మొహర్రిర్, జమేదార్, ప్యూన్,- వంటి, మూడున్నర రూపాయలనుండీ నూరురూపాయల జీతంవరకూ గల పనులలో, దేశీయు లనేకులను నియమించక తప్పిందికాదు.

న్యాయస్థానాలలోని అభియోగాలలో వాదిప్రతివాదుల తరఫున వాదించ

డానికై, ప్రభుత్వప్రాయమైన దేశీయన్యాయవాదుల సంస్థ నొకదానిని ఏర్పర చిరి. వీరికి లభించవలసిన రుసుమును (ఫీజు) కూడా ప్రభుత్వమే నిర్ణయించింది.

దేశప్రజలకు ఈ ప్రభుత్వవిధానం కలిగించినదుస్థితి, నిరాశా ఘూయిష్ఠమై నది. అగ్ర వర్గాలవారికి పూర్వంలో ఉండిన ఉద్యోగావకాశాలూ, మార్గాలూ, లో పించినవి ఉన్నత పరిపాలన విధానంలో, అనుభవం సంపాదించుకోడానికి కావల సిన అవకాశాలకు వీరు దూరులైరి. దేశప్రయోజనం కొరకు చేయవలసిన విశాల విధానాలను ఏర్పరచే సదవకాశాలు వీరికందకుండా చేసినారు. ఈ పరిస్థితులు, మధ్యతరగతులవారి శీలస్వభావాలనూ, దృక్పథాన్నీ సంకుచితమొనర్చినవి. బాధ్యత వహించగల నాయకత్వం దేశంలో, తలయెత్తడానికి వీలులేకపోయింది. కారన్ వాలిస్ యొక్క ప్రభుత్వవిధానాన్ని గూర్చి వ్రాస్తూ, 'ఆస్పినాల్' (Aspinall) అనే ఆయన, "కంపెనీ వారి ప్రభుత్వం క్రింద పతితులైన ప్రజను, ఇంకనూ హీన మైన, నికృష్టమైన స్థితికి తెచ్చుటకే, కారన్ వాలిస్ విధానం ఉద్దేశించింది, కాని, వారిని పైకి తెచ్చుటకుకాదు." అని విమర్శించినాడు.

వాణిజ్య భాగంలో అవలంబింపబడిన విధానంకూడా, ఇట్టి ఫలితాలనే కలి గించింది. ఇదివరలో పెక్కువిధానాలనుసరింపబడినవి, కాని ఏవీ పూర్తిగా సంతృప్తికరములు కాలేదు. దాధ్నీ వర్తకులతోనూ, గోమాస్తాలతోనూ, దలాలు లతోనూకూడిన దేశీయపద్ధతులు అధికార దుర్వినియోగానికి దారితీసినవి. దాని వలన కలిగిన దుష్ఫలితాన్ని సవరించడానికి, యూరోపియను వర్తకులతో ఒక వ్యాపారసంఘాన్ని (Board of Trade) స్థాపించవలసి వచ్చింది. తరవాత, దీన్ని తొలగించి, కర్మాగారాల అధ్యక్షుల ఒప్పందములతోకూడిన పద్ధతిని ప్రవేశ పెట్టడం అవసరమయింది. కాని, ఈ పద్ధతికూడా, విఫలమయింది. 1857 లో, ఏజెన్సీ పద్ధతిని కారన్‌వాలీసు అమలుపరచినాడు. రెండేండ్లతర్వాత దానిని సార్వత్రికము గావించినాడు. ఆంగ్లేయులు స్థాపించిన ఏజెన్సీసంస్థలలో, కంపెనీ ఉద్యోగులనేకులు ప్రవేశించిరి. కొందరు ఉద్యోగాల నుండి విరమించుకొని, ఈ సంస్థలలో డైరెక్టర్ల పదవులనూ, మానేజర్ల పదవులనూ ఆక్రమించిరి. ఈ సంస్థల నిర్వహణకు అవసరమైన ధనమంతా, కంపెనీ ఉద్యోగుల పెట్టుబడివల్ల సిద్ధించింది. తాము నిలువచేసుకొన్న సంపాదననంతా ఉద్యోగులు ఈ సంస్థలలో ప్రవేశపెట్ట లేదు. అట్లు పెట్టడానికవకాశమూ లేదు. ఈ సంస్థలలో భాగం వహించడానికి దేశీయులు ఇష్టపడలేదనీ, వారికి పెట్టుబడిపెట్టే సామర్థ్యంలేదనీ, కల్లప్రచారం గావించి, బ్రిటీషువారు తమ ప్రత్యేకతాభావాన్ని సమర్థించుకొనిరి.

1788లో, కంపెనీ ఉద్యోగుల స్వంతవ్యాపారాన్ని అంతమొందించడంతో, 1300 మంది బ్రిటీషు ఉద్యోగులు నష్టపడిరి. ఈ చర్య, ఏజెన్సీసంస్థలకు లాభదా యకమయింది. తమతో, లాభాల విషయమై, పోటీచేస్తూఉండిన కంపెనీ ఉద్యో గులు బైటికిపోవుటతో, వ్యాపార లాభమంతా, ఏజెన్సీకే మిగిలింది.

1789 నుండీ, ఏజెన్సీసంస్థల సంఖ్యా, వారికార్యకలాపాలూ విస్తరించినవి. దేశవ్యాపారాన్ని తమ అధీనంచేసుకొని, నీలిమందు, చక్కెరల ఉత్పత్తికిపెట్టు

బడిపెట్టి, సర్కారు ఋణపత్రాలతో వ్యాపారం జరిపి, బ్యాంకింగునూ, భీమా వర్తకాన్నీ జరిపి, ఈ సంస్థలు లాభదాయకములైన అన్నివ్యవహారాలనూ, ఆక్రమించినవి. నౌకాధికారుల గృహోన్ముఖవ్యాపారాన్ని నిర్వహించడమూ, విదేశ కంపెనీలపై ఉన్నహుండీలను మార్చడమూ, ప్రతివాదివిషయక వ్యవహారాన్ని నడపడమూ, మొదలైన పనులన్నీ నిర్వహిస్తూ వచ్చినవి. ఈ ఏజెన్సీసంస్థలవారు, లండనులో తమకార్యాలయాలను నెలకొల్పి, ఇండియానుంచీ పంపబడిన డబ్బు నుచేరవలసిన వారికి చేర్చేవారు. దేశీయవ్యాపారంపై ప్రత్యేకమైన ఆధిపత్యము సంస్థలకు లభించింది.

నూతనవాణిజ్య విధానాన్ని అవలంబించడంవల్ల, దేశీయులు విదేశ వ్యాపారమునుండి బహిష్కృతులు కావడము మొదటిఫలితము. గోమాష్టాలూ, దలాలులూ, పైకారులూ, తమఉద్యోగములను గోల్పోయిరి. పెట్టుబడిదార్ల జాబితానుండి దేశీయులపేర్లు మాయమైనాయి. ఢక్కాలో ఏజెంట్లుగా పనిచేస్తున్న వారిలో (1789లో) నూరుమంది తమవృత్తిని పోగొట్టుకున్నారన్న దాన్నిబట్టి, నిరుద్యోగసమస్య ఎట్టిదయిందో, ఊహించవచ్చు. ఏజెన్సీవిధానము, అభివృద్ధి పొంది, వ్యాపార కర్తవ్యాలనూ, బ్యాంకింగు కర్తవ్యాలనూ చాలవరకు తన అధీనం చేసుకోవడంతో, ఈ శాఖలో అభ్యుదయావకాశాలు భారతీయులకు పూర్తిగా లోపించినవి.

నూతన వాణిజ్యవిధానంలోని ఈ నిర్బంధనలు, అభివృద్ధిచెందుతున్న మధ్యతరగతివారిని, బాధించలేదు. దేశీయులైన ఏజెంట్లు, ఆంగ్ల ఏజెన్సీ సంస్థలకంటే చవుకగా (Cheap) ఉండటంవల్లనూ, ఎక్కువ ఓర్పుగలవారు అగుటవల్లనూ, ఇతర యూరోపియను వర్తకులు వీరికి ప్రాపకమిస్తూ వచ్చినారు. (ఈస్ట్ యిండియా కంపెనీపై తమకుగల అసూయ కూడా ఈ ఏజెంట్లకు సహాకరించింది).

తమకు కలిగిన నష్టాన్ని, దేశీయులు మరొకమార్గంలో కూడా సర్దుకుంటూవచ్చిరి. ఇండియానుంచి ఎగుమతియగుచున్న సరకులస్వభావంలో, మార్పు కలిగినా, మొత్తం ఎగుమతుల యొక్క విలువ తగ్గలేదు. ముడిపట్టును సమకూర్చడము బ్రిటీషువారి జాతీయ ప్రయత్నమయింది. ఇదివరలో, గుడ్డలకు (Piece-goods) ఉన్న ప్రాధాన్యం తగ్గి,- ముడిప్రత్తీ, ముడిపట్టూ, చక్కెరా, నీలిమందూ, జనపనార, గోగునార, మరి ఇతర ముడిపదార్థాలకూ, ఎగుమతులలో ప్రాధాన్యం ఏర్పడింది. పట్టువస్త్రాలను ఇండియానుంచి ఇంగ్లాండుకు దిగుమతి చేయడం నేరంగా పరిగణింపబడి, శిక్షకు గురిఅయింది. దాని స్థానం, నీలిమందు ఆక్రమించింది. కంపెనీవారు ఎక్కువగా, నీలిమందుపై, పెట్టుబడి పెట్టినారు.

భారతదేశ వ్యాపారంలో అధికసంఖ్యాకులుగా ప్రవేశిస్తున్న, స్వతంత్ర ఆంగ్లేయవర్తకులు, ఈస్ట్ఇండియా కంపెనీవారి ఏకైకస్వామ్యానికి, పైపోటీగా, నిలిచిరి. ఈ స్వతంత్రవర్తకులు, తాము కొన్నసరకులను, యూరోపుఖండ దేశాల్లో అధిక సౌలభ్యంతో విక్రయించగలరు. ఆ కారణంగా, వీరు భారతదేశీయ

సరకులను ఎక్కువధరలకు కొనగలిగినారు ఇట్టి సౌకర్యము కంపెనీకి లేదు. స్వతంత్రవర్తకులు తాముకొన్న సరకులను, చౌకగా విదేశనౌకలలో, కోపెన్ హేగెన్, ఆస్టెండ్, లెగ్‌హారన్, మొదలైన యూరోపు రేవుపట్టణాలకు సులభంగా పంపగలిగేవారు. కనుక, 1790 నాటికి, దక్కానుండీ స్వంతవ్యాపారంలో ఎగుమతియైన సరకుల విలువ 14 లక్షలు. కాగా, కంపెనీవారి ఎగుమతులు 7 లక్షలు మాత్రమే, ఐ, యుండడం వింతకాదు. ఈ కాలంలో, స్వంతవ్యాపారం ఎక్కువగా అభివృద్ధిచెందింది. 1781-1790 ప్రాంతంలో, కంపెనీవారి ఎగుమతుల భాగం 14 శాతంకు తగ్గింది. దిగుమతులు 18 శాతం తగ్గినవి. స్వంతవ్యాపారం యొక్క ఎగుమతులు 10 శాతం నుంచి 43శాతంవరకూ పెరిగినవి.

వాణిజ్యాభివృద్ధికి చెందిన వివరాలు గమనింపదగినవి. 1776-77 సంవత్సరంలో, ఇంగ్లాండునుంచి ఇండియాకు దిగుమతియైన సరకుల విలువ (సరకులు, సామానులు, బంగారం, కలిసి), 626,893 పౌనులు. 1785-86 నాటికి, అది 1253,482 పౌనులకు పెరిగింది; 1793-94 సంవత్సరానికి 1346,04 పౌనులు అయింది. యూరోపునుంచి, ఇండియాకు దిగుమతియైన సరకుల విలువ 1781-91 నాటికి 2393,610 పౌనుల విలువగలది. అందులో కంపెనీయొక్కభాగం 346,070 పౌనులు మాత్రమే. అనగా 14 శాతం మాత్రమే. అదేకాలంలో, ఇండియానుంచి ఎగుమతియైన సరకుల విలువ 7331,669 పౌనులు. ఇందులో కంపెనీవారిభాగం 1962,095 పౌనులు. అనగా 27 శాతం మాత్రమే.

విదేశీయ, సముద్రతీరవాణిజ్య, భూప్రాంత, వాణిజ్యాభివృద్ధులు, దేశీయ వ్యాపారవర్గంవారియొక్క అభివృద్ధికి, దోహద మొనర్చినవి. ఎగుమతి దిగుమతులకు కావలసిన సరకుల అభివృద్ధి సరఫరాలకూ, అవసరాలకూ కావలసిన మొత్తాన్ని పూర్తిచేయడమేకాక, దేశాంతర్భాగంలో వాటి సరఫరానుకూడా అభివృద్ధి చేసింది. సర్కారు ఉద్యోగులు తప్ప, తక్కిన యూరోపియనులు, దేశపు అంతర్భాగాల్లో నివసించడానికి వీలులేనందువల్ల, అంతర్దేశీయవ్యాపారంలో అధికభాగం, దేశీయుల హస్తగతమయింది. వ్యాపారవిధానంలో జరిగిన మార్పు, బ్యాంకింగు, పరపతిరంగాల్లోకూడా సమానమైన మార్పులను దెచ్చింది.

కంపెనీవారి తొలిరోజుల్లో 1788 వరకూ, దేశీయబ్యాంకర్లూ, షరాపులూ లాభకరమైన వ్యాపారాన్ని సాగించినారు. ఇంగ్లాండునుంచి దిగుమతియైన రూకలపైననూ, దేశంలో చెలామణిలోఉన్న ఇతర నాణెములపైననూ, ఆంగ్లేయుల వ్యాపారం ఆధారపడి యుండేది. ఆ పద్ధతి దేశీయ వ్యాపారస్థులకూ, షరాపులకూ లాభం కలిగించింది. తన చెలామణీ నాణ్యాలను ముద్రించుకోవడానికి, మొఘలు ప్రభుత్వపు అనుజ్ఞను సంపాదించుకొని తద్వారా, భిన్నభిన్న నాణ్యాలను తొలగించడానికి, కంపెనీ ప్రయత్నించింది. కాని, 1757 వరకూ, అట్టి అనుజ్ఞ లభింపలేదు. ఆ తర్వాతనే, తన నాణ్యాలను కంపెనీ స్వయంగా ముద్రించడమారంభించింది. 1757 అనంతరం, ఇంగ్లాండునుండి దిగుమతియగుచుండిన బంగారం ఆగిపోవడంవల్లనూ, చైనా ప్రయోజనార్థం, బెంగాలురూకలు దోపిడియగుట

వల్లనూ, మదరాసు బొంబాయి ప్రాంతాలలో ఏర్పడిన కొరతను పూడ్చుటకు కంపెనీ పూనుకోవడంవల్లనూ, కంపెనీ ఉద్యోగులు ఎగుమతి చేయడానికై సరకులను కొనడంవల్లనూ, నాణ్యముల చలామణిలోనూ, ప్రామాణికకరెన్సీలోనూ, సమస్యలేర్పడినవి. ఈ సమస్యలను పరిదిద్దడానికై చేసిన ప్రయత్నాలు విఫలమైనవి. నాణ్యాలను తయారు చేయడానికి 1786 లో, బంగారం ఉపయోగింపబడింది: కాని, మూడుసంవత్సరాల అనంతరం ఆ ప్రయత్నం ఆపివేయబడింది. ఒక్కటితప్ప, తక్కిన టంకశాలలన్నియూ మూసివేయబడినవి. కాని దాని ఉత్పత్తి, చెలామణికి చాలినది కాలేదు. జిల్లాలలో భిన్న భిన్న నాణ్యాలచలామణీ తప్పలేదు. ఈ అవకాశాలను ఉపయోగించుకొని, సరాఫులు నాణెములపైనా, మారకంపైనా ఏకైకస్వామ్యాన్ని సంపాదించుకొని, జిల్లాలన్నిటిలోను, తమ ఏజెంట్లను నియమించి, లాభాన్ని పొందిరి. పన్నులను, నాణెములరూపంలో వసూలు చేయడానికీ, ప్రభుత్వానికి శిస్తుచెల్లించడానికీ సాధ్యంకాక, కష్టపడుతున్న జమీందార్లకు, ఈ వర్తకుల ఏజెన్సీలు సహాయపడినవి.

వీరిపలుకుబడిని కూడ, కారన్ వాలీస్, త్వరలో తగ్గించివేసినాడు. ఈ వర్తకులు బాగుపడడానికి అవకాశాలను కలిగించిన కల్లోలపరిస్థితులను నిర్మూలించడానికి తగినచర్యలను ఆరంభించినాడు. అనేక పట్టణాలలో టంకశాలలను స్థాపించి, చెలామణీనాణెముల సంస్కారాన్ని గావించెను.

బంగారుకూ వెండికీ విలువలో తారతమ్యాన్ని పదహారుకు ఒకటిగా నిర్ణయించినాడు. ("ద్విధాతుమానం") మిశ్రలోహనాణెములను ప్రవేశపెట్టి, కరెన్సీలో, నూతన ప్రయోగం ఆరంభించినాడు. పురాతన కాలంగా, చెలామణీలో ఉన్న, 'చౌరీ'ని(అన్నిటిలోనూ చిన్ననాణెం) తీసివేసి, దాని స్థానంలో రాగినాణెములను ప్రవేశపెట్టినాడు. కొంతవరకూ కరెన్సీ ప్రయోజనమూ, అంతకంటే ముఖ్యంగా, ఇంగ్లాండు నుండి రాగిని దిగుమతి కావించడమూ, - ఈ సంస్కారము యొక్క ఉద్దేశాలు. దీనివల్ల బ్రిటీషు వ్యాపారానికీ, బ్రిటీషు పడవలకూ కూడ, లాభంకలిగింది. ఈ సంస్కారాలు దేశీయులైన బ్యాంకర్ల వర్తకాన్ని పడగొట్టి, వారివ్యాపారం ఏజెన్సీ సంస్థలకూ, క్రొత్తగా నెలకొల్పిన ఇతర బ్యాంకులకూ, బదిలీయగునట్లు చేసినవి.

క్రొత్తగా స్థాపితములైన బెంగాలు బ్యాంకు, జెనరల్ బ్యాంకు, మున్నగు వానితో, దేశీయబ్యాంకులు పోటీచేయలేక పోయినవి. క్రొత్తబ్యాంకులకు ప్రభుత్వంయొక్క ప్రాపకమూ, ఆదరమూ, కలవు. కాగితపు కరెన్సీ (నోట్ల చెలామణీ)ని, వాడే అవకాశంకూడా వీటికి లభించింది. నోట్లచెలామణీ విధానం. దేశానికి క్రొత్తకావడంవల్ల, దేశీయులకు అర్థం కాలేదు. మరిన్ని, సమస్తమైన విదేశవ్యాపారమూ, అంతర్దేశీయవ్యాపారంలో ఎక్కువభాగమూ, ఇదివరకే విదేశీయుల హస్తగతమైపోయి యుండడంవల్ల దేశీయబ్యాంకులకు, వాటి ప్రాపకం లేకపోయింది.

కాని, కంపెనీకి పెట్టుబడిని సమకూర్చే విధానాన్ని మార్చుకొని,

బ్యాంకింగులో కలిగిన ఈ నష్టాన్ని కొంతవరకు సరిదిద్దుకోగలిగినారు. ప్లాసీ యుద్ధానంతరం, కొంతకాలందాకా, పెట్టుబడి అవసరాలకు, బెంగాలుప్రభుత్వపు పన్నుల ఆదాయాన్ని కంపెనీవారు ఉపయోగిస్తూ వచ్చిరి. కాని, పరిపాలన వ్యవస్థకు సంబంధించిన ఖర్చులు ఎక్కువ కావడంవల్లనూ, యుద్ధాలఖర్చులకు అధికంగా ధనం అవసరము కావడంవల్లనూ, సర్కారు ఆదాయం ఈ అవసరాలను తీర్చడానికి సమర్థం కాలేదు. కావున, కంపెనీయొక్క వ్యాపారం సార్వజనిక రుణాల ఆధారంపై జరుపవలసి వచ్చింది. కోశప్రమాణపత్రాలనూ, బాండులనూ విడుదలచేసి, ఇతరవ్యయములను నిర్వహించవలసి వచ్చింది. అప్పుడు నెలకొని యుండిన పరిస్థితులనుబట్టి, ఎక్కువవడ్డీపై, సార్వజనిక, రుణాలను సంపాదింప వలసిన పరిస్థితి కలిగింది. 12 శాతం వడ్డీ సర్వసాధారణమైనదే. కంపెనీవారి బాండ్లపై రుసుము (Commission) బెంగాలులో 18 శాతమూ, మదరాసు బొంబాయీలలో, 30 నుండి 40 శాతమూ ఐ ఉండినది. విదేశవాణిజ్యమునుంచి, సముద్రతీరవ్యాపారమునుంచి, బ్యాంకింగు వ్యాపారమునుంచికూడా, బహిర్గతులైన దేశవర్తకులు, ఈ అవకాశాన్ని పురస్కరించుకొని, తమ డబ్బును కంపెనీవారి రుణపత్రాలలోనూ, బాండులలోనూ, పెట్టుబడిపెట్టుతూ వచ్చిరి.

"బెంగాలు విదేశవ్యాపారపత్రిక" (Reporter on the External Commerce of Bengal) ఈ విషయమై - "పూర్వం, బంకుకొంకులతో వెను కాడుచుండిన దేశవర్తకు డిప్పుడు సముద్రవాణిజ్యానికి అవసరమైన డబ్బును, 'కోరెస్ పాండెంట్' పద్ధతిపై అప్పుగా ఇస్తున్నాడు; ప్రపంచంలోని భిన్న ప్రదేశాలలోని చట్టా వ్యాపారంలో పాల్గొంటున్నాడు; అనేకములైన భీమా కంపెనీలకు హామీదారుగా ఉంటున్నాడు, బెంగాలు పలుప్రదేశాల్లో నీలిమందు తయారుచేస్తున్నాడు. వాణిజ్యవ్యాపారాలకు సంబంధించిన బ్రిటీషు న్యాయ సూత్రాల విషయంలో, ఇతర యూరోపియను వర్తకులతో సమానమైన పరిజ్ఞానాన్ని సంపాదించుకొన్నాడు." అని వివరించింది. ప్రభుత్వం మార్కెట్టులో విడుదలచేసిన సార్వజనిక, రుణపత్రాలలో చాలభాగం దేశవర్తకుల హస్తగతమై యుండడం కారన్ వాలీసు గమనించినాడు.

పరిపాలన విధానంలోనూ, వ్యాపారపద్ధతులలోనూ కలిగిన మార్పుల ననుసరించి, యూరోపియను యజమానులకు అధీనులై, పరిపాలనరంగంలోనూ ఆర్థికరంగంలోనూ, సేవచేయుచుండిన దేశీయవర్గమొకటి, ఏర్పడింది. పాశ్చాత్య పరిపాలన పద్ధతులతోనూ, సర్కారు వ్యవహారాలను నిర్వహించే మార్గాలతోనూ, బాగా పరిచయం సంపాదించుకొన్న విశాలమైన సేవాజనవర్గంకూడా దేశంలో ఏర్పడింది. శాసనాలనూ, నియమనాలనూ, ప్రవర్తింపజేయుటలో, బ్రిటీషువారికి తోడ్పడుతూ, నూతన ప్రభుత్వ విధానానికీ, మధ్యకాలపు ప్రభుత్వవిధానానికీగల తారతమ్యాన్ని వీరు చక్కగా గ్రహిస్తూ, గుర్తించుకొంటూ వచ్చినారు. నాగరకతా ప్రవర్తనల విషయంలో, తమకునూ, పాశ్చాత్యపాలకులకునూ, గల భేదాన్ని గుర్తించడంతో, జాతికీ, జాతీయతకూ గల వైవిధ్యమూ, భిన్నత్వమూ,

వీరి మనస్సులలో నూతన భావచైతన్యం కలిగించింది. వీరిలో కొందరు తగినంత ధనాన్ని సంపాదించుకొని యుండిరి. ఇతరులు, తమ అధికారపదవులను ఆధారంగా చేసుకొని, స్థిరాస్తులను సంపాదించుకొని యుండిరి. కలకత్తాలోనూ, ఇతర పట్టణాల్లోనూ, ఇండ్లూ తోటలూ, గ్రామసీమల్లో భూములూ,- వీరు సంపాదించుకొన్నారు. అంతర్దేశీయవ్యాపారంలోనూ, వర్తకంలోనూ, ఉద్యోగాల్లోనూ కూడా పాల్గొంటూ వచ్చినారు.

ఈస్ట్ ఇండియా కంపెనీ నిర్వహింపవలసిన రెండు కర్తవ్యాలుగా సాగించుటకై, కారన్ వాలీసు స్థాపించిన పరిపాలన వ్యవస్థ, నలభై సంవత్సరాల కాలం,- పెద్దమార్పులకు లోనుగాక, నడిచింది. వాణిజ్యసంస్థ (Board of Trade) ప్రతి జిల్లాలోనూ, వాణిజ్య ప్రతినిధులను నియోగించుకొని, అత్యుచ్చ సభ (Supreme council) యొక్క, ఆదేశానుసారంగా, తన వ్యాపార వ్యవహారాలను 1835 వరకూ, సాగిస్తూనే ఉండింది. ఇండియా, వాణిజ్యంలో, కంపెనీ అనుభవిస్తూండిన ఏకైక స్వామ్యం తొలగి, (1813) వ్యాపారం క్షీణించిన తర్వాత కూడా, వీరి వ్యాపార విధానంలో మార్పు, ఎక్కువగా కలుగలేదు. జిల్లాలలోని వ్యాపార ప్రతినిధుల సంఖ్యను, తగ్గించడ మొకటే ముఖ్యమైన మార్పు. సాధారణ పరిపాలన, రెవిన్యూ పోలీసు, న్యాయపరిపాలన,-ఈ విషయాల యంత్రాంగంమాత్రం, కొద్దిగా పరివర్తనం పొందింది. పరిపాలన నిర్వహణ శాఖకూ, న్యాయపరిపాలనశాఖకూ, ఇంతవరకూ వుండిన నిష్కృష్టమైన ప్రత్యేకతను సడలించి, కలెక్టరుయొక్క అధికారాలను, ఎక్కువచేసినారు. దీనితో- కలెక్టరు జిల్లాకు అంతటికీ, ప్రభుత్వం తరపున, ప్రధానుడైన ఏజెంటుగా, ఏర్పడినాడు. న్యాయపరిపాలనశాఖకూ, పోలీసుశాఖకూగల ప్రయోజనాలు గుర్తింపబడి, గమనింపదగినమార్పులు,-ముఖ్యంగా నేరముల విషయంలో,-గావింపబడినవి. శాసనవ్యవస్థకూ, పరిపాలన వ్యవస్థకూలోబడి, కంపెనీ ప్రభుత్వం, జరుగుతూ వచ్చింది. ఆర్థిక విషయాలకునూ, ఇతర విషయాలకునూ, సంబంధించిన దేశ వ్యవహారాలుకూడా, నిర్వహింపబడుతూ వచ్చినవి.

కారన్ వాలీసు ఉద్యోగవిరమణ కాలంనుండీ, (1793) కంపెనీవారి శాసనపత్రం (Charter) పునరుజ్జీవనం (Renewal) పొందేవరకూ (1813) గల మధ్యకాలము అధికమైన శ్రమప్రయాసలకూ, ఒత్తిడికీ, లోనైనది. యూరోపు రంగంలో,-ఇంగ్లాండు నిరంతరమైన యుద్ధాన్ని ఫ్రాన్సు దేశంపై సాగిస్తూ వచ్చింది. నెపోలియను సాధించిన యూరోపు విజయమువల్లనూ, ఇంగ్లాండు వర్తకాన్ని బహిష్కరించడానికి ఏర్పడిన యూరోపుఖండపు వ్యవస్థవల్లనూ (Continental system), హాలెండువంటి దేశాలు బ్రిటీషువారికి విరుద్ధంగా నిలిచినవి. తర్వాతికాలంలో, అమెరికా సంయుక్త రాష్ట్రాలుకూడా, బాహాటంగా బ్రిటీషు వారి కెదురు నిలిచినవి. ఇండియాలో, మైసూరు, మహారాష్ట్రరాజ్యాల కూటమితో బ్రిటీషువారికి యుద్ధమేర్పడింది.

పశ్చిమరంగంలోనూ, తూర్పురంగంలోనూ ఈ విధంగా బ్రిటీషు ప్రయో

జనాలకు భంగకరములైన విరుద్ధపరిస్థితులు ఏర్పడడానికి ఉద్దేశములుండినవి. రాజకీయరంగాలలో బ్రిటిషువారికి ఏర్పడియుండిన ప్రబలనాయకత్వాన్ని నశింపజేయడం ప్రథమోద్దేశము. వాణిజ్యరంగంలో బ్రిటను స్థాపించుకొని యుండిన తూర్పుఖండాల ఏకైక స్వామ్యాన్ని నిర్మూలించడం ద్వితీయోద్దేశం. ఆ కాలంలో ఇండియాగవర్నరు జెనరలు పదవులందుండిన వెల్లెస్లీ, మింటో, హేస్టింగ్సులు ఈ పరిస్థితులనూ, వాటి ప్రాధాన్యమునూ, బాగుగా గుర్తించినవారే. కనుకనే, ఇంగ్లాండులోని కంపెనీడైరెక్టర్లు ఆర్థికపరిస్థితులనువల్ల, సామ్రాజ్యప్రయోజనాలను గమనింపని సందర్భాలలో, తామే స్వయంగా, సామ్రాజ్య ప్రయోజన రక్షణకు తగిన, స్వతంత్రచర్యలను తీసుకొంటూ వచ్చినారు. ఈ విషయంలో తమ యజమానుల ఆజ్ఞలకు విరుద్ధంగా ప్రవర్తించడానికి కూడా వీరు వెనుదీయలేదు. కనుక, ఇట్టిపరిస్థితులలో, వ్యాపారవాణిజ్య విషయాలూ, సామ్రాజసంబంధములైన విషయాలూ, ఏకంగా, మిళితంకాక తప్పదు ఒకదాని అవసరాలనూ ప్రయోజనాలనుబట్టి రెండవదికూడా, తదనుగుణంగా ప్రవర్తింపక తప్పదు. ఇటువంటి పరిస్థితుల ప్రాబల్యంవల్ల ఇండియాలోని కంపెనీ స్థావరములకు, రాజ్యభాగాలకు సంబంధించిన ఆర్థికవ్యవస్థలో మార్పులేర్పడినవి. ఈ మార్పులు భారత ప్రజాజీవితంలో ముఖ్యపరిణామాలను కలిగించినవి.

వాణిజ్యరంగంలో పలువిధములైన ప్రవృత్తులు ప్రాధాన్యం వహించినవి. యూరోపుయుద్ధాలూ, ఇండియాలోని యుద్ధాలూ, జరుగుతూఉన్నా, ఇండియా యొక్క మొత్తం వాణిజ్యం తగ్గలేదు. అంతర్దేశీయ, విదేశీయ, తీరదేశ వ్యాపార వాణిజ్యములన్నీ, అభివృద్ధి చెందుతూనే ఉన్నందున, సరకుల మొత్తమూ, దాని విలువకూడా పెరిగింది. బ్రిటనుమాత్రమే కాక, అనేక ఇతర పాశ్చాత్యదేశాలకు ఎగుమతి దిగుమతి వాణిజ్యంలో భాగముండినది. ఫ్రాన్సు, హాలెండు పోర్చుగల్, అమెరికా సంయుక్తరాష్ట్రాలు ప్రధానములైనవి. యూరోపుఖండములోని రేవుపట్టణాలనుంచి వాణిజ్యాన్నంతటనీ, లండనుకు మరలించడం బ్రిటీషువారనుసరించిన విధానం. యుద్ధం సాగుతూరాగా, భారతదేశ వాణిజ్యంనుంచి శత్రువర్గంలోని ఇతర దేశాలు బహిష్కృతములైనవి. తత్ఫలితంగా బ్రిటనుయొక్క వ్యాపారలాభం అధికమయింది. ఇక, బ్రిటీషు వ్యాపారవిషయంలో కూడా ఒక ముఖ్యమైన మార్పువచ్చింది. వ్యాపారాన్ని ఈస్ట్ఇండియా కంపెనీనుంచీ, క్రమంగా, స్వతంత్రులైన వర్తకులకు అప్పచెప్పడం ఆరంభమయింది. ఏకైక స్వామ్యవాణిజ్యం, ఈ విధంగా ముక్తవ్యాపారంగా పరిణమించింది.

వ్యాపారానికి డబ్బుసమకూర్చడంలో, భిన్నమార్గాలుండినవి. పెట్టుబడికి అవసరమైన ధనము, కంపెనీ వారికి, ఇంగ్లాండునుంచి దిగుమతియైన రూకల రూపంగా, మొదటసిద్ధించినది. 1757 తర్వాత, ఈ విధానాన్ని తగ్గించి, బెంగాలు సర్కారు యొక్క నిలువ ఆదాయాన్ని ఉపయోగిస్తూ వచ్చిరి. కాని, యుద్ధాలవల్లనూ, పరిపాలన వ్యవస్థవిస్తృతి వల్లనూ, సర్కారు నిలువ ధనం అంతా, ఖర్చయిపోయింది. కనుక, ఇంగ్లాండు నుంచి దిగుమతియైన

సరకుల అమ్మకంతోనూ, రాజస్వంలో మిగిలే డబ్బుతోనూ, ఋణపత్రాల ద్వారా ఉత్పాదింపబడిన డబ్బుతోనూ, వ్యాపారం సాగించుకోవలసి వచ్చింది.

కొన్ని సంవత్సరాల్లో, ఇంగ్లాండు నుంచి బంగారాన్ని దిగుమతిచేసుకొని, తాము కొన్న సరకులకై డబ్బుకట్టవలసిన పరిస్థితి కూడా ఏర్పడింది. ఈ కాలమంతటా, అధికమవుతున్న ఆర్థికక్లిష్టపరిస్థితులను, కంపెనీ, ఎదుర్కొంటూ ఉండడంవల్ల, తాము పూర్వము నిర్ణయించుకొన్న పెట్టుబడి సంపూర్తికాలేదు. సంవత్సరానికి పదిలక్షల పౌనులు, వారు, ప్రమాణంగా ఏర్పరచుకొని యుండిన పెట్టుబడి. ఇది సాధ్యంకాలేదు. తత్కారణంగా, కంపెనీరుణం, పెరుగుతూ వచ్చింది. రుణాలపై చెల్లించవలసిన అధికమైనవడ్డీ, రాజస్వ ఆదాయంపై భారంగా పడింది. కాగా, పెట్టుబడికి, రాజస్వ ఆదాయం వాడుకొన్నా, చాలిందికాదు.

ఇంగ్లాండు నుంచి దిగుమతి చేసుకొన్న సరకులపైననే ఎక్కువగా ఆధారపడి, కంపెనీవారు, ఎగుమతి సరకులను కొనేవారు. సాధ్యమైనంత వరకూ, ఇంగ్లాండు నుంచీ బంగారును దిగుమతి చేయకూడదనడమే వీరిప్రయత్నము కాని, ఇతర పాశ్చాత్యదేశాలవారు తమ దేశాల బంగారం తెప్పించి, ఇండియాలో సరకులను కొనేవారు. ఏజెన్సీసంస్థలపై ఆధారపడడమే కంపెనీవారవలంబించిన వ్యాపార విధానము. కాని, ఇతర పాశ్చాత్య వర్తకులు దేశీయ బాంకాలనూ, దేశవర్తకులనూ ఆదరించి, వారి ద్వారా, అవసరమైన మూలధనాన్ని, సరకులనూ సమ కూర్చుకొనే వారు.

ఇదికాక, కంపెనీవారి వ్యాపారం దెబ్బతినడానికి, ఆంగ్లస్వతంత్ర వర్తకులు కూడా కారకులు. కంపెనీవారి ఏకైక స్వామ్యాన్ని లక్ష్యపెట్టక, అనేకములైన స్వార్థపద్ధతులను అవలంబించి కంపెనీ యొక్క అత్యుచ్ఛ స్థితిని భంగపరచిరి. సరకులను సమకూర్చు కోవడంలో వీరు, కంపెనీవారికంటె ఎక్కువ ధరలిచ్చేవారు. దీనివల్ల కలిగిన నష్టాన్ని సరిదిద్దు కోడానికై తమ సరకులను విదేశముల వారి పడవలలో రవాణాచేసేవారు. డబ్బు రాకపోకలకు కూడా వేరే మార్గాలనేర్పరచుకొని యూరోపులో కంపెనీ వారి ప్రాబల్యాన్ని తగ్గించిరి. ఇంతేకాక, తమ సరకులరవాణాకు నావలను నిర్మించుకొని, బ్రిటీషు వారి నావల ఛార్జీలు పడిపోయేటట్లు చేసిరి.

కంపెనీవారి వ్యవస్థలో కలిగిన మార్పువల్లనూ, స్వంతవ్యాపారస్థుల అభివృద్ధివల్లనూ, దేశీయ వర్తకుల వ్యాపారం కూడా దెబ్బతిన్నది. బ్రిటీషువారి ఎగుమతి వ్యాపారంలో దేశీయవర్తకుని భాగం, ఇదివరకే క్షీణించింది. సముద్ర తీర వాణిజ్యం నుంచీ కూడా, ఇది చాల వరకు, బహిర్గతమొనర్పబడింది. అంతర్దేశీయ వ్యాపారాన్ని మాత్రం దేశీయులు నిలుపుకోగలిగిరి. యూరోపియను, అమెరికా వర్తకుల ప్రాపకమూ ఆదరమూ, ఇంకనూ లభిస్తూనే ఉంది. బ్రిటీషు వారు బ్యాంకులను స్థాపించు కోవడంవల్లనూ, దేశమంతటికీ సాధారణమైన, ఒకే చెలామణీ నాణెములను ప్రవేశపెట్టడం వల్లనూ, దేశీయులైన బ్యాంకర్లూ,

షరాఫులూ నష్టపడినారు. ఐనా, తమ డబ్బును కంపెనీవారి బాండులలోనూ, రుణపత్రాలలోనూ, నిలువచేసి, విదేశవ్యాపారస్థులకు అప్పులిచ్చి, తమకు కలిగిన నష్టాన్ని కొంత వరకూ సర్దుకోగలిగినారు. కాని, వారికి వ్యాపారంలో, ముఖ్య స్థానం లేకపోయింది. బ్రిటీషు, యూరోపియను సంస్థల ఆదరణకు పాత్రులైన మధ్యస్థులుగను, దలాలీలగను, భృత్యులుగను, మాత్రమే వీరు వ్యవహరించ వలసిన వారైరి. పండ్రెండు లక్షల పౌనుల విలువగల కంపెనీ రుణాలను, కారన్ వాలీస్ చెల్లించినాడు. (1792) వర్తకులకు లభించిన ఈ మొత్తం, భూముల పైనా, సంస్థానాలపైనా పెట్టుబడిగా ఉపయోగించింది. 1793 లో ప్రకటింప బడిన శాశ్వత పరిష్కారం కూలిపోనున్న వర్తకులనూ, చట్టావ్యాపారులనూ, సమయంలో రక్షించింది.

ఈ అభివృద్ధిదశలో మధ్య తరగతి యొక్క ఆర్థికస్థితి ఎట్టిదై యుండెనో గ్రహించడానికి, దేశవ్యాపారానికీ, ద్రవ్యస్థితికీ సంబంధించిన వివరాలను పరిశీలించడం అవసరం. 1766/67 నుండీ 1792/93 వరకూగల పాతిక సంవత్స రాలలో బ్రిటీషువారు ఇండియాతో జరిపిన వ్యాపారంలో జరిగిన వృద్ధికీ, రెండు ప్రపత్రశాసనాల (Charter Acts) మధ్యకాలంలో (1793-1813) జరిగిన అభివృద్ధికీ గల తేడా (Difference) ఈ క్రింది వివరాలవల్ల వ్యక్త మౌతుంది.

1766/67 — 1792/93 మధ్యకాలం.

ఇంగ్లండు నుండీ దిగుమతులు—8,10,000 పౌనులు-సంవత్సరానికి.

ఇండియా నుండీ ఎగుమతులు—38,00000 పౌనులు-సంవత్సరానికి.

1793-94 నుండీ 1809-10 వరకూ గలకాలం.

ఇంగ్లాండు నుంచి దిగుమతులు—23,50000 పౌనులు సంవత్సరానికి.

ఇండియానుంచి ఎగుమతులు—60,00000 పౌనులు సంవత్సరానికి.

పూర్వపు దానికంటె, 1793-1810 కాలంలోని వ్యాపారం రెండింత లయింది. మొదటి కాలంలో, ప్రతి సంవత్సమూ, సరాసరి 27 నావలు సరకుల రవాణాకుపయోగింపబడినవి. రెండవ కాలంలో 49 నావలుపయుక్తము లైనవి.

1796 లో బెంగాలు నుంచి ఎగుమతియైన సరకుల విలువ 15 లక్షల పౌనులు. కాగా, 1806 లో 42 లక్షల పౌనులకు పెరిగింది. ఇదేకాలంలో దిగుమతులు 8 లక్షల పౌనుల నుండి 31,50,000 పౌనులకు పెరిగింది.

కంపెనీ యొక్క దిగుమతి ఎగుమతి వ్యాపారానికి, విదేశీయులైన స్వంతవ్యాపారస్థుల (బ్రిటీషు, ఇతరులూచేరి) వ్యాపారంతోగల వ్యత్యాసాన్ని, [1802-1806 కాలానికి] క్రింది పట్టిక సూచిస్తుంది.

| | | దిగుమతులు | | ఎగుమతులు | |
|---|---|---|---|---|---|
| ఈస్ట్ఇండియాకంపెనీ | = | 4,023, 552 | పౌనులు | 4601, 224 | పౌనులు. |
| లండన్ స్వంతవర్తకులు | = | 2,360, 653 | ,, | 4601, 391 | ,, |
| యూరోపియనులు | = | 1,354,062 | ,, | 1471, 771 | ,, |
| అమెరికా | = | 3,065, 287 | ,, | 3027, 233 | ,, |
| బ్రిటీషు ఏషియా | = | 946, 431 | ,, | 4175, 855 | ,, |
| బ్రిటీషుఏషియాకు భిన్నమైనది | = | 4090, 645 | ,, | 5493, 922 | ,, |
| మొత్తం | = | 15,639,630 | ,, | 22,105,396 | పౌనులు |

ఇట్లు ఇండియాదిగుమతుల్లో ఈస్ట్ఇండియాకంపెనీ భాగం నాలుగోవంతు మాత్రమే. ఎగుమతుల భాగం ఐదోవంతుకు తక్కువ. 1802-06 వరకూగల కాలంలో, బ్రిటీషు స్థావరాలనుంచి ప్రపంచంలోని దేశాలకు ఎగుమతియైన సరకుల విలువ 3834,532 పౌనులనుండి 9099,641 పౌనులకు పెరిగింది. ప్రపంచ భాగాలనుంచి బ్రిటీషు స్థావరాలలోనికి దిగుమతియైన సరకుల విలువ, —75, 11, 676 పౌనులనుంచి 9313,737 పౌనులకు అధికమయింది. 1796-97 నుండి 1613-14 ప్రాంతకాలంలో కలకత్తా రేవులో జరిగిన విదేశవ్యాపారంలో, ఎగుమతులు 230 శాతం పెరుగగా, దిగుమతులు 330 శాతం పెరిగింది. స్వంతవ్యాపారస్థులు కలకత్తానుంచి లండనుకు పంపినద్రవ్యం, 1796-97 సంవత్సరంలో 5079,310 సిక్కారూపాయలై యుండగా, 1814-15 సంవత్సరంలో 1,21,42,263 లకు పెరిగింది. వారి దిగుమతు లీ విధంగా ఎక్కువకాలేదు. 1796—99లో, దిగుమతియైన సరకులూ, బంగారూ కలిసి మొత్తం 5060,535 సిక్కారూపాయలు. 1813-14లో సరకులు మాత్రం 5376,775, సిక్కారూపాయలు.

ఇట్లు విస్తృతమౌతున్న వ్యాపారంవల్ల సిద్ధించిన లాభం, చాలవరకు బ్రిటీషు వర్తకులకు చెందియున్నా, భారతదేశ వర్తకులకు కూడా, ఈవ్యాపారం లాభదాయకమయింది. సంఖ్యలోనూ, సంపదలోను కూడా, దేశవర్తకులభివృద్ధి చెందిరి. సర్కారు వారి ద్రవ్య వ్యవహారాల్లోనూ, బాండులలోనూ, ప్రమాణ పత్రాలలోనూ, పెట్టుబడిపెట్టిన వర్తకులు ఎక్కువ ధనాన్ని గడించుకొనిరి. యుద్ధాలకారణంగా కంపెనీవారు, ఎక్కువ వడ్డీపై,-12 శాతంవరకు-రుణం తీసుకోవలసిన అవసరం ఏర్పడింది. వీటిపై వడ్డీ వట్టం కూడా, పదేపదే మారుతూ వచ్చింది.

రుణముల విషయమై ప్రభుత్వ విధానంలో కలిగిన మార్పులవల్లకూడా, దేశీయ పెట్టుబడిదారులకు చిక్కులేర్పడినవి. ఏజెన్సీ సంస్థలను ఆదరించే ఉద్దేశంతో, ఇండియారుణంపై, అసలు మాత్రమేకాక, వడ్డీకూడా ఇంగ్లాండులో వసూలు చేసుకోవచ్చుననే నిర్ణయాన్ని, ప్రభుత్వంచేసింది. దీని ఫలితంగా, రుణద్రవ్యం ప్రభుత్వం వారి హస్తగతమై, దేశీయుల భాగంతగ్గింది. ఐనప్పటికి,

1801 లో, ఇండియనుల అధీనంలో 1,89,45,000 సిక్కా-రూపాయల విలువగల పత్రాలూ, యూరోపియనుల అధీనంలో 6,69,20,000. సిక్కా రూపాయల విలువగల పత్రాలూ ఉండినవి.

కారన్‌వాలీస్, పదవిలో ప్రవేశించిన సంవత్సరం ఇండియా ప్రభుత్వ రుణం, 80 లక్షల పౌనులు. మైసూరు యుద్ధం ఆరంభమగునంతవరకూ తగ్గుతూ వచ్చిన రుణం, 1792 లో ఒక్కసారిగా 91 లక్షలకు పెరిగిపోయింది. యుద్ధానంతరం అది 79 లక్షలకు తగ్గింది. కాని, వెల్లెస్లీ ప్రారంభించిన సామ్రాజ్య విస్తరణ విధానంవల్ల, రుణం మరల పెరుగుతూ వచ్చింది. 1798 లో, 110 లక్షల పౌనులూ, 1799 లో 130 లక్షలూ రుణంగా ఏర్పడింది. 1801 నాటికి 185 లక్షల వరకూ పెరిగిన రుణం, 1804. ఏప్రిలు 30 వ నాటికి 270 లక్షల పౌనులయింది.

ప్రభుత్వరుణం ఈ విధంగా పెరుగుతూ తగ్గుతూ ఉండడం దేశంయొక్క ఆర్థిక జీవితానికి పెద్ద ఆఘాతమయింది. రుణభారము చాలినంతగా తగ్గడము 1792 లో జరిగింది. ఆ సమయానికి సరిగా, భూముల విషయమైన శాశ్వత పరిష్కారం కూడా ప్రకటింపబడింది. ఈ పరిష్కార విషయంలో తరువాత చేసిన మార్పులవల్ల, వ్యావసాయిక వ్యవస్థకు స్థైర్యం ఏర్పడలేదు. రుణ పత్రాలను కొనడం లాభదాయకమయ్యేపట్ల, నూతన భూస్వాములు భూములనమ్మి, ఆ డబ్బుతో రుణపత్రాలు కొనేవారు. భూములనుంచీ వచ్చే ఆదాయము ఎక్కువయ్యే సంధర్భాలలో రుణ పత్రాలను విక్రయించి, ఆడబ్బును మరల భూములపై పెట్టేవారు. భూములీవిధంగా, బజారులో అమ్మకానికి వచ్చే సరకుల స్థాయికి వచ్చినవి. అద్భుత భయావహమైన ఈ పరిస్థితి ప్రాబల్యము భారతీయ సామాజిక వ్యవస్థపై ఆఘాతమయింది.

*బెంగాలులో నూతన జమీందారీ వర్గంయొక్క ఉదయము:* భూముల విషయంలో గావించిన శాశ్వతపరిష్కారం తర్వాత కొద్ది సంవత్సరాలలోనే, దాని ఫలితాలు గోచరం కాజొచ్చినవి వ్యావసాయిక సరకుల ధరలు పద్ధెనిమిదో శతాబ్దంలో పెరుగుతూ వచ్చినవి. నిదర్శనకు,-సుమారు యాభై ఏండ్లలో (1728-76) ఉత్తమ తరగతి బియ్యం ధర, రూపాయకు ఒక మణుగూ 10 సేర్లు ఉండినది, రూపాయకు 16 సేర్లు మాత్రమే అయింది తగ్గురకం బియ్యం, రూపాయకు 4 మణుగులూ 15 సేర్లుగా ఉండినది, 32 సేర్లు మాత్రమే అయింది. రూపాయకు 3 మణుగులున్న గోధుమలధర రూపాయకు 32 సేర్లకు వచ్చింది. నెయ్యి ధర రూపాయకు 10 1/2 సేరులనుండి 3 సేర్లకు మారింది.

బెంగాలు జనాభా విషయంలో, 1770 నాటి క్షామంవల్ల కలిగిన ప్రజా వినాశం, తర్వాతి కాలంలో సర్దుకొంది. 1793 నుండి జనాభా సంఖ్య పెరుగుతూ వచ్చింది. పొలాలలో పనిచేసే వారి సంఖ్య వృద్ధియై, రైతుకు ప్రతికూలస్థితి ఏర్పడింది. ఈ కూలీల సంఖ్య క్రమంగా పెరుగుతూనే ఉంది. ధరలపెరుగుదల, జనసంఖ్యాభివృద్ధీ,-అను ఈ రెండంశాలూ, స్వాభావికంగా భూముల వెలను

అధికం చేయవలసి ఉంటుంది. కాని, పరిణామం అందుకు విరుద్ధంగా జరిగింది. 1795-96 లో పొలం విలువ దాని 15 సంవత్సరాల ఆదాయానికి సమమై ఉండింది.

1796-97 నాటికి 12 నుండి 13 సంవత్సరాల ఆదాయానికి, 1797-98 నాటికి 9 1/2 సంవత్సరాల ఆదాయానికి దిగిపోయింది. భూములపై మోపిన అధిక పన్నులభారమే ఇందుకు కారణమై, వ్యవసాయము నష్టదాయకమయింది. చట్టావ్యాపారులవంటివారు, శిస్తులను కట్టలేని పూర్వపు జమీందారుల నుంచి పొలాలను చౌకగా కొన్నారు. పిమ్మట వీరు కూడా ప్రభుత్వానికి శిస్తుచెల్లించలేక, మళ్ళీ భూములను నష్టానికి అమ్మవలసి వచ్చింది.

క్రొత్తగా కొన్నవారు కూడా సర్కారు శిస్తులను చెల్లించ లేక పోవడం వల్ల భూములను వేలం వేసింది ప్రభుత్వం. శిస్తులను చెల్లించలేని వారిలో, పెద్ద పెద్ద జమీందారులు కూడా ఉన్నారు. నాడియా, రాజషాహీ, దినాపూర్, బిష్ణుపూర్, కోసిజూరా, రాజులందరూ ఈ విధంగానే తమ భూములను అమ్ముకోవలసిన పరిస్థితి ఏర్పడింది. కొన్ని సంస్థానాల విలువలు పూర్తిగా తగ్గిపోయినవి; కొన్ని ముక్క ముక్కలై పరులపాలైనవి.

భరింపజాలని ఈ శిస్తుల విషయమై అందరూ మొరపెట్టినవారే. వాటిని వసూలు చేయడంలో అనుసరించిన పద్ధతులు కర్కశములైనవి. ప్రథమ దశల్లో జమీందారులు అవమానింపబడినారు. వారిని ఖైదులో ఉంచడమూ, అన్ని విధాలా బాధించడమూ కూడా జరిగింది. తర్వాతి కాలంలో, శిస్తులు కట్టకపోవడం వల్ల ఖైదుచేసే పద్ధతి తొలగింపబడింది.

1796-97 సంవత్సరంలో, 14 లక్షల శిస్తు బేరీజుగల భూములు అమ్ముడుబోయినవి. మరుసటి సంవత్సరం 23 లక్షల బేరీజుగల భూములనమ్మినారు. క్రూరమైన ఈ అమ్మడు విధానంవల్ల, "బెంగాలులోని మూడవవంతునుంచి సగంవంతు వరకూగల సుక్షేత్రమంతా ఈ విధంగా విక్రయింపబడిందని" అంచనావేసినారు. బుచానన్ (Buchanan) తన పర్యటనలో, "వర్తకులతోనూ, ఏజెంట్లతోనూ, సర్కారు ఉద్యోగులతోనూ కూడిన నూతన భూస్వామివర్గము, జమీందారులను తొలగించివేసినదని" తెలిపియున్నాడు.

క్రొత్త భూస్వాముల వర్గంలో ఏజెంట్లు విచిత్రమైన వ్యక్తులు. క్రొత్త అవసరాన్నిబట్టి వారు ఏర్పడడం జరిగింది. రైతులనుండి పన్నులు వసూలుచేసుకోజాలక పోవడ మొకవైపుననూ, సర్కారుకు సమయానికి చెల్లించవలసిన శిస్తు, తప్పనిసరియగుట ఇంకొకవైపుననూ, చిక్కులు కలిగించుచుండగా, జమీందారులు గత్యంతరము లేనివారై, తమ భూభాగాన్ని, చిన్న క్షేత్రాలుగా('పట్నీలు') విభజించి, వాటిని ఇతరులకు అమ్మినారు. వాటిపై సర్కారుకు కట్టవలసిన శిస్తును జమీందారులు నిర్ణయించి, భూమిని కొన్నవారు దానిని కట్టేటట్లుగా షరతుగావించుకొనిరి. ఈ క్షేత్రాన్ని కొన్నపట్నీదారు, మళ్ళీ ఆ క్షేత్రాన్ని చిన్నభాగాలుగా విభజించి, దార్ పట్నీదార్ అనేవారికి అప్పగించినారు. వారిక్రింద ఇంకనూ

సబ్ ఏజెంట్లు కూడా ఉండేవారు.

ఈ విధంగా, మధ్యస్థుల పెద్దవర్గం ఒకటి ఏర్పడింది. ఈ అమ్మకాలు కలకత్తాలోనే జరగడంవల్లనూ, తగినంత కాలవ్యవధి లేనందువల్లనూ, పొలాలను కొన్న మధ్యస్థులందరూ కలకత్తా వాస్తవ్యులే. మరిన్నీ, ఈ అమ్మకాలు మూడు మూడు నెలల, లోపుగనే జరుగుచుండినవి.

సంస్థానా లీవిధంగా ఛిద్రమైపోవడం సాగుతూనే వచ్చింది. నూరు సంవత్సరాలకాలంలో, చాలవరకు పెద్దసంస్థానాలన్నీ ముక్కలై పోయినవి. 1872నాటికి వీటి సంఖ్య 1,54,200కు పెరిగింది. 20 వేల ఎకరముల భూఆస్తి (భూస్థితి) గల జమీందారుల సంఖ్య అత్యల్పము తక్కినవారందరూ చిన్న జమీందారులే.వీరిలో నూటికి పదిమంది సమర్థులైనవారే. కాని తక్కిన తొంబదిమందీ చిన్న భూస్వాములు మాత్రమే.

ఆర్థిక ప్రయోజనం మాత్రమే ఈ కాలపు జమీందారులాశించినది. ఈ కాలపు జమీందారులకు ఆర్థిక ప్రయోజనము మాత్రమే ప్రధానమైన విషయము. మధ్యయుగాల జమీందారులకు, వీరికి గల భేదమిందులోనే ఉన్నది. తమ ఆధీనంలో నున్న భూములపై, ఈ కాలపుభూస్వాములకు సర్వతంత్ర స్వతంత్రమైన అధికారంకలదు. కాబట్టి, రైతులకు పొలాలపై ఎట్టి అధికారమూ లేకుండా చేసినారు. న్యాయస్థానాలకు పోనవసరము లేకుండానే, రైతులనుండి పన్నులు వసూలు చేసుకొనే విశేషాధికారం కూడా ప్రభుత్వము, వీరికి ఇచ్చింది. ప్రాచీనులవలె గ్రామాల్లో నివసిస్తూ ప్రజల కష్టసుఖాల్లో, సంతోషాల్లో పాల్గొంటూ ఉండడము వీరికి రుచించలేదు. అనేకులు పరోక్షభూస్వాములై, కలకత్తాలోని తమ సౌధాలలో నివసిస్తూ, సుఖజీవితానికి అలవాటుపడిరి. భూములవల్ల వచ్చిన లాభాన్ని మరల భూములపైనే వెచ్చించి, వాటిని బాగుపరచే ఉద్దేశమే వీరికి లేకపోయింది. ఆ డబ్బును వర్తకంలోనూ, ఋణాల క్రిందనూ, పెట్టుబడి పెట్టడం నేర్చుకొన్నారు. ఆంగ్లేయుల జీవిత పద్ధతులనూ, వారి ప్రవర్తనలనూ అనుకరించినారు. తమ కుమారులకూ, సన్నిహిత బంధువులకూ ప్రభుత్వోద్యోగాల అవకాశం కల్పించగల ఆంగ్లవిద్యావిధానంపై ఆసక్తి ఎక్కువయింది. ఆ విద్యవల్ల బ్రిటీషు అధికారులతోనూ, పాశ్చాత్య వర్తకులతోనూ సాహచర్య సంపర్కాలు కూడా కలిగి, తమకు అభ్యుదయం కలుగుతుందని వీరి ఆశ. ప్రాచీనసంప్రదాయాలను విస్మరించడము ఎక్కువయింది. సమాజం నూతన పంథాలో నడవడం ఆరంభించింది. జాతిమత నిబంధనలు, సంకోచము, ఇత్యాదులు లోపించి, ప్రతిష్ఠకు ప్రాధాన్య మేర్పడింది. భూస్వాములు తమ ధనాన్ని పరిశ్రమలను స్థాపించడానికి వినియోగించియుండ వచ్చును. కాని, నూతన కార్యారంభానికి అవసరమైన సాహసోత్సాహాలు వీరికిలేవు. మరిన్ని తమకు అపరిచితములైన కార్యక్రమాల్లో ప్రవేశించి నష్టపడతామనే జంకు కూడా కారణమయింది. అంతకంటెను ముఖ్యమైన ప్రతిబంధకం,- ప్రభుత్వం అనుసరిస్తున్న నిరుత్సాహకరమైన విధానము. ఈ కారణాలవల్ల దేశంలో, పారిశ్రామిక

వ్యవస్థాపకవర్గము ఉత్పన్నం కాలేదు.

బెంగాలు ప్రాంతంలోని మధ్యతరగతి వర్గంలో, ప్రధానమైన భాగం, జమీందారులది. కొంతకాలంగడచిన తర్వాత, భూములపై నుండిన శిస్తులభారం క్రమంగా తగ్గింపబడింది. తత్ఫలితంగా, ఆదాయంలో, నిలువ ఏర్పడింది. గ్రామాలలో, ఉత్పత్తియైన సరకులధర పెరగడమూ, జనాభా ఎక్కువకావడమూ, భూముల విలువ అధికంకావడమూ, జరుగుతూ వచ్చింది. ఆదిలో, అస్థిరత్వాన్ని కలిగించి, కలత బెట్టిన శాశ్వత పరిష్కారం క్రమంగా వ్యవసాయ వ్యవస్థకు స్థైర్యం చేకూర్చింది.

కాని, దురదృష్టంవల్ల రైతులకు మాత్రం ఈ పరిణామం దుస్థితినే తెచ్చి పెట్టింది. వారి ఆర్థికపరిస్థితి దినదినానికీ క్షీణిస్తూ వచ్చింది. మరిన్ని, బ్రిటీషు ప్రభుత్వము తమ దేశంలోని పరిశ్రమల రక్షణార్థము భారతదేశంలో, అవలంబించిన స్వార్థపర విధానంవల్ల, పరిశ్రమలన్నీ నశించినవి. పెట్టుబడిదారీ విధానం ఆధారంగా ఇంగ్లాండులో యాంత్రికపరిశ్రమలు స్థాపింపబడడంవల్ల, భారతదేశంలోని శిల్పులూ, కర్మకారులూ నిరాధారులైపోయిరి. ముఖ్యంగా నూలు తయారు చేసే అధికసంఖ్యాకులైన కార్మికవర్గాలు, జీవనాధారాన్ని గోల్పోయినవి. వీరి భారమంతా వ్యవసాయపు పొలాలపై బడింది. స్వంతభూములులేని పొలం కూలీల సంఖ్య పెచ్చు పెరిగింది.

## XIX. శతాబ్దారంభంలోని మధ్యతరగతులు

1813 నాటికి నూతన భారతజాతియొక్క రూపురేఖ తేప్పకినవి. సమస్తమైన అధికారాన్నీ సంపదనూ, ప్రతిష్ఠనూ ఏకైక స్వామ్యంతో అనుభవిస్తూ, ప్రభుత్వపు బాధ్యతలన్నీ తామే వహిస్తూ, అధికారమునుంచీ, బాధ్యతల నుంచీ దేశీయులను బహిష్కరించిన, పరదేశీయుల స్వల్పజనాధిపత్యం, సామాజిక రంగంలో ప్రాబల్యం వహించింది. ఈ స్వల్ప జనాధిపత్యం యొక్క ప్రాబల్యానికీ, స్థైర్యానికీ బ్రిటీషు ప్రజల శక్తి సామర్థ్యాలూ, బలసామగ్రీ, ప్రధానాధారములు. దేశీయులయందు నెలకొనియున్న అనైక్యతా, అలసతా, బ్రిటీషు వారికి బాగుగా సహాకరించినవి. ఇండియాకు వచ్చిన ఆంగ్లేయులకు వారి దేశంలో గల స్థానప్రతిష్ఠ లెలాంటివైనా, ఇండియాలో మాత్రం వారు, కులీనవర్గం వారి వలె, తమలోతాము కట్టుగా, దేశీయులకు దూరంగా నిలిచినారు. శాంతి వ్యవస్థలను నెలకొల్పడంలో వారు సమర్థులేకాని, తమదేశమైన ఇంగ్లాండు ప్రయోజనాలను సాధించి, రక్షించడమే వారి ఆశయోద్దేశాలైనవి.

తాము జయించి, వశపరచుకొన్న భారతదేశ ప్రజల బాగోగులు, తమ కర్తవ్యంగా, వీరు భావించలేదు. లక్షలాది గ్రామాలలో, పల్లెలలో నివసిస్తూ, వేగంగా విస్తృతి చెందుతున్న అఖండ ప్రజానీకంతో ఏర్పడింది, భారతదేశ సమాజము. వారి జీవన ప్రమాణము పాతాళమడుగంటియున్నది. దారిద్ర్యము,

రోగము, అజ్ఞానము, మూఢవిశ్వాసము,- ఇవి వారి దుఃఖ జీవితంయొక్క రూపురేఖలు. బ్రిటీషు పరిపాలనలో ప్రజా సంఖ్య పెచ్చుపెరిగింది, కాని వారి ఆర్థిక వ్యవస్థ అధోగతికి దిగిపోయింది.

విదేశపాలకులకూ, దైన్యావస్థలోనున్న ప్రజానీకానికీ మధ్య, భూస్వాములతోనూ, వ్యాపారస్థులతోనూ, వృత్తివర్గాలవారితోనూ, సంఘటితమైన మధ్యతరగతి ఏర్పడింది. మధ్యతరగతిలోని భిన్నభిన్న వర్గాలకు, ఆదిలో, సమ్మేళనంజరిగి, ఐక్యత సిద్ధింపకపోయినా, సమానలక్షణాలూ, ప్రయోజనాలూ, వీరి నొకవర్గంగా ఏర్పరచినవి. నాగరిక భూస్వాములకూ, విద్యావంతులకూ, సామ్యాలనేకములు. అట్లే, స్వతంత్రవృత్తులలోని వారికీ, సర్కారుద్యోగంలోనున్న వారికీ సమానభావాలుండినవి. భూస్వాములందనేకులు వ్యాపారాన్ని కూడా సాగిస్తున్నవారే. దేశమును పరిపాలిస్తున్న పరదేశస్వల్ప జనాధిపత్యవర్గానికీ, దేశప్రజానీకానికీ,- మధ్యనిలిచియున్న వర్గము కావడంవల్ల వీరిని మధ్యతరగతియని, వ్యవహరిస్తున్నాము. అదికాక, కొత్తగా ఏర్పడిన ఈ వర్గంలో అగ్రవర్ణాలు ప్రాధాన్యంవహించియున్నా, అచ్చులలోపోసి తయారుచేసినట్టి భిన్నకులాలులేవు. వృత్తిఉద్యోగాలను స్వేచ్ఛగా ఎన్నుకోవడంలోనూ, మార్చుకోవడంలోనూ, వీరికి చైతన్యశక్తి ఉండినది. ఆది దశలో, వీరి సంఖ్య పెద్దది కాదు. కాని, క్రమంగా వీరభివృద్ధిచెంది, పరస్పరం కలిసిపోయినారు. ఈ తరగతిలోని భిన్నవర్గాల వారి తరతమసంఖ్యా, వర్గంయొక్క మొత్తంసంఖ్యా దేశంలోని వివిధప్రాంతాలలో వివిధమై యుండినది. ఐనా, వారికి సమాజంపై గల ప్రాభవం, వారి సంఖ్యాబలానికి ఎన్నోరెట్లు మించినట్టిది. ఈ వర్గానికంతకూ అగ్రగాములైనవారు విద్యావంతులు.

## VII. నూతన మధ్యతరగతి అభివృద్ధి (1813-33)

1813, 1833లలో ప్రకటింపబడిన రెండు శాసనపత్రాలలో (Charters) కంపెనీవారి ఏకైకస్వామ్యం, నశించి, స్వతంత్రవర్తకుని ప్రయోజనం బాగుపడే అవకాశం కలిగింది. మొదటి శాసపత్ర ప్రకటనతో కంపెనీవారు ఇండియావర్తకస్వామ్యాన్ని గోల్పోయిరి. రెండవదానితో వారి వివిధవ్యాపార కార్యక్రమాలు అంతమొందింపబడినవి.

ఈ మధ్యకాలంలో, ఇండియాయొక్క విదేశవాణిజ్య స్వభావం పూర్తిగా మారిపోయింది. వాణిజ్యావకాశాలు సర్వులకూ కలిగించడంవల్ల, మొత్తంలోనూ విలువలోనూ కూడా, వ్యాపారం ఇతోధికంగా పెరిగింది. తయారైన దూదివస్త్రాలనూ, పట్టువస్త్రాలనూ, తయారైన ఇతర సరకులనూ, ఇంతవరకూ ఎగుమతి చేయుచుండిన భారతదేశము, ఇప్పుడు ముడిపదార్థాలనూ, వ్యావసాయిక పదార్థాలనూ, ఎగుమతి చేయడమారంభించింది. 1799-80. సంవత్సరం, 6587 మణుగుల ప్రత్తిని దేశం ఎగుమతిచేసింది. ఈ ఎగుమతి 1829-30 నాటికి 134,953 మణుగులకు పెరిగింది.

అదే విధంగా, 1899-1800లో నీలిమందు ఎగుమతి 35,509 మణుగులు మాత్రమేకాగా, 1829-30లోని ఎగుమతి 135,399 మణుగులయింది. మరియూ, 1815లో భారతదేశంలోనికి దిగుమతియైన నూలువస్త్రములు 819,308 గజములు. 1831లో ఈదిగుమతి 52,179,844 గజాలకు పెరిగింది.వ్యాపారవ్యవస్థలో జరిగిన ఇట్టి మార్పులవల్ల, ఇండియా మధ్యస్థుల వ్యవహారిక కర్తవ్యాలు కూడా మారినవి. విదేశవాణిజ్యము సమస్తమూ, పరదేశీయుల హస్తగతం కావడంవల్ల, అందులో దేశీయునికి భాగం లేక పోయింది.

దేశీయ బ్యాంకరుకు కూడా, ఇట్టి దురవస్థేపట్టింది. పరదేశంవారు సాగిస్తుండిన అంతర్దేశీయ వ్యాపారపోషణకై మాత్రమే స్థాపింపబడిన విదేశీయ బ్యాంకులు, తమ అవధిని అతిక్రమిస్తూ వచ్చినవి. అధికలాభాలను సంపాదించుకొనే స్వార్థబుద్ధితో, ద్రవ్యాన్ని రవానాచేసే వ్యాపారంలో కూడా పాల్గొని, దేశీయ బ్యాంకరుపై పోటీచేసినారు. ఆరంభంలో, వారి ప్రయత్నం ఫలవంతం కాలేదు. దేశీయ బ్యాంకింగు వ్యవస్థతోబాటు, యూరోపియను బ్యాంకులు కూడా ఉండడంవల్ల, ప్రయోజనమేమీ కలుగదని, కారన్ వాలీసూ, డైరెక్టర్ల సంఘం కూడా, 1791 ప్రాంతంలో, అభిప్రాయపడినారు. ఈ రెండు బ్యాంకింగు వ్యవస్థలమూ ఏర్పడిన పోటీ సమాన స్థితిలోనిదికాదు కూడా. పరదేశ బ్యాంకులకు ప్రభుత్వాదరణ ప్రాపకాలూ, కావలసినంత మూలధనమూ, ఉన్నవి. విషమ పరిస్థితులేర్పడిన సందర్భాల్లో ప్రభుత్వము, వీటికి బాసటగా నిలిచేది. 1791 లో, బ్యాంకు వ్యవస్థయందంతటా క్లిష్టపరిస్థితి ఏర్పడిన సందర్భంలో, ప్రభుత్వము, విదేశబ్యాంకులకు రుణప్రదానం గావించియుండడము, ఇందుకొకనిదర్శనము. ఇతర విదేశీయ వర్తకుల ప్రాపకమూ, ఆదరణ కూడా వీరికి లభించడమారంభించింది. విదేశ బ్యాంకులే, వారికి ఇష్టకరమైనవి.

తత్ఫలితంగా, యూరోపియను బ్యాంకులు 1813 నాటికి విదేశ వాణిజ్యంలో బాగుగా స్థిరపడిపోయినవి. విదేశ వాణిజ్యంలోనేకాక, వారి కార్యక్రమాలూ వ్యవహారాలూ, అంతర్దేశీయ వ్యాపారపోషణకూ, ద్రవ్యము యొక్క రవాణాలకూ, ప్రభుత్వరుణ పత్రాలపోషణకూ, కూడా, వ్యాప్తమైనవి. ఇండియను బ్యాంకర్లు క్రమంగా స్థానభ్రంశం పొందుతూ వచ్చినారు.

దేశీయ బ్యాంకింగు వ్యవస్థను పూర్తిగా కూలద్రోసినది కరెన్సీ సంస్కరణ. కంపెనీవారు, వెండిరూపాయల ముద్రణాన్ని 1815 లో ఆరంభించిరి. ఈ ప్రమాణనాణెం, బ్రిటీషు వారి అధీనంలోనున్న ప్రాంతాలందంతటా చెలామణిలోకి వచ్చింది. వివిధములైన నాణెములను మార్చడము, స్వంతటంకశాలలలో రూకలను తయారుచేయడము, భిన్ననాణెముల మారకంలో రుసుము (బట్టా) వసూలు చేయడము,-ఇత్యాది వ్యవహారాలు ప్రవృత్తిలో ఉన్న కాలంగతించింది. ఈ వ్యవహారాలను సాగిస్తున్నషరాఫులు నిస్సహాయులైరి. తర్వాత కొన్ని సంవత్సరాలలో కంపెనీ వారి రుణపత్రాల్లో ధనాన్ని పెట్టుబడి పెట్టే, లాభకరమైన అవకాశం, దేశీయబ్యాంకర్లకు సిద్ధించింది. 1790-91 లో,

కంపెనీ వారికి మైసూరుతో ఏర్పడిన యుద్ధకాలంలోనూ, 1802-03 లో మహారాష్ట్రులతో సంభవించిన యుద్ధకాలంలోనూ, ఇండియా బ్యాంకర్లు ప్రభుత్వ రుణపత్రాలను కొని, కంపెనీ వారి రుణదాతలలో ప్రధానస్థానాన్ని వహించడము, ఒక నిదర్శనము. కాని, 1813 తర్వాత, కంపెనీ రుణము [1815 నుండీ 1829 వరకూ గల మధ్యకాలంలో] 173 లక్షల పౌనుల దాకా పెరిగినాకూడా, అందులో ఇండియనుల భాగం తక్కువయింది.

ఈ అభివృద్ధి పరిస్థితులవల్ల, దేశీయ వ్యాపారవర్గమూ, ధనికవర్గమూ, ప్రబలనష్టానికి గురియైనవి. వ్యావసాయిక పదార్థాల వ్యాపారానికి కొందరూ, గ్రామసీమల్లో వడ్డీవ్యాపారానికి కొందరూ, పూనుకోవలసి వచ్చింది. బ్రిటీషు వారి అధీనంలోలేని ఇతరప్రాంతాలలో, బ్యాంకింగు వ్యవస్థను నెలకొల్పి, కొందరు తమ పరిస్థితులను రక్షించుకొనిరి. వర్తకంలోనూ, పరిశ్రమల్లోనూ, ప్రవేశించికొందరూ, భూస్థితిలో ద్రవ్యాన్ని పెట్టుబడిపెట్టి మరికొందరూ, ఈ విషమపరిస్థితులనుంచీ తమ్ముతాము రక్షించుకొన్నారు.

దేశంలో వ్యాపారం అభివృద్ధికావడంవల్ల, నూతనావకాశాలు సిద్ధించినవి. ఉదాహరణకు,-1813-14 సంవత్సరంలో కలకత్తా దిగుమతులు 125 లక్షల సిక్కారూపాయలు. అది, 1828-29 నాటికి, దూదివస్త్రాల దిగుమతి 109,480 పౌనుల నుంచి, 1621,650 పౌనులకు పెరిగింది. ఇవికాక, దిగుమతి సరకులలో,-బీరూ (Beer), సారాపదార్థాలూ (Spirits) కడ్డీలూ మొదలైన ఇనుప సరకులూ, జాడీలూ మొదలైన మట్టివస్తువులూ, గాజుసామానూ, చర్మమూ, గుర్రపు జీనులూ, యంత్రాలూ, చాకూ కత్తి మున్నగు వస్తువులూ, ముడి మందులూ, ఔషధాలూ, తగరమూ, తుపాకులూ, పిస్తోళ్ళు,-మొదలైనవి కూడా చేరినవి. మొత్తం దిగుమతివాణిజ్యమంతా విదేశవర్తకుల స్వామ్యాధికారంలోనే ఉండింది. కాని, ఈ సరకులను దేశాంతర్భాగాలలో, సరఫరాచేసే వ్యాపారమంతా దేశీయులచేతులలోకి వచ్చింది. విదేశీయ వ్యాపారం పోయినందువల్ల, కలిగిన నష్టానికి, ఇది కొంత ప్రతిఫలమయింది. రాజధానీపట్టణాల్లోని వర్తకులూ, అంతర్భాగాల్లోని వర్తకులూ కూడా, దీనివల్లలాభాన్ని పొందగలిగిరి.

కొన్ని వ్యాపారవిభాగాలలో నష్టానికి గురియై వెనుకబడినప్పటికీ వర్తక వ్యాపారాలలో వ్యవహరిస్తూ ఉన్నవర్గంవారు, మొత్తం మీద, బాగుపడుతూ వచ్చిరి.

భూస్వాములైన మధ్యతరగతి వారి సంఖ్య కూడా ఈ కాలంలో అధికంగా వృద్ధి అయింది. సహింపవీలుకాని శిస్తుల భారంవల్ల, ప్రాచీన జమీందారీవర్గ మదివరకే వ్యర్థమై పోయింది. వర్తకులూ, సర్కారు ఉద్యోగులూ బనియాలూ, గోమాస్తాలూ, వారిస్థానాల నాక్రమించినారు. వీరు పట్టణ వాస్తవ్యులు కావడంవల్ల, వీరిదృక్పథమూ, ప్రయోజనాలూ కూడా, పట్టణ సంబంధమైనవే. వ్యవసాయం వారికి కేవలం లాభదాయకమైన పెట్టుబడేకాని,

ప్రవృత్తిప్రేరకమైన ఉద్యోగంకాదు. అదృష్టవశాత్తూ వ్యవసాయపరిస్థితులు త్వరలో బాగుపడజొచ్చినవి. 1820 నాటికి, భూమివిలువ పెరిగింది. 1821 నాటి నియమనాలవల్ల స్థితి ఇంతనూ బాగుపడింది. శిస్తుచెల్లింపలేక భూములు అమ్మడు పోవడం తగ్గింది. కాని, వ్యవసాయంచేసే రైతుల సంఖ్యపెరిగింది. తత్ఫలంగా మధ్యవర్తుల సంఖ్య కూడా అధికమయింది. వీరు కూడా నూతన జమీందారీ వర్గంలోని వారివలె నగరవాస్తవ్యులే.

అనేకులైన పండితులకూ పూజారులకూ పూర్వం మాన్యాలుగా, (శిస్తు లేని భూములు) నియమితములై, వారి అనుభవంలోనుండిన భూములను ప్రభుత్వం వెనుకకు, తీసుకొని, వాటినికూడా నగరవాసుల కప్పగించడంతో, భూస్వాముల సంఖ్య ప్రబలమయింది. కాని, విద్యాసంస్థలనూ, మత సంస్థలనూ, నడపుచున్నవారి జీవనోపాధి, నశించి, వారు దుస్థితికి లోనైరి. తత్ఫలితంగా, సాంప్రదాయకవిద్యా, నైతికప్రవృత్తీ దెబ్బతిన్నవి.

బెంగాలులోని గ్రామసీమలో జరిగిన మార్పు, ఆ అవధులకు మాత్రమే పరిమితం కాలేదు. పరిసర ప్రాంతమైన ఒరిస్సాకూడా (ఆనాడు బెంగాలుభాగమే) ఈ విధమైన పరిస్థితులకే, లోనయింది. ఒరిస్సాలోని పొలాలుకూడా కలకత్తా వ్యాపారస్థుల హస్తగతమైనవి.

ప్రాంతానికి చెందిన పంటభూమిలో అధికభాగము, పరోక్ష భూస్వాముల చేతుల్లోకి పోయింది. తాము పెట్టుబడిపెట్టిన ధనంపై, సాధ్యమైనంతలాభం సంపాదించడమే వీరి ప్రధానోద్దేశం.

వ్యావసాయకవర్గం ఏర్పడడంలో, ఈ విధంగా, నూతన పరివర్తనం కలుగుతూ వచ్చింది. "భారత మిత్రము" (Friend of India) అనే పత్రిక, 1839 లో,- "దేశీయుడైన కలెక్టరు, భూమికి ప్రభువైనాడు. కాని, పదేపదే ఈ ఉద్యోగులు బదలీ అగుచుండడంవల్ల, వ్యావసాయిక సంస్థలో అగ్రశ్రేణి వారికీ, నిమ్నశ్రేణి వారికీగల సంబంధం సడలిపోయింది. సంబంధాలు తెగిపోయినవని కూడా చెప్పవచ్చు. స్వత్వాధికారం కలిగి ప్రభుత్వాధికార వ్యాప్తికి దూరులై, స్వాతంత్ర్య భావంతో జీవించుచుండిన చిన్న భూస్వాములు నశించిపోయినారు. పెద్ద జమీందార్లూ, వారి కింకరులూ, మాత్రమే మిగిలియున్నారు."- అని ఈ పరిస్థితి విమర్శింపబడియున్నది.

*మదరాసు బొంబాయిలలో గ్రామీణ పెట్టుబడిదారుని ఉదయము :* ఇట్టి ప్రబలమైన జమీందారీ సంస్థ, మదరాసు బొంబాయి ప్రాంతాలలో ఏర్పడలేదు. రైతువారీ పరిష్కార విధానం ప్రవృత్తిలోకి రావడం దీనికి కారణము. ఐనా, ఈప్రాంతాల్లో ఒక క్రొత్తరకపు మధ్యస్థుల వర్గం తలయెత్తింది. రైతువారీ పరిష్కారాన్ననుసరించి, పంటభూమి చిన్న చిన్న పొలాలుగా, విభక్తమై రైతుల కప్పగింపబడింది. ప్రకృతి విషయములైన వర్షమూ, ఇతర అస్తవ్యస్తతలు కారణములుగా, పంటల ఆదాయంలో సంవత్సర, సంవత్సరం మార్పుకలుగుతూ ఉండింది. అట్టి క్లిష్ట పరిస్థితుల నెదుర్కొని నిలువగలిగిన స్తోమత ఈ చిన్నరైతు

లకు లేదు. కనుక, అట్టి సందర్భాల్లో అప్పుల నివ్వగలిగిన సంస్థ, తప్పనిసరిగా అవసరమయింది. అట్టి అవకాశాన్ని పురస్కరించుకొని, సహజంగా సాహసిమైన మార్వాడీ రుణదాత, దక్కను జిల్లా పల్లెసీమలో ప్రవేశించినాడు. మదరాసు ప్రాంతంలో, ఈ అప్పుల అవసరాన్ని బ్రాహ్మణ రుణదాత తీర్చినాడు.

ఇట్లు జమీందార్లూ, భూస్వాములూ, రుణదాతలూ కలిసి ఏర్పడిన ఒక పెట్టుబడి దారీ సంఘము గ్రామసీమలలో ఏర్పడింది. రైతులకు కలిగిన అవసరాలను ఆధారంగా చేసుకొని ఈ సంఘము అభివృద్ధిపొందింది. లాభదాయకమైన సర్కారుద్యోగావకాశాన్ని కలిగించే, ఆంగ్ల విద్యాభ్యాసంపై ఆసక్తిని పెంపొందింప జేసింది ఈ సంఘము. ఎల్లెన్ బరో చెప్పినట్లు "'ఆంగ్లమూ'-'డబ్బూ' అనే పదాలు సమానార్థకాలు."

## VIII. 1833 సంవత్సరపు శాసనపత్రమూ,-మధ్యతరగతి అభివృద్ధీ

1833 నాటి శాస పత్రకారణంగా, ఈస్ట్ ఇండియా కంపెనీ, తన వ్యాపార కార్యకలాపాలను విడిచిపెట్టింది. ఇంగ్లాండులోని బ్రిటీషు ప్రభుత్వానికి ప్రాతినిధ్యంవహించి, ఇండియాలోని బ్రిటీషు రాజ్యప్రాంతాలను పరిపాలించడం, ఇప్పుడు, దానికర్తవ్యమయింది. పరిస్థితి ప్రవృత్తులు వేరుకాలేదుకాని, వాటి వేగం ఎక్కువయింది. 1833 నాటికి, సమాజంలో కలిగిన పరివర్తన స్థిరపడింది. వేగంగా జరిగిన వ్యాపారాభివృద్ధీ, తోటల పెంపకంలో నిలువచేసిన పెట్టుబడి లాభమూ, రైల్వేలూ, ఇతర ఉద్యమాలూ, దిన దినమూ విస్తృతమగుచున్న పరిపాలన సంస్థయొక్క అవసరాలూ, ఇత్యాదులు సమాజ పరివర్తనకు ఎక్కువగా దోహదమొనర్చినవి.

ఈ కాలంలో, ఇండియా యొక్క విదేశవాణిజ్యం ఒక్కసారిగా, అధికమయింది. 1840 లో ఎగుమతులు 120 లక్షల పౌనుల విలువగలవి, 1860 నాటికి 279.6 లక్షల పౌనులకు పెరిగినవి. అదేకాలంలో, దిగుమతులు 58.32 లక్షల నుండి 242.8 లక్షలకు అధికమయినవి. 1860 వ నాటి ఎగుమతులలో, ముడిప్రత్తి విలువ 56.4 లక్షల పౌనులు; అనగా, మొత్తం ఎగుమతిలో నాల్గవ భాగం, ఎగుమతియైన అపీమువిలువ 90.5 లక్షలు; అనగా మొత్తం ఎగుమతిలో మూడవ భాగం. ఎగుమతి ధాన్యాల విలువ 35.9 లక్షలు; అనగా మొత్తంలో ఎనిమిదవవంతు.

ఈ వాణిజ్యంలో దేశీయులకు లభించిన లాభం స్వల్పమైనదే, కాని ఉపేక్షించదగినంత అల్పంకాదు. కొందరు దేశీయులు స్వతంత్రంగానూ, కొందరు పాశ్చాత్య ఎగుమతి దారులకు ఏజెంట్లగానూ ఉండి, వ్యావసాయికపదార్థాల ఎగుమతి వ్యాపారంలో పాల్గొన్నారు. అపీము ఎగుమతిలో, ముఖ్యంగా, వీరికి భాగమెక్కువ. ఈ క్రింది పట్టిక-1846 డిసెంబర్ 7 నుండి 1847 జూలై 12 వరకూ గల కాలం-ఈ విషయాన్ని ధ్రువపరుస్తుంది.

| అపీము పెట్టెలను కొన్న కంపెనీలు | | సంఖ్య. |
|---|---|---|
| యూరోపు, అమెరికా వర్తకులు. | — | 5715 |
| బెంగాలీలు—(యూరోపు వారికొరకు) | — | 5150 |
| బెంగాలీలు—(దేశీయుల కొరకు) | — | 1505 |
| మార్వారీలు, ముఘలులు, పార్సీలు | — | 7094 |
| జ్యూయిష్‌జాతి వారు | — | 2175 |
| మొత్తం- | | 21,639 |

మార్వారీలు, మొగలులు, పార్సీలూ కలిసి మొత్తం వ్యాపారంలో మూడవవంతు నాక్రమించినారని, దీనినిబట్టి తెలుస్తుంది. పార్సీలకూ, మార్వారీలకూ, తర్వాత, ఎగుమతి వ్యాపారంలో బెంగాలీ వారి సంఖ్య పెద్దది.

ఇంగ్లాండునుంచీ దిగుమతియైన సరకులను దేశంలో సరఫరాచేయడానికై, ఒక ఏజెన్సీ సంస్థను నెలకొల్పవలసిన అవసరమేర్పడింది. రాజధానీనగరాలలోనూ పాశ్చాత్య వాడుకదార్లున్న ప్రధాన సైనిక స్థావరాలలోనూ, ఇంగ్లీషు పరిపాలకులను నిలువచేసిన ఏజెంట్లు సాధారణంగా యూరోపియనులే ఐనా, పార్సీలూ గుజరాతీలూ బొంబాయిలోనూ, పార్సీలూ బెంగాలీలూ కలకత్తాలోనూ, ఏజెన్సీలో కొంత పరిమితభాగాన్ని సంపాదించుకొన్నారు. అంతర్భాగాలలో మాత్రం సరకుల సరఫరా అంతా దేశీయుల చేతులమీదుగనే జరుగుతూ వచ్చింది. ఈ క్రొత్త ఉద్యమంలో పెట్టుబడి పెట్టినదేశీయవర్తకులకు శీఘ్రకాలంలో, సామాజిక గౌరవ ప్రతిష్ఠలు సిద్ధించినవి. పశ్చిమోత్తర ప్రాంతాలలోని వర్తకసంఘం యొక్క సంపదనుగూర్చి, ఆర్, ఎమ్, బర్డ్ (R. M. Bird) సాక్ష్యమిచ్చియున్నాడు. "పశ్చిమోత్తర ప్రాంతంలోని అనేకప్రదేశాలలో, దేశీయులవద్ద నిలుపధనం అధికంగా ఉన్నది. అనేకములైన వస్తువులపై వారు చట్టావ్యాపారం చేస్తున్నారు. మిరాజ్‌పూర్, బనారసులు కూడా, ఈ విధంగానే, మితంకాని ధనానికి నిలయాలు. ఆగ్రాకంటెనూ సంపన్నలక్షణాలతో కూడినదీ, ధనాభివృద్ధి అవకాశాలుకలదీ, ఐన, నగరాన్ని నేనింతవరకూ చూడలేదు. కాని వారు తమ సంపదను, ఎట్టి పరిశ్రమావృద్ధికీ, వినియోగించడం లేదు." ఇది అతని సాక్ష్యం. మరియొక ప్రశ్నకు సమాధానంగా అతడు,- బనారసు వర్తకుడైన ముత్తీరామువద్దనూ, లక్నో వర్తకులైన 'షా',ల (Shas) వద్దనూ, చెరి 40 లక్షల పౌనుల విలువగల ధనమున్నదని వివరించినాడు.

యూరోపియను వర్తక సంస్థలలోనూ, బ్యాకింగుసంస్థలలోనూ, భారతీయులు కూడా కొంతభాగాన్ని సంపాదించుకొన్నారు. లాంగర్‌విల్ క్లార్క్ (Longreville clarke)తో ద్వారకనాథ్‌ఠాగూర్ కూడా, యూనియన్ బ్యాంకుకు డైరెక్టరుగా ఉండడము, ఇందుకొక నిదర్శనము. ఈ విధంగానే, 1804లో, ఇండియా ఇంగ్లాండులమధ్య రవాణాలకు అనుకూలించే నావికా సంస్థను స్థాపించడానికై, కలకత్తాలోని దేశీయవర్తకులూ, యూరోపియనువర్త

కులూ, చేరి ఈస్ట్ఇండియా స్టీమ్ నావిగేషన్ కంపెనీ అధ్యక్షుడైన, టి. ఏ కర్టిస్‌ను (Mr. T. A. Curtis) ఆహ్వానించిరి.

1833 నాటికి, ప్రపంచ పారిశ్రామిక రంగంలో ఇంగ్లాండు ప్రముఖస్థానం వహించింది. ఇతర దేశాలలో కంటె ముందుగా, పారిశ్రామిక విప్లవము ఇంగ్లాండులో జరగడంవల్ల, నెపోలియన్ యుద్ధాలలో విజయాన్ని సంపాదించ డానికి ఇంగ్లండు సమర్థమయింది. ప్రపంచమంతటా సామ్రాజ్యాన్ని నెలకొల్ప డానికి తగిన శక్త్యుత్సాహాలను ఈ విప్లవం కలిగించింది. అట్లే, అన్ని ఖండాల్లోని ఉద్యమాల్లోనూ, పెట్టుబడి పెట్టడానికి తగినంత సంపన్నమైనదిగా, ఇంగ్లాండును తయారుచేసింది కూడా, ఈ పారిశ్రామిక విప్లవమే.

*యూరోపియను పారిశ్రామిక ఉద్యమాభివృద్ధి:* పద్ధెనిమిదో శతాబ్దపు కడపటి విభాగంనాటికి, ఇంగ్లీషు వారి మూలధనము, ఇండియాలోని యాంత్రిక పరిశ్రమలో ప్రవేశించింది. ఇంగ్లాండులోనూ, ఇతర యూరోపియను దేశాల బజారులలోనూ, నీలిమందు ఎక్కువగా, ఆవశ్యకమైనందువల్ల, ఇండియాలో దాని ఉత్పత్తిని, ఇంగ్లీషువారు తమ మూలధనంతో, 1779 లో ఆరంభించిరి. 1780-1802 మధ్య కాలంలో, నీలిమందును కొనడానికై, అపారమైన ధనాన్ని వెచ్చించిరి. పదిలక్షల పౌనుల దాకా, దానికై ధనాన్ని ముందుగనే ఇచ్చినారు. దీనివెంబడే, దూదివస్త్రాలను, తయారు చేయడానికి కూడా, ప్రయత్నం గావించిరి. కాని, ఆ ప్రయత్నము శీఘ్రమే అంతమొందింది. యూరోపియను యంత్రాలనూ, యూరోపియన్ సాంప్రదాయిక విజ్ఞానాన్నీ ఉపయోగించి, బెంగాలులో, వ్రాతకాగితాన్నీ, ముద్రణకాగితాన్నీ తయారు చేయడానికి కూడా, ప్రయత్నాలు చేసినారు.

కాని, 1833 వరకూ, ఒక క్రమప్రణాళిక ననుసరించిన పెట్టుబడీ, దాని అభివృద్ధికి సక్రమమార్గమూ, ఏర్పడలేదు. శాసపత్రానికి (Charter) పునర్జీవనం కలిగించే సందర్భంలో (1837), పార్లమెంటు సెలెక్టు కమిటీవారు, ఇండియా కంపెనీవారి వ్యవహారాలనుగూర్చి ఒక విచారణ జరిపినారు. ఆ కమిటీ ఎదుట సాక్ష్యమిచ్చిన వారిలో, ఇంగ్లాండులోని వర్తక సంఘాలూ, పారిశ్రామిక సంఘాలూ కూడా చేరినవి. మూలధనాన్ని ఇండియాలో నెలకొల్పడానికీ, యూరోపుదేశీయులకు ఇండియాలో స్థిరనివాసము ఏర్పరచడానికీ కూడా ఇష్టం ఉన్నట్టుగా ఈ విచారణలో స్పష్టమయింది. పెట్టుబడివల్లనూ, ఆంగ్లేయుల నివాసంవల్లనూ, కేవలం ధన సంబంధమైన లాభంమాత్రమేకాక, ఇండియాదేశము ఆర్థికంగానూ, రాజకీయంగానూ తమ స్వాధీనంలో ఉండగలదని వాదించి నారు.

దీనినిబట్టి ఇంగ్లీషువారి జాతీయాశయమెట్టిదో స్పష్టంగా బయటపడింది. బ్రిటీషు సామ్రాజ్య ప్రయోజనాల కుపయోగించే వలస రాజ్యంగా, ఇండియాను తయారుచేయడమే వీరి ఆశయమని తేలింది. ఇంగ్లాండులోని పరిశ్రమలకు అవసరములైన ముడిసరకులను తయారుచేసి, ఇంగ్లీషువారి ఆవశ్యకములను

తీర్చడమూ, బ్రిటనులో తయారైనవాడుక సామగ్రిని ఉపయోగించుకొని, ఇంగ్లాండు కార్మికులకు పనికల్పించడమూ,—అనే కర్తవ్యాలను ఇండియా నిర్వహించవలసిందిగా నిర్ణయమయింది. ఇంగ్లాండు నుంచి దిగుమతి అగుచున్న వస్తువులకు పోటీగా పరిశ్రమలను ఇండియాలో స్థాపించడమూ, అటువంటి వాటిలో, ధనాన్ని పెట్టుబడి పెట్టడమూ,-నిషేధింపబడినవి. కనుక, ఇంగ్లాండు నుంచీ వచ్చే మూలధనమంతా,- నీలిమందూ, టీ, కాఫీ,-తోటలను పెంచడము, రైల్వే, నావలు, బ్యాంకింగు, విశాలమైన వ్యాపారము, మొదలైన ఉద్యమాలలో మాత్రమే, పెట్టుబడిగా ఉపయోగించడమూ జరుగునట్లుగా నిశ్చయమయింది.

ఇంగ్లాండు ప్రభుత్వము నిర్ణయించి, నిశ్చయించిన ఈవిధానాన్ని, కంపెనీ అన్ని విధాలా అమలు పరచింది. పాశ్చాత్యులు భూములనుకొని, వాటిని సాగించుకోడానికీ, కూలీలను నియమించుకొని తోటలను అభివృద్ధిపరచుకోడానికీ, తగిన అన్ని అవకాశాలనూ కంపెనీ కలిగించింది. 1822లో కాఫీ ఉత్పత్తిదారుగా డా. వాలిక్ (Dr. Wallick) దారి చూపెను. కాఫీపొలాలను కొని, అధీనంలో ఉంచుకొనే విశేషాధికారము, పాశ్చాత్య ఉత్పత్తి దార్లకు 1824 లో సిద్ధించింది.

టీ తోటలను పెంచడం, పిదారంభించిన మరియొక ఉద్యమము. చైనా నుంచీ ఇంగ్లండుకు టీ దిగుమతి అనిశ్చితమైనదిగా ఉండినది. కనుక, టీ ఉత్పత్తిని ఇండియాలో సాగించే అభిప్రాయం ఆంగ్లేయులకు కలిగింది. 1832 నాడే, డా. వాలిక్ ఈ విషయమై బ్రిటీషు ప్రభుత్వానికి వ్రాసియున్నాడు. "పదే పదే మనకీ విషయంలో ఏర్పడుచున్న పరిస్థితులను పరిశీలిస్తే సక్రమమైన నిర్వహణతో టీ తోటలను ఇండియాలో చక్కగా పెంచగలమనే దృఢవిశ్వాసము ఏర్పడుతున్నది. అది కూడా శీఘ్రంలో సంభవిస్తుందనీ, ఇండియాలోని గౌరవనీయమైన ఈస్ట్ ఇండియా కంపెనీవారి విశాలభూభాగంలో, విస్తారంగా ఈ పంటను పండించగలమనీ, నాదృఢ విశ్వాసము. అట్టి పరిస్థితిని ఏర్పరచుకోవడంతో, మనము, నాగరకజీవనంలో అతి ముఖ్యమూ సౌఖ్యదాయకమూ ఐన, టీ, కొరకు, ఒక నిరంకుశ జాతియొక్క ఇష్టానిష్టాలపైననూ, చపల స్వభావము పైననూ, ఎంతోకాలము ఆధారపడియుండనవసరం ఉండదు."-ఇది అతనిసలహా. 1834 లో, కంపెనీ వారిసభ, ఒక సంఘాన్ని నియమించి, టీ తోటలను ఇండియాలో పెంచే విషయమై, సమగ్ర విచారణ సలిపి, నివేదికనూ, ప్రణాళికనూ సమర్పింపవలసిందిగా ఆదేశించింది. 1838 లో, ప్రథమంగా భారతదేశపు, టీ, బజారులలో ప్రవేశించింది. ఆ పిమ్మట, టీ వ్యాపారం, అతివేగంగా అభివృద్ధి చెందింది. 1850 లో, 1876 ఎకరాలు టీ, పండిస్తూ వచ్చినవి. సాలుకు 216,000 పౌనుల తూకంగల టీ ఉత్పత్తి అయింది. 1859 నాటికి, టీ పంటపొలం 1599 ఎకరాలై, సాలుకు 1205,689 పౌనుల టీ ఆకును ఉత్పత్తి చేసింది. టీ ఆకు పరిశ్రమ ఈ విధంగా అభివృద్ధి పొందడంతో, అస్సాములోని పొలాలకై, ఉత్పత్తి దారులలో, పై పోటీకలిగి, భూమి విలువ అధికంగా పెరిగింది.

ముడి ప్రత్తి ప్రధానమైన మరియొక, అవసరపదార్థం. కనుక దానిని

పండించడంలో కూడా ఎక్కువ ఉత్సాహముతో, ప్రయత్నం జరిగింది. కాని, పత్తిపంటను అభివృద్ధి చేయడంలో, ఆంగ్లేయులు ఆసక్తిచూపలేదు, కనుక తగిన పెట్టుబడి లభించలేదు. కనుక, ఈ పంటను విస్తృతి గావించడం కంపెనీవారి కర్తవ్యమయింది. ఇది బ్రిటీషువారి సామ్రాజ్య విధానానికి అనుకూలమైనదే.

ప్రత్తిపంటను ప్రోత్సహించడంవల్ల, ఇండియాలో వలసరాజ్య ఆర్థిక వ్యవస్థ ఏర్పడి, బ్రిటనుదేశం యొక్క అభ్యుదయం జరుగుతుంది. బ్రిటనులోని అమూల్యములైన పరిశ్రమలు ముడి ప్రత్తిపై ఆధారపడియున్నవి. కనుక, ఉత్తమరకమైన పత్తిని ఇండియాలో పండించినట్టయితే, ఇంగ్లాండు అట్టి సరకుకై, ఇతర దేశాలపై ఆధారపడవలసిన అవసరం ఉండదు. ఈ ముఖ్య విషయాన్ని గూర్చి, కంపెనీ డైరెక్టర్ల సంఘానికి ఇదివరకే, 1829 లోనే, ప్రత్యేకంగా తెలియపరచడంజరిగింది ప్రత్తిపంటను విస్తరించడంవల్ల ఇంగ్లాండూ, ఇండియా కూడా లాభంపొందినవి. బొంబాయి గవర్నరు, సర్ జాన్ మాల్కాం (Sir John Malcolm), దీనిని గూర్చి, "సుక్షేత్రములైన మన జిల్లాలలోని పంటలలో ప్రధానమైనది ప్రత్తిపంట. మంచిరకం ప్రత్తిని పండించడానికీ, పంటను అభివృద్ధిపరచడానికీ, మనం చేసేప్రయత్నాలన్నీ మన వ్యావసాయిక వ్యవస్థను పెంపొందించడమేకాక, మన ఆదాయాన్ని కూడా పెంచగలవు." అని వ్రాసి యున్నాడు.

ప్రత్తిపంటకు ప్రోత్సాహమిచ్చే ప్రభుత్వ విధానం, కంపెనీవారి పరిపాలన కాలమందంతటా, అటుపిమ్మట కూడా, అనుసరింపబడింది. 1862 లో ఆరంభమైన అమెరికా ఆంతరంగిక యుద్ధంవల్ల, ఆ దేశమునుంచి, ఇంగ్లండుకు దిగుమతి యగుచుండిన ముడి ప్రత్తి సరఫరా ఆగిపోయింది. అందుతో, ఇండియాలో ప్రత్తిపంటను పెంచే విధానానికి ఇంకనూ ప్రోద్బలం కలిగింది. ఈ అమెరికా యుద్ధకాలంలో ఇండియానుంచీ పత్తి ఎగుమతి అధికమై, దేశంలో, పత్తి పండించే రైతుకు,- కొంతకాలమే ఐనా,- అభ్యుదయ హేతువయింది.

ప్రత్తిపంటా, దానిని జమచేయడమూ కూడా, దేశీయుల అధీనంలోనే ఉండినది. ఈ కారణంవల్ల, బొంబాయి ప్రాంతంలోని దక్కనుజిల్లాలలో ముఖ్యంగానూ, మధ్యప్రాంతంలోనూ, బీరారులోనూ, పత్తిపంటకు ద్రవ్యాన్ని సమకూర్చి, దాన్ని వర్తకమార్గాల్లో ప్రవహింపజేసే మధ్యస్థుల వర్గం, ఒకటి ఏర్పడింది. కొద్ది మూలధనంగల వ్యక్తులు కూడా, ప్రత్తివ్యాపారంలో ప్రవేశించి, ప్రత్తిని ఉత్పత్తిచేసీ, దాని క్రయవిక్రయముల నొనర్చి, సంపదను గడించినారు.

బెంగాలులోని పట్టుపరిశ్రమ, పద్దెనిమిదో శతాబ్దపు కడపటి రోజులనుండీ క్షీణదశలో ఉండినది. కాని, ఇటాలియనుల ప్రోత్సాహోద్యమాల కారణంగా,- అందును ముఖ్యంగా, ముట్టో (Mutto) ప్రోత్సాహంవల్ల- పట్టుపరిశ్రమ బొంబాయి- దక్కనుప్రాంతంలో విజయవంతంగా అభివృద్ధి చెందింది. (1880 ప్రాంతం). ఈ ఉద్యమం, మూలధనంగల దేశీయుల నాకర్షించింది. ఉద్యమం సఫలమౌతుందనే విశ్వాసంతో మూలధనాన్ని సమకూర్చిరి.

ప్రత్తి, నీలిమందు, అపీము, టీ ఆకు, కాఫీ,- వీటి పంటలను విస్తరించడము, జమీందారులకూ, సామాన్యవర్తకులకూ కూడా లాభదాయకమయింది. ఈ కారణంవల్లనే, ప్రజాభిప్రాయాన్ని గ్రహించిన, విజ్ఞానవంతులైన రామ్ మోహన్‌రాయ్, ద్వారకనాథ్‌టాగోర్‌వంటి ప్రజానాయకులు ఈ ఉద్యమానికి సహకరించినారు. "నీలిమందును పండించడంవల్లనూ, దేశంలో యూరోపియనుల నివాసంవల్లనూ, ప్రజానీకం బాగుపడిందని నేను గుర్తించినాను. జమీందారులు ధనవంతులై అభ్యుదయాన్ని పొందినారు. రైతులపరిస్థితి కూడా, ద్రవ్యవిషయంలో బాగుపడింది. నీలిమందు ఉత్పత్తిజరగని ప్రదేశాల్లోని రైతులకంటెను ఎక్కువగా ఈ రైతులు సుఖజీవనం గడుపుతున్నారు. మొత్తంమీద, ఈ యూరోపియను ఉత్పత్తిదార్లు, ఇతర పాశ్చాత్య వర్తకులకంటెనూ, పాశ్చాత్యోద్యోగుల కంటెనూ ఎక్కువ ఉపకారం దేశప్రజకు గావించినారు,"—— అని తమ అభిప్రాయాన్ని తెలిపియున్నారు.

*పరిపాలన-మధ్యతరగతి అభివృద్ధి* ; (1833-58) మధ్యతరగతి ఏర్పడడానికి వాణిజ్యాభివృద్ధి ఒక్కటే కారణముకాదు. బ్రిటీషువారి న్యాయపరిపాలన వ్యవస్థా, దేశపరిపాలన వ్యవస్థా, ఆంగ్లవిద్యావిధానమూ కూడా, వ్యాపారాభివృద్ధితో సమానంగా, కారణములై మధ్యతరగతి వారి సంఖ్య నభివృద్ధిపరచడమే కాక, వారికి అన్యోన్యమైన సంయోగాన్ని కూర్చినవి.

విశ్వాస బాధ్యతలతో కూడిన అధికారపదవులన్నిటి నుంచీ భారతీయులను బహిష్కరించిన కారన్ వాలీస్ పరిపాలన విధానమువల్ల, భారతీయులు స్వల్ప వేతనములతో కూడిన చిన్న ఉద్యోగములలోనే నిలువ వలసిన వారైరి.

కాని, దేశపరిపాలన కార్యక్రమాన్నంతా యూరోపియను ఉద్యోగులతోనే నడపడం, అధిక వ్యయంతో కూడినది మాత్రమేకాదు; అయుక్తమైనదీ, పొసగనిదీను. కనుక బనారసులోనూ, తత్పరిసరపు జిల్లాలలోనూ, కానుంగో, నయాబ్ తహసీల్దారు పదవులను స్థిరపరచి, వాటిని భారతీయాధికారుల అధీనమందుంచిరి. ఇదే పద్ధతిలో, మదరాసు, బొంబాయి రాజధానుల్లోని పరగణా అంతస్తు పదవుల్లో, భారతీయోద్యోగులే, నియమితులైరి. సదర్ అమీన్ పదవి, 1803 లో, స్థాపితమయింది. ఆసంవత్సరమే ఇండియన్ మునసపుల అధికారాలు ఎక్కువచేయబడినవి. ఈ ఉద్యోగస్థులను, హేస్టింగ్సు ప్రభువు, కంపెనీవారి సేవలో స్థిరపరచి, వీరిపేర్లను వేతన పత్రంలో చేర్చినాడు. వారి వేతనములు కూడా అధికమొనర్పబడినవి. బెంటింక్ హయాములో సబ్‌జడ్జిపదవి స్థాపితమయింది. ఇదే విధంగా, పశ్చిమోత్తర ప్రాంతాలలో, భారతీయులు డిప్యూటీ కలెక్టర్ల పదవులలో నియోగింపబడిరి. ఇది కూడా బెంటింకు హయాములోనే జరిగింది.

ప్రభుత్వోద్యోగముల విషయంలో, భారతీయులపట్ల విభేదభావంతో అవలంబిస్తున్న విధానం, 1833 లో, తొలగిపోయింది. ఆ సంవత్సరం ప్రకటింపబడిన నూతన శాసపత్రం (Charter) ఈ మార్పునకు కారణము. ఇంతటి నుంచీ,

ప్రభుత్వానికి చెందిన ఉద్యోగముల ప్రవేశవిషయంలో, ఏవ్యక్తియొక్క వర్ణము కానీ, కులము, మతము, జననస్థలములలో ఏవికానీ, ఏవ్యక్తికీ ప్రతిబంధకము కాకూడదు, అని శాసపత్రంలోని ఒక నియమనం ప్రకటించింది. ఈ సూత్రం చాలవరకు, పవిత్రాశయంగానే ఉండిపోయింది. కంపెనీ వారి ఆర్థిక పరిస్థితి క్లిష్టమై యున్నందున, ఒప్పందంతో కూడిన అధికారుల (Covenanted Services) సంఖ్యను తగ్గించి, బెంటింకు, క్రింది పదవులలో భారతీయోద్యోగుల సంఖ్యను అధికంచేయవలసి వచ్చింది. 1828 లో, ఇండియా ప్రభుత్వ సేవలో, మొత్తం 1197 మంది భారతీయాధికారులుండిరి. 1849-50 నాటికి వీరి సంఖ్య 2813 కు, అభివృద్ధిచెందింది.

సంఖ్యలో అభివృద్ధి మాత్రమేకాక, భారతీయుల వేతనాల విషయంలోనూ, ప్రతిష్ఠ విషయంలోనూ అభివృద్ధి జరిగింది. 1828 లో, ఏ భారతీయోద్యోగికి కూడా 250 రూపాయలకు మించిన వేతనం ఉండినదికాదు. సాదర్ అమీను వేతన ప్రమాణం 250 నుండి 500 వరకూనూ, ముఖ్యసాదర్ అమీను పదవికి 500 నుండి 600 వరకూ,-బెంటింకు నిర్ణయించినాడు. ఒప్పందపు అధికార్లకు బదులుగా, ఇతరాధికారులను డిప్యూటీ కలెక్టర్లుగా నియోగించే నియమనం మొదటిసారిగా, 1843 లో, అమలు జరిగింది. 1849 లో, సంవత్సరానికి 240 పౌనులు,- అనగా నెలకు 300 రూపాయలు వేతనం పుచ్చుకొనే అధికార్ల సంఖ్య 493 కు తక్కువకాదు.

పరిపాలన వ్యవస్థకనుగుణంగా, విద్యావిధానం, సంయోజన మొనర్ప బడింది. సదర్ దివానీ అదలత్‌లోనూ. జిల్లాస్థాయి న్యాయస్థానాల్లోనూ, న్యాయ వాదులుగా పనిచేయుచుండిన వకీళ్ళందరూ, పూర్వం కలకత్తా 'మదరసా'లోనూ, బనారసు సంస్కృత కళాశాలలోనూ చదివినవారే. సివిల్ న్యాయస్థానాలలో వకీళ్ళుగా పనిచేయడానికి పర్షియన్, సంస్కృత భాషల జ్ఞానం అవసరంకాదని, తర్వాతి కాలంలో నిశ్చయింపబడింది. కంపెనీ ప్రభుత్వము, తన నియమనాల నన్నిటినీ ఆంగ్లభాషలో ప్రచురించి యుండడంవల్ల, వాటిని సక్రమంగా గ్రహించ డానికి ఆంగ్లభాషా పరిజ్ఞానం మాత్రమే అవసరమయింది. సర్కారు విద్యా లయాలలో సక్రమంగా విద్యాభ్యాసం పూర్తిచేసి, క్రమబద్ధమైన యోగ్యతా పత్రాలను సంపాదించుకొని, హిందూ మహమ్మడన్ న్యాయశాస్త్రంలో తగి నంత పాండిత్యాన్ని, బ్రిటీషుప్రభుత్వం వారు ప్రకటించిన నియమాలనూ, చక్కగా గ్రహించిన భారతీయులందరూ, నగరన్యాయస్థానాలలోనూ, జిల్లా న్యాయస్థానాలలోనూ. వకీళ్ళుగా వ్యవహరించడానికి అర్హులని 1826 లో ప్రకటనగావింపబడింది.

ఇంతవరకూ, ప్రాచీన భాషలైన పర్షియను, సంస్కృతములలో విద్య గరపుతూ, హిందూ మహమ్మడన్ న్యాయశాస్త్రాలను, బోధించుచుండిన, రెండు కళాశాలలలో విద్యాభ్యాసం గావించినవారు మాత్రమే న్యాయ వాదులుగా వ్యవహరించడానికి అర్హులై యుండిరి. ఇప్పుడట్లుకాక, ఏ సర్కారు

విద్యాలయంలో చదివినవాడైనా, ప్రభుత్వోద్యోగాలలో ప్రవేశించడానికి, ఆంగ్లభాషలో న్యాయశాస్త్రం చదివి యోగ్యత సంపాదించుకొని న్యాయవాదిగా వ్యవహరించడానికి తగిన అవకాశమేర్పడింది.

1833వ నాటి శాసనపత్రంలోని నియమనాలు, ఇరవై యేండ్ల పర్యంతం నామ మాత్రంగా నిలిచినవేకాని అమలులోనికి రాలేదు. సరిగ్గా, బ్రిటీషుపార్లమెంటులో జరిగినచర్చలో (1853), కంపెనీ ఉద్యోగాలలో భారతీయుల ప్రవేశాన్ని గురించిన విషయాన్ని బ్లాకెట్, జాన్ బ్రైట్‌లు (Blacket and john bright) ప్రవేశపెట్టిరి. 1833లో శాసపత్రాన్ని ఆమోదించిన సందర్భంలో ప్రభుత్వం ఇచ్చిన వాగ్దానానికీ, పరతుకూ విరుద్ధంగా, కంపెనీ ప్రవర్తిస్తున్నదనీ, ఒప్పందపు అధికార స్థానాలనుండి భారతీయులు, ఉద్దేశపూర్వకంగా, బహిష్కరింపబడినారనీ, ఇది శోచనీయమైన విషయమనీ బ్లాకెట్, ఖండితంగా తన విచారాన్ని వెలిబుచ్చినాడు. పూర్వం ఎగ్జికూటివ్ కౌన్సిల్ సభ్యుడునూ, లాకమిషన్ అధ్యక్షుడునూ ఐన, కామెరాన్ (Cameron) 1848లో, చెప్పిన విషయాన్ని, ఇరువురూ ఉద్ఘాటించినారు. "ఇప్పుడు ప్రకటింపబోవు శాసపత్రం (Charter) కేవలం, కృతకమూ, అవహేళనాస్పదమైనట్టిదీ మాత్రమే అని భారతీయులెల్లరూ భావిస్తున్నారు." ఇవి కామెరాన్ వాక్యములు. తమ ప్రతిపాదనను బలపరుస్తూ, డాక్టరుచక్రవర్తి విషయాన్ని దృష్టాంతంగా, వీరిరువురూ ఉద్ఘాటించినారు. ఉన్నత విద్యార్జనకై, ద్వారకనాథ్‌టాగోర్ ఇంగ్లాండుకు పంపిన నలుగురు విద్యార్థులలో, చక్రవర్తి యొకడు. ఇంగ్లాండువైద్య విద్యలో అతడు వైశిష్ట్యం సంపాదించుకొని, ప్రఖ్యాతిచెందినాడు. అతనిని ఇండియా వైద్యశాఖలో ఒప్పందపు అధికారస్థానంలో నియోగించవలసిందిగా ప్రార్థిస్తూ, సర్. ఇంరియాన్, కామెరాన్,- ఇరువురూ కంపెనీ డైరెక్టర్ల సభకు వ్రాసిరి. కాని, ఈ సభ దీనికి సూటిగా సమాధానమివ్వక, ఒప్పందపు అధికార పదవికే మాత్రమూ తక్కువ కాని పదవిలో చక్రవర్తి నియోగింపబడినాడని, డొంకతిరుగుడు జవాబును వారికి వ్రాసినారు

ఈ పరిస్థితి భారతీయులకు అన్యాయ మొనర్చడం మాత్రమేకాక, ఇంగ్లాండుకు సంక్షోభను తెచ్చిపెట్టేది కూడా కావడంవల్ల, దీనిని తక్షణం గమనించి, చక్కబెట్టవలెనని వీరు వాదించిరి. కల్నల్ సైక్స్ 1849 లో, వివరించినట్లుగా, "నా దృఢవిశ్వాసాన్ని హృదయపూర్వకంగానూ, సత్యబద్ధంగానూ, వ్యక్తంచేస్తున్నాను. ఇండియాలోని ఇనాము భూములనూ, ముక్తభూములనూ, అనుభోక్తల నుంచీ తప్పించి, మన స్వత్వం గావించుకొంటూ ఉన్న నిరంతరమైన, విధానం, చాల అపాయకరమైనది. భారతదేశంలో మన ఆధిపత్యానికీ, మన ఆర్థికాభ్యుదయానికీకూడా, ఈ పద్ధతి విపత్కరమైనట్టిది. సర్కారుద్యోగుల ప్రభుత్వాన్ని ఒక ప్రక్క నెలకొల్పడమూ, మరియొక ప్రక్క గులాములజాతిని ఏర్పరచడమూ, మాత్రమే మన ప్రధానాశయ ప్రయత్నాలని ప్రజానీకం భావించక తప్పదు." ఇవి అతని వాక్యాలు.

విజ్ఞానవంతులైన ఆంగ్లేయులీవిధంగా, తమ ఆక్షేపణాభిప్రాయాలను వెలిబుచ్చుతున్నప్పటికీ, ప్రయోజనం లేకపోయింది. భారతీయులను ఉన్నత పదవులనుంచీ, బహిష్కరించడం, విక్టోరియారాణీ ప్రకటనకాలం (1858) వరకూ నిరంతరాయంగా సాగుతూనే వచ్చింది. 'హిందూ పేట్రియట్'లోని పత్రికావిలేఖరి 1860 లో వ్రాస్తూ, "ఆంగ్లేయులైన మీరు, భారతీయ యూరోపియను చరిత్రనూ, తత్త్వశాస్త్రాన్నీ బోధిస్తున్నారు. కాని, భారతీయునకు అతని దేశపరిపాలనలో భాగం కల్పింపరు. ఇది యొక విరోధాభాసమైయున్నది." అని విమర్శించినాడు. రోమను సామ్రాజ్యపర్యవసానాన్నీ, భారతదేశంలో జరిగిన సైనిక విప్లవాన్నీ, ఈ విలేఖరియే ఇంగ్లీషువారికి, జ్ఞాపకంగావించి, తప్పులను త్వరలో సవరించుకోవలసిందని హెచ్చరించినాడు.

ప్రభుత్వానికి భారతీయులపట్ల విశ్వాసంలేకపోవడమే, ఉన్నత సివిల్ మిలిటరీ పదవులనుంచి వారిని బహిష్కరించడానికి, కారణమయింది. 1861 నాటి 'సివిల్ సర్వీస్ బిల్'ను గూర్చి, 'ఫ్రెండ్ ఆఫ్ ఇండియా', పత్రిక గావించిన వ్యాఖ్యానము, ప్రభుత్వమూ, యూరోపియను అధికారులూ వహించిన అభిప్రాయాన్ని సమగ్రంగా నిరూపిస్తుంది. "ఇపుడు ఉద్యోగాలలో ఉన్న, మర్యాదస్థులైన భారతీయుల వేతనాల అభివృద్ధికై, మేమెంతో ప్రచారం చేసినాము. ప్రతి ఉన్నత న్యాయస్థానంలోనూ, ఒక దేశీయ న్యాయాధిపతిని నియమించవలెనని కూడా, కోరియున్నాము. కాని, భారతదేశీయులు క్రైస్తుమతాన్నవలంబించి, ఉన్నత పదవుల కవసరమైన, నైతిక ప్రవృత్తి, యోగ్యత, తమకున్నవని నిరూపించే అంతవరకూ ఛార్లెస్‌ట్రెవిల్యన్ వంటి హఠమారి ప్రభువు, సిపాయి సైన్యాన్ని బోలిన, ఉపద్రవకరమైన అధికార వర్గాన్ని, నెలకొల్పునని ఊహించడం సాధ్యంకాదు. పోలీసుశాఖపట్లనూ, అమ్లాపట్లనూ, ప్రజలకుగల ద్వేష భావంకంటెనూ, అధికమైన ద్వేష భావం ఈ అధికారుల పట్ల ఉన్నదన్న విషయము కూడా అతనికి తెలిసియున్నదే,.........ధనమూ, సామర్థ్యమూగల, దేశీయ కులీనులకు, గౌరవమూ, వేతనమూ, పదవీ, లభ్యం కావడంలో మాకెట్టి అభ్యంతరమూలేదు. కాని, అధికారాన్ని మాత్రం వారి కప్పగించడం తగదు."

యూరోపియనులతో సమానములైన యోగ్యతలనూ, అర్హతలనూ, శిక్షణనూ, పొందియున్నా కూడా, గమినింపక, భారతీయులపట్ల, విభేదభావమూ, అపనమ్మకమూ వహించి, వారి స్వత్వమైయున్న అధికారభాగాన్ని వారికి ఇవ్వక నిరాకరించడము, భారతీయులలో, ఐక్యభావం ఏర్పడడానికి, ముఖ్యకారణమయింది. దేశపు వివిధ భాగాలలోని విద్యావంతులందరూ, ఈ విధమైన నిరాకరణకూ, తిరస్కారానికీ గురియైనవారే కావడంవల్ల, వారిలో భావైక్యము ఏర్పడి, తీవ్రజాతీయ భావోదయం కలిగింది.

***ఉత్తరభారత భాగంలోని మధ్యతరగతి :*** సముద్ర తీరనగరములైన బొంబాయి, కలకత్తా, మదరాసులు, యూరోపియను వర్తకుల వాణిజ్య కార్యకలాపాలకు, మొదటినుంచీ, వ్యవహారరంగములు ఈ ప్రాంతాలలో మధ్యతర

గతి వర్గం ఏర్పడిన విధానమువేరు; ఉత్తరభారత ప్రాంతాల్లో మధ్యతరగతి సృష్టి విధానం వేరు. బ్రిటీషువారి ఆక్రమణ తర్వాత చాలకాలంవరకూ, ఇప్పటి ఉత్తర ప్రదేశ్, ఢిల్లీప్రాంతాలు, పాశ్చాత్య వాణిజ్యాన్ని ,స్వయంగా నడపడంకానీ, లేదా అందులో భాగం వహించడానికికానీ, పూనుకోలేదు. కాని, బ్రిటీషువారి రాకకు పూర్వమే, ఈ ప్రాంతాలలో ధనవంతములైన వర్తకసంఘాలు ఉండినవి.మిరాజ్ పూర్, ఆగ్రా, లక్నో, ఢిల్లీ నగరాలు,- అభ్యుదయ స్థితిలోనున్న వ్యాపార కేంద్రాలు మాత్రమేకావు. రాజకీయప్రాబల్యానికీ, పలుకుబడికీ, స్థానాలు. అంతర్దేశీయ వ్యాపారంసాగిస్తున్న వ్యాపారస్థులు, వణిజులూ, బ్యాంకర్లు, పరిపాలకులు, రాజాస్థానసభ్యులు, విద్యావేత్తలు,- ఇత్యాదివర్గాలతో కూడిన, ధనవంతమూ, ప్రబలమూఐన, మధ్యతరగతి ఈప్రాంతములో ఉండినది. ప్లాసీ యుద్ధానంతరము, అంతర్దేశీయ వ్యాపారాన్ని కంపెనీ ఉద్యోగులు, తమ ఏకైక స్వామ్యంగా చేసుకోవడమూ, ఆ తర్వాత 1803లో బ్రిటీషువారు ఆగ్రాను, తమ రాజ్యభాగంగా చేసుకోవడమూ, ఉత్తరభారతంలోని వ్యాపార సంఘం వారికి, గొప్ప ఆఘాతమయింది. వ్యాపార, వాణిజ్యాలకు బొంబాయి, కలకత్తాలు, నూతన కేంద్రములైనాయి. గంగాయమునా నదీతీరాల్లోని అంతర్దేశీయ వ్యాపార కేంద్రాలు, తమ పూర్వపు ప్రాధాన్యాన్ని కోల్పోయినవి. ఈ విధంగా తమ ప్రాచీన వృత్తివ్యాపారాలను పోగొట్టుకొన్న వర్తకులు, పంట భూములను కొనడము, వడ్డీవ్యాపారము, చట్టావ్యాపారము జరపడము,-మొదలైన వ్యవహారాలలో ప్రవేశించిరి. ప్రభుత్వానికి ధనాన్ని రుణంగా ఇచ్చి, అందుకు ప్రతిఫలంగా భూములను పొందడము అనే పద్ధతి, ఈ ప్రాంతంలోని వ్యాపారస్థులకు సంప్రదాయ సిద్ధమైనదే. బ్రిటీషువారి రాజ్యభాగాలలో ఈ పద్ధతి జరగడానికి వీలులేదు. కనుక, వర్తకులంతతో తమ వ్యవహారాలను దేశీయ రాజ్యాలలో సాగింపనారంభించిరి. దేశీయప్రభువులకూ, ఆరాజ్యాలలోని కులీన వంశస్థులకూ, అప్పులిచ్చి, ప్రతిఫలంగా పంటభూములను కొని, వాటి ఆధారంగా అపారమైన ధనాన్నిగడించిరి. నైజాము ప్రాంతంలోనూ, ఇతర రాజులప్రాంతాల్లోనూ, కూడా, వర్తకుల ఈ వ్యవహారం సాగుతూవచ్చింది. దీనితోపాటు, ఆగ్రా, ఢిల్లీలలోని వ్యాపార సంస్థలు,-చక్కెర, ప్రత్తి, మందులు, లోహాలు, మొదలైన పదార్థాల వర్తకాన్ని స్వయంగా సాగించడానికి ప్రారంభించిరి. లక్నోలో, మోతీరాం, షా, వర్తకస్థానాలున్నూ, ఢిల్లీలో శ్రీకృష్ణ గూర్వాలా వర్తక స్థానమున్నూ, సంపదకు ప్రసిద్ధిగాంచి, 1857 విప్లవం నాటి వరకూ నిలచియున్నవి. 1853 నాడు, మోతీరాం ఆస్తి 40 లక్షల పౌనుల విలువగలదని, అంచనాగావింపబడింది. ఢిల్లీగూర్వాలాలు, ఉత్తర హిందూస్థానపు Rothschilds అని బ్రిటీషు వారి అభిప్రాయము.

బెంగాలులో వలెనే, యూరోపియను బ్యాంగులూ, పాశ్చాత్య వర్తక సంఘాలూ పోటీచేయడంవల్ల, వర్తక వ్యాపారములను వదలుకొన్న, ఉత్తర ప్రదేశ వ్యాపారసంస్థలు కూడా, భూములపై పెట్టుబడి పెట్టడం ఆరంభించి,

దేశీయ రాజ్యభాగాల్లో పెద్ద భూస్వాములైనవి. విప్లవ సందర్భంలో ఢిల్లీసార్వ భౌమునికి సహాయంగావించినారనే మిషతో, బ్రిటీషు ప్రభుత్వము ఢిల్లీ గూక్ వాలాల వంటి వర్తకులను శిక్షించి, దివాలా తీయునట్లు చేసింది. మరికొందరు పరిశ్రమవ్యాపారానికీ, దుకాణపు వర్తకానికి పూనుకొనిరి రాజధానీ నగరాల్లో సృష్టికి వచ్చినట్టి మధ్య తరగతి, ఈ కాలంలో, ఉత్తర ప్రదేశంలో ఏర్పడలేదు.

అగ్రాలోనూ, ఔధ్‌లోనూ, ఆంగ్లవిద్యాభ్యాసంకూడా మందంగానే నడిచింది. విప్లవానంతరం చాలకాలందాకా కూడా, ఔధ్ జమీందారులు ఆంగ్ల విద్యాభ్యాసానికి పూనుకోలేదు. ప్రభుత్వం వారు కల్పించిన అత్యల్పము లైన విద్యా అవకాశాలనుపయోగించుకోవడంలో, వర్తక వర్గంవారు కూడా, వెనుకబడినారు. 1860-61 నాడు పశ్చిమోత్తర ప్రాంతంలో ఉండిన, ఒకే ఒక ఉన్నత పాఠశాలలోని విద్యార్థుల సంఖ్య 127. అదేకాలంలో, బెంగాలు లోని 45 ఉన్నత పాఠశాలలలోని విద్యార్థుల సంఖ్య 5309. పంజాబులో పాఠశాలల సంఖ్య 21; విద్యార్థులసంఖ్య 1714. మదరాసులోని 11 పాఠశాల లలోనూ 2027 మంది విద్యార్థులుండిరి బొంబాయిలో 2 పాఠశాలలూ, 618 మంది విద్యార్థులు. 1861-62 నాటికి పశ్చిమోత్తర ప్రాంతంలో ఐదు ప్రభుత్వ కళాశాలలుండినవి. కాని, ఆ సంవత్సరపు ప్రభుత్వనివేదికలో,- "సంవిధానమూ, పఠనీయ ప్రణాళిక,-మున్నగు విషయములన్నిటిలోనూ, ఇవి పాఠశాలలను పోలి యుండడంవల్ల, కళాశాలలనే పేరు వీటికి వర్తించదని చెప్పవచ్చును -" అనే విమర్శకలదు వర్తకవ్యాపార విషయాలలోనూ, ఉన్నత విద్యావిషయంలోనూ, కూడా, పరిస్థితులు అనుకూలములూ, శుభసూచకములూ కావు.

దేశపు వివిధప్రాంతాలలోని, మధ్య తరగతిలోని వివిధవర్గాలకూ సామర స్యాన్ని గూర్చి, జాతీయ భావాన్ని కలిగించినవాటిలో, ముఖ్యమైనది 'న్యాయము' (Law). భారతదేశమంతటికీ సమానములైన న్యాయములూ, నిబంధనములూ, దేశచరిత్రలో, మొట్టమొదటిసారిగా ఏర్పడినవి. పౌరన్యాయా లకూ, దండనన్యాయాలకూ, సంబంధించిన స్మృతులు రచింపబడి, అవి దేశంలోని వివిధప్రాంతాలకూ, వివిధజాతి మత వర్గాలకూ, సమానంగా వర్తించేటట్లు చేయ డంతో, దేశప్రజలందరూ ఒక విధానానికి కట్టుబడిన వారైరి. ఈ న్యాయాలనూ, నిబంధనలనూ, నిర్వహించడంలో భారతీయ న్యాయవాదులూ, అధికారులూ, కూడా పాల్గొన్నారు. కేవలం తమ కక్షిదార్లు (Litigants) వీటికి కట్టుబడి యుండడం మాత్రమే ఇందుకు కారణంకాదు. న్యాయాలను ప్రవర్తింప జేయ డంలో అధికార్లూ, వాటిని వ్యాఖ్యానించి, వివరించడంలో న్యాయవాదులూ, న్యాయస్థానాలకు సహకరించినారు. సమానములైన న్యాయాలకు అందరికీ సమానమైన విధంగా వర్తింపజేసే కార్యక్రమంలో పాల్గొంటున్న కక్షిదార్లూ, న్యాయవాదులూ, న్యాయాధిపతులూ కూడా, సమానములైన ప్రయోజ నాలనూ, భావాలనూ అభివృద్ధిగావించుకోవడం తప్పదు. కనుకనే, దేశంలోని రాజకీయోద్యమానికి, న్యాయవాది వర్గం అగ్రగామి కావడం వింతకాదు.

న్యాయాలూ, పరిపాలనవ్యవస్థా, విద్యావిధానమూ, పత్రికలూ, సారస్వతమూ, జాతీయైక్యభావాన్ని గూర్చిన సంస్థలుకాగా, రాకపోకల సదుపాయాలూ, ఉత్తర ప్రత్యుత్తర సులభమార్గాలూ, ఐక్యమును సిద్ధింపజేయుటకు ప్రధానసాధనములైనవి.

రైలుమార్గాలూ— *జాతీయైక్యమూ* : బెంగాలు, బొంబాయి, మద్రాసు ప్రాంతాలలోని మధ్యతరగతుల వారందరి మధ్యా విశాలమైన సామ్యంకలదు. వారు పరస్పరం కలుసుకోడానికి సులభమూ, శీఘ్రమూ, ఘన, అవకాశాలూ, మార్గాలూ లేనంతవరకూ,-అందరికీ సమానమైన దేశభక్తి, సమానమైన ప్రజాభిప్రాయమూ, సమానమైన కార్యాచరణమూ జరగడానికి, వీలులేకపోయింది. దేశములోని వివిధ ప్రాంతాల రాకపోకలకూ, భిన్నప్రాంతాలవారి సాంఘిక సంపర్కాలకూ, సులభావకాశం కలిగించిన రైల్వేసంస్థ.- జాతీయచైతన్యోదయమునకీ, తత్పరిణామానికీ ముఖ్యమైన సాధనమయింది.

యూరోపు, కెనడా, సంయుక్త రాష్ట్రాలలో రైల్వేల అభివృద్ధి జరిగిన వెంటనే, ఇండియాలో రైల్వే నిర్మాణ మారంభమయింది. (1853). 1830 ప్రాంతంలో, ఇతర దేశాలకు,-ముఖ్యంగా యు.ఎస్.ఏ.కు-రైల్వేల నిర్మాణ నిమిత్తము, మూలధనాన్ని, ఇంగ్లాండు ఎగుమతిచేస్తూ ఉండింది. నిరుపయోగంగా కోశంలో నిలువయున్న ధనము, ఈవిధంగా లాభదాయకమైన పెట్టుబడిగా, ఉపయుక్తము కావడమేకాక, ఇంగ్లాండులోని సాంకేతిక నిపుణులకు మంచి ఉద్యోగావకాశాలూ, ఇంగ్లాండు పరిశ్రమ కర్మాగారాలలో, తయారైన సాంకేతికవస్తు సామగ్రికి మార్కెట్టూ, కూడా, లభించినవి. రైల్వేల నిర్మాణం వల్ల ఆహార పదార్థాలనూ, ప్రత్తివంటి వ్యావసాయిక ముడిపదార్థాలనూ సులభంగానూ, కొంచెము ఖర్చులతోనూ, ఎక్కువగా ఇంగ్లాండుకు తెచ్చుకొని, వాటితో తయారైన సరకులను యూ.ఎస్.ఏ., కెనడా బజారులలో, సౌలభ్యంతో అమ్ముకొనే సదవకాశం, ఇంగ్లాండుకు ఏర్పడింది.

ఇండియా విషయంలో, రైల్వేల నిర్మాణంవల్ల బ్రిటిషు ప్రభుత్వానికి సిద్ధించే, మరియొక ప్రయోజనం కూడా కలదు. 1857 విప్లవ విషయంపై, డల్హౌసీ గావించిన 'ప్రసిద్ధ సూచన'ను, అనుసరించి, కల్లోలాలు ఏర్పడిన సందర్భాల్లో, సైన్యాలను శీఘ్రంగా, వివిధ ప్రాంతాలకు తరలించుకొనిపోయి, కల్లోలాలను అణచివేయడానికి, బ్రిటిషు ప్రభుత్వపు ఆధిపత్యాన్ని సుస్థిరం చేయడానికీ, రైల్వేల నిర్మాణం ఎక్కువగా బ్రిటీషువారికి ఉపకరిస్తుంది. ఇంగ్లాండులో స్థాపింపబడిన స్వంత కంపెనీలకు, ఇండియాలోని రైల్వేల నిర్మాణము అప్పగింపబడింది. ఆ కంపెనీ వారి మూలధనంపై 5 శాతం. లాభానికి ప్రభుత్వము భరవసాయిస్తూ, ప్రమాణపత్రాలను స్థిరపరచుకొన్నది. 1848-49 లో, భరవసాగల మూలధనం 9. లక్షలు మాత్రమే. 1851-52 నాటికి అది 1.3 కోట్లకు పెరిగింది. 1860-61. నాటికి అట్టి మూలధనం 34.96 కోట్లు అయింది. దేశంలోని మొట్టమొదటి రైలుమార్గం 1853 లో ఏర్పడింది.

1853-54 లో 21 మైళ్ళు మాత్రమే ప్రయాణానికి విడుదల అయింది. 1860-61 నాటికి 839 మైళ్లూ, 1869-70 నాటికి, 4265, మైళ్లూ ప్రయాణాలకు ఉపయుక్తమయింది. 1872 నాటికి, మూడురాజధానీ నగరాలను చేర్చే ప్రధాన మార్గాలు నిర్మితములైనవి. అదేవిధంగా ఆ రాజధానులలోని, వివిధ పట్టణాలను చేర్చే మధ్యమార్గాలు కూడా, ఏర్పడినవి. రాజధానీనగరాల మధ్య ప్రధాన మార్గాల నిర్మాణము, జాతీయైక్యమునకు ప్రబలమైన దోహదం గావించింది. తర్వాత 30 సంవత్సరముల కాలంలో, శాఖోపశాఖలుగా దేశాంతర్భాగములకు అన్ని వైపులా ప్రసరించునట్లుగా నిర్మితములైన భిన్న భిన్న మార్గాలూ, ఉపమార్గాలూ, ఇత్యాదులు జాతీయైక్య నిర్మాణాన్ని పూర్తి చేసినవి. శతాబ్దం కడపటికి, 23,763 మైళ్ళ వ్యాప్తిగల రైలుమార్గం రాకపోకలకు ఉపయుక్తమయింది.

# 4
# నూతన విద్యావిధానము

## I. పాశ్చాత్య సంస్కృతి ప్రభావము

రాజకీయంగా ప్రబలమైయున్న అగ్రవర్ణాలు నశించిపోవడంతో, నూతన మధ్యతరగతి, ప్రాముఖ్యంవహించింది. ప్రాథమికదశలో, ఈ వర్గంలోని ప్రతి శాఖా, తామే బ్రిటిషుపరిపాలనవల్ల, ఉత్కర్షను పొందినామనే భావనతో, ప్రవర్తించింది. వర్తకులయొక్క సంపదా, భూస్వాముల ఆదాయమూ, సర్కారు ఉద్యోగుల వేతనాలూ, వృత్తిదారుల సంపాదనా,— ఇవన్నీకూడా, బ్రిటిషువారి ఉద్యమాల మూలంగానే సిద్ధించినవి కావడంవల్ల వీరందరూ, తమకు ఉపకారులైన బ్రిటిషువారికి, ఋణపడియుండిరి. కాని, కాలం గడచినకొద్దీ,— ఈ భ్రాంతి మాయమయింది. పూర్వం భారతదేశాన్ని జయించిన విదేశీయులు, భారతదేశంలో శాశ్వతంగా నిలిచిపోయి, దీనినే తమ దేశంగా భావించి, ప్రజలలో కలిసిపోయి, వారి సంస్కృతిని గూడా తమదిగా చేసుకొన్నవారు. కాని, బ్రిటిషువారు ఆ అడుగుజాడల్లో నడవలేదు, నడవవలెననే కోరికకూడా వారికి కలుగలేదు. కనుక, బ్రిటిషువారు తమ ఆశ్రిత దారులనే [illegible] ఆశ్చర్యంకాదు.

బ్రిటిషు ఆక్రమణవల్ల కలిగిన సామాజిక ఫలితాలలో, అగ్రస్థానంవారు నశించిపోవడం ఒకటి. ప్రాచీన విద్యాంశ వర్గమైన బ్రాహ్మణ సమాజపు నిర్వీర్యమూ, నిస్సత్వమూ, ఒనర్చడం రెండవది. ఇది రెండు విధాలుగా జరిగింది. బ్రాహ్మణ సంస్థలు, పూర్వము ఆశ్రయంగా ఉన్న రాజాస్థానాలు, వారికి ప్రాపకమిచ్చిన గవర్నరులనూ, సర్దారులనూ, జమీందారులనూ నిర్మూలించడ మొకటి. మత సంస్థలకూ దేవాలయపు పూజా విధానములకూ, [illegible]గా నియమితములై యుండిన, పూజారిపురోహితులను, అనుభవజ్ఞులైన బ్రాహ్మణ విద్వాంసులనుండీ, మత ప్రవర్తకులనుండీ, లాగుకొనడం, రెండవది. అనూచానంగా వచ్చుచుండిన తమ జీవనోపాధి లోపించడంతో, లక్ష్యమైన ఏ ఉద్యోగాలైనా, ఏ వృత్తినైనా వారు ప్రవేశింపక తప్పలేదు. ఎస్. కె. దే., చెప్పినట్లుగా.— "ప్రాచీన విద్యాసంస్కృతుల మూలము గొడ్డలిపెట్టుకుగురి అయింది; హైందవ నాగరకతకు పరమోదాత్తతను సిద్ధింపజేసినమూల శక్తి, నశించింది. మూఢ విశ్వాసాన్ని, అసంబంధమైన పేశలస్థితినీ తెచ్చిపెట్టిన దుష్టశక్తి, ప్రబలమయింది."

పరదేశీయుల ఆక్రమణవల్ల కలిగిన ఆర్థికఫలితాలు కూడా, మార్పులను కలిగించే అంశాలకు సహాకరించినవి. వ్యావసాయకరంగలో, భూస్వామికీ, రైతుకూ మధ్య, ఒక కొత్తరకపు అనుబంధం ఏర్పడింది. ఆస్తికి సంబంధించిన స్వభావము పూర్తిగా మారిపోయి, కొత్తరూపాన్ని గైకొన్నది డబ్బు యొక్క ప్రాబల్యమూ, పై పోటీ పద్ధతీ, వ్యవసాయ వ్యవహారాలకుకూడా, వ్యాపించింది.

పారిశ్రామిక రంగంలో భారతదేశము వలస రాజ్యానికి సమగ్రమైన నిదర్శనంగా, ఏర్పడింది. సంప్రదాయాను బద్ధులైన పారిశ్రామిక వర్గంవారిని నశింపజేయడం, ఇంగ్లాండు కర్మాగారాల్లో తయారైన వస్తువులకు బదులుగా భారతదేశపు ముడిపదార్థాలను సరఫరాజేసే బజారుగా దేశాన్ని మార్చడం,- ఇత్యాది విధానాల కారణంగా, భారతదేశము అన్నివిధాలా, ఆనుషంగికములైన ఆర్థిక పరివర్తనములతో సహా, ఇంగ్లాండుకు వలసదేశమయిపోయింది.

ఈ పరివర్తనల కారణంగా, మూలపదార్థాల అవసర మధికమయింది. జనాభా పెరగడమూ, దిగుమతులకూ, ఉత్పత్తి ఖర్చులకూ, డబ్బు అవసరం కావడమూ, ఇందుకు కారణమయింది. దేశాంతర్భాగంలో సరకుల సరఫరా వేగాన్నందుకొంది. అంతర్దేశీయ విదేశీయ వ్యాపారం మొత్తం అధికమయింది. తత్ఫలితంగా మధ్యతరగతి వర్గం ప్రాబల్యాన్ని పొందింది.

ఆర్థిక వ్యవస్థలోనూ, రాజకీయ వ్యవస్థలోనూ కలిగిన మార్పులు రెండూ ఏకమై, ఇండియా ప్రజల ఐక్యానికి మూలాధారంగా ఏర్పడింది. రహదారులూ రైలూమార్గాలూ, తపాలా, టెలిగ్రాఫూ,-మొదలైన రవాణా సౌకర్యములవల్ల దేశంలోని, వివిధ ప్రాంతాలూ, ప్రదేశాలూ పరస్పరం సామీప్యాన్ని పొందినవి. వివిధ ప్రాంతాలలోని నూతన సమాజ వర్గాలవారికి అనుబంధం కల్పించడానికి ఈ సౌకర్యములు ఉపకరించి, జాతినంతటినీ, ఒక సమ్మిళిత సమగ్ర సంస్థగా ఏర్పరచడానికి సహాకరించినవి.

ఈ విధంగా, పాశ్చాత్య సంఘం, ప్రాచీన ప్రాగ్దేశ సమాజంపై విరుచు కొని పడి, ఆర్థిక వ్యవస్థనూ, రాజకీయ వ్యవస్థనూ విచ్ఛిన్నం గావించింది. అదే సమయంలో, విజ్ఞాన రంగంలోనూ, నైతిక రంగంలోనూ కూడా, ఈ పాశ్చాత్య నాగరకతయొక్క ఆఘాతం విద్యుత్ప్రవాహం వంటిదయింది. పురాతనకాలం నుండీ పవిత్రమైనవిగా రక్షించుకొంటూ వచ్చిన, మత, నైతిక, శిల్ప సౌందర్య సంబంధములైన భారతీయ శాస్త్రములన్నీ విమర్శకు గురియైనవి. భారతజాతి ఈ అన్నిటినీ, ఎదుర్కొని, నిలిచింది. ఇదిమూడు విధములుగా ప్రవర్తించింది. పూర్వాచార పరాయణులు ప్రాచీన విధానాలను సమర్థించిరి. ఉదారవాదులు వాటి సంస్కరణకు బూనుకొనిరి అభ్యుదయవాదులు వాటిని పరిహారించడానికి నిశ్చయించుకొనిరి.

కాని దృక్పథమెట్టిదైనా, ఈ పాశ్చాత్య విమర్శనను ఎదుర్కొనే విధానమూ, చర్చలో ఉపయోగించే సాధనాలూ, ఈ మూడు వర్గాలవారివీ

సమానములే విమర్శాత్మకములూ, తార్కికములూ, ఐన ఈ పర్యాలోచనా విధాన మంతా వీరు పాశ్చాత్యులనుంచి గ్రహించినదే. ఈ విధంగా, భారతీయుల వివిధ వర్గాలవారందరికీ, విజ్ఞానాత్మకమైన ఐక్యము ఏర్పడింది.

ప్రాక్పాశ్చాత్య సంఘాలమధ్య ఏర్పడిన ఆఘాతంవల్ల, రెండు ఫలితాలేర్పడినవి. భారతీయమూ, అభారతీయమూ అను రెంటికీగల అంతరాన్ని గుర్తించడం మొదటిది. ఒక మతసంస్థతోనో, లేదా, ఒక వంశంతోనో ఒకనికి గల సంబంధమే ఆ వ్యక్తిగా పరిగణించే మధ్యయుగపు వ్యవస్థకునూ, తానిపుడు చెందియున్న ప్రస్తుత సాంఘికవ్యవస్థకునూ, గల భేదాన్ని గుర్తించే చైతన్యము. ఇది రెండవది. ఈ రెండునాగరికతలకూ కలిగిన సంఘర్షణ, కుల, మత, ప్రాంతాలకు అతీతమైన, ఒక ఏకజాతిభావాన్ని, ఒక ఏకమాతృకభావాన్ని కలిగించింది. తాము పరదేశజాతులకంటెను భిన్నులమనీ, భారతదేశంలోని వివిధకుల, జాతివర్గాలన్నీ ఏకమాతృకలూ అనే భావము, ప్రజానీకంలో ఉత్పన్నమయింది.

ఈ భావస్ఫూర్తి ప్రథమంలో, సహజంగా, రూపరహితంగానూ, అస్పష్టంగానూ ఉండినది. కాని, కాలంగడచినకొద్దీ, రూపురేఖలు స్పష్టంగాఏర్పడి, జాతీయైక్యభావం చైతన్యాన్ని పొందింది.

## II. విద్యావిషయములో సంప్రదాయ దృక్పథము

జాతీయచైతన్యాన్ని పెంపొందించడంలో, ప్రాచీనవ్యవస్థ గావించిన ప్రయత్నము విలక్షణమైనదైనా, సమ్మోహనకరమైనదే. ప్రాచీనవ్యవస్థ చాల పురాతనమైనది కావడంవల్ల, పెక్కు పరివర్తనములకు లోనైనది. ఇందులో ఏ భాగము సజీవమూ అమూల్యమూ ఐ యున్నదని గుర్తించి మనము గ్రహింపవలెననడం, ఒక సమస్య. సంప్రదాయబద్ధమైన మన పర్యాలోచన విధానమూ, పాశ్చాత్య నాగరకతాప్రభావమూ, నూతనజీవనంలో ప్రబలములై నెలకొనియున్న అత్యావశ్యక విషయాలూ,- ఇవన్నీ ప్రస్తుతము ప్రవృత్తములై యున్నందువల్ల, మనకర్తవ్యము సుకరంకాదు. ప్రజ్ఞానిబద్ధములు కానట్టివీ, నిగూఢములైనట్టివీ ఐన ప్రేరకశక్తులపైననూ, ఇచ్ఛాపూర్వకములైన ప్రయత్నములపైననూ మననిర్ణయ మాధారపడియున్నది. వస్త్రములోని పేక, పడుగులవలె, జాతీయచైతన్యంలో, ప్రాచీనవర్తమాన జీవితములు రెండూ నిబద్ధములై యున్నవి.

జాతీయ చైతన్య మెట్లు ఉత్పన్నమైనది; ఎట్లు తన విశిష్టవ్యక్తిత్వాన్ని పెంపొందించుకొన్నది; కళాసాహిత్యాదులలోనూ, మత సాంఘిక సంస్కరణల లోనూ, నూతనసంయోగ సంబంధములలోనూ తన వ్యక్తిత్వచైతన్యాలను ఎట్లు ప్రదర్శించినది; విద్యా, ప్రచార, పత్రికలద్వారా తన ఆశయాల నెట్లు వ్యక్త మొనర్చినది; నూతన సామాజిక ప్రమాణములనూ, రాజకీయ ఆదర్శములనూ, ఎట్లు ఏర్పరచుకొన్నది,- అనే విషయాలను ముందుప్రకరణములలో వివరిస్తాను.

భారతీయుల మనోభావాలపై ప్రగాఢమైన ప్రభావాన్ని నెరపి, జీవిత సమస్యలైన విజ్ఞాన, కళాసౌందర్య, సామాజిక, నైతిక, మతాత్మక విషయ

ములపట్ల, నూతనాభిప్రాయ దృక్పథములను కలిగించిన అంశములన్నిటిలోనూ, పాశ్చాత్య విజ్ఞానవ్యాప్తికి ప్రధానస్థానము, ఇవ్వవలసియున్నది పద్దెనిమిదో శతాబ్దాంతమున, భారతదేశంలో స్థిరపడియుండిన భారతీయ సంప్రదాయ విజ్ఞానానికీ, భారతదేశంలో ప్రవేశించిన పాశ్చాత్యవిజ్ఞానానికీ, స్వభావంలో విస్తారమైన అంతరముండినది. విజ్ఞాన సంపాదనోద్దేశమూ, విజ్ఞానసంగ్రహణమును_గూర్చిన ఆశయమూ,- అనే_ప్రధానవిషయాలు రెండు వ్యవస్థలలోనూ విభిన్నములు మరిన్ని, పాశ్చాత్యవిజ్ఞానము సమాజమునకంతటికీ బాహాటంగా సంబంధించిన ప్రవృత్తి; ప్రత్యేకంగా ఒక సమాజభాగానికి మాత్రమే వర్తించేదికాదు. భారతదేశంలో, విజ్ఞానవ్యాప్తి కేవలం కొన్ని ప్రత్యేక సమాజవర్గాలకు మాత్రమే నియతమైనది.

ఈ విభేదాలను గూర్చి విస్తృతంగా చర్చింపనవసరములేదు. ఐనా, అధునాతనమైన పాశ్చాత్య విజ్ఞానం తాత్త్వికంగా శాస్త్రీయమూ, వాస్తవికమూ విమర్శాత్మకమూ, ఐనది. హేతుబద్ధమైన సమ్యగ్విచారణవల్ల సిద్ధించిన వాస్తవ జ్ఞానం, కేవలం, ఆధికారిక బద్ధమైనదికాదు, అనే విషయాన్ని స్పష్టపరచవలసి యున్నది. భారతీయ విజ్ఞానము దీనికి పూర్తిగా విలక్షణమైనది. దివ్యదృష్టి ఆధారంగా, వైయక్తిక అంతర దృష్టి సహాయంతో, ధ్యాన, మనన, చింతనా, మూలకమైన, విశిష్ట ప్రయత్నంతో, సిద్ధించినది, స్వయం ప్రకాశకమూ, సాత్త్వికమూ ఐన భారత విజ్ఞానజ్యోతి దీని ననుసరించిన జ్ఞానము ఉత్తమమూ, సామాన్యమూ అని రెండు విధములు. సృష్టికంతకూ మూలకారణమైన తాత్త్విక సత్యాన్ని అన్వేషించడం ఉత్తమ విద్యకు సంబంధించినది. అస్థిరమూ అశాశ్వతమూ, ఐన ప్రాపంచిక విషయసంబంధమైన జ్ఞానం సామాన్యమైనది కావడం వల్ల, అనుత్కృష్టమైనది. సత్యవస్తుపరిజ్ఞానానికి ఆధారమైన, ఆత్మస్థమైన చైతన్య శక్తిని అన్వేషించడం ఉత్తమ విద్యకు ఆశయము బాహ్యవస్తు పరిజ్ఞానాన్ని సంపాదించడం రెండవదే కాని, ప్రధానమైనదికాదు. కాల, దేశ, కారణాలకు అతీతమైన తాత్త్విక సత్యాన్వేషణలో, నిమగ్నమైయున్న మనస్సునకు, చంచలమూ, అస్థిరమూ, ఐన, బాహ్య ప్రకృతి విచిత్రముల పరీక్షకు పూనుకొనే వ్యవధిలేదు. గణితమూ, జ్యోతిష్కమూ, ఆయుర్వేదమూ,-ఇత్యాది ప్రకృతి శాస్త్రాలలో భారతదేశం అసాధారణమైన పాండిత్యాన్ని గడించియుండినా, తర్క వ్యాకరణ అలంకార, న్యాయ, వేదాంతాది ఉద్గ్రంథాలను రచించి యుండినా, ప్రకృతి శాస్త్రాలకు సంబంధించిన ప్రయోగాత్మకమైన కృషికి ఎక్కువగా పూనుకోలేదు.

సంప్రదాయ సిద్ధమైన ప్రాచీన విజ్ఞానము, సుసంఘటితమూ, అఖండమూ అని ప్రాచీనుల నిశ్చితాభిప్రాయము. సంస్కృత భాషాపాండిత్యము తప్పనిసరిగా అవసరమైయుండడం, ఈ ప్రాచీన విద్యాభ్యాసంలోగల కష్టాలలో ప్రధానమైనది. అపారమైన శబ్దజాలముతోనూ, అతిక్లిష్టమైన వ్యాకరణశాస్త్రంతోనూ నిబద్ధమైయున్న సంస్కృత భాషాధ్యయనము, దీర్ఘకాల వ్యయప్రయాసలతో

కూడిన విషయము. కనుక, విద్యార్జన విషయంలో, పరిస్థితులు ఇట్టివి కావడంవల్ల, ప్రాచీన విద్యోపాసకులు ప్రత్యేకమైన ఒక చిన్న వర్గంగా ఏర్పడడం తప్పదు. చైనాలోని మాండారినుల వర్గంకూడా ఇట్టిదే. వారి పోషణ భారము రాజ్యము రాజాశ్రయమూ సమాజమూ తమ కర్తవ్యంగా పరిగణిస్తుండడంవల్ల, జీవనసంబంధికై వేరుగా ప్రయత్నించవలసిన అవసరం వారికి లేకపోయింది. ప్రాపంచికవస్తు సంపద లేనివారైనా, ఆత్మసంపదగల జ్ఞానులు కావడంవల్ల, వీరిని సమాజం ఎంతో ప్రేమగా గౌరవించింది. ఈ విద్యావంతులలో ఎక్కువభాగం బ్రాహ్మణులే ఐనా, వైశ్యాదిన వర్గంలోని ఇతర కులాలవారు కూడా, ఈ వర్గంలో లేకపోలేదు. అందరూ కలిసి విద్యావంతుల సంఘంగా ఏర్పడిరి. పరమమైన ఆత్మజ్ఞానాన్ని అన్వేషించే సాధకులూ, ఆ జ్ఞానసాధనలో ఉత్తీర్ణులైనవారూ అన్ని కాలాలలోనూ, వర్గాల లోనూ ఉండినారు.

బ్రాహ్మణుల మనస్సుకు ప్రవృత్తులు కొన్ని ద్రావిడముస్లిం ముస్లిములలో కూడా కలవు. ముస్లిములుకూడా విద్య ద్వంద్వమైనదని నిర్ణయించినారు. దివ్యమైనవిద్య (marifat) అనీ, ప్రాపంచిక విద్య (ilm) అనీ, విద్య రెండు వర్గములు. దైవప్రేరణవల్ల సిద్ధించిన విద్య (అద్భుతమై), సహజసిద్ధమైనది, ఆత్మ ప్రకటన సమర్థమైనది,- ఉత్తమము. క్లేశముతో కూడిన నిరంతర ఆంతరంగిక శిక్షణవల్ల మాత్రమే సాధ్యమయ్యేది ఈ ఉత్తమజ్ఞానం. ఈ ఆత్మాభ్యుదయ సాధనలో దశలనేకములు కలవు. ప్రాపంచిక వాంఛలను అణచి పెట్టడమూ, ఇంద్రియములపై నిగ్రహమూ, ప్రాపంచిక వస్తువులను సౌఖ్యములను పరిత్య జించడమూ,-అను నియమాలు ఈ శిక్షణలో చేరియున్నవి. ఈ నియమాలను పెక్కురు పాటింపజాలరు. కనుక, ఉత్తమజ్ఞానాన్ని, నిజంగా అన్వేషించేవారి సంఖ్య స్వల్పము మాత్రము.

రెండవిద్యకు, సమాజంలోగల ప్రతిష్ఠ తక్కువదేమీ కాదు. కాని, ముస్లిము విద్వాంసులు దానికికూడా ఎక్కువ ప్రాధాన్యమిచ్చి యున్నారు. ప్రాథమికదశ లలో, గ్రీకుల అభిప్రాయములను శ్రద్ధతో పఠించి, వివిధ విజ్ఞానశాస్త్రాలలో కృషి చేసి, వాటిని పెంపొందించిరి. ప్రయోగాత్మకమైన అధ్యయనంలోనూ లౌకిక విషయముల అధ్యయనంలో వారు సాధించిన ప్రయోజనం, హిందువులు సాధి చిన దానికంటెనూ, జీవవంతమైనది. గణితశాస్త్ర జీవవిజ్ఞానశాస్త్రములలోనూ, సాంకేతిక వస్తునిర్మాణములోనూ, హిందూశాస్త్రజ్ఞులను వీరు అధిగమించినారు. చరిత్రపరిశీలన కూడా వీరు గావించినారు. చరిత్రలేఖనము, జీవితచరిత్రరచనా, ఇత్యాదులలో వీరు గ్రీకురోమనుల కంటే ఎక్కువగా కృషిసల్పినారు. ప్రకృతి శాస్త్రాలలో వారు యూరోపుదేశాలకు కూడా గురువులై యుండిరి.

ఆధ్యాత్మికమైన అంతర్దృష్టి విషయంలోనూ, ప్రకృత్యతీతమైన తత్త్వ శాస్త్రవిషయంలోనూ, హిందువుల మనసు నిశ్చపజ్ఞమైనది, అతిశయమైనది. ఈ విషయమైన వారి సారస్వతం అధికమైనది. కాని, బాహ్యప్రకృతినిగూర్చి, ప్రకృతి లోని విచిత్ర పరివర్తనములను గూర్చి, వారు ఎక్కువ శ్రద్ధచూపినవారు కారు.

పందొమ్మిదోశతాబ్దం నాటికే, ప్రకృతికి సంబంధించిన విజ్ఞానవిషయంలో, హిందువులూ ముస్లిములూ కూడా కృషిసల్పడంలేదనీ, తత్సంబంధమైన ప్రయత్నం వెనుకబడి యుండినదనీ, తెలుస్తుంది. ఆయుర్వేదము, గణితము, జోతిష్కము, రసాయనశాస్త్రము,- మున్నగువాటిలో హిందువులజ్ఞానం పూర్తిగా అభ్యుదయరహితమై యుండినది. పాతదానినే చర్వితచర్వణం గావించుచుండిరి. ఇక, ముస్లిముల విషయాన్ని పరిశీలించగా,-ఈవిషయములనుగూర్చి ఆలోచించినవారూ, నూతన విషయపరిశోధకులూ, ప్రమాణగ్రంథాలను రచించినవారూ,- చాలా వరకు అందరూ, పదునాల్గవశతాబ్దానికి పూర్వపు ఇతరదేశాల వాస్తవ్యులేకాని, భారతదేశంలోనివారు కారు. ఆ గ్రంథాలపై వ్యాఖ్యానాలనూ, టీకలనూ, సంహితలనూ, మాత్రమే ఇండియాలోని ముస్లిములు కూర్చినారు.

కాలిఫేట్‌పై జరిగినటర్కీ ఆక్రమణమూ, తర్వాతికాలంలో మంగోలులు బాగ్దాదునుజయించి దానిని ధ్వంసముగావించడమూ, ఐబీరియా ద్వీపకల్పంలో క్రైస్తవ రాజ్యాల విస్తరణమూ, కారణాలుగా, ఇస్లామికు దేశాలలోని విజ్ఞానశాస్త్రాభివృద్ధి భంగపడినదని ఊహించవచ్చును. తరువాతి కాలంలో, ఇరానులో ఏర్పడిన సఫావీద్ ముస్లిమురాజ్యాలూ, ఇండియాలో స్థాపింపబడిన మొఘలు సామ్రాజ్యమూ, సంపదలోనూ, వైభవంలోనూ ప్రఖ్యాతి వహించినవి. కాని, విజ్ఞానశాస్త్రాభివృద్ధికి రాజ్యాలు దోహదం గావించలేదు.

హిందూముస్లిము విద్వద్వర్గాలవారు చాలవరకు, తమతమ ప్రత్యేకములైన అవధులలోనే, నిలిచిపోయినారే కాని, పరస్పరం కలుసుకొని, భావాలనూ, అభిప్రాయాలనూ కలిసి చర్చించుకొన్నవారు కారు. ఆకారణం వల్ల, ఒక వర్గం వారినుంచి మరియొక వర్గంవారు జ్ఞానాన్నిపంచుకొనే అవకాశం కలుగలేదు. కావుననే, వీరిభావాలలోనూ అభిప్రాయాలలోనూ, విస్తృతి వికాసాలు కలుగలేదు. ఆపై, పద్దెమిదోశతాబ్దమంతా, రాజకీయ కల్లోలంతో గడచిపోవడంతో, విజ్ఞాన వ్యాప్తి క్షీణించింది. యుద్ధాలతోనూ, విప్లవాలతోనూ దేశమంతా వ్యాప్తమైయున్న పరిస్థితులలో, శాస్త్రవికాసం జరగడం సాధ్యంకాలేదు. బ్రిటీషు రాజ్యస్థాపనంవల్ల శాంతి నెలకొనడంతో, విజ్ఞానవికాసానికి అవసరమైన ప్రథమ పరిస్థితిఏర్పడింది. ఆంగ్లేయులతో సహాప్రవేశించిన, నూతన విజ్ఞానాన్ని గ్రహించి, దానిని వికసింపచేయడానికి దేశం సుముఖంగా ఉంది.

## III ప్రాథమికదశలో, క్రైస్తవ మిషనరీల కార్యకలాపాలు

ప్లాసీయుద్ధానికి పూర్వము భావపరివర్తనకు రెండు సంస్థలు పూనుకొనియుండినవి. వర్తకవ్యాపార వ్యవహారాల్లోనూ, పరిపాలన వ్యవస్థలోనూ కలిగిన సంపర్క-సాహచర్యముల కారణంగా, భారతీయులు పాశ్చాత్య ప్రభావానికి లోనయిరి. పాశ్చాత్యుల జీవనపద్ధతులూ, వారి వర్తకవిధానమూ, దేశీయులను ఆకర్షించినవి. వాటియందు ఆసక్తికలిగినవారై, భారతీయులు పాశ్చాత్యుల సాహచర్యంలో, ఆంగ్లభాషను నేర్చుకొనిరి. అట్టివారిసంఖ్య మాత్రం స్వల్పమైనదే.

తొలి రోజుల్లో, ఇండియాకు వచ్చిన ఆంగ్లేయులు, దేశభాషలను నేర్చుకోవడం ఉపయోగకరమని గ్రహించినారు. అందునూ ముఖ్యంగా, దేశరాజుల వ్యవహారంలో ఉండిన పర్షియాభాషను నేర్చుకోవడంవల్ల, ఆంగ్లేయులకు ప్రయోజన మెక్కువ. తమవర్తక వ్యాపారములకు అవసరమునైన ఆజ్ఞాపత్రాలనూ ఇతరము లైన ఉపకారాలనూ సంపాదించుకొనడానికై వారు, దేశీయప్రభువుల నాశ్రయించవలసి వచ్చింది. తత్కారణంగా పర్షియనుభాష నభ్యసించిరి.

క్రీస్తుమతాన్ని భారతదేశంలో వ్యాపింప చేయడానికి ఉత్సుకులైయున్న మిషనరీలు, ప్రజలలో కలసితిరుగుతూ 'సువార్తను' ప్రచారం చేస్తూవచ్చిరి. అందులకై వారు దేశభాషలను నేర్చుకొన్నారు. అంతేకాక, క్రైస్తవవాతావరణంలో పిల్లల విద్యాభ్యాసం జరిపేఉద్దేశంతో, పాఠశాలలను స్థాపించిరి. క్రిష్టియను మిషనరీల కార్యకలాపం, భారతదేశంలో చాలకాలంగా ప్రథమశతాబ్దం నుంచీ ఉండినదే. కాని, మలబారుతీరంలోపోర్చుగీసువారి ప్రవేశంతో ఈ కార్యక్రమం నూతనంగా ఆరంభమయింది. యూరోపులోని ప్రొటెస్టంటురాజ్యాలు, 18 వ శతాబ్దంలో, వలసరాజ్యాల ఆధిపత్యాన్ని పొందడంతో, రోమను కాథొలిక్‌ల ఉద్యమం, వెనుక బడింది.

రోమన్ కాథొలిక్ సంస్థలు మృతప్రాయములైయున్న పరిస్థితిలో, యూరోపులోని ప్రొటెస్టంటు రాజ్యాలు క్రీస్తుమతాన్ని, తమ మతానుగుణంగా ప్రచారం గావించడానికి బూనుకొన్నవి. అనేకములైన సంఘాలూ, వర్గాలూ సంప్రదాయాలూ, ఆదేశాలలో ఏర్పడి, మతప్రచార నిర్వహణకెక్కువ అభినివేశం ప్రదర్శించినవి. ప్రొటెస్టెంటు యూరోపులో జరిగిన ఈ మత పునరుజ్జీవన ప్రోద్బలానికి లోనై, డెన్మార్కురాజైన నాల్గవ ఫ్రెడరిక్ విలియం,మతప్రచారార్థం మిషనరీలను విదేశాలకు పంపే బాధ్యతను వహించినాడు. జైగెన్‌బాగ్ ప్లుట్‌షౌ, (Zeigen bagl and plutshau) అనే ఇరువురు జర్మనీ మతప్రచారకుల నితడాహ్వానించి, వారిని భారతదేశం పంపించినాడు. జైగెన్‌బాగ్ 1706లో ఇండియాచేరి, Tranquebar లో డేనిష్ తమిళ మిషనుస్థాపించెను. తమిళభాషను అభ్యసించి, తమిళభాషలో పుస్తకములను, ముద్రించడానికై ముద్రణయంత్రాన్ని, విదేశమునుండి తెప్పించెను. అంత, తాను స్వయంగా బైబిలును తమిళంలో రచించి, ముద్రించినాడు. దేశీయులైన పిల్లలనూ, సంకరజాతి పిల్లలనూ చదివించడానికై ఒక పాఠశాలను కూడా స్థాపించినాడు.

శూద్రులలో తక్కువగా పరిగణింపబడే తావారులనూ, 'పరయా'లనబడే నిమ్నజాతివారినీ, అనేకులను క్రీస్తుమతంలోనికి మార్చి దేశీయ ఉపదేశకసంస్థ నేర్పరచి, మదరాసులోనూ, కడలూరులోనూ, మిషన్ స్థావరాలను నెలకొల్పి, తన కార్యక్రమాన్ని కొంతవరకూ, ఈ ప్రొటెస్టెంటు సంస్థ, సఫలంగా సాధించింది.

*విద్యారంగంలో క్రిష్టియను మిషనులు :* దేశంలో పాశ్చాత్యభావాన్ని వ్యాపింపజేయడంలో ఈ దక్షిణ దేశ సంస్థల కార్యక్రమం, ఎక్కువ ప్రయోజనకారికాలేదు. మతాంతరీకరణ ఉద్యమంలోనూ, విద్యావ్యాపక విషయంలోనూ

కూడా, వీరి ప్రయత్నమంతా, కేవలం హిందూ నిమ్నజాతులవారికి మాత్రమే, సంబంధించింది. ప్రబలమై యున్న అగ్రవర్గాలవారినిది ఏమాత్రమూ, స్పృశించ లేదు. 'నోబిలీ' అనే మిషనరీ, తాను బ్రాహ్మణుడనీ, ఐదవ వేదాన్ని బహిర్గత మొనర్చినవాడనీ చెప్పుకొంటూ, చేసిన ప్రచారమంతా వ్యర్థమయింది. బ్రాహ్మణు లెవ్వరూ అతని ప్రయత్నాన్ని గమనించనేలేదు. నూతనమైన మధ్యతరగతి, సమాజంలో, ఇంకనూ, ఏర్పడియుండలేదు.

బెంగాలులోని పరిస్థితి వేరు. 18వ శతాబ్ద మధ్యానికే బెంగాలులోని ఒక దేశీయవర్గం, తమ మధ్య నివసిస్తూ ఉన్న ఆంగ్లేయుల నూతన జీవన పద్ధతులపై ఆసక్తి చూపుతూవచ్చింది. బెంగాలు, బ్రిటీషువారి అధీనంలోనికివచ్చిన తర్వాతనూ (1757), ఆ పిమ్మట బ్రిటీషు పరిపాలన వ్యవస్థ ఏర్పడిన అనంతరమూ, ఈ విషయంలో అభివృద్ధి వేగంగా జరిగింది. పాలకుల ఆశ్రయంపై ఆధారపడియున్న క్రొత్తసమాజ వర్గాలేర్పడినవి.

ప్రథమ దశలలో, ఈస్ట్ ఇండియా కంపెనీవారు మత ప్రచార విషయాల్లో ఆసక్తి చూపలేదు. కంపెనీవారి కర్మాగారాల్లో పనిచేస్తూ ఉన్న మతబోధకులు "దేశీయ భాషలను అభ్యసించవలసిందనీ, ఆభాషాజ్ఞానం, కంపెనీలో ఉద్యోగులు గానో, దాసులుగానో, ఏజెంట్లుగానో ప్రవేశించే హిందువులకు క్రీస్తుమతం బోధించడానికి ఎక్కువగా, ఉపకరిస్తుందనీ,"-1698. శాస పత్రంలో నియతమై ఉంది. కాని, లాభాలను సంపాదించుకోవడంలోనే మునిగితేలుతున్న కంపెనీవారు, శాస పత్రంలోని ఈ ఆదేశాన్ని పాటించినవారు కారు.

ప్లాసీ యుద్ధానంతరం, ప్రొటెస్టెంటు మిషనరీల కార్యక్రమం, తీవ్రంగా, ఆరంభమయింది. డేనిష్ మిషను నుండీ,-కేర్‌నాండర్ (Keirnander) 1758లో కలకత్తా చేరుకొన్నాడు. మిషను కార్యక్రమం ప్రారంభించడానికి, క్లైవు, అతనికి అనుమతి ఇచ్చినాడు. ఇతని కార్యక్రమమంతా ఆంగ్లేయులకునూ, 'పోర్చుగీసు' లని వ్యవహరింపబడుచుండిన సంకరజాతి వారికిని మాత్రమే చాలవరకు పరిమిత మైనది. ఐనా, కలకత్తా సుప్రీముకోర్టులో, పర్షియను వ్యాఖ్యాతగానూ, భాషాంతరీకారుడుగానూ, వ్యవహరిస్తున్న ఢిల్లీవాస్తవ్యుడూ, ప్రముఖ హిందువూ, ఐన, గణేశదాసును, అతడు క్రీస్తుమతంలోకి మార్చినాడు.

ఇంగ్లీషు చర్చి మిషనరీలు ఇండియాకు రాకపూర్వం, కంపెనీలోని మత బోధకులు, మిషనరీ కార్యక్రమాన్ని ఆరంభించియుండిరి. ఈ మతబోధకులు, ఆంగ్ల విశ్వవిద్యాలయాల్లో చదివినవారు కావడంవల్ల, విద్యాసంబంధమైన విష యాల్లో ఎక్కువ శ్రద్ధాసక్తులను, ప్రదర్శించిరి. డేవిడ్‌బ్రౌన్, ఫోర్ట్‌విలియమ్ కాలేజీలో అధికారిగా చేరడం ఇందుకు నిదర్శనము. కలకత్తా హిందూయువకు లకుగాను, అతడొక భోజనవసతిగల పాఠశాలను కూడా స్థాపించెను. హెన్రీ మార్టిన్, కలకత్తాలోనూ, దినాపూర్, కాన్‌పూర్లలోనూ పనిచేసినాడు. అతడు 'న్యూటెస్టమెంట్' అనే బైబిలును, ఉర్దూ, పర్షియన్, అరాబిక్, భాషల్లోకి తర్జు మాగావించెను. మొదట ఆగ్రాలోనూ, పిమ్మట బనారసులోనూ, మిషనరీగా పని.

చేసిన 'డేనియల్ కారి' (Daniel corrie) అనునతడు, రాజా జయనారాయణ గోసాలును ప్రోద్బలంచేసి, ఒక పాఠశాలను స్థాపింప జేసెను. ఉత్తరప్రదేశ్ లో ఆంగ్లవిద్యావ్యాప్తికి పాఠశాల మార్గదర్శకమయింది.

తరువాత వచ్చిన మిషనరీల వర్గాలలో, విలియం క్యారీ (William carey), అతని సహచరులిద్దరూ ముఖ్యులు. క్యారీ కలకత్తా చేరేనాటికి (1793) మిషనరీ సంస్థలపట్ల, కంపెనీవారి విధానము వ్యతిరేకమై యుండినది. మతప్రచార విషయంలో ఎక్కువగా వ్యవహరించడంవల్ల, పోర్చుగీసు వర్తకసంస్థకు కలిగిన నష్టము, వీరిని హెచ్చరించింది. "మిషనరీల ఉద్యమాన్ని ప్రోత్సహించడంవల్ల తిరుగుబాట్లూ, అంతర్యుద్ధమూ, సార్వజనీనమైన కల్లోలమూ, తప్పక ఏర్పడగలవని వీరు గ్రహించియుండిరి. అందునూ, అగ్రవర్ణులైన దేశీయసైనికుల మతాంతరీకరణంవల్ల, సైన్యము పూర్తిగా విచ్ఛిన్నమైపోయి, అంతతో బ్రిటీషు ప్రభుత్వము కూలిపోవునని, వీరు బాగా ఎరుగుదురు." ఈ విషయంలో కంపెనీవారి వైముఖ్యానికి వేరు కారణాలను కూడా రిచ్ టర్, (Richter) పేర్కొన్నాడు. వారన్ హేస్టింగ్స్, ఫిలిప్ ఫ్రాన్సిస్, వంటి బ్రిటీషు అధికారులు క్రైస్తవనైతిక పథాన్ని పరిత్యజించి, వర్తించడమూ, భారతీయ ప్రాచీనవిద్వాంసులు భారతీయ మతాన్నీ, తత్త్వశాస్త్రాన్నీ గౌరవించి ప్రచారంగావించడమూ, తమ సేవలో లేని పాశ్చాత్యులూ, తమ అనుజ్ఞపొందిన ఇతర పాశ్చాత్యులూ, ఇండియాలో నివసించడాన్ని, కంపెనీ నిషేధించడమూ,- ఇత్యాదులు ఇతర కారణాలు.

కనుక, తన కార్యనిర్వహణలో క్యారీ, అనేక ప్రతిబంధకములను, ఎదుర్కొవలసి వచ్చింది. 1798 లో (John Marshunan మరియూ William word అతనితోచేరి, అందరూ కలిసి, కలకత్తాకు ఇరువదిమైళ్ళదూరంలో, డేనిష్ ప్రాంతంలోనున్న, సెరాంపూరులో నివాస మేర్పరచుకొనిరి. వారు ఉమ్మడిగా చేసిన ప్రయత్నాలు నూతన బెంగాలీల మనోభావాలను దిద్దుటలో, ఎక్కువగా సహాకరించినవి. బెంగాలును పునరుజ్జీవింపచేయడంలో, సెరాంపూర్ మిషనరీల సేవాభాగం, అల్పమైనదికాదు. ఈ విధంగా బెంగాలులో కలిగిన పునరుజ్జీవనాన్ని, కొన్ని విషయాల్లో యూరోపు, పునరుజ్జీవనంతో పోల్చినారు.

జ్ఞానసంపాదనలో క్యారీకి తీరనికాంక్ష కలదు; విజ్ఞానశాస్త్రవిషయంలో ఆసక్తి మిక్కుటము. కావున సంస్కృతమూ, బెంగాలీ, మరాఠీ, హిందీభాషలలో అధికారం సంపాదించుకోడానికి, శ్రద్ధతో పూనుకొన్నాడు. న్యూటెస్టమెంటును బెంగాలీభాషలోనికి అనువదించి, అధికభాషాపరిచయం కలవాడనేపేరు సంపాదించుకొన్నాడు. ఇండియా సివిల్ అధికారఉద్యోగాలనూ, మిలిటరీ అధికారఉద్యోగాలనూ, ప్రవేశింపబోవువారికి శిక్షణనిచ్చే ఉద్దేశంతో 'ఫోర్టువిలియమ్' కళాశాలను, 1801 లో, వెల్లెస్లీ స్థాపించినాడు. ఆ కళాశాలలో, క్యారీ, బెంగాలీ భాషాధ్యాపకుడుగా, నియోగింపబడినాడు. అతని సారస్వత, వైజ్ఞానిక కార్యప్రవృత్తికి ఈ ఉద్యోగం, మంచి దోహదమిచ్చింది. సంస్కృత నిఘంటువునూ, వ్యాకరణాన్ని, అతడు ప్రకటించినాడు. రామాయణాన్ని పరిష్కరించి, క్రొత్త

ప్రతిని తయారుగావించెను. ఇతర పురాతన సంస్కృత గ్రంథాలను పరిష్కరించి, క్రొత్తప్రతులు సిద్ధపరచెను. ఇండియాలోని పుష్పజాతులను శ్రద్ధా సక్తులతో పరిశీలించినాడు.

బెంగాలీవచన రచనకు అస్తిభారం వేయడం, అతడు బెంగాలీభాషకు చేసిన సేవలలో మిక్కిలి ప్రముఖమైనది. క్యారీకి పూర్వము, బెంగాలీలో అపారమైన కావ్యసారస్వతం ఉండినది. కాని, గుణవిషయంలో ఈ కవిత, పద్దెనిమిదో శతాబ్దంలో, సన్నగిల్లిపోయినది. అదికాక, విలువగల వచన సారస్వతమే అభివృద్ధికాలేదు. బెంగాలీ భాషకు అతడు వ్యాకరణాన్ని రచించినాడు. హాల్ హెడ్ ఇదివరకే ఒక వ్యాకరణాన్ని రచించియుండడంవల్ల, క్యారీవ్యాకరణము, కాలాన్నిబట్టి మొదటిది కాదు. కాని, శాస్త్రీయంగా రచితమైన మొదటి వ్యాకరణం ఇదే. తర్వాత, 80 వేల పదములతో కూడిన బెంగాలీ నిఘంటువు నితడు రచించెను. ఈ రెండు గ్రంథాలూ, బెంగాలీ వచనరచనయొక్క స్వరూపాన్ని నిర్ణయించడానికి సహకరించినవి. వ్యాకరణ, నిఘంటువులు మాత్రమేకాక, ఇతని రచనలలో పాఠ్య గ్రంథము లనేకములు. కథోపకథాన్, ఇతిహాస్,- అనేవి వీటిలో కొన్ని.

తాను స్వయముగా రచయిత కావడమేకాక, పెక్కురచయితల నితడు ఆకర్షించినాడు. మృత్యుంజయ, రామ్‌రామ్ బాసూ, రాజీబలోచన్, చందీచరణ్, మోహన్ ప్రసాద్ ఠాకూర్, ఇంకనూ ఇతరులు ఇతని అనుయాయులు.

బెంగాలులో జరిగిన పునరుజ్జీవనానికి ఈ పండితులూ, మున్షీలూ, ప్రముఖులు. క్యారీ కార్యప్రవృత్తి సారస్వతానికి మాత్రమే నియమితమై యుండలేదు. సంఘసంస్కరణ విషయంలో, ఇతడు అత్యభిమాని. హిందూసమాజము నందానాడు, తప్పక నిర్మూలింపవలసిన, లజ్జాస్పదమైన, దురాచరణలూ, చెడుగులూ, ఉండినవి. బాలబాలికల విద్యాభివృద్ధి, క్యారీ ప్రోద్బలంవల్లనే జరిగింది.

క్యారీ సహచరులైన మార్షామ్, వార్డ్ అనేవారు ఇతనికి ఉత్సాహంతో, తోడ్పడిరి. మార్షామ్ ఉపాధ్యాయుడు. అతడూ, అతని భార్యాకలిసి, బాలబాలికల పాఠశాలలను స్థాపించిరి. అవియే, తర్వాత అధునాతన విద్యాకేంద్రములైనవి. మార్షామ్ పత్నియైన హ్యానా (Hanna), సెరాంపూరులో ప్రథమ బాలికాపాఠశాలను స్థాపించింది; తర్వాత కలకత్తాలో మరియొక బాలికాపాఠశాల నేర్పరచింది. సెరాంపూర్ మిషనరీలు స్థాపించిన, (Baptist female school society) బ్యాప్టిస్టు స్త్రీ విద్యాసంఘం కలకత్తా, ఢక్కా, చిటగాంగ్‌లలోనూ ఇతర పట్టణాల్లోనూ, వరుసగా అనేకములైన బాలికాపాఠశాలలను స్థాపించింది.

వార్డ్ (Ward) పుస్తకాలను అచ్చువేసేవాడు. మొట్టమొదటి ముద్రణాలయాన్ని స్థాపించినవాడితడే. బెంగాలీ అక్షరాలకు అచ్చులను ఇందులోనే తయారుచేసినారు. పెద్దముద్రణ సంస్థనూ, కాగితం తయారుచేసే కార్ఖానానూ, అచ్చులు తయారుచేసే కార్ఖానానూ, కూడా, ఇతడు సెరంపూరులో స్థాపించెను. సెరంపూరు మిషనరీలూ, ఫోర్ట్ విలియం కళాశాలవారూ, రచించిన పుస్తకములను

మాత్రమేకాక, కోల్‌బ్రూక్ (Colebrooke) వంటి, పండితుల గ్రంథాలనూ, రాక్స్‌బర్గ్ (Roxburgh) వంటి విజ్ఞానశాస్త్రజ్ఞుల గ్రంథాలను కూడా ఇతడు ప్రచురిస్తూ, వచ్చినాడు. ముద్రణయంత్ర స్థాపనవల్ల, సెరంపూరునుండీ, ఇంగ్లీషు బెంగాలీ పత్రికలనూ, వార్తాపత్రికలనూ, ప్రచురించే సౌకర్యమేర్పడింది.

ఈ విధంగా, సెరంపూరుకు వచ్చిన మిషనరీల మొదటిజట్టు, భారతీయులకు, పాశ్చాత్య విజ్ఞానంతోనూ, భావాలతోనూ పరిచయం కల్పించడానికి, ఎక్కువ కృషిచేసింది. వీరి తర్వాతవచ్చిన వారిలో, ఇండియా దేశచరిత్ర రచించిన జాన్‌క్లార్క్ మార్ష్‌మన్ (Johnclark Marshman) (1794-77) ఒకడు. జ్యోతిశ్శాస్త్రగ్రంథమునూ, భూగోళశాస్త్రాన్నీ, ఇతడు బెంగాలీలోకి అనువదించినాడు. విలియమ్ క్యారీ పుత్రుడైన ఫెలిక్స్‌క్యారీ (Felix carey 1786-1822) బెంగాలీలో మొట్టమొదటి విజ్ఞానసర్వస్వాన్ని (Encyclopaedia) సిద్ధపరచినాడు. ఇందులో, శరీరరచనా విజ్ఞానశాస్త్రం (Anatomy), వైద్యశాస్త్ర, రసాయనశాస్త్రాలూ, సాంకేతిక పదకోశమూ, అనే విషయములపై ప్రకరణములున్నవి. విలియమ్‌యేట్స్ (William yates 1792-1845), ప్రకృతి తత్త్వశాస్త్రాన్నీ, ప్రకృతిచరిత్రనూ, బెంగాలీలో రచించెను. 'బెంగాలీ భాషాపరిచయము' అనే రెండుసంపుటాల గ్రంథాన్నికూడా, ఇతడు రచించినాడు.

ఇంకనూ అనేకులు మిషనరీలు, బెంగాలీభాషలో పెంపొందుతున్న పాశ్చాత్య విజ్ఞానాన్ని అభివృద్ధి గావించిరి. ఆంగ్లగ్రంథాల అనువాదాలూ, విజ్ఞానశాస్త్రగ్రంథాల అనువాదాలూ వీరు రచించి, బెంగాలీ సారస్వతాన్ని పోషించిరి. వారి రచనలయొక్క సాహిత్య ప్రమాణమెట్టిదైనా, అది భారతీయుల మనస్సులకు ఉత్తేజనం కల్పించి, మధ్యయుగాల భావబంధనాలలో చిక్కుబడియున్నవారి మనస్సులను వాటినుండి తప్పించి, స్వతంత్ర ప్రవృత్తికి ఉన్ముఖమొనర్చిందనడం, తథ్యము.

## IV. మిషనరీ ఉద్యమంలో నూతనశకము, ఆంగ్లవిద్యాభ్యాసారంభము

1813లో ప్రకటింపబడిన నూతనశాసపత్ర కారణంగా, మిషనరీ ఉద్యమంలో క్రొత్తశక మారంభమయింది. క్రిష్టియను మిషనుల ప్రబల అభిమానులైన చార్లెస్‌గ్రాంట్, విలియమ్ విల్బర్‌ఫోర్స్ (Charles grant and william wilberforce) వంటివారు, శాసపత్రంలో నూతనవినిమయం చేర్చేటట్లుగా పార్లమెంటును ప్రార్థించి సఫలులైరి. దేశీయులకు ఉపయోగకరమైన విద్యావిధానాన్ని ఏర్పరచి నిర్వహించడంలోను, వారి నైతిక జీవితాన్ని పెంపొందించడంలోను, ఆసక్తులైయున్న ఆంగ్లేయులు భారతదేశములో నివాసమేర్పరచుకొని, ఈ ఉదారాశయాలను నిర్వహించడానికి తగిన సదవకాశాలను, ప్రభుత్వం, శాసపత్రం ద్వారా కలిగించవలెనని ఈ నూతన నియమనం ఆదేశిస్తుంది. మరిన్నీ కలకత్తాలో ఒక క్రైస్తవ ధర్మక్షేత్రాన్ని బిషప్ (Bishop) అధికారంలో నెలకొల్పి, దానిని ఇండియా ఆదాయం నుండీ పోషించవలెనని కూడా, ఈ నియ-

మనంలో ఉన్నది.

కంపెనీవారి ఉద్యోగంలోని ముఖ్యపదవులలో, పూర్వం, పనిచేసి, గొప్ప సంపదను ఆర్జించుకొన్న ఛార్లెస్ గ్రాంటు, కొంతకాలం ఈస్ట్ ఇండియా కంపెనీ డైరెక్టర్ల సభకు అధ్యక్షుడుగా నుండినవాడు. అత డిదివరలో (1792) భారతదేశ నాగరకతపైనా భారతీయ ప్రజలపైనా దోషారోపణ గావిస్తూ, ఒక అభియోగ పత్రాన్ని ప్రకటించి యుండినాడు. (1797) శాసపత్ర విచారణ జరుగుతున్న సమయంలో ఆ పత్రానికి బహుళ ప్రచారం కలిగింది. సర్ జాన్ షోర్ సాహాయ్యంతోనూ, క్లాప్ హామ్ వర్గంవారి సహకారంతోనూ, బానిస పద్ధతికి వ్యతిరిక్తుడుగా ప్రసిద్ధిగాంచిన, విల్బర్ ఫోర్స్ యొక్క ప్రబలమైన సమర్థనవల్ల శాస పత్రంలో ఈ నియమనం అంగీకరింపబడింది. బ్రిటీషువారి రాజ్యభాగాలలో అంతటా ఎట్టి ప్రతిబంధకమూ లేక, తమ కార్యక్రమాలను కొనసాగించడానికి తగిన అనుజ్ఞ, మిషనరీలకు లభించింది. వెంటనే, అనేకులు మిషనరీలూ, మత ప్రచారకులూ, ఇండియాకు వచ్చి, దక్షిణంలోనూ, ఉత్తరంలోనూ కూడా స్థావరాలను ఏర్పరచుకొనిరి. యూరోపు అమెరికా దేశాల నుంచీ కూడా, సంస్థలు ఇండియావచ్చి, విద్యావిధానాన్ని విస్తరించే ఉద్యమంలో, బ్రిటీషు మిషను సంస్థకు తోడ్పడినవి.

ఇట్లు, శాసపత్రం తర్వాత వచ్చిన మత ప్రచారకులలో అలెగ్జాండర్ డఫ్ (Alexander Duff) ప్రముఖుడు. మిషనరీ కార్యక్రమంలో, రెండవదశ ఇతనితో ఆరంభమయింది. ఇతర మిషనరీలు కలిగించలేని ప్రభావం, ఇతని కార్యక్రమం కలిగించింది. బెంగాలు ప్రాంతాన్ని పాశ్చాత్య భావోన్ముఖమొనర్చడానికి ఇతడు నిర్వహించిన కార్యక్రమం కూడా, ముఖ్యమైనదే. అతడు ఇండియాకు వచ్చిన 1830 ప్రాంతంలో, మిషనరీ కార్యక్రమం క్షీణదశలో ఉండినది. అధమ వర్ణాలవారిలో దారిద్ర్యంతో క్రుంగుతూ, అగ్ర వర్గాలవారి ప్రాబల్యం క్రింద నలుగుతూ ఉన్న, దరిద్రులు మాత్రమే, క్రీస్తు మతంలో చేరడానికి అంగీకరించేవారు. క్రీస్తుమతం గ్రహించినవారిని, పరిసరాల్లోని ఇతరులు నీచంగా చూచేవారు. "పలుకుబడీ, ప్రాబల్యమూగల అగ్రవర్ణాలవారితో సంపర్కం కలిగించుకొనే మార్గమేలేదా"-అనే విషయం, డఫ్‌కు, ఒక సమస్య అయింది.

విద్యావ్యాపనమే దానికి సరియైన మార్గమనీ, పాశ్చాత్య క్రీస్తుసంస్కృతిని, భారతీయులలో వ్యాపింపజేయడానికి ఆంగ్లభాషయొక్కటే సమర్థమైన సాధనమనీ అతడు గ్రహించినాడు. "పాశ్చాత్య విజ్ఞానసర్వస్వాన్నీ భారతీయులలో వ్యాపింపజేసి, హిందూదేశాన్నంతటినీ చలింపజేయగలశక్తి ఒక్క ఆంగ్ల భాషకే కలదు, అదే ఇందుకు అత్యుత్తమసాధనము, అని, నేను మరీమరీ విశ్వాసంతో చెప్పగలను". అని తన అభిప్రాయాన్ని ప్రకటించినాడు. కనుక, ఆంగ్ల భాషాపరిజ్ఞానము భారతీయులకు తప్పనిసరిగా ఆవశ్యకము. విజ్ఞానసంబంధమైన విషయాల్లో ఇంతవరకూ ప్రముఖస్థానంవహించిన, అగ్రవర్గాలవారు, "ఆంగ్ల భాషకు వ్యతిరిక్తులై నిలుతురా ? 'నిలవరు?'-అని దీనికి ప్రత్యుత్తరం లభిం

చింది. ప్రాచీనసంస్థలోని అగ్రవర్గాలవారు ఆంగ్లభాసను నిరసించి తిరస్కరింప వచ్చును. కాని, నూతనవ్యవస్థ కలిగించిన అభ్యుదయావకాశాలను పురస్కరించుకొని, తమ పరిస్థితిని బాగుపరచుకోడానికి, మధ్యతరగతులవారు ఆతురతతో ఎదురుచూస్తున్నారు. ధనాన్ని, ప్రాబల్యాన్ని, లౌకిక సౌఖ్యాన్ని లభింపజేసే మంత్రకవచం (Talisman) గా, ఆంగ్లభాష వీరికి గోచరించింది. దాని ఆధారం వల్లనే సామాజికప్రతిష్ఠా, వ్యక్తియొక్క గౌరవస్థానమూ లభ్యమౌనని వీరి ఆశ.

పాఠశాలలనూ, కళాశాలలనూ ఆధారంగాచేసుకొని, భారతదేశ యువతీయువకులను క్రిష్టియను ప్రభావంలోనికి గొనివచ్చే నూతనవిధానంలో, మిషనరీ కార్యక్రమాన్ని నిర్వహించవలెనని, డఫ్ నిశ్చయించుకొన్నాడు. యువకవర్గం ద్వారా, ఉన్నత భారతీయ సమాజరంగంలో, ప్రవేశం సంపాదించుకొని, క్రీస్తుమత సంబంధమైన సాధారణవిజ్ఞానాన్ని ప్రజలలో వ్యాపింపజేసి, అగ్రవర్గాలలోని ఉత్తమవంశీయులను, క్రీస్తుమతంలో చేర్చుకొనవలెనని ఇతడాశించెను.

డఫ్, రామమోహన్‌రాయ్‌ను కలుసుకొన్నాడు. ఆనాటి, భారతీయులలో ప్రముఖుడు, నూతన భారతయుగాగమనానికి సూచకుడు ఐనవాడు రామమోహన్‌రాయ్. నశించిపోయిన తన మాతృదేశవైభవప్రాభవాలను పునస్థాపన మొనర్చడానికి, నూతన విజ్ఞానవ్యాప్తి అత్యవసరమని విశ్వసించి, ఔత్సుక్యాన్ని ప్రదర్శిస్తున్నాడు, రాయ్. ఆంగ్ల విద్యావ్యాప్తిమూలంగా, నాస్తికులైన (Pagans) భారతదేశీయులను క్రీస్తుమతంలో చేర్చి, తరింపజేయడానికి అత్యుత్సాహాన్ని చూపుతున్నవాడు, పాశ్చాత్యప్రతినిధియైన డఫ్. ఇరువురి ఆశయాలకూ, ఉత్తరదక్షిణధ్రువములకు గల అంతరమున్నది. సహస్రాబ్దాలుగా, భక్తివిశ్వాసాలతో భారతీయులు పోషించుకొంటూ వచ్చిన ఉదారాశయాలను నశింపజేయబూనుకొన్నవాడు డఫ్. యుగయుగాలుగా, భారతదేశ మతజీవితాలపై ప్రాలి, అలముకొనియున్న బూజునూ, అంటిపెట్టుకొనియున్న మాలిన్యాన్ని ఖాళనం చేసి, దేశాన్ని పవిత్రమొనర్పబూనుకొన్నవాడు రాయ్. ఇట్టి ఈ ఇరువురూ, ప్రస్తుతకర్తవ్యమైన పాశ్చాత్యవిజ్ఞానవ్యాప్తికై, పరస్పరసహకారానికి అంగీకరించిరి. తన కార్యక్రమంలో ప్రధానమైన బైబిల్‌బోధనసుకూడా, ఒక కార్యక్రమంగా చేర్చి, ఒక పాఠశాలను 1830 లో, డఫ్ ఆరంభించినాడు. ప్రభుత్వంలోనూ, భారతసమాజంపైనా, విస్తారమైన పలుకుబడి ప్రభావాలుగల విశిష్టవ్యక్తి, డఫ్, అనడంలో సందేహం లేదు. ఆంగ్లవిద్యాభ్యాసవిధానాన్ని, అతడు గాఢంగా సమర్థించినాడు. శాఖోపశాఖలుగా పాఠశాలలను నెలకొల్పి, వాటిలో పాశ్చాత్య విజ్ఞానంతోబాటు, క్రీస్తుమతాన్నికూడా బోధించడాని కేర్పాట్లు గావించెను. కలకత్తాలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించియుండిన భారతీయుల ననేకులను మతాంతరులను గావించడంలో కృతార్థుడైనాడు. ముఖర్జీలు, బెనర్జీలు, చక్రవర్తులు, ఘోషులు, మజుందార్లు, దత్తులు, సర్కారులు, నాథులు, గంగూలీలు,- ఇత్యాదివంశముల వారనేకులు వీరిలో గలరు. కృష్ణమోహన్ బెనర్జీ, గోపీనాథ నందే, మోహిశ్‌చంద్రఘోష్, ఆనందచంద్రమజుందార్, లాల్ బిహారీడే,-

మొదలైన నూతన క్రైస్తవమతావలంబులు, బెంగాలులో అభ్యున్నతులైరి.

1835 మార్చి 7వ దినం, బెంటింకు ప్రకటించిన ప్రసిద్ధతీర్మానానికి, డఫ్ యొక్క ప్రోద్బలమూ, ఆంగ్లవిద్యావ్యాప్తికి అతడిచ్చిన తోడ్పాటూ, ముఖ్య కారణములయినవి. నూతన విద్యావిధానానికి ప్రభుత్వము పూనుకోవడమూ, కంపెనీ డైరెక్టర్ల సంఘము, ప్రత్యేకపరచిన ధనాన్ని పాశ్చాత్య విజ్ఞాన సారస్వత వ్యాప్తికీ ఆంగ్లసంస్కృతి పోషణకూ ఉపయోగించడమూ,- అనే అంశములు, బెంటింకు ప్రకటించిన తీర్మానములో ప్రధానాంశాలు. ఇతని ఆదర్శం, దేశంలోని ఇతర మిషనరీ సంస్థలకు గూడా ప్రోద్బలమిచ్చింది. పాశ్చాత్య సారస్వతాన్నీ పాశ్చాత్య విజ్ఞానశాస్త్రాలనూ బోధించడానికి తగిన కళాశాలలు, ఈ సంస్థల ప్రాపకంలో ఉత్పన్నమైనవి బొంబాయిలోని విల్సను కళాశాల, (1832), మద్రాసులోని క్రిశ్చియన్ కళాశాల (1837), నాగపూర్‌లోని హిస్లాప్ కళాశాల (1853) మసులీపట్నంలోని నోబెల్ కళాశాల 1841),- ఇత్యాదులు అన్నియూ, డఫ్ 1830లో స్థాపించిన 'జెనరల్ అసెంబ్లీ ఇన్స్టిట్యూషన్' (General Assembly Institution) పద్ధతులపై ఏర్పడినవి. డఫ్‌స్థాపించిన, పై కళాశాల 1908లో, కలకత్తాలోని Scottish churches కళాశాలతో మేళనం పొందింది.

పందొమ్మిదోశతాబ్దపు మధ్యకాలంనాటికి, మిషనరీ కార్యక్రమం కారణంగా, జరిగిన అభివృద్ధిని పరిశీలించి విలువనేర్పరచడంలో, ఆ కార్యక్రమంవల్ల దేశానికి జరిగిన లాభనష్టాలు రెంటినీ, గమనింపవలసి ఉంటుంది. విద్యావ్యాప్తి, సారస్వతాభివృద్ధి, సంఘసంస్కరణము, వైద్యసాహాయ్యము,- అనేవి అభ్యుదయానికి తోడ్పడిన ముఖ్యాంశాలు.

అధునాతన ప్రాథమిక విద్యావిధానమంతా మిషనరీ సంస్థల పోషణలోనే జరిగిందనే విషయం, గుర్తుంచుకొనవలసియున్నది. ఉన్నత పాఠశాల విద్యార్థులలో సగం మందికిపైగా, మిషను పాఠశాలలలోనివారే. పెక్కు కళాశాలలను కూడా వారే నిర్వహించుచుండిరి. స్త్రీ విద్యా నిర్వహణమూ, వారిసౌకర్యాలకై వసతి గృహాల నిర్వహణమూ కూడా, మిషనరీలు ఒనర్చినవే.

ఇక, దేశభాషల్లో ఒక వచన శైలిని సృష్టించడమూ, వచన సారస్వతాన్ని అభివృద్ధిపరచడమూ,-అనునవి వారి పూనిక పైననే ఆధారపడినవి. పర్యాలోచనపరమైన విషయములను వ్యక్తపరచడానికి అర్హమైన వచనశైలి, ప్రస్తుత భారతీయ భాషల్లో ఇంతవరకూ అభివృద్ధికి వచ్చియుండలేదు. ఈ కార్యక్రమానికి బూనుకొన్న వారిలో మిషనరీలు అగ్రగాములు. భారతీయ భాషల్లోకి బైబిలును అనువదించిన పాశ్చాత్యులు వచన రచనకు బూనుకొన్న వారిలో కొందరు. క్యారీ, బ్రౌన్, మ్యూలిన్, స్కిన్నర్, బైలీ, గ్రుండర్ట్, ఇతరులూ, వీరిలో కొందరు. వ్యాకరణాలనూ, నిఘంటువులనూ, రచించి, వీరు, భాషాస్వరూపాన్ని, భాషా విషయాన్నీ కూడా నిశ్చయించిరి. వారి సారస్వతోద్యమము, కేవలం, మత గ్రంథాల రచనకూ, మతప్రచార కరపత్రముల రచనకూ, మాత్రమే పరిమితం కాలేదు. పాఠశాల పాఠ్యపుస్తకాలు, బన్యనురచితమైన పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్,

గ్రంథముల అనువాదాలు, భారతదేశ మతాలకూ, కులాలకూ, పురాణాలకూ, సంబంధించిన రచనలు,- మొదలైనవన్నీ వీరు రచిస్తూవచ్చిరి.

భారతదేశమధ్యయుగకాలంలో, స్త్రీవిద్య కేమాత్రమూ, శ్రద్ధలేదు; అలక్ష్యమునకులోనై వెనుకపడినది. కనుక, బాలికల ప్రయోజనార్థం పాఠశాలలనూ, కళాశాలలనూ, వసతిగృహాలనూ నెలకొల్పడం విశేషంగా గమనించవలసిన విషయము. గృహరంగంలోనూ, సమాజంలోనూ, స్త్రీలు నెరపుతున్న ప్రభావం అతి విస్తృతమైనది. కనుక, విద్యావతులైన స్త్రీలసంఖ్య అధికం కాకపోయినా, వారికి సంఘంలో గల ప్రాబల్య ప్రభావాలెక్కువ, అనే విషయము గుర్తింపదగింది. భారతీయ సమాజ జీవితంలోనూ, పరిపాలన రంగంలోనూ కూడా విద్యావతులు అభ్యుదయ కార్యాల్లో ఎక్కువగా పాల్గొన్నారు. భారత స్వాతంత్ర్యోద్యమంలో కూడా తమ భాగభారాన్ని వహించినారు. వారి జీవితం ప్రథమంగా చైతన్యాన్నిపొంది, ప్రథమదశలలో భావవికాసానికి లోనైనది, క్రిశ్చియన్ సంస్థల ఉద్యమంవల్లనే అనడం నిస్సందేహము.

ఇతరములైన, మిషనరీ కార్యక్రమాలు కూడా, ఈ విధంగానే ప్రబలములైనవి; కాని దేశంపై వాటి ప్రభావం మాత్రం హానికరమయింది. క్రైస్తవ మతానికి సంబంధించిన సూత్రాలనూ, సిద్ధాంతాలనూ, బోధించడమూ, హిందూ మత, సంప్రదాయాలపై వివాదాత్మకములైన, కువిమర్శలు, సాగించడమూ,- ఇత్యాదులతో కూడిన క్రైస్తవ ఉద్ధారకతత్త్వ ప్రచారము, వారి కార్యక్రమంలో రెండవభాగము. విద్యావిధానంలో గూడా, ఈ రెండవ భాగానికిగల ప్రాధాన్యాన్ని వారు విస్మరించలేదు. హిందువైనా, ముస్లిమైనా, క్రిష్టియనైనా,- ప్రతి ఉపాధ్యాయుడూ, విజ్ఞానశాస్త్రాన్ని, గణితాన్ని బోధించేటప్పుడు, హిందూ మతమనేది మట్టి కుండను, పాశ్చాత్య విజ్ఞాన మనేది ఇనుపగుండంతో ముక్కలు చేస్తున్నాడని వారి విశ్వాసము.

పద్ధెనిమిదో శతాబ్దపు ఉత్తరార్ధంలో వచ్చిన ప్రొటెస్టెంటు మిషనరీలు, మతవిషయక విప్లవయుగంలో శిక్షితులైనవారు. పవిత్రతలో ఆసక్తమై (Pietism), మొరావియానిజం (Moravianism), మెథాడిజం (Methodism), ఎవాంజెలికానిజం (Evangelicanism),- అనువాటిద్వారా ఉత్పన్నమైన మత విప్లవప్రభావము, వీరి నావరించింది. క్రిష్టియన్ నైతికవిధానమూ, సౌశీల్యమూ, ఆధారాలుగా మానవజాతి అభ్యుదయం జరుగగలదని వీరి విశ్వాసము. కనుక, క్రైస్తవమతసూత్రాలద్వారా, సామాజిక సంస్కరణమూ, ప్రపంచముయొక్క అభ్యుదయమూ, జరుపవలెననడం వీరి ఆశయము. క్లాప్‌హామ్ (Clapham) వర్గానికి చెందినవారు ఈ సభ్యులు,- "పాఠశాలలు, కారాగృహసంస్కరణ, సేవింగ్సుబ్యాంకులు, మతగ్రంథాలు, గ్రామగ్రంథాలయాలు, జిల్లా సంచారాలు, చర్చి మందిరములు,- ఇట్టి ప్రతికార్యక్రమమూ, వారు బూనిన విశ్వప్రజా ఉద్యమాల ప్రయోజనార్థము స్పర్ధతో సాగింది. ప్రతి మానవప్రయోజనానికీ, వారు రక్షణ గల్పించిరి; భూభాగమందలి ప్రతిప్రాంతానికి తమ ప్రతినిధిని అర్పిం

చినారు."

పునరుజ్జీవనము (Revivalism) అనేది దుర్గ్రాహ్యమైన తత్త్వవిచారము. ఇండియాకువచ్చిన ప్రొటెస్టంటు మిషనరీలు ఆ తత్త్వశాస్త్రాన్ని జీర్ణించుకొని వచ్చినవారు. పూర్వపు క్రీస్తుమత సంస్కర్తల నిష్ఠురమైన, పరమత అసహన భావాన్ని, ఉగ్గుపాలతో గ్రహించినవారు వీరు. "భారతదేశము అజ్ఞానాంధకారా వృత మైనదనీ, నీతి, బుద్ధి, నాగరకతా, శూన్యమై అధోగతిలో నున్నదనీ," విల్బర్ ఫోర్స్ తలచినట్లుగా, వీరునూ విశ్వసించినారు.

క్షుద్రదైవారాధనలోపడి, నిజమైన దేవుని గుర్తించలేక, అధోపతితులై యున్న, భారతీయులస్థితి, (విల్బర్ ఫోర్స్‌కువలెనే) వీరికినీ, ఘోరంగా కనబడింది. కనుక, హిందూమతాన్నీ, ముస్లిముమతాన్నీ ఇతరమతాలనూ దూషించి, నిర సించడంలో, విశృంఖలంగా ప్రవర్తించిరి. భారతీయ మతములు, నైతిక ప్రవృత్తి, నడవడిక, ఆచారసంప్రదాయాలు, పండుగలు, కర్మలు, జీవనవిధానము,- మొద లైన వాటని గూర్చిన వారివ్రాతలు నిందావాక్యములతో, నీచభాషణలతో నిండి యున్నవి. హిందువులూ, ముస్లిములూ కూడా, వారి దూషణకు లోనైరి. ఇస్లాము, మతంకాదని విమర్శించడానికి వీలుకాని సందర్భాల్లో, ముస్లిముల రాజ కీయ విధానంపై తమ ద్వేషభావాన్ని తీవ్రంగా ప్రదర్శించి, తమలోటును పూర్తి చేసుకొన్నారు. వాస్తవానికి, ముస్లిముల రాజ్యాన్ని బ్రిటీషువారు దౌర్జన్యంగా లాక్కొన్నారు; కనుక ముస్లిములు వీరికి శత్రువులు. హిందువులు ఉపాయ శాలురు, సాధువర్తనం కలవారు, ఐయుండగా, ముస్లిములు ధైర్యశాలులు, అహంభావపూరితులు, అని బ్రిటీషువారి అభిప్రాయము. కనుక, పాశ్చాత్యులకు ఈ రెండు మతస్థులపట్లా ఏర్పడియున్న భావము, చాలవరకూ ఒక్కటే.

## V. విద్యవిషయంలో ప్రభుత్వపు దృక్పథము

భారతదేశంలో నూతనంగా ఏర్పడిన వర్గాలవారికి అత్యంతమూ అవసరమై యున్న ప్రయోజనాన్ని, మిషనరీల కార్యక్రమము,- ఆక్షేపణీయములైన చర్యా లతో కూడియున్నా - సఫలమొనర్చింది. ఉపయోగాన్నిబట్టీ సామాజిక గౌరవ ప్రతిష్ఠలనుబట్టీ కూడా, ఆంగ్లభాషాపరిజ్ఞానం అవసరమయింది. వర్తక వ్యాపార వ్యవహారాల్లో, ఆంగ్లేయవర్తకులతో సంబంధముండడంవల్ల, వారితో ఆంగ్ల భాషలో మాట్లాడే సౌకర్యము లభించింది. పాశ్చాత్యుల స్వంతసంస్థలోకానీ, కంపెనీవారి పరిపాలన వ్యవస్థలోకానీ, ఉద్యోగసంపాదనావకాశాలూ, ఆ సేవలో క్రమాభ్యుదయంపొందే అవకాశాలూ, ఆంగ్లభాషాపరిజ్ఞానము కలవారికెక్కువ. ఆంగ్లం తెలియనివారికట్టి సౌకర్యములేదు. ఆంగ్లభాషా పరిచయము మరొక లాభాన్ని కూడా తెచ్చింది.ఆంగ్లేయుల సంఘంలో కలిసి వ్యవహరించడానికి అవ కాశం కలిగించడమేకాక, తమ సమాజంలో కూడా గౌరవాన్ని సిద్ధింప చేయ డానికి, ఈ భాషాజ్ఞానం ఉపకరించింది. దేశీయవర్తకులతోనూ, ఏజెంట్లతోనూ, క్రింది ఉద్యోగులతోనూ, ఆంగ్లభాషలో దేశీయులు వ్యవహరించ గలగడం ఆంగ్లే

యులకు కూడా గొప్ప సౌకర్యమయింది.

ఆరంభంలో భారతీయులు కొందరు ఆంగ్లేయుల సంపర్కంలో ఆంగ్లం నేర్చుకొన్నారు. తర్వాత. ఆంగ్లేయులు నెలకొల్పిన స్వంత పాఠశాలలు, ఆంగ్ల భాషా బోధన నారంభించినవి. సైన్యాన్ని వదలివచ్చిన సిపాయీలూ, మత బోధకులూ, ఆంగ్లవర్తకులూ, దేశీయులనేకులకు ఆంగ్లభాషను నేర్పిరి. మిషనరీ పాఠశాలలు కూడా, ఇదివరకే ఏర్పడి, ఆంగ్లభాషాబోధన గావించుచుండినవి. ఆంగ్లభాషను నేర్చుకొన్న వారి సంఖ్యతో పాటు, నేర్వబూనుచున్న వారి సంఖ్య కూడా, పెరుగుతూవచ్చింది. బెంగాలు ప్రాంతంపై బ్రిటీషువారి ఆధిపత్యం ఏర్పడడంతో, ఆంగ్లభాషాభ్యాసానికి, ప్రోద్బలం కలిగింది. పరిపాలన భారాన్ని వహించియున్న ఆంగ్లేయాధికారులు, తమ కార్యక్రమాన్ని నిర్వహించడానికై, దేశపాలకుల రాజ్యభాషగా నుండిన పర్షియను, నేర్వవలసివచ్చేది. కనుక సహజంగా, ఆంగ్లభాషాపరిజ్ఞానమున్నవారిని తమసేవలో నియమించుకోవడం వారికి సౌకర్యము. ఈ విధంగా భారతీయులూ, ఆంగ్లేయులూ, కూడా అంగ్లభాషా వ్యాప్తిని తీవ్రంగా ప్రోత్సహించినారు.

ఆంగ్ల భాషాజ్ఞానం ఏక్కువైనకొద్దీ, భారతీయులు ఆంగ్లసారస్వతాన్నీ, విజ్ఞానశాస్త్రాన్నీ, అర్థంచేసుకొని, వాటి విలువను గ్రహించగలిగిరి. కేవలం వ్యవహార ప్రయోజనం కొరకు ఆరంభమైన ఆంగ్లభాషాభ్యాసము, విజ్ఞాన జిజ్ఞాసను కలిగించి, ఆంగ్లభాషాజ్ఞాన సంపాదనేచ్ఛను ఇంకనూ అధికం గావించింది.

పర్షియను భాషా వ్యవహారము నశించక తప్పిందికాదు. పరిపాలకుల వ్యవహారం నుంచి అదిఎప్పుడో తొలగిపోయింది. మతమునకు సంబంధించిన భాష కూడా కాదది. ముస్లిములకు అరబ్బీభాషా, హిందువులకు సంస్కృతభాషా వారి మతములకు సంబంధించినట్టివి. విద్వాంసులైన ముస్లిములూ, హిందువులూ కూడా పర్షియను భాషను చక్కగా అభ్యసించి యుండిరనడం వాస్తవమే. కాని, నూతనంగా ఏర్పడిన దేశవ్యవస్థలో దాని ఉపయోగము ఎంతోకాలం ఉండదని నిర్ణయమైపోయింది.

ఇదివరకే, బ్రిటీషుపరిపాలన ఆరంభదశలోనే, ఆంగ్లము ప్రభుత్వ భాష కావలెననే అభిప్రాయాలు వెలువడి యుండినవి. ఛార్లెస్‌గ్రాంట్‌వంటి వారీ అభిప్రాయాన్ని సమర్థించినారు. అధోగతిలో, ముక్తిమార్గంలేక పడియున్న భారతీయుల పునరుద్ధరణము, పాశ్చాత్యవిజ్ఞాన జ్యోతివల్లనే జరుగగలదనీ, అట్టి విజ్ఞాన ప్రాప్తికి ఆంగ్లభాషే సమర్థమైన సాధనమనీ అతని విశ్వాసము. "తూర్పులో మన రక్షణలోనున్న దేశాలు మన స్వత్వము. చాలకాలమవి మన అధీనంలో ఉన్నాయి. ఆంగ్లేయులనేకులు దేశీయుల మధ్య నివసిస్తున్నారు. మనభాష దేశీయులకు అపరిచితంకాదు. దానిని ఇంకనూ ఎక్కువగా విశాలంగా వ్యాపింప చేయడం సుసాధ్యము. ప్రథమంగా, వ్యవహారానికి పిమ్మటా తక్కిన విజ్ఞాన విషయాలను ప్రవేశపెట్టడానికి తగిన సాధనము ఆంగ్లభాష. జయింపబడిన ప్రజలను

మనలో ఐక్యం జేసుకోడానికి విజేతల భాషను ప్రవేశపెట్టడమే తగినసాధనము"
అని, గ్రాంట్ వివరించియున్నాడు.

ఇంకనూ ఇతరకారణాలను అధికారులు సూచించిరి. రాజస్వఆదాయానికి, రాజకీయపరిపాలనకూ సంబంధించిన విషయాలలో, జయింపబడిన దేశీయుల అనాగరక భాషను ఉపయోగించడం అర్థరహితమైనది. పాలకులకూ ప్రజలకూ సుకరమైన వ్యవహారమార్గాన్ని వదలివేసి, దేశభాషలు తెలియని, ఉన్నతాధికారులను సమక్షంగా కలుసుకొని, వ్యవహరించే అవకాశము ప్రజలకు కలిగించకపోవడం అనుచితమైనదని కూడా అధికారులు వాదించిరి.

పాశ్చాత్యసారస్వత జ్ఞానమూ, పాశ్చాత్యవిజ్ఞానమూ, దేశీయుల మానసిక దాస్యాన్ని తొలగించగలవనీ, అన్ని విషయాలలోనూ, హేతువిమర్శక విధానాన్ని కలిగించి, ప్రజలశక్తి సామర్థ్యాలను అభివృద్ధి గావింపగలవనీ వివరించిరి. అట్లు జరిగినతోడనే, ప్రజలు తమ పంటభూములనూ, వాతావరణాన్ని పరిస్థితులనూ, చక్కగా వినియోగించుకొని, తమ జీవిత సౌఖ్యాలనూ, సౌకర్యాలనూ అభివృద్ధి చేసుకోగలరని,- కూడా వాదించినారు.

విద్యావిస్తృతి కారణంగా, బ్రిటీషుసామ్రాజ్యము లుప్తమైపోతుందన్న భయము గ్రాంటుకెప్పుడూ కలుగలేదు. పాలకులకూ, పాలితప్రజలకూ సామరస్యాన్ని, భావైక్యతనూ, పాశ్చాత్య విజ్ఞానం కలిగిస్తుందనీ, భారతీయులు బ్రిటీషువారికి సర్వదా కృతజ్ఞులై యుందురనీ, తన్మూలంగా, బ్రిటీషువార వాణిజ్యము ఇంకనూ ఎక్కువగా భారతదేశంలో విస్తరిస్తుందనీ, అతడు ఆశపడి యుండెను.

ఈ తార్కిక చర్చలేవీ, కంపెనీ డైరెక్టర్లకు రుచించలేదు. విజ్ఞానవ్యాప్తి వల్ల తమ పరిపాలనకు భంగం కలుగగలదనే శంక వారిని విడవలేదు. ఇంగ్లాండు ప్రభుత్వం, ఇంగ్లాండులోని ప్రజానీకంయొక్క విద్యావ్యాప్తికి ఎంతమాత్రం చేస్తున్నదో వీరెరుగుదురు. తమ ప్రజలవిషయంలోనే ఇంగ్లీషుప్రభుత్వం ఉదాసీనం వహించియుండగా, పాలితప్రజల విద్యావిషయమై తాము డబ్బు వెచ్చించవలసిన అవసరమింకా కలుగలేదని కంపెనీవారి వాదము. కనుక, 1765 నుండి 1813 నాటివరకూ, సాధారణ విద్యావ్యాప్తి విషయమై కంపెనీవారెట్టి చర్యకూ పూనుకోలేదు. ఐనా, దేశీయప్రభువుల పరిపాలన బాధ్యతలన్ని తమకు సంక్రమించి యుండడంవల్ల పూర్వపురాజులు నిర్వహిస్తుండిన కొన్ని ధర్మములు ఇప్పుడు తమ కర్తవ్యములుగా ఏర్పడినవి. విద్వాంసులను ఆదరించడమూ, మద్రసాలలలోనూ, టోలులలోనూ, ఉన్నతవిద్యకు ఆశ్రయమివ్వడమూ,- ఇత్యాదులు వీరిపై బడినవి. న్యాయశాస్త్రవివరణమూ, న్యాయనిర్ణయమూ,- ఇత్యాది పరిపాలన నిర్వహణకార్యాలలో, హిందూముస్లిము న్యాయశాస్త్రిల పండితుల అవసరం ఏర్పడింది కనుక, వారికి ప్రాపకమివ్వక తప్పిందికాదు.

ఈ అవసరాన్నిబట్టే, హేస్టింగ్సు 1780 లో కలకత్తా మద్రసాను స్థాపించినాడు. కలకత్తా ముస్లిములను సమాధానపరచి, వారి అభిమానాన్ని సంపాదించ

డము" ఇతని ఉద్దేశము. "ప్రభుత్వంలోని బాధ్యతాయుతములైన ఉద్యోగాలకూ, అధికవేతనమిచ్చే పదవులకూ, కులీనముస్లిముల కుమారులను, చదివించి, అర్హులుగాజేసి, న్యాయస్థానాలకు సమర్థులైన అధికారులను సిద్ధముచేయడం ఇతని పూనిక" ఈ ఉద్యోగాలన్నీ ఆనాడు హిందువుల అధికారంలో ఉండినవి.

దీని ననుసరించే, బనారసులో, స్థానికమంత్రిగానుండిన జొనాథన్ డంకన్ (Jonathan Dunkan) 1791 లో, బనారసు సంస్కృతకళాశాలను స్థాపించెను. కలకత్తా మద్రసాను స్థాపించడంలో ముస్లిములను వశపరచుకోవడం ఆశయమైనట్లే, ఈసంస్కృతకళాశాల స్థాపనకు హిందువుల వశీకరణమే ఆశయమయింది 1801లో, వెల్లస్లీ స్థాపించిన ఫోర్ట్ విలియం కళాశాల ప్రధానంగా, కంపెనీవారి ఇంగ్లీషు సివిల్ సర్వీసు ఉద్యోగుల తరిఫీదుకై ఏర్పడియుండినది. కాని అప్పుడు భారతీయ భాషలలో పాఠ్యగ్రంథాలనూ, వ్యాకరణాలనూ, నిఘంటువులనూ, రచించడానికీ, ఇతర భాషలనుండి గ్రంథాలను అనువాదం చేయడానికీ ఆ కళాశాలాధ్యాపకులను ఉపయోగించుకొనిరి. భారతీయ సారస్వతాన్ని,– ప్రధానంగా, ప్రాచీన సారస్వతాన్ని అభివృద్ధిచేయడము, ఆ కళాశాలయొక్క ప్రధానకర్తవ్యము.

కలకత్తా మద్రసానూ, బనారసు సంస్కృత కళాశాలనూ, స్థాపించడము, భారతీయ భాషల్లో కుతూహలమున్న ఆంగ్ల విద్వాంసులు ఆ భాషల్లో పరిశోధనకు పూనుకోవడము, (Wilkins, William Jones, Colebrooke, and others), విద్యా వ్యాప్తివిషయమై ఇంగ్లాడులో చూపెట్టబడియున్న ఉత్సుకతా,– ఇవి ఇండియాలోని బ్రిటిసు పరిపాలకుల అభిప్రాయాలలో పరివర్తనం కలిగించినవి. 1811లో, మింటోప్రభువు. (Lord Minto), ఇండియా ప్రజలు సాహిత్య విజ్ఞాన విషయాల్లో వెనుకబడుతున్న విషయాన్ని ఇంగ్లాండు ప్రభుత్వానికి తెలియజేస్తూ, తన అభిప్రాయాన్ని గుర్తించి యున్నాడు. "భారతీయ ప్రభుత్వంలో పూర్వంరాజులూ, సర్దారులూ, సంపన్నులైన వ్యక్తులూ, విజ్ఞాన వ్యాప్తికి, ఇస్తూ ఉండిన ప్రోత్సాహము, మన హాయాములో లోపించింది. ఇంగ్లీషు ప్రభుత్వము, హిందువుల సారస్వతాన్ని ఆదరించి పోషించడంలేదు."– అని అతడు తన విచారాన్ని వ్యక్తపరచినాడు.

ఇంగ్లాండులోని ప్రజాభిప్రాయ ప్రాబల్యకారణంగా 1813 నాటి, శాసనపత్రంలో ఈ విషయమై ఒక ప్రకరణాన్ని చేర్చిరి. భారతీయ సారస్వత పునరుద్ధరణకు, సారస్వతాభివృద్ధికి పండితులను ప్రోత్సహించడానికీ, ఇండియా ప్రజలలో విజ్ఞాన వ్యాప్తికీ,–ప్రతి సంవత్సరమూ లక్షరూపాయలకు తక్కువ కాకుండా ధనాన్ని ప్రత్యేకించవలెనని (కేటాయించవలెననీ) ఈ ప్రకరణము శాసించింది.

కాని, ఈ ప్రకరణం 1823 నాటి వరకూ నామమాత్రావశిష్టమైయుండినది. దీన్ని అమలు జరుపలేదు. 1813 నుండీ 1823 వరకూ, ఏసంవత్సరంలో కూడా ప్రత్యేకింపబడిన లక్షరూపాయలను పూర్తిగా ఖర్చుపెట్టలేదు. విద్యావిషయకమైన, ఆశయాలు, ఉద్దేశాలూ, విధానాలు,– ఇత్యాదులను గూర్చిన

వాదప్రతివాదాల్లో మునిగిపోయిరి. కడపటికి మెకాలే (Macaulay) సలహా ననుసరించి, బెంటింక్, ఒక నిశ్చయానికి వచ్చి, 1835 మార్చి 7వ నాటి తీర్మానాన్ని అమలు జరిపి, ఈ వాద ప్రతివాదాలను అంతమొందించినాడు.

## VI. అధికారేతరుల కార్యక్రమము

విద్యావ్యాప్తి విషయంలో కంపెనీ వారిట్టి అయిష్టతనూ, అలక్ష్యాన్ని చూపినప్పటికీ, విద్యాభ్యుదయం జరగకపోలేదు. ఇంతకు ముందు వివరించిన విద్యావ్యాపక కార్యక్రమము,అధికమైనది కాకపోయినా, మిషనరీ సంస్థల ఉద్యమం వల్లనే ఈ అభ్యుదయము జరిగిందనడం నిజము.

మిషనరీలు మాత్రమేకాక, అధునాతన విద్యా వ్యాప్తికిగల ఆవశ్యకాన్ని గూర్చి భారతీయులుకూడా ఆసక్తిని చూపుతూ వచ్చిరి. ధనమూ అవకాశాలూ వీరికి స్వల్పమే. ఐనా, బాలబాలికలకు పాశ్చాత్య విద్యావకాశాలను ఏర్పరచడంలో, ఆంగ్ల ప్రభుత్వాధికారులూ, ప్రభుత్వసంస్థలకు చెందని ఇతర ఆంగ్లేయులూ, వీరికి ప్రబలమైన సాహాయ్యాన్ని ఇచ్చియుండడం ముదావహమైన విషయము.

ఈ సహకారఫలితంగా, మొదట, 1817 లో, హిందూకళాశాల 'విద్యాలయ'- స్థాపితమయింది. ఆంగ్లసారస్వతాన్ని పాశ్చాత్య విజ్ఞానాన్ని ఇండియాలో వ్యాప్తిగావించడానికి ప్రోద్బలమిచ్చినవారిలో రాజారాంమోహన్‌రాయ్, డేవిడ్ హేర్ (David Hare) ముఖ్యులు. గడియారాలనూ, రత్నాభరణాలనూ, తయారుచేయడం, డేవిడ్ హేర్ వృత్తి. విద్యావ్యాప్తికీ, సంఘసంస్కరణానికీ, ఉదారాశయాలను పెంపొందించే సంస్థల పోషణకూ తన జీవితాన్ని అంకితం చేసినవాడై, ఇతడు కలకత్తాలో నివాస మేర్పరచుకొన్నాడు.

ఆంగ్లభాషా సారస్వతాలనూ, పాశ్చాత్యవిజ్ఞానశాస్త్రాలనూ, బోధించే కళాశాలను స్థాపించడానికి ఇతడు ఉత్సుకుడై ఉండినాడు. మతవిషయంలో లౌకిక దృష్టిగలహేర్, సంస్కృతభాషపై అభిమానం చూపలేదు. ఐనా, అనేక ప్రముఖ భారతీయుల, తోడ్పాటు ఇతనికి లభించింది. కలకత్తా సుప్రీమ్‌కోర్టుకు అధ్యక్ష న్యాయాధిపతియైన, సర్, ఎడ్‌వర్డ్ హైడ్ ఈస్ట్ (Sir Edward Hyde East) యొక్క సహకారముతోనూ, ఇతర ప్రముఖ భారతీయుల సహకారం తోనూ, ఇతడు, కళాశాలాస్థాపన నిధికి విరాళాలను పోగుచేయడానికై ఒక సంఘాన్ని ఏర్పరచెను. భారతీయమతం విషయంలోనూ, సమాజ సంస్కరణ విషయంలోనూ, రామ్‌మోహన్‌రాయ్ అభ్యుదయవాదికావడంవల్ల, ప్రాచీన సంప్రదాయస్థవర్గంవా, రితనిపట్ల, అయిష్టులై యుండిరి. ఆ కారణంవల్ల ఇతడు కళాశాలాసంఘంలో సభ్యుడుగా చేరలేదు.

ఈ విధంగా స్థాపితమైన కళాశాల, కేవలము, హిందూవిద్యార్థుల ప్రయోజనానికి మాత్రమే ప్రత్యేకింపబడింది. వేగంగా అభివృద్ధిచెందుతూ వచ్చిన ఈ కళాశాలలో 1828 నాటికి 436 మంది విద్యార్థులు అధ్యయనం చేయుచుండిరి.

కాని, పిమ్మట దీని నిర్వహణకార్యక్రమము అసమర్థులైనవారి చేతుల్లో పడింది. అంతతో, సాధారణసమితి జోక్యం కలిగించుకొని, ఒక పరిశీలకుని, నియోగించింది. కడపటికి, ప్రభుత్వము దీనిని తన హస్తగతం చేసుకొని, 1855 లో, రాజధానీ కళాశాలలో కలిపివేసింది.

ఆంగ్లవిద్యపట్ల అపారమైన ఔత్సుక్యమున్న రామ్‌మోహన్‌రాయ్, తన స్వంతధనంతో ఒక ఆంగ్లపాఠశాలను, ఇంతకుపూర్వమే నెలకొల్పియుండెను. (1816-17) ఇతని కుమారుడు రామప్రసాదూ, తన స్నేహితుడైన మహర్షి ద్వారకనాథ్ టాగోరుకుమారుడైన దేవేంద్రనాథ్ టాగోరూ, ఈ పాఠశాలలో చదివినారు. పాఠశాలతోబాటు, వేదాంతకళాశాలనుకూడా ఇతడే నిర్మింపజేసినాడు. ఆధునిక విజ్ఞానదృష్టితో, భారతీయ తత్త్వశాస్త్రాన్నీ, ప్రాచీన విజ్ఞానాన్నీ పరిశీలించడమూ, బోధించడమూ ఈ కళాశాల నిర్వహిస్తూ వచ్చింది.

ప్రాథమికదశలో, ఈ హిందూకళాశాలలోని విద్యార్థులు, బాహాటంగా హిందూధర్మాలనూ, సిద్ధాంతాలనూ, విశ్వాసాలనూ, ఆహారవిహారవిధాలనూ, నిరాటంకంగా విమర్శిస్తూ, హైందవ సంప్రదాయ ప్రవర్తనకు విరుద్ధమైన ప్రవర్తిస్తూ, అపకీర్తిపాలైరి. ఈ విధంగా సమాజంలో పరివర్తన ఝంఝూమారుతం ఉత్పన్నమయింది.

విద్యావిషయంలో కృషిచేసిన మరియొక అనధికారసంస్థ, 1919 లో ఏర్పడిన కలకత్తా పాఠశాలాసమితి. ప్రాథమిక విద్యావ్యాప్తికై పాఠశాలలను స్థాపించడమూ, ఉపాధ్యాయులకు శిక్షణనివ్వడమూ, ఈ సంస్థ కార్యక్రమాలు. 1823 లో ప్రభుత్వం ఈ సంస్థకు ధనసహాయం గావించింది.

ఆధునిక విద్యాభ్యాసంపట్ల ప్రజలకు అభిమానమూ ఉత్సాహమూ అధికమౌతూ ఉండినవని, స్వతంత్ర విద్యాసంస్థల కార్యక్రమంవల్లనూ, సత్ఫలితాల వల్లనూ, వ్యక్తమౌతుంది. ఇంతవరకూ నిర్లక్ష్యంగా ఉన్న కంపెనీ ప్రభుత్వము విద్యావిషయంలో తగినచర్య తీసుకోకతప్పలేదు.

## VII. ఆంగ్ల విద్యావ్యాప్తి విజయము

1823 లో, తాత్కాలిక గవర్నరు జెనరలుగా వ్యవహరిస్తూ ఉండిన, ఆడం (Adam) సర్కారువిద్యాశాఖాసమితిని ఏర్పరచినాడు. హెచ్. టి. ప్రిన్సెప్; హెచ్. హెచ్. విల్సన్ మున్నగు ప్రముఖులతోసహా పదిమందిసభ్యులు ఈ సమితిలో ఉండిరి. ప్రతిసంవత్సరం ప్రభుత్వం ఇచ్చే లక్షరూపాయల విరాళమూ, గత సంవత్సరాల నిలువబాకీ, విద్యాసంస్థల విరాళాలలో నిలువయున్న మొత్తమూ,- చేర్చి ఈ సమితివారికి అప్పగించినాడు.

ఈ సమితి, ప్రథమంగా రెండు సమస్యలను సాధించవలసి వచ్చింది. విద్యార్థులకు గరపవలసిన విద్యాస్వభావమెట్టిదై యుండవలెను,- అనేది మొదటి సమస్య. ఈ విద్యను గ్రహింపవలసిన విద్యార్థులెట్టివారై యుండవలెను. అనే విషయాన్ని నిర్ణయించడం రెండవసమస్య. సంస్కృతంలోనూ, అరబ్బీలోనూ

నిబద్ధమైయున్న హిందూముస్లిముల సంప్రదాయవిద్యను బోధించడానికిమాత్రమే, విద్యావిధానం పరిమితము కావలెనా, లేక, ఆంగ్లసారస్వతానికీ, పాశ్చాత్య విజ్ఞానశాస్త్రాల బోధనకుకూడా, తమ విద్యావిధానము వర్తించవలెనా,- అనే విషయాన్ని మొదట నిర్ణయించవలెను. ఇక, ఈ విద్యాబోధన అగ్రవర్గాలవారికి మాత్రమే పరిమితం కావడమూ, లేక, తమ ఉద్యమంలో సామాన్యప్రజానీకాన్ని అంతటినీ గ్రహించవలెనా, అనేది నిర్ణయింపవలసిన రెండవప్రశ్న.

సమితిలో, ప్రాచీన సంప్రదాయస్థులకు ఎక్కువ ప్రాబల్యం ఉండినది. కావున, "ముస్లిములలోనూ, హిందువులలోనూ, ఇంకనూ నిలిచియున్న తీవ్ర పక్షపాతభావాన్నిబట్టీ, నూతన విద్యావిధానానికి అవసరమైన సాధనసామగ్రి యొక్క కొరతను గమనించీ, ప్రభుత్వ మేర్పరచిన హిందూముస్లిము విద్యాలయాలలో, ఆయా వర్గాలవారికి, హిందూ మహమ్మదీయ సారస్వతాలనూ, విజ్ఞానశాస్త్రాలనూ, మాత్రమే బోధింపవలెననే, మా, సునిశ్చితాభిప్రాయాన్ని ఇస్తున్నాము,"- అని కమిటీ తన దృఢాభిప్రాయ మిచ్చింది.

డైరెక్టర్లసభ, ఈ అభిప్రాయానికి ప్రతికూలమయింది. బెంథామ్ శిష్యుడైన జేన్స్‌మిల్, అనుభవశాలియైన బుద్ధివాది. ఇతని సలహానుసరిస్తూన్న, కంపెనీడైరెక్టర్లూ, బిషప్ హీబర్, అలెగ్జాండర్ డఫ్, వంటి మిషనరీలూ, అభ్యుదయాన్ని కోరుతున్న హిందూసంస్థా, రామ్‌మోహన్‌రాయ్ అధ్వర్యంలో, ఈ సమితి నిశ్చయాన్ని, ప్రతిఘటించిరి. సంస్కృతకళాశాలను కలకత్తాలో స్థాపించే ప్రయత్నాన్నీ, సంస్కృతవిద్యను బోధించే నిశ్చయాన్నీ, తీవ్రంగా ఖండిస్తూ, రామమోహన్‌రాయ్, ఆమ్‌హర్‌స్ట్ ప్రభువుకు (Lord Amherst) నిష్కర్షమైన మాటల్లో పత్రం లిఖించి పంపినాడు. "సంస్కృత వ్యాకరణంలోని సునిశితములైన మెళకువలను గ్రహించడానికై, యువకులు తమ అమూల్యమైన పన్నెండు వత్సరములకాలాన్ని వ్యర్థం గావించడంవల్ల, వారికికలిగే ప్రయోజన మేమాత్రమూ లేదు. వేదాంత, మీమాంసా న్యాయశాస్త్రాలలోని, పర్యాలోచన, ఊహాపోహాల్లో కాలం గడపడంవల్లకూడా లభించే ప్రయోజనం శూన్యము. ఈ చదువువల్ల, యువకులు సమాజానికి ప్రయోజకులైన వ్యక్తులుగా సిద్ధింపరు. దేశీయప్రజాభ్యుదయమే ప్రభుత్వంయొక్క ఆశయం కావడంవల్ల వారికి విజ్ఞానాన్ని కలిగించి, విశాలదృక్పథాన్నిచ్చి ప్రయోజకులను గావించే ఉదార విద్యావిధానాన్ని అవలంబింపవలసి యున్నది. గణితశాస్త్రమూ, ప్రకృతిశాస్త్ర రసాయనశాస్త్రాలూ, జీవరచనాశాస్త్రమూ, ఉపయోగకరములైన ఇతర ఆధునిక శాస్త్రాలూ, ఈ విద్యాప్రణాళికలో తప్పక చేరవలెను. యూరోపులో అధ్యయనంచేసి, ఈ విషయాలలో పాండిత్యం గడించివచ్చిన కొందరు అధ్యాపకులను నియోగించుకొని, ఆవశ్యకములైన గ్రంథాలనూ, సాధనసామగ్రినీ సమకూర్చుకొని, కళాశాలను నడపడానికి ప్రభుత్వము ప్రత్యేకించిన ధనం చాలునని మా దృఢవిశ్వాసము." ఇది ఆ జాబులోని విషయము.

మెకాలే (Macaulay) ఇండియాకు రావడం (1834) ఈ వ్యతిరేక

సంఘానికి, బలంచేకూర్చింది. గవర్నరు జెనరలుయొక్క కౌన్సిలులో మెకాలే, నూతన సభ్యుడు కావడము, వీరి ప్రయత్నానికి తోడ్పడింది. విద్యాసభకు ఇతడు అధ్యక్షుడుగా నియమింపబడడంతో, సభ్యుల అభిప్రాయం ఆంగ్లవిద్యాభ్యాసం వైపు మొగ్గింది. 1835 ఫిబ్రవరి 2వ నాడు, మెకాలే తన సిఫారసు పత్రాన్ని గవర్నర్ జెనరల్ బెంటింకుకు పంపినాడు. (శిఫారసు, Macaulay Minute అని ప్రసిద్ధిచెందింది.) ఆ శిఫారసులోని, నిర్ణయబద్ధములైన వాదమూ, ప్రదర్శనలో మెకాలే ఉపయోగించిన భాషా విన్యాసమూ, శైలీ, ఎంతో ఆదరణను సంపాదించుకొన్నవి. మెకాలే శిఫారసు పనిచేసినది, అనేక ఆలోచనలను ఎత్తిచూపినాడు. ఈ శిఫారసును బలపరచడానికి మెకాలే మరి కొన్ని విషయాలను కూడా చేర్చి యున్నాడు. ఆంగ్లవిద్యాభ్యాసానికి భారతీయులు ఉత్సుకతతో ఉన్నారు గనుక, విద్యాభ్యాస సంబంధమైన ఖర్చులను, భరించడానికి కూడా, సిద్ధపడియున్నారు. సంస్కృతాన్ని, అరబ్బీని, బోధించ దలచినచో, ప్రభుత్వం విద్యార్థులకు ద్రవ్య సహాయము చేయవలసి ఉంటుంది. మరిన్ని-

సంస్కృత కళాశాలలో దీర్ఘకాలం చదివి వచ్చిన విద్యార్థులు లనేరులు తమ దరిద్రావస్థను వివరిస్తూ కమిటీ వారికి విన్నప పత్రాన్ని సమర్పించినారు. ఇంత కాలంవారు కష్టపడి చదివి వచ్చినందువల్ల కూడా, తమ జీవితస్థితిగతులేమీ బాగు పడలేదనీ, వాటిని బాగుపరచుకొనే అవకాశాలు కూడా లేవనీ, వారు తమ విజ్ఞాపనలో మొరపెట్టుకొన్నారు. పాఠశాలల పుస్తక సంఘంవారు ప్రచురించిన, 31,000 ఇంగ్లీషు పుస్తకాలన్నీ రెండేండ్లలో ఖర్చుకాగా, అరబిక్, సంస్కృత పుస్తకాలు, మూడేండ్ల కాలంలో కూడా ఏమాత్రమూ ఖర్చుకాలేదు. వాటి ముద్రణ ఖర్చుల విషయమట్లుండగా, వాటిని నిలువచేయడానికై వెచ్చించిన డబ్బు కూడా, ఈ పుస్తకాల అమ్మకంవల్ల, రాలేదు. ఈ విషయాల నన్నింటిని మెకాలే వ్యక్తము చేసినాడు.

విద్యకై ప్రభుత్వం నియమించిన ధనము ప్రయోజనకరమైన విద్యావిధానానికి మాత్రమే ఉపయుక్తము కావలెనని బెంటింక్ నిశ్చయించినాడు. అనగా, అభివృద్ధికి వస్తున్న భారతీయులలో పాశ్చాత్య విజ్ఞానాన్ని వ్యాపింపచేయడమే ప్రభుత్వంయొక్క ఆశయమని ఇరడంగీకరించడం జరిగింది.

ఈ పాశ్చాత్యవిజ్ఞానవ్యాప్తివల్ల దేశంలో, ఒక నూతనవర్గం సృష్టికి వస్తుంది. ఈ వర్గంలోనివారు జన్మతః భారతీయులే ఐనా,- అభిరుచులు, నైతిక ప్రవృత్తి, బుద్ధివిశేషము,- మున్నగువాటిలో, ఆంగ్లేయులవంటి వారౌతారు. "ఆధునిక భావాలుగల భారతీయులు" అని దీనికి సరళమైన అర్థము.

భారతీయ ప్రజాభిప్రాయం కూడా, ఈ నిర్ణయానికి అనుకూలంగానే ఉండినది. యుద్ధనిర్వహణం, శాంతిపరిస్థితులను నెలకొల్పడం, పరిపాలననూ, పరిశ్రమలనూ, సువ్యవస్థితమొనర్చడం,- మున్నగువాటిని గమనించిన దేశీయులు, తమకంటెనూ పాశ్చాత్యులు అన్నివిధాలా ఉత్తములనే అభిప్రాయాన్ని స్థిరపరచుకొన్నారు.. నూతనమైన జీవిత దృక్పథాన్ని ఏర్పరచుకోవడంవల్లనూ,

నూతనమైన ఆలోచన విధానాలనూ ప్రవృత్తులనూ గ్రహించడంవల్లనూమాత్రమే అభ్యుదయ సామర్థ్యాలు తమకు సిద్ధింపగలవని, సహజ ప్రవృత్తికమైన నిశ్చిత జ్ఞానము, వారి నుద్బోధించింది. నూతనవర్గ ప్రజల ఆశయాలను వివరించడంలో రామమోహన్‌రాయ్ ప్రముఖుడు. సంప్రదాయబద్ధులైన, పూర్వాచారపరాయణులైన వారిలో అనేకులుకూడా, ఈ అవసరాన్ని గుర్తించి, పాశ్చాత్యవిద్యావిజ్ఞానాల వ్యాప్తికి, తమ సహకారాన్ని కలుగజేసినారు.

ఆంగ్లవిద్యావ్యాప్తి, బ్రిటీషుపరిపాలన అవసరాలనుకూడా తీర్చింది భారతీయులనేకులను క్రింది ఉద్యోగాలలో, నియోగించవలసిన ఆవశ్యకము ప్రభుత్వానికిగలదు. ప్రధానంగా, పాశ్చాత్యవిధానంపై ఏర్పడియున్న, పరిపాలన యంత్రాన్ని నిర్వహించడం, పాశ్చాత్య విధానాన్ననుసరించి విద్యాభ్యాసం గావించిన వారికెక్కువ సులభము. ఇట్టి సౌకర్యం ప్రభుత్వానికి లాభకరం. పాలిత ప్రజల దేశభాషల నభ్యసించే కష్టంతొలగి బ్రిటీషు అధికారులకు కొంత విరామమేర్పడింది. విద్యావంతులైన భారతీయులకు పాశ్చాత్య సారస్వతంలోనూ, శాస్త్రాల్లోనూ, అభిరుచి ఎక్కువ కాగలదనీ, పాశ్చాత్యవిజ్ఞాన కారణంగా, వారికి బ్రిటీషువారిపట్ల స్నేహభావమూ, కృతజ్ఞతా ఏర్పడుననీ, బ్రిటీషువారు ఆశించిరి. దేశం విద్యావంతమైతే, స్వాతంత్ర్య భావముదయించి, తత్ప్రయత్నం గావింతురనే వాదన అతిశయోక్తియనీ, వాస్తవం కాదనీ త్రోసిపుచ్చిరి.

దేశంలో ఆంగ్ల విద్యను నెలకొల్పడానికి, విశదములైన కారణాలున్నవి. "దేశీయుల మతస్వభావ ప్రవృత్తులు చాల సున్నితములైనవి. ఈ పరిస్థితి మనకెప్పుడూ అపాయకరమైనదే. మనకూ, మన పాలిత ప్రజకూ సాహచర్యంలేదు; అంతర మెక్కువగా ఉన్నది. మన ప్రభుత్వము అస్థిరమై యుండడానికి, ఇది హేతువు. కనుక, ఈ రెండు అపాయ పరిస్థితులనూ, తొలగించడానికి సమర్థమైన విధానాన్ని మనమవలంబించవలసియున్నది. వారికి మన విషయంలో గల దురభిప్రాయాన్ని ప్రథమంగా తొలగించడమూ, మనభావాలు వారు గుర్తించేటట్లు చేయడమూ అవసరము. మన ఆశయాలనూ, అభిప్రాయాలనూ వారు గ్రహించేటట్లు చేయడానికి, ప్రయోజనకరము, హేతుబద్ధము ఐన విద్యావ్యాప్తి ఒక్కటే తగిన సాధనము." అని ఎలిఫిన్‌స్టన్ వ్రాసియున్నాడు. బొంబాయి గవర్నరైన సర్ జాన్‌మాల్‌కాం, 1828లో, (Sir John Malcolm.) "ఆంగ్ల విద్య, దేశీయులలో, వ్యాప్తి కావడంవల్ల, మన పరిపాలన వ్యవస్థలోని ప్రతి భాగముతోనూ, దేశీయులకు సంబంధమూ బాధ్యతా ఏర్పడగలదనే ఆశ, నాకున్నది. ఆర్థికవ్యవస్థ, పారిపాలనాభివృద్ధీ, సామ్రాజ్య పరిరక్షణ,- ఈ విషయముల ప్రయోజనాన్నిబట్టి ఆంగ్ల విద్యావ్యాప్తి, అత్యవసరమని నా అభిప్రాయము." అని వ్రాసినాడు.

ఆంగ్ల విద్యను నెలకొల్పడంలో తమకుగల ఆశయాన్ని, కంపెనీ డైరెక్టర్లసభ (5-9-1827) ఈ క్రింది విధంగా వివరించింది. "దేశవ్యాపార

వాణిజ్యాలలోనూ, ప్రభుత్వపు పరిపాలన వ్యవస్థలోని ముఖ్యశాఖలలోనూ, దేశీయులను నియోగించవలసిన అవసరము, దిన దినమూ ఎక్కువవుతున్నది. అట్టి ఉద్యోగాలను సక్రమంగా నిర్వర్తించగల వ్యక్తుల ననేకులను తయారుచేయడము, నూతన విద్యావిధానంయొక్క ప్రథమకర్తవ్యమై యున్నది. అవలంబింపవలసిన, నూతన విద్యాప్రణాళిక, విద్యార్థులబుద్ధి, శక్తిసామర్థ్యాలను వృద్ధిపరచడం మాత్రమేకాక, వారినైతిక వ్యవస్థను పెంపొందించేదికూడా కావలెను. విశ్వాసంతో వారిని ఉద్యోగాలలో నియమించడానికీ, వారి న్యాయనిష్ఠనూ, నిష్కాపట్యాన్నీ ఆధారంగా చేసుకొని, విశ్వాసయుతములైన పదవులను వారి కప్పచెప్పడానికీ, తగిన అర్హతనూ, యోగ్యతనూ, మన విద్యాప్రణాళిక వారికి, కలిగించవలసి ఉంటుంది."

కంపెనీడైరెక్టర్లసభ (29-9-1830), నను ఉద్దేశాన్ని రెండవసారిగా, "బుద్ధిసూక్ష్మతవల్లనూ, నైతిక ప్రవృత్తివల్లనూ యోగ్యులై సివిల్ పరిపాలన వ్యవస్థలోని ఉన్నతపదవులను నిర్వహించడానికి సమర్థులైన వ్యక్తులను సిద్ధింప చేయడం, నూతన విద్యావిధానంయొక్క ఉద్దేశము." అని వ్యక్తంచేసింది.

ఇట్లు, 1835 నాటికి,- భారతీయుల మనస్సుల, ముద్రితపరుస్తున్న నూతన విజ్ఞానవాంఛ, పరిపాలన వ్యవస్థాసౌకర్యం యొక్క ప్రేరణము, మిషనరీల ప్రోద్బలము, ఉదారాశయులైన అధికారులూ, ఇతరులూ, ఈ విషయమై చేసిన సమర్థనము, వారు స్థాపించిన ఆంగ్లపాఠశాలలకు కలిగిన ప్రజాదరణము,- ఇత్యాదులన్నీ ప్రోద్బలకారణములు కాగా, మెకాలే శిఫారసులోని ప్రధాన విషయాన్ని గవర్నర్ జెనరల్ ఆమోదించెను.

పాశ్చాత్యసారస్వతమూ, శాస్త్రవిజ్ఞానమూ నూతన విద్యాప్రణాళికలో ప్రాధాన్యం వహింపవలెననే సలహాను, బెంటింకు అంగీకరించినాడు. కాని, ప్రాచీన సంప్రదాయ విద్యను బోధించే విద్యాలయాలను తీసివేయవలెననే శిఫారసును ఆమోదించలేదు. కలకత్తా మద్రసాకునూ, కలకత్తా బనారసులలోని సంస్కృతకళాశాలలకూ, ప్రభుత్వసాహాయ్యాన్ని ఇస్తూవచ్చినాడు. కాని, విద్యార్థి వేతన విధానాన్నీ, ప్రాచీన పుస్తకప్రచురణకై డబ్బు ఖర్చుపెట్టడాన్నీ, ఆపివేసినాడు.

తరువాతవచ్చిన ఆక్లాండ్ (Auckland), ప్రాచీన పుస్తకాల ముద్రణాన్ని, మరల ప్రారంభించెను. ప్రాచీన సంప్రదాయవాదులకూ, పాశ్చాత్య విజ్ఞానవాదులకూ జరుగుచుండిన వివాదాత్మక చర్చలను, తానుగావించిన సిఫార్సుతో అంతమొందించినాడు (24-11-1839). అంతవరకూ నిలిచి యున్న ప్రాచీన విద్యాసంస్థలను ముందుకూడా పోషించడమూ, ప్రభుత్వం నియతం కావించిన ద్రవ్యపరిమితినిదాటక, ప్రాచీన పుస్తకములను, ప్రచురించడమూ, ప్రభుత్వం జరుపుతుందని, హామీఇచ్చి, నూతన పాశ్చాత్య విద్యాభివృద్ధి విషయమై, బెంటింకుగావించిన నిర్ణయాన్ని, స్థిరపరచినాడు.

దీనికి సంబంధించిన ఇతర విషయాలు, వివాదాత్మకములైనవి. ఒకటి, విద్యాబోధన భాషకు సంబంధించినది. ప్రజానీకంలో జరుగవలసిన విద్యావ్యాప్తిని

గూర్చినది, రెండవది. ఈ రెండువిషయములలో, జరిగిన నిర్ణయాలు కలిగించిన పరిణామము, సాంస్కృతికంగానూ, ఆర్థికంగానూ, రాజకీయంగానూ సుదూర వ్యాప్తికలది.

బోధనభాషవిషయంలో, మూడు పక్షము లేర్పడినవి. ఉన్నతపాఠశాలలోనూ, కళాశాలలోనూ, విద్యాబోధన సమస్తమూ ఆంగ్లంలోనే జరుగవలెననే పక్షం, ఒకటి. పాశ్చాత్యవిజ్ఞానము సర్వస్వమూ, భారతీయభాషలైన సంస్కృత, అరబ్బీ, పారసీకభాషలలో, బోధింపవలెననే పక్షము, రెండవది. వ్యవహారంలో ఉన్న బెంగాలీ, హిందీ, ఉర్దూ మున్నగుభాషలు ఈ ప్రయోజనానికి ఎక్కువ తగినవని, మూడవపక్షంవారి వాదన. మొదటివర్గంవారిలో ఛార్లెస్‌గ్రాంట్ ప్రముఖుడు. "పరమప్రయోజనాన్ని బట్టి, ఆంగ్లభాషనుపయోగించడమే శ్రేష్ఠమైనది. నూతన భావప్రపంచప్రవేశం కలిగించే సాధనము, ఆంగ్లమొక్కటే. అంతేకాక, హిందూతత్త్వమనే ప్రమాదనిర్మితమైన కట్టడముయొక్క మూలాన్ని పెకలించి, క్రింద పడద్రోయగలిగినట్టిది, ఆంగ్లభాషా పరిజ్ఞానము. జయింపబడిన జాతిని తమలో ఐక్యపరచుకోడానికి తగిన ఉత్తమసాధనము, విజేతలభాషను వారికి నేర్పడం,- అనే విషయము అన్నిటికంటెను ముఖ్యమైనది". ఈ వాదన లెట్లున్నా, మెకాలే గావించిన సమర్థన, ప్రభుత్వంవారిని ఒప్పించి, ఆంగ్లభాషను బోధన భాషగా స్థిరపరచింది. సారస్వతవిజ్ఞానమూ, శాస్త్రీయవిజ్ఞానమూ, కొరత పడిన వ్యవహారభాషలు, ఉన్నత విద్యాబోధనకు అనర్హములని వాటిని ఖండించినాడు. సంస్కృత అరబ్బీభాషలనుగురించి, మెకాలే, సూత్రప్రాయమైన ఒక వాక్యంలో, తన విమర్శను ఇమిడ్చినాడు.

"ఇండియా, అరేబియాదేశాలలోని దేశ సారస్వతం సమస్తమూ, మంచి యూరోపియన్ గ్రంథాలయంలోని ఒక అల్మారా పుస్తకాల విలువకు సమానము." అనే వాక్యము, ఇతని అజ్ఞానాన్నీ, తిరస్కారభావాన్నీ వ్యక్తంచేస్తుంది. ఆంగ్లభాషను ప్రశంసించి, దానిని బోధన భాషగా సిఫారసు చేసెను. "ఇండియాలో, పాలకుల వ్యవహరించే భాష ఆంగ్లము. ప్రభుత్వ పదవులలో అగ్రవర్గాల దేశీయులు వ్యవహరిస్తున్నది ఆంగ్లభాష. తూర్పుసముద్రతీరములందంతటా ఆంగ్లము వ్యవహారభాష కాబోతున్నది." అని కూడా అతడు, తన అభిప్రాయాన్ని సమర్థించినాడు.

పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ కమిటీ సభ్యుడునూ, మెకాలే బావమరదీ ఐన, సర్ ఛార్లెస్ ట్రెవిల్యన్, ఆంగ్లభాషను సమర్థిస్తూ, మరి రెండు కారణాలను వివరించెను. భారతీయ భాషలను సంపన్నములుగా చేసి, వాటికి ఐక్యతను సమకూర్చి, తద్వారా భారతదేశానికి సాంస్కృతిక ఐక్యాన్ని త్వరలో, సంపాదించడానికి ఆంగ్లవిద్య సహకరిస్తుందని, అతని అభిప్రాయము.

"భారతజాతి భాషలూ, భారతజాతీయ స్వభావమూ కూడా, ఆంగ్లభాషావిజ్ఞానములనెడి ఒకే మూలము నుండీ సమృద్ధిగా సంపన్నములై, ఒకే అచ్చులో క్రొత్త రూపంపొంది, సమానమైన విజ్ఞానశాస్త్రంతో, సమానమైన

ప్రమాణంగల అభిరుచితో సమానమైన పరిభాషతో, బలపడి, ఒక సముచ్చయ రూపంగా సిద్ధిస్తాయి. సమాజ లోని ఒక భాగమునకు ప్రాప్తించిన సాహిత్యక, శాస్త్ర సంబంధమైన జ్ఞానము, ఇతర భాగాలకు కూడను, లభ్యమై, దేశవిజ్ఞాన సంభారానికి పోషకమౌతుంది. ఇదివరలో, భిన్న భిన్న వర్గాలుగా ముక్కలై, ఒకేవర్గంలోని వారైనా, కులమత బేధాలకారణంగా, అస్తవ్యస్తమై యుండిన ప్రజానీకానికి మారుగా, ఐక్యమూ, విజ్ఞానమూ గల అఖండమైన భారతజాతిని చూడగలుగుతాము. పూర్వపు, దేశసాంప్రదాయమంతా, అభ్యుదయాన్ని నిరోధించడానికి ఏర్పడినదే కాని, మానవబుద్ధి వికాసానికి ఏర్పడినదికాదు. కనుక, ఈ ప్రాచీన విద్యావిధానము. ప్రజానీకాన్ని అణచి పెట్టింది."

ఆంగ్లవిద్య కారణంగా, భారతీయులు బ్రిటీషుపరిపాలనకు హెచ్చుశక్తితో సహాయపడతారని అతడు ఆశించెను. "ఆంగ్లేయులు అవలంబించిన విధానంలోనే, భారతీయులు కూడా విద్యావంతులై, సమానములైన విషయములలో ఆసక్తి వహించి, మనతో సమానంగా ఒకే ఉద్యమాల్లో ప్రవృత్తులై, జన్మనుబట్టి హిందువులైనా, ఎక్కువభాగం ఆంగ్లేయులుగా పరివర్తనం పొందుతారు. రోము ప్రాంతంలో నిలిచిపోయిన 'గాలు' జాతివారూ, ఇటాలియన్లూ, రోమనులై పోయినట్లే, భారతీయుల కూడా, ఆంగ్లేయులుగా పరివర్తనం పొందగలరు".

అనంతరము, జరిగిన విషయాలనుబట్టి చూడగా, ఇతడు భావిదృష్టితో చెప్పిన మొదటిఅంశము, చాలవరకూ సత్యమయింది. రెండవ విషయంలో,- అతడు ఆశించినదానికి వ్యతిరేకమైన పరిణామం కలిగింది. సమగ్రదృష్టితో పరిశీలిస్తే మెకాలే, ప్రెనిలియనులు, సూచించిన భవిష్యత్తు వాస్తవమైనదని నిరూపితమయింది. కాని, వర్ణంలోతప్ప, తక్కిన అన్ని విషయాల్లోనూ, భారతీయుడు ఆంగ్లేయుడుగా మారినాడనడం, సత్యదూరము. ఆంగ్లవిద్య కారణంగా, విద్యావంతుడైన భారతీయుని భక్తివిశ్వాసాలు, బ్రిటీషుపరిపాలనపై దృఢపడినవని; అనడంకూడా సత్యవిరుద్ధమైనది. నిజానికి, తద్వ్యతిరేకమైన పరిణామము కలిగింది.

సంస్కృతభాషనూ, అరబ్బీభాషనూ సమర్థిస్తుండిన ప్రాచీన సంప్రదాయస్థులు, స్వార్థప్రయోజనానికై, ప్రయత్నించిన వారైరి. సారస్వతమూ, వేదాంతాది తత్త్వవిజ్ఞానమూ ఈ భాషలలో ఎంత ఎక్కువగా ఉన్నా, అందులోని పవిత్రవస్తువును బట్టి ఎంత గౌరవింపబడినా, అవి- వ్యవహారంలో లోపించినవి. దేశంలో ఎచ్చటా అవి, దైనికవ్యవహారంలో లేవు. ఆ భాషాజ్ఞానము, అల్పసంఖ్యాకులకు మాత్రమే పరిమితమై యున్నది. వాటిలో, పాండిత్యం సంపాదించడం, అతిదీర్ఘకాల ప్రయాసలతో కూడినది. ఆ విధంగా, కాలాన్నీ, శ్రమనూ, వ్యయపరచడానికి పాలకులుకానీ పాలితప్రజలుకానీ, సిద్ధంగాలేరు.

***దేశీయభాషలకు కలగిన నిరాదరణ :*** పాశ్చాత్య విజ్ఞానాన్ని దేశీయ వ్యవహారభాషలద్వారా, బోధించవలెనని పలు వర్గాలవారు వాదిస్తూ, వచ్చిరి. విల్సన్, షేక్స్పియర్, వంటి సాధారణసమితి సభ్యులు దీనికి సుముఖులై యుండిరి. మాల్కాం, మన్రో, ఎలిఫిన్స్టన్, అనువారుకూడా దీనిని సమర్థించిరి.

పలుకుబడిగల కొందరు భారతీయులు, కలకత్తాలో స్థాపించిన దేశభాషా శిక్షణ శాలవారు, ఇంగ్లీషుభాషను బెంటింకు నిర్ణయించిన తర్వాతకూడా, దేశభాషల విషయమై ఒత్తిడిచేస్తూ వచ్చిరి. ఉన్నత పాఠశాలా పాఠ్యప్రణాళికలోని విషయాలను, దేశభాషల్లో బోధించడం సాధ్యమనీ, దానివల్ల దేశభాషల్లో సారస్వతం కూడా వృద్ధిపొందుతుందనీ, వీరు వాదిస్తూవచ్చిరి. ఉన్నత పాఠశాలలలో, చాల వరకు, దేశభాషలద్వారా విద్యాభ్యాసం జరిగిస్తున్న బొంబాయి రాజధానిని, వీరు నిదర్శనంగా పేర్కొన్నారు.

దేశభాషలద్వారా బోధించడంవల్ల ఆర్థిక సౌలభ్యం, ఏర్పడుతుందన్న విషయమూ, ఉపాధ్యాయులను నియోగించడంలో సౌకర్యమున్నదనే విషయమూ,- ఆక్లండు, అంగీకరించినా, వారి సలహాను అంగీకరించలేదు. "దేశ భాషలో వ్యాసరచనను నేర్చుకోడానికై కాదు, మా పాఠశాలలకు విద్యార్థులు రావడం" అని వారి వాదనను త్రోసిపుచ్చినాడు.

బోధన భాషావిషయమై బొంబాయిలో, రెండు పక్షాలవారికీ, వాద ప్రతివాదాలు జరిగినవి. ఉన్నత న్యాయాధిపతియైన సర్ ఎర్‌స్కిన్ (Sir Erskin), విద్యాసమితి అధ్యక్షుడు, ఆంగ్లభాషాభిమానియొకడు,- వీరందరూ ఒక పక్షంగానూ,- కల్నల్ జెర్విస్, జగన్నాధ శంకర్ శేట్, బోర్డులోవి, దేశ సభ్యులు,- వీరందరూ ఒకపక్షంగానూ, చేరి, 1847 లో, ఈ విషయమై వాగ్యుద్ధం గావించిరి. జగన్నాధశంకర్ శేట్, బోర్డువారికి పంపిన సిఫారసులో, విజ్ఞానాన్ని వ్యాపింపజేసి, దేశీయుల మనస్సులను వికసింపజేయడం, మన ఆశయమైతే, ఆ ప్రయత్నము వారి మాతృభాషలలోనే జరుగవలెనని, నా అభిప్రాయము. విద్యాభ్యాసంవల్ల సిద్ధించే ప్రయోజనాలను, భారతస్త్రీలకు కలిగించడానికి వేరే మార్గమేమున్నది? ఇంగ్లీషును చదవడం నిరుత్సాహపరచడం ఏమాత్రమూ, నా అభిప్రాయం కాదు. కాని, అది ప్రజానీకానికి అందుబాటులో లేదని, నా సంశయము,"- అని వాదించినాడు. ప్రయోజనకరమైన జ్ఞానాన్ని తెలియపరచడంలో, దేశభాషలకు ఎక్కువ సౌకర్యములున్నవనికూడా వివరించినారు. ఈ సమస్యను ప్రభుత్వము విచారించి, కళాశాలదశలో, బోధనభాష పూర్తిగా ఆంగ్లమై ఉండవలెననీ, ఉన్నతపాఠశాలదశలో మాత్రము, దేశభాషలు ఉపయోగించవచ్చుననీ,- నిర్ణయించి, ఆ విధంగా ఆజ్ఞలను పంపింది. 1833 తర్వాత, బొంబాయి మదరాసు, రాజధానులపై గవర్నర్ జెనరల్‌కు, పర్యవేక్షణాధికారాన్ని, ఆ ప్రాంతాలపై ఆధిపత్యాన్ని అధికం, గావించిరి. ఈ అధికారాలను పురస్కరించుకొని గవర్నర్ జెనరల్, బొంబాయి విద్యావిధానాన్ని కూడా బెంగాలు విధానానికి, అనుగుణంగా మార్చినాడు.

వ్యవహార భాషల వ్యవహారం ఈ విధంగా వెనుకబడి, ఉన్నత విద్యాశాఖలో, ఆంగ్లమే బోధన భాషగా స్థిరపడింది. వేర్వేరు మాతృభాషలలో వ్యవహరిస్తూ ఉండిన విద్యావంతులైన భారతీయులకు, ఆంగ్లమిప్పుడు సమానభాషగా ఏర్పడడంవల్ల, అందరికీ సమానంగా, ఏర్పడిన ప్రయోజనాల్లో, దానిని ఉపయో

గించడానికి, దేశంలోని వివిధభాగాలతో, ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడానికీ, సౌకర్యం కలిగింది. మరిన్నీ, జీవిత సమస్యలపై, సమానమైన దృక్పథాన్నీ, సదృశములైన మనోభావాలనూ కూడా ఆంగ్లవిద్యాభ్యాసం కలిగించింది. ఈ విధంగా, భారతీయులలో ఐక్యభావాన్ని అభివృద్ధి పరచడానికి, భారత జాతీయ చైతన్యాన్ని బలపరచడానికీ, ఆంగ్లభాష తోడ్పడింది. ఆంగ్లభాషను బోధిస్తూ తక్కిన పాఠ్యవిషయాలను మాతృభాషలలో బోధించియుంటే ఎక్కువ పరిపాకమే ఏర్పడియుండదా? అనే ప్రశ్న వివాదాత్మకమైనది. అట్టి ప్రశ్నను గురించి ఆనాడు ఎవ్వరూ తీవ్రంగా ఆలోచించియుండలేదు. భాషాసమస్య, చాల సరళంగా, ప్రయోజనాత్మక దృష్టితో మాత్రమే, పరిశీలింపబడింది. రాజ్యపరిపాలన వ్యవస్థ యొక్క ప్రయోజనార్థము ఆంగ్లభాషా పరిజ్ఞానం కల వ్యక్తులు, కావలసివచ్చిరి.

ఉన్నత విద్యను మాత్రం పోషించి, జనానీకం సర్వానికీ అవసరమైన విద్యావిషయాన్ని, ప్రభుత్వము నిరాదరించడానికి, ప్రభుత్వ పరిపాలన వ్యవస్థ యొక్క సౌకర్యమే కారణమయింది. ప్రాథమిక దశలో, హిందూ-ముస్లిము న్యాయశాస్త్రాల్లో, పరిచయం ఉన్న విద్వాంసుల ఆవశ్యకాన్ని కంపెనీవారు గుర్తించియుండిరని ఇదివరలో, వివరింపబడింది. కనుక, విద్యావిధానంలో, ప్రాచీన సంప్రదాయస్థుల అభిప్రాయం ప్రాధాన్యం వహించింది. ఆ తరువాత పరిపాలన విధానంలో మార్పు జరిగింది. న్యాయశాఖలోనూ, ఆదాయశాఖలోనూ, పోలీసుశాఖలోనూ క్రొత్తగా కల్పింపబడిన క్రింది ఉద్యోగాలకు తగిన వ్యక్తులు అవసరమైరి. అట్టి వారిని సమకూర్చుకోవడం ఇప్పుడు కంపెనీ వారి ఉద్దేశమయింది. ఇదికాక, సంప్రదాయంగా, తమకు సిద్ధమైయున్న ఉద్యోగాలనూ వృత్తులనూ, పోగొట్టుకొన్న ఉన్నత తరగతుల వారిని కొంత తృప్తిపరచి, వారికి ఉన్నత విద్యద్వారా ఉద్యోగాలను కల్పించి, సమాధాన పరచడం, కంపెనీవారు పాటించిన రాజనీతిలో ఒకభాగం. విద్యావంతులైన అగ్రవర్గాల వారి నుండీ, వ్యాపక ప్రభావయుతములైన విద్యాసంస్కృతులు, జనానీకానికి ప్రసరించునని వీరిఆశ.

ఇట్టి సిద్ధాంతాల ప్రభావానికిలోనైయున్న కంపెనీ ప్రభుత్వము, ధనాభావమనే మిషతో, మన్రో, ఎలిఫిన్‌స్టనులు గావించిన సార్వజనిక విద్యాప్రణాళికలను త్రోసివేసెను. ఎలిఫిన్‌స్టన్, తన (1823) సిఫార్సులో, విద్యావ్యాప్తికిగల అవసరాన్ని గురించి, "పాఠశాలల సంఖ్యను అభివృద్ధి చేయడంవల్ల ఏర్పడిన సదవకాశాలను ఉపయోగించుకొని, సామాన్యజనానీకం కూడా బాగుపడడానికై ప్రోత్సాహం కొంతైనా ఇవ్వడం ప్రభుత్వపు బాధ్యత."- అని వ్రాసియున్నాడు. ఈ విషయమై, మన్రో, కూడా, "ప్రజలను విద్యావంతులుగా చేయడానికి మనం నిశ్చయిస్తే, ఈ విషయమైన ప్రయత్నం సాగించే ఉద్దేశమేఉంటే, పాఠశాలలను, తెహసీల్దారీలకు మాత్రమే, పరిమితం చేయకూడదు. చిన్న జిల్లాలలో కూడా, వాటిసంఖ్యను పెంచితే, మన ఉద్యమప్రయత్నాలు తప్పక సఫలం కాగలవని నాకు దృఢవిశ్వాస మున్నది." అని వ్రాసియున్నాడు.

ప్రజానీకానికి సాధారణ విద్యాదానం చేసే ప్రయత్నానికి, ప్రభుత్వము స్వయంగా పూనుకోకపోవడం, నిజంగా దురదృష్టము. ఈ విధానం అభ్యుదయ కాలాన్ని వెనుకకు మరలించింది. ఈ ప్రభుత్వ నిర్ణయంవల్ల, దేశీయ విద్యావిధానానికి కూడా దెబ్బతగిలింది. "పందొమ్మిదో శతాబ్దపు ప్రాథమికదశల్లో, అధిక సంఖ్యాకంగా పాఠశాలలూ, మక్తబులూ, బెంగాలులో ఉండినవని, నేను సంచయం గావించిన వాస్తవిక విషయాలనుబట్టి తెలుస్తుంది. చాలవరకు, ప్రతిపల్లెలో కూడా, ప్రాథమికములైన చదువు, వ్రాత, లెక్క,- అనే మూడంశాలను నేర్పే పాఠశాలల సౌకర్యం ఉండినది"ని, ఆడం (Adam) తన నివేదికలో వివరించినాడు. 1815 లో, గవర్నర్ జెనరల్ హేస్టింగ్సు,- "పూర్వపు దేశీయ ప్రభుత్వాలు, ప్రధానాశయమైన విద్యావ్యాప్తి విషయంలో శ్రద్ధవహించి యుండిరనడానికి, వారు మాన్యాలుగా ఇచ్చియుండిన ముక్తశుల్క (Rent free) భూములూ, సార్వజనిక శిక్షణశాలల పోషణార్థమై వారు గావించిన ద్రవ్యదానాలూ, ప్రత్యేక వర్గాలకు చెందిన విద్యార్థులకు చేసిన సాహాయ్యమూ, సాక్ష్యాలుగా ఉన్నవి. కాని, బ్రిటీషు ప్రభుత్వంయొక్క ఉద్యమకారణంగా స్థాపితములైన విద్యాసంస్థలను జాగ్రతతో గమనించక పోవడమూ, వాటికి నియమితమై ఉండిన ద్రవ్యముపై పర్యవేక్షణ లేకపోవడమూ, కారణంగా, ఆ సంస్థలకు ఇచ్చిన ద్రవ్యము, కొందరు దేశీయుల స్వంత ద్రవ్యమై పోయింది. ప్రభుత్వం ఆశించిన విద్యాకార్యక్రమం ఆగిపోయింది" అని వ్రాసినాడు.

కేవలం మాతృభాషల మూలంగా జరుగవలసిన సార్వజన విద్యావ్యాప్తికి, ప్రభుత్వం పూనుకోక పోవడంవల్ల, ఈ దేశభాషల అభివృద్ధికి అవసరమైన ప్రోత్సాహ, ప్రోద్బలాలు లేకపోయినవి. అందులోనూ, ఉన్నత పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ, విద్యాబోధనకు అర్హమైన భాష ఆంగ్లమే అని, బెంటింకు నిర్ణయించడమూ, దానిని మెట్‌కాఫ్, ఆక్‌లండ్‌లు స్థిరపరచడమూ, జరగడంతో, దేశభాషలను గమనించే అవకాశం లేకపోయింది. ప్రాథమిక విద్యాభివృద్ధికై హార్డింజ్ గావించిన ప్రయత్నాలు సఫలం కాలేదు.

***ఆంగ్ల విద్యాభ్యుదయము :*** ప్రభుత్వము అవలంబించిన విధానాల కనుగుణంగా ఆంగ్లవిద్యాభివృద్ధి, 1835 అనంతరము, సక్రమంగానూ, వేగంగానూ జరిగింది. 1835–1838 మధ్యకాలంలో, విద్యాసమితి పర్యవేక్షణలో నున్న విద్యాలయాల సంఖ్య శీఘ్రంగా వృద్ధిచెందింది. వాటిలోని విద్యార్థుల సంఖ్య రెండు రెట్లు పెరిగింది.

సర్ చార్లెస్ ట్రెవిల్యన్, "దేశం, ఆంగ్లవిద్యార్జనకు అభిముఖమై, వేగంగా నడుస్తూ ఉంది. క్రొత్త పాఠశాలలను నెలకొల్పవలెనని అర్థిస్తున్న విన్నపపత్రాల సంఖ్యకు అంతులేదు. అప్పటికే స్థాపితములై యున్న విద్యాలయాలలో ప్రవేశమును కోరుతూ వచ్చిన దరఖాస్తులు కూడా అసంఖ్యాకములు. కాని, వీరందరికీ ఆ విద్యాలయాల్లో స్థలంచాలదు." అని వ్రాసియున్నాడు. "సమాచార దర్పణం" అనే పత్రిక ప్రచురించినదాన్ని అనుసరించి,-

తమ మాతృభాషలో వ్యవహరించినంత సులువుగా, సుకరంగా, ఆంగ్లభాషలో వ్యవహరించగల, భారతీయులు రెండు వందలమంది కలకత్తాలో ఉన్నారు. ఆంగ్లభాష ప్రజామోదాన్ని పొందిందని, జె సదర్ లాండ్, సర్ జాన్ షోర్, హోల్ట్ మెకంజీ మున్నగువారు ప్రమాణీకరించిరి. మూడు రాజధానుల్లోనూ కూడా, ప్రజలు ఆంగ్లభాషకు ఆసక్తులై యున్నారని, 'మిషనరీ రెజిస్టర్' అనే పత్రిక ప్రకటించింది. ఆంగ్లభాషను సివిల్ సర్వీసు ఉద్యోగులకు నిర్బంధంగా చేయవలెనని కోరుతూ, నాలుగు వేలమంది భారతీయులు, పార్లమెంటుకు మహజరు సంపిరి. ఆంగ్లభాషలో సమగ్ర జ్ఞానం ప్రభుత్వ ఉద్యోగాలకు అవసరమైన యోగ్యతలలో ఒకటి, అని పార్లమెంటు సెలెక్టుకమిటీ వారు 1832 లో సలహా ఇచ్చిరి.

మతము, జనసము, వర్గము, ఇత్యాదులతో ప్రసక్తి ఏ మాత్రమూ లేక, భారతదేశీయులెల్లరూ, ప్రభుత్వోద్యోగము లన్నిటికీ సమానంగా అర్హులే, అని స్పష్టంచేసిన ప్రకరణము, 1833 శాసపత్రంలో ఉన్నది. కంపెనీ దివాలా తీయకుండా నిలువవలెనంటే, భారతీయులను అధిక సంఖ్యలో ప్రభుత్వోద్యోగాలలో ప్రవేశపెట్టడం తప్పనిసరి, అనే విషయాన్ని బెంటింకు గ్రహించినాడు. పాలితప్రజల స్వభావాలతోనూ, ఆచార వ్యవహారాలతోనూ, బాగుగా పరిచయమున్న భారతీయులతో, పరిపాలన వ్యవస్థను నిర్వహించే ఉద్దేశంతో, 500 రూపాయల వేతనమున్న డిప్యూటీ కలెక్టరు పదవులను కొన్నింటిని, విద్యావంతులైన భారతీయులకు ప్రత్యేకించినాడు. న్యాయ పరిపాలనకూ, ఆదాయ శాఖకూ సంబంధించిన వ్యవహారాలను దేశభాషలలోనే జరుపవలెననీ, పర్షియను భాషలో జరుపరాదనీ, ఆక్లండ్ ప్రభువూ అతని సహాయసభా, నిశ్చయించిరి. అంతతో, 1837. XXIX శాసన ప్రకారం, పర్షియను భాషను ఉపయోగించడం రద్దయింది. ఆంగ్లభాషా పరిజ్ఞానము ప్రభుత్వపు ఉద్యోగాలకు తప్పక అవసరమైన యోగ్యత, అని ప్రకటింపబడింది. అట్టి అర్హతగల విద్యార్థుల జాబితాలను సిద్ధం చేసి, ప్రభుత్వకార్యాలయాల ఉన్నతాధికారులకు పంపవలెననీ, వారందులో తగినవారినెన్నుకొని కాళీ ఉద్యోగాలను భర్తీచేయుదురనీ, ఆదేశిస్తూ ఒక ఆజ్ఞాపత్రం విడుదల అయింది. ఆంగ్లవిద్యాభాష ఉద్యమానికి ఈ విధానం ప్రోద్బలమిచ్చింది.

మధ్య తరగతుల వారి విద్యావిషయంలో మాత్రమే, ప్రభుత్వము బాధ్యత వహించడం కారణంగా, బెంగాలులోనూ, దేశంలోని ఇతర ప్రాంతాల్లోనూ కూడా, మధ్యతరగతులవారు, విద్యావిషయంలో ఎక్కువ అభ్యుదయాన్ని సాధించుకొన్నారు.

*బొంబాయిలో విద్యావిధానము :* బొంబాయిలో అవలంబింపబడిన ఆంగ్ల విద్యావిధానము, బెంగాలు విధానానికి భిన్నమైనది. బొంబాయి రాజధానిలో చేరియున్న ప్రాంతము, మరాఠాయుద్ధానికి (1818) తర్వాతనే బ్రిటీషువారి అధీనంలోకి వచ్చింది. తత్పూర్వము, యూరేషియన్ పిల్లలకూ, క్రిష్టియన్

పిల్లలకూ విద్యగరపే ఉద్దేశంతో పాఠశాలలు నెలకొల్పబడి యుండినవి. కాని, మహారాష్ట్రదేశాన్ని ఆక్రమించడంతో, విద్యాసమస్యను బ్రిటీషుప్రభుత్వము సాధించవలసి వచ్చింది. ప్రజల ఆర్థికస్థితినీ, నైతికస్థితినీ, బాగుపరచడానికి, విద్యావ్యాప్తి అత్యంతమూ, అవసరమని, ఎలిఫిన్‌స్టన్ (Mount Stuart Elphinston) గుర్తించినాడు. ఆ విషయమై అతడు ఆ దేశమూలకంగా పరిశీలన జరిపించెను. ఆ పరిశీలననుబట్టి విద్యాపరిస్థితి దేశంలో శోచనీయమై ఉన్నదని తేలింది. విద్యాకార్యక్రమాన్ని ఆరంభించడమెట్లు, ఏ మార్గాన్ని అనుసరించి పాశ్చాత్య విజ్ఞానాన్ని ప్రజలలో వ్యాపింప జేయగలము, అనే ప్రశ్నలతని నెదుర్కొన్నవి.

1. ఆంగ్లభాషా మూలంగా విద్యాభ్యాసం జరుగవలెనన్న వాంఛ బొంబాయి నగరానికి మాత్రమే పరిమితమై యున్నందువల్ల, ఇతర ప్రదేశాలలో, దేశభాషల్లోనే పాశ్చాత్యవిద్యను బోధింపవలెననీ, 2. ఆంగ్లవిద్యకంటెను ప్రాథమిక విద్య ఎక్కువ ప్రయోజనకారి కావడంవల్ల, ప్రాథమిక విద్యావ్యాప్తికి తగిన సక్రమ ప్రణాళికను ఏర్పరచవలెననీ, 3. ఉన్నత ప్రాచీన సంప్రదాయవిద్యకు తగినంత ద్రవ్యం ప్రత్యేకించవలెననీ,- అతడభిప్రాయపడి యుండెను.

పీష్వాదర్బారు పడిపోవడంతో, ఆదరప్రాపకాలను గోల్పోయిన అగ్రవర్గాలవారి భావోపశాంతికై, పూనాలో సంస్కృత కళాశాలను స్థాపించడం (1821) ఇతడు గావించిన ప్రథమ ప్రయత్నము. బొంబాయి దేశీయ విద్యాలయాన్నీ, గ్రంథ సంఘాన్నీ నెలకొల్పి, విద్యాభివృద్ధికి తగిన ఏర్పాటు గావించడం (1822), ఇతని రెండవ ప్రయత్నము. 1827 లో, ఆ విద్యాసంస్థకు "బొంబాయి దేశీయ విద్యాసంస్థ" అనే వ్యవహారం సిద్ధించింది.

ఆధునిక దేశభాషలలో పాఠ్యగ్రంథాలను సిద్ధపరచడం, ఉపాధ్యాయులకు తగిన శిక్షణను ఇవ్వడము, ఆంగ్ల విద్యాభ్యాసానికి పాఠశాలలను నెలకొల్పడము,-అనే ఉద్యమాలను ఈ సంస్థ సమర్థతతో నిర్వహించి కీర్తి నార్జించుకొంది. ఈ సంస్థయొక్క కార్యక్రమ ఫలితంగా బొంబాయి, థానా, పన్‌వాల్, పూనా నగరాలలో నాలుగు జిల్లాఆంగ్ల విద్యాశాలలు, పాశ్చాత్య ప్రధానోపాధ్యాయుల పర్యవేక్షణలో స్థాపింపబడినవి. జిల్లాలోని వివిధ ప్రదేశాలలో 115 ప్రాథమిక పాఠశాలలు ఏర్పడినవి. ఆంగ్లదేశ భారతదేశ చరిత్రలు, భూగోళశాస్త్రము, సంఖ్యాగణితము, బీజగణితము, రేఖాగణితము, త్రికోణమితి (Trignometry), జ్యోతిష్కము, ప్రకృతిశాస్త్రము మొదలైన విషయాలన్నీ విద్యార్థుల మాతృభాషలద్వారా, ఆ పాఠశాలలో బోధింపబడుతూ ఉండినవి.

దేశీయ విద్యాసంస్థకు తోడుగా, ప్రభుత్వం కూడా, రెండు కళాశాలలను నిర్వహిస్తూఉండినది. పూనాలో, ఇదివరకే స్థాపింపబడిన సంస్కృత కళాశాలలకు నూతన స్వరూపమిచ్చి, (1837) అన్ని వర్ణాల వారికి దానిలో ప్రవేశం లభించే అవకాశాన్ని కలిగించిరి. రెండవది, బొంబాయిలో స్థాపింపబడిన ఎలిఫిన్‌స్టన్ విద్యాలయం (Elphinston Institute). బొంబాయి ప్రజలు విరాళాలద్వారా సంచయమొనర్చిన ధనముతోనూ, కంపెనీవారిచ్చిన ధనంతోనూ, 1834లో నిర్మిత

మయింది. ప్రభుత్వ వ్యవస్థలోని సివిల్ సర్వీస్ ఉద్యోగాలకు తగిన శిక్షణను ఇవ్వడం, ఈ కళాశాల తన ఉద్దేశంగా చేసుకొన్నది. జిల్లా ఆంగ్ల విద్యాలయాలు ఉత్తమ విద్యార్థులను ఈ కళాశాలకు పంపుచుండినవి.

సమస్తములైన విద్యాసంస్థలనూ నిర్వహించడానికై ఏడుగురు సభ్యులతో ఒక 'విద్యాసమితి'ని (Board of Education) ఏర్పరచి (1840) 'దేశీయవిద్యా సంస్థ'ను మూసివేసిరి. ఈ సమితి సభ్యులలో భారతీయులు ముగ్గురు. సమితి అధ్యక్షుడైన సర్ ఎర్స్కిన్ పెర్రీ (బొంబాయి ఉన్నత న్యాయస్థాన ప్రధాన న్యాయాధిపతి) ఆంగ్ల విద్యా సమస్యను పునర్విచారణకు తెచ్చినాడు. పాఠశాలా ప్రణాళికలో దేశభాషల అధ్యయనమూ, ఆంగ్లభాషాధ్యయనమూ కూడా కలిసి జరుగవలెననీ, ఉన్నత విద్యా విషయంలో మాత్రం ఆంగ్లమే బోధన భాషగా ఉండవలెననీ,-సమితి తన విద్యా విధానాన్ని తీర్మానించుకొన్నది. ప్రతి జిల్లా పట్టణంలోనూ, అవసరమని నిశ్చయమైన ఇతర ప్రదేశాల్లోనూ, మంచి ఆంగ్ల విద్యాలయాలను, సమితి ధనంతో నెలకొల్పడానికి నిశ్చయింపబడింది. పెర్రీ ఆమోదించిన విధానాన్ని అనుసరించి, బెంగాలు గావిస్తున్న ఒత్తిడినిబట్టి, దేశ భాషల ఉపయోగ విషయంలో, సమితి, తన విధానాన్ని మార్చుకొన్నది. ఉన్నత వ్యాప్తికి ఆంగ్లభాషను మాత్రమే వాడవలెననే బెంగాలు విధానానికి అనుగుణంగా బొంబాయి విధానంకూడా మారింది. ఈ విషయంలో మాత్రము దేశభాషల ఉపయోగం పోయింది. ఐనప్పటికీ, మాతృభాషల్లో విద్య గరపుతున్న పాఠశాలలను పెక్కింటిని, బొంబాయి విద్యాసమితి నిర్వహిస్తూనే వచ్చింది. [1853లో 216 పాఠశాలలు] అనేకవేల విద్యార్థులీ పాఠశాలలో మాతృభాషద్వారా విద్యాభ్యాసం గావించేవారు:-

[1853లో 12000 మంది విద్యార్థులు.]

మిషనరీల ఉద్యమంకూడా, బొంబాయిలో ఆంగ్ల విద్యావ్యాప్తికి తోడ్పడింది. పూనా, అహమ్మద్‌నగర్, సూరత్, రాజ్‌కోట్ వంటి పట్టణాలనేకములలో, మిషన్ సంస్థలు ఆంగ్లబోధనకు పాఠశాలలను నెలకొల్పినవి. బొంబాయిలోని విల్సన్ కళాశాలకూడా వారు నెలకొల్పినదే. 1852లో, అందులో నాల్గు వందలమంది విద్యార్థులు చదువుచుండినారు ప్రాథమికదశలో ఆంగ్లవిద్యకు పూనుకొన్న వారిలో పార్సీవర్గము ప్రముఖమైనది. పార్లమెంటు సెలెక్ట్ కమిటీ సమక్షంలో, సాక్ష్యమిచ్చిన వారీ విషయాన్ని వ్యక్తంగావించిరి. "చాల వరకూ పార్సీలందరూ, ఆంగ్లభాషలోనే వ్యవహరిస్తారు. వారి పిల్లలందరూ ఆంగ్లంలోనే విద్యాభ్యాసం గావిస్తున్నారు; యూరోపియనులతో సమానమైన సౌకర్యంతో వారు ఆంగ్లంలో మాట్లాడగలుగుతున్నారు." అని వారిచ్చిన సాక్ష్యము.

*మదరాసు రాజధానిలో విద్యావిధానము :* మదరాసు రాజధానిలో పాశ్చాత్య విద్యావిషయకంగా, ఉద్యమంసాగించిన మూడు సంస్థలలోనూ అగ్ర స్థానం మిషనరీ సంఘం వహించింది. ప్రభుత్వమూ, భారతీయ పౌరవర్గమూ,

ఇతరసంస్థలూ, ప్రొటెస్టంటు మిషనులూ, క్రిశ్చియను విజ్ఞానప్రచార సంఘమూ, మదరాసు, కడలూరు, తంజావూరు, తిరుచినాపల్లి, ప్రాంతాలలోని అనేక ప్రదేశాలలో, పాఠశాలలను నెలకొల్పి, దేశీయులకు చదువు నేర్పుచుండిరి. ఈస్ట్ ఇండియా కంపెనీవారి పాఠశాలలకు ప్రతి సంవత్సరమూ, విరాళములిస్తూ ఉండిరి.

పందొమ్మిదో శతాబ్ద ప్రథమభాగంలో, ఆంగ్లభాషను బోధించే పాఠశాలలను రాజధానిఅంతటా స్థాపించడానికి బూనుకొనిరి. దేశభాషలతోపాటు ఆంగ్ల భాషనుకూడా బోధించే "ఆంగ్ల - దేశీయ" ప్రాథమికపాఠశాలలనుకూడా వీరు స్థాపించిరి. ఈ అన్నిపాఠశాలల్లోనూ, ఆంగ్లభాషను బోధించడం నిర్బంధమై యుండినది. 1838 నా టికి, ట్రెవెల్యాయన్ "ఈదేశానికి ఇప్పుడు ఆంగ్లభాష వినూత్నమైన వింతభాష కాదు అనేకులకు దీనిపై ఆసక్తి ఏర్పడింది. వేలకొలది ప్రజలు ఈ భాషను నేర్చియున్నారు" అని వ్రాసియున్నాడు "మిషనరీ కార్యక్రమాలకు విస్తారమైన అవకాశం కలిగింది. తత్కారణంగా, మూడు ప్రభుత్వ కళాశాలలూ, దేశీయుల సంస్థలు కొన్ని, తప్ప, తక్కిన, విద్యావిషయక కార్యక్రమమంతా మిషను సంఘాల హస్తగతమయింది."

ఈ పాఠశాలలను మాత్రమేకాక, ఉన్నతపాఠశాలలకూ కళాశాలలకూ మధ్యస్థములైన విద్యాశాలలనుకూడా, వీరు, నెలకొల్పి, వాటిలో విద్యార్థులకు, ఆంగ్లసారస్వతమూ, పాశ్చాత్యవిజ్ఞానశాస్త్రాలూ బోధించేవారు. ఈ విద్యాశాలల పాఠ్యప్రణాళికలో క్రీస్తుమతధర్మాలకూ, మతగ్రంథాలకూ విశిష్ట ప్రాధాన్యం కలిగించిరి. క్రీస్తుమతోపదేశకులనూ, ఉపాధ్యాయులనూ, మత ప్రచారకులనూ, పెంచి పోషించే స్థానములుగా ఈ విద్యాశాలలు వ్యవహరించినవి. ఉన్నత విద్యావిషయంలో వారు గావించిన సేవకు నిదర్శనము, ఆండర్సన్, మదరాసులో స్థాపించిన కళాశాల (General Assembly Institution). ఈ విద్యాలయమే, తరువాతి కాలంలో 'క్రిశ్చియన్ కళాశాల' అని వ్యవహరింపబడుతూ వచ్చింది. స్కాటిష్ చర్చివారూ, లండన్ మిషన్ సంఘంవారూ, ఇతర విద్యాలయాలను స్థాపించిరి.

విద్యావిషయక కార్యక్రమంలో వెనుకబడియున్న ప్రభుత్వము, గవర్నరు సర్ థామస్ మన్రోకాలంలో, ఈ ఉద్యమ నిర్వహణకు బూనుకొన్నది. దేశీయపాఠశాలలు రాజధానిలో అనేకములున్నా, వాటిలోని విద్యాప్రమాణం చాలా తగ్గుదశలో ఉన్నదని అతడు గ్రహించినాడు. ఆదరమూ, ద్రవ్యమూ లేనివై, అవి క్షీణదశలో ఉండినవి. పూర్వపు ప్రభుత్వాలూ, జమీందారులూ, ఏర్పరచియున్న ఆదాయాలతో, బ్రాహ్మణులు వేదపాఠశాలలను నడుపుతూఉండిరి; విద్యావిషయంలో ఏర్పడిన అవకాశాలను, అధికంగా ఉపయోగించుకొనినవారు బ్రాహ్మణులు. హిందువుల జనాభాఅంతటిలోనూ వారి సంఖ్య ఐదవ భాగమే ఐనా, విద్యనభ్యసించే వారిలో, ప్రతినలుగురు విద్యార్థులకూ, ఒక బ్రాహ్మణవిద్యార్థి ఉండేవాడు ప్రతి జిల్లాలోనూ రెండు ఉన్నత

పాఠశాలలనూ, ప్రతి తాలూకాలోనూ, ఒక మధ్యమ పాఠశాలనూ, నెలకొల్ప డానికి నిశ్చయించి, ఆ కార్యక్రమనిర్వహణకై, ప్రభుత్వం విద్యాసమితిని ఏర్పరచెను. రాజధానిలోని ప్రతి ఐదువందల పురుషులకూ ఒక్క దేశీయ పాఠశాల మాత్రమే ఉండినదనీ, ప్రాథమిక విద్యావయఃపరిమితిలో నున్న పిల్లలలో మూడవ వంతుమాత్రమే చదువుకొనుచున్నారనీ, అతడు జరిపియుండిన పరిశీలననుబట్టి విశదమయింది. సామాన్య ప్రజానీకానికి మాతృభాషల మూలం గానే విద్యాభ్యాసము జరుగవలసియుందనీ, దేశీయ విద్యాలయాల ఆధారం తోనే విద్యావిధానమూ, ఉన్నత పాఠశాలలూ ఏర్పడవలెననీ, మన్రో అభి ప్రాయము. దురదృష్టంవల్ల అతని ప్రణాళిక సఫలంకాలేదు. 1836 లో, ఈ దేశీయ పాఠశాలలకు మూతపడింది. మన్రో ఏర్పరచిన ప్రభుత్వ విద్యా సమితి స్థానంలో, దేశీయ విద్యాసంఘం ఏర్పడింది. కంపెనీ డైరెక్టర్ల సమర్థనతో, బెంటింకు అవలంబించిన విద్యా విధానాని కనుగుణమైన కార్యక్రమము, నూత నంగా ఆరంభింపబడింది. ఉన్నత స్థాయిలో నడుస్తున్న పరిమితమైన విద్యా లయాల ద్వారా, అగ్రవర్గాలవారిలో విద్యావ్యాప్తి గావించడమే ప్రయోజన కారి, అని, నిశ్చయింపబడినది. మన్రో బూనుకొన్న, సామాన్య ప్రజానీకానికి ఉద్దిష్టమైన విధానము, వర్జిత మయింది. ప్రభుత్వపు ఉద్యోగాలకు యోగ్యతగల వ్యక్తులను ఏరుకొనే నిమిత్తము, పరీక్షలు నిర్వహించడానికై, 1845 లో, ఒక విద్యాసంస్థను ప్రభుత్వం ఏర్పరచింది. ప్రభుత్వాదేశంపై, ఈ సంస్థ, ప్రత్యేకింప బడిన ద్రవ్యంతో, 'మదరాసు విశ్వవిద్యాలయం' అనే ఒక కళాశాలను 1841 లో, స్థాపించింది. జిల్లాలలోనూ, ఇతర ప్రదేశాలలో కూడా స్వంత పాఠశాలలను నెలకొల్పింది.

ఈ సంఘము పూనుకొన్న ప్రణాళికకు ప్రజల ఆమోదం లభించింది. డెబ్బైభవేల సంతకాలతో, ఒక మహజరు, వీరి కార్యక్రమాన్ని ఆమోదిస్తూ, ప్రభుత్వానికి అర్పింపబడింది.కలకత్తా హిందూకళాశాల అనుసరించిన విద్యాప్రణా ళికనే ఈ కళాశాలకూడా అనుసరించి, పాశ్చాత్య విజ్ఞానశాస్త్రాలనూ, తత్త్వ శాస్త్రాలనూ, చరిత్రనూ, బోధింపనారంభించింది. 1854 లో, ఐదువందలమందికి పైగా, విద్యార్థులీ కళాశాలలో శిక్షణపొందుతూ ఉండిరి. ప్రభుత్వోద్యోగాల లోనూ, సాంఘికసేవలోనూ, ఈ కళాశాలనుండి వచ్చినవారనేకులు ప్రఖ్యాతి చెందిరి. రాజధానిలోని నాలుగు ద్రావిడభాషాప్రాంతాలలోనూ,- అనగా, తిరుచినాపల్లి, మచిలీపట్టణం, బళ్లారి, కాలికట్,- నాలుగు అత్యుత్తమ విద్యాల యాలను స్థాపింపబూనిన వీరిప్రయత్నము, కొంతఫలించి, కడలూరులోనూ, రాజమండ్రిలోనూ, రెండు ఆంగ్లవిద్యాలయాలు ఏర్పడినవి.

మూడవవదియైన పౌరుల ఉద్యమం 1842 లో ఆరంభించింది. దాని ఫలితమే మదరాసులో నెలకొల్పిన 'పచ్చయప్పకళాశాల'. సంపన్నుడైన పచ్చ యప్ప అనే హిందూప్రముఖుడు నెలకొల్పియుండిన, దానధర్మసంస్థనుండి లభించే ఆదాయంతో ఈ కళాశాలను నిర్వహించేవారు. కంజీవరంలోనూ, చిదం

బరంలోనూకూడా, ఈ సంస్థ నిర్వాహకులు పాఠశాలను నెలకొల్పి పోషిస్తూ వచ్చిరి.

***ఉత్తరభారతంలో విద్యావిధానము*** : కొత్తగా బ్రిటీషు రాజ్యంలో, సంయోజితములైన ప్రాంతాలలో విద్యావ్యాప్తి మందంగా సాగింది. బెంగాలులో విద్యావ్యాప్తికి ఏర్పడియుండిన సదవకాశాల వంటివి, పశ్చిమోత్తర ప్రాంతాలలోనూ, ఔధ్‌లోనూలేవు. విస్తారంగా వృద్ధి పొందుతున్న విదేశ వాణిజ్యానికి కలకత్తా కేంద్రం కావడంవల్ల, అక్కడ అధిక సంఖ్యాకులైన ఆంగ్లేయ వర్తకులు నివసిస్తూ ఉండిరి. పరిపాలన రంగంలోనూ, వ్యాపారరంగంలోనూ, కూడా, భారతీయులకు అనేకావకాశాలు, కలకత్తాలో ఏర్పడియుండినవి. పాశ్చాత్య విద్యను సాధించడానికి పలువురు ఉత్సుకులై యుండినందువల్ల, దాని నిర్వహణకై సంస్థలనేకములు, ఒక దానితో ఒకటి పోటీపడి, ఆ కార్యాన్ని సాధించినవి.

బెంగాలులో తప్ప, ఇట్టి పరిస్థితులు ఇతర ప్రాంతాలలో లేవు. వాస్తవానికి, ఆంగ్లవిద్యాభ్యాసంపట్ల ప్రజలకు దురభిప్రాయం ఏర్పడియుండినది. క్రిశ్చియన్ మిషనరీల దుష్కార్య కలాపంవల్ల, ఇట్టి అభిప్రాయము ప్రజల మనస్సులలో ఏర్పడినందువల్ల, ఆంగ్లపాఠశాలలు కూడా, మతాంతరీకరణ సంస్థలుగా సంశయింపబడుతూ వచ్చినవి. బీహారులో ఆంగ్లభాష విషయంలో ఉత్సాహమే మాత్రమూ లేని కారణంగా, పాఠశాలలను నెలకొల్పే ప్రయత్నానికి ఏ సహకారమూ లభింపలేదు. బెంగాలు లెఫ్టినెంట్ గవర్నర్ వ్రాసినదాన్ని బట్టి (19-11-1858) పాట్నాలోని పాఠశాలా పర్యవేక్షకాధికారియొక్క కార్యాలయము (Inspector General of School), 'సైతాన్-కా-దఫ్తర్ ఖానా' అని వ్యవహరింపబడుతూ ఉండేది. (దయ్యపు కార్యాలయము,-అని దీని అర్థము.)

పశ్చిమోత్తర ప్రాంతము ఏడు సంవత్సరాలకు పూర్వమే బెంగాలు నుండి వేరుచేయబడి యుండినా, ఆ ప్రాంతంలోని విద్యా వ్యవహారాలు 1843 దాకా, కలకత్తాలోని విద్యాసంస్థ యొక్క పర్యవేక్షణలోనే జరుగుచుండినవి. కాబట్టి, ఆ ప్రాంతంలో ఆంగ్లవిద్యా విషయంలో ఆసక్తి తక్కువగా ఉన్నా, ప్రభుత్వము బెంగాలులో వలెనే తన విద్యావిధానాన్ని అమలు జరిపింది.

బనారసు సంస్కృతకళాశాలలో ఆంగ్లభాషను బోధించే తరగతులనుకూడా ప్రవేశపెట్టిరి. 1824లో ఆగ్రాలోనూ, 1824-25లో ఢిల్లీలోనూ, 1827లో బరైలీలోనూ కళాశాలలను ఇదివరకే స్థాపించియుండిరి. వాటిలో ఆంగ్లభాషను ప్రవేశపెట్టినారు. గోరఖ్‌పూరునుండి, అజమీరు వరకూ పదునాల్గు ఆంగ్లపాఠశాలలను వరుసగా నెలకొల్పినారు.

కాని, 1843లో, పశ్చిమోత్తర ప్రాంతాలకు లెఫ్టినెంటు గవర్నరుగా థామ్‌సన్ (Thomson) రావడంతో, ఈ విధానంలో మార్పు ఏర్పడింది. విద్యార్థులు ఆంగ్లభాషా అధ్యయనంపట్ల నిరుత్సాహులై, ఉదాసీనంగా ఉండడం

అతడు గమనించినాడు. కనుక, వాటిలో, ఎనిమిది పాఠశాలలను మూసివేసి, ఆగ్రా, అజమీర్, సాగరులలో ఆంగ్ల పాఠశాలలను నెలకొల్పడానికి బూను కొన్నాడు. "ఉన్నత వర్గాలవారు కానీ, వివిధ పరిపాలన శాఖలలోని ఉన్నత భారతీయోద్యోగులు కానీ, కొందరైనా, తమ పిల్లలను, ప్రభుత్వ నిర్వహణంలో ఉన్న ఆంగ్ల-దేశభాషా కళాశాలలకు పంపకపోవడమూ, పాశ్చాత్య విద్యపట్ల తమకూ, తమ పిల్లలకూ అభ్యుదయావకాశాలు కలవని, గుర్తించకపోవడమూ, ఆశ్చర్యంగా ఉన్నది." అని అతడు వ్రాసినాడు. క్రింది తరగతులవారి పిల్లలే ఎక్కువగా, ఈ పాఠశాలలనూ, కళాశాలలనూ ప్రవేశిస్తూవచ్చినారు.

దేశీయ విద్యాపద్ధతిని, థామ్సన్ అభిమానించి, దానిని అభివృద్ధిచేయ నిశ్చయించెను. ధనం లేకపోవడమొక్కటే అతని ప్రయత్నానికి ప్రతిబంధక మయింది. జమీందారుల అంగీకారంతోనూ, వారి తోడ్పాటుతోనూ, ఐచ్ఛిక మైన సుంకమును (Levy-ఉద్గ్రహణము) వేసి, దాని ద్వారా వసూలైన మొత్తానికి సమానమైన మొత్తాన్ని ప్రభుత్వకోశంనుంచి ఇచ్చి,-తన ప్రయత్న సాధనకు పూనుకొన్నాడు. ప్రతి తెహసీల్ లోనూ, ఒక ప్రభుత్వ 'గ్రామ పాఠ శాలల'ను నెలకొల్పి, వాటిలో, హిందీ, ఉర్దూ, పద్దులు వ్రాయడం, ప్రాథమిక గణిత సూత్రాలు, చరిత్ర, ప్రాదేశిక భూగోళము, రేఖాగణితము-ఇత్యాదులను మాతృభాషలో నేర్పే ఏర్పాట్లు గావించెను. ఈ పాఠశాలలను తనిఖీచేయ డానికీ, సక్రమమార్గం ప్రదర్శించడానికీ, తగిన విస్తార వివరాలతోకూడిన, విద్యా పర్యవేక్షక వ్యవస్థను ఏర్పాటు గావించినాడు. దీనిని మొదట డల్ హౌసీ, తర్వాత గవర్నర్ జెనరల్, డైరెక్టర్ల సభ,-ఆమోదించిరి. ఈ విధానమే, తక్కిన ప్రాంతాలలోని విద్యాశాఖల నిర్మాణానికి నమూనాగా ఏర్పడింది.

కాని, "కొంతకాలంవరకూ,- సైనికవిప్లవంనాటికికూడా,- ఆంగ్లభాష ఇండియాలో మృతప్రాయమై యున్నదనీ, కళాశాల ఆవరణంలో తప్ప, ఇంకెక్క డనూ దీనికి వ్యవహారంలేదనీ," విద్య విషయంలో ప్రభుత్వప్రయత్నము స్వల్ప మైనది మాత్రమే అనీ, కొన్ని చోట్ల వ్రాసియుండడం మనము చూస్తున్నాము.

ప్రభుత్వము పాఠశాలలను నెలకొల్పకపోయిన ప్రదేశాలలో, తాము పాఠశాలలను నెలకొల్పి, ప్రభుత్వం పూనిన విద్యావ్యాప్తి ఉద్యమానికి మిషనరీ సంస్థలు తోడ్పడినవి. లూధియానా, సహారాన్ పూర్, జలంధర్, అంబాలా, లాహోర్, ఫరూకాబాద్,- మొదలైన ప్రదేశాలలో, అమెరికన్ ప్రెస్బిటీరియన్ సమితివారు విద్యాలయాలను నెల్పకొల్పి, వాటిలో, బైబిలుతోపాటు ఆంగ్ల సారస్వతాన్ని, విజ్ఞానశాస్త్రాలనూ, ఇతర పాఠ్యవిషయాలనూ బోధింపసాగినారు. అలహాబాద్ లోని ప్రభుత్వకళాశాలను వీరు పుచ్చుకొని, దానిని కళాశాలస్థాయికి అభివృద్ధిగావించిరి. ఇతరప్రదేశాలలోకూడా, తక్కిన మిషనరీసంఘాలు ఈవిధంగానే విద్యావ్యాప్తిగావించినవి. చర్చిమిషనరీసంఘం ఆగ్రాలో సెంట్ జాన్ కళాశాలను (St. Johns College) స్థాపించెను. తత్ఫలితంగా, 1854 నాటికి, 1750 మంది విద్యార్థులతోకూడిన ఇరవైరెండు మిషను విద్యాలయాలన్నిటిలోని విద్యార్థుల

సంఖ్యతో సమానమైనది, ఈ మిషను విద్యార్థులసంఖ్య.

పంజాబులో ఉండిన దేశీయ విద్యావ్యవస్థలో, ఆ ప్రాంతంలోని మూడు మతాల వారికీ ప్రత్యేకంగా, మూడు విధములైన, విద్యాలయాలు ఏర్పడి యుండినవి. ఇది గమనింపదగిన విషయము. హిందువులు హిందీని నేర్చుకొను చుండిరి. ముస్లిములు అరబ్బీ భాషలో 'ఖురాను'నూ, పార్సీ సారస్వతాన్నీ అభ్యసిస్తూ ఉండిరి. సిక్కులు గురుముఖిలో "గురుగ్రంథ సాహేబ్' అనే గ్రంధాన్ని చదువుచుండిరి. వాటికి సదృశములైన పాఠశాలలు స్త్రీల నిమిత్తం ఏర్పడి యుండినవి. బ్రిటీషువారు పంజాబును వశపరచుకొన్న పిమ్మట, అమృత్ సర్ లో, ఒక ఆంగ్లవిద్యాలయాన్ని స్థాపించిరి. తక్కిన ముఖ్యపట్టణాలలో, మిషనరీలు పాఠశాలలను ఏర్పరచిరి.

## VIII. 1854 లో, వుడ్ పంపించిన పత్రము. (జాబు).

అధికారసమితి అధ్యక్షుడు (President of the Board of Control.) 1854 లో పంపిన జాబు, సుస్థిరంకాని స్థితిలో ఉన్న విద్యాభవనానికి, శిఖర ప్రాయమయింది. ఇండియాలో జరిగిన విద్యాభివృద్ధిని గూర్చి, పార్లమెంటు సెలెక్టుకమిటీ వారు గావించిన విచారణ ఆధారంగా, ఈ జాబు రచితమయింది. "నైతికమూ, లౌకికమూ ఐన, అభ్యుదయాన్ని ప్రజలకు కలిగించడమూ, ప్రజల బుద్ధివికాస సామర్థ్యములను అభివృద్ధిపరచడమూ, న్యాయ నిష్ఠలుగల వ్యక్తులను ప్రభుత్వోద్యోగములకు సిద్ధపరచడమూ, దేశములోని మూలసంపత్తిని అభివృద్ధిపరచి, దేశసంపదనూ వ్యాపారాన్నీ విస్తరింపచేయడమూ, మన ఇంగ్లాండులోని ప్రజాబాహుళ్యం ఉపయోగిస్తున్న వస్తువుల ఉత్పత్తికి, అవసరమైన ముడిసరకులను ఇండియా నుండి నిరంతరంగా, సరఫరాచేయడమూ, బ్రిటీషు కార్మికులు తయారుగావించిన వస్తువులను అపారంగా, నిరంతరంగా, వాడుతూ రావడమూ,- అను ఆశయాలను దృష్టిలో నుంచుకొని భారతదేశంలోని విద్యా విధానాన్ని, మనం రూపొందించవలెను." అని, అతడు జాబులో మరల ఉద్ఘాటించినాడు.

భారతదేశంలో జరుగవలసిన విద్యాస్వభావాన్ని గూర్చి జరుగుచున్న వివాదాన్ని, వుడ్, ఈ క్రింది వాక్యాలలో పర్యవసానం గావించెను. "అభివృద్ధిపొందిన కళలనూ విజ్ఞాన శాస్త్రాన్నీ, పాశ్చాత్యతత్త్వ శాస్త్ర, పాశ్చాత్య సారస్వతాన్నీ,- అనగా, పాశ్చాత్య విజ్ఞాన సర్వస్వాన్నీ,- భారదేశంలోను వ్యాప్తిగావించడమే, మన విద్యావిధానం యొక్క ఆశయంగా ఉండకతప్పదని నేను నిష్కర్షగా ప్రకటిస్తున్నాను."

బోధనభాష విషయమై జాబులో, "పాశ్చాత్య విజ్ఞానాన్ని దేశంలో విస్తరింపచేయడానికి, ఆంగ్లభాషా, దేశభాషలూ, చేరి, బోధనభాషలుగా ప్రవృత్తములై, ఉద్దిష్ట ప్రయోజనాన్ని సాధించగలవని మనం ఆశిస్తున్నాము,-"అని యున్నది. అనగా, వాస్తవ వ్యవహారంలో, - ఉన్నత విద్యాబోధనలో ఆంగ్ల

భాషా, సార్వజనికమైన సామాన్య విద్యావ్యాప్తిలో దేశభాషలునూ, ఉప యుక్తములగునని తాత్పర్యము.

విద్యావిస్తృతిని గూర్చి,-వుడ్ పంపిన పత్రంలోని సిఫార్సుననుసరించి,-(1) కలకత్తా, బొంబాయి, మదరాసు నగరాల్లో, లండన్ విశ్వవిద్యాలయం మాదిరిపై, మూడు విశ్వవిద్యాలయాలను నెలకొల్పి, (1857) వాటిని లండను మాదిరిపైననే పరీక్షా సంస్థలుగా చేయడము, (2) దేశీయములూ, ఆంగ్ల-దేశీయములూ ఐన, ఉన్నత పాఠశాలలను అధిక సంఖ్యాకంగా పెంచడము, (3) పశ్చిమోత్తర ప్రాంతాలకు, థామ్సన్ ప్రణాళికననుసరించి, దేశీయ పాఠశాలల ద్వారా ప్రాథమిక విద్యను వ్యాప్తిగావించడము,-అనేవి వివరింపబడియున్నవి.

ప్రతి ప్రాంతంలోనూ, డైరెక్టర్ పర్యవేక్షణలో విద్యాశాఖలను నెలకొల్పి, వాటిద్వారా పాఠశాల విద్యావిధానము సక్రమంగా జరగడానికీ, ప్రభుత్వం పూనిన ఉద్యమము సఫలం కావడానికీ తగిన వివరాలన్నీ, వుడ్, తన పత్రంలో వివరంగావించినాడు. ఇట్టి కార్యక్రమాన్ని ప్రతిపాదించినా, వుడ్, దాని నిర్వహణకు, అవసరమైన ఆర్థిక బాధ్యతను, వహింపలేదు. ఈ బాధ్యతలో కొంత భాగాన్ని ప్రజలపైనా, పౌర సంస్థలపైనా నెలకొల్పినాడు. ఈ విషయమై, ఇంగ్లండులోని పద్ధతి ననుసరించి సహాయకగ్రాంట్ల విధానాన్ని (Grants in aid) ఇతడు సూచించెను. ఈ విధానంవల్ల ప్రధానంగా లాభాన్ని పొందేవి, మిషన్ పాఠశాలలు.

*విద్యావిధానంలోని ప్రవృత్తులు :* 1813-1858ల, మధ్యకాలంలో బాగా గమనింప తగినంత విద్యావిస్తృతి జరిగింది. 1813లో ఆమోదింపబడిన గ్రాంటు మొత్తము లక్షరూపాయలు మాత్రమే. కాని, బెంగాల్,మదరాసు,బొంబాయి, పశ్చిమోత్తర ప్రాంతము, పంజాబు,-అనే ఈ ఐదు ప్రాంతాలపై జరిగిన వ్యయం 1856-57 నాటికి రెండు లక్షల పౌనులకు (ఇరవై లక్షల రూపాయలకు) పెరిగింది. ఇందులో అత్యధిక భాగము,- మొత్తం ఖర్చులో సగానికిపైగా,-అనగా తొంభైనాలుగువేల పౌనులు బెంగాలు విద్యావ్యాప్తికి ఖర్చయింది. ఈ విస్తృతి వల్ల 1854 నాటికి, దేశంలో 180 ఆంగ్ల విద్యాలయాలేర్పడినవి. ముప్పైవేల విద్యార్థులు విద్యాలయాలకు హాజరవుతున్నారు.

ఈ నలభై సంవత్సరాలకాలంలో, ఈ విధంగా స్థాపింపబడిన విద్యావిధానంయొక్క లక్షణాలు, భారతజాతి పరిణామంలో ఎక్కువ ప్రాబల్యం వహించినవి. ఈ లక్షణాలలో ప్రధానములైనవి;-(1) విద్యాప్రయత్నమంతా సమాజంలోని అగ్రవర్గాలవారిపై ఏకాగ్రమై, సామాన్య ప్రజానీకాన్ని విస్మరించడము, (2) ఉన్నత పాఠశాలలలోనూ, కళాశాలల్లోనూ, ఆంగ్లాన్ని బోధన భాషగా నిర్ణయించడము, (3) పాశ్చాత్య విజ్ఞానాన్ని విద్యలో ప్రధానాంశంగావించడము, (4) కేవలము తార్కిక పాండిత్యానికి మాత్రమే ప్రాధాన్యమిచ్చి, కార్యరూపమైన సాంకేతిక విజ్ఞానాన్ని విరాదరించడము,-అనునవి.

నైతికంగానూ, లౌకికంగానూ దేశాన్ని అభివృద్ధిగావించడమే విద్యా

ప్రయోజనమనీ, అదే తమ ఆశయమనీ, ప్రభుత్వపు ప్రకటనలన్నీ ఇంతవరకూ ఘోషించియుండడం వాస్తవమే. కాని, వాటిని నిర్వహించిన వారి ఉద్దేశాలలో భేదమున్నదనడంలో సందేహమే మాత్రమూ లేదు. క్రింది తరగతి ఉద్యోగాలకు తగిన వ్యక్తులను తయారు చేయడం ప్రభుత్వ ప్రయత్నము. భారత సమాజంతో సాహచర్యం కలిగించుకొని, వారికి క్రీస్తు సువార్తను అందజేసి ఉద్ధరించడంలో, మిషనరీలకు విద్య ఒక సాధనం మాత్రమే. భారతీయులకు ఆంగ్లవిద్యపై గలిగిన అభిమానాసక్తుల కంతటికీ కారణము, లాభప్రయోజనము. "ఆంగ్లమూ, ధనమూ వారికి పర్యాయపదాలు." కొద్దిమందికి మాత్రమే విద్యను పరిమితి చేయడానికి, కంపెనీవారి ధనాభావమూ, పరిపాలన వ్యవస్థలో ఏర్పడిన అవసరమూ, కారణాలు. ఐనా, సామాన్య ప్రజానీకం విషయంలో జరిగిన నిరాదరణ కూడా, విద్యావిధానాన్ని నిర్ణయించిన ప్రభువులపై ప్రభావం చూపింది. గ్రామీణ సమాజంలో, భూస్వాముల దౌర్జన్యానికీ, ఋణదాతల దౌష్ట్యానికీ రైతులు గురియై నిస్సహాయులై ఉండడము, పట్టణాల్లో చేతిపనివాండ్లూ, కార్మికులూ, దిక్కులేని వారైయుండడము,— అనే దుష్టపరిస్థితులకు కారణాలు, వారి అపారమైన సంఖ్యా, వారి సహజదారిద్ర్యమూ, (దేవుడిచ్చిందా ?) ఐయున్నవనే నెపంతో, ప్రజలను శాశ్వతమైన అజ్ఞానజీవితానికీ, నిరక్షరాస్యజీవితానికీ శపించి విడిచి పెట్టినారు.

***నూతన విద్యావిధానంలోని, లోపాలు:*** ఈ విధంగా, సమాజంలోని గణ్యభాగమైన మధ్యతరగతి, నూతనవిధానంవల్ల అభ్యుదయాన్ని పొందింది. విద్యావంతులైనవారి శక్తిసామర్థ్యాల ప్రవృత్తికి, చాలకాలంవరకు, వివిధవృత్తులూ, ప్రభుత్వోద్యోగాలూ, మాత్రమే అవకాశాలుగా ఉండినవి. న్యాయవాదివృత్తీ, వైద్యవృత్తీ ఉపాధ్యాయవృత్తీ,— స్వతంత్రోద్యమాలలో ప్రధానములైనవి. జాతి, కుల, మత భేదాలేవీ ప్రభుత్వోద్యోగ విషయాల్లో పరిగణింపబడవని, పెద్దమాటలు చెప్పుతూ ఉన్నా, సమానావకాశాలు సర్వులకూ కలిగించే ప్రకరణము, 1833 శాసపత్రంలో చేరియున్నా, భారతీయులకు అందుబాటులో ఉన్నవీ, వారు ఆశించగల్గినవీ, డిప్యూటీ కలెక్టరు, సబ్ జడ్జీ ఉద్యోగాలు మాత్రమే. ఒప్పందపు ఉద్యోగాలు భారతీయులకు కలలోనివార్త.

ప్రజానీకంయొక్క అగాధమైన అజ్ఞానము, సమాజంపై మోయజాలని బరువుగా, ఏర్పడింది. సాంఘిక, ఆర్థిక, రాజకీయాభ్యుదయాల ప్రయత్నములన్నిటినీ, ఈ అజ్ఞానభారము, వెనుకకు లాగుతూ ఉంది. సమాజంలోని ఒక వర్గానికి మాత్రమే ప్రయోజనకరమైన నూతన విద్యావ్యవస్థ నేర్పరచే ప్రయత్నములో, ప్రజానీకానికెంతో సేవగావించగల, దేశీయవిద్యాసంస్థను నశింపజేసియుండడము దేశదురదృష్టము. దేశీయవిద్య కేవలం, ప్రాథమికదశకుమాత్రమే చెందినదైయుండినా, విస్తారమైన ప్రజలలో అక్షరాస్యతను పెంపొందిస్తూ ఉండినది. మధ్యయుగపు జీవితంనుంచి బయటపడడానికి, ఆధునిక విద్యాసంపాదన మిక్కిలి అవసరమైనమాట నిజమే. అట్టి విద్యావరము మనకు లభించినందుకు,

కృతజ్ఞత చూపవలసిందికూడా భావ్యమే. కాని, ఈ విద్యవల్లకలిగిన స్వల్పమైన సత్పరిణామము, ప్రజానీకాన్ని దట్టంగా ఆవరించియున్న అజ్ఞానాంధకారంలో, పూర్తిగా మరుగుపడిపోయింది.

ఉన్నతవిద్యాప్రసారానికి ఆంగ్లమును బోధనభాషగా నిర్ణయించడంవల్ల ఏర్పడిన సమస్యలకు సమాధానం చెప్పడమూ, వాటికి ప్రతిక్రియ గావించడమూ, కష్టము. ప్రభుత్వ వ్యవహార నిర్వహణ విషయంలో పర్షియన్ భాషాస్థానాన్ని, ఆంగ్లభాష ఆక్రమించుకొన్నది. అనగా, ఒక విదేశభాషకు బదులుగా మరియొక విదేశభాష ఏర్పడింది. దేశవ్యవహారభాషల్లో ఏదీకూడా దేశసమస్తానికీ వ్యాప్తమై యుండలేదని, సమర్థించినారు. ఉత్తరభారతంలో అంతటా విస్తారంగానూ, దక్కను పట్టణాల్లోనూ, దక్షిణదేశంలోనూకూడా, ఉర్దూభాష వ్యవహారంలో ఉన్నది. కాని, దానిలోని వచనసారస్వతం స్వల్పము. హిందీ మాండలికభాషలు,- ముఖ్యంగా 'బ్రజ' భాష,- విశాలమైన దేశభాగంలో సువ్యాప్తమై ఉన్నాయి. కాని, పరిపాలన వ్యవహారాలకూ, వ్యాపారవ్యవహారాలకూ, తగిన వచనసారస్వతం కానీ, ప్రమాణశైలికానీ, ఇంకనూ, ఏర్పడియుండలేదు. ఇతరదేశభాషలుకూడా, చాలవరకూ ఇట్టి పరిణామస్థితిలోనే ఉండినవి. పరిణతిచెందిన కొద్దిభాషలు, దేశం యొక్క పరిధిసీమలలోమాత్రమే, వ్యవహారములో ఉన్నవి. సంస్కృతంబాగా పరిణతి చెందినభాషేకాని, అది దేశంలోని ఏవర్గంలోకూడా వ్యవహారంలో లేదు. విద్వాంసులైన అల్పసంఖ్యాకవర్గానికి మాత్రమే అది పరిమితము. పాశ్చాత్య విజ్ఞానసర్వస్వాన్ని, సంస్కృతభాషద్వారా ప్రసరింపచేయడం, కార్యరూప ప్రతిబంధకాలతోకూడిన, కఠినప్రయత్నము. పరిపాలన వ్యవహారాలలో పాల్గొన్న భారతీయులందరూ, అన్ని వర్గాలవారూ, పర్షియనుభాషను రాజభాషగా గ్రహించి దానిని చక్కగా నేర్చియుండగా, నూతనపాలకులైన ఆంగ్లేయుల భాషను నేర్చుకొనడానికి ఆక్షేపణ ఎట్టిది ? అని బ్రిటీషువారి వాదను. అదికాక, ఆధునిక విజ్ఞానసర్వస్వానికంతటికీ, ఆంగ్లభాష నిలయమై యున్నందువల్ల, తక్కిన భాషలన్నిటిలోనూ అది అగ్రస్థానమాక్రమించింది. తత్కారణంగా, భారతీయు లనేకులు దీనిని సంస్కృతంకంటె, ఎక్కువగా అభిమానిస్తున్నారు. అని బ్రిటీషువారు యుక్తియుక్తంగా వాదించిరి.

అట్టి పరిస్థితులలో, రెండవ మార్గమేదీ పరిపాలకులకు సుకరంగానూ, సుసంగతంగానూ, కనబడలేదు. ఈ నిర్ణయ ఫలితంగా, లాభమూ, నష్టమూ, కూడా, కలిగినవి. దేశమందలి వివిధప్రదేశాల్లోని వారు ఆంగ్లభాషా పరిజ్ఞానం సంపాదించడంవల్ల, వివిధప్రాంతాల మధ్య పరస్పర వ్యవహారాలకూ, ఉత్తర ప్రత్యుత్తరాలకూ, మంచి అవకాశం ఏర్పడి, జాతీయైక్య ప్రవృత్తికి దోహదం జరిగింది. మరిన్ని,-పాశ్చాత్య సారస్వత ప్రభావము, భారత దేశసమాజానికి వినూత్నమైన జాతీయతా చైతన్యాన్ని మేల్కొల్పి, జాతికి బలాన్ని చేకూర్చింది, అనే సత్యము విశదమైనదే. యూరోపియనులు, బూనుకొన్న ఉద్యమాలు, సమస్తములైనవారి కార్యక్రమాలు,- యుద్ధకాలంలోనూ, శాంతి

సమయంలోనూకూడా,- సర్వమూ వారి మాతృదేశప్రయోజనములను సాధించుటకే, ప్రవృత్తములైనవి. తమ మాతృదేశవిజయాన్నీ, వైభవాన్నీ పోషించడమే వారి ప్రధానలక్ష్యము. ఇట్టి వీరి ఉన్నతాదర్శము విద్యావంతులైన భారతీయుల మనస్సులకు ఉద్బోధకలిగించడం ఆశ్చర్యం కాదు. మాతృదేశభక్తిభావాలతోనూ, మాతృదేశరక్షణకై గావించిన అతి సాహసకార్యాలతోనూ, ఆత్మత్యాగంతోనూ నిండియున్న, ఆంగ్లసారస్వతాన్నీ, ఆంగ్లచరిత్రనూ, అధ్యయనంచేసిన భారతీయుల మనస్సులు, ఈ విశిష్టప్రభావప్రాబల్యానికి లోనైనవి.

పరిపాలనవ్యవస్థలోనూ, ఆర్థిక వ్యవస్థలోనూ, బ్రిటీషు ప్రభుత్వం దేశంలో నెలకొల్పిన ఐక్యము, జాతీయైక్యమును ప్రబలంగా కూర్చుటకుకూడా, పరోక్షంగా సహకరించింది. ఈజాతీయైక్యభావాన్ని, ఆంగ్లభాష శీఘ్రంగా పరిణతం గావించింది.

ఐనా, ఆంగ్ల ప్రాబల్యం దేశభాషల అభివృద్ధిని మాత్రం వెనుకకు నెట్టింది. ఆంగ్లంలో సంభాషిస్తూ, ఆంగ్లంలోనే వ్రాస్తూ, ఆంగ్ల గ్రంథాలనే పఠిస్తూవచ్చిన భారతీయులు, చాలకాలం తమ మాతృ భాషలపట్ల నిరాదరణతో, ప్రవర్తించిరి. ప్రకృతిదత్తమైన ప్రతిభకారణంగా, అన్ని దేశభాషలలోనూ శక్తివంతమైన, సారస్వతం ఉత్పన్నమైనదనడం నిజమే. కాని ప్రకృతిశాస్త్రము తత్త్వశాస్త్రము, చరిత్ర,- ఇత్యాది విషయబాహుళ్యంతోకూడిన, లౌకికజ్ఞానప్రదమైన వచన సారస్వతం ఉత్పత్తికాలేదు.భారతీయ విద్యావిధానము, చిరకాలంగా కార్యకారికాని పాండిత్యప్రకర్షకూ, భావనాత్మకమైన కవితాసృష్టికీ మాత్రమే, ప్రాధాన్యమిచ్చింది. కావున, ఇదివరకూ రాజ్యవ్యవహారాలలో ఉపయుక్తమైయుండిన భాషల స్థానంలో (సంస్కృతం, అరబ్బీ, పారసీక) ఆంగ్లభాష ఏర్పడినప్పటికీ, భారతీయుల భాషాదృక్పథంలో మార్పు కలుగలేదు. ఆంగ్లభాషాధ్యయనంలోనూ, వ్యవహారంలోనూ కూడా శబ్దప్రాధాన్యమూ, తాత్త్వికదృష్టీ, ప్రాధాన్యములైనవి. ఆంగ్లవిద్యాభ్యాసం వీరిలో ఒక, ద్విసంయోజక, దృక్పథాన్ని కలిగించింది. విద్యావిహీనులైన ప్రజానీకంయొక్క క్షేమంపట్ల, విద్యావంతులు ఐక్యభావాన్ని ఒకవైపు ప్రదర్శించడమూ, మానసికంగా ప్రజానీకంతో ఐక్యం పొందలేకపోవడమూ,-అనే ద్వంద్వ జీవిత పరిస్థితి ఏర్పడింది. వ్యక్తి జీవితప్రవృత్తి ఇంటిలో ఒక విధంగానూ, బైట మరొక విధంగానూ, ఉండడం ఈ ద్విసంయోజకశక్తియొక్క ప్రాభవము. జాతీయైక్యము ఏర్పడడంలోగల లోపాలకుగూడా ఇదే ప్రబల కారణమయింది. గృహవ్యవహారాల్లో ఉపయోగించే భాషా, దేశసంబంధములైన బాహ్య వ్యవహారాలలో ఉపయోగించే భాషా, భిన్నములైనప్పుడు, బుద్ధికి వ్యాపార రుజుత్వం (ప్రామాణికత) నశించకతప్పదు. అదేవిధంగా, దేశజీవనానికి, అత్యావశ్యకములైన ప్రధాన విషయాలలో ఉపయోగించే భాష ప్రజలభాష కానప్పుడు, అభేదభావం మరుగుపడిపోయి జాతీయైక్యమునకు భంగం కలగక తప్పదు.

అగ్రవర్గాలవారి విద్యాభివృద్ధికి అధికప్రాముఖ్యం కలుగడానికి, బ్రిటీషు

పరిపాలనయొక్క సాంఘికార్థిక వ్యవస్థావిధానమే ముఖ్యకారణము. 1857 నాటి, విప్లవంవరకూ అగ్రవర్గాలవారిని తమకు అనుకూలురుగా చేసికోవడమే బ్రిటీషు వారు పాటించిన రాజనీతి. కనుకనే, రైతువర్గానికి నష్టకష్టాలు కలిగినా గణించక, భూస్వాములను ఆదరించిరి. అధికారాలనూ, పదవులనూ, ఉద్యోగాలనూ గోల్పోయిన అగ్రవర్గాలవారి అభ్యుదయానికై, బ్రిటీషుప్రభుత్వము ఆసక్తిచూపింది.

ఆంగ్ల విద్యకు మాత్రమే అధికప్రాధాన్యం ఏర్పరచడమూ, సౌకర్యములున్న అల్పసంఖ్యాకులకు మాత్రమే విద్యావకాశం కల్పించడమూ,—అనే రెండునూ బ్రిటీషుప్రభుత్వపు రాజనీతి కనుగుణంగానే ఉన్నవి. అత్యధికసంఖ్యాకమైన ప్రజానీకం అజ్ఞానాంధకారంలో దిక్కుతెలియక పడియుండడమూ, ఎప్పుడో గతించిపోయిన యుగం నాటిసంప్రదాయాలకు బంధింపబడి ఖిన్నులై యుండడమూ,—అనే పరిస్థితులను బాగుపరచే బాధ్యతను ప్రభుత్వము వహించలేదు. నూతనవిద్యావంతుల సంఘమంతా, చాలవరకు, హైందవ అగ్రవర్గాలవారితోనే ఏర్పడియుండడం, గమనించవలసిన విషయము. విద్యావంతులైన బ్రాహ్మణులూ, కాయస్థులూ, పారసీకులూ, బొంబాయిలో అగ్రస్థానాన్ని ఆక్రమించిరి. మదరాసులో బ్రాహ్మణులదే, ప్రధానస్థానము. ముస్లిము అగ్రవర్గాలవారు, పూర్తిగా, ఆంగ్ల విద్యకు బాహ్యంగానే నిలిచిపోయిరి.

*ముస్లిములు వెనుకబడడానికి కారణాలు.*

1845లో, బ్రిటిషు ఇండియాలో, ప్రభుత్వపోషణలో నున్నవిద్యాలయాలలో చదువుతున్న విద్యార్థుల సంఖ్య 17,350. మొత్తం విద్యార్థుల సంఖ్యలో, 13,699 మంది విద్యార్థులు హిందువులు. ముస్లిములు 1636, క్రిశ్చియనులు 236, ఇతర మతాలవారందరూ కలిసి 1789. రాజధానీవారీగా, —బొంబాయిలో పాఠశాలలలోనూ, కళాశాలలలోనూ, చదువుతున్న విద్యార్థుల సంఖ్య 8138. క్రిందిప్రాంతాలలోని సంఖ్య 7036; పశ్చిమోత్తర ప్రాంతంలోనిసంఖ్య 2186;. 1856-57 సంవత్సరంలో,—బ్రిటీషుభాగాల్లో ఎక్కువ మొత్తం బెంగాలులో ఖర్చయిందని ఈ క్రిందిపట్టిక తెల్పుతుంది.

| ప్రాంతం | ఆదాయం పౌనులు | విద్యపై ఖర్చు | మొత్తం ఆదాయంలో ఖర్చు శాతం |
|---|---|---|---|
| బెంగాల్ | 11,202,641 | 94,322 | 0.841 |
| మదరాసు | 4,718,036 | 34,222 | 0.725 |
| బొంబాయి | 4,600,478 | 35,243 | 0.766 |
| N. W. P. | 2,724,141 | 33,060 | 1.213 |
| పంజాబ్ | 1,057.987 | 14,487 | 1.369 |

విద్యాభివృద్ధికై బెంగాలులో వ్యయమయిన ధనము, బొంబాయి కంటే, మదరాసుకంటె మూడురెట్లు అధికము. 1861లో, బెంగాలులో చదువుతున్న విద్యార్థుల సంఖ్యా వివరాలనుబట్టి, పాశ్చాత్య విద్యావిధానంవల్ల, బాగుపడిన వారిలో బెంగాలీ హిందువులే ప్రాధాన్యం వహించిరని తెలుస్తుంది.

కలకత్తా విశ్వవిద్యాలయ ప్రవేశపరీక్షఫలితాలు.1861.

| ప్రాంతం | విద్యార్థి సంఖ్య | క్రైస్తు | ముస్లిము | హిందూ | పార్సీ |
|---|---|---|---|---|---|
| క్రిందిప్రాంతాలు | 749 | 41 | 24 | 683 | 1 |
| బీహారు | 22 | 1 | 1 | 20 | 0 |
| N. W. F. | 23 | 3 | 1 | 19 | 0 |
| పంజాబ్ | 2 | 2 | + | — | — |
| సిలోన్ | 13 | 12 | 0 | 0 | 1 |
| మొత్తం | 809 | 59 | 26 | 722 | 2 |

బి,ఎ. పరీక్షలో (1861-కలకత్తా) పరీక్షకు హాజరయిన 39 గురిలో, 13 మంది పాసయిరి. పాసయినవారిలో 11 మంది హిందువులు, ఒకడు క్రిశ్చియను. ఒకడు ముస్లిము.

రాజధానీ నగరాల్లోఉన్న హిందువులు, పార్సీలు, అవకాశాన్ని పురస్కరించుకొని, పాశ్చాత్య విద్యాభ్యాసానికి ఎక్కువగా పూనుకొనిరి. కాని, ముస్లిములు,-ముఖ్యంగా దేశపు అంతర్భాగాల్లో నివసించేవారు,-పాశ్చాత్య విద్యపట్ల నిరాదరణ వహించియుండిరి. బీహారు, ఔధ్ ప్రాంతాల్లోని ముస్లిములు,-తమ పిల్లలను చదివించే తాహతుగలవారుకూడా,-ఆంగ్ల విద్యాభ్యాసంపట్ల, అసహ్యాభావాన్ని ప్రదర్శిస్తూ వచ్చిరి. 1867లో, లక్నోలో జరిగిన రాజప్రతినిధి సభకు 260 మంది తాలూకాదార్లు హాజరైరి. కాని, తాలూకావారి కుటుంబాలనుంచీ పాఠశాలలకు హాజరౌతున్న పిల్లల సంఖ్య డెబ్బై మాత్రమే. 1860లో, కోలింగా మద్రసా, తలతాలా గ్రంథాలయసంఘం, అనే రెండు ముస్లిము విద్యాలయాలు మాత్రమే కలకత్తాలో ఉన్నవి. విద్యాప్రమాణంలోనూ, విద్యార్థుల సంఖ్యా విషయంలోనూ ఇవి హిందువుల విద్యాలయాలతో సాటి రాలేక పోయినవి. ఇట్లు ముస్లిము విద్యాపరిస్థితి వెనుకబడియుండడానికి, ముస్లిము నాయకులు రెండు కారణాలను పేర్కొన్నారు. (1) ముస్లిముల మతభ్రాంతి (Bigotry) ఆంగ్లవిద్యను నిషేధించడము, (2) ప్రభుత్వంవారి అశ్రద్ధా, ఇందుకు హేతువులని వారి అభిప్రాయము. బొంబాయి, మదరాసు ప్రాంతాలలోకూడా, పాశ్చాత్యవిద్యవల్ల అభ్యుదయంపొందినవారు పార్సీలు, హిందువులు. అందులో, బ్రాహ్మణులూ కాయస్థులూ, సారస్వతులూ, వ్యాపారవర్గంవారూ, ముఖ్యులు. 1860 వరకూ, మధ్యతరగతి వారిలో విద్యావంతులైన హిందువుల సంఖ్యే అత్యధికము. ముస్లిముల సంఖ్య అల్పాత్యల్పమైనది.

మధ్య తరగతులవారు ఆంగ్లీకరణమొందిన పాఠశాలలో చదివి, అందరికీ సాధారణమైన ఆంగ్లభాషలోనే వ్యవహరిస్తూ, పాశ్చాత్యభావాలను బాగుగా

గ్రహించిరి. అభేదములైన ఆర్థిక రాజకీయశక్తులకు లోబడి, వీరు ఆంగ్ల విద్యా సాహాయ్యముతో, తమ కందరికీ సాధారణమైయున్న జాతిపౌరత్వ ప్రభావాన్ని గుర్తింపగలిగిరి. ఇట్లు సమాన జాతీయ భావం కలిగిన ఈ విద్యావంతులు, కొంత కాలానికి సంఖ్యాబలాన్నీ, పలుకుబడినీ కూర్చుకొన్నారు. తమ హక్కులనుగూర్చిన పరిజ్ఞానమిదివరకే వీరిలో ఏర్పడింది. ఆ హక్కులను సంపాదించుకొనడానికై, ఈ వర్గంవారు సంఘంగా ఏర్పడడానికీ, పాలకులను ఒత్తిడి పెట్టడానికీ పూనుకొన్నారు.

# 5
# పత్రికలూ, ప్రజాభిప్రాయము

**ఇండియాలో పత్రికోద్యోగ ఆరంభదశ**

నూతన జీవనపద్ధతులూ, నూతన ప్రయోజనాలూ, కలిగిన ప్రజావర్గాలు, బ్రిటీషు పరిపాలనలోని వివిధప్రాంతాలలో ఏర్పడుచుండినవి. వారి మనస్సులను, ఆధునికములైన ఆలోచన మార్గాలకునూ భావాలకునూ అనుగుణంగా దిద్దుతూ వచ్చింది నూతన పాశ్చాత్య విద్యావిధానము. ఈ భావాలనూ, అభిప్రాయాలనూ దేశంలో ప్రచారంచేసే పాశ్చాత్య పద్ధతులతోనూ సాధనాలతోనూ కూడా, భారతీయులకు పరిచయమేర్పడింది. కొంతకాలానికి, ఈ నూతన వర్గాలకు పరస్పర సాహచర్యమధికమై, సంఘీభావ మేర్పడింది. తత్పరిణామంగా ప్రజాభిప్రాయం ఏర్పడడం ప్రారంభమయింది. పత్రికలు, రాజకీయ సంస్థలు, మహాజర్లు, ప్రభుత్వానికి నివేదించుకొన్న విన్నపాలు, ప్రజల హక్కుల సమర్థనకు న్యాయస్థాన వ్యవహారాలు,- మొదలైన వాటి ద్వారా, క్రమబద్ధమైన విధానంలో, ఈ ప్రజాభిప్రాయం వ్యక్తం కాజొచ్చింది. ప్లాసీయుద్ధం జరిగి అరవై సంవత్సరాలింకా పూర్తి కాలేదు. దేశంలోని చాల భాగమింకనూ, ప్రాచీన పరిపాలన వ్యవస్థనుంచి బైటపడియుండలేదు. ఇంతలో నూతన భావ ప్రవాహం దేశంలో ప్రవహించ నారంభించింది. కొత్తగా ఏర్పడిన కార్యక్రమంలో పత్రికలు మిక్కిలి ప్రాధాన్యం వహించినవి. రైల్వేలూ, రహదార్లూ, నదీమార్గాలూ, టపా-తంతి విధానాలు,-ఇత్యాది సంచారమార్గాలు, సాధనాలలో ముఖ్యమైనాయి.

ముద్రణ యంత్రాన్ని దేశంలో మొదట ప్రవేశపెట్టినది పోర్చుగీసువారు. 1550 లో, రెండు యంత్రాలను దిగుమతిచేసి, మత సంబంధమైన పుస్తకాలను ప్రచురించడానికి, వాటి నుపయోగించిరి. ఇతర ముద్రణాలయాలు దక్షిణ దేశంలో ఏర్పడినవి. పదహేడో శతాబ్దంలో, భీమ్‌జీపరేఖ్, అనే, కాపోల్ బనియా, బొంబాయికి ఒక ముద్రణ యంత్రాన్ని దిగుమతి చేసినాడు ఈస్ట్ ఇండియా కంపెనీ వారు ఒక ముద్రణాలయాన్ని బొంబాయిలో నెలకొల్పిరి. (1674). పద్దెనిమిదో శతాబ్దంలో, మదరాసు, కలకత్తా, హుగ్లీ, బొంబాయిల లోనే, కాక, మరి రెండు ఉత్తర ప్రాంతంలో,-ముద్రణాలయాలు ఏర్పడినవి.

ఈ విధంగా ముద్రణాలయాలేర్పడడంతో, పుస్తకాలూ సమాచార పత్రికలూ నియతకాల పత్రికలూ, (Journals) ప్రచురించడం ప్రారంభమైనది.

స్వతంత్రవ్యక్తులు, మిషనరీ సంస్థలూ, వీటిప్రయోజనాన్ని గుర్తించి, తమ స్వంత ముద్రణాలయాలను ప్రారంభించినారు.

1766లో, విలియం బోల్ట్స్ (William Bolts) స్వతంత్ర పత్రికను ప్రకటించే ఉద్దేశం తనకున్నదని తెలిపినాడు; అటువంటిదేదీ జరుగలేదు. పధ్నాలుగు సంవత్సరాల తర్వాత, (1780) జె. ఏ. హిక్కీ, అనే అతడు 'బెంగాల్ గెజెట్' అనే పేరుతో, ఒక వార పత్రికను నడపడం ప్రారంభించినాడు. (Calcutta General Adviser), అనికూడా దీనికి ఇంకో పేరుండేది, కాని అందరూ ఈ పత్రికను 'హిక్కీ గెజెట్' అని పిలిచేవారు. కొందరు యూరోపియనులను హీనంగా విమర్శించి, హిక్కీ, ప్రభుత్వానికి చికాకు గలిగించినాడు. ఉన్నతాధికారులైన వారన్‌హేస్టింగ్సు, ఎలిజా ఇంపే, కూడా ఇతని విమర్శలకు గురి అయినారు. 'తపాలా' సౌకర్యాలు లేకుండా చేయడం, ప్రభుత్వం తీసుకొన్న మొదటి చర్య. తర్వాత, అతని ముద్రణాలయాన్ని ప్రభుత్వపు వశపర్చుకొంది అంతటితో, హిక్కీ పత్రికోద్యోగము అంతమయింది. పిమ్మట ఇతర పత్రికలు వెలువడినవి. ప్రభుత్వం పట్ల, అసంతుష్టులైయున్న ఆంగ్లేయుల ఆక్షేప రచనలకివి ఉపకరించినవి. ప్రభుత్వ విధానాలను గురించీ, ప్రభుత్వపు చర్యలను గూర్చి, ప్రచురించిన విమర్శలు అధికారుల ఆగ్రహానికి గురియైనవి. అందులో, సైన్యవిషయకమైన విమర్శలు, అవిచారాత్మకములనీ, పరిపాలన వ్యవస్థకు విరుద్ధములైనవనీ తలచడం జరిగింది. తత్ఫలితంగా ప్రభుత్వానికీ ఈ పత్రికలకూ మధ్య వ్యతిరేక భావమేర్పడింది. ప్రభుత్వాగ్రహానికి గురియై సంపాదకులు కొందరో, ఇండియానుంచి బహిష్కృతులైనారు. విలియం డ్యూన్ (William Duane), ఛార్లెస్ మెక్లీన్ (Charles Maclean), జేమ్స్ సిల్క్ బకింగ్‌హామ్ (James Silk Buckingham)- మొదలైన వాళ్ళిందుకు నిదర్శనాలు.

దీనితో తృప్తిపడక, వెల్లెస్లీ, పత్రికలపై కఠినమైన అవష్టంభకాలను (Censor) విధించినాడు హేస్టింగ్సు కాలంవరకూ, పత్రికా స్వాతంత్ర్యానికి సరియైన పరిస్థితు లేర్పడలేదు. 1818 లో, ఆయన పత్రికా సెన్సారు శాఖను రద్దుచేసి, పత్రికా నిబంధనలను ప్రకటించినాడు. "దిగువ వివరించిన ముఖ్యాంశాలను గూర్చి, ఏ విషయాన్ని కూడా వ్రాయకూడదని పత్రికా సంపాదకులు నిషేధింపబడినారు.

మొదటిది : గౌరవనీయులైన కంపెనీ డైరెక్టర్ల కోర్టువారు, గావించిన శాసనచర్యలూ వ్యవహారాలూ, లేదా, ఇండియా ప్రభుత్వంతో సంబంధముున్న ఇంగ్లాండులోని అధికారులు, లేదా ప్రాదేశిక పరిపాలన వ్యవహారాలను గూర్చిన చర్చలు, కౌన్సిలు సభ్యుల అధికారప్రవర్తనపట్ల నిందావాక్యములు, లేదా, సుప్రీంకోర్టున్యాయాధిపతులు, లేదా, కలకత్తా లార్డ్ బిషప్,- ఇత్యాదులపై విరుద్ధ ప్రచారము నిషిద్ధము.

రెండవది : దేశప్రజల మత సంప్రదాయాలకూ అభిప్రాయాలకూ హానికరమైన చర్య ఉద్దేశమైనదని వ్రాసి, వారిలో సంశయాన్నీ భయాన్నీ

రెచ్చగొట్టే వివాదాలూ నిషిద్ధము.

మూడవది : పైన చెప్పిన శీర్షికలకిందవచ్చే విషయాలతోపాటు ఇంగ్లాండు పత్రికలలో ప్రచురించబడిన వ్యాసాలనుగాని, భాగాలనుగాని, తర్జుమాచేసి ఇండియాలో ప్రచారం చేయడం, లేదా, బ్రిటీషు ప్రభుత్వానికి భంగాన్నీ, అప్రతిష్ఠనూ, గూర్చే యితర విషయాలను ప్రచురించడమూ,-నిషిద్ధము.

నాల్గవది : సమాజంలో భేదభావాలను కలిగించే అపనిందలూ, వ్యక్తిగత విమర్శలూ, నిషిద్ధము."

హేస్టింగ్సు ప్రభువు పత్రికలపై విధించిన నిర్బంధాలనుబట్టి, పత్రికలపై ప్రభుత్వానికిగల అధికారాన్ని పూర్తిగా తొలగించడం కంపెనీ డైరెక్టర్లు ఆమోదించరనే విషయం అతడుగుర్తించినాడని తెలుస్తున్నది ప్రజాభిప్రాయం పట్ల గల బాధ్యతను, పరిపాలన వ్యవస్థలో పెంపొందించడం అత్యంతమూ అవసరమనే విషయాన్ని, అతడు కోర్టు వారికి పంపిన తన శిఫారసు పత్రంలో వివరించియున్నాడు.

కాని, కంపెనీ డైరెక్టర్లు గవర్నర్ జెనరల్ గావించిన మార్పును అంగీకరించలేదు. పూర్వము అమలులో నున్న నిర్బంధ (ప్రీసెన్సారు) విధానాన్ని మళ్ళీ అమలులో పెట్టవలసిందిగా అతనిని కోరినారు. కాని, బోర్డ్ కంట్రోల్ వారు ఆ డైరెక్టర్ల జాబును, హేస్టింగ్సుకు పంపలేదు.

అదే సంవత్సరము జెమ్సు సిల్క్ బకింగ్‌హాం, 'కలకత్తా జర్నల్' పత్రికను స్థాపించినాడు. దీనిలోని వ్యాసాలలో ప్రదర్శితములైన ఉత్సాహ చైతన్యాలూ, బుద్ధితీక్ష్ణతా, అధికారుల లోపాలు నిర్భయంగా ప్రదర్శించడమూ, దేశంలో ప్రచలనం కలిగించినవి. యూరోపియన్ వర్గంలోనేకాక, భారతీయులలో కూడా, దీనిపై ఆదరమేర్పడింది. ఆ కాలంలో ప్రచురించబడుతూవచ్చిన పత్రికలన్నిటిలోనూ, దీనికే ఎక్కువ ప్రచారమున్నట్లు తెలుస్తుంది ఇందులోని ఖండితమైన విమర్శ, హేస్టింగ్సు సభ్యులలో, ఆడం (Adam), బెలీ (Bayly) మొదలైన వారికి కష్టం కలిగించింది. హేస్టింగ్సు విశ్రాంతి తీసుకోగానే, బెలీ అధికారం వహించినాడు. వెంటనే, పత్రికలను, ప్రచురించే ప్రతిముద్రణశాలాధికారీ, 'లైసెన్సు' (అనుజ్ఞ) తీసుకోవలసిందిగా శాసించినాడు. ఈ విధానంతో బకింగ్‌హాం కార్యక్రమాలు కుంటుపడలేదు. కనుక, దేశం విడిచిపోవలసిందిగా అతనికి ఆదేశం జారీచేయడం జరిగింది.

పత్రికాస్వాతంత్ర్యం విషయంలో,- అతిసంవేదనశీలమైన (Oversensitive) సర్వతంత్రస్వతంత్రమైన ప్రభుత్వానికీ, ప్రభుత్వచర్యలను సంశయంతో చూస్తూ అధికారులను విమర్శిస్తున్న సంపాదకులకూ మధ్య జరిగిన సంఘటనలను వివరించడం, అవసరము. ఆనాటి ఆంగ్లపత్రికలు, భారతీయుల ప్రయోజనాలనుగూర్చి, పట్టించుకోలేదు. వాటి ప్రచారంకూడా పరిమితంగానే ఉండి భారతీయులు కొందరు మాత్రమే వాటిని పఠించేవాళ్ళన్నవిషయంకూడా, మనం గుర్తుంచుకోవలసి ఉంది.

ఐనా, ప్రజాభిప్రాయాభివృద్ధికి, పత్రికలనుపయోగించే ప్రయత్నము, విస్తరించింది. పరిస్థితులుకూడా దీని కనుకూలములై యుండినవి. సారస్వతాభివృద్ధి, హేస్టింగ్సుకు అభిమానవిషయము. పత్రికలప్రయోజనాన్నికూడా గుర్తించినవాడతడు. పత్రికోద్యోగఉద్యమానికి ఇంతవరకూ ఉండిన ప్రతిబంధకాలు కూడా తొలగినవి. అంతటితో, నూతనాభిప్రాయాలను ప్రజలకు బోధించి, ప్రజాభిప్రాయాన్ని బలపరచడానికి, ఒక భారతీయవర్గం పూనుకొన్నది.

*భారతీయ పత్రికల జననము :* గంభీరములైన విషయాల చర్చకు తగిన వచనశైలిని, బెంగాలీభాషలో, మిషనరీలు అభివృద్ధికి తెచ్చుచుండిరి. గంగాధర భట్టాచార్య, హరచంద్రరాయ్, అనే ఇద్దరు విద్యావంతులు, కలకత్తాలో, 'బెంగాల్ గెజెట్' అనే పత్రికను 1816లో, ఆరంభించినారు. ఈ ప్రథమ ఉద్యమం శీఘ్రకాలంలోనే ఆగిపోవడం భారతీయుల దురదృష్టము.

దేశభాషా పత్రికను నెలకొల్పడానికి దృఢ ప్రయత్నం గావించినవారు, సెరంపూర్ మిషనరీలు. 'దిగ్దర్శన్' అనే మొదటి బెంగాలీ మాసపత్రిక,-కళకళంతోనే,-వెలువడింది. సారస్వత, విజ్ఞానశాస్త్ర, చారిత్రక విషయాలకు మాత్రమే ఈ పత్రిక పరిమితమైనది. ఆంగ్లభాషకూ, బెంగాలీభాషకూ కూడా ఈ పత్రికలో అవకాశం కలిగింది. కాని, మూడు సంవత్సరాల కాలం మాత్రమే ఇది నడిచింది. 'సమాచార దర్పణ' మనే బెంగాలీ వారపత్రిక కూడా, డాక్టర్ మార్షామ్, సంపాదకత్వంలో, బెంగాలీరచయితల సహాయంతో 1818 లో, వెలువడింది. 1818 నుంచీ, 1841 దాకా, ఈ పత్రిక ప్రతి శనివారమూ, వెలువడుతూ ఉండేది. తర్వాత, అది ఆగిపోయి, మళ్ళీ 1851లో వెలువడి, త్వరలోనే అస్తమించిపోయింది. ఆ పత్రికలో వివిధ విషయాలపై వెలువడిన వ్యాసాలు, పాఠకులకు నూతన ప్రపంచదర్శనాన్ని కలిగించినవి అమెరికా యూరోపు వ్యవహారాలకు సంబంధించిన విషయ పరిజ్ఞానము, భారతదేశ వ్యాపార వాణిజ్యాలు, విజ్ఞానశాస్త్ర విషయాలు, బెలూన్ (Balloon-గుబ్బారా), ఆవిరి పడవలు (Steam Boat), మొక్కలు, జీవితచరిత్ర,-మొదలైన విషయాలన్నీ ఈ పత్రికలో వర్ణితములైనవి. అయినప్పటికీ హిందూ, క్రీస్తు మతాలను గూర్చిన చర్చలు, వీటిలో ప్రాధాన్యం వహించినవి.

అదే సంవత్సరంలోనే (1818) సెరంపూర్ మిషన్ వారు కూడా ('Friend of India') ఇండియా మిత్రము, అనే ఆంగ్లపత్రికను ప్రారంభించినారు. మిషనరీల ఉద్యమాలు, ఇతరులను కూడా ప్రోత్సహించి పత్రికల ప్రచురణకు కారణములైనవి. ఈ కొత్త అవకాశాలను పురస్కరించుకొని, పత్రికాప్రచురణకు పూనుకొన్న వారిలో జేమ్స్ సిల్క్ బకింగ్ హామ్, తారాచంద్ దత్, భవానీ చరణ బందోపాధ్యాయలను, ముఖ్యంగా పేర్కొనవలసి ఉంటుంది. 'సంబద్ కౌముదీ' అనే బెంగాలీ వారపత్రికకు బంధోపాధ్యాయుడు సంపాదకుడు. దాని మొదటి సంచిక 1821 డిసెంబర్ 4వ దినం వెలువడింది. రామమోహన్ రాయ్, ఈ పత్రికతో సహకరించి, తన రచనలను వరుసగా ప్రచురిస్తూ వచ్చినాడు. హిందూ

సమాజంలో, జరగవలసిన సాంఘిక మత సంస్కరణల ప్రచారానికి ఈ పత్రికను అతడు ఉపయోగించుకొన్నాడు. 'సహగమన' విధానాన్ని ఖండిస్తూ వ్రాసిన ఇతని వ్యాసాలు ఇందులో ప్రచురించబడినవి. ఈ కారణంగా, హిందూ సంఘంలో తీవ్రమైన అలజడి బయలుదేరి, పత్రిక దెబ్బతిన్నది. 1823 ఫిబ్రవరి 14వ నాడు వెలువడిన కలకత్తా జర్నల్, "దేశానికి అత్యంతము అపాయకరమైన విషయాన్ని ఈ పత్రిక ప్రచారం గావించడం, 'తుపాకు మందుతో నిండిఉన్న పీపాలో నిప్పు వేయడం' వంటిది. ఈ పత్రికలోని రచనల మూలంగా, దేశమంతా సంక్షోభకు లోనుగాక తప్పదు. కాని, పోషణలేనందువల్ల ఈ పత్రికా ప్రచురణం నిలిచి పోవడం జరిగింది. దేశీయుల ఆచార వ్యవహారాలను, అందునూ ముఖ్యంగా విధవ లైన హిందూస్త్రీలను భర్త శవంతో కూడా కాల్చటమనే ఆచారాన్ని ఖండించ డంవల్ల, దేశీయుల ఆగ్రహానికిగురియై నిలిచిపోయిందని తెలుస్తుంది." అని, ఈ పత్రిక వ్రాసింది. 'సంబద్ కౌముదీ' పత్రిక, పడుతూలేస్తూ, పది సంవత్సరాల కాలం నడిచింది. పందొమ్మిదో శతాబ్దపు ప్రథమభాగంలో, సంస్కరణోద్యమాని కెటువంటి ప్రతి బంధకము లుండినవో, ఈ పత్రిక పర్యవసానాన్నిబట్టి వ్యక్త మౌతుంది.

'సంబంద్ కౌముదీ' పత్రికతోబాటు, రామమోహన్‌రాయ్, ఇంకొక పత్రికనుకూడా ప్రారంభించినాడు. క్రిశ్చియన్ మిషనరీలు హిందూమతంపై సాగిస్తున్న దాడుల నెదుర్కొని, వారికి తగిన సమాధానం చెప్పడం ఇతని ఉద్దేశము. ఆ పత్రికకు 'బ్రాహ్మణసేవాధి' అని పేరు పెట్టినాడు. అందులో, ఆంగ్లంలోనూ బెంగాలీలోనూ, వ్యాసాలు వెలువడుతుండేవి. మూడుసార్లు మాత్రమే ఈ పత్రిక వెలువడి, ఆగిపోయింది. ఈమూడు ప్రచురణలలోనూ, హిందూముస్లిము మతములపై మిషనరీలు మోపిన దురారోపణలను సహేతు కంగా విమర్శించి, మిషనరీల కార్యక్రమాన్ని ఖండించినాడు. వీధులలో క్రైస్తవ మతప్రచారం గావించడమూ, పలురకములైన ఆశలనుచూపి, ప్రలోభపెట్టి దరిద్రు లను హిందూమత భ్రష్టులను గావించడమూ,- మొదలైనవారి కార్యక్రమాలను ఆక్షేపించినాడు. పాలకవర్గానికి చెందియుండడంవల్ల, ఆ అవకాశాన్ని దుర్వినియో గించుకొని, పాలకజాతికి మిక్కిలి భయపడి బ్రతుకుతున్న, నిస్సహాయులైన దరిద్రప్రజానీకంలో తమ మతప్రచారం గావించడాన్నిగూర్చి తీవ్రంగా ఖండిస్తూ, అతడు వ్రాస్తూ వచ్చినాడు. 'జమే జహాన్‌నూమా', 'మిరాతుల్ అక్బర్', అనే రెండు పర్షియను పత్రికలుకూడా, రామమోహనరాయ్, జవాబ్దారీలో వెలు వడుతూవచ్చినవి. ఈ పత్రికలన్నిటిలోనూ, ప్రధానంగా మత సమస్యలే చర్చించ బడుతుండేవి.

అభ్యుదయ సంస్కారస్వభావంగల రామమోహన్‌రాయ్ పత్రికలను పూర్వాచారపరాయణులూ, సంప్రదాయ బద్ధులూఐన హిందువులు ప్రతిఘటి స్తూవచ్చినారు. ఇంగ్లీషు మిషనరీలకూ, హిందూమతసమర్థనకు బూనుకొన్న భారతీయులకూ జరుగుతున్న వాగ్వివాదాలూ, ఖండన ప్రతిఖండన రచనలూ,

ప్రభుత్వాన్ని కలవరపెట్టినవి. గవర్నర్ జెనరల్ కౌన్సిల్ సభ్యులలో కొందరు, పత్రికలపై తీవ్రచర్యను ప్రతిపాదిస్తూ ప్రభుత్వానికి జాబులు వ్రాసినారు. బహిరంగసభలలో కలతలు చెలరేగుతున్నవనీ, భిన్నవర్గాల ప్రజలమధ్య ద్వేషభావాలు రగులుకోవచ్చుననే సంశయం తమకుకలదనీ, వీరు తెలిపినారు. అభ్యుదయపత్రికలు ముఖ్యంగా వ్యాకులం కలుగజేస్తున్నాయని, ప్రభుత్వాన్ని వీరు హెచ్చరించినారు. విలియం బటర్‌వర్త్ బేలీ, 1822, అక్టోబర్ 10వ నాడు తనఅభిప్రాయాన్ని తెలుపుతూ, "స్వేచ్ఛా స్వాతంత్ర్యాలున్న రాజ్యంలో, పత్రికా స్వాతంత్ర్యం అవసరమే. ఐనా, ఈ దేశంలోని సంస్థల స్వభావాన్నిబట్టి, దేశంపై మనకుగల అసాధారణమైన అధిపత్యాన్నిబట్టి, ఆస్వాతంత్ర్యం, సంగతమైనదికాదని, నా అభిప్రాయము. బ్రిటీషుపాలకుల, శీలప్రవర్తనవల్లనూ, వారి అధికారచర్యలను విమర్శిస్తూ, వాటినిగూర్చి చర్చిస్తూ, దేశభాషల్లో పత్రికలలో తమ భావాలనూ, ఆక్షేపణలనూ ప్రకటించే స్వేచ్ఛనువారికి కల్పించడం అవివేకము. ఇండియాలోని వివిధవర్గాలవారు అనుసరించి అవలంబిస్తున్న వివిధమతాల తారతమ్యాలను విమర్శింపడమూ, తమ నూతనాభిప్రాయాలను ప్రకటించడమూకూడా అనుచితమైనవే," అని వ్రాసినాడు.

దానికనుగుణంగా, తాత్కాలికగవర్నర్ జెనరల్‌గా జాన్ ఆడం (John Adam), పత్రికాస్వాతంత్ర్యాన్ని నిర్బంధిస్తూ, ఒక నియమాన్ని ప్రకటించినాడు. పర్యవసానంగా, పాలన విషయాలకు సంబంధించిన ఏ సమాచారాన్నిగానీ, ప్రభుత్వశాసనాలనూ, వ్యవహారాలనూ విమర్శించే ఏ విషయాన్నికానీ, పుస్తకరూపంలోకానీ, పత్రికరూపంలో కానీ, ప్రచురించడానికి ముందుగా ప్రభుత్వపు అనుజ్ఞాపత్రాన్ని (License) పొందవలెనని శాసనం వెలువడింది. అట్టి అనుజ్ఞాపత్రాన్ని పొందడానికి ముద్రించేవాని పేరూ, ప్రచురణకర్త పేరూ, ముద్రణాలయపు యజమాని పేరూ, తెలుపుతూ, శపథపత్రాన్ని (Affidavit) ముందుగా దాఖలు చేయవలసి వచ్చేది. అనుజ్ఞాపత్రాన్ని పరిహరించుకొనే అధికారంకూడా ప్రభుత్వానికున్నది. అనుజ్ఞలేని ప్రచురణకు 400 రూపాయల జరిమానా విధింపబడేది.ఈవిధంగా,ప్రభుత్వపు అనుజ్ఞలేక,పుస్తకాలనూ,పత్రికలనూ ప్రచురించడమూ, ముద్రణాలయాలను నడపడమూ శిక్షార్హమైన నేరంగా ప్రకటించడం జరిగింది.

*పత్రికా స్వాతంత్ర్యావసరము-రామమోహనరాయ్ :* ప్రభుత్వపు చర్యకు రామమోహన్‌రాయ్ ఆక్షేపణ తెలిపి ఈ నియమనాన్ని త్రోసివేయవలసిందిగా కోరుతూ, సుప్రీంకోర్టుకు విన్నవించు కొన్నాడు. ప్రభుత్వంచేసిన నియమన ప్రకటన, విద్యావ్యాప్తికి ప్రతిబంధకం కావడమే కాక, ప్రభుత్వాధికారులు గావించిన తప్పులనూ, అన్యాయాలనూ, ప్రభుత్వం దృష్టికి తెచ్చే అవకాశం కూడా ప్రజలకు లేకుండా చేస్తున్నదని కోర్టువారికి వివరించినాడు. "విశాలమైన సామ్రాజ్య వ్యవహారాలను పరిపాలించడంలో ఏవో కొన్ని తప్పులు జరగడం తప్పదనీ, మానవ స్వభావ ప్రవృత్తులు ఎప్పుడూ సమగ్రములు కావనీ గ్రహించి, ప్రపంచ పరిపాలకుడైన భగవంతుని గౌరవించే, ప్రతిపాలకుడూ, తప్పులను

తెలుసుకోవడానికి ఆసక్తి గలవాడై, తమ కష్టాలను తెలుసుకొనే సులభావకాశాలను ప్రజలకు కల్పించి, పరిపాలన దోషాలను సరిదిద్దుకొనేందుకు ఎప్పుడూ ఉద్యుక్తుడై ఉంటాడు. ఇటువంటి విశిష్ట ప్రయోజనం సిద్ధించడానికి, నిర్బంధ రహితమైన పత్రికా స్వాతంత్ర్యమే ముఖ్య సాధనమని గుర్తించవలసియున్నది." అని ఈ విషయమై వ్యాఖ్యానించినాడు.

కాని, సుప్రీంకోర్టు ఈ విన్నపాన్ని త్రోసిపుచ్చింది. అంతటితో ఊరుకోక రామమోహన్‌రాయ్, కౌన్సిలు అధ్యక్షుడైన, ఇంగ్లాండు సార్వభౌమునకు, విన్నప పత్రం లిఖించి పంపినాడు. ఇండియా ప్రభుత్వం కలిగించిన బాధాకరమైన పరిస్థితిని కౌన్సిలు వారికి వివరిస్తూ అతడు,- "ఇండియాలోని స్థానికాధికారులు, అతిప్రాధాన్య ప్రభావములుగల విషయంపై శాసనాధికారాన్ని, తొందరపడి వహించి, మాకు న్యాయ రీత్యా చాల కాలంగా సిద్ధించియున్న విశేషావకాశాలను తొలగించినారు. ఈ అవకాశాలను మేమెప్పుడైనా దుర్వినియోగ మొనర్చినామా ? అన్న ప్రశ్నను కూడ విచారించక, బెంగాలు చరిత్రలో ఇంత వర కెన్నడునూ జరగని విధంగా, మాకుగల పౌరస్వత్వములపై అధికారులు దాడిసాగించినారు. తమ సార్వభౌమ పరిపాలనమందలి విశ్వాస పాత్రులైన ప్రజల పౌర స్వత్వమునూ, వారికిగల హక్కులనూ ఇప్పుడు ప్రకటించిన శాసనము, నిర్లక్ష్యంతో తిరస్కరించేదిగా ఉన్నది. లేదా, ప్రభుత్వంపై మాకుగల అభిమాన విశ్వాసాల పట్ల నిరాధారమైన, నిర్దయాత్మకమైన సంశయాన్ని సృష్టించే ప్రయత్నానికి దోహదమొనర్చేదిగా యున్నది." అని ఇంగ్లీషు ప్రభువుల హృదయాలను స్పృశించే ప్రయత్నంచేసినాడు.

సహేతుకంగా, యుక్తియుక్తంగా రచించి పంపిన ఈ విన్నపం కూడా కౌన్సిలు వారిచే పరిత్యజింపబడింది. ఐనా, ఈ విన్నపపత్రము, చరిత్రలో విశిష్టఖ్యాతికి పాత్రమయింది. దీనిని గూర్చి మిస్ మ్యాలెట్ (Miss Mallet),- "ఈ విన్నప పత్రానికి భారతచరిత్రలో గల స్థానము, ఇంగ్లాండు దేశచరిత్రలో మిల్టను రచించిన 'పరియోపజటికా' (Areopagitica) కు గల స్థానంతో, సరిసమానమైనది". అని ప్రశంసించింది. శబ్దవిన్యాసంలోనూ, వాక్యరచనలోనూ, కార్యకారణబద్ధమైన వాదంలోనూ, ఆంగ్లసంస్కృతి వికాసచరిత్రలోని, విశిష్ట ఘట్టంగా పర్వడింది, ఈ విన్నపపత్రము. ముందు ముందు పందొమ్మిదో శతాబ్దమంతటా జరగవలసిన రాజకీయ ఆందోళనకు తగిన మార్గాలనూ, విధానాలనూ, ఈ విన్నప పత్రము విశదంచేసింది.

## II. భారత పత్రికలూ-పరిమితమైన అభివృద్ధీ

ప్రభుత్వ ప్రకటనను ఉపసంహారింపజేసే ప్రయత్నం విఫలమైనందువల్ల, భారతదేశంలోని పత్రికాభివృద్ధికి భంగమేర్పడలేదు. పత్రికకుగల ప్రయోజనాన్నీ వాటికి ప్రజాభిప్రాయం పై గల ప్రభావాన్నీ ప్రజలుగుర్తించినారు. నిర్బంధాలు 1835 వరకు అమలులో ఉన్నా, భారతీయుల సంపాదకత్వంలోనూ, యూరో

పియనుల సంపాదకత్వంతోనూ పత్రికలనేకములు వెలువడుతూ వచ్చినవి. ఈ మధ్య సుమారు ముప్పై పత్రికలకు అనుజ్ఞాపత్రాలు లభించినవని, తెలుపుతూ బంధోపాధ్యాయ వాటి జాబితాను ప్రచురించినాడు. వాటిలో కొన్ని మాస పత్రికలు: తక్కినవన్నీ, వారపత్రికలే.

ప్రాచీన సంప్రదాయ వర్గపు హిందువులు ప్రకటించిన పత్రికలలో, ప్రధానమైనది, "సమాచార చంద్రిక." ఇదివరలో, 'సంబద్ కౌముదీ' పత్రికకు సహాయక సంపాదకుడుగా ఉన్న భవానీచరణ బంధోపాధ్యాయ ఈ పత్రికకు సంపాదకత్వం వహించి, రామమోహన్ రాయ్ సాగిస్తున్న 'సహగమన నిరోధ' ఉద్యమాన్ని ప్రతిఘటించి నిలిచినాడు. ప్రాచీనపరాయణతను సమర్థిస్తున్న 'ధర్మసభ'కు ఈ పత్రిక సహకరించింది. కొంతకాల మీ పత్రిక, భిన్నభిన్న పరిస్థితులకు లోనవుతూ, నడిచింది కాని, ధర్మసభ అంతరించడంతో, దీనికి పలుకుబడి నశించింది. 'సంవద్ పూర్ణచంద్రోదయ'మనే ఇంకో పత్రిక చాల సంవత్సరాల వరకూ, వెలువడుతూ వచ్చినది. సాహిత్య రాజకీయ విషయకమైన మాసపత్రికగా ఆరంభించిన ఈ చంద్రోదయ పత్రిక, కొంతకాలానికి వారపత్రిక గానూ, తరవాత త్రైవార పత్రికగానూ మారి,-కడపటికి, దినపత్రికగా రూపొందింది. ప్రసిద్ధ విద్వాంసుడూ, కవీ అయిన, ఈశ్వర చంద్రగుప్త 'సంబద్ ప్రభాకర్' అనే వారపత్రికకు సంపాదకుడు. ఈ పత్రిక కొంత కాలానికి దిన పత్రికగా మారింది. హిందూ సమాజంలో స్త్రీల హీనస్థానము, అంతస్తు,-ఇత్యాది విషయాలపై, ఈ పత్రిక ప్రాచీన సంప్రదాయాభిప్రాయాలను సమర్థించింది. రాధాకాంతదేవ్, ప్రసన్న కుమారటాగోర్, జయగోపాల తర్కాలంకార్, నవలారచయిత బంకించంద్రచటర్జీ, 'నిదర్పణ' రచయిత దీనబంధుమిత్రా,-మొదలైన వారు తమ ప్రాథమిక దశలో, ఈ పత్రికకు తమరచనలతో సహకారం నెరపుతుండేవాళ్ళు.

ఈ విధమైన సమాన భావాలతో, ఇంకా చాలా పత్రికలు వెలువడినవి కాని, అవి ఎంతో కాలం నిలవలేదు. ఉదారాభిప్రాయాలను సమర్థించిన పత్రికలలో, 'సంబద్ కౌముది' మాత్రమేకాక, 'బెంగాల్ హెరాల్డ్' అనేది కూడా ఒకటి.

ఈ పత్రిక మొదటిసారిగా 1829లో, వెలువడింది. ఆంగ్లము, పారశీకము, హిందీ, బెంగాలీ,-ఈనాలుగు భాషల వ్యాసాలనూ ఈ పత్రిక ప్రకటించేది. ఆర్. ఎమ్. మార్టిన్ ద్వారకనాథటాగోర్, ప్రసన్నకుమార టాగోర్, రామమోహనరాయ్, ఇంకా ఇతరులు దీనికి సహకరించినారు. హెరాల్డు పత్రికా నిర్వాహకుల ఆదరణలో 'బంగదత్' అనే ఇంకొక పత్రిక కూడా 1830 లో ప్రారంభమయింది.

'జ్ఞానాన్వేషణ' మనే ఇంకొక ముఖ్యమైన వారపత్రిక, ఉదారభావాలను ప్రచారం చేస్తూ, మత విజ్ఞానశాస్త్ర సంబంధములైన విషయాలను ప్రకటిస్తూ వచ్చింది. రాబర్ట్ యాంట్ జోమరీ మార్టిన్, నీలరతనదేలు, ఇద్దరూ ఈ

పత్రికకు సహసంపాదకులు. ప్రభుత్వాదేశములపై వ్యతిరేకాభిప్రాయాలు ప్రకటించినందువల్ల, ప్రభుత్వం వారు అనిష్టులై, ఈ పత్రికా సంపాదకులను వెళ్ళగొట్టి రించినారు. హిందూ కళాశాలలో శిక్షణపొంది వచ్చిన యువకులతోనూ, డెరోజియో (Derozio) శిష్యులతోనూ ఏర్పడిన 'యువక బెంగాలు' అనే సంఘం వారికి ఈ పత్రిక భావప్రచార సాధనమయింది. వారు ఎంక్వైరర్ (Enquirer) అనే ఆంగ్ల పత్రికను కూడా ప్రచురించడం, ప్రారంభించినారు. బెంగాలు పునరుజ్జీవనోద్యమానికి ఈ రెండు పత్రికలూ అగ్రనాయకత్వం వహించినవి.

'విజ్ఞానసేవధి' అనే మాసపత్రిక, విజ్ఞానశాస్త్ర సంబంధములైన వ్యాసాలను ప్రకటించేది. ప్రకృతిచరిత్రను వర్ణించే 'పశ్వావళి' అనే విజ్ఞానశాస్త్రపత్రికను, ప్రాచీన విద్యాపండితుడైన హెచ్, హెచ్. విల్సన్, నిర్వహించేవాడు.

*పారసీకపత్రికలు :* ఇతర భాషాపత్రికలకుకూడా, కలకత్తా రంగస్థలంగా రూపొందింది. అప్పటికింకా, రాజ్యవ్యవహార భాషగాఉన్న పారసీకభాష అగ్రవర్గంవారికి సుపరిచితమై ఉండినది. ఈభాషలో అనేకపత్రికలు బయలుదేరినవి. రామమోహన్‌రాయ్ ప్రచురించిన 'మిరాతుల్ అక్బర్' పత్రిక 1822 లో వెలువడింది. కలకత్తా సమాజంలో నెలకొనిఉన్న శాంతిభద్రతలనూ, అగ్రవర్గాలవారికినీ, నిమ్నవర్గాలవారికినీ సమానంగా ప్రభుత్వం శాసించిన హక్కులనూ, పేర్కొని, సమాజాన్ని విద్యావంతం గావించడమూ, సమాజ సంస్కరణగావించడమూ, ప్రజల కష్టసుఖాలను ప్రభుత్వానికి తెలియబరచడమూ అవసరమనే విషయాన్ని వివరించి.- పత్రికాప్రయోజనాలూ, ఉద్దేశాలూ ఏలాంటివో స్పష్టంగా ప్రకటించినారు పత్రికానిర్వాహకులు.

'జామే జహాన్‌నూమా' అనేది రెండోపారసీక పత్రిక. 'మున్షీ సొదాసుఖ్' సంపాదకత్వంలో ఈ పత్రికను, విలియమ్ పయర్స్ హాప్కిన్స్ కంపెనీ వారు (Messers William Piers Hopkins & Co.) ప్రచురించినారు. కొంతకాలం ఈ పత్రికకు ఈస్ట్ఇండియా కంపెనీ ప్రాపకం లభించింది. కాని, తర్వాత ఏకారణంవల్ల ఈ ప్రాపకం పోయిందో తెలియదు. 'జామే జహాన్‌నూమా' అనే పేరుతోనే, ఉర్దూసహాయపత్రికకూడా పారసీకవిభాగంతోకూడా వెలువడుతుండేది. వ్యాసాలూ, వార్తలూ మాత్రమేకాక, దీనిలో, ఇంగ్లీషు పర్షియను గ్రంథాల అనువాదాలూ, కవితారచనలూ కూడా ప్రకటింపబడేవి.

మణీరాం ఠాకూర్, మధురమోహన్‌లు స్థాపించిన 1823, 'షంసూల్ అక్బర్', సెరంపూరు మిషనరీలు ప్రచురించిన, 'సెరం పూర్ అక్బర్' (1826), వహాజుద్దీన్ సంపాదకీయంలో 'ఐనా-ఏ-సికందర్, మా హీ-అలాం-అఫ్రోజ్',లూ, (1833) లక్నోవాస్తవ్యుడైన రజాబ్ ఆలీ ప్రచురించిన 'సుల్తానుల్ అక్బర్', 'మిహ్రీమునీర్లూ, (1841) (త్రైవార పత్రిక),-మొదలైనవి ఆకాలంలో ప్రచారంలో ఉన్న, ఇతర పారసీక పత్రికలు. కొన్ని పారసీక పత్రికలు ప్రభుత్వాన్ని ఖండితంగా విమర్శించేవి. ఖండనకు అర్హములైన ప్రభుత్వ చర్యలనూ, వ్యక్తులనూ కూడా బహిరంగంగా తిరస్కరించడానికి ఈ పత్రికలు వెనుదీయలేదు.

ఆధిపత్యం ఉన్న ఇంగ్లీషు అధికారుల చర్యలపట్ల భారతీయులు తమ ఆగ్రహాన్ని ప్రదర్శించిన కొన్ని సందర్భాలు గమనించదగినవి. వేట నిమిత్తం అడవులకు పోయిన ఒక ఇంగ్లీషు అధికారి, అనుద్దిష్టంగా ఎట్లా ఒక స్త్రీని కాల్చి చంపిందీ, 'మాహీ-అలాం-అఫ్రోజ్' ప్రత్రిక ప్రచురించింది. 'బుద్ధివాక్య' మైనా (Warning) చెప్పక మాజిస్ట్రేటు ఆ అధికారిని విడుదలచేసినాడు. "దోషారోపణ కూడా చేయకుండా, ఏపాపమూ ఎరుగని ఒక స్త్రీని హత్యచేసినందుకు శిక్షకానీ, జరిమానాకానీ, విధించకుండా, సంపన్నుడైన హంతకుణ్ణి విడిచి పెట్టడంలో, న్యాయాధికారి జాతిపక్షపాతం ప్రదర్శించినాడు." అని ఈ పత్రిక వ్యాఖ్యానించింది. న్యాయస్థానాలలోనూ, అధికార కార్యాలయాలలోనూ ఉండే చిల్లరుద్యోగులు, లంచగొండితనానికి అలవాటుపడి, ప్రజలనెట్లా కష్టాలపాలు చేస్తున్నదీ, వాళ్ళనుగూర్చి చేసిన ఫిర్యాదుల నెట్లా పై అధికారులు గమనించక పోవడమూ,- మొదలైన విషయాలను గూర్చి 'సుల్తానుల్ అఖ్బార్' పత్రిక ప్రకటించింది.

బ్రిటీషు రాజ్యభాగంలోని పరిస్థితులకున్నూ ఔధ్ ప్రాంతంలోని పరిస్థితుల కున్నూ, గల తరతమ విషయాన్ని ఈ పత్రిక పరిశీలించి ప్రకటించింది. బ్రిటీషు రాజ్యంలోని భూస్వాములు దుస్థితికి లోనై ఉన్నారు. ఔధ్ ప్రాంతం మొత్తంలో జరిగిన హత్యలకంటె ఎక్కువహత్యలు ఒక్క కలకత్తానగరంలోనే జరుగుతున్నవి. ప్రతి బ్రిటీషు న్యాయస్థానంలోనూ లంచగొండితనం నెలకొని ఉన్నది. 1836లో, ఢిల్లీ స్థానిక మంత్రిగా ఉన్న విలియం ఫ్రేయరును (William Frayer) చంపిన దోషారోపణపై కరీంఖానును ఉరిదీసిన విషయంలో, ఈపత్రికగావించిన వ్యాఖ్యా నము, బ్రిటీషువారిపట్ల భారతీయుల భావము లేవిధంగా ఉండేవో వ్యక్తం చేస్తుంది. ఈ నేరం విషయంలో, లోహారు నవాబైన షంసుద్దీనును కూడా, ఇరికించింది, బ్రిటీషు ప్రభుత్వము. అతని ఉరి శిక్షను చూడడానికి ఒక వ్యక్తి కూడా,-పురుషుడు కానీ, స్త్రీకానీ, బాలుడు-బాలిక కానీ, సంపన్నుడుకానీ, దరిద్రుడుకానీ,-రాలేదు. ఈ విధంగా ఢిల్లీవాస్తవ్యులు తమను నవాబుపైగల అభిమానాన్ని, బ్రిటీషు వారి చర్యపై అసహ్యాన్ని వ్యక్తం గావించినారు.

**హిందీ పత్రికలు :** వార్తలను, వ్యాసాలను, బెంగాలీతోపాటు హిందీలో కూడా ప్రకటించడానికి, కొన్ని బెంగాలీ పత్రికలు ప్రయత్నించినవి. 'ఉదంత మార్తాండ' మనే పేరుతో మొదట సమగ్ర హిందీ వార్తాపత్రిక, 1826 లో, వెలువడింది. సదర్ దివానీ అదలత్‌లో ఉద్యోగి అయిన కాన్పూరు వాస్తవ్యుడు పండిట్ జుగల్ కిశోర్ శుక్లా, దీనిని ప్రచురించినాడు. ఈ పత్రిక ఒక చిన్న సంవత్సరం నడిచి, పిమ్మట, పోషణలేనందువల్ల ఆగిపోయింది.

1830 కడపటికి, కలకత్తాలో మాత్రమే మూడు బెంగాలీ దినపత్రికలూ, ఒక త్రై వారపత్రికా, రెండు ద్వివారపత్రికలూ, ఏడు వారపత్రికలూ, ఒక మాసపత్రికా, ప్రచారంలో ఉన్నవి, సాధారణంగా, ఆంగ్ల పత్రికలకు యూరో పియనులే చందా దారులైనా కొందరు భారతీయులు కూడా వాటికి చందా

దారులుగా ఉండేవారు. కొన్ని పత్రికలకు ప్రభుత్వంతో, ఘర్షణ ఏర్పడుతూనే ఉండేది. ప్రభుత్వపుచర్యలనే కాక, ఈ పత్రికలు, ప్రభుత్వాధికారులపై కూడా వ్యక్తిగత విమర్శలు గావించినవి. హిక్కీ విషయంలోనూ, జేమ్‌సిల్క్ బకింగ్ హాం, విషయంలోనూ, జరిగిన సంఘటన లిందుకు నిదర్శనాలు.

*పత్రికా స్వాతంత్ర్యము మళ్ళీ సిద్ధించడం :* 'బకింగ్‌హాం' పత్రిక, స్వతంత్రాభి ప్రాయాన్ని పోషించి, ప్రచారం చేయడమేకాక, ప్రభుత్వాధికారుల చర్యలను కూడా నిర్భయంగా విమర్శించేది. ఇతర పత్రికలలోని వ్యాఖ్యానాలను తన పత్రికలో ప్రకటిస్తూ, ఆ పత్రికలోని విషయసూచికను కూడా ప్రచురిస్తూ వచ్చింది. ఇతనికి రామమోహన్‌రాయ్ మైత్రీలాభం కూడా ఉన్నది. ఈయన ఆదర్శాన్ని భారతదేశ పత్రికలు అనుసరించినవి.

అధికారుల పరస్పర వివాదాలూ, బెంటింకు తీసుకొన్న ఆర్థిక చర్యలవల్ల ఏర్పడిన భావోద్రేకమూ, కారణాలుగా, గవర్నర్ జెనరల్ ఉదారాభిప్రాయా లున్న వాడే ఐనా, నిష్కర్షమైన నిర్ణయాన్ని తీసుకోలేకపోయినాడు. కలకత్తా లోని పత్రికోద్యోగులందరూ, (భారతీయులదే ఎక్కువ సంఖ్య) కలిసి, కౌన్సిలు అధ్యక్షుడైన గవర్నరు జెనరల్‌కు ఒక మహజరును సమర్పించినారు 1823లో, ప్రవేశపెట్టిన ప్రభుత్వ నియమనాన్నీ, దానికి సంబంధించిన నియమాలనూ రద్దు చేయవలసిందని వారు మహజరులో, విన్నవించుకొనినారు. పత్రికలకుసంబంధించిన శాసనం తృప్తికరంగా లేదని బెంటింకు అంగీకరించి, దానిలో మార్పులు చేస్తా నని మాట ఇచ్చినాడు. కాని, ఆ పనిని పూర్తిచేసే లోపుననే, అతడు విశ్రాంతి తీసుకొని ఉద్యోగం నుంచి విరమించడమూ, మెట్‌కాఫ్ ఆపదవికి రావడమూ జరిగింది.

బెంటింకు పాలనలో, ఇండియా వ్యవహారాలలో కొత్త విధాన మేర్పడింది. బ్రిటీషు మూలధనం వ్యవసాయంలోనూ, పరిశ్రమలలోనూ పెట్టు బడిగా ఏర్పడడమూ, ఇంగ్లాడుకు ముడిసరకులను ఎగుమతిచేసి, ఇంగ్లాండులో తయారైన వస్తువులను ఉపయోగించుకొనే ప్రధానకేంద్రంగా భారతదేశం రూపొందడమూ,-ఈ కాలంలోనే ప్రారంభమైనవి. ప్రభుత్వపు సివిల్‌సేవలోని ఉద్యోగాలలో, భారతీయులసంఖ్య అధికమయింది. 'సతీసహగమనం' వంటి సమాజ సంస్కరణలు జరిగినవి ఆంగ్లవిద్యా ప్రసారం వేగంగా జరుగుతూ, అనేక కార్య క్రమాలకు ప్రోద్బలం కలిగించింది. అనేక విషయాలపై చర్చలు జరగడమూ, వార్తా పత్రికలెన్నో వెలువడడమూ జరిగింది. ప్రాచీన భావాలూ, సంప్ర దాయంగా అనుసరింపబడుతూ ఉన్న విలువలూ, పునఃపరిశీలనకు గురియైనవి. ప్రాచీనాచార వ్యవహారాలూ, మత విశ్వాసాలూ నిశితమైన పరీక్షకు లోనైనవి. సారస్వత రూపురేఖలూ, భాషాస్వరూపము కూడా, పరివర్తనం చెందినవి.

1835 లో, మెట్‌కాఫ్, ధైర్యంవహించి పత్రికలకు స్వేచ్ఛను ప్రసాదించి, కంపెనీడైరెక్టర్ల అయిష్టతకు గురిఅయినాడు. ప్రభుత్వాధికారులలో, ఈ విష యమై రెండు వర్గాలుండినవని ఊహించవచ్చు. సర్‌థామస్ వర్ణించినవిధంగా,

ఒక వర్గంవారు, "పరప్రభుత్వమూ, పత్రికాస్వాతంత్ర్యమూ అనేవి పరస్పరమూ అసంగతములైన విషయాలు; రెండూ ఒకచోట వర్తింపజాలవు" అని భావించి నారు. "స్వతంత్రసంస్థలకారణంగా, ఆనుషంగికంగా వర్తించేది అభిప్రాయస్వాతంత్ర్యము. అది ప్రకృతి సహజంగానే స్వచ్ఛందపరిపాలనకు విరుద్ధమైనది. అందునూ, ముఖ్యంగా పరప్రభుత్వాధిపత్యాధికారాలకు విరుద్ధమైనది." అని వీళ్ళవాదము. రెండోవర్గంవారికి ఈ రకమైన నిరాశాపూరితమైన అభిప్రాయంలేదు. వారిలో సర్ ఛార్లెస్ ట్రెవిల్యన్ ఒకడు. 'ఇండోఫిలస్' అనే కలంపేరుతో (Pseudonym) తాను స్వయంగా వ్యాసాలను పత్రికలలో ప్రకటించినవాడితడు. ప్రజాభిప్రాయమనేది ప్రభుత్వోద్యోగులపై సత్ప్రభావాన్ని కలిగిస్తుందని ఇతడు నిష్కర్షగా చాటి చెప్పినాడు. ప్రజాప్రతినిధులతో ఏర్పడిన శాసనసభ, లేనంతకాలమూ, ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోవడానికీ, అధికార దుర్వినియోగంవల్ల కలిగిన నష్టాలను గుర్తించడానికీ, పత్రికలు తప్ప, వేరు మార్గంలేదు, అని ఇతడు దృఢంగా తన భావాన్ని వెలిబుచ్చినాడు.

పత్రికా స్వాతంత్ర్యంపై శాసింపబడిన నిర్బంధాలను తొలగించడం భావ్యమా? అన్న సంశయాలను పూర్తిగా తోసిపుచ్చి, మెట్‌కాఫ్, "భారతదేశ ప్రజలను అజ్ఞానాంధకారంలో శాశ్వతంగా ఉంచడంవల్లనే, ఈ దేశాన్ని మన సామ్రాజ్యంలో ఒక భాగంగా నిలుపుకోగలమన్న పక్షంలో, ఈ దేశానికి మన ప్రభుత్వం శాప ఫలమైన ఒక విపత్తువంటిది. అనిచెప్పవలసి ఉంటుంది. ఈ విధంగా అయితే మన ప్రభుత్వం తొలగిపోవడమే శ్రేయస్కరము" అని అతడు ఖండితంగా ప్రకటించినాడు

ఈ విధంగా ప్రారంభించిన స్వాతంత్ర్య భావం ప్రజాభిప్రాయాన్నీ, పత్రికలనూ అభివృద్ధి పరచింది. పత్రికలసంఖ్యాకములుగా వెలువడినవి. వాటిలో కొన్ని కొంతకాలం మాత్రమే ప్రచారంలో నిలబడ గలిగినవి. ఈ విధంగా ఉత్పన్నములైన వాటిలో, దినపత్రికలూ, పక్ష పత్రికలూ, త్రైవారాలూ, మాసపత్రికలూ, త్రైమాసిక పత్రికలూ, ఉన్నవి. ప్రథమదశలో వాటి ప్రచారం పరిమితమైనదే ఐనా, వాటి ప్రభావం చందాదారుల సంఖ్యను అధిగమించి, ప్రసారమయింది.

1835-37. మధ్యకాలంలో పత్రికలు నూటికిపైగా వెలువడినవి. వాటిలోని విషయ బాహుళ్యము సమస్తమైన భావరంగాలకూ, కార్యరంగాలకూ వ్యాప్తమైనట్టిది. మత విషయము నైతికప్రవృత్తి, ఆచారాలూ, సారస్వతము, విజ్ఞాన శాస్త్రము, ప్రపంచ వ్యవహారాలూ, చరిత్ర, ఆర్థికశాస్త్రము, పరిపాలన విధానము, మొదలైన విషయాలన్నీ - ఈ పత్రికలలో చోటుచేసు కొన్నవి.

చర్చలవల్లనూ, వాదనలవల్లనూ, ఇతరులను అంగీకరింప చేయడమే, ప్రజాస్వామ్య పరిపాలన విధానసారమైతే, భారతదేశ మీ విధానాన్ని, ఒక కళగా, నేర్చుకోవడం ఆరంభించింది. పందొమ్మిదో శతాబ్దపు ప్రథమ భాగంలోని పరిస్థితులనుబట్టి, ఈ విధానాన్ని ఎక్కువగా ఆదరించి, అభివృద్ధిపరచినవారు మధ్య

తరగతివారే కావడం తప్పనిసరి. అదే విధంగా పత్రికా ప్రచురణ ప్రచారంలో కూడా, విద్యాప్రసార విషయంలోవలెనే, బెంగాలు అగ్రగామియై నాయకత్వం వహించడం సుసంగతమైనదే.

*బొంబాయి రాజధానిలో పత్రికా ప్రచురణము :* కలకత్తాకు తరవాతనే, బొంబాయిలో వార్తా పత్రిక ముద్రణం ప్రారంభమయింది. 'బొంబాయి హెరాల్డ్, అనే ఆంగ్ల వారపత్రిక 1789 లో వెలువడింది. దీని తర్వాత ఒక సంవత్సరానికి 'బొంబాయి కోరియర్' (Bombay courier) అనే పత్రిక వెలువడటం మొదలయింది. 'బొంబాయి గెజెట్' అనే పత్రిక (ప్రభుత్వ పత్రికగా తర్వాత రూపొందింది.) 1791 లో, మొదట వెలువడింది. 1792లో, ఈ పత్రిక హెరాల్డ్ పత్రికతో మేళనం పొందింది. ఆంగ్లవార్తాపత్రికలలో, ఇండియాలోని ఆంగ్లేయులకు అవసరములైన విషయాల కెక్కువగా ప్రాధాన్యం ఏర్పడడం సహజము. ఇంగ్లాండు పార్లమెంటులోని చర్చలూ, ఇంగ్లాండులోనూ యూరోపు ప్రదేశాలలోనూ జరిగిన విశేషాలూ, ఇండియా పాలకుల ప్రణాళికలూ, ఇండియాలో నివాసమేర్పరచుకొన్న యూరోపియనుల సాంఘిక సమాచారాలూ,-ఇత్యాదులీ పత్రికలలో ఎక్కువగా ప్రచురించబడేవి. ప్రభుత్వ ప్రచురణలకూ, రికార్డుల నిమిత్తం నిలవచేయడానికీ, ప్రభుత్వంవారు, ఈ పత్రికలకు చందాదారులైనారు. కంపెనీ ప్రభుత్వంలోని విశిష్ట ఉన్నతాధికార వర్గంలో లేనివారికి ఈ పత్రికలు ఆనాటి బ్రిటీషు పరిపాలనను గూర్చి వ్యాఖ్యానించడానికి కూడా ఉపకరించినవి. ప్రభుత్వపు చర్యలపై ఈ విమర్శకు కొంత ప్రభావమేర్పడింది. భారతీయుల యాజమాన్యంలో మొదటి సారిగా ఏర్పడిన 'గుజరాతీ సమాచార్' అనే ముద్రణాలయాన్ని, 'ఫర్దూన్ జీ-మర్జబాన్' అనేవ్యక్తి బొంబాయిలో స్థాపించినాడు (1812). 1822 లో, మొదటి గుజరాతీ సమాచార పత్రిక, 'బొంబాయి సమాచార్ అనే పేరుతో, ఈ ముద్రణాలయం నుంచే, ప్రచురించబడింది. పత్రికల విషయంలో, బొంబాయి ప్రభుత్వపు దృష్టికూడా, బెంగాలులో ఉన్నట్లుగానే వ్యతిరేకంగానూ అభిమాన రహితంగానూ ఉండేది. పత్రికలపై, తీవ్రమైన, నిష్కర్షమైన నిర్బంధ విధానాలను విధించవలెనని, ముఖ్యంగా ఎలిఫిన్‌స్టన్ అభిప్రాయపడినాడు. సుప్రీంకోర్టు వ్యవహారాలపై వ్యాఖ్యానించడంవల్ల, ప్రభుత్వ మాగ్రహించి, పత్రికాసంపాదకుడైన, శి. జె. ఫేర్‌ను (C. J. Fair), భారతదేశం నుంచి వెళ్ళగొట్టింది. పత్రికా యజమానులూ, సంపాదకులూ, తమ పేర్లనూ వివరాలనూ, రిజిస్టరు చేయవలసిందిగా ఆదేశిస్తూ ప్రభుత్వ నియమనము 1825 లో, అమలులోకి వచ్చింది.

అయినప్పటికీ, వార్తాపత్రికలసంఖ్య పెరుగుతూనే వచ్చింది. తమ మతం వారిలో విద్యావ్యాప్తి గావించే ఉద్దేశంతో పార్సీలు, రెండు స్వంతపత్రికలను నెలకొల్పుకోవడం జరిగింది. వాళ్ళవలంబిస్తున్న పంచాగం విషయమై రెండు అభిప్రాయాలుండినవి. 'కడిమీ' లు అనే ఒక వర్గంవారు, తామనుసరిస్తున్న పంచాగంకాలంలో ఒక నెలతేడా ఉన్నదని వాదిస్తున్న దస్తూర్ ముల్లాఫిరోజ్‌ను

సమర్థించినారు ప్రతిపక్షవర్గంవారు 'షాహింషాహీలు', ప్రస్తుత పంచాంగాన్నే పాటిస్తూ వచ్చినారు. ఈ విషయానికి సంబంధించిన చర్చలు ఈ పత్రికలు ప్రచురించేవి.

1830 లో, నౌరోజీ దొరాబ్జీ చందారూ అనేవ్యక్తి 'ముంబయి వర్తమాన్' అనే గుజరాతీ వారపత్రికను ప్రారంభించినాడు. పదమూడు నెలల తర్వాత, అది ద్వివారపత్రికగా మార్పు పొందింది. పెస్టన్‌జీ మానెక్‌జీ మోతీవాలా అనేవ్యక్తి, 'జామ్-ఎ-జంషెద్' అనే గుజరాతీవారపత్రికను ప్రారంభించినాడు కొంతకాలానికి అది దినపత్రికగా ఏర్పడింది.

దాదాభాయి నౌరోజీ సంపాదకత్వంతో, ఖుర్షీద్‌జీకామా ఆర్థిక సహాయంతో వెలువడిన 'రాస్‌గోఫ్తార్' అనే పక్షపత్రిక, బొంబాయిలో వెలువడడం కుతూహలకరమైన విషయము. 'అక్బర్ - ఎ - సౌదాగర్' అనే పత్రికను తరువాత సంవత్సరంలో, దాదాభాయి కవాస్‌జీ స్థాపించినాడు.

బాలశాస్త్రి జంభేకర్, 1832 లో ప్రచురించిన 'బొంబాయిదర్పణం' మొదటి మరాఠీపత్రిక. వీరు ముందుగా విడుదలచేసిన 'విపరణపత్రం' లో (Prospectus) "తమ దేశప్రజలలో ఆంగ్లసారస్వత అధ్యయనాన్ని పెంపొందించడము, దేశ ఆర్థికాభ్యుదయానికీ, ప్రజల సౌఖ్యజీవితానికీ సంబంధించిన విషయాలనుగూర్చి స్వేచ్ఛగా, బహిరంగంగా, చర్చించే అవకాశాన్ని అందరికీ కల్గించడము, అనేవి మా ఉద్దేశాలు. బొంబాయి వాస్తవ్యులైన కొందరువ్యక్తులు, 'బొంబాయి దర్పణ'మనే పత్రికను ప్రచురించడానికి ఉద్యుక్తులై యున్నారు. పాశ్చాత్య సారస్వతాధ్యయనాన్ని ప్రసారం గావించడం మా పత్రిక ముఖ్యోద్దేశము."

"పత్రిక ప్రతి పేజీలోనూ, ఒక వరసలో ఆంగ్లభాషలోనూ, రెండవవరసలో మరాఠీభాషలోనూ, విషయాన్ని ముద్రించడంవల్ల పత్రిక ప్రయోజనం విస్తరిస్తుందని మా అభిప్రాయం" అని పత్రికాప్రయోజనాలు ప్రకటించినారు. చెప్పిన రీతిగా ప్రయోజనాలను సాధించడానికి ఈ పత్రిక కృషిచేసింది. ఐనా, ఈ పత్రికను ఆపివేసే సందర్భంలో, (1840) - "మరాఠీభాషలో వెలువడే పత్రికలపై అభిరుచి కలిగించడం, మత రాజకీయవిషయాలలో ఉదారభావాలను వ్యాప్తిచేసి, ప్రజలలో సామరస్యాన్ని అభ్యుదయాన్ని సాధించడం,- అనే ప్రయోజనాలు ఈ పత్రికను స్థాపించడంలో ఉద్దేశించి యున్నా"మని వివరించినారు.

1840 లో, 'దిగ్దర్శన్' అనే మాసపత్రికను బాలశాస్త్రి అనేవారు ప్రారంభించినారు. విద్యా, సాంస్కృతిక, విజ్ఞానశాస్త్ర విషయాలను చర్చించడం ఈపత్రిక ఉద్దేశము. సుమారు అదే సమయంలోనే ఈయన సహచరుడైన, భావు మహాజన్ 'ప్రభాకర్' పత్రికను ప్రారంభించినాడు. 1842 లో మిషనరీలు 'ధ్యానోదయ' పత్రికను వెలువరచినారు. 'ధ్యాన ప్రకాశ్,' పూనా నుంచి వెలువడిన మొదటి పత్రిక (1849).

***మదరాసు రాజధానిలోని పత్రికలు :*** మదరాసు రాజధానిలో, మొదటిసారిగా వెలువడిన ఆంగ్ల పత్రిక 'మదరాసు కోరియర్' (1785). ప్రభుత్వము

దీనిని ఆదరించి, తమ అధికార ప్రచురణలను ఇస్తూవచ్చింది. ఆ పత్రికకు సంపాదకుడైన బాయిడ్ (Boyd) ఈ పత్రికతో సంబంధం వదులుకొని, 'హర్‌కారు' అనే పత్రికను ప్రారంభించినాడు. ఆ తర్వాత, 1797 లో, 'మదరాసు గెజెట్' అనే వారపత్రిక స్థాపితమయింది. ఆ పిమ్మట, శీఘ్రకాలంలోనే ఇండియన్ హెరాల్డ్, అనే అనధికార పత్రిక వెలువడింది. ఇతర ప్రాంతాలలోని ప్రభుత్వాలకు పత్రికలపై కలిగిన సంశయ భావమే మదరాసు ప్రభుత్వానికి కూడా కలిగింది. అనుజ్ఞా పత్రాల ద్వారా (Licensing), సెన్సారు ద్వారా, వీటిని తమ అధికారానికి నిర్బంధ పరచి, తమకు లొంగని సంపాదకులను దేశం నుంచి వెళ్ళగొట్టడం జరిగింది. మదరాసులో పత్రికాభ్యుదయము, మందగతిలో సాగింది. 1858 వరకూ దేశభాషా పత్రికలు స్వల్పమే. 1877 నాటికి, ఇరవైయ్యారు పత్రికలు ప్రచారంలో ఉండేవి. ఉర్దూ, పారసీక, భాషలలోకూడా, ఎన్నో పత్రికలు మద్రాసునుంచి వెలువడినవి. ఇవి అజల్ ఆల్ అక్బర్, తసీర్ ఆల్ అక్బర్, అఫ్తాబీ అలంతాబ్, జమా ఆల్ అక్బర్,- అనేవి.

***ఉత్తరభారతంలోని పత్రికలు :*** ఉత్తరప్రాంతాలు బ్రిటీషువారి అధీనంలోకి ఆలస్యంగా వచ్చినవి. 1820 తర్వాతనే, ఆ ప్రాంతాలలో, పత్రికలు వెలువడడం ప్రారంభమయింది. కాన్‌పూరు, ప్రధానమైన బ్రిటీషు సైనికకేంద్రంగా ఏర్పడింది. 'కాన్‌పూర్ అడ్వర్టైసర్' 1822 లోనూ, 'ఆమ్నిబస్' 1828 లోనూ, స్థాపింపబడినవి.

యునైటెడ్ మ్యాగజీన్' మీరట్‌నుంచి 1835 లో వెలువడింది. 'డెల్లీ గెజెట్' అనే వారపత్రిక 1833 లో, మొదటిసారిగా వెలువడింది. దీన్ని అనుసరించి, 'ఢిల్లీ అడ్వర్టైసర్' 1833 లో వెలువడి, తర్వాత (1856) తన పేరును 'ఇండియన్‌టైమ్స్' అని మార్చుకొంది. 'రెకార్డర్' అనే పత్రికను బనారస్ ప్రచురించింది.

ఈ ప్రాంతంలో, ఉర్దూ పారసీకభాషలలో, ఎన్నో పత్రికలు ప్రచారంలోకి వచ్చినవి. జుబ్దాత్-ఉల్-అక్బర్ (1823), మెహ్రీమునీర్ (1841), సిరాజ్-ఉల్-అక్బర్ (1841), అహసాన్-ఉల్-అక్బర్ (1844) మొదలైనవి పారసీక పత్రికలు. ఆగ్రాఅక్బర్, ఢిల్లీ అక్బర్, సయ్యాద్-ఉల్-అక్బర్, కరీం-ఉల్-అక్బర్, అసద్-ఉల్-అక్బర్, బనారసీ అక్బర్, అఫ్తాబీహింద్, కోహినూర్, మొదలైనవి ముఖ్యములైన ఉర్దూపత్రికలు.

1848 నాటికి, పశ్చిమోత్తర ప్రాంతాలలోనూ, పంజాబులోనూ, సుమారు పద్దెనిమిది ముద్రణాలయాలు వెలసినవి. వీటిలో రెండు తప్ప, తక్కినవన్నీ వార్తాపత్రికలను ప్రకటిస్తూ ఉన్నవే. పారసీకపత్రికలలో, సిరాజ్-ఉల్-అక్బర్ ఒక విధంగా ఢిల్లీ సార్వభౌముని దర్బారు గెజెట్‌గా ఉండినదని చెప్పవచ్చు. మున్షీ వజీజ్ ఆలీఖాన్ యాజమాన్యంలో ప్రచురించబడుతూవచ్చిన 'జుబాత్ - ఉల్ - అక్బర్', బాధ్యతా, వైదుష్యమూకూడా చూపిన పత్రిక. ప్రాచీన సంప్రదా

యాలను జాగ్రత్తతోనూ, సంయమనంగల భాషలోనూ ప్రకటించేది.

తక్కిన దేశభాషాపత్రికలలో, మున్షీ హర్‌సుఖ్‌రాయ్ పంజాబులో ప్రారంభించిన 'కోహినూర్' పత్రిక ప్రధానమైనది. బనారసునుంచి వెలువడిన 'బాఘ్-ఓ-బనారస్' పత్రికలో వైద్యము, చరిత్ర, జ్యోతిష్యము, తదితర విషయాలు చర్చించబడుతూ ఉండేవి. 'నూరుల్ అక్బర్' అనే ఉర్దూ పత్రికా, 'బుద్ధిప్రకాశ్' అనే హిందీ పత్రికా,- ఈ రెండున్నూ, మున్షీ సదాసుఖ్‌లాల్ నిర్వహణకింద ప్రచురితములైనవి. ఈ పత్రికలు అవలంబించిన పరిష్కరణ మార్గాలూ, సంపాదకీయాలూ, మిక్కిలి సమర్థతతో నిర్వహింపబడినవి.

మత్లా—ఉల్-ఉలం ముద్రణశాలనుంచి ప్రచురించబడిన, 'కిరన్-ఉస్-సదాయిస్,' 'ఫవాద్-ఉన్-నజీరిన్' అనే మాసపత్రికలు రెండూ పేర్కొనదగినవి. ఈ పత్రికలలో చాల భాగంలో పాశ్చాత్య విజ్ఞానానికి ప్రాధాన్యమివ్వడం జరిగింది.

పత్రికలు నిర్వహించిన కార్యభారం రెండు ప్రయోజనాల నుద్దేశించినది. ప్రభుత్వం యొక్క పాలనవిధానాలనూ, అధికారచర్యలనూ ప్రజాభిప్రాయాల కనుగుణంగా దిద్దడానికి ప్రయత్నించడమూ, ప్రజలలో విద్యావ్యాప్తి గావించి వారికి జ్ఞానోదయం కలిగించడమూ,- అనేవి రెండూ, పత్రికల ఆశయాలు.

## III. పత్రికలూ-ప్రభుత్వము

మొదటి రోజుల్లో పత్రికలు ప్రభుత్వపరిపాలనను గూర్చి విమర్శకు పూనుకోలేదు. కాని, కారన్‌వాలీసూ, అతని తరవాత వచ్చిన అధికారులూ, అవలంబించిన విధానాలు ప్రజలకు కష్టం కలిగించినవి. దేశీయప్రభువుల పాలనలో ప్రజలను భవిస్తూవచ్చిన ఆదారప్రాపకాలను తొలగించడం భరించరాని కష్టమయింది. అత్యధికంగా శుల్కభారాన్ని మోపిన ప్రభుత్వవిధానమూ, ముక్తశుల్కంగా (Rent free) అనుభవిస్తున్న పట్టాభూములను ఒక్కసారిగా, వివేచనరహితంగా ప్రభుత్వం లాగివేయడమూ, ప్రజలలో విస్తారంగా అసంతుష్టినీ, కష్టాలనూ కలిగించినవి. ఈ కష్టాలకుతోడుగా, దేశపు సరిహద్దుప్రాంతాలలో కలిగిన పరిస్థితులు దేశంలో అస్వాస్థ్యాన్ని ఎక్కువచేసినవి. ఇరేనియన్ సైన్యాలు హెరాట్‌ను ఆక్రమించడం, నేపాలు బర్మాలపై దాడులు జరపడం, నేపాలు దర్బారు భారతదేశప్రభువులతో రహస్యంగా సంప్రదింపులు జరపడం,- మొదలైన ఉదంతాల ప్రభావం దేశంపై ప్రసరించింది.

ఈకల్లోల పరిస్థితి దేశభాషా పత్రికలలో ప్రతిఫలించసాగింది. ముఖ్యంగా, ఉర్దూపారసీక పత్రికలు ఈ విషయాలను ప్రచురించి, వ్యాఖ్యానించినవి. 'జామే-జహాన్-నూమా' పత్రిక, భాషలో ఆత్మసంయమానాన్ని పాటిస్తూ, ప్రభుత్వాన్ని నిస్సంకోచంగా విమర్శించి, ఇతర పత్రికలకు దారిచూపింది. 'రిఫార్మర్' పత్రికలోని వ్రాతలన్నీ ప్రభుత్వపు చర్యలపై గావించిన ఆక్షేపణలతో నిండిపోయినవి.- ఈ పత్రికా ప్రకటనలనుగూర్చి, 1845 లో, ఈ కింది విధంగా వర్ణింపబడినది:—

"రాజకీయవిషయాలలో, 'రిఫార్మర్' పత్రిక బ్రిటీషు ప్రభుత్వంపట్ల, వివేచన రహితమైన రభసతోనూ, బద్ధమత్సరంతోనూ, ప్రచార మారంభించింది. ఆ మూలాగ్ర సంస్కరణాతివాదం (Ultra Radicalism) కూడా, ఎన్నడూ అవలంబించని ఉచ్ఛృంఖల విహారానికి ఈ పత్రిక పూనుకొన్నది. ఏ మానవ వర్గానికి చెందని, అధమ జాతులవారి అల్పజనాధిపత్యము, వారి గణరాజ్యతంత్ర విధానము, చేరి దివ్యౌపధంగా సిద్ధించి, దేశంలో పాతుకొనిపోయిన సర్వ రోగాలనూ, హరించివేస్తుందని, కనుక అట్టి ప్రభుత్వం ఏర్పడవలెననీ, ఈ పత్రిక సూచిస్తున్నది."

ఏమైనా మొత్తంమీద, భారతదేశ పత్రికలు ప్రభుత్వంపట్ల గౌరవం చూపుతూ విమర్శవిషయంలో, మితంగానే ప్రవర్తించినవి. కాని, సమచిత్తతకు భంగం కలిగించిన తీవ్రపరిస్థితులలో, నిస్సంకోచంగా విమర్శించిన సందర్భాలూ లేకపోలేదు. హిందువు, క్రిశ్చియన్ మతంలో చేరడంతో, కుటుంబపు ఆస్తిపై హక్కును గోల్పోయేవాడు. అది, ఆనాడు అమలులోఉన్న చట్టము. ప్రభుత్వము ఈ చట్టాన్ని మార్చడానికి పూనుకోవడం ప్రజలలో ఆందోళనను కలగజేసింది ఈ పరిస్థితులలో పత్రికలు ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించక తప్పదు. ఈ విషయమై ప్రజలు, తమ ఆక్షేపణను ఖండితంగా వ్యక్తంజేస్తూ ప్రభుత్వానికొక మహజరును పంపుకోవడం జరిగింది. (1845), కాని ఫలితం లేకపోయింది. ప్రజలలో సంక్షోభం చెలరేగింది. వీటిని గూర్చి ప్రచారంగావించిన పత్రికలు "దుర్భాషాపూరితములనీ, ఆధిపత్యంవహించిన ప్రభుత్వాన్నీ, అధికారులనూ,- సద్వులనూ- నిందించడానికి పూనుకొన్నవనీ", అధికారులు ఖండించినారు. "ప్రభుత్వానికి ప్రతిష్ఠాభంగాన్నీ, మానహానినీ కలిగించే వ్యాసాలను ప్రకటించి, ప్రజలలో విప్లవమేర్పడడానికి కూడా, పత్రికలు అవకాశం కల్పిస్తున్నవి". అన్న అభిప్రాయం కూడా వెలిబుచ్చినారు.

ఈఅభిప్రాయాలన్నీ, అతిశయోక్తులు, అనవసరంగా భయాన్ని రేకెత్తించే ప్రయత్నాలు. వాస్తవానికి, ఆనాటికింకా రాజకీయాలలో పత్రికల పలుకుబడి పరిమితమై మాత్రమే ఉన్నది. కలకత్తా నగరంలో, పత్రికల చెలామణి స్వల్పమనీ, ఇతర ప్రదేశాలలో, ఇంతకంటెనూ అల్పమనీ, ప్రభుత్వం ఎరుగకపోలేదు. భూస్వాములు పత్రికల విషయాన్నే పట్టించుకోలేదు. పూజాపునస్కారాలు జరపడానికీ, బ్రాహ్మణులకు దానాలియ్యడానికి ధారాళంగా ఖర్చుపెట్టే భూస్వాములు, నెలకు రూపాయన్నర చందాఇచ్చి, పత్రికను కొనడానికి వెనుదీసేవారు. ఇక, రాజకీయవిషయాలేవీ తెలియని అజ్ఞాననిద్రలో ఉన్నవారు సామాన్య ప్రజలు. కనుక, ప్రజాభిప్రాయానికి దేశంలో భావైక్యతలేదనీ, అందువల్ల "వివిధ మత, కుల, వర్గాల ప్రజలందరూ, ఏకమై పత్రికలతో సహకరిస్తారని, భయపడడానికి అవకాశంలేదనీ," ప్రభుత్వం విశ్వసించింది.

ఐనా, సమాజాభిప్రాయాలపై పత్రికలప్రభావం క్రమంగా వృద్ధికాసాగింది. 'ఫ్రెండ్ ఆఫ్ ఇండియా' పత్రిక 1838, నవంబరు 8వనాటి ప్రచురణంలో, "పత్రి

కాప్రభావం భారత నాగరకతా వ్యాప్తికి ప్రబలసాధనంగా ఏర్పడింది. యుగాలుగా సుప్తస్థితిలో ఉన్న దేశాన్ని బాగుపరచే విధానంలో ఆ జాతిని, నిద్రనుంచి మేల్కొల్పడం ప్రథమ ప్రయత్నము. దానిని సాధించడంలో, పత్రికల కింత వరకూ లేని సామర్థ్యం ఈనాటికేర్పడింది." అని లిఖించబడింది.

ప్రభుత్వపు నిర్బంధాలకులోనై ఉన్నకాలంలోకూడా పత్రికలు, ప్రజల ప్రయోజనాలకు అత్యంతమూ సంబంధించిన విషయాలనుగూర్చి చర్చిస్తూ, తమ పలుకుబడిని వృద్ధిపరచుకొన్నవి. కాని, బ్రిటీషు ప్రభుత్వపు ప్రథమదశలో, మధ్య తరగతివారు, బ్రిటీషువారి అత్యుచ్చస్థితికి ఎదురుచెప్పడానికి సాహసించినవారు కారు. కనుక, రాజకీయాలకూ, పరిపాలన వ్యవస్థకూ సంబంధించిన విషయాలు ఆనాటి పత్రికలకు చర్చనీయాంశాలు కాలేదు. ప్రభుత్వ విధానాలనూ, చర్య లనూ, వ్యాఖ్యానించడంలో, సంపాదకులు జాగ్రత్తవహిస్తూ ఉండేవారు. కాని, మతము, సాంఘికాచారాలూ, విద్య,- మొదలైన సమస్యలనుగూర్చి, ఔత్సు క్యంతో, చర్చిస్తూ, వివిధాభిప్రాయాల గుణాగుణాలను ప్రదర్శిస్తూ వచ్చినారు. భారతదేశ వివిధ ప్రాంతాలలో జరుగుతున్న ఉదంతాలపై వ్యాఖ్యానం గావిస్తూ, ప్రజలలో వాటినిగూర్చిన జ్ఞానాన్ని ఉద్బోధించినారు ఏషియా ఖండంలోని ఇతరదేశాలలోనూ, యూరోపు దేశాలలోనూ, జరుగుతున్న ఉదంతాలనూ, అక్కడి పరిస్థితులనూ, వివరంగా ప్రచురించడంవల్ల, మనదేశానికీ వాటికీగల తారతమ్యాన్ని గుర్తించే అవకాశం ప్రజలకు ఏర్పడింది.

కంపెనీ తరువాతకాలంలో, దేశపత్రికలు,- అందునూ ముఖ్యంగా పార సీక పత్రికలు,- నిస్సంకోచంగా, ఖండితంగా వ్యవహరించసాగినవి. ఇతర పత్రిక లన్నీ సాధారణంగా ప్రభుత్వంపట్ల విశ్వాసనిష్ఠనూ, మార్దవాన్ని, సహానభావాన్ని ప్రదర్శిస్తుండగా, జామే-జహాన్-నూమా మాత్రము అందుకు విరుద్ధంగా ప్రవ ర్తిస్తున్నదని ఫ్రెండ్ ఆఫ్ ఇండియా పత్రిక ఆక్షేపించింది. దేశంలోని పట్టణ ప్రాంతాలలో ఈ పత్రికకు అధికప్రచారము ఉండేది. భారతీయప్రభువులూ, సర్దారులూ, దీనికి చందాదారులై ఉండేవాళ్ళు. ఈ పత్రికను తక్కిన దేశపత్రిక లతో పోల్చి విమర్శిస్తూ, ఫ్రెండ్ ఆఫ్ ఇండియా పత్రిక, 1840లో, "జామే-జహాన్-నూమా- పత్రిక హితవాదియై ప్రస్తుతపాలకులపై నీతి బాహ్యమైన దాడి సాగిస్తూ ఉన్నదని, ఘోషపెట్టింది.

బొంబాయి పత్రికలను గూర్చి వ్యాఖ్యానిస్తూ ఫ్రెండ్ ఆఫ్ ఇండియా పత్రిక, 1850 లో "ఇండియా పరిస్థితులనుగూర్చి తమకు తెలిసినంత సమగ్రంగా, దేశీయ పత్రికోద్యోగులకు కూడా తెలిసిఉన్నదనే భ్రాంతికిలోనై, ఆంగ్ల పత్రికో ద్యోగులు దేశీయుల వ్రాతలను నిరక్ష్యంగా చూపుతూ, ఎత్తి వ్రాస్తూఉండడం, ఈ కాలంలో జరుగుతున్న వింతలలో ఒకటి." అని హేళనగా వ్యాఖ్యానించింది.

కాలం గడచిన కొద్దీ, దేశపత్రికల పలుకుబడి హెచ్చుతూ వచ్చిందనీ, ఆ పత్రికలోని వ్రాతలు ఎక్కువ సమతనూ, స్వాస్థ్యాన్ని, హేతువాదాన్ని అనుసరిస్తూ వచ్చినవనీ, దీనినిబట్టి తెలుస్తుంది. పందొమ్మిదో శతాబ్దపు పూర్వా

ర్ధంలో జరిగిన దేశపత్రికల చరిత్రనుగూర్చి పునర్విమర్శచేస్తూ, విలియం డిగ్బీ, "భారతదేశ పత్రికలు ప్రజల సంసర్గసాహచర్యంలో చరిస్తూ, ప్రజల విశ్వాసాన్ని సంపాదించుకొన్నాయనీ, ఈ పత్రికలో వ్యక్తమైన భావాభిప్రాయాల వెనుక తీవ్రమైన ప్రజాభిప్రాయశక్తి ఉన్నదని గ్రహించవలసి ఉన్నదనీ" వివరించినాడు. దేశీయ పత్రికోద్యమం బాల్యావస్థలో ఉన్నదనడం వాస్తవమే. ఐనా, అసాధారణమైన అభ్యుదయశక్తి దీనిలో, నిహితమై ఉన్నదనడం నిజము. పరోక్షంగా, ఈ పత్రికల ప్రభావం అనంతమైనది "అని ఆయన తనభావిదృష్టిని సూచించినాడు.

సమాజంపై పత్రికాప్రభావం గాఢంగా ప్రసరించింది. సమాజజీవితాన్ని విషక్రిములవలె మూలమట్టంగా నశింపజేస్తున్న దురాచారాలను బైటపెట్టి, ప్రజల మనస్సాక్షిని మేల్కొల్పి, దురాచారాలవల్ల కలిగిన దుష్ఫలితాలను రూపుమాపడానికిన్నీ, వ్యక్తుల పాపచర్యలను అరికట్టడానికిన్నీ, పత్రికలు సహకరించినవి

1857-58 నాటి విప్లవకాలంలో, రాజధానీనగరాలలోని పత్రికలు విప్లవ చర్యకు సానుభూతిని ప్రదర్శించలేదు. ఈ పత్రికల సంపాదకులు, నూతన విద్యావిధానంలో శిక్షణ పొందినవారు కావడంవల్ల ప్రజాభ్యుదయానికి ఆంగ్లసంస్థలు అవసరములని వాళ్ళు విశ్వసించినారు. కాని ఢిల్లీ, పంజాబు, ప్రాంతాలలోని ఉర్దూ పారసీకపత్రికలు ముఖ్యంగానూ, ఇతర ఉర్దూ పారసీకపత్రికలున్నూ, విప్లవసంబంధములైన వృత్తాంతాల ప్రసారంచేసి, బ్రిటీషువారిపట్ల విరుద్ధభావాలను ఉద్బోధించి, ప్రజలు పరప్రభుత్వానికి ఎదురుతిరిగేటట్లు చేసినవి. 1857 జూన్ 13 వ తేదీ జరిగిన శాసన నిర్మాణసభలో మాట్లాడుతూ, క్యానింగ్,- "సమాచారాలనూ వృత్తాంతాలనూ దేశప్రజల కందించే నెపంతో, పత్రికలు ఎంత విస్తారంగా, ఎంత సాహసంతో విద్రోహ భావాలను ప్రజల హృదయాలలో ప్రవేశింపజేసినవో, అన్న విసయమందరికీ గ్రాహ్యమైందని కానీ, తెలిసిందిఅని కానీ నాకు నమ్మకం లేదు. ఈ ద్రోహచర్య ప్రయత్నపూర్వకంగానూ, చాతుర్యంతోనూ కృత్రిమ, కుతంత్రాలతోనూ జరిగింది" అని వివరించినాడు.

# 6
# సంఘసంస్కరణము

## I. ఆధునిక సంస్కృతి ప్రభావము

భారతదేశ రాజకీయ ఆర్థిక సాంఘిక వ్యవస్థలపై, బ్రిటీషు ప్రభుత్వపు పరిపాలన విధానమూ, ఆర్థిక విధానమూ ఏవిధమైన పరిణామాన్ని కల్గించిందో, పూర్వప్రకరణాలలో వివరింపబడింది. అట్టి పరిణామాల్లో నూతన మధ్యతరగతి వర్గం ఏర్పడడం ఒకటి. పాశ్చాత్య విజ్ఞానాన్ని ప్రసారంచేసే పాఠశాలలు, కళాశాలలు, సంస్కృతి సంఘాలు, పుస్తకాలు, పత్రికలు, మొదలైన విద్యావ్యాపక సంస్థల మూలంగానూ, మిషనరీలు, వర్తకులు, అధికారులు, మొదలుగా గల పాశ్చాత్యుల ప్రత్యక్ష సంసర్గ సాహచర్యాల మూలంగానూ, ఈ వర్గం వారెట్లు అధునాతన దృక్పథాన్ని సంపాదించుకొన్నదీ, అనే విషయం కూడా వివరింపబడింది.

సంస్థాసంబంధి, భావనాసంబంధి,-అను ఈ రెండు విధములైన ప్రభావాలు కూడా, పరిపాలక వర్గంవారు అవలంబించిన అభిప్రాయాలనూ, దృక్పథములనూ, దృఢనిశ్చయాలనూ బట్టి ఏర్పడినవి. సివిల్ మిలిటరీ అధికారులూ, గవర్నరులూ, గవర్నరు జెనరలులూ, కంపెనీడైరెక్టర్లూ, బోర్డ్ ఆఫ్ కంట్రోలుపై అధ్యక్షత వహించిన బ్రిటీషుమంత్రులూ, బ్రిటీషుమంత్రి మండలి, పార్లమెంటు, భారతదేశ వ్యవహారాలలో ఆసక్తివహించిన ఇంగ్లాండు పౌరులూ, వీరందరూ కూడా, తమ అభిప్రాయాలనూ, నిశ్చయాలనూ, ముందుగనే స్థిరపరచుకొని, భారతదేశ వ్యవహారాల పరిష్కారానికి బూనుకొన్నారు. కనుకనే, ఈ అభిప్రాయాలే సహజంగా, ప్రభుత్వ వ్యవహారాలలో ప్రవేశించి, ప్రభుత్వ విధానాలనూ, వాటి స్వభావాలనూ నిర్ణయించినవి.

ఈ అభిప్రాయాలు ప్రధానంగా సామ్రాజ్య సార్వభౌమ ప్రయోజనాల నుద్దేశించి, ఏర్పడినవి. కావున, ఇండియాలోని బ్రిటీషు అధికారుల కార్యాచరణము లన్నిటికినీ, అవే, కారకములై, వారి వ్యవహారములన్నిటికినీ, ప్రధాన ప్రోద్బల ములై, బ్రిటీషు పరిపాలనను నడుపుతూ వచ్చినవి. స్వప్రయోజనమిట్లు అత్యధిక ప్రాబల్యం వహించినప్పటికీ, భారతీయ సంస్కృతి నాగరకతలు భారతీయ శీల స్వభావములు, పాలిత ప్రజలపట్ల పాలకుల కర్తవ్యాలు, ప్రభుత్వ శాసన విధాన ములు, దాని చర్యలు - అనే విషయాలపై భిన్నాభిప్రాయములతో నుండిన వ్యక్తులూ, వర్గాలూ లేకపోలేదు.

ఈ విషయంలో ఏర్పడిన వివిధ అభిప్రాయభేదాలు ఆయా సందర్భాలలో వివరింపబడగలవు. ఐనా, ప్రభుత్వ పరిపాలన విధానము నిర్ణయంకావడంలో, ఎట్టి అభిప్రాయమూ, ఉద్దేశమూ కారణములైనవో, వాటిని వివరించడం, అవసరము.

పద్దెనిమిదో శతాబ్దంలో జరిగిన వర్తకానికి వాణిజ్యసూత్రాలను వర్తింపచేయడంవల్ల జరిగిన పరిణామమే బ్రిటీషువారి భారతదేశాక్రమణము. ఆంగ్లజాతి శక్తిని అభివృద్ధిపరచడమూ, అవసరమైన సందర్భాలలో యుద్ధచర్యతోనైనా వర్తకాన్ని విస్తరింపజేయడమూ, అనే రెండునూ, బ్రిటీషువారి వాణిజ్యవాదానికి ఆశయాలు. వర్తకప్రయోజనానికై భారతదేశాన్ని జయించడంతో, బ్రిటీషు ఆర్థికవ్యవస్థ యొక్క లాభప్రయోజనార్థం భారతదేశాన్ని ఉపయోగించుకోవడం కూడా, అనుషంగికమైన పరిణామంగా ఏర్పడినది. సామ్రాజ్య ప్రయోజనాన్ని సాధించడమే, భారతదేశంలో బ్రిటీషుపరిపాలన యొక్క ప్రధానోద్దేశము.

ప్రథమదశలో,- అనగా, బెంగాలు ఆక్రమణకు తర్వాతిరోజులలో, కంపెనీ ఉద్యోగుల స్వంతలాభమూ, సామ్రాజ్యప్రయోజనమూ ప్రధానములై, కంపెనీ లాభం కూడా దెబ్బతిన్నది. విశృంఖలంగా అపారమైన సంపాదనకు వీరు పూనుకొన్నారు. తత్కారణంగా భారతదేశంలో, కల్లోల పరిస్థితులేర్పడినవి. ఇంగ్లాండులోని పాలకవ్యవస్థ కూడా, నీతిభ్రంశమయ్యే అవకాశమేర్పడింది.

దూరదృష్టిలేని, ఈ అరాజక సామ్రాజ్యతత్త్వాన్ని తొలగించి, బర్క్ (Burke), ఆస్థానంలో, బాధ్యతాయుతమూ, ఆత్మసంయమనయుతమూ, ఐన, సామ్రాజ్యతత్త్వాన్ని నెలకొల్పి, ఇంగ్లాండుదేశానికి క్షేమకరమైన దీర్ఘకాల ప్రయోజనాన్ని సాధించినాడు. వివిధ విషయాలలో జరిగిన పరివర్తనమూ, ఈ అవస్థా, రెండూ ఒకేకాలంలో జరిగినవి. వాణిజ్య తత్త్వంనుండీ పారిశ్రామిక తత్త్వానికీ, వర్తకరక్షణ విధానంనుంచీ వర్తకస్వేచ్ఛకూ, కులీన ప్రభుత్వంనుంచీ మధ్యతరగతి ప్రభుత్వానికీ, పద్దెనిమిదోశతాబ్దపు నైతికదౌర్బల్యము నుంచీ నైతికసంస్కరణకూ, మత ఔదాసీన్యంనుంచీ మతౌత్సుక్యానికీ,- ఈ విధంగా పరివర్తనం ఆకాలంలో జరిగింది. సుస్థిరమైన పరిపాలన యంత్రాంగాన్ని దేశంలో నెలకొల్పి, ఇండియా ఆర్థికవ్యవస్థను బ్రిటీషువారి ఉద్దేశాల కనుగుణమైన విధంగా దిద్ది, ఇంగ్లాండుయొక్క ఆర్థికప్రయోజనాలను సాధించడమే, ఈ అవస్థాకాలంలో, పరిపాలకుల ప్రధానాశయమయింది. కంపెనీవారి సలహాదారుల వర్గంలో ప్రధాన అధికారపదవిలో నుండిన (1794-1823) ఛార్లెస్‌గ్రాంట్ ఆర్థికసామ్రాజ్య సూత్రాన్ని ఈ క్రిందివాక్యములో వివరించినాడు. "తన సాధారణ ప్రయోజనాలను సమగ్రదృష్టితో యోచించి, మొత్తంమీద ఉత్తమమైనదని సమ్రాట్టు ప్రభుత్వము (Paramount state) నిర్ణయించిన విధానానికి, అధీన దేశం, లోబడియుండడము సరియైనపద్ధతి".

సామ్రాజ్యతత్త్వానుగుణమైన ఉత్సాహప్రకృతికూడా, ఈ విధానంతో

సహా, రాజ్యవిస్తరణోద్యమంలో వ్యక్తమయింది. కలహాన్ని పురికొల్పి, తామె భారతదేశ ప్రభువులపై యుద్ధానికి పూనుకొని, విశాలభూభాగాలను తమ రాజ్యంలో కలుపుకొనిరి. భారతదేశము, ఇంగ్లాండుకు అవసరములైన ముడి సరకులను ఎక్కువగా ఉత్పత్తిచేయడమూ, ఇంగ్లాండులో తయారై వచ్చిన వస్తువులను భారతదేశము ఎక్కువగా ఉపయోగించుకోవడమూ, జరిగినప్పుడే, తాము ఈ దేశంవల్ల ఎక్కువ లాభాలను సంపాదించుకోగలరు. అట్టి పరిస్థితు లేర్పడడానికి, దేశంయొక్క ఆర్థిక, నైతిక పరిస్థితిని పెంపొందించడమూ, భూమి పన్నుల విధానాన్ని ఏర్పరచడమూ, న్యాయపరిపాలననూ, విద్యావిధానాన్ని-అనగా క్రమబద్ధమైన పరిపాలన వ్యవస్థను - ఏర్పరచడమూ అవసరమని బ్రిటీషు ప్రభుత్వము గుర్తించింది.

తరువాతి అవస్థలో, కంపెనీ అనుభవంలోఉన్న ఏకస్వామ్య వాణిజ్యవిధానాన్ని పూర్తిగా తీసివేసి, తాటస్థ్యనీతి (Laissez faire) పద్ధతిని ప్రారంభించిరి. ఐనా, ఇంగ్లాండు ఆర్థికవ్యవస్థకు అనుకూలములైయున్న విషయములందుమాత్రమే ఈ తాటస్థ్యనీతిని అవలంబించిరి. ప్రభుత్వము ప్రవేశించడం అవసరమని తోచిన సందర్భాల్లో ఈ నీతిని వర్తింపనీయక, వెనుకకు త్రోసిపెట్టిరి. ఉదాహరణకు,-ఇంగ్లాండునుంచి ఇండియాకు దిగుమతియైన బ్రిటీషు వస్తువులపై సిమాశుల్కము తగ్గింపబడింది. కాని, ఇండియానుంచి ఇంగ్లాండుకు ఎగుమతిచేసే సరకులపై అధికమైయున్న శుల్కం తగ్గించలేదు. పరిశ్రమలలో వ్యక్తుల స్వంత ఉద్యమానికి ప్రభుత్వము అడ్డుతగులలేదు. కాని, ఇంగ్లాండుకు అవసరములైన, సరకుల ఉత్పత్తిని ఎక్కువచేసే కార్యక్రమానికి ప్రభుత్వము పోత్సాహమిచ్చింది.

ఆంగ్ల - అమెరికా యుద్ధకాలంలో, (1812-14) ఈస్టిండియాకంపెనీ, ఇండియాలో ప్రత్తిపంటను విస్తరింపజేసి, ఉత్తమతరగతి ప్రత్తినికూడా పండింప జొచ్చింది. తర్వాత అస్సాములో తేయాకుతోటలను పెంచే ఉద్యమానికి కంపెనీ పూనుకొని, కొంతకాలానికి వాటిని స్వంతవ్యాపారదార్లకు అప్పగించింది. అదేవిధంగా, రైల్వేలో పెట్టుబడిపెట్టడానికి స్వతంత్రవ్యక్తులను ప్రోత్సహించడానికికై, ఐదవశాతం లాభభాగానికి హామీ ఇచ్చింది. ఈ విధానంగా, రెండు విధానాల్లోనూ, భారతప్రయోజనాలకు నష్టంకలిగించిరి కంపెనీప్రభుత్వం వారు. వాణిజ్యవాదాన్ననుసరించి, బ్రిటీషు పరిశ్రమలకు భారతదేశం పోటీ రాకుండాచేసి, బ్రిటీషువారిని రక్షించిరి. తాటస్థ్యనీతిననుసరించి, భారతపరిశ్రమలకురక్షణనివ్వక, బ్రిటీషుపారిశ్రామికులనే రక్షించిరి.

ఈ అవస్థ, 1857 విప్లవం వరకూ ప్రవృత్తిలో ఉండినది. అదే సమయానికి ఇంగ్లాండులో ఉదారతా వాదం విజయం పొందింది. ఇండియాలో, బ్రిటీషు రాజ్యభాగాన్ని పశ్చిమోత్తర ప్రాంతంలో సహజ సరిహద్దుల వరకునూ, తూర్పులో బర్మావరకునూ, విస్తరింపజేసి, భారతీయ ప్రభువుల పాలనలో ఉన్న భాగాలను తగ్గించి, ఇంగ్లాండు సామ్రాజ్య ప్రయోజనాలను పెంపొందించిరి

ఈ అవస్థా కాలంలోని ఆర్థికరంగంలో రెండు రకములైన అభివృద్ధులు

జరిగినవి. బ్రిటీషువారి మూలధనాన్ని, లాభకరములైన రైల్వేలలోనూ, తోటల లోనూ పెట్టుబడిగా పెట్టడానికి తగిన అవకాశము ఏర్పడడం మొదటిది. ఇంగ్లాండుకు ఆవశ్యకములైన ముడిసరకులను ఉత్పత్తిచేసి సరఫరాచేస్తూ, ఇంగ్లాండులో తయారైన వస్తువులను తానుపయోగిస్తూ, భారతదేశము వలస రాజ్య ఆర్థిక వ్యవస్థకు లోను గావడం రెండవది.

విజ్ఞానాత్మకమైన స్వార్థప్రయోజనము ఈ అవస్థాదశలోని సామ్రాజ్య తత్త్వము యొక్క లక్షణము. బహుదూర వ్యాప్తిగల సంఘసంస్కరణలను బెంటింకు ప్రవేశపెట్టెను. ఆంగ్ల విద్యాభ్యాసాన్ని పెంపొందించడానికి నిర్ణయించి, పాశ్చాత్య విజ్ఞానాన్ని దేశంలో వ్యాప్తిగావించినాడు. సివిల్ సేవలోని క్రింది ఉద్యోగాల అవకాశాన్ని భారతీయులకు కలిగించి, వారిని తృప్తిపరచడానికి పూనుకొన్నాడు. శాసనాలన్నిటినీ, గ్రంథరూపంలో ప్రకటించి న్యాయ విధానాన్ని ఆంగ్లేయులకూ, భారతీయులకూ, వర్తింపజేయడంలోగల తారతమ్యాన్ని తొలగించి, ఉత్తమ ప్రభుత్వ నిర్మాణానికి పునాదులు వేసినాడు, బెంటింకు.

భారతదేశపు ఆర్థికస్థితిని బాగుపరచడము, బ్రిటీషు పరిపాలనకు పునాదులను బలపరచడము, అను రెండు ఉద్దేశాలతో కూడిన పథకంతో, డల్‌హౌసీ, పాలనకు పూనుకొన్నాడు. రహదారులు, కాలువలు, వ్యవసాయావసర కార్యములు, మున్నగు పౌర నిర్మాణ కార్యక్రమాలను విస్తారంగా, ప్రారంభించెను. అంతర్భాగాల నుంచి రేవుపట్టణాలకు సరకులను కొనిరావడానికి, బ్రిటీషు వస్తువులను దేశంలో సరఫరా చేయడానికీ, సైన్యాలను ఒకభాగం నుంచి మరియొక భాగానికి తరలించడానికీ, అనువుగా రైల్వేలను నిర్మింపచేసినాడు. 'వుడ్' పంపిన శిఫార్సు ననుసరించి, విద్యావ్యాప్తికి నూతన ప్రోత్సాహాన్ని కలిగించెను.

1858 నాటికి, ప్రాచీన భారత సమాజం, రాజకీయంగా లుప్తమై పోయిందని చెప్పవచ్చు. నూతన భారతం రూపరేఖా వైశిష్ట్యంతో, నూతన అంతర శక్తితో, దేశంలో స్పష్టంగా ఏర్పడింది. ఈ నూతన సమాజాన్ని జీవ వంతం గావించిన శక్తీ, జీవన కార్యక్రమము ప్రవృత్తమైన వివిధాంగములూ, ఎట్టివో తెలుసుకోవడం అవసరము. పాశ్చాత్య నాగరకతా ప్రభావము, భారతదేశపు ఆంతర ఆవేగపరిణామము,- అను రెండు విధములైన అంశాలు, ఈ నవభారత జీవనానికి పోషకములైనవి.

భారతసమాజంపై పాశ్చాత్యనాగరకతా ప్రభావుతాకిడి, ప్రశాంతంగానూ, సహజమార్గంలోనూ, జరగలేదు. రెండు విభిన్న నాగరకజాతుల పరస్పర సంబంధాన్ని నిర్ణయించిన సైనికాక్రమణ పరిణామంగా జరిగింది, ఈ సంఘటన. యుద్ధ విజయ ఫలితంగా జన్మించిన సామ్రాజ్యగర్వమూ, ఆధిక్యతాభావమూ, విజేతలను ఆవేశించింది. అపజయంవల్ల ఏర్పడిన మానసికక్షోభా, నిస్సహాయజనితమైన మౌనాంగీకారమూ, జయింపబడిన భారతీయులలో నెలకొన్నవి. అపజయంవల్ల

భారతీయులలో తాము అసమర్థులమనే మనోభావం జనించింది. ఈ మనోభావం, హారవాదితనాన్ని తెచ్చిపెట్టి, ఆత్మ ప్రతిష్ఠాపన భావాన్ని ప్రేరేపించింది. అట్టి పరిస్థితుల్లో, పాలకపాలితవర్గాల వారి మధ్య స్వాభావికములైన మానవ సంబంధాలు ఏర్పడజాలవు. పాలిత ప్రజల శ్రేయోభివృద్ధికి తగిన విధానాలను ఏర్పరచే ప్రజ్ఞావివేచనలు తమ ఏకైక స్వామ్యమనే దురభిమానమూ, దేశప్రజలపట్ల దుస్సహమైన దురహంకార ప్రవర్తనా,- ఇవి బ్రిటీషువారిపట్ల, దుర్భావాన్ని, కపట ప్రవృత్తినీ, అస్వాభావికమైన సంశయాన్ని కలిగించినవి.

ప్రసన్నతా సామరస్యములుగల సుసంఘటితమైన సమాజపరిణామానికి, ఈ పరిస్థితులు సుముఖంగాలేవు. ఘర్షణ ద్వేషభావాలతో నిండిన పరిస్థితులలో ప్రాక్పశ్చిమజాతులు భారతదేశంలో సమాగమమైనవి. కనుక, అధునాతన వ్యవస్థావిధానమూ, పర్యవసానంగా జరిగిన స్వాతంత్ర్యవిధానమూ కూడా వక్రగతిలో నడిచినవి. నిరంతరంగా దీర్ఘకాలం జరిగిన సామ్రాజ్యాధిక్య ప్రతిష్ఠాపన చరిత్రా, దీనిని సహింపజాలక భారతీయులుగావించిన ప్రతిఘటన ప్రయత్నమూ,- నిర్వివాదములైన చారిత్రకాంశములు లేనిచో, నమ్మడానికి కూడా సాధ్యము కానివి.

బ్రిటీషుపాలక వర్గంలో సర్వసాధారణమై పాతుకొనిపోయిన సామ్రాజ్య తత్త్వాన్ని, ఆబేద్యుబాయ్ (Abbedubois) రచించిన చమత్కారవాక్యం సంక్షేపంగా వర్ణిస్తుంది. "విశ్వములోని ప్రతిదృశ్యమూ ఉల్లాసజనకమైయుండగా మానవుడు మాత్రమే నికృష్టమైన దృశ్యము" అని ఇతని వాక్యము. కంజర్వేటివ్ లిబరల్ వర్గాలవారు, క్రిశ్చియనులు, మానవహితోత్సాహులు, అధికారులు, వర్తకులు, రాజకీయవేత్తలు, వృత్తివర్గాలవారు వివిధములైన అభిప్రాయములు కలవారు,- అనగా, అన్నివర్గాల బ్రిటీషువారందరూ,- ఎవరో కొందరు ప్రశంసార్హులు తప్ప,- భారతదేశాన్ని గూర్చి దురభిప్రాయం కలవారే. భారతదేశప్రజలు, వారి మత సాంఘికాచారములు, నైతికప్రవృత్తులు, సంస్కృతి,- మున్నగువాటిని అనుగ్రహభావంతో, శ్లాఘించడం కొందరు ఆంగ్లేయులుచేయగా, ఇతరులు వాటిని సమగ్రంగా దూషించి, ఖండించిరి. భారతీయుల సమాజంపట్ల, ఆంగ్లేయుల అభిప్రాయాలు ఈ రెండు విధముల ననుసరించినవి.

ఐనా, బ్రిటీషుప్రభుత్వపు తొలిరోజుల్లో, భారతీయ తత్త్వాన్ని, సారస్వతాన్ని, మెచ్చుకొని, గౌరవాన్ని ప్రకటించిన అధికారులు కూడా కొందరు లేకపోలేదు. విల్కిన్స్, రచించిన 'భగవద్గీతా' ను వాదానికి పరిచయ వాక్యం వ్రాస్తూ హేస్టింగ్సు, "పరమోదాత్తమైన భావము, హేతుబద్ధమైన వాదము, అసదృశమైన శబ్ద విన్యాసము, అద్భుతకరమైన స్వోపజ్ఞ,-ఇత్యాది విశిష్ట లక్షణాలతో కూడిన ఉదాత్తసృష్టి, 'గీత,' అని నిస్సందేహంగా చెప్పగలను. మానవజాతిలో సృష్టికివచ్చిన మత ధర్మశాస్త్ర గ్రంథాలన్నిటిలోనూ, విధివిధానాన్ని, మూలసిద్ధాంతాలనూ, శక్తిమంతంగా వర్ణించి వివరించడంలో, 'గీత'కు సరివచ్చేనది, క్రీస్తు ధర్మశాస్త్రమొక్కటే, అనడంలో సందేహ-

మేమాత్రమూలేదు." అని ప్రశంసించినాడు.

కాని అతడు తెలిపినట్లు వారన్ హేస్టింగ్సు కాలంలో కూడా, "భారత దేశీయులు, అనాగరక అడవిజాతి జీవిత స్థాయిని దాటని మనుష్య మాత్రులు." అనే భావము ఆంగ్లేయులలో బాగుగా వ్యాపించినది. ప్రాచీన సంప్రదాయస్థుడూ తత్త్వశాస్త్రజ్ఞుడూ ఐన, బర్కు, హేస్టింగ్సు సమకాలికులలో ప్రసిద్ధవ్యక్తి. మానవజాతి పరిణామ చరిత్రలోని వివిధ దశావస్థలను గుర్తించి, విధినియతిమైన పరిణామవిధానాన్ని గౌరవించినవాడు కనుక, ప్రపంచములోని వివిధజాతుల, వివిధసంస్థల తారతమ్యానికిగల ప్రకృతికారణములను, అర్థంచేసుకోగలిగినాడు. భారతీయ సామాజికవ్యవస్థనూ, దానిని నడుపుతున్న న్యాయవిధానాన్ని, సాను భూతితో అర్థంచేసుకొన్నాడు. భారతీయ సంస్కృతియొక్క గొప్పతనాన్ని, విలువనూ గుర్తించినాడు. భారతీయ సంస్కృతి విషయంలోనూ, సంస్థల విషయం లోనూ, ఇట్టిగౌరవాన్నే ఇతని అనుయాయులు కూడా ప్రదర్శించినారు. కాని, అట్టివారు అల్పసంఖ్యాకులు కావడంవల్ల, భారతదేశ వ్యవహారములపై వారి ప్రభావం అల్పమయి, నిరర్థకమయింది.

ప్రాచీనపండితులైన ఛార్లెస్ విల్కిన్స్, బెంగాలు ఏషియాటిక్ సొసైటీ స్థాపకుడైన విలియంజోన్స్,- మున్నగువారికి కూడా భారతదేశ విషయంలో, ఇట్టి భావములే ఉండినవి. కాళిదాసుని శాకుంతలము, మనుసంహిత, హితోప దేశము, ఇత్యాదిరచనలను ఆంగ్లములోని కనువదించిన విలియంజోన్స్, సంస్కృత భాషను ఎక్కువగా మెచ్చుకొన్నాడు. "అద్భుతకరమైన రచనావిన్యాసము, గ్రీకుభాషకంటె ఎక్కువ సమగ్రము, లాటిన్ భాషకంటె అధికమైన శబ్దవిస్తృతి, గ్రీకులాటినుల రెండింటికంటెను మనోజ్ఞమైన లాలిత్యము," సంస్కృత భాషకు గలవని అతడు ప్రశంసించినాడు.

ప్రాచీన విద్యావేత్తలేకాక, భారతదేశ సారస్వతాన్ని అధ్యయనం చేసిన అధికారులు కూడా, పెక్కురుండిరి. కాని, "భారతదేశ సంస్కృతిని ఆంగ్ల దేశమూ, ఆంగ్లసంస్కృతిని భారతదేశమూ, గ్రహించినట్టయితే, ఆంగ్లదేశమే, ఎక్కువ బాగుపడుతుందని" చెప్పిన మన్రో అభిప్రాయాన్ని మాత్రము వీరంగీక రింపరు.

## II. బ్రిటీషు పరిపాలకుల భావప్రవృత్తి

భారతీయ సంస్కృతిపై సదభిప్రాయంగల వారికి, వ్యతిరేకంగా, దానిని దూషించి, అవమానించేవారు అనేకులుండిరి. సామ్రాజ్య రాజకీయవేత్తలు, బెంతమైట్ ఉదారవాదులు, క్రైస్తవ మిషనరీలు, వారి ఆశ్రితులూ, మానవతా వాదులు,- ఇట్టి వారిలో కలరు.

కారన్‌వాలీస్ మొదలు క్యానింగు వరకూ వచ్చిన గవర్నరు జెనరలు లెవ్వరికీ భారతదేశీయులపై సదభిప్రాయంలేదు. దేశీయుల శీలస్వభావాలపై, కారన్‌వాలీస్‌కు అతిహీనమైన అభిప్రాయం ఉండడంవల్లనే, బాధ్యతగల ఉద్యోగాలనుంచి వారిని బహిష్కరించినాడు. మొఘులు, రోమను సామ్రా

జ్యాల ప్రాభవ వైభవములకు అతిశయించిన ప్రబలసామ్రాజ్యాన్ని ప్రపంచంలో ప్రతి ఫలింపచేయడం వెల్లస్లీ ఆశయము. అసమర్థమూ, నిరంకుశమూ, ఐన, భారతదేశరాజుల పరిపాలన కంటె బ్రిటీషుప్రభుత్వము ఉత్తమమైనదని, అతని నిశ్చితాభిప్రాయము. కనుక, దేశీయ ప్రభువులను నిర్మూలించి, వారి రాజ్యాలను ఆక్రమించడంలో దాక్షిణ్య మేమాత్రమూ చూపిన వాడుకాడు.

మింటో హేస్టింగ్సు లిద్దరూ సామ్రాజ్యాన్ని బలపరుప నుద్దేశించినవారు. సామ్రాజ్యాన్ని విస్తరింప జేయడానికి ఇరువురూ దండయాత్రలు సాగించినారు ; దుస్థితికిలోనై యున్న ప్రజానీకానికి సహాయపడడానికి ఇరువురూ ప్రయత్నించిరి. నిరంకుశ దేశీయ ప్రభుత్వానికీ, మూఢవిశ్వాసాలకూ దేశం, లోనై యున్నదని తలచి, బెంటింకు, మెట్‌కాఫ్, మెకాలేలు, బెంథాము ననుసరించి, భారతదేశాన్ని త్వరలో పరివర్తింపచేయవలెనని వాదించినవారే. బ్రిటీషు పరిపాలన విధానము తృప్తికరమైనది కాదని గ్రహించి, దానిని బాగుపరచడానికి ప్రయత్నించినవాడు బెంటింకు ; అతనికి దేశ ప్రజల విషయంలో కూడా సంతృప్తిలేదు. "పలు విధములైన ఏషియావారి దుష్పరిపాలనవల్ల, దేశము శాపగ్రస్తమై, దుర్నీతి, అజ్ఞానము, దుష్టప్రాబల్యము, నిరంకుశత్వము, అనాగరకత, క్రూరములైన ఆచారాలు,- మొదలైనవి యుగయుగాలుగా భారతీయులలో పాతుకొనిపోయి యున్నవని," అతని అభిప్రాయము.

భారత సారస్వత విషయమై, మెకాలే, అభిప్రాయ మెట్టిదో మనకిదివరకే వ్యక్తమై[illegible] "మూడువేల సంవత్సరాలకాలము, నిరంకుశ ప్రభుత్వానికీ, పురోహిత స్వార్థపరత్వానికీ, దాస్యానికీ, మూఢవిశ్వాసానికిలోనై, భారతజాతి హీన స్థితికి వచ్చియున్నదని" నిష్కపటంగా చెప్పగలిగినాడు మెకాలే.

ప్రయోజకతావాదసూత్రాల (Utilitarian Principles) చే, ప్రేరితులై ఉదారవాదులు, భారతసమాజములోని దురాచారాలను రూపుమాపడానికి పూనుకొన్నారు. సతీసహగమనము, శిశుయజ్ఞము, దాస్యము, చరకపూజవంటి క్రూరపూజావిధానము,- ఇత్యాదులను నిర్మూలించడం వీరి ఉద్దేశమయింది. పాశ్చాత్య విజ్ఞానంవల్ల భారతజాతి పునరుజ్జీవనం కలుగుతుందని వారి విశ్వాసము. సర్ ఛార్లెస్ వాక్యాల ననుసరించి, "పాశ్చాత్య విజ్ఞానము హిందూ ముస్లిము మతాల కేంద్రాలను కదలించివేసి, మన భాషనూ, విజ్ఞానాన్నీ, కడపటికి మన మతాన్ని దేశంలో ప్రతిష్ఠించగలదు." కనుక, పత్రికలపై విధించి యుండిన సెన్సారు నిర్బంధాలను తీసివేసి, భావవ్యక్తీకరణానికి స్వేచ్ఛను కలిగించిరి. బెంథమైట్ సిద్ధాంతాన్ని అనుసరించి, పరిపాలన సంస్థలను దిద్దడానికీ, శాంతినీ, సక్రమవ్యవస్థనూ సత్ప్రభుత్వాన్నీ నెలకొల్పడానికి ప్రయత్నించిరి. ఐనా, భారతసంస్కృతి విషయంలోనూ, సాంఘిక రాజకీయ సంస్థలవిషయంలోనూ, అధికమైన నిరసనభావం కలవారు కావడంవల్ల, అవి అతిశీఘ్రంగా తొలగిపోవలెననీ, పాశ్చాత్యీకరణం వెంటనే జరుగవలెననీ, వీరు అత్యాతురతను ప్రద

ర్శించిరి. శాంతిసంస్కరణల విషయమైన ఈ విడంబన దృశ్యం, ఎల్లెన్‌బరో పదవికి రావడంతో, అంతమయింది. సామ్రాజ్యవిస్తరణకై సైనికదండయాత్రలు మరల ప్రారంభమైనవి. డల్‌హౌసీ పదవికివచ్చి, ఈ సామ్రాజ్యవిస్తరణాన్ని పూర్తి చేసినాడు.

ఎలెన్‌బరో టోరీవర్గంలోని సామ్రాజ్యవాది. ఆ కాలంనాటికి, మధ్య ఆసియాలోనికి చొచ్చుకొని వస్తున్న, రష్షియా ఔద్ధత్యంనుంచి, బ్రిటీషు సామ్రాజ్యాన్ని రక్షించడం, తన ప్రధానకర్తవ్యంగా ఇతడు భావించినాడు. రష్షియనులనూ, సిక్కులనూ బ్రిటిషు సరిహద్దులకు, సాధ్యమైనంతదూరంలో, పెట్టవలెనని ప్రయత్నించిన పామర్‌స్టన్ (Palmerstone) అనుయాయి ఇతడు. సామ్రాజ్యరక్షణ ప్రయత్నానికై పన్నిన వ్యూహవ్యవస్థలో, భారతదేశము, తన నిర్దిష్టమైన కర్తవ్యాన్ని నిర్వహించవలెనని ఇతని, నిశ్చయము. తక్కిన రాజ్య విషయాలన్నీ ఇతనికి అప్రధానములైనవి. ఉదారవాదులు సూచించిన సంస్కరణ లితనికి ప్రయోజనకారులు కావు. భారతీయులను విద్యావంతులను గావించే ప్రయత్నాని కితడు వ్యతిరేకి. ద్వారకానాథ టాగోరుతో ఇతడుచేసిన సంభాషణలో,- "దేశీయులను విద్యావంతులను జేయడానికై పూనుకొన్న ఈ ఉదారుల ఉద్యమం సఫలమైతే, ఈ దేశంలో మేము మూడుమాసములు ఉండజాలమని, మీరు గ్రహించియుండరు."- అని అతడు తన అభిప్రాయాన్ని వెలిబుచ్చినాడు. ప్రజలు విద్యావంతులై, సివిల్‌సేవలలో ప్రవేశించి, సివిల్ పరిపాలనను నిర్వహించడమూ, వారికి స్వతంత్రపత్రికలు, రైల్వేలూ, టెలిగ్రాఫు విధానము మున్నగునవి తోడ్పడడమూ, జరిగితే, బ్రిటీషు ప్రభుత్వానికి వారెన్నడూ లోబడి యుండరు,- అన్న విషయమే ఎల్లెన్‌బరోకు భీతి కలిగించింది.

డల్‌హౌసీ, ప్రముఖుడైన సామ్రాజ్యవాది. కాని, ఎల్లన్‌బరోకంటె దీర్ఘదృష్టికలవాడు; మధ్యమార్గాన్ని అవలంబించేవాడు. సామ్రాజ్య ప్రాభవవైభవముల విషయంలో ఎల్లెన్‌బరో కితడేమాత్రమూ తీసిపోయినవాడు కాడు. భారతదేశ సామ్రాజ్య విస్తృతికై దేశీయప్రభువుల ప్రాంతాలను కలుపుకోవడములోనూ, రాజ్యాన్ని సుస్థిరం కావించడంలోనూ, ఇంగ్లాండు ఆర్థికవ్యవస్థను బాగుపరచడంలోనూ, అతడవలంబించిన విధానాలే ఇందుకు నిదర్శనాలు. భారతదేశం పట్ల అభిమానంకానీ, ప్రజల మనోభావాలపట్ల దాక్షిణ్యంకానీ, ఇతనికి లేదు.

***ఉదారవాదుల ప్రవృత్తి :*** జెరిమీబెంథామ్ వంటి ఉదారుల స్థానంలో వచ్చిన తాత్త్వికులకు కూడా ఇట్టి అశ్లాఘ్యములైన అభిప్రాయములుండినవి. 'ఇండియా చరిత్ర' (History of India) అనే ఉద్గ్రంథాన్ని రచించిన జేమ్స్ మిల్, (James mill) ఈస్ట్‌ఇండియా కంపెనీవారి వ్యవహారములలో, పలుకుబడీ, ప్రాబల్యమూ కలవాడు. (1819-36)కాని, ఇతడు ఉదారవాద సూత్రములైన స్వేచ్ఛ, సమానత, ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వము అనువాటిని, ఇండియా వ్యవహారముల విషయంలో మాత్రము వర్తింపనీయక, పెడదారి పట్టించినాడు ఈస్ట్‌ఇండియా కంపెనీయొక్క ఏకైక స్వామ్యవిధానాన్ని ఖండించడంలోనూ

స్వేచ్ఛావ్యాపార విధానాన్ని సమర్థించడంలోనూ, అనాగరకుల స్వచ్ఛంద ప్రభుత్వానికేమాత్రమూ తీసిపోదని బ్రిటీషుపరిపాలన విధానాన్ని విమర్శించడంలోనూ, సంస్కరణ విధానాలను ప్రోత్సహించడంలోనూ, ఆధునికవిద్యనూ; అందునూ ముఖ్యంగా విజ్ఞానశాస్త్ర విద్యాప్రయోజనాన్ని బలపరచడంలోనూ, ఇతడు తన ఉదారభావాలను వ్యక్తపరచి యుండడం వాస్తవమే. కాని, భారతసమాజ సంస్కృతులతనికి ఇష్టములైనవికావు. కావున "యూరోపియనులు తమ బుద్ధిశక్తి సామర్థ్యాలతో, తమ గౌరవప్రతిష్ఠలకనుగుణమైన మార్దవంతో, తమ స్వేచ్ఛననుసరించి ఏర్పరచిన సాధారణ ప్రభుత్వము భారతీయులకు అర్హమైన ప్రభుత్వము". అని నిశ్చయించడమూ, అంతకంటె తగిన విధానాన్ని యోచించక పోవడమూ, తగనిపని. పురోహితుల స్వార్థంతోనూ, మూఢవిశ్వాసంతోనూ, నిండియున్న భారతసమాజము, అనాగరకమైనది, మధ్యయుగాల యూరోపు సమాజంకంటె అధమమైనదీ, అని అతని అభిప్రాయము.అస్పష్టతా, పదబాహుళ్యము, అస్తవ్యస్తము,- మున్నగు దోషములతో కూడియున్నది భారతీయ స్మృతి గ్రంథము. (Law code). ఘోరములైన ప్రాయశ్చిత్తాది నిష్ఠలు, నిష్ప్రయోజనములు హానికరములు ఐన వ్రతములు,- మున్నగువాటి కలయికతో ఏర్పడినది హిందూమతము. హిందూవిద్యావిధానంలో కార్యకారణ సంబద్ధమైన భావమే లేదు." ఇవి అతని భావాలు.

ఇతని కుమారుడైన జాన్ స్టూవర్ట్ మిల్, ఇంతమూర్ఖపు పట్టుదల కలవాడు కాడు. ఇతరాభిప్రాయములను గ్రహింపగల మనస్సితనిది. ప్రధాన విషయాల్లో బెంథామ్ సిద్ధాంతానికి భిన్నంగానూ, భారతీయ సమాజసంస్కృతుల విషయాల్లో జేమ్స్‌మిల్లుకు వ్యతిరేకంగానూ, ఇతడు నడచినాడు. భారతీయ సాహిత్యాన్ని గూర్చిన మెకాలే అభిప్రాయాన్ని ఇతడు వ్యతిరేకించెను. ఉద్యోగాలకు అవసరమైన వ్యక్తులను తయారుచేసే విద్యావిధానాన్నీ, తత్ప్రయోజనార్థం మాత్రమే ఉపయోగించే జ్ఞానాన్నీ, నీతులనూ బోధించడం అనుచితమైనదని తెలిపినాడు. విద్యయొక్క లక్ష్యము విద్యాసాధనమే అనీ, లౌకిక ప్రయోజనం అప్రాధాన్యమనీ, వివరించినాడు. అట్లే, విద్యాబోధన మాతృభాషల ద్వారా జరుగవలెనే కాని, పరభాషయైన ఆంగ్లంలో బోధించడం ప్రయోజనకారి కాదనీ, బ్రిటీషువారి విధానాన్ని విమర్శించినాడు. తమ నాగరకతను మరియొక జాతివారిపై నిర్బంధం గావించే అధికారము, హక్కూ, ఏజాతికిలేదనినాడు. భారతదేశ ఆర్థికాభివృద్ధికై ఇతడు ప్రతిపాదించిన విధానాలు ఉదార వాదానికి అనుగుణములై, ఇతని తండ్రి ప్రతిపాదించిన వాటికంటె మెరుగుగా ఉన్నవి. న్యాయపాలన విషయంలో, వర్ణపక్షపాతంవల్ల దేశీయులకు కలిగించిన దౌర్బల్యాన్ని, నిషేధాలనూ తొలగించవలెనని ఇతని:కోరిక. ఆధునిక సంస్థల నిర్వహణ విషయములో భారతీయులకు శిక్షణనిచ్చి, వారిని సిద్ధపరచడము, బ్రిటీషు ప్రభుత్వంయొక్క నైతిక కర్తవ్యము. 1858 లో, జరిపిన ఘోరచర్యలూ, అమానుషకృత్యాలూ, అతని హృదయాన్ని సంక్షుబ్ధం గావించినవి.

గ్రేటర్ బ్రిటన్ (Greater Britain) అనే గ్రంథంలో డిల్క్ (Dilke) వర్ణించిన నూతన సామ్రాజ్య తత్త్వమూ, Surlinegalite des races humaines' అనే వ్యాసంలో, గోబినో (Gobinean) ప్రతిపాదించిన సామ్రాజ్య వాదమూ,- అతడు విశ్వసించలేదు. వాటి ఉద్దేశాన్ని ఇతడు సంశయించినాడు. బుద్ధిశక్తికి, విజ్ఞానానికి, విజ్ఞానాత్మకములైన ప్రభుత్వ సంస్థలకూ, అధిక ప్రాధాన్య మిచ్చి, వాటిపై విశ్వాసముంచిన, జాన్ స్టూవర్టుమిల్లు, జాతివర్ణ ఆధిక్యాన్ని గౌరవించలేదు.

భారతదేశం అభ్యుదయం పొందవలెననెడి ఇతనికోరిక నిజమైనదే. కాని, అతని సమకాలికులలో వ్యాప్తములై యున్న కొన్ని భావాలకు, అభిప్రాయా లకు అతీతుడు కాజాలకపోయినాడు. దేశీయ నాగరకతకంటెను పాశ్చాత్యనాగ రకత శ్రేష్ఠమైనదనడము, భారతసమాజం క్షీణదశలోనున్నదనడము, స్వపరిపాల నకు భారతీయులు అర్హులు కారనడము, అనే అభిప్రాయాలితనికికూడ ఉండినవి. విజ్ఞానంతోనూ, బాధ్యతతోనూకూడిన తీవ్రమైన స్వచ్ఛందప్రభుత్వమే భారతీయు లకు తగిన పరిపాలన విధానమని, ఇతడుకూడ తన తండ్రివలెనే, నమ్మినాడు.

*భారత సమాజవిషయంలో మిషనరీల అభిప్రాయం :* హిందూ ముస్లిము మతాలను దూషిస్తూ, నిరసిస్తూ ఎక్కువ గొడవచేస్తున్నవారిలో ముఖ్యులైన వారు క్రిశ్చియను మిషనరీలూ, వారి సహచరులైన క్లాపహామైట్స్, మానవతా వాదులూ అనేవారు. ఇండియా ఉద్యోగంనుండి విరమించుకొన్న ఛార్లెస్ గ్రాంట్, డైరెక్టర్లసభలో పలుకుబడిగల సభ్యుడైనాడు. క్లాప్ హామ్ వర్గాన్నితడు సమర్థించేవాడు. క్రైస్తవమతాన్ని భారతదేశంలో ప్రచారంచేయడంవల్ల, బ్రిటీషు సామ్రాజ్యప్రయోజనాలు సిద్ధిస్తాయని ఇతని అభిప్రాయము. సామ్రాజ్య రక్షణము, ఈస్ట్ ఇండియా కంపెనీయొక్క అభ్యుదయము, సామ్రాజ్యంతో దేశీయులకు సన్నిహితసంబంధము,- ఇవన్నీ కూడా క్రీస్తుమతప్రచారం సాధిస్తుంది. సామ్రాజ్యానికి బలం చేకూర్చడానికి ఉత్తమసాధనము పాశ్చాత్యవిద్యావిధా నమే", అని ఇతడు తీవ్రంగా వాదించినాడు. "మన భాషను, విజ్ఞానాన్ని భావా లను, మతాన్ని మన ఆసియా రాజ్యాలలో ప్రతిష్ఠించడంవల్ల, ఎట్టి పరిస్థితులలో కూడా భంగం కలగనట్టి మహోకార్యాన్ని నిర్వహించినవారమౌతాము" అని అతడు వ్రాసినాడు.

భారతదేశంపట్ల ఇతడు తీవ్రమైన దురభిప్రాయాలను ప్రచారం చేసినాడు. "మానవప్రకృతియొక్క, అధోగతి ,దైన్యావస్థ, హిందూసంఘంలో ప్రత్యక్షమై ఉన్నవి. వీరితోకలిసియున్న ముస్లిములుకూడా, నైతికవిషయంలోనూ, ప్రవర్తన విషయంలోనూ, హిందువులవంటివారే. నిజాయితీ, సత్యసంధత, విశ్వాసము,- ఇవి బెంగాలీలలో మిక్కిలి లోపించినవి. కృత్రిమాలు, మోసాలు, బాధ్యతను తప్పించుకోవడము, కాలహరణం చేయడము,- ఇత్యాది దుర్గుణాలు జీవితంలోని అన్ని విషయాలలోనూ, అన్ని వృత్తులలోనూ, ఎల్లప్పుడూ ప్రత్యక్షము లౌతాయి. ఏ మాత్రము జంకుకొంకులులేక వీరు కూటరచనలు (forgeries)

తయారుచేస్తారు" అని ఇతడు బెంగాలీలను దూషించినాడు.

హిందూమతాన్ని హేళనచేయడంలో, ఇతడు, ఇంగ్లీషుభాషలో ఉన్న అన్నితిట్లనూ నిందావాక్యాలనూ, ఖర్చుపెట్టినాడు. "అపవిత్రములైన చెత్త విగ్రహాల నన్నిటినీ పూజించడము, కర్రతోనూ రాతితోనూ తయారైన రాక్షస విగ్రహాలనారాధించడము, అసత్యములైన నియమాలనూ, దురాచారాలనూ, పాటించడము, భ్రాంతిమూలకములైన ఆశలూ భయాలూ, అపహాస్యము కలిగించే కర్మలూ వ్రతాలూ, అధోగతికి ఈడ్చే మూఢ విశ్వాసాలూ, కపట నిర్బంధాలూ," ఇవి హిందూమత మని అతడు వర్ణించినాడు. దాస్యతావ్యతిరేకోద్యమానికి నాయకుడూ, పార్లమెంటులో ప్రబలసభ్యుడూ ఐన, విలియం విల్బర్ ఫోర్స్, ఛార్లెస్ గ్రాంటుకు సన్నిహిత అనుచరుడు. పాశ్చాత్య విద్యాప్రసారానికి సంబంధించిన ప్రకరణాన్ని 1813 శాసపత్రంలో చేర్చడానికీ, మిషనరీలను ఇండియాకు పంపడానికీ, పార్లమెంటును ప్రోత్సహించిన వాడితడే. భారతదేశపు నాస్తికజనాన్ని, అజ్ఞానాంధకారంలో నుంచి తప్పించి రక్షించడం బ్రిటీషు సామ్రాజ్య ప్రయోజన మని ఇతని విశ్వాసము

పార్లమెంటునూ, ఇంగ్లాండు ప్రజలనూ, ఈ విషయమై ఉద్బోధిస్తూ ఇతడు, భారతదేశ సమాజ వ్యవస్థనూ, స్త్రీల స్థితినీ అసహ్యంగా చిత్రించినాడు. "మన మతం ఉదాత్తమైనది. పవిత్రమైనది, ప్రజాహితకరమైనది, వారిదో (ఇండియనులది) నీచమూ, విషయలంపటమూ, క్రూరమూ, ఐనది. దేవుని నిజ స్వరూపము తెలియని భారతదేశీయుల అధోగతీ, వారి దైన్యావస్థా, నేను చదివిన దానినిబట్టీ, విన్నదాన్నిబట్టీకూడా, బాగుగా వ్యక్తమయింది." అని ఇతడు ఘోషించినాడు.

క్రిశ్చియను మతాన్ని ఒకవైపు ప్రచారంచేస్తూ మిషనరీలు, మరియొక వైపు బ్రిటీషు సామ్రాజ్య ధ్వజాన్ని ఎత్తిపట్టుతూ, బ్రిటీషు వాణిజ్యానికి తోడ్పడినారు. హిందువుల ఆరాధనలను, పూజావిధానాలను, విశ్వాసాలను, కుల భేధాలను, స్త్రీల దుస్థితినీ,-ఇత్యాదులన్నిటినీ వీరు తిరస్కరించి, ఖండిస్తూ వచ్చిరి. వివేచన శక్తిని హిందూజాతి విడిచిపెట్టినంత పూర్తిగా మరేజాతీ విడిచి పెట్టలేదని చెప్పవచ్చును." అని క్యారీవ్రాసియున్నాడు. హిందూస్త్రీలనుగూర్చి "దుఃఖార్తులు, విద్యాశూన్యులు, కష్టజీవులూ, ఐన హిందూస్త్రీలు పశుతుల్యులు. కావుననే వారిని చంపడానికి హిందువులు జంకరు". అని వ్రాసియున్నాడు.

మిషనరీల నిందావాక్యాలను ఇంకను ఎక్కువగా ఉదహరించడం అనవసరం. కాని, ఇంగ్లాండునుంచి ఇండియాకు బ్రిటీషుప్రభుత్వం పంపగావచ్చి, మిషనరీ కార్యక్రమాన్ని సమర్థతో నిర్వహించి, ప్రసిద్ధిచెందిన, అలెగ్జాండరు వ్రాతల నుండి కొన్నిభాగాలను ఎత్తిచూపి, ఆ కాలపు మిషనరీల మనోవృత్తి ఎట్లుండునో వివరించడం అవసరము. "భారతదేశీయులు దేవుని నిజస్థితిని కూడా తెలియని జీవులు. సూర్యకాంతి ప్రసరించే ప్రపంచమంతటిలోనూ ఇంతటి విషయ లంపటులూ, ఇంతటి అధములూ కానరారు. ఈ దేశంలో సత్యమైన విధానాన్ని నెల

కొల్పడానికంటె ముందుగా, ఇచ్చట పాతుకొనియున్న అసత్యాన్ని, నిర్మూలించవలసి ఉంటుంది." అని అతడు అభిప్రాయపడినాడు, భారతదేశమూ, భారత దేశ మిషను సంస్థలూ (India and Indian missions) అనే తన గ్రంథంలో, "పతితులైన జనులు వక్రగాములైన బుద్ధిమూలంగా కల్పించిన అసత్య మత సిద్ధాంతాలన్నిటిలోనూ, నిశ్చయంగా హిందూమతం అద్భుతమూ, అగాధమూ ఐనది." అని వ్రాసినాడు. భారతీయ ప్రాచీనవిద్య, "ఆధ్యాత్మిక సంబంధమైన సూక్ష్మాతిసూక్ష్మములైన విమర్శలతో కూడిన నిరర్థకప్రయత్న ఫలితము. యూరోపులో మధ్యయుగాల కాలపు పండితులు అభ్యసిస్తున్న విద్యతో సదృశమైనది ఇది". అని తన అభిప్రాయాన్ని వివరించినాడు

సెషన్సు న్యాయాధిపతిగానూ, సివిల్ కమీషనరుగానూ, ఏజెంటుగానూ వివిధోద్యోగాలలో పనిచేసిన ఎఫ్. జె. షోర్ చెప్పినవిధంగా, "భారతీయులు, అధోగతిలోనున్న నీచులు; సద్గుణము లేమాత్రమూ లేనివారు. వారి సంస్థలూ, ఆచారవ్యవహారాలూ, ప్రభుత్వవిధానాలూ, అధమములైనవి", దేశీయులను ఆంగ్లేయులు అసహ్యించుకొని ద్వేషించినారు. తిరస్కారభావంతోనూ, అహంభావంతోనూ, దురహంకారంతోనూ వారిపట్ల ఆంగ్లేయులు ప్రవర్తించినారు. రామమోహనరాయ్‌వంటి ఉత్తమస్థాయిలోనున్న వారు కూడా ఈ విధమైన ఆంగ్లేయుల ప్రవర్తనకు గురియైనారనడానికి నిదర్శనములున్నవి. "భారతీయుల ఇట్టి స్థితికి భిన్నమైన మనమూ, మనసంస్థలూ, మన జీవనసర్వస్వమూ, మిక్కిలి శ్రేష్ఠమైనవి". అని షోర్ అభిప్రాయ మిచ్చియున్నాడు.

ఇంత కర్ణకఠోరంగా భారతజాతిని తిరస్కరిస్తున్న రోజుల్లోకూడా అక్కడక్కడ, కొంతమంది తద్వ్యతిరేకమైన భావాలను వెల్లడించినారు. అట్టివారిలో, బిషప్ హేబర్ ఒకడు. హిందువుల ఆరాధనపద్ధతి గ్రీకులు అవలంబించిన వ్రాత్యవాదం (Paganism) కంటె అధమంకాదని, హిందూకులతత్త్వం రోమనుకాథలిక్కుల స్వచ్ఛందతకంటె ఎక్కువకాదని, ఇతడు వివరించినాడు. "ప్రకృతిసిద్ధంగా హిందువులు దయార్ద్రహృదయులు, శ్రమజీవులు, ప్రసన్నశాంతచిత్తులు. ఐనా, తగిన సందర్భాల్లో పౌరుషాన్ని, శౌర్యసాహసాలనూ, ప్రదర్శిస్తారని" ఇతడు వివరించెను. శ్వేతజాతులవారి ఆధిక్యవాదాన్ని ఇతడు ఆమోదించలేదు. కనుకనే, భారతీయులకూ యూరోపియనులకూ పరస్పరవివాహాలను కూడా చేయించినాడు. భారతీయుల జాతీయగౌరవప్రతిష్ఠలకు భంగం కలిగించే భాషను, వారికి పూజనీయములైన విషయాలనూ నిరసించే, భాషను, ఉపయోగించరాదని, తన సహచరులైన ఇతర మిషనరీలకు ఉపదేశించినాడు. ఐనా, భారతసారస్వతాన్ని గురించి మాత్రము, ఇతడు కూడా "దీర్ఘ కాలవ్యయప్రయాసలతో సంస్కృతభాషను అభ్యసించడమూ, నిరుపయోగమూ, నిష్ప్రయోజనమూ ఐన ప్రాచీన సారస్వతాన్ని పఠించడమూ" వ్యర్థమని విశ్వసించినాడు.

ఈ విషయంలో ఉన్నత బ్రిటీషు పరిపాలకుల అభిప్రాయములు ఎటువంటివో భారతప్రజలకు ప్రత్యక్షంగా తెలియదు. ఆంగ్లేయుల దురహంకార

ప్రవర్తననుబట్టి, అపరోక్షంగా మాత్రమే ఆ విషయం గ్రాహ్యమౌతుంది. మిషనరీల విషయంలో, దాగుడుమూతలేమీ లేవు. బాహాటంగా, తమ తిరస్కారాన్ని, అసహ్యాన్ని నిందాదూషణలతో, ప్రజలపై రోజూ రుద్దుతూనే ఉన్నారు మిషనరీలు. పాఠశాలల్లో, సంఘాల్లో, బజార్లలో,- వీరు తమ మతాన్ని ప్రచారం సాగిస్తున్నారు. పుస్తకాలు, కరపత్రాలు, దినపత్రికలు ఇత్యాదులద్వారా, నిరంతరంగా హిందూమతానికి వ్యతిరేకమైన ప్రచారాన్ని జరుపుతూనే ఉండిరి. అసభ్యమైన భాష, వారి వాదకళకు (Polemics) కంటకసాధనమై (Barbs-కంటకాలు-ముళ్ళు) శ్రోతలను అత్యంతం బాధించింది. ఆత్మాధిక్యాన్ని ప్రదర్శించేవారి పద్ధతులు, ప్రజలలో కోపాన్నీ, భయభ్రాంతినీ కలిగించినవి. మిషనరీలు తమ ప్రవర్తన వల్ల ఉన్నత పదవులలోని అధికారులకుకూడా, ఎక్కువ వ్యాకులాన్ని కలిగించినారు. ఇండియా ప్రభుత్వకార్యదర్శియైన ఛార్లెస్ వుడ్, క్యానింగుకు వ్రాస్తూ "తుంటరితనంతో మిషనరీలు కీడు చేస్తున్నారని వేరే చెప్పనవసరం లేదు. నిష్ప్రయోజనంగా వారిని కెలకడం నాకిష్టంలేదు. వారిక్కడ (ఇంగ్లాండులో) గొడవచేయగలరనీ, ఇండియానుగురించి తెలియని ఇంగ్లాండుప్రజలు మిషనరీల వాక్యాలను నమ్మి వారినే సమర్థించవచ్చు." అని తన నిస్సహాయస్థితిని వ్యక్తం చేసినాడు. కాని, ఇండియాలోని సివిల్ మిలిటరీ అధికారులు మిషనరీలకు ప్రాపకమిచ్చినారు. మిషనరీల ఉద్యమానికి సానుభూతిచూపడం మాత్రమేకాక, బహిరంగంగా వారిపట్ల పక్షపాతం చూపుతుండడంవల్ల మిషనరీల నెవ్వరూ కదలించలేక పోయిరి. కనుక, వీరి మతాంతరీకరణ ప్రయత్నవిషయమై హిందూ ముస్లిములలో భయభ్రాంతులేర్పడి యుండడం ఆశ్చర్యం కాదు.

*పాశ్చాత్యాధిక్కారానికి భారతీయ ప్రతిక్రియ :* పాశ్చాత్యులు తమ ఆధిక్యాన్ని ఈ విధంగా ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ, ప్రదర్శిస్తూ ఉండడము భారతజాతికి ధిక్కారమయింది. రెండు జాతులమధ్య పరస్పర గౌరవ విశ్వాసాలేర్పడడము, ఈ పరిస్థితిలో, అసాధ్యమయింది. జాతిభేదాన్ని పరిగణించడము, రాజకీయచైతన్య ప్రవృత్తి, భారతీయుని సంప్రదాయ జీవితంలోలేవు. తద్విరుద్ధంగా, ఆంగ్లేయుడు తీవ్రమైన రాజకీయభావం కలవాడు. తనజాతీయ ప్రయోజనాలనూ, జాతి ఆధిక్యతనూ, తీక్షమైన చైతన్య శక్తితో సాధించే స్వభావం అతనిది. రెండు జాతుల మధ్యగల ఈ సంస్కృతి విభేదాలు, విరసతనూ ద్వేషభావాన్నీ తీవ్రమొనర్చినవి. పాశ్చాత్యుని ధిక్కారాన్ని సహించలేక భారతీయుడు ప్రతిక్రియకు బూనుకొన్నాడు. ఈ ప్రతిక్రియ పలురూపములలో ప్రవర్తించింది.

*ప్రాచీన వర్గంవారి ప్రతిక్రియ :* ప్రాచీన సంస్థకు ప్రాతినిధ్యం వహించిన వర్గంవారు, బ్రిటీషు ప్రభుత్వపు రాజకీయ మత విధానాలనే ప్రధాన విషయాలుగా గ్రహించి, ప్రతి క్రియాచరణకు ప్రారంభించిరి. భారత ప్రభువులను రాజ్యభ్రష్టులు గావించి వారి రాజ్యాలనూ, అధికారాలనూ, స్వాతంత్ర్యాన్నీ నశింపజేయడము, ప్రజల పురాతన మత విశ్వాసాలను నశింపజేయడానికి పూనుకోవడము, అనే బ్రిటీషు వారి చర్యలను వీరు ఆక్షేపించిరి. ఈ కారణంవల్లనే,

బ్రిటీషు ఆధిపత్యాన్ని పడగొట్టడానికి అనేక ప్రయత్నము లొనర్చి, 1857 వ నాటి విప్లవానికి కూడా కారకులైరి. కాని, వీరి ప్రయత్నాలు విఫలములైనవి. ఈ ప్రయత్నాలలో శాఖోపశాఖలుగా విస్తరిల్లిన వహాబీ ఉద్యమం బ్రిటీషు సామ్రాజ్యానికి అత్యంత ఆపత్కరమయింది.

*మధ్యతరగతివారి ప్రతిక్రియ :* మధ్యతరగతి వారొనర్చిన ప్రతిక్రియలు దీనికి పూర్తిగా భిన్నములైనవి. ఈ తరగతిలో, సంప్రదాయవాదులు, పరివర్తన వాదులూ, ఇత్యాదిగా అనేకవర్గాలేర్పడి యుండినవి. హిందూమత సంప్రదాయాలలోను, సాంఘికాచారములలోనూ, ఎట్టి పరివర్తనమూ కలిగింపకూడదని సంప్రదాయవాదుల పట్టుదల. పురాతన సంప్రదాయంవల్లనూ, దివ్యములైన పవిత్ర గ్రంథాలవల్లనూ, ఇవన్నీ, పునీతములైనందువల్ల వాటిని కదలించే అధికారం ఎవరికీ లేదని వీరి భావము. మిషనరీలు, ఇతరులు, వీటిపై దాడిసాగించేకొద్దీ, వీటిని తాము రక్షించుకోవాలనే పట్టుదల సంప్రదాయవాదులలో దృఢపడింది. మత సంబంధములైన తమ ఆచారవ్యవహారముల బాహ్యరూపం ఇతరులకు వికృతంగా గోచరించినా, వాటి పరమార్థం ఉత్కృష్టమైనది, దైవ నిర్దిష్టమైనది అని వారి వాదము. వాటిని మార్చడానికి బూనుకొంటే, ఎంతవరకు పోతుందో, ఎక్కడ ఆగుతుందో, ఊహించలేము. చిరకాలంగా రూఢిలోనున్న సంప్రదాయపు బాహ్య స్వరూపాన్ని మార్చడానికి ప్రయత్నిస్తే, మత సౌధమంతా కూలిపో గలదు. ఇటు, క్రిశ్చియనుల విరోధచర్యలనూ, అటు, సంస్కర్తల ప్రయత్నాలనూ కూడా వీరు ఎదుర్కోవలసి వచ్చింది. పాశ్చాత్యులదాడి ప్రబలమయ్యేకొద్దీ, సంప్రదాయవాదుల ప్రతిక్రియకూడా ప్రబలంకాజొచ్చింది. తమ మాతృదేశానికి, తమ ప్రాచీన విజ్ఞానానికి రక్షకులై నిలిచిన ఈ సంప్రదాయవాదులకు, ప్రజాబాహుళ్యం తోడుగా నిలిచి వీరి ప్రతిక్రియాచరణాన్ని విజయవంతం గావించింది. ఈ విధంగా, సంప్రదాయవాదులు భారత జాతీయతాభివృద్ధికి సమగ్ర దోహద మొనర్చిరి.

*సంప్రదాయవాదులు :* ఈ వర్గానికి నాయకులైన ఆధునిక విద్యావంతులు, మతవిషయంలో సంప్రదాయవాదులైనప్పటికీ, విద్యారాజకీయ ఆర్థికవిషయాల్లో అభ్యుదయభావాలు కలవారు. వీరిలో గోపీమోహన్‌దేవ్ కుమారుడైన రాధాకాంతదేవ్ ప్రముఖవ్యక్తి. క్లైవుకు మున్షీగా (భాషాబోధకుడు) ప్రసిద్ధి గాంచిన, నాబాకృష్ణదేవున కితడు మనమడు. 1784 ఇతని జనన సంవత్సరము. కన్నింగ్‌హాము స్థాపించిన కలకత్తా అకాడెమీలో ఇతడు శిక్షణను పొందినాడు. బెంగాలీ, పారసీకం, అరబ్బీ, సంస్కృతము, ఆంగ్లము,— అనే ఐదుభాష లితనికి తెలుసును. విద్వాంసుడుగా, రచయితగా పేరుగాంచినవాడితడు. పెక్కు విజ్ఞాన విషయాల్లో ఆసక్తిగలవాడు. సంస్కృతాధ్యయనానికి శ్రద్ధాభక్తులతో బద్ధుడైనవాడు. 'శబ్దకల్పద్రుమ' మనే విజ్ఞానసర్వస్వనిఘంటువును ఇతడు రచించెను. ఏడుభాగాలు, అనుబంధప్రకరణము కల ఈ ఉద్గ్రంథాన్ని పూర్తిచేయుట కితనికి, నలభై సంవత్సరాలకాలం పట్టింది. పాఠశాలల పాఠ్యగ్రంథాలనుకూడా

ఇతడు రచించినాడు. ఆంగ్ల పారసీక భాషలనుండీ అనువాదాలను రచించినాడు.

అనేక విద్వత్సంఘాలలో, ఇతడు సభ్యుడు. వ్యావసాయిక, ఉద్యాన విభాగానికి (Agicultural and Horticultural) ఇతడు ఉపాధ్యక్షుడు. గ్రేట్ బ్రిటనులోని 'రాయల్ ఏషియాటిక్' సంఘంలో సభ్యుడు, రచయితా. హిందూ కళాశాలా సమితిలోనూ, కలకత్తాపాఠశాల సమితిలోనూకూడా ఇతడు సభ్యుడు. విద్యావిజ్ఞానముల ప్రసారము నుద్దేశించి, 'గౌడీయ సమాజ' ము నితడు 1823 లో, స్థాపించెను. 'సతీసహగమన' నిరోధాన్ని ప్రతిఘటించే ఉద్యమానికి బూనుకొని, 'ధర్మసభను' స్థాపించినాడు. మహారాజా శ్రీగిరీశచందర్, రాధామాధవ బెనర్జీ, కాశీనాథ బెనర్జీ, ఇంకనూ ఇతరుల సంతకాలతో ఒక మహాజరును తయారుచేసి, హిందువుల మత విషయాల్లో ప్రభుత్వపు జోక్యాన్ని ఆక్షేపిస్తూ, గవర్నర్ జెనరల్ విలియం బెంటింకు ప్రభువుకు అర్పించెను. (18-1-1830), రూఢిలో ఉన్న సంప్రదాయము, ఉపదేశాత్మకమైన విధి, తమకు సమానంగా పవిత్రములైనవనీ, తమ పవిత్రగ్రంథాలకు అర్థవ్యాఖ్యానములను వివరించే అధికారము బ్రాహ్మణపండితులకు మాత్రమే కలదనీ, నొక్కి వాదించినాడు. కాని, మత విషయకంగానూ, మానవతావిషయకంగానూ, కూడా, సతీ సహగమనాచారము, విరుద్ధమైనదని నిర్ణయించి, బెంటింకు వీరి, మహాజరును త్రోసివేసినాడు. అనంతరము, ధర్మసభవారు ఇంగ్లాండులోని కౌన్సిలు అధ్యక్షుడైనరాజుకు విన్నవించుకొన్నారు. కాని, అక్కడ కూడా, వీరి ప్రయత్నము విఫలమయింది.

లాఖిరాజ్ భూములను (Rent free-ముక్తశుల్క.) ప్రభుత్వము సంగ్రహించుకోడానికి బూనుకోవడంతో (1838), పట్టా రైతుల హక్కులను సంరక్షించే నిమిత్తము జమీందారీ సంఘం ఏర్పడింది. భారతదేశ ప్రజల కష్టాలను పార్లమెంటుకు తెలియజేయడానికై, బ్రిటీషు ఇండియా సమితిని స్థాపించి, (1851) దానికి అధ్యక్షుడుగా రాధాకాంత్‌ను నియమించిరి.

బెంగాలులోని ప్రజాతత్పరులైన దేశాభిమానులలో రాధాకాంత, ప్రముఖుడు. ప్రాంతంలోని విద్యాకార్య క్రమాలన్నిటికినీ ఇతడు నాయకత్వం వహించి, వాటిని నిర్వహించెను. హిందూకళాశాలాస్థాపకులలో ఒకడై, ఆ కళాశాలా వ్యవహారాలను, ముప్పైసంవత్సరాలకుపైగా, నిర్వహించినాడు. (1817-1850). 1851 లో, సంస్కృత కళాశాలను ప్రారంభించెను. హిందూ కళాశాలా కార్యనిర్వాహక సంఘానికి అధ్యక్షుడైయుండిన ఆంగ్లేయునితో అభిప్రాయ భేదమేర్పడినందున, రాధాకాంత, ఆసంఘ సభ్యత్వాన్ని త్యజించి, 1853 లో, హిందూ మెట్రొపాలిటన్ కళాశాలను స్థాపించెను. బెంగాలీ పాఠశాలల స్థాపనకు ఇతడెక్కువగా తోడ్పడి, సాంకేతిక విద్యాభివృద్ధికి కూడా ప్రోద్బలమిచ్చెను. స్త్రీ విద్యావిషయాన్ని ప్రోత్సహిస్తూ ప్రభుత్వము, మిషనరీలు ఇతరులు జరుపుతున్న కార్యక్రమాలకూ, ప్రయత్నాలకూ, స్త్రీజన విద్యావ్యాప్తికీ పూర్తిగా సహకరించినాడు.

రాధాకాంత పూనుకొన్న ఉద్యమకార్యాచరణమున కంతటికీ, ప్రేరకము

మైన ఆశయాలు రెండు. హిందూమత సంరక్షణ, భారతప్రజల జీవితాభ్యుదయము,- అనేవి ఈ ఆశయాలు. ప్రథమ ఆశయాన్ని సాధించడంలో, అతని ప్రయత్నము, సంప్రదాయవాదాన్ని అనుసరించింది. హిందూ కళాశాలలో ప్రవేశం హిందువులకు మాత్రమే ప్రత్యేకించడము, కళాశాలసమితి సభ్యత్వం నుండి రామమోహన్‌రాయ్‌ని బహిష్కరించడము, రామమోహన్‌రాయ్ అనుయాయుడైన విలియమ్ ఆడమ్‌కు కళాశాలలో అధ్యాపక పదవిని నిరాకరించడము, విద్యార్థులలో స్వేచ్ఛావాదాన్ని వ్యాప్తిచేయడానికి బాధ్యుడైన డెరోజియోను (Derojio) ఉద్యోగమునుండి తొలగించడము,- ఇత్యాదులన్నిటిలోనూ, కళాశాలసమితి ఇతని ప్రోద్బలంతోనే నిర్ణయం తీసుకొన్నది. కళాశాలలోని ఒక అధ్యాపకుడూ, అతని ననుసరించి, ఒక విద్యార్థీ, క్రిశ్చియనుమతములో చేరిపోవడం, ఇతనికి పెద్ద ఆఘాతమయింది. అధ్యాపకుడూ, విద్యార్థీకూడా, కళాశాలను వదలవలసి వచ్చింది. ఈ కారణంగా కళాశాలాసమితి అధ్యక్షుడైన డ్రింక్‌వాటర్ బీడనుకూ,- రాధాకాంతదేవుకూ సంబంధం బెడిసింది. అంతతో రాధాకాంత, ఆ కళాశాలాసభ్యత్వాన్ని, త్యజించెను.

హిందూమతముతో రాధాకాంతకుగల గాఢానుబంధమెట్టిదో, ఈ సంఘటనలు ప్రదర్శించుచున్నవి. దేశంలో జరిగిన ప్రతిమతపరివర్తనమూ, హిందూమతముపై బడిన ఒక ఆఘాతంగా, ఇతడు భావించినాడు. క్రీస్తుమతంలో చేరినవారిని మరల హిందూమతంలో కలుపుకోడానికై, పతితోద్ధారసభను స్థాపించెను. ఆ కాలంలో, విస్తారప్రచారమున్న ఆంగ్లవారపత్రిక, 'ఫ్రెండ్ ఆఫ్ ఇండియా', ఈ సభాస్థాపననుగురించి, "ఈ శతాబ్దంలో జరిపిన సంఘటనలలో మిక్కిలి ప్రధానమైనది పతితోద్ధారసభాస్థాపనము" అని వ్రాసింది.

1867 లో రాధాకాంత మరణించెను. హిందూజాతి ఆత్మగౌరవ పునరుజ్జీవనము, భారతసంస్కృతి పునఃప్రతిష్ఠ,- ఇవి, వారసులైన మనకతడు ఇచ్చిపోయిన ఆస్తులు.

*పరివర్తన వాదులు :* దేశంలో ఆంగ్ల విద్యాభ్యాసానికి మొదట పూనుకొని విద్యావంతులైన వారితో ఈ రెండవవర్గం ఏర్పడింది. హిందూ కళాశాలలో శిక్షణపొందిన వారికే వర్గంలో ప్రాధాన్యం సిద్ధించింది. 'యువక బెంగాలు' లేక, నవ్యబంగాళం, అని వీరికి వ్యవహారము. లాక్, హ్యూమ్, రీడ్, స్టీవర్ట్, బ్రౌన్, బెంథామ్, వంటి తాత్త్వికుల రచనలనూ,-టాంపేయిన్, వోల్టేర్, ఆడమ్‌స్మిత్, వంటి చింతన శీలుర రచనలనూ, డ్యూయీ, న్యూటన్ వంటి విజ్ఞానశాస్త్రజ్ఞుల రచనలనూ, పఠియించి, పాశ్చాత్య హేతువాద సమన్వితమైన జ్ఞానాన్ని వీరు అలవరచుకొనియుండిరి. రాబర్ట్‌సన్, గిబ్బన్‌వంటి ఆంగ్లచరిత్రకారుల గ్రంథాలనూ, భావనాత్మక కవితనూ, వచనసారస్వతాన్ని, వీరు బాగుగా అధ్యయనంచేసినవారు. పుస్తక పఠనమువల్ల సంపాదించిన జ్ఞానం మాత్రమేకాక, ఆంగ్లాధ్యాపకుడైన హెన్రీడెరోజియో ప్రభావంవల్ల, వీరికిలభించిన జ్ఞానము ఎక్కువైనది. అద్భుత ప్రతిభాశాలియైన ఈ యువక అధ్యాపకుడు వీరి మనస్సులను తీర్చిదిద్దినాడు.

డెరోజియో జీవితంలో రెండుజాతుల మేళనమున్నది; తండ్రిపోర్చుగీసు వాడు, తల్లిభారతస్త్రీ. ఐనా, ఇతడు భారతదేశంతో తనజీవితాన్ని ఐక్యంగావించుకొన్నాడు. ఇతడు విలక్షణ ప్రతిభాశాలి అనడంలో సందేహంలేదు. పధ్నాలుగేండ్లనాటికే ఇతడు, డ్రమ్మండ్ (Drummond) శిక్షణలో పాఠశాల విద్యను పూర్తిచేసుకొని, (1823), భాగల్ పూరులోని ఒక ఆంగ్లకంపెనీలో గుమాస్తాగా ప్రవేశించెను. 1827లో, కలకత్తాకు మరలివచ్చి పత్రికోద్యోగమూ, (Journalism) సారస్వతకృషి, అవలంబించినాడు. ఇండియాగెజెట్, కలకత్తా లిటరరీగెజెట్, బెంగాల్ మాన్యుయల్,(Bengal annual), క్యాలెడాస్కోప్ (Kaleidoscope),- మొదలైన పత్రికల సంపాదకీయరచనల్లో సహకరించెను. 1827 లో, ఇతడు కవితాసంపుటిని ప్రకటించెను. అదే సంవత్సరంలో, హిందూకళాశాలలోని ఉన్నత శాఖలో సహాయక అధ్యాపకుడుగా నియమింపబడినాడు.

ఒక సంవత్సరం తర్వాత, ఆంగ్లసారస్వతము, చరిత్ర, బోధించే ఉపన్యాసకుడుగా (Lecturer) నియోగింపబడెను. అధ్యాపకుడుగా విద్యార్థుల ప్రశంసను భక్తివిశ్వాసాలను సంపాదించుకొన్నాడు. ఇతని ఉపన్యాసాలు ఎక్కువ ఆకర్షకములై యుండడంవల్ల, ఇతని తరగతి విద్యార్థులే- కాక, పై తరగతులలోని విద్యార్థులు కూడా ఇతని ఉపన్యాసాలు వినడానికి వచ్చేవారు. తరగతిలో ఉపన్యసించడం మాత్రమేకాక, ఉపన్యాసానికి పూర్వమునూ, పిమ్మటనూ, విద్యార్థులను కలుసుకొని, అభిప్రాయాలను చర్చించడమూ, పరస్పరం వాటిని గ్రహించడమూ, జరిపేవాడు. ఈ చర్చలకు ముగ్ధులైన విద్యార్థులు, అకాడెమిక్ అసోసియేషన్ (Academic association) అనే పేరుతో ఒక సంఘాన్ని ఏర్పరచుకొనిరి. కవిత, సారస్వతము, తత్త్వశాస్త్రము, నీతిశాస్త్రము, మతము, రాజకీయము,- ఇత్యాది విషయాలనుగూర్చి ఈ సంఘంలో స్వేచ్ఛగా చర్చలు, జరుగుచుండినవి. ప్రతివారమూ జరిగే ఈ సభలలో డేవిడ్ హేర్, సర్ ఎడ్విన్ రియాన్, డాక్టర్ మిల్ (బిషప్ కాలేజీ అధ్యక్షులు)- వంటి ప్రఖ్యాతవ్యక్తులు పాల్గొనేవారు. డేవిడ్ హేర్ యొక్క పాఠశాలలో, డెరోజియో, వారవారం, నీతిశాస్త్రాన్ని, సారస్వతాన్ని, గూర్చి ఉపన్యాసములిచ్చేవాడు.

డెరోజియోవంటి అధ్యాపకులు లభించడం సకృత్తు. స్వార్థరహితమైన విజ్ఞానప్రీతి, సత్యప్రీతి, పాపద్వేషము,-అనే ఇతనిసుగుణములు, ఇతనితో సంపర్కమేర్పడిన ప్రతివారినీ ఆకర్షించి, లోగొన్నవి యుక్తమైన విషయాన్ని, సోక్రటీస్ వలె, ఏకైకదీక్షతో అనుసరించేవాడు. సోక్రటీస్ వలెనే, యువకులనుత్సాహపరచి, సత్యాన్వేషణకు పురికొల్పేవాడు. యువకులను తప్పుదారిలో పెట్టుచున్నాడనే నేరానికి సోక్రటీస్ గురియైనట్లే ఇతడునూగురియై, అతనివలెనె కష్టానికి లోనైనాడు. ఉద్యోగమునుండి తొలగించిన వెంటనే, తనప్రవర్తనను సమర్థిస్తూ, హొరేస్ హేమన్ విల్సన్ కు, ఇతడు జాబువ్రాసెను. తత్త్వశాస్త్రం బోధించడంలో, బేకన్ అవలంబించిన పద్ధతినే అనుసరించి, చర్చనీయాంశాన్ని గురించిన రెండుపక్షాల వాదాలనూ సమగ్రంగావివరించి, నిర్ణయాన్ని

విద్యార్థుల బుద్ధికి వదలివేసినానని, ఇతడు తెల్పుకొన్నాడు. ఉదాహరణకు,- దేవుని ఉనికినిగూర్చి చర్చించేసందర్భంలో, క్లియాంథిస్‌కూ ఫిలోకుజరిగిన ప్రశ్నోత్తరావళిలో, హ్యూమ్ వాదానికి ప్రతికూలంగా, ప్రదర్శించిన వాదప్రతి వాదాలన్నీ సమగ్రంగా వివరించి, పిమ్మట ఈ వాదాన్ని ఖండిస్తూ, హ్యూమ్ పేర్కొన్నసందేహాలకు సమాధానమిస్తూ డ్యుగాల్డుస్టీవర్టు, రీడ్, ఇచ్చినవాదాలను కూడా సంపూర్ణంగా వివరించినాడు. సువిమర్శాత్మకమైన ఇతని బోధనవిధానము, విద్యార్థియువకుల మనస్సులకు బంధనవిముక్తిగావించిది. పుష్పములు వికసించి నట్లుగా వారిమనస్సులు వికసించడమూ, సుప్తమైయున్న వారిమానసిక చైతన్యం ఉద్బోధనుపొందడమూ, గమనించి, ఇతడు సంతోషించేవాడు విద్యార్థులు, అన్నిటి కంటెఎక్కువగా, సత్యాన్ని గౌరవించడం నేర్చుకొన్నారు.

అన్నిటికంటే, ఎక్కువగా మాతృదేశభక్తి అనే జ్యోతిని, తనతోసాహచర్యం గలిగినయువకులకు ఇతడు అందించినాడు. వారితోసంభాషిస్తూ, ఉదాహరించిన,-

"నాదేశమా! నీప్రాచీనవైభవకాలంలో,
సుందరప్రభామండలం నీముఖరేఖను పరివేష్టించినది."

My Country! in My day of glory past
A beauteous halo circled round your brow.

ఇత్యాది కవితాభాగాలు యువకుల హృదయాలను ఉదారభావాలతో నింపి, వారి అభిప్రాయాలకు ఔన్నత్యాన్ని ఇచ్చినవి

డెరోజియో శిష్యులు మధ్యతరగతిలోని వారైనా, ధనవంత వర్గంలోని వారుకారు. కళాశాల జీతాన్ని కట్టడానికి కూడా సమర్థులు కానందున, కళాశాల కల్గించిన ధన సహాయంతోనూ, ఉదారులైన రాజారామ్‌మోహన్‌రాయ్, డేవిడ్ హేర్ వంటి సంపన్నుల సహాయంతోనూ, విద్యాభ్యాసాన్ని సాగించేవారు. ఐనా, ఉన్నతగుణ శీలములతో, ఒప్పివ, సమర్థయువకులు. వీరి ప్రభావము ఆ కాలంపై ప్రసరించింది. డెరోజియో నాయకత్వంలో వీరు, 'పార్థినాన్,' లేక, అథీనియం (Parthenon or Athenium). 'బెంగాల్ స్పెక్టేటర్' వంటి పత్రికలను వెలువరించినారు. 'బెంగాల్ స్పెక్టేటర్' పత్రిక, నవ్యబంగాళమనే (New Bengal) పేరుతో వ్యవహరింపబడుతూ, ఈవర్గంవారి అభిప్రాయ ప్రసారానికి ప్రధాన సాధనంగా ఏర్పడింది.

పద్దెనిమిదో శతాబ్దపు యూరోపియన్ విచారశక్తితో (Thought - విచారశక్తి) పరిపుష్టములైన, ఈ స్వేచ్ఛా పరిశీలన స్వేచ్ఛా చింతనములు (Free enquiry and Free thinking.) భారతీయ సమాజంలోని విపరీత పరిస్థితులను ఎదురోక్కవలసివచ్చింది. మూఢ విశ్వాసములు, నిర్హేతుకములూ, క్రూరములూ ఐన, ఆచారములు, సమాజంలో సర్వసాధారణమైఉన్న నైతిక స్ఖాలిత్యమూ వీటిని పరిశీలించడంతో, ఈయువకుల మనస్సులో జుగుప్స జనించింది. అది వీరి వ్రాతల్లో అతిశయోక్తి రూపంతో వ్యక్తమయింది. కులతత్త్వము,

విగ్రహారాధనము, సతీసహగమనము, స్త్రీలదుస్థితీ, ఇతర సాంఘిక పాపములు,- మున్నగు వానిని ఖండించడంతో తృప్తిపడక, అత్యుత్సాహమునకు లోనైన కొందరు యువకులు, హిందూమత సంస్థను కూడా ఖండింపసాగిరి. కొందరు క్రీస్తుమతములోచేరిరి. మరికొందరు, వేదప్రామాణ్యము నంగీకరింపని దేవాస్తిక్య మతమును (Deism) అవలంబించిరి. కొందరు అన్ని మతములనూ త్రోసివేసిరి. మత సంస్థపై వీరొనర్చిన దాడి, సంప్రదాయవాదుల కోపాగ్నిని రెచ్చగొట్టినది. ఐనా, ఈ యువకుల ప్రయత్నమువల్ల మంచి ప్రయోజనం సిద్ధించింది. తమ విశ్వాసాలనూ, వాటి కాధారములైన సూత్రాలనూ, సంప్రదాయవాదులు పునః పరిశీలన గావించునట్లు చేసింది, ఈ యువకుల ప్రయత్నము విప్లవాత్మకమై, విచార దృష్టి, తత్ఫలితంగా ఏర్పడింది. ఇంతమాత్రమేకాక, తమ సత్యసంధత, గంభీర ప్రవర్తన, మనస్సాక్షితో కూడిన బుద్ధిసామర్థ్యమూ,- ఇత్యాదుల సహాయంతో ఈ యువక హృతోత్సాహులు, సమాజంయొక్క ఆత్మగౌరవ ప్రతిష్ఠలక్షూ, నైతిక ఔన్నత్యానికీ ప్రాధాన్యాన్ని కలిగించినారు. వీరు మాననీయులు. దేశాభిమానము, అనే జాతీయ భావం మొట్టమొదటి సారిగా వీరిలో వ్యక్తమయుంది.

భారతదేశ ప్రాచీనవైభవాన్నీ, ప్రస్తుత అవమాన పరిస్థితినీ, స్మరణకు దెచ్చిన డెరోజియోకవిత, ఈ యువకుల హృదయాంతరాళంలోని భావతంత్రులను మీటి, వీరిని మేల్కొల్పింది. తమ సమకాలీన సమాజముయొక్క లజ్జాకరమైన, అవమానకరమైన పరిస్థితికి ఒకవైపు దుఃఖిస్తూ, మరియొకవైపు ప్రజలను పైకితెచ్చి, వారి పూర్వపు గొప్పదనాన్ని మరల ప్రతిష్ఠించడానికి అనేక మార్గాలలో ప్రయత్నిస్తూ వచ్చిరి. వారిలో కొందరు పత్రికోద్యోగమునకు బూనుకొనిరి. కొందరు సాంఘికసేవలో నిమగ్నులైరి. కొందరు విద్యాంసులుగా ప్రఖ్యాతిచెందిరి. మరికొందరు విజ్ఞానశాస్త్రాభివృద్ధికి తోడ్పడిరి. ఉత్తములూ, సమర్థులూ సత్యనిష్ఠాపరులు, ఐన పరిపాలనాధికారులుగా కొందరు పేరుగాంచిరి. నవబంగాళాన్ని నూతనంగా సృష్టికిదెచ్చిన, ఈ పరివర్తనవాదులలో, కృష్ణమోహన బందోపాధ్యాయ, రసికకృష్ణమల్లిక్, రాధానాథశిక్దార్, దక్షిణరంజన్ ముఖోపాధ్యాయ, ప్యారీచంద్‌మిత్ర, రామ్‌తానూలాహిరీ, ఇతరులూ, ముఖ్యంగా పేర్కొన తగినవారు.

## IV. రాజారామ్ మోహన్‌రాయ్ కార్యక్రమము

బెంగాలులోని, సంప్రదాయవాదులూ, పరివర్తనవాదులూ, అవలంబించిన ఆదర్శాలకు గల మధ్యమార్గాన్ని, రామ్‌మోహన్‌రాయ్ అనుసరించెను. కల్లోలాలతోనూ, కష్టాలతోనూ, కూడిన పరిస్థితుల్లో రూపురేఖలను దిద్దుకొనే జీవితదశ గడిచింది. బెంగాలు ఆ కాలంలో ఆర్థిక, రాజకీయ, విప్లవాలకు లోనైఉండినది: అకాలప్రౌఢమూ, చింతానాత్మకమూ, పరిశీలనాత్మకమూ, ఐనది అతని మనసు. క్షీణదశలోనున్న భారతసంస్కృతికీ, వేగవంతమూ అభ్యుదయకారకమూ ఐన పాశ్చాత్య సంస్కృతికీగల విస్తారమైన భేదము, ఇతనిలో ప్రచండమైన పరిణా

మాన్ని కలిగించింది.

పద్దెనిమిదో శతాబ్దంలోని హిందువులు అవలంబిస్తున్న మతవిధానము, పురాతన మూలాధార స్థలమునుంచి ఎంతోదూరం తప్పిపోయింది. ఉపనిషత్తులను, దర్శనములను అధ్యయనం చేసినవారు అత్యల్పసంఖ్యాకులు. వారుకూడా పౌరాణిక మతనిష్ఠలలోనూ, పూజావిధానంలోనూ ప్రత్యక్షంగా పాల్గొనుచుండే వారు. అత్యున్నతమైన ఏకేశ్వరోపాసన ఎప్పుడోవిస్మృతమయిపోయింది. బహు దేవతోపాసన, విగ్రహారాధనము, వ్యాప్తికివచ్చినవి. భారతీయులు పూజిస్తున్న లక్షలాదిదేవతలలో, బ్రహ్మ,విష్ణు, మహేశ్వరులు అనేత్రిమూర్తులు వారిపత్నులు, ప్రధానదేవతలుగా భావింపబడిరి. అదికాక అవతారాలు, స్థానికులైనదేవుళ్ళు, దేవతలు,-వీరిలోకూడా భక్తివిశ్వాసము లేర్పడినవి. వివిధదేవతల ఉపాసన విధానాల ననుసరించి, వివిధ కుల వర్గాలేర్పడినవి. ఉదాహరణగా, - ఎడమ చేతితో చేయవలసిన తాంత్రికపూజావిధానములు, అసహ్యాకరములూ, అశ్లీలములూ, ఐనవి. దుష్టపిశాచములు, దయ్యాలు, వీటియందు నమ్మకం విస్తారంగా ఏర్పడింది. వాటికి ఉపశమనం కలిగించి, వాటి ఆగ్రహాన్ని పోగొట్టి, వాటి దయను సంపాదించవలసి యున్నది. మానవవ్యవహారములపై, సూర్యచంద్రాది గ్రహములకు ప్రభావమున్నదని గ్రుడ్డినమ్మక మేర్పడింది. ప్రతికార్యాచరణానికీ జ్యోతిష్కుని సలహా అవసరమయింది. పండుగలకూ, తీర్థయాత్రలకూ జీవితంలో అధిక ప్రాధాన్యమేర్పడింది. క్రింది తరగతులలోని ప్రజలు అగాధమైన మూఢ విశ్వాసాలలో మునిగిపోయినారు. సజీవములు, నిర్జీవములు,- ఐనవన్నీ పూజార్హములైనవి. పాములు, కోతులు, చెట్లు, నదులు, శిలలు, రాళ్ళు, దేవుళ్ళు, దేవతలు,- అన్నీ ఆరాధింపబడుతూ వచ్చినవి. చరకపూజవంటి, హింసాత్మకములైన విధానాలూ, అసహ్యాకరములైన ఇతర ఆరాధనలూ, ఆచరణలోనున్నవి.

కులతత్త్వము భద్రంగా స్థిరపడింది. సాంఘికమైన అసమానత్వము విధి విహితమైనదని భావింపబడింది. బెంగాలీ బ్రాహ్మణులు, 'కులీనత్వం' అనే బహు పత్నీత్వమును పాటిస్తూ వచ్చిరి. అదివారి విశేషస్వత్వమని సాంప్రదాయకంగా సమర్థింపబడింది. సమాజంలో స్త్రీకిగల స్థానం అధమమైనది. విధవలను బలవంతంగా భర్తల శవములతో సహాకాల్చడం, శిశువులను (ముఖ్యంగా స్త్రీ శిశువులను) నదీ ప్రవాహములో పారవేయడం, జగన్నాథుని రథచక్రాల క్రింద మనుష్యులను నలిపి వేయడం,- మొదలైనవన్నీ పుణ్యకార్యాలుగా, పరిగణింపబడినవి. "భారతదేశ చరిత్ర, చాలకాలంగా, ముందుకు ప్రవహింపక, మురుగుగుంటగా ఏర్పడింది. అలసట జెంది, సత్యాన్వేషణకు స్వతంత్ర ప్రయత్నమేమాత్రమూ చేయజాలక, జీవితానికి సంబంధించిన సాహసోద్యమాలనన్నిటినీ వదలీ, ఆంతర బాహ్య జీవితాన్ని కడిగి, శుభ్రం గావించే ప్రయత్నాన్ని కేమాత్రమూ పూనుకోక, తనక్షీణ స్థితిని తానే పూజ్యభావంతో చూస్తూ, కాలప్రభావంవల్ల పరివర్తన మొందుతున్న మానవ జీవితానికి అను గుణంగా తన జీవితాన్ని పొందికపరచే ప్రయత్నమేమాత్రమూ చేయక సమాజము స్తబ్ధమైపోయింది. ఆరోగ్య దారిద్ర్యంవల్లనూ,

విజ్ఞాన దారిద్ర్యంవల్లనూ, భారత ప్రజాజీవిత జ్యోతులన్నీ వరుసగా, ఒకటి వెంబడి ఒకటిగా ఆరిపోయినవి" అని రవీంద్రనాథటాగోరు వాపోయినాడు.

ఇట్టిపరిస్థితులను పరివర్తనమొనరించడమనే మహాత్కార్యానికి బూను కొన్న రామమోహన్‌రాయ్, బ్రాహ్మణ కుటుంబంలో రాధానగర్‌లో జనించినాడు. (1774). ఇతని తండ్రి భూస్వామి. 'రాయ్‌రాయన్' అనే బిరుదు ప్రథమంగా వహించిన, ఇతని తండ్రి, తాత, ముత్తాతలు, బెంగాలు నవాబుల కొలువులోనివారు. అతని బాల్యజీవితాన్ని గురించిన వివరాలు తెలియరావు. మొదట ఇంటిలోనూ, తర్వాత ఆ ఊరి పాఠశాలలోనూ చదివినట్లు తెలుస్తుంది. ఆ పాఠశాలతో అతడు సంస్కృత, పారసీక, బెంగాలీభాషలను అభ్యసించినాడు పిమ్మట పారసీక, అరబ్బీ, సంస్కృతభాషల అధ్యయనానికై పాట్నాకూ, బనారసుకూ, పోయినాడు. సుమారు పదహారుసంవత్సరముల ప్రాయంలో, అతడు గృహంలో సత్యస్వరూపాన్ని తెలుసుకోలేక, సత్యాన్వేషణార్థమై గృహంవదలి, ఉత్తర భారతంలోనూ, హిమాలయప్రాంతములోనూ పర్యటనం గావించెను. ఈ పర్యటన కాలంలో, బౌద్ధలామాసిద్ధాంతాలను అధ్యయనంచేసినాడు అనడానికి ఆధారములున్నవి. రాధానగరులోని సంస్కృత పండితునివద్ద ఇతడిదివరకే, తాంత్రిక సిద్ధాంతాన్ని గ్రహించినాడు. ఇస్లాము ధర్మశాస్త్రాన్నీ, ఇస్లాము యోగరహస్యాలనూ, ఇతడు తన అరబ్బీ, పారసీక, గురువులనుండీ నేర్చియుండెను. ఇస్లాము విజ్ఞానమతని మనస్సు నెక్కువగా ఆకర్షించి, పరివర్తనం కలిగించిందని చెప్పవచ్చును. "వివాదములతోనూ, తార్కికచర్చలతోనూ కూడిన, తన జీవిత యాత్రకు అరబ్బీల తర్కశాస్త్ర విజ్ఞానంతో, సంసిద్ధుడై యుండెనని తెలుస్తుంది. తక్కిన తర్కశాస్త్రము లన్నిటికంటెనూ అరబ్బీతర్కం శ్రేష్ఠమైనదని అతని అభిప్రాయము". ముతాజిలా తత్త్వశాస్త్రం, ఇతని కెక్కువ సంతృప్తి కలిగించింది. కనుకనే, ఇతడు పలుమార్లు, హాఫిజ్, జలాలుద్దీన్‌రూమీ రచనలనుండి పద్యాలను ఉదహరించేవాడు. ఇతని తండ్రి అవసానకాలంనాటికి (1803), ఇతడు ఈస్టు ఇండి యాకంపెనీ సేవలోచేరి, రెండేండ్లకాలం పనిచేసెను. పిమ్మట డిగ్బీకి దివానుగా నియమితుడై, అతనితో 1814 వరకూ పనిచేసెను. డిగ్బీ ఇతనికి మిత్రుడై, ఆంగ్లభాషను బోధించెను.

ఈ పది సంవత్సరాలకాలంలో, రామమోహన్, పాశ్చాత్య భావాన్నీ, సారస్వతాన్నీ, దీక్షతో అధ్యయనంచేసి, ఆంగ్లంలో శ్రేష్ఠమైన శైలీ విన్యాసాన్ని పెంపొందించు కొన్నాడు. ఇతని శైలిని ప్రశంసిస్తూ, బెంథామ్ "హిందువు పేరుండడంవల్ల గుర్తించవలసిందేకాని, లేకపోతే ఇతని శైలిని అత్యుత్తమ శిక్షణను పొందిన ఆంగ్లవిద్వాంసుని శైలియని తలంపకతప్పదు." అని వ్రాసియున్నాడు. వాస్తవంగా, జేమ్స్‌మిల్ శైలికంటె, ఇది ఉత్తమమైనదని తలచినారు. 1814 లో, డిగ్బీ ఇంగ్లాండు నుండి మరలి వచ్చి రామమోహన్‌రాయ్, కలకత్తాలో నివాసమేర్పరచుకొన్నాడు. సంస్కరణ, ప్రజాసేవలతో నిండిన; ఇతని అద్భుత జీవితదశ ఇప్పటినుంచీ ప్రారంభమయింది. మతము, సమాజము,

నీతిశాస్త్రము, అనే మహాసమస్యల విషయమై తన కార్యక్రమాన్నిదివరకే నిశ్చయించుకొనియున్నాడు. సమాజంలో పాతుకొనియున్న అజ్ఞానము, విచారహీనత, అనే అంధకారాన్ని నిర్మూలించి, సహేతుకమైన ధర్మనిష్ఠను ప్రవిష్టించడానికై, కార్యక్రమరంగంలోకి దూకినాడు.

కలకత్తాలో, ఇతనికి, సెరంపూర్ మిషనరీలతో పరిచయమేర్పడింది. ప్రస్తుతం ఆచరణలో నున్నమూఢవిశ్వాస దురాచారాల విషయంలో మాత్రం మిషనరీలు గావించిన విమర్శన సరియైనదని ఒప్పుకొన్నాడు. వీరివిమర్శ, ఇతనిని క్రీస్తుమతాధ్యయనానికి పురికొల్పింది. క్రైస్తవులబైబిలు వాక్యాలనూ, చర్చివారు (Church) వికసింపజేసిన మతధర్మశాస్త్రాన్నీ, సునిశితపరిశీలనతో, పఠించినాడు. ఈ అధ్యయనానికై గ్రీకు, లాటిన్, హీబ్రూ, భాషలనునేర్చుకొని, క్రైస్తవదేవతాశాస్త్రజ్ఞుల గ్రంథములను పఠించినాడు. జీససుక్రీస్తుబోధనలను మెచ్చుకొన్నాడు; కాని, బైబిలులోని హరవాదాన్నీ, ఔద్ధత్యాన్నీ, అతిలౌకికాద్భుతచర్యలనూ, తిరస్కరించెను. హిందూమతాన్ని సమర్థించడంతో మాత్రమే ఆగక, క్రైస్తవమతంలోగల హేతువిరుద్ధములైన విశ్వాసాలనూ, నిష్ఠలనూ విమర్శింపనారంభించినాడు.

ప్రకృతివిరుద్ధములైన అద్భుతచర్యలు (Miracles) త్రితయైక్యమైన దేవతాప్రకృతి (Triune nature of Divinity), నిష్కళంకగర్భధారణము,-మున్నగు క్రైస్తవ విశ్వాసాలనుఖండిస్తూ, ఎదురుదాడిసాగించి, ప్రకృతి విరుద్ధములూ, హేతువిరుద్ధములూఐన, వీటినిసమర్థించుకొండని, విరోధులైన మిషనరీలకు పని కల్పించెను. క్రైస్తుమతానికేమాత్రమూ హిందూమతము తీసిపోదని సమర్థించినాడు. బెంగాలు హరకారుపత్రికలోని ఇతనిరచననుండి ఉద్ధృతమైన క్రిందిభాగం ఈ విషయాన్ని నిర్ధారణచేస్తుంది.

"మనబుద్ధివికాసానికి, తేజోకిరణాన్ని ప్రసాదించిన ఆంగ్లేయులకు, మనం రుణపడియున్నామని క్రైస్తవులు చెప్పుతున్నారు. కేవలం యాంత్రిక విజ్ఞానశాస్త్రాలకు సంబంధించియున్నంత వరకు, ఈ విషయమై నేనువారితో ఏకీభవిస్తున్నాను. మనం వారికిఅంశంలో కృతజ్ఞులమే. కాని, విజ్ఞానము, సారస్వతము, మతము, ఇత్యాదివిషయములలో, వారికి మనమేమాత్రమూ రుణపడియుండలేదనడం ధ్రువము .విజ్ఞానోదయం ప్రథమంగా, ప్రాగ్దేశాల్లోనే జరిగిందనీ, ప్రపంచం మనప్రాచీనులకు రుణపడిఉన్నదనీ, చరిత్రనుబట్టి నిశ్చితమైయున్నది. జ్ఞానదేవతదయవల్ల సమృద్ధమైనభాష, తత్త్వశాస్త్రము మనకు నిలిచియున్నవి. విజ్ఞానశాస్త్రసంబంధమైన, అతీంద్రియములైన భావాలను తమభాషలో వ్యక్తమొనర్పజాలక అన్యభాషాపదజాలాన్ని ఎరువుతెచ్చుకొంటున్న ఇతరదేశాలకంటె మనదేశముశ్రేష్ఠమైయున్నది." ఇట్లు, సంస్కృతికీ భావప్రపంచానికీ సంబంధించిన ప్రధానవిషయాల్లో, పాశ్చాత్యుల ఆధిక్యం వాస్తవమైనదికాదని నిరూపించి, హిందువుల ఆత్మప్రత్యయానికి మరలజీవంపోసినాడు. మిషనరీలు, వారిసహాయులు

జరిపినదాడి కారణంగా, అలజడిచెందిన భారతజాతికి, స్థైర్యం చేకూరింది. పాశ్చాత్యవిజ్ఞానంవల్లను, క్రిశ్చియను మతభోధలవల్లనూ, భారతీయులు క్రీస్తుమతంలో చేరిపోగలరనే భ్రాంతి మూలకస్వప్నం విరిసిపోయింది.

ప్రాచీనకాలంలో ఆచరణలోఉండిన హిందూమత విశుద్ధస్వరూపాన్ని ఒకవైపు సమర్థిస్తూ, తరువాతికాలంలో ఈ మతంచుట్టూ దట్టంగా గోడలవలె, వ్యాపించిన భ్రష్టతను, అమానుషాచారాలను ఇతడు ఖండిస్తూవచ్చినాడు. అలక్ష్యంవల్ల, శతాబ్దాలుగా శిథిలమౌతూవచ్చిన మతసంస్థచుట్టూ ఎర్పడిన, దురాచారములనే ఈ గోడలను బద్దలుకొట్టడానికి, ఇదివరలో, కబీర్, నానక్, దాదూ, మున్నగుసంస్కర్తలు ధైర్యంతో పూనుకొని యుండిరి.

"కులతత్వము, బహుభార్యాత్వము, కులీనమతాచారము, సతీసహగమనము, శిశుహత్య మున్నగు దురాచారాలవల్ల హిందూసమాజవృక్షము, పూర్తిగా పుచ్చిపోయియుండడము" గమనించి రాంమోహన్‌రాయ్ దుఃఖాక్రాంతుడైనాడు. నైతికప్రవృత్తి అధమాధమస్థాయికి దిగిపోయింది. దుర్వ్యసనాలు, సోమరితనము, సాంఘికకలహాలు, వర్గకలహాలు,—అనేచర్యలతో ప్రజలు కాలాన్నివ్యర్థంచేస్తున్నారు. దేశంలో సమగ్రంగా, ఉత్తర దక్షిణంగా ప్రాక్పశ్చిమంగా వ్యాపించిన అజ్ఞానమూ, మూఢవిశ్వాసమూ, తాండవంచేస్తున్నవి. దేశమంతా అంధకారంతో వ్యాప్తమైఉంది; ఈ చీకటి ఎప్పుడు విడిగి పోతుందో, ఎవరూచెప్పలేరు.

కలకత్తాలో అతడున్నపది హేనేండ్ల కాలంలో, అతడు నిర్వహించిన తీవ్ర కార్యాచరణము, సమాజంలో అసాధారణమైన సంక్షోభనుకలిగించింది. పరివర్తన వాదులు, సంప్రదాయవాదులూ గావించుచున్న ఉద్యమకార్యక్రమము, రాంమోహన్ ఉద్యమానికితోడై, కలిసి, మధ్యతరగతి వర్గంవారి మనోభావాలలో, ముఖ్యంగా విద్యావంతుల సంఘంలో,—గొప్పపరివర్తనాన్ని తెచ్చినవి. చలనంలేక, స్తబ్ధమైయున్న సంప్రదాయ వ్యవస్థపట్ల, మధ్యయుగాల దృక్పథం మారింది. భావప్రవృత్తిలోనూ, కార్యప్రవర్తిలోనూ, నూతనక్రియా శక్తి ఉత్పన్నమయింది. రాంమోహన్‌రాయ్ సర్వతోముఖంగా నిర్వహించిన ఉద్యమప్రభావమే, ఈ పరివర్తనకు కారణము.జాతీయ జీవనంలో అతడుస్పృశించి, బాగుచేయని అంశమేలేదు.

*మత విషయంలో అతని అభిప్రాయాలు :* వాస్తవికము, శాస్త్రీయము, హేతువాద సమన్వితము,—ఐనది పాశ్చాత్యవిచారశీలుర భావసృష్టి. అట్టిదే వారి విజ్ఞానము. వైయక్తికము, అంతరోద్భవవల్ల స్వయంప్రకాశితము, ప్రత్యక్షానుభవం వల్ల గోచరమైన సత్యస్వరూపముఐనది, ఉత్తమ విద్యఅని ప్రాచీనభారతీయుల అభిప్రాయము. ద్వివిధమైన ఈ విజ్ఞానాలకు సమన్వయము కూర్చడం రామ్‌మోహన్‌రాయ్‌కి, ప్రధానసమస్యగా ఏర్పడింది. కేవలం ప్రయోగాత్మకపద్ధతి వల్ల సిద్ధించిన పాశ్చాత్యజ్ఞానము, హ్యూమ్ ప్రతిపాదించిన అనిశ్చిత జ్ఞానానికీ, సందేహావాదానికీ, శాస్త్రీయమైన భావనాత్మక చింతనకూ, కారణమయింది. కనుక,విశ్వవ్యాపకమైన వాస్తవశక్తి ఒకటి ఉన్నదనే భావాన్ని హ్యూమ్ ఖండించి

నాడు. పాశ్చాత్యజ్ఞానం కేవలం ఇంద్రియ గోచరమైన నిర్దిష్టవస్తు ప్రపంచానికి మాత్రమే పరిమితమయింది. దీనికి వ్యతిరేకమైనది మధ్యయుగకాలపు భారతీయ శాస్త్రము. సర్వవస్తు ప్రపంచాన్ని మనోవీధినుండి బహిష్కరించి, భావనాత్మక మైన ఆదర్శరూప గ్రహణంలో నిలీనమై, భిన్నత్వప్రత్యేకత్వాలను అంగీకరింప నట్టిది భారతీయశాస్త్రవిధానము. వాస్తవ ప్రపంచము సర్వమూ, భావానాత్మక చింతనాసృష్టియని దానిపై ఆధారపడక, కేవలం ఆత్మార్పణ, ధ్యానమననాది అధ్యాత్మయోగంవల్ల, విశ్వరహస్యాన్ని సాధింపప్రయత్నించేది, భారతీయ సిద్ధాంతము. ఇట్టి భిన్నవిధానాలకు సమన్వయం కూర్చప్రయత్నము ననుసరించి, సామాజికవ్యవస్థకు, విద్యావ్యాప్తికీ, సంబంధించిన సమస్యలుకూడ బయలుదేరినవి.

ఇతడు 1803-04 లో, ప్రచురించిన తహ్‌ఫాతుల్ మువహీదీన్ (ఏకార్థ సిద్ధాంతుల కొరక కానుక) అనే వ్యాసపత్రంలో,- "ప్రతి విషయంలోనూ సత్ - అసత్ వివేచన, కావించే విధానానికి, విజ్ఞానసూత్రాల సహాయము, తార్కికశక్తి ఆధారాలు. జ్ఞానసంపాదనకై మనకు భగవంతుడు ప్రసాదించినవరము, తార్కిక శక్తి. అట్టిదానిని నిరుపయోగమని త్రోసిపుచ్చడం అనుచితము." అని వ్రాసినాడు.

మరిన్ని, 'కేనోపనిషత్తు' యొక్క అనువాదమునకు పీఠికవ్రాస్తూ, సంప్ర దాయమునకూ, కార్యకారణబద్ధమైన హేతువాదానికీకల వైరుధ్యాన్ని సూచించి,- "కేవలం సంప్రదాయానికిగానీ, లేదా తార్కికవిమర్శకుగానీ, పూర్తిగా వశులమైపోక, రెండు విధానాలవల్లనూ, మనకు లభించే జ్ఞానజ్యోతితో మన బుద్ధి శక్తినీ, నైతికసామర్థ్యాన్ని పెంపొందించుకోవడం ఉత్తమపద్ధతి"- అని వివరించినాడు.

మరిప్ని- 'ఈశోపనిషత్తు'కు రచించిన అనువాదపీఠికలో "ధర్మశాస్త్ర గ్రంథాలలోని విషయాన్ని పరిశీలించడానికి, తర్కప్రయోజనం అవసరము. ఐనా, దానిని పరిమితంగానూ, క్రమబద్ధంగానూ, ఉపయోగించి, శాస్త్రములు ప్రదర్శించిన, ఆదేశాలను అనుసరించవలెను." అని పాఠకుని కోరియున్నాడు. దివ్యమైన మతనిష్ఠకూ, ఆచరణలో ఉన్న మతానికీ, అంతరము అధికంగా ఉన్న దని, నిరూపిస్తాడు. ఆధ్యాత్మికప్రమాణము, సక్రమ తార్కికచర్చ,- వీటిపై ఆధారపడింది, దివ్యమతనిష్ఠ. నింద్యమైన చపలస్వభావ పరిణామరూపము ఇప్పు డాచరణలోనున్న మత వ్యవస్థ. ఇది, వివేచనారహితమైనది, తార్కికభ్రాంతి మూలకమైనది. సాధ్యాసాధ్యముల భేదములను గమనించక, పరస్పర విరుద్ధము లైన అభిప్రాయముల సమూహంగా ఏర్పడి, సంప్రదాయాధారమున సిద్ధాంతం చేస్తూ, పూర్వభావిలేనిదే అభిమానాన్ని అవలంబిస్తూ,- గ్రుడ్డిగా ప్రవర్తిస్తూ ఉన్నది ఈ మతవ్యవస్థ.

ప్రకృతిరహస్యములను పరిశీలించి, వాటి విషయమై యోచించి, వాటి నిజస్వరూపాన్ని గ్రహింపగలశక్తి ప్రతివ్యక్తికీ ఉన్నది. దాని సహాయంతో, ఈ విశ్వాన్నంతటినీ నడిపేజ్ఞానస్వరూపమైన శక్తి, (భగవంతుడు) ఒకటి ఉన్నదని

అతడు గ్రహింపగలడు. ఈ విషయంలో ఇతరుల ఉపదేశ నిర్దేశాలేవీ అవసరం లేదు. అని మన ప్రాచీనదివ్యమతం నిరూపిస్తుంది". రామ్‌మోహన్‌రాయ్ స్థాపించిన సిద్ధాంతము క్రమవ్యవస్థితమైనదికాదు.

ఆధ్యాత్మికదృష్టికీ, తార్కికబుద్ధి విచారానికీ, ఇతడు ప్రతిపాదించిన సమన్వయసిద్ధాంతంలోగల ప్రమేయవిచార, తార్కికవిచారముల పరస్పరసంబంధములను అతడు పరిశీలించలేదు. ఐనా, అతని తర్వాతివారు అతడు ప్రదర్శించిన మార్గాన్ని అనుసరించిరి. భారతీయ సంప్రదాయ సిద్ధాంతస్వరూపములను భగ్నము గావించడంలో, పరివర్తనవాదులు అత్యుత్సాహాన్ని ప్రదర్శిస్తూరాగా, సంప్రదాయవాదులు తమ సిద్ధాంతాలను మార్చడానికి నిరాకరిస్తూ వచ్చిరి. ఆధునికవిజ్ఞానవ్యాప్తికి, అట్టి పరివర్తనం అవసరమనే విషయాన్ని వీరంగీకరింప లేదు. భారతీయ సంస్కృతియొక్క వైశిష్ట్యాన్ని, దాని ఆధ్యాత్మికస్వాతంత్ర్యాన్ని ఒకవైపు రక్షిస్తూ, పాశ్చాత్యుల తార్కికమైన వాస్తవికదృష్టితో, భారతీయదృక్పథాన్ని సమన్వయపరచే మార్గాన్ని రామ్‌మోహన్‌రాయ్ సూచించినాడు.

ఈ సమన్వయాన్నిబట్టి, వ్యక్తియొక్క ఆంతరజీవితవిషయంలో, ఆత్మస్వాతంత్ర్యం, మరలప్రాధాన్యం వహిస్తుంది. ఇది హిందువుల ఆధ్యాత్మికదృష్టినీ, మతసిద్ధాంతాన్ని అనుసరించినట్టిదే. ముస్లిములవిషయంలోకూడా ఇది సమగ్రంగా వర్తిస్తుంది. పాశ్చాత్యవిజ్ఞానం బోధించే వాస్తవిక ప్రపంచానికికూడా ప్రసరించేవిధంగా, ఈ స్వాతంత్ర్యాన్ని ఇతడు విపులం గావించెను. ఈ విధంగా ఆత్మస్వాతంత్ర్యానికి ఆంతరంగికంగానూ, బాహ్యంగానూకూడా ప్రతిష్ఠకలిగి, ఆత్మాధిపత్యం సిద్ధించింది. దీన్ని అనుసరించి,- స్వతంత్రసంస్థలలోనూ, స్వతంత్రమైన సమాజంలోనూ, స్వతంత్రప్రభుత్వంలోనూ, స్వతంత్రసంకల్పం నెలకొంటుందని తేలింది.

స్వాతంత్ర్యమనే ఈ గృహీతపదం (Postulate), జాతీయ జీవితానికి సంబంధించిన అన్నివిషయాలకూ అనువర్తిత ఆధారంగా ఏర్పడింది. మతము, నీతి, సాంఘికవ్యవస్థ, రాజకీయములు,- అనే అన్నివిషయాలకూ ఈ స్వాతంత్ర్యము ప్రాతిపదికగా ఏర్పడింది. స్వాతంత్ర్యమనే భావాన్ని రామ్‌మోహన్‌రాయ్, ముఖ్యంగా, ఉపనిషత్తులవల్ల గ్రహించినా, ఈ అభిప్రాయాన్ని సమర్థించే అంశాలను ఇతర మతములనుంచి గ్రహించడానికి వెనుదీయలేదు. నీతిమత విషయాల్లో అతడు సర్వసమదర్శి; అతని దృక్పథం విశ్వప్రజకు వ్యాప్తమైనది. గొప్ప మతములన్నీ సత్యప్రతిపాదకములని అతని విశ్వాసము. కనుకనే, ఖండితమైన ఏకేశ్వరోపాసనను, విగ్రహారాధన ద్వేషమును,సాంఘిక సర్వస మతాసూత్రమును, ఈశ్వరునకు ఈశ్వరలక్షణములకుగల సంబంధ సిద్ధాంతమును, జీవనవిధాన ప్రవృత్తులను నిర్ణయించే ఇతరలక్షణములను,-ఇతడు ఇస్లామునుండి గ్రహించినాడు. క్రైస్తవమతం ఏర్పరచిన నీతిసూత్రాలను ఇతడు మెచ్చుకొన్నాడు. జీసస్ క్రీస్తుగావించిన బోధనలపట్ల ఇతనికి అభిమానమెక్కువ,

'తుహాఫాతుల్ మువాహిదీన్' వ్యాసము, ఇతడు తన సత్యాన్వేషణ దశలో రచించినది. ఇస్లాము మతభావము దీనికి ప్రోద్బలమయింది. 'జీసస్ ఉపదేశాలు' అనే ఇతనివ్యాసం, క్రీస్తు మతనీతి సూత్రాలను సమన్వయ పూర్వకంగా క్రోడీకరించింది. నివేదాంత సంగ్రహము, కేన, ఈశ, కఠా, మాండూక్య, ముండకోపనిషత్తుల, అనువాదాలు,-ఇత్యాదులన్నీ పునీతహైందవ మతపునరుద్ధరణ ప్రయోజనమునాశించి, రచితములైనవి. అన్నిమతములనూ, గౌరవించడం, ఏదానినీ నిందించకపోవడం, భానుని కాంతిపుంజము భిన్నవస్తువులపై పడి భిన్నవర్ణములుగా భాసించునట్లు, సత్యము భిన్నమతములలో భిన్నరూపములతో వ్యక్తమగుచున్నదని గ్రహించడం,-ఇవి అతడు మానవులకు బోధించినసత్యాలు. భారతదేశానికి ఆధారమైన ఐక్యస్వరూపానికి, ఈ విధంగా ఇతడురూపు రేఖలను రచియించినాడు.

రామ్ మోహన్‌రాయ్ శతవార్షికోత్సవంలో, ప్రశంసిస్తూ, రవీంద్రనాథ టాగోరు,"భారతదేశ చరిత్రయందలి ఆధునిక యుగారంభంలో, రామ్ మోహన్ ఉద్భవించినాడు. దేశీయులకూ విదేశీయులకూగల విభిన్నత ఎట్టిదో, ఇంకాగుర్తింపబడియుండలేదు. ఐనా, ఆయుగంలో సాధించవలసినది, మానవతాఐక్యమనే విషయాన్ని అతడుగుర్తించినాడు. విజ్ఞానకాంతితో ప్రకాశించిన అతని విశాల హృదయంలో, అన్నిమతాలవారికీ,-హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు,-కావలసినంత స్థలమున్నదని కనుగొన్నాడు. వాస్తవానికి, అతడు భారతదేశ హృదయపేటిక; భారతీయసత్య స్వరూపమతనిలోనే ప్రకాశించింది. ప్రతిమతమునూ గౌరవించి, అన్నిమతములనూ అంగీకరించినవాడే, భారతీయుడని వ్యవహరింపబడడానికి అర్హుడని అతని అభిప్రాయము". అనినుడివియున్నాడు.

రాజకీయ పరిస్థితులవల్లను, సాంస్కృతిక సంఘటనలవల్లను, ఈ మానవైక్యోద్యమం వెనుకబడడం, భేదభావాలు దేశంలో ప్రచారంకావడం, దురదృష్టము.

మత విషయంలో, రామమోహన్‌రాయ్ సాధించినపరివర్తనము, రెండు విధములైనది. ఆవశ్యకములైన వాటిని, అనావశ్యకములైనవాటినుంచి వేరుచేసి, వాస్తవమూ తార్కికబద్ధమూ, నీతిమతసంయోజితమూ, స్వష్టమూ ఐన, వ్యవస్థను ఏర్పరచడం ప్రధానమైనది. నాచుతోనూ, విషవల్లులతోనూ, దట్టంగా అలముకొని, హిందూసమాజజీవితాన్ని నులిమివేస్తున్న, కీకారణ్యాన్ని, అతడు నిర్మూలించినాడు. నిర్మాణాత్మకకార్యక్రమ నిర్వహణలో, అతడు మృదువూ, యుక్తియుక్తమూ, ఐన విధానాన్ని పాటించి, అందరినీ కూడగట్టుకొన్నాడు. దురాచార విధ్వంసకకార్యక్రమంలో, నిర్భీతిగా, ఖండితంగా ప్రవర్తించినాడు. ద్వేషభావమును, నిందావాక్యములను విసర్జించి హేతువిరుద్ధములైన ఆచారాలను, పూజావిధానములను, క్రియలను, కర్మలను, అప్రతిహతమైన తర్కంతో ఖండించి, నిరసించినాడు. విగ్రహారాధనము, సమాజముయొక్క రచనకు భంగం కలిగిస్తుందని అతని అభిప్రాయం. పూజావిధానము దోషం కాకపోయినా విధ్యుక్త

ధర్మంకాదని, వేదమంత్రాలప్రమాణములతో, ఉపనిషత్తుల ఆధారంతో నిరూపించినాడు. సార్వత్రికములు, హేతుబద్ధములు ఐన సూత్రాలకు విరుద్ధములైన ఆదేశాలు, నిషేధాలు, ప్రవర్తననియమాలు, ఇత్యాదులన్నీ శాస్త్రసమ్మతములు కావని, తప్పక విసర్జింపవలసినవనీ, నిరూపించినాడు. ప్రకృతిసిద్ధంగా మానవునిలో, దివ్యత్వం నెలకొన్నదనే ఉదాత్తభావాన్ని, -'ఆత్మావై బ్రహ్మ'-హిందూమతమునుంచి గ్రహించినాడు. మానవుని జీవితాంతరంగంలో నిద్రాణమై యున్న 'అపమానవత్వం' (Subconscious), స్థితినుంచి, మానవాతీతస్థితికి గొనిపోయే శిక్షణకాలము జీవితమనీ, అట్టి ఉత్తమస్థితిని పొందడం అతని ప్రయత్నముపై ఆధారపడి యున్నదనీ, రామ్‌మోహన్‌రాయ్ వివరించినాడు. వేదవాఙ్మయంలో, ప్రోక్తమైన దివైక్యసిద్ధాంతాన్ని పునరుద్ధరింపవలసిందనీ, అర్థరహితమైన పూజావిధానాన్ని విసర్జించవలసిందనీ, ఇతడు ప్రబోధించెను. పవిత్రోపదేశాలను ఆచరణలోపెట్టి, శ్రవణ, మనన, నిదిధ్యాసములనే మూడు అధ్యయన విధానాలను అభ్యసించి, వాటి సహాయంతో విశ్వకర్తను మానవుడు గుర్తింపగలుగుతాడు. అట్టిమార్గాన్ని అనుసరించవలసిందిగా భారతీయుల నతడు ప్రోత్సహించెను. వర్ణ జాతి, మత భేదాలను గమనింపక మానవులను ప్రేమించడం, వారికి సేవచేయడం అనేది, ఉత్తమోత్తమ జీవితసూత్రము, అనే అంశాన్ని నొక్కి చెప్పినాడు. దుష్టములైన మనోవికారాలను, ఆవేశాలను, స్వార్థప్రయత్నాలను జయించేశక్తి, మానవునకు మానసికశిక్షణమువల్ల సిద్ధిస్తుంది. ప్రాచీనులు విధించిన ఆ శిక్షణవిధానాన్ని అవలంబించవలసిందని భారతీయులను ప్రోత్సహించినాడు.

ఆచరణలోఉన్న హిందూమత వ్యవస్థను మాత్రమే ఖండించి, రామ్‌మోహన్‌రాయ్, ఇతరమతములను విడిచిపెట్టలేదు. క్రీస్తుమతములోనూ, ఇస్లాములోనూ హేతువిరుద్ధములని తనకు తెలిసిన విషయాలనుకూడా, నిర్భయంగా, నిస్సంకోచంగా విమర్శించినాడు. జీససుక్రీస్తు బోధించిన వాటిని మెచ్చుకొన్నాడు. శిలువమానుసిద్ధాంతానికి (Doctrine of the Cross), అత్యంత గౌరవాన్ని ప్రదర్శించినాడు. మానవుల పాపనాశనప్రయోజనార్థం క్రీస్తు అనుభవించిన పరార్థకబాధ (Vicarious suffering), మానవాతీత కార్యమని, ఇతని అభిప్రాయము. కాని, క్రీస్తు దివ్యత్వాన్ని ప్రతిపాదించి వాత వాదాన్ని, ఈశ్వరత్రిత్వభావాన్ని (Trinity of the christians), దేవదూతలను, అద్భుతచర్యలను,- ఇతడు అంగీకరించలేదు. అదేవిధంగా, ఇస్లాముమతంలోని ప్రత్యేకతానీతిని, (Exclusiveness), ఒప్పుకోలేదు. మానవజాతినంతటినీ, ఇస్లాము రెండు వర్గాలుగా విభజించింది. ఏకేశ్వరత్వాన్ని, మహమ్మదు ప్రవక్తతను, అంగీకరించినవారుమాత్రమే, ఈశ్వరుని అనుగ్రహపాత్రులనీ, తత్కారణంగా,- వారిప్రవర్తన ఎట్టిదైనా దానితో ప్రసక్తిలేక వారికి స్వర్గప్రాప్తి కలుగుతుందనీ, తక్కిన మానవులెంత సచ్ఛీలురైనా, ఎంత మంచివారైనా, నరకవాసానికి పోదురనీ, చెప్పేవాదాన్ని ఇతడంగీకరించలేదు. ప్రవక్తలలో 'మహా

మ్మదు' కడపటివాడని గ్రహింపపోవడమూ, పవిత్రసూత్రమైన 'కలిమా' ను వల్లింపకపోవడము,- ఇవి ఇతరుల నరకప్రాప్తికి హేతువులని ముస్లిములు విశ్వాసం. దీనిని రామ్ మోహన్ రాయ్ అంగీకరించలేదు.

దేవుళ్లు, దేవతలు, దేవమాతలు, మానవాతీతులైన వ్యక్తులు,- ఇట్టి వారందరూ దేవుని అంశములని చెప్పడము, వారికి దేవునితో అభేదత్వం కల్పించడము, ఇత్యాదులను అతడు ఒప్పుకోలేదు.

*సంఘసంస్కరణ విషయమై అతని అభిప్రాయాలు :* కార్యరూప ఉద్యమంలో, హిందూసమాజంలోని విచారహీనములైన వ్రత నియమాదులను, దురాచారములను రూపుమాపడానికి ప్రథమంగా రామ్ మోహన్ పూనుకొన్నాడు. స్త్రీలపట్ల సమాజవర్తనము, మధ్యయుగకాలపు దుర్లక్షణాలలో ముఖ్యమైనది. ఆస్తిపై వారికి హక్కులేకుండా చేసినారు. జీవితాంతంవరకు వైధవ్యమనుభవించడమో, లేదా, భర్తశవంతోకూడా కాలిచావడమో మాత్రమే వారిగతి. బహుభార్యాత్వంవల్ల ఏర్పడే దుష్టపరిణామాలన్నిటినీ అనుభవించవలసినది స్త్రీయే. విద్యాభ్యాసానికి నోచుకోక, జెనానాసెరలో పడియుండి, ఆశ్రితులుగా, అల్పులుగా గణింపబడుతూ, బ్రతుకుతున్న స్త్రీ జనస్థితి, దాసజనస్థితికేమాత్రమూ తీసిపోదు. ఈ పరిస్థితి పూర్తిగామారిపోయి, స్త్రీలు గౌరవస్వాతంత్ర్యములతో జీవించే అవకాశాన్ని సిద్ధింపచేయవలెనని, రామ్ మోహన్ రాయ్ వాదించినాడు. ఆస్తివిషయమైన ప్రస్తుతపు శాసనాన్నిమార్చి, స్త్రీలకుగూడ ఆస్తిలోభాగము ఏర్పరచవలెననీ, సతీసహగమన విధానాన్ని తొలగించవలెననీ, అతడు పట్టుపట్టెను. స్త్రీలకు పునర్వివాహమును ప్రోత్సహించినాడు. పురుషుల బహుభార్యాత్వ నిషేధం జరగవలెనని, వాదించెను. అన్నిటికంటెను ముఖ్యంగా, స్త్రీల విద్యా ప్రయత్నము జరుగవలెనన్నాడు. కులవ్యవస్థ మరియొక ఘోరమైన దురాచారము. ఇంతవరకూ, దేశదౌర్భాగ్యాలన్నిటికీ, ప్రధానకారణమై, జాతిఐక్యానికి, ప్రజల అన్యోన్య సంయోజనానికి, భంగకరమైనది ఈ కులతత్త్వమే. సమాజాన్నంతటినీ వర్గాలుగా విభజించి, వాటిని వేర్వేరుగా, గాలికూడా ప్రసరించనట్లు, బంధించింది, ఈ కులతత్త్వము. ఆవర్గాలలోకూడా తరతమవర్గాలేర్పడి, ఉన్నత, మధ్యమ అధమాది భేదములేర్పడి, సంఘాన్ని విచ్ఛిన్నం గావించినవి. ఊహింప వీలులేనిదీ, తార్కికవిచారానికి సాధ్యముకానిదీ ఐన, జన్మనుబట్టి ఏర్పడినది కులతత్త్వము. మానవసమాజ వ్యవస్థను అత్యధమస్థితికి ఈడ్చి, మానవులను కేవలం ఉత్పాదకక్రియా జీవులుగా చేసింది. కులవిభాగరచన దృఢంగా ఏర్పడడం వల్ల, వర్గాలపరస్పర సంపర్కసాహచర్యాలకు అవకాశంతగ్గింది. తత్ఫలితంగా, జాతీయైక్యానికి ఆస్కారంలేకపోయింది. కనుకనే, పరిణామశ్రేణిలోని అధమస్థాయికి చెందిన జీవివలె భారతజాతి, అమితసంఖ్యాభివృద్ధిచెందుతూ విస్తరించి చిరకాలం బ్రతికియున్నదే కాని, జీవితచరిత్రలో కలిగిన బాహ్యాఆఘాతాలను ఎదుర్కొనజాలక పోయింది.

స్వాతంత్ర్య, సమానత్వ, భ్రాతృత్వములతో కూడిన ప్రజాస్వామ్యసంస్థ

ఏర్పడడం కులతత్త్వం నశించినప్పుడే సాధ్యమౌతుందన్న విషయాన్ని ఇతడు గ్రహించినాడు. "కులాలు, వాటిలో అసంఖ్యాకములైన ఉపకులాలు,-ఈ విధంగా సంఘము భిన్నాభిన్నమైనందున ప్రజలలో దేశభక్తి, స్వజాతిభావము ఏర్పడలేదు. తొమ్మిదివందల సంవత్సరాలుగా ఇప్పుడనుభవిస్తున్న పరులతిరస్కారానికి మనము పాల్పడియున్నాము. మా అధోగతికంతకూ, కులభేదాలు తత్ఫలమైన అనైక్యమూ, కారణాలైనవి.

ఈ కులమత భేదాలన్నీ నశించడానికి ఉత్తమమార్గము, మహానిర్వాణ తంత్రంలో నియమింపబడిన శైవవివాహ పద్ధతిని అవలంబించడమే, అని అతడు సూచించినాడు.

"వయోవర్ణవిచారో అత్ర నవిద్యతే" వర్ణము, కులము, ఇత్యాదుల కింద ప్రసక్తిలేదు. అని వాక్యార్థము.

*రాజకీయముల విషయంలో అతని అభిప్రాయాలు :* ఇతని కాలమూ, శక్తీ, చాలవరకు మతసాంఘిక సంస్కరణవిషయాలకే వినియుక్తమయింది. ఐనా, ఇతర ముఖ్యసమస్యలనుకూడా, ఇతడు గమనించకపోలేదు. స్వాతంత్ర్యము అనే సూత్రాన్ని వ్యక్తిప్రవృత్తికీ, సాంఘికప్రవృత్తికీ వర్తింపజేసినట్లు, రాజకీయాలకు వర్తింపజేయడంకూడా సహేతుకమైనదే.

రామమోహన్‌రాయ్ స్వాతంత్ర్యాభిమానము కేవలం ఒక భారతదేశానికి మాత్రమే పరిమితమయిందికాదు; అది ప్రపంచమునకంతటికీ పరివ్యాప్తమైనట్టిది. భారతప్రజల, జీవివ్యవస్థకు చెందిన ప్రతివిషయాన్నీ బాగుపరచి, వారిని బాగు పరచడానికై కృషి చేసినాడు. నలభై సంవత్సరాలలో భారతదేశము స్వతంత్ర మౌతుందనీ, ఈ మధ్యకాలంలో, బ్రిటీషు రక్షణపాలనలో ప్రపంచమందలి ఇతర నాగరక స్వతంత్రదేశాలతో, సమానమైన స్థితికి వస్తుందనీ, తన అభిప్రాయాన్ని వెలిబుచ్చియున్నట్లు, ఇంగ్లాండులో ఇతని కార్యదర్శిగా నుండిన ఆర్నాట్ (Mr. Arnot) గుర్తుగా, లిఖించిపెట్టి యున్నాడు. న్యాయపరిపాలనవ్యవస్థలో మత విభేదాలను ప్రవేశపెట్టిన, 1827 జూరీచట్టాన్ని ఆక్షేపిస్తూ, "ఐర్లాండు దేశ విజ్ఞానంలోనూ, శక్తిసామర్థ్యాలలోనూ, పాతికవంతు భారతదేశానికి ఉండిఉంటే, తన సుదూరస్థితిని, సంపదను, విస్తారజనసంపదను పురస్కరించుకొని, బ్రిటనుకు. సహాయకదేశంగా, లాభాన్నీ ప్రయోజనాన్నీ కలుగజేయడమో, లేక, నిష్కర్షగా శత్రుత్వాన్ని వహించి, కష్టాలుకలిగిస్తూ విసుగుకలిగించడమోచేసి ఉండేది" అని వ్రాసినాడు. ఇంగ్లీషువారి ఆధిపత్యం ఇంకనూ చాలకాలందాకా, భారత దేశానికి అవసరము. తన రాజకీయస్వాతంత్ర్యాన్ని మరల సంపాదించుకొనే లోగా, దేశము ఇతర విషయాలలో నష్టం పొందకుండా, భారతదేశానికి బ్రిటీషు ప్రభుత్వము రక్షణ నిస్తుంది." అని ఇతడు 'విక్టార్ జెక్‌మంట్' కు వివరించి యున్నాడు.

రాజకీయాభిప్రాయాల్లో బెంథామ్ అనుయాయియైన రామ్‌మోహన్ రాయ్, బ్రిటీషువారి రాజకీయాందోళన మార్గాలను జాగ్రత్తతో గమనించి,

తమకు జరిగిన అన్యాయాలను, సరిపరచుకోడానికి అవలంబింపవలసిన రాజకీయోద్యమ విధానాన్ని ఏర్పరచుకొన్నాడు. పత్రికాస్వాతంత్ర్యాన్ని తొలగించిన శాసనానికి (1823) ప్రతికూలంగా ఇతడు జరిగిన ఆందోళనోద్యమం మొదటిది. ఇతడు రచించి, ప్రభుత్వానికి పంపిన మహాజరుపత్రము, (Milton) రచించిన 'ఏరియో పెజటికా' తో సమానమైనదని ప్రశంసింపబడింది. మతాన్ని పురస్కరించుకొని, హిందువులకూ, ముస్లిములకూ విభేదాన్ని పాటించిన జూరీ చట్టాన్ని ఆక్షేపిస్తూ, ఈ శాసనాన్ని రద్దుచేయవలసిందని బ్రిటీషు పార్లమెంటుకు అర్జీ పంపినాడు. దానధర్మాదుల నిర్వహణకై ప్రత్యేకింపబడిన ముక్తశుల్కభూములను, ప్రభుత్వంలాగుకొనడంలో, ఈ విధానం అనేకప్రజల జీవితాలను నాశం చేస్తుందని ఆక్షేపిస్తూ, వాదించినాడు. ఇతడు ఇంగ్లండులోనున్న కాలంలో, భారతప్రజల కష్టాలను దుస్థితిని వివరిస్తూ, కంపెనీవారి పరిపాలనలోని లోపాలను ప్రదర్శిస్తూ, ఆ కష్టాలను తొలగించవలసిందని బ్రిటీషు ప్రభుత్వానికి మరియొక మహాజరును పంపినాడు. సంవిధానమార్గంలో, ప్రజలకొరకై ఆందోళన సాగించినవారిలో రామ్ మోహన్ రాయ్ ప్రముఖుడు, అగ్రగామి. దీనినే భారత రాజకీయ నాయకులవలంబించి, నూరు సంవత్సరాలకాలం, ఈ పద్ధతిలోనే తమ ఉద్యమాన్ని సాగించిరి.

భారతదేశంలోని పరిస్థితి స్వయంవిరుద్ధోక్తంగా (Paradosical) ఉన్నదని రామ్ మోహన్ రాయ్ ఎరుగును. తన దేశానికి మాత్రమేకాక, ప్రపంచదేశాలన్నిటికీకూడా స్వాతంత్ర్య మవసరమని అతని అభిప్రాయము. కాని, భారతదేశ సమాజంయొక్క బలహీనతా, అందలి దురాచారాది ప్రతిబంధకవిషయాలూ, అతనిని క్రుంగదీసినవి. ప్రభుత్వ పరిపాలకుల, శక్తిసామర్థ్యముల నితడు నమ్మికొన్నాడు. ఔదార్యము, అభ్యుదయభావము, సంస్కారము కల ఇంగ్లాండు రక్షణపాలనలో, భారతదేశం నైతికంగానూ, ప్రజాసేవావిషయకంగానూ ఉన్నతిని పొంది, స్వాతంత్ర్యానికి యోగ్యతను సంపాదించుకోగలదని, ఇతడాశించినాడు.

రామ్ మోహన్ రాయ్ ప్రతిపాదించిన రాజకీయసంస్కరణలన్నీ, ఈ ప్రయోజనాన్ని ఉద్దేశించినవే. తక్షణం దేశానికి స్వాతంత్ర్యం ఇవ్వవలసిందని ఇతడు కోరలేదు. కంపెనీవారి పరిపాలనవిధానము హేతుబద్ధమైన సూత్రాల ప్రకారముగా నడవవలసిందని మాత్రమే ఇతడు కోరినాడు. సంవిధానబద్ధమైన ప్రభుత్వంలో, న్యాయానికి ప్రాధాన్యం లభింపవలసియున్నది. పౌరస్వాతంత్ర్యమూ, వ్యక్తియొక్క హక్కులూ, రక్షితములు కావలెను. వ్యక్తిజీవితము, ఆస్తి, అభిప్రాయప్రకటనస్వాతంత్ర్యము, మతస్వాతంత్ర్యము,- వీటికి రక్షణ కలుగవలెను. వీటితోపాటు, ఆస్తిపై సంపూర్ణమైన అధికారము, హక్కు, వ్యక్తికి ఏర్పడవలెను.

శాసననిర్మాణ సంస్థవిషయంలో, పరిపాలనవ్యవస్థనూ, శాసనవ్యవస్థనూ వేరుపరచవలెనని, రామ్ మోహన్ గట్టిగా నమ్మినాడు. భారతదేశీయ శాసన

సభను ఏర్పరచడంలో అనేకములైన చిక్కులున్నవని, అతడు గుర్తించినాడు. ప్రజాప్రతినిధులను ఎన్నుకొనే అవకాశాలులేవు కనుక, శాసనసభ ప్రజాప్రతినిధుల సభకాజాలదు. శాసనసభనుకాని, శాసనసమితినికాని, ప్రభుత్వము ఏర్పరచడం కూడా సమంజసమైనదికాదు. అట్లుజరిగితే, ఆ సంస్థలు, అధికారుల ప్రాబల్యానికి లోబడక తప్పవు. శాసననిర్మాణ కార్యక్రమాన్ని కంపెనీ ప్రభుత్వానికి అప్పగించడం కూడా, భావ్యంకాదు. వర్తకాన్ని, లాభాలను ప్రధానంగా చేసికొనియున్న వాణిజ్యసంస్థ ప్రజల కష్టసుఖాల సమస్యను గమనింపదు. దానికి సంబంధం అసంగతము.

ఇట్టిపరిస్థితుల్లో, శాసనిర్మాణాధికారము, పార్లమెంటుకు ఆధిపత్యం వహించిన ఇంగ్లాండురాజుకు అప్పగించడం శ్రేయస్కరము. శాసననిర్మాణాధికారానికి కొన్ని నిర్బంధములను ఏర్పరచడం తప్పక అవసరము. శాసననిర్మాతలకూ, శాసితప్రజలకూ, జాతినాగరకతల విషయంలో ఎక్కువ అంతరమున్నది. ఈ రెండువర్గాలవారూ పరస్పరము దూరదేశాల్లో ఉన్నవారు. కాబట్టి, నిర్బంధాలుండడం అవసరము. ఈ సమస్యలనన్నిటినీ సమన్వయపరచే మార్గాన్ని రామ్‌మోహన్‌రాయ్ సూచించినాడు. ప్రజాభిప్రాయాన్ని నిస్సంకోచంగా, నిర్భయంగా వ్యక్తంచేయగల పత్రికాస్వాతంత్ర్యము ఒకటి. ప్రతిపాదింపబడిన శాసనాలను ముందుగా పరిశీలించడము ముఖ్యము. దానికై, న్యాయవ్యవస్థకూ ఆదాయవ్యవస్థకూ చెందిన ప్రతినిధులతో ఒక సమితిని నియమించడం రెండవది. సంపదలోనూ, బుద్ధిశక్తిలోనూ ఉన్నతులైన వారి సంఘము (జమీందార్లూ, వర్తకులూ), దీనిని సువిమర్శగావించడం, మూడవది. ఈ విధంగా, శాసనాలు ప్రథమంగా ఇండియాలోని ప్రభుత్వముతో ఆరంభించి, అధికారులచేతను, ప్రముఖులైన భారతీయులచేతను పరిశీలింపబడి, కడపట, పార్లమెంటులో శాసన రూపాన్ని పొందుతాయి. ఇది రామ్‌మోహన్‌రాయ్ సూచించిన ప్రణాళిక.

కంపెనీ పరిపాలనలో, న్యాయపాలన వ్యవస్థకు మంచి పేరు ప్రతిష్ఠలు లేవు. పలువిధాల విమర్శలకు న్యాయపరిపాలన విధానము గురియైనది. భారతదేశ సంప్రదాయాలకు ఈ విధానము క్రొత్తది. పైగా, అసమర్థతా, కాలవిలంబము, దుర్నీతి,-వీటికి న్యాయస్థానాలు ఆకరమై ఉండినవి. దీని సంస్కరణ విషయంలో రామ్‌మోహన్‌రాయ్ సూచించిన విధానము సమగ్రమైనది. న్యాయశాఖను కార్యనిర్వాహకశాఖ నుంచి వేరుపరచడము, ప్రజల భాషలతో పరిచయమున్న సమర్థులు, సత్యశీలురు ఐన న్యాయాధిపతులను నియోగించడము, భారతీయులను ఎక్కువ వేతనములపై నియమించడము, కూటపత్రాలకు, తప్పుడు సాక్ష్యాలకూగల కారణములను నిర్మూలించడము, జూరీవిధానాన్ని స్థాపించడము, పంచాయితీ సంస్థల స్వరూపాన్ని దిద్ది, వాటిని అమలులో పెట్టడము, కోర్టు వ్యవహారాల విచారణలను ప్రజలు ప్రత్యక్షంగా గమనించే అవకాశం కల్పించడము,-ఇది అతడి విషయంలో ఇచ్చిన ప్రణాళిక.

కార్యనిర్వాహకశాఖను కంపెనీ ప్రభుత్వంనుండి, పార్లమెంటు అధికారం

లోకి మార్చడం ఇతనికి అంగీకారంకాదు. రాకపోకల సదుపాయాలు సరిగా లేని కాలంలో, వేలమైళ్ళ దూరంనుంచి, భారతదేశ పరిపాలన సాగించడానికి పూనుకోవడం సాహసకార్యము. అదికాక, శాసనాధికారాన్ని వహించిన పార్లమెంటు, కార్యనిర్వాహణాధికారాన్ని కూడా వహించడం, సమంజసమైన పద్ధతికాదు. అధికారుల స్వచ్ఛంద పరిపాలనకు నిరోధకంగా కొన్ని రక్షణలను కూడా, శాసన రీత్యా ఏర్పరచవలెను. తమ చర్యలకు అధికారులు న్యాయరీత్యా బద్ధులై, న్యాయాధిపతుల నిర్ణయానికి లోబడవలసిఉంటుంది. ఇది మిక్కిలి అవసరము.

ప్రభుత్వము, నిర్వహించవలసిన కార్యక్రమంపట్ల రామ్‌మోహన్‌రాయ్ సూచించిన సంస్కరణలు ప్రయోగాత్మకములైనవి. స్వంత ఆస్తిపై వ్యక్తికి సర్వాధికారమున్నదని విశ్వసించినవాడితడు. భూమి వ్యవసాయదారుని స్వత్వము, ప్రభుత్వస్వత్వంకాదు, అని ఇతని నమ్మకము. రైతువారీ విధానంకంటె, జమీందారీ విధానంపై ఇతనికి అభిమానమెక్కువ. సుదృఢమైన మధ్యతరగతి, సమాజానికి శ్రేయస్కరమని ఇతని భావము. భూముల విషయంలో శాశ్వత పరిష్కారాన్ని ఇంకనూ విస్తరం గావించవలెనని కోరుతూ, అదే విధమైన శాశ్వత పన్నునిర్ణయం రైతులకు కూడా కలిగించవలెనని వాదించినాడు. సైన్యపుఖర్చు, మాతృదేశపు ఖర్చు (Home charges) తగ్గించుకొని, ప్రభుత్వ వ్యయంలో పొదుపు పాటించవలసిందని అతనివాదన. తాటస్థ్యనీతికి విరుద్ధమే ఐనా, కూడా, నిశ్చయాత్మకంగా సాంఘిక స్వాస్థ్యాన్ని ప్రభుత్వము, పోత్సహించవలెననీ, నిషేధాత్మకంగా, సతీసహగమనం వంటి సాంఘిక దురాచారాలను శాసనం ద్వారా నిర్మూలించవలసిందనీ, అతడు కోరెను.

రాజకీయవేత్తగా, జాతీయసమైక్యానికి మనఃపూర్వకంగా పూనుకొని, నిష్పాక్షికమైన భ్రాతృభావంతో హిందూముస్లిము సమస్యను పరిశీలించినాడు. ముస్లిముల భారతదేశాక్రమణనుగూర్చి, "గజినీమొదలుగా, ఘోరీవరకూ, ముస్లిములు భారతదేశంపై, దాడిసాగిస్తూ వచ్చినారు. దేశంలో ఐక్యము లేక పోవడము, భిన్నభిన్నప్రాంతాలు భిన్నభిన్న రాజులపాలనలో ఉండడమూ, ఆ రాజులను వారి ప్రజలే, అసహ్యించుకొనుచుండడమూ గమనించి, ఒక్కరొక్కరినే వరుసగా జయిస్తూ, దేశాన్ని ఆక్రమించి, ప్రజాపీడనకరమైన తమ నిరంకుశ ప్రభుత్వాన్ని స్థాపించినారు." అని వ్రాసినాడు. ముస్లిముల వ్యక్తిగత నిరంకుశ ప్రభుత్వాన్నీ, ఆ ప్రభుత్వంలో ఏర్పడిన అరాజకత్వ ప్రజాపీడనాన్నీ, ఇతడు ఆక్షేపించినాడు. "ఐనా, ముస్లిముల పాలనలో, దేశీయులందరూ ముస్లిములతో సమానంగా, రాజకీయ ప్రత్యేకాధికారాలను, హక్కులను అనుభవిస్తూ, ఉన్నతాధికారపదవులను వహించినారు. సైన్యాధిపతులుగా, రాజ్యంలోని ప్రాంతాలకు అధిపతులుగా, రాజులకు ముఖ్యసలహాదారులుగా, మంత్రులుగాకూడా హిందువులు వర్తిస్తూ ఉండినారు. మతము, జన్మము - ఇత్యాది తుచ్ఛభేదాలేవీ, ముస్లిముల పరిపాలనలో గణింపబడలేదు. హిందువులకు భూములను మాన్యాలుగా ఇచ్చి, వాటిపై శిస్తునుకూడా రద్దుగావించినారు. ప్రభుత్వోద్యోగులకు

లభిస్తూఉండిన ఉత్తమవేతనంతోపాటు, బాధ్యత, విశ్వాసములతోకూడిన పదవుల లోని వారి అనుభోగ్యానికై, విశాలములైన సుక్షేత్రములనుకూడా, జతపరచి ఇచ్చినారు. ప్రతిభావంతులు, విద్వాంసులు ఐన, దేశీయుల పోషణార్థమై గౌరవోద్యోగాలనూ, వేతనాలనూ ఇచ్చి వారిని సత్కరించినారు." ఈ అభిప్రాయమిట్లున్నా, ముస్లిము పరిపాలనకు బదులుగా, ఈస్ట్ఇండియా కంపెనీపరిపాలననితడు ఆమోదించడానికిగల కారణాన్ని ఇతడే వివరించినాడు. "రాజకీయాధిపత్యము, అధికారము, లోపించియున్నా, తాము (భారతీయులు), మతస్వాతంత్ర్యాన్ని, పౌరస్వాతంత్ర్యాన్ని, మునుపటికంటె ఎక్కువగా, అనుభవిస్తూ, కంపెనీపాలనలో సుఖులై ఉన్నామని ప్రజలు భావించినారు. ముస్లిముల ఏకేశ్వరోపాసనపద్ధతి, వారి వర్గరహితమైన సాంఘికవ్యవస్థ, ఇతనికి ప్రశంసార్హములైనవి. కనుక, వారి పరిపాలన విధానవిషయమైన ఇతని నిర్ణయము వాటి ప్రభావానికి లోనయినది.

*అతని అంతర్జాతీయ దృక్పథము :* రామ్‌మోహన్‌రాయ్ అవలంబించిన రాజకీయవిధానము కేవలం తన మాతృదేశపు ప్రయోజనానికిమాత్రమే, సంబంధించింది కాదు. తన దేశప్రజల విషయంలోను, ఇతరదేశ ప్రజల విషయంలోను కూడా, ఇతడు స్వాతంత్ర్యాన్ని ఎక్కువగా వాంఛించినవాడు. మానవజాతి సర్వస్వమూ ఒక కుటుంబమని అతని భావము. ఒకజాతి కష్టసుఖాలతో ప్రపంచంలోని ఇతరజాతులకు కూడా, సంబంధమున్నదని ఇతని భావము.

ఆస్ట్రియనులు నియోపాలిటనుల స్వాతంత్ర్యాన్ని అణచివేసిన సందర్భంలో, ఇతడు దుఃఖితుడై, ఒక స్నేహితుడేర్పాటుగావించిన విందుకుకూడా పోలేదు. స్పెయినులో సంవిధానబద్ధమైన ప్రభుత్వమేర్పడినదని వినడంతో, ఉత్సాహాన్నిపొంది, టౌనుహాలులో బహిరంగమైన విందు నేర్పాటుచేసెను. ఫ్రెంచివిప్లవాన్ని గూర్చి విన్నంతనే, ఇతడెంతో ఉత్సాహంతో, ఆరోగ్యం బాగు లేకున్నా, రేవులో త్రివర్ణ పతకాన్ని ప్రతిష్ఠించి యున్న ఫ్రెంచి నౌకలోకివెళ్ళి, వారిని అభినందించి వచ్చినాడు. రాజకీయ సంస్కరణ ప్రతిపాదన, చర్చింపబడుతున్న రోజులలో, ఇతడు ఇంగ్లాండులో ఉన్నాడు. బిల్లు ఏ విధంగా నిర్ణయమౌతుందో అనే సంశయం ఆతనిని పీడిస్తూఉండినది. ఆ బిల్లు నెగ్గకపోతే తాను బ్రిటనుతో సంబంధాన్ని పూర్తిగా తెంచుకొంటానని ప్రతిజ్ఞచేసినాడు. ఫ్రాంసు దేశపు విదేశవ్యవహార మంత్రికి ఒక సందర్భంలో, జాబువ్రాస్తూ, "సమస్తమైన మానవజాతీ ఒక పెద్దకుటుంబము. దీనిశాఖలే, ప్రపంచంలో వివిధజాతులుగా, వర్గాలుగా ఏర్పడినవి." అని తెలిపినాడు. అన్నిదేశాల జాతులునూ కలిసి ఒక సంస్థగా, కాంగ్రెస్ అనేపేరుతో, ఏర్పడవలెననీ, జాతులమధ్య ఏర్పడే వివాదాలన్నీ- రాజకీయము, వర్తకము- ఆ కాంగ్రెసు నిశ్చయానికి వదలవలెననీ, ఇతడు ఆ జాబులోనే సూచించినాడు. విశ్వప్రజతో సానుభూతి, మానవ జీవిత పర్యవసానంలో ఆసక్తి, దూరదృష్టి, గల ఉదాత్తవ్యక్తి మాత్రమే, ఈ విధమైన ప్రపంచరాజ్యవ్యవస్థా ప్రణాళికను, ఒక శతాబ్దం ముందుగా, ఊహించగలుగు

తాడు. రామ్‌మోహన్‌రాయ్ కలలుగన్న ప్రకృష్టమైనశాంతి, ఒకతరంనుంచి మరియొకతరానికి సంక్రమించే శాశ్వతమైత్రీ భావం,- ఇంతవరకూ సిద్ధించలేదు. అది నిజమే. కాని, అతని ఈ ఆశఒక్కటే, మానవజాతి వినాశంకాకుండా రక్షించ డానికి సమర్థమైనది,- అనడం వాస్తవము.

*బ్రహ్మసమాజము :* ఉపన్యాసాలతో, రచనలతో తృప్తిపడినవాడుకాడు రామ్‌మోహన్‌రాయ్. తాను పూనుకొన్న మత సాంఘిక సంస్కరణలు సిద్ధించ డానికై ఇతడొక సమాజాన్ని స్థాపించెను. ఈ సమాజసభ్యులు నియమ ప్రకారంగా ఒకచోట కలుసుకొని, హిందూధర్మ శాస్త్రాలలోని సూత్రముల ననుసరించి, సామూహిక ఆరాధన గావించేవారు. పవిత్రగ్రంధభాగపఠనము, మంత్రపఠనము, మతసిద్ధాంతముల తత్త్వమునుగూర్చి చర్చించడము, పరమేశ్వరుని దయాస్వభావాన్ని, శక్తినిగూర్చి ధ్యానించడము, మానసిక దౌర్బల్యాన్ని జయించడానికి మౌనధ్యాన నిష్ఠను అవలంబించడము, ప్రపంచ ప్రభువైన ఈశ్వర సాన్నిధ్యం కొరకు ప్రయత్నించడము,-ఇత్యాదికార్యక్రమము, ఆ సమాజంలో జరిగేది.

ఈ ఉద్యమ సాధనకు ప్రథమప్రయోగాత్మక ప్రయత్నంగా, ఆత్మీయ సభ 1816 లో, స్థాపింపబడింది. వేదమంత్రపఠనము, మతసంబంధములైన పాటలగానమూ, సభలలో జరిగేవి. సంగీతవాద్య సహాయంతో పాటలుపాడే వారు. 'గులాం అబ్బాస్' అనే ముస్లిము గీతవాద్య ప్రవర్తకుడు. విద్వాంసులను ఆహ్వానించి, వారిచే మతోపన్యాసాలు జరిపించేవారు. 1828 నాటికి, ఉద్యమ ప్రయోగం సఫలమయింది. బ్రహ్మసమాజముద్భవించింది. సమాజము సంఘ టితమైన న్యాస పత్రమూ, (Trust deed) ,సమాజానికి ధనము నిచ్చిన దాతల ఆస్తులూ, ముగ్గురున్యాసధరుల (Trustees) అధీనం గావించినారు. రామ్‌మోహన్‌రాయ్, ద్వారకనాథటాగోర్, ప్రసన్నకుమార టాగోర్, కాశీనాథరాయ్, రామచంద్ర విద్యావాగీశ్,-అను వీరందరూ, తమ ఆస్తులను సమాజానికి దానంగా ఇచ్చినారు.

సమాజంయొక్క ఆశయాలూ, నియమాలూ, న్యాసపత్రంలో వివరింప బడినవి. ఈ ఆశయాలూ నియమాలూ హిందూమత చరిత్రకు విప్లవాత్మకము లైనవి. పదహారో శతాబ్దంలో ప్రచారమైన భక్తి ఉద్యమం తెచ్చిన విప్లవంతో సదృశమైనది. "నిత్యుడు, అగమ్యగోచరుడు, నిర్వికల్పుడు, విశ్వకర్త, విశ్వ రక్షకుడు ఐన ఈశ్వరుని పూజించి, ధ్యానించడం"సమాజం యొక్క ఆశయము. రచితమైన ప్రతిరూపము, విగ్రహము, శిల్పము, ఉత్కీర్ణచిత్రము, రంగుచిత్రము, భావచిత్రము, ఏ ఇతర రూపముకానీ, ఈ సమాజమందిరములోకి తేకూడదు. ప్రాణహాని కలిగించే యజ్ఞము, ఆహారము, పానీయము, ఇతర మతాల దూషణ నిరసనములు, అక్కడ సహింపబడవు.

బ్రహ్మసమాజ సిద్ధాంతాలు, పూజా విధానము, దివ్యసేవ,-ఇత్యాదుల స్వభావ ప్రవృత్తులు, బుద్ధిశాలురైన విద్వాంసులకు మాత్రమే ఆసక్తి కలిగించినది.

దీని తీక్ష్ణమైన బుద్ధిప్రవృత్తి, భావావేశలేశమును కూడా సహింపని నియమము,-ఇత్యాదులు ఉన్నత విద్యావంతులను ధనవంతులను మాత్రమే ఆకర్షించినవి. మధ్యతరగతికి చెందిన సామాన్య సరళ స్వభావులు దీనిపై ఆసక్తిచూపలేకపోయిరి. విద్యారహితులెవ్వరూ సమాజంలో చేరలేదు. ఈవిధంగా ఉద్యమము సర్వసాధారణమైనది కాకపోయినా, దీని ప్రభావం మాత్రము, సర్వత్రా వ్యాపించింది. సంఘంలో అత్యున్నత స్థాయిలోనున్న ప్రముఖ బెంగాలీలు దీనికి అనుయాయులైరి.

తన జీవితంలోని కడపటి మూడు సంవత్సరములూ, రామ్ మోహన్ రాయ్ యూరోపులోనూ, ఎక్కువభాగం ఇంగ్లాండులోనూ, గడపెను. తాను బూనుకొన్న మతరాజకీయ కార్యక్రమాన్ని, అక్కడ నిర్వహిస్తూవచ్చెను. ఇంగ్లాండులోని, వివిధ సంస్థలతని ప్రాముఖ్యాన్ని గుర్తించి, గొప్ప భారతీయ నాయకుడుగా గౌరవించి, అతనినాహ్వానించేవి. అతడు బ్రిస్టల్‌లో మరణించెను. (1833). ఇదివరకు సాధించిన అద్భుతకార్యక్రమమే కాక, ఇంకను ఎక్కువగా సాధిస్తాడన్న ఆశ అంతతో అంతమయింది.

ఉత్తేజకరమైన ఇతని నాయకత్వం లోపించడంతో, బ్రహ్మసమాజోద్యమం దెబ్బతిన్నది. నిర్వేదముతోనూ, అభిప్రాయభేదాలతోనూ కొంతకాలం వ్యర్థమయింది. సమాజ కార్యక్రమభారాన్ని వహించిన ద్వారకనాథటాగోరు, తగినంత కాలాన్నీ, శ్రద్ధనూ వినియోగించ లేకపోయెను. అంతట, అతని కుమారుడు దేవేంద్రనాథటాగోరు, బ్రహ్మసమాజంలోచేరి, దానికి నూతనచైతన్యాన్ని ఇచ్చినాడు. బాల్యంలోనే, ఇతడు రామ్‌మోహన్‌రాయ్ దృష్టినాకర్షించి యుండెను. యువకుడుగా ఇతడు ప్రజాకార్యక్రమాల్లో ఆసక్తిగహించి, సాధారణ విజ్ఞానసంపాదక సంఘము(Society for the acquisition of knowledge), తత్త్వబోధినీసభ, మొదలైనవాటిలో సభ్యుడై, కృషిచేసియుండెను. అతడిప్పుడు ముఖ్యపట్టణాలలో బోధకులను నియమించి, సమాజప్రచారానికి తత్త్వబోధినీ పత్రికను సాధనంగా చేసికొనెను. అక్షయ కుమారదత్తా, ఈ పత్రికా సంపాదనకు బూనుకొన్నాడు.

*సమాజంలో ఛిద్రము (Schism) :* రామ్‌మోహన్‌రాయ్ మరణానంతరము, క్రిశ్చియన్‌మిషనరీలు, అలెగ్జాండర్ డఫ్‌నాయకత్వంలో, మరల విజృంభించిరి. విద్యావంతులైన భారతీయుల దృష్టిలో, హిందూమతానికి గౌరవం కలిగించడానికీ, హిందువులను క్రీస్తుమతములో చేర్చడానికీ ఉద్యమమారంభించిరి. ఈ ఆపదను సమాజము, పత్రికా ఎదుర్కొన్నవి. బుద్ధివికాస ప్రాధాన్యంవల్ల బ్రహ్మసమాజము, శుష్కము, నీరసము అనదనే ఆక్షేపణకు సమాధానంగా, రాజనారాయణ్, పూజావిధానంలో భక్త్యుత్సాహాన్ని ప్రవేశింపజేసెను. సమాజము యొక్క సిద్ధాంతాలను, నియమాలను సమర్థిస్తూ వ్యాసములు, పుస్తకములు ప్రచురింపబడినవి. పూజావిధానాన్ని సూత్రప్రాయమొనర్చడానికి, పవిత్రకర్మల (Sacraments) నిష్కర్ష గావింపబడింది. క్రిశ్చియనులతో ఏర్పడిన వాద ప్రతి

వాదాల మూలంగా, వేదప్రామాణ్యమును గూర్చి సమాజంలో భేదాభిప్రాయ మేర్పడింది. రామ్‌మోహన్‌రాయ్ నిర్ణయించిన మార్గంలో, సమాజ మూల స్వభావాన్ని మార్చకూడదని, దేవేంద్రనాథు అభిప్రాయం. ఎ. కె. దత్ మొదలైన పరివర్తనవాదులు దీనికివ్యతిరేకంగా నిలిచి, తమ పూజావిధానానికి హిందప సంప్రదాయానుగుణమైన స్వరూపాన్ని ఏర్పరచిరి.

1858లో సమాజసభ్యుడుగా చేరిన కేశబ్‌చంద్రసేన్, ఈ యువక పరివర్తనవాదులకు నాయకత్వంవహించి, వారి ననుసరించి, సాంఘిక మతసంస్కరణలకు బూనుకొనెను. సమాజం అంగీకరించున పరిమిత కార్యక్రమాన్ని అధిగమించు, అధికపరివర్తనకు ప్రారంభించిరి. 1866లో సమాజభిద్రం ఏర్పడింది. దేవేంద్రనాథటాగోరువర్గము, ఆదిబ్రహ్మ సమాజమనే పేరుతో వేరుపడింది. కేశవచంద్రసేనునివర్గం, భారతీయ బ్రహ్మసమాజము, లేక 'నవవిధాన' మనేపేరుతో, రెండవసమాజంగా ఏర్పడంది.

*భారతీయులలో ఆధునిక భావోత్పత్తి-రాజకీయోద్యమ ప్రారంభము :* సంప్రదాయవాదులు, పరివర్తనవాదులు, ఉదారవాదులు తమ తమ మార్గాల ననుసరించి, భారతీయుల మనస్సును ఆధునిక భావోన్ముఖ మొనర్చే ప్రయత్నము గావించినారు. పాశ్చాత్య సంస్కృతికీ, సంప్రదాయాను బద్ధమైన భారతీయుల దృష్టికీ, జీవిత విధానానికీ, ఏర్పడిన సంఘర్షణ సమస్యను విడదీయడానికి, తమ అభిప్రాయానుసారంగా బూనుకొనిరి. భారతీయుల ఆత్మవిమర్శకూ, ఆత్మ పరిశీలనకుం ఈ ప్రయత్నము దారితీసింది. తత్ఫలితంగా పాశ్చాత్యదేశాల వ్యక్తిత్వానికి భిన్నమైన వ్యక్తిత్వం, భారత జాతికి కలదనే భావమూ, చైతన్యమూ, ఉదయించినవి. దీని ననుసరించి, భారతీయుల భావనాసముచ్చయంలో మతనైతిక స్వాతంత్ర్యము, గర్భితమై, యున్నదనే పరిజ్ఞానమూ, ఈ పరిజ్ఞానమునకు భారతీయ సమాజముయొక్క స్వతంత్ర భావము ఉపాధిగా ఉన్నదనే వాస్తవ జ్ఞానమూ, సిద్ధించినవి.

మానవుల ప్రస్తుత జీవితానికీ, అనంతర జీవితానికి నియతి ఎట్టదనే మూలాధార సమస్యలను గూర్చి, నూతన మధ్యతరగతికి చెందిన బుద్ధిమంతులు ఆలోచించి, అది, దేశము యొక్క సాంఘిక రాజకీయ సమస్యలతో, ముడిపడియున్నదనే సత్యాన్ని గుర్తించిరి. సాంఘిక సమస్యలనుగూర్చిన వారి దృక్పథంలోనూ, అనుసరించిన విధానాల్లోనూ, భేదములుండినవి. కాని, రాజకీయ సమస్యల విషయంలో, విభేదాలు స్వల్పం మాత్రమే.

వీరిలో, ఎక్కువ ఔత్సుక్యాన్ని ప్రదర్శిస్తూ, నిస్సంకోచంగా తమ అభిప్రాయాలను వెలిబుచ్చిన వారు పరివర్తన వాదులు. రాజకీయ, సాంఘిక, మత సంస్కరణ విషయంలో సమగ్రమూ సమంజసమూ, ఐన విధానాన్ని వీరు అవలంబించిరి. భారతీయులూ, బ్రిటీషువారూ ప్రతిపాదించి అనుసరించే, అభ్యుదయ విరుద్ధమైన సంప్రదాయవాదమును ఎదుర్కొవడంలో,దయాదాక్షిణ్యాలు చూపిన వారుకారు. బెంథాము ప్రతిపాదించిన స్వాతంత్ర్య సూత్రాన్ని వీరు విశ్వసించిన

వారు. విశాలమైన లౌకికదృష్టితో వీరు ప్రజాస్వపరిపాలనను అభిమానించినవారు. ఆర్థికవ్యవస్థ విషయంలో తాటస్థ్యనీతిని ఆమోదించి, వాణిజ్య నీతి ననుసరించిన వర్తకపద్ధతులను వ్యతిరేకించిరి. 1830 లో జరిగిన ఫ్రెంచి విప్లవాన్ని మెచ్చుకొన్నారు. అట్టి విప్లవం తమదేశంలో కూడా జరుగవలననే వాంఛ వీరికి ప్రబలమై ఉండినది. సమగ్ర భారతదేశమనే భావమప్పుడే వీరి మనస్సులో స్థిరపడ, దేశభక్తి భావాలతో వీరి హృదయాలు నిండినవి. పరివర్తనవాదియైన కాశీప్రసాదఘోష్ అనే కవికి, భారతదేశము "దేవతాభూమి, నాజన్మ భూమి" అనేభావం ఉత్తేజనాన్ని ఇచ్చింది. భారతదేశం 'ధన్యస్వాతంత్ర్య' స్థానాన్ని అధిష్టించడం, కలలుగన్నాడు.

ఈ పరివర్తనవాదుల కార్యక్రమాలు విస్తారములైనవి. తమ అభిప్రాయాల ప్రచారానికై, అనేకములైన సంఘాలను స్థాపించిరి. ఇదివరలో పేర్కొన్న 'అకెడిమిక్ అసోసియేషన్' ఒకటి. 1838 లో, సాధారణ విజ్ఞానసంపాదక సంఘము, తారాచంద్రమిత్రా అధ్యక్షతలో ప్రారంభింపబడింది. రామగోపాల్ ఘోష్, ప్యారీచంద్ మిత్రా, రామ్‌తానూలాహిరి,- అనువారు ఈ సంఘకార్య నిర్వాహకవర్గంగా ఏర్పడిరి. సభలలో, రాజకీయవిషయములతోసహా, అనేక ఇతర విషయములపై చర్చలు జరిగేవి. కంపెనీవారి దండనీతి, న్యాయపాలననీతి, పోలీసువ్యవస్థ,- మొదలైన విషయాల "ప్రస్తుత పరిస్థితి" అనే వ్యాసం అలజడి కలిగించింది. ఈ వ్యాసమందలి కొన్ని అంశాలను, కళాశాలాధ్యక్షుడు, రిచర్డ్సన్ ఆక్షేపించగా, సభాధ్యక్షుడైన తారాచంద్ చక్రవర్తి, ఆక్షేపణను త్రోసివేసెను. 'థియో ఫిలాంత్రిక్ సొసైటీ',- వీరు స్థాపించిన మరియొకసంఘము. దీనిని కిశోరీచంద్‌మిత్రా 1843 లో, స్థాపించెను.

తమ ఆశయాలసిద్ధికై వీరుపయోగించిన ఇతరసాధనం పత్రికాప్రచురణము. ఇదివరలో పేర్కొన్నవికాక, పార్థినాన్, జ్ఞానాన్వేషణ్, బెంగాల్ స్పెక్టేటర్, హిందూపయొనీర్, ఎన్‌క్వైరర్, క్విల్,- అనేవి వీరు ప్రారంభించిన ఇతర పత్రికలు. బెంగాలులో రాజకీయ చైతన్యప్రచారానికి, వీటిలోని రచనలు ప్రబలంగా తోడ్పడినవి.

సంవిధానబద్ధమైన ఆందోళనము ప్రయోజనముకాగలదని రాంమోహన్ రాయ్ విశ్వసించినాడు. పరిపాలకుల సదుద్దేశంలో కూడా, ఆతనికి విశ్వాసమెక్కువ. 1833 శాసపత్రంలోని అనుబంధాలూ, బెంటింకు అవలంబించిన ఉదారవిధానమూ, ఈ విశ్వాసం సమంజసమైనదని ధ్రువపరచినవి. కాని, బెంటింకు తరవాత, ప్రభుత్వ విధానము వ్యతిరేకమయింది. రాజకీయ పరిజ్ఞానముగల వర్గంవారికి, క్రమంగా భ్రాంతి తొలగింది. ప్రభుత్వవిధానాలపట్ల వారి విమర్శ, తీక్ష్ణము కాజొచ్చింది. స్వశక్తిపైననే భారతీయులు ఆధారపడవలసి యున్నదనే ఘోష ప్రబలమయింది. ఈస్ట్‌ఇండియాకంపెనీ వహించిన రాజకీయ శాసనాధికారం అంతంకావలెనని, భారతీయ శాసనసభ నిర్మాణము జరుగవలెనని, న్యాయపాలన వ్యవస్థ సంస్కరింపబడవలెననీ, పలువురు ఉద్ఘోషింపసాగిరి. విద్యాప్రసారము, సాంకేతిక విద్యాలయాల

స్థాపన, పౌరస్వాతంత్ర్యపరిరక్షణ, భూస్వాముల అతిక్రమణలనుండి రైతుల హక్కులకు రక్షణ, ఉన్నతోద్యోగాలలో భారతీయులకు ఎక్కువ అవకాశము,-మున్నగునవి జరుగవలెననే ఆందోళన అధికమయింది. ప్రజలకుగల ప్రకృతిసిద్ధమైన హక్కులకు ప్రాధాన్యము కలుగవలెననీ, ప్రజల సంకల్పాభిప్రాయాలపై, ప్రభుత్వము, ఆధారపడవలెననీ, కోరుతూవచ్చిరి. ప్రభుత్వానికి అధికారం ప్రజల వల్లనే సిద్ధిస్తుంది. కనుక, ప్రజాప్రతినిధులతో కూడిన శాసనసభల ద్వారా, పరిపాలన నిర్వహణలో ప్రజలు పాల్గొనడము, వారి హక్కని వాదించిరి. పరివర్తన వాదుల ప్రచారసాధనమైన తత్త్వబోధినీ పత్రికకు సంపాదకుడైన అక్షయకుమారదత్తు, తీవ్రమైన దేశాభిమానం గల వ్యక్తి. పాశ్చాత్య తత్త్వశాస్త్ర సారస్వతాలలో, అతని మనస్సులీనమై ఉండినది. ప్రభుత్వ కార్యక్రమం పట్ల ఉత్కర్ష భావాలు కలవాడతడు. ప్రభుత్వము, సమాజం యొక్క కార్యకారి (Agent) మాత్రమే. వ్యక్తులప్రాణమాన ధనాలను రక్షించడము, ప్రభుత్వ కర్తవ్యము. ఈ కర్తవ్యం ఉపాధిగా, ప్రజలనుంచి పన్నులు వసూలు చేసే అధికారము, హక్కు, ప్రభుత్వానికి సిద్ధిస్తాయి. శారీరకంగా, నైతికంగా, ఆధ్యాత్మికంగా, సమాజాన్ని అభివృద్ధికితెచ్చే బాధ్యత ప్రభుత్వముపై ఉన్నది. దారిద్ర్యాన్ని రూపుమాపడం, ఉచిత నిర్బంధ విద్యను రెండు సంవత్సరాల వయస్సునుండి పదహైదు (పదిహేను) సంవత్సరాల వయస్సు వరకూ ఏర్పాటు చేయడము, వివాహము, కుటుంబము మున్నగు వాటికి చెందిన సాంఘిక విషయాల్లో సంస్కరణలు కలిగించడం,-ఇవన్నీ ప్రభుత్వము చేయవలసిన కార్యక్రమాలు,- ఇత్యాదులు అతని అభిప్రాయాలు.

ప్రభుత్వాన్ని నిర్దాక్షిణ్యంగా విమర్శించేవాడు దత్. దౌర్జన్యం పెరగడమూ ప్రజల ఆరోగ్యం భంగపడడమూ, మతము నిర్మూలింపబడడమూ, వస్తువుల ధరలు పెరగడమూ,- ఇవన్నీ కంపెనీ పరిపాలన ఫలితాలనీ, ప్రజానీకము దుస్థితిలో మునిగి యున్నదనీ, ఇతడు నిస్సంకోచంగా ప్రకటించినాడు. పరప్రభుత్వంపై దేశం ఆధారపడియుండడమే ఈ దుస్థితికంతటికీ ప్రధానకారణమని ఇతని దృఢాభిప్రాయము.

రామ్‌మోహన్‌రాయ్ శిష్యులు సమాజంలో ఎక్కువ పలుకుబడికలవారు. టాగోరు కుటుంబమువారు ఈ వర్గంలో ముఖ్యులు. (ద్వారకనాథ్, అతని కుమారులు,- దేవేంద్రనాథ్, ప్రసన్నకుమార్) ప్యారీచంద్, కిశోరీచంద్, అనే మిత్రా సోదరులు, హిందూ పేట్రియట్ సంపాదకులైన గిరీషచంద్రఘోష్, హరిశచంద్రముఖర్జీలు, రామ్‌మోహన్‌ఘోష్,-ఇత్యాదులు ఈ వర్గంలోనివారు. రాజకీయరంగంలో, ఇంకనూ పెక్కురు వీరితో సహకరించి పనిచేయుచుండిరి.

ఇండియాలో శాసనసభానిర్మాణము; పాశ్చాత్యులు ఇండియాలో స్థిర నివాసం ఏర్పరచుకోవడము,-అను రెండు విషయాలలో తప్ప, తక్కిన అన్ని అభిప్రాయాలలోనూ వీరు రామ్‌మోహన్‌రాయతో ఏకీభవించినారు. కార్యక్రమ నిర్వహణలో వీరు తమ నాయకుడు ప్రదర్శించిన మార్గాన్ననుసరించి,

విశ్వాసంతో, వ్యవహరించినారు. ప్రజల కష్టాలను తొలగించవలసిందని కోరుతూ, సభల మూలంగానూ, అర్జీలు మహజర్లు మున్నగువాటి ద్వారానూ, ఆందోళన సాగించిరి. వీరి ఈ కార్యక్రమంతో, సంప్రదాయవాదులు కూడా ఏకీభవించిరి. రాధాకాంతదేవ్, రామకమలసేన్, భవానీ చరణబంధోపాధ్యాయ,-వీరు సంఘ కార్యక్రమాల్లో పాల్గొని, తమ వ్రాతల సహాయంతోనూ, ఉపన్యాసాల సహాయంతోనూ, జాతీయ వ్యవహారాలపట్ల ప్రజలకు ఆసక్తి కలిగించినారు.

పరివర్తనవాదుల భావాలను, ఉదారవాదుల అభిప్రాయాలనూ, ప్రచారం గావించిన బెంగాలీపత్రికలలో, సంబద్ కౌముది, జ్ఞానాన్వేషణ్, సంబంద్ ప్రభాకర్, బెంగాల్ స్పెక్టేటర్, తత్త్వబోధినీ పత్రిక-, ఇత్యాదులు ముఖ్యములైనవి.

ఆంగ్లభాషా పత్రికలలో, రిఫార్మర్, హిందూ ఇంటెలిజెన్సర్, బెంగాల్ రెకార్డర్, అనునవి వీరి ఉద్యమానికి అమూల్యమైన సహకారాన్ని ఇచ్చినవి.

## VI. పశ్చిమ భారతంలో సంఘ సంస్కరణ.

పశ్చిమ భారతంలో, మహారాష్ట్రప్రాంత రాజకీయ చరిత్ర బెంగాలు చరిత్రకు భిన్నమైనది. పద్దెనిమిదో శతాబ్దపు ప్రథమ భాగంలో, పీష్వాలు, తమ ఆధిపత్యము మహారాష్ట్ర ప్రాంతంలోనేకాక, మధ్యభారతంలో కూడా, చాల భాగంపై నెలకొల్పియుండిరి. తరువాత వీరు, ఢిల్లీ వ్యవహారాల్లోనూ, దోబ్‌లో కూడా కలుగజేసుకొని, ఒకప్పుడు పంజాబు ప్రాంతంలోకి కూడా చొచ్చుకొని పోయిరి. కానీ, 1761లో, మహారాష్ట్ర సామ్రాజ్యం వెనకబడడంతో, సరదారులపై పీష్వాల అధికారం సడలిపోయింది. అంతః కలహాల కారణంగా, బ్రిటీషు వారు జోక్యంచేసుకొని, పీష్వాల రాజ్యాన్ని తమ భూభాగంలో కలుపుకొనిరి. అంతతో, స్వతంత్రులైన మరాఠా సర్దారులు ఈస్ట్ ఇండియా కంపెనీ యొక్క అధిరాజత్వాన్ని అంగీకరించిరి. ఇట్లు, బెంగాలు ఆక్రమణ తర్వాత డెబ్బదియైదు సంవత్సరాలలో, మహారాష్ట్ర రాజ్యాలు బ్రిటీషు పరిపాలనలోకి వచ్చినవి.

పీష్వాల ప్రభుత్వము, వందసంవత్సరాల కాలము పరిపాలన సాగించియుండినా, ప్రజల పరిస్థితిలో ఎట్టి మంచి పరివర్తనమూ కలుగలేదు. ఆర్థికంగా బెంగాలు కంటె దరిద్రస్థితిలో నుండినది మహారాష్ట్ర ప్రాంతము. పరిశ్రమలలోనూ, వ్యవసాయంలోనూ, కూడా ఈ ప్రాంతం వెనుకబడింది. అంత ర్దేశీయ, విదేశీయ వ్యాపారం కూడా ఈ ప్రాంతంలో అత్యల్పము. ప్రభువులకూ ప్రజలకూ మధ్య సామరస్యముండినది. కాని ప్రజల దృష్టి సంకుచితమైనందువల్ల, సమాజం, చలనమేమాత్రమూ లేక, స్తబ్ధమై పోయింది. భావంలో చైతన్యము లేక, మత విశ్వాసాలలోను, సంస్థలలోనూ, అభ్యుదయం కలుగలేదు. మూఢ విశ్వాసాలకు ప్రజలు దాసులై పోయిరి. కులతత్త్వము ప్రజలపై అధికారం వహించింది. బ్రిటీషు వారితో కలిగిన జీవనసంఘర్షణలో, సమాజము యొక్క దౌర్బల్యమూ, ప్రభుత్వము యొక్క దౌర్బల్యమూ వ్యక్తమైనవి.

బ్రిటీషు ఆక్రమణవల్ల మహారాష్ట్రంపై కలిగిన ఆఘాతం, విప్లవాత్మక మైనది కాలేదు. రాజకీయంగా, బ్రాహ్మణుల ప్రాబల్యం నశించింది. భూమి శిస్తుల విషయంలో రైతువారీ విధానాన్ని నెలకొల్పడంవల్ల, భూస్వాములైన మధ్య తరగతి వర్గము, ఏర్పడలేదు. పంటభూమి నిస్సారమైనది కావడంవల్ల, వ్యాపారం అభివృద్ధికాలేదు. పరిశ్రమను పెంపొందించడానికి, ఎక్కువగా ప్రత్తి పంట మాత్రమే సహకరించింది. విద్యావ్యాప్తి చాల మందంగా సాగుతూ వచ్చింది. సంఘంలో మధ్య తరగతి వర్గం దుర్బలంగా ఉన్నందున, పాశ్చాత్య ప్రభావం ఎక్కువగా ప్రసరింపలేదు.

కాని, ప్రజానీకంపై పాశ్చాత్య ప్రభావం వ్యాపించే అవకాశం 1818 లో ఏర్పడింది. జయింపబడిన మహారాష్ట్ర ప్రాంతంపై బ్రిటీషు పరిపాలన విదాన మేర్పడింది. బ్రిటీషువారు ఆదాయావకాశాలను గూర్చిన పరిశీలనము ప్రారంభించిరి. న్యాయస్థానాలను స్థాపించి, న్యాయపరిపాలన విషయమైన నియమ నాలను క్రోడీకరించిరి. విద్యా పరిస్థితిని గూర్చి విచారణజరిపి, గవర్నరు అధ్యక్షతలో బొంబాయి దేశీయవిద్యాలయాన్ని, పుస్తక సంఘాన్ని (Book Society), 1822 లో, స్థాపించిరి. బొంబాయి రాజధానికి నూతన గవర్నరుగా వచ్చిన ఎలిఫిన్‌స్టన్, పరిపాలనలో పరివర్తనం రావడం తప్పనిసరియని తెలిసిన వాడే. కాని, ప్రాచీన వ్యవస్థను ఒక్కసారిగా మార్చివేయడం సమంజసము కాదని గుర్తించి, పాలిత ప్రజలభావాలను, చిత్తవృత్తులను గౌరవించవలసిందిగా తన క్రింది ఉద్యోగులను హెచ్చరించెను. గవర్నరు అవలంబించిన జాగ్రత్తవల్లను, ప్రాంతంలో సర్వసాధారణమైయుండిన సంప్రదాయ ప్రబలమైనవాతావరణం వల్లను, సాంఘికాభ్యుదయం వేగంగా జరుగలేదు. ఐనా, బ్రిటీషువారు ప్రవేశ పెట్టిన నూతన విద్యావిధానము, మిషనరీల కార్యక్రమము, కారణములుగా, ప్రజల మనస్సులు ఉత్తేజితములైనవి. చిరకాల సంప్రదాయంగా వ్యవహారంలో నిలిచియున్న సమాజ సంస్థలను, నూతన దృష్టితో పరిశీలించడానికి ఆరంభించిరి. పాశ్చాత్యుల తార్కిక దృష్టి, ప్రకృతిశాస్త్రాలలో వారు సాధించిన అభ్యుదయము, పారిశ్రామిక నైపుణ్యము, రాజకీయ పరిపాలన వ్యవస్థలు,-వీటిని పరిశీలించిన ఆ కాలపు మహారాష్ట్ర విద్వాంసులు, వాటి ప్రభావానికి లోనైరి. ప్రకృతిశాస్త్రములు, భూగోళము, ఇంగ్లాండుదేశ చరిత్ర,- వీటిని చదవడంవల్ల విద్యావంతులలో నూతనమైన నిశ్చయజ్ఞానం పెంపొందింది. సమాజంలోని అన్యాయాలు, సాంస్కృతిక విషయమైన స్తబ్ధతా, నైతిక భ్రంశమూ, వీరి దృష్టిని ఆకర్షించినవి. తమ మత ప్రచారానికి అమితోత్సాహంతో పూనుకొనిన మిషనరీలు, హిందూమతాచారాలను ఖండించి, తిరస్కరించడం మానలేదు. కనుక, నూతన విద్యనభ్యసించిన భారతీయులు తమ ప్రాచీన మతసిద్ధాంతాలను, సాంఘికాచారాలను, సంస్థలను, సునిశితంగా పరిశీలించడం ఆవశ్యకమయింది. తమ సమాజవ్యవస్థను, జీవనవిధానాన్ని, తార్కిక దృష్టితో పరిశీలించినారు. సంఘములోని అన్యాయాలను-నిర్మూలించడానికి, మత సంస్థను సమాజ ప్రవర్త

నను, సంస్కరించడానికి పూనుకొనిరి.

మితవాదులైన సంస్కర్తలు : జగన్నాథ శంకరశేట్, బాలశాస్త్రి జంబేకర్, విష్ణుశాస్త్రి బాపత్, కృష్ణశాస్త్రి ఛిప్లుంకర్,-మున్నగువారు నూతన సంస్కరణోద్యమానికి బూనుకొనిన ప్రముఖులు. బాలశాస్త్రిపూర్వులు విద్వాంసులైన పురోహితులు. సంపన్నుల గృహాలలో వీరు పురాణపఠనం గావించేవారు. 1812వ సంవత్సరం కడపట బాలశాస్త్రి జన్మించెను. తండ్రి శిక్షణలో సంస్కృతమునూ, మరాఠీని శీఘ్రంగా నేర్చుకొన్నాడు. 1825లో, బంధువులితనిని విద్యావ్యాసం నిమిత్తం బొంబాయికి పిలుచుకొనిపోయి, క్రొత్తగా స్థాపింపబడియుండిన ఆంగ్లపాఠశాలలో ప్రవేశపెట్టిరి. తీక్షబుద్ధిగల ఈ బాలుడు, పాఠ్య విషయాలను అతిత్వరలో సాధించి, బహుమానము లన్నిటినీ సంపాదించుకొన్నాడు. పదహేడేండ్ల వయసువచ్చుసరికి ఇతడు సంస్కృత మహారాష్ట్ర భాషలలో పాండిత్యము సంపాదించడమేకాక, ఆంగ్లము, గుజరాతీ, బెంగాలీ, పారసీక భాషలనుకూడా అభ్యసించినాడు. పాఠశాల విద్యలో సాధించిన గణనీయమైన అభ్యుదయం కారణంగా, అతనికి పుస్తక సంఘంలో, దేశీయభాషా సహాయక పదవి లభించింది (1830). ఈ సంస్థయొక్క అధికారులద్వారా, ఇతనికి బొంబాయిలోని పాశ్చాత్య విద్వాంసుల ప్రముఖవర్గములో ప్రవేశం లభించింది. అతడు గావించిన విస్తారమైన అధ్యయనము, పాశ్చాత్య పండితులతో కలిగిన సాహచర్యము, ఇతని దృక్పథాన్ని విశాలంగావించి, సామాజిక విషయమైన అంతర్వివేకాన్ని మేల్కొలిపినవి. నీతి, సాధారణ విజ్ఞానము, అనే విషయములపై, విద్యార్థుల ప్రయోజనంకొరకు ఇతడు పుస్తకములను రచించెను. తరువాత ఉత్కంఠాప్రేరితుడై, ప్రయోజనకారియైన, పత్రికారచనోద్యమానికి సాహసించి, 'బొంబాయి దర్పణ' మనే మరాఠీ వార పత్రికను ప్రారంభించెను. (1832). దీని తర్వాత 'దిగ్దర్శన్' పత్రిక వెలువడింది (1840).

దర్పణ్ మొదటిసంచికలో, బాలశాస్త్రి ఈ క్రింది విధంగా వ్రాసియున్నాడు. "మన పరిపాలకుల మాతృదేశంలో, పత్రిక, అనే మహోద్భుతశక్తి ప్రవృత్తిలో ఉన్నది. అది మానవుల మనస్సులను మలినపరచుచున్న అజ్ఞాన దురాచారాలను తుడిచివేసి, జ్ఞానజ్యోతిని ప్రకాశింపజేయుచున్నది. పత్రికలు ప్రచారములలోనున్న అన్ని దేశాలలోనూ, జీవితానికి ఆవశ్యకములైన లాభాలను ప్రజలు పొందినారు. సారస్వతాన్ని, విజ్ఞానశాస్త్రాన్ని ప్రోత్సహించడానికి, అవి సాధనములైనవి. పత్రికలమూలంగా శాశితమై సామాజికనైతికవ్యవస్థ పవిత్రమయింది. ఒకవైపు పాలితప్రజలకు వినీతత్వాన్ని బోధిస్తూ, మరియొకవైపు, నిరంకుశంగా, నిరపేక్షంగా, అధికారం నడపకుండా పరిపాలకులను అరికట్టుతూ వచ్చింది." భారతదేశంలోని ఈ ప్రాంతం బ్రిటీషు ఆధిపత్యంలోనికి వచ్చి కొంతకాలమే ఐనా, చిరకాలంగా ఇచ్చట నెలకొనియుండిన అజ్ఞానాంధకారం క్రమంగా విరిసిపోవడం ఆరంభమయింది. మనలను అధిగమించుచున్న ఆంగ్లేయుల శ్రేష్ఠగుణాలను మనంకూడా అలవరచుకొని, వారితో సమానమైన ప్రతిపత్తిని

పొందగలరోజులు శీఘ్రమే రానున్నవి." "మనస్సును విస్తరింపజేసి, ప్రయోజన కరమైన విజ్ఞానాన్ని ప్రసారం చేయడం, దిగ్దర్శన పత్రికయొక్క ఆశయమని," అతడు వివరించినాడు.

మహారాష్ట్రప్రాంతంలో వ్యాప్తిగాంచిన పాశ్చాత్య ఉదారవిద్యవల్ల అభ్యుదయం చెందిన వారిలో బాలశాస్త్రి ప్రథముడు. ముప్పై సంవత్సరములు కూడా పూర్తికాకపూర్వమే బాలశాస్త్రి అస్తమించడం, దేశదురదృష్టము. అతని ప్రతిభ పూర్తిగా వికసించడానికి వ్యవధిలేకపోయింది. ఐనా, ఈ కొలదికాలంలోనే, పాశ్చాత్యవిజ్ఞానాన్ని, సర్వజనాదరణీయం గావించడాని కితడు ప్రయత్నించి నాడు. సంఘసంస్కరణోద్యమానికి బూనుకొని, విధవా పునర్వివాహము, స్త్రీజనవిద్య, మతాంతరంచెందినవారికి హిందూమతంలోకి పునఃప్రవేశము,- మొదలైన సమస్యలనుగూర్చి, ప్రచారం గావించెను. ఐనా, బాలశాస్త్రి ఇతని అనుయాయులు,- హిందూమతమూలాధారములనుండి విడిపోలేదు. చాల కాలంగా విస్మృతములైయున్న ప్రాచీనశాస్త్రాదేశాలకు, నియమాలకు అను గుణంగా, మన ఆచారాలను సరిదిద్దుకోడానికి అవసరములైన మార్పులను, మాత్రమే వీరు సమర్థిస్తూ వచ్చిరి.

*పరివర్తన వాదులు* : శాస్త్రివర్గంవారు ప్రతిపాదించిన మిత సంస్కరణా లతో, అధిక పరివర్తనం గోరేనూతన విద్యావంతులు తృప్తిపడలేదు. ప్రాచీన హిందూసంస్థ యొక్క ప్రయోజకత్వం ఎప్పుడో నశించిపోయిందని వీరి అభి ప్రాయము. ఆధునిక అవసరాలకనుగుణంగా, ప్రాచీనస్మృతులను వ్యాఖ్యా నించడం కింకర్తవ్యమీమాంసకమని (Casuistry) వీరు తలంచిరి. క్రైస్తవ మతము బోధించిన నైతిక విధానము వీరికి బాగా నచ్చింది. ప్రపంచం సర్వ స్వమూ భగవత్సృష్టియైనందువల్ల, శ్రీకృష్ణుడు, బుద్ధుడు, క్రైస్తు, మొహ మ్మదు,-ఇత్యాదులందరూ, సృష్టివ్యాఖ్యాతలు మాత్రమే. కనుక, సర్వమత ములు బోధించిన నీతి సూత్రాల ఆధారంతో మానవ జాతికంతటికీ వర్తించే ఏకైక ప్రపంచమేర్పడవలెనని వీరి నిశ్చయము. రామ్‌బాలకృష్ణజయకర్, దాదోబాపాండురంగ తార్ఖాద్, అతని సోదరుడు, ఆత్మారామ్ పాండురంగ,- వీరందరూచేరి, 'పరమహంస మండలి' అనే సంస్థను బొంబాయిలో, స్థాపించిరి. (సుమారు 1850). ఏకేశ్వర భావము, సార్వజనిక సౌభ్రాత్రము,-అనే సిద్ధాం తాలు ఈ సంస్థకు ఆధారములు. వ్యక్తి యొక్క నైతికాభివృద్ధి ఈ మండలి యొక్క ప్రధానోద్దేశము. నీరసములైపోయిన ఆచారాలను, కర్మలను వీరు ఖండించినారు. దయ, సత్యప్రీతి, న్యాయనిష్ఠ, సహనము,- ఇవి మానవుని ప్రవర్తనను నడిపే సూత్రములని వీరు నిశ్చయించిరి. వీరి ఉద్యమ నిర్వహణకు ప్రేరకులైన వారు క్రైస్తవ మిషనరీలు. ఐనా, తమ సందేశాన్ని మహారాష్ట్ర జనుల భాషలో ప్రచారం గావించడానికి వీరు పూనుకొన్నారు. కాని, సమాజ దూషణలకు, అవమానానికి వెరచి, వీరు తమ కార్యక్రమాన్ని రహస్యంగా నడుపుతూ వచ్చిరి. ఉద్యమానికి స్వతంత్రమైన తాత్త్వికాధారాన్ని వీరు కల్పింప

లేదు. క్రైస్తవ పూజావిధానాన్ని ఎక్కువగా అనుకరించిరి. మిషనరీలకున్న ఉన్నత నైతిక స్థైర్యము, శ్రద్ధా, ఈ మండలి స్థాపకులకులేదు. కావున, వీరి ప్రయత్నము ప్రజల సంశయాలకు గురియయింది. 1860 లో, ఈ సంఘం విడిగి పోయింది.

ఇంతకంటెను దృఢంగా, సంఘ సంస్కరణ రక్షణకు బూనుకొన్నవాడు గోపాల్ హరిదేశముఖ్. 'లోకహితవాది.'అనే కృతకనామంతో రచనలుసాగించి, ప్రఖ్యాతిపొందినాడు. చిన్న జాగీర్దారు కుటుంబంలో జనించి, (1823), ఇతడు పూనాలో, క్షీణదశలోనున్న స్తబ్ధ వాతావరణంలో పెరిగినాడు. పూర్వపు వైభవాన్ని నగరం గోల్పోయింది. జాగీరుదార్లు, బ్రాహ్మణులు ఎక్కువగా నష్టపడియుండిరి. బ్రిటీషు పరిపాలన ఎప్పటికైనా అంతమై, మరల పీష్వాల ప్రభుత్వమేర్పడి శుభదినములు వచ్చునా, అనేదే నిరంతరం అగ్రవర్గాలవారు చర్చిస్తూ ఉండిన విషయము. సమాజమంతా విధివైపరీత్యమనే భావమునకులోనై నిశ్చైతన్యమైయుండినది. ఈ నిరర్థక భావనలకూ బాల్యస్వప్నాలకూ స్వస్తిచెప్పి, కార్యప్రవృత్తిని ప్రబోధించే బాధ్యత, లోకహితవాది పత్రిక వహించింది. స్వశక్తిపై ఆధారపడి, నూతన విద్యార్జనగావించి, సహేతుకమైన జీవన దృక్పథమును ఏర్పరచుకొని, బ్రిటీషు ఆక్రమణయొక్క తాత్పర్యమెట్టిదో గ్రహించవలసిందని, ఈ పత్రిక ప్రజలను ప్రబోధించింది.

నూతన పాశ్చాత్య విద్యావ్యవస్థలో శిక్షణపొందినవాడు గోపాల్ హరి. పూనా ప్రభుత్వ పాఠశాలలోచదివి, ఇంగ్లీషుభాషలోనూ, చరిత్రలోనూ పాండిత్యంగడించి, బుద్ధిమంతుడనే పేరు సంపాదించుకొన్నాడు. దక్కను రాజులకూ సర్దారులకూ, కార్యకారిగా పనిచేయుచుండిన ఏజెంటు కార్యాలయంలో పనిచేస్తూ, న్యాయశాస్త్రం చదివి, 1861లో, మునసిఫ్‌గా నియోగింపబడినాడు. తర్వాత, అహమ్మదాబాదులోనూ నాసిక్‌లోనూ, న్యాయాధిపతిగా పనిచేసెను. 1876లో, ఢిల్లీ దర్బారుకు ఇతడు ఆహ్వానింపబడినాడు. 1878లో, యూనివర్సిటీ ఫెలోగా (University fellow ship) నియమితుడై, 1880లో, గవర్నరు కౌన్సిలు సభ్యుడైనాడు. ఒక సంవత్సరకాలం (1884) రట్లాం సంస్థానానికి దివానుగా పనిచేసి, కడపట 1892లో, చనిపోయెను.

1848 నుండీ, గోపాల్ హరి, సాంఘికరాజకీయ విషయములపై వ్యాసములువ్రాసి, 'ప్రభాకర్' అనే వార పత్రికకు పంపుచుండేవాడు. ఈ వ్యాసాలనతడు 'శతపత్రేన్' అనే వ్యవహరించినాడు. 'నూరుకృతులు' అని దీని అర్థము. నిద్రావస్థలోనున్న ప్రజలను మేల్కొల్పడం ఇతని ఉద్దేశము. నూతన విద్యార్జనకు పూనుకొని, దేశ సమస్యలను సాధించవలసిందని వారిని ప్రోద్బలపరచెను. ఇతని రచనలు భావోత్పాదకములై, పలువురిచే పఠింపబడినవి. కులతత్త్వాన్ని ఖండిస్తూ, ఇతడు 1877లో, 'జాతిభేద' మనే గ్రంథాన్ని రచించెను. భగవద్గీతా బోధనలను జనాదరణీయం గావించే ఉద్దేశంతో, 'గీతాతత్త్వ,' 'సుభాషిత' అనే

రచనలను ప్రచురించెను. హిందువుల మత కర్మలను విమర్శకాత్మంగా వివరిస్తూ 'స్వాధ్యాయ' 'ఆశ్వలాయన గృహ్యసూత్ర' అను వానిని 1880లో, ప్రచురించెను. పల్లెలలోని పరిస్థితులను 'గ్రామ రచన' అను వ్యాసములో చర్చించినాడు. చరిత్రలోనూ, చారిత్రక పరిశోధనలోనూ ఇతనికిగల ఆసక్తిని, ఈ క్రింద పేర్కొన్న గ్రంథములు నిరూపించుచున్నవి. చారిత్రక కథలు-ఇతరోదంతాలు, (మూడు సంపుటములు) రాజస్థాన్ చరిత్ర, సౌరాష్ట్ర చరిత్ర, గుజరాతీచరిత్ర, సిలోన్ దేశచరిత్ర. గుజరాతు చరిత్రకు అనుబంధంగా ఇతడు బ్రిటీషు పరిపాలనను దేశీయ పరిపాలనతో పోల్చి, వాటి పరస్పర గుణదోషాలను చర్చించినాడు.

సంఘసంస్కరణను ఎక్కువగా సమర్థించింది లోకహితవాది పత్రిక. పశ్చిమ భారతంలోని ప్రార్థన సమాజము, ఆర్యసమాజము, థియోసాఫికల్ ఉద్యమము-అను సంస్థలతో ఇతనికి సన్నిహిత సంబంధము ఉండినది. స్త్రీ జన శ్రేయమునకు ప్రోద్బలమిస్తూ, ఇతడు స్త్రీ జనవిద్యను సమర్థించెను. మహారాష్ట్రంలో ప్రధానములైన 'ధ్యాన ప్రకాశ్', 'ఇందు ప్రకాశ్' అనే పత్రికలు, గుజరాతులోని 'హితేచ్ఛు' పత్రికా, ఇతని సహకార ప్రోత్సాహములను పొందినవి. దక్కను దేశీయ భాషానువాదసంస్థా (Deccan Vernacular Translation Society), గుజరాతులోని దాని భగినీ సంస్థా, కూడా ఇతని సహకారాన్ని పొందినవి. పండరపురంలోని అనాథశరణాలయాన్ని స్థాపించిన సంఘంలో ఇతడు సభ్యుడు.

ప్రాచీన విధిశాస్త్రాలనూ, సంప్రదాయాచారాలనూ ప్రశ్నించి విమర్శించి, సంస్కరణకు బూనుకొన్న సంస్థలలో ప్రధానమైనది లోకహితవాది పత్రిక. పరివర్తన మొందుతున్న సమాజానికి ఆవశ్యకములైన నూతన భావాలనూ, విశ్వాసాలనూ ఈ పత్రిక హృదయపూర్వకంగా అంగీకరించింది. ప్రజా శ్రేయమును గూర్చిన చింత, సుదూరదృష్టి, అనాసక్తి, సత్యప్రీతి,-అనే ఇతని స్వభావములు మహారాష్ట్ర సంఘ సంస్కర్తలలో అగ్రగామిగా, ప్రముఖుడుగా, అతనిని, నిరూపిస్తున్నవి. అగ్రవర్గాలవారి అజ్ఞానాన్ని, సోమరితనాన్ని, స్వార్థపరతను, నిష్కర్షమైన భాషలో నిరసించి, ఖండించింది లోకహితవాది పత్రిక.

ఆధునిక యుగము యొక్క సార్థకతను, దానికాధారములైన మూల భావములను గ్రహించిన ఆంగ్లవిద్యావంతులలో ఇతడొకడు. మహారాష్ట్రుల అపజయానికి, వారి సాంఘిక క్షీణతకు గల కారణములను తెలిసికోడానికి ఇతడే ప్రథమంగా పూనుకొన్న వాడు. సమాజాభ్యుదయం జరుగడానికి అనుసరించవలసిన మార్గాన్ని ఇతడే సూచించినాడు. బ్రిటీషువారి విజయానికి కారణాలను పరిశీలించినాడు. మానవతావాదము, సంఘసేవ,- ఇవి రెండూ వారి ఉద్యమాలకు ప్రోద్బలమొసిచ్చినవనీ, వాటిని భారతీయులు గ్రహించి పాటింపవలెననీ ఇతడు వాదించినాడు. ప్రాచీన సంప్రదాయంవల్ల ఏర్పడియున్న భారం అతని ప్రశాంత స్వభావానికి విసుగుకలిగించింది. ప్రాచీన విశ్వాసాలు హానికరములైనవని అతని అభిప్రాయం. సాంఘికసంపదను పోషించడానికి ప్రాచీనవర్గాలు

ఏమీ సహకరించలేదు, ప్రాచీన విద్యప్రయోజనకరము కాలేదు, అని అతని తలంపు. హేతుబద్ధములైన సూత్రముల ఆధారంపైనా, పాశ్చాత్య సాంఘిక మౌల్యములపైనా భారత సమాజ పునర్నిర్మాణము జరుగవలెనని, అభ్యుదయ ప్రయత్నాలలో ఇది ప్రథమమైనదని, ఇతని అభిప్రాయము. కాని, భారతదేశంలో సాంఘికార్థిక వ్యవస్థా, నైతిక ప్రవృత్తీ, మత సంప్రదాయాల ప్రాబల్యానికి లోనై ఉన్నవి. కనుక, లౌకిక వ్యవహారములను, మతప్రాబల్యము నుంచి వేరుచేయవలెనని ఇతడు ప్రయత్నించినాడు. "ఈ దేశంలోని ప్రజల అభిప్రాయాలు విచిత్రములై యున్నవి. సాంఘికాచారాలు, వ్యవహారాలు, అన్నీ మతంతో అభేదాన్ని పొందినవి. దైవభక్తి, మతము, వస్త్రధారణ కూడా మతమే." అని ఇతడు విమర్శించినాడు.

బ్రిటీషు పరిపాలనను అతడంగీకరించడానికి కారణములు లేకపోలేదు. ప్రజాస్వామ్యప్రభుత్వ సూత్రాలపై, అది ఆధారపడి నిర్మితమయింది. భారతదేశ మోక్షం, ప్రజాస్వామ్యంపైనే ఆధారపడవలసి ఉంది. ఈవిధంగా బ్రిటీషుపరిపాలనను అతడు మెచ్చుకొన్నా, ప్రభుత్వనిర్వహణలోని లోపాలకతడు గ్రుడ్డివాడు కాడు. ప్రజలలో ప్రబలంగా వ్యాపించిన త్రాగుడుకు ప్రభుత్వమే కారణమన్నాడు. అతిభారమైన పన్నులను ప్రజలపై, మోపడము, న్యాయపరిపాలన విషయంలో పాశ్చాత్యులపట్ల పక్షపాతం వహించడమూ,- ఇత్యాది దోషాలను ఎత్తిచూపి విమర్శించినాడు.

భారతదేశప్రజల రాజకీయ ఉత్కంఠలనుగూర్చిన ఇతని అభిప్రాయాలు కాలరీత్యా ఎంతో ముందున్నవి. "ప్రజానీకంయొక్క శ్రేయస్సునుగూర్చి ప్రస్తుత ప్రభుత్వం నిర్లక్ష్యంగా ఉన్నదని, దేశప్రజలందరూచేరి,- బీదలూ ధనికులూ అందరూ,- ఇంగ్లాండు మహారాజ్ఞికి మహజరు పంపవలసియున్నది. ఆంగ్లేయులకూ భారతీయులకూ గొప్ప అంతరమేర్పడింది. ఇరువురినీ సమానదృష్టితో ప్రభుత్వం చూడడంలేదు. అసమానతను తొలగించడానికై భారతదేశంలో ఒక పార్లమెంటును ఏర్పరచవలెను. ప్రతి పట్టణమునుండీ, ప్రతిజిల్లానుండీ ఇద్దరు ప్రతినిధులకు ఆ పార్లమెంటులో స్థానం కలుగవలెను. ఈ ప్రతినిధుల విజ్ఞానాన్ని ఆధారంచేసుకొని ప్రజలు వారి నెన్నుకోవలెను. అప్పుడు బ్రిటీషువారికి ప్రజలపట్లగల దురభిప్రాయం తొలగిపోయి, ప్రభుత్వనిర్వహణలో సమగ్రమైన అభ్యుదయం కలుగుతుంది. నిరంకుశప్రభుత్వానికీ, బాధ్యతాయుత ప్రభుత్వానికీగల భేదాన్ని ప్రజలు గుర్తింపగలుగుతారు. బీదలు - ధనికులు, అధమవర్ణులు, ఉత్తమవర్ణులు, అనే వివక్షలేక, సర్వులనూ సమానంగా చూడడము ప్రజాస్వామ్య ప్రభుత్వ లక్షణమని ప్రజలు గ్రహిస్తారు. కులతత్త్వంతో ప్రసక్తిలేక, గుణ సామర్థ్యాలను బట్టి మాత్రమే, ప్రతినిధుల నెన్నుకొనవలసి యుంటుంది. దురభిమానమూ, దర్పమూ బ్రాహ్మణుల లక్షణములై ఉండడంవల్ల వారి ప్రాతినిధ్యం స్వల్పసంఖ్యకు పరిమితం కావలెను."

ప్రజలకు ప్రాజ్ఞత, వివేకము సిద్ధించిన అనంతరం ఇంగ్లాండులోని పార్ల

మెంటు నమూనాపై, ఇచ్చటకూడా శాసనసభ ఏర్పడవలెనని ప్రజలేకోరుతారు. ఆ పిమ్మట ఆంగ్లేయులీదేశంలో వర్తకులుగా మాత్రమే నివసిస్తారు."

"ప్రజలను క్రూర చర్యలతో అణచివేయడానికి ప్రయత్నించినా, ప్రజలకు అనిష్టములైన శాసనములను అమలుజరిపినా, అమెరికాలో జరిగినట్లుగా ప్రజలు తామే స్వాతంత్ర్యాన్ని వహించి, ఇంగ్లీషువారిని దేశమునుండి వెడలిపొమ్మని ఆదేశిస్తారు. ఇట్టిపరిస్థితి ఏర్పడడానికి రెండువందల యేండ్లు పట్టవచ్చు; కాని పర్యవసాన విషయంలో మాత్రం సంశయంలేదు."

అతడీవిధంగా ప్రదర్శించిన భారత రాజకీయ భవిష్యత్తు భ్రాంతిమూలక మైన స్వప్నంకాదు: అధ్యయన పర్యాలోచనల ఫలితం. "ప్రభుత్వమెంత తక్కువగా అధికారం వహిస్తే ప్రజలకంత శ్రేయము. వెనుకబడియున్న దేశంలో, ప్రభుత్వం నిరంకుశంగానూ, రక్షకర్తగానూ ప్రవర్తిస్తుంది. నాగరక దేశంలో ప్రభుత్వము ప్రజల సేవలో వ్యవహరిస్తుంది."

విజ్ఞానశాస్త్రాలను, ఇతరవిద్యలను నిర్లక్ష్యంచేయడమే మనక్షీణతకు, నాశనానికి హేతువయింది. "వ్యాసుని కాలమునాటి తిరుగలినే, పాండవుల కాలమునాటి నాగలినే, మనమిప్పుడును ఉపయోగిస్తున్నాము." బ్రాహ్మణుల సోమరితనానికి అంతులేదని అతడు అసహ్యించుకొన్నాడు. "పురోహితులనే భూతాలవల్ల మనకెట్టి ప్రయోజనమూలేదు. వాళ్ళు బ్రతుకుతున్నది దానాల పైన. మనము, దీనిని పుణ్యకార్యమని భావిస్తున్నాము. జ్ఞానశూన్యులను ఈ విధంగా పోషిస్తూ మనము, అజ్ఞానాన్ని ప్రోత్సహిస్తున్నాము. దర్జీపని, వడ్లపని, లేక ఇతర ప్రయోజనకరమైన చేతిపనులను వారికి నేర్పడంవల్ల సంఘం బాగు పడుతుంది. అట్టి విద్యలవల్ల వారికి జీవనోపాధిలభించి, వారు గౌరవంగా బ్రతుకగలరు. ఇతరులపై కూటికాశ్రయించవలసిన అవసరం ఉండదు." అతని ప్రకారము సంస్కృతం చదవడంవల్ల ప్రయోజనం కలుగదు. పైగా, సంఘంలో అస్తవ్యస్తత ఏర్పడుతుంది. కుతర్కంతో నిబద్ధమైయున్నది సంస్కృత విద్య. ప్రయోజన రహితమైన చర్చలకు బూనుకొని, వ్యక్తి సోమరిగా తయా రౌతాడు. ఆధునిక యుగంలో జీవితానికి ఆవశ్యకమైన జ్ఞానము అందులో లేదు." "భారతదేశాన్ని జయించడంలో ఇంగ్లీషువారికి సాధనమైన విద్యను అభ్యసించవలసిందని దేశీయులను హెచ్చరించెను."

సాంప్రదాయకములైన విశ్వాసాలను, ఆచారాలను అతడు తిరస్క రించెను. హేతువాదాన్ని ఆధారంగా చేసుకొని సాంఘిక ప్రయోజనాలను, సాంఘిక ప్రవర్తనను తార్కికంగా, పరిశీలించి నిర్ణయించవలెను. ప్రాచీన హైందవ వ్యవస్థలో, సేవాకర్తవ్య మనే సామాజిక భావం క్రిందపడి, వ్యక్తి నలిగిపోయినాడు. తన కర్తవ్యాన్ని తానేనిశ్చయించుకొనే శక్తి స్వాతంత్ర్య ములూ, తన సంకల్పాముకనుసరించి, సహేతుకంగా కార్యాచరణాన్ని నిర్ణయించు కొనే స్వాతంత్ర్యమూ, వ్యక్తికి ఉండవలెనని 'లోకహితవాది' వాదించింది.

దేశంలో విస్తారంగా పెరుగుతున్న దారిద్ర్యం అతనిని ఆకర్షించింది. "దేశంలో దారిద్ర్యము తీవ్రరూపందాలుస్తూ ఉంది. జీవనోపాధికి పని దొరకడం లేదు. పరిశ్రమలు, వ్యాపారము నశించడంవల్ల, ఇట్టి దుర్భరస్థితి ఏర్పడింది. ఇంగ్లాండు, ఇతర పాశ్చాత్య దేశాలూ, తమ వస్తువులను ఈ దేశంలో దిగుమతి చేస్తారు. అవి చౌకగా ఉండటంవల్ల ప్రజలు వాటిని కొంటారు. పరదేశవస్తువులను పరిహరించి, దేశంలో తయారయ్యే వస్తువులను ప్రజలు వాడడానికి పూను కొంటే, కార్మికులకు పనీ, జీవనోపాధీలభిస్తుంది. గొడుగులు దేశంలో తయా రౌతున్నా, విదేశపు గొడుగులను కొంటూ ఉండడం ఒక ఉదాహరణ. దేశీయ వస్తువుల వాడకంవల్ల ప్రజలూ దేశమూ కూడా, బాగుపడడం జరుగుతుంది. అదే విధంగా, మన దేశంలో తయారైన వస్తువులను మాత్రమే అమ్మకానికి పంపవలెను. ముడిసరకులను మాత్రమే అమ్మకానికి పంపరాదు. ముడిసరకు లను ఏ మాత్రమూ అమ్మకూడదు. ప్రస్తుతము, విదేశవస్తువులను మనవారు కొని, దేశంలోని కార్మికులకు కూడు లేకుండా చేస్తున్నారు. గాజుసామానులు, గుడ్డలు, కత్తులు చాకులు, గడియారాలు, కుట్టుయంత్రాలు,- ఇత్యాదులను ఇంగ్లీషువారు మన బజార్లలో అమ్ముతున్నారు. దేశంలోని చేతిపనివాండ్లు వీటిని తయారు చేయడం నేర్చుకోవలెను. తయారైన వస్తువులలో మన ఉప యోగానికి అవసరమైనంత నిలువచేసుకొని, తక్కిన భాగాన్ని మాత్రమే బైటికి పంపవలసి ఉంది. ఇంగ్లాండుకు మాత్రమేకాక, ఇతర దేశాలకు గూడా, మనం వస్తువులను ఎగుమతి చేయవలెను. మన పరిశ్రమలు అభివృద్ధిపొందడానికీ, మన కార్మికులకు జీవనోపాధి లభించడానికీ ఇదే మార్గం." తరువాతి కాలంలో రెనడే (Ranade), జోషీ మహారాష్ట్రలో ప్రారంభించిన స్వదేశీ ఉద్యమానికి, 'లోకహితవాది' సూచించిన కార్యక్రమం మార్గదర్శకమయింది.

గోపాల్‌హరి, తన ఉద్యమ సూత్రాలను ఈ క్రింది విధంగా సూచించి నాడు.

1. భక్తితో భగవంతుని పూజించడం అందరికీ కర్తవ్యము.

2. ఉపనయనము, వివాహము, అంత్యక్రియలు, తప్ప తక్కిన కర్మ కలాపమంతా విసర్జించవలెను. పూజలూ, ప్రార్థనలూ, మాతృభాషలోనే జరుగ వలెను.

3. తన అభిప్రాయాలను వ్యక్తంచేసే స్వాతంత్ర్యము, తనకు ప్రయో జనకరమని తోచినపనికి బూనుకొనే స్వేచ్ఛా, ప్రతి వ్యక్తికీ కలుగవలెను.

4. సాంఘిక కార్యములలోనూ, కర్మలనిర్వహణంలోనూ, స్త్రీ పురుషు లకు సమాన స్వాతంత్ర్యం సిద్ధించవలెను.

5. కర్మలు, పూజలు, నిర్వహించడంకంటె నైతిక ప్రవృత్తి ప్రధాన మైనది.

6. ఏ వ్యక్తినీ, నిరసనభావంతో చూడరాదు. కులగర్వం అయోగ్య మైనది. అందరిపట్లా ఔదార్యం అవసరము. అందరికీ శ్రేయం కలిగించడం మన

కర్తవ్యము.

7. మాతృదేశప్రేమా, దేశక్షేమమూ, సర్వదా మనస్సులలో స్థిరమై యుండవలెను.

8. ప్రజల హక్కులు ప్రభుత్వము కంటెను శ్రేష్ఠమైనవి.

9. ప్రభుత్వం అమలు జరిపిన నియమాలూ, హేతువాదంవల్ల సిద్ధించిన నియమాలూ పాటింపదగినవి.

10. విద్యాభివృద్ధికి ప్రతి వ్యక్తీ పాటుపడవలెను.

11. మన ప్రవర్తనను ఎల్లవేళలూ నిర్ణయించవలసిన శాశ్వత సూత్రం సత్యమై యుండవలెను.

**కులతత్త్వంపై విప్లవం :** మత సాంఘిక వ్యవహారాల్లో, దేశపరిపాలన వ్యవహారాల్లోనూ బ్రాహ్మణులు పీష్వాలకాలంలో, ప్రాబల్యం వహించియుండిరి. రైతులనూ, చేతిపనివాండ్లనూ, తిరస్కారభావంతో చూచుచుండిరి. 'కున్ బాత్', 'నాగలిదున్నేవాడు', 'ఎముకలు నమిలేవాడు' అనే నింధావాక్యాలతో వీరిని వ్యవహరించేవారు. ఆహారపానీయ విషయాలలో బ్రాహ్మణులు వీరిని చేర నిచ్చేవారుకారు. సాంఘిక సమారంభాలలోనూ, ఉత్సవాలలోనూ, వీరితో స్వేచ్ఛగా కలిసేవారుకారు. సంస్కృత విద్య కేవలము బ్రాహ్మణులకు మాత్రమే ప్రత్యేకింపబడిన హక్కు. మరాఠా పిల్లలు నూతన విద్యాలయాల్లో ప్రవేశించడం కూడా వీరికి ఇష్టంలేదు.

సమాజంలో అత్యున్నతస్థితి తమ స్వత్వమనే భావంతో ప్రవర్తించే బ్రాహ్మణ వర్గంపట్ల, బ్రిటీషు పరిపాలనారంభదశలో ద్వేషభావం, బాగుగా వ్యాప్తమై ఉండినది. ఈ బ్రాహ్మణ ప్రతిష్ఠను ఎదుర్కొని అబ్రాహ్మణోద్యమాన్ని లేవదీసిన, జోతి బపూలే, మాలికుటుంబంలో (వనరక్షకులు) జన్మించినవాడు. (1828). తక్కువ కులంలో పుట్టడంవల్ల, విద్యాభ్యాసావకాశాలు, ఇతనికి సిద్ధింపలేదు. కాని, పదహేనేండ్ల ప్రాయంలో, ఇతడు, ఒక క్రీస్తు మిషనరీ దయాసహాయాలతో విద్యాభ్యాసానికి పూనుకొనెను. సాంఘిక సందర్భాల్లో, ఇతనిని అవమానించడానికి బ్రాహ్మణులు తమ చేతనైనంత ప్రయత్నం చేసిరి. ఇది హృదయాఘాతంకాగా, బ్రాహ్మణుల ఈ ప్రతిష్ఠ ఎట్టిదో తెలుసుకోడానికై ప్రొఫెసరు విల్సన్, సర్ విలియమ్ జోన్స్, హిందూ మతంపై రచించిన గ్రంథాలను చదువడం ఆరంభించినాడు. ఇతడు గావించిన అధ్యయనము, స్వానుభవము, మిషనరీలతో గలిగిన సాహచర్యము,-ఇవి కారణాలుగా, అప్పుడు ఆచరణలో నుండిన, హిందూమత ఆచారాలపట్ల విమర్శకదృష్టి ఏర్పడింది.

21 సంవత్సరాల వయస్సులో, అతడు, ప్రజావిరోధాన్ని లెక్కింపక, బాలికా పాఠశాలను ప్రారంభించినాడు. 1854 లో, అస్పృశ్యజాతుల వారికొక పాఠశాల నారంభించెను. భర్తృ విహీనలైన హిందూ స్త్రీల దుస్థితికి, వారి నిస్సహాయపరిస్థితికి జాలిచెంది, క్లిష్టస్థితిలో నున్న విధవల రక్షణార్థం, స్వంతంగా, అనాధశరణాలయాన్ని స్థాపించెను. కాని, బ్రాహ్మణుల ఆధిక్యతను

ఎదుర్కోవడం అతని జీవిత ప్రధానాశయంగా ఏర్పడింది. సార్వజనిక విద్యా ఆవశ్యకమును గూర్చి ప్రచారం చేయడము 'సార్వజనిక సత్యధర్మ పుస్తకం', 'గులాంగిరి' అనే విమర్శక గ్రంథాలు రచించడము, బ్రాహ్మణ విరుద్ధ కార్య క్రమాన్ని సక్రమ మార్గంలో నిర్వహించడానికి సత్యశోధక సమాజాన్ని స్థాపించ డము,- ఇత్యాది కార్యక్రమాన్ని పాటించి, బ్రాహ్మణ సంఘాన్ని ఎదు ర్కొన్నాడు.

ఫూలే రచనలు సువిమర్శకాత్మకములు కావు. అతని సిద్ధాంతాలు వాస్తవ పరిస్థితులపై ఆధారపడి ఏర్పడినవికావు. కాని, శతాబ్దాలుగా అణగద్రొక్కబడి యుండిన నిమ్న జాతులవారు తమ హక్కులను మరల సంపాదించుకోవడంలో చేసిన ఘోషలో గర్భితమై యున్న దుఃఖము, బాధ, ఫూలే కార్యక్రమంలో వ్యక్తమయినవి. మరాఠీ భాషతో పరిచయమున్న ఇంగ్లీషు, స్కాచ్, మిషనరీలు, పల్లెలలో నివాసమేర్పచుకొని నిలిచి, గ్రామ కులకర్ణుల వ్యవహారాలను ఇతర బ్రాహ్మణాధికారుల చర్యలను గమనిస్తూ ప్రతి సంవత్సరమూ, ప్రభుత్వానికి వార్షికవివరణ పత్రికను పంపుతూ ఉండవలెననే,-వింత సలహా కూడా ఇతడు గావించినాడు. ప్రజానీకాన్ని ఉద్బోధించి, వారిని సక్రమమైన పద్ధతిలో నడిపి, బ్రాహ్మణుల అహేతుక ఆధిక్యాన్ని ప్రతిఘటించేటట్లు చేయడమే అతని ప్రధా నోద్యమం. ఇట్టి సాంఘిక విప్లవానికి ఆకాలంలో పూనడము, అతిసాహస కార్యము. అసాధారణమైన ధైర్యస్థైర్యములు దీనికి ఎంతో అవసరాలు. ఈ రెండూ అతనికి గొప్పదనాన్ని ఆపాదించినవి. 'సత్యశోధక సమాజం' వారి వార్షిక నివేదనంలో ఇతని ఆశయం వివరింపడింది. "వేలకొలది సంవత్సరాలుగా బ్రాహ్మణులు తమ గ్రంథాలను ఆధారంగా చేసుకొని, సామాన్యజనులు అధమ వర్ణులని ప్రకటించి, వారిని స్వప్రయోజనార్థం ఉపయోగించుకొంటున్నారు. ఈ పౌరోహిత్యాధిపత్యదాస్యము నుంచి ప్రజలను విడుదల గావించి, విద్యా వ్యాప్తిమూలంగా తమ హక్కులను వారు గుర్తెరుగునట్లుగా, చేయడం ఆశ యంగా పెట్టుకొని, సత్యశోధక సమాజము స్థాపితమయింది. (24-9-1873).

బ్రాహ్మణ పౌరోహిత్యవర్గంపట్ల అతనికిగల అనిష్టము జోతిఫూలే ఉద్య మానికి ప్రేరణం అయియుండవచ్చు. అంతమాత్రంతో అతడు నిర్వహించిన కార్యానికి లోపం కలుగదు. కులతత్త్వంవల్ల వ్యక్తి గోల్పోయిన గౌరవప్రతిష్ఠ లను మరల అతనికి కలిగించినాడు. "మానవజాతి సర్వమూ ఒకే దివ్యశక్తియొక్క సృష్టి ఐ యుండగా, ఇతరులకంటె తామే అధికులమని ఒక కులంవారెట్లు చెప్పుకోగలరు." అని అతడు ప్రశ్నించినాడు. కులతత్త్వకారణంగా ఛిద్రమై యుండిన హిందూసాంఘికవ్యవస్థకు ఐకమత్యంకూర్చే ప్రయత్నానికి ఇతడే మొదట పూనుకొన్నవాడు. బ్రాహ్మణులు, అస్పృశ్యులు, అనే భేద మెప్పుడూ ఇతడు గుర్తింపలేదు. డ్యూక్ ఆఫ్ యార్క్‌ను సంద ర్శించేసందర్భంలో ఇతడు,- దారిద్ర్యభూయిష్ఠమైన భారతదేశంలోని దరిద్ర

రైతుల వాస్తవప్రతినిధిగా,- కొల్లాయిగుడ్డలో ఆ ప్రభుకుమారుణ్ణి కలుసుకొన్నాడు సామాన్య దేశప్రజల దారిద్ర్యంతో ఇతనికిగల అనుబంధ మిట్టిది.

*పార్సీసంఘంలో కలిగిన సంస్కరణ :* బ్రిటీషువారి సంసర్గంవల్ల కలిగిన పరివర్తనం, పశ్చిమభారతంలో మహారాష్ట్రులకు మాత్రమే పరిమితం కాలేదు. వ్యాపారకార్యకలాపాలలో చాలకాలంగా బ్రిటిషువారితో ఎక్కువ సన్నిహితులై ఉండిన పారసీలలోనే, మొదట పరివర్తనం ఆరంభమయింది. కులవిషయంలోనూ, ఆహారవిహారవిషయాల్లోనూ, నిషేధాలులేనివారు కావటంవల్ల, వీరు బ్రిటీషువారిని తమ ఇండ్లలోనూ, బజారులోనూ కలుసుకొనేవారు. ఆంగ్లేయునకు సేవావృత్తిలోనూ, బనియావృత్తిలోనూ, కూడా పార్సీ ఉపయోగించినాడు. పాశ్చాత్యులకు దేశీయులకు మధ్యవర్తిగా వ్యవహరించి, పిమ్మట ప్రాక్పశ్చిమ వాణిజ్యంలో ఆంగ్లేయులకు కమిషన్ ఏజెంటుగా వ్యవహరిస్తూ వచ్చినాడు. బ్రిటీషువారితో ఏర్పడిన ఈ సన్నిహితత్వంవల్ల, పార్సీలు తొలిరోజులనుండీ ఆంగ్లభాషను నేర్చుకొంటూ వచ్చిరి. ఎలిఫిన్‌స్టన్ విద్యాలయంలోని తరగతులన్నీ పార్సీ పిల్లలతో నిండి ఉండినవి. మిషనరీలు ప్రారంభించిన పాఠశాలలుకూడా వీరితో నిండిపోయినవి.

పార్సీసంఘంలో, ఈ విధంగా కలిగిన విద్యావ్యాప్తియొక్క ప్రభావము వారి సంస్కరణోద్యమంలోనూ, రాజకీయాల్లో వారు ప్రదర్శించిన ఆసక్తిలోనూ ప్రతిఫలించింది. బొంబాయిలో బయలుదేరిన మొదటి పత్రిక 'బొంబాయి సమాచార్', వీరి ఉద్యమఫలమే.

దాదాభాయి నౌరోజీ అధ్యక్షతలో విద్యార్థుల సారస్వత వైజ్ఞానికసంఘం ప్రారంభింపబడింది (1848). రెండు వారాల కొకసారి జరిగే, ఆ సంఘసభల్లో, సారస్వత వైజ్ఞానిక, సాంఘికవిషయాలపై వ్యాసాలు, ఉపన్యాసాలు చదివేవారు. రెండు దేశభాషాశాఖలుకూడా ఈ సంఘం నడిపేది. గుజరాతీశాఖకు దాదాభాయి అధ్యక్షతవహించి, సంఘంలో చర్చింపబడిన వ్యాసాలను 'ధ్యాన ప్రసారక్', అనే పత్రికలో ప్రచురించేవారు. సాంఘికవిషయాల చర్చలలో ఎక్కువ ఉద్రేకమూ ఔత్సుక్యమూ ప్రదర్శింపబడుతూ ఉండినవి. పార్సీ స్నేహితులతోకలసి, దాదాబాయి, బాలికల విద్యావ్యాప్తికై పెక్కు పాఠశాలలను నెలకొల్పెను. ఆ కాలంలో ఇది నవీనమైన ఉద్యమము.

భారతదేశంలో చిరకాలం నివసించడంవల్ల భారతీయుల ఆచారాలు కొన్ని వీరిలో వ్యాపించినవి. హోలీ సందర్భంలో కొబ్బరికాయలు దేవాలయంలో కొట్టడము, హనుమాన్‌కు నూనె నివేదించడము,-మున్నగువాటిని వీరు పాటించేవారు. నూతన ప్రభావాలకులోనై వీరు, తమపై సంక్రమించిన హిందూఆచారాలను తొలగించి, తమ 'జొరాస్ట్రియానిజం', అనే మతమును పవిత్ర మొనరించడానికి, బూనుకొనిరి. 'రహ్నూమాయిమజ్దావస్నాం' సభ, లేక, మత సంస్కరణ సంఘము, 1851 లో, స్థాపితమయింది. తమ మతాన్ని పవిత్ర మొనర్చడము ఈ సంఘముయొక్క ఆశయము. ఈ ఉద్యమ ప్రయత్నంలో

జెండావెస్టా అధ్యయనమూ, మతగ్రంథాల పరిశోధనమూ, ప్రారంభమయింది.

*గుజరాతీలలో సంఘసంస్కరణము :* నూతన విద్యలోనూ, దానివలన ఉత్పన్నమైన భావాలలోనూ వీరెక్కువగా ఆసక్తి చూపలేదు. కాని, దేశాన్ని ముంచుకొని వస్తున్న సంస్కరణ ప్రభావాన్ని వీరుకూడా తప్పించుకోలేక పోయిరి. వల్లభాచార్య మతానుయాయులైన వైష్ణవులువీరు. మత గురువులైన 'మహారాజు'లను వీరు భక్తితో ఆరాధించేవారు. ఈ గురువులకు తమ మతానుయాయులపై అత్యధిక ప్రాబల్యముండేది. విగ్రహదర్శన బహిష్కారము మొదలుగా మత బహిష్కరణ వరకూగల, అనేకములైన దండనలను వీరిపై విధించే అధికారం ఈ గురువులకుకలదు. శ్రీకృష్ణుని అపరావతారములని భావిస్తూ వీరు, అనుయాయుల వ్యక్తిగత జీవితంపైన కూడా అధికారాధిపత్యాలను వహించినారు. వీరి గురుస్థానాలు దుస్సహములైన వైషయిక దురాచారాలకూ, వ్యభిచార ప్రవృత్తికీ ఆ సరములై యుండినవి. ఈ గురువు చేసే దోపిడిని అనుయాయులు సహింపలేక అసంతుష్టికి లోనై యుండిరి. మలబార్ వర్ణననుసరించి,—

"వైష్ణవ మహారాజా ఒక కపటవేషధారి. విద్యావతులైన రాణివాసంపై తన ఆధిపత్యాన్ని, ప్రభుత్వాన్ని నడిపేవాడు. ఈస్త్రీల భర్తలు అత్యుదార స్వభావులు ... ... ... తన అనుయాయుల నుండి విరాళాలను, కానుకలను, గ్రహించడంలో, అత్యద్భుతమైన భావనగలవాడు మహారాజా." తన దర్శనానికి, స్పర్శకు, పాదప్రక్షాళనకు, తనగదిలో కొంతకాలం నిలవడానికి, అతని పాద తాడనము, కొరడాదెబ్బ, అనుభవించడానికి, అతనితో రాసక్రీడ జరుపడానికి కూడా, భక్తులు వివిధములైన రుసుములూ, సుంకములూ చెల్లించవలసిఉండేది." అని తెలుస్తుంది.

ఎలిఫిన్‌స్టన్ విద్యాలయంలో విద్యార్థిగా, సారస్వత వైజ్ఞానిక సంఘంలో సభ్యుడై యుండిన కర్సొన్‌దాస్ మూల్జీ అనే యువకుడు, ఈ మహారాజుల నిజ స్వరూపాన్ని బహిర్గతమొనర్చే ప్రయత్నానికి స్వయంగా పూనుకొన్నాడు. మొదట, సంఘసంస్కరణను గురించి వ్యాసములు వ్రాసి 'రాస్త్ గోఫ్తార్' పత్రికకు పంపించినాడు. పిమ్మట తాను స్వతంత్రంగా 'సత్యప్రకాశ్' అనే పత్రికను ప్రారంభించెను. 'మహారాజుల' నిర్లజ్జా ప్రవర్తన, కపటోపాయాలు, అసభ్యతా అవినీతులు, పోకిరితనము, మోసము,'—మున్నగు వాటిని బహిరంగం గావించినాడు. మాననష్టముపై దావావేసి, కర్సొన్‌దాస్ మూల్జీని న్యాయ స్థానానికీడ్చిరి. మాననష్టవాదాన్ని అంగీకరిస్తూ అధ్యక్ష న్యాయాధిపతి, వ్యాసం లోని విషయాలను సమంజసంగా సమర్థించి, రుజువుపరిచే ప్రమాణములున్నవనే ప్రతివాదాన్ని కూడా అంగీకరించినాడు. న్యాయాధిపతులు, ప్రజలూ కూడా, కర్సొన్‌దాస్ ప్రదర్శించిన ధైర్యాన్ని ఔత్సుక్యాన్ని మెచ్చుకొని, ఉబ్బిపోయినారు. ఈ యువకుని ఆదర్శం ఇతరులకు కూడా ప్రోద్బల మిచ్చింది. గుజరాతీ సంఘంలో సంస్కరణోద్యమానికి ఇతరులు కూడా పూనుకొనిరి.

ఈ విధంగా పీష్వాల ప్రభుత్వం అంతమైన పిమ్మట నలభై సంవత్సరాల కాలంలో, మహారాష్ట్ర ప్రాంతంలోకూడా నాగరకతాస్వరూపం ఏర్పడజొచ్చింది. నూతన ఆర్థిక వ్యవస్థ కూడా దేశాన్ని పరివర్తన మొనరింప నారంభించింది. రైల్వేల నిర్మాణ మారంభ మయింది. మొదటి దూదిమిల్లు బొంబాయిలో స్థాపితమయింది. (1854) ఈ పరివర్తన ఫలితాలు తరువాతి కాలంలో గోచర మైనవి.

ఏ సంఘములోనైనా, నూతనంగా అభివృద్ధి చెందుతున్న వర్గంవారు, పాశ్చాత్యనాగరకత నుండి, నూతనాభిప్రాయాలను ఆసక్తితో గ్రహించడం సహజమే. కాని, ఈ అభిప్రాయాలు ప్రచారం కావడానికి పూర్వం, వీరు సంప్రదాయ వాదుల ప్రతిఘటనల నెదుర్కొని, వాటిని జయించవలసి ఉంటుంది. మహారాష్ట్ర ప్రాంతంలోని సంప్రదాయ వాదుల ప్రాబల్యము ఆకాలమునాడు, సమాజంలో బాగా పాతుకొని పోయి యుండినది. అందువల్ల సంప్రదాయ వర్గంవారు పాశ్చాత్య విద్యావంతుల ఉద్యమాలపట్ల నిర్భయంగా, ఉదాసీనులై ఉండిరి 1857 లో, జరిగిన విప్లవకారణంగా, రాజకీయ వ్యవస్థ పూర్తిగా దగ్ధమై పోవడంతో, అభ్యుదయవాదులకూ సంప్రదాయవాదులకూ, భావైక్యము కలగడానికి, మహారాష్ట్రంలో అవకాశం ఏర్పడింది,

# 7
# భారత జాతీయతకు వెనుకనున్న ఆర్థికవ్యవస్థ

## I. భారతీయార్థిక వ్యవస్థపై బ్రిటీషు ఆఘాతము

1857 విప్లవం తరవాత యాభై సంవత్సరాలకాలంలో, జాతీయభావ చైతన్యం వేగంగా అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఈ అభివృద్ధికి అనేకాంశాలు దోహదం గావించినవి. ఆర్థికవ్యవస్థలో అవలంబించిన "విభిన్న ప్రసరణనవీనత" (Differential Diffusion modernism), అనే విధానం ఈ అంశాలలో మిక్కిలి ప్రధానమైనది. భారతీయ స్థైతిక ఆర్థికవ్యవస్థలోని (Static Economy), కొన్ని భాగాలైన వ్యాపారము, ప్రయాణసౌకర్యాలు, సంచారమార్గాలు (Communications), పరివర్తనకు లోనవుతూవుండగా, ఆ వ్యవస్థలోని ప్రధాన విభాగమైన 'వ్యవసాయం' లో చలనంలేక అది కుంఠితమై నిలిచింది. జనాభా పెరుగుతూవచ్చి, పంటపొలంపై భారం అధికంకాగా, నిరంతరంగా పెరిగే దుస్థితికి ప్రజలు లోనయిరి. ఆహారధాన్యాలు కరువైన రోజుల్లోనూ, క్షామమేర్పడిన రోజుల్లోనూ, ఈ దుస్థితి తీవ్రమయింది.

పల్లెసీమలలో కలిగిన ఈ క్లేశంవల్ల, దేశంలోని వ్యాపారం దెబ్బతిన్నది. దీని ఫలితంగా, వర్తకులు, బ్యాంకర్లు, న్యాయవాదులవంటి వృత్తివర్గాలవారు, కష్టాలకు గురియైనారు. గ్రామసీమలోని సంకటపరిస్థితులు, రాజకీయవ్యవహారాలలో పాల్గొంటున్న పట్టణవాసుల దృష్టికి వచ్చినవి. వీరివిషయమై ఆందోళన జరిపి, ఆర్థికవిధానాలలోనూ పరిపాలన విధానాలలోనూ, మార్పులు తేవలసిందని ప్రభుత్వాన్ని ఒత్తిడిచేయనారంభించినారు.

భారతదేశ ఆర్థికవ్యవస్థలో, తగ్గుస్థాయిలో ఉన్న వ్యాపారము, పరిశ్రమలు, కొంత ముందుకు సాగినవి. కాని, అభివృద్ధి చాల మందగతిలో జరగడంమాత్రమే కాక, అది సమతూకంగా కూడా జరగలేదు. బ్రిటీషువారు తమ మూలధనాన్ని కేవలం రైల్వేలలోనూ, తేయాకు పండించేటటువంటి తోటలలోనూ, మాత్రమే పెట్టుబడి పెట్టినారు. రైల్వేలనిర్మాణంలో వారి ప్రధానోద్దేశము కేవలము సైన్యముల రవాణాసౌకర్యానికి, వలసరాజ్య ఆర్థికవిధానానికి మాత్రమే సంబంధించినది. తోటల పరిశ్రమలన్నీ యూరోపియనుల ఏకస్వామ్యమై ఉన్నందువల్ల, లాభంలో అధికభాగమంతా వారే అనుభవించడం జరిగింది. దూది వస్త్రాల పరిశ్రమతప్ప తక్కిన భారీపరిశ్రమలకెటువంటి ప్రోత్సాహమూ లభించకపోవడంతో, వాటి అభివృద్ధి అత్యల్పమై ఉండేది. పందొమ్మిదోశతాబ్దం కడపటికి

కూడా, లక్షజనాభాగల పట్టణాలలోని జనసంఖ్యాసర్వమూ, దేశం జనసంఖ్యలో 2.33 శాతం మాత్రమే అనే విషయము, పై విషయాన్ని ధ్రువపరుస్తున్నది. నాగరీకరణవిషయంలో (Urbanization) భారతదేశం, (యూ. ఎస్. ఏ.) అమెరికాకు 75 సంవత్సరాలు వెనుకబడింది.

బ్రిటీషు వర్తకులు, భారతీయ వర్తకులు కలిసి అవలంబించిన సహోద్యమ విధానము (Collaboration), పెట్టుబడి ఉత్పాదనకు (Capitalist-Production), ప్రోద్బలం కలిగించిన వర్తక వ్యవస్థాభివృద్ధి,- అంటే ప్రత్తిని దూదిగా తయారుచేయడం,-ఈ రెండున్ను అంతర్దేశీయ విదేశీయ వాణిజ్యాభివృద్ధికి కారణాలైనవి. వలసరాజ్య ఆర్థికవ్యవస్థ, దేశంలో ఏర్పడడానికి ప్రోద్బలమిచ్చినది, విదేశవ్యాపారాభివృద్ధి. ఇంగ్లాండులోని యంత్రాలలో తయారైన వస్తువుల దిగుమతి అధికమయింది. ఇండియాలోని ముడిసరకులు - ఎక్కువ మొత్తంలో ఆహారధాన్యాలుకూడా, విదేశాలకు ఎగుమతికావడం అధికంగా పెరిగింది.

ఈ వాణిజ్యంలో పాల్గొన్న దేశీయులు, లాభాలు పొందినారు. వీళ్ళు పెట్టుబడిదారులవర్గంగా ఏర్పడి, సంపదలోనూ, పలుకుబడిలోనూ అభివృద్ధి సాధించినారు. పరిశ్రమలను నెలకొల్పడానికి, దేశంలోని వనరులను (Resources) అభివృద్ధిపరచడానికి తమ ధనాన్ని పెట్టుబడిపెట్టడానికీ,-వీళ్ళు ఔత్సుక్యంతో పూనుకొన్నారు. కాని, బ్రిటీషు సామ్రాజ్య ప్రయోజనాలు వీరి అభ్యుదయ కాంక్షకు అడ్డు తగిలినవి. అంతటితో, ప్రభుత్వంయొక్క ఆశయం సరిఅయినదేనా అని, ఈ వర్గంవాళ్ళు ప్రశ్నించినారు. దుర్భరదారిద్ర్యభారంతో నలిగిపోతున్న ప్రజానీకంయొక్క దుస్థితితో సానుభూతి వహించిన ఈ వర్గమువారు, ఈ దుస్థితి కంతటికీ మూలకారణమైన పరిపాలన విధానంపై ఆగ్రహం వహించినారు.

బ్రిటీషువారు ప్రవేశపెట్టిన సాంకేతిక విజ్ఞాన పరివర్తనంవల్ల జాతీయార్థిక వ్యవస్థ ఉత్పన్నమై, దేశాన్ని సమగ్రంగా ఒక ఆర్థికవిధానంలోకి తీసుకొని వచ్చింది. ఆధునిక రవాణాసౌకర్యాలు, సంచారసౌకర్యాలు, అభివృద్ధిపొందడం ఈ పరివర్తనకు ఆధారమయింది. రైల్వేలూ, టెలిగ్రాఫూ, నాగరీణవర్తక కేంద్రాల వ్యవహారాలలో, విప్లవాత్మకమైన మార్పులు తేవడమేకాక, గ్రామీణ ఆర్థికవ్యవస్థలోకూడా విప్లవాత్మకమైన పరివర్తనం తెచ్చినవి. పల్లెప్రాంతాలలో వస్తువినిమయం (Barter), తొలగి ద్రవ్యవినిమయం (Coin Exchange) ఏర్పడింది. నిర్వాహకవ్యవసాయము (Subsistance farming), అపసర్పణం (Regression), పొంది, బజారుకు కావలసిన వస్తూత్పాదన ప్రారంభమయింది. శతాబ్దాలుగా, నెలకొనిఉన్న స్వయంపోషకత్వవిధానం (Self Sufficiency) తొలగి, దేశంలోని ఇతరభాగాలపైనా, ఇతరదేశాలపైనాకూడా తన అవసర వస్తువులకు ఆధారపడేవిధానము అవలంబించబడింది. ఉపయోగకరవస్తువుల క్రయ విషయంలోనూ, ముడిసరకుల విషయంలోనూకూడా ఈ పద్ధతే అనుసరించ బడుతూ వచ్చింది.

సాధారణపరిస్థితులలో, ఈ పరివర్తనం దేశానికి అభ్యుదయకారకమై,

ప్రజలను ధనవంతులుగా చేసి ఉండేది. కాని, రెండు కారణాలవల్ల ఆ మేలు కలగలేదు. అభివృద్ధిచెందని దేశాలలో, ఒక్కసారిగా ఆధునికములు, అపరిచితములు ఐన, తంత్రములు (Technique) పద్ధతులు, ఆర్థికవిధానాలు, ప్రవేశపెట్టడంవల్ల, ప్రాచీన జీవనవిధానము నూతనపరిస్థితులతో త్వరగా సమాధానపడలేక, తొలిరోజుల్లో, కొంత అస్తవ్యస్తత ఏర్పడడం సహజమే. ఇది ప్రథమ కారణము. పాలితప్రజలను స్వప్రయోజనార్థం ఉపయోగించుకోవడమనేది, వలసరాజ్య ఆర్థికవ్యవస్థాలక్షణము. ఇది రెండో కారణము.

బ్రిటీషువారు ఇండియాలో ప్రవేశపెట్టిన నూతన ఆర్థికవ్యవస్థకు పునరుత్పాదకస్వభావం లేదు. నూతన అభివృద్ధివల్ల సిద్ధించిన లాభాలను పాశ్చాత్యులైన పాలకులు, పారిశ్రామికయజమానులు, పెట్టుబడిదార్లు,- అనుభవించినారు. అంతర్దేశీయ, విదేశీయవాణిజ్యంలో, పాల్గొన్న సంపన్నులు, వడ్డీవ్యాపారస్థులు, పరిపాలనాధికారాల్లోనివారు,- మొదలైన దేశీయులుకూడా ఈ లాభాలలో, భాగాన్ని పంచుకొన్నారు. ఈ లాభధనమంతా దినదినంపెరుగుతున్న అధికధరలవల్లనూ, వ్యాపారపరిశ్రమల అభివృద్ధివల్లనూ, సిద్ధించినది కావడంవల్ల, రైతుకూ, చేతిపనివాండ్లకూ, పొలంలేనివాండ్లకూ, ఈ లాభంతో, సంబంధలేదు. కనుక, ఈ అభివృద్ధివల్ల, వాస్తవంగా, దుస్థితికిలోనైన వాళ్ళు వీళ్ళే. 1860 తర్వాత, దేశంలో పదేపదే భయానకంగా ఉత్పన్నమైన క్షామాలూ, రోగాలవల్లనూ, పస్తులవల్లనూ గ్రామసీమల్లో సంభవించిన అధికసంఖ్యాకమరణాలూ, దేశమంతటా, అత్యంతం పెరిగిన గ్రామీణుల రుణగ్రస్తతా,- పై విషయాన్ని, సువ్యక్తం చేస్తున్నవి. కూలిడబ్బు పెరగడానికంటే ముందుగా ఆహారధాన్యాల ధరలు పెరుగుతూ వచ్చినవి. ఉద్యోగావకాశాలు పెరగలేదుకాని, జనసంఖ్య పెరుగుతూ వచ్చింది. నూతన పరిశ్రమలు, వ్యాపారము, మొత్తంగా పెరిగినవికాని, అవి పాశ్చాత్య మూలధనప్రాబల్యానికి లోనైనవి కావడంవల్ల, దేశీయులకు లాభం కలుగలేదు. పరిపాలనవిధానము సమర్థంగా అభివృద్ధి చెందింది, కాని, ప్రభుత్వపు శాఖలన్నిటిలోనూ, పాశ్చాత్యులే ఉన్నతోద్యోగులై, సర్వత్రా వారే వ్యాపించి ఉండడంవల్ల, దేశీయుల క్షేమాత్రమూ ప్రయోజనం కలుగలేదు. పన్నులభారం అధికమవుతూ వచ్చింది కాని, జాతీయాదాయంలో వృద్ధి కనబడలేదు. ఇండియా ఆర్థికవ్యవస్థలోని ఈ పరస్పరవిరుద్ధాలైన విధానాలు సామాన్యప్రజానీకానికి కష్టాన్ని, దుఃఖాన్ని, తెచ్చిపెట్టినవి. ముఖ్యంగా విద్యావంతులైన మధ్యతరగతి వారిలో, అసంతుష్టికి దోహదంచేసినవి ; రాజకీయమైన అశాంతికి ప్రోద్బలం కలిగించినవి.

## II. భారతీయ ఆర్థిక వ్యవస్థయొక్క రచన

ఈస్టిండియా కంపెనీవారేర్పరచిన పునాదుల ఆధారంపై నూతన ఆర్థిక వ్యవస్థ నిర్మితమయింది. గ్రామీణ, నాగరీణ, ఆర్థికవ్యవస్థలో, సుదూరంగా వ్యాపించే మార్పులను, కంపెనీవారు ప్రవేశపెట్టినారు. నూతన ఆర్థికవ్యవస్థాభి

వృద్ధి ఫలితంగా, గ్రామసీమలలో కొత్తపెట్టుబడిదార్లు, భూస్వాములు, ఒక నూతనవర్గంగా ఏర్పడినారు. భూములపై వచ్చే బాడుగలు, రైతులకిచ్చిన అప్పులపై వచ్చే వడ్డీ, వీరి పెట్టుబడికి మూలధనంగా లభించింది.

కంపెనీవారు తమ రాజ్యంలోని వివిధభూభాగాలలో, మూడు విధాలైన పట్టాదారీ విధానాన్ని ఏర్పరచినారు. ఇట్లా ఏర్పరచిన పట్టాదారీ పద్ధతులు వేరువేరుగానే ఉన్నా, దేశంలోని ప్రతి ప్రాంతంలోనూ భూమి సంబంధములైన విషయాలలో విప్లవాత్మకమైన మార్పులు రాక తప్పలేదు. కంపెనీ పరిపాలన అంతమయ్యేనాటికి, రైతులను పీల్చి పిప్పిచేసే మధ్యవర్తులవర్గం గ్రామసీమల్లో ఏర్పడి, ఉత్పాదనకు భంగం కలిగించింది. వ్యావసాయిక, ఋణములనుంచి లభించే వడ్డీపైనా, పంటభూములపై వచ్చే బాడుగపైనా ఆధారపడి బ్రతుకుతూ ఉండే ఈ మధ్యవర్తులవర్గము, వ్యవసాయాభివృద్ధికిగానీ, పంటల అభివృద్ధికిగానీ, ఏ రకమైన ప్రయత్నమూ చేసినవారు కారు. భూస్వాములూ, ఋణదాతలూ, ఈ విధంగా పెడుతున్న బాధలనుండి, కంపెనీవారి హయాంలో రైతులకేవిధమైన రక్షణకానీ, విరామంకానీ, లభించలేదు.

కంపెనీవారు నాగరీణప్రాంతాలలో కలిగించిన మార్పులు, ఇంతకన్నా, విప్లవాత్మకములైనవి. దేశీయములైన చేతిపనులను నశింపచేయడంవల్లనూ విదేశ వ్యాపారాన్ని నిర్మూలించడంవల్లనూ, దేశీయులైన పనివాండ్రవర్గమూ, గ్రామీణ వర్తకసంఘమూ నాశనమై పోయినవి. ప్రవర్ధమానములై ఉన్న వర్తక కేంద్రాలు, పరిశ్రమ కేంద్రాలు, తమ సంపదను, ప్రాధాన్యాన్ని, కోల్పోయి, చిన్నపట్టణాలుగానూ, పల్లెలుగానూ, మారిపోయినవి. ప్రజలు జీవనోపాధిలేనివారై, ఇతర ప్రాంతాలకు వలసపోవడంవల్ల, ఈ పూర్వకేంద్రాలు జనశూన్యమవుతూ వచ్చినవి. వాటికి బదులుగా కలకత్తా, బొంబాయి, మదరాసువంటి నగరాలు సృష్టికి వచ్చినవి ఈ నగరాలు ప్రభుత్వ అధికార కేంద్రాలు మాత్రమేకాక, యూరోపియనులకు స్థావరాలుగానూ, వారి వర్తక కేంద్రాలుగానూ, ఉపయుక్తమైనవి. ఈ నగరాలలోని జీవితమంతా, కంపెనీలోని పాశ్చాత్యోద్యోగుల కార్యక్రమంపైనా, పాశ్చాత్యవర్తకుల వ్యాపారంపైనా, ఆధారపడింది. యూరోపియనుల సంఖ్య స్వల్పమే అయినా, ప్రజలలో వారికే ప్రాబల్యమెక్కువ. ఈ నగరాలలోని ఆర్థికవ్యవస్థ సమస్తమూ వీరి చేతుల్లో చిక్కిపోయింది. ప్రపంచంలోని ఇతర వలస రాజ్యాలలోవలె ఇక్కడకూడా సామ్రాజ్యవాదమే ప్రధానసూత్రంగా ఏర్పడింది. తమ మాతృదేశమైన ఇంగ్లాండు మూలధనాన్ని, వర్తకానికి పెట్టుబడిగా చేసుకొని, స్వప్రయోజ నార్థము ఈ దేశాన్ని దోచడం ప్రధానవాణిజ్యనీతిగా స్థిరపడింది.

దేశంలోని మూలద్రవ్యాన్ని (వనరులను) అభివృద్ధిపరచే ప్రయత్నం. కంపెనీ, ఏమాత్రం చేయలేదు. పురనిర్మాణకార్యాలు,- ముఖ్యంగా రహదారులు, పంటకాలవలు,- మొదలైనవాటిని గమనించినవారు లేరు. దేశంలోని చేతిపనులన్నీ నాశనం చేయబడినవి. అధికశిస్తులభారము, రైతులను భూస్వాములు పీడిస్తూ ఉండడం, వ్యవసాయాభివృద్ధికి అవసరములైన నిర్మాణాలకు ప్రభుత్వం

పూనుకోకపోవడం,- అనే కారణాలవల్ల, పంటల ఉత్పత్తి క్షీణిస్తూ వచ్చింది. థాంసన్ (Thomson) చెప్పినట్లుగా, "దేశంలోని పంటపొలం శాపగ్రస్తమై ఉంది." ప్రజాపీడకుడైన స్వచ్ఛందప్రభువువలె, కంపెనీ రాజ్యపరిపాలన సాగిస్తూ ఉంది. భూమిని కేవలం స్వప్రయోజనార్థం ఉపయోగించుకోవడమేకాని, దానిని అభివృద్ధిపరచే బాధ్యతనుమాత్రం వహించడం లేదు. ఈ ఇద్దరికీ ఆర్థికవిషయంలో ఒక ముఖ్యభేదం లేకపోలేదు. స్వచ్ఛందుడైన పూర్వపు భూస్వామి తన భూభాగంలోనే నివసించేవాడు. ఇక కంపెనీ (వారు) భూస్వాములంటేనో ఇంగ్లాండులో నివసిస్తూ ఈ దేశాన్ని తమ లాభానికై ఉపయోగించుకొంటున్నారు." అని జెంక్స్ (Jenks) అనే ఆంగ్లేయుడు విమర్శించినాడు. బ్రిటీషు పరిపాలన ప్రథమశతాబ్దంలో జరిగిన ఆర్థిక దుర్వ్యవస్థలలో ప్రధానమైనది,- 'దేశీయవస్త్రనిర్మాణ పరిశ్రమ నాశనము; మ్యాన్‌ఛెష్టరు (Manchester) మిల్లుల పోటీ ఈ వినాశానికి ముఖ్యకారణము. పరిశ్రమలు నాశనం కావడంతో, ఈ కార్మికులందరూ వ్యవసాయకూలీలుగా పంటపొలాలపై బడడంవల్ల, పోషణభారమధికమై ఉత్పత్తి చాలలేదు. అదికాక, ఆహారధాన్యాలపంటను తగ్గించి, వాణిజ్య సరకుల ఉత్పత్తికి పూనడంతో, తిండికొరత ఇంకా తీవ్రమయింది. భూమిశిస్తును రూకలరూపంగా చెల్లించవలసిరావడంతో, పంటలోని అధికభాగాన్ని, రైతు బజారులో అమ్మి, పన్నుల కవసరమైన వెండిరూకలను కొనవలసిన పరిస్థితి ఏర్పడింది. దీనివల్ల, తన కుటుంబానికికూడా, ఆహారధాన్యాలు చాలని దుర్గతి సిద్ధించింది.

1858 లో, అనుసరించిన ఆర్థికవ్యవస్థలో, అభ్యుదయసాధకములైన ప్రధాన మూలసూత్రాలు లోపించినవి. పంటపొలాన్ని సారవంతంగా చేయడానికి తగినస్తోమత రైతుకు లేదు. నూతన వ్యావసాయక పరికరాలను కొనడానికి ఆవశ్యకమైన ధనము అంతకుమొదలే లేదు. కనుక, వ్యవసాయాభివృద్ధి కుంటుపడడం ఆశ్చర్యం కాదు. పన్నులు చెల్లించడానికీ, కొన్ని సందర్భాలలో తన జీవనానికికూడా, రైతు రుణదాతలను ఆశ్రయించవలసిన దుస్థితి సంప్రాప్తించింది. నూతన ఉద్యమోద్యోగానికి పూనుకొనే చైతన్యము, సాహసము వ్యాపారస్థుల సంఘానికి లేదు. పెద్దపరిశ్రమలను స్థాపించడానికి తగిన మూలధనంకానీ, ద్రవ్యాన్ని సేకరించుకొనే అవకాశాలు కానీ వారికి లేవు. కనుక, స్థానికవర్తకానికి, ఏజెన్సీ ఉద్యోగానికి, దలాలీవ్యాపారానికి అంగళ్ళు నడపడానికి, దేశీయ బ్యాంకు వ్యాపారానికి మాత్రమే వర్తకులు, తమ కార్యక్రమాలను పరిమితం చేసుకోవలసి వచ్చింది. ప్రథమదశలో, ఇంగ్లాండు ప్రయోజనసాధనకై ప్రభుత్వం భారతదేశాన్ని దయాదాక్షిణ్యశూన్యంగా దోపిడి చేసింది. పిమ్మట వాణిజ్య నీతినే 'తాటస్థ్యనీతి' అనే మారుపేరుతో ప్రవేశపెట్టి, దేశీయపరిశ్రమాభివృద్ధిని వెనక్కునెట్టి, వలసరాజ్యవిధానాన్ని ప్రభుత్వం చక్కగా, పెంపొందించుకొంది. కనుకనే. ఆర్థికవ్యవస్థను బాగుపరచుకొనే అవకాశము, తరవాతకాలంలో, లభించినా, దేశం దానిని ఉపయోగించుకోవడానికి సమర్థంకాలేదు. వాస్తవానికి విదేశాల బజార్లు (విపణివీధులు) (Markets) అభివృద్ధిచెంది, విదేశవ్యాపారం

వృద్ధి అయి అట్టి సదవకాశం లభించింది. పాత ఆర్థిక శృంఖలాలనుంచి బైటపడి, నూతన వాణిజ్యరంగంలో ప్రవేశించే అదను భారతీయవర్తకులకు లభించింది. కాని, భారతీయార్థికవ్యవస్థ రచనలోని లోపాలు, దానిని నిర్బంధించే అవధులు, పరిశ్రమాభివృద్ధిని అరికడుతున్న ప్రభుత్వపు రాజకీయశక్తి,- ఏకమై ఈ సదవకాశానికి అడ్డుతగిలి, తత్ప్రయత్నాన్ని భంగపరచినవి.

## III. శతాబ్దపు ఉత్తరభాగంలో, ఆర్థికవ్యవస్థలోని మార్పులు

1858 శాసనం ప్రకారము, ఈస్ట్ఇండియా కంపెనీ ప్రభుత్వము ఇంగ్లాండు సింహాసనానికి సంక్రమించింది. ఐనా, భారతదేశ పరిపాలన విధానంలోకాని, పాలకుల ఆర్థికనీతిలోకాని, వారవలంబించిన విధానాలలోకాని, గణనీయమైన మార్పులేమీ రాలేదు. ఐనప్పటికీ, ప్రభుత్వం ఆంగ్లసింహాసనానికి సంక్రమించిన పిమ్మట అర్థశతాబ్దకాలంలో, భారతదేశంలోని ఆర్థికరంగంలో సంవేగాత్మకములైన సంఘటనలు జరిగినవి. భారతీయార్థికవ్యవస్థలోని కొన్ని విభాగాలు ఆధునిక పరివర్తనం పొందడం ఆ సంఘటనలలో ప్రబలమైనది. ఈ పరివర్తనము, సాంఘికపరివర్తనకు దారితీసింది. భారతదేశీయుల దృక్పథం ఈ పరివర్తన ప్రభావప్రాబల్యానికి లోనయింది. ఈ కాలంలో, జాతీయభావము, వేగంగా వృద్ధిపొందింది. ఈ అభివృద్ధికి దోహదం గావించిన కారణాలు రెండున్నవి. ప్రజానీకంయొక్క ఆర్థికస్థితి దినదినానికీ క్షీణిస్తూండడము, మధ్యతరగతివారి అసంతుష్ట భావము,- అనేవే ఈ కారణాలు. రాజకీయచైతన్యం దేశంలో ఉదయించి, విస్తరించడం ఎట్లా జరిగిందో ఆ చైతన్యంయొక్క విశిష్టలక్షణాలు,- ఎటువంటివో అర్థం చేసుకోవలసి ఉంది. ఇంగ్లాండు రాజుయొక్క ఆధిపత్యంలో, భారతదేశ ఆర్థికరంగం ఏవిధమైన పరివర్తనానికి లోనైనదో, పరిశీలించడం, ఈ విషయంలో ఆవశ్యకము.

ఒకవైపు, ఆర్థికోత్పత్తి మందంగా వృద్ధిపొందుతూ ఉంటే, రెండోవైపు, జనసంఖ్యక్రమంగా వృద్ధి అవుతూ వచ్చింది. తత్ఫలితంగా, అర్థవిస్తృతి సమాజంలో సమానప్రతిపత్తిలో జరగలేదు. కొద్దిమంది వ్యక్తులుమాత్రమే ధనవంతులు కావడమూ, అత్యధికభాగమైన ప్రజానీకం దరిద్రావస్థనుంచి ప్రబల దరిద్రావస్థకూ, దుస్థితినుంచి మరింత దుస్థితికి దిగజారిపోవడమూ, తటస్థించినవి. ప్రభుత్వ మవలంబించిన విధానాలు, ఆర్థిక వ్యవస్థాభివృద్ధికి సహకరించక పోవడం మాత్రమే కాదు, అవి ఉత్పత్తి నిరోధకాలై, జాతీయ ఆదాయానికి హానిని కూడా కలిగించినవి. ప్రభుత్వ విధానాల ఫలితంగా, వ్యాపారానికి ప్రోత్సాహమూ, పరిశ్రమల నిర్మాణానికి ప్రతిబంధకమూ, ఏర్పడినవి. అంతేకాక- విదేశపుపెట్టుబడిదార్లకు, మధ్యవర్తులకు ఈ విధానాలు ప్రయోజనకరములై, సరకులను ఉత్పత్తిచేసే ప్రాథమిక వర్గంవారి (వ్యవసాయదార్లు) ఆర్థికస్థితి క్షీణించడానికి ప్రబలకారణాలయినవి.

బ్రిటీషువారి పారిశ్రామిక సామ్రాజ్యనీతి భారతదేశాన్ని వలసరాజ్యంగా పరిగణించి, వలసరాజ్య ఆర్థికవ్యవస్థను,-అన్ని లక్షణాలతో,-దేశంలో నెల

కొల్పింది. వలసరాజ్య విధానాలన్నిటికీ సుపరిచితమైన, అన్యోన్యాశ్రయ విషమచక్రాన్ని (Vicious circle), ఆర్థికరంగంలో ప్రతిష్ఠించింది దేశంలోని వ్యవసాయ పద్ధతి, సర్వసాధారణంగా పెట్టుబడిలేనిది; కనుక ఉత్పత్తి కూడా స్వల్పమైనదే. దీనిలో మిగిల్చి పరిశ్రమలను నెలకొల్పడం, జరగని సంగతి. అటువంటి వ్యవసాయ విధానానికి ఒక వైపు చలనంలేకుండాచేసి, ఇంకొక వైపు ఆధునికమైన భారీపరిశ్రమల అభివృద్ధి జరగకుండా కట్టుదిట్టం గావించింది ప్రభుత్వ ఆర్థికవిధానము. మొదటనే మూలధనరహితమై, కుంటుతూ నడుస్తున్న దేశ వ్యవసాయము, తన ఉత్పత్తిలో మిగిల్చి, నూతన వ్యావసాయిక పరికరాలను కొని, వ్యవసాయపద్ధతులలో మార్పులు తేలేదు. అటువంటి సందర్భంలో, భారీ పరిశ్రమలకు మూలధనాన్ని సమకూర్చి, వృద్ధిచెందుతున్న ప్రజానీకానికి పరిశ్రమలలో జీవనోపాధి అవకాశాన్ని కల్పించి, వ్యవసాయంపై గల ప్రజాభారాన్ని మళ్ళించడం జరగనిపని. ఈ విధంగా వ్యవసాయమేమో అధికప్రజానీకాన్ని భరించలేదు. పరిశ్రమల స్థాపనకు సహకరించనూలేదు. ప్రభుత్వము, భారీ పరిశ్రమలను నెలకొల్పి, ప్రజలకు జీవనోపాధి కల్పించదు. నెలకొల్పడానికి పూనుకొనే వర్తక సంఘాన్ని అడ్డగిస్తుంది. ఇటువంటి విషవలయం ఆర్థికరంగంలో ఏర్పడింది. తత్ఫలితంగా, ధనవిషయంలోనూ, సంఖ్యలోనూ మధ్య తరగతి వర్గంవృద్ధిపొందుతుండగా, సామాన్య ప్రజ దారిద్ర్యానికీ, దుఃఖానికీ, లోనై కుంగి పోతూ వచ్చింది. మధ్య తరగతివారి, మత సాంఘిక సంస్కరణోద్యమాలూ, విద్యా, రాజకీయ, కళాసారస్వతాల అభివృద్ధి ప్రయత్నాలూ, ఒక వైపుజరుగుతుండగా, ప్రజలు దిక్కులేనివారై, అజ్ఞానంలోమునిగి, రోగాలతో నీరసించి, దారిద్ర్య భారంతో కుంగిపోయి జీవచ్ఛవాలుగా బ్రతుకవలసిన స్థితిఏర్పడింది.

1858-1905 మధ్యకాలంలో, 90 శాతంపైగా దేశప్రజలు పల్లెలలో నివసిస్తుండేవారు. ఈ కాలంలో, ప్రజాసంఖ్య 50 శాతం పెరిగింది. కాని, వస్తూత్పత్తి గావించే పరిశ్రమలు వ్యవసాయేతరములైన ఇతర ఉద్యోగావకాశాలు' ప్రజాభివృద్ధికి అనుగుణంగా వృద్ధిపొందలేదు. కనుక గత్యంతరంలేక, ఈ ప్రజాభారమంతా, మధ్యయుగాల పద్ధతిపై కుంటుతూ సాగుతున్న వ్యవసాయోత్పత్తిపై ఆధారపడవలసి వచ్చింది. ఈ పరిణామ పరిస్థితిని, వేరా ఆన్‌స్టే (Vera Anstey) ఈ విధంగా వర్ణించినాడు. "పాశ్చాత్య దేశాలలో కూడా,- ఒక చదరపుమైలు విస్తీర్ణంగల పంటపొలం వ్యవసాయం, సుమారు 250 మంది ప్రజలను మాత్రమే పోషించగలదని అంచనా వేసినారు. కాని, ఇండియాలో ప్రతిచదరపుమైలు విస్తీర్ణం గల వ్యవసాయంపైనా, పల్లెసీమలలోని 600 మంది ప్రజలు ఆధారపడి ఉన్నారు."

మొత్తందేశజనాభాలోని, ఐదులో మూడవవంతు (3/5 భాగము), మొత్తం దేశవిస్తీర్ణంలోని మూడవ వంతులో (1/3 భాగం) ఇమిడి ఉన్నారు. పంటభూములపై భారంగా పడిన ఈ సమభిపాతం (Concentation), గ్రామ పరిశ్రమల నాశంవల్ల మరింత తీవ్రమయింది. ఇంతకు ముందు వివిధ వృత్తులలో

ఉన్నవాళ్ళంతా, తమకు వేరేమార్గంలేనందువల్ల వ్యవసాయాన్ని ఆశ్రయించవలసివచ్చింది. ఇందువల్ల, తప్పనిసరిగా పొలాలు చిన్నచిన్న భాగాలుగా చీలిపోవడం జరిగింది. ఆ చీలికలనుదున్నడంవల్ల లభించే ఉత్పత్తి, కూటికి చాలకపోవడంవల్ల ప్రజలు అధఃప్రమాణజీవనాన్ని (Sub standard living) గడపవలసివచ్చింది. ఇదేకాలంలో, దేశాన్ని తుడిచిపెట్టిన క్షామాలు, దేశప్రజల జీవితాన్ని మూలంగా తినివేస్తున్న ఆర్థికదుర్విధాన విషకీటక చర్యలకు సాక్ష్యమౌతున్నాయి.

## IV. వ్యవసాయము-వ్యవసాయదారుల పరిస్థితులు

వ్యావసాయిక సమృద్ధికి అనుకూలములైన పరిస్థితులు అనేకములు దేశంలో ఉన్నప్పటికి కూడా, వ్యవసాయదారుని పరిస్థితి దిగజారిపోవడం అనేది, పరస్పర విరుద్ధంగా తోచకపోదు.

ఉదాహరణకు ;— 1891-92 సంవత్సరంలో, సేద్యంలో ఉన్న మొత్తం పొలము 18.775 కోట్ల ఎకరాలు. అది, 1901-02 నాటికి 19 971 కోట్లకు పెరిగింది. 1910-11 నాటికి అది 22.23 కోట్ల ఎకరాలయింది. పంటకుపయోగించే బంజరుభూములనేకములు సేద్యంలోనికి వచ్చినవి. పంటబావులు, పంటకాలువలు అభివృద్ధిపొందినవి. ఈ అభివృద్ధివల్ల దేశసంపద వృద్ధిపొందిందని కొందరు తలచినారు. అట్లా తలంచడంకూడా సంగతమైనదే. కాని, ఈ అభివృద్ధి జనాభా అభివృద్ధికి చాలినది కాదు. అదికాక, ఈ పంటపొలాల విస్తీర్ణాన్ని ఆహారధాన్యాల ఉత్పత్తికీ, ఇతర సరకుల ఉత్పత్తికీ సమన్యాయంగా (Ebuitably) విభాగించలేదు. 1901-1902 నాటికి, పంటపొలం విస్తీర్ణం 120 లక్షల ఎకరాలు అధికమైనా, ఆహారధాన్యాల పొలం విస్తీర్ణం 27 లక్షలు మాత్రమే పెరిగింది. 1891-1911 మధ్యగల పండ్రెండేండ్లలో ఆహారధాన్యాల ఉత్పత్తికి ఉపయోగించబడిన పొలం విస్తీర్ణము 3 శాతము, వాస్తవానికి, తగ్గింది. ఆహారధాన్యాల ఉత్పత్తిని, ఇతర సరకుల ఉత్పత్తి ఏవిధంగా తగ్గించివేసిందనే విషయం, ఈకిందిపట్టికవల్ల వ్యక్తమౌతుంది.

పట్టిక

*మొత్తము పంటపొలంలో, ఆహారధాన్యాలు పండించే పొలం యొక్క శాతము.*

(బ్రిటీషు ఇండియా మాత్రమే - బర్మాను మినహాయించి)

| | పంచాబ్దము | | | | | |
|---|---|---|---|---|---|---|
| | 1890-91, 1895-96, 1900-01, 1905-06, 1 1 1 1910-11, 1911-12, 1894-95, 1899-1900, 1904-05, 1909-10. | | | | | |
| ఆహారధాన్యాలు | 81.3 | 81.00 | 80.2 | 79.3 | 79 7 | 78.2 |
| నూనెగింజలు | 6.0 | 5. 5 | 5.7 | 5.4 | 5.6 | 6.5 |
| జనుము | 1.0 | 1. 0 | 1.1 | 1.4 | 1.2 | 1.4 |
| ప త్తి | 4.6 | 4. 4 | 5.1 | 5.7 | 5.9 | 6. |

అఖిలభారతానికి చెందిన ఈ వివరాలు నిజస్వరూపాన్ని పూర్తిగా తెలియ జేయలేవు. కొన్ని ప్రాంతాలలో, నగదు పంటలు (Cash Crops) అధికమై, ఆహారధాన్యాలను తగ్గించి తీవ్రపరిస్థితులను తెచ్చిపెట్టినవి. ఉత్తర, తూర్పు బెంగాలు ప్రాంతాలలో, 1890-91 కి 1894-95 కి గల మధ్యకాలంలో, ఆహార ధాన్యాల పంటపొలము 71.48 శాతంగా ఉండినది.

1911-12 నాటికి అది, 67.7 శాతానికి తగ్గిపోయింది. అదేకాలంలోనే జనుము పంటపొలము 11.28 నుంచి 14.1 శాతానికి పెరిగింది. మదరాసు దక్షిణ భాగంలో, ఆహారధాన్యాలు పండించే పొలము 82.78 నుంచి 76.8 కు తరిగి పోయింది. నూనె గింజల పంటపొలము 6.71 నుంచి 10.6 శాతానికి పెరిగింది. ప్రత్తిపంట విస్తీర్ణము 4.8 నుంచి 7.0 శాతానికి అధికమయింది. ఇదే విధంగా, సింధ్‌లో 1894-95 కూ 1911-12 కూ, గల మధ్యకాలంలో, పత్తి పంట విస్తీర్ణము 3.06 నుంచి 10.3 శాతంకు పెరిగింది. బీహారులో, అదే, 33.06 నుంచి 46.1 శాతానికి పెరిగింది. నగదు సరకులకు గల గిరాకీ (demand), దాని ఉత్పత్తీ, ఆ సరకులను విశిష్టంగా పెంచే ప్రదేశాలలోని రైతులకు ప్రయోజన కారిమై, వాళ్ళు బాగుపడినారు. నిజమే. కాని, దీనివల్ల దేశంలో ఆహారధాన్యాల కొరత ఏర్పడి ధరలు పెరిగిపోయినవి. అధిక సంఖ్యలో వృద్ధిఅవుతున్న శ్రామికవర్గం తత్ఫలితంగా-(పొలంలేని వాళ్ళు కావడంవల్ల) కష్టాలకులోనైనారు. నగదు పంటల అభివృద్ధివల్ల వారికి జరిగింది నష్టమే.

వ్యావసాయిక ఉత్పత్తి, ఆదాయము,- వీటిలో గుర్తించదగినంత అభి వృద్ధికలగకపోవడానికి, ఇంకో కారణంకూడా ఉన్నది. పంజాబులోని పంటకాలు వల కిందఉన్న భూములు, దేశంలో ఇతర నీటిపారుదల సౌకర్యాలు గల ప్రాంతాలు తప్ప,- నూతనంగా సాగుబడిలోకి వచ్చిన తక్కిన పొలమంతా, సాధారణంగా, నీరసమైన బంజరుభూమీ, నాసిరకపుభూమీ ఐ ఉండటం సంభ వించింది. ఈ కొత్తపొలాల ఉత్పత్తి ఇదివరకే సాగుబడిలోఉన్న పొలాల ఉత్పత్తికంటె అల్పమైనది. అదికాక, పాతరకపు సేద్యపుపద్ధతీ, పొలంయొక్క అల్పపరిమాణమూ-కారణాలుగా ఉత్పత్తి పెరగలేదు.

1905-06 వరకూ గల కాలంలో ఉత్పత్తిఅయిన ఆహారధాన్యాల సంఖ్యా పరిశీలననుబట్టి, సగటుఉత్పత్తి ఆ కాలంలో నిలకడగా ఉన్నదనీ, అది సాలుకు సుమారు 7.2 కోట్ల టన్నులనీ తెలుస్తుంది. ఈ మొత్తం ఉత్పత్తిలో కొంత భాగం విదేశాలకు ఎగుమతి అయింది. ఇంతలోగా, దేశంలో ఆహారధాన్యాల విని యోగదార్ల సంఖ్య (Consumers) వృద్ధిఅవుతూ వచ్చింది. ఆహారవినియోగంలో ప్రతివ్యక్తికీ కొరతకలిగిందా అనే విషయం దీనినిబట్టి నిశ్చయించలేము. హంటర్ (W. W. Hunter) వివరించినట్లు "దేశం మన పరిపాలనలోకి వచ్చిననాటికంటె, ఇప్పుడు జీవనానికై ప్రజలు పడుతున్న కష్టం తీవ్రతరంగా ఉన్నది. విశాలము లైన రాజ్యభాగాలన్నిటా ఇది సాధారణంగా కనిపిస్తూనే ఉన్నది". "భూము లను, బెంగాలులోవలె, భూయజమానుల కప్పగించినా, లేక, దక్షిణభారతంలో

వలె, మన అధీనంలో నిలుపుకొన్నా కూడా, భేదం కనపడడంలేదు. అధిక సంఖ్యాకులైన ప్రజలలో జీవనసంఘర్షణ రానురాను తీవ్రమౌతూనే ఉన్నది."

"పూర్వమెన్నడూ ఉత్పత్తి కానంత మొత్తం ఆహారం ఈనాడు పండిస్తున్నారు. కాని, ఇంతకంటె వేగంగా ప్రజాసంఖ్య పెరుగుతూ ఉండడంవల్ల ఆహారసరకుల సరఫరా చాలడంలేదు. దేశీయప్రభుత్వంలో ఎన్నడూలేని సమృద్ధి ఈనాడు, బ్రిటీషుపాలన ప్రాంతంలో ఏర్పడింది. దేశంలోని జనాభాలోని ఐదులో రెండోవంతు ప్రజానీకం ఈ భాగంలోఉండి, తత్ఫలితాన్ని అనుభవిస్తున్నారు. తక్కినభాగంలో రెండువంతుల ప్రజ, క్షీణజీవనాధారాన్ని (Diminishing-subsistence) సంపాదించుకొంటూ ఉన్నది. తక్కిన ఐదవ భాగం, అంటే నాలుగు కోట్ల ప్రజానీకం, చాలీచాలని ఆహారంతో జీవనయాత్ర సాగిస్తున్నారు." అని ఇతడు పరిశీలనచేసి అంచనా వేసినాడు.

వ్యావసాయక అభివృద్ధికై ప్రభుత్వం కొంత ప్రయత్నించిన మాట వాస్తవమే. 1878-80 ల మధ్య, నూతన వ్యవసాయ పద్ధతులను, పరికరాలను ప్రదర్శించడానికై ప్రయోగాత్మక క్షేత్రాలను కొన్నిటిని ఎన్నికచేసినారు. క్షామ నివారణ సమితివారి (Famine commission) సిఫార్సులననుసరించి, ప్రభుత్వం వ్యావసాయికశాఖను, (Agricultural department) నెలకొల్పింది. కాని, ఈ శాఖవారు, మొదటి సంవత్సరాలంతా వ్యావసాయిక సంఖ్యలను సేకరించడంలోనే గడిపినారు. 1889 లో, డాక్టర్ వూయెల్కర్, (Dr. Voelcker) అనే వ్యావసాయ రసాయనికశాస్త్రజ్ఞుడు, ఇండియాకువచ్చి, పరిశీలనానంతరం విలువగల ఒక నివేదికను సమర్పించినాడు. 1901 లో వివిధప్రాంతాలలోని వ్యవసాయశాఖల కార్యక్రమాలకు సమన్వయం కలిగించడానికై ఇన్‌స్పెక్టర్ జెనరల్ ఆఫ్ అగ్రికల్చర్' అనే అధికారిని ప్రభుత్వం నియమించింది. అమెరికాదేశీయుడైన ఫిప్స్ (Mr. Phips) అనే లోకోపకారి ఔదార్య సహాయంతో, ప్రభుత్వము, పూసా రీసర్చి ఇంస్టిట్యూటును, ఢిల్లీలో స్థాపించింది. వ్యావసాయిక విద్యావ్యాప్తి నిమిత్తం కొన్ని పాఠశాలలు, కళాశాలలు నెలకొల్పబడినవి. ఈ ప్రయత్నాలేవీ, ఉత్పాదనవిధానంలోకాని, వ్యావసాయిక ఉత్పత్తిలోకాని, గమనించదగినంత మార్పును తేలేకపోయినవి. పరిశోధనలో చాలభాగం కేవలం వర్గీకరణానికి మాత్రమే సంబంధించినది. "పరిశోధన సాధించిన ఫలితమేదైనా, ఉన్నట్టయితే, అదిరైతు వరకూ పోలేదు."

రవాణా సౌకర్యాలు, సంచారసౌకర్యాలు, అభివృద్ధిపొందడంవల్ల, వ్యవసాయదారుని ఆర్థికాభ్యుదయం కూడా పెంపొందవలసింది. బజార్లు విస్తృతి పొందినవి, విదేశాలలోనూ, స్వదేశంలోనూ ధరలు పెరిగినవి. ధరలలో సమానత్వం ఏర్పడే సూచనలు కూడా కలిగినవి. ఐనా, ఫలితం కనబడలేదు.

రైల్వే విధానంవల్ల కూడా, ఆర్థిక పరిస్థితి బాగుపడక పోవడానికి కారణాలను హెలెన్ ల్యాంబ్ (Helen Lamb), ఈ విధంగా వివరిస్తుంది. "భారత దేశపు రైల్వేల అభివృద్ధికి ప్రభుత్వం సాహసించి నష్టానికి కూడా సిద్ధపడవలసి

వచ్చింది. 5 కోట్ల పౌనుల భారం ప్రభుత్వంపై పడింది. 1900 నాటికిగాని రైల్వేలు లాభదాయకం కాలేదు. ఐనా శాఖోపశాఖలుగా నిర్మితమైన రైల్వే నిర్మాణంవల్ల, సమగ్రమైన, సుసంబద్ధమైన ఆర్థికాభివృద్ధి కలుగలేదు. రైల్వేలను అభివృద్ధి పరచడంలో ప్రభుత్వం వహించిన బాధ్యతకు అనుగుణమైన ప్రయోజనాన్ని దేశం పొందలేకపోయింది. పైగా దేశానికి కొంత నష్టంకూడా కలిగింది. రైల్వేలు ప్రణాళిక రహితంగా నిర్మించబడలేదు. బ్రిటీషువారి ప్రయోజనాలను దృష్టిలో ఉంచుకొనే రైల్వే ప్రణాళిక తయారుచేసినారు."

ఇండియా రైల్వే నిర్మాణకర్తా, దాని ప్రేరకుడూ, ఐన ఆర్. ఎమ్. స్టీవెన్సన్, అభిప్రాయాన్నిబట్టి, రైల్వేల నిర్మాణంలో బ్రిటీషువారి ఉద్దేశాలు ప్రధానంగా రెండు. "తక్కువ ఖర్చుతో సమగ్రసామ్రాజ్యరక్షణను మిలిటరీ సహాయంతో నిర్వహించడం మొదటిది. రెండోది వాణిజ్యసౌకర్యానికి సంబంధించినది. దేశాంతర్భాగాలనుంచి, వివిధములైన, విలువగల సరకులను సమీప రేవుపట్టణాలకుచేర్చి, వాటికి బదులుగా ఇంగ్లాండునుంచి దిగుమతియైన ఉప్పు మొదలైన వస్తువులను భారతదేశంలోని అన్నిభాగాలకూ సరఫరా చేయడం, బ్రిటీషు ప్రభుత్వంయొక్క ప్రధానోద్దేశము.

భారతదేశ ఆర్థికవ్యవస్థను పెంపొందించడానికి అనుకూలమైన అవకాశము ఇంకొకటికూడా ఉన్నది. ప్రపంచంలోని అన్ని భాగాలలోనూ వస్తువుల ధరలు 1861 సంవత్సరంనుంచి పందొమ్మిదో శతాబ్దమంతటా పెరుగుతూ వచ్చినవి. 1891నుంచి ధరలు వేగంగా పెరుగుతూ 1905లో ఒక్కసారిగా పైకిపోయినవి. ఈ మధ్యకాలంలో భారతదేశ ఆర్థిక వ్యవస్థ, నిజంగా, బాగుపడియుండవచ్చు, కాని, అటువంటిది జరుగలేదు. కె ఎల్. దత్తా గావించిన విచారణను, లెక్కలనుబట్టి, 1890-1912 మధ్యకాలంలో, ధరలస్థాయి క్రమాభివృద్ధిచెందుతూ వచ్చింది. పాంచవార్షిక లెక్కలనుబట్టి, అఖిల భారతానికి సంబంధించిన సూచీ సంఖ్య, 1900-04 కాలానికి రూపాయి విలువలో 8 శాతం వృద్ధిపొందింది. 1905-09 పాంచవార్షిక కాలానికి అది 31 శాతం పెరిగింది. ముఖ్యంగా ఆహార ధాన్యాల విషయంలో ఈ పెరుగుదల ప్రాధాన్యం వహించింది. ఈ పెరుగుదలకు అంతర్దేశీయ విదేశీయములైన ఉపాదానాలు (factors) కారణమని ఆయన వివరించినాడు. ఆహారధాన్యాల ఉత్పత్తి, పరస్పర సంబంధాన్నిబట్టి, తక్కువ కావడం, ప్రజాసంఖ్య పెరగడం, ఇండియాలో, ఆహారవస్తువులకు ముడిసరుకులకు, గిరాకీ అధికం కావడం, రవాణా సౌకకావడం, రూపాయలు అధికంగా చెలామణిలో ఉండడం, బ్యాంకింగు సౌకర్యాలు ఏర్పడడం,-ఇవన్నీ దత్తా అభిప్రాయాన్నిబట్టి, ఆంతరములైన ఉపాదాన కారణాలు. బంగారం సరఫరా ఎక్కువకావడం, పరపతి అభివృద్ధి చెందడం, యుద్ధాలవల్ల కలిగిన వినాశము, అనుత్పాదకములైన యుద్ధకార్యక్రమాలకు శ్రామికవర్గాన్ని మూలధనాన్ని, మరల్చడమూ,-మొదలైన ప్రపంచ పరిస్థితులు బాహిరములైన ఉపాదాన కారణాలు.

1860 ప్రాంతంలో, ప్రత్తివ్యాపారంయొక్క ఆకస్మిక అభివృద్ధివల్ల, బొంబాయి, దక్కన్, బీరారులోని వ్యవసాయదారునికి తాత్కాలికంగా కలిగిన ఆర్థికాభ్యుదయమంతప్ప, ధరలు పెరగడంవల్ల తక్కిన భారతభాగంలోని రైతులకే విధమైన ప్రయోజనమూ కలుగలేదు. వాళ్ళ ఆర్థికపరిస్థితి బాగుపడలేదు. పంట పొలానికి దోహదం లేకపోవడంవల్ల, ఉత్పత్తి స్వల్పంకావడము, ఒక్కొక్క రైతు సాగుచేస్తున్న పొలం విస్తీర్ణంలో చిన్నదికావడం, కారణాలుగా, ఉత్పత్తిలో రైతు కుటుంబపోషణకూ, పన్నులకూ పోగా, రైతుకు మిగిలేదేమీ లేదు. దీనికి తోడుగా, ప్రభుత్వం విధించిన పన్నులు రైతుల తలకు మించినవిగా పరిణమించినవి. పైగా, భూములసారాన్నీ, ఉత్పాదన యోగ్యతనూబట్టి, పన్నుల నియామకం జరగలేదు.

*భూరాజస్వము (Land revenue) :* భూరాజస్వ పరిపాలనలో, రెండు ప్రధానవిధానాలవలంబించబడినవి. ప్రభుత్వానికి వ్యవసాయదారునికి మధ్య ఒక భూస్వామి మధ్యవర్తిగా ఉండేవాడు. దీనిని జెమీందారీ విధానమని వ్యవహరించేవారు. ఇంకొకటి రైతు వారీవిధానము. ఈ విధానంలో, ప్రభుత్వము రైతుతో ప్రత్యక్షసంబంధం కలిగించుకొన్నది. రైతు స్వయంగా, ఉద్యోగుల ద్వారా, ప్రభుత్వానికి పన్నులు చెల్లించేవాడు. మహల్ వారీ విధానము మూడోది. గ్రామీణులందరూ ఒక సంఘంగాకానీ, లేదా, జమీందారులవర్గం కానీ, ఏకంగా భూమికి స్వామ్యంవహించి, ప్రభుత్వానికి శిస్తులుకట్టే పద్ధతి ఈ విధానాన్ని అనుసరించినది.

పంటపొలం మొత్తం విస్తీర్ణంలో 48 శాతము, జమీందారీ విధానంలోనిది. ఇందులోని 29 శాతం, 20-30 సంవత్సరాలదాకా తాత్కాలిక పరిష్కారానికి చెందినది. తక్కిన 19 శాతం, శాశ్వత పరిష్కారమునకు లోనయినది. శాశ్వత పరిష్కారానికి లోబడిన భూమి మినహా, తక్కినభాగంపై విధింపబడిన శిస్తు, తలకు మించింది, కావడంవల్ల, ఖర్చులుపోగా ఉత్పత్తిలో మిగిలేదేమీ లేకపోయింది. అటువంటి పరిస్థితిలో వ్యవసాయాభివృద్ధికి పెట్టుబడి లభించే అవకాశం లేకపోయింది.

శాశ్వత పరిష్కారం గావించబడిన బెంగాలు జిల్లాలలో, మొత్తం ఉత్పత్తిలో 11 శాతానికి మించిఉండలేదు శిస్తు. తాత్కాలిక పరిష్కారానికిలోనైన గుజరాతులో భూరాజస్వము, 20 శాతము. అంటే, బెంగాలులోకంటె ఇది, రమారమి రెండురెట్లు. ఉత్తరభారతంలో, 50 శాతం ఉత్పత్తి రాజస్వంగా వసూలుచేసేవారు. కాని, భూస్వామికిచెందే భాగంనుంచి ఉపకరములకింద (Cesses) 8 శాతం తగ్గించేవారు. గ్రామ తలారి ఖర్చులు, గ్రామాధికారి ఖర్చులుకూడా భూస్వామి భాగంనుంచే ఇచ్చేవారు.

సాగుబడిలోఉన్న పంటపొలంలో 52 శాతం రైతువారీ విధానంలో ఉంటూవచ్చింది. బొంబాయి మదరాసు ప్రాంతాలలో రైతువారీ విధానం కింద ఉన్న ప్రాంతాలలోని పరిస్థితులు, ఇతర ప్రదేశాలలోకంటె, అధమంగా ఉండేవి.

బొంబాయి రాజధాని 1866 పరిష్కారాన్ని సంశోధిస్తూ (Revise), రాజస్వాన్ని అధికంచేయడం, హింసాత్మక రాజస్వవిధానమనడం యథార్థమే. హింసాత్మక శబ్దార్థము సమగ్రంగా, ప్రభుత్వ మవలంబించిన విధానానికి వర్తిస్తుంది. సేద్యపు ఖర్చులూ, ప్రభుత్వపు శిస్తూ చెల్లించిన తరవాత, రైతుకు మిగిలిందేమీలేదు.

మదరాసు రాజధానిలో అమలుజరిపిన నూతన రాజస్వవిధానంవల్ల, రైతుపై మరింత ఎక్కువగా శిస్తులభారం పడింది, అని, దత్, పేర్కొనినాడు. మొత్తం ఉత్పత్తిలో ప్రభుత్వానికి చెల్లించవలసిన భాగాన్ని, సరుకుల ధరలను పరిశీలిస్తే, పన్నులభారం 1860 నాటికంటె 1875లో ఎక్కువగా ప్రజలపై బడిందని వ్యక్తమౌతుంది. ఇండియా ప్రభుత్వానికి అండర్ సెక్రెటరీ ఆఫ్ స్టేట్ (Under secretary of state)గా ఉండిన సర్ జేమ్స్ మాలెట్ (Sir James Mallet) వంటి గొప్ప అధికారియే, "విధింపబడిన పన్నులు అత్యధికంగా ఉండడంవల్ల, భాటకం మొత్తానికి సమమైన మొత్తాన్ని ప్రభుత్వానికి చెల్లించవలసిన స్థితి ఏర్పడింది; అంతేకాదు, లాభంకూడా మిగులకుండా పోతున్నదని నా సంశయము" అని వ్రాసియున్నాడు.

భూస్వామి ఏర్పరచుకొన్న భూమి భాటకంపై ఆధారపడి బేరిజు నియమించిన ప్రదేశాలలో, భూస్వాములు భాటక మొత్తాన్ని పెంచుతూ వచ్చినారు. కంపెనీ ప్రభుత్వం ఇంగ్లాండు రాజు అధీనంలోకిపోయిన పిమ్మట అర్థశతాబ్దకాలం ఇది జరుగుతూ వచ్చింది. దీనికి తోడుగా, బేరీజు పునర్విమర్శన అవకాశాన్ని పురస్కరించుకొని, ప్రభుత్వం పదే పదే, బేరీజును ఎక్కువచేస్తూ వచ్చింది. భూస్వాములూ, ప్రభుత్వమూ చేస్తున్న ఈ మార్పులవల్ల రైతుపై భారం క్రమంగా ఎక్కువౌతూ వచ్చింది.

ఈ పరిష్కారాల కారణంగా నియతకాలికమాంద్యం వచ్చిపడింది. పెంచబడిన శిస్తులను చెల్లించడం తప్పించుకోవడానికై, రైతు ఒకటి రెండు సంవత్సరాల కాలం సేద్యం మానివేసి, తరవాతి బేరీజు పరిష్కారానికి ఎదురుచూస్తూ కూర్చునేవాడు.

ఐనా, 1860-61 నుంచి 1904-05 మధ్యకాలంలో పన్నుల వసూళ్లు 50 శాతం పెరిగినవి. సాగుబడి పొలం విస్తరించినందువల్ల వసూళ్లు కొంత ఎక్కువై ఉండవచ్చు. కాని, 50 శాతం పెరుగుదల అంతా ఇందులోదికాదు. ధరలు పెరగడంవల్ల సిద్ధించినలాభమంతా ప్రభుత్వానికి సిద్ధించిందేకాని, రైతుకేమాత్రమూ ముట్టలేదు.

రైతు అనుభవిస్తున్న దారిద్ర్యానికి, వ్యవసాయం వెనుకబడి ఉండడానికీ, పట్టాకాల వ్యవధి, పన్నులవిధానము, మూలకారణాలైనవి. నానావతి, అంజేరియాలు చెప్పిన ప్రకారము,-"శాశ్వత పరిష్కారం ఆధారంగా ఏర్పడిన పట్టా, కాలవ్యవధులవల్ల, చెడుగులనేకములేర్పడినవి. భూస్వాములు దూరంగా, పరోక్షంలో నివసించడం, పన్నువసూలులో జరిగే హింసాత్మక చర్యలు, భాటక

దారుల ఆర్థికదాస్యము, మొదలైన దురంతాలన్నీ, పన్నుల విధానంవల్లనే ఉత్పన్నములైనవి. పట్టాకాల వ్యవధులు భిన్నమైఉన్న ఇతరప్రాంతాలకు కూడా ఈ దురవస్థ తప్పలేదు. ప్రమాణములుగా నిశ్చయించబడిన సూత్రాల ననుసరించి, ఏర్పడిన ఏకైక విధానము, సార్వత్రికంగాలేదు. అందువల్ల రాజస్వవిధానము స్వచ్ఛందమయినట్టిది. దీనిలో సామ్యికవితరణ కూడా లోపించింది. (Inequilires) వ్యవసాయదారుల నిస్సహాయస్థితిని ఆధారంగా చేసుకొని, ఏర్పరచిన భాటకవిధానము వారిని మరింత దరిద్రులుగా (పాపర్లు) చేస్తూఉన్నది. భూమి సారాన్ని గమనించకుండానే, దోహద క్రియలు చేయకుండానే, వాడుతూ రావడం వల్ల పంట పొలం కూడా చెడిపోతూవచ్చింది."

సగటులెక్క ప్రకారము ఒక రైతు సాగుబడిలో ఉన్న పొలం విస్తీర్ణము స్వల్పమైనందువల్ల, ధరలపెరుగుదలవల్ల కాని, ఆహారధాన్యాలకు విదేశాలలో కలిగిన గిరాకీవల్లకానీ, రైతు కెటువంటి లాభమూ లేకపోయింది. సాంఖ్యీయ వివరాలు తగినంతగా లేనందున, రైతుసాగుబడిలోని క్షేత్రం (Holding) ఏ విధంగా క్రమంగా తగ్గిపోతూవచ్చిందో పరిశీలించి నిశ్చయించలేము. ఐనా, బొంబాయి దక్కన్ ప్రాంతంలోని వివరాలు దేశానికంతటికీ వర్తిస్తాయని చెప్ప వచ్చు. 1771 నుంచి 1818 వరకు గల, మధ్యకాలంలో క్షేత్రవిస్తీర్ణం, 40 ఎకరాల నుంచి 17½ ఎకరాలకు తగ్గింది. 1820-40 ప్రాంతంలో 17 ఎకరాలకు, 1915 నాటికి 7 ఎకరాలకు తగ్గిపోయింది. ఈ క్షేత్రాలలోని 60 శాతం భాగంలో ఒక్కొక్క క్షేత్రమూ 5 ఎకరాలకంటె తక్కువైనది కావడంవల్ల, ఆర్థికంగా నిష్ప్రయోజకం,"-అని హారాల్డ్‌మ్యాన్ (Harold Mann) అంచనా వేసినాడు.

"కాలువల నీటిపారుదల సహాయంతో నూతనంగా సాగుబడిలోకి తెచ్చిన జిల్లాలలో తప్ప, తక్కిన పంజాబు ప్రాంతమంతటా (పంజాబుపరిస్థితి దేశమంతటికీ సాధారణమైనదే;) రైతు అధీనంలో ఉన్న క్షేత్రం చాలచిన్నది. ప్రజా సంఖ్య ఎక్కువయ్యేకొద్దీ, క్షేత్రవిస్తీర్ణం ఇంకా చిన్నదౌతూ వచ్చింది."- అని బ్రజనారాయణ్, వివరించినాడు. ఇంతేకాక- మొదటనే చిన్నవైయున్న ఈ క్షేత్రాలను ఉపక్షేత్రాలుగా విభజించడం, ఇట్లా చీలికలుగా ఏర్పడిన క్షేత్ర భాగాలు దూరంగా అక్కడక్కడ చెదరిఉండడం,- అనే పరిస్థితులు మరింత హానిని కలిగించినవి. సగటున, ప్రతిక్షేత్రము 5 మొదలు 8 భాగాలుగా ముక్కలు చేయబడింది. దీనివల్ల వ్యవసాయపుఖర్చులు ఎక్కువై తగినప్రతిపలం లేకపోవడం, రైతుకాలము, శ్రమ, వ్యర్థంకావడం జరిగింది. ఆర్థికవిషయంగా, వ్యవసాయ కృషి అప్రయోజకమౌతూ వచ్చింది.

వ్యవసాయక్షేత్రాన్ని భాగించడం, చీలికలుచేయడం అనే దుర్విధానం; హిందూముస్లిము వారసత్వాలకు సంబంధించిన న్యాయసూత్రంవల్ల ఏర్పడింది. జనాభా పెరగడమూ; దేశీయపరిశ్రమలు వృద్ధిచెందకపోవడము, ఈ దుష్టపరిస్థితిని మరింత ఎక్కువచేసి క్షేత్రవిభజన పద్ధతిని, తీవ్రమొనర్చినవి.

వ్యవసాయదారుని అధీనంలోఉన్న క్షేత్రం క్రమంగా చిన్నదికావడం,

నగదును, ధాన్యాన్ని,భాటకంగా మధ్యవర్తులకు చెల్లించే భాటకదార్ల సంఖ్య పెరగడము, నియతంగా ఇచ్చే భాటకానికి బదులుగా, పోటీభాటకవిధానం ఏర్పడడము, భూస్వాములు స్వచ్ఛందులై భాటకదారులను వ్యవసాయ భూములనుంచి తీసివేయడము,- మొదలైనవి, వ్యవసాయదారులకు దుస్థితిని కలిగించిన ప్రధాన విషయాలు.

థార్నర్ (Thorner) "వ్యవసాయదార్ల వర్గంలో అధికభాగానికి మూలధనమేమాత్రమూ లేదు. ఈ దారిద్ర్యం నిరంతరమైనది. దీనికారణంగా, ఇరవైయో శతాబ్దమంతటా,- (పందొమ్మిదో శతాబ్దం కడపటిభాగం కూడా) దేశంలో వ్యావసాయికార్థిక దుస్థితి ఏర్పడింది." అని వివరించినాడు.

*ఆహార ధాన్యాల సరఫరా :* పందొమ్మిదో శతాబ్దపు ఉత్తరార్ధంలో ఉత్పన్నమైన ఆహార ధాన్యాల కొరత, భారతదేశ ఆర్థిక వ్యవస్థయొక్క ప్రధాన లక్షణము. ప్రజా సంఖ్యాభివృద్ధికి అనుగుణంగా ఎక్కువ భూమిని సాగుబడిలోకి తీసుకొని రాకపోవడము, ఆహారధాన్యాల ఉత్పాదనను తగ్గించి, నగదు సరకుల ఉత్పాదనను ఎక్కువ చేయడం-అన్నవి రెండూ ఈ కొరతకు కారణాలు.

1892-93 నుంచి 1904-05 వరకుగల మధ్యకాలంలో మొత్తం సాగుబడి భూమి 174 లక్షల ఎకరాలు. అంటే 8 శాతం పెరిగింది. దీనిలో ఆహార ధాన్యాల సాగుబడి 53.9 లక్షల ఎకరాలు,-అంటే 3 శాతం మాత్రమే. కాని, ఇతర ధాన్యాల సాగుబడి 120 లక్షల ఎకరాలు, అంటే, 29 శాతము. ఇదే కాలంలో జనసంఖ్య 150 లక్షలు అధికమయింది. ఈ విధంగా పెరిగిన జనాభా పోషణకు మాత్రమే, 105 లక్షల ఎకరాల సాగుబడి భూమి అవసరమైఉండగా, 53.9 లక్షల భూమి మాత్రమే అధికంగా సాగుబడిలోకి వచ్చింది. అధికమైన జనాభాలో సగంమందిని మాత్రమే ఇది పోషించగలిగింది.

వ్యావసాయక ఉత్పాదనలో జరిగిన ఈ మార్పు అనుద్దిష్టమైనదికాదు. ఇతరదేశపు బజార్లలో, ఇండియా ముడిసరకులకు గలిగిన ఎక్కువ గిరాకి, ఇండియా ప్రభుత్వ మవలంబించిన విధాననీతీ,-ఈ రెండున్నూ ఈ మార్పునకు కారణాలైనవి. వస్తువులను తయారుచేసే పరిశ్రమల విషయంలో, ప్రభుత్వము 1919 వరకూ తాటస్థ్యనీతిని అవలంబించింది. కాని, వ్యవసాయ విషయంలో,- ఇంగ్లాండుకు అత్యవసరాలైన, పత్తి, జనుము, మొదలైన సరకుల ఉత్పాదనకూ, విదేశీయ మారకద్రవ్యాన్ని సంపాదించడానికి సమర్థములైన తేయాకు, సింకోనావంటి సరకుల ఉత్పాదనకూ, ప్రభుత్వం స్వయంగా ప్రోద్బలమిచ్చింది.

అమెరికా అంతరంగికయుద్ధ ప్రారంభంతో, మధ్యభారత-బీరారులో కాటన్ కమీషనరు'ను ప్రభుత్వం నియోగించి, పశ్చిమోత్తర ప్రాంతాలలో (నేటి ఉత్తర ప్రదేశం) పత్తిపంటను విస్తరింపజేసే కార్యక్రమానికి పూనుకొంది. శాశ్వత భూమి పరిష్కారాన్ని విస్తరింపచేయడము, పత్తి పంట విస్తృతికి అవసరాలైన నీటి పారుదల సాధనాల నిర్మాణము, అన్న విషయాలు 1862 లో తీవ్రంగా పరిశీలించబడినవి. ఈస్ట్ ఇండియా కంపెనీవారు నీలి మందు పంటను

ప్రోత్సహించినారు. మాల్వాప్రాంతంలో గసగసాల పంటను (Poppy cultivation)-(అపీము తయారయ్యే మొక్క-) సాగించడానికై ప్రభుత్వం రైతులకు ముందుగా డబ్బుపెట్టుబడి పెట్టింది. తత్ఫలితంగా, మాల్వానుంచి కూడా ఆహారధాన్యాల సరఫరా తగ్గిపోయింది. 1893-1906 మధ్యలో, సగటు ఆహార ధాన్యాల ఉత్పత్తి సూచీ సంఖ్య 100 నుంచి 96 కు దిగిపోయింది. నగదు సరకుల ఉత్పత్తి 100 నుంచి 105 కు పెరిగింది. సగటు ఆహారోత్పత్తి 739 లక్షల టన్నుల నుంచి 715 లక్షలకు దిగిపోయింది. సంవత్సరానికి, ప్రతివ్యక్తికీ లభించే ఆహారం మొత్తము, 587 పౌనుల బరువు నుంచి 560 పౌనులకు తగ్గింది. క్షామములు వచ్చినా ఆహార సరఫరాలో కొరత కలిగినా కూడా, ఆహార ధాన్యాల అధికోత్పాదనకు ఎటువంటి చర్యలూ ప్రభుత్వం తీసుకోలేదు. పైగా, విదేశ బజారులలో గిరాకీగా ఉన్న సరకుల ఉత్పాదనకై, స్వయంగా ప్రోద్బల మిస్తూ వచ్చింది ప్రభుత్వము.

*ఋణగ్రస్తత :* ఆస్తివిషయంలోను, ఆస్తికి సంబంధించిన స్వామ్యాధికార విషయంలోను, పాశ్చాత్యభావన ననుసరించి, బ్రిటీషువారు ఇండియాలో భూమి విధానాన్ని నెలకొల్పినారు. వ్యావసాయికార్థిక వ్యవస్థకు సంబంధించిన ఆదాయాన్ని పంచడంలో, వారవలంబించిన విధానం అన్యాయమైనది, సామ్యికవితరణకు విరుద్ధమైనది, పీడాకరమైన దీను. ప్రజల దారిద్ర్యానికీ, వారి ఋణగ్రస్తతకూ ఇదియే కారణమయింది.

భూముల, ఆదాయ, కొలతల పరిష్కారాలు, అధికార- అఖిలేఖలు, న్యాయపాలనవిధానము, న్యాయస్థానాలు,- వీటి స్థాపనవల్ల, భూమికి విశిష్టమైన విలువఏర్పడి, అది హస్తాంతర యోగ్యమైన ఆస్తిగా సిద్ధించింది. జనాభా పెరిగి, వ్యవసాయేతరములైన ఉద్యోగాలు తక్కువకావడంతో, భూసంపాదనకు పోటీ ఏర్పడి, భూమివిలువ అధికమయింది. ఇట్లా సిద్ధించిన సురక్ష ఆధారంపై, భూస్వామికి, ఋణం సులభంగా లభించే అవకాశమేర్పడింది. కాని, అట్లా తెచ్చుకొన్న ఋణద్రవ్యాన్ని అతడు నిరుపయోగంగా వెచ్చించినాడు. పట్టణవాసులైన పెట్టుబడిదారులు, తమ మూలధన వినియోగానికి ఇతర ప్రయోజకమార్గాలు లభించక, భూసంపత్తిని కొనడానికి, లేక, భూమి తనఖాపై ఋణంగా ఇవ్వడానికీ ప్రారంభించినారు. పొలం పంటపై కూడా ఋణమిచ్చి వడ్డీతో, రాబట్టుకొనేవారు. ఋణంకాలంలో తీర్చలేక పోయిన సందర్భాలలో, తనఖా పెట్టిన భూములను, ఇతరులకు హస్తాంతరంగావించి, తన డబ్బు రాబట్టుకొనేవారు.

నిరంతరమైన ఈ ఋణభారంవల్ల, రైతులు తమ భూములను, ధనవంతులైన భూస్వాములకో, వ్యవసాయదారులకో, లేక, ఋణదాతలకో అన్యాక్రాంతం చేయవలసివచ్చింది. ఈ పరిస్థితి కారణంగా, నిష్ప్రయోజకులైన మధ్యవర్తులు, అధికవడ్డీ ఋణదాతలు ఒకవైపునా, అధికసంఖ్యాకులైన భాటకరైతులు, స్వేచ్ఛా భాటకదారులు, క్షేత్రరహితులైన పారిశ్రామికులు మరియొకవైపునా వృద్ధి అవుతూ వచ్చినారు. జమీందారీ, మహల్‌వారీ, రైతువారీ విధానా

లన్నింటనూ దేశంలో సర్వత్రా,ధనికులకూ,దరిద్రులకూ మధ్యగల అంతరం విశాల మౌతూ వచ్చింది. దేశంలోని సాగుబడి పొలంలో మూడువంతుల భాగాన్ని సాగుచేసే రైతులకు, దినవెచ్చానికి మించి లభించడంలేదు.

సామంత ప్రధానాత్మకమూ, పితృసత్తాత్మకమూ (Feudal and Patriarchical) అయిఉన్న సమాజము, ఒక్కసారిగా ఆధునికమూ, వాణిజ్యాత్మకమూ, ఐన వ్యవస్థగా మారిపోవడం, ఈ గ్రామీణ రుణగ్రస్తతకు కారణమని, స్థూలంగా వివరించవచ్చు. వస్తూవినిమయ పద్ధతినుంచి రూకల చెలామణికి, సంప్రదాయ పద్ధతినుంచి పోటీ పద్ధతికి, ప్రసరణ పద్ధతినుంచి సాంద్రీకరణ పద్ధతికి, ప్రత్యేకతనుంచి కేంద్రీకరణానికి, సమాజం ఒక్కసారిగా మారిపోయింది. 'దందుపత్' వంటి హితకరములైన ఆచారాలను విసర్జించడము, స్థానికరుణదాతలనుంచి రైతును రక్షించి, నియమితములైన సమాజ సంబంధాలను, ప్రాచీన ఆస్తి స్వరూపాన్ని కాపాడుతూవస్తున్న గ్రామ సంఘం నశించిపోవడము, ఈ మార్పులకు ముఖ్య కారణాలు. [దందుపత్ = అప్పుపుచ్చుకొన్నవాడు రుణదాతకు చెల్లించే మొత్తం వడ్డీ, అసలు ద్రవ్యానికెన్నడూ మించకూడదు,-అనే విధానం ప్రాచీనకాల వ్యవహారము.] వ్యవసాయానికి పూనుకొనేవారి సంఖ్య ఎక్కువకావడంతో, రుణగ్రస్తత మరింత తీవ్రమయింది. ఈ పరిస్థితులవల్ల, సాంప్రదాయిక వ్యవసాయదారుల కుటుంబాలు, తమ భూసంపత్తిని, నూతన సంపన్న వర్గాలకు హస్తాంతరం గావించే ప్రవృత్తి ప్రారంభమయింది.

వ్యావసాయిక రుణగ్రస్తత, కేవలం భారతదేశానికి మాత్రమే విశిష్టమైనది కాదు. ప్రపంచమంతటా ఇది సాధారణమైనదే. వ్యవసాయంకూడా ఒక పరిశ్రమే కావడంవల్ల, దీనికికూడా పరపతి అవసరము, కాని, ఇండియాలోని రైతుల రుణంలోని అధికభాగము, అనుత్పాదకమైనది. ఇతర దేశాలలోని రైతులు,-విత్తనాలు, ఎరువులు, పశువులు, పరికరాలు, యంత్రాలు, పంటపొలము, మొదలైన వాటిని కొనడానికీ, బావులు త్రవ్వడం మొదలైన శాశ్వత అభివృద్ధి నిర్మాణాలు గావించడానికీ,- రుణంతీసుకుంటారు. కాని, మనదేశంలోని రైతు స్థితివేరు. భూమి పన్నులు చెల్లించడానికి, కరువు రోజుల్లో తన కుటుంబపోషణ గావించుకోడానికి, కరువురోజులకు, పెళ్లి, జననము మరణము, మొదలైన సాంఘిక విషయాలకూ, మనదేశపు రైతు రుణదాతలను ఆశ్రయించవలసివస్తుంది. రైతుకు వ్యవసాయంనుండి వచ్చే ఆదాయము, అతని సామాన్య జీవనానికి, కటాకటిగా సరిపోవచ్చు. అదికూడా పంటలు సక్రమంగా పండిన సంవత్సరాల్లోనే. కనుక, ఒకసారి ఏకారణానైనా, రుణంచేయడం జరిగితే, తరవాత సంవత్సరాల ఆదాయంనుంచి దానిని తీర్చగలగడం అసంభవము. కనుక, రుణమల్లే నిలిచి, వడ్డీతో చేరి పెరుగుతూపోతుంది. బొంబాయి రాజధానిలోని గ్రామీణరుణమంతా, అనుత్పాదకమైన వాటికై చేయబడినదని, బ్యాకింగు ఎన్క్వైరీ కమిటీవారు నిర్ణయించినారు.

సంయుక్త ప్రాంతాలలో (United Provinces) 30 శాతం రుణం

మాత్రమే వ్యవసాయోద్యోగ ప్రయోజనానికి సంబంధించింది. తక్కిన భాగంలో 34 శాతం దారిద్ర్యానికీ, 36 శాతం వివాహాది శుభకార్యాలకూ చేయబడినది. మధ్య ప్రాంతాలలో 26 శాతం రుణం అనుత్పాదక విషయాలకై చేయబడింది. పంజాబులో, "దుర్భిక్షకాలం వచ్చినప్పుడు ముప్పైఫలకుల మంది రైతుల జీవనంగడవడానికీ, వారి పిల్లల పెండ్లిండ్లకూ, చనిపోయినవారి దహన క్రియలకూ,-అవసరమై ఎక్కువ భాగం రుణ మేర్పడింది."

ఇటువంటి పరిస్థితుల్లో, రైతులు పూర్తిగా మునిగిపోకుండా ఉండడానికి మాత్రమే రుణం ఉపయుక్తమయింది. వ్యవసాయంలో పెట్టుబడిపెట్టి, వృద్ధి చేయడానికి కెక్కడా ఆస్కారం లేకపోయింది.

పంజాబునుగూర్చి వ్రాస్తూ, డార్లింగ్ (Darling),-"రైతు యజమానికీ, రుణదాతకూ జరుగుతున్న అసమాన యుద్ధము 1880 నాటికి పూర్తియై, రుణదాత అఖండమైన విజయం పొందినాడు. పిమ్మట ముప్పై సంవత్సరాల కాలము రుణదాతలు అత్యుచ్ఛస్థితి నాక్రమించి, సంఖ్యలోనూ, సంపదలోనూ, ఎక్కువగా అభివృద్ధిచెందినారు. బ్యాంకర్లు, రుణదాతలు, వీరి ఆశ్రితులు, కలిసిన సంఖ్య 1868 సంవత్సరంలో 53,163 1911 నాటికి వీరిసంఖ్య 193,890కి పెరిగింది." అని వివరించినాడు.

ఇండియాలోని అన్ని ప్రాంతాలలోను, రైతులలో రుణగ్రస్తత విస్తారమై ఉన్నదని, ప్రాంతీయ ప్రభుత్వాలనుంచి 1880లో జరిగిన క్షామ విచారణ సంఘానికి (Famina commission) నివేదికలు వచ్చినవి. "భారత మధ్య ప్రాంతాలలోని రైతులు, విత్తనాలుకొనడానికి మాత్రమేకాక ఆహార ధాన్యాలు కొనుక్కోడానికి కూడా, తమ భూస్వాములపై పూర్తిగా ఆధారపడి ఉన్నారు. అని నికాల్స్ (Nichols) తెలిపినాడు. బెంగాలు నాడియా జిల్లాలోని మొత్తం రైతువర్గంలో, 75 శాతం రుణదాతల వలలో చిక్కుకొని ఉన్నారని స్కర్న్ (Skirne) తెలిపినాడు. బొంబాయిలో, 75 శాతం రైతులు రుణగ్రస్తులనీ, వారిలో 50 శాతం రైతులకు రుణవిముక్తి కలిగే ఆశలేదని, పేయిల్ (Mr. Peile) వివరించినాడు. కృష్ణా జిల్లాలోని 57 శాతం రైతులు, వెల్లూరులోని రైతులలో 80 శాతం, రుణాల్లో చిక్కుకొని ఉన్నారని, మదరాసు రాజధానిలో జరిపిన పరిశీలనవల్ల తెలిసింది. బీరారులో తగుమాత్రం మూల ధనమున్న రైతులు మాత్రమే వృద్ధిలో ఉన్నారు. తక్కిన వాళ్ళందరూ సాహుకారుపై ఆధారపడే ఉన్నారు, అని Major Szezepanski వ్రాతలవల్ల తెలుసుకోవచ్చు.

తమ భూస్వాములు అప్పుగా ఇచ్చిన ధాన్యానికై, షహాబాద్ జిల్లాలోని రైతులలో సగం మంది, రుణపడి ఉన్నారనీ, నూటికి నలభై మంది రైతులు, ధాన్యానికీ, లేక, రూకలకూ మహాజన్‌కు రుణపడి ఉన్నారనీ బీహారు కలెక్టరు వ్రాసియున్నాడు.

ఎనిమిది సంవత్సరాల అనంతరం డఫ్ఫెరిన్ ప్రభువు (Lord Dufferin)

జరిపిన విచారం వల్లకూడా ఈ వివరాలు రుజువైనవి. అఖిలిఖితమైన సాక్ష్యాన్ని బట్టి, "దేశంలోని ప్రాంతాలన్నిటిలోనూ, తగినంత పొట్టకూటికి కూడా నోచుకోని ప్రజానీకం అసంఖ్యాకమై ఉన్నదని, వాళ్ళు నిరంతరమైన అప్పులలో చిక్కుకొని ఉన్నారని, ఈ అప్పులన్నీ వివాహాది శుభ కార్యాలకూ, ఇతర కర్మలకూ విచ్చలవిడిగా చేసిన ఖర్చులవల్ల ఏర్పడినవని తెలుస్తున్నది. ఈ రుణగ్రస్తత వల్లనూ, రుణ దాతలైన మధ్యవర్తులు వ్యవసాయాదాయంలోని అధిక భాగాన్ని లాగుకొంటూ వచ్చినందుననూ, రైతులు ఏ మాత్రమూ మిగుల్చలేకపోయి, దుర్భిక్షకాలంలో దుస్థితికిలోనౌతున్నారనీ, విశదమవుతున్నది

పందొమ్మిదో శతాబ్దమంతటా, రైతుల రుణగ్రస్తత అధికమౌతూ వచ్చింది. సుభిక్షంలోనూ, దుర్భిక్షంలోనూ, ధరలు పెరిగినప్పుడూ, పడిపోయినప్పుడూ,- అన్ని పరిస్థితుల్లోనూకూడా రైతుల రుణం పెరగడం నిలిచిపోలేదు. ధరలు బాగా పెరిగిఉన్న 1914లో ఈ విషయమై వ్రాస్తూ, కె. ఎల్. దత్తా "సుభిక్ష మేర్పడిన సంవత్సరం, రుణంలో చాలభాగం తీర్చడానికి రైతు సమర్థుడై ఉన్నా, రుణాన్ని తీర్చడు. తప్పనిసరియైన రుణభాగాన్ని మాత్రమే తీర్చి, మిగులు ద్రవ్యాన్ని దుబారాగా వ్యర్థం చేస్తాడు. దుర్భిక్ష కాలంలో, తన పోషణకే తాను అసమర్థుడైనందువల్ల అప్పులను చెల్లించే ప్రమేయమేలేదు. కనుక, ఈ రుణ భారంనుంచి బైటపడే ఆశ అతనికి ఏ మాత్రమూ, లేదు." అని వ్రాసియున్నాడు. "భారతదేశపు రైతులలో అత్యధికభాగం రుణంలో పుట్టి, రుణంలో పెరిగి, రుణంలో చచ్చి, రుణాన్ని వారసుల కప్పగించిపోతారు." అనేది దీని ఫలితంగా ఏర్పడింది.

రుణగ్రస్తత పెరగడంవల్ల వ్యవసాయదారుల స్వత్వాహరణము (Expropriation), రుణదాతల భూసంపత్తి సంపాదనము, అనే పరివర్తనములు స్పష్టంగా, సమాజంలో సిద్ధించినవి. రుణదాతే, వ్యవసాయదారుడు కూడా అయిన సందర్భాలలో, అతని క్షేత్రం విస్తృతమయింది. వ్యవసాయదారుడు కాని సందర్భంలో రుణదాత, పరోక్ష భూస్వామిగా పట్టణాలలో నివసిస్తూ, పొలంపై లాభాలను మాత్రమే అనుభవించేవాడు. పొలం గోల్పోయిన రైతులు, భాటకదారుల సంఖ్యనూ, వ్యవసాయ శ్రామికుల వర్గాన్నీ, ఎక్కువచేసిన వారైనారు. 1866-1895 మధ్యకాలంలో భూమి సంక్రామణం (భూములను పరాధీనం చేయడం) మితిమీరిపోయింది. ఈ కింది పట్టిక, పంజాబులోని పరిస్థితిని విశదం చేస్తుంది.

| | | | |
|---|---|---|---|
| 1866-74. | ప్రతి సంవత్సరం అమ్ముడుబోయిన భూమి. | 88,000 | ఎకరాలు |
| 1875-80. | ,, | 93,000 | ,, |
| 1880-85. | ,, | 160,000 | ,, |
| 1885-90. | ,, | 310,000 | ,, |
| 1890-95. | ,, | 338,000 | ,, |

పంజాబులోని కొన్ని ప్రదేశాలను ఎన్నుకొని, Thornburn ఈ విష

యమై గాఢమైన విచారణగావించి, పరిశీలనవల్ల తేలిన విషయాలను ఈ విధంగా వివరించినాడు,-

742 కుటుంబాలలో 566 కుటుంబాలు అధికరుణగ్రస్తమై కార్యతః, పాడై పోయినవి. మొత్తం పంటపొలంలో 53 శాతం అన్యసంక్రాంతమైపోయింది. ఇందులో రెండు భాగాలు రుణదాతలకు, ఒకవంతు పెద్ద భూస్వాములకు సంక్రమించినవి. అతడు పరిశీలించిన 474 గ్రామాలలో 176 గ్రామాలు అధిక రుణభారానికి లోనైనవి. 210 గ్రామాలు రుణగ్రస్తతవల్ల తీవ్ర పరిస్థితికి గురియైనవి. 138 గ్రామాలలో మాత్రమే రుణభారము [తులనాత్మకంగా (Comparatively)], ఇతర గ్రామాలతో పోల్చగా కొంత తేలికగా ఉన్నది, అని తెలిపినాడు.

1901-02, నైతిక ద్రవ్యాత్మక అభ్యుదయ నివేదికను (Moral and Material Progress Report) అనుసరించి, పంజాబులో యజమానుల సాగుబడిలోని క్షేత్రవిస్తీర్ణము 1891-92 నుంచి తగ్గుతూ వచ్చింది. ప్రాంతంలోని మొత్తం విస్తీర్ణంతో సాపేక్షగా పోల్చినా, నిరపేక్షంగా పరిశీలించినాకూడా ఈ విషయం ధ్రువమౌతుంది. వ్యవసాయదారులు కాని వారికి భూమి సంక్రమించడంవల్ల ఈ పరిస్థితి ఏర్పడింది. మధ్యప్రాంతాలలో రైతుల రుణభారము ఎక్కువయింది. మదరాసులో రుణం మొత్తం అతి విస్తారంగా పెరిగింది.

బొంబాయి రాజధానిలోని అధిభోగరైతులలో (Occupancy Tenants) రెండువంతులు (2/3) తమ పట్టాలను గోల్పోయి, 1894 నాటికి భూస్వాముల ఇష్టంపై ఆధారపడిన రైతుల స్థితికి (Tenants at will) దిగిపోయినారు, అని జి. వి. జోషీ వివరించినాడు.

అప్పులు లేనివారి సంఖ్యాశాతాన్నిబట్టి, రుణం ఏవిధంగా వృద్ధి ఐనదన్న విషయం వ్యక్తమౌతుంది, 1901 కాలంనాడు, గుజరాతులోని బరోడా సంస్థానంలో 40 శాతం పొలం యజమానులు, అప్పులులేనివారు. 1907 నాడు, బెంగాలు - ఫరీద్‌పూర్‌లో అప్పులు లేనివాళ్ళు 55 శాతము. 1919 లో మైసూరులో 37 శాతము, పంజాబులో 17 శాతము రుణంలేనివారు. 1930 లో, గుజరాతులో 22 శాతము, పంజాబులో 13 శాతము రుణగ్రస్తులు కారు.

ఇటువంటి, స్వభావవిరుద్ధమైన పరిస్థితులవల్ల, వివిధ ఆర్థికపరిణామాలు ఏర్పడినవి. ప్రజలలో విస్తృతమైన దుస్థితినీ, తీవ్రములైన రాజకీయసమస్యలనూ, ఈ పరిస్థితులు కలిగించినవి. "సర్వసాధారణమైన రైతు రుణగ్రస్తత విషయంలో, స్వత్వహరణసమస్యలు ఒక అవస్థనుమాత్రమే ప్రదర్శిస్తున్నవి. రాజకీయ పరిస్థితులపై దీనికి ప్రత్యక్షప్రభావం ఏర్పడింది. కనుక, తన్నివారణోపాయం, అత్యంతం అవసరమై ఉన్నది." అని ఇ. డి. మక్లాగన్ (E. D. Maclagan) సూచించినాడు. కనుక ప్రభుత్వం ఈ విషయాన్ని గమనించి, శాసననిర్మాణకార్యానికి పూనుకొన్నది.

గవర్నర్ జెనరల్ కౌన్సిలులో, పంజాబు క్షేత్ర అన్యసంక్రామణబిల్లును

(Punjab Land Alienation Bill) ప్రతిపాదిస్తూ (ఛార్లెస్ రివాజ్ (Charles Rivaz), "క్షేత్రం వేగంగా అన్యాక్రాంతమౌతూ, బలిష్ఠులైన పంజాబు క్షేత్రీయుల ఆస్తి హరించిపోవడంవల్ల, రాజకీయమైన అపాయపరిస్థితి ఏర్పడింది. ఈ పంజాబు వ్యవసాయదారుల కుటుంబాలు మన దేశీయసైన్యానికి అత్యుత్తము లైన సైనికులను చేకూరుస్తూ ఉన్నవి. అపారములైన కష్టాలతోనూ కీర్తితోనూ కూడిన సైనికవృత్తి ముగించుకొని వచ్చిన సిపాయీలు, తమకు వంశ పరంపరంగా సిద్ధించిన క్షేత్రాలు ఆధారంగా తమ జీవితయాత్రను గడపడానికి, ఎదురుచూస్తూ ఉంటారు. అటువంటి అవకాశానికిప్పుడు భంగం కలిగింది. కనుక, ఈ దుష్టపరిస్థితుల నెదుర్కోవడానికి ఈ బిల్లును ప్రభుత్వం ప్రతిపాది స్తున్నది"- అని ప్రభుత్వోద్దేశాన్ని వివరించినాడు.

ప్రభుత్వం ఈ బిల్లువల్ల గావించిన నివారణ, పంజాబులో మత విషయక మైన దుష్టపరిణామాన్ని కలిగించడం, దేశదురదృష్టము, పొలంలో చాలభాగం ముస్లింరైతుల సాగుబడిలో ఉన్నది. కాని, రుణదాతలందరూ హిందువులు. బెంగాలులోనూ, ముఖ్యంగా తూర్పుప్రాంతంలో, పరిస్థితికూడా ఇదే. తరవాత కాలంలో, ఈ రెండుదేశభాగాలూ హిందూముస్లిము మత సంఘర్షణకులోనై పాకిస్తానులో భాగంగా ఏర్పడినవి. భారతదేశ విభజనకు ఇతరవిషయాలు, శక్తులు, కారణాలు కావచ్చు, కాకపోవచ్చు; కాని హిందూ జమీందారులు, హిందూ రుణ దాతలు ఒకపక్షంగానూ, ముస్లిరైతులు, ముస్లింరుణగ్రస్తులు ఇంకొక పక్షం గానూ, ఏర్పడిన ద్వైధీకరణం మాత్రము, దేశవిభజనకుగల ముఖ్యకారణాలలో ఒకటి అని అంగీకరించక తప్పదు. రైతుల రుణగ్రస్తతను, క్షేత్ర అన్యాక్రాం తాన్ని నిరోధించడానికి అవలంబించిన విధానాలు,- (a) వడ్డీవ్యాపారాన్ని నియ మనబద్ధంగావించడం. (b) సాగుబడిపొలాన్ని వ్యవసాయేతరులకు బదిలీచేయ డాన్ని నిరోధించి, తద్ద్వారా, వ్యవసాయదారుల రుణాన్ని పరిమితపరచడం, (c) ఒప్పందము చట్టాన్ని, రుణము చట్టాన్నిమార్చి, రుణదాతకు రుణగ్రస్తునకు గల సంబంధాన్ని ఎక్కువ సమన్యాయంగా చేయడం, అనేవి. పొలము యజమానీ, వ్యవసాయదారుడుకూడా ఎక్కువగా రుణగ్రస్తులై పోవడానికి, అంతటికీ ప్రభుత్వం అవలంబిస్తున్న రాజస్వవిధానమే ప్రబలకారణము. కనుక, రుణగ్రస్తతను తొలగించడానికి, రాజస్వవిధానసంస్కరణ మావశ్యకమై ఉన్నది. కాని, ప్రభుత్వము దీనికి పూనుకోలేదు.

రుణదాతనుంచి రుణగ్రస్తుని రక్షించడానికి కొన్ని శాసనవిధులను అంగీక రించడం మాత్రమే, ప్రభుత్వంచేసిన గొప్పపని. రుణభారనుంచి రైతునకు ప్రశమనం కలిగించి, రుణదాతపీడనుంచి తప్పించడానికి, ప్రప్రథమంగా తీసు కొన్నచర్య, 1879 సంవత్సరపు దక్కన్ రైతుల రుణప్రశమనశాసనము. (Deccan Agriculturists Act of 1879). అప్పుల పూర్వచరిత్రను, వాటి స్వభావాన్ని, న్యాయస్థానాలు విచారణగావించడం, దుబారావడ్డీలను (Unreasonable Interests) అంగీకరించకపోవడము, రుణగ్రస్తుడు ఖైదులో

పడకుండా రక్షించడం, వ్రాతమూలకమైన, కరారుంచేనేతప్పు, రైతు భూమిని అమ్మకంనుంచి రక్షించడము, రాజీదార్ల నియోగాన్ని అంగీకరించడం,- మొదలైన అధికారాలు న్యాయస్థానాలకు, శాసనంవల్ల సిద్ధించినవి. తరవాత కాలంలో, ఈ శాసనంపై జరిగిన మార్పులు రైతుకు మరికొన్ని రక్షణలను కలిగించినవి. కాని, శాసనంవల్ల కలిగిన ఫలితాలు నిరుత్సాహకరములైనందువల్ల దీనిని రద్దుచేయవలసిందని, బ్యాంకింగు విచారణసమితి ప్రభుత్వానికి సిఫార్సుచేసింది.

పంజాబు క్షేత్రం అన్యాక్రాంతశాసనాన్ని ప్రభుత్వము 1901 లో, నియత శాసనసంపుటిలో (Statute Book) చేర్చింది. రుణదాత న్యాయస్థానంలో పొందిన ఆ జ్ఞప్తి (డిక్రీ) ననుసరించి రైతుపొలాన్ని అమ్మడం నిషేధించబడింది. రైతు పొలము ఇరవైయేండ్లకుపైగా బదిలీగావించడంకూడా నిషిద్ధమయింది. రైతును అతని క్షేత్రంనుంచి వెళ్ళగొట్టడం, అతని ఆస్తిని జప్తుచేయడం, అతడు చేసిన అప్పులకు వారసులను బాధ్యులను చేయడం, మొదలైనవాటి నన్నిటినీ తొలగించి, ఈ శాసనము రైతుకు రక్షణకలిగించింది. తరవాతకాలంలో వరసగా, బుందేల్ఖండ్ క్షేత్ర అన్యాక్రాంతశాసనము (1903), పశ్చిమోత్తరప్రాంత క్షేత్ర అన్యాక్రాంతశాసనము (1904), మధ్యప్రాంతాలక్షేత్ర అన్యాక్రాంతశాసనము (1916) - ఇవన్నీ పంజాబు శాసనమార్గాన్నే అనుసరించి, ప్రభుత్వము అంగీకరించింది.

ప్రభుత్వం పూనుకొన్న ప్రయోజనము, ఈ చర్యలవల్ల సఫలంకాలేదు. శాసనంలోని కొన్ని లోపాలను బాగా ఉపయోగించుకొని, రుణదాతలు తమ కార్యక్రమాలను సాగించుకొంటూవచ్చినారు. పంజాబులోని పెద్ద భూస్వాములు, ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని తమ క్షేత్రాలను విస్తరించుకోవడం జరిగింది. తత్ఫలితంగా చిన్న వ్యవసాయదారులు నష్టపడుతూ వచ్చినారు. వ్యవసాయదార్ల వర్గంవారు తనఖా పెట్టిన క్షేత్రాల మొత్తము విస్తృతినిబట్టీ, క్షేత్ర అన్యాక్రాంతం శాసనం అమలు జరిగినపిమ్మట వృద్ధిచెందిన తనఖా రుణాన్నిబట్టీ, ఈ విషయము, సువ్యక్తమౌతుంది.

1902-06 వరకూ, గల నాలుగు సంవత్సరాల్లోను, తనఖాపెట్టిన మొత్తం క్షేత్ర విస్తీర్ణము 1,89,810 ఎకరాలు. అప్పటి తనఖా రేటు, ఎకరాకు 62 రూపాయలు. 1906-11 కాలంలో, తనఖా భూమి విస్తీర్ణము 289,604 ఎకరాలు; తనఖారేటు, 93 రూపాయలు. శిస్తుకు ఎన్నిరెట్లు రుణం రైతు తీసుకొన్నాడన్న దాన్నిబట్టీ, రుణభారం చిన్నరైతులపై ఎంత ఉన్న దన్న విషయము తెలుస్తుంది. శాసనానంతరం కూడా, పంజాబులో రుణం 27 రెట్లున్నది. రుణభారం దీన్నిబట్టి గుర్తించవచ్చు. చిన్న చిన్న క్షేత్రాలు కలవారు ఈవిషయంగా ఎక్కువ క్లిష్టపరిస్థితికి లోనైనారని,ధారన్‌బర్న్,పరిశీలించి, తెలుసుకొన్నాడు. ఇట్టి చిన్న క్షేత్రదారుల సంఖ్యే, దేశంలో అసంఖ్యాకమై ఉండడం, ఇంకొక దురదృష్టము.

జమీందారీ ప్రాంతాలలో, ఆచరణలోఉన్న రైతులను, హింసాత్మక

చర్యలకు గురిచేసి శిస్తు వసూలుచేసే పద్ధతి, రుణగ్రస్తతకంటె దుర్భరమైన పీడ, రైతులు దరిద్రులై పోవడానికిది ముఖ్య కారణము. సామంత విధానంలో ఉప సామంత విధానాన్ని ఏర్పరచి, పీడకవర్గాన్ని అధికంచేయడం, శిస్తు వసూలులో హింసాత్మక పాపచర్యలను అవలంబించడం, బెంగాలులో బాగా వ్యాప్తిలో ఉండేవి. ఉపసామంత విధివల్ల, దురాశపరులైన మధ్యవర్తుల సోపానమేర్పడింది. జమీందారులలో, నియతమైఉన్న అధికారము, నరక ద్వారాలను తెరచి, రైతులను యమయాతనకు గురిచేసింది. జమీందారుల దురధికారాన్ని అరికట్టడానికి గాని, రైతులను రక్షించడానికిగాని, ప్రభుత్వము 1859 దాకా, ఏ చర్యనూ తీసుకోలేదు. బెంగాలు (భాటక) శాసనము, ఆ సంవత్సరం పారితమై, (Passed) ఉపద్రవంగా భాటకాన్ని పెంచడము, స్వచ్ఛందంగా రైతులను క్షేత్రాలనుంచి తీసివేయడము,-మొదలైన జమీందారీ చర్యలను నిరోధించింది. కాని, జిరాయితీ హక్కులున్న స్వల్పవర్గానికి మాత్రమే ఈ శాసనము, రక్షణ కలిగించింది. అత్యధిక సంఖ్యాకమై ఉన్న చిన్న రైతువర్గానికి, ఈ శాసనంవల్ల ఏ విధమైన ప్రయోజనమూ లేకపోయింది. వ్యావసాయిక వర్గంవారి దుర్గతి ఎక్కువౌతూ రాగా, ప్రభుత్వము, జిరాయితీ హక్కులు లేనిరైతులకు కూడా సహకరించే శాసనాన్ని 1885లో, పారితంగావించింది. ఇదికూడా నిష్ప్రయోజనమయింది. జమీందార్లు భాటకాన్ని పెంచుతూ, రైతులను బాధిస్తూనే ఉన్నా, ఈ శాసనం వల్ల నిరోధక చర్యలేమీ జరగలేదు. గుత్తకు తీసుకొన్న భూమిని, ఇంకొకరికి గుత్తకివ్వడము, బదిలీచేయడము,- అనే అక్రమ చర్యలు క్రమంగా, ఎక్కువౌతూ వచ్చినవి. జిరాయితీ హక్కులున్న వ్యవసాయదార్ల సంఖ్య తక్కువై, క్షేత్రహీనులైన రైతుల సంఖ్య పెరుగుతూ వచ్చింది.

1859 నాటి బెంగాలు గుత్తేదారీ శాసనం (గుత్తేదారీ చట్టము) ఇతర ప్రాంతాలకు గూడా అనువర్తితమైంది. గుత్తేదారీ శాసనాలూ, భాటకశాసనాలూ, మధ్య ప్రాంతాలలోనూ,(1887)పశ్చిమోత్తర ప్రాంతాలలోనూ(1886) పారితములైనవి. భూస్వాములకు భాటకదార్లకుగల సంబంధాలను నియమన పరచడం, వివేచనరహితంగా గుత్తేదార్లను తొలగించడాన్ని అరికట్టడం, భాటకముల నియంత్రణంగావించడం, పట్టాదార్లు క్షేత్రాల అభివృద్ధికై ఖర్చుపెట్టిన స్వంత డబ్బుకు తగిన ప్రతిఫలం, వారికి లభించేటట్లు చేయడం,-ఇవి ఈ శాసనాలు తలపెట్టిన ప్రయోజనాలు. కాని, రైతులకు ఈ శాసనాలవల్ల ఎక్కువ ప్రయోజనం సిద్ధించలేదు. ప్రభుత్వం వర్తింపజేసిన ఈ ఉపశమన చర్యలను గూర్చి తన నిశ్చితమైన అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ బెంగాలు వ్యవసాయిక విచారణసమితి, (Bengal commission on Agriculture) "ప్రభుత్వము ఎదుర్కొని సాధించవలసిన సమస్య మహత్తరమైనది కావడంవల్ల, అత్యంతావసరములైన మూల విషయాలను పరిశీలించలేకపోతున్నది." అని వివరించింది.

శాసనరీత్యా మాత్రమేకాక, ప్రభుత్వం, వ్యావసాయిక సమస్యను సాధించడానికి, ఇతర ప్రయత్నాలకుకూడా పూనుకొన్నది. ఋతుపవనాల

(Monsoon), అనిశ్చిత స్వభావంనుంచి రైతుల రక్షణార్థము, నీటి పారుదలావ కాశాలను విస్తరించడం, రుణదాతల పీడా చర్యలనుంచి రక్షణ గలిగించడానికి పరపతి సంఘాలను నెలకొల్పడం, వ్యవసాయ పద్ధతులలో అభివృద్ధి గలిగించి సహాకరించడం, రైతులుత్పత్తి గావించిన సరుకుల అమ్మకానికి బజారు విధానాన్ని సంస్కరించడం,-మొదలైన కార్యక్రమాలను ప్రభుత్వం ప్రవేశపెట్టింది. కాని, అధిక సంఖ్యాకులుగా ఉన్న ప్రజల పరిస్థితులలో, తగినంత మార్పు తీసుకొని రావడానికి ప్రభుత్వం అవలంబించిన విధానము,-పరిమితిలోనూ, స్వభావంలోనూ కూడా-చాలినది కాలేదు. కాబట్టి, అధిక ప్రజానీకానికి, అప్పులూ, అభావమూ, దారిద్ర్యమూ తప్పలేదు.

*క్షామాలు - ఆర్థికదుస్థితి :* పందొమ్మిదో శతాబ్దంలో తరచు ఉత్పన్నములైన క్షామ పరిస్థితులూ, వాటివల్ల దేశంలో కలిగిన వినాశమూ ప్రజల, ఈ శోచనీయస్థితిని రుజువు పరుస్తున్నవి. నలభై యేండ్ల కాలపరిమితిలో, అంటే 1860 నుంచి 1908 వరకూ, ఇరవై క్షామము లేర్పడినవి. ఒరిస్సా బెంగాలులో 1866 లోను, పశ్చిమోత్తర ప్రాంత-రాజ పుటానాలలో 1868-69 లోను, బొంబాయి మదరాసు ప్రాంతాలలో 1876-77 లోను, పశ్చిమోత్తర ప్రాంతం-కాశ్మీరులలో 1878-79 లోను, పశ్చిమోత్తర ప్రాంత-మదరాసు-బొంబాయి-మధ్య ప్రాంతాలలో 1896-97 లోను, బొంబాయి-మధ్యప్రాంత-బీరారు-పంజాబు-అజమీరులలో 1899-1900 లోను, ఉత్పన్నములైన మహాక్షామాలు లక్షలాది ప్రజల ప్రాణాలను హరించినవి. 1876-77 క్షామకాలంలో 50 లక్షల ప్రజలు నశించిపోయినారు. 1896-97లో 45 లక్షలు, 1899-1900 లో 12.5 లక్షలు ప్రజలు కూడులేక చచ్చిపోవడం సంభవించింది.

1860 తర్వాత, దిగ్భ్రమకలిగించే తొందరతో, మాటిమాటికి ఉత్పన్నమైన ఈ క్షామపరిస్థితులకు హేతువేది? 'వర్షాభావము' అనే ప్రకృతివిషయమే, ఈ వైపరీత్యానికి పూర్తిగా కారణమని సమర్థించలేము. ఇండియావంటి విశాల భూభాగంలో, కొన్నిచోట్ల వర్షమధికం కావడం, కొన్నిచోట్ల తక్కువకావడం, సహజసిద్ధమైనదే. కాని, దేశంసర్వత్రా, వర్షాభావంవల్ల క్షామపరిస్థితు లేర్పడడం అపూర్వమైన దుర్ఘటన. సాధారణంగా, ఒక ప్రాంతంలో కలిగిన ఆహారధాన్యాల కొరతను, ఇతరప్రాంతాలలోని సమృద్ధి, సర్దుతుంది. అంతేకాని, సార్వత్రికంగా దేశప్రాంతాలన్నిటా, ఆహారాభావం కలగడం అసంభవము. కనుక, క్షామపరిస్థితు లేర్పడి లక్షలాదిప్రజలు నశించిపోవడానికి కారణము, ఆహారధాన్యాల అభావమూ కాదు, వాటిపంపకం సరిగా జరగకపోవడమూ కారణం కాదు. బీదలకాహారం లభించే అవకాశం లేకపోవడమే, దీనికి మూలకారణము. వారి సహజదారిద్ర్యమూ, ఆహారధాన్యాల ధరల పెరుగుదలా, ఆయా ప్రదేశాలలో పంటలు పాడైనందువల్ల కూలిలభించకపోవడమూ,- కారణాలుగా, బీదప్రజకు కూడులేకపోయింది. మామూలు రోజులలోకూడా ఆహారాన్ని కొనే స్తోమతలేని బీదప్రజలు, 30 మొదలు 40 శాతం దాకా, రోజు కూటికి కరవై బ్రతుకు వెళ్ళదీస్తూ

ఉండడం దేశంలో ఎప్పుడూ జరుగుతున్నదే. అనుభవజ్ఞులైన, ఎలియట్, హంటర్ (C. A. Elliot and W. W. Hunter) వంటి ప్రభుత్వాధికారులే ఈ సత్యాన్ని ధ్రువపరచినారు.

ఈ పరిస్థితుల విచారణ జరగవలసిందిగా, డఫ్ఫెరిన్ (Dufferin) ఆదేశించినాడు. విచారణ ఫలితమైన నివేదికను మాత్రం రహస్యంగా, వెలికిపొక్కనీక, భద్రపరచినారు. బ్రాడ్‌లా (Mr. Bradlaugh) అనే పార్లమెంటు సభ్యుని సహకారంతో, దీనిని విలియం డిగ్బీ (William Digby) సంపాదించి, ఇందులోని విషయాల నుపయోగించుకొని, 'సమృద్ధమైన బ్రిటీషు ఇండియా' '(Prosperous British India') అనే గ్రంథాన్ని రచించినాడు. దీనిని ప్రచురించవలసిందని జాతీయ కాంగ్రెస్ గావించిన ప్రార్థనకు ప్రభుత్వం అంగీకరించలేదు. "మనకు విరుద్ధములైన భాగాలను ఇందులో నుంచి జాగ్రత్తతో గ్రహించి, కాంగ్రెసు వారు తమ ప్రచారం కొరకు ఉపయోగిస్తారనీ, ఈ విషయాలు చాల కాలము, వాద ప్రతివాదాలకు అవకాశం కలిగిస్తాయనీ" ప్రభుత్వం వారు జంకి, వాటిని బహిరంగ పరచలేదు. రైతుల ఋణగ్రస్తతా, హింసాత్మక చర్యలచే గుత్తలు వసూలు గావించడమూ, దేశంలో సార్వత్రికంగా వ్యాప్తమై ఉన్నదనీ, చిన్న వ్యవసాయదారుల వర్గాలవారిలో అత్యధికభాగము, అత్యంతమైన దారిద్ర్యానికిలోనై, దిక్కులేనివారై కుములుతున్నారనీ, ఈ విచారణ తేల్చింది.

క్షేత్రాలకూ, కుటుంబాలకూ సంబంధించిన ఆయవ్యయాల విషయాలపై (Budgets) ప్రభుత్వాధికారులూ, ప్రాంతీయప్రభుత్వాలూ జరిపిన విచారణలు కూడా, పై నిర్ణయాలను బలపరచినవి. ఆ విచారణలవల్ల తేలిన అంశాలు;- "ఇండియా ఖండంలోని అధికభూభాగంలోని చిన్నరైతులు, శ్రామికులు దినదిన జీవనంతో కాలం గడుపుతున్నారు." "మొత్తం జనాభాలో నాల్గవభాగంగాఉన్న పంచమజాతి (Pariahs) వారి పరిస్థితి దుఃఖకరమై ఉన్నది." (మదరాసు ప్రభుత్వము).

"బీహారులోని 15౩ లక్షల మొత్తం జనాభాలో,- శ్రామికులు, చేతి పనివాండ్లు, భూమిధారులు. (Land Holders) వీరందరూ, కలిసిన, 40 శాతం భాగం అత్యల్పమైన జీవనాన్ని మాత్రమే సంపాదించుకోగలుగుతున్నది. రోజుకొకపూట తిండి మాత్రమే సంపాదించుకోగలుగుతున్నది. రోజుకొకపూట తిండి మాత్రమే వీరికి లభిస్తుంది. రెండుపూటల తిండిలేదు." (బెంగాలుప్రభుత్వము)

"ఈ ప్రాంతంలోని బీదలజీవనానికి, సగంకడుపు తిండికి తేడాలేదు." (అలహాబాద్ కమిషన్)

"బీదజనానికి తిండీలేదు, గుడ్డాలేదు. ముడిబియ్యము, పాలకూరమాత్రమే, దొరికినంతతిని బ్రతుకుతున్నారు. నూనెకుకూడా వీరు నోచుకోలేదు. రోజుకొకపూట తిండికంటె, ఎక్కువలేదు. ఈ దుస్థితి ఒకనియమంగా పాతుకొనిపోయింది." (పూరీలోని సివిల్‌సర్జన్ - ఒరిస్సా).

పంటలు బాగా పండినరోజులలో సగం దుంపలు సగం ఆకులు ప్రజల

భోజనము. పండని చెడురోజులలో, ఈ భోజనంలోని మూడు వంతులు మాత్రమే వీరికి ప్రాప్తిస్తుంది. సుభిక్ష దుర్భిక్షాలకుగల తేడా వీరి విషయంలో ఇంతే." (పంజాబులోని చంబా)

సాధారణ సారవంతమైన, ఐదెకరాల, క్షేత్రానికి సంబంధించిన, ఆయ వ్యయాలనుగూర్చి క్రూక్ (Mr, Crooke) అనే జిల్లా అధికారి పరిశీలించి, తన విచారణ ఫలితాలను ప్రదర్శించినాడు. అవి,-

| ఆదాయము (అయం) | రూ. | వ్యయము | రూ. |
|---|---|---|---|
| ఖారీఫ్ | 129-8-0 | భాటకము | 75-0-0 |
| | | సేద్యం ఖర్చులు | 93-0-0 |
| రాబీ | 84-8-0 | లాభము | 45-0-0 |
| మొత్తము = | 214-0-0 | | 214-0-0 |

ఈ 45 రూపాయల లాభంలో, కుటుంబ పోషణ, ఇల్లు, గుడ్డలు, ఇతర అవసరాలు అన్నిసర్దుకోవలసిఉంది. తిండి ఖర్చుకు 43/- గుడ్డలకు 8/- కనీసం ఖర్చవుతుంది కనుక,-6 రూపాయలు కొరత ఏర్పడింది. తప్పనిసరిగా అప్పుచేయ వలసి ఉంటుంది. "ఇటువంటి రైతుయొక్క జీవన ఆయవ్యయ పట్టికను సరిచేయ డానికి నేనెన్నోసార్లు ప్రయత్నించినాను. ఇది నా తుది ప్రయత్నము." అని రైతు దుస్థితికి లెక్కలు కట్టిచూపించినాడు.

క్షామకాలాల్లో కలిగిన దుర్భరమైన దుస్థితికీ, ప్రజానాశానికీ, దారిద్ర్యమే కారణమనే విషయము ఆకాలపు తలసరి ఆదాయాన్ని (Percapita income) పరిశీలించడంవల్ల కూడా స్థిరమౌతుంది. 1868-1900 మధ్యకాలానికి సంబంధించిన ఈ అంచనాలను పెక్కింటిని అధికారులు, ఇతరులు, కూడా తయారుచేసినారు. ఒక సంవత్సరానికిగాని, లేదా, సన్నిహిత సంబంధమున్న కొన్ని సంవత్సరాలకు గాని, ఈ అంచనాల సగటును వర్తింపజేసి, ఆ సంవత్సరపు ధాన్యము ధరను, అదే సంవత్సరపు సగటు అంచనాతోపోల్చి పరిశీలించినాడు, వి. వి. భట్. ఈ పరిశీలనను అనుసరించి, గత శతాబ్దపు ఉత్తరార్థంలో తలసరి ఆదాయం తగ్గుతూ వచ్చిందని, ఆర్థికగణాంకాలు 'నిష్ఫల ఆర్థికాభివృద్ధిని' (Aborted Economic growth.) నిరూపిస్తున్నవనీ, తెలియజేసినాడు. డేనియల్ థార్నర్ కూడా ఇదే నిశ్చయాన్ని తెలిపినాడు. "బ్రిటీషు పరిపాలన ఫలితంగా భారతీయ వ్యవసాయా నికి సంబంధించిన సాంఘిక వ్యవస్థ తీవ్రంగా మారిపోయింది. కాని, ఉత్పాదనకు సంబంధించిన ప్రాథమిక విధానము, ఉత్పాదనకు అవసరమైన నేర్పు, అనే ప్రధాన విషయాలలో మార్పు, ఏ మాత్రమూ రాలేదు. అగ్రస్థాయిలోని నూతన వ్యావ సాయవర్గం చక్కని లాభాన్ని సంపాదించుకొని బాగుపడింది. రైతుల జీవనస్థితి క్రమంగా క్షీణిస్తూ వచ్చింది. వ్యవసాయాభివృద్ధి కవసరమైన మూలధనం పీల్చి

వేయబడింది. మొత్తం ఉత్పత్తి, ఒకే మట్టంలో నిలిచి, స్తబ్ధమైపోయింది." అని అతడు వ్రాసియున్నాడు.

క్షామాలవల్ల కొన్నిముఖ్యపరిణామాలు కలిగినవి. ప్రజాసంఖ్యావృద్ధి రేటు మారింది. బొంబాయిలో 1872నుంచి 1889 వరకు 2.05 శాతం ప్రజాసంఖ్య పెరిగింది. అదేకాలంలో మదరాసులో 1.35 శాతము, అధికమయింది. మైసూరు ప్రాంతంలోని జనసంఖ్య పదేండ్ల కాలపరిమితిలో 17.19 శాతం తగ్గింది. కొచ్చిన్ లోని జనసంఖ్య, ఆరేండ్లలో 14 శాతం తగ్గింది. జనాభాతగ్గటానికి క్షామకాలంలో జరిగిన ప్రజామరణం ముఖ్యకారణం కాదు. క్షామకారణంగా కలిగిన ఆహార లోపము, దాని ననుసరించి ఏర్పడిన దుర్బలత' క్షామాలనంటి వ్యాపించిన సాంక్రామిక రోగాలు,- ఇవి జననష్టానికి ఎక్కువకారణాలైనవి. జనాభాను, ఆహారోత్పత్తిని సామ్యస్థితిలో ఉంచడానికై, ప్రకృతి కలిగించిన క్రూరవిధానం క్షామపరిస్థితి. క్షామపరిస్థితులు తరచుగా, ఏర్పడకపోయినట్లయితే, పందొమ్మిదో శతాబ్దంలో కూడా, జనాభా ఆహారసమస్య మరింత విషమస్థితిని కలిగించి ఉండేది.

వ్యవసాయాభివృద్ధి కూడా క్షామాలవల్ల వెనకబడింది. వ్యవసాయ పద్ధతులు ఎప్పటివలెనే నిలిచిపోయినవి. ఆ పద్ధతులను బాగుపరచవలెననే కోరిక క్షామపరిస్థితివల్ల భగ్నమైపోయింది. నశించిపోయిన పశుసంపదను మళ్ళీ సమ కూర్చుకొనే యోగ్యత రైతుకు లోపించింది.

తరువాత కాలంలో (1895-1900) కలిగిన క్షామాలవల్ల, ప్రజల ఆరోగ్యము, నైతికస్థైర్యము దుర్బలంకావడమేకాక, రెండు పంటలు పండించే క్షేత్రవిస్తీర్ణం తక్కువకావడం, పరిశ్రమలకూ ఎగుమతులకూ అవసరమైన పంటలకు బదులుగా ఆహారధాన్యాల పంటలు పండించడం,- అనే మార్పులు కలిగినవి. ఆహారవిషయకంగా ఈ పరివర్తనం శుభకరమయినదే.

ఇండియా ప్రజానీకంలో అధికభాగమైన బీదజనుల పరిస్థితి దుర్భరమై ఉండేదని పై విషయాలవల్ల సువ్యక్తమయింది. పందొమ్మిదోశతాబ్దపు ఉత్తరార్ధ భాగంలో, ఈ దుస్థితి ఇంకా తీవ్రమైనదా, లేక, ఒకేస్థాయిలో నిలిచిందా, అనే విషయాన్ని నిర్ణయించడం కష్టం, కాని, కోట్లసంఖ్యలోఉన్న ఈ దౌర్భాగ్యుల దుస్థితి విస్తారమూ, గాఢమూ, ఐఉండి ఉన్నదనటానికి కావలసినంత సాక్ష్యమున్నది. ఎడతెగని ఇటువంటిదుస్థితిలో కూడా, మెతకతనము, ఓర్పు, బాధలను భరించే సహనము, వీరికి ఉండడం అత్యాశ్చర్యకరమైనది. ఆకలిబాధ, ఇతరుల పీడా, దుస్సహములైతే తప్ప, ఎదురుతిరిగి తమ కష్టాలను, అసంతుష్టినీ వెల్లడించే స్వభావం కాదు వీరిది. అటువంటి పరిస్థితులప్పుడప్పుడు కలిగినవంటే, ఆ పరిస్థితులెట్లా భరించరానివిగా ఉండేవో గ్రహించవచ్చు.

అటువంటి మొదటి తిరుగుబాటు బెంగాలులో (1858-60) లో వచ్చింది. నీలిమందు వ్యవసాయదారులు, తోటలయజమానులు పెట్టే పీడలను భరించలేక తిరగబడినారు. తరవాత,1873 లో, పాట్నాలో, దొమ్మికలహాలు (Riots) చెలరేగినవి. దక్కను, పూనా, అహమదనగర్ జిల్లాలలోని రైతులు 1874 లో,

దొమ్మి గావించినారు. భాటకపు వసూళ్ళ విషయంలో హింసాత్మకచర్యలు జరుగుతున్నవని, బ్యారక్‌పూర్, పైక్‌పారా రైతులు ప్రభుత్వానికి ఫిర్యాదులు పంపినారు (1878-79). రైతుల పరిస్థితికి సంబంధించిన ఈ మహాసమస్య యొక్క విస్తృతిని, తీవ్రతనుబట్టిచూస్తే, ఈ సంఘటనలు అత్యల్పములు, అపర్యాప్తములు అని తోచకపోదు. భారతకాంగ్రెసు ఏర్పడిన తరవాత, ఈ అల్పసంఘటనలుకూడా ఆగిపోయినవి. తన కష్టాలను బాధలను ప్రభుత్వపు దృష్టికి తెచ్చి, తనకు న్యాయము కలిగించే సంస్థ 'కాంగ్రెసు' అని నమ్మి, రైతుదానిపై ఆధారపడినాడు.

## IV. వ్యాపారసంబంధమైన విప్లవము (1858-1905)

**రైల్వేలూ, టెలిగ్రాఫూ :** రవాణాసౌకర్యాలలోనూ, సంచారమార్గాల లోనూ వచ్చిన విప్లవాత్మక పరిణామము, భారతీయార్థికాభివృద్ధికి ప్రోద్బలం కలిగించింది. తత్ఫలితంగా, అంతర్దేశీయ విదేశీయ వ్యాపారవాణిజ్యాలకు ప్రోత్సాహమేర్పడింది ఇండియాలో రైల్వేనిర్మాణాన్ని ప్రభుత్వం ప్రథమంగా 1848 లో, గుత్తకిచ్చింది.కాని, ఆదిదశలో అభివృద్ధి మందగతిలో సాగుతూ వచ్చింది. మొదటి 21 మైళ్ళదారి 1853 నాటికి, పూర్తిఅయింది. 1858 నాటికి 288 మైళ్ళు మాత్రమే రైలుమార్గం ఏర్పడి, ప్రజల ఉపయోగంలోకి వచ్చింది. 1857 లో, జరిగిన విప్లవకారణంగా, రైల్వేనిర్మాణం అత్యవసరమయింది. రాజకీయ, సైనిక, సామ్రాజ్యసంబంధాలైన కారణాలిందులో ప్రాధాన్యం వహించినవి. ఇండియా అంతర్భాగాలనుంచి ముడిపత్తిని రేవుపట్టణాలకు చేర్చడానికి రైలుమార్గాలు అవసరాలని, ఆ ముడిపత్తి ఇంగ్లాండుకు శీఘ్రంగా, క్రమంగా చేరితేనేతప్ప, మిల్లులలో పని ఆగిపోతుందనీ, ల్యాంకషైరునుంచి (Lanashire) భారత ప్రభుత్వానికి ఒత్తిడి కలిగింది. అదికాక, ఇదేసమయంలో ఇంగ్లాండు తన మూల ధనాన్ని అధికమొత్తంలో విదేశాలకు పెట్టుబడిగా ఎగుమతిచేస్తూ ఉన్నది. 1875 వరకు రైల్వేలు ప్రధానాలైన పెట్టుబడి సంస్థలుగా ఏర్పడినవి. ఇటువంటి సందర్భాలలోకూడా, ఈ పెట్టుబడిపై ఇంగ్లాండు మోపిన షరతులు ఇండియా ఆర్థికస్థితికి నాశనాన్ని తెచ్చిపెట్టేవే అయినవి. 1869 వరకు ఇండియాలోని రైల్వేనిర్మాణము ఇంగ్లీషు కంపెనీల గుత్తవిధానంపై నడిచింది. ఆ కంపెనీల పెట్టుబడి ధనంపై ప్రభుత్వము 5 శాతం లాభానికి హామీ ఇచ్చింది. అదికాక, రైల్వేల ఉద్యోగాలపైకాని, వ్యయంపైకాని, ప్రభుత్వానికెటువంటి అధికారమూ లేదు. 5 శాతం లాభానికి ప్రభుత్వపు హామీ ఉన్నందువల్ల, రైల్వే కంపెనీవారు ఖర్చులను అదుపులో పెట్టే ప్రయత్నం చేయలేదు. హామీ ఇచ్చిన పెట్టుబడి మొత్తము 1848-49లో, 42 లక్షలు మాత్రమే. 1868-69 నాటికిది 83.42 కోట్ల రూపాయలకు పెరిగింది. ప్రజల ఉపయోగానికి విడుదలయైన రైలు మార్గము 1868-69 నాటికి 4016 మైళ్లు అయింది. 1862లో రైళ్ళలో ప్రయాణంచేసిన జనుల సంఖ్య 72 లక్షలు. 1869 నాటికిది 160 లక్షలకు

వృద్ధిఅయింది.

అభివృద్ధి ఇంతబాగా జరిగినా, ప్రభుత్వానికి తృప్తికరంగాలేదు. రైల్వే కంపెనీల వారి పెట్టుబడిపై నియమించిన 5 శాతం హామీ, ప్రభుత్వానికి నష్టకర మౌతూవచ్చింది. ఇంతకాలమూ అధిక లాభాలకు అలవాటుపడిన రైల్వే కంపెనీలు, ప్రభుత్వపు హామీ ఉంచేనే తప్ప, ఇండియాలో తమ డబ్బు పెట్టుబడిగా ఉపయోగించమని భీష్మించినవి. కనుక, ప్రభుత్వము 1869లో స్వయంగా రైల్వే నిర్మాణానికి పూనుకోవలసి వచ్చింది. ద్రవ్య విషయకంగా ప్రభుత్వానికి ఎక్కువ ఒత్తిడి ఉన్న సమయంలో ఈ పరిస్థితి యేర్పడింది. పంజాబు రాజపుటానాలోని క్షామాలు (1868-69) ; బెంగాలు క్షామము (1873) ; బొంబాయి మదరాసుల లోని క్షామాలు (1876) ;- ఇవన్నీ ఇండియా ప్రభుత్వకోశంపై అధికభారాన్ని కలిగించినవి. అంతర్జాతీయ బజారులలో, వెండిపై మారకపురేటు తగ్గినందువల్ల, ఇండియా రూపాయకు విలువ తగ్గింది. ఈ పరిస్థితి 1872 లో ప్రారంభమై 1893 వరకూ అదే విధంగా నిలిచింది. టంకశాలలో స్వేచ్ఛగా రూపాయలను ముద్రించడం ఆపివేయవలసి వచ్చినందువల్ల, ద్రవ్యసంబంధమైన ఇబ్బందులు అధిక మైనవి. ఇండియా ప్రభుత్వము లండను బజారులో అప్పు తీసుకొనే అధికారాన్ని, ఇండియా ప్రభుత్వ కార్యదర్శి, పరిమితం గావించినాడు. దీనివల్ల ప్రభుత్వం, నిర్బంధంలో పడింది. ఇన్ని అడ్డంకులు, ప్రతి బంధకాలు ఏర్పడినా, తానుపూను కొన్న రైల్వే నిర్మాణాన్ని ప్రభుత్వం విడిచిపెట్టలేదు. తత్ఫలితంగా, 1869-70 నుంచి 1878-79 వరకూగల పది సంవత్సరాలకాలంలో, రైలు మార్గం 4265 మైళ్ల నిడివి నుంచి 8212 మైళ్లకు పెంచబడింది. ఇండియాలో బ్రిటీషు వారి వర్తకం దృష్ట్యా, ప్రభుత్వం పూనుకొన్న క్షామ నిరోధక విధానదృష్ట్యా, ఈ అభివృద్ధి చాలినదికాదు. పెద్దక్షామాలను నివారించడానికి, ఇంకా 10,000 మైళ్ల రైలు మార్గాన్ని తక్షణం నిర్మించవలసి ఉంటుందని క్షామ విచారణ సంఘం వారు సిఫారసు చేసినారు. (1880). ఈ ఉద్యమానికి పూనుకోవడానికి తగిన ఆర్థికస్తోమత ప్రభుత్వానికానాడు లేకపోవడంవల్ల, ప్రైవేటు కంపెనీ వారికి ఈ పనిని అప్పగించవలసి వచ్చింది. ఐనా, ఇదివరకు హామీఇచ్చి యున్న 5 శాతం లాభానికి మారుగా 3½ శాతం లాభానికి హామీయిచ్చి, రైల్వేకంపెనీ వారికి ఈ పనిని ప్రభుత్వం అప్పగించింది. ఈ నిర్ణయం వెంటనే సత్ఫలితాన్ని కలిగించింది. 1880 తర్వాత, రైల్వేలు దేశంలో అతివేగంగా విస్తరించినవి. 1878-79 నుంచి 1889-90 వరకూ గల పదకొండు సంవత్సరాలలో, రైలు మార్గం రెండు రెట్లు పెరిగింది. అంటే, 8212 మైళ్ల నుంచి 16404 మైళ్ళకు పెరిగింది. 1899-1900 నాటికి 23,763 మైళ్ళకు, 1905-06 నాటికి 28,604 మైళ్ళకూ ఇది వృద్ధి అయింది. 1906 లో, 27.1 కోట్ల ప్రజలు రైల్వేలలో ప్రయాణంచేసినారు. 1869 లో ప్రయాణీకుల సంఖ్య 1.6 కోట్ల ప్రజలు మాత్రమే. అదే విధంగా, 1906 నాటికి, రైల్వేల సంపాదన 24.75 కోట్ల పౌనులకు పెరిగి, నష్టానికి మారుగా, పెట్టుబడిపై 6 శాతం లాభాన్ని కలిగించింది.

ఈ మధ్యలో, దేశంలో టెలిగ్రాఫుమార్గాలు అత్యద్భుతంగా విస్తరించినవి. దిగువ పట్టిక, ఈ వివరాలను తెలియచేస్తుంది.

| సంవత్సరము | తంతుల విస్తారము | కార్యాలయాల మొత్తంసంఖ్య | మొత్తం టెలిగ్రాములసంఖ్య | మొత్తం ఆదాయము |
|---|---|---|---|---|
| 1860-61 | 11,093 మైళ్ళు | 145 | | 6 లక్షలు |
| 1870-71 | 13,534 ,, | 197 | 577 వేలు | 13 ,, |
| 1880-81 | 20,346 ,, | 254 | 1657 ,, | 39 ,, |
| 1890-91 | 37,070 ,, | 949 | 3407 ,, | 52 ,, |
| 1900-1901 | 55,055 ,, | 1939 | 6449 ,, | 93 ,, |
| 1910-1911 | 74,828 ,, | 2856 | 13090 ,, | 93 (అని) ,, |

1870-71 నుంచి 1910-11 వరకుగల నలభై సంవత్సరాలలో, టెలిగ్రాఫు కార్యాలయాలు 14 రెట్లు అధికమైనవి. వాటినుంచి ప్రసారమైన టెలిగ్రాముల సంఖ్య 22 రెట్లు పెరిగింది. అంటే, 5,77,000 నుంచి, 13,090,0001 వరకు వృద్ధిఐనవి. అదేసమయంలో, టపాసౌకర్యాలు కూడా దేశంలో విస్తారంగా అభివృద్ధిచెందినవి. 1862లో, టపాకార్యాలయాల ద్వారా పంపినజాబులు, వార్తాపత్రికలు, పార్సెళ్ళు,- కలిసి మొత్తము 471.4 లక్షను. 1880-81 నాటికి ఆ సంఖ్య 1586 లక్షలయింది. 1889-90 నాటికి, 3120 లక్షలకు పెరిగింది. 1905-06 నాటికి సంఖ్య 6451.3 లక్షలకు అధికమయింది.

ఈ విధంగా, సంచార సౌకర్యాలలోను, రవాణా సౌకర్యాలలోను, జరిగిన విస్తృతి, ఈ విశాల ఉపఖండం యొక్క ఆర్థిక ఐక్యతకు దోహదం గావించింది. తత్ఫలితంగా, దేశం వివిధప్రాంతాలలో, వస్తువులధరలు సమానమై, వాటిలో ఇదివరకు ఉన్న భేదం నశించింది. దేశంలోని ఒకభాగంలో అనావృష్టి కలిగితే, అది కేవలం ఆ భాగానికి మాత్రమే పరిమితంకాక, దేశానికంతకూ సంబంధించిన విషయంగా సిద్ధించింది. దారిద్ర్యమూ, దుస్థితీ, దేశమంతా పంచుకొనే అవకాశం ఏర్పడింది. వీటితోపాటు, వివిధప్రాంతాలలోని ప్రజలకు మధ్య, సంసర్గ సాహచర్యాలు సులభంగా, శీఘ్రంగా ఏర్పడే అవకాశాలు సిద్ధించినందువల్ల, సంఘీభావము, సంఘాభిమానము, అభివృద్ధిపొందడం సాధ్యమయింది.

ఇండియాలో రైల్వేలు, టెలిగ్రాఫులు విస్తరించడాన్ని అనుసరించి, సముద్రరవాణాలో ప్రయోజనకరములైన రెండు మార్పులు ఏర్పడినవి. 1869లో, సూయజుకాలువ ఏర్పడడం మొదటిది. భారతీయ నౌకాపరివహనం (Indian shipping) ఓడచాపల సహాయంతోకాక, ఆవిరియంత్రాలతో నడవనారంభించడం రెండోది. ఈ మార్పువల్ల సముద్రవ్యాపారం సులువయింది. సూయెజుకాలువ ఏర్పడడంవల్ల, ఇండియాకు యూరోపుకు మధ్యదూరము, 3000 మైళ్ళు తగ్గింది. ప్రయాణకాలం 35 రోజులు కలిసివచ్చింది. అంతేకాక, స్టీమర్లు ఎక్కువసరకును రవాణా చేయగలిగినవి కావడంలో సరకులపై వహన

శుల్కము (Freight charges) బాగా తక్కువయింది. 1872లో కలకత్తానుంచి లివర్‌పూలుకు, ఒకటన్ను వ్యవసాయపు సరకును రవాణాచేయడానికి వహన శుల్కము 55 షిల్లింగులు. 1822 నాటికది 27 షిల్లింగులకు తగ్గింది. ఈ విధంగా రవాణాఖర్చులు తగ్గినందువల్ల, అధిక మొత్తంలో ఇండియాసరకులు యూరోపు బజారులకుచేరి, రష్యా, కెనడా, యూ-ఎస్-ఏ మొదలైన దేశాల సరకులతో నైనా పోటీచేయడానికి వీలయింది. గోధుమను, ప్రత్తిని, ఇతర వ్యవసాయపు సరకులను, ఈ దేశాలవారు బ్రిటీషుదీవుల బజారులకూ, ఇతర యూరోపుదేశాల బజారులకూ సరఫరాచేస్తూ ఉండేవారు. వారికిప్పుడు ఇండియాతో పోటీ ఏర్పడింది.

కాని, భారతదేశ దురదృష్టంవల్ల, రవాణా సౌకర్యాలన్నీ బ్రిటీషు సామ్రాజ్య ప్రయోజనార్థమై సృష్టించబడినవే కాని, ఇండియా ప్రయోజనార్థం కాదు. భారతదేశ ప్రయోజనాలు ఏ మాత్రమూ గమనించడం జరగలేదు. కనుక, భారతీయార్థికాభి వృద్ధి నిర్లక్ష్యానికి గురిఅయింది. రైల్వే మార్గాల విన్యాసము (Layout), వహన శుల్కముల నిర్ణయము, బ్రిటీషు వాణిజ్యానికే ఉపకరించే విధంగా రూపొందించబడినవి. అంటే, ఇండియా నుంచి ఇంగ్లాండు ఎగుమతులకు, ఇంగ్లాండు నుంచి ఇండియా దిగుమతులకు అనుగుణంగా రైలు మార్గాలూ, వహన శుల్కాలూ రూపొందించబడినవి. అంతర్దేశీయ వ్యాపారానికి, దేశ శ్రేయస్కరమైన పరిశ్రమల స్థాపనకు, ఇవి ఎంతమాత్రమూ, ప్రయోజకములైనవి కావు.

ఉదాహరణకు;-దేశంలోని పరిశ్రమ కేంద్రాలను, బజారులను కలిపేరైలు మార్గాలు ఏర్పరచలేదు. కనుక, పరిశ్రమ కేంద్రాలలో తయారైన వస్తువులు బజారులకు చేరే అవకాశాలు కలగలేదు. చర్మాలను రేవుపట్టణాలకు తరలించుకొని పోవడానికి వహనశుల్కం తక్కువ. (అవి ఇంగ్లాండుకు ఎగుమతి అయ్యేవి కాబట్టి.) వాటినే దేశంలో ఒక భాగం నుంచి ఇంకొక భాగానికి సాగించవలెనంటే, వహనశుల్కం రెండింతలు. అంత మాత్రమేకాదు. సరకులను దేశంలోని ఒక భాగం నుంచి ఇంకొక భాగానికి కొనిపోవడానికై, భారతీయు లెవ్వరూ స్వంతంగా రవాణా సౌకర్యాలను ఏర్పరచుకో కూడదు. అది శాసన రీత్యా నిషిద్ధము. పరిశ్రమల స్థాపనే దేశంలో జరగకూడదని బ్రిటీషు ప్రభుత్వం వారి వాదము. [వారి న్యాయ పరిపాలనా.]

*విదేశ వాణిజ్యము :* రవాణా సౌకర్యాలలో కలిగిన విప్లవాత్మకమైన పరివర్తనము ఇండియా సముద్రాంతర వాణిజ్యంలో అద్భుతమైన అభివృద్ధిని కలిగించింది. రూకల రూపంలోకాక, 1860-61 లో ఇండియా నుంచి పంపిన ఎగుమతుల విలువ మొత్తం 32.97 కోట్ల రూపాయలు. 1906-07 నాటికిది 177 కోట్లకు పెరిగింది. అమెరికా ఆంతరంగిక యుద్ధకారణంగా, అమెరికా పత్తి సరఫరా ఆగిపోయినందువల్ల, ఇండియా పత్తికి ఇంగ్లాండులో గిరాకీ అధికమై, ఈ పత్తి ఎగుమతి ఒక్కసారిగా పెరిగింది. 1860-61 లో 32.97 కోట్ల పత్తి

ఎగుమతి, 1863-64 నాటికి 65 63 కోట్లు, 1864-65 కు 68 కోట్లు అయింది. 1865-66 లో, 65.49 కోట్లు ఎగుమతి అయిఁది. అమెరికాలో శాంతి మళ్ళీ కుదురు కోవడంతో, ఇండియా పత్తికి గిరాకి తగ్గిపోయి, 1866-67 నాటికి, 41.86 కోట్లు అయింది. 1868-69 కి, ఎగుమతి మళ్ళీ 53 కోట్లకు పెరిగింది. సూయెజు కాలువ ఏర్పడడము, (1869) వహన శుల్కము 1870 ప్రాంతంలో తక్కువ కావడం కారణంగా, ఇండియా పత్తి ఎగుమతి 1880 లో మళ్ళీ వేగాన్ని అందుకొన్నది. 1888-89 లో 97 కోట్లకూ, 1898-99 లో 112.5 కోట్లకూ, 1906-07 లో 177 కోట్లకూ ఎగుమతులు పెరిగినవి.

దిగుమతులు కూడా అధికమైనవి. 1861-62లో 22.32 కోట్లు మాత్రమే ఉన్న దిగుమతులు, 1869-70 నాటికి 32.93 కి పెరిగినవి. సూయెజుకాలువ ఏర్పడిన అనంతరము ఒక్కసారిగా దిగుమతులధికమై, 1880-01కు 53.11 కోట్లు, 1890-91కు 71.97 కోట్లు, 1906-07కు 127 కోట్లు- ఈ విధంగా పెరుగుతూ వచ్చినవి.

ఇంత ఆశ్చర్యకరంగా ఇండియా విదేశవ్యాపారం వృద్ధికావడంవల్ల, ఫలితాలెటువంటివి ? దేశము ఆర్థికంగా అభ్యుదయం పొందుతూఉన్నదని బ్రిటీషు పరిపాలకుల అభిప్రాయము. ఇండియాలో ఉత్పన్నమైన ముడిసరకులకు యూరోపు బజార్లలో కలిగిన అవకాశమూ, తత్కారణంగా వ్యావసాయి కాదాయం దేశంలో వృద్ధికావడమూ, రూకలు ఇండియాలోకి ప్రవహించడమూ,-అభ్యుదయ సూచకాలని వీరు పేర్కొనినారు. ఇంగ్లాండులో జరిగిన సాంకేతిక శాస్త్రాభివృద్ధి కూడా, ఇండియాలోని వినియోగదారులకు లాభకరమని వీరివాదము. ఇంగ్లాండు కర్మాగారాలలో తయారైన వస్తువులు ఇండియాలో చౌకగా లభ్యమవుతున్నాయని, ఈ వస్తువులను ఇండియాలో తయారుచేస్తే ధరలు అధికమవుతాయని, అందువల్ల ఇంగ్లాండులో వస్తువులు తయారుకావడమే ఇండియాకు శ్రేయమనీ వీరి తర్కము.

**వ్యాపార విధానము : మూలద్రవ్యాలను,** ఉత్పత్తిని, ఆధారంగా చేసుకొని, అంతర్జాతీయ వాణిజ్యాలలో స్వేచ్ఛగా ప్రవేశించే దేశాల పరస్పర సంబంధాలను నిర్ణయించే అంశాలు, ఇండియా విదేశవాణిజ్యాన్ని సంఘటితం చేయలేదు. ఇండియా వాణిజ్యరచన పూర్తిగా పరిపాలకుల సామ్రాజ్య నీతి ననుసరించి, వారి స్వప్రయోజనార్థం ఏర్పడినది.

ఇండియాప్రభుత్వము, ఒకవైపు, రైల్వేల అభివృద్ధికి పౌరనిధినుంచి అనుపూరకధనాన్ని వెచ్చించింది. ఇంకొకవైపు ఇతరదేశాల ఇండియా వ్యాపార సంబంధాలకు, స్వేచ్ఛావ్యాపార సూత్రాలను నిర్దాక్షిణ్యంగా వర్తింప జేసింది. ప్రభుత్వము అవలంబిస్తున్న వాణిజ్యనీతిని ఛార్లెస్ ట్రెవిలియన్, విశదంగా ఈ విధంగా వివరించినాడు. (1864) "మనము ఇంగ్లాండులో అనుసరించిన పద్ధతి ప్రకారము, వ్యాపారస్వాతంత్ర్యానికి గల ప్రతిబంధకాలన్నిటినీ తొలగించడం మన ఉద్దేశమై ఉండవలెను." ఇంగ్లండులో పాటింపబడిన స్వేచ్ఛావ్యాపార విధానము,

ఆదేశానికి లాభకారమైనందువల్ల, ఆ విధానమనుసరించబడింది. పారిశ్రామికంగా, ప్రపంచదేశాలన్నిటికీ, ఇంగ్లాండు, ప్రముఖదేశంగా సిద్ధించింది. తన దేశంలోని ప్రజలకు చౌకగా ఆహారపదార్థాలూ, కర్మాగారాలకు ముడిసరకులూ, ఆవశ్యకమై ఉన్నవి. తనదేశంలో తయారైన వస్తువుల వినియోగము లాభదాయకంగా జరగవలసి ఉన్నది. కనుక, స్వేచ్ఛావ్యాపార విధానాన్ని ఇండియాప్రభుత్వ మవలంబించడంలో గల ఉద్దేశము ఇంగ్లాండుకు సరకుల ఎగుమతి నధికం చేయడానికే కాని, ఇండియాలో ఉత్పాదనను అభివృద్ధిపరచడానికి కాదు. ఎగుమతికి పనికి వచ్చే ముడిసరకులు ఇండియాలో విస్తారంగా ఉత్పన్నమై, ఎగుమతికి సిద్ధంగా ఉన్నవి. కాని, ఈ సరకుల మొత్తానికి అనుగుణంగా దిగుమతులు జరగకపోవడం వల్ల ఇండియా వాణిజ్యంలో, క్లిష్టపరిస్థితి యేర్పడింది. ఈ వ్యాపారక్లిష్టతను తొలగించి, వ్యాపారవిస్తృతికి అవకాశం కలిగించడం మన ఆశయమైతే, దిగుమతుల అభివృద్ధికి, అన్ని విధాలా ప్రోత్సాహ ప్రోద్బలాలను ఇవ్వవలసి ఉంటుంది." అని ట్రెవిలియన్ వివరించినాడు. స్వేచ్ఛావ్యాపారవిధానము, ఇండియాకు లాభదాయకమని సమర్థించే ఈ వాదము, వాస్తవంగా విచిత్రమైనది.

ఇండియా ప్రభుత్వవిధానము, ఇంగ్లాండు వస్త్రపరిశ్రమకు ప్రయోజకంగా, ఇంగ్లాండు కర్మాగారాల ఒత్తిడివల్ల, ఏర్పడినదనడము వాస్తవము. ఇండియాలో యాంత్రికదూదిపరిశ్రమలేర్పడడం, ఇంగ్లాండుదేశానికి చింతావ్యాకులత్వాలను కలిగించింది. మాంచెస్టరు, ల్యాంకషైర్లు, పార్లమెంటుద్వారా, ఇండియా ప్రభుత్వంపై ఒత్తిడికలిగించి, ఇండియాలో దూదిపరిశ్రమలను అణచివేయవలసిందని, నిర్బంధపరచినవి. ఇండియాలోకి దిగుమతి అవుతున్న దూదివస్త్రాలపై సుంకాలు విధించడం, ఇండియా మిల్లులకు రక్షణ కల్పించే సమంజస వాణిజ్య విధానానికి వ్యతిరేకమై ఉన్నందువల్ల సాధ్యమైనంత త్వరలో ఇండియా ప్రభుత్వ ద్రవ్యపరిస్థితి అనుకూలించిన వెంటనే, ఆ సుంకాలను రద్దుచేయడం పార్లమెంటు అభిప్రాయమని, ఒక తీర్మానంద్వారా, ఇండియాప్రభుత్వాన్ని పార్లమెంటు ఆదేశించింది.

చరిత్రలో ఎన్నడూ అనుభవించనట్టి దురంతమైన క్షామపరిస్థితు లేర్పడి, దేశం దురవస్థకు లోనై ఉన్నది. ప్రభుత్వపు ద్రవ్యపరిస్థితి విషమంగా తయారైనది. కనుక, ఆదాయాన్ని పెంచేనిమిత్తము, దూదివస్త్రాల దిగుమతులపై 5 శాతం సుంకాన్ని విధించడానికి ప్రభుత్వం నిశ్చయించినది. ఈ సుంకాలవల్ల ఇండియాలోని దూదిమిల్లులకు రక్షణ ఏర్పడుతుందని అభిప్రాయపడి, ల్యాంకషైరు ఈ ప్రతిపాదనను తీవ్రంగా వ్యతిరేకించింది. సుంకాలను విధించే ప్రయత్నాన్ని ప్రభుత్వం వదలి వేయవలసివచ్చింది. ఇంగ్లాండు వస్త్ర పరిశ్రమల ప్రయోజనమే ప్రభుత్వానికి ప్రథమకర్తవ్యమయింది. అంతేకాని, స్వేచ్ఛావ్యాపారసూత్రాలపై శ్రద్ధా, ఇండియా ఆర్థిక లాభమూ,-అనే ఉదారాశయాలు ప్రభుత్వ మవలంబించిన విధానానికి హేతువులు కావు.

సుంకాలు రద్దుచేసినా ల్యాంకషైరుకు తృప్తికాలేదు. అన్ని రకాలైన దూది వస్త్రాలపైనా అన్ని విధాలైన దిగుమతి సుంకాలనూ రద్దుచేయవలసిందని నిర్బంధపరచింది. ఈ విషయమై, ఇండియా సెక్రెటరీ ఆదేశపత్రాన్ని పంపుతూ దానిలో, "దూదివస్త్రపరిశ్రమవంటి విస్తారమైన పరిశ్రమలను ఇండియాలో నెలకొల్పడాన్ని అనుమతించడం వర్జించరాని దుర్ణయము. దీనివల్ల అపారమైన క్లిష్టపరిస్థితి రెండుదేశాలమధ్య ఏర్పడగలదని, అది సమంజసమైనదికాదని అనుభవం వల్ల నిశ్చయించబడింది. అంతేకాక, ఇంగ్లాండు ఉద్దేశపూర్వకంగా అవలంబించిన నీతి విధానానికిది విరుద్ధమైనది. ప్రకృతిసహజములైన కారణాలవల్ల, ఇంగ్లాండు తాలూకు ఇండియావ్యాపారం తగ్గిపోవడం వేరు. ప్రభుత్వంయొక్క అనుమతితో ఇండియాలో మిల్లులేర్పడితే, ఇంగ్లాండు వస్త్రాల దిగుమతి క్షీణించడమూ, రెండు దేశాలకూ మధ్య ఈ దిగుమతి వ్యాపారంవల్ల ఏర్పడిఉన్న ద్రవ్యసూపాను బంధము భగ్నం కావడమూ సంభవించగలదు. అటువంటి పరిస్థితి శ్రేయస్కరం కాదు." అని ఇంగ్లాండు రాజనీతిని విశదంచేసినాడు. ఈ సామ్రాజ్య నీతి నిర్బంధకారణంగా, 1879లో, ఇంగ్లాండు వస్త్రాల దిగుమతిపై అన్ని సుంకాలూ తొలగించబడినవి. "దేశంయొక్క విస్తృతిని, అక్కడి అనుకూల పరిస్థితులను ఉపయోగించుకొని, ప్రజల వినియోగాని కవసరమైన ప్రతి వస్తువునూ, తయారు చేసుకోవడానికి ఇండియా సమర్థమైయున్నదని," అధికారులే బాహాటంగా వెల్లడి చేసియున్నారు కనుక, ఇండియా బజారులలో ఇంగ్లీషువస్తువుల ఉత్కృష్టత స్థిరంగా, నిలిచిఉండవలెనంటే, వీటికి పోటీగా ఇండియాలలో పరిశ్రమలు ఏర్పడ కూడదు. అటువంటి ప్రయత్నాన్ని ప్రభుత్వము, భంగం కావించకతప్పదు.

స్వేచ్ఛావ్యాపార విధానాన్ని 1869లో, హాస్యాస్పదమైన స్థితికితెచ్చింది ప్రభుత్వము. ఇండియాకు దిగుమతి అవుతున్న వస్త్రాలపై $3\frac{1}{2}$ శాతం రాజస్వ శుల్కాన్ని ప్రభుత్వం విధించింది. ఇందువల్ల విదేశవస్త్రాల ధర పెరిగి, దేశీయ వస్త్రాలకు గిరాకీకలుగుతుంది. ఈ నష్టం ఇంగ్లాండుకు కలగనీయకుండా చేయడానికిగాను, ప్రభుత్వము, ఇండియాలో తయారైన మిల్లుగుడ్డలపై $3\frac{1}{2}$ శాతం ప్రతి కరశుల్కాన్ని (Countervailing duty) విధించింది. ఇందువల్ల దేశవస్త్రాల పోటీ తొలగి, ఇంగ్లాండు మిల్లుయజమానులు ఇండియా బజారులను స్వేచ్ఛగా, స్వప్రయోజనార్థము ఉపయోగించుకో గలిగినారు.

సంచార రవాణాసౌకర్యాల అభివృద్ధివల్ల, దేశంయొక్క విదేశవ్యాపారము, మొత్తంగా అభివృద్ధిచెందింది కాని, దేశం ధనవంతంకాలేదు. దీనికికారణం సుగమమైనదే. అభ్యుదయస్థితిలో లేని దేశీయవ్యవసాయము, ఉత్పన్నం గావించిన ముడిసరకులను, ఆహారధాన్యాలను, ఆకాలంలో ఎగుమతిచేస్తూ వచ్చినారు, దూదివస్త్రాలు, ఉన్నివస్త్రాలు పట్టువస్త్రాలు,- మొదలైన సాధారణ వినియోగ వస్తువులను విదేశంనుంచి, ఇండియా దిగుమతి చేసుకొంటూవచ్చింది. సాధారణమైన పెట్టుబడితో, నేర్పుతో, మనం ఎగుమతిచేస్తున్న ముడిసరకులతో, మనమే వీటిని దేశంలో సులభంగా తయారుచేసుకోవచ్చు. ఇటువంటి పరిశ్రమల స్థాప

నకు, ప్రభుత్వము, అనుమతించే ఉంటే, విదేశవ్యాపారం తాత్కాలికంగా తగ్గి పోయేదేకాని, అధికమయ్యేదికాదు. కాని, అట్లా జరగడం ఇంగ్లాండుకు ఇష్టం కాదు. విదేశవ్యాపారాన్ని ప్రధానసాధనంగా ఉపయోగించుకొని, తన ఆర్థిక సామ్రాజ్యవ్యవస్థను పెంపొందించుకోవడమే ఇంగ్లాండుయొక్క ప్రధానోద్దేశము. ఇండియా ఆర్థికవ్యవస్థపై బ్రిటీషుసామ్రాజ్య నీతి ప్రాబల్యం వహించడం, ఇండియాలోని మూలద్రవ్యాలను, బజారులను స్వప్రయోజనార్థము ఉపయోగించుకొని, బ్రిటీషు పారిశ్రామికులకూ, పెట్టుబడిదార్లకు లాభంకలిగించడం,- ఇవి ప్రధాన హేతువులుగా, ఇండియా విదేశవాణిజ్యం ఎక్కువ చేయబడింది. కనుక, ఈ విదేశ వ్యాపారాభివృద్ధి, ఇండియా ఆర్థికవ్యవస్థ యొక్క స్వాస్థ్యాన్ని సూచించేది కాదు

గణాంకశాస్త్రజ్ఞుడైన ఎ ఎల్. బౌలీ (A. L. Bowley) "భారతదేశానికీ, మన యితర వలసరాజ్యాలకూ, కొన్ని సామ్యాలున్నవి. మనం తయారు చేసిన దూదివస్త్రాలు, యంత్రాలు మొదలైన విశిష్టవస్తువుల వినియోగానికి ఈ రెండూ బజారులుగా ఉపయోగించినవి. మన వ్యాపారానికి భంగం కలగని మార్గంలో, ఇష్టంలేక మనమిచ్చిన అనుమతి నుపయోగించుకొని, ఈ రెండు వర్గాలూ, ఇతరదేశాలతో వాణిజ్యానికి, (ఈ శతాబ్ద మధ్యకాలంలో,) పూనుకొన్నవి." అని అభిప్రాయం వెలిబుచ్చినాడు.

ఇతర దేశాలతో ఇండియా వాణిజ్యము, బ్రిటను ఆర్థిక సామ్రాజ్య విధానంలో ప్రధాన స్థానాన్ని వహించింది. సుమారు 1875 వరకు, బ్రిటను తన మూలధనాన్ని, యూరోపు ప్రభుత్వాలకు రుణంగా ఇస్తూవచ్చింది అటు తరవాత అందులో అభ్యుదయకరమైన మార్పు కలిగింది. బ్రిటీషు సామ్రాజ్యంలోని దేశాలకూ, అమెరికాకూ, (U. S. A.), ఈ మూల ధనం ఎక్కువగా ప్రవహిస్తూ వచ్చింది బ్రిటీషు పెట్టుబడిదార్లు, తమ వద్దనున్న రష్షియను ప్రభుత్వ రుణ పత్రాలను, ఇతర ప్రభుత్వ పత్రాలను అమ్మివేసి, రైల్వే పత్రాలను (స్టాకును) కొంటూ వచ్చినారు. ఆహార పదార్థాలను, ప్రత్తిని, ఇతర ముడిసరకులను, ఇంగ్లాండుకు ఎక్కువగా సరఫరా చేసే దేశాలలో రైల్వేలు నిర్మించబడినవి. రుణగ్రస్తములైయున్న ఈ దేశాల నుంచి, బ్రిటను ఈ సరకులను అధికంగా దిగుమతి చేసుకొంటూ వచ్చినందువల్ల పందొమ్మిదో శతాబ్దం కడపటికి, తానిచ్చి ఉన్న రుణం తీరిపోవడమేకాక, ఈ దేశాల సరకులకు తాము చెల్లించవలసిన బాకీ మిగిలింది అంతేకాదు, అటువంటి సందర్భాలలో "భారతదేశం, ఇంగ్లాండుకు అచలసురక్షా సాధనంగా (Safety Valve) ఉండడమే కాక, ఇతర విషయాలలో కూడా లాభకారియై నిలిచింది టారిఫ్ శుల్క ద్వారాల (Tariff Barriers) ఆఘాతాల నుంచి రక్షించుకొని, బ్రిటను నిలబడటానికి ఇండియాతోగల సంబంధాలు కొంతవరకు సహాయపడినవి. బ్రిటీషు సరకుల వినియోగానికి ఇండియా బజార్లు ఉపయోగించగా, ఇండియా నుంచి జరిగే ఎగుమతులు, టారిఫ్ శుల్కాలను చెల్లించి ఇంగ్లాండుకు లాభం గావించినవి." జనుముకు

సంబంధించిన వ్యాపారంవల్ల, ఈ వ్యవహారం అర్థమౌతుంది. 1867-91 నుంచి 1909-13 వరకుగల మధ్యకాలంలో, బ్రిటనులో తయారైన జనుము వస్తువులు, సరాసరి, 25 కోట్ల గజాల నుంచి 17 కోట్ల గజాలకు తగ్గిపోయింది. "యూ. ఎస్. ఏ., ఆస్ట్రేలియాలోను, టారిఫ్ శుల్క మధికంగా ఉన్న దక్షిణ అమెరికాలోనూ కూడా, ఇండియా జనుము వస్తువులు అధికంగా అమ్ముడుపోయి, ఆ బజార్లలో, అధికారాన్ని సంపాదించుకొన్నవి. ఈ విధంగా, భారతదేశపు జనుము వాణిజ్యం, విదేశాలలో సఫలం కావడంవల్ల ఇంగ్లాండు కేమీ నష్టంకలగ లేదు. కారణం ? జనుమును, జనుం వస్తువులను అమెరికాకు ఎగుమతిచేయడంవల్ల సిద్ధించిన ద్రవ్యంలో నుంచి 100 లక్షల పౌనులను, ప్రతి సంవత్సరము ఇంగ్లాండుకు డాలర్ పరిష్కారానికై, చెల్లిస్తూ వచ్చింది. "టారిఫ్ శుల్క ద్వారాల నిరోధ కారణంగా, బ్రిటనుకీ కార్యము సాధ్యమై ఉండేదికాదు." అని డండీ అంగీక రించింది.

1858 నాటికి, విదేశాల దిగుమతులకు చెల్లించవలసిన శేషము అధికమై, ఇండియా ఆర్థికస్థితికి క్లిష్టత ఏర్పడింది. దేశంలోని చేతిపనులు నశింప జేయబడి నందువల్ల బ్రిటీషు వస్తువులను పెద్ద మొత్తంలో దిగుమతి చేసుకోవలసివచ్చింది. నీలిమందువంటి ముడి సరుకుల ధరలు, బ్రిటీషు బజారులో, పడిపోయినవి. అపీము యుద్ధాల కారణంగా విదేశద్రవ్య మారకాన్ని ఎక్కువగా సంపాదించే, ప్రధానమైన అపీము వ్యాపారం, దెబ్బతినింది. విదేశపు దిగుమతులకు చెల్లించ వలసిన శేషము అట్లే నిలిచిపోవడంవల్ల, ఇంగ్లాండు వస్తువుల దిగుమతిని అభి వృద్ధి చేయడానికి వీలు కలుగలేదు జనుము, పత్తి, తేయాకు-వీటి పరిశ్రమల అభివృద్ధీ, ఆవిరి నౌకల రవాణాలూ ఈ సమస్యను సాధించినవి.

## VI ఆర్థిక నిస్స్రావము (Economic Drain)

దిగుమతులు అద్భుతంగా పెరిగినా, 1862 తరవాత వ్యాపారాల చెల్లింపులో శేషం మిగలకుండా, లాభకరంగా, ఇండియా, గడుపుకొంటూ వచ్చింది. 1862 ఏప్రిలు నుంచి, 1905 మార్చివరకూగల 43 సంవత్సరాలలో దిగుమతులకు దాటిపోయిన ఎగుమతి సరకుల విలువ మొత్తము 1288.23 కోట్ల రూపాయలు. అంటే సరాసరి సంవత్సరానికి 29.3 కోట్ల ఎగుమతులు ఎక్కువ అని తేలుతుంది. దీనికి బదులుగా, 508.81 కోట్ల విలువగల బంగారును, వెండిని, ఇండియా, దిగుమతి చేసుకొన్నది. తక్కిన 780.42 కోట్ల రూపాయలను బ్రిటను పట్ల తనకుగల బాధ్యతలకై, ఇండియా చెల్లించింది. బ్రిటనుతో ఇండియాకుగల రాజకీయ ఆర్థిక సంబంధాలనుబట్టి యేర్పడిన బాధ్యత ఇది. ఈ ఖర్చును 'అనర్జక నిర్యాతము'గా (Unrequited exports) గణించవలసి ఉంటుంది.

దాదాభాయినౌరోజీ, రొమేశచంద్రదత్, వంటి భారతీయ అర్థశాస్త్ర వేత్తలు, ప్రజానాయకులు, ఈ ఖర్చును బ్రిటీషువారు ఇండియానుంచి నిర్బం ధంగా గ్రహించిన 'కప్పము' అని వర్ణించియున్నారు. "ఇండియానుంచి ప్రతి

సంవత్సరమూ ఈ విధంగా ద్రవ్యాన్ని పీల్చివేస్తూ ఉండడమే, దేశదారిద్ర్యాన్ని అధికంచేసే ప్రబలకారణమని", దారిద్ర్యబాధ్యతను దీనిపై మోపినారు. ఈద్రవ్య పరివాహంలోని ఒకభాగము, 'మాతృభూమి' వ్యయానికి' (Home charges) సంబంధించినది ప్రభుత్వరుణంపై, ఇండియా ఏటేటా ఇంగ్లాండుకు చెల్లించేవడ్డీ, ప్రభుత్వం రైల్వేలకిచ్చే హామీలు, సబ్సిడీలపై చెల్లించవలసిన వడ్డీలు, వార్షిక ద్రవ్యాలు, పురనిర్మాణాదికార్యాలకై ప్రభుత్వంచేసిన రుణాలపై వడ్డీలు, సెలవు, లేదా, విశ్రాంతి తీసుకొన్న ఇండియా సివిలుఉద్యోగుల విదేశ వేతనాలు (Furlough) పెన్షనులు, ఇంగ్లాండులోని ఇండియా సెక్రెటరీ కార్యాలయ ఖర్చులు, ఇండియా ప్రభుత్వశాఖలకు సరఫరాచేసిన వస్తువుల వెలలు,- ఇవన్నీ మాతృభూమి వ్యయంలో, చేరినవి. విదేశీయ బ్యాంకుల సేవలు, భీమాకంపెనీలు, పరివహన కంపెనీలు, తేయాకు తోటలు, జనుము వస్తువుల తయారు, ఖనిజ పరిశోధనము, బ్రిటీషు అధికారులు, వర్తకులు ఇండియానుంచి ఇంగ్లాండు పంపే ద్రవ్యము,—మొదలైనవన్ని అదృశ్య దిగుమతులుగా (Invisible imports) పరిగణింపబడి, మాతృభూమి వ్యయంలోని మిగత భాగంగా ఏర్పడింది.

1835-1871 మధ్యకాలంలో, సంవత్సరపు ఎగుమతుల మిగులు-ఖర్చులు పోగా-41 లక్షల పౌనుల విలువగలది. 1871-72 నాటికి, ఈ మిగులు 21 03 కోట్ల రూపాయలకు పెరిగింది. తరవాత, అది తగ్గిపోయి 1890-91 వరకూ, 16-18 కోట్లలో, నిలిచిపోయింది. పిమ్మట అది మళ్ళీ పెరిగి, 1891-92 నాటికి 27 3కోట్లు, 1892-93కు, 30 28 కోట్లు, 1894-95 నాటికి 34కోట్లు,- ఈ విధంగా, మారుతూ వచ్చింది. 1903-04లో అది 37 కోట్లుగా ఏర్పడింది. ఈ కాలంలో, మాతృభూమి ఖర్చులుకూడా, దీని ననుసరించి పెరుగుతూ పోయినవి. 1884-85లో ఈ ఖర్చులు 114 లక్షల పౌనులు, 1904-05లో 194 లక్షల పౌనులూ,-ఈ విధంగా మాతృభూమి ఖర్చులు అధికమైనవి.

ఇండియా వలసరాజ్యంగా ఉన్నరోజులలో చెల్లించవలసిన ఈ కర్చుల విషయమై, భారతీయ ఆంగ్ల రచయితలు ఉద్రేకపూరితములైన వాదప్రతివాదాలు, చాలకాలంచేస్తూ వచ్చినారు. ఇంగ్లాండు దేశంలో పెట్టుబడి పెట్టిన ద్రవ్యంపై వడ్డీకి, లాభాంశాలకు బదులుగా ఈ ఖర్చులు ఇండియా ఇస్తున్నదని బ్రిటీషు పక్షంవారు వాదిస్తూ వచ్చినారు. భారతీయ నాయకులలో గొప్పవాడైన 'రెనడే' వంటివాడుకూడా, ఒక సమయంలో బ్రిటీషువాదాన్ని సమర్థించినాడు. పారిశ్రామికమహాసభలో ఉపన్యసిస్తూ "మన ఎగుమతి మిగులులోని 20 కోట్లను 'కప్పం' రూపంలో ఇంగ్లాండు తీసుకొంటున్నంతవరకూ మనకు మోక్షంలేదనీ, మనకుమనం సహాయంచేసుకొని అభివృద్ధికి రాలేమనీ, భావించే వ్యక్తులున్నారు. ఈదృష్టి న్యాయమైనదీకాదు, పురుషలక్షణమూ కాదు" అని పలికినాడు. "ఈ విషయమై నిరర్థకాలైన చర్చలకు, వివాదాలకుదిగి, మీ శక్తిసామర్థ్యాలను, అన్యథా మరల్చవద్దని, ఈ కప్పమునకు సంబంధించిన సమస్యను రాజకీయ కాంగ్రెసుకు వదలివేయవలసిందనీ" పారిశ్రామిక యజమానులను ఇతడు హెచ్చ

రించినాడు. దీనికి వ్యతిరేకంగా, పలువురు ఆంగ్లేయులు,- అధికారులు, అనధికారులుకూడా,- ఈ విషయమై భిన్నాభిప్రాయాన్ని వెలువరచినారు. 1878-79 నాటి ద్రవ్యవివరణపత్రం (Financial Statement) ఈ కిందివిధంగా ఈ విషయాన్నిగూర్చి తెలుపుతున్నది.

"దేశంలో ఉత్పన్నమైన సరకులోని మిగులును ప్రయోజనకరంగా, ఉపయోగించడం,- అనే సమస్యకు విశిష్టప్రాధాన్యాన్ని కలిగించే ఆర్థికపరిస్థితులు దేశంలో ఉన్నవి. అవి అత్యవసరములు, మిక్కిలి ప్రధానములు ఐ యున్నందువల్ల వాటిని గమనించక తప్పదు. ఇండియాకు ఇంగ్లండుతో ఏర్పడిఉన్న సంబంధము, తత్కారణంగా సిద్ధించిన ద్రవ్యరూపసంబంధము,- ఇవి నిమిత్తాలుగా, ప్రతి సంవత్సరము ఇండియా రెండుకోట్ల పౌనుల విలువగల సరకును ఇంగ్లాండుకు తగిన ప్రతిఫలంలేకుండా, పంపవలసి వచ్చింది. దిగుమతులకంటె అధికంగా పంపిన ఈ ఎగుమతులకు ఆర్థికశాస్త్రభాషలో, 'కప్పము' అని వ్యవహారము. ఈ కారణం వల్ల ఇండియా వాణిజ్యానికి అస్వాభావికమైన స్థితి ఏర్పడింది. ఈ స్థితివల్ల తాను సరఫరాచేసిన సరకుల విలువకు సమానమైన వస్తువులను దిగుమతి చేసుకొనేశక్తి, ఇండియాకు లేకపోయింది. కనుక, తన వాణిజ్యంతో లభించవలసిన పూర్తి ప్రయోజనం పొందకపోవడంవల్ల, దేశంలో విస్తారమై ఉన్న మూలద్రవ్యాన్ని ఉపయోగించుకొని అభివృద్ధిచెందే అవకాశం లోపించింది." రాంసే మాక్డొనాల్డ్ కూడా, (Ramsey Macdonald) ఈ విధంగానే అభిప్రాయపడినాడు

"పరప్రభుత్వంలోని ఈ మృతచార్జీలు (కర్చులు) రెండు విధాలుగా దేశానికి హానికరములైనవి. ఇండియాలో ఉత్పత్తి అయిన సరకులనుంచి ఈ ద్రవ్యాన్ని గ్రహించడం, అట్లా గ్రహించిన ద్రవ్యాన్ని ఇండియా ప్రయోజనార్థం ఉపయోగించకపోవడం,- ఇట్లా రెండువిధాలుగా ఇండియాకు నష్టం కలుగుతున్నది. ఇండియాలోని ఉత్పాదకప్రవాహంనుంచి సారభూతమైన జలాన్ని వెలుపలికి ప్రవహింపజేసి, ఉత్పత్తిని దరిద్రం గావిస్తూ ఉన్నది. ఈ మాతృభూమి వ్యయమనెడి నిర్బంధంగా ఎగుమతి గావించిన 'కప్పము' అధికమైనప్పుడు,. అభ్యుదయము విస్తరించే అవకాశం లేదు."

లేలాండ్ జెంక్స్ (Leyland Jenks) అనే ప్రఖ్యాత అమెరికా రచయిత, ఈ విషయంపై, కింది విధంగా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చినాడు. "ఇంగ్లాండు ప్రభుత్వము తన సౌకర్యాన్ని ఉద్దేశించి, తన ఖర్చుల భారాన్ని ఇండియాపై మోపడం అసంబద్ధమైనది. 1857 నాటి విప్లవం కర్చులు, కంపెనీ అధికారాన్ని ఇంగ్లాండు ప్రభుత్వానికి సంబంధించిన లండనులోని ప్రతి ఖర్చు, ఇండియా ప్రభుత్వ కార్యాలయంలో బూడిద తుడిచే కూలిదాని కిచ్చిన ఖర్చు, ఇంగ్లాండు నుంచి వెళ్లిన పడవలు యుద్ధంలో పాల్గొనకపోయినా వాటికైనఖర్చు, ఇండియాకు పంపే సైన్యాల ఆరుమాసాల శిక్షణ ఖర్చు,- ఇండియా పేరుతో ఏమాత్రము సంబంధం కలిగిన అంశానికైనా జరిగినఖర్చు,-ఇట్లా అన్ని ఖర్చులూ ఇండియాపై,-అంటే ప్రాతినిధ్యం ఏమాత్రమూలేని ఇండియా రైతుపై మోపి

వది ఇంగ్లాండు ప్రభుత్వము." టర్కీసుల్తాను 1868 లో, తన సిబ్బందితో సహా లండనుకు వచ్చిన సందర్భంలో, అతని గౌరవార్థం, ప్రభుత్వం ఒక నర్తన గోష్ఠిని (Ball) ఇండియా కార్యాలయ భవనంలో ఏర్పాటుచేసి, దానికైన ఖర్చును ఇండియా దేశంపై వేసింది.

మహాత్మాగాంధీకి సన్నిహిత వర్తియైన జె. సి. కు మారప్ప, ఈ విషయాన్నిగూర్చి, ఇంతవిపులంగా కాకపోయినా, ఇంగ్లాండు ప్రభుత్వం ఇండియాపై మోపిన రుణభారం సామ్య విరుద్ధమైనదని, ఆరుణంపై నియమితమైన వడ్డీ అక్రమమనీ, తెలిపియున్నాడు. "అనుత్పాదకములైన ఈ రుణాలు, బ్రిటీషు వారి ఇండియా ఆక్రమణ ప్రయత్నంలోనే పుట్టినవి. ఇంతేకాక సామ్రాజ్య ప్రయోజనాన్ని ఉద్దేశించి, ఏషియా, ఆఫ్రికా ఖండాలలో వారు జరిపిన యుద్ధాలకై ఈ రుణాలు పెరిగినవి. అటువంటి రుణాన్ని ఇండియా చెల్లించవలసిందిగా వీరే నిర్ణయించినారు. ఈ యుద్ధాలు, కలహాలు, ఇండయాకు ఏమాత్రమూ సంబంధించినవికావు. ఈ యుద్ధాలు జరిగిన ప్రయోజనాలు కూడా భారతదేశ ప్రయోజనాలుకావు. కనుక ఈ ఖర్చుల భారాన్ని భారతదేశంపై మోపడం అన్యాయము".

'మాతృభూమి ఖర్చులు', 'కప్పము' అనేసమస్యలపై జరిగిన చర్చలన్నీ, చాలవరకు, నైతిక స్థాయిలో జరిగినవి. కాని, ఈ ఖర్చులను చెల్లించడంవల్ల భారతీయ ఆర్థిక వ్యవస్థలో కలిగే పరిణామమెటువంటిది? అనే విషయం ముఖ్యంగా పరిశీలించవలసినది.

ప్రథమ ప్రపంచయుద్ధం తరవాత, జర్మనీపై క్షతిపూర్తి (Reparations) భారాన్ని మోపే సందర్భంలో, ఆర్థిక శాస్త్రవేత్తలు మొదటిసారిగా, అనార్జవ నిర్యాతాలను గూర్చి, శ్రద్ధతో చర్చించినారు.

జే. ఎమ్. కేయిన్స్ (J. M. Keynes)- ఈ విషయాన్నిగూర్చి ఈ విధంగా వ్రాసినాడు. "ఉత్పాదన మిగులుగా ఉన్న దేశం కప్పముకట్టడము అనే పద్ధతి, ప్రజల జీవన ప్రమాణాన్ని తగ్గించడం మాత్రమేకాక, రెండు పక్షాలవారికీ కూడా హానికలిగిస్తుంది. దాస్యానికన్న కూడా ఎక్కువభేదం లేని జీవిత పరిస్థితులలో శ్వేతజాతులవారి మనఃప్రవృత్తి ఎటువంటిదై ఉంటుందో మన అనుభవంలో లేదు. ఐనా, ఒకవ్యక్తి ఉత్పత్తిగావించిన సరకులోని మిగులునంతటినీ అతని నుంచి గ్రహించివేస్తే, అతని సమర్థతా, కార్యనిర్వహణోత్సాహమూ కూడా, తగ్గిపోతాయి. ఉద్యమకర్త (Entrepreneur), ఆవిష్కర్త (Inventor), వ్యాపారస్తుడు, దుకాణదారుడు,- ఎవ్వరూ కూడా డబ్బు మిగల్చరు. శ్రామికుడు ఎక్కువపనిచేయడు. తమ శ్రమవలన సిద్ధించినలాభము, తమ ప్రయోజనానికీ, తమ పిల్లలకూ, తమ వార్ధక్యానికీ, తమ పదవికీ, ప్రతిష్ఠకూ, ఉపయోగపడక, తమ్ము జయించిన పరదేశీయుని సౌఖ్యానికి ఉపయోగించేటట్టయితే, ఎవ్వరూ కష్టపడి పనిచేసి మిగల్చవలసిన అవసరమే ఉండదు." శ్వేతజాతులవారికి న్యాయమైన ఈ విషయము భారతదేశానికి కూడా వర్తిస్తుంది. ఐనా, ఇండియా స్వతంత్ర

దేశము కానందువల్ల, ద్రవ్యాన్ని నిరంతరంగా పరదేశం పీల్చివేయడంవల్ల, ఈ దేశ ఆర్థికస్థితిపై ఏ రకమైన హానికర పరిణామం కలుగుతుందనే విషయం, యూరోపియను ఆర్థికశాస్త్రవేత్తల దృష్టిని ఆకర్షించలేదు. అల్పవికసిత దేశాల ఆర్థికస్థితిని బాగుపరచే ప్రయత్నసందర్భంలో, ఈ విషయాన్నిగూర్చి, ఆర్థికశాస్త్రవేత్తలు ఇటీవలనే, చర్చించినారు. 1 హ్యారీ. జి. జాన్సన్ (Harry. G. Johnson), ఆర్థికాభివృద్ధికి, అంతర్జాతీయవాణిజ్యానికి గల సంబంధాన్నిగూర్చి, హెరాడ్ డోమార్ (Harrod domar) ప్రదర్శించిన పద్ధతిని ఈ విషయానికి వర్తింపజేసి, ఒక గణితసూత్రం నిర్మించినాడు. అనార్జవ నిర్యాతాలవల్ల ఆర్థికాభివృద్ధిపై కలిగే ఫలితాలను ఈ సూత్రం నిర్ణయిస్తుంది. ఒక దేశంయొక్క ఉత్పాదనలోని మిగులును నిరంతరంగా ఎగుమతిచేసే విధానమేర్పడి ఉన్నట్లయితే, మిగులురేటు సంవత్సరం సంవత్సరమూ క్షీణిస్తూ, ఈ క్షీణతకు అనుగుణంగా ఆర్థికాభివృద్ధి కూడా ఇదే రేటులో క్షీణిస్తుంది,- అని ఈ సూత్రం నిశ్చయిస్తుంది. "అనుపాతీయ నిర్యాతశేషము (Proportional export surplus) కాలక్రమేణ తగ్గుతూ వస్తే, అభివృద్ధియొక్క సంతులనం రేటు (Rate of equillibrium) కాలక్రమేణా అధికమౌతూ వస్తుంది.

నిర్యాతాల అభివృద్ధిరేటు, అభివృద్ధియొక్క సంతులనం రేటును మించినట్టయితే, రెండవది కాలక్రమేణా తగ్గిపోతూ వస్తుంది." అనేవి ఆయన వాక్యాలు. మాతృభూమి ఖర్చుల విషయము, న్యాయమా కాదా అనే విషయమై ఎవరెటువంటి అభిప్రాయాన్ని కలిగి ఉన్నా, ఈ ఖర్చులవల్ల భారతీయార్థికాభివృద్ధికి హాని కలిగిందనే విషయంలో మాత్రం భేదాభిప్రాయంలేదు. నిర్యాతశేషం (Export Suplus) వల్ల, ఉత్పాదనలో మిగిల్చి, ఇతర ప్రయోజకోద్యమాలలో పెట్టుబడి పెట్టే శక్తి దేశంలో నశించింది కాబట్టి, దేశంయొక్క ఆర్థికాభ్యుదయం ఆగిపోయింది.

ఈ అభిప్రాయాన్ననుసరించి, ఇంగ్లాండుకు ఏటేటా చెల్లించే కప్పానికి, మాటిమాటికి దేశంలో చెలరేగుతున్న క్షామ పరిస్థితులకూ ప్రత్యక్ష సంబంధమున్నదని, దాదాభాయి నౌరోజీ, దత్తులు గావించిన అభియోగం నిజమని నిశ్చితమౌతుంది. మూలధనం అభివృద్ధియొక్క మందగతి పారిశ్రామికాభివృద్ధికి సంభవించిన నిరోధము,-దేశం యొక్క ద్రవ్య నిస్స్రావానికి ప్రత్యక్ష హేతువులని దాదాభాయి, నిష్కర్షగా తెలియజేసినాడు. ఆహార ధాన్యాల ఎగుమతి, తత్ఫలితంగా ఏర్పడిన ఆహారపుకొరత, ధాన్యాల అధికధరలు,-ఇవన్ని ద్రవ్య నిస్స్రావం వలని ఫలితాలని, వివరించి, దత్, ఈ ద్రవ్య నిస్స్రావం, దేశవినాశానికై ఏర్పడినదని పేర్కొన్నాడు. "ద్రవ్య నిస్స్రావం ఏవిధంగా దుస్థితిని కలిగిస్తూ ఉన్నదో పరిశీలించడం, దుఃఖకరమైనప్పటికీ, ఆవశ్యకము". అనివ్రాసినాడు. "ఇంగ్లాండుకు సంవత్సరం సంవత్సరం ప్రవహిస్తున్న ఈ ధన భారము, ఇండియా ప్రభుత్వ రాజస్వము స్వయంగా భరిస్తున్నది. ఈ రాజస్వంలోని అధిక భాగము దేశంలోని పంట పొలాల నుంచి, పన్నులరూపంలో ప్రభుత్వానికి సిద్ధిస్తుంది. దక్షిణ

భారతంలో, స్వయంగా రైతుల నుంచీ, ఉత్తర భారతంలో భూస్వాముల మూలంగానూ, ఈ పన్నుల వసూలు జరుగుతుంది. ఈ భూస్వాములు తమ రైతుల నుంచి పన్నులను, పీడించి వసూలు చేస్తున్నారు. ఈ పన్నులను చెల్లించడానికై, రైతులు తమ ధాన్యంలో అధిక భాగాన్ని అమ్మి, చాలీచాలని మిగులును తమ జీవనానికై దాచుకొంటారు. పన్నుల చెల్లింపుకై రైతులు నిర్బంధంగా అమ్మవలసి వచ్చిన ధాన్యాలను కొనడానికి, ఎగుమతి వర్తకుల ఏజెంట్లు దేశమంతా వ్యాపించి ఉన్నారు. ఇట్లా సమకూర్చిన ధాన్యాలకు రైల్వేలు శీఘ్రగతిలో రేవు పట్టణాలకుచేర్చి, ఎగుమతికి తోడ్పడతాయి. ఈ వ్యవహారాలు జరుగుతున్న చలికాలంలో, దేశపర్యటన గావించే విదేశీయులకు ప్రతి పట్టణమూ, బజారూ, వ్యాపారంతో కిటకిటలాడుతూ, గోచరిస్తుంది. పైకి ఉత్సాహంగా కనబడే ఈ ధాన్య వర్తకం వెనుక నున్న సత్యస్థితి, ఇతరులకు కానరాదు. వ్యవసాయంపై ప్రధానంగా ఆధారపడి ఉన్న దేశంలోని రైతుల గృహాలు, పల్లెలూ, దోపిడికి గురిఐనవని, ప్రజలకు తిండిగింజలు కరవై పోయిన వని, ఇదంతా ఇంగ్లాండుకు ప్రతి సంవత్సరము, చెల్లించవలసిన కప్పము డబ్బు సేకరణకై జరుగుతున్నదనీ, పరులకెట్లా తెలుస్తుంది".

విదేశ మూలధనాన్ని దిగుమతి చేసుకొన్నందుకూ, విదేశప్రభుత్వానికి లోబడి ఉన్నందుకూ ఫలితంగా, దేశం తగినంత శిక్షననుభవిస్తూ ఉన్నది. ద్రవ్య నిస్స్రావంవల్ల, మిగల్చగలిగిన సామర్థ్యము నశించింది. దానితో మూలధనం లేక పారిశ్రామికాభివృద్ధి ఆగిపోయింది. ఇంగ్లాండుకు చెల్లించవలసిన కప్పంలో ఒక భాగానికిగాను ఆహారధాన్యాల ఎగుమతి నిర్బంధమయింది. తత్ఫలితంగా, దేశం లోని జనాభాకూ, ఆహారధాన్యాల నిలువకూ ఉండవలసిన సామ్యతకు భంగం కలిగి, తిండికొరత ఏర్పడింది. కొరత ఏర్పడడంతో, ధరలు పెరిగినవి. అధిక సంఖ్యాకులై ఉన్న దరిద్రులకు తిండికరవై, క్షామపరిస్థితులు, సాంక్రామికరోగాలూ వ్యాపించినవి. పందొమ్మిదో శతాబ్దపు ఉత్తరార్ధమంతా ఇటువంటిపరిస్థితులే నెల కొని ఉన్నవి.

*వాణిజ్య నిబంధనలు :* ఇండియా సరకులకు మంచి ధరలు లభించడం వల్ల, ఈ కప్పపరుణాన్ని ఇంగ్లాండుకు చెల్లించడమేకాక, కొంత బంగారాన్ని, వెండిని, దిగుమతిచేసుకొంది కూడా. 1861-1914 వరకూ వాణిజ్య నిబంధనలు ఇండియాకు అనుకూలమై ఉండేవి. 1876 తరవాత, ప్రపంచమంతటా, వాణిజ్య నిబంధనలు, వ్యవసాయ దేశాలవిషయంలో క్లిష్టములై, పారిశ్రామిక దేశాలపట్ల అనుకూలములైనవి. ఈ పరిస్థితి అంతర్జాతీయార్థికరంగ మంతటా ప్రాబల్యం వహిస్తూ ఉన్నదని ఒక యూ. ఎస్. ఏ (U. S. A.) ప్రచురణనుబట్టి తెలుస్తుంది. ఐనా, ఇండియావిషయంలో మాత్రము, ప్రథమ ప్రపంచయుద్ధం వరకు, వాణిజ్య నిబంధనలు అనుకూలంగా ఉన్నవని ఈ క్రింది పట్టికవలన వ్యక్తమౌతుంది.

## ఇండియా నికరవస్తు వినిమయపు వ్యాపారనిబంధనలు

ఆధారం 1872 = 100

*నిబంధనలు*

| సంవత్సరము | | ఎగుమతుల సూచీసంఖ్య | సంవత్సరము | | ఎగుమతుల సూచీసంఖ్య |
|---|---|---|---|---|---|
| 1861 | — | 92.6 | 1888 | — | 106.5 |
| 1862 | — | 92.6 | 1889 | — | 114.3 |
| 1863 | — | 82.4 | 1890 | — | 114.3 |
| 1864 | — | 78.0 | 1891 | — | 122.5 |
| 1865 | — | 80.0 | 1892 | — | 131.0 |
| 1866 | — | 87.8 | 1893 | — | 126.0 |
| 1867 | — | 87.8 | 1894 | — | 131.0 |
| 1868 | — | 111.3 | 1895 | — | 127.6 |
| 1869 | — | 110.5 | 1896 | — | 124.6 |
| 1870 | — | 108.0 | 1897 | — | 144.2 |
| 1871 | — | 111.0 | 1898 | — | 127.5 |
| 1872 | — | 100.0 | 1899 | — | 115.0 |
| 1873 | — | 108.0 | 1900 | — | 129.1 |
| 1874 | — | 105.5 | 1901 | — | 120.8 |
| 1875 | — | 99.0 | 1902 | — | 131.5 |
| 1876 | — | 125.0 | 1903 | — | 117.0 |
| 1877 | — | 135.7 | 1904 | — | 111.8 |
| 1878 | — | 135.0 | 1905 | — | 120.8 |
| 1879 | — | 125.0 | 1906 | — | 133.4 |
| 1880 | — | 115.0 | 1907 | — | 125.0 |
| 1881 | — | 111.8 | 1908 | — | 142.4 |
| 1882 | — | — | 1909 | — | 134.3 |
| 1883 | — | 112.0 | 1910 | — | 116.5 |
| 1884 | — | 128.0 | 1911 | — | 120.0 |
| 1885 | — | 121.3 | 1912 | — | 124.0 |
| 1886 | — | 116.2 | 1913 | — | 131.0 |
| 1887 | — | 113.2 | 1914 | — | 140.0 |

ఎగుమతులపై నిబంధనల ననుసరించి సూచీసంఖ్య పెరుగుతూ రావడానికి చాలా కారణాలున్నాయి. ఎగుమతి సూచీ సంఖ్యను నిశ్చయించడంలో ఆధారాలుగా గ్రహించిన 28 సరకులలో, 7 ఆహారధాన్యాలకు సంబంధించినవి. ఈకాలమంతటా ఆహార ధాన్యాల ధరలు దేశంలో పెరుగుతున్నందువల్ల, దిగుమతుల ధరలకంటె, ఎగుమతుల ధరలు ఎక్కువగా పెరిగినవి. ఈ కారణంవల్ల వాణిజ్య నిబంధనలు ఇండియాకు అనుకూలించినవి. ఇది ఒక కారణము. ఇండియా, అప్పుతీసుకొనే దేశం కనుక, ప్రతి సంవత్సరమూ అధికంగా వడ్డీ మొత్తాన్ని ఇతర ఖర్చులను, అచ్చుకోవలసి ఉన్నది. అందువల్ల, విదేశబజార్లలో తన సరకుల ధరలను పెంచి ఉంచవలసి వచ్చింది. "పారిశ్రామిక దేశాలు విరివిగా అప్పులిస్తూ ఉన్నకాలంలో, వాణిజ్య నిబంధనలు, ముడి సరకులను ఉత్పత్తి గావించే దేశాలకు లాభకరంగా ఉంటాయి. అప్పులివ్వడం తగ్గితే పరిస్థితి వ్యతిరేకంగా ఉంటుంది" అని కోలిన్ క్లార్కు (Colin clark) వివరించినాడు. 1875 నుండి 1914 వరకు ఇండియాలోను ఇతర దేశాలలోను, ఇంగ్లాండు పెద్ద మొత్తాలను పెట్టుబడి పెట్టినది. ఈ మూల ధనంయొక్క ఎగుమతివల్ల వాణిజ్య నిబంధనలు ఇంగ్లాండుకు అనను కూలములై ఇంగ్లాండు వాణిజ్యం జరుపుతున్న వ్యవసాయ దేశాలకు లాభకరంగా ఏర్పడినవి.

ఇండియా నుంచి ఎగుమతి అవుతున్న సరకుల స్వభావము, ఎగుమతి మొత్తంకూర్పు, ఏటేటా దేశంనుంచి ఇంగ్లాండులోకి ప్రవాహ రూపంలో పోతున్న ద్రవ్యము,-ఇవి కారణంగా ఇండియా ఆర్థికాభివృద్ధికి విదేశ వాణిజ్యం దోహదం చేయలేకపోయింది కిండెల్ బెర్గర్ (Kindel Berger) సూచించినట్లు,- "ఎగుమతులవల్ల అభివృద్ధి కలగడం సహజమే, కాని అభివృద్ధి కలగక పోవచ్చు. వాటివల్ల అభివృద్ధి ఏర్పడవలెనంటే,-పెట్టుబడి ద్రవ్యము సమకూరడం, సాంకేతికమైన మార్పు కలగడం, మూలద్రవ్యాలను, సౌకర్యాలను, సక్రమంగా వినిధానమొనర్చడం (Allocation,) అనేవి ఆవశ్యకాలు ఇండియా విషయంలో ఇటువంటి పరిస్థితులేవీ ఏర్పడలేదు. ద్రవ్య నిస్రావంవల్ల మూల ధనాభివృద్ధి మందగించింది. ఎగుమతులలో వ్యవసాయ సరకులు ఎక్కువగా ఉండడంవల్ల, శ్రామికవర్గాన్ని, మూలధనాన్ని, వ్యవసాయానికి పరిశ్రమలకూ అనుగుణంగా వినిధానం చేయడం సాధ్యంకాలేదు. కొత్తగా ఏర్పడిన పరిశ్రమల మిల్లులలోతప్ప,- తక్కిన పరిశ్రమలలోను, వ్యవసాయంలోనూ అవలంబిస్తున్న పద్ధతులు పూర్తిగా ఆదికాలనాటివి. పందొమ్మిదవశతాబ్దంలో ఇండియాలో స్థిరపడిఉన్న సందర్భాలనుబట్టి చూస్తే,- విదేశవాణిజ్యం తక్కువై ఉన్నట్లయితే, ఆర్థికాభివృద్ధి కలిగిఉండేదని తెలుస్తుంది."

ఇండియా విదేశవాణిజ్యము విప్లవాత్మకంగా అభివృద్ధికావడంవల్ల, ఆర్థిక వ్యవస్థపై తీవ్రమైన వితరణప్రభావం ఏర్పడింది. వాణిజ్యాభివృద్ధివల్ల ఆ వర్తకులు ధనవంతులైనారు. నౌకాపరివహనము, బ్యాంకింగు, భీమా, ఎగుమతి దిగుమతి వాణిజ్యము,- ఇవన్నీ, చాలభాగం విదేశవర్తకుల అధీనంలోను, విదేశకంపెనీల

అధీనంలోను ఉండి ఉండేవి. దేశంలోని సరకులను జమచేసి, రేవుపట్టణాలకు పంపడం, రేవుపట్టణాలలో దిగుమతి అయిన వస్తువులను దేశంలో సరఫరా చేయడం,- అనే కార్యాలను నిర్వహించే ఏజెంట్లుగా మాత్రమే, దేశీయులు వ్యవహరిస్తూ వచ్చినారు. ధాన్యాన్ని జమచేసేవాడు, రుసుం ఏజెంటు, దలాలీ దారుడు, వ్యవసాయపు సరకుల వర్తకుడు, బ్యాంకరు, గ్రామీణ రుణదాత, భూస్వామి, అంగడివాడు, దిగుమతి వస్తువులను సరపరా చేసేవ్యక్తి,- వీళ్ళందరూ విదేశ వాణిజ్యాభివృద్ధివల్ల ప్రయోజనం పొందినారు. వ్యాపారవర్గంవారు ధనికులై, బలవంతులైనారు. అదేవిధంగా, గ్రామీణ పెట్టుబడిదారులు, భూస్వాములు, సంపన్నులు, బలవంతులు అయినారు. స్వయంగా వ్యవసాయం చేసే రైతులు, చేతిపనివాండ్లు,- రానురాను మరింత దారిద్ర్యానికిలోనై, క్షామాల వల్ల పదేపదే బాధపడుతూ వచ్చినారని నిరూపించడానికి వలసినంత సాక్ష్యమున్నది.

## VII. పారిశ్రామికాభివృద్ధి

ఇండియా ఇంగ్లాండులకుగల సంబంధాన్ని గూర్చిన చరిత్రలో, బ్రిటీషు ప్రభుత్వం బుద్ధిపూర్వకంగా పరిశ్రమాభివృద్ధిని అరికట్టినఘట్టము, విషాద భూయిష్ఠమైనట్టిది. భారత జనానీకంలో అధికసంఖ్యాకులకు లాభకరమైన ఉద్యోగాన్ని కల్పించి, శతాబ్దాలుగా ప్రపంచభాగాల్లో నిలువవున్న బంగారాన్ని వెండినీ, సంపాదించిన ప్రాచీన భారతీయ పరిశ్రమలు, నశించిపోయినవి. నశింపజేసిన చేతి పరిశ్రమలకు బదులుగా కొత్తపరిశ్రమలను ఏర్పరచలేదు. జపానులో జరిగిన అటువంటి ప్రయత్నానికి గూడా ప్రభుత్వం పూనుకోలేదు. ప్రాచీన వ్యవస్థలోని చేతి పరిశ్రమలకు, నూతనపారిశ్రామిక వ్యవస్థతో, సంయోజనం కలిగించింది జపాను. అటువంటిదేదీ ఇండియాలో జరపలేదు బ్రిటీషు ప్రభుత్వము.

ఇంగ్లాండులో ప్రాధిపత్యం వహించిన వర్గాలవారి స్వార్థకారణంగా, పాశ్చాత్య యాంత్రిక పరిశ్రమలను ఇండియాలో అభివృద్ధికి రానీయలేదు ప్రభుత్వము. ఇట్లు భారతీయార్థిక వ్యవస్థకు రెండువిధాలైన హానికలిగింది. పలువిధాలైన ఉద్యోగాలు, వృత్తులు ఏర్పడితేతప్ప, అత్యధికంగా పెరిగిన జనాభాకు జీవనోపాధి లభించదు. కాని, అటువంటి అవకాశాలను ప్రభుత్వం ఖండితంగా నిరోధించింది. ఎక్కువలాభాలను శీఘ్రకాలంలో సంపాదించడానికి సమర్థమైన పెట్టుబడి పరిశ్రమల ఉద్యమాన్ని ప్రభుత్వం భగ్నమొనర్చింది. మధ్యయుగ కాలాలకు సంబంధించిన దరిద్ర ఆర్థికవిధానాన్ని, అనవరతంగా విస్తరింపజేసింది. ఆర్థిక యంత్రంలో ప్రధానమైన వాణిజ్యచక్రం మాత్రము అతివేగంగా తిరుగుతూ వచ్చింది. కాని, పరిశ్రమలు దేశంలో లేకపోవడంవల్ల, వలసరాజ్యంయొక్క అధమలక్షణాలన్నీ దేశానికి సంక్రమించినవి.

పందొమ్మిదో శతాబ్ద ఉత్తరార్ధ భాగానికి చెందిన భారతదేశ ఆర్థికస్థితినంతటినీ, క్షామ విచారణ సమితి, ఒక్క వాక్యంలో క్లుప్తంగా వివరించింది.

"దేశంలోని ప్రజానీకాని కంతటికీ, కేవలం, వ్యవసాయ మొక్కటే వృత్తిగా ఏర్పడిఉండడం, దేశదురదృష్టము. ప్రజలలో సర్వ సాధారణమై ఉన్న దారి ద్ర్యానికి, క్షామపరిస్థితులలో వాళ్ళు గురిఅవుతున్న ప్రాణాపాయ పరిస్థితులకూ,- అంతటికీ మూలకారణము ఇదే. (కేవలం వ్యవసాయంపై ఆధారపడియుండడం). పరిశ్రమల స్థాపనతో కాని,- పలువిధాలైన జీవన వృత్తులను దేశమంతటా కల్పించి కాని, మిగులు జనాభాను ఈపరిశ్రమలలోకి ఆకర్షించి, వారికి జీవనోపాధి కల్గించడంకంటె వేరే, మార్గంలేదు. ప్రస్తుత దుస్థితిని రూపుమాపడానికి ఈ విధాన మొక్కటే సాధనము." అని క్షామ విచారణ సమితి తమ నివేదికలో వ్రాసియున్నారు. ఇండియాలో జరగిన వాణిజ్యాభివృద్ధివల్ల, ఇంగ్లాండులో జరిగిన విధంగా, ఇండియా పారిశ్రామికం కాలేదు. విదేశ పెట్టుబడి ద్రవ్యమంతా, రైల్వేలు, తోటలు, ఖనిజ పరిశోధన, బ్యాకింగు, భీమా, ప్రభుత్వ రుణము,- మొదలైన ఉద్యమాలకు మాత్రమే ఉపయుక్తమయింది. తేయాకు తోటల పరిశ్రమ, ఖనిజ పరిశ్రమలు, జనుము పరిశ్రమలు,-తప్ప ఇతర ఆధునిక పరిశ్రమ లేవీ ద్రవ్య సహాయాన్ని పొందలేదు. జపాను జర్మనీలలో వేగంగా జరిగిన పారి శ్రామికాభివృద్ధితో, భారతదేశ స్థితిని పోల్చి పరిశీలించి, ఇక్కడ పరిశ్రమలు వెనుకబడి ఉండటానికిగల కారణాలను, కింగ్స్లీ డేవీ, (Kingsley Davis), ఇట్లా వివరిస్తాడు.

"ఆర్థికంగా ఇండియా, సామంత రాజ్యస్థితిలో ఉన్నది. భారతదేశంపట్ల, ఇంగ్లాండు-ఇతర ప్రయోజనాలను, ఉద్దేశాలను కలిగి ఉండడమే కాక-వ్యవసాయ దేశంపట్ల పారిశ్రామిక దేశ మవలంబించే విధానాన్ని అనుసరించింది."

ప్రభుత్వము, పరిశ్రమలను పెంపొందించక పోవడానికిగల కారణాలను అతడు వివరించినాడు. దేశంలోని సాధనాలను స్వప్రయోజనార్థం ఉపయోగించు కోవడంలో విదేశీయుల ఉద్యమాలకు సౌకర్యం కల్పించి, దేశీయులకు అవకాశ మియ్యకపోవడం, ముడిసరకుల ఉపయోగాన్ని విదేశఉద్యమ కర్తలకు కల్పించి, ఉత్పత్తిదారులను బహిష్కరించడం; సైన్యానికి, పౌర వినియోగాలకు, రైల్వే లకు ఆవశ్యకాలైన సామానులను బ్రిటీషు కంపెనీల ద్వారా కొని, ఆ అవ కాశాన్ని దేశీయులకు లభింపకుండాచేయడం, చెలామణీ ద్రవ్యాన్ని తమ కను కూలంగా తారుమారుచేయడం, ఇండియాప్రయోజనాలకు విరుద్ధంగా బ్యాకింగు వ్యవస్థను నడపడం,- ఈ విషయములన్నీ పరిశ్రమాభివృద్ధికి ఆటంకాలైనవి."

1858 కి పూర్వము, ఇనుము పరిశ్రమ, నీలిమందుపంట, కాగితపు పరి శ్రమ, పట్టు ఉత్పాదన,-మొదలైన ఉద్యమాలకు కొందరు వ్యక్తులు పూనుకొని ఉన్నారు. కాని, 1858 లో జరిగిన, రాణీ ప్రకటనానంతరం, ఇవన్నీ వెనుకబడి నవి "ఇండియాలో శాంతియుతమైన పరిశ్రమలకు ప్రోద్బలం గావించడం మా అభిమతము." అని ప్రకటన ఘోషిస్తున్నది. ఈ ప్రకటనతో, విదేశీయులు, భారతీయులు కూడా పరిశ్రమలకు ధనం పెట్టుబడి పెట్టడం మానుకొన్నారు. జనాభా పెరగడంవల్లను, దేశీయములైన చేతి పనులు నశించడంవల్లను, అధిక

సంఖ్యలో, ప్రజలు జీవనోపాధికై వ్యవసాయపు పనులలో ప్రవేశించినారు. గ్రామ సీమలలో నిరుద్యోగ సమస్య తీవ్రమయింది. యూరోపుదేశాలు, అమెరికా, జపాన్,-ఇవి పారిశ్రామిక దేశాలుగా ఏర్పడి, అభ్యుదయ మార్గంలో శ్రామిక శక్తిని వ్యవసాయం నుంచి మరల్చి, పరిశ్రమలలో నియమించి, ఉండగా, ఇండియా, నిరుద్యోగీకరణ విధానానికి లోబడిపోయింది. 1881-1911 మధ్య కాలంలో, ప్రజల వృత్తి వితరణలలో గలిగిన మార్పులనుబట్టి, ఈ విషయం వ్యక్తమౌతుంది.

పట్టిక

| కార్యకారీ | 1881 | 1881 | 1891 | 1901 | 1901 |
|---|---|---|---|---|---|
| పురుషులు | 100 | 100 | 100 | 100 | 100 |
| I వ్యవసాయం, మొదలైనవి. | 74 | 74 | 74 | 75 | 76 |
| II కార్మికపు పనులు | 18 | 16 | 16 | 15 | 15 |
| III రవాణాలలో etc. | 8 | 10 | 10 | 10 | 9 |

రెండో వర్గంలో నియోగించబడిన కార్యకారీ శక్తియొక్క శాతము (1881 నుంచి 1901) కు, 18 నుంచి 15కు దిగిపోయింది. పారిశ్రామికీకరణము దేశంలో, ఎంతగా పడిపోయిందో ఇది నిరూపిస్తుంది. ఈ రెండోవర్గంలో పరిశ్రమలు మాత్రమేకాక, ఖనిజోత్పత్తి, వ్యాపారము, నిర్మాణాలు, కూడా చేరి ఉన్న వనడం గుర్తించవలసిన అంశము. వర్తకకార్యక్రమాలు ఈ కాలంలో కొంతగా అధికమయినవి. పట్టణాలు వృద్ధికావడంవల్ల నిర్మాణ కార్యక్రమాలకు కొంత ప్రోద్బలంకలిగి ఉండవచ్చు. అర్థిక విభాగాలైన పురనిర్మాణ, వర్తకవ్యవహారాలలో ఉద్యోగావకాశం కొంత అధికమై ఉంటుంది. ఈ రెండువిభాగాలలోనూ కలిగిన ఉద్యోగావకాశాలను పరిగణించినా కూడా, పరిశ్రమలలోనూ, ఖనిజోత్పత్తుల లోనూ ఏర్పడిన పరిస్థితి అతి నిరుత్సాహకరంగా ఉన్నది.

ఈ దశలో, మిల్లుపరిశ్రమలు ఏర్పడినవనడం వాస్తవమే. ప్రత్తి, జనుము మిల్లులు కొంత ముందుకు పోయినవి. ఖనిజపరిశ్రమ కూడా కొంత అభివృద్ధి చెందింది. 1905 నాటికి దూదివస్త్రాల మిల్లులలో 1,96,369 మందివ్యక్తులు జనుముమిల్లులలో 1,33,162 మందీ, పనిచేస్తూ ఉండేవాళ్ళు. ఉన్నిమిల్లులు, కాగితంమిల్లులు, తుపాకులు, మందుగుండ్లు తయారుచేసే కార్ఖానాలు, సారా భట్టీలు, దూదిజిన్నులు, దూదిప్రెస్సులు, నీలిమందుకార్ఖానాలు, జనుముప్రెస్సులు బియ్యంమరలు, రంపపుమరలు, పంచదారకార్ఖానాలు, పట్టుదారపుపరిశ్రమ, ఇత్తడి

పోతపరిశ్రమ, పెంకులకార్ఖానాలు,- మొదలైనవి చిన్నపరిశ్రమలలో పేర్కొనదగినవి. 1905లో, కార్ఖానాలలో పనిచేసే కార్మికుల మొత్తంసంఖ్య 19.2 లక్షలు ఇది మొత్తంజనాభాలో (30,కోట్లు) 1 శాతం మాత్రమే. కనుక, 1905 వరకు, పరిశ్రమలవల్ల ఏర్పడిన ఉద్యోగావకాశము, అత్యల్పమైనదని ఇందువల్ల వ్యక్తమౌతుంది.

విదేశ మూలధనంతోను, విదేశ ఉద్యమ ప్రయత్నంతోనూ ఇండియా పరిశ్రమాభివృద్ధి ప్రారంభమయింది. నీలిమందు, తేయాకు, కాఫీ పంటల పరిశ్రమలన్నీ విదేశీయుల ఆధీనమందే ఉండినవి. దేశీయులు కొందరు, దీనిలో చేరినా, వారి పెట్టుబడి భాగం పరిమితం చేయబడినందువల్ల, విదేశీయులే ప్రాబల్యం వహించి, వీటికి యజమానులై, కార్యములను నిర్వహిస్తూ వచ్చినారు. జనుము మిల్లుల విషయంలో కూడా ఈ విధంగానే జరిగింది. 1855లో జార్జ్ ఆక్లెండ్ అనే స్కాటిష్ దేశీయుడు మొదటి జనుము మిల్లును ప్రారంభించినాడు. ఖనిజ పరిశ్రమ కూడా పూర్తిగా విదేశీయులకు వశమై ఉండేది. ఈ పరిశ్రమ లన్నిటిలోనూ విదేశీయుల ఏకైక స్వామ్యాన్ని ప్రభుత్వం అనుమతించి నందువల్ల, ఈ పరిశ్రమలలో దేశీయుల పెట్టుబడికి అవకాశమే లేకపోయింది దేశీయ పెట్టుబడిదార్ల వశంలో ఉన్న పెద్ద పరిశ్రమ, దూది వస్త్ర పరిశ్రమ ఒక్కటి మాత్రమే.

1905లో, 267.8 లక్షల పౌనులు (48 కోట్ల రూపాయలు) చెల్లించిన మూలధనంతో 1494 ఉమ్మడి వాటా కంపెనీలు ఇండియాలో రిజిస్టరై ఉండేవి. ఇట్లా ఇండియాలో రిజిస్టరైన కంపెనీల మూల ధనమంతా భారతీయులదే అని వాదానికై ఒప్పుకొన్నా-(ఆధార రహితంగా ఒప్పుకోవడమే.-) కార్ఖానా పరిశ్రమలకూ, ఖనిజ పరిశ్రమలకూ సంబంధించిన భాగము 147 లక్షల పౌనులు మాత్రమే. వర్తకంలోనూ, పరిశ్రమలలోనూ, పెట్టుబడిగా ఆనాడు ఉపయుక్తమైన 35 కోట్ల పౌనుల బ్రిటీషు మూలధనంతో పోల్చిచూస్తే, అంతరం వ్యక్తమౌతుంది. బ్రిటీషువారు తమ ప్రయోజనార్థం నెలకొల్పుకొనిన ఆధునిక పరిశ్రమలలో భారత దేశీయుల మూల ధనానికి అవకాశం అత్యల్పమని గ్రహించవచ్చు

నీలిమందు, తేయాకు, కాఫీతోటలు, బొగ్గుగనులు, బంగారు, మ్యాంగనీస్‌గనులు, జనుముతయారు,- వీటిలో కార్యనిర్వహణాధికారము, పరిపాలన, సర్వస్వమూ, విదేశీయుల హస్తగతమై ఉండేవి. గుమాస్తాగిరి,- ఇత్యాది చిన్న పనులలో మాత్రమే దేశీయులు నియుక్తులైనారు. 99 శాతం మూలధనం భారత దేశానిదైనా, దూదివస్త్రపరిశ్రమ మొదటిదశలలో, మిల్లులలోని మానేజర్లు, వివిధశాఖల అధికార్లూ, ల్యాంకషైరు నుంచి వచ్చిన ఆంగ్లేయులే. 1895 సంవత్సరము,- బొంబాయిమిల్లులోని మానేజర్లు, యాంత్రిక ఇంజనీర్లు,- దూదిపకడం, దారంవడకడం, నేతనేయడం, మొదలైన పనులనిపుణులు- ఇటువంటి ఉద్యోగులలో 42.4 శాతం యూరోపియనులు. పరిశ్రమాభివృద్ధికి పూనుకొన్న ప్రథమ

దశలలో, నూతనయంత్రాలను, నూతనపద్ధతులను ప్రవేశపెట్టినప్పుడు, వాటితో పరిచయమున్న విదేశీయనిపుణులను తెచ్చుకోవడం సహజమైనదే. జపాన్, జర్మనీ వంటి స్వతంత్రదేశాలు కూడా పరిశ్రమల నారంభించిన మొదటిరోజులలో ఈ పద్ధతినే అవలంబించినవి. కాని, ఆ దేశాలలోని ప్రజలు నూతన పరిశ్రమల పద్ధతులను, అందులోని చాతుర్యాన్ని శీఘ్రకాలంలో నేర్చుకొని, పరిశ్రమనిర్వహణం అంతా తామేవహించేవారు. కాని, ఇండియాలో ఇటువంటి మార్పురాకపోవడానికి ఎంతోకాలం పట్టింది. అనవసరంగా, ఆలస్యం చేయబడింది.

ఇండియాలో నెలకొల్పిన పరిశ్రమలన్నీ కేవలం ఎగుమతి వస్తువుల ఉత్పాదనకు, విదేశ ఉద్యమ నిర్వహణకు, ప్రయోజకములైనవి మాత్రమే. నీలిమందు, తేయాకు, కాఫీ, జనుము వస్తువులకు ఇంగ్లాండులోను, ఇతర యూరోపు దేశాల్లోను గిరాకీ ఉండడంవల్ల, వాటి అభివృద్ధికి ప్రభుత్వం తోడ్పడింది. ఇండియాలో నిర్మించిన రైల్వేల ప్రయోజనార్థము, బొగ్గుగనుల పరిశ్రమ ప్రారంభించబడింది. రైల్వేల ప్రయోజనం కొరకు రైలు ఇంజను షాపులు, ఇంజనీరింగు ఉద్యమాలు స్థాపించబడినవి. కాని యంత్రాలను తయారుచేసే కర్మాగారాలు దేశంలో ఏర్పడలేదు. ప్రథమ ప్రపంచ యుద్ధం తరవాతికాలంలో కూడా, భారతదేశం సామాన్యములైన యంత్రాలకు విదేశాలపై ఆధారపడవలసి వచ్చింది. ఇనుము, ఉక్కు, పరిశ్రమలకు భారతదేశంలో, ఎక్కువ అవకాశమూ, సౌకర్యమూ, సహజసిద్ధమై ఉన్నవి. కాని, పందొమ్మిదో శతాబ్దాంతంవరకు, వీటిని నెలకొల్పడానికి కూడా ప్రభుత్వం అడ్డుపెట్టింది బెల్జియం ఉక్కు పరిశ్రమ అభివృద్ధిజెంది, ఇండియాకు ఎక్కువ మొత్తంలో ఉక్కును పంపడం జరిగేదాకా, ప్రభుత్వం ఈ విషయం పట్టించుకోలేదు. అటువంటి పరిస్థితి ఏర్పడడంతో, ప్రభుత్వ విధానమొక్క సారిగా మారిపోయింది. ప్రభుత్వపు అధీనంలో ఉన్న వరోరాబొగ్గుగనులను తీసుకొని, తాను, ఇనుమును విస్తారంగా తయారు చేస్తానని జమ్‌షెడ్‌జీ తాతా, 1882 లో, పూనుకొన్నాడు. కాని, ప్రభుత్వం దీనిని, నిరాకరించింది. కాని. 1900 నాటికి, బెల్జియం ఉక్కు దిగుమతులనల్ల, పరిస్థితి మారింది. కనుక, ఇండియా సెక్రెటరీ ఐన, హ్యామిల్టన్ (Mr.Hamilton) రాజప్రతినిధియైన కర్జన్ (Mr. Curzon),-ఇద్దరూ తాతాను ఆహ్వానించి, అతని ప్రణాళిక ప్రకారంగా ఇనుమును, ఉక్కును చేయవలసిందని అనుమతిని ఇచ్చినారు ఐనా, తాతా అయరన్-స్టీల్ కంపెనీ, మొదటిసారిగా ఇనుమును తయారుచేయడం 1911 సంవత్సరంలో. ఉక్కును ప్రథమంగా 1911 లో తయారుచేసింది.

దూది వస్త్రాల పరిశ్రమ ఒక్కటే, దేశంలో 1905కు పూర్వం, నెలకొల్పబడి అభివృద్ధికి వచ్చింది. ఇంగ్లాండునుంచి ఇండియాకు దిగుమతి అవుతున్న వస్తువులలో, వస్త్రాలకు మాత్రమే ఇండియాతో పోటీ ఏర్పడింది. ఈ పరిశ్రమకు ఇండియాలో ఉన్నంతగా అనుకూల పరిస్థితులు, సౌకర్యాలు మ్యాంచెస్టరులో లేవు. (Manchester), దేశంలోనే ఉత్పన్నమయ్యే ముడిపత్తి సిద్ధంగా ఉండడం

ఒకటి. ముడి పత్తిని ఇతర దేశాలనుంచి దిగుమతి చేసుకోవలసిన అసౌకర్యము, ఇంగ్లాండు కున్నది. ఇండియా పరిశ్రమలలో తయారైన వస్తువులు అమ్ముడు పోవడానికి తగిన విస్తారమైన బజారుకూడా ఇక్కడేఉన్నది. ఇది రెండో సౌకర్యం. పైగా, ప్రాచీనకాలంనుంచి పత్తి పండించడం దేశీయులకు సుపరిచిత మైనది నూతన పరిశ్రమ కానందువల్ల, పెట్టుబడి భంగమౌతుందన్న సంశయం లేదు కనుక, పెట్టుబడిదార్లు దీని అభివృద్ధికి ఇష్టంతో పూనుకొనినారు. అన్నిటి కంటె ముఖ్యంగా, చౌకగా లభించే శ్రామికవర్గం దేశంలో కావలసినంత ఉన్నది. ఈ సౌకర్యాలవల్ల దేశంలోని పెట్టుబడిదార్లు పూనుకొని, దూది వస్త్రాల పరిశ్ర మలను స్థాపించినారు. కాని పరిశ్రమ క్రమంగా అభివృద్ధి చెందుతూ రాగా, ఇంగ్లాండు మిల్లులకు ఈ పోటీవల్ల కలిగిన నష్టాలను ప్రభుత్వం ఇంకొకవిధంగా తొలగించి, ఇంగ్లాండు వాణిజ్యాన్ని రక్షించింది. ఇంగ్లాండునుంచి ఇండియాకు రవాణా అయ్యే వస్తువులపై వహానకులాక్కన్ని తగ్గించి, స్వేచ్ఛావాణిజ్య విధా నాన్ని ఇండియాపై నిర్బంధపరచి, ల్యాంకషైరు మిల్లుల ప్రయోజనాన్ని ప్రభుత్వం రక్షించుకొన్నది. ఇంగ్లీషు నూలుకు, ఇండియా నూలుకు, ఇండియా బజారు ధరలో 3/4 పెన్నీ మాత్రమే తేడా ఉన్నదని (1893లో), ఎ ఎల్. బౌలీ (A. L Bowley) అంచనావేసినాడు. ఐనప్పటికీ, వస్త్రముల పరిశ్రమ సమృద్ధ మైనదిగా నిలిచి, నూలు మిల్లులకూ, నేత మిల్లులకూ ప్రథమదశలో కూడా అధిక లాభాంశాలను సంపాదించి పెట్టింది.

1905కు పూర్వము అభివృద్ధికివచ్చిన ప్రతి భారీపరిశ్రమకూ, ఆర్థికవ్యవస్థకు సంబంధించిన ప్రయోజనాలు కారణాలైనవి. కాని, దేశఆర్థికాభివృద్ధి విస్తరించక, కుంఠితమై నిలిచిపోవడానికి గల కారణాలను వివరించలేము. సమాజస్వభావాలకు, రాజకీయప్రవృత్తులకూ సంబంధించిన అంశాలను పరిశీలిస్తేతప్ప, అభివృద్ధికి సదవ కాశాలు ఉండీకూడా, దేశంలో పరిశ్రమలు సక్రమంగా పెరగక, మాంద్యానికి లోనుగావడం,- అంటే 'నిరుద్యోగీకరణాన్ని',- వివరించలేము.

భారతదేశ సాంఘికవ్యవస్థ, ప్రభుత్వవిధానము దీనికి కారణాలని, నిశ్చ యించబడినవి.

ఇండియాలో యూరోపియను వాణిజ్యము అభివృద్ధికావడాన్ని అనుస రించి, దేశంలో నూతన వ్యాపారవర్గమొకటి యేర్పడి, క్రమంగా అభివృద్ధిచెంది, ప్రబలమైన సంఘంగా ఏర్పడింది. ద్రవ్యసంపాదన, ద్రవ్యసంగ్రహణము, ఈసంఘం యొక్క ఆర్థికప్రవృత్తిలో ప్రధానలక్షణాలై, యూరోపులోని వర్తకసంఘంతో వీరికి సాదృశ్యాన్ని కలిగించినవి. కాని, ఇంగ్లాండులోని నాగరీణ వర్తకుడు, నూతన యంత్రనిర్మాణా లేర్పడంతో, వర్తకాన్ని వదలి, పరిశ్రమలస్థాపనకు పూను కోవడం జరిగింది. ఇండియాలోని వర్తకుడామార్గాన్ననవలంబించక, వ్యాపారవ్యవ హారాలలోనే, నిలిచిపోయి, వడ్డీవ్యాపారము, స్థిరాస్తులనుకొనడం,- మొదలైన లాభకర కార్యాలలో నిమగ్నుడైనాడు. దేశము, పారిశ్రామికాభివృద్ధి పొందక, వెనుకబడి ఉండటానికి, మూలధనాభావం ప్రధానకారణంకాదు; ఉద్యమకర్తవ్యా

నికి పూనుకొనే సమర్థులు, సదవకాశాలు లేకపోవడం ముఖ్యకారణాలు. "పారిశ్రామిక నాయకులు దేశంలో ఉదయించక పోవడానికి, భారతీయ సమాజ వ్యవస్థలోని పరిస్థితులు అనుకూలమైనవికావు. ఇండియాలోని కర్మాగార విధానము ఇంగ్లాండులోవలెగాక, ఒక విలక్షణమైన మార్గంలో నడవడం, ఇందుకు కొంత కారణమని చెప్పవచ్చు ఆధునిక దేశాలలోని కర్మాగారాలు, రెండు వర్గాల వారి సహకారంవల్ల ఏర్పడినవి. మూల ద్రవ్యాన్ని సమకూర్చే వర్తకులు, పరిశ్రమల అనుభవంకల కార్మిక నిపుణులు,-ఉభయులూ ఏకమై, పరిశ్రమల స్థాపనకు పూనుకొంటారు. ఇండియాలోని కార్మిక నిపుణులు ఈ విధంగా కర్మాగారాలలో బాధ్యత వహించలేదు. వ్యాపారంలో అనుభవము, మూల ధనము కల భారత దేశ వర్తకులు, లాభసంపాదన కెదురుచూస్తూ ఉంటారు. కాని, శ్రామికజనాన్ని సక్రమంగా నడిపి, కర్మాగారాలను నిర్వహించే అనుభవజ్ఞానము వీరికిలేదు.

ఇండియాలో పరిశ్రమలు అభివృద్ధి చెందక, వెనకపడి ఉండటానికి కారణాలను వివరిస్తూ, పాశ్చాత్య రచయితలు, భారతీయ సమాజ వ్యవస్థలోగల లోపాన్ని ఒక ముఖ్య కారణంగా పేర్కొన్నారు. ప్రపంచాతీతమైన మత ప్రవృత్తి, గాఢమైన సంప్రదాయ దృష్టి, పూర్వాచార పరాయణత, కుల తత్త్వము, విదేశీయులతో సంపర్కంలేని ప్రత్యేకత, రాజకీయ స్థైర్యలోపము,-ఇవి ఆర్థిక పరివర్తనకు ప్రతిబంధకములైనవి; ఇప్పటికిన్నీ ప్రతిబంధకాలుగనే ఉన్నవి,-అని వేరా ఆన్‌స్టే (Vera Anstey) అభిప్రాయము. "కులతత్త్వము,-కుటుంబతత్త్వము, హిందూమతతత్త్వము ఇవి మూడూ ఏకమై, ఆధునికమార్గంలో జరుగవలసిన దేశాభివృద్ధికి పెద్ద అడ్డుగా ఏర్పడినవని," కింగ్స్‌లీడేవీ అభిప్రాయ పడినాడు.

ఈ వాదాన్ని విశ్వసించడం కష్టము. ఒక వ్యవస్థనుంచి, ఇంకొక వ్యవస్థకు సమాజం మారినప్పుడు, సంప్రదాయవాదులైన వారి వర్గం కొంత ప్రతిఘటించడం తప్పదు. అది స్వాభావికమైనదే. కాని, ఇష్టమున్నా లేకపోయినా, సమాజాన్ని నడపుతున్న ఆర్థిక రాజకీయ శక్తుల ననుసరించి, సమాజము క్రమ పరివర్తనం పొందుతూ, పర్యవసానంలో నూతన వ్యవస్థతో ఐక్యం పొందుతుంది. ఆర్థిక పరిస్థితులనుబట్టి మాత్రమే సామాజిక వ్యవస్థ ఏర్పడుతుంది అనడం సత్యానికి దగ్గరగా ఉంటుంది. తద్వ్యతిరేకమైన సిద్ధాంతం సత్యదూరము.

క్రైస్తవ మత పురోహితుల నిరోధక శక్తులున్నప్పటికీ, ప్రపంచాతీతము, విరాగము ఐన దృక్పథాలేర్పడి ఉన్నప్పటికీ, ఆర్థిక వ్యవస్థకు విరుద్ధములైన అప్పుల పద్ధతులు, న్యాయాలు, ధరనిర్ణయ నియమనాలు, వ్యాప్తమైఉన్నా, యూరోపియను జీవిత విధానాలను అణచివేయడానికి, చర్చి వ్యవస్థ ప్రోద్బల మిచ్చినా,-కూడా,-యూరోపియను జాతులు మధ్యయుగాల జీవిత వ్యవస్థనుంచి బైటపడి ఆధునిక జీవిత వ్యవస్థలో స్థిరపడి ఉండడం, ఇందుకు ప్రత్యక్ష నిదర్శనము. అవశేషాలను పూజించడం, పుణ్యజీవుల సమాధులను దర్శించడానికై

యాత్రలు గావించడం,- మొదలైన విషయాలనుబట్టి పరిశీలిస్తే, ఆ కాలపు క్రైస్తవ మతాధికారులూ, భారతదేశంలోని పూర్వ సంప్రదాయస్థులూ, ఒకే విధంగా, హేతుబద్ధంకాని, ఆచారాలను పాటించేవారని వ్యక్తమౌతుంది.

పద్దెనిమిదోశతాబ్దంలోని భారతీయ సమాజము, అనేక విషయాలలో, మధ్యయుగాల యూరోపు సమాజాన్ని పోలిఉన్నది. రెండూ, సమాజస్థ సమాజమై, వర్గాలతోకూడిన వర్గమై [సొసైటాస్ సోషియాటారం] (Societas sociatarum) ఉండేవి. సామాజిక, ఆర్థిక, వ్యవస్థలకు సంబంధించిన శక్తుల ఒత్తిడికి లోనై ఒక సమాజం భిన్నభిన్న వ్యక్తులతో కూడిన వర్గాలుగా ఏర్పడితే,- [ఇది శోచనీయమైనదని కొందరు ఆధునికుల భావము,] అటువంటి సందర్భాలకు లోబడిన ఇంకొక సమాజంకూడా అదే పరిస్థితులలో, అదే విధంగా ఏర్పడదని చెప్పలేముకదా! ఆర్థికాభివృద్ధికై ప్రయత్నించడం, ప్రకృతి సహజమైన మానవ స్వభావము. అటువంటి అభివృద్ధికి అవకాశం లభించినప్పుడు, ఈ స్వభావం కార్యరూపంలో ప్రవృత్తమై, నిరోధాలనుదాటి, కృతకృత్యం కావడం అనేది జీవన సంఘర్షణలోని ప్రధాన సూత్రము. కనుక, అభ్యుదయ నిరోధకశక్తులైన మతము, సంప్రదాయము,-ఇత్యాదుల నన్నిటినీ అధిగమించి, తన అభివృద్ధికి అనుకూలములైన సాంఘిక పరిస్థితులను ఏర్పరచుకొని, మానవ స్వభావం విజయం పొందుతుంది.

సుసంబద్ధమైన సమాజ మేర్పడడానికి, ప్రజాస్వామ్యక సమానత్వానికి, భారతదేశపు కులవిధానము కీడుగా పరిణమించిన దనడం సత్యమే. కాని, ఆర్థిక దురవస్థ కంతటికీ కులతత్త్వం కారణమనడం అత్యుక్తి. భారతజనాభాలో నాలుగోవంతు హిందువులుకారు. ఐనా, వారుకూడా హిందువులవలెనే వెనకబడి ఉన్నారు. అన్నివర్గాలవారితో పొందికతో వర్తించేది కాకపోయినా, కులతత్త్వము, ఇతరులూహించినంత బిగువైనదికాదు. కులవృత్తులను మార్చుకోవడం, ప్రతిష్ఠగలవారన్నికులాలలోనూ ఉండడం,- సర్వదా జరుగుతున్న విషయమే. ఉదాహరణకు,- వేదవాఙ్మయాధ్యయనంలో నిమగ్నులై,. పురోహిత వ్యవహారాలలో ప్రవర్తించవలసిన బ్రాహ్మణులు, వ్యవసాయము, వ్యాపారము, ఇతరులసేవ,- మొదలైనవాటిని లవలంబించడం కొత్తకాదు క్షత్రియ వైశ్య శూద్రులు కూడా ఈ విధంగానే ఇతర కులవృత్తులను అవలంబించినారు. నేతనేసేవ్యక్తి వస్త్రముల మిల్లులోచేరి పనిచేయడాన్ని కులం ఎట్లా అడ్డుపెట్టగలదో అర్థంకాదు. ఇట్లానే కమ్మరివృత్తిలో నున్నవారు ఇనుము కార్ఖానాలో చేరడం కులవిరుద్ధంకాదు. బ్యాంకర్లుగానున్న వైశ్యులు, వర్తకులు ధనం సంపాదించి కూడబెడుతున్నారు కదా ! కులమెందుకు వీరిని నిరోధించలేదు ? లాభదాయకములు, దేశప్రయోజనకరములు ఐన పరిశ్రమలలో ప్రవేశించి, తమ మూలధనాన్ని పెట్టుబడి పెట్టడంలో కులాని కెటువంటి అభ్యంతరమూలేదు.

ఇండియా పారిశ్రామికంగా వెనుకబడి ఉండటానికి, పరిశ్రమల అభివృద్ధి విషయంలో ప్రభుత్వమవలంబించిన నిరోధవిధానమే ప్రబలకారణము. ప్రభుత్వం

యొక్క దృక్పథమే ఇటువంటి విధానానికి ప్రోద్బలమయింది. ప్రభుత్వకోశానికి, ద్రవ్యచెలామణికి సంబంధించిన ప్రభుత్వ విధానాల దృష్టిఅంతా, భారతీయేతర ప్రయోజనాలపైనను, బ్రిటీషుసామ్రాజ్య ప్రయోజనాలపైనను కేంద్రీకరించ బడటం జరిగింది.

బ్రిటీషు ప్రభుత్వపు వర్తక విధానాలను, రాజకోశీయ విధానాలను తీర్చి దిద్దినది, ల్యాంకషైరు మిల్లుల వ్యవస్థ. ప్రథమ ప్రపంచయుద్ధందాకా ఈ పద్ధతే నడుస్తూవచ్చింది. యుద్ధానంతరము, ఈ విషయంలో భారతదేశానికి స్వాతంత్ర్యం లభించింది. 1870 సంవత్సరాల ప్రాంతంలో ఏర్పడిన క్షామ పరిస్థితుల కారణంగా, దేశంయొక్క ద్రవ్యపరిస్థితి మిక్కిలి క్లిష్టమైన దశను చేరుకొన్నది. ఐనా, ఇంగ్లాండు నుంచి దిగుమతి అవుతున్న వస్త్రాలపై ఆదాయపు పన్నును, ఇతర శుల్కాలను రద్దుచేయవలసిందని, ఇండియా సెక్రెటరీ, ఇండియా ప్రభుత్వాన్ని ఆదేశించినాడు. తరవాత కాలంలో, ద్రవ్యలోపకారణంగా ఇండియా ప్రభుత్వం మళ్ళీ 3½ శాతం శుల్కాన్ని వాటిపై విధించగా, ఈ శుల్కభారాన్ని తగ్గించడానికై ఇండియావస్త్రాలపై 3½ శాతం ప్రతికర శుల్కాన్ని విధించి, ప్రభుత్వం ఇంగ్లాండు మిల్లులకు రక్షణ కల్గించింది.

1865 అనంతరము, జపానులో అధికవేగంతో జరిగిన పారిశ్రామికాభివృద్ధిని, అదేకాలంలో, ఇండియాలోని, కుంఠిత పరిశ్రమల మందగతితో పోల్చి, అభివృద్ధి నిరుత్సాహకంగా ఉన్నదని, విమర్శించడం, సాధారణంగా జరుగుతూ ఉన్నది. జపానులో జరిగిన అభివృద్ధికి, ఆదేశ ప్రభుత్వ మవలంబించిన ఉదార విధానమే ముఖ్యకారణము. ఆర్థికాభివృద్ధిపట్ల ఇండియా ప్రభుత్వమవలంబించిన ఔదాసీన్యము, నిర్లక్ష్యము, ఇక్కడి దురవస్థకు హేతువులైనవి. పారిశ్రామిక ప్రదర్శనలు నెలకొల్పడం, ఇండియాలో ఉత్పన్నమైన సరకులను ఇతర దేశాలలోని ప్రదర్శనలకు నమూనాలుగా పంపడం, పరిశ్రమలకు వాణిజ్యానికి సంబంధించిన వివరాలను ఇతర ప్రదేశాలలో ప్రసారం చేయడం,-ఇవీ,-పరిశ్రమరంగంలో ప్రభుత్వ మొనర్చు చుండిన కార్యక్రమాలు. ప్రాదేశికములైన చేతిపనులను, పరిశ్రమలను, ప్రోత్సహించవలసిందని, 'మదరాసు పరిశ్రమలశాఖ' ప్రభుత్వానికొకప్పుడు సిఫార్సు చేసింది. ఇటువంటి సామాన్యములైన ప్రతిపాదనలు కూడా, ఇండియా సెక్రెటరీ ఆగ్రహానికి పాత్రములైనవి. పరిశ్రమల అభివృద్ధి విషయంలో ప్రభుత్వము తాటస్థ్య నీతిని అంగీకరించి, పాటిస్తున్నదనే మిషతో, ఈ ప్రతిపాదనను ఇంగ్లాండు ప్రభుత్వం తోసిపుచ్చింది. పరిశ్రమాభివృద్ధిలో ఇండియా వెనకబడి ఉండటానికిగల కారణాలను అన్వేషించడంలో,-రాజకీయంగా దేశానికిగల స్థానాన్ని, పరిపాలక ప్రభుత్వ మనుసరిస్తూవచ్చిన ఆర్థిక విధానాలను ప్రధానంగా గమనించవలసి ఉంటుంది.

## VIII ఇండియా ప్రతిక్రియ

ఈ ఆర్థిక విషయాలను గురించి, జరిగిన వాద ప్రతివాదాల కారణంగా

రెండు ప్రధాన పరిణామాలు కలిగినవి. భారతీయులందరూ ఒక పక్షంగా ఏర్ప డడం మొదటి పరిణామము. ప్రజాభిప్రాయం రెండు కక్షులుగా ఏర్పడింది. భారతదేశ ప్రయోజనాలకు బ్రిటీషు పరిపాలకుల ప్రయోజనాలు విరుద్ధములై ఉన్నవనే అభిప్రాయము దేశంలో వ్యాప్తిచెందినది. దేశానికి హానికరములైన ప్రభుత్వ విధానాలను విమర్శించడానికి అన్ని ప్రాంతాలలోని ప్రచారకులూ ఏకమైనారు.

పౌర సంఘాల విన్నపాలను, వాదాలను, తీర్మానాలను ప్రభుత్వం చెవి కెక్కించుకోలేదు. ప్రజాభిప్రాయాన్ని ఏ మాత్రమూ, గమనించనేలేదు. కనుక, ప్రభుత్వ వ్యవస్థలో అభ్యుదయమైన మార్పు కలిగితేనే తప్ప, తమ ఆర్థిక దుర వస్థ తొలగిపోయే అవకాశంలేదని, రాజకీయ సంస్థలు గుర్తించినవి. తత్ఫలితంగా, రాజకీయములైన హక్కులూ, బాధ్యతాయుతమైన ప్రభుత్వమూ ఏర్పడవలె ననెడి ఆందోళన దేశమంతటా బయలుదేరింది. బ్రిటీషు పరిపాలకుల దృష్టిలో 'ప్రజాభిప్రాయ'మనే పదం భారతదేశ విషయంలో అపశబ్దమని, పరిగణించబడింది. భారతీయ ప్రజ, భారతీయ జాతి అనేవి లేవనే, పరిపాలకుల దృఢాభిప్రాయము. ఇండియా అనే పదము, కేవలం, భౌగోళిక వ్యవహారానికి మాత్రమే సంబంధిం చినది. అనేకములైన మత వర్గాలు, వివిధ దేశ జాతులు, కులాలు, మొదలై నవి చేరి ఏర్పడిన సముదాయమేకాని, సాంఘిక సంయోజనము, రాజకీయై క్యతా కలిగిఉన్న దేశంకాదు,-అని,-ఇండియా పట్ల వీరి నిశ్చితాభిప్రాయము. ఇండియా ప్రభుత్వ కార్యదర్శి, వేదాంతి, యైన, మార్లే ప్రభువు (Lord Morley), 1906 ప్రాంతంలో కూడా, "ఇండియాలో నివసిస్తున్న భిన్నజాతుల ప్రజలకు, ఇంగ్లాండు రాజకీయ సంస్థలను వర్తింపజేయడం, అనే విషయము అసమంజసము, అసాధ్యము, అనూహ్యము, అని నీకు కలిగిన (మింటో ప్రభువు) అభిప్రాయానికీ, నా అభిప్రాయానికీ ఏ మాత్రమూ భేదంలేదు." అని వ్రాసి యున్నాడు.పందొమ్మిదోశతాబ్దంలోజరిగిన రాజకీయప్రజాభిప్రాయపరిణామంలో, సువ్యక్తములైన మూడు అవస్థలున్నవి బ్రిటీషుపరిపాలన దైవదత్తమైన వరమని, విద్యావంతులైన మధ్యతరగతులవారి అభిప్రాయము. ఇది ప్రథమావస్థ. గతశతాబ్ద కాలంలో లేని శాంతిభద్రతలు, న్యాయపరిపాలన, బ్రిటీషు వారిచే నెలకొల్పబడి నవి. ప్రాణధనముల భద్రతలకు, ప్రజల క్షేమాభ్యుదయాలకు, ఇవి అత్యంతావసర ములైనందువల్ల, బ్రిటీషుపరిపాలనను సమర్థించడం సబబుగా వీరికి తోచింది. విద్యా, సామాజిక, నైతికసంస్కరణలకు, ఈ పరిపాలనలో, అవకాశములేర్పడి నవి. జాతీయాభివృద్ధికి నూతనరంగము లేర్పడినవి. ఈ అవకాశాలు కల్గించిన బ్రిటీషువారు దైవసంకల్పాన్ని నిర్వహించి, ప్రాచీన భారతజాతిని ఉద్ధరించ డానికై అవతారమెత్తి వచ్చినారని, ఈ నూతనవర్గంవారు విశ్వసించినారు.

ప్రథమదశలో కలిగిన శాంతిభద్రతల భావాలు తర్వాతకాలంలో, మాయ మైనవి. అవి స్వభావసిద్ధంగా కాలంపరిణామంలో, సిద్ధించినవనే భావము ఏర్పడింది. అంతేకాక, దండనాధికారుల పరిపాలన, న్యాయాధిపతుల నిర్ణయాలు, విదేశీయ

మైన న్యాయపరిపాలన వ్యవస్థ- మొదలైనవి, బ్రిటీషువారిపట్ల మొదట్లో ఏర్ప డిన శ్లాఘనను తగ్గించివేసినవి. పాశ్చాత్యసంస్కృతి, వారి విజ్ఞానశాస్త్ర పరిజ్ఞానము, పరిపాలనవిధానంలోని కార్యకారిత్వము,- వీటితో కలిగిన పరిచయము, మొదట భారతీయులను ఆశ్చర్యచకితులను, గావించింది. ప్రత్యక్షానుభవంవల్ల, క్రమంగా ఈ ఆశ్చర్యము, తగ్గిపోయి, సహేతుకమైన నిర్ణయజ్ఞానం ఈ నూతన విద్యావంతులలో ఉదయించింది. వ్యావసాయిక అసంతుష్టివల్ల పదేపదే చెలరేగుతున్న దొమ్మికలహాలు, ఇల్‌బర్ట్ ప్రతిపాదనను నిరాకరించడం (Ilbert bill) మొదలైన రాజకీయపు అస్తవ్యస్తతలు, భ్రాంతిమూలకాలైన పూర్వభావాలు, మాయంకావడానికి తోడ్పడినవి. ఐనా, 1885 వరకూ జరిగిన రాజకీయాందోళన సర్వస్వమూ, దృఢమైన ప్రభుభక్తితో కూడుకొనే జరిగింది.

భారత జాతీయ కాంగ్రెసు స్థాపితమై, రాజకీయాందోళన, భారతదేశానికంతటికీ, సమగ్రంగా వర్తించేటట్లు చేసింది. ప్రజల దురవస్థలను బ్రిటీషుప్రభుత్వం తొలగిస్తుందనే విశ్వాసము, ప్రథమ దశలో, స్థిరంగా నిలిచి ఉండేది. ఈ విశ్వాసం భగ్నంకావడంతో, కాంగ్రెసు ఇండియాలోని ప్రభుత్వాధికారులను ఆశ్రయించడం మాని, ఇంగ్లాండులోని ప్రధాన ప్రభుత్వాన్ని ఆశ్రయించింది. భారతీయ ప్రేరణ వర్గము (Deputation) ఇంగ్లాండు వెళ్లి, ఇండియాపట్ల అభిమానులు, సుముఖులు, అని విశ్వసించిన పార్లమెంటు సభ్యులను, ఇతర నాయకులను కలుసుకొని, వారికి తమ కష్టాలను తెలుపుకొని, వారి సహకారాన్ని, అర్థించింది. పత్రికా సంస్థలను తమ ప్రయోజనాలకు సుముఖంగా చేసుకొని, భారతీయుల అభిప్రాయాలను, దృక్పథాన్ని ప్రజలలో ప్రసారం గావించడానికి ప్రచార సంఘాలను ఏర్పరచింది. ఆందోళన చరిత్రలోని ఈ అవస్థ 1905 దాకా నడిచింది.

*భారత జాతీయ కాంగ్రెసు,-ఆర్థిక అసంతృప్తి :* కాంగ్రెసు సంస్థ ఏర్పడిన ప్రథమ దశనుంచీకూడా గ్రామాల దుస్థితీ, అతి వ్యాప్తిగా ఉన్న దారిద్ర్యమూ, సంస్థదృష్టిని ఆకర్షించినవి. రెండో కాంగ్రెసు మహాసభలో,-"అసంఖ్యాకమైన ప్రజల దారిద్ర్యం అధికమవుతూ ఉండడంపట్ల, గాఢమైన సానుభూతినీ, ఈ దుస్థితివిషయమై కాంగ్రెసు సంస్థకుగల భయసంశయాలనూ," గుర్తించడం జరిగింది ప్రజాదారిద్ర్యాన్ని గూర్చిన తీర్మానము, తరవాత జరుగుతూ వచ్చిన ప్రతి మహాసభలోనూ, చేర్చడం ప్రధానాంశంగా ఏర్పడింది. బ్రిటీషువారి ఇండియా పరిపాలనపై ఆక్షేపణల కన్నిటికీ ఇది కేంద్రస్థానమయింది. 125 సంవత్సరాల బ్రిటీషుపాలన తరవాతకూడా, 40 శాతం ప్రజలకు సాధారణజీవనానికి అవసరమైన ఆహారధాన్యము సుభిక్షకాలంలోకూడా లభించడం లేదు. ఆర్థికస్థితిని ఈ గతికి తెచ్చినది బ్రిటీషువారి 125 ఏండ్ల పరిపాలన. నిరంతరమైన ఇటువంటి దరిద్రస్థితిని, ప్రజలు పస్తులతో గడిపే జీవనాన్ని, నిరూపించడం అవసరమైతే, అటువంటి నిరూపణకు కావలసిన ప్రబల సాక్ష్యాన్ని, 1857 తరవాత, తరచు ఏర్పడిన క్షామాలు, ప్రత్యక్షంగా, ప్రదర్శిస్తున్నవి. జుగుప్సాకరమైన ఈదరిద్రదుస్థితికి అనేక కారణాలను, కాంగ్రెసు సంస్థ వివరించింది. ఆ

కారణాలన్నిటిలోను,- ప్రభుత్వపు రాజస్వవిధానము, ఇండియానుంచి, 'ద్రవ్య నిస్స్రావము', దేశంలోని మూలసాధనాల, పరిశ్రమల అభివృద్ధికి ప్రభుత్వం సహాకరించకుండా, నిరోధంకల్పించడం- అనేవి ప్రధానములైనవి.

శాశ్వతపరిష్కారంలేని ప్రాంతాలలోని రైతుల దారిద్ర్యానికంతటికీ రాజస్వవిధానము కారణమై ఉన్నదని ప్రభుత్వాన్ని కాంగ్రెసు ఖండిస్తూ వచ్చింది. తాత్కాలికంగా పరిష్కారం కుదిర్చిన భూభాగంలోకూడా శాశ్వతపరిష్కారం ఏర్పడవలెనని నిర్బంధిస్తూ వచ్చింది.

దారిద్ర్యానికీ, క్షామ పరిస్థితులకూ, రైతువారీ పద్ధతే ప్రధాన హేతువని నిశ్చయిస్తూ, 1901 లో ఆర్. సి. దత్, బహిరంగ లేఖలను కర్జను ప్రభువుకు వ్రాసినాడు. ప్రభుత్వ పరిపాలనను విమర్శించడంలో, కాంగ్రెసు, రాజస్వ విధానాన్ని కేంద్రస్థానంగా చేసుకొన్నది. అసాధారణ పరిస్థితులకులోనైయున్న ప్రజానీకంయొక్క సహకారాన్ని సంపాదించుకోవడానికి, ఇంతకంటెను శ్రేష్ఠమైన మార్గంలేదు. విదేశీయ భూమిపద్ధతినీ, పన్నుల అధికభారాన్నీ విమర్శించడం వల్ల వ్యవసాయంపైననే ప్రధానంగా ఆధారపడిఉన్న అశేష ప్రజానీకము కాంగ్రెసుకు సహకరించి నిలిచింది. ప్రజానీకంయొక్క దరిద్ర దుస్థితికిగల కారణాలు క్లిష్టములైనవి. రాజస్వవిధానము, ద్రవ్యనిస్సారము అనే రెంటిని మాత్రమే ముఖ్యంగా నొక్కిచెప్పినా, సామ్రాజ్యనీతికి సంబంధించిన ఆర్థిక విధానాలన్నీ ప్రజల దుస్థితి మూలంలో ఇమిడిఉన్నవి. ప్రజల దుస్థితికిగల బాధ్యతను ప్రజానాయకులపై మోపడానికి ప్రయత్నించినాడు కర్జన్. "భూస్వాములకు రైతులిస్తున్న భాటకాన్ని పరిమితం చేసే విషయంలో, ఈ విమర్శకుల సహకారము ప్రభుత్వానికి లభించకపోవడం శోచనీయమైన విషయము. కాని, బేరీజు మొత్తంలో భూస్వామి నుంచి ప్రభుత్వానికి రావలసిన ద్రవ్యాన్ని శాశ్వత పరిష్కార మూలంగా తగ్గించవలసిందని, మాత్రం కోరుతున్నారు." ఈ విధంగా తన బాధ్యతను ప్రజానాయకులపైకి త్రోసినాడు.

*ప్రభుత్వ విత్తము (Public Finance) :* రాజస్వ సమస్య కేవలం ప్రత్యేకమైనదికాదు. ప్రభుత్వకోశము, ప్రభుత్వ విత్తము,-ఈ రెంటికీ సంబంధించిన విధాన మంతటితోనూ రాజస్వసమస్య ముడివడి ఉంది. (1) ప్రభుత్వవ్యయము, (2) పన్నుల విధింపు,-అందునా బీదవర్గంపై దాని భారము, (3) ప్రభుత్వ ఋణ భారము, దీని ఉత్పత్తి, బాధ్యత,-అన్న, ప్రభుత్వ విత్తానికి సంబంధించిన మూడు అంశాలూ, ప్రజానాయకుల పరిశీలనకు, విమర్శకు గురిఅయినవి.

*ప్రభుత్వ వ్యయము (Public Expenditure) :* ప్రభుత్వ వ్యయం తగ్గించవలసిన అవసరాన్ని గూర్చిన వాద ప్రతివాదం, మొదట ప్రారంభించినవాడు, మదరాసు గవర్నరుగా ఉన్న ట్రెవిల్యాయన్. ఇతడీ విషయంగా మూడు నిర్దేశ పత్రాలను పై అధికారులకు సమర్పించినాడు. ఈ నిర్దేశ పత్రాల కారణంగా, విల్సనుకు ట్రెవిల్యాయన్‌కు మధ్య వాద ప్రతివాదాలు జరిగి, భిన్నాభిప్రాయాలు గల రెండు కక్షలేర్పడినవి.

భారత దేశాభిప్రాయము సమస్తమూ ట్రెవిల్యాయన్ ప్రదర్శించిన దృక్పథంతో ఏకీభవించింది. ప్రభుత్వ విత్త విధానమంతా విల్సన్ ఏర్పరచిన పద్ధతుల ననుసరించి, నిర్వహించబడుతూ వచ్చింది. రాజ ప్రతినిధియొక్క కార్య నిర్వాహక సభలో విత్త సంబంధి సభ్యుడై ఉన్న విల్సన్, దేశంలోని విత్త విధానానికి అస్తిభారం వేసినాడు. దానినే అనుసరిస్తూవచ్చినవి ప్రాంతీయ ప్రభుత్వాలన్నీ.

కనుక, ఈ విధానాన్నే అనుసరిస్తూ ప్రభుత్వం వ్యయాన్ని మితంలో ఉంచడాని కెటువంటి ప్రయత్నమూ చేయలేదు. విప్లవానంతరం ఖర్చులు పెరుగుతూ వచ్చినవి. 1850-51లో 26.93 కోట్ల రూపాయలుగా ఉన్న ఖర్చు, 1860-61 నాటికి 46.92 కోట్లు, 1890-91 నాటికి 82 కోట్లు, 1904-05 నాటికి 101.47 కోట్లు,-ఈ విధంగా పెరుగుతూ వచ్చింది

ప్రభుత్వ వ్యయం ఎక్కువకావడంవల్ల దేశానికి తప్పకుండా నష్టం రావలసిన అవసరంలేదు. కాని, సామ్రాజ్య పరిపాలనకు లోనై ఉన్న ఇండియా ప్రభుత్వవ్యయాన్ని రెండు జాడ్యాలు పీడించుకొని తింటున్నవి. సైన్యము, సివిల్ పరిపాలన, అనుత్పాదక విషయాలకై చేసిన రుణాలపై వడ్డీ,-వీటికై ఎక్కువ భాగం ఖర్చవుతూ ఉంది. ఇది మొదటిది. ప్రభుత్వ వ్యయాన్ని పంచుకొనే, సైన్యసిబ్బంది, సివిల్ ఉద్యోగులు, సైన్యానికి, ప్రభుత్వ పరిపాలన శాఖలకు సామానులు సరఫరా చేసేవారు,-ప్రభుత్వ రుణపత్రాలపైనా, రక్షణ పత్రాలపైనా వడ్డీ పుచ్చుకొనేవారు,-వీరందరూ చాలవరకు, పాశ్చాత్యులు. ఇండియా ప్రభుత్వ వ్యయంనుంచి ఆదాయాన్ని పొందే వారందరూ, ఈ విధంగా, పాశ్చాత్యవ్యక్తులై ఉండగా, ఈ వ్యయానికి ధనమును పన్నులరూపంలో సమకూర్చి యిచ్చిన భారతీయులకు ఇందులో భాగంలేదు.

ఇక, ఈ విధంగా జమచేసిన ప్రభుత్వాదాయాన్ని రైల్వేలలోను, నీటి సరఫరాకు సంబంధించిన వాటిలోనూ పెట్టుబడిగా వ్యయ మొనర్చడం జరిగింది. ఈ రైల్వేల నిర్మాణం దేశంలోని ఉత్పాదనను పెంపొందించడానికై జరిగింది కాదు. ప్రధానంగా సామ్రాజ్య ప్రయోజన సాధనకై ఏర్పడినవి రైల్వేలు. రైల్వేల నిర్మాణం, పూర్తి అయ్యేదాకా వ్యవసాయ సంబంధమైన నిర్మాణాలకు పూనుకోలేదు, ప్రభుత్వము. అంతవరకూ, ఆ కార్యక్రమం నిర్లక్ష్యానికి గురిఅయింది. కనుక ప్రభుత్వ వ్యయ విషయమై, జాతీయాభిప్రాయం తీవ్రంగా విమర్శిస్తూ వచ్చింది. ఇండియా పరిపాలన, ప్రజాప్రతినిధులతో సంబంధంలేక, నిర్వహించబడుతూ ఉండడం ప్రజల ఆక్షేపణకు గురిఅయినది. ఇది రెండవ అంశము. ఈ విషయంపై ప్రభుత్వం తీవ్ర విమర్శకు గురి అవుతూ వచ్చింది.

ఆర్థిక సమస్యల విషయాలలో దేశీయుల ముఖ్య ప్రతినిధియైన దాదాభాయి నౌరోజీ, ఇండియా ప్రభుత్వ వ్యయాన్ని ప్రధానమైన ఆక్షేపణగా చేసుకొని, బ్రిటీషు ప్రభుత్వాన్ని ఎక్కువగా విమర్శించినాడు.

ఈస్ట్ఇండియా విత్త పరిస్థితిపై, బ్రిటనులోని సెలెక్టు కమిటీకి వివరణ పత్రాన్నివ్రాస్తూ(1897),- "దేశప్రజల పోషణకు చాలినంత సరకులను ఇండియా

ఉత్పత్తిచేసి తన ప్రజలు కష్టపడకుండా వారికి సరఫరాచేస్తూ, ఉత్పాదనలో ఒక భాగాన్ని ఎంతో దూరంలో ఉండే ఇంగ్లాండుకు పంపగలిగి ఉందా? ఇండియా ప్రజల సాధారణావసరాలు, జాతికి ప్రత్యేకములైన అవసరాలు, అసాధారణములైన క్షామ దురవస్థాది సందర్భాలలోని అవసరాలు ఒకవైపు తీరుస్తూ, ఇంకొకవైపు ఆహారధాన్యాలను బైటికి పంపగలశక్తి ఈనాటికైనా దేశానికేర్పడిందా? ఇండియాలోని పిల్లల ఆహారావశ్యకాలను తీర్చడానికి తగినంత ఆహారాన్ని కూడా దేశం పండించడంలేదని నాకుతెలుసును." అని వ్రాసియున్నాడు. అతడాక్షేపించింది, ప్రభుత్వవ్యయంయొక్క మొత్తాన్నికాదు. ఇండియా పరిపాలన ఇంకా సమగ్రంగాలేదని, ప్రభుత్వ వ్యయము నిజంగా మితంగానే ఉన్నా దేశ దారిద్ర్యంవల్ల అది భరించరానిదవుతున్నదనీ, డ్యూక్ ఆఫ్ డెవన్‌షైర్, సర్ విలియం హంటర్లు చెప్పినదాన్ని ఇతడు కూడా అంగీకరించినాడు. "ఇండియా ప్రజలు ఏమాత్రమూ డబ్బు సంపాదించలేకపోవడం,-అంతకంటె ఘోరంగా-లక్షలాది ప్రజలు తిండిలేకచస్తూ ఉండడం, ఆహారం కొరతవల్ల లక్షలమంది పస్తులుపడి దుర్బలులవుతూ ఉండడమూ, నిస్సారమైన ఆహారధాన్యాలను దేశం ఉత్పన్నం చేస్తూఉండడం, ఆ, ఆహారంలో కూడా ఇతరులు భాగాన్ని గ్రహించివేసి వాళ్ళని మాడ్చడం,-ఇవన్నీ ప్రస్తుత బ్రిటీషు పరిపాలనను, ప్రభుత్వ వ్యయ విధానాన్నీ, ప్రత్యక్షంగా ఖండించే పరిస్థితులు కావా?" అని అతడు ప్రశ్నించినాడు.

ఇండియా సైన్యంలోని సిబ్బంది, సివిలు సర్వీసులోని ఉద్యోగులూ, ఎక్కువగా పాశ్చాత్యులై ఉండడము, వారికిస్తూ వచ్చిన వేతనాలు అత్యధికములై, సమానయోగ్యతలుకల ఇండియనుల వేతనాలకంటె ఎన్నోరెట్లు అధికమై ఉండడం,- ఇవి ప్రభుత్వవ్యయం పెరగడానికి ప్రధానకారణాలు. "రాజకీయ సంబంధములైన ఉద్యోగులకు ఇంగ్లాండులో ఇచ్చేవేతనాలు ప్రపంచదేశాలన్నిటి కంటెను, అధికమైనవి. అటువంటి వేతనాలను ఇండియా భరించలేదు. ఇండియాలోని దేశీయవేతనాల ననుసరించి మాత్రమే ఈ ఖర్చును భరించగలదు. కాని, ప్రపంచమంతటిలోనూ ఇండియా దేశీయవేతనాలు చాలా తక్కువ." అని ఈ విషయమై విలియమ్ హంటర్ 1880 లో తెలిపినాడు.

పాశ్చాత్యులను ఇండియా ఉద్యోగాలలో నియోగించే విషయంలో మరొక ఆక్షేపణ ఉన్నది. ఇండియాలో వారున్నంతకాలమూ, వారి జీతంలోని భాగమూ, వారుద్యోగంనుంచి విరమించుకొన్న పిమ్మట, వారి ఫించనుల మొత్తమూ, ఏటేటా ఇంగ్లాండుకు పంపుతుంది, ఇండియా ప్రభుత్వము. ఇది ఇండియానుంచి జరుగుతున్న 'ద్రవ్యనిస్స్రావమని' దాదాభాయి నౌరోజీ, ఇతరులు అధిక్షేపిస్తూ వచ్చినారు. ఈస్ట్‌ఇండియా విత్తపరిస్థితినిగూర్చి, సెలెక్టు కమిటీయెదుట ఇంగ్లండులో సాక్ష్యమిస్తూ, దాదాభాయి నౌరోజీ, "పూర్వము ఇండియాపై జరిగిన పరదేశీయుల ఆక్రమణలలో, శత్రువులు దోపిడిధనాన్నీ, సంపదనూ తీసుకొని వెళ్ళిపోయినారు, లేదా, దేశంలో నిలిచిపోయి, పరిపాలకు

లైనారు. శత్రువులు పరిపాలకులుగా ఏర్పడిన సందర్భాలలో, వారిక్కడే, స్థిర నివాస మేర్పరచుకొనినారు. ఆ ప్రభువుల గుణశీలాలనుబట్టి పరిపాలన ఏవిధంగా నడిచినా, దేశంనుంచి ద్రవ్యము నిస్స్రావం కాలేదు; నైతిక నిస్స్రావంకూడా జరగలేదు. ఇంగ్లీషువారి విషయం విచిత్రమైనది. పూర్వపు విదేశప్రభువులు కసాయివారివలె దేశంలోని అక్కడిభాగాలను మాత్రమే ఖండించినారు. ఆంగ్లే యులో? శాస్త్రీయమైన తమ శస్త్రంతో దేశాన్ని హృదయపేటికవరకూ, కోసు కొనిపోయినారు. ఆ గాయం కనబడకుండా నాగరకత, అభ్యుదయము, అనే పెద్దపెద్ద మాటలతో ఆ గాయాన్ని కప్పివేసినారు. ఇండియాద్వారంవద్ద, ఆంగ్లేయులు రక్షకులవలె నిలిచి, ప్రపంచంలోని ఇతరులెవ్వరూ దోచుకొని పోకుండా చూస్తూ, తాము రక్షిస్తూ ఉండేధనాన్ని, సంపదను, తామే దొడ్డి త్రోవగుండా హరించుకొని పోతున్నారు. ఇండియా సంపదను సంగ్రహించు కొని పోవడానికి,ఆంగ్లేయులు బుద్ధిపూర్వకంగా పూనుకొని, ప్రపంచం కండ్లు కప్ప కుండా, దానికి ఉత్తమమైన వేరుమార్గాలను రచించుకొని యుండినా, ఇప్పుడు వారవలంబిస్తున్న విధానంకంటె శ్రేష్ఠమైన మార్గం వారికి లభించి ఉండేది కాదు." అని నౌరోజీ నిష్కర్షగా ప్రభుత్వాన్ని ఖండించినాడు.

అదే వివరణ పత్రంలో ఇంకొకచోట, "విద్యను, అందునా పాశ్చాత్య విద్యను ఇండియాలో ప్రవేశింప చేసినామని, ఆంగ్లేయులు గొప్పలు చెప్పు కొంటారు. చెప్పుకోవలసిందే. ఇట్లా ఒక వైపు ప్రపంచానికి చెపుతూ, ఇండి యాలో విద్యావ్యాప్తి అనేదే లేదని, తాము చేసిన ప్రగల్భాలన్నీ భ్రాంతి మూలకాలనీ, వాదిస్తారు. వారు విద్యావ్యాప్తి గావించింది నిజమైనా కావలసి ఉంది, లేదా, అబద్ధమైనా కావలసి ఉంది. వారు విద్యావ్యాప్తి గావించింది నిజమే ఐతే, ఇంతకాలం తమ పరిపాలన సాగిన తరవాతకూడా, తమ ప్రయత్నం వల్ల, తమ దేశ పరిపాలనకు యోగ్యులైన విద్యావంతులను తగిన సంఖ్యలో తయారు చేసుకోకపోవడం అనేది స్వవచన వ్యాఘాతమౌతుంది. విద్యాశాఖనే పరిశీలిద్దాము. బి.ఏ., ఎమ్.ఏ., ఎమ్.డీ.,-లుగా మమ్ము తయారు చేసినారు. కాని, మా దేశీయులకు ఆయా విషయాలను బోధించడానికి మేము అర్హులము కాము, అనే వాదము విచిత్రమైనది. ఈ వాదాని కనుగుణంగా, విద్యాశాఖలో కూడా,-ఇతర శాఖలలోవలెనే,-పాశ్చాత్యులను తెచ్చి, అవకాశమున్న ఉద్యో గాలన్నిటిలోనూ ఇరికించడం,-మేము తల యొగ్గి అంగీకరించవలసి ఉన్నది.

ఇండియా సరిహద్దులలో బ్రిటీషుసామ్రాజ్య యుద్ధాలను సాగించడానికై పెద్దమొత్తాలలో ద్రవ్యాన్ని వ్యర్థపరచిన ప్రభుత్వము, ఇండియాలో విద్య, వ్యవ సాయము, పరిశ్రమలు, మొదలైన ప్రయోజకములైన వాటికి ఖర్చుపెట్టడానికి లోభిత్వాన్ని ప్రదర్శిస్తుంది,- ఇది బ్రిటీషుప్రభుత్వంపై మోపిన మరియొక అభి యోగము.

ప్రభుత్వం వ్యయము మొత్తము, దానిని ఖర్చుపెట్టిన విధము,-రెండూ కూడా భారతీయులకు సంపద, ఉద్యోగము, విజ్ఞానము, అనేవి కలగనీయక

నిరర్థకములై పోయినవి. అంతేకాక, వారికి "అవమానకరమైన క్షీణతను, నైచ్యాన్ని తెచ్చిపెట్టి, వారిలోని పౌరుషాన్ని కూడా నలిపివేసినవి ప్రభుత్వపు ఖర్చులు."

*పన్నులు విధించడం* (Taxation) ఈ విధమైన దుబారాఖర్చుకు పూను కొన్నప్పుడు ప్రభుత్వం అత్యధికములైన పన్నులను విధించకతప్పదు. కనుక, పీడాకరము, స్వాభావిక విరుద్ధమూ ఐన పన్నుల విధానాన్ని ప్రభుత్వం ఏర్పరచి, సామాన్య ప్రజానీకంపై ఈ భారాన్ని మోపింది. పరిపాలన నిర్వహిస్తున్న బ్రిటీషు అధికారులుకూడా, ఇది నిజమని ఒప్పుకొన్నారు. ఇండియా కార్యదర్శిగా నుండిన సాలిస్‌బరీ ప్రభువు, "ప్రభుత్వపు ఆదాయపు మొత్తాన్ని ద్రవ్య విహీనమై ఉన్న గ్రామసీమల నుంచి లాగి, ద్రవ్యం అధికంగా, నిరర్థకంగా ఉన్న పట్టణ ప్రాంతాలను వదలివేయడం మితవ్యయ విధానంకాదు. ఇండియా దేశరక్తము అవసరమేఐతే, రక్తం ఘనీభవించి ఉన్న భాగాలకుగాని, లేదా, తగినంత రక్తం ఉన్న భాగాలకుగాని, ఛురికను ప్రయోగించవలెనుకాని, రక్తవిహీనములై, ఇదివరకే నీరసములై ఉన్న భాగాలకుకాదు." అని వ్రాసియున్నాడు. అదే పద్ధతిలో, రాజప్రతినిధి కార్యనిర్వాహకసభలో, విత్తవిషయక సభ్యుడైన 'ఆక్‌లండ్' శాసనసభలో మాట్లాడుతూ, "ప్రభుత్వపు భద్రతా రక్షణలను ఈ దేశంలో అధికంగా అనుభవిస్తున్న వర్గాలవారందరూ, ప్రభుత్వానికే మాత్రమూ సహాకరించనివారే. ఇది మన పరిపాలనపై యేర్పడిన గొప్పకళంకము. (మచ్చ.) దీనిని తుడిచివేయడానికి బదులుగా, ఇటీవలి సంవత్సరాలలో జరిగిన సంఘటనల వల్ల ఈ మచ్చ ఇంకా పెద్దదౌతూ వచ్చింది." అని వివరించినాడు. ఇండియాలోని పన్నుల విధానం పరావర్తన పద్ధతిలో (Regression) రూపొందడానికి ధనికులూ, మధ్యతరగతులవారూ, బాధ్యులు కారనే విషయాన్ని గుర్తించవలసి ఉంటుంది. 1878 తరవాత, ప్రభుత్వము ఇంగ్లాండు నుంచి జరిగేవస్త్రాల దిగుమతులపై అన్ని విధములైన శుల్కాలను, ఆదాయపు పన్నులను తీసివేయడానికి, స్వేచ్ఛా వాణిజ్య విధానాన్ని ఇండియాపై నిర్బంధంగారుద్దడానికి,ల్యాంకషైరు మిల్లులూ, బ్రిటీషు రాజకీయపు ప్రయోజనాలూ కారణములైనవి. ఈ రెండూ సంభవించక పోయినట్లయితే విదేశ వస్త్రాలపై విధించిన శుల్కములభారం అప్రత్యక్షంగా ఇండియాలోని ధనిక వర్గాలపై పడిఉండేది. కాని, ఇంగ్లాండులోని ఇండియా కార్యదర్శియిచ్చిన ఉత్తర్వు ప్రకారము ఇది జరగలేదు. కనుక దీని కంతకూ కారణం, ఇంగ్లాండు మిల్లుల రక్షణ ప్రయత్నము.

కనుక, ధనికుల నుంచి ద్రవ్యాన్ని లాగడానికి మార్గం ప్రత్యక్షంగా పన్నులు విధించడమే. ఇటువంటి ఆదాయపు పన్నును 1860 ప్రాంతంలో ప్రభుత్వం విధించింది. కాని, ఎందువల్లనో దానిని రద్దుచేసి, 1866 వరకు మళ్ళీ అమలులోకి తేలేదు. రైల్వేలింకా లాభదాయకములై ఉండలేదు. నీటిపారుదల నిర్మాణాలు కూడా ఇంకాను పూర్తిగా అభివృద్ధికాలేదు. అటువంటి సందర్భా లలో, భూమిపై శిస్తు, ఉప్పుపన్ను, అబ్కారీశుల్కము, (సారాయి, గంజాయి,

అపీము etc,) స్టాంపులు,-ఇవే ప్రధాన ఆదాయ మార్గాలు. వివిధములైన ఈ పన్నుల భారమంతా గ్రామీణులపై-అందునా ముఖ్యంగా బీదవర్గాలపై-పడింది.

ఇండియా ప్రభుత్వపు పన్నుల విధాన మీ విధంగా, బీదజనానికి ఎక్కువ అన్యాయం చేసింది. కనుక అమితమైన అసంతుష్టి ప్రజలలో బయలుదేరి, రాజకీయాందోళనకు ప్రధానమైన ఆధారంగా పరిణమించింది. రాజస్వవిధానాన్ని హేతుబద్ధంగావించడం, రైతు వారీప్రాంతాలలో శాశ్వతపరిష్కారాన్ని నెలకొల్పడం, తద్ద్వారా రైతులపై నిరంతరంగా అధికమవుతున్న భారాన్ని తొలగించడం, ఉప్పు పన్నును, ఉత్పాదన శుల్కాన్ని తగ్గించడం, అనేవి భారతజాతీయ కాంగ్రెసు పదేపదే తీర్మానాలరూపంలో ఒత్తిడిచేస్తున్న సంస్కరణలు. ఆదాయపు పన్ను సామర్థ్యము 1000 రూపాయలకు పెంచవలసిందని, కాంగ్రెసు 1888 లో ప్రభుత్వాన్ని కోరింది. అదేసభలో "ఉప్పుపన్ను"ను పెంచడంవల్ల బీదప్రజకు కష్టంకలిగిందని, ఈ పన్ను, శాంతిసమృద్ధికాలంలోని మిగులును హరించివేస్తున్నదని" ప్రభుత్వానికి తన యిష్టాన్ని తెలియజేసింది. రాజస్వవిషయంలో, శాశ్వత పరిష్కారాన్ని నెలకొల్పవలసిందిగా, ఐదవ మహాసభలో కాంగ్రెసు, ప్రభుత్వాన్ని ప్రార్థించింది. (1899).ఉప్పుపన్ను అధికంచేయబడినందువల్ల ప్రజలలో "అనేకములైన రోగాలు, జాడ్యాలు, వ్యాప్తిచెందినవని, అవి ఉప్పువినియోగం తక్కువ కావడంవల్ల ఏర్పడినవని ఆరోగ్యశాఖ నిర్ణయించినదని, కాంగ్రెసు 1902 లో ప్రభుత్వంపై దోషమారోపించి, దానిని 1888 లో ఉన్న పన్నుస్థాయికైనా తగ్గించవలెనని కోరింది. 1895 లో పత్తిపై విధించబడిన ఉత్పాదన శుల్కాన్ని రద్దుచేయవలసిందిగా కోరుతూ, ఆ పన్నువల్ల కలిగిన దుష్టపరిణామాలెటువంటివో వివరించింది. "నేతపరిశ్రమయొక్క స్వేచ్ఛాభివృద్ధిని నిరోధించడమేకాక, అది, దేశీయములైన ముతకగుడ్డలను వాడే బీదప్రజకు కష్టంకలిగిస్తుందని, వాటిని తయారుచేసే దేశీయపరిశ్రమదారులకు తగని అన్యాయంచేస్తున్నదని, "కాంగ్రెసు వాదించింది. 1904 డిసెంబరులో జరిగిన 20వ కాంగ్రెసు మహాసభలో, గోఖలే ప్రవేశపెట్టిన ప్రతిపాదనపై, సమగ్రమైన తీర్మానాన్ని ఆమోదించి, కాంగ్రెసు దానిని ప్రభుత్వానికి పంపింది. "కరెన్సీవిధానంవల్లను, మారకపు విధానంవల్లను సిద్ధించిన మిగులు ద్రవ్యాన్ని (a) (i) ఉప్పుపన్నును తగ్గించడం (ii) దుర్భిక్ష పరిస్థితులవల్ల రైతులు దెబ్బతిన్నప్రాంతాలలో ప్రభుత్వం రాజస్వాన్ని తగ్గించడం, (iii) దూదివస్త్రాలపై ఉత్పాదన శుల్కాన్ని రద్దుచేయడం,- ఇత్యాది పన్నుల భారాన్ని తగ్గించడమూ,- (b) అటువంటి తగ్గింపు జరగునంతవరకూ, మిగులు ద్రవ్యంలోని భాగాన్ని ప్రజలకు ప్రత్యక్షంగా ఉపకరించే ప్రయోజనాలకు వినియోగించడము,- అంటే శాస్త్రీయమార్గంలో వ్యవసాయాభివృద్ధి, తగినంత వైద్యసౌకర్యాలు,- ఇత్యాదులకు ఖర్చుపెట్టడము,- తక్కినభాగాన్ని ప్రాదేశిక, పురపాలకసంఘాలకు వినియోగించడమూ జరగవలెనని, కాంగ్రెసు తీవ్రంగా అభిలషిస్తున్నది."

ఇండియాపై బడిన సమగ్ర పన్నులభారం ప్రజలు భరించలేరని, అది ప్రజలను అణచివేస్తున్నదని, జాతీయ కాంగ్రెసునాయకులు ప్రభుత్వానికి తెలియజేసినారు. దాదాభాయినౌరోజీ తయారుచేసిన అంచనానుబట్టి 34 కోట్ల పౌనుల జాతీయాదాయంలో (1871) ప్రభుత్వం వసూలుచేసిన పన్నులమొత్తం 5 కోట్ల పౌనులు. అంటే 15 శాతం అన్నమాట. 40 షిల్లింగుల తలసరి ఆదాయంలో ఇది, 6 షిల్లింగులని తేలింది. ఇతరదేశాలతో పోల్చిచూస్తే, ఈ పన్ను తక్కువగానే కనబడుతుంది. ఉదాహరణకు, సాలుకు టర్కీలో తలసరిపన్ను 7 షిల్లింగులు 9 పెన్నీలు, రష్యాలో 12 షిల్లింగులు, 2 పెన్నీలు, స్పెయినులో 18 షిల్లింగులు 5 పెన్నీలు, ఆస్ట్రేలియాలో 19 షిల్లింగులు 7 పెన్నీలు, ఇటలీలో 17 షిల్లింగులూ,- అని మేయోప్రభువు వివరించినాడు. కాని, ఈ దేశాలతో ఇండియానుపోల్చడం భ్రాంతిమూలకము, తప్పుదారిలో పెట్టడమూ అని చెప్పక తప్పదు. విధించబడిన పన్నులు ప్రజలను అణచివేస్తున్నవా, లేదా అనటానికి, మనం పరిశీలించవలసినది, పన్నులు చెల్లించేవాని ఆదాయము. భారతదేశీయుడు తన స్వల్పఆదాయంలో 15 శాతం, పన్నులకు ఇస్తూఉండగా, ఇంగ్లాండు దేశంలోని వ్యక్తి తన కింతకంటె అధికంగా లభిస్తున్న 30 పౌనుల ఆదాయంలోనుంచి 8 శాతం మాత్రమే పన్నులకింద చెల్లిస్తున్నాడు. అదీకాక, సాలుకు 30 పౌనుల ఆదాయంలోనుంచి, 2 పౌనులు 10 షిల్లింగులు పన్నును చెల్లించడం, 40 షిల్లింగుల ఆదాయంనుంచి 6 షిల్లింగులు పన్ను చెల్లించడంకంటె భారమైనది కాదు. భారతీయునికి లభించిన 40 షిల్లింగులు సంవత్సరమంతా అతని పోషణకే చాలినది కాదు; జీవనానికి అత్యవరములైన వస్తువులకు కూడా చాలకపోగా, దానిలోనుంచి 6 షిల్లింగులు పన్ను చెల్లించడమెట్లా ?

ఇండియాకు ఎక్కువహానిని, అన్యాయాన్ని కలిగించిన విషయము ప్రభుత్వ ఆదాయాన్ని ఇండియా అభివృద్ధికి ఉపయోగించకపోవడం అనేది. ఇండియాలోని వివిధ వ్యవస్థలకు దోహదం గావించి, ఉత్పాదన అధికం గావించి, దేశాన్ని సమృద్ధంచేయడానికి బదులు ఆదాయమంతా, 'మాతృ భూమి' కర్చుల రూపంలోను, ఇంగ్లీషుపెట్టుబడిదారుల లాభాల రూపంలోను, ఇంగ్లాండుకు నిస్స్రావమైపోతూ ఉండడం' దేశానికి జరిగిన గొప్ప అపకారము. ఈ నిస్స్రావమే లేకపోయినట్లైతే దేశంలోని ఉత్పాదన సామర్థ్యం క్రమంగా అభివృద్ధిచెంది ఉండేది. దానివల్ల వ్యక్తి ఆదాయం వృద్ధిచెంది, ప్రస్తుతపుపన్నుల భారము యథాతథంగా స్థిరమయ్యే ఉన్నా, అధికాదాయాన్నిబట్టి, అది భారంగా తోచేదికాదు. కాని, జాతీయాదాయం అభివృద్ధిచెందక నిలిచిపోయి, పన్నుల భారం మాత్రం పెరుగుతూ వచ్చినప్పుడు ప్రజలీభారంవల్ల నలిగిపోకతప్పదు.

భారత ప్రభుత్వపు అధికవ్యయము, దాని కారణంగా ఏర్పడిన పన్నుల భారము, ద్రవ్య నిస్సారము,- వీటి పరిస్థితి, మదనమోహన్ మాలవ్యా వాక్యాలలో సంగ్రహంగా వ్యక్తంచేయబడింది. పదకొండో కాంగ్రెసుసభలో ఉపన్యసిస్తూ ఆయన, "గత 40 సంవత్సరాలకాలపు బ్రిటీషు పరిపాలన విషయమై న్యాయ

మైన విచారణ జరపవలసిందిగా, విద్యావంతులైన భారతీయులు-సంస్కారులు బుద్ధిమంతులైన దేశీయుల ప్రతి నిధులైనవారు,-ప్రభుత్వాన్ని ప్రార్థిస్తూనే ఉన్నారు."

"సమగ్రములైన వాస్తవ కారణాలను ఆధారంగా చేసుకొని, ప్రభుత్వ పరిపాలన విధానము ప్రజల విశ్వాసాన్ని గోల్పోయినదని మహాభియోగం ప్రభుత్వంపై మోపిఉన్నాము. అతి వ్యయంతో కూడిన అనావశ్యకమైన సివిలు సర్వీసు ఖర్చు భారాన్ని మాపై మోపడం ఒక అభియోగము. దేశ ప్రజలను పూర్తిగా నేలకు తొక్కివేస్తున్న సైన్యపు అమిత వ్యయాన్ని నిర్బంధంగా మోపడం రెండోది. భారతదేశపు ద్రవ్యాన్ని పెద్ద మొత్తంలో ఇండియా సరిహద్దుల బైట వ్యర్థపరచే ఉద్యమాలు నడపడం మూడోది. మాతృభూమి ఖర్చుల విషయంలో ఇండియాను అన్యాయం చేయడం నాల్గోది. ఇంతేకాక, ఇండియా దేశంపట్ల ప్రభుత్వం తన కర్తవ్య నిర్వహణంలో నిర్లక్ష్యభావం వహించినందువల్ల, ప్రతి దశాబ్దంలోనూ లక్షలాది జనులు కూటికి కరవై చనిపోతూ ఉన్నారు. దీని కంతకూ ప్రభుత్వం మోపిన మితంలేని పన్నుల భారము, అసమర్థమైన పరిపాలన విధానము, బాధ్యత వహించి తీరవలెనని, అభియోగాలను బాహాటంగా మోపి ఉన్నాము."

*ప్రభుత్వ రుణము:* భారత జాతీయవాదిని రెచ్చగొట్టిన ఇంకొక బాధాకరమైన అంశము, ఇండియా ప్రభుత్వ రుణము. 1860-61లో 94.56 కోట్ల రూపాయల రుణభారము, 1901-02 కాలానికి 312 కోట్లుఅయింది. ఈ భారమంతా పన్నులు చెల్లించే దేశీయులపై బడింది. దీనికి తోడుగా, అమితమైన సైన్యపు ఖర్చు, సివిల్ సేవా ఖర్చులు కూడా దేశీయులు మోయవలసి ఉన్నందువల్ల, ప్రజానీకంపై పన్నులభారం దుస్సహంగా, పడింది. ఈ విషయంలో దేశీయుల వ్యతిరేకతకు కారణమైన విషయం కేవలం ద్రవ్య వ్యయానికి సంబంధించింది కాదు. దీనికి సంబంధించిన నైతిక బాధ్యత ముఖ్యమైన కారణము. తూర్పు దేశాలను జయించడానికిగాను ఇంగ్లాండు జరిపిన యుద్ధాల మూలంగా, ఈ రుణం ఉత్పత్తిల్లి, చెల్లించే బాధ్యత భారతదేశంపై మోపబడింది. ఇండియా ఆక్రమణకై ఈస్ట్ ఇండియా కంపెనీ ఇండియాలో జరిపిన యుద్ధాల ఖర్చులు, 1857లో జరిగిన విప్లవ సందర్భంలో జరిగిన ఖర్చులు, ప్రభుత్వం ఇంగ్లాండుకు మారినప్పుడు కంపెనీ వాటాదారులకు భాగాలను వాపసు చేయడానికైన ఖర్చులు, ఆఫ్గన్ బర్మా యుద్ధాల ఖర్చులు, తత్సదృశములైన ఇతర విషయాలకు సంబంధించిన ఖర్చులు,-ఇవన్నీ ఇండియాపై రుణంగామోపి, వీటిని తీర్చడానికై ఇంగ్లాండులో రుణ పత్రాలద్వారా ద్రవ్యాన్ని సమకూర్చుకొన్నది ప్రభుత్వము. తనకేమాత్రమూ సంబంధించని ఈ రుణాల బాధ్యత ఇండియా మోయడం నైతికంగా అధర్మమని, అన్యాయమని, భారత జాతీయవాదులు వ్యతిరేకించినారు.

న్యాయశీలురైన చాలామంది ఆంగ్లేయులుకూడా ఈ విషయం అన్యాయమైనదని, ఆక్షేపించే ఉన్నారు. ఫాసెట్ (Mr. Faucett), పార్లమెంటులో

(1880) ఈ విషయమై ఒక ప్రతిపాదనగావిస్తూ, "ఇంగ్లాండు ఇండియా దేశాల ప్రయోజనార్ధమై ఆఫ్గన్ యుద్ధానికి పూనుకొన్నామని ప్రభుత్వం గావించిన ప్రకటననుబట్టి, ఈ యుద్ధాలకై జరిగిన ఖర్చును, ఇకముందు కాబోయే ఖర్చును, సమస్తమూ భారతదేశంపై మోపడము, ఆ దేశపు ఆదాయంనుంచి ఈ ఖర్చులను భరించడం, అన్యాయమని ఈ సభ, అభిప్రాయపడుతున్నది" అని అందులో పేర్కొనినాడు. అబిసీనియా యుద్ధంలో జరిగిన ఖర్చులను ఇండియా ప్రభుత్వ కోశంపై మోపే విషయాన్నిగూర్చి ప్రసంగిస్తూ, నార్త్ బ్రూక్ ప్రభువు (Lord North Brook), అబిసీనియా దండయాత్రకై జరిగిన సాధారణవ్యయమంతా భారతదేశం, చెల్లించింది. అసాధారణములైన ఖర్చులు మాత్రమే ఇంగ్లాండు భరించింది. ఇండియా సైన్యాల ఖర్చులను, ఎప్పటి ప్రకారము ఇండియాదేశమే భరించవలసిందని యుద్ధకాలంలోని ఖర్చులను ఇండియా మిగుల్చుకోవడం అన్యాయమని, ప్రభుత్వం తన విధానాన్ని సమర్థించుకొంటూ ఉంది. ఐతే, విప్లవసందర్భంలో ఇండియాకు ఆంగ్లసైన్యాలను పంపినప్పుడు, ఇంగ్లీషుప్రభుత్వం అవలంబించిన విధానమెటువంటిది? ఇందువల్ల లాభం పొందడం మాకిష్టంలేదని, ఆంగ్లసైన్యాల ఖర్చులను ఇంగ్లాండు భరించిందా? ఏమాత్రమూ లేదు. ఇంగ్లాండునుంచి పంపిన ప్రతిసైనికుని ఖర్చును, పైసాతో సహా, ఆ విప్లవకాలమంతటా, ఇండియా భరించింది. తాత్కాలికంగా మాత్రమే, ఆంగ్లసైన్యము, ఉపయుక్తమైనప్పటికీ, దానికై జరిగిన ఆ కాలపు ఖర్చునంతటినీ, ఇండియా పంపడానికి ముందు వారి శిక్షణకై జరిగిన ఖర్చునూ,- సమస్తమూ ఇండియా భరించవలసి వచ్చింది". అని వాదించినాడు.

కొందరువ్యక్తు లీవిధంగా ఆక్షేపించినా, ఇంగ్లాండులోని పెద్ద రాజకీయ పక్షాలన్నీ ఇండియాపట్ల ఒకేవిధమైన పాలకనీతి నవలంబించినవి. గ్లాడ్‌స్టన్ నిస్సంకోచంగా అంగీకరించినట్లు,-"జాతీయనీతి, సామ్రాజ్యనీతి, అని నేనిదివరలో వివరించిన బాధ్యతలను రక్షించడానికై మీరు ధనాన్ని మా అధీనమొనర్చియున్నారు. ఆ ధనాన్ని మా శక్తిసామర్థ్యాల ననుసరించి, వినియోగించే అధికారాన్ని మాకు కలిగిస్తూ ప్రతిపక్షంలోని సభ్యులు గావించిన ప్రసంగాలు సంతుష్టిని కలిగించినవి. ఇండియా సామ్రాజ్య ప్రయోజనాల విషయమై మాకు గల బాధ్యతా పరిజ్ఞానము పూర్తిగా తమ స్వత్వమై ఉన్నదని, ఈదేశంలోని ఇతర ఏ రాజకీయపక్షమూ, ఇంతవరకూ వాదించడం జరగలేదు. ఇతర ఏ రాజకీయపక్షవాదియైనా, ప్రభుత్వపక్షంవారికంటె తమ పక్షంవారికే, ఈ విషయంలో ఎక్కువ బాధ్యతకలదని వాదిస్తే, ఆ వాదము, నైతికంగా దుర్జనత్వము, రాజకీయంగా అవివేకము, అని నా అభిప్రాయము. పార్లమెంటులోని అన్ని పక్షాలవారు కలిసి, ఏకంగా, అనుసరిస్తున్నది, సామ్రాజ్యనీతి." (అని గ్రహించడం అవసరము.)

పరిస్థితు లీవిధంగా ఉన్నప్పుడు, ఇంగ్లాండు ఇండియాలమధ్య ఏర్పడిన ద్రవ్య సమస్యలు న్యాయంగా పరిష్కారమౌతాయని ఆశించడం వ్యర్థము. పైన వివరించిన ఖర్చుల భారాన్ని, ఋణాలభారాన్ని ఇండియాపై మోపడం

అన్యాయమనే విషయాన్ని ప్రదర్శిస్తూ, ధర్మాన్ని, న్యాయాన్ని, బట్టి, వీటిని సామ్రాజ్యప్రభుత్వం వహించడమే సమంజసమని, భారతదేశ ప్రజానాయకులు గట్టిగా వాదించినారు. అంతేకాక, ప్రస్తుతము ప్రభుత్వమవలంబిస్తున్నవిధానంవల్ల అపాయకరములైన దుష్టపరిణామాలు ఏర్పడవచ్చునని కూడా హెచ్చరించినారు. 1867 నాడే, దాదాభాయి నౌరోజీ బ్రిటీషువారికి ఈ క్రిందివిధంగా, నిష్కర్ష మైన మాటలలో, పరిస్థితు లెట్టివో వివరించినాడు. "అసంతుష్టులై యున్న 20 కోట్ల ప్రజలకూ, నూరువేల తుపాకులకూ మధ్య, సంఘర్షణమే ఏర్పడితే, దాని తుదిపరిణామమెట్లా ఉంటుందో తెలియజేయడానికి ఏ భావికాలజ్ఞుడూ, అవసరం లేదు. ఒక నీటి బిందువు అత్యల్పమైనదే; కాని అటువంటి బిందువులతో ఏర్పడిన జలప్రపాతవేగము, సమస్తాన్నీ తనతో తీసుకొనిపోకతప్పదు. ఏ జాతికూడా శీఘ్రంగా సంతుష్టం కాదు. అసంతుష్టిమై ఉన్నజాతి వందసార్లు అపజయంతో పడిపోవచ్చు. కాని మరీ చైతన్యాన్ని పుంజుకొని లేచి, నిలబడవచ్చు. కానీ, పరదేశీయులకు ఒకటి రెండు అపజయాలు జరిగినా అవి వారికి ప్రాణాంతకాలే అవుతాయి. దేశీయులకు జరిగిన ప్రతిపరాజయమూ వారికి అధికభారాన్ని కలిగిస్తూ,- పరప్రభుత్వ దాస్యాన్ని తొలగించుకోవలెననే ఉత్కంఠను మరింత వృద్ధిగావిస్తుంది." ఇవి దాదాభాయి నౌరోజీ వాక్యాలు. ఆయనే ముప్పై సంవత్సరాల తర్వాత, వెల్బీకమిషన్‌కు తన వివరణపత్రాన్ని పంపుతూ, ఆగ్రహంతో, ఈ క్రింది విధంగా తన భావాన్ని వెలిబుచ్చినాడు. "ఇండియాలో ప్రబలాధిపత్యాన్ని ప్రవర్తింపచేస్తూ ఉన్న అల్పసంఖ్యాకులైన ఆంగ్లేయుల మహాత్తమస్థితిని నిలబెట్టడానికి, జరిగే ఖర్చులో ప్రతిపైసా భారతదేశీయు లిచ్చుకోవలసి ఉన్నది. కాని, ఆ పైసా ఎట్లా ఖర్చవుతూ ఉన్నదన్న విషయాన్ని అడిగేహక్కు భారతీయునికి లేదు. బ్రిటీషు పరిపాలనలో ప్రజలందరికీ సమానమైన పౌరత్వాన్ని సిద్ధింపజేస్తామని ప్రభుత్వంగావించిన వాగ్దానంలోనిభావమూ, అర్థమూ, కూడా అక్షరాలా భగ్నమై పోవడంచూస్తున్నాము. ఎందుకీ విధంగా జరిగింది ?

సాలిస్‌బరీ ప్రభువు వివరించినట్లుగా, బ్రిటీషువారికి ప్రభుత్వమూ, మర తుపాకులూ ఉండడమే ఇందుకు కారణమా? లేక, ఇండియా విషయమై గ్లాడ్‌స్టన్ చెప్పినట్లుగా 'మాచేతనున్న బలము, లేక దాని ప్రయోగము, అనేవే న్యాయమూ, న్యాయ సమర్థనమూ',-అన్న మీ నిర్ణయం కారణమా? చర్చనీయాంశమైన 'ఖర్చులను' న్యాయంగా వితరణగావించి, భారతదేశానికి జరిగిన, జరుగుతున్న, ఘోరమైన ఈ అన్యాయాన్ని పరిహరించడం మీ కమిటీయొక్క ముఖ్య కర్తవ్యము."

"భారతీయులు అనాగరకులైన ఆఫ్రికను జాతుల వంటివారని, లేక, చిన్న పిల్లలనీ మీ బ్రిటీషు ఇండియా అధిపతులు, నిజంగా భావిస్తున్నారా? బ్రిటీషు వారు సంస్కార విహీనులై యున్ననాడే,- రెండువేలేండ్ల సంస్కారంతో నుండిన వారు భారతీయులు. పవిత్రులైన బ్రిటిషువారినుంచి పాశ్చాత్య విద్యనంది

'విద్యా సంస్కారాలుగల పెద్దమనుష్యులని' డఫెరిన్ ప్రశంసలకు పాత్రులైన పిమ్మట కూడా భారతీయులు తమ శోచనీయావస్థను, తమ అవమానకరమైన దశను, తమకు కలుగుతున్న ఆర్థిక వినాశాన్ని గ్రహించి, అర్థం చేసుకోలేకున్నారని, బ్రిటీషు అధిపతులు అభిప్రాయపడుతున్నారా? లేక బ్రిటీషు పరిపాలనలో ఇండియా ప్రజలు శాంతి భద్రతలతో సుఖంగా ఉన్నారని ఇంగ్లాండు ప్రజలను మీరు నమ్మిస్తున్నంతకాలమూ, నిజస్థితిని భారతీయులు గ్రహించినా నష్టంలేదని భావిస్తున్నారా?"

## IX కరెన్సీ సమస్య

అధికస్థాయిలో ఉన్న పన్నులతోను, మాతృభూమి ఖర్చులతోను సంబంధించిన కరెన్సీ సమస్యకూడా భారతీయులకు ఎక్కువ నష్టకష్టాలను కలిగించింది. అంతర్జాతీయ ద్రవ్యరంగంలో సంభవించిన పరిస్థితులవల్ల, వెండి బంగారాలకు పరస్పరంగల విలువ 1873 నుంచి తగ్గుతూవచ్చింది. ఆ కాలంలో రూపాయలను ముద్రించుకోవడంలో స్వేచ్ఛ ఉండినందువల్లను, రూపాయ నాణెము ప్రమాణద్రవ్యమై ఉన్నందువల్లను, వెండి వెల తగ్గిపోవడంతో, స్టెర్లింగుతో రూపాయకుగల విలువకూడా తగ్గింది. రూపాయి-స్టెర్లింగు మారకం రేటు 1 షిల్లింగు 10 3/4 పెన్నీలనుంచి, 1 షి. 5 పె. లకు 1874-91 కాలంలో తగ్గిపోయింది. దీనివల్ల ప్రభుత్వానికి చాలా ఇబ్బందులు కలిగినవి. మారకపు రేటు తగ్గడంవల్ల, తాము ఇంగ్లాండుకు పంపుతూవచ్చిన వేతన భాగంలో నష్టం కలిగిందని, ఆ నష్టాన్ని పూర్తిచేయడానికై పూరకభత్తాలు ఇవ్వవలసిందని, ఇండియాలోని బ్రిటీషుద్యోగులు, మిలిటరీ సిబ్బంది, ఒత్తిడి పెట్టసాగినారు. మారకం రేటు పడిన కొద్దీ మాతృభూమి ఖర్చులకై చెల్లించవలసిన ద్రవ్యంకూడా ఎక్కువవుతూ వచ్చింది. ఇందువల్ల, ప్రభుత్వానికి విత్తసంబంధమైన క్లిష్టత ఏర్పడడమేకాక, బడ్జెటు తయారుచేయడం విదేశీ ద్రవ్యమారకానికి సంబంధించిన ఊహాపోహాల కార్యంగా ఏర్పడింది ఇతర దేశాలు బంగారాన్ని ఆధారంగా చేసుకోక, ద్విధాతుమానం (Bimetallism) అవలంబిస్తే ఈ చిక్కులు విడిపోతాయని నిశ్చయించి, నాలుగు అంతర్జాతీయ సమావేశాలు జరిగినవి. కాని, ఇంగ్లాండు, సువర్ణ ప్రమాణాన్ని (Gold Standard) విడిచి పెట్టడాని కిష్టపడనందువల్ల, ఈ సమావేశాలలో ఏకాభిప్రాయం సిద్ధించలేదు. 1892లో జరిగిన బ్రసెల్సు సమావేశం విఫలం కావడంతో ప్రభుత్వం, రూపాయి మారకపురేటు తగ్గుతున్న సమస్యను పరిశీలించి, తన్నివారణోపాయాలను సూచించడానికై, హెర్షెల్ అధ్యక్షతలో ఒక సమితిని ఏర్పాటు చేసింది. ఇండియాలోని టంకశాలలను మూసివేసి, రూపాయలను ఇతరులు ముద్రించటం ఆపివేసి, దేశంలో రూపాయి నాణెముల సంఖ్య తగ్గించవలసిందని, అట్లా, కృతకంగా రూపాయల సంఖ్య తగ్గిపోవడంతో, రూపాయి విలువను 1 షిల్లింగు 4 పెన్నీలకు పెంచవలసిందని, ప్రభుత్వం ఈ వెలకు రూపాయలను విడుదలచేస్తూ, తాను మాత్రం ఈ వెలకు

కొనగూడదని, హెర్షెలు సమితి సలహా ఇచ్చింది. స్టెర్లింగుతో రూపాయి రేటు 1 షి. 4 పె.లకు పెరిగి స్థిరపడిన తరవాత, శాశ్వత ద్రవ్య ప్రమాణాన్ని నిశ్చయించడానికై మరి సమితినిగాని లేక కమిషనును కాని ఏర్పరచవలసిందని కూడా హెర్షెలు సమితి సూచించింది. ఈ సిఫార్సులను ప్రభుత్వ మంగీకరించి, 1893లో దేశంలోని టంకశాలలన్నిటినీ మూసివేసింది. 1898 నాటికి, తామనుకొన్న ప్రయోజనం సిద్ధించి రూపాయి రేటు 1 షి. 4పెం.ను పెరిగింది. హెర్షెలు సమితి సలహా ననుసరించి, సర్ హెన్రీఫౌలర్ అధ్యక్షతలో, ఇంకొక కరెన్సీ కమిషనును ప్రభుత్వం ఏర్పరచింది. సువర్ణ ప్రమాణాన్ని భారతదేశంకూడా అవలంబించవలసిందని ఈ కమిషన్ సలహాఇచ్చింది. కాని, ఇండియా ప్రభుత్వం బంగారు మారకపు ప్రమాణాన్ని అంగీకరించింది. సువర్ణ ప్రమాణాన్ని అంగీకరించక పోవడానికిగల కారణాలను చర్చించనవసరం లేదు.

ద్రవ్యసంబంధమైన ఈ విషయంలో, కాంగ్రెసు రెండు ముఖ్యములైన అంశాలపై ఆందోళన సాగించింది. (1) మారకపురేటు తగ్గినందువల్ల, యూరోపియనులకు పూరకభత్యాలను ఇచ్చే పద్ధతిని కాంగ్రెసు వ్యతిరేకించింది. (2) రూపాయిని పరదేశపు కరెన్సీ అయిన స్టెర్లింగుతో లంకెవేయడంవల్ల రూపాయికిగల స్వేచ్ఛాప్రతిష్ఠలు తగ్గిపోవడం, దేశానికి శ్రేయస్కరంకాదని, కాంగ్రెసు ఈ పద్ధతికి అడ్డు చెప్పింది. 1893 డిసెంబరులో జరిగిన తొమ్మిదో మహాసభలో, ఈ విషయమై రెండు తీర్మానాలు కాంగ్రెసు అంగీకరించింది. "వ్యక్తులు వెండిరూపాయలను ముద్రించుకొనే స్వేచ్ఛను నిరోధిస్తూ ప్రభుత్వం తొందరపడి గావించిన శాసనంవల్ల టంకసాలలు మూతపడి, ప్రజల పన్నులభారము అప్రత్యక్షమార్గంలో, అధికమయింది. ఈభారం అధికమూ, అనిశ్చితస్వభావమూ కలది. ముఖ్యములైన వ్యాపారాలూ, పరిశ్రమలూ,- అందునూ ప్రధానంగా మిల్లుపరిశ్రమలు,- అవ్యవస్థకు లోనై నష్టానికి గురియైనవి." అని XIV తీర్మానం ప్రకటించింది. దేశంలోని విత్తపరిస్థితి అసంతృప్తికరంగా ఉండి, దేశం ఇంకా అధికమైన పన్నులకు గురి అయ్యే సందర్భమేర్పడి ఉండగా, భారతదేశ నివాసులుకాని యూరోపియనులకు ఇస్తూఉన్న మారకభత్యాలు, సాలుకుకోటి రూపాయలకు పైబడి ఉండడము, బ్యాంకులకిస్తున్న పూరకద్రవ్యము 181,000 పౌనుల మొత్తమై ఉండడము,- అనే విధానాలు దేశక్షేమానికి భంగకారులని కాంగ్రెసు ఆక్షేపిస్తున్నది." అని XV తీర్మానము ప్రకటించింది.

వెండి ప్రమాణానికి బదులుగా సువర్ణప్రమాణాన్ని ప్రవేశపెట్టే ప్రభుత్వ ప్రయత్నాన్ని కాంగ్రెసు 1899 సంవత్సరం తీర్మానంతో ఆక్షేపించింది. టంకసాలల మూసివేతను ఆక్షేపిస్తూ, 1901 లో మళ్ళీ ఇంకోతీర్మానం జేసింది, కాంగ్రెసు.

అయినా, కరెన్సీలో జరిగిన ఈ సంస్కరణంవల్ల ప్రభుత్వపు విత్త పరిస్థితి బాగుపడింది. ఇంగ్లాండుకు ప్రతిసంవత్సరము చెల్లించవలసిన వడ్డీలు,- ఇతరఖర్చులు [రూపాయి మారకపురేటు అధికమైన కారణంగా] తగ్గినందువల్ల ఇండియా

కోశానికి లాభంకలిగి, విత్తపరిస్థితి బాగుపడింది. ఐనా, కాంగ్రెసు ఈ సంస్కరణ లను వ్యతిరేకిస్తూ వచ్చింది. "కృతకంగా రూపాయివిలువను 30 శాతం పెంచడం వల్ల, అన్ని పన్నులూ, పరోక్షమార్గంలో 30 శాతం అధికమైనవని, అందువల్ల ప్రభుత్వానికి ఏటేటా ద్రవ్యం మిగులుతూ ఉన్నా, దేశసరకులను, వస్తువులను ఉత్పాదనచేసే రైతులు, ఇతరులు దీనివల్ల నష్టపడుతున్నారని" కాంగ్రెసు ఆక్షే పించింది. ఈ ప్రశ్నపై మొదటి ప్రపంచయుద్ధం తర్వాతకూడా, ఆర్థికశాస్త్ర వేత్తలూ లోకలేఖకులూ (Publicists) చర్చలు సాగిస్తూ వచ్చినారు.

## X పరిణామము

ఇంగ్లాండు ప్రభుత్వం స్వయంగా భారతదేశ పరిపాలనను నిర్వహించిన మొదటి 50 సంవత్సరాలకాలంలో (1858-1905) దేశంలో కొన్ని మార్పులు జరిగినవి. సంచారరవాణా మార్గాలు విస్తరించడం, విదేశ వాణిజ్యం ఎక్కు వగా అభివృద్ధిపొందడం, భారతీయార్థిక వ్యవస్థ ఆధునికం కావడం,-అనేవి ముఖ్య ములైన పరివర్తనములు. అంతర్జాతీయవాణిజ్యావర్తంలో ఇండియాకూడా ప్రవేశించి ప్రధానములైన వాణిజ్య సంస్థలలో ఒకటిగా గుర్తించబడింది. ఆధునిక పరిశ్రమలూ, ఖనిజ పరిశ్రమా ఇండియాలో ఏర్పడినవి. జనుము, పత్తి, పరిశ్ర మలు,-బొగ్గు గనులు, మ్యాంగనీసు, మైకాపరిశ్రమలు,-గణనీయమైన అభి వృద్ధిగాంచినవి. స్వదేశీ ఉద్యమాన్ని కాంగ్రెసు ప్రారంభించి, దానికై ఆందో ళన జరుపుతున్న సమయానికే, ఆధునిక ఉక్కు పరిశ్రమ స్థాపనకై తాతా పూనుకొని, ప్రయత్నం ప్రారంభించడం జరిగింది ఆర్థిక పరివర్తనల కారణంగా, వ్యాపార వర్గాల వారు, జమీందార్లు, వడ్డీ వ్యాపారస్థులు, పైకివచ్చి, తమ స్థానాన్ని బలపరచుకొనినారు. ధరలు పెరిగి, వాటితో, లాభాలు పెరిగినవి. తత్ఫలితంగా దేశంలోని పెట్టుబడిదారీ వ్యవస్థ యూరోపియను పద్ధతిపై వ్యాపారవిధానాభివృద్ధికి పూనుకొన్నది. ఉమ్మడి వాటా కంపెనీల సంఖ్యా, పెట్టుబడి మొత్తమూ అధికమౌతూ వచ్చినవి.

ఇటువంటి అభ్యుదయం జరుగుతున్న కాలంలో కూడా దేశంలో, వరసగా సంభవించిన అనర్థాలకు లోనై, లక్షలాది ప్రజలు తిండికి లేక మరణించడం జరి గింది. ఈ కాలంలో, చాలభాగం, ప్రభుత్వపు విత్త పరిస్థితి అసంతృప్తికరమై ఉన్నందువల్ల, ఎక్కువగా పన్నులను విధించడమూ, రుణం చేయడమూ, సంభ వించినవి. అతి భారమైన పన్నులవల్ల కలిగిన ఆర్థికదుస్థితి, దేశీయములైన చేతి పనులు నశించడం, సివిల్, మిలిటరీ సేవలలో పాశ్చాత్యులు ప్రబలులై ఉన్నందు వల్ల, దేశీయులకు ఉద్యోగావకాశాలు, కొరతపడి నిరుద్యోగ పరిస్థితి ఏర్పడడం,- మొదలైనవన్నీ ప్రజలలో అధికంగా అసంతుష్టిని కలిగించినవి.

బ్రిటీషు పరిపాలనపట్ల వైమనస్యము, విరోధము కలిగించిన కారణా లనేకము లుండినవి. కాని, వాటిలో, ఆర్థిక అసంతుష్టి, ప్రజలదుస్థితి ప్రధానము లైనవి. బ్రిటీషు వారవలంబించిన వలసరాజ్య ఆర్థికనీతి, బ్రిటీషువారి ప్రయోజనా

లను పెంపొందించిందేకాని, పారిశ్రామికంగా దేశమభివృద్ధికి రాకుండా ఆదిలోనే భగ్నం గావించింది. అదే సమయంలో జరిగిన పాశ్చాత్య విజ్ఞానవ్యాప్తి, ఆధునిక రాజకీయ భావవ్యాప్తి, ఆధునిక విజ్ఞానశాస్త్ర సాంకేతికశాస్త్రాల అభివృద్ధి, మధ్యతరగతివారి అభివృద్ధి,- ఇవి అన్నీ, రాజకీయ విప్లవానికి తగినపరిస్థితిని, దాని నిర్వహణకు తగిన సంస్థను సిద్ధము గావించినవి. స్వాతంత్ర్యము, సమానత్వము, "ప్రాతినిధ్యంలేకపోతే పన్నులు లేవు",- అని ఇంగ్లీషు అభ్యుదయ వాదులనుంచి గ్రహించిన భావాలకు, వలసరాజ్యస్థాపనలో అవకాశం కలుగలేదు భారత సమాజంపై బ్రిటీషువారి ఆఘాతపరిణామంగా ఉత్పన్నమైనది భారత జాతీయకాంగ్రెసు దేశంలోని ప్రజాదారిద్ర్యము, దానికి చైతన్యవంతమైన ప్రోద్బలం కలిగించి, అసంతుష్టిని పెంపొందించింది.

ఈ దారిద్ర్యానికి, అణగద్రొక్కుతున్న పన్నులభారానికి, నిరర్థకమైన అమితవ్యయానికి, ద్రవ్యనిస్రావానికి,- అంతటికీ మూలమైనది అస్వాతంత్ర్యత. స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు లేని, అధీనరాజ్యం కావడంవల్లనే ఈ విపరీత పరిస్థితులన్నీ, ఒకటి తరవాత ఒకటి ఏర్పడుతూ వచ్చినవి.

పదిహేడోకాంగ్రెసుసభ, అధ్యక్షోపన్యాసంలో డి ఎన్. వాచా, "పరిపాలన వ్యవస్థలో కార్యనిర్వాహకులను ఎన్నుకొనే స్వాతంత్ర్యము ఇండియాకు లేదు. అటువంటి స్వాతంత్ర్యమే ఉండిఉన్నట్లయితే, పరిపాలన విధానంలోని వాళ్ళందరూ దేశీయులై, దేశంలో నివసిస్తూ, తమ సంపాదనను దేశంలో వ్యయం చేస్తూ ఉండేవారనడంలో సందేహమేమున్నది?" అని ప్రశ్నించినాడు.

విదేశ పరిపాలన, ఇండియాలో బ్రిటీషువారు నెలకొల్పిన పరిపాలన వ్యవస్థ,-ఇవి,-ఇండియా దరిద్రస్థితికి దిగజారడానికి మూల హేతువులు,-అనే సత్యాన్ని ఇండియా ఆర్థిక వ్యవస్థయొక్క విశ్లేషణ పరిశీలనవల్ల సుస్పష్టంగా తెలుసుకోవచ్చు. ప్రభుత్వ స్వభావంలో అభ్యుదయాత్మకమైన పరివర్తనం కలిగితేనే తప్ప, ప్రజల ఆర్థికస్థితి బాగుపడే ఆశలేదు. కనుక, ప్రభుత్వం మారడానికి, ప్రజాప్రాతినిధ్యం కలిగిన బాధ్యతాయుత ప్రభుత్వం ఏర్పడటమేమార్గము. రాజకీయాధికారం బ్రిటీషువారినుంచి, భారతీయుల హస్తగతం కావడానికి ప్రజలు ఆందోళన జరుపక తప్పదు. ఆర్థిక సమస్యలు ప్రధానములు, అత్యవసరములు, శీఘ్రంగా సాధింపవలసినవే. అయినా, భారతదేశానికి స్వాధికార పరిపాలన సిద్ధించేటంతవరకూ ఈ సమస్యలు పరిష్కార సాధ్యములుకావు.

# 8
# ముస్లిము రాజకీయ భావప్రవృత్తులు (1857-1905)

## 1. 1857 నాటి విప్లవానికి ముస్లిముల ప్రతిక్రియ

1857 నాటి విప్లవంతో. భారతదేశ ఉన్నతవర్గాలవారి ఉత్కాంఠలన్నీ భగ్నములై పోయినవి. ఇదివరలో గోల్పోయిన రాజ్యభాగాలనూ, అధికారాన్నీ సంపాదించుకొనే ఆశలన్నీ అడుగంటినవి. విప్లవానంతరము బ్రిటీషువారి ద్వేషానికి ఎక్కువగా గురియైన ముస్లిములు, విప్లవానంతర పరిణామాలవల్ల ఎక్కువ కష్ట పడవలసి వచ్చింది. విప్లవం చెలరేగిన ప్రాంతాల్లోని ముస్లిము నాయకుల కుటుంబాలన్నీ మూలమట్టంగా పెకలింపబడినవి. వారి భూములు, ఆస్తులు, బ్రిటీషు వారి పాలై పోయినవి. సంపాదించి పోషించే రక్షకులు అతి దరిద్రులై పోయిరి. ప్రభుత్వాదరానికి వెలియైనందున యువకుల భావిజీవితం శూన్యమయింది. సంఘము అంధకారావృతమై, భవిష్యత్తులో కీడు తప్ప, ఇతరమేదీ గోచరించ లేదు.

1857 విప్లవం తరువాత, "ముస్లిములు నిజంగా తమకు శత్రువులని, తమ ప్రతికక్షులని భావించి, బ్రిటీషువారు తమ ఆగ్రహమంతా వారిపై చూపు తూవచ్చిరి కనుక, విప్లవం విఫలం కావడము, హిందువులకంటె ముస్లిములకే ఎక్కువ నష్టము, హాని కలిగించింది. హిందువుల కంటెను, తాము అధికుల మనే ప్రతిష్ఠ పూర్తిగా నశించింది. బ్రిటిషు ప్రభులకు ముస్లిములపై, ఇదివరలో ఉండిన విశ్వాసమూ పోయింది. సివిల్ మిలిటరీ సర్వీసులలో కిందిస్థాయిలోని పెద్ద ఉద్యోగాలు వీరికి లభింపక పోవడము, ఈ కాలమునుండే ప్రారంభ మయింది అని చెప్పవచ్చును." అని సర్ ఆల్‌ఫ్రెడ్‌లైయాల్ వ్రాసియున్నాడు.

**ఉలామాలు :** ముస్లిములకు ఈ పరిస్థితులలో రెండే గత్యంతరాలు గోచరించినవి. తమకు కలిగిన ఆపదను ధైర్యంగా ఎదుర్కొని, తమ సంకల్పాన్ని నిశ్చైతన్య మొనర్చిన నైతిక దౌర్బల్యాన్ని త్రోసివేసి, కురాన్ ఉపదేశాల ననుసరించి, దైవభీతితో కూడిన పాపరహితమైన సంఘాన్ని ఏర్పరచుకొని, దేశంలోని ఇతర మత వర్గాలతో సహకరించి, అన్నివర్గాలకూ సమానమైన మత స్వాతంత్ర్యాన్ని, రాజకీయప్రతిపత్తినీ భద్రతా రక్షణలనూ, కలిగించే రాజ్య పరిపాలన వ్యవస్థను ఏర్పరచి, అన్ని జాతి మత కులాలవారికీ ఆత్మగౌరవంతోనూ,

ప్రతిష్ఠతోనూ కూడిన జీవితాన్ని కలిగించి, తామూ సుఖపడడం ఒకటి. లేదా, స్వాతంత్ర్య స్వప్నాన్ని ఈ జీవితానికి మరచిపోయి, విదేశ ప్రభువుల పరిపాలనను అంగీకరించి, వారి ఆదరాన్నీ సానుభూతిని సంపాదించుకొని, ప్రభుత్వ సేవలోని ఉద్యోగాలనూ, పురపాలక సంస్థల్లోనూ, శాసన సభల్లోనూ, ఇతరములలోనూ, పలుకుబడిని సంపాదించుకొని, జీవించడము,-అనే పద్ధతిని అవలంబించడం రెండవది.

సంప్రదాయ విద్యకూ, ఆశయాలకూ ఆశ్రయులైన ఉలామాలు మొదటి పద్ధతిని అవలంబించిరి. పాశ్చాత్య విద్యా ప్రసారార్థం ఏర్పరచిన పాఠశాలల్లోను, కళాశాలల్లోనూ విద్య నభ్యసించిన ముస్లిము నాయకులు రెండవ పద్ధతిని అవలంబించిరి.

వహాబీ ఉద్యమాన్ని అనుసరించిన నాయకులకు ఉత్తేజనం కలిగించిన షావాలీఉల్లా, 1857 విప్లవంలో, స్వయంగా పాల్గొన్న పలువురు మత గురువులూ స్థాపించిన సంస్థతో ఏకీభవించి, ఉలామాలు మత సంస్కరణకూ రాజకీయ స్వాతంత్ర్య సంపాదనకూ, బూనుకొనిరి. ముస్లిము ప్రజానీకంయొక్క ప్రయోజనాలకు ప్రతినిధులై, సామాన్య ప్రజల బాగును సాధించుటకై బూనిన వారు ఉలామాలు. "విద్యారహితులు, దయాదాక్షిణ్య శూన్యులు ఐన ముస్లిము సామాన్య జనానీకం, మనకు విరోధులై యున్నారనడం, సత్య సన్నిహితమైయున్నది." అని లైయాల్ (Lyall) అభిప్రాయ మిచ్చినాడు. ఈ వర్గంలోనివారందరూ సామాన్య కుటుంబాలలోని శ్రామికులు. ప్రజలు అనుసరిస్తున్న మతాచారాలను సంస్కరించడము, ప్రజలలో పేరుకొనిపోయిన మూఢ విశ్వాసాలను, ఇస్లాము మత విరుద్ధములైన అంశాలను తొలగించడము, కురాను ఉపదేశాలను ఆదేశాలను, మొహమ్మద్ బోధనలను అతని ఆదర్శములను పాటించి, విశుద్ధమైన జీవితాన్ని గడపడము,- అనేసంస్కరణాలను సాధించడం వారి ప్రధానాశయము.

పర ప్రభుత్వానికి, ఇండియా, లోబడియున్నంతకాలము, ఇట్టి సంస్కరణలకు అవకాశము లేదనికూడా వారు గ్రహించినారు. రాజకీయంగాను, సాంస్కృతికంగాను ఇస్లామును నశింపజేయడానికి సిద్ధపడుచున్న బ్రిటీషు ఆధిపత్యాన్ని తొలగించే అంతవరకు, మత-రాజకీయ సమస్య పరిష్కారము కాజాలదని వారి విశ్వాసము. కనుక, దేశంలోని ఇతర మతాలవారతో ఈ విషయంలో ఏకీభవించి, జాతీయ స్వాతంత్ర్య సంఘర్షణలో ప్రవేశించడానికి, సంపూర్ణ హృదయంతో పూనుకొనిరి. ఇండియాకు స్వాతంత్ర్యం సిద్ధించడంతో, తమ మత సాంస్కృతిక స్వాతంత్ర్యం రక్షితమౌతుందని నమ్మిరి.

కనుక, ప్రభుత్వాన్ని వారు ప్రతిఘటించడము, సహజ ప్రవృత్తి మూలకమైనది కనుక, వెనుదిరగని ప్రయత్నమిది. దేశంలో, తమ స్థాన ప్రభావాన్ని నశింపజేసిన పరప్రభుత్వం పట్ల మనస్సులో ద్వేష మేర్పడినందువల్ల పాశ్చాత్య విద్యా సంస్కృతులపై జుగుప్స కలిగింది. పాశ్చాత్యవిద్య, ఇస్లాము మతములో విశ్వాసాన్ని భంగపరచి, ప్రజలను ధర్మ భ్రష్టులను గావిస్తుందని వీరు

గ్రహించినారు.

ముస్లిము సంఘంపై పలుకుబడి సంపాదించుకొనడానికై వీరితో పోటీ పడుచుండిన రెండవ వర్గంవారు, పాశ్చాత్యుల ప్రభావానికి లోబడినవారు. పాశ్చాత్యుల రాజకీయ సంస్థలు, సైన్యశక్తి, నాగరకతా సంస్కృతులు, అనే వాటి ప్రభావానికి వీరు లోబడిపోయిరి. బ్రిటీషువారి నెదిరించి, స్వతంత్ర్యా ముస్లిము రాజ్యము లెట్లు భగ్నము లైపోయినవో వీరు చరిత్రలో చదివి యున్నారు. అందువల్ల, ఇండియాలో నెలకొనియున్న బ్రిటీషు ప్రభుత్వము అచంచలమైనదని, జయింపరానిదని వీరు భావించిరి. 1857లో జరిగిన దోషాల ఫలితంగా ముస్లిము అగ్రవర్గాలవారి వినాశం జరిగిందని వీరికి దృఢ విశ్వాస మేర్పడింది.

సాధారణంగా హిందువులు,- ముఖ్యంగా బెంగాలీలు,- ఏవిధంగా, నదవ కాశాల నుపయోగించుకొని బాగుపడి యున్నారో గుర్తించినారు. భూస్వాములుగానూ, వ్యాపారులుగానూ, ధనంచేకూర్చుకొని, ఉద్యోగాలన్నిటిలోనూ వారేయై, ఏవిధంగా అభ్యుదయంపొందినదీ గమనించినారు. పాశ్చాత్యవిద్యను శ్రద్ధతో, నిస్సంకోచంగా అభ్యసించి, హిందువులు బ్రిటీషువారికి అభిమానపాత్రులై ఉన్నారు. ముస్లిములు, తమకు కలిగిన అన్యాయాన్నిగూర్చే సర్వదా చింతిస్తూ, పాశ్చాత్యులకు, పాశ్చాత్యవిద్యకూ దూరంగా నిలిచినందువల్ల, వెనుకబడిపోయినవారైరి ఈ అంతరాన్నిగూర్చి, హంటర్, "మన మేర్పరచిన పౌరవిద్యావిధానము, హిందువులను శతాబ్దాల నిద్రనుండి మేల్కొల్పి, జడ ప్రాయులైయున్న ప్రజానీకంలో, ఉత్కృష్టజాతి భావాల నుద్భోదించింది. కాని, అది, ముస్లిముల మతానికి విరుద్ధమై, వారి సంప్రదాయాలకు వ్యతిరేకమై, వారి ప్రయోజనాలకు అనర్థమైనదిగా సిద్ధించింది." అని వ్రాసియున్నాడు

ముస్లిములు పాశ్చాత్య విద్యావిధానానికి మొదటినుండీకూడా వ్యతిరేకులై యున్నారు. ప్రభుత్వము విద్యాప్రసారానికై కేటాయించిన ధనమంతా కేవలం పాశ్చాత్యవిద్యకే వినియోగించే, విలియం ప్రభువు (1835 లో ఇచ్చిన) ఆదేశాన్ని ఆక్షేపిస్తూ, 8000 మంది ముస్లిముల సంతకాలతో ఒక మహజరు నిదివరకే పంపియున్నారు. ఆంగ్ల విద్యవల్ల ఇండియను విద్యార్థుల మతవిశ్వాసం సడలిపోతున్నదని, క్రైస్తవమతప్రచారానికి అవకాశ మేర్పడుచున్నదనీ, వీరు తమ వ్యతిరేకానికిగల ముఖ్యకారణాన్ని ఆ మహజరులో వ్యక్తంచేసి యున్నారు.

పాశ్చాత్యవిద్యపట్ల ముస్లిములకుగల ఈ దురభిప్రాయాన్ని, విమర్శించిన ముస్లిము నాయకులుకూడా కొందరు గలరు. పాశ్చాత్యవిజ్ఞానాన్ని సంపాదించుకోవడం శ్రేయస్కరమని, షా అబ్దుల్ అజీజ్ (1746-1824) ఇదివరకే ఒక ప్రకటన గావించినాడు. కొందరు ముస్లిం యువకులు, పూర్వాచారపరాయణులైన తమ పెద్దల ఆగ్రహాన్నికూడా లక్ష్యముచేయక, కలకత్తాలోని ఇంగ్లీషు పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ ప్రవేశించిరి కలకత్తా మద్రసా కూడా, ఇంగ్లీషు భాషాబోధనకై తరగతులను ప్రారంభించింది. ఢిల్లీలో ప్రారంభింపబడిన కళాశాల (1828),

పాశ్చాత్యవిజ్ఞానాన్ని బోధిస్తూ, పాశ్చాత్యవిజ్ఞానశాస్త్రాలను ఉర్దూభాషలలోనికి అనువదించే ఉద్యమానికికూడా బూనుకొన్నది. తత్ఫలితంగా, కలకత్తానుండి ఢిల్లీవరకుగల ప్రాంతంలోని ముస్లిముయువకులు,- స్వల్పసంఖ్యాకులే ఐనా,- పాశ్చాత్యవిద్యావిధానంలో శిక్షణపొందుతూ వచ్చిరి. పందొమ్మిదో శతాబ్దపు పూర్వార్ధంలోని పరిస్థితి ఇది. కాని మొత్తంమీద, ముస్లిముసంఘం, పాశ్చాత్య విద్యను బహిష్కరించి, నిలిచింది.

రాజకీయ రంగంలోకూడా, బ్రిటీషుపాలక వర్గంవారిపట్ల ముస్లిములకు ఏర్పడియున్న వైముఖ్యాన్నీ, సంశయాన్నీ, తొలగించే ప్రయత్నాలు జరిగినవి. కలకత్తాలో స్థాపింపబడిన మహమ్మదీయ సారస్వత సంఘం (1863) కార్యదర్శి యైన ఖాన్ బహదూర్ నవాబ్ అబ్దుల్ లతీఫ్ ఖాన్, ఈ ప్రయత్న మొనర్చిన వారిలో ముఖ్యుడు. మహోబీలు అనే పేరుతో వలీ ఉల్లాహీ వర్గంవారు, జిహద్, ఉద్యమానికి పూనుకొని చేస్తూ ఉండిన ప్రచారాన్ని ఇతడు ప్రతిఘటించినాడు. బ్రిటీషు పరిపాలకులకు విరుద్ధంగా ధార్మిక యుద్ధ ప్రయత్నము అసమంజసమని ఖండిస్తూ, జాన్ పూర్ మౌల్వీకరమత్ ఆలీ, ఒక సందేశాన్ని ప్రకటించెను. బ్రిటను రాణికి విరుద్ధంగా, పోరాటం సాగించడం ఇస్లాము మత బాధ్యతకాదని నిర్ణయిస్తూ, మెక్కాముఫ్తీలు ఇచ్చిన ఫత్వాలనుకూడా, వీరు ప్రజలలో ప్రచారంగావించిరి.

## II సర్ సయ్యద్ అహమద్ ఖాన్-జీవిత చరిత్ర

పాశ్చాత్య విద్యా ఆవశ్యకాన్నీ, బ్రిటీషు ప్రభుత్వంతో సహకారాన్నీ సమర్థిస్తూ, సయ్యద్ అహమద్ ఖాన్ పూనుకొన్న ఉద్యమము, మిక్కిలి ఫలప్రద మయింది. ఇండియా ముస్లిముల రాజకీయ పునరుజ్జీవన ప్రయత్నంలో ప్రధాన పాత్రను వహించిన వాడితడు.

1817 ఇతని జన్మకాలము. ఇతని తలిదండ్రులిరువురూ సంపన్నములు, మతవిషయక శ్రద్ధాభక్తులుగల కుటుంబాలలో, జన్మించినవారు. తండ్రివంశంవారు ఔరంగజేబు కాలమునుండీ సామ్రాజ్యసేవలో ఉండినవారు. మొఘలు దర్బారుతో సన్నిహితసంబంధము కలిగినందువల్ల, దర్బారుసంస్కృతిని బాగుగా జీర్ణించుకొన్నవారు ఇతని మాతామహుడైన ఖాజా ఫరీదుద్దీన్ అహమద్, సంపన్ను లైన ఇరాను వర్తకకుటుంబముయొక్క సంతతిలోనివాడు. ఇతడు లక్నోలో విద్యాభ్యాసము గావించి, గణితశాస్త్ర, జ్యోతిష్కశాస్త్రములలో పాండిత్యము సంపాదించి యుండెను. మొదట, ఇతడు కలకత్తా మద్రసాకు పర్యవేక్షకుడుగా పనిచేసి, పిమ్మట, ఇరానురాజుల దర్బారులోను, బర్మాలోను, (Ava), బ్రిటిషు రాయబారిగా, ఉద్యోగం నిర్వహించినాడు. సార్వభౌముడైన రెండవ అక్బర్ షా (1806-1837) ఇతనిని రెండుసార్లు ప్రధానమంత్రి పదవిలో నియమించి యుండినాడు.

ఈ విధంగా, మధ్యయుగాల పరిసర వాతావరణాల్లో, ప్రాచీన ఆధునిక లక్షణాలురెండూ సిద్ధించినవి. కాని, అతని విద్యాభ్యాసం, క్రమవిధానాన్ని

అనుసరించి, ఒక పద్ధతిలో జరుగలేదు. వరుసగాకూడా తగినంతకాలం చదువు సాగలేదు. కనుక, ఇస్లాం విషయములకు సంబంధించిన ఇతని విజ్ఞానము, అసమగ్రమైనట్టిది. తరువాతికాలంలో ఇతడు, స్వయంకృషితో పాశ్చాత్య భావాలతో మంచి పరిచయం సంపాదించుకొన్నాడు. విజ్ఞానశాస్త్రాలలో పాశ్చాత్యులు సాధించిన అభ్యుదయము, ఇతనిపై ఎక్కువ ప్రభావాన్ని కలిగించింది.

22 ఏండ్ల ప్రాయంలో ఉండగా, ఇతడు తండ్రిని గోల్పోయి, జీవనోపాధికై ప్రయత్నించవలసిన పరిస్థితికి లోనైనాడు. ఇతని అభిరుచులకు అనుగుణమైనదీ, తగినంత వేతనముతో కూడినదీ ఐన, ఉపాధిని మొఘలు దర్బారు కలిగించలేకపోయింది. కనుక, 1839 లో న్యాయపరిపాలనకు సంబంధించిన విద్యానభ్యసించడానికి బూనుకొని, ఆగ్రాలో కమీషనరు కార్యాలయంలో గుమాస్తాగా ప్రవేశించెను. 1857 నాటికి, సదర్ అమీన్ పదవిలోకి వచ్చినాడు. 1857 లో విప్లవం ప్రారంభమైనప్పుడితడు బిజ్నోరులో ఉండినాడు. పండ్రెండేండ్లతర్వాత, ఇంగ్లాండుపోయి, అక్కడ ఒకటిన్నర సంవత్సరకాలం గడపినాడు. 1876 లో, ప్రభుత్వోద్యోగాన్ని, విరమించుకొని, ఆలిఘర్ లో స్థిరపడెను 81 సంవత్సరాల వృద్ధాప్యంవరకూ జీవించి, మరణించినాడు.

సంతతోత్సాహశ్రమలతో కూడిన ఇతని సుదీర్ఘమైన జీవితమంతా, ప్రత్యేకంగా ముస్లిముల శ్రేయోప్రయోజన సాధనలో గడచింది. నైతికభ్రంశతకు లోనై అవమానదశకు దిగజారిపోతున్న సంస్థయొక్క పరిసరాలలో, నిర్భాగ్య పరిస్థితులలో ఇతని బాల్యం గడిచింది. ఆ సంస్థయొక్క రాజకీయాధిపత్యము, ప్రభావము, అప్పటికే నశించిపోయినవి. ఉన్నతవర్గంవారు నీతిభ్రష్టులై క్షీణదశలో నుండిరి. ప్రజలు వేగంగా, దారిద్ర్యంలో క్రుంగిపోయే పరిస్థితులేర్పడినవి. జడతా, అజ్ఞానమూ, మూఢవిశ్వాసము సార్వత్రికములై వ్యాపించినవి. మత విషయములో శ్రద్ధాభక్తులు నశించి, బాహ్యచిహ్నాలు కర్మలు మాత్రమే మిగిలి యుండినవి. వంచన, బూటకము, నియమలోపము, జీవితములో ప్రధానలక్షణములైనవి. నీతిప్రవృత్తులు, అధమస్థితికి వచ్చినవి. వ్యభిచారము, విషయలాంపట్యము, విస్తృతిచెందినవి. ఉన్నతాశయాలన్నీ పరిహాసపాత్రములైనవి.

సయ్యద్ అహమద్ ఖాన్ జీవితకాలంలో ఉత్తమదశ ప్రాప్తమయ్యేనాటికి, దేశంలో గొప్ప విపత్తు సంభవించి, ముస్లిముల భావిజీవితం హతాశమైపోయేస్థితి ఏర్పడింది. 1857 నాటి విప్లవం తర్వాతిసంవత్సరాలలో దేశంలో ఎక్కడ చూచినా, నాశము, దుస్థితి నెలకొనింది. ఉన్నతవర్గవంశములు చాలవరకు అణగిపోయినవి. ఆ వంశములోనివారనేకులు నాశమొనర్పబడిరి. బ్రిటిషు పరిపాలకులకు ముస్లిములపట్ల, సంశయద్వేషభావాలు తీవ్రములైనవి. అభిమానము, ఆత్మగౌరవము, దృఢవిశ్వాసాలూ, గల ముస్లిము హృదయాలను ఈ ఉదంతాలు దహించి వేసినవి. దేశాంతర నివాసంతో విమోచన పొందవలెననెడి కోరికకూడా ఇతనిలో ఉదయించింది. దుస్థితికి పాలైయున్న తన భ్రాతృవర్గాన్ని వారి గతికి వదలి తానుమాత్రం స్వసౌఖ్యానికై పరదేశం పోవడం, నైతిక భీరుత్వమనే

జ్ఞానం అంతలో ఉదయించి, అతనినాపింది. దేశంలోనే నిలిచి, కష్టాలను ఎదుర్కొని పోరాడదలచుకొన్నాడు. ఈ నిశ్చయానికి కట్టుబడి నిలిచి, సుమారు అర్ధశతాబ్దకాలము, కష్టపరంపరలను సహిస్తూ, అసాధారణమైన సహనంతో, శ్రద్ధా స్థైర్యాలతో నిలిచి తన ఉద్యమాన్ని నిర్వహిస్తూ వచ్చినాడు. తన సంఘాన్ని ఒకప్పుడు ఆవరించి ముంచివేయడానికి సిద్ధమైయున్న అంధకారం క్రమంగా విరిసి పోవడము, సంఘజీవితంలోను, వ్యవహారాల్లోనూ విప్లవాత్మకమైన పరివర్తనం కలిగి భావిశుభాన్ని సూచించడము,- ఇతడు తన అవసానకాలానికి చూడగలిగి, తృప్తితో కనుమూసినాడు.

## III. మత సాంఘిక విషయాలపట్ల, అహమద్‌ఖాన్ అభిప్రాయాలు

అతడు పూనుకొన్న కర్తవ్యం అతిదుష్కరమైనది. ముస్లిము సమాజము యొక్క సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితిని బాగుపరచడమనే ఇతని ఉద్యమం అసాధారణమైనది. అదికాక, ఇతడు అగ్రవర్గాలకు చెందిన వ్యక్తి అనడంకూడా, గుర్తించవలసిన అంశము. దేశంలోని ఈ అగ్రవర్గవినాశము ప్రళయోత్పాతంగా జరిగింది. అది ఇతని జీవితానికి ప్రత్యాఘాతమయింది. అది తనకు జరిగిన వినాశంగా ఇతడు బాధపడినాడు. క్రమంగా, బాహ్యాగోచరము కాకుండా జరిగిన క్రిందితరగతులవారి వినాశము, వారి కేర్పడిన దారిద్ర్యము, ఇతనిని బాధింపలేదు. తనచుట్టూ, దేశంలో వ్యాప్తమైయున్న దుర్భర పరిస్థితులితని దృష్టి నాకర్షింపలేదు. పూర్వ మీదేశంలో ప్రాభవవైభవాలతో స్థిరపడి, కీర్తిప్రతిష్ఠలకు ఆధారములైన మహోద్యమాలతో చరిత్రనునింపి, తాము సాధించిన కార్యాలను తమ భావిసంఘమువారికి ఆస్తిగా వదలిపోయిన, ఆ అగ్రవంశాలవారిని పైకిదెచ్చి, వారికి సంఘంలో తగిన గౌరవస్థానాన్ని మరల ప్రతిష్ఠించడమే ఇతని ప్రధానాశయము. ఇట్లు ముస్లిము సమస్యకు పూనుకొన్న ఇతని దృక్పథము, ఉలామా దృక్పథంకంటె విభిన్నమైనది. ఇండియానుంచి బ్రిటీషువారిని పారద్రోలే ప్రయత్నములేవిధంగా విఫలములైనవో, ఇతడు, ఇతని అనుయాయులు, ప్రత్యక్షంగా చూచినారు. కనుక, 'స్వాతంత్ర్యసాధనమనే' క్రియాత్మకమైన రాజకీయప్రయత్నము వీరి అభిమతంకాదు. బ్రిటీషువారి దయాదాక్షిణ్యాలను సంపాదించి, వారి ద్వేషభావాన్ని తొలగించడము, ముందు జరుగవలసియున్నది. ముస్లిముల మతంతోనూ, సంప్రదాయాలతోనూ ఐక్యం కలిగించుకోకపోతే, వారెన్నడూ బ్రిటీషు పరిపాలనకు వ్యతిరేకించరని, ముస్లిములు బ్రిటీషువారికి బద్ధశత్రువులు కారని, బ్రిటీషువారికి విశ్వాసం కలిగించడము, అంతేకాక, ముస్లిము మతముకూడా, పాలకులైయున్న క్రీస్తుమతస్థులపై ద్వేషభావాన్ని కలిగించేదికాదని నిరూపించడము, వీరు సాధించవలసిన మొదటికార్యము.

ముస్లిము మతాన్ని దీని కనుగుణంగా వ్యాఖ్యాలించడం ఈ ప్రయత్నానికి అవసరము. ఈ విధమైన వివరణము, ఇంకనూ మూడు ప్రయోజనాలకు సాధనమౌతుంది. క్రిశ్చియను మిషనరీలు ఇస్లాము మతాన్ని తీవ్రంగా విమర్శించి,

దానిని ధిక్కారానికీ, తిరస్కారానికీ గురిచేసియున్నారు. పుస్తకాలు, కరపత్రాలు, బహిరంగప్రచారాలు, చర్చలు,- వీటి మూలంగా, జరుగుతున్న ఈ ప్రచారానికి పాఠశాలలు, ఇతర విద్యాలయాలుకూడా ప్రోద్బలం కలిగిస్తూ, మిషనరీల కార్యక్రమాన్ని ఫలప్రదం గావిస్తున్నవి. మిషనరీలు పాలకజాతివారు కావడము, వారికి అధికారవర్గంవారి సానుభూతి సహకారాలు, ప్రత్యక్షప్రోద్బలమూ లభించడమూ, దేశీయుల పరిస్థితిని అపాయకరంగా చేసినవి. ఇట్టి సంక్షోభాత్మకమైన పరిస్థితి నెదుర్కొడానికి, తమ మతాన్ని సమర్థించుకోవడం ప్రథమ కర్తవ్యంగా ఏర్పడింది.

ముస్లిము సంఘములో వ్యాప్తిచెందియున్న నైతిక భ్రంశము, మత విషయములో ప్రజల నిర్లక్ష్యభావము,-అనేవి ప్రతిపక్షులైన క్రిశ్చియనుల విమర్శలకు అవకాశం కలిగించి, మత సమర్ధనకు బూనుకొన్న వారికి చిక్కులను తెచ్చిపెట్టినవి. ఇస్లాము మతాన్ని సమర్థించడానికి, ఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోడానికి దానిని ఆధునిక తార్కిక విధానంపై వ్యాఖ్యానించవలసిన ఆవశ్యకం తప్పనిసరి అయింది. అంతకంటె ముఖ్యంగా, మూఢవిశ్వాసాల కారణంగా, మత సంప్రదాయాలలో వచ్చి చేరిన అసంగత విషయాలను, నిర్హేతుకములైన అసంబద్ధ ఆచారాలను తుడిచివేయవలసియున్నది. ఇది రెండవ కార్యక్రమము.

పాశ్చాత్య భావాలవ్యాప్తి, పాశ్చాత్య విద్యాప్రసారము, ఇస్లాము మతము యొక్క మూలాధారాలనే పెకలించి వేయడానికి బూనుకొన్నవి. కనుక ఆధునిక విజ్ఞాన శాస్త్రాధారంపై, తమ మతాన్ని సమర్థించుకొనవలసియున్నది. ఇది మూడవ కార్యక్రమం.

ఇట్టి మహాప్రయత్నానికవసరములైన, తాత్త్విక పాండిత్యము, మతధర్మశాస్త్రముల పాండిత్యము,-ఇతనికి సమగ్రంగాలేవు. కాని, అసాధారణమైన ధైర్యము తీవ్రమైన ఉత్సాహము, అఖండములైయున్నవి. మత విషయకమైన వ్యాఖ్యానము, సాంఘిక సంస్కరణము, విద్యాప్రచారము,-అను మూడు మహా కార్యములకును ఇతడు స్వయంగా బూనుకొన్నాడు. ఆర్థికంగాను, రాజకీయంగాను, తన సంఘాన్ని పునః ప్రతిష్ఠగావించడానికి, ఈ మూడు కార్యములూ ప్రధానావసరములని కూడా, అతడు గుర్తించినాడు.

క్రిశ్చియను మిషనరీలతోను, ఇతర లేఖకులతోను ఇతడు గావింపబోయే, ధర్మశాస్త్ర వివాదాలలో విజయం పొందడానికి, ఆధునిక పాశ్చాత్య విజ్ఞానశాస్త్ర విధానాన్ని అవలంబించవలసి ఉంటుందని గుర్తించినాడు. హేతువాదాన్ని, విజ్ఞాన శాస్త్రాన్ని ఆధారంగాచేసుకొని క్రిశ్చియనులు ఇస్లామును విమర్శిస్తే, తానుకూడ అట్టి ఆధారంతోనే వారి వాదనను ఖండింపవలసి ఉంటుంది. కనుక, ఖురానులోని బోధనలు సమగ్రంగా, హేతు బద్ధములు, ప్రకృతి సంబద్ధములు అని నిరూపించడానికి పూనుకొన్నాడు. ఇతడవలంబించిన వాద విధానం ఉలామా పద్ధతికి పరావర్తంగా నడిచింది. అతడాధారంగా చేసుకొన్న సూత్రాలు ;-

1. ఖురాను బోధనలు దైవప్రేరణవల్ల సిద్ధించినవి. అవి నిరంతరములు, కనుక

దోషరహితములు. అర్థతః, శబ్దతః తప్పక అనుసరింపదగినవి. వాటిని విడిచి, అన్యథా ప్రవృత్తి నిషిద్ధము.

2. ప్రవక్త ప్రోక్తముల సముదాయం, హదీథ్, (Hadith) ఇవి అన్నీ ఆఖ్యాయకులు పరంపరగా మన కందించినవి. వీటికి సాక్షులైన ఆఖ్యాతల శీలము, ఋజుత్వము, ఇంకను పరిశీలింపవలసి యుండడంవల్ల, విమర్శ కవకాశమున్నది. విచారణ, పరిశీలన, జరిగిన అనంతరం వాటిలో ప్రమాణములైనవి మాత్రమే గ్రాహ్యములు.

3. మత విషయాలలో మాత్రమే హదీజ్‌కు అధికారమున్నది. ప్రాపంచిక వ్యవహారములలో అది నిర్బంధింపదు.

4. మానవుని సంకల్పము స్వతంత్రమైనది.

ఇస్లాము మత ధర్మాలను, ఈ విధంగా సూత్రరూపంలో వ్యాఖ్యానించి, ఇతడు విప్లవాత్మకమైన మార్పును కలిగించెను. ఏకేశ్వరత్వము, ఆత్మ, సంకల్ప స్వాతంత్ర్యము, దైవనియతి, భావికాలజ్ఞానము, దివ్యదర్శనము, అద్భుతచర్యలు, ప్రవక్తయొక్క స్వర్గారోహణము, (మిరజ్), స్వప్నప్రపంచము, (అలం - ఇ - మథల్), దేవదూతలు, సైతాన్, భావిప్రపంచము (ఆలం - ఇ - ఫైజ్), పునర్జన్మ, కురాను శాశ్వతత్వము,- మొదలైన భావములన్నిటికీ, ఈ సూత్రముల నితడు అనువర్తింపజేసెను. ఈ సమస్యలను పరిశీలించడంలో ఇతడు అవలంబించిన విధానం హేతువాదాన్ని అనుసరించింది. ఉదాహరణకు;- విశ్వములో గోచరములై యున్న ఈశ్వరుని శక్తులే ఈశ్వరుని ఉనికికి సాక్ష్యములై యున్నవి. మనజ్ఞానం పరిమితమై యున్నందువల్ల ఆ విశ్వేశ్వరుని స్వభావాన్నీ, తత్త్వాన్నీ గ్రహింపలేకున్నాము. ఆత్మ ఉన్నదని మాత్రమే మనమెరుగుదుము; కాని, దాని నిజస్వభావమెట్టిదో మనము గ్రహింపలేము. మానవుని ఉత్కృష్టస్థితే ప్రవక్తత (Prophet hood). ప్రవక్తతకు అవసరములైన యోగ్యతలన్నీ అతనికి దైవదత్తములైనవి. ఈశ్వరుని సందేశమును, ఈశ్వరప్రేరణను పొందడానికి మానవులందరూ సమర్థులే; కాని వాటినిగ్రహించేశక్తి భిన్నభిన్నమై ఉంటుంది. ప్రకృతిప్రమాణాన్ని ఆధారంగా చేసుకొని, పైన ప్రేరణయని చెప్పినదాన్ని నిర్ణయించవలసి యుంటుంది.

ప్రకృతి సూత్రములకు విరుద్ధములైన వగుటచే అద్భుతచర్యలు గావించినాడనే విషయాన్ని ఇతడు విశ్వసింపలేదు. దేవదూతలు, సైతాను,-అని చెప్పబడినవి,-మానవులు, జంతువులు, అన్యప్రాణుల వంటివి కావనీ, అవి మానవుని హృదయములోని సద్భావదుర్భావములనీ, కనుక వాటికి మంచీ, చెడూ చేసే శక్తికలదనీ వివరించినాడు. స్వర్గము, నరకము, అనేవి మానవుని గ్రహణశక్తికి అందని భావములని ఇతని భావము. కురాను దైవవాక్యము, కనుక శబ్దతః, అర్థతః అది శాశ్వతమైనది అని అతని అభిప్రాయము. ఇస్లాము మతము ప్రకృతి సిద్ధమైనదనే భావాన్ని ఆధారంగా చేసుకొని, అతడు నిరూపించిన సిద్ధాంతము ముఖ్యంగా గమనింపదగినది. ఆస్తికుడైన వాడెవ్వడూ మత నిష్ఠాశూన్యుడు (కాఫిర్) కాడు, సంప్రదాయ బాహ్యుడు (Heretic) కాడు, అని కురాను

బోధించుచున్నదని ఇతని సిద్ధాంతము. నాస్తికుడైన వానిని కూడా దైవవిశ్వాసం లేని వాడని పరిగణించడానికి వీలులేదు. ఇస్లాంమత, నియమాలను అంగీకరింప మని ఎవ్వరైనా నోటితో పల్కినా, క్రియా రూపంలో వీరుకూడా ఇతర ముస్లిముల వలె మత సూత్రాలకు బద్ధులైయున్నవారే. ఈశ్వరుని ఆదేశములన్నీ ప్రకృతి నియమాలే కావడంవల్ల, వాటి నతిక్రమించి, ఎవ్వరూ జీవించలేరు. ఈ ప్రకృతి నియమాలే, కురానులో వాక్యరూపంలో ఉన్నందువల్ల, వాచ్యతః ఏమి పల్కినా, వాటిని ఉల్లంఘించడం సాధ్యంకాదు.

సాంఘిక, సాంస్కృతిక, రాజకీయ సమస్యల విషయంలోకూడా, అహమద్ ఖాన్ దృక్పథం ఇట్లే స్వతంత్రమైనది. వివాదాత్మకములైన ఈ సమస్యలలో,-దాస్యము, బహుభార్యాత్వము, ధార్మిక యుద్ధము (జిహాద్), వడ్డీ, యుద్ధఖైదీలపట్ల విజేతల ప్రవర్తన,- అనేవి ప్రధానములైనవి.

ఈ సమస్యలను గురించిన ఇస్లాము దృక్పథం సహేతుకము, ప్రకృతి నియమాలకు అనుగుణమూ, ఐనదని ఇతడు వ్యాఖ్యానం గావించినాడు. దాస్యము లోనున్న వ్యక్తులవిషయమై ఇస్లాము ఉదారములైన ప్రవృత్తి విధానముల నేర్పరచి యున్నదని, అవి; దాస్యముయొక్క స్వభావాన్నే మార్చునంతటి ప్రకృతి సహజములైనవని, ఇతడు వివరించినాడు. అసాధారణములైన సందర్భములలో మాత్రమే బహుభార్యాత్వమును ఇస్లాము అంగీకరించింది; అది సార్వజనికంకాదు. ఇస్లాముమతముపై దాడిజరిపిన సందర్భములలోతప్ప, ఇతర మతాలవారిపై ధార్మికయుద్ధం జరపడము, ఇస్లాము ఒప్పుకోదు. ప్రాగిస్లాము కాలములోనున్న 'కుసీదక పద్ధతి' (Usury) మాత్రమే నిషిద్ధముకాని, ఇతరవిధములైన వడ్డీ విధానాన్ని కురాను ఖండించదు. యుద్ధఖైదీలను వధింపకూడదు. స్త్రీలను దాస్యానికి లోబరచకూడదు. పవిత్రక్యాలిఫేట్ విషయంలో,- ప్రవక్త మరణించిన ముప్పైసంవత్సరముల అనంతరం ఇమాంహాసన్‌తో, ఈ విధానమంతమయింది, అని అతని అభిప్రాయము. దీనినిబట్టి క్యాలిఫ్ బిరుదువహించే అధికారం టర్కీసుల్తానుకు లేదు కనుక ఇండియాలోని ముస్లిములు బ్రిటీషుపరిపాలకులపట్ల విశ్వాసం కలిగియుండడం, కర్తవ్యమని నిశ్చితమయింది.

ముస్లిములకు, బ్రిటీషుపరిపాలకులకు మధ్యఏర్పడిన అంతరాన్ని కప్పివేయడం, సయ్యద్ అహమద్‌ఖాన్ యొక్క ప్రయత్నం. కనుక, క్రిశ్చియను మతాన్ని, మిషనరీలను, విమర్శించడాని కతడు పూనుకోలేదు. విమర్శించడానికి బదులుగా, ఈ రెండుమతాలకూ గల సమానాంశాలకు ప్రాశస్త్యమిచ్చి, క్రిశ్చియను మతానికి ఇస్లాముమతము గావించియుండిన సేవను జ్ఞప్తిచేసినాడు. సాంఘిక సంబంధవిషయాలలో, ముస్లిములు క్రిశ్చియనులపట్ల వహించియున్న దురభిప్రాయాలను విసర్జించవలసిందని అందును ముఖ్యంగా, సహభోజనవిషయంలో ఏ విధమైన అభ్యంతరమూ పాటింపరాదని, ముస్లిములకితడు బోధించెను.

సంస్కర్తగా ఇతడెక్కువ పురోగామి. అందువల్ల ప్రాచీన సంప్రదాయ వర్గాలవారి, కితని అభిప్రాయములు వ్యతిరేకములైనవి. సంప్రదాయవాదు

లితనిపై ఆగ్రహం వహించి, సంప్రదాయబాహ్యుడని ఇతనిపై పలుమార్లు మతనిర్ణయాలను ప్రకటించిరి. వార్తాపత్రికలలోను పుస్తకములలోను, ఉపన్యాసములలోను, ఇతనిపై నిందలను, దూషణలను, కురిపించిరి ప్రాణభీతికూడా కలిగించిరి ఇతడేదానికి జంకలేదు. తాను పూనుకొన్న ఉద్యమాన్ని విడువలేదు. ఇతని ప్రతికక్షులు, ఇతనిని పరిహసించినవారూ, కడపటికి మౌనం వహించిరి. ఇతడు ధైర్యంతో పూనుకొని గావించిన ఖురానువ్యాఖ్యనుగూర్చి ఇతడు ప్రదర్శించిన మూలసూత్రము,- అనగా, హేతువాదంతోనూ, ప్రకృతి నియమాలతోనూ ఇస్లాము అనుగుణమై ఉండడము,-అనే విషయాన్ని మాత్రము పాశ్చాత్య విద్యావంతులైన ఆధునిక ముస్లిములందరు, మారుమాటాడక, అంగీకరించిరి.

అతడు ప్రతిపాదించిన మతధర్మశాస్త్రములో హిందూసమాజానికి సంబంధించిన ఒక అంశముకూడా ఉన్నది. గమనింపదగిన విషయమిది. సంకుచిత హృదయులైన, ముస్లిముధర్మశాస్త్రజ్ఞులు, హిందువులను కాఫిరులని వ్యవహరించుచుండడము తప్పని, ఇతడధిక్షేపించినాడు. ఇస్లాము మతసూత్రాలు ప్రకృతిసూత్రముల ననుసరించి ఏర్పడియున్నవని, మానవులందరూ వాటిని అనుసరించి తీరుతారనీ,- సిద్ధాంతం చేయడంతో,- ఇస్లాము ననుసరించేవారికీ, ఇతరులకూగల భేదం శాబ్దికమైనదే కాని, వాస్తవమైనదికాదని, సహేతుకంగా సిద్ధిస్తుంది మరిన్ని, మంచి, చెడు, అనేవాటిని ఎన్నుకోవడంలో ప్రతిమానవునికీ స్వేచ్ఛ ఉండడంవల్ల, ఇతర మతస్థులు చేసిన తప్పును ముస్లిముకూడా చేయవచ్చు. ఇరువురూకూడా, పర్యవసానంలో, పరమేశ్వరుని సమక్షంలో తాము చేసిన కార్యాలకు సమాధానం చెప్పవలసి ఉంటుంది. ఆ సమయంలో, ప్రవక్తలుకాని, ఉద్ధరించేవారుకాని, అడ్డుపడేవారుండరు. ఈ విధంగా, సయ్యద్ అహమద్‌ఖాన్ ప్రతిపాదించిన ఉదారభావం, సామాజిక సామరస్యానికి విశాలమైన మార్గాన్ని కల్పించి, ముస్లిము, హిందూ, క్రీస్తు మతస్థుల సమన్వయానికి తోడ్పడింది.

తన రచనలన్నిటిలోనూ, అహమద్‌ఖాన్, హిందూ ముస్లిముల ఐక్యానికి ప్రాధాన్యమిచ్చి యుండడంలో ఆశ్చర్యంలేదు. 1883 లో (Jan 27) పాట్నాలో అతడుపన్యసిస్తూ, "ముస్లిములు హిందువులు కూడా ఇండియాలోని గాలినిపీల్చి, జీవిస్తున్నాము. పవిత్ర గంగాయమునా జలాన్ని, త్రాగుతున్నాము. బ్రతుకులో చావులో కూడా మనం కలిసియున్నాము. ఇండియాలో, నివసిస్తూ ఉన్న మన దేహాల్లోని రక్తములో కూడా మార్పు కలిగింది. హిందూముస్లిముల దేహచ్ఛాయలు కూడా ఒకటే ఐనవి రూపురేఖలన్నీ సమానములైనవి. అనేకములైన హైందవాచారాలను ముస్లిములు గ్రహించినారు. ముస్లిముల ప్రవృత్తి లక్షణములనేకములు హిందువులవలంబించినారు. ఈ రెండు వర్గాలూ మేళనమైపోయి, ఉర్దూ అనే క్రొత్త భాషనే సృష్టించుకొన్నవి. ఇది మన భాషాకాదు, హిందువుల భాషాకాదు. కాబట్టి, పరమేశ్వరునికి చెందిన మన జీవిత భాగాన్ని మాత్రమే మనం ప్రత్యేకపరచుకొంటే, అపుడు మన మిరువురమూ ఏకమవడం నిస్సందేహము. మన మిరువురమూ ఒక దేశము వారము; ఒకే జాతిగా ఏర్పడి

యున్నాము. దేశ క్షేమము, అభ్యుదయము, మన క్షేమాభ్యుదయాలు, మన ఐక్యముపై పరస్పర సానుభూతిపై, ప్రేమపై, ఆధారపడి యున్నవి. మన పరస్పర భేద భావాలు, మొండి పట్టుదలలు, వ్యతిరేకభావ ద్వేష భావాలు ఇవి తప్పకుండా మనలను నాశం చేస్తాయి." అని వివరించినాడు. సౌందర్యవతియైన వధువుయొక్క రెండు కండ్లతో హిందూ ముస్లిములను పోల్చి, ఏ కన్నుకు హానికలిగినా సౌందర్యానికి భంగము కలిగినట్లే, హిందూ ముస్లిములలో ఎవరికి నష్టంకలిగినా,దేశ సౌభాగ్యం నశిస్తుందని హెచ్చరించినాడు.

పంజాబులోని హిందువులసభలో ఉపన్యసిస్తూ తన్ను వారెందుకు హిందువుగా పరిగణించడంలేదని ఆక్షేపించెను. "హిందువు అనే పదాన్ని మీ విషయంలోనే వర్తింపజేసుకొంటున్నారు. అది సరికాదు. 'హిందువు' అనే పదము ఒక మతాన్ని ప్రత్యేకంగా నిర్దేశించదు. అని నా అభిప్రాయము. హిందువు అనే వ్యవహారానికి ఇండియాలో నివసించే ప్రతివ్యక్తికీ హక్కు ఉన్నది. కనుక, ఇండియాలో నేను నివసిస్తున్నా, హిందువు అని నన్నుమీరు పిలువకపోవడం నాకు విచారంగా ఉన్నది." అని పలికినాడు.

అతడు రచించిన ఒక వ్యాసములో,- ముస్లిములకు హిందువులకు మత విషయములోగల భేదములున్నా, అవి పరస్పర సాంఘికవ్యవహారములకు, పరస్పరాభిమానాలకు, ప్రీతికి, సానుభూతికి, ప్రతిబంధకములు కారాదు. అట్లే, రాజకీయవిషయములలో ఏర్పడిన భేదాభిప్రాయాలు కూడా సాంఘికసంబంధాలకు, అభిమానానికి, ప్రీతికి, సానుభూతికి, అడ్డురాకూడదు." "మతవిషయకమైన భేదాలను పరిహరించి, హిందూ ముస్లిములమధ్య, స్నేహము, అభిమానము, ఐక్యము, సానుభూతి ఏర్పడవలెనని మనము కోరుచున్నట్లే, రాజకీయభేదాలను కూడా గమనింపక, సాంఘిక వ్యవహారాలలో స్నేహాభిమానాలు, సానుభూతిభ్రాతృత్వాలు ఏర్పడవలెను".

హిందూ ముస్లిముల రాజకీయైక్యతను విశ్వసించినవాడు అహమద్‌ఖాన్. హిందువులు, ముస్లిములు భిన్నజాతులవారనే సిద్ధాంతానికి అతడు కారకుడని చెప్పడం సత్య విరుద్ధమైనది. హిందూ ముస్లిముల ఐక్యమును సమర్థించిన వాడతడు, అనడము వాస్తవము. ఈ ఐక్యత విషయంలో అతనికెట్టి మత విషయక ప్రతిబంధకమూ లేదు. అంతస్సాక్షి కూడా అట్టి భేదభావాన్ని అతనిలో కలిగించలేదు. కాంగ్రెసుతో అతనికి కల్గిన భేదాభిప్రాయాలు రాజకీయానుకూలములపై మాత్రమే ఏర్పడినవి. అట్టి అభిప్రాయభేదాలు హిందువులలో కూడా ఏర్పడినవి. వ్యవసాయ దారుల వర్గానికి, విద్యావంతులైన మధ్యతరగతుల వారికీ, మధ్యఏర్పడిన భేదాభిప్రాయాలు కూడా ఇట్టివేయని గమనింపవలసి యున్నది

*విద్యావేత్తగా, సయ్యద్ అహమద్‌ఖాన్ :* ముస్లిముల భావాలలో, గొప్ప పరివర్తనమును కలిగించినవాడు సయ్యద్ అహమద్‌ఖాన్. ముస్లిము సమాజంలోని వ్యక్తినీ, వర్గాలనూ, సంస్కరించడానికై అతడు గావించిన ఉద్యమ

నిర్వహణం, ఇంతకంటె ముఖ్యమైనది. అతడు చేసిన మత సిద్ధాంతాల వ్యాప్తికై సంస్థల నేర్పరచడానికి బూనుకొన్నాడు. ముస్లిముల మత సాంస్కృతిక ఆర్థిక ప్రయోజనములను తృప్తిపరచడానికి తగిన విద్యా ప్రణాళికను తయారు గావించెను. ప్రభుత్వ విద్యాలయాలలో బోధింపబడుతున్న లౌకిక విద్యా విషయమై, ముస్లిము ప్రాచీన సంప్రదాయస్థులవలెనే, ఇతనికిని, తృప్తిలేదు. ఇస్లాము మతములో విద్యార్థుల విశ్వాసాన్ని, ఈ విద్య నశింపచేస్తున్నదని వీరి అభిప్రాయము. గుణశీలముల పోషణకు ప్రాధాన్య మిచ్చియుండిన, సంప్రదాయ విద్యను, ఆధునిక విధానం నశింపజేసింది. కాని, ఆ స్థానంలో, నైతిక ప్రవృత్తి పోషకములైన నూతన సూత్రములను, ప్రతిష్ఠించలేదు. బుద్ధి సంస్కార విషయంలో,-ముస్లిము మద్రసాలలో బోధించే సంప్రదాయ విద్యా, ప్రభుత్వ విద్యాలయాల్లోనూ, విశ్వవిద్యాలయాల్లోనూ, బోధించే విద్యా,-ఈ రెండూ కూడా సంతృప్తికరమైనవి కావని అహమద్ ఖాన్ అభిప్రాయము మద్రసాలను గురించి, "జాన్‌పూర్, అలిఘర్, కాన్‌పూర్, సహరాన్‌పూర్, దేవబంద్, ఢిల్లీ, లాహోరులలో, ప్రాచీనవిద్యాలయాలను పెక్కింటిని ముస్లిములు స్థాపించినారు. కాని, అవి నిష్ప్రయోజకములు, వ్యర్థములు అని నా మనఃపూర్వకమైన అభిప్రాయము." అని అతడు వచించియున్నాడు.

మద్రసాల పాఠ్యప్రణాళికలో మతధర్మశాస్త్రము, భాష, తర్కము, ప్రకృతిశాస్త్రాలు, గణితము, జ్యోతిష్కము, వైద్యము,- చేరియున్నవి. "ఇస్లాము విజ్ఞానశాస్త్రాలు ఎట్లు నిరర్థకములైనవో ఇప్పుడు బహిరంగమయింది. ప్రయోజనకరమైన జ్ఞానమేమాత్రమూ వీటిలోలేదని, ఇట్టివిద్యపై మన మాధార పడియుండడంవల్లనే మనకిట్టి దురవస్థ, అవమానము సిద్ధించినవని స్పష్టంగా విశద మయింది." అని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చినాడు.

ఇండియా విశ్వవిద్యాలయాలలో బోధింపబడుతున్న ఉన్నతవిద్య కూడా, ఈ విధంగానే, అసమగ్రమైయున్నదని, అతడు విమర్శించెను. ఆయా విషయా లలో బాహ్యాపరిజ్ఞానాన్ని మాత్రమే కలిగించి, బి ఏ, ఎమ్. ఏ, లను వందలా దిగా తయారుచేస్తూ ఉండడమేతప్ప, విషయంలో గాఢమైన పరిజ్ఞానం గల విద్వాంసులను సృష్టించడంలేదు. అని అతడు నుడివియున్నాడు.

విద్యా ప్రయోజనాల నతడీవిధంగా వివరించినాడు. (1) విశ్వాసాన్ని బల పరచడానికి అవసరమైన మతసత్యాలనూ, సంప్రదాయాలనూ, హేతువాదముతో సమన్వయపరచడము, (2) స్థానిక విద్యాలయాలను ఏర్పరచి, గుణశీలాల పోష ణకు తగినశిక్షణ నివ్వడము, విద్యార్థులలో సత్కార్య ప్రవృత్తిని కలిగించడము, (3) ఆధునిక విజ్ఞానశాస్త్రాలను అత్యున్నతస్థాయివరకు అభ్యసింపచేయడము, విద్యార్థులలో సహేతుక దృక్పథాన్ని పెంపొందింపచేయడము.

ఈ ప్రయోజనాలను సాధించడానికై, అతడు పాఠశాలలను స్థాపించ డము, విజ్ఞానశాస్త్ర సంఘాలను నెలకొల్పడము, ముస్లిము విద్యాసమావేశాలను ఏర్పరచడము,- ఇత్యాది కార్యక్రమాలను ప్రారంభించెను ముస్లిముసంఘ విద్యా

వ్యాప్తికై అతడు మూడు విధములైన విద్యాసంస్థలను ప్రతిపాదించెను. అవి, (1) 18 ఏండ్ల ప్రాయమునకు పైబడినవారికి ఆంగ్ల - సంప్రదాయ విద్యాకళాశాలలు ఉన్నతస్థాయిలో నెలకొల్పడము, ఒకటి. ఇందులో ఆంగ్లము, ఉర్దూ, అరబ్బీ, పారసీకభాషలు బోధించే మూడు శాఖలుచేరి యుండడము; (2) మధ్యమ స్థాయిలో,- 11 నుండి 18 వరకు వయస్సుగల విద్యార్థులకు ఉన్నతపాఠశాలలను ఏర్పరచడము; వీటిలో ఉర్దూబోధనభాష, కావడము, (3) 6 నుండి 11 వరకు వయస్సులో నున్న పిల్లలకు ప్రాథమిక పాఠశాలలను (మక్తాబులు) ఏర్పరచడము; ఈ మూడు విధములైన సంస్థలలోనూ, మతవిషయకమైన శిక్షణ నిర్బంధమై ఉంటుంది.

ఈ విధానంపై, అలిఘర్ ఆంగ్ల-ప్రాచీన విద్యాశాల 1874లో, ప్రారంభింపబడింది. ఇది 1878 నాటికి, కళాశాల స్థాయికివచ్చింది. ఆధునిక విద్యావిషయంలో ముస్లిములు జడులై వెనుకబడియుండలేదని, ఈ విద్యాసంస్థ నిరూపిస్తుంది హిందువులూ, బ్రిటీషుపరిపాలకులు కూడా ఈ విషయాన్ని గమనించినారు. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్, విశ్వవిద్యాలయాల కనుగుణంగా, ఈ అలిఘర్ కళాశాల అభివృద్ధి పొందవలెనని అహమద్ ఖాన్ ఆశయము. ఆక్స్‌ఫర్డ్, కేంబ్రిడ్జ్, విద్యాలయాలలో శిక్షణపొంది వచ్చిన విద్యార్థులు, బ్రిటీషుసామ్రాజ్యంలోని పరిపాలకులుగా, అధికారులుగా, నియోగింపబడడానికి తగిన యోగ్యతను సంపాదించుకొనియున్నారు. ఈ అలిఘరు కళాశాలలో శిక్షణనందినవారు కూడా, అట్టి యోగ్యత కలవారు కావలెనని ఇతని ఉద్దేశము. అంతమాత్రమేకాక, పాశ్చాత్య విద్యలో అత్యుత్తమమైనది, దేశీయభాషలద్వారా, ప్రజలలో వ్యాపింపజేయడం ఈ కళాశాల ప్రయోజనం కావలెనని ఇతని ఆశయము. ఆంగ్లకళాశాలలలోని ప్రమాణస్థాయిలో, విద్యగరపడాన్ని ఉర్దూవిభాగము తన ధ్యేయంగా ఉంచుకోవలెను. ఇస్లాము మతవిజ్ఞానాన్నీ, సంస్కారాన్నీ భావితరాలవారికి ప్రసారం చేయగల విద్వాంసులను తయారు గావించడము, అరబ్బీ విభాగంయొక్క ఆదర్శము.

కాని, అహమద్ ఖాన్ ఆశించిన స్థాయికి, కళాశాల, రాలేకపోయింది. పాశ్చాత్యవిజ్ఞానాన్ని ఉర్దూభాషలో ప్రసారంగావించే ఉద్యమాన్ని, ఆంగ్లశాఖ నిర్వహింపజాలక పోయింది. ఐనా, 'అలిఘర్ ఉద్యమానికి' ఈ కళాశాల కేంద్రంగా ఏర్పడి, ముస్లిము సంఘ జీవితంపైనా, భావాలపైనా, తీవ్రమైన ప్రభావాన్ని కలిగించింది.

మహమ్మడన్ ఆంగ్ల-ప్రాచీన కళాశాలా స్థాపనము అహమద్ ఖాన్ జీవితంలో, ఒక పరివర్తనాన్ని కలిగించింది. ఈ కళాశాలాభివృద్ధి విషయంలోనూ, దాని అభ్యుదయం విషయంలోనూ, తీక్షంగా కృషిచేస్తూ, తక్కిన ప్రయోజనాలకు అహమద్ ఖాన్, ప్రాధాన్యమివ్వలేదు. ఇండియాలోని ఆర్థిక రాజకీయ దుస్థితులన్నిటినీ తొలగించగలిగిన మహాసాధనం, పాశ్చాత్య ఉన్నత విద్యయొక్కటే, అనే అభిప్రాయమతనిని ఆవేశించింది. పంజాబు అలహాబాదు

విశ్వవిద్యాలయాలు ప్రాచీన సంప్రదాయ విద్యాశాలలుగా ఏర్పడుతూ ఉన్నవని తెలిసి, ఆ ఉద్యమాన్ని తీవ్రంగా ఖండించినాడు. ప్రాథమిక పాఠశాలల స్థాపనకై, ముస్లిం సంఘమువారు విరాళములద్వారా ద్రవ్యాన్ని సేకరించడం కూడా ఇతని విమర్శకు గురిఅయింది. రాజకీయాధికారాలకై జరిగే ఆందోళనలను కూడా ఇతడు నిరసించినాడు. ఉన్నత విద్యా సంపాదనవల్ల, అవి తప్పక సిద్ధించగలవని అతని భావము. ముస్లిము సంఘమువారి సహకారాభిమానముల పైనను ప్రభుత్వముయొక్క ఆదరణ సహాయములపైనను కళాశాల అభ్యుదయము ఆధారపడియున్నదని గుర్తించి, ఇతడు ముస్లిము సంఘాన్ని ప్రభుత్వాన్నీ విమర్శించడం మానుకొన్నాడు.

ఇతడు పూనుకొన్న ఉద్యమం కష్టసాధ్యమైనది. మత రాజకీయ విషయములలో ముస్లిము సంఘము, ఆ సమయంలో, రెండు కక్షలుగా ఏర్పడి యుండినది. పూర్వాచార పరాయణులైన ఉలామా సంస్థకుచెందిన, దేవబంద్ పాఠశాలాసభ్యులు, నవాబ్ అబ్దుర్ లతీఫ్‌జాన్ (కలకత్తా), నవాబ్ సిద్దిక్ హసన్‌ఖాన్ (భోపాల్), నవాబ్ రసూల్‌యార్‌ఖాన్ (హైదరాబాద్)-నవాబ్ ఇందాద్ ఆలీ (ఉత్తర ప్రదేశ్),-మున్నగు విద్వాంసులు ఇతనికి ప్రతిపక్షులు. వీరందరు ఇతని అభ్యుదయ మార్గానికీ, హేతువాద సిద్ధాంతాలకూ ప్రతికూలురై, ఇతనిని లౌకిక వాదియని (దహ్రియా) ధర్మ బాహ్యుడనికూడా, నిరసిస్తూ వచ్చిరి. తాను 'ముతజిలైట్' అని చెప్పుకొన్న మహా విద్వాంసుడైన, సయ్యద్ అమిర్ ఆలీ, ఉపాయశాలియైన సయ్యద్ మెహ్దీఆలీ (ముహ్సిన్-ఉల్ ముల్క్), మోల్వీ చిరాఘ్‌అలీ,-మున్నగు వారితనికి సహకరించి, సమర్థించుచుండిరి. సయ్యద్ మెహ్దీ ఆలీ ఇతని ప్రయత్నము లన్నిటిలోనూ, సహకరించినవాడు. చిరాగ్‌ఆలీ, సరళమైన తన వ్రాతలతో ఇతని ఉద్యమానికి తోడ్పడినాడు. వీరవలంబించిన ఉదారాభిప్రాయాల కారణంగా, ముస్లిము సంఘంలో, ఉలామాకూ, అతని అనుయాయులకూ కలిగిన పలుకుబడి వీరికి లభించలేదు.

ముస్లిముల వ్యతిరేకతను ప్రశమనం గావించే ఉద్దేశంతో, అహమ్మద్ ఖాన్, తానింతవరకు ప్రచురించుచుండిన 'తహ్దీబుల్ అఖల్క్' అనే పత్రికను ఆపివేసెను. ముస్లిములకు అనిష్టమును కలిగించే పత్రికను తొలగించి, వారిని శాంతింపజేసినాడు. ధర్మప్రచారక అత్యుత్సాహాన్ని వివేకం జయించింది.

*సయ్యద్ అహమద్‌ఖాన్,- రాజకీయాలు :* ఇస్లాము మత సంస్కరణోద్యమం అతి సాహసకార్యము. కాని, ముస్లిముల పూర్వపు ప్రాభవాన్ని మరల ప్రతిష్ఠించడము, ఇండియాలోని నూతన పరిస్థితుల కనుగుణంగా ముస్లిములకు స్థానం కల్పించడము,-ఇవి అవశ్యంగా సాధింపవలసిన ప్రధాన విషయాలు. పూర్వపుపరిస్థితులలో, అధికారంవల్ల ధనములభించేది. నూతన పరిస్థితులలో, విద్యవల్ల సామర్థ్యమూ, సామర్థ్యమువల్ల అధికారపదవులూ, లభిస్తున్నవి. కనుక, ఇతడు విద్యకు ప్రాధాన్యమిచ్చియున్నాడు.

ఇట్లు, ఆర్థికపరిస్థితులు, రాజకీయాలు, పరస్పర సంబంధము కలిగినవై,

ఒక దానిపై ఒకటి ఆధారపడి, ఉన్నవని ఇతని అభిప్రాయము. ముస్లిము సంఘము ఆర్థికంగా, అధోగతికి వచ్చియున్నదని గుర్తించినాడు. కనుక, ప్రభుత్వంతో ఏకీభవించి, ముస్లిములు తమ ఆర్థికస్థితిని బాగుపరచుకొన వలెనని, ఇతని ఆశయము. ఆర్థిక పరిస్థితికి వర్తించిన మార్గమే రాజకీయరంగానికి కూడా వర్తిస్తుంది. ఆర్థికాభివృద్ధి, రాజకీయ ప్రతిష్ఠా రెండూ కూడా ప్రభుత్వం యొక్క ఆదరణపై ఆధారపడియున్నవి. బ్రిటీషు ప్రభుత్వంతో సహకరించ డానికి అహమద్ ఖాన్ చేసిన ప్రయత్నరహస్యమంతా, ఈ అభిప్రాయంలో ఇమిడియున్నది.

ప్రభుత్వ శాసనసభలలో, భారత ప్రతినిధులందరూ చేరియుండ వలెనని, జిల్లా పరిపాలనలోను, స్థానిక పాలన సంస్థలలోనూ కూడా భారత ప్రజాప్రతి నిధులందరూ ఏకమై పాల్గొనవలెనని, భారత జాతీయ కాంగ్రెసుకు పూర్వ మితడు తీవ్రంగా వాదించి యుండెను. ముస్లిములకు ప్రత్యేకమైన ఆదరణ అవసరంలేదని, ముస్లిములు స్వశక్తిపై ఆధారపడి అభ్యుదయం పొందవలెనని, ఇతడు ప్రచారం గావించి యుండినాడు. 'ఇండియా విప్లవము' అని ఇతడు ప్రచురించిన కరపత్రంలో "శాసనసభలో దేశీయునకు స్థానం లేక పోవడమే, విప్లవానికి మూలహేతువు. ప్రజాప్రాతినిధ్యము లేక పోవడమే ప్రధాన కారణమై, తిరుగుబాటు విప్లవ రూపంలో ఉత్పన్నమయింది. తక్కిన కారణాలన్నీ ఈ ప్రయోజనాన్ని అంటి పెట్టుకొని యున్న చిన్న అంశాలు మాత్రమే. ఈ అభిప్రాయం నా ఊహాపోహలపై ఏర్పడిందికాదు, నా అభిమాన సిద్ధాంతమూ కాదు. నేను వివరింపబోయే అభిప్రాయాలతో, పర్యాలోచన శీలురైన సమర్థులు, శతాబ్దాలుగా ఏకీభవిస్తూ వచ్చినారు."

"ప్రభుత్వ శాసనసభలలో, ప్రజల అభిప్రాయాలకు స్థానం కలగడము, ప్రభుత్వ క్షేమమునకూ, ప్రభుత్వం యొక్క అభ్యుదయానికీ, ఎక్కువ సహ కారంగా ఉంటుందని,ప్రభుత్వానికి, స్థైర్యం కలిగించేది ప్రజాభిప్రాయమే అని అనేకులు అంగీకరిస్తారని నా విశ్వాసము. ప్రభుత్వము నిర్వహించడానికి బూను కొన్న పథకాలు, ప్రజలకిష్టమగునా, కాదా అనే విషయము ప్రజాభిప్రాయాన్ని బట్టే గ్రహించవలసి ఉంటుంది. పరిపాలనలో జరిగిన లోపాలను కాని, దోషాలను కాని, ప్రజల అభిప్రాయాన్నిబట్టి గుర్తించి, వాటిని ఆదియందే సవరించడానికి అవకాశం కలుగుతుంది. దోషాలవల్ల కలుగబోయే ఆపదను ప్రజాభిప్రాయంవల్ల గ్రహించే అవకాశంలేనినాడు, దేశమంతా నాశంకావచ్చు."

శాసన సభలనుండి దేశీయులను బహిష్కరించడానికి కారణమేమో తెలి యడం లేదు. దేశంలోని దుస్థితి కంతటికీ, ఈ బహిష్కారమే మూలకందము. భారతదేశంలో ఉత్పన్నములైన దుష్ట సంఘటనల కన్నిటికీ, ఇదే ప్రబలహేతువు. విద్యా విహీనులై, రాజకీయ పరిజ్ఞానంలేని దేశీయులేవిధంగా శాసనసభ కార్య క్రమాలలో పాల్గొనగలరనే సమస్యను, చర్చించడానికి ఇప్పుడు ప్రయత్నించను.

ఇంగ్లీషు పార్లమెంటు ఏర్పడిన పద్ధతిపై మనం దేశంలో ఏ విధంగా సభ్యులను ఎన్నుకొనవలెననే సమస్యకూడా, చర్చనీయాంశము కాదు. అవి, క్లిష్ట సమస్యలనడం వాస్తవమే. అట్టి ప్రజాప్రాతినిధ్యము సమంజస మనడమేకాదు, అత్యంతావసరమని, నిరూపించడమే నా ప్రయత్నము. దీనిని నిర్లక్ష్యం చేసినందువల్లనే, దేశంలో కలతలు, కల్లోలాలు ఏర్పడి, మహా విప్లవంగా పరిణమించినవి."

బ్రిటీషు ఇండియా సంస్థను అతడు స్థాపించిన సందర్భంలో (1866) ఉపన్యసిస్తూ, తమ ప్రయోజనాలను సాధించడానికి తగిన ప్రాతినిధ్యాన్ని, శాసన సభలలో సంపాదించుకోడానికి ప్రయత్నించ వలసిందని భారతీయులను ప్రోత్సహించియున్నాడు. ప్రభుత్వానికి, ప్రభుత్వాధికారులకు భయపడి, మీస్వత్వమైయున్న ప్రజాప్రాతినిధ్యానికై ప్రయత్నింపక పోవడము, అవివేకము మాత్రమే కాక, భీరుత్వము అనికూడా హెచ్చరించెను. తమ పరిస్థితులను అభివృద్ధి గావించుకొనే ప్రయత్నంలో హిందువులు ముస్లిములు పరస్పరం సహకరించవలెననీ, అట్టి పద్ధతి తన అభిమతమనీ తెలిపియున్నాడు. "గోవధను, మానడంవల్ల హిందూ ముస్లిముల మధ్య, పొందిక, స్నేహము, ఏర్పడితే, దయచేసి, గోవధను మానడము సహస్ర విధాలుగా శ్రేయము" అని ముస్లిములకు బోధించియున్నాడు.

ఇండియాలోని వారందరూ, ఏకజాతివారనే విషయంపై, పాట్నా ఉపన్యాసంలో నిష్కర్షమైన అభిప్రాయాలను వ్యక్త మొనర్చియున్నాడు. "హిందువు ముస్లిము, అనేవి, కేవల మతసూచకములైన 'పదములు' మాత్రమే అని జ్ఞాపక ముంచుకోండి. హిందువు, ముస్లిము, క్రిశ్చియను,-ఎవ్వరేకాని ఇండియాలో నివాసులై యుండడంవల్ల, ఒక జాతికి చెందినవారై యున్నారు. భిన్నవర్గాలు పాటిస్తున్న భిన్న మతాలనుబట్టి, ఒక దేశనివాసులైన ప్రజలు భిన్న జాతులుగా పరిగణింపబడే కాలం ఎప్పుడో గతించిపోయింది.

గురుదాస పూరులో, అతడు గావించిన ఉపన్యాసములో (27-1-1884), రెండు మతముల ఐక్యమును గూర్చిన తన దృఢవిశ్వాసాన్ని ప్రకటించినాడు. "హిందూ మతస్థులు, ఇస్లాము మతస్థులు ఐన మనము, ఏకహృదయంగా, ఒక్క ఆత్మగా, ఏర్పడి, సాంగత్యంతో, కార్యనిర్వహణకు పూనుకోవలసియున్నది. అట్టి సాంగత్యమున్నప్పుడే పరస్పరము రక్షించుకోగలము. కానినాడు, పరస్పరాఘాతంవల్ల, రెండు వర్గాలూ పతనమై పోవడం తప్పదు.

"హిందూ మహమ్మదీయ సోదరులారా ! హిందూస్థానములో కాక, మరి ఏ ఇతరదేశములోనైనా మీరు నివసిస్తున్నారా ? ఒక దేశవాసులు కారా మీరు ? మిమ్ములను దహించడము, పూడ్చడము, ఈ నేలలోనే కాదా జరుగుతున్నది ? ఒకే నేలపై నడుస్తూ, ఒకే భూమిపై ఆధారపడి బ్రతకడం లేదా ? హిందువు, ముస్లిం అనే శబ్దాలు రెండు మతాలను సూచించడానికి ఏర్పడిన చిహ్నాలు మాత్రమే అని జ్ఞాపకముంచుకొండి. హిందువులు, ముస్లిములు, క్రిశ్చియనులు కూడా,- ఈ దేశవాసులైన వారందరూ ఈ విషయంలో ఒకే జాతివారని గ్రహించండి. ఈ భిన్నమతాలన్నీ ఒకే జాతిలోని వర్గభేదాలు

మాత్రమే. మనకందరికీ సమానమై యున్న దేశక్షేమం విషయంలో ప్రతి యొక్కరూ ఏకీభవించవలెను."

## VI సయ్యద్ అహమద్ ఖాన్-అలిఘర్ ఉద్యమము

సయ్యాద్ అహమద్ ఖాన్ ఇంత వరకూ పాటిస్తూ వచ్చిన ఈ ఉదార వాదం 1885 కు పిమ్మట, పరావర్తన మొందుతూ వచ్చింది. మత విషయము లలో కంటె ఎక్కువ జాగ్రతతో రాజకీయ విషయములలో, ప్రవర్తింప వలసి యున్నదని అతడు భావించడం, శోచనీయమైన పరివర్తనము. మత విషయంలో సులభంగా ఉద్రేకంపొందే ముస్లిములను నొప్పింపక, వారిని తన పక్షంవారిగా చేసుకోవడం, ఆవశ్యక మయింది. రాజకీయ విషయాలలో పాలకులకు తమపై గల వ్యతిరేక భావాన్ని పోగొట్టి, వారి సానుభూతి సహాయాలను పొందవలసిన అవసరమున్నదని అతడు భావించినాడు.

ముస్లిము సంఘము రాజకీయ ప్రయోజనముల విషయములో భిన్నాభి ప్రాయాలకు లోనై యుండడ మిందుకు పెద్ద ప్రతిబంధకమయింది. ముస్లిము సంఘములో ఎక్కువ పలుకుబడియున్న ఉలామా, బ్రిటీషు ప్రభుత్వంతోను, వారి సంస్కారం తోనూ, సంబంధము కూడదని పట్టుపట్టియున్నాడు. ఇంతే కాక, ప్రపంచమందలి ఇస్లాము దేశాలలో జరిగిన ఉదంతాలవల్ల ముస్లిములలో, అలజడి ప్రారంభమయింది. 1878లో, ఆటోమాన్ సామ్రాజ్యము, రష్యనుల చేతుల్లో,- అవమానకరమైన అపజయాన్ని పొందింది. ఎక్కువ భూభాగాన్ని, ప్రతిష్ఠను క్యాలిఫేట్ గోల్పోయింది. టర్కీ సుల్తానును క్యాలిఫాగా గౌరవించు చున్న ఇండియను ముస్లిములకీ అపజయము సహింపరానిదయింది. అదే సమయంలో, మరియొక ముస్లిము రాజ్యము,-ఈజిప్టు-క్రమంగా స్వాతంత్ర్యాన్ని గోల్పోతూ, వేగంగా బ్రిటీషు ఆధిపత్యంలోకి చేరిపోయే పరిస్థితి ఏర్పడింది. 'ఖెదివ్'ను రాజ్యభ్రష్టుని గావించడము, అరాబీ పాషాను ఓడించడము (1881)- అనే ఉదంతాలు, ముస్లిములకు గొప్ప ఆఘాతములై, ఇస్లాము దేశము లందం తటా ప్రతిక్రియలు జరిగినవి.

మరిన్ని, బ్రిటను రష్యాల మధ్య ఏర్పడిన ప్రతిస్పర్ధ కారణంగా, ఆఫ్గన్ యుద్ధమేర్పడి, జెనరల్ రాబర్ట్సుకు కాబూలు వశమైపోయింది. తత్ఫలితంగా, ఆఫ్గనిస్థానము బ్రిటీషువారి ప్రాభవానికి లోబడిపోయింది. ఇక, ఇరానులో, దక్షిణంలోని పర్షియన్‌గల్ఫ్ తీరమంతా బ్రిటీషువారి ఆధిపత్యానికీ, ఉత్తర భాగము రష్యనుల ఆధిపత్యానికీ, లోబడింది.

ఈ పరిస్థితుల ఫలితంగా, ముస్లిము దేశాలలో తమ పట్ల, ఉద్రిక్త లజ్జా భావాలూ, యూరోపు సామ్రాజ్యాల పట్ల,-అందునూ ముఖ్యంగా బ్రిటను పట్ల,-క్రోధ ద్వేషాలూ పెచ్చు పెరిగినవి. ఇట్టి సందర్భంలో సయ్యాద్-జమాల్-అల్-దీన్-అఫ్గానీ ముస్లిము దేశాలకు నాయకుడుగా, ప్రోత్సాహకుడుగా ఏర్పడినాడు. పాండిత్యము, వాగ్ధోరణి, అనంతమైన శక్తి, స్వార్థరహితమైన

శ్రద్ధా-గల ఇతడు సాంస్కృతికంగాను, రాజకీయంగాను, ముస్లిములకు కలుగ బోయే అపాయాన్ని వారు గ్రహించునట్లుచేసి, ముస్లిము దేశాలను ప్రబోధించెను. పాన్ ఇస్లామిక్ ఉద్యమాన్ని లేవదీసి, దాని కితడు ప్రముఖుడైనాడు.

అతని రచనలను, ఉపన్యాసాలను, ఇండియాలోని ముస్లిములందరు, అన్ని వర్గాలవారు అత్యాశతోచదువుతూ వచ్చిరి. మూడవ సారి అతడు ఇండియా రాగానే (1879-80), ముస్లిము యువకులతనికి వీరోచితమైన ఆహ్వానాన్నిచ్చి, అతడు తమ ఉద్ధారకుడని (Messaiah) పూజించిరి. ఒక సంవత్సర కాలమతడు ఇండియాలో నివసించి, సయ్యద్ అహమద్ ఖాన్ ప్రతిపక్షాన్ని బలపరచెను. అహమద్ ఖాన్ మత సిద్ధాంతాలను, రాజకీయాభిప్రాయాలను తీవ్రంగా ఖండించినాడు అఫ్గానీ. కురాను విషయంలో అహమద్ ఖాన్ గావించిన వ్యాఖ్యానము, అజ్ఞానంవల్ల ఉత్పన్నమైన, నింద్యవివరణమని, తిరస్కరించెను. "ముస్లిముల మత విశ్వాసాలను నశింపజేసి, పరుల ప్రయోజనాన్ని సాధించి, ముస్లిములను పరమతంలో చేర్చే పన్నాగమని" అహమద్ ఖాన్ ఉద్యమాన్ని నిరసించినాడు.

రాజకీయ స్వాతంత్ర్యాన్ని, సర్వసమానత్వాన్ని అభిమానించిన అఫ్గానీ, పాశ్చాత్య సామ్రాజ్య నీతికి బద్ధశత్రువు. ముస్లిము దేశాలకు జరిగిన అన్యాయం కారణంగా, ఇండియను ముస్లిములలో ఉదయించియుండిన సానుభూతిని ఇతడు తన ప్రబోధనలతో, ఘనీభవింపజేసి, దాని కొక ఆకారాన్ని కలిగించినాడు. ముస్లిముల ఐక్య భావం, రూపొందింది· దానిననుసరించి, ప్రపంచమందలి ఇస్లాము మతస్థుల విశాల ఐక్యము ఏర్పడవలెననే భావం ఉదయించింది. అఫ్గానీ, ప్రచారం గావించిన ప్రయోజనాలు, అహమద్ ఖాన్ అవలంబించిన రాజకీయాభిప్రాయాలకు పూర్తిగా విరుద్ధమైనవి. భారత దేశీయులకు స్వామ్య ప్రభుత్వము, స్వపరిపాలన సాధ్యము కానిదనీ, అది అసమంజసమనీ, నమ్మినవాడు అహమద్ ఖాన్. అలిఘర్ ఉద్యమానికి మూలాధారమైన, ఆంగ్లముస్లిము సాంగత్యము, ఒక్కటే ముస్లిముల రక్షణభద్రతలకు, వారి సంయోజనానికి ఏకైక సాధనమని ఇతని విశ్వాసము.

కనుక, అహమదుఖానును ఎదుర్కొన్న సమస్యలు ప్రబలములైనట్టివి. కాని, 1885 నాటికి, ఆ సమస్యలకు ప్రతి క్రియారూప సంఘటనలు ఏర్పడి, ఇతని ఉద్యమానికి సహకరించినవి. ముస్లిము సంఘానికీ, బ్రిటిషువారికీ మధ్య, సౌహార్దము సిద్ధించే అవకాశం ఏర్పడడం మొదటిది. యూరోపులో, టర్కీ దేశాన్ని ముక్కలుగా చేస్తున్న రష్షియా ప్రయత్నాన్ని, బ్రిటను భగ్నంచేసింది. ఆఫ్ఘనిస్తానుపట్ల బ్రిటీషువారి విధానము కూడా సుముఖంగా మారుతూవచ్చింది. మధ్య ఏషియా ప్రాంతాలకు రష్షియనులు చొచ్చుకొని రాగలరనే భయంవల్ల, బ్రిటీషువారు ముస్లిము రాజ్యాలతో జాగ్రత్తతో వ్యవహరింపసాగిరి. అమీర్ అబ్దుల్ రహమాన్ ఖాన్ ఆహ్వానానికై, రావల్ పిండిలో బ్రిటిషు వారేర్పాటు గావించిన దర్బారు, ఇందుకు సూచనగా ఉన్నది. ఇండియాలో, ముస్లిములపట్ల,

బ్రిటీషువారి ప్రవృత్తిలో కూడా మార్పు ఏర్పడింది. పూర్వపు వ్యతిరేక భావానికి మారుగా, ముస్లిము వర్గాలవారికి తోడ్పడే విధానం ప్రారంభమయింది. ఈ మార్పు ఏనాటి నుండి కలుగనారంభించింది అని సూటిగా నిర్ణయించలేము. కాని, హంటర్ రచించిన 'ఇండియా ముసల్మానులు' అనే గ్రంథం ప్రకటింపబడిన తర్వాత నుంచీ, ఈ మార్పు గోచరిస్తూ వచ్చిందని మాత్రం చెప్పగలము. ముస్లిములకు జరిగిన అన్యాయాన్ని, హంటరు బ్రిటీషు ప్రభుత్వపు దృష్టికి తెచ్చినాడు. "సానుభూతి లేకుండడమూ, ఔదార్యం తమ పట్లచూపక పోవడమూ, తమద్రవ్యాన్ని నీచంగా దుర్వినియోగం గావించడమూ, ఇండియా పౌరులైన తమకు ఒక శతాబ్దంగా జరుగుతున్న అన్యాయాలూ,"- ఇత్యాదిగా గల వీరి ఆక్షేపణలన్నీ ప్రభుత్వం దృష్టికితెచ్చింది హంటర్ గ్రంథము. ఆవేశానికి లోనుగాక, ముస్లిముల పక్షాన్ని సమర్థించిన వారిలో ఇతడే మొదటివాడు. కలకత్తా మద్రసాకు పూర్వము అధ్యక్షుడుగా నుండిన, నాసో లీస్ (Nassau Lees), ఆంగ్ల-మహమ్మదీయ కళాశాలకు చెందిన బెక్, మారిసన్‌లు, బ్లంట్, అనే వారు ఈ విషయమై వాదించిన ఇతర పాశ్చాత్యులు. తమ హక్కులకై గట్టిగా ప్రయత్నం చేయవలసిందని ముస్లిములను, ప్రోద్బలంగావించినారు."ముస్లిములు తమ శక్తిసామర్థ్యాలను గుర్తిస్తే, ప్రభుత్వం ఈ విధంగా నిర్లక్ష్యంచేసి, వారిని నిరసనభావంతో చూడదు," అని వారిని బ్లంట్ ప్రోత్సహించినాడు. "ఇండియాలో ముస్లిములు తిరుగుబాటు గావింతురనే భయము, ఇంగ్లాండులో నున్న మాకు ఎప్పుడూ ఉండేది. కనుకనే, ఏ ముస్లిముచెప్పిన మాటనైనా మేము శ్రద్ధతో ఆలకించేవారము. హిందువులు అరవైమంది చెప్పినదాన్ని కూడా అంతగా గమనించేవారము కాము. తమకు గలిగిన నష్టానికంతటికీ ఈశ్వరుడే కారకుడని, ముస్లిములు అతనిని భజిస్తూ కూర్చుంటే ఎవ్వరూ సహాయమొనర్చరు. మిమ్ముల నాస్థితిలోనే, సంతోషంతో వదలివేయడానికి, ఇంగ్లాండు పౌరులకెట్టి అభ్యంతరమూ ఉండదు." అని అతడువ్రాసి, ముస్లిములను కార్యాచరణానికై ప్రబోధించినాడు.

1885లో, ఇండియా ప్రభుత్వ కార్యదర్శియైన రాండాల్ఫ చర్చిల్ (Randolph Churchill) ఇండియా వచ్చెను. ముస్లిములపట్ల, బ్రిటీషువారు అనుకూల విధానాన్ని పాటించడం ధ్రువమని ఇండియా ప్రభుత్వానికి కతడు తెలియజేసినాడని, ఊహించడానికి అవకాశాలున్నాయి. ఏదైనా, 1888 నాటికి, ప్రభుత్వ విధానం సుస్పష్టమయింది. కాంగ్రెసు వారి రాజకీయ కార్యక్రమాల పరిణామము అపాయకరమైనదని, సర్ ఆక్లండ్‌కాల్విన్, హ్యూముకు సూచించినాడు.

డఫ్రిన్ భయభ్రాంతుడైనాడు. ముస్లిము లిచ్చిన వీడ్కోలు పత్రానికి బదులు పలుకుతూ అతడు వారిని ఈ క్రిందివాక్యములతో పొగడినాడు."పూర్వం అత్యున్నతాధికారాన్ని వహించియుండిన వ్యక్తుల సంతతివారైన మీరు, పరిపాలకులు వహించిన బాధ్యత ఎట్టిదైయుండునో గ్రహించడానికి తగిన సమర్థులై

యున్నారు".

ఈ అనుకూలవిధానాన్ని. పెంపొందించే ఉద్దేశంతో, నార్త్‌బ్రూక్ ప్రభువు, అలిఘర్ కళాశాలలోని విద్యార్థి వేతన ప్రయోజనార్థం, 10,000 రూపాయలను, విరాళంగా ఇచ్చెను. ఈ కళాశాలను ఔదార్యంతో పోషించవలసిందని తన దేశీయులకు, జాన్‌స్ట్రాచీ, సిఫార్సుగావించెను. విద్యాసమితి అధ్యక్షుడైన హంటర్, కమీషన్ సమావేశాన్ని అలిఘర్‌లో ఏర్పాటుచేసి, అలిఘర్ విద్యాలయ ప్రాధాన్యాన్ని, పరోక్షంగా, అభినందించి, విద్యావిషయంలో ముస్లిముల ప్రత్యేకపు హక్కులను అంగీకరించెను. అలిఘర్ కళాశాలాస్థాపకులు ప్రభుత్వమునకు గొప్ప సేవగావించి, యున్నారని, ఆల్ఫ్రెడ్‌లైయల్ ప్రశంసించినాడు. తరవాత, ప్రభుత్వంపట్ల భక్తివిశ్వాసాలను ఉద్బోధించిన ఈ కళాశాలపట్ల తమకు ప్రత్యేకాభిమానం కలదని, ఆక్‌లండ్‌కాల్విన్, ఆశ్వాసం కలిగించినాడు.

ఈ కాలంలో, హిందువులకు ముస్లిములకు మధ్య సంబంధాలు బిగిసిపోవడం దురదృష్టము. సాంఘిక, రాజకీయ, ఆర్థికకారణాలన్నీ, ఈ అభిప్రాయవైరుధ్యానికి హేతువులైనవి. కొన్ని అగ్రవర్గాలను బాధించినవి. కొన్ని ప్రజానీకంలో అలజడికి హేతువులైనవి. తక్కినవి రెండువర్గాలవారినీ బాధించినవి. ప్రభుత్వోద్యోగాలకై విద్యావంతులైన హిందూముస్లిముల పోటీవల్ల ఏర్పడినది ఈఘర్షణ. జీవనోపాధికి సంబంధించిన సమస్యకావడంవల్ల, రెండువర్గాలవారి ప్రయోజనాలకూ ఘర్షణఏర్పడి,- రెండుమత సంఘాలమధ్య సంబంధము, బెడిసింది. 19వ శతాబ్దపు చతుర్థభాగమువరకూ, హిందువులు ఉద్యోగాలకై ఎక్కువ ప్రయత్నం గావించి, బ్రిటీషు రాజ్యపరిపాలనలో క్రియాత్మక కార్యాచరణంలో ఎక్కువగా పాల్గొని ఉన్నారు. హిందువులలో విద్యావ్యాప్తి బాగా జరిగింది. ముస్లిములాకాలంలో, ఆంగ్లవిద్యకు దూరంగా ఉండిపోయిరి. ఆ కారణంవల్ల, ప్రభుత్వోద్యోగాలు, స్వతంత్రవృత్తులలో అభివృద్ధి, ఇత్యాదిఅవకాశాలు చాలభాగము హిందువులవశమైపోయినవి. ఇదికాక పత్రికారచన, చాలభాగం హిందువుల హస్తగతమై ఉండడంవల్ల రాజకీయాందోళన, వారి స్వామ్యంగా పరిణమించింది. 1893 లో, ఇండియా ప్రభుత్వము వివరించినట్లుగా, "ప్రభుత్వోద్యోగముల నుంచి, ఇతర స్వతంత్ర ఉద్యోగాల నుంచి, ముస్లిములు బహిష్కరింపబడి యుండినందువల్ల, ముస్లింవర్గంవారు నష్టపడినారు. తత్ఫలితంగా, హిందువులపట్ల అసూయాభావం ఏర్పడింది. పూర్వపు తమఉన్నతస్థితిని గూర్చిన స్మరణవల్ల, ఈభావం తీవ్రమౌతూ వచ్చింది."

పిమ్మట, 1885 డిసెంబరులో జరిగిన భారతజాతీయ కాంగ్రెసు మహాసభ, అహమద్‌ఖానును కల్లోలపరచింది. కాంగ్రెసు వారాసభలో గావించిన తీర్మానములలో, భారతీయులకు శాసనసభలలో ప్రాతి నిధ్యం ఏర్పడవలెననే తీర్మానము ప్రధానమైనది. కాంగ్రెసువారి కోరికలను ప్రభుత్వము అంగీకరించనట్టయితే, తమ ముస్లిం వర్గంవారి భవిష్యత్తు అంధకార బంధురమై పోతుందనే భ్రాంతికి ఇతడు లోనైనాడు. కాంగ్రెసుకు వ్యతిరేకించి ముస్లిములు అందులో చేరరాదనే ప్రయ

త్వానికి ఇతడు పూనుకోడానికి తగిన కారణం లేకపోలేదు. సామాన్యంగా ఎన్నికలు జరిగే పద్ధతిలో, అల్ప సంఖ్యాకులైయున్న ముస్లిములకు శాసనసభలలో ప్రాతినిధ్యము లభించే అవకాశం స్వల్పమని, అతడు సంశయించినాడు. పందొమ్మిదో శతాబ్దంలో, ఇట్టి సంశయానికి తగిన ఆధారం లేకపోలేదు. యూరోపులో అంతటా, జాతిమత భాషా విషయములలో అల్ప సంఖ్యాకులైన వర్గాలవారు, అధిక సంఖ్యాకులతో ఘర్షణపడుతూ ఉండిరి. ఆయాదేశాలలో ఛిద్రములై యున్న ఈవర్గాలవారు, పరిసరదేశాలలోని తమ వర్గాల వారితో చేరి, ఏకీకరణ వాదానికి పూనుకొని, తమ నివాస దేశముల అధిక సంఖ్యాకులతో వేరు పడడం జరుగుతూ ఉండినది. ఉదాహరణకు :- ఆస్ట్రియను టైరోలులోని ఇటాలియను భాషలవారూ, ట్రియెస్టిలోని వారూకలిసి, ఇటలీలో చేరవలెనని కోరియుండిరి. అదేవిధంగా, స్లావ్ దేశాలలోని జర్మనులు, జర్మనీతో సంబంధమేర్పడ వలెనని ఆందోళన గావించినారు. అల్ప సంఖ్యాకులైన ఇతర జాతులవారు కూడా ఇదేవిధమైన ఆందోళన ప్రారంభించి యుండిరి. ఆస్ట్రియా, టర్కీ, సామ్రాజ్యములలోని స్లావులు, గొప్ప స్లావుదేశమైన రష్యాతో చేరిపోవలెనని కాంక్షిస్తూ ఉండిరి. ఈ విషయంలో ఆటోమన్ సామ్రాజ్యము సమంజసమైన ఉదాహరణ. ఈ ముస్లిము సామ్రాజ్యపు సరిహద్దులలోపల, ముస్లిములు కానటువంటి అల్ప సంఖ్యాకులైన ఇతరజాతుల వారనేకులుండిరి. వీరిలో ఆర్మీనియనులు, గ్రీకులు, ముఖ్యులు. వీరికి ఏర్పడియుండిన కష్టాలలో కొన్ని వాస్తవమైనవి, కొన్ని భావించుకొన్నవి,- ఈ అల్పసంఖ్యాక జాతులకు కష్టాలు ఏర్పడినవనేమిషతో, యూరోపు క్రిశ్చియను ప్రభుత్వాలు, జోక్యం కలిగించుకొని, వారికి రక్షకులై నిలిచిరి.

ఇండియాలో, హిందువులతో సమానమైన ప్రతిపత్తితో జీవించడము, ప్రాచీన ముస్లిమువంశాల వారికి రుచించలేదు. ఆరుశతాబ్దాలకాలము తమ మతం వారు పరిపాలించినరాజ్యంలో, తమ పాలనకు లోబడియున్న హిందువులతో, ఇపుడు సమానంగా నివసించే పరిస్థితికి వీరి హృదయాలంగీకరించ లేదు. ఆధిపత్య సంప్రదాయాలు ముస్లిములలో జన్మతః సిద్ధించియుండడంవల్ల, రాజకీయంగా తమకు ప్రాధాన్యం ఉన్నదని, అందువల్ల విశిష్టమైన ప్రాతినిధ్యం తమకు పరిపాలనలో ఏర్పడవలెనని వీరు ప్రభుత్వాన్ని కోరుతూ వచ్చిరి.

ముస్లిములలోని సామాన్య జనానికి ఆర్థిక పరిస్థితులు మాత్రమే ప్రాధాన్యము. భూస్వాములైన హిందువులు, ముస్లిములు కూడా తమ రైతులతో ఘర్షణపడుచుండడం ఇందులకు నిదర్శనము. ఈ విషయంలో మత భేదాలేవీ ప్రవర్తించినవికావు. ఆర్థిక విషయం మాత్రమే, ఘర్షణకు కారణమైనది. హిందూ వడ్డీ వ్యాపారస్థులు, ముస్లిము ఋణగ్రస్తులు, పరస్పరము విరోధులు. ఈ ఆర్థిక సంఘర్షణను తీవ్రము గావించిన విషయం చేతి పరిశ్రమలనాశము. అందులోనూ, చేతి పరిశ్రమలు, చాలవరకు, ముస్లిముల అధీనమందుండినవి. కనుక అవి నశించడంతో ఆర్థిక సంఘర్షణ ప్రారంభమయింది

## V కులతత్త్వంపై ఆధారపడిన రాజనీతి

పందొమ్మిదో శతాబ్దంలో వ్యాప్తిచెందిన పునరుజ్జీవనోద్యమాలు, పరస్పర సంశయాలను, భయాలను ఉద్రేకపరిచినవి. ఢిల్లీ వాస్తవ్యుడైన షావలీయుల్లా స్థాపించిన సంస్థ, అతని శిష్యులు దేవబంద్‌లో స్థాపించిన విద్యాలయము, సయ్యద్ అహమద్‌ఖాన్ ప్రారంభించిన సంస్కరణోద్యమము,—ఇవన్నీ, ముస్లిము సంఘముయొక్క పవిత్రతను, మతాభినివేశాన్ని పునఃప్రతిష్ఠ గావించడంలో కార్యకారులైనవి. హిందువుల సంపర్క-సాహచర్యాలవల్ల ముస్లిములలో ఏర్పడిన ఆచారాలను, ఇతర పద్ధతులను తొలగించడం, ప్రధానమైన సంస్కరణగా, పునరుజ్జీవనోద్యమ వాదులు నొక్కిచెప్పిరి. ముస్లిము సంఘములో జరిగిన ప్రయత్నమిది. ఇక హిందువుల విషయము;- క్రిశ్చియను మిషనరీలు, అభ్యుదయ వాదులు, హిందూ మత సాంప్రదాయములపై చేస్తూ ఉండిన దాడులనుంచి రక్షించుకోడానికై, రాధా కాంతదేవ్, కలకత్తాలో నెలకొల్పిన 'ధర్మ సభ,, హిందూ సంఘ పునరుజ్జీవనకు పూనుకొనినది. అది క్రమంగా, శక్తివంతమై, సాహిత్యరంగంలో ప్రతిభాశాలియైన బంకించంద్ర ఛటర్జీవంటి రచయితల ప్రోద్బలంవల్ల, ప్రజామోదాన్ని, బలాన్ని చేకూర్చుకొన్నది. స్వామి దయానంద సరస్వతి, ఆర్య సమాజ స్థాపనకు బొంబాయిలో శంకు స్థాపనగావించెను. (1875) కాని, ఈ సమాజ ప్రభావము, ఉత్తర భారతంలో ఎక్కువగా ప్రసరించింది. వేద పరిశీలనకు బూనుకోవలసిందని హిందువులను ఇతడు ఆదేశించెను. ఇతర మతములలో చేరిన హిందువులను మరల సంఘంలోకి గ్రహించే ప్రయత్నానికి ఇతడు బూనుకొన్నాడు.

పాశ్చాత్య విద్యాభ్యాసం వల్ల, హిందూమతంపట్ల ఏర్పడిన నిర్లక్ష్య భావానికి ప్రతిక్రియగా, హిందూమత సిద్ధాంతాలను, ఆచారాలను ప్రచారము గావించి, మతాన్ని గౌరవించి, రక్షించే కార్యక్రమం ప్రారంభమయింది. ఈ ఉద్యమం ఉన్నత వర్గాలవారికి మాత్రమే పరిమితం కాలేదు. నిమ్న కులాలని పరిగణింపబడిన వారిలో కూడా ఈ ఉద్యమం, ప్రచలనం తెచ్చింది. హిందూ సంఘములో ఉన్నతస్థాయిని సంపాదించుకోవడానికై, పాటుపడుతున్న ఈ కులాలవారు, మత సంప్రదాయాలను, ఆచారాలను పాటించడంలో, ఇంకను ఎక్కువగా, శ్రద్ధానిష్ఠలను ప్రదర్శిస్తూ వచ్చిరి. ఈ ఉద్యమంవల్ల, ప్రాచీన హిందూ సంస్థపై, సంప్రదాయాలపై ఎక్కువ గౌరవ మేర్పడింది.

రెండు మతాలవారూ, సమానాశయాలతో, సమానమైన పద్ధతులతో, తమ మతపునరుజ్జీవనోద్యమాలను, ఒకే కాలంలో, సాగించినారు. కాని, దురదృష్టంవల్ల, ఈ రెండు వర్గాలలోని ఉదారభావాలను, పరమత సహనాన్ని బలపరచడానికి ఆవశ్యకమైన పరస్పర సహకారం లేక పోయింది. దీనికి మారుగా, ఒకరి ఉద్దేశాలను మరియొకరు సంశయిస్తూ వచ్చిరి. నిషేధప్రతిషేధాలకు మాత్రమే ప్రాధాన్యమిచ్చినందువల్ల, ఉద్యమాలు, కలహ ప్రవృత్తికీ, స్వోత్క

ర్షకూ ఆకరములు కావడం సైజము. తామే ధర్మిష్ఠులమనే భావం రెండు వర్గాలలోనూ ఏర్పడింది. ఆత్మశ్రేష్ఠతా భావము,-"నీ కంటెను నేనే పవిత్రుడను"- అనే భావము రెండు మతోత్సాహులలోనూ సిద్ధించినవి. లౌకిక జీవితానికి సంబంధించిన విషయాలలో, రెండు వర్గాల వారిలోనూ, సంకుచితమైన స్వార్థము ఇదివరకే ప్రబలుతూ వచ్చింది. ప్రభుత్వమవలంబించిన విభేదవిధానము, ఈ స్వార్థాన్ని మరింత తీవ్రమొనర్చింది. ఏకైక స్వార్థప్రయోజనము అనే భావము బాగా ప్రబలింది. కనుక, మతాన్ని పునఃప్రతిష్ఠగావించే ప్రయత్నాలు, మతతత్త్వాలను తీవ్రముగావించడంలో ఆశ్చర్యం లేదు. అందులోను, నిరుద్యోగ సమస్యను పరిష్కరించడానికి తగిన అవకాశాలను కలిగించే సామర్థ్యం ఆర్థిక పరిస్థితికి లేనప్పుడు, ప్రభుత్వోద్యోగాలకు ప్రాకులాడడము, ఆ ప్రయత్నంలో ఘర్షణ పడడము తప్పదు.

ఈ పరిస్థితిలో అత్యంతావశ్యకమైనవి, భావిదృష్టి, ఆత్మసంయమనము. రెండు సంఘాల వారి శాశ్వత ప్రయోజనాలూ సమానములే. ఆ ప్రయోజనాలు అవసరములై యుండడానికీ లభింపకపోవడానికీ కారణం కూడా ఇరువురికీ సమానమైనదే. ఇరువురూ ప్రభుత్వంపై ఆధారపడి యుండడము, ఇరువురూ పరప్రభుత్వానికి లోబడి యుండడము,- అనే అధీన పరిస్థితి ప్రధానమైన మూల హేతువు,- కాని, తన స్థితిని తాను బాగుపరచుకొనవలెననే, ఆతురతతో, ప్రతి వర్గమూ, తనకనుకూలమైన రాజకీయ విధానాన్ని అనుసరించడంతో, రెండు వర్గాలకూ మధ్య అంతరం పెద్దదయింది. పరస్పర ప్రత్యారోపణలకు, దోషారోపణలకు, బూనుకొనడంవల్ల, రెండు పక్షాలవారి భవిష్యత్తూ, మూడవవర్గం వారి నిర్ణయానికి పాల్పడినది. రెండు వర్గాల వారి అభిప్రాయ భేదాలవల్ల, మూడవ వర్గానికి సమగ్రమైన లాభం సిద్ధించింది. ఇండియాపై బ్రిటీషు అధిపత్యం దీనితో స్థిరపడింది. తమ పరిపాలనను సమర్థించుకోడానికి తగినంత సదవకాశం బ్రిటీషు వారికి లభించింది.

నూతనోద్యమంవల్ల, ప్రాచీన సిద్ధాంతాలకు, ఆచారవ్యవహారాలకు, ప్రశస్తికలిగింది. ప్రాచీన సంస్కృతిలోని, విజాతీయాంశాలను తీసివేసి, దానిని పునీతమొనర్చవలెననే నూతనోత్సాహం ఉదయించింది. ఇట్టి ప్రయత్నాలలో, హిందూ ముస్లిముల విభేదాన్ని మరింత వృద్ధిచేసినవి కూడా, గలవు. (1) గోరక్షణ, (2) హిందీ-ఉర్దూ వివాదము, (3) పండుగలు-పర్వదినాలు,- వీటి సందర్భంలో విశేషసౌకర్యములకై పట్టుపట్టడం, మొదలైనవి. అందులోను, హిందూ ముస్లిము పంచాంగాలనుబట్టి రెండు వర్గాల వారి పండుగలూ ఒకే సమయంలో ఏర్పడినప్పుడు ఈ వివాదాలు మరింత తీవ్రములైనాయి. రెండు వర్గాల వారి మధ్య వైషమ్యాన్ని ప్రబలంచేసిన ఇతరకారణాలు కూడా ఇందుకు తోడ్పడినవి. బ్రిటీషు పరిపాలనకు పూర్వము, ఒక ప్రదేశంలో ఒక మతం వారు అధిక సంఖ్యాకులై ఉంటే, ఇతర భాగంలో రెండవవర్గం వారి సంఖ్య అధికమై యుండి, రెండు వర్గాలకూ, సమాన ప్రాబల్యం ఏర్పడియుండినది. కనుక, కల

హాలు చెలరేగడానికి అవకాశం ఉండేదికాదు. కాని, బ్రిటీషు ఆక్రమణం తర్వాత, రెండు వర్గాల వారూ పరప్రభుత్వ పాలనకు లొంగి యుండవలసిన వారైరి. బ్రిటీషు వారితోగల సంబంధములో ఇరువర్గాల వారూ, అధములుగా పరిగణింప బడుచుండినా, తమ ప్రాచీనౌన్నత్యాన్ని పురస్కరించుకొని తమలోతాము పరస్పరాధిక్యతను, ప్రశస్తిని, ప్రకటించు కొంటూ వచ్చిరి. బ్రిటిషువారి ఆక్ర మణకు పూర్వం, ప్రభువు, మత సహనంకలవాడై యున్న సందర్భాల్లో రెండు వర్గాలూ ప్రశాంతతతో జీవించుచుండినారు. ప్రభువు స్వమతాభినివేశియై, ఇతర మతం వారిని పీడించినప్పుడు, తమ ఆగ్రహాన్ని ప్రదర్శించే అవకాశమే ఈ రెండవ వర్గంవారికి ఉండేదికాదు. కనుకనే, పూర్వం మత కలహాలు చెలరేగ లేదు. గోరక్షణోద్యమము, మొదట పంజాబులో ప్రారంభమయింది. సిక్కు ప్రభువుల పాలనలో గోవధ, నిషేధింపబడింది. శాసన విరుద్ధంగా, ఈ విషయంలో ప్రవర్తించిన వారు మరణశిక్షకు గురి అవుతూ ఉండిరి. పంజాబును బ్రిటీషు వారాక్రమించిన తరవాత, ఈ మరణదండన రద్దు గావింపబడింది. ఇది హిందువులకు, సిక్కులకు తీవ్రమైన వ్యథను కలిగించింది. అమూల్యమైన తమ హక్కు తమకు సిద్ధించిందని ముస్లిములు సంతోషించిరి. ఆర్యసమాజం స్థాపింప బడిన వెంటనే, అన్ని ప్రాంతాలలోనూ వివిధ ప్రదేశాలలో, గోరక్షణ సమితు లేర్పడినవి. దేశ సంచారకులు గోరక్షణను గూర్చి ప్రచారం సాగిస్తూ వచ్చిరి. పశుశాలలు దేశంలోని వివిధ భాగాలలో నెలకొల్పిరి. గోవధ నివారణకై, ఆందోళన బయలుదేరింది. అనేకులు హిందూ రాజులు, జమీందార్లు ఈ ఉద్య మానికి తోడ్పడిరి. సిక్కులలో, భాయిని నాంధిరీలు ఈ ఉద్యమానికి నాయ కత్వము వహించిరి. ముస్లిములలోకూడా గోరక్షణోద్యమానికి సానుభూతి చూపినవారు కలరు. ఉత్తర ప్రదేశ్ ముస్లిములు ఈ ఉద్యమాన్ని సమర్థించిరి. గోరక్షణ కేవల మతసంబంధమైన సమస్య మాత్రమేకాదు. వ్యవసాయదారులైన వారికి, ముస్లిములైనా కూడా, ఇది ఆర్థిక సమస్య.

లక్నోలోని ఫిరంగిమహాల్‌కు చెందిన మౌలానా అబ్దుల్ హై, ఇండియాలో గొప్ప ఇస్లాము మత ధర్మశాస్త్రవేత్త. ఇతడు మరి ముగ్గురు ఉలాములు కలిసి, గోవధ సమస్యపై, తమ నిర్ణయాన్ని (Fatwa) ప్రకటించిరి. ముస్లిములు గోవధను మానడము పాపకార్యం కాదని, అందువల్ల యజ్ఞ విధా నాని కెట్టి దోషము సంభవింపదని ఈ నిర్ణయము, శాస్త్రరీత్యా నిష్కర్ష చేసింది.

"ఇతరులకు బాధకలిగించే ప్రవృత్తిని విడిచిపెట్టడము మనకు (ముస్లిము లకు) అత్యంతమూ అవసరము. ఇతర మానవులను సమతాభావంతో చూడక పోవడము, వారికి బాధకలిగించడము, మనకు (ముస్లిములకు) అనుచితమైనది. కనుక, అట్టి పాపాచరణము నుండి ప్రజలను మరలించడానికి మన శక్తిసామర్థ్య ములను పూర్తిగా, వినియోగించవలెను. ఇస్లాము మతము గోవధను ఆదేశించి యుండలేదు. కనుక అట్టి నిరర్థకమైన పనిని మానివేయడం ఉత్తమ పుణ్యము.

ఈ మత విషయక నిర్ణయంపై సంతకము చేసినవారు,- (1) అబ్దుల్ హసనత్ మహమ్మద్ అబ్దుల్ హై (2) మహమ్మద్ అబ్దుల్ వహాబ్, (3) అబుల్ హయా మహమ్మద్ అబ్దుల్ హమీద్ (4) కాజీసయ్యిద్ మహమ్మద్ హాసన్.

కాని, దురదృష్టంవల్ల, ఒకపక్షమువారు ఉద్రేకపూరితమైన అత్యుత్సాహానికి బూనడము, రెండవపక్షమువారు వీరిని రెచ్చగొట్టడానికి బూనుకోవడము కారణములై, అసహ్యాకరములైన ప్రదర్శనలు, సంఘర్షణలు జరిగినవి. ముల్తానులో దొమ్మిజరిగింది. (1881). చాలకాలంవరకూ, దేశం వివిధభాగాల్లో, అప్పుడప్పుడు కలహాలేర్పడి, శాంతికి భంగం కలుగుతూనే వచ్చింది. 1893లో, ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్, బీహార్, బొంబాయిలో, మతకలహాలు జరిగినవి. ఈ కలహాలకూ, ఆ సందర్భంలోజరిగిన ధనప్రాణముల నష్టానికి, హిందువులే కారకులని, ముస్లిములూ ప్రభుత్వమూ కూడా హిందువులపైన అభియోగం మోపిరి. ఈ కలహాల విషయంలో బాధ్యత ఎవరిదైనప్పటికీ, వీటి నివారణ ప్రయత్నములు ఎందుకు జరుగలేదన్న విషయం ముఖ్యము. 1871 జూలై 21వ తేదీనాడు, ప్రభుత్వకార్యాలయ పత్రములలో, ఈ క్రిందివిషయం లిఖితమైయున్నది. "ప్రత్యేకములైన నివారణచర్యలను ముందుగనే తీసికొనకపోవడంలో, పోలీసుశాఖకాని, దండనాధికారికాని, బాధ్యులుకారని, వారిపై దోషమేమాత్రమూలేదనీ, ఉన్నతాధికారులు లెఫ్టినెంటు గవర్నరూ ఇచ్చిన అభిప్రాయాన్ని, నేనేమాత్రమూ విశ్వసించను".

ఏ విషయానికీ ఎవ్వరిపైననూ బాధ్యతమోపక, తమ బాధ్యతను కూడా తప్పించుకొనే ప్రయత్నంగా ఇది కనబడుతుంది. రోహిల్ఖండులో పూర్వం జరిగిన ఇట్టి సంఘటనాలలో నా అనుభవాన్నిబట్టి,- రానున్న ఆపదను ముందుగనే తెలుసుకొనే అవకాశాలు, సాధనాలు, అధికారులకు లేవనినవాదము, అసంబద్ధమైనదని నిష్కర్షగా చెప్పుతున్నాను."

సయ్యద్ అహమద్ ఖాన్ ఆశించి ప్రయత్నించిన మతైక్యానికి భంగం కలిగించింది, హిందీ-ఉర్దూ వివాదం. ప్రభుత్వ రంగంలోని అధికారులనేకులు ముస్లిములపట్ల వ్యతిరేక భావంతో ఉండినారు. కనుక, ముస్లిముల సంస్కృతికి చెందిన, ప్రతి విషయాన్నీ అనాదరంతో చూచేవారు. పందొమ్మిదో శతాబ్దపు ప్రథమదశలో, బెంగాలీ, మరాఠీ, ఉర్దూమున్నగు ఆధునిక భాషల వచన రచనను అభివృద్ధిచేసే ప్రయత్నానికి, ఫోర్ట్ విలియం కళాశాల, బూనుకొన్నది.

ఈ భాషలతో సమృద్ధమైన కావ్యసాహిత్యము ఉండినందున, ప్రయత్నం సులభసాధ్యమయింది. కాని. ఉర్దూభాష పారసీకలిపిలో లిఖితమై యుండడంవల్ల, పారసీక శబ్దాలూ, పారసీక పద్యరచనా విధానమూ, దీనిపై ప్రాబల్యము వహించినవి. అందువల్ల, ఇట్టి ఉర్దూభాష, ముఖ్యంగా నగరములలోని వారికి మాత్రమే అర్థమౌతూ, ప్రజానీకానికి దూరమై యుండినదని, అందువల్ల ఇది ప్రజాభాష కాదని కళాశాలాధి కారులకుతోచింది. అంతతో, పారసీకపదములను విసర్జించి, కొత్త మార్గంలో, ఉర్దూవచన రచనగావించడం ప్రారంభించిరి. ఇదే

హిందీ వచనరచనకు దారి తీసింది. ఆకాలానికి హిందీలో, కావ్యరచన ఎక్కువగా, లేదు. పారసీకపదముల స్థానంలో, సంస్కృత పదాల నుపయోగించిన ఉర్దూభాషే, హిందీ వచనరచనగా సిద్ధించింది. మొదట కొంత అస్తవ్యస్తంగా ఉండినా, శీఘ్రమే సరళమైన రచనాశైలి యేర్పడి, సారస్వత భాషగా పరిణామం చెందింది.

1857 తర్వాత, హిందీభాషకు నూతన ప్రోద్బలం కలిగింది. బ్రిటీషు అధికారులనేకులు, ఈ భాషను అభివృద్ధి చేయడానికి ఆసక్తిచూపుతూ వచ్చిరి. హిందీ భాషకు వ్యాకరణాలు రచించి, హిందీరచయితలను ప్రోత్సహించిరి. "న్యాయస్థానాలలోను, ఇతర ప్రభుత్వ కార్యాలయాలలోనూ, హిందీ భాషను ప్రవేశపెట్టడం సాధ్యమని, అది అవసరమనీ" కూడా బెయిలీ, ప్రభుత్వానికి సలహాయిచ్చెను. "పారసీక లిపిని మార్చడం సుకరమై యుండడంవల్ల, న్యాయస్థానాలకు, కార్యాలయాలకు సంబంధించిన పత్రాలలో, మార్పులు గావించి మోసం చేసే అవకాశమున్నదని, అట్టి అవకాశం హిందీ లిపివిషయంలో లేదని" ఇతడు వాదించినాడు.

బీహారు లెఫ్టినెంటు గవర్నరుగా నుండిన, (1871-74) సర్ జార్జి కాంప్ బెల్, న్యాయస్థానాలనుండి పాఠశాలలనుండి, పారసీక లిపిని తొలగించడానికి ప్రయత్నించెను. "బీహారీలు దరిద్రులు, పరుల ప్రాబల్యానికి లోబడియున్నవారు. నాగరి, లేక, కైథీ లిపిలోనున్న వారి దేశభాషను న్యాయస్థానాల్లో ప్రవేశింపజేస్తే తప్ప, అమ్లా, పోలీసు, జమీందార్లు, నీలిమందు పంటయజమానులు, మొదలైన వారు వీరిపట్ల జరుపుతున్న దౌర్జన్యము అంతంకాదని" గవర్నరు ప్రభుత్వాన్ని ఒత్తిడి చేసెను.

ఈ ప్రయత్నము ముస్లిములకు కంటక ప్రాయమయింది. న్యాయస్థాన ఉద్యోగియైన అమ్లా, పోలీసులు, జమీందారుల సిబ్బంది వర్గము, నీలిమందు వ్యాపారుల సిబ్బంది,- వీరందరూ చాల వరకు ముస్లిములు, ఉర్దూ ఒక్కటే, వీరికి పరిచితమైన భాష. కనుక, ప్రభుత్వ ప్రయత్నం వీరి జీవనోపాధికి భంగం కలిగిస్తుంది. పారసీక లిపిలోనున్న ఉర్దూకుబదులుగా, నాగరిలిపిలోని హిందీ భాషను, న్యాయస్థానాల్లో ప్రవేశింప పెట్టవలసిందని ప్రార్థిస్తూ, ప్రభుత్వానికొక మహాజరును పంపిరి. (1867). న్యాయపరిపాలనాధికారిగా, ఆ సమయంలో వ్యవహరిస్తూ ఉండిన సయ్యద్ అహమద్ ఖాన్, దీనివల్ల, ఎక్కువ అలజడిపడినాడు. హిందూస్థానంలో, రెండు వర్గాల వారూ, ఐక్యప్రయత్నంతో సాధించి, స్థాపించిన సంస్కృతుల మేళనము, ఇంతతో పరిత్యజింపబడడమేకాక, వేయి సంవత్సరాలకుపైగా, ఈ దేశాన్ని తమ మాతృభూమిగా సిద్ధింపజేసినమూల ధాతువులు కూడా విచ్ఛిన్నమై పోతున్నాయని, ఇతడు భావించినాడు. స్వల్పవేతనంపై జీవించుచున్న ముస్లిముల కనేకులకు, ఆర్థిక దుస్థితిని తెచ్చిపెట్టడము మాత్రమేకాక, ఈ ఉద్యమం దేశములోని సమాజాన్నంతటినీ, సంస్కృతి నంతటినీ, రెండు వర్గాలుగా చీల్చి, ఎన్నటికీ మరల చేరిపోవుటకు

సాధ్యము కానట్టి పరిస్థితిని కలిగిస్తున్నదని, ఇతడు భావించినాడు.

మధ్య ప్రదేశంలోని తొమ్మిది జిల్లాల న్యాయస్థానాలలో, ఉర్దూకు బదులుగా, హిందీభాషను ప్రవేశపెట్టిరి. ఈ చర్యవల్ల, హిందూ ముస్లిము మతోద్వేగం తీవ్రమయింది.

ఈ విధంగా, 1885కు పూర్వమే, పరస్పర సంశయాలతోనూ, వైషమ్యంతోనూ, మత విషయక ప్రవాహం కలుషితమైపోయింది. ముస్లిము సంఘంలో, అప్పటికే, విపరీత విభేద వాదు లేర్పడియుండిరి. హిందువులనుంచి పూర్తిగా వేరుపడిపోయి, బ్రిటీషు పరిపాలకులతో సన్నిహితత్వాన్ని వృద్ధిచేసుకోవడం అత్యంతావసరమని, వీరు బోధింపసాగిరి. వీరిలో ప్రముఖుడైన వ్యక్తి సయ్యద్ అమీర్ ఆలీ; ఇంగ్లాండులో విద్యాభ్యాసం గావిస్తూ ఉండిన కాలంలో కూడా, రాజనీతి ఇతని అభిమాన విషయము. ఆ విషయంలో,-అనగా, రాజకీయ సమస్యలలో తగుశిక్షణనిచ్చి, ముస్లిముయువకులను రాజకీయ వ్యవహారాలకు యోగ్యులుగా తయారు చేయడానికై, జాతీయ మహమ్మదీయ సంఘమును, ఇదివరకే స్థాపించి, యున్నాడు (1877). ఇండియా ముస్లిముల రాజకీయ శిక్షణ హిందువులతో సమానంగా జరగని పక్షంలో, ప్రపాతరూపంలో వస్తూ ఉన్న నూతన జాతీయ ప్రవాహంలో ముస్లిములు కొట్టుకొని పోగలరని, ఇతడు ముస్లిములను హెచ్చరించి ఉండినాడు. ఆ కాలంలో, సయ్యద్ అహమద్ ఖాన్, ఇతనిని సమర్థించలేదు.

భారత జాతీయ కాంగ్రెసు స్థాపింపబడుటతో (1885), ఇంతవరకూ అంతర్నిహితములై యుండిన ఇతని సంశయాలూ, భయాలూ, ఒక్కసారిగా పైకుబికినవి. అలిఘర్ ఆంగ్ల-ప్రాచీన విద్యాలయంలోని ఆంగ్లాధ్యాపకులు కూడా ఈ పరివర్తనకు దోహదం గావించి యుండవచ్చును. 1886 లో కళాశాలాధ్యక్షుడుగా నియమితుడైన థియోడర్ బెక్, ఇందుకు ముఖ్యుడు. అహమద్ భయాన్ని ఇతడు బాగుగా రెచ్చగొట్టినాడు. తనకుగల ప్రేరకశక్తి సామర్థ్యాలను చక్కగా ప్రయోగించి, హిందూ సంఘంపట్ల ద్వేష భావాన్ని, బ్రిటీషు ప్రభుత్వంపట్ల భక్తి భావాన్ని ముస్లిము విద్యార్థులలో బాగా స్థిరపడేటట్లుచేసినాడు. అలిఘర్ కళాశాలను అభినందిస్తూ "ఈ కళాశాలలో పెరిగి అభివృద్ధిచెంది, ఇందలి క్రికెట్, ఫుట్‌బాల్, రంగాలలో పాల్గొని, తయారైన యువకులు, ప్రభుత్వానికీ, ప్రియమైన తమ ప్రభువుకూ సేవచేసి, సామ్రాజ్య రక్షణ కార్యంలో ఇండియా ముస్లిములు కత్తులనూ తుపాకులనూ కూడా ఎదిరించి నిలువగలరని, నిరూపించగలరు," అని ప్రశంసారూపంలో ముస్లిము యువకులను రెచ్చగొట్టియున్నాడు. సయ్యద్ అహమద్‌ఖానును ప్రార్థించి, అతడు నిర్వహిస్తూ ఉండిన అలిఘర్ విద్యాలయ గెజెటును గ్రహించి, దానికి తానే పరోక్ష సంపాదకత్వాన్ని వహించి, భారత జాతీయోద్యమాన్ని, దాని స్థాపకులైన బెంగాలీలను, నిరసించి, ఖండిస్తూ వచ్చినాడు. అధికారికంగా, అహమద్‌ఖానే పత్రికా సంపాదకుడై ఉన్నందువల్ల, దానిలోని

వ్రాతలకు బాధ్యత ఇతనిపై బడింది. బెంగాలీ పత్రికల ప్రతి విమర్శలకూ, ప్రతి ఖండనలకూ ఇతడు గురియైనాడు.

1866 లో సయ్యద్ అహేమద్ ఖాన్, మహమ్మదీయ విద్యాసమావేశాన్ని (తర్వాతికాలంలో ముస్లిము) ఏర్పాటు గావించినాడు. వాస్తవంగా ఇది రాజకీయ సమావేశము. ఇండియాలోని నగరాలలోను, పట్టణాలలోను, శాఖలను స్థాపించి, ముస్లిముల విద్యా విషయక అవసరాలను, వ్యవసాయిక, వర్తక, పారిశ్రామిక ఆవశ్యకాలను గురించి, వివరములను సేకరించి, ఈశాఖకు పంపుతూ, దేశములోని ముస్లిముల నందరిని, ఒక సంస్థగా ఏర్పరచడం, ఈ సమావేశము యొక్క ఉద్దేశ్యము. ముస్లిం సంఘము, ముస్లిము సమైక్యము అనే భావాలను తమ మతస్థులకు కలుగజేయడంలో ఈ సమావేశోద్దేశం సఫలమయింది.

1887 లో, కాంగ్రెసుకు విరుద్ధంగా, ప్రచండమైన ప్రచారాన్నితడు ప్రారంభించెను. కాంగ్రెసు కార్యక్రమంలో పాల్గొనడము చాల విపత్కరమైనదని భారతీయులందరినీ,-ముఖ్యంగా, ముస్లిములనూ హెచ్చరించెను. ఇతడు కాంగ్రెసు పట్ల పాటించిన వ్యతిరేకత కేవలము రాజకీయ సంబంధమైనది మాత్రమే. హిందూ సంఘముతోగల సంబంధాలకు ఇది ఎట్టి ఆటంకాన్నీ కలిగించలేదు. ఇతని ప్రవృత్తిని తెలుసుకోడానికి ఒక విషయాన్ని వివరించడం అవసరము. పుట్టుకతోను, బాల్య శిక్షణతోను, కూడా, అహమద్ ఖాన్, సంపన్న, ప్రతిష్ఠాత్మక వర్గములోనివాడు. మధ్యయుగాల భూస్వామ్య సంప్రదాయములలో మునిగి తేలిన వ్యక్తి కనుక, రాజకీయ విషయాలలో కూడా ఇతని భావాలు మధ్యయుగ విధానంవైపు ప్రవృత్తమైనవి. మధ్యయుగాలవారివలె, అధికారమే అన్నిటికీ మూలమైనదనీ, దాని ననుసరించి, తక్కినవి ఏర్పడుననీ అతడు కూడా విశ్వసించినాడు. యుద్ధవీరుడు, పరిపాలకుడూ, ఇతని భావ ప్రపంచములో శ్రేష్ఠులైనవారు ; వర్తకులూ, దలాలీదార్లూకారు. కనుక, ఇతని ఉద్యమాలన్నీ, ప్రయత్నాలన్నీ, ఉన్నత ముస్లిము వర్గాలవారి పునరుద్ధరణాన్ని ఉద్దేశించి జరిగినవి.

సామాన్య ముస్లిము ప్రజలస్థితిగతుల నితడు పట్టించుకోలేదు. ఉపకారదాతలైయున్న బ్రిటీషు పరిపాలకుల దయాదాక్షిణ్యాలను సంపాదించుకోవడమే ఇతని ప్రధాన సమస్య. వారిని ప్రతిఘటించడంవల్ల 1857 లో, ఎట్టి దుస్థితి తమ వారికేర్పడిందో, అది సతతం ఇతని మనస్సులో మెదులుతూనే ఉండినది. కనుక, భక్తి విశ్వాసములతో బ్రిటీషు వారికి అన్ని విధాలా తోడ్పడడమే ముస్లిములు అవలంబించవలసిన నీతి అని ఇతని నిశ్చయం. దినదినానికీ పెరుగుతున్న భారత దేశప్రజానీకం యొక్క దుర్భర దారిద్ర్యమే దేశారిష్ట కారణమని, ఇతడు గుర్తింప లేకపోయినాడు. దుస్సహమై యున్న సాంఘిక ఆర్థిక దుస్థితిని బాగుపరచే ప్రయత్నము, పరప్రభుత్వమెన్నడూ చేయదు. పరప్రభుత్వమెంతటి శక్తివంతమైనదైనా, దానికి ఎంత సదుద్దేశమున్నా, స్వప్రయోజనాన్ని విస్మరించి, విజాతీయులను ఆత్మీయతతో చూడ జాలదు, అనే ప్రకృతి సత్యము, ఇతని భావ వీధిలో గోచరించనే లేదు.

ఇట్టి సంకటస్థితిలోనున్న వాడితడొకడేకాడు. భూసంపదగల వర్గం వారందరూ, ఈ అభిప్రాయాలననుసరించినవారే. బ్రిటిషు పరిపాలన సుస్థిరమైనది; సులభంగాచలించునదికాదు, కనుక 'స్వాతంత్ర్య'మనే భావమంతా పిచ్చిస్వప్నము వంటిది. అని అతడు వాదించేవాడు. ప్రభుత్వంలోని దోషాలను ప్రచారంగావించి, ప్రజలలో అయిష్టాన్ని కలిగించి, పాలకులకు చిరాకు కలిగించడం వక్రమార్గము. సయ్యద్ అహమద్ ఖాన్‌కు ఆంతరంగిక మిత్రుడు, సలహాదారుఐన థియోడర్ బెక్, ఈ విషయాలను వ్యక్తం చేస్తూ బదురద్దీన్ త్యాబ్జీకి ఒక జాబు వ్రాసినాడు. (1888 మే. 7)

"కాంగ్రెసుపట్ల మాకు గల వ్యతిరేకత ప్రాథమిక ప్రాతిపదికకు సంబంధించినది. కాంగ్రెసు ప్రతిపాదనలలో, ఏ ఒక్కదానికీ ఇది ప్రత్యేకమైనది కాదు. బహిరంగ సభలు నడపడము, ప్రజలకుగల కష్టాలను ఎత్తిచూపడము, కాంగ్రెసు నివేదికలోని ఆక్షేపణలను ప్రజలలో ప్రచారం గావించడము,- ఇత్యాది పద్ధతులన్నీ, ఇప్పుడో అప్పుడో ఈ ప్రాంతాలలోని ప్రజలను, పంజాబులోని వారినీ ఉద్రేకపరిచి, విప్లవాన్ని ప్రేరేపించక మానవు. దీనికి, సరిహద్దుల వారితో యుద్ధము కూడా చేరినట్టయితే, వినాశకరమైన పరిస్థితి ఏర్పడక తప్పదు."

"ప్రథమంగా, ఉత్తర హిందూ స్థానములోని ముస్లిము సంఘమంతా, దరిద్ర భూయిష్ఠమై యున్నదని, గుర్తింప వలసియున్నది. వారి దుస్థితికంతటికీ బ్రిటీషు ప్రభుత్వమే కారణమని వారిని విశ్వసింపజేస్తే,- అట్టి పనికి అప్పుడే ఉన్ముఖులై యున్న ముస్లిములు తిరుగుబాటుకు సంసిద్ధులౌతారు. తమ ప్రాచీన వైభవ వినాశనాన్నిగూర్చి వారు ఇప్పుడే బాధ పడుతున్నారు. ఢిల్లీలోను, ఆగ్రాలోను స్మారక చిహ్నములుగా నిలిచియున్న సార్వభౌమ భవనాలు, తమ ప్రస్తుత అవమాన స్థితిని ఎత్తిచూపుతున్నవి. తిమోర్ వంశజుడైన, కడపటి ఢిల్లీ సార్వభౌముని జ్ఞాపకమున్న వృద్ధులింకను ఢిల్లీలో ఉన్నారు. వారిలో ఇంకనూ చైతన్యవంతమైయున్న మతోన్మాదం దీనికితోడైతే, పరిస్థితి ఎటువంటిది? 'జెహాద్' అనే నినాదము, పదే పదే వినవస్తూనే ఉన్నది. సులభంగా ఉద్రిక్తమయ్యే స్వభావం, ముస్లిములది. కలహము వారికి ప్రీతికరమైనది కూడా. ఢిల్లీలోను, ఎటావాలోనూ ఈ విషయం మనం చూచినదే. కనుక ఇప్పుడు జరుగుతున్న ఆందోళన వ్యాప్తిచెందితే, ఉత్తర హిందూస్థానమంతా ఒక్కసారిగా ప్రజ్వరిల్లి పోతుందనే సంశయానికి ప్రబల కారణాలున్నవి. వైయక్తికంగా అట్టిది, నాకు అయిష్టము. ప్రథమంగా, గొంతుకోయించుకోడానికి నేను సిద్ధంగాలేను. రెండవది,-నా జీవితాన్ని అంకితం చేసిన ప్రయోజనము భగ్నమైపోతుంది. ముస్లిములు నాశమైపోయి, మరెన్నటికీ తలయెత్తలేకపోతారు. కనుక, ఏ విధమైన ఆందోళనా మాకు ఇష్టములేదు".

మరొక జాబులో, భారతదేశభవిష్యత్తునుగురించి, తన అభిప్రాయాలను,- [అహమద్ ఖాన్ అభిప్రాయాలు కూడా అవే]- వివరిస్తాడు. "ఇండియాలో

ప్రధానంగా ఆవశ్యకమైనది, సుస్థిరప్రభుత్వము. విద్యాభివృద్ధీ, ఆర్థికాభివృద్ధీ క్రమంగా ఏర్పడగల అవకాశాలను, అట్టి సుస్థిర ప్రభుత్వమున్నప్పుడే ఆశింపగలము. ప్రభుత్వపరిపాలనలో ప్రజలు కూడా పాల్గొనడం నాకూ అభిమతమే. కాని, ప్రజాప్రాతినిధ్యంపై కాదు. అట్టి విధానము ఇండియాకు అనుగుణం కాదనే నా విశ్వాసము అధికారతంత్రాంగంలో, ఉన్నత పదవుల నాక్రమించి, పరిపాలనలో పాల్గొనడము అనేది యొకటే ఇండియా పట్ల తగిన విధానము.

బెక్ వంటి వారిచ్చిన తోడ్పాటుతో, సయ్యద్ అహమద్ ఖాన్ అభిప్రాయాలు బలపడినవి. సర్ ఆక్ లండ్ కాల్విన్, డఫ్ఫెరిన్ ప్రభువులు కూడా, కాంగ్రెసుపట్ల ఈ అభిప్రాయాలనే వహించి యుండిరి. ఔధ్ ప్రాంతంలోని తాలూకుదార్లందరూ,- ముఖ్యులైన రాజారామ్ సింగుతప్ప-అహమద్ ఖానుతో చేరిరి. తాలూకు దార్లవర్గం వారిలో కొద్ది మంది మాత్రమే- (ఉత్తర ప్రదేశ్, పంజాబ్, సింధ్ ప్రాంతాలలోని వారు) - కాంగ్రెసులో చేరిరి తొలి రోజుల్లో కాంగ్రెసుపట్ల, ప్రభుత్వము కొంత ఆసక్తి చూపింది. కాని, పిమ్మట బ్రిటీషు సంఘము, చాల వరకు కాంగ్రెసు పక్షంపై శత్రుభావం వహించింది.

కాంగ్రెసుకు విరోధులైన వారినందరినీ ఒక సంఘంగా ఏర్పరచడానికి అహమ్మద్ ఖాన్ ప్రయత్నించెను. ఈ ఉద్దేశంతో ఇతడు నెలకొల్పిన, యునైటెడ్ ఇండియా పేట్రియాటిక్ అసోసియేషన్,' శీఘ్రంగానే అస్తమించింది. 1893లో, మత విషయకకల్లోలా లనేకములు దేశములో అచ్చటచ్చట జరిగినవి. అట్టిది బొంబాయిలోకూడా చెలరేగింది. తిలక్, పూనాలో గణపతి ఉత్సవం ప్రారంభించెను. ఈ కల్లోల పరిస్థితిని పురస్కరించుకొని 'బెక్' 'మహమ్మడన్ డిఫెన్స్ అసోసియేషన్' (ముస్లిము రక్షక సంఘము) స్థాపించి, దానికి తానూ, సయ్యద్ మహమ్మదూ, కార్యదర్శి పదవులలో నిలబడిరి. ప్రారంభోపన్యాసములో పేట్రీయాటిక్ అసోసియేషన్‌లోని లోపాలను పేర్కొని, కేవలం ముస్లిములకు చెందిన సంఘముయొక్క ఆవశ్యకమును గూర్చి వివరించెను. హిందూ వర్గాలకు, హైందవ పునరుద్ధరణ వర్గాలకు, ప్రభుత్వ పరిపాలనాధికారాన్ని అప్పగించే ప్రయత్నం కాంగ్రెసు ఉద్యమమని, అట్టిది జరిగినట్టయితే, ముస్లిముల ఉనికికే భంగం కలుగుతుందని, అట్టిది జరుగకుండ చేయడానికై, కాంగ్రెసును వ్యతిరేకించే రాజకీయ పక్షము ఏర్పడడం అవసరమని, అట్టి ఉద్దేశంతో ఈ ముస్లిము సంఘం స్థాపింపబడినదనీ, బెక్, తన ఉపన్యాసంలో వ్యక్తంచేసినాడు.

"పత్రికలు, రాజకీయ వ్యాసాలను ప్రవాహరూపంలో ప్రచురిస్తూ ఉండగా, మన యువకులు (ముస్లిములు) వాటిని సమర్థించడానికి, లేక, ఖండించడానికి పూనుకోవడం తప్పక జరుగుతుంది. అట్టి పరిస్థితులలో, మార్గదర్శకులు, లేకపోవడం సమంజసం కాదు." అని తన కర్తవ్యాన్ని కూడా వివరించినాడు.

1895లో, 'లండన్ ముస్లిం అసోసియేషన్' అనే సంస్థలో ఉపన్యసిస్తూ, హిందూ ముస్లిముల ఐక్యము సాధ్యంకాదు. కనుక, ప్రజాస్వామ్య ప్రభుత్వము కూడా సాధ్యంకాదు. అట్టి ప్రయత్నమే జరిగితే-అట్టి పరిపాలన విధానంలో,

అసంఖ్యాకులైన హిందూ ప్రతినిధులను ముస్లిము ప్రతినిధులు అనుసరించడము జరిగి, ముస్లిములు శాశ్వతంగా దాస్యంలో నిలిచిపోతారు, అని తన సిద్ధాంతాన్ని బోధించినాడు. 1857లో చేసిన తప్పును మరల చేయవద్దని, విద్రోహులైన దాదాభాయి నౌరోజీ, బెంగాలు నాయకులు మొదలైన వారితో చేరవద్దని, అట్లుచేరిన పట్ల, ఉద్యోగాలను, స్వాతంత్ర్యాన్ని, పదవిని పోగొట్టుకొని ముస్లిములు భ్రష్టులైపోవుదురని-బెక్, బెదరించి బుద్ధి చెప్పినాడు.

బెక్కు సలహాల ననుసరించి, అహమద్‌ఖాను జీవితాంతం దాకా, కాంగ్రెసు గావించిన ప్రతి తీర్మానాన్ని వ్యతిరేకిస్తూ రావడం శోచనీయమైన విషయం. కడపటి 15 సంవత్సరములలో, బెక్కు ప్రభావానికి లోబడి, అహమద్ ఖాన్ జరిపిన కార్యక్రమాలు ఇదివరకు ఎవ్వరూ ఊహింపనట్టివి. కనుక, స్నేహితులు కూడా ఆశ్చర్యపడినారు. స్నేహితుల సహకారం కూడా ఇతడు గోల్పోయినాడు. కళాశాల వ్యవహారాలలో బెక్కుకు కలిగిన విపరీతమైన పలుకుబడిని సహింపలేక, సమీయుల్లాఖానూ, అతని స్నేహితులూ, కళాశాల పోషకవర్గం వదిలివేసిరి. సయ్యద్ అహమ్మద్‌ఖాన్ అవలంబించిన రాజకీయాభిప్రాయాలను వ్యతిరేకించి, షిబ్లీనుమానీ, కళాశాలనుండి విరమించుకొన్నాడు. ఇతర పోషకులందరూ ఏకమై, ప్రతిక రచనలద్వారా ముస్లిము సంఘానికి వాస్తవ విషయాలను తెలిపి, కళాశాల రక్షణకు పూనుకొండని ప్రచారం గావింపదలచిరి. కాని అహమద్‌ఖాన్ అంతలో మరణించడంతో వారు తమ ప్రయత్నాన్ని విరమించుకొనిరి. కడపటి రోజులితనికి దుఃఖాన్ని కలిగించినవి. కుటుంబంలో కలిగిన చావు, కుమారుడు మతిభ్రష్టుడు కావడము, కళాశాల ద్రవ్యం అపహరింపబడడము, హిందీ భాషను న్యాయ స్థానాలలో ప్రవేశపెట్టిన ఆంటోనీ మ్యాక్‌డొనెల్ ఆదేశము,-ఇవన్నీ అతని ఆరోగ్యాన్ని భగ్నం గావించినవి.

*సయ్యద్ అహమద్‌ఖాన్-అతని గుణశీలముల గణనము :* ఈ మహావృద్ధుడు 1898 లో అస్తంగతుడైనాడు. ఏ ప్రమాణాన్నిబట్టి నిర్ణయించినా ఇతడు గొప్పవాడే. అత్యంతము సన్నిహితుడైన, ఇతని మిత్రుడుగావించిన ప్రశంసను, సి. యఫ్. ఆండ్ర్యూస్, ఉదాహరించినాడు. అహమద్‌ఖాన్ గొప్పతనాన్ని అది చక్కగా వ్యక్తం చేస్తుంది. "గాంభీర్యము, సింహసదృశమైన బలము, ఉదాత్తములైన ఆశయాలు, ఉద్విగ్న పూరితమైన భావోత్సాహమూ, నాకు సర్ సయ్యద్ అహమద్‌ఖాన్‌లో ప్రత్యక్షమైనవి. ఇంతటి శీల, నిష్ఠాశక్తి గాంభీర్యములు, ప్రబలమైన బుద్ధి మహత్త్వము, నేను చూచిన ఇతర ఏ ముస్లిములోనూ గోచరించలేదు. ఇతని వ్యక్తిత్వ ప్రభావంవల్ల, ఇతరులితనిని సహజంగా అభిమానించినారు. అద్భుతకరమైన నాయకత్వం వహించి, ఇతడు నైరాశ్యములో విషణ్ణులై పడియున్న ముస్లిము సంఘమువారిని, ఉద్ధరించినాడు. జీర్ణములై, అస్పష్టములై, హేతువాద విరుద్ధములైయున్న ప్రాచీన విద్యావిధానముల నుంచి, వారి మనస్సులను, ఆధునిక విద్యపై మరల్చి, వారిని విద్యావంతులుగా జేసి, తమ దేశవ్యవహారములలో అర్హమైన స్థానాన్ని పొందే

అవకాశాన్ని కలిగించి, తన సంఘానికి అమూల్యమైన సేవగావించినాడు. ప్రభుత్వం వారు ముస్లిములపట్ల వహించియుండిన సంశయ ద్వేషభావాలను, విశ్వాసస్నేహములుగా మార్చినాడు.

దేశానికివ్వవలసిన ప్రాధాన్యాన్ని, అతడు, తన మత వర్గానికి ఇచ్చియుండడము సంతాపకరమైనది. బుద్ధిశాలురైన విద్యావంతుల వర్గం తప్ప, తక్కిన దేశ ప్రజలందరూ, ఇంకను మధ్యయుగాల దృక్పథంలో ఉండడం ఇందులకు కారణం కావచ్చు.

హిందూ ముస్లిములందరికీ - జనసామాన్య సర్వస్వానికీ,- జీవితంలో, గురుత్వం వహించింది మతం. ప్రాచీన సంపర్కమే మాత్రమూ లేని, ప్రాచీన స్వర్ణయుగాల పవిత్రమతౌన్నత్యాన్ని కలలుగంటూ ఉన్న వ్యక్తులు రెండు వర్గాలలోనూ ఉన్నారు. చరిత్ర ప్రవాహాన్ని వెనుకకు మరల్పజాలమనే జ్ఞానం లేక, ప్రాచీన కాలపు వ్యవస్థ యొక్క పునః ప్రతిష్ఠను వీరు కాంక్షిస్తున్నారు. పృథివీపతియే దేవుడని నిశ్చయించు కొన్నవీరు, మానవుని కర్తవ్యం, భగవంతుని పట్లా, ప్రభువుపట్లా కూడా సమానమై యుండవలెనని విశ్వసిస్తారు. గతానుగతికంగా వస్తున్న, మూలధన రహితమైన, వ్యవసాయి కార్థికస్థితి సమాజాన్ని నడుపుతూ వచ్చింది. అధిక సంఖ్యాకులకు జీవితం, కష్టకరము, దరిద్రము, దుస్సహము. విద్యావంతులకు ఉద్యోగావకాశంలేదు. ఆర్థికంగా పరస్పరం సహకరించడము, భిన్నమతాల వారు, భాగస్థులై యుండడము,- ఇత్యాది ప్రవృత్తులు ఇంకను ఏర్పడలేదు. ఎవరి వృత్తివారు చేసుకొంటూ, ఇతరులతో సంబంధం కలిగించుకోక, ఏకాకిగా ఉండడం అలవాటై పోయింది.

రాజకీయ రంగములో, భారతీయుల జ్ఞానము, అనుభవము, కేవలం బ్రిటీషువారి భావాలను, కార్యక్రమాలనుబట్టి మాత్రమే ఏర్పడినవి. సామరస్యముతో కూడిన ప్రజాస్వామ్య ప్రభుత్వము, బ్రిటను ప్రభుత్వము. మత, జాతి, భాషలకు సంబంధించిన అల్పసంఖ్యాక వర్గాల సమస్య ఆ దేశంలో లేదు. స్కాట్లండ్, ఐర్లండ్, వేల్స్ విషయాలకు ప్రసక్తి కలుగదు. బ్రిటనులోని అధిక సంఖ్యాక, అల్పసంఖ్యాక వర్గాలు కేవలం రాజకీయ సంబంధములైనవి. కనుక, అవి అస్థిరములు, మారిపోయే వ్యవస్థలు. ఇండియాలోని పరిస్థితివేరు. అల్పసంఖ్యాక వర్గాల వారి మత సంప్రదాయాలు భద్రములు, సురక్షితములు; వాటితో ఇతరులు జోక్యం కలిగించుకోరు,-అనే విశ్వాసం ప్రజలలో కలిగితే తప్ప, జాతీయైక్యమూ, ప్రజాస్వామ్య ప్రభుత్వమూ ఏర్పడజాలవనే జ్ఞానం, హిందువులలో అనేకులకు కలుగలేదు. ఒక మతంవారు అధిక సంఖ్యాకులై యున్నంతమాత్రాన రాజకీయంగా వారు శాశ్వత అధికారవర్గంగా ఉండనవసరం లేదన్న విషయము, ముస్లిముల కర్థంకాలేదు. శాశ్వత మత వర్గానికీ, రాజకీయ వర్గానికీ, సంబంధంలేదన్న జ్ఞానము, ఆధునిక రాజకీయముల అనుభవంలేని ఇండియను (హిందువులు ముస్లిములు కూడా) లకు లేకపోయింది. ఒక మతం వారు రాజకీయాధికారంలో ఉన్నప్పటికీ, ఇతరుల మత స్వాతంత్ర్యానికి

భంగం రాదనే విషయము, విదేశప్రభుత్వాలను గమనించిన విద్యావంతులు కూడా గ్రహింపకపోవడం శోచనీయ విషయము. ప్రాచీనవ్యవస్థా ప్రభావము ఇంకా విరిసిపోలేదని చెప్పవలసి యున్నది.

అధిక సంఖ్యాకత అనే భావము కేవలము సంఖ్యనుబట్టి మాత్రమే ఏర్పడింది. జనాభా లెక్కలలో, వివిధ మతాల వారి సంఖ్య వేరు వేరుగా, గుర్తింపబడి ఉంటుంది ప్రజలకు తెలిసినవి ఈ సంఖ్యలు మాత్రమే. ఒక మతం వారి సంఖ్య ఎక్కువగా ఉంటే, అది అన్ని కాలాల్లోనూ, ఎక్కువగానే ఉంటుందని వీరు భ్రమచెందిరి. రాజకీయ పక్షాలకు వర్తించే సంఖ్యఎట్టిదో వీరికి అనుభవం లేదు. రాజకీయ ఆర్థిక ఉద్యమాలపై ఏర్పడిన రాజకీయ పక్షాలు మారిపోతూ ఉంటాయన్న విషయము ప్రజలకు తెలియదు. ఆధునిక కాలంలో ప్రభుత్వాలను నడిపేవి ఆర్థిక విషయాలే కాని, మత విషయాలు కావనే సంగతి ప్రజలు గ్రహించలేదు. కనుక, రెండు మతాల వారికీ మధ్య దురభిప్రాయాలేర్పడి, తమ కష్టాలకు పరస్పరము కారకులని దూషించుకొంటూ వచ్చిరి.

ముస్లిములలోని ఉన్నత వర్గాలవారికి ఆశ్వాసాన్ని ఆత్మ విశ్వాసాన్ని కలిగించి, వారికి రాజకీయ వ్యవహారాలలో మార్గదర్శియైనాడు అహమద్ ఖాన్. అతడు స్థాపించిన ఉద్యమము విద్యావంతులైన ముస్లిములను అఖిఘరు నాయకత్వానికి లోబరచి, ప్రతిపక్షులైన ఉలమా వర్గం వారిని వెనుకకు నెట్టింది. కాని, సంఘానికి అతడిచ్చిన ఆదర్శాలు సంకుచితములు, దూరదృష్టి రహితములు కావడంవల్ల, హిందూ ముస్లిము మతాలవారి మధ్య పొందికా, సామరస్యమూ, ఏర్పడక పోయినవి.

అహమ్మద్ ఖాన్ తన జీవితాన్ని సాంఘిక మత సంస్కర్తగా ఆరంభించినాడు. ఉన్నత ముస్లిము వర్గాలలో కలిగిన నైతిక భ్రంశత, అధ్యాత్మిక క్షీణత, వారి పతనానికి హేతువులని అతడు గుర్తించినాడు. కనుక, ఇస్లాము మత సంస్కరనానికి ప్రథమంగా పూనుకొనెను. ముస్లిములు మూఢ విశ్వాసాలకు, అర్థరహితములైన సంప్రదాయాలకు గురియై యుండినందువల్ల హేతువాద సిద్ధాంతముపై ఆధారపడి వారిని మేల్కొల్పడము అతని ప్రయత్నము. కనుక, హేతు బద్ధములుకాని, విశ్వాసాలను, ఆచారాలను, ఖండించి సంప్రదాయాన్ని అంధప్రాయంగా అనుగమించే పద్ధతిని విడువవలసి వచ్చింది. శిథిలములై పోయిన భావబంధనములనుండి మనస్సులను మొదట తప్పించవలసివచ్చింది.

ముస్లిము మనస్సుకు దాస్యవిమోచనం గావించేది ఆధునిక విద్య యనే ఇతని వాదము సమంజసమైనది. తార్కిక విధానాన్ని, ప్రయోగాత్మక విజ్ఞానాన్ని అవలంబించిన విద్య యొక్కటే, ఇట్టి దానిని సాధింపగలదు. ఈ ప్రయోజనాన్ని సాధించే ఉద్దేశంతో ఇతడు, మహమ్మదీయ ఆంగ్ల-ప్రాచీన కళాశాలను, శాస్త్రీయ విజ్ఞాన సంఘాన్ని స్థాపించెను. ముస్లిము సంఘములో భావ పరివర్తనం కలిగించడం మాత్రమేకాక, ఆధునిక విద్య, మరియొక అత్యవసరమైన ప్రస్తుత ప్రయోజనాన్ని కూడా సాధించవలసియున్నది. ప్రభుత్వోద్యోగాలకు

యువకులను తయారుచేయడం, ఈ రెండవ ప్రయోజనము.

ముస్లిము సంఘంలోని పూర్వాచార పరాయణులు ఇతని మొదటి ప్రయోజనాన్ని తీవ్రంగా ప్రతిఘటించిరి. కనుక, ఇస్లాము మతాన్ని హేతు వాదానుగుణంగా వ్యాఖ్యానించడమనే మహా ప్రయత్నాన్ని, అహమద్ ఖాన్ త్యజించవలసి వచ్చింది. అంతట, తన రెండవ ప్రయోజన సాధనకై శక్తిసామర్థ్య ములనన్నిటినీ ధారవోసినాడు. బ్రిటీషు ప్రభువులకు ముస్లిములపట్ల ఆదరాభి మానాలను కలిగించి, సంపన్న ముస్లిము వర్గాలవారి ఆర్థికస్థితిని బాగుచేసే, ఈ రెండవ ప్రయోజనం చాలవరకు ఫలించింది.

ఇస్లాము మత పునరుజ్జీవనానికి అలిఘర్, కేంద్రం కాజాలకపోయింది. ఫజాలీ, వలీయుల్లా, జమాల్-అల్-దీన్, రషీద్ రాజా, వంటి ఒక్క వ్యక్తి కూడా, ఈ కళాశాల నుంచి బైటపడలేదు. కళాశాలలో జరిగిన మత విషయిక శిక్షణలో, సంప్రదాయ విధానము ప్రాధాన్యం వహించింది. ఇంతేకాక, సంప్ర దాయము,-పాశ్చాత్య విజ్ఞానము, తత్త్వశాస్త్రాలు,-సారస్వతాలు -అనే విష యాలు బోధింపబడడంవల్ల అధ్యయన విషయాలకు పొందికకుదరలేదు. కాబట్టి, విద్యార్థుల మనస్సులు బుద్ధివిషయక ద్వైధీకరణానికిలోనైనవి. సంప్రదాయ సిద్ధమైన హఠవాదానికీ, హేతువాదానికీ సమన్వయము సిద్ధించలేదు.

ముస్లిము సంఘము యొక్క లౌకిక ప్రయోజనానికి బూనుకొన్న అలి ఘర్ విద్యాసంస్థ, ప్రభుత్వంపై ఆధారపడినందున, తన విద్యాప్రణాళికను తదనుగుణంగా ఏర్పరచుకొన్నది. ఆంగ్లవిద్యావిధానాన్ని పూర్తిగా అవలం బించడంవల్ల, హిందువులు ముస్లిములు కూడా తమ పూర్వచరిత్రను విస్మరించిరి. తమ ప్రాచీన సంస్కృతికి తాము అపరిచితులు కావడమేకాక, హిందూ ముస్లి ములు, పరస్పర సంస్కృతులతో సంసర్గం కూడా పోగొట్టుకొన్న వారైరి. పాశ్చాత్య సంస్కృతి యొక్క పై మెరుగులు ఈ రెండు వర్గాలవారినీ దగ్గర చేరుస్తున్నట్టు గోచరించినా, జీవితాంతర్భాగాల్లో వీరిదారులు పూర్తిగా వేరై యుండినవి. పాశ్చాత్య విజ్ఞానము విచిత్రమైన, పరస్పర విరుద్ధమైన పరిణామాన్ని కలిగించింది. బుద్ధివిషయక సాదృశ్యాన్నీ, భావవిషయక విభేదాన్నీ కలిగించింది.

ప్రత్యేకత, ఏకైకత, అనే భావాలు రెండు వర్గాల వారికీ మధ్య, ఇది వరకేన్నడూలేని అంతరాన్ని కలిగించినవి. ఈ అంతరాన్ని పాశ్చాత్య విజ్ఞానం సంధించ లేక పోయింది.

ఇండియా విద్యావిధానము, భిన్నమతాల వారి మధ్య సత్సంబంధాన్ని కలిగింప లేక పోయింది. ఆంగ్లమును బోధన భాషగా చేయడము, ఉన్నత- పాఠశాలలలోను, కళాశాలలలోను పాశ్చాత్య విజ్ఞాన భాగాలను పాఠ్యములుగా విధించడము,- ఇవి కారణములుగా, ప్రాచీన భాషలైన సంస్కృతము, అరబ్బీ, విద్యార్థులకు అందరానివైనవి. అందువల్ల, ఒక వర్గంవారు మరియొక వర్గంవారి ఆశయాదర్శాలను గ్రహించి, పరస్పరము అర్థంచేసుకొనగలిగే అవకాశం

నశించింది. పాశ్చాత్య విద్యావిధానంలో శిక్షితులైన హిందూ ముస్లిములకు, పాశ్చాత్య తత్త్వశాస్త్రాలు, విజ్ఞానశాస్త్రాలు, సారస్వతాలు, తెలిసినంత బాగుగా, తమ సారస్వతాది విషయాలు కాని, తమ దేశము వారైన ఇతరుల సారస్వతాది విషయాలు కాని, తెలియవు.

## VI సయ్యద్ అహమద్ ఖాన్ తరవాత ఆలిఘర్ ఉద్యమము

సయ్యద్ అహమద్ ఖాన్ తర్వాత, అలిఘర్ ఉద్యమం, మహసిన్-ఉల్-ముల్క్ ఆధిపత్యంలోనికి వచ్చింది. కాని, హిందీ-ఉర్దూ సమస్యపై, ఆంతోనీ మ్యాక్‌డొనెల్ (ఉత్తర దేశపు లెఫ్టినెంటు గవర్నరు), కోపానికి గురియై, అలిఘరు రాజకీయ కార్యకలాపాలు, ఆగిపోవలసి వచ్చినవి. బెంగాలు విభజనతో, ఇండియా చరిత్రలో నూతన ఘట్టం ప్రారంభమయింది.

బెక్ తరువాత, కళాశాలాధ్యక్షుడుగా నియమితుడైన థియోడర్ మారిసన్, అలిఘరు ఉద్యమాన్ని నిర్వహిస్తూవచ్చెను. తన పలుకుబడి నుపయోగించి ముస్లిములు రాజకీయాందోళనలలో ప్రవేశించకుండా చూచుకొన్నాడు. "ప్రభుత్వాదరణను ప్రత్యేకంగా పొందిన ఉన్నత ముస్లిము వర్గాలవారు, తమ కృతజ్ఞతను ప్రదర్శించడానికి తగిన సమయమిది. ముస్లిములు విశ్వాస పాత్రులు కారనే అభిప్రాయానికి మీ చర్యలు ఏ మాత్రం ఆస్కారం కలిగించినా, మీకు నష్టము కలుగక తప్పదు. ఇటీవల కాలంలో, ముస్లిములు ప్రదర్శించిన స్నేహావర్తనం కపటమని, హిందువులపట్ల ముస్లిములకు ద్వేషభావం లేదని, తమ ప్రయోజనాలను సాధించుకోవడానికై ప్రయత్నించడం లేదని, బ్రిటీషు ప్రభుత్వము, మీ ప్రవర్తనవల్ల సంశయించి, మిమ్ముల నాదరించడం మానివేయడంలో ఆశ్చర్యమేముంది" అని ముస్లిములను బెదిరించెను.

ఇతని అభిప్రాయాన్ని అనుసరించి,- రాజకీయాభ్యుదయము, మత సంస్కరణము అనేవి అలిఘర్ ఉద్యమంయొక్క ఆశయాలు. మత విషయాలలో సయ్యద్ అహమద్ ఖాన్ ఉదారుడైన హేతువాది; రాజకీయాలలో మాత్రం దూరదృష్టి లేనివాడైనాడు. స్వతంత్ర భారతదేశములో, తన మతస్థులకు భవిష్యత్తు లేదనే భ్రాంతికి లోనై, ప్రభుత్వపు దయాదాక్షిణ్యాలకై వారి నాశ్రయించి, తన భక్తి విశ్వాసములను వారి కర్పించెను. ఇతనిననుసరించిన వారిలో ప్రఖ్యాతులైన పండితులు, విద్వాంసులైన రాజకీయవాదులు కూడా కలరు. చిరాగ్ ఆలీ, నజీర్ అహమద్, జాకాఉల్లా, అల్తాఫ్ హుసేన్ ఆలీ,-వీరు ప్రసిద్ధ పండితులు. ముహ్సిన్-ఉల్-ముల్క్, వాకార్-ఉల్-ముల్క్-అను ఇరువురూ హైదరాబాదు ప్రభు సేవనుండీ విశ్రాంతి పొంది వచ్చిన రాజకీయవాదులు.

*సయ్యద్ అమీర్ ఆలీ:* ముస్లిముల బాగోగులను, వారి భవిష్యత్తును, గూర్చి పాటుపడిన వారిలో, కలకత్తా సయ్యద్ అమీర్ ఆలీ ముఖ్యుడు ఇతడు. సయ్యద్ అహమద్ ఖాన్ వర్గము లోనివాడు కాడు; ఐనా, అతని వలెనే ముస్లిముల అభ్యుదయ విషయములో ఆసక్తి కలవాడు. తాను 'ముతాజిలా' అనే

అభిప్రాయంతో, విద్యావంతులైన ముస్లిముల మనోభావాలను తీర్చి దిద్దడంలో ఎక్కువ కృషిచేసినాడు. పాశ్చాత్య దేశాలలోనున్న ఇండియా ముస్లిములు కూడా, ఇతని ప్రభావానికి లోనైరి. అహమద్ ఖాన్ అనుయాయులందరు కలిసి చేసిన కృషికంటె, ఇతడు స్వయంగా చేసినదీ, సాధించినది ఎక్కువ. రాజకీయాలలో అత్యంతమూ సంకుచితమైన దృష్టి కలవాడై, అహమద్ ఖాన్ వర్గములో వారెవ్వరూ హిందువుల పట్ల చూపని విభేద భావాన్ని, విధానాన్ని, ఇతడు అవలంబించెను. రాజకీయైక్యము సాధ్యము కాదని, మొండి పట్టుదల గలవాడై, హిందూ ముస్లిములకు దేశంలో సమాన పౌరత్వము తగదని నిశ్చయించినాడు. "పరిస్థితు లెట్టివో తెలియని వారు, వాటిని గ్రహించని వారు మాత్రమే, హిందూ ముస్లిముల సమాన ప్రతిపత్తినిగూర్చి మాట్లాడుతున్నారు. చిన్న వర్గాన్ని పెద్దవర్గంలో ప్రవేశింపజేసే ప్రయత్నము, అనర్థదాయక మౌతుంది. రెండు మతాల వారినీ కలిపి ఎన్నికల స్థానానికి తోలడంవల్ల, మీ రనుకొన్న ప్రయోజనం సిద్ధిస్తుందా ?" అది సాధ్యమా? అని ఇతడు ప్రశ్నించినాడు. కేవలం ముస్లిముల ప్రయోజనాలను సాధించే, ముస్లిము ఉద్యమాన్ని లేవదీయడానికి, అహమద్ ఖాన్ సహకారాన్నితడు కోరినాడు. కాని, ఆ పక్షంనుండి ఇతనికి ప్రోత్సాహం లభింపలేదు. ఆ మీదట, ముస్లిము మతస్థులలో, తమ బాధ్యతకు సంబంధించిన చైతన్యాన్ని ఉద్బోధపరచే ఉద్దేశంతో, సెంట్రల్ మహమ్మడన్ అసోసియేషన్ స్థాపించెను (1877). 1902 లో ఇస్లాము తత్త్వము (The spirit of Islam) అనే గ్రంథాన్ని ప్రకటించెను.

హేతువాదాన్ని, అభ్యుదయాన్ని, ప్రజాస్వామ్యాన్ని పెంపొందించే మతము ఇస్లాము అని, దానిలో ఇతడు నిరూపించెను. 'మహమ్మదు జీవితము, బోధనల విమర్శాత్మక పరిశీలన,' 'మహమ్మదీయ న్యాయశాస్త్ర సంగ్రహము', 'సారసీనుల (Saracens) సంగ్రహచరిత్ర', 'ఇస్లాము మతనీతులు', మహమ్మదీయుల వైయక్తికి న్యాయము', అనే గ్రంథాలనూ, ఇతర వ్యాసాలనూ, ఇతడు రచించెను. తమ ప్రాచీన మతౌన్నత్యాన్ని యువకుల దృష్టికి తెచ్చి, పాశ్చాత్యుల దురభిప్రాయాలను తొలగించడం ఈ రచనల ఆశయము.

ఇస్లాము మతములో వర్ణితములైన ప్రకృత్యతీత విషయాలను, ప్రకృతి విరుద్ధములైన అద్భుతచర్యల గాథలను కప్పిపుచ్చి, ఇస్లాము మతపవిత్రసూత్రాలు ఇరవైయవ శతాబ్దపు ఆదర్శాలకు అనుగుణములై యున్నవని నిరూపించడము, ఇతని దృక్పథము, ప్రయత్నమూను. సంప్రదాయసిద్ధంగా వస్తూఉన్న న్యాయాలను మార్చకూడదని, నలుగురు గొప్ప ఇమాములూ గావించిన నిశ్చయాన్ని, ఇతడు అంగీకరించలేదు. షరియాత్‌లోని నిబంధనలను, ఆధునిక జీవితావసరముల కనుగుణంగా మార్చవచ్చునని, నిర్ణయాధికారం ప్రతివ్యక్తికీ కలదని, ఇతడు నిష్కర్ష గావించెను.

విశ్రాంతి తీసుకొన్న పిమ్మట, అమీర్ ఆలీ, ఇంగ్లాండులో స్థిరపడి, తన అభిప్రాయాలను పత్రికలమూలంగాను, ప్రత్యక్షచర్యల మూలంగాను, బ్రిటీషు సంప్ర

దాయ వర్గంవారిలో వ్యాప్తిగావించడానికి బూనుకొన్నాడు. 1910లో, అఖిల భారతీయ ముస్లిము లీగుశాఖను, లండనులో అతడు స్థాపించెను.

## VII. ఉలామా-దేవబంద్ ఉద్యమము

సయ్యద్ అహమద్ ఖాన్ ప్రతిపాదించిన అభిప్రాయాలను ముస్లిముల లోని రెండుపక్షాల వారూ అధిక్షేపించిరి. సంప్రదాయ విద్యకు ఆకరమైయున్న ఉలమా, జాతీయవాదులైన ముస్లిములు- ఈ రెండు పక్షాలవారూ ఇతనికి వ్యతిరేకులు.

1857 విప్లవానికి తరువాతనే, అహమద్ ఖాన్ ముస్లిము రాజకీయాలలో ఆసక్తి వహించినాడు. కాని, అంతకు పూర్వమే ఉలామా, రాజకీయాలలో ప్రవేశించినాడు. ముఘల్ సామ్రాజ్యము పడిపోవడము, ఆ స్థానాన్ని బ్రిటీషు వారాక్రమించుకొని బలపడడము, ఇతనికి అత్యంతాఘాతములైనవి. ఇస్లాము మతానికి ఆధారములని ఇతడు తలచియుండిన విశ్వాసము, అధికారము, అను వాటిలో రెండవది నాశము గావింపబడింది. ప్రభుత్వ పోషణలేనిదే, మత సౌధము నిలబడియుండగలదా యన్న సమస్య ఏర్పడింది.

ముస్లిముల రాజకీయాధిపత్యాన్ని పునఃప్రతిష్ఠ గావించవచ్చునని, ఉలామా దృఢ నిశ్చయము. కనుక, ఢిల్లీ వాస్తవ్యుడైన షావాలీ ఉల్లా, తన విద్యాలయంలో ద్వివిధమైన కార్యక్రమాన్ని ప్రారంభించెను. జీవిత ప్రవాహ మూలములో పేరుకొనియున్న దుర్నీతి మాలిన్యాన్ని తీసివేసి, ప్రవాహాన్ని పరిశుద్ధమొనర్చడము, శాస్త్రాధార మతౌద్ధత్య భారాన్ని తొలగించడము, కురాను బోధించే పవిత్రబోధనలను ముస్లిములనుసరించేటట్లు చేయడము, ప్రవక్త పవిత్ర జీవితాన్ని ముస్లిములకు ఆదర్శంగా చేయడము,-ఇవి అతడు బూనుకొన్న మొదటి ఉద్యమ భాగాలు. బ్రిటీషు ఆక్రమణవల్ల ఏర్పడిన క్రియాత్మక సమస్యకు పరిష్కారాన్ని అన్వేషించడము, రెండవ ఉద్యమము. 1803 లో ఢిల్లీ పతనమైన తర్వాత ఇండియా, తమ యుద్ధరంగమని (దార్-ఉల్-హార్బ్) ప్రకటిస్తూ, ఇతని కుమారుడు షాఅబ్దుల్ అజీజ్, ఒక ఆదేశ పత్రాన్ని (ఫత్వా) విడుదల చేసియున్నాడు. క్రిశ్చియను విజేతలపై ధార్మికయుద్ధాన్ని (జెహాద్), ప్రకటించి, సాగించడం ముస్లిముల కర్తవ్యమని, అట్లు చేయజాలకపోతే, ఇండియాను వదలి పెట్టి, ముస్లిము దేశాలకు వలస పోవలసిందనీ, ఈ ఫత్వా, ముస్లిములను ప్రబోధించింది.

బరైలీవాస్తవ్యుడైన సయ్యద్ అహమద్, ఈ ఉద్యమానికి నాయకత్వం వహించెను. అబ్దుల్ అజీజు బంధువులూ, విద్యార్థులూ, సయ్యద్ అహమదుకు తోడై నిలిచిరి. 'వహాబీలు' అని బ్రిటీషువారు తప్పుగా వ్యవహరించిన ఈ వీరులు, పశ్చిమోత్తర ప్రాంతపు సరిహద్దులలోని దుర్గమ పర్వత ప్రదేశాలను ఆకరంగా చేసుకొని, తమ ధార్మిక యుద్ధోద్యమాన్ని సాగిస్తూ, 1914 వరకూ బ్రిటీషు ప్రభుత్వాన్ని ప్రతిఘటిస్తూ నిలిచిరి.

వీరి అనుయాయులలో కొందరు, 1857 విప్లవంలోచేరి, బ్రిటీషువారి నెదిరించినారు. కాని, విప్లవం అణగిపోవడంతో, షావాలీ ఉల్లాను పూర్వం ఎదుర్కొనిన సమస్య, ఇప్పుడు వీరి కెదురయింది. పందొమ్మిదో శతాబ్ద మధ్య కాలంలో, విప్లవ మణగిపోయిన తర్వాత, ధార్మిక యుద్ధ ప్రసక్తికి అవకాశం కలుగలేదు.

ఉలామా సంస్థకుచెందిన ఒకవర్గంవారు, ముజాఫర్ జిల్లాలోని, షామ్లీని, కేంద్రంగా చేసుకొని, ఒక సార్వజనికమైన విప్లవోద్యమాన్నినడిపి, అఖిల భారత విప్లవములో పాల్గొనియుండిరి. విప్లవానంతరము బ్రిటీషు వారి ఆగ్రహాచర్యలకు గురికాక తప్పించుకొనిపోయి, సహారాన్‌పూర్ జిల్లాలోని దేవబంద్‌లో, వీరొక విద్యాలయాన్ని నెలకొల్పుకొని, ముస్లిము మత నాయకులను తయారు చేయడానికి బూనుకొనిరి. మహమ్మద్ కాసీం నానౌతవి (1837-1880), రషీద్ అహామద్ గంగోహీ (1828-1905),- అనేవారు ఈ ఉద్యమానికి ప్రముఖులు. 1857 లో మెక్కాకు వలసబోయిన ఇమాదుల్లాకు వీరిరువురు అనుయాయులు.

దేవబంద్ విద్యాలయం 1867 లో, ప్రారంభమయింది. దాని ఆశయాలు,-

1. ఇతరులు చూపే ప్రలోభాలకు, ఆదరణకు, ఒత్తిడికి, దయాదాక్షిణ్యాలకు లోనుగాక, భగవద్వాక్యాన్ని కీర్తించడము,

2. ఆది ఇస్లాము మత సూత్రాల ననుసరించి, తమ జీవితాలను నడపుకోడానికై, ముస్లిములనందరిని, ఒక వర్గంగా ఏర్పాటుగావించడము,

3. ప్రభుత్వముతోకాని, ఇతర సంపన్నులతోకాని, ముస్లిములు సహకరించడము విద్యాలయ ప్రయోజనాలకు, హానికరమని బోధించడము,

4. షావల్లీ ఉల్లా బోధనలను, శ్రద్ధతో తూ. చా. తప్పకుండా పాటించడము,

5. సంపన్న కుటుంబాల వారి జీవిత పద్ధతులను, స్వచ్ఛంద మార్గాలను, పరిత్యజించి, పరిపాలనలో, ప్రజాస్వామ్య సిద్ధాంతాలను, గణరాజ్య విధానాలను (Republican methods), పరస్పర సహాకారంవల్లను, పరస్పరపర్యాలోచన వల్లను, ఆదర్శంగా నెలకొల్పడము,- అనేవి వీరి ఆశయాలు.

విద్యావిషయంలో, దార్స్-ఇ-నిజామీ రచించిన ప్రణాళికను ఈ విద్యాలయము అనుసరించింది. సంప్రదాయ సిద్ధములైయున్న విజ్ఞానశాస్త్రాలపై ఈ ప్రణాళిక కేంద్రీకరించింది. విద్యాప్రణాళిక, ద్రవ్యము, పరిపాలన నిర్వహణము, ఈ విషయములలో విద్యాలయము స్వతంత్రమై యుండినది. కాని, ఇందులో శిక్షణ నొందిన పట్టభద్రులకు ప్రభుత్వోద్యోగాలలో ప్రవేశం లభింపలేదు. ఇది బీదల విద్యాలయము. అధ్యాపకులు, విద్యార్థులు కూడా, అత్యంతమైన పొదుపుతో కష్టతరమైన జీవనాన్ని గడుపుతూ ఉండినారు. మత పవిత్రతకు ప్రాధాన్యమిచ్చిన వీరు లౌకికాభ్యుదయాన్ని వాంఛించినవారుకారు. ఆంగ్ల విద్య, పాశ్చాత్య సంస్కారము, పాశ్చాత్య ఆధిపత్యము అనేవి తూర్పు దేశాలలో వ్యాపించడం వారికి

అసహ్యాకరమైన విషయము. ముస్లిముల నైతిక మత విషయక పునరుజ్జీవనం కలిగించే ఉద్దేశము, ఏషియా దేశాలను పాశ్చాత్య ప్రభావము నుండి తప్పించి, స్వాతంత్ర్యం నెలకొల్పడమూ వీరి ప్రయత్నము.

విద్యా వ్యాప్తి, శీలపోషణము ప్రస్తుతకార్యక్రమాలు. ఐనా, 'మతము', 'మత ప్రవృత్తి', వలెనే, 'సమాజము' 'రాజ్యము' అనే విషయాలు కూడా వీరికి ప్రధాన సమస్యలైనవి. ఇండియాలోనూ, ముస్లిము దేశాలలోనూ, జరిగిన విషయాలలో కూడా, వీరు ఆసక్తి వహించిరి. 1859-60 లో జరిగిన, నీలి మందు కల్లోలాలు, 1876 లో జరిగిన దక్కను కలహాలు, దేశంలో ఏర్పడిన క్షామ పరిస్థితులు, గ్రామసీమలలోని రైతులకు, చేతి పనివాండ్రకు ఏర్పడియున్న దురవస్థలు,- ఇవన్నీ వీరికి బాధకలిగించినవి. బెంగాలులో ప్రారంభమై దేశమంతటా వ్యాపించిన రాజకీయ కార్యక్రమాలు, అందునూ, ఇల్ బర్ట్ బిల్లుకు వ్యతిరేకంగా జరిగిన ఆందోళన, బ్రిటీషువారిపట్ల ద్వేషభావాలను విస్తారంగా ఉత్పన్న మొనర్చినవి. దేశంలో అసంతుష్టి ప్రబలంకాజొచ్చింది.

ఇతర దేశాలలో జరిగిన ఉదంతాలు ముస్లిము ప్రపంచము నంతనూ గగ్గోలు కావించినవి. ఈజిప్టు, టర్కీ. పశ్చిమ ఏషియా, ఉత్తరాఫ్రికా, ఇరాను దేశాలపై జరిగిన పాశ్చాత్య సామ్రాజ్య వ్యాప్తి, ఇండియాలోని ముస్లిములలో అశాంతిని రగులు కొల్పింది. సయ్యద్-జమాల్-ఆల్-దీన్, ఇండియాకు వచ్చి, ముస్లిము విద్యాలయాలలోని యువకులను ఉద్వేగ పరిచినాడు. ఏషియా ఖండాన్ని పాశ్చాత్య సంస్కార భారంనుంచీ, పాశ్చాత్య రాజకీయాధిపత్యము నుంచీ, విడుదల గావించి, స్వాతంత్ర్యాన్ని నెలకొల్పవలసిందని అతడు బోధించి యున్నాడు. ఈ భావాలు యువకుల హృదయాలలో ప్రతిధ్వనించినవి.

జమాల్-ఆల్,-దీన్-అఫ్గానీ అభిప్రాయాలకు అనుగుణంగా ఏర్పడింది, దేవబంద్ విద్యాలయము. కనుక, రాజకీయ ప్రయోజనముల సంపాదనకై భారత జాతీయ కాంగ్రెసు 1885లో, ఏర్పడి, ప్రజల ఐక్యమునకు పూనుకోవడంతో, దేవబంద్ విద్యాలయం కాంగ్రెసు విధానానికి సహకరించింది. మహమద్‌కాసీం తరువాత, విద్యాలయాధ్యక్షుడైన రషీద్ అహమద్ గంగోహి, ఈ విషయంలో విద్యాలయము యొక్క అభిమతమెట్టిదో వివరించియున్నాడు. షా-అబ్దుల్-అజీజ్ ప్రకటించిన ఆదేశాన్నిబట్టి, ఇండియా యుద్ధరంగమై యున్నది. కనుక బ్రిటీషువారిని దేశమునుండి పారద్రోలడం ముస్లిముల కర్తవ్యం, అని అతడు వ్యక్తం గావించినాడు.

జాతీయాశయాలను సిద్ధింప చేసుకొనే ఉద్యమానికై, లౌకిక వ్యవహారాలలో హిందువులతో సహకరించడం, 'షరియాత్' అనుమతిస్తుంది. కనుక, హిందువులతో ఒడంబడిక చేసుకొని, ఈ జాతీయ విషయంలో వారితో సహా, ఉద్యమ ప్రయత్నానికి పూనడం అవసరమని తన అభిప్రాయాన్ని, గంగోహీ వ్యక్తపరచినాడు. కనుక, కాంగ్రెసుతో కలిసి, కృషి చేయవలసిందని ముస్లిము సంఘానికతడు ఉపదేశించెను. దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యము లభించడం ఇతని అభి

మతము. కాంగ్రెసు ఆనాడు, అట్టి సంపూర్ణ స్వాతంత్ర్య సాధనకు పూనుకొని యుండనందువల్ల, ఇతడు స్వయంగా, కాంగ్రెసులో చేరలేదు. దేశంలోని అన్ని మతాల వారూ ఏకమై, ఒక జాతీయ పక్షంగా ఏర్పడడము ఇస్లాము మత సూత్రాలకు ఏ మాత్రమూ విరుద్ధం కాదని, మహా పండితుడు, దేవబంద్ విద్యాలయాధ్యక్షుడైన, గంగోహీ, గావించిన ఈ ప్రకటన నిష్కర్షమైనది.

ఈ నిశ్చయంవల్ల దేవబంద్ విద్యాలయానికీ, ఆలిఘర్ విద్యాలయానికీ, విభేదం ఏర్పడింది. అరాబీపాషా 1881లో విప్లవం లేవదీసిన సందర్భంలో, బ్రిటీషువారిని సయ్యద్ అహమ్మద్ ఖాన్ బలపరచియుండడము, అహమద్ ఖానుని మత, రాజకీయాలను జమాల్-ఆల్-దీన్ అఫ్ఘానీ ఖండించియుండడము, టర్కో-గ్రీకుయుద్ధంలో, 1897 టర్కీకి విరోధులైన, పాశ్చాత్యరాజ్యాలకు అహమద్ ఖాన్ సహాయం గావించడము, ఇత్యాదులు, ఇండియాలోని ప్రధాన ముస్లిము కేంద్రాలమధ్య పెద్ద అంతరాన్ని కలిగించినవి. ముహ్సిన్-ఉల్-ముల్క్, ఈ రెండు సంస్థలకూ ఐక్యము, కూర్చడానికి ప్రయత్నించెను. కాని, అది సాధ్యం కాలేదు. కనుక, తీవ్రమైన మతవిభేద భావాలు ప్రబలిన దినాలలోకూడా, దేవబంద్ సంస్థ ఉలమా, భారతదేశ స్వాతంత్ర్యాన్ని, భారతజాతి ఐక్యమును, సమర్థిస్తూ వచ్చెను.

*షిబ్లీనిమానీ :* దేవబంద్ విద్యాలయానికి సహాకరించిన వారలలో షిబ్లీనిమానీ ఒకడు. (1857-1914). అరబ్బీపారసీక భాషలలో గొప్పపండితుడు; ఉర్దూలో కవితను, వచనరచనను, విరివిగా రచించినవాడు. సయ్యద్ అహమద్ ఖాన్ ఆహ్వానముపై ఇతడు ఆంగ్ల-ప్రాచీన కళాశాలలో అధ్యాపకుడుగా ప్రవేశించి, 1898 వరకూ అందులో పనిచేసెను. కాని, అహమదు మరణానికి ఒక సంవత్సరానికి పూర్వమే, ఇరువురికీ అభిప్రాయభేదములేర్పడినవి. మతధర్మశాస్త్రాల విషయములలోనూ, రాజకీయాల్లోనూ, కూడా, ఇతడు అహమద్ ఖాన్ అభిప్రాయాలను అంగీకరించలేదు. ఇమాం ఆబూహానీఫాను, పూర్తిగా అనుసరించినవాడు షిబ్లీ. కనుక, నలుగురు ఇమాముల న్యాయనిర్ణయాన్ని, ఘైర్ ముకాల్లిద్ నూ ఆమోదించని సయ్యద్ ఖాన్ ప్రవృత్తిని ఇతడు అధిక్షేపించెను. మతాందీ అనుయాయుడుగా ప్రారంభించి, పిమ్మట ఘుజాలీ, రాజీల ప్రభావమునకు లోనై, కడపట ఇబన్ తైమియా భక్తుడుగా సిద్ధించినవాడు షిబ్లీ. కనుక అహమద్ ఖాన్ అవలంబించిన హేతువాదాన్ని, తిరస్కరించెను.

విద్యా విషయములో, ఇతని విధానం, దేవబందు విద్యాలయ పద్ధతికీ, అహమదుఖాన్ విద్యాలయ పద్ధతికీ, మధ్యస్థమై యుండినది. ముస్లిము సంప్రదాయ విద్యాప్రణాళికలోని శాబ్దికమూ, ఔపచారికమూ ఐన సంప్రదాయ భాగాన్ని తగ్గించి, ఆంగ్లభాషనూ, పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రాలనూచేర్చి, విద్యావిధానాన్ని, సంస్కరింపదలచుకొనెను. నద్వతల్ ఉలమా, దరుల్ ఉలుమ్, అనే విద్యా సంస్థలను లక్నోలో నెలకొల్పి (1894,-1896), తన విద్యా ప్రణాళికను వాటిలో ప్రవేశ పెట్టెను. ప్రథమంలో సంప్రదాయస్థులైన ఉలామావర్గం వారు

ఇతని ప్రయత్నానికి అడ్డు తగిలిరి. కాని, పూర్వ ప్రణాళికను మార్చవలసిన అవసరాన్ని, ఆంగ్లభాషా ప్రవేశ ఆవశ్యకాన్ని, ఇతడు వారికి నచ్చజెప్పి అంగీకరింపజేసెను.

రాజకీయ విషయాలలో,-ఇస్లాము ఉదారమైన సంస్థయని, నాగరకతను, అభివృద్ధిని అది ఆదరిస్తుందని ఇతని నమ్మకము. మానవుని ఘనతను నిలబెట్టడము, మానవుల సమానత్వాన్ని సమర్థించడము, స్త్రీ జనుల హక్కులను రక్షించడము, ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని అభిమానించడము,-మొదలైనవన్నీ ఇస్లాము మతమునకు అభిమతములైనవి. మత సహనము, మత రక్షణ అనే విషయాలలో తప్ప, తక్కిన యుద్ధచర్యపట్ల అనిష్టతను ఇస్లాము బోధించినది. బలవంతంగా మతాన్ని వ్యాపింపచేయడము ఇస్లాము నిషేధించింది. మానవ జీవితము లౌకికానికీ పారమార్థికానికీ మధ్య ధ్రువీకరించడము (Polarisation) ఇతని అభిమతముకాదు. సన్యాసి జీవితము, మరజీవితముకూడా, ఇతడు నిరాకరించెను. షిబ్లీ ప్రజాస్వామ్యవాది; సామ్రాజ్యనీతికి విరోధి; ముస్లిము దేశాల ఐక్యవాది. కనుక, సయ్యద్ అహమద్ ఖాన్‌తో ఇతడు ఏకీభవించకపోవడం సహజమే. ఇండియా సమస్యలపై కూడా వీరిరువురి అభిప్రాయాలు విభిన్నములు కావడంవల్ల ఇరువురికీ గల భేదాభిప్రాయం వృద్ధియయింది. బ్రిటీషు వారికి భక్తుడై, జాతీయ సంస్థయైన కాంగ్రెసును, అహమద్ ఖాన్ వ్యతిరేకించడం దుఃఖకరమైన విషయమని ఇతని నమ్మకము. కళాశాలలోని ఆంగ్ల అధ్యాపకుల చేతులలో, అహమద్ ఖాన్, కీలుబొమ్మగా మారినాడని ఇతడూహించెను. షిబ్లీ శిష్యుడూ, జీవిత చరిత్రకారుడూ, ఐన సయ్యద్ సులేమాన్ నద్వీ, ఈ క్రింది విధంగా వ్రాసియున్నాడు. "కాంగ్రెసును వ్యతిరేకించి, బ్రిటీషు ప్రభుత్వంతో స్నేహం గావించడము ముస్లిములకూ, కళాశాల ప్రయోజనానికీ శ్రేయమని, బోధించి, ఇంగ్లీషు అధ్యాపకులు, అహమద్ ఖానుకు దృఢమైన విశ్వాసాన్ని కలిగించినారు. ఆంగ్లేయుల ప్రభావమనే ఇంద్రజాలానికి ఇతని స్వతంత్రాభిప్రాయాలు వశమై, దానిలో మునిగిపోయినవి. ఇపుడు తాను చూడగలిగిన దంతా వారి నేత్రముల ద్వారానే: వినగలిగినదంతా వారి చెవుల ద్వారానే : అతనిస్థితి ఇట్టిది."

కాంగ్రెసు సంస్థయొక్క ఉన్నతాశయాలను, ఇండియా ప్రజల బాగును, వారి అభివృద్ధిని కాంక్షించి కాంగ్రెసు చూపుతున్న ఉత్సుకతను, షిబ్లీ మెచ్చుకొని ప్రశంసించినాడు. అల్ప సంఖ్యాకులైన ముస్లిములకు రెండు విధములైన స్థానము, ఇండియాలో ఏర్పడుతుందని అతడు గ్రహించినాడు. ప్రత్యేకమూ, విశిష్టమూ, ఐన, మత సంస్కృతులు గలవారు ముస్లిములు. ఇండియా చరిత్రలో వారు నిర్వహించిన కార్య భారం వైభవోపేతమైనది. మత దృష్ట్యా, ప్రపంచ సమాజానికి చెందినది తమ సంఘము. ఇండియా పౌరులై యున్నందువల్ల మాతృదేశ భక్తి విశ్వాసములు తమ కర్తవ్యములు. బ్రిటీషు పరిపాలనవల్ల ఏర్పడిన కష్టాలను, నష్టాలను ఇతర మతాల వారితో సహా, ముస్లిములు కూడా అనుభవిస్తున్నారు. భారతీయులందరూ సాధించడానికి బూనికొనియున్న భవిష్యత్తు

లోని శుభములన్నీ, తమకు కూడా, సంబంధించినవే. మధ్య యుగాల ముస్లిము ప్రభుత్వం పునరుద్ధరింప బడడము సాధ్యంకాదని ఇతడెరుగును. కాని, హిందువులతో కలిసి ముస్లిములు స్వతంత్ర రాజ్యాన్ని ఏర్పరచుకొని, గౌరవంతో, సౌఖ్యంతో, జీవించడం సాధ్యమనీ, అట్టి జీవితం తమ ఆత్మకుగాని, తమ పవిత్ర మత సూత్రాలకు గాని, భంగకరమైనది కాదనీ కూడా ఇతడు గుర్తించినాడు.

## VIII జాతీయ వాదులైన ముస్లిములు

కాంగ్రెసు ఉద్యమానికి, మరియొక ముస్లిము సంస్థకూడా సహకరించింది. బొంబాయి, మదరాసు రాజధానులలోని విద్యావంతులైన ముస్లిముల సంస్థ ఇది. ఆధునిక భావాన్ననుసరించికూడా, ఈ సంస్థ అవలంబించినది జాతీయతా దృక్పథము. ప్రజాస్వామ్య విధానములో ఇండియా అభ్యుదయం పొందవలెననే కాంక్షతో వీరు రాజకీయోద్యమాన్ని సమర్థిస్తూ వచ్చిరి. ఆ దృష్టితోనే హిందూ ముస్లిము ఐక్యమును వీరు గాఢంగా అభిమానించి, తత్ప్రయత్నము గావించిరి. ఇస్లాము మతములో తమకున్న విశ్వాసానికీ, మాతృదేశమైన ఇండియాను ప్రేమించడానికీ, మధ్య ఎట్టి ఘర్షణా వారికి గోచరించలేదు.

*బద్రుద్దీన్ త్యాబ్జీ :* కాంగ్రెసుసంస్థ ప్రారంభమైన రోజులలో, బదురుద్దీన్ త్యాబ్జీ, ప్రముఖనాయకులలో ఒకడు. అరేబియానుండి ఇండియా వలసవచ్చి, బొంబాయిలో స్థిరపడిన, అరబ్బీ కుటుంబములోని వాడితడు. బాల్యంలో ఒక మద్రసాలో చదివి, పిమ్మట బొంబాయి ఎలిఫిన్‌స్టన్ విద్యాలయంలో, ఉన్నత విద్యనభ్యసించెను. 1878లో లిట్టన్ ప్రభువు దేశీయ పత్రికాశాసనాన్ని ప్రకటించి, ఒప్పందపు సేవలనుంచి భారతీయులను బహిష్కరించవలసిందని ఇండియా సెక్రెటరీకి వ్రాసినప్పటినుంచి, త్యాబ్జీ, రాజకీయాలలో ఆసక్తి కలిగించుకొన్నాడు. ప్రభుత్వం గావించిన ఈ నిబంధనలను, త్యాబ్జీ తీవ్రంగా ప్రతిఘటించెను. 1883 ఇల్‌బర్ట్ బిల్లుపై జరిగిన వివాదాలలో, ఇతడు ఇండియా ప్రయోజనార్థం పోరాడినాడు. న్యాయవాద వృత్తిలో ఇతడు వేగంగా, అభ్యుదయస్థితికి వచ్చుచుండిన సమయమది. బొంబాయి శాసనసభలో సభ్యుడుగా అప్పటికే నియమితుడైయుండినాడు. ఇతని వాగ్ధోరణి, న్యాయవాదము ప్రజల మెప్పును, ఆదరణను ఎక్కువగా సంపాదించుకొన్నవి. 1885 జనవరి 31వ నాడు, బొంబాయి రాజధాని సంఘము ఏర్పడినది. అందులో ఉపన్యసిస్తూ, తన రాజకీయాభిప్రాయాలను ఈ క్రిందివిధంగా వివరించెను.

"వ్యక్తుల విషయములోవలెనే, జాతుల విషయంలో కూడా, రాజకీయ జీవితం అభివృద్ధి పొందడంతో, నూతన ఉత్కాంతులు ప్రజలలో ఉదయిస్తాయి. ఈ ఉత్కాంతులను క్రమబద్ధంగా వ్యక్తముగావించుటకు సుసంఘటితమైన ఒక సంస్థ ఆవశ్యకము. ఈ సంస్థ, జాతీయ ఉత్కాంతులను గమనించి, నియమనపరచి, అభివృద్ధిపరచి, సక్రమమార్గంలో నడిపిస్తుంది, అని నా అభిప్రాయం. మన రాజకీయ స్వత్వముల విషయమైన పరిజ్ఞానం మనలో ఉదయించింది. ఇంతకాలము

వరకూ, మన ప్రయోజనాలకు విరుద్ధంగా, విభేదాలను కల్పిస్తూవచ్చిన, జాతి మత వర్ణవిభేదాలు, విజ్ఞానప్రదమైన విద్యా ప్రభావంవల్ల, తొలగిపోయినవి".

కాశీనాధ త్రియంబక్ తెలాంగ్, ఫెరోజ్‌షామెహతా, త్యాబ్జీ,- ఈ ముగ్గురూ బొంబాయిలో జరిగిన ప్రజా ఉద్యమాలన్నిటికీ నాయకులుగా గుర్తింపబడినారు. సర్. హెచ్. పి. మోడీ వచించినట్లు, "పరిపాలనలోని ప్రతి శాఖలోనూ జరుగవలసిన సంస్కరణలకై, ఈ నాయకత్రయం, నిరంతరమైన ఉద్యమ నిర్వహణను సాగిస్తున్నది. ప్రజా జీవితమునకు సంబంధించిన ప్రతి రంగంలోనూ, ప్రజల మేలును సమకూర్చడానికై, ఈ నాయకులు, సభలద్వారా, సంస్థలద్వారా, నిరంతరమైన కృషిచేసియున్నారు.

1885లో భారత జాతీయ కాంగ్రెసు బొంబాయిలో సమావేశమైన సందర్భంలో, త్యాబ్జీ, కాంగ్రెసు సంస్థను బలపరచడమే కాక, బొంబాయి ముస్లిములు కాంగ్రెసు సమావేశానికి దూరంగా ఉండిరని, లండన్ టైమ్సు పత్రిక వ్రాసిన దానిని, ఖండించినాడు. బొంబాయి రాజధాని సంఘ సమావేశంలో ఉపన్యసిస్తూ, "ఈ ఉద్యమానికి నా సంపూర్ణ సానుభూతి సహకారములు, నా మతస్థుల సానుభూతి సహకారములు ఉన్నవని, మిమ్ములను ఆశ్వాసిస్తున్నాను. కాంగ్రెసు ఉద్యమంతో, మహమ్మదీయులకు ఎటువంటి ఎట్టి సంబంధమూలేదని, వారు దూరంగా ఉన్నారని టైమ్సు పత్రిక తప్పుగా వ్రాసి, దురభిప్రాయం కలిగించింది. టైమ్సు వ్రాత వాస్తవం కాదని నేను నిష్కర్షగా చెప్పుతున్నాను." కారణాంతరాలవల్ల, త్యాబ్జీ, కాంగ్రెసు సమావేశానికి హాజరు కాకపోవడం వాస్తవమే. కాని, అతనితో సమానమైన పలుకుబడి కలిగిన ముస్లిము నాయకులు,- రహంతుల్లా సయానీ, అబ్దుల్లా ధరాంసీ,-సమావేశానికి హాజరైనారు. "ముస్లిముల అవసరాలనుగూర్చి ప్రభుత్వానికి తెలుపుకోడానికై అంజుమాన్-ఏ-ఇస్లాం, అనే సంస్థ యొకటి ప్రత్యేకంగా ముస్లిము లేర్పరచుకొన్నారు. అంతమాత్రంతో, ముస్లిములకు కాంగ్రెసు సంస్థతో సంబంధం లేదనడం సరికాదు. రాజకీయాభ్యుదయానికై పాటుబడుతున్న ఈ ఉద్యమంలో, ఇతర మతస్థులతోపాటు ముస్లిములు కూడా చేరియున్నారు." అని తన ఉద్దేశాలను మరియొక సారి ఉద్ఘాటించినాడు.

ముస్లిములు కాంగ్రెసుకు సహాయపడకుండాచేయుటకై, బొంబాయి గవర్నరు, రీయే ప్రభువు, కొన్ని సూచనలను బహిర్గతం గావించినాడు. సయ్యద్ అహమద్‌ఖాన్‌తో స్వయంగా కలిసి సంప్రదించి, తన ప్రయోజనాన్ని సాధించుకొన్న డఫ్ఫెరిన్ ప్రభువు, బదురుద్దీన్ త్యాబ్జీని కూడా, వశపరచుకోడానికి స్వయంగా ప్రయత్నించెను. రాజప్రతినిధియైన డఫ్ఫెరిన్, త్యాబ్జీని కలుసుకొని, తానూ, తన కుటుంబమూ కలిసి తీయించుకొన్న ఫోటోను అతనికి బహుమానంగా ఇచ్చి, తనకు ముస్లిములపట్లగల ప్రశస్తభావాన్నీ స్నేహాన్నీ, పేర్కొని, టర్కీలో తాను ప్రభుత్వ రాయబారిగా నున్నప్పటి నుంచీ ముస్లిముల పట్ల ప్రీతి ఏర్పడిందనీ తెలిపి, తన అభిప్రాయాన్ని వ్యంగ్యంగా సూచించెను.

కాని, రాజప్రతినిధి ప్రయత్నం ఫలింపలేదు. "ప్రతి గ్రహీతలు, కానుకలు తీసుకొని రావడం నాకు భయంకలిగిస్తుంది," అని త్యాబ్జీ ఈ ఉదంతాన్ని ఒప్పుకొన్నాడు. సయ్యద్ అమీర్ ఆలీ కూడా, త్యాబ్జీని, తమ పక్షం తిప్పుకోడానికి ప్రయత్నించి నాడు. కలకత్తా మహమ్మదీయ సంఘానికి కార్యదర్శియైన అమీర్ ఆలీ, తాము ఏర్పరచనున్న మహమ్మదీయ రాజకీయ సమావేశానికి రావలసిందని, త్యాబ్జీకి ఆహ్వానం పంపించెను. త్యాబ్జీ, ఆహ్వానాన్ని నిరాకరిస్తూ, "దేశమంతటికీ సంబంధించిన రాజకీయ విషయాలలో, దేశమందలి అన్ని మత వర్గాలతోనూ, ముస్లిములు ఏకీభవించవలెననే అభిప్రాయం, నాకెప్పుడూ ఉన్నదే. ఇది మీకు తెలిసిన విషయమే. అట్టి సమస్యల విషయంలో, హిందువులతోను, పార్సీలతోను అనైక్యమును కలిగించే ప్రయత్నాన్ని నేను నికృష్టమైనదిగా భావిస్తాను. బొంబాయిలోను, కలకత్తాలోను, జరిగిన కాంగ్రెసు సమావేశాలకు, కలకత్తా ముస్లిములు హాజరు కాకపోవడము శోచనీయమైన పనియని, ఈ అభిప్రాయాల వల్లనే నేను నిరసించియున్నాను. కనుక, మీరు ఏర్పాటు చేయబూనుకొన్న మహమ్మదీయ సమావేశము, కాంగ్రెసు సంస్థకు కేవలం పైపోటీగా ఉద్దిష్టమై యుంటే, ఆ ప్రయత్నాన్ని నేను ప్రతిఘటించక తప్పదు. మన కేర్పడియున్న పరిస్థితులను బట్టి, మనము, కాంగ్రెసులోచేరి, దాని పర్యాలోచనలలో పాల్గొన డమే, మన మవలంబించవలసిన ఉచిత మార్గమని నాకు విశ్వాసమేర్పడినది." అని జవాబిచ్చియున్నాడు.

తర్వాత వ్రాసిన మరియొక జాబులో కూడా, త్యాబ్జీ, తన రాజకీయాభి ప్రాయాలను పునరుక్తం గావించినాడు. "దేశాభ్యుదయానికి సంబంధించి, ప్రజా సమస్తానికీ వర్తించే రాజకీయసమస్యల విషయంలో, విద్యావంతులు, ప్రజా శ్రేయస్సును గోరినవారు, అందరూ, జాతిమత వర్ణవిభేదాలను గణింపక, ఐక్యముతో కృషిచేయడము, తమ విద్యుక్త ధర్మంగా భావించవలెననడము, నా అభిప్రాయము".

1887, భారతజాతీయ కాంగ్రెసు మదరాసులో సమావేశమై, బదురుద్దీన్ త్యాబ్జీని, అధ్యక్షపదవికి ఎన్నుకొనింది. ఈ విషయంలో ప్రభుత్వపు అసమ్మతిని గాని, సయ్యద్ అహమద్ ఖాన్, సయ్యద్ అమీర్ ఆలీల ఆగ్రహాన్నికానీ, ఇతడు గణించలేదు. అధ్యక్షోపన్యాసములో "దేశంలోని మనకందరికీ ప్రయోజనం కలి గించే గొప్పహక్కులను, పరిపాలన సంస్కరణలను సంపాదించడానికై చేసే ఈ మహాప్రయత్నములో, దేశంలోని అన్నిమతాలవారు, అన్నివర్గాలవారు, ఏకం కావడం సమంజసమైనది, ఉచితమైనది. మన మందరమూ ఏకీభవించి మనఃపూర్వ కంగా ఒత్తిడిచేస్తే, మనమనుకొన్న హక్కులూ సంస్కరణలూ, తప్పక సిద్ధిస్తా యనడం తథ్యం." అని అన్నివర్గాలవారినీ ప్రోత్సహించినాడు. కాంగ్రెసుసంస్థ కేవలం ప్రజల కూటం మాత్రమే అనే ప్రచారాన్ని, ఇతడు తిరస్కరించినాడు.

అట్టి ప్రచారం గావించిన వ్యక్తులను స్వయంగా సభకువచ్చి, నిరూపించుడని ఆహ్వానించెను. "నాతోవచ్చి, ఈ సభను ఒక్కసారి పరికించండి. బుద్ధిప్రాభవంలో, విద్యలో, పదవిలో, (కులీనత, సంపదల మాట అటుంచి)- ఇక్కడచేరిన వారి కంటె సంపన్నులైన ప్రజాప్రతినిధులు, ఇంకెక్కడ మీరు చూడగలరో చెప్పండి." అని కువిమర్శకులను ఆక్షేపించినాడు.

1887 తర్వాత, చాలకాలంవరకు, కాంగ్రెసు సమావేశ పర్యాలోచనలలో త్యాబ్జీ నిర్ణయమే ప్రమాణంగా ఏర్పడింది. మతసంబంధమైన విషయాల్లో ముస్లిములు సర్వస్వంతంత్రులు. స్వేచ్ఛగావారి మతసంప్రదాయాలను పాటించుకోవడంలో కాంగ్రెసుకెట్టి సంబంధమూలేదు; కనుక జోక్యం కలుగజేసుకోవలసిన అవసరమూ లేదు; అని ముస్లిములకు ఆశ్వాసం కల్పిస్తూవచ్చినాడు త్యాబ్జీ. జాతీయకార్యక్రమాల విషయములో, ముస్లిములు తాము కూడా భారతీయులనే భావంతో, భారతజాతీయతాభ్యుదయాన్ని కోరి, దేశంతో ఐక్యాన్ని పొందవలసి ఉంటుంది. ఉత్తమ ప్రభుత్వస్థాపన, ఇండియనులకు తగిన గౌరవప్రతిపత్తులు, పన్నులభారాన్ని తగ్గించడము, అన్ని మతాలవారికీ అనుగుణమైన ఉత్తమ విద్యావిధానము- మున్నగు జాతీయవిషయాలను సాధించుకోడానికి, ముస్లిములు ఇతరులతో చేరి, ఒక్క జాతిగా ప్రయత్నించవలసియున్నది. ప్రజాప్రాతినిధ్యంపై ఏర్పడే శాసన సభల విషయములో ముస్లిములకు గల దురభిప్రాయాలను, భీతిని, తొలగింప బూనుకొన్నాడు. హిందువులు అధిక సంఖ్యాకులై యుండడంవల్ల, శాసన సభల ప్రాతినిధ్యం కూడా అధికమై, తమ మత విషయములకు విరుద్ధములైన శాసనములు జరుగవచ్చుననీ, ఈద్, మొహరం, ఇతర కర్మలు మున్నగువానికి భంగం కలుగవచ్చుననీ ముస్లిములు భయపడడము భ్రాంతి మూలకమని వారికి నచ్చ జెప్పినాడు. జాతి మత భేదాలను గణించక, ప్రజల కష్టాలను తొలగించడానికై, విద్యావంతులు, ప్రజాహిత కాంక్షులు ఐన వారెల్లరూ పాటుపడడం కర్తవ్యమనీ, వైయక్తికంగానూ, సంస్థల ద్వారాను, ఈ కార్యక్రమాలకు పూనుకోవలసిందనీ ప్రార్థిస్తూ, ఉత్తర భారతంలోని ముస్లిము నాయకులందరికీ ఇతడు జాబులు వ్రాసెను. అతని జీవితాంతం వరకు, త్యాబ్జీ శ్రద్ధాయుతుడైన ముస్లిముగా జీవిస్తూ, భారత జాతీయ కాంగ్రెసు సంస్థకు కూడా శ్రద్ధాభక్తులతో, నిర్భయంతో, నాయకుడుగా సేవ గావించినాడు.

1905 లో జరిగిన బెంగాలు విభజనవల్ల హిందూ ముస్లిము సంఘాల పరస్పర సంబంధములో నూతన అవస్థ ఆరంభమయింది. అప్పటివరకు, దేశములోని ముస్లిము రాజకీయ భావాలు రెండు సంస్థలుగా ఏర్పడి యుండినవి. ఉత్తర భారతంలోని ఉన్నతవర్గ ముస్లిములు, అలిఘరు ఉద్యమానికి అభిమతులై అహమద్ ఖాన్ అభిప్రాయాలతో ఏకీభవించి యుండిరి. పాశ్చాత్య విద్యా విధానంలో శిక్షితులుకాని ముస్లిములపై, దేవబందీ విద్యాలయంవారూ, ఉలామా, నాయకత్వంవహించి, రెండవ సంస్థను నడపుచుండిరి. ముస్లిము జాతీయవాదులు

పాశ్చాత్య విద్యా విషయములో, అహమద్ ఖాన్ యొక్క ఉదారాభిప్రాయాలతో ఏకీభవించినవారే. కాని, రాజకీయ సంస్కరణలు, ప్రజాప్రాతినిధ్యంపై ఏర్పడే ప్రజాస్వామ్య ప్రభుత్వము, ప్రజాస్వామ్యాందోళన విధానము, మొదలైన రాజకీయవిషయలములో వీరికి ఏకీభావం లేదు. బెంగాలు విభజన జరిగిన పిమ్మట, పరిస్థితి ఏవిధంగా ఉంటుందో ముస్లింసంఘ నాయకత్వానికి పోటీపడుచున్న ఈ రెండు వర్గాలలో ఏదిజయించి, నాయకత్వము వహిస్తుందో, నిశ్చయించడం కష్టము.

# 9
# మతసాంఘిక సంస్కరణోద్యమాలు

## I పాశ్చాత్య ఆపత్తి (Ghallenge.)

ప్లాసీ యుద్ధానంతర సంఘటనలవల్ల పరిణమించిన 1857 నాటి విప్లవము, దేశాన్ని మూలమట్టం వరకు కదలించివేసింది. భారతరాజ్య వినాశము, ఆర్థిక వ్యవస్థ పరివర్తనము, సాంఘికవ్యవస్థా సంస్కృతులపై పాశ్చాత్యుల దాడి, - ఇవి, పురాతనమైన భారతజాతిని శాశ్వత రాజకీయ దాస్యానికి లోబరచడమే కాక, దేశాన్ని ఆర్థిక వలస రాజ్యంగాను, పాశ్చాత్య సంస్కృతి ప్రాంతంగానూ చేసివేసినవి. ఈ రాజకీయ అధీనానికీ, భావదాస్యానికీ ప్రతిక్రియగా దేశము వేగ శక్తిని సంపాదించుకొన్నది.

ప్రాగ్దేశ మూలభావాలకు, సంస్థలకు జరిగిన ఈ పాశ్చాత్య ఆపత్తి, ఇదివరకెన్నడూ లేనిది. ఇంగ్లాండు ప్రభుత్వం యొక్క రాజకీయాధిపత్యము నిర్నిరోధమై, ప్రబలమై, అచంచలమైఉన్నది. దానిని తొలగించడానికి జరిపిన ప్రయత్నం విఫలమయింది. కనుక, భారతీయుల దృష్టి రాజకీయములనుంచి మరలి, పాశ్చాత్య సాంస్కృతిక సాంఘిక భాగములపై ప్రసరించింది.

పందొమ్మిదో శతాబ్దపు ప్రథమ భాగంలో కలిగిన పాశ్చాత్య సంఘట్టనం వల్ల, భారతీయులలో, ఆత్మవిమర్శ, మత సంస్కరణ దృష్టి ప్రారంభమయినవి. శతాబ్దపు రెండవ భాగములో, ఈ ప్రక్రియ వేగవంతమయింది. క్రిశ్చియను మతము కలిగించిన ఆపత్తి కారణంగా, హిందువులు ముస్లిములు కూడా, తమ యింటిని చక్కబెట్టుకొనే ప్రయత్నానికి బూనుకొనిరి. కాలం వల్ల తమ మతాలు, ఆది కాలపు పవిత్రతను గోల్పోయినవని, ఆశయములు మరుగుపడిపోయినవని, గ్రుడ్డి సంప్రదాయాలతో మతం కలగాపులగమైపోయినదని, దుష్టములైన ఆచారాలకు, క్షుల్లక కర్మలకు, నిర్హేతుకములైన క్రియాకలాపాలకు, క్రూరములైన మూఢ విశ్వాసాలకు, జనుల జడప్రవృత్తి, లొంగిపోయిందని, రెండు మతాల వారూ గ్రహించిరి. దుష్టములైన ఈ పరిణామాలను నిర్మూలించి, తమ మతములను పరిశుద్ధమొనర్చడానికి పూనుకొనిరి. మానవుని ఆధ్యాత్మిక జీవితము పరిశుద్ధమై, ఆత్మబలాన్ని చేకూర్చుకొని, వ్యక్తికీ సంఘానికీ కూడా స్వాతంత్ర్యమును, నిజమైన సౌఖ్యమును చేకూర్చడానికి సమర్థమై యుండవలెను. కనుక సంస్కరణ మావశ్యకమైనది.

ఈ ఆధ్యాత్మిక చైతన్యము, పవిత్రీకరణకాంక్ష, వీరి మనస్సులను, తమ

మతము యొక్క మూలస్థానాలకు గొనిపోయినవి. ఆది కాలపు మత పవిత్రతా ప్రభావము, వీరిని ముగ్ధులను గావించినది. ఇట్టి సందర్భములలో సంస్కరణ జరగ వలెనంటే పూర్తిగా మూలాన్వేషణ గావించి, దానిని పునఃప్రతిష్ఠ గావించవలసి యుంటుంది. అనేకులు సంస్కర్తలిట్టి పునఃప్రతిష్ఠోద్యమానికి పూనుకొనిరి. కాని, గతాన్ని పునఃసృష్టించడం సాధ్యం కాని పని. అది ప్రకృతి విరుద్ధమైనది. కనుక, గతాన్ని గూర్చి పర్యాలోచించిన మనస్సును బట్టి, దానిని నిర్మించవలసి యుంటుంది. వేర్వేరు సంస్కర్తలు తమకు అభిమతమైన రీతిగా, ప్రాచీన మత వ్యవస్థను వేర్వేరు రూపములలో ప్రదర్శించి, దానిని పునఃప్రతిష్ఠ గావించడానికి వేర్వేరు పద్ధతులను ప్రతిపాదించిరి.

మతాన్ని పునరుద్ధరించదలచుకొన్నా, సంస్కరించదలచుకొన్నా, మాతృకకు అనుగుణముగాలేని అంశములన్నిటినీ తీసివేయడం అవసరము. ఈ ప్రక్రియకు బూనుకొని సంస్కర్తలు స్వేచ్ఛగా, మతసంబంధములైన విషయాలను తీసివేయ సాగిరి. మాతృకలోని సిద్ధాంతాలను, ఆచారాలను ఆధునిక జీవితమున కనుగుణంగా వివరించడంలో, వ్యాఖ్యానించడంలో విభేదము లేర్పడినవి. ఇట్లు హిందువులలోను, ముస్లిములలోను కూడా భిన్న భావాలు గల సంస్థలేర్పడెను. పద్ధతుల విషయంలో భేదాభిప్రాయములున్నా, సంస్కరణావశ్యకము, నైతిక సంస్కరణావసరము, ఏకమతావలంబులైన వారి ఐక్యము అనే విషయాలలో వీరికేకాభిప్రాయమున్నది. సత్యమైన మతాన్ని నిర్లక్ష్యం చేసి, నైతిక భ్రంశానికీ, సాంఘిక లోపాలకూ అవకాశము కల్గించినందువల్లనే, రాజకీయ వినాశము, దాని ననుసరించిన దుస్థితులు, తమకు కలిగినవనే విషయాన్ని అందరూ ఒప్పుకొన్నదే.

ఈ మత సంస్కరణోద్యమాల కారణంగా, కార్యకారణ సంబద్ధమైన దృక్పథం పెంపొందడం అభిలషణీయమైన పరిణామము. భిన్న మతానుయాయుల మధ్య, మత సిద్ధాంతాలపై జరిగే చర్చలు, వివాదాలు చిత్త విభ్రాంతిని కలిగించడం తప్పదు. సంప్రదాయాలను గాఢంగా పాటించుచుండిన ప్రాచీనుల దృక్పథం కూడా మారజొచ్చింది. పరిశీలనకు, విమర్శకు, ప్రయత్నించక సంప్రదాయాలను ఒప్పుకొనుచుండిన వారిప్పుడు విమర్శాత్మక నిర్ణయాల నన్వేషింపసాగిరి. ఈ మత వివాదాల వల్లను, చర్చలవల్లను, ప్రయోజనం సిద్ధించినా, సిద్ధించకపోయినా, ఒక మేలు జరిగింది. ఆధునిక లౌకిక భావాలకు ఆధారమైన వ్యక్తి స్వాతంత్ర్య తత్త్వము అభివృద్ధికివచ్చింది. రాజకీయార్థికాంశాలు, వ్యక్తి స్వాతంత్ర్య తత్త్వంతో చేరి, జాతీయ భావాభివృద్ధికి దోహదం గావించినవి. దీనినిబట్టే, మత సంస్కరణోద్యమాలను, ఈ స్వాతంత్ర్య చరిత్రలో, చర్చించవలసిన ఔచిత్యం ఏర్పడింది.

హిందువులలోను, ముస్లిములలోను కూడా, చిన్న భావాలుగల సంస్కర్తలూ ఏర్పడిరి. ఎట్టి మార్పూ జరగకూడదనే పూర్వాచార పరాయణులు మొదలు కొని, పూర్తిగా ఉన్న దానినంతా తీసివేయవలెననే అతివాదుల వరకూ, సంస్కర్తల వర్గా లేర్పడినవి. ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వీరందరూ, పాశ్చాత్య ప్రభావానికి లోనైనవారే. పూర్వ సంప్రదాయాలలో పుట్టి పెరిగిన వారు కూడా

కాల ప్రభావానికి లోనైరి. రామ్‌మోహనరాయ్, దేవేంద్రనాథ టాగోర్, కేశవ చంద్రసేన్, రెనడే, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, రాజానారాయణ బోస్,-వంటి మహనీయులు హిందూ వర్గంలోని అభ్యుదయ వాదులు. సయ్యద్ అహమద్ ఖాన్, అమీర్ అలీ, మహమ్మద్ ఇక్బాల్, వీరు ముస్లిము వర్గంలోని ఉదార సంస్కర్తలు. దయానంద సరస్వతి, రామకృష్ణ పరమహంస, వివేకానంద, బంకిం చంద్ర ఛటర్జి వంటివారు హిందూ సంస్థలోని ప్రాచీన సంప్రదాయాలకు రక్షకులైనారు. ముస్లిము సంఘములో, అహల్-ఈ-హదీత్, అహల్-ఈ-కురాన్, అనే మతవర్గాలను ప్రసారం గావించిన వారూ, కాదిసీలూ, సంప్రదాయవాదులు.

పూర్వ ప్రకరణములో, దిఙ్మాత్రంగా వివరింపబడిన హైందవ సంస్కరణోద్యమాన్ని ఈ ప్రకరణంలో వర్ణించడము ప్రస్తుత ప్రయత్నము. ఈ ఉద్యమము మూడు భిన్న మార్గాలలో ప్రవృత్తమైనదని ఇదివరకే సూచించబడినది. పందొమ్మిదో శతాబ్దపు రెండవ భాగంలో, ఈ మూడు వర్గాలూ నడుస్తూ వచ్చినవి. కాని, వాటి బలాబలాలలో మార్పులు వచ్చినవి. చాల కాలం దాకా, బ్రహ్మసమాజ ప్రాభవము వృద్ధి పొందుతూ వచ్చింది. తరవాత, సమాజంలో భేదాభిప్రాయాలు, ఛిద్రములు ఏర్పడినందువల్ల బలహీనమై, సమాజము, ప్రజల భావాలపై గల ప్రభావాన్ని, పలుకుబడిని గోల్పోయింది. ఒక చిన్న వర్గం వారు మాత్రమే సమాజానుయాయులుగా నిలిచిరి.

రామ మోహన్‌రాయ్ మత విషయంలో ప్రతిపాదించిన ఉదార విధానము, బెంగాలు సరిహద్దుల నతిక్రమించి,, ఇతర ప్రాంతాలలో కూడా సంస్కరణోద్యమాలకు దోహదకారియయింది.

అభ్యుదయ విధానము, సుసంబద్ధమైన ఒక సంస్థగా ఇంకను ఏర్పడలేదు. ఐనా, పాశ్చాత్య ప్రభావమునకు లోనైన వారనేకులు ఈ విధానానికి బద్ధులైరి. అభ్యుదయ తత్త్వప్రభావము, సాహిత్య రూపంలోను సాంఘిక రాజకీయ క్రియాచరణలోను కూడా వ్యక్తముకాజొచ్చింది.

కాలం గడిచినకొద్దీ, సాంప్రదాయక దృక్పథము, మధ్యతరగతుల వారిపై ఎక్కువ ప్రాబల్యం నెరపుతూవచ్చింది. అందునూ, 1870 తర్వాత, మతపునరుజ్జీవ ప్రయత్నానికి తీవ్రంగా బూనుకొన్న సంస్థలనేకములు దేశములో ఏర్పడినవి. హిందూమత సంప్రదాయాలను సమర్థించడమనే విషయములో ఈ ఉద్యమాలన్ని ప్రాచీన వ్యవస్థపై ఆధారపడియున్నా, సంప్రదాయస్థ విషయాన్నిబట్టి, వీటిలో విభేదాలుండినవి. ప్రాచీనములైన అధికార సిద్ధాంతాలు, కర్మకలాపాలు, మత గ్రంథాలు, వీటికి సంబంధించిన అంశాలలో పరిగ్రాహ్యములేవి, త్యాజ్యములేవి అనే సమస్యపై తరతమ భేదాభిప్రాయాలేర్పడినవి. ఐనా, మధ్యయుగాల కాలంలో వచ్చిచేరిన అతిమూఢ విశ్వాసాలను, నిర్హేతుకములైన కర్మలను ఆచారాలను ఖండించే విషయంలో వీరందరికీ ఏకాభిప్రాయమున్నది.

భారత భూమిలో నెలకొని విస్తరించిన పాశ్చాత్య సంస్కృతి అనే నూతన వృక్షము ప్రసాదించిన సత్ఫలం రామ్‌మోహన్‌రాయ్ అని అతనిని వర్ణించవచ్చు.

మత విషయకమైన అతని అన్వేషణ, బుద్ధిశక్తిప్రధానమైనది. అతడు సంయోజన పరచి, స్థాపించిన బ్రహ్మసమాజసంస్థ, అతని తీక్ష్ణతార్కిక మనోభావంపై ఆధార పడినది. సమకాలిక హిందూ సంప్రదాయ విశ్వాసాలను ధైర్యంతో ప్రతిఘటించ డానికి సమర్థమైన ఇతని వ్యక్తి స్వాతంత్ర్యభావమే, ఇతడు నిరూపించి స్థాపించిన ఏకేశ్వరోపాసన సిద్ధాంతానికి మూలాధారము. ఇట్టి ఉన్నతభావము, బుద్ధిశక్తి సామర్థ్యంగల ప్రజ్ఞావంతులను మాత్రమే ఆకర్షించడం సహజమైనదే. ఇతడు ప్రతి పాదించిన ప్రకృత్యాత్మక దేవతా శాస్త్రము, తార్కికనీతి శాస్త్రము, సాంఘిక ఆర్థిక రాజకీయ విషయములలో ఇతడు పాటించిన ఉదార మనోభావము, క్రియాత్మకము, వాగాత్మకము ఐన మధ్యయుగ ప్రవృత్తిని ఖండించే ప్రవృత్తి, మతవిషయ లౌకిక విషయములను వేరుపరిచి, పరిశీలించే దృక్పథము, మొదలైన సంస్కార విధానాలు, సామాన్యమైన బుద్ధికి అందరానివి. కనుక, సాధారణ వ్యక్తులు వీటిని గ్రహించడము సాధ్యంకాని పని.

సామూహికాధ్యయనము, ధ్యానమననములు, బ్రహ్మసమాజారాధనలోని ఆచరణలు. ఆరాధకుల మనస్సులకు ఏకాగ్రత కలిగించే నిమిత్తము, చర్చిపూజా విధానాలలో ఏర్పరుపబడిన ఉపబంధనాలను వీరు త్యజించిరి. ఆడంబర రహితము, విశుద్ధము ఐన వాతావరణంతో కూడిన వీరి ప్రార్థనమందిరములో, నేమిష్టమైన మతవిశ్వాసానికి ఆస్కారములేదు.

రామమోహనరాయ్ మరణానంతరము, సంఘ కార్యక్రమంలో, చైత న్యము క్షీణించి, సమాజం వెనకబడింది. అంతట, 1843 లో దేవేంద్రనాథటాగోర్ సమాజంలో ప్రవేశించెను. రామమోహనరాయ్‌తో సహకరించి, సమాజాభివృద్ధికి తోడ్పడిన పూజ్య ద్వారకనాథటాగోరుకు ఇతడు కుమారుడు. సమాజ పునర్వ్య వస్థీకరణాని కితడు పూనుకొన్నాడు. బ్రాహ్మమత ప్రచారకుల శిక్షణకై తత్త్వ బోధినీ పాఠశాలనూ, తాత్త్విక మత చర్చలకై తత్త్వబోధినీ సభనూ, స్థాపించెను. బ్రహ్మమతాన్ని ప్రచారం గావించే ఉద్దేశంతో, ఏ. కె. దత్తు సంపాదకుడుగా 'తత్త్వబోధినీ పత్రిక' ప్రారంభింపబడింది. సభ్యులను సమాజంలో చేర్చుకోడానికై నియమాలను రచించి, మతబోధకు, ఆరాధనకు నిర్వాహకుల నియోగమునకు ఉపకరించే నియమనాలను క్రోడీకరించెను. ఏకేశ్వరుని ప్రేమించి, పూజించడము, దేవుని కిష్టములైన కార్యములలో ప్రవర్తించడము, సభ్యుల కర్తవ్య విధులు, వారు గావించవలసిన శపథములు, ఇత్యాదులతో కూడిన, బ్రాహ్మ సంవిదను **(covenant)** సిద్ధపరచెను. ఈశ్వర ప్రార్థన, ఆరాధనలతో కూడిన సార్వజనిక పూజా విధానమును ప్రవేశపెట్టెను. హిందూ మత గ్రంథముల ఆధారముతో బ్రాహ్మధర్మమనే మత శిక్షణ గ్రంథాన్ని, ప్రార్థన పుస్తకాన్ని, ఇతడు సిద్ధ పరచెను. ఈ విధంగా పునరుజ్జీవనం పొందిన సమాజము, వేగంగా అభివృద్ధి చెందింది. బ్రాహ్మమత బోధకులు, దేశములోని వివిధ ప్రాంతాలలో పర్యటనం గావించి, పంజాబునుండి, తూర్పు బెంగాలువరకూ గల ప్రదేశాలలో బ్రహ్మసమాజ శాఖలను నెలకొల్పిరి.

రామమోహనరాయ్ ప్రారంభించిన బ్రహ్మమతోద్యమము ఈ విధంగా 1843 నుండి 1857 వరకూ, బాగా అభివృద్ధికి వచ్చింది. పిమ్మట 1857 లో కేశవచంద్రసేన్ ఈ ఉద్యమంలో ప్రవేశించి, తన సహజౌత్సుక్యాన్ని, శ్రద్ధను సమాజ కార్యనిర్వహణకు వినియోగించెను. ఇప్పటికే సమాజ ప్రక్రియలలో అనేకములైన పరివర్తనలు సిద్ధించినవి. రామ్‌మోహన్‌రాయ్ పాటించిన ప్రజ్ఞా ప్రాధాన్యము, వ్యక్తి స్వాతంత్ర్యము, పరిత్యక్తములు కాలేదు. కాని, అతడు విడిచిపెట్టిన ఇతర మానసిక విభాగాలకు, మానవానుభూతులకు, సమాజ కార్యక్రమాలలో ప్రాధాన్యమేర్పడి, బ్రహ్మమతం సాధారణ మానవ జీవితానికి సన్నిహితమయింది. ప్రార్థన సంబంధమైన భావాలు, అంతరంగధ్యానము, జీవితాన్ని ఈశ్వరార్పితం గావించడము, ఈశ్వరునిపట్ల శ్రద్ధాభక్తులు దైవ సంకల్పము ననుసరించిన మానవ సేవ, ఈశ్వర జ్ఞానాన్వేషణ, ఈశ్వర ప్రేరణ ప్రసాదములకు ప్రయత్నము, - ఇత్యాదులన్నియూ బ్రాహ్మమత విధాన భాగములుగా ఏర్పడినవి. ఈ పరివర్తనతో ఇదివరలో లేని రసభావాత్మక ఆరాధన విధానము సమాజములో సిద్ధించింది.

ఐనా, విచారణాత్మక చైతన్యము, సంస్కరణేచ్ఛా, పరివర్తనాసక్తి, ఇదివరకే ప్రబోధములై యున్నవి. కనుక, దేవేంద్రనాథు గావించిన సిద్ధాంతాలు, ప్రతిజ్ఞాపత్రము, ఆరాధకులకు సంతుష్టిని కలిగింపలేదు. ఆరంభంలో హేతువాదాన్ని గమనించక, వేద ప్రామాణ్యాన్ని అంగీకరించి, సమాజ పునర్నిర్మాణానికి బూనుకొన్నాడు దేవేంద్రనాథ్. కాని, అది యుక్తి యుక్తం కాదని గ్రహించి, అతడు రామ్‌మోహన్‌రాయ్ ప్రతిపాదించిన తార్కిక సిద్ధాంతాన్ని అవలంబించెను.

మతవిషయిక జ్ఞానానికి, ప్రకృతి, అంతర్బోధ అనేవి మాత్రమే మూలములని నిశ్చితమయింది. వేదముల అపౌరుషేయత్వాన్ని, కర్మసిద్ధాంతాన్ని, పునర్జన్మనూ కూడా దేవేంద్రనాథ్, - అంగీకరించలేదు. "ఆత్మసాక్షాత్కారమువల్ల సిద్ధించిన, ఆధ్యాత్మిక జ్ఞానంతో ప్రకాశితమైన, మానవ హృదయమే" బ్రాహ్మమతానికి ఆధారమని సిద్ధాంతం గావించినాడు. అత్యుదాత్తమైన జాతీయప్రతిష్ఠాభావం గల దేవేంద్రనాథ్ బ్రిటీషు ప్రభుత్వమునుంచి ఎట్టి ఆదరమునూ గ్రహించడానికి ఇష్టపడలేదు. తన దేశంలో పాలకులుగా నెలకొన్న పరదేశీయులతో సంపర్కం కూడా ఇతడు పరిహరించెను. ఇతని జాతీయభావ మింత సున్నితమైనది. "భారతదేశ పరిపాలన విషయములో బ్రిటిషువారికీ, దేవేంద్రబాబుకూ, ఏకాభిప్రాయం లేని కారణంగా, అతడు పాశ్చాత్యుల సంసర్గానికి విముఖుడై యున్నాడు. బ్రిటీషు ప్రభువుల అభిప్రాయాలను సమర్థించి, ఇండియాలోను, ఇంగ్లాండులో కూడా ప్రతిష్ఠను సంపాదించుకోవడం సులభమే. కాని, అట్టి ప్రతిష్ఠను బ్రిటీషు వారినుంచి గ్రహించడం దేవేంద్రబాబుకు అయిష్టము. కృష్ణనగర్ కళాశాలాధ్యక్షుడైన లాబ్ **(Mr. Lobb)**, "పాశ్చాత్యుల ప్రశంసలను గ్రహించడం కూడా గౌరవభంగమని, ఆత్మాభిమానియైన ఈ వృద్ధుడు భావించియున్నాడు" అని

వ్రాసియున్నాడు.

ఉత్సాహపూరితమైన కేశవచంద్రసేనుని మనస్సు, నూతనాభిప్రాయాన్వేషణకు, నూతన ప్రయోగములకు బూనుకొన్నది. తత్ఫలితంగా, ఇతని మనస్సు హిందూమత పరిమితులలో ఇమిడియుండలేకపోయెను. 1860 లో, ఇతడు 'సంగత్ సభ' ను స్థాపించి, 'దుర్గాపూజ' వంటి కర్మలు, కులసంస్థ మున్నగునవి సప్రమాణములా ? అను పరిశీలనకు బూనుకొన్నాడు. ఇవి పరిత్యజింపదగినవని పరిశీలనవల్ల తేలింది. పాశ్చాత్యవిద్యా వ్యాప్తికై, కలకత్తా కళాశాల 1861 లో స్థాపింపబడెను. సంస్థ కార్యక్రమాల ప్రచారమునకై 'ఇండియన్ మిరర్' (భారత దర్పణము) అనే పత్రికను ప్రారంభించెను.

1864 లో, కేశవచంద్రసేన్, భారతదేశ పర్యటనమారంభించెను. ఆధునిక భారతదేశంలో, భ్రాతృైక్యమును కలిగించే ఉద్దేశముతో జరిగిన ప్రథమ ప్రయత్నమిది. అతని ప్రచార ఫలితంగా, మదరాసులో 'వేదసమాజము', మహారాష్ట్ర ప్రాంతములో ప్రార్థన సమాజము, స్థాపితములయ్యెను. కేశవచంద్రసేనుని అభ్యుదయ విధానం అతితీవ్రంగా జరుగుతూ, సమాజములో ప్రబలమైన పరివర్తనం కలిగించినందువల్ల, దేవేంద్రనాథ టాగోరుతో, ఇతనికి ఘర్షణసిద్ధించింది. హిందూ ఆచారములను, హిందూ మతభావాలను గూర్చి, ఇరువురికి అభిప్రాయభేదమేర్పడినందువల్ల, కేశవచంద్రసేన్, సమాజమును వదలిపెట్టి (1865), నూతన సంస్థను స్థాపించెను. ఇండియాలోని బ్రాహ్మమతస్థులందరిని,—స్త్రీలను పురుషులను కూడా— ఒక్క సంస్థగా ఏర్పరచడము, అన్ని మతాలనుండీ ఉపదేశాలను గ్రహించి, సార్వజనీయమైన బ్రాహ్మమతసూత్రాలను స్థాపించడము ఇతని ఆశయాలు. ఈ ఉద్దేశానికి అనుగుణంగా ఈ సంస్థ "భారతవర్షీయ బ్రహ్మ సమాజము" అనేపేరుతో వ్యవహరింపబడింది. దేవేంద్రనాథ్ నడుపుతున్న సమాజానికి 'ఆది బ్రహ్మసమాజము' అనే పేరు ఏర్పడింది.

సమాజములో ఇట్లు ఛిద్రమేర్పడిన కొంతకాలానికే మరియొకసారి విభేదమేర్పడింది. ప్రారంభమునుండీ ఈ రెండవ సంస్థ కేశవసేనుని ప్రాబల్య ప్రభావములకు లోబడిపోయినది. ఇతని ప్రతిభా ఉత్సాహములు బెంగాలు యువకవర్గాన్ని ఎక్కువగా ఆకర్షించినవి. కేశవసేనుని భావచైతన్యము, స్వస్థతలేనిది. 1870 లో, ఇతడు ఇంగ్లాండును సందర్శించినాడు. సంఘసంస్కరణ విషయంలోను, సమాజసేవా విషయములోను, ద్విగుణీకృతమైన ఉత్సాహముతో ఇండియాకు మరలి వచ్చెను. బ్రహ్మమతానుసారంగా జరిగిన వివాహములు శాసనబద్ధములు గావిస్తూ, బ్రిటీషు ప్రభుత్వము, బ్రాహ్మవివాహ శాసనాన్ని, అధినియమ గ్రంథములో **(statute book)**, చేర్చునట్లుగావించెను (1872). హిందూ మతమునుంచీ, వేరుపడిన విధిగా ఇది సిద్ధించింది.

ఈ లోపుగా, ఇతనికి ఇంకను వినూత్నములైన భావాలు కలిగినవి, ఒక వైపు క్రైస్తవయను మతమితనిని ఎక్కువగా ఆకర్షించినది. రెండవ వైపు, వైష్ణవుల భక్తి విధానాలలో ఎక్కువ అభిమానమేర్పడింది. ఈశ్వరుడు మానవరూపంలో

జన్మించడము- అనగా, అవతార పురుషుడుగా జన్మించడము, ఈ రెండు సూత్రాల్లోనూ కలదు. కనుక, ప్రకృతి, అంతఃకరణబోధ, అనేవి మాత్రమే మతమునకు మూలములుకాక, దివ్యదర్శనము కూడా మూలమనే అభిప్రాయ మేర్పడింది. అంతటినుంచీ ఈశ్వర ధ్యానమునకు, కీర్తనమునకు ఎక్కువకాలం వినియోగిస్తూ వచ్చెను. తానుకూడా ఈశ్వరప్రేరణచే, భగవత్సంకల్పమును నిర్వహించడానికై జన్మించిన దూతయనే భావం ఇతని మనస్సు నావేశించింది. సమాజాన్ని ఇంతవరకు అధికారయుక్త కులపతిగా పరిపాలించిన కేశవసేన్, ఇప్పుడు, తన కార్యములన్నీ దైవప్రేరితములని చెప్పడానికారంభించెను. ఇతని అనుయాయులలో అనేకులు దీనికి వ్యతిరేకులైరి. అదికాక, 1878 లో ఇతడు, తన కుమార్తెను కూచ్ బీహార్ మహారాజాకిచ్చి, హిందూధర్మశాస్త్రముల ప్రకారంగా వివాహము గావించెను. వధూవరులిరువురూ వివాహానికి అర్హవయస్కులు కాక పోవడము, బ్రహ్మసమాజ నియమాలకు భంగకరంగా హిందూమతప్రకారం వివాహం జరగడము,- ఇవి ఇతని ప్రతిపక్షవర్గానికి ఆగ్రహము కలిగించినవి. వారందరూ ఒక కట్టుగా సమాజమును విడిచిపెట్టిరి.

విడిపోయిన సభ్యులు 'సాధారణ బ్రహ్మసమాజ' మనే పేరుతో నూతన సంస్థ నేర్పరచుకొనిరి. విగ్రహారాధనను పరిత్యజించడము, కులతత్త్వమును, పాటింపక పోవడము, స్త్రీలకు స్వాతంత్ర్యము గల్పించడము, గృహపూజాదులలో బ్రహ్మసమాజ విధులను పాటించడము, సమాజము రచించిన నూతన మత సూత్రములను పాటించడము,-అనే నియమాలను పాటించే వారు మాత్రమే ఈ సంస్థలో చేరడానికి అర్హులు.

సాధారణ బ్రహ్మసమాజ స్థాపకులైన యువకులు రాజకీయోద్యమములలో కూడా ముఖ్యపాత్రను వహింపనారంభించిరి. శివనాథశాస్త్రి నాయకత్వంలో వీరు, స్వాతంత్ర్యములో విశ్వాసము కలిగి యుండడము, పరప్రభుత్వ సేవలో చేరక పోవడము, దేశ పరిస్థితుల ననుసరించి, శాంతియుతంగా ఉద్యమ నిర్వహణ గావించడము-అనే తమ ప్రతిజ్ఞలను ప్రకటన గావించిరి; ప్రజాస్వామ్య ప్రభుత్వము పై ఏర్పడే గణరాజ్య' విధానము ననుసరించి, సార్వజనీనమైన స్వాతంత్ర్య సంపాదన దీక్షకు బూనుకొనిరి. తరువాతి కాలములో, "బెంగాలు అనధికార ప్రభువు"గా ప్రసిద్ధి చెందిన, సురేంద్రనాథ బెనర్జీ వీరిలో ప్రముఖుడు.

సమాజంలో జరిగిన ఈ చీలికలు కేశవ చంద్రసేనునికి బాధ కలిగించినవి. కాని, సమాజానికి నూతన చైతన్యాన్ని కలిగించవలెననే నిశ్చయంతో, నూతన సంస్కరణోత్సాహంతో, మరల కార్యాచరణకు బూనుకొన్నాడు. 'నవ విధాన' మనే పేరుతో, నూతన సంస్థను ప్రారంభించెను. (1) మత సంబంధమైన ఆధ్యాత్మిక భాగమునకు ప్రాధాన్యము, (2) హిందూ క్రీస్తు మతములలోని ఆదర్శాను ఆచరణలను మేళవించడము-ఈ నూతన సంస్థ యొక్క లక్ష్యములు. పండ్రెండుగురు, శిష్యులను 'దైవ నియుక్త ప్రవర్తకాచార్యులు' గా **(apostles)** నియమించి, స్త్రీ పురుషుల దీక్షా వర్గాన్ని ఏర్పరచి, వీరందరినీ తీక్ష్ణముతైన

ప్రతిజ్ఞలకు లోబరచెను.

"మానవుని ఆత్మ భగవంతునిలో లీనమైపోవునంతటి సంసర్గము క్రీస్తుకు భగవంతునితో సిద్ధించి యుండడంవల్ల, అతడు ఆదర్శపురుషుడు, ఆస్తికులలో ఆదర్శప్రాయుడు" అని ఇతడు ప్రకటించి, క్రీస్తును ప్రవక్తగా పరిగణించెను.

రెండవవైపు, ఇతడు రామకృష్ణపరమహంస ప్రభావానికి గురియై, భగవంతుని 'మాతృదేవత'గా పూజించే విధానాన్ని గ్రహించినాడు. మానవుని మాత్రమే కాక, విశ్వసృష్టినంతటినీ పోషించే దయామయి, భగవంతుడనే భావము ఇతని నాకర్షించింది.

ప్రపంచమందలి అన్ని మత ధర్మశాస్త్రములకు, ప్రవక్తలకు, మత విధానములకు, సమన్వయమైనదిగా తన, 'నవవిధానము' సిద్ధించవలెనని, కేశవచంద్రుని ఆశయము. వివిధ మతాలలోని, బాహ్యాంశాలు, భావాలు, ఆంతరంగిక ప్రజ్ఞాలక్షణములని, ఈ నవ విధానం వివరించింది. దీనివల్ల మానవుడు తన హృదయములో వాస్తవంగా నిలిచియున్న దివ్యత్వాన్ని, వ్యక్తిగా మాత్రమే కాక, ఈశ్వర లక్షణంగా గుర్తించగలడని, ఇతని అభిప్రాయము. ఇట్లు, ఇతడు నెలకొల్పిన నూతన సంస్థకు తగిన సిద్ధాంతాలను, ఆరాధన పద్ధతిని, ఏర్పరచడంలో ఇతని జీవితం గడచింది. పాశ్చాత్య క్రైస్తవ సిద్ధాంతాలకు, హిందూమత సిద్ధాంతాలకు మేళనం కూర్చడానికై ఇతడు బుద్ధిపూర్వకంగా నిర్వహించిన ఉద్యమము మిక్కిలి ప్రధానమైనది.

అతని మరణానంతరం (1884), ఇంతటి మహోన్నతుడైన నాయకుడు, ఈ సంస్థలలో ఉద్భవింపలేదు. సకల మతముల సార సంగ్రహారూపమైన, ఇతని మతము దేశంలోని విద్యావంతుల నెక్కువగా ఆకర్షించలేదు. బ్రహ్మసమాజ వ్యాప్తి అంతటితో ఆగిపోయింది. 1911 లో, దేశమందు 183 బ్రహ్మసమాజము లేర్పడినవి. వాటిలోని సభ్యుల సంఖ్య 5504.

స్వల్ప సంఖ్యాకులే ఐనా, బ్రాహ్మమతస్థులు దేశమంతటా వ్యాప్తి చెంది యుండిరి. మధ్యతరగతి వర్గంలోని ప్రజ్ఞావంతుల సంఘము మొదటిసారిగా ప్రారంభించిన ఈ మతోద్యమము భారతదేశములోని వివిధ వర్గాలవారికి, ఐక్యము కలిగించి, ఒక సంస్థగా నెలకొల్పడానికి ప్రయత్నించింది. సంఖ్యనుబట్టి చూస్తే ఈ మత సంస్థ సాధించిన విజయం స్వల్పంగా తోచవచ్చు. కాని, సంస్కరణోద్యమాలపై దీని ప్రభావం విస్తారమైనది. దేశభక్తి భావాన్ని ఉద్బోధించడంలో, ఈ సంస్థ ప్రధానపాత్ర వహించింది.

జాతీయ భావము పరిణతి పొందడంలో బ్రహ్మసమాజము గావించినసేవ యెట్టిదో వివరిస్తూ, బిపిన్‌చంద్రపాల్, "కేశవచంద్రసేనుని ఆధిపత్యములో, బ్రహ్మసమాజము వ్యక్తి స్వాతంత్ర్యాన్నిగురించీ, సాంఘిక సమానతనుగూర్చీ, నూతన సత్యాన్ని ప్రకటించింది. అప్పుడప్పుడే ఉదయించుచున్న జాతీయ చైతన్యానికి ఈ నూతనసత్యము తీవ్రమైన ప్రోద్బలమిచ్చింది. బెంగాలులోని నూతన జాతీయ జీవనము, యువకుల ఉత్కాంతులు, బ్రహ్మసమాజ సిద్ధాంతాలవల్ల చైతన్య

వంతములైనవి. ఇంతవరకూ వీరిని, జడప్రాయంగా ఉంచిన, పాశ్చాత్యపాలకుల ఆధిక్యభావము క్షీణింపజొచ్చింది. విద్యావంతుల హృదయాలలో, నూతనమైన ఆత్మ విశ్వాసం ఏర్పడింది." అని ప్రశంసించినాడు.

సంఘ సంస్కరణకు బూనుకొనిన ముఖ్యనాయకులలో, రాజనారాయణ బోస్, ఒకడు (1826-99.) విశాలభావాలుగల ఈ మహావిద్వాంసుడు, పారసీక భాషా సారస్వతములను కూడా పఠించినాడు. బ్రహ్మసమాజీయులకు ఎక్కువ ఆసక్తి గలిగించిన 'మతశాస్త్రము' **(The Science of Religion)** అనే గ్రంథానికి ఇతడు రచయిత. "ఇది వారి ధర్మశాస్త్రము." అని, బ్రాహ్మోప్రజాభిప్రాయము' అనే పత్రిక ఈ గ్రంథాన్ని వర్ణించింది, కేశవచంద్ర సేనునూ, ఈశ్వరావతారంగా అతనినిని రూపింపబూనుకొన్న అతని శిష్యులనూ, ఇతడు తీవ్రంగా ఖండించినాడు. బ్రాహ్మసిద్ధాంతాలకూ హిందూసిద్ధాంతాలకూ గల ఐక్యమును ఇతడు ఉద్ఘాటించెను. బ్రాహ్మమతములో హిందూ మతముకు అత్యున్నత స్థాయి సిద్ధించింది, అనిఅతడు తెలిపియున్నాడు.

జాతీయ భావాన్ని పెంపొందించే నిమిత్తం రాజనారాయణ బోస్ ఒక సంస్థను స్థాపించెను భారతీయ వ్యాయామ పద్ధతులపై యువకుల దేహదార్ఢ్యాన్ని పెంపొందించడము, భారతీయ సంగీతాన్ని వృద్ధి పరచడము, వైద్యము, సంస్కృతము, ప్రాచీనవిద్య ఇత్యాదులను పాఠశాలలో బోధించడడము, విదేశీయములైన పద్ధతులను, ప్రవర్తనలను, భాషా ప్రయోగాన్ని తొలగించి, భారతీయములైన వాటిని అలవరచడము-ఈ సంస్థ యొక్క ఆశయాలు. దేశీయతకు ప్రజాదరం కలిగించే ఉద్దేశంతో ఇతడు, 'హిందూమేళా' ను (1867) జాతీయ సంఘాన్ని నెలకొల్పెను.

ఈశ్వరచంద్ర విద్యాసాగర్ 1820-1891) ప్రధానంగా, విద్యావేత్త, సంఘ సంస్కరణమతని రెండవ అభిమాన విషయం. సంస్కృతలో ఇతడఖండుడైన పండితుడు. కలకత్తా సంస్కృత కళాశాలలో మొదట అధ్యాపకుడుగా ప్రవేశించి, ఒక సంవత్సరం తర్వాత దానికి అధ్యక్షుడైనాడు (1850). పాఠశాలల విశిష్ట పర్యవేక్షకుడుగా ఇతడు ఉద్యోగం నిర్వహించినాడు. 1858 లో ప్రభుత్వోద్యోగమును త్యజించెను. ఐనా, విద్యావిషయములలో ప్రభుత్వానికి సలహాదారుడుగా ఉంటూ వచ్చెను.

సంస్కృత కళాశాలలో ఆంగ్ల భాషాధ్యయనాన్ని ప్రవేశపెట్టి, తద్వారా ఆధునిక దృక్పథాన్ని విద్యార్థులకు కలిగించి, రామమోహనరాయ్ ప్రారంభించిన లౌకిక విద్యా విధానాన్ని ఇతడు బలపరచినాడు. విద్యా సమితికి **(council of Education)** సలహాయిస్తూ, 'కొన్ని కారణాల వల్ల......వేదాంతాన్ని సాంఖ్య సిద్ధాంతాన్ని సంస్కృత కళాశాలలో బోధించడం మనకు తప్పనిసరి. వేదాంతము, సాంఖ్య సిద్ధాంతము-రెండూ తత్త్వశాస్త్రదృష్ట్యా సమంజసములు కావు, అనడం నిర్వివాదమైన విషయము. అసత్యములే ఐనా, వీటిపై హిందువులకు అనంతమైన గౌరవ ప్రపత్తు లేర్పడి యున్నవి. వీటిని సంస్కృత ప్రణాళికలో

భాగంగా బోధిస్తూ, వాటి ప్రభావాన్ని నిరోధించడానికి ఆంగ్లములో నిజమైన తత్త్వశాస్త్రాన్ని బోధించవలసి యున్నది' అని వ్రాసి యున్నాడు.

బెంగాలు సమాజాన్ని ఆధునిక వ్యవస్థకనుగుణంగా చేయడానికై, ఇతడు పెక్కు సంస్కారములను సూచించియున్నాడు. ఇతడు నిర్మూలింపదలచుకొన్న దుష్టప్రవృత్తులలో ముఖ్యములైనవి,- బహుపత్నీత్వము, బాల్యవివాహము, విధవా వివాహప్రతిషేధము,- అనునవి. పలుకుబడిగల ఇతర వ్యక్తులసహాయంతో ఇతడు గావించిన మహాప్రయత్నంవల్ల, విధవా వివాహములకు శాసనరీత్యా రక్షణ లభించింది. ఈ వివాహములను న్యాయబద్ధంగావిస్తూ, శాసనసభ 1856 లో, ప్రభుత్వశాసనాన్ని ప్రకటించింది, సంస్కరణలను సమర్థించడములో ఇతడు ధర్మ శాస్త్రాల అధికారాన్ని త్యజించలేదు. ఆధునిక సమాజవ్యవస్థకు అనుకూలమైన నిబంధనలను గ్రహించి, సంస్కరణోద్యమాన్ని నిర్వహించినాడు విధవా వివాహ విషయములో ఇతడు గ్రహించినది "పరాశర సంహిత".

దురదృష్టంవల్ల, ఇతడాసక్తి వహించియుండిన ఇతర సంస్కారములు,- అనగా బహుపత్నీత్వము, బాల్యవివాహము,- సాధ్యములుకాలేదు. 'బహు వివాహ', బాల్యవివాహేర్ దోష్' అనే వారపత్రికలద్వారా ఇతడీ సంస్కారా లకు ప్రోద్బలమిచ్చినా, ఇతని ప్రయత్నం సఫలంకాలేదు.

స్త్రీ జనస్వాతంత్ర్యానికై, ఇతడొనర్చిన ప్రయత్నానికి డ్రింక్ వాటర్ బెత్యూన్ **(drink water bethune)** సహకారం లభించింది. బెత్యూన్ స్త్రీ కళాశాల, ఇతర పాఠశాలలు స్థాపింపబడినవి.

## III. ప్రార్థన సమాజం

ఆధునిక భారతయుగములో ప్రారంభమైన మొదటి మతసంస్థ బ్రహ్మ సమాజము. నూతన మతసిద్ధాంతాలను దేశములో ప్రచారము చేయడానికై పర్య టించిన మొదటి హిందూ మిషనరీ కేశవచంద్రసేన్. 1864 లో అతడు బొంబాయి వచ్చే నాటికే అతని సందేశాన్ని గ్రహించడానికి అనుకూలములైన పరిస్థితులేర్పడి యుండినవి. బెంగాలులో వలెనే బొంబాయి రాజధానిలో కూడా విద్యావంతు లైన మధ్యతరగతులవారు సిద్ధమైయుండిరి. పాశ్చాత్య విద్యనభ్యసిస్తూ పాశ్చాత్య భావాలను గ్రహించుచుండిరి. మత విషయకంగానూ, సాంఘిక విషయంగానూ, సంస్కరణలవసరములని వీరుకూడా భావించియుండిరి. క్రిశ్చియన్ మిషనరీలు జరు పుతూ ఉండిన మతాంతరీకరణ ప్రయత్నాలు వారికి కష్టము కలిగించినవి. ఈ క్రైస్తవ మతవ్యాప్తిని అరికట్టడానికి 'పరమహంససభ' వంటి సంస్థలు ఏర్పడినవి.

కేశవ చంద్రసేను బొంబాయికి వచ్చినందుకు ఫలితంగా ప్రార్థన సమాజము స్థాపితమయింది. ఆస్తికతా ప్రసారము, సాంఘిక సంస్కరణము, ఈ సమాజము యొక్క మూలసూత్ర ప్రయోజనములు. రెనడే, భండార్కరువంటి మహనీయులు చేరడంతో సమాజానికి బలప్రతిష్ఠలు ఏర్పడి, కార్యక్రమాలు విస్తరించినవి. సమాజ సిద్ధాంతాల ప్రచారమునకై 'సుబోధ పత్రిక' అనే వార్తాపత్రికను ప్రారంభించి,

శ్రామికుల విద్యావ్యాప్తికై సమాజము రాత్రి పాఠశాల నేర్పరచినది. ప్రచార కార్యక్రమము 1862లో ప్రారంభమయింది. మేధాశక్తి సామర్థ్యములుగల పండిత రమాబాయి, ఆర్యమహిళా సమాజ స్థాపనకు ఎక్కువ సహాయం చేసింది. జ్ఞానులూ, విద్వాంసులూ అనేకులు సమాజములో చేరి, సాంఘికసంస్కరణోద్యమానికి, సమాజాభి వృద్ధికీ ప్రోద్బలం కలిగించినారు.

సమాజాభి వృద్ధికి ప్రధాన నిర్మాత, మహాదేవ గోవింద రెనడే. (1842-1901). ఇతడు 19 వ శతాబ్దపు భారతదేశములో, ఉదాత్త పాండిత్యముగల మేధావి, ప్రజ్ఞాశాలి. మేధావియైన విద్యార్థి, ఉత్తేజకుడైన అధ్యాపకుడు శీలనిష్ఠ గల ప్రజ్ఞావంతుడైన న్యాయాధికారి,— అని ప్రసిద్ధిగాంచిన రెనడే, భారతదేశంలోని న్యాయపరిపాలన శాఖలో అత్యుచ్చపదవిని అధిష్ఠించినాడు. ప్రజాహితకరమ్ములైన అనేక సమస్యలలో అతడాసక్తి వహించినాడు. భారతజాతీయ జీవితమునకు సంబంధించిన ముఖ్యవిషయాలన్నిటి లోనూ, ఇతడు ప్రవేశించి, తన బుద్ధి శక్తిని వాటి ప్రయోజనమునకై ఉపయోగించినాడు. అన్నిటికంటెను ముఖ్యంగా మత సాంఘిక సంస్కరణలకు తన శక్తిని కాలాన్ని అంకిత మొనర్చియున్నాడు. భారత సమాజపు దురవస్థకు కారణమ్ములై యున్న దురాచారాలను, మూఢవిశ్వాసాలను రూపుమాపడానికి, నిరంతరోత్సాహంతో, నలభై సంవత్సరాల దీర్ఘ కాలము తన జీవితాన్ని ధారవోసినాడు.

మత సాంఘిక సమస్యల నతడు హేతువాదదృష్టితో పరిశీలించినాడు. అంధప్రాయంగా పాశ్చాత్యపద్ధతులను అనుసరించినవాడూ కాడు ; విమర్శింపక పాశ్చాత్యభావాన్ని మెచ్చుకొన్న వాడూ కాడు. హిందూమతస్థుడై యుండడం అతనికి గర్వ కారణమయింది. "భాగవత ధర్మ" మతని అభిమత విషయము. తార్కికవిచారణతో సమర్థింపలేని, సంకుచితాభిప్రాయములను, మూఢ విశ్వాసములను పరిత్యజించినవాడు. ఇతర మతాలవారికి దూరులై, హిందువులు, ప్రత్యేక జీవితం సాగించడము తగినదికాదని ఖండించినాడు. మానవజాతి నంతటిని, విశాల హృదయముతో ఆహ్వానించి, తమతో ఐక్యం చేసుకోవలెనని హిందువుల నుద్బోధించెను. విరక్త జీవితాన్ని, ప్రపంచ నిరసన ప్రవృత్తిని మాని, సమాజ ప్రయోజనమునకై తాము నిర్వహించవలసిన కర్తవ్యములకు పూనుకొనవలెననీ, సంపదలవల్ల ఏర్పడే సంతుష్టభావాన్ని విసర్జించి, దేశాభ్యుదయానికి, అభివృద్ధికి పూనుకోవలసిందనీ, హిందువులను ప్రబోధించెను.

రెనడే, మనఃపూర్వకంగా అవలంబించింది హిందూమతము. ఐతే అది సాధారణమైన హిందూమతంకాదు. మాలిన్యమునంతటినీ క్షాళన మొనర్చడం వల్ల పరిశుద్ధమై, ఆధునిక ఆస్తిక మతతత్త్వశాస్త్రానుసారంగా పునఃపరిశీలనకు గురియై, సత్యమైనదిగా నిశ్చితమైన హిందూమతము అతడవలంబించినది. రహస్యార్థ గర్భితము, విశ్వదేవైక్యవాద నిష్ఠము ఐన సర్వదేవతారాధనమును, ప్రతిపాదించిన ఆది శంకరుల వేదాంత తత్త్వశాస్త్రాన్ని ఇతడు ఒప్పుకోలేదు.

రామానుజులు, వైష్ణవులు, మధ్యయుగాల మరాఠీ సాధువులు గావించిన, దేవాస్తిక్య వాదమును ఇత డంగీకరించినాడు. "అనాడు వ్యాప్తిలోనున్న ఇతర మతములకు సాధ్యముకాని, ఉదాత్త సత్య ఆస్తిక్య భావాన్ని వీరు అందుకో గలిగినారు". అని ఇతడు పలికియున్నాడు. భక్తి ఉద్యమము విగ్రహారాధనకాదని' అది నిజంగా ఆస్తికోద్యమమని ఇతని అభిప్రాయము.

మత విషయకమైన సత్యము తార్కిక చర్చచే నిరూపించడానికి సాధ్యము కానిది. అంతరోద్బోధవల్ల స్వయంప్రకాశితమై నిశ్చితమౌతుంది మతసత్యము. ప్రకృతి నియమాలు సార్వత్రికములూ, సార్వకాలికములూఐ అన్ని ప్రదేశములందునూ ఓకే విధంగా ప్రవర్తిస్తాయి,—అనే విశ్వాసము ఆధారంగా ప్రకృతి సత్యములను మనం గ్రహిస్తాము. ఇవి తార్కికచర్చచే నిరూపింపబడేవి కావు. మతవిషయములో ఈ ప్రక్రియ భిన్నము. ఆస్తికతానిరూపణలో రెనడే అవలంబించిన వాదప్రక్రియను బట్టి, పాశ్చాత్య తత్త్వశాస్త్రజ్ఞుల రచనలను అతడు అధ్యయనం చేసినట్లు ఊహించవచ్చును, కాని, విశ్వశాస్త్రము, మూల సంకల్పవాదము, వస్తుమూల తత్త్వశాస్త్రము, **(Cosmology, Telcology, Ontology.)** ,— వీటి విషయములో పాశ్చాత్యు లవలంబించిన అతి సూక్ష్మతర్కము, వాదనలు, వారు ప్రదర్శించిన ప్రమాణములు, ఖండనలు, ఇత్యాదుల నితడు, సమగ్రంగా గ్రహించియుండెనా, అనే సంశయాని కవకాశ మున్నది. ఆస్తికత విషయములో తన అభిప్రాయములను 39 తత్త్వభాగములుగా 'ఒక ఆస్తికుని దర్శన నివేదనము' **(A Theists Confession of faith)** అనే పేరుతో నిష్ఠాపత్రాన్ని రచించెను. వాటిని కొన్ని ప్రధాన సూత్రములుగా వివరింపవచ్చును.

1. "పరమారాధ్యుడు భగవంతుడు మాత్రమే. ప్రభువు, సృష్టికర్త, నిర్ణాత, నైతిక రక్షకుడు అతడే. ఈశ్వరు డొక్కడే. అతనికి ప్రతినిధి, ప్రతినిధులు, లేరు. త్రిమూర్తత్వము, ద్వంద్వవ్యక్తిత్వము అతనికి లేదు. వస్తు చైతన్యమయమైన ప్రపంచములో ధ్యానలీనుడై యున్న బ్రహ్మకాడతడు. అతడు తప్ప వేరే దేవుళ్లు లేరు. విగ్రహారాధనము దోషము. అతని కవతారాలు లేవు. ప్రకృతి, మానవుడు, చరిత్ర వీనిలో అతడు వ్యక్తమై యున్నాడు."

2. అతడు గావించిన విశ్వసృష్టి వాస్తవమైనది. కేవలం అపాతరూపము కాదది. వస్తుప్రపంచము యొక్క అస్తిత్వము, చలనము, చైతన్యము అతనివల్లనే సిద్ధించినవి. విశ్వసృష్టియొక్క ఉత్పత్తి, మానవోత్పత్తి, మానవునకు ఈశ్వరునితో గల సంబంధము,—అను సమస్యలు గూఢతత్త్వములు, విడదీయడానికి సాధ్యము కానివి".

3. "మానవుని జీవితము చిన్మయాత్మకమైనది. వస్త్వాత్మకమైనది కాదు ఆత్మ. అది నిత్యమైనది. ఆత్మ—ఈశ్వరుడు ఒక్కరు కారు. ఈశ్వరుని నుంచి ఏర్పడినది కూడా కాదు ఆత్మ. ఆత్మలనంతములు. తార్కిక శక్తి, సంకల్పశక్తి, సద సద్వివేచన శక్తి ప్రతి ఆత్మకూ కలదు. ఆత్మ స్వతంత్రమైనది. దాని ప్రవృత్తి బాధ్యత, దానిదే. ఈ జీవితములో ఆత్మపొందే శిక్షణ, దాని ప్రయత్నములు,

ఆగామి జీవిత స్థితికి సాధనలు కాని, భావి జీవితస్వభావం అగ్రాహ్యం. పరిమితా వధికి లోబడిన ఒక జీవితంలో చేసిన పాపానికి అనంతమైన దండన అనేదిలేదు. జన్మతః మానవుడు పతితుడు కాడు. స్వర్గ నరకప్రాప్తి జన్మకు పూర్వమే, నిశ్చిత మై యుండలేదు".

మానవుడు క్రమంగా సాధనవల్ల పెంపొందించుకొనే దైవ భావము, తత్ప్రాప్తి, అనేవి మానవునకూ ఈశ్వరునకూ గల సంబంధము లోనివి. ఈ సాధన ప్రక్రియలో, ధ్యానము, సంయోగము, (భావైక్యము) శ్రద్ధాభక్తియుతు లైన సజ్జనుల సాంగత్యము, పశ్చాత్తాపము, జీవిత శాసనము,—అనేవి అగత్య ములు. దేవాలయములలో సామాజిక పూజ, జీవితమందలి ఉత్తమ ఘట్టాలను శాస్త్ర నిబద్ధము గావించే కర్మాచరణములు, ఇందుకు సహకారులు. కాని, సన్యా సము, 'గురువుల' ఆరాధన, పాప పరిహర్తలను అద్భుత చర్యలను విశ్వసించడము —ఇవి బొత్తిగా అనవసరములు.

ఆత్మసాక్షికి విధేయులమై ప్రవర్తించడం అన్నిటికంటెను ఉత్కృష్టమైనది. సందర్భానుకూలంగా స్వప్రయోజనాన్ని అనుసరించి, ప్రవర్తించడం తగదు. ఈ ఆత్మసాక్షి ననుసరించడములో ఒక అవధి మాత్రమున్నది. నైతిక ప్రవృత్తికీ, ఇతర వ్యక్తులకూ గల సమాన హక్కులకు భంగం కలిగించరాదు. ఇది ఇందులో పాటించవలసిన నిర్బంధము. నైతికన్యాయాన్ని బట్టి, స్త్రీపురుషులందరూ సమానులే. హృదయపూర్వకమైన శ్రద్ధతో, భక్తియుతమైన విశ్వాసముతో భగవంతుని ప్రేమించిన విధంగా, తోడిమానవుని ప్రేమించడం, మానవుని ఉత్కృష్ట కర్తవ్యము దేహమునకు సంబంధించిన పాశములనుంచి, కామాది విషయబంధన ములనుంచి, మానవునకు విముక్తి కలిగించడము, నైతిక ప్రక్రియా విధానము యొక్క పరమలక్ష్యము".

ఈ మతసిద్ధాంతముల ననుసరించి ఏర్పడింది, రెనడే సంఘసంస్కరణ విధా నము. ప్రకృతిసిద్ధంగా మానవునిలో దివ్యత్వం నిహితమై యుండడము, మానవు లందరూ దేవుని దృష్టిలో సమానులై యుండడము, భగవత్సంకల్పము. మాన వుని యందు గల సామాజిక సహజ ప్రవృత్తి కూడా భగవత్సంకల్పమువల్ల సిద్ధించినదే. కనుక, ఈ ప్రవృత్తి వలన ఏర్పడిన సమాజం దివ్యమైనది, అని, సహజంగా నిశ్చితమగుచున్నది. కనుక, మానవుని అభ్యుదయము, సాంఘికాభ్యు దయము అను రెండునూ, నైతికాభివృద్ధికి సంబంధించినవే. కాబట్టి నైతికాభ్యు దయానికి నిరోధములై, మానవ సహజప్రకృతియైన దివ్యత్వానికి భంగం కలిగించే దురాచారాలను, దుష్టవిధానాలను, నిర్మూలించడం అగత్యము అని తేలుతుంది.

ప్రాచీన వైదికమతాన్ని తాను గ్రహించి అర్థం చేసుకొన్నదాన్ని, ఉపన్యాస మూలంగాను, రచనల మూలంగాను వివరించియున్నాడు రెనడే. వేద మతము అతనికి గర్వకారణమయింది. ఐనా, హిందూ సంఘంలో వ్యాప్తిచెంది యున్న మూఢవిశ్వాసాలూ, ఆచరణలూ, హేతువిరుద్ధములు అమానుషములు ఐన ఆచారాలూ, సంఘానికి హానికరములైనవి, అనే దృఢవిశ్వాస మతనికి

ఏర్పడింది. "ప్రాచీన వేదమత ప్రమాణములనుంచి, మీరు బాహ్యులై యుండ డానికి, పూర్వస్మృతికర్తలు ఏమాత్రమూ బాధ్యులు కారు. మీ దోషం వారిపై మోపడం తగనిపని. మానవ దౌర్బల్యానికి ప్రాధాన్యమిచ్చిన మానవులచే, రచింపబడినవవి. ప్రాచీన మతవ్యవస్థలోని నైతిక హితకరములైన నియమనముల స్థానములో, దూష్యములైనవాటిని తెచ్చిపెట్టినారు".

చరిత్రను ఆధారంగా చేసుకొని గావించేవాదనకు ప్రతిపక్షంవారు అపార్థం కల్పింపగలరని ఇతడు గుర్తించెను. కనుక, హేతువాదము నాధారము గావించు కొని, సంస్కరణాభిప్రాయానికి స్థైర్యమునాపాదించెను. "సంస్కరణ మనేది వాస్తవంగా స్వాతంత్ర్యోద్యమము. స్వార్థప్రయోజ నాభివృద్ధికి పూనుకొన్న పశు శక్తికి మనములొంగిపోవడంవల్ల ప్రాచీన మతంపై కళంక మేర్పడింది. ఉత్కృష్ట ములై యుండిన, ప్రాచీన న్యాయశాస్త్రము, రాజనీతి, సంస్థలు, ఆచారాలు,— వీటిపై నిర్బంధా లేర్పడినవి. ఈ నిర్బంధాలను తొలగించి, కళంకాన్ని తుడిచి వేసి, మతానికి సంఘ వ్యవస్థకు స్వేచ్ఛను కలిగించడమే సంస్కరణము". 'పునః ప్రతిష్ఠ - సంస్కారము'—అనే ఉపన్యాసములో ఇతడు,—నిజమైన సంస్కరణ మన ప్రయత్నమైతే, మనం మార్చవలసింది బాహ్యరూపాన్ని కాదు; అంతర స్వరూపాన్ని మార్చవలసి ఉంటుంది. బాహ్యరూపకల్పన గావించేవి, భావములు, అభిప్రాయములు; కనుక మార్పుచెందవలసినవి ఇవి". అని చెప్పియున్నాడు. ఇతరుల సంపర్కము నోర్వక దూరంగా వసించడము, ఆత్మ సాక్షి ననుసరించక బాహ్యశక్తికి లోబడడమూ, జన్మను పురస్కరించుకొని మానవునికీ మానవునికీ విభేధము చూపడము, పాపాచరణకు దోషాచరణకు తలయొగ్గి సహించడము, లౌకిక జీవితం విధివిధాయక మని నిరుత్సాహులై ఉండడము,—ఇట్టి మూలభావా లలో, ముఖ్యంగా మార్పు రావలసియున్నది".

ప్రతి మానవునకూ ఆత్మసాక్షిపట్ల గల బాధ్యత ఎట్టిదో, క్రింది విధంగా వివరిస్తాడు రెనడే".

"పూర్వమూ, ఇప్పుడూ ఉన్న జ్ఞానులందరూ మన గౌరవానికి అర్హులైన వారే. కాని, వారు, మనకూ మన సృష్టికర్త యైన భగవంతునకూ మధ్య రాకూడదు. గొప్పవాడైనా, అల్పుడైనా, ప్రతి వ్యక్తి యందునూ, దివ్యత్వము నిహితమై యున్నది. కనుక ఇతరుల మధ్యస్థం అవసరంలేదు. మనలో ప్రకృతి సిద్ధమై యున్న దేవునిపై గౌరవాన్ని, - ఇదియే ఆత్మగౌరవం, - మనము అభివృద్ధి చేసుకోవలసి యున్నది. అతిసున్నితమైన ఈ భావము వికసించడానికి చాలకాలం పట్టుతుంది. ఐనా, దానిని సాధించే సామర్థ్యం మనకున్నది; దానికై ప్రయత్నించడం ఆత్మకర్తవ్యము".

ప్రాచీన వ్యవస్థను పునరుజ్జీవింప జేయవలెననే భావాన్ని ఒకప్పుడు రెనడే సమర్థించి యుండినాడు. కాని ఇప్పుడు పునరుజ్జీవనవాదుల నితడు, తీవ్రమైన హేళన వాక్యాలతో, తిరస్కరించెను. "దేనిని పునఃప్రతిష్ఠ గావించవలెను? మన

సమాజములోని ఉత్తమోత్తమ వర్గాలవారు పాటిస్తూ ఉండిన అసహ్యాప్రవృత్తు లను [మనకిప్పుడవి అసహ్యాకరములు]. మాంసాహారాన్ని, మధుపానాన్ని, ఇతరములైనవారి అలవాట్లను, పునఃప్రతిష్ఠ గావింతామా ? పండ్రెండు విధములుగా కలిగే సంతానవిధానాన్ని, రాక్షసంతో సహా అష్టవిధ వివాహాలనూ, విభిన్న జాతుల స్త్రీపురుషుల సంగమాన్ని, న్యాయబద్ధముకాని స్త్రీపురుష సంగమాన్ని, పునరుజ్జీవింప జేయడం మీ అభిప్రాయమా ? దేవతల తృప్తికై, సంవత్సరారం భమునుండి సంవత్సరాంతం వరకూ, సర్వజనుల సమక్షంలో జరిపిన శతమేధమహా యజ్ఞాలను, - నరబలితో సహా - మరల జరపడానికి పూనుకొందామా ? వామ హస్త ప్రయోగముతో సహా, అసభ్యాచారాలతో, ప్రత్యక్షములైన వ్యభిచార ములతో కూడిన, శక్తిపూజను, మరల నెలకొల్పడం మీ ఆశయమా ? సతీసహగమ నము, శిశుహత్యాచారాలు, జీవంతోనున్న మనుష్యులను నదీప్రవాహములలో వేసే ఆచారము, కొండలపైనుండి మనుష్యులను క్రిందికి త్రోసివేసే మతాచారము, (చరుపాతం), మనుష్యులను కొరతవేసి దైవబలి గావించే పద్ధతి (సిడిమానుబలి), లేక, జగన్నాధుని రథచక్రాల క్రింద మనుష్యులను త్రోసి నలిపి, వారికి మోక్షము కల్పించే విధానము, - వీటిని మరల నెలకొల్పితే మీకు సంతుష్టి కలుగుతుందా ?" అని వారిని ప్రశ్నించియున్నాడు.

సాంఘిక పునరుజ్జీవన విషయములో ప్రాచీనకాలమందలి ఏ కాలపు వ్యవస్థను మనము గ్రహించవలెననే ప్రశ్న ఉదయిస్తుంది. సమాజం సజీవమైన వ్యవస్థ. పరివర్తన ప్రక్రియ నిరంతరంగా, సదా జరుగుతూ ఉంటుంది. అభ్యాసాలు, సంస్థలు, న్యాయాలు, ఆచారాలు, మతభావాలు, విశ్వాసాలు, - అన్నీ పరివర్తనం పొందుతూఉండడం సహజము. "చచ్చిపోయినవారిని పూడ్చడమో, కాల్చడమో జరిగిపోయింది. వారు ప్రకృతిలో కలిసిపోయినారు. వారి రూపనామాలు లోపించిపోయినవి. కనుక, గతించిపోయినదాన్ని మరల తెచ్చుకోలేము" కనుక, ప్రాచీన వ్యవస్థలో మిగిలియున్నదాన్ని మన ప్రస్తుత జీవితవ్యవస్థ కనుగుణంగా మార్చుకొని గ్రహించడమే మనము అవలంబించవలసిన ధర్మము. అదియే సాంఘిక సంస్కరణ.

కులవ్యవస్థను నిర్మూలించి. మానవులకు సమానతను సిద్ధింపచేయడము, వర్ణాంతర వివాహాలను అధికారయుక్తమొనర్చి, అంగీకరించడము, బాల్యవివాహ ములను నిరోధించడము, విధవా వివాహాలను శాసనబద్ధమొనర్చి, వాటికి గతి కల్పించడము, స్త్రీజనుల అంతఃపురవాసాన్ని (పరదాపద్ధతి) తొలగించడము, స్త్రీజన విద్యను వ్యాపింపచేయడము, హేతువాదవిరుద్ధములైన క్రూర ఆచారా లను నిర్మూలించడము, మానవ వ్యక్తిత్వానికి అగౌరవం కలిగించే అలవాట్లను, పద్ధతులను పరిత్యజించడము, ఇవి, అతడు పదే పదే పట్టుబట్టి సమర్థిస్తూ ఉండిన, సంస్కరణ సమస్యలు. అనగా, వ్యక్తి జీవితాన్ని పవిత్రమొనర్చి, జీవితాభివృద్ధికి దోహదం గావించడము, కుటుంబానికి, గ్రామానికి, వర్గానికి, జాతికి నూతన స్వరూపం కల్పించడము అను ప్రయత్నమే అతని సంస్కరణోద్యమము అని

సారాంశము.

మత సాంఘిక సమస్యల విషయములో, రెనడీ, ప్రతిపాదించిన తత్త్వ సిద్ధాంతము పాశ్చాత్యభావముల ప్రభావముపై ఏర్పడినట్టిది. ఆస్తికత, మానవ సమానత, సాంఘిక స్వాతంత్ర్యము, సన్యాసజీవిత వ్యతిరేకము. క్రియావాదము, **(activism)** అనువాని నితడు పాశ్చాత్యుల నుండి గ్రహించియున్నాడు. వీటి కంటెను ఉత్కృష్టమైన అభ్యుదయ వాదానికితడు, వారికి ఋణపడియున్నాడు. వ్యక్తికీ, సంఘానికీ సంబంధించిన సమస్యలను పరిశీలించడములో, ఇతడు అవలంబించిన బుద్ధివాద ప్రక్రియ, పాశ్చాత్యులనుండి గ్రహించినది. పరిశీలనలో ఇతడవలంబించిన విధానం, వాస్తవికము, విమర్శాత్మకము ఐనట్టిది. చారిత్రక పద్ధతినితడనుసరిస్తూ, అవసరమైనచోట్ల అనుమితి తర్కాన్నికూడా (నిగమన పద్ధతి) ప్రయోగించెను. ఇతనికి మానవాభ్యుదయ మందుగల విశ్వాసమే ఇతని సంస్కరణోద్యమానికి ఆధారమయింది. అతని అభిప్రాయానుసారంగా, కేవలం ప్రజల జీవిత సౌకర్యాల అభివృద్ధి మాత్రమే అభ్యుదయంకాదు. కేవలం విజ్ఞానాభివృద్ధికూడా అభ్యుదయం కాకపోవచ్చు. మానవుని నైతిక, ఆధ్యాత్మిక జీవితాభివృద్ధికి అనుగుణములైన పరిస్థితులు సమాజములో ఏర్పడడమే, అభ్యుదయమని అతని ఉన్నతాభిప్రాయము. మానవాభ్యుదయానికి సూటిగా ఒక మార్గమున్నదనీ, దాని ననుసరిస్తే మానవుని జీవితం సుఖకరమౌతుందనీ, అతని విశ్వాసము కాదు. ఉదాహరణకు : వస్తుసంపదలోను, నైతికౌన్నత్యంలోను, ప్రస్తుత వ్యవస్థకంటెను, శ్రేష్ఠములైన కాలభాగాలు పూర్వం ఉండినవి. కాబట్టి తరువాతి కాలములో ఏర్పడు వ్యవస్థ పూర్వపు వ్యవస్థకంటెను అభ్యుదయమైనదని చెప్పజాలము. అదే విధంగా, ఒకప్పుడు సాంఘిక వ్యవస్థ నిశ్చైతన్యమై జడస్థితిలో నున్నట్లయితే, రాబోవుకాలంలోని వ్యవస్థ ఇంతకంటెను అధమం కాగలదనడానికి ఇది సూచకమని కూడా చెప్పలేము. స్వతంత్రులైన వ్యక్తుల కార్యాచరణంవల్ల సాంఘిక జీవనం పురోగమించడమే అభ్యుదయమని, ఇతని భావము. ఈ సూత్రాలను వర్తింపజేసి పరిశీలింపగా, భారతదేశచరిత్రలోని ఆయాకాలపు అభివృద్ధి పతనములు, శాంతివెంబడే కలిగిన సంఘర్షణలు, అవ్యవస్థా,- ఇత్యాదులన్నిటికీ, ప్రజల నైతిక క్షీణతా, పరదేశీయుల ఉద్ధతాక్రమణములూ, హేతువులని, రెనడీకు, గోచరించింది. ప్రతి విషయములోనూ, మానవుని అంతఃసాక్షిననుసరించి, ప్రయోజకాత్మక దైవసంకల్పం నెరవేరుతుంది; విస్తృతమైన ప్రతిసంఘటనా ప్రకృతి నియామకంగా జరుగుతుంది అని ఇతడు నిశ్చయించుకొన్నాడు. భారత దేశంలో ముస్లిం పరిపాలననుగూర్చి, ఉదాహరిస్తూ, - భారతదేశంలో నివసిస్తున్న ఇంత విస్తారమైన ప్రజానీకము, శతాబ్దాల పర్యంతము, పరదేశీయుల ప్రాబల్యానికి లోనై, వారి ప్రభావానికి, వారి నిర్బంధములకు లోబడియుండడం భగవన్నియామకము కాదని ఎట్లు భావింపగలము ? ఈ పరదేశ పాలకుల ప్రభావము, నిర్బంధములు, భారత జాతులలో బలాన్ని, శీలాన్ని, పెంపొందించి, ఇంతవరకూ తెలియని నూతన మార్గాలలో వారిని ప్రవర్తింపజేసి వారికి మేలు చేకూర్చలేదని

ఎట్లు చెప్పగలను."

దేశంలోని వివిధ జాతులవారు మహమ్మదీయ పరిపాలనవల్ల, క్షీణతకూ, సాంకర్యమునకూ లోనై, నశించిపోవడానికి మారుగా, బలం చేకూర్చుకొని యున్నారు. దేశక్షేమాన్ని అభిమానించిన మహమ్మదీయ, హిందూ రాజనీతి వేత్తలు, మత సహనాన్నీ, సమదృష్టినీ, పాటించి ప్రభుత్వాన్ని నడిపిన కాలములలో, దేశములోని ఇతర మతాలవారుకూడా బలవంతులై యున్నారు. అశోకుని కాలం తర్వాత, హిందూ రాజ్యములకు ఐక్యభావం లేకపోవడంవల్ల, బలం నశించి, మహమ్మదీయ దండయాత్రలకు దేశం సులభంగా లొంగిపోయింది. మహమ్మదీయుల ఆధిపత్యంవల్ల హిందువుల అభిరుచులు, ప్రవర్తనలు శత విధాలుగా సున్నితములైనవి మహమ్మదీయులతోడి సంసర్గమువల్ల మత విషయములోను, భావముల విషయములోను, ఉదాత్తత సిద్ధించింది." అని ఇతడు వివరించినాడు.

"ప్రాచీన చరిత్రనుండి మనము తప్పక గ్రహించి, పాటించవలసిన గుణపాఠమొకటి యున్నది. విస్తారమైన ఈ దేశములోని హిందువులు, మహమ్మదీయులు, చేతులు కలిపి, దేశ కల్యాణమును గోరిన నాయకులను అనుసరించడానికి నిశ్చయించుకొంటేతప్ప, అభ్యుదయ మేమాత్రమూ కలుగదు. అక్బరునాడు మంత్రులుగా సలహాదారులుగా, ఉపదేశకులుగా ఉండి రాజ్యపాలనను దక్షతతో నడిపించినట్టివారి ననుసరించవలసిందనీ, ఔరంగజేబు అనుసరించిన మార్గమును పరిహరించవలసిందని" రెనడే, ప్రజల నుద్బోధించినాడు.

## IV వేదసమాజము

బెంగాలులో ప్రారంభమైన సంస్కరణోద్యమం, కేశవచంద్రసేన్ మహారాష్ట్ర ప్రాంతంలోనూ, తమిళనాడులోనూ ప్రవేశపెట్టినాడు. 1864 లో ఇతడు మదరాసు వెళ్లి, తన వాగ్ధోరణి నుపయోగించి, వేదసమాజ స్థాపనకు ప్రోద్బలం గావించినాడు. సమాజంలో ప్రతివారమూ ప్రార్థనలు జరిగేవి. సమాజ సిద్ధాంతాల ప్రచారమునకై ఒక పత్రికకూడా బయల్వెడలింది. ప్రసిద్ధ న్యాయవాదులైన వి. రాజగోపాలాచార్లు, పి. సుబ్బరాయచెట్టి, న్యాయాధిపతి పదవినుండి విశ్రాంతి దీసుకొన్న విశ్వనాథ మొదలియారు ఈ సమాజానికి నాయకులు. విశ్వనాథ మొదలియారు రచయితకూడా.

కాని, సమాజాభివృద్ధికి పూనుకొన్నవారిలో ప్రముఖుడు కె. శ్రీధర నాయుడు లౌకికంగా బీదవాడే ఐనా, భావిదృష్టి, అభ్యున్నతి, ఉత్సాహము, అనే లక్షణము లతనికి సహజములు. ఇతడు కలకత్తా వెళ్లి, బ్రహ్మసమాజోద్యమాన్ని, సమాజ సిద్ధాంతాలను గ్రహించినాడు. మదరాసుకు వచ్చి, వేద సమాజాన్ని బ్రహ్మసమాజముగా మార్చెను (1871). దక్షిణభారతములో ఏర్పడిన ప్రథమ బ్రహ్మసమాజమిది. పూర్వము ఏర్పరచియున్నదానికంటెను అభ్యుదయకరములైన విషయములను, ధైర్యముతో ప్రవేశింపజేసెను. ఆత్మ నివేదనమనేది అట్టివాటిలో ఒకటి. బ్రాహ్మధర్మాలను, తెలుగు తమిళ భాషలలోనికి కనువదించి, మత సిద్ధాంత ప్రచారమునకై పర్యటనలకు బూనుకొన్నాడు. కాని, దురదృష్టం

వల్ల, కారు ప్రమాదములో అతడు 1874 లో మరణించెను.

ఆతర్వాత, సంస్థలో అభిప్రాయభేధము లేర్పడినవి. కేశవచంద్రసేనుని శిష్యుడైన శ్రీధరనాయుడు అవలంబించిన సిద్ధాంతాలను కొందరు సభ్యులనుసరిస్తూ వచ్చిరి. కాని, సమాజములోని అధికవర్గంవారు, సాధారణ బ్రహ్మసమాజ విధానము ననుసరించి, నూతన సంస్థ నేర్పరచుకొనిరి. ఈ వివాదంవల్ల ఉద్యమం బలహీనమై, ప్రజాభిమానాన్ని గోల్పోయింది.

రామమోహన్‌రాయ్, మహదేవ గోవింద రెనడేలు, పందొమ్మిదో శతాబ్దంలో ఉద్భవించిన మహనీయులు. భయాలను, దుర్బలత్వాన్ని పరిత్యజించి, తన భవిష్యత్తును సాధించడానికి పూనుకొమ్మని భారతదేశాన్ని ప్రబోధించిన ఉదాత్త వ్యక్తులు వీరు. తత్కాల పరిస్థితులనుబట్టి చూస్తే, బహు దూర భావి దృష్టిగల ఈ మహాత్ములు కాలానికి చాల ముందుగా వచ్చినవారని వ్యక్తమౌతుంది. కనుకనే, వారిచ్చిన సందేశాన్ని ప్రజలు తక్షణమే గ్రహించి, పాటించలేకపోయిరి. ఐనా, భారతదేశం అనుసరించవలసిన మార్గాన్ని ఏర్పరచి, దానిని తేజోవంతముగావించి, భారతీయుల పురోగమనాన్ని సుకరం గావించినారు. వారు ప్రదర్శించిన ధ్యేయాన్ని అనుసరించడంవల్లనే దేశంనేడు, వేగంగా కాకపోయినా, తడబడుతూనైనా ముందుకు నడుస్తూఉంది.

కేశవ చంద్రసేనుని ఆస్తికవాదం రహస్యగర్భితమైన భావనా ప్రధానమైన సార సంగ్రహ తత్త్వంగా సిద్ధించి, హిందూ సిద్ధాంతాన్ని అతిక్రమించిపోయింది. మూడు బ్రహ్మసమాజ సంస్థలలోను, ఆది సమాజము చాలవరకు హిందూమతమే ఐ, ఉండడంల్ల క్రమంగా మరుగుపడిపోయింది. స్థాపకులవైయక్తిక, ప్రాధాన్యం వల్లను, మితిమీరిన అభిప్రాయాలవల్లను కేశవచంద్రసేనుని 'నవవిధానము' నష్టపడింది. సాదారణ సమాజమొక్కటే, తన స్థానవ్యక్తిత్వములను నిలుపుకొని, క్రమంగా అభివృద్ధిబొందింది. ఈ సమాజముయొక్క ప్రచారకవర్గము, సేవా సంస్థలు, పత్రికలు, సక్రమంగా కార్యక్రమాన్ని నిర్వహించినవి,

రెనడే బోధించిన సిద్ధాంతములో బుద్ధిప్రాభవము ప్రాధాన్యంవహించినా, మానవ హృదయభావ ప్రవృత్తులు విస్మృతములు కాలేదు. కాని, ఇందలి తీవ్ర మత నైతిక నిష్ఠా, హిందూ సంప్రదాయ ఖండనమూ, పూర్వాచార పరాయణులకు నచ్చలేదు. ఈ సంప్రదాయాలు, ప్రస్తుత కాలానికి అనుగుణమైనవి కాకపోయినా, తమ పూర్వులు స్వతంత్రులైయున్న కాలములో ఏర్పడినవని, కనుక వాటిని రక్షించడం తమ విధియని వీరు భావించి, ప్రాచీన మత సంస్థను పునః ప్రతిష్ఠ గావించడానికి పూనుకొనిరి. పాశ్చాత్యపాలకుల ఆధిపత్యంవల్ల ప్రజలలో ఏర్పడియున్న అసంతుష్టి, వీరికి మంచి అవకాశాన్ని కలిగించింది. ప్రాచీన సంప్రదాయవాదులు ఈ అవకాశాన్ని పురస్కరించుకొని, పునరుజ్జీవనోద్యమాన్ని ప్రజలలో వ్యాప్తిగావింపజొచ్చిరి. ఈ విధంగా, బెంగాలులోను, మహారాష్ట్రములోనూ, ఉదారాభ్యుదయోద్యమాలకు భంగం కలిగింది.

## V బెంగాలులో పునరుజ్జీవనోద్యమం

1870 ప్రాంతంలో బెంగాలులోను, 1880 లో మహారాష్ట్రంలోను పునరుజ్జీవనోద్యమము, ప్రజల అభిమానాన్ని సంపాదించుకొంటూ, బ్రహ్మ సమాజ ప్రార్థన సమాజాలను వెనుకకు నెట్టడానికి ప్రారంభించినది. నలభై సంవత్సరాల కాలంనుంచీ దేశములో ప్రతిధ్వనిస్తున్న హేతువాద నినాదాన్ని అణచివేసి, హిందూమతము ప్రబలం కాజొచ్చింది.

పెక్కు అంశములు ఈ ప్రవృత్తికి పోషకములైనవి. రామమోహనరాయ్ స్థాపించిన ఉదార బ్రహ్మసమాజ సంస్థకు వ్యతిరేకంగా, పండిత రాధాకాంతదేవ్, 1830 లో ధర్మసభను స్థాపించియుండెను. బెంగాలులోని మధ్యతరగతి హిందూ వర్గంవారు ఇతనికి సహకరించిరి. కాని, ఉదారవాదులైన యువకులు, సంస్కర్తలైన ద్వారకనాథ టాగోర్, దేవేంద్రనాథటాగోరులూ, గావించిన ఆందోళనవల్ల ఈ సంస్థ ఎక్కువగా అభివృద్ధి చెందలేకపోయింది. కాని, రెండు సంస్థలూ, అర్ధ శతాబ్దకాలం తమ కార్యక్రమాలను నిర్వహిస్తూ వచ్చినవి. అక్షయకుమార దత్తా (1820-1886), ఈశ్వరచంద్రవిద్యాసాగర్ (1820-91), రంతానూలావారీ (1813-1898), రాజనారాయణబోస్ (1826-99) తదితరులూ సంఘ సంస్కరణోద్యమాన్ని బాగా బలపరుస్తూ వచ్చిరి. వీరి సహకారంవల్ల బ్రహ్మసమాజ ప్రతిష్ఠ బాగుగా స్థిరపడింది.

కాని, 1857 విప్లవం తర్వాత, దేశములోని రాజకీయ వాతావరణములో పరివర్తన మారంభమయింది. నూతనాంశములవల్ల సాంఘిక ప్రవృత్తులు మారజొచ్చినవి. అభ్యుదయ వాదాలు, మతభావాలు, సంస్కరణావసరములు, వెనుకబడి, పూర్వాచార ప్రవృత్తులు ప్రబలమైనవి. 1870 ప్రాంతంలో, ఈ ప్రాచీన సంప్రదాయ ప్రవృత్తులకు సమాజములో ప్రాబల్యం సిద్ధించింది.

1858 తర్వాత, బెంగాలు మనోభావాలను ఉత్తేజపరచినవి జాతీయత, భావనా స్వాతంత్ర్యము. ఈ రెండూ ఒక్క ప్రేరక శక్తి వల్లనే ఏర్పడినవి. వ్యక్తి స్వాతంత్ర్య ప్రతిష్ఠ, తమ జాతి ప్రాచీనతయందు గర్వము, పరిపాలకవర్గం వారి దురహంకార ప్రవృత్తిపట్ల ద్వేషము, గ్రామీణ ప్రజల దుస్థితిపట్ల సానుభూతి, స్వాతంత్ర్య సమత్వాలపై ఉత్కాంక్ష, – వీటి ప్రేరణవల్ల విద్యావంతుల వర్గం ఉద్రిక్తమయింది. రాజకీయ స్వాతంత్ర్యం లేనిదే, సమగ్రమైన సమాజ సంస్కరణ సాధ్యము కాదనే భావాన్ని ఈ ప్రేరక శక్తులు ఉద్బోధించినవి.

తమ ప్రాచీన సంస్కృతినిగూర్చిన అభిమానాన్ని మొదట ప్రబోధించింది మతోద్యమము: చరిత్రాధ్యయనము, ప్రాచీన చరిత్ర శోధనవల్ల బహిర్గతమైన విషయాలు, భారతీయ సంస్కృతి పరిశోధన, – ఈ అభిమానాన్ని పోషించినవి. ఇంతవరకూ విస్మృతములైయుండి ఇపుడు చైతన్యవంతములై పైకి వచ్చిన, ప్రాచీన సారస్వతము, తత్త్వశాస్త్రము, విజ్ఞానశాస్త్రము, న్యాయశాస్త్రము, కళలు, స్మారకచిహ్నలు, ఇత్యాదులు, భారతదేశ ప్రతిష్ఠను ప్రపంచములో ప్రతిష్ఠించి, దేశప్రజలలో ఆత్మగౌరవ ఆత్మాభిమానములను పెంపొందించినవి.

తత్ఫలితంగా, పాశ్చాత్య సంస్కృతిపట్ల హేయభావ ముత్పన్నమైనది. పాశ్చాత్యుల ఆధిక్యతను ఖండించి, తిరస్కరించవలెననే ఆతురత ఎక్కువ యింది. ఇట్లారంభమైన, 'నవ్య హిందూమత' మును అనేకులవలంబించిరి. కాని, వీరిలో రెండు విస్పష్టములైన వర్గము లేర్పడెను. సంస్కరణ మేమాత్రమూ కూడదనే వర్గము ఒకటి. ప్రధానమైన మత సిద్ధాంతాన్ని స్పృశింపక, కొన్ని ప్రత్యేక విషయాలలోమాత్రమే మార్పు కావలెనని కోరే వర్గం రెండవది. మొదటివర్గానికి మూలకర్త, శశాధరతర్కచూడామణి. రెండవదానికి, బంకిం చంద్ర చటర్జీ, మూలకర్త.

ప్రాచీన పౌరాణిక పూజావిధానాలను, కర్మకాండను సమర్థించినవాడు శశాధర్. ప్రజలు పాటిస్తూఉన్న కర్మలు, సాంఘికాచారాలు, సంస్థలు మొదలైనవి అర్థవంతములైన విజ్ఞానశాస్త్ర సూత్రముల ఆధారమున ఏర్పడినవని ఇతడు వాటిని సమర్థిస్తూ వచ్చినాడు. టాగోరు తన 'జీవనస్మృతి' లో ఇతనిని గురించి, "సంఘములో ప్రస్తుతం వ్యాప్తమైయున్న మూఢవిశ్వాసాలను కూడా, ఆభాస విజ్ఞానశాస్త్రంతో సమర్థించే హాస్యాస్పద ప్రయత్నానికి బూనుకొన్నది శశాధర్ సంస్థ" అని వ్రాసియున్నాడు.

ఈ నవ్యహిందూమతానుయాయులలో శశాధర్ అభిప్రాయాలకు సన్నిహితులైనవారు కృష్ణప్రసన్నసేన్, హేమచంద్రబంధోపాధ్యాయ. కృష్ణప్రసన్నుడు అవలంబించిన విధానం ప్రజ్ఞానిబద్ధమైనది కాదు. మతవిషయకమైన ఇతని ప్రయత్నము సంస్కారవిహీనమైనది. నవీనచంద్రసేన్, ప్రకృత్యా, కవి. సాంఘిక సంస్థలను గూర్చి, ఇతని అభిప్రాయములు వ్యక్తిగతములైనవి. ఏకేశ్వర సిద్ధాంతాన్ని ఇతడంగీకరించినా, విగ్రహారాధనలో ఇతనికి దోషం కనిపించలేదు. చిరకాలంగా వస్తున్న, బాల్యవివాహములు, కులభేదాలు, కులాంతర్గత వివాహాలూ అర్థరహితములై యుండజాలవని ఇతని వాదము. బెంగాలులో క్రమవ్యాప్తి చెందుతున్న పాశ్చాత్య విధానాన్ని, ఇతడు తీవ్రంగా విమర్శించెను. మతాభిమానాన్ని పెంపొందించి, రక్షించేది విద్యాప్రయోజనమని ఇతడు తీక్ష్ణంగా వాదిస్తూ వచ్చినాడు.

నవీనచంద్రుని వలెనే, హేమచంద్రబంధోపాధ్యాయ కూడా. సనాతన సంప్రదాయ వాది. 1857 లో ఇతడు శ్రీకృష్ణుని జీవితచరిత్రను గూర్చి సుదీర్ఘమైన వ్యాసమును రచించెను. అది, తర్వాత, గ్రంధ రూపములో, వెలువడింది. 'భారతదేశములో బ్రాహ్మ ఆస్తికమతము' అనే గ్రంథములో విద్యావిద్యావంతుడైన హిందువు, బ్రహ్మమతాన్ని అవలంబించకూడదని వివరించెను.

***బంకించంద్రఛటర్జీ (1838-94) :*** బెంగాలులో ఈ ఉద్యమానికి మూలకర్త ఐనవాడు బంకించంద్రఛటర్జీ. పందొమ్మిదో శతాబ్దములోని సంప్రదాయవర్గం వారిలో జరుగుతున్న ఈ ఉద్బోధకు ఇతడు ప్రతినిధి. ఇతనికి పూర్వము, సంప్రదాయ సంస్థను సమర్థించుటకు బూనుకొన్న, రాధాకాంతదేవ్ ధర్మసభను స్థాపించి, దానికి నాయకుడై సనాతనమత రక్షణ కార్యం నిర్వహించి

నాడు. దేశమందలి ఇతర ప్రదేశాలలో కూడా ఇట్టి ఉద్యమాలు బయలుదేరెను. మధ్వమతస్థులు, శ్రీవైష్ణవులు, శైవసిద్ధాంతులు, లింగాయతులు, దక్షిణదేశ స్మార్తులు, బెంగాలు చైతన్యమతానుయాయులు, మధ్యభారత వైష్ణవులు, - ఈ వర్గాలవారు తమతమ మతసిద్ధాంతాలను సమర్థించే సారస్వతాన్ని సృష్టికి దెచ్చిరి. విద్యాసంస్థలను నెలకొల్పి, మతసంబంధమైన క్రియాకలాపాలను సాగించిరి.

జాతియోత్సుకతా, మతానురక్తీ బంకించంద్ర జీవితంలో మేళవించినవి. ఆంగ్ల విద్యాభ్యాసము, క్యాంట్, ఫిచ్, బెంథామ్, మిల్, స్పెంసర్, - ఇత్యాదుల తత్త్వశాస్త్రాధ్యయనము, ఇతని విమర్శక శక్తులకు ఉద్బోధ కలిగించెను. అగస్టీకాంటీ **(Auguste comte)** ప్రతిపాదించిన ప్రత్యక్షప్రమాణ వాదము **(Positivism)** ఇతనిపై ఎక్కువ ప్రభావాన్ని కలిగించింది. పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రాధ్యయన మావశ్యకమని ఇతడు సమర్థిస్తూ వచ్చెను. బెంథాము సంస్థవారవలంబించిన ఉపయోగితావాదము **(Utilitarianism)** కాని, స్పెన్సర్ ప్రతిపాదించిన సుతఖత్త్వ పరిణామ వాదము **(Evolutionary Hedonism)** కాని, ఇతనికి నచ్చలేదు. నిరీశ్వరమైన ప్రత్యక్ష ప్రమాణ వాదాన్ని కూడా, ఇతడంగీకరించలేదు.

హిందూ ధర్మశాస్త్రాధ్యయనము, హిందూమతము, ఇతని బుద్ధికి సంతుష్టి కలిగించినవి. మత సమస్యల పరిశీలనకు, పాశ్చాత్యు లవలంబించిన, క్రమబద్ధమైన రీతివిధానశాస్త్రము **(Methodology)** ఇతని కెక్కువగా ఉపయోగించింది. జీవిత మహాసమస్యలను, సాంఘిక సమస్యలను పరిశీలించుటలో, ఇతడు, శాస్త్రీయము, విమర్శాత్మకము, తార్కికము, ఐన విధానాన్ని వర్తింపజేసి, విచారణకు బూనుకొన్నాడు. స్వతంత్రమైన దృక్పథాన్ని పెంపొందించి, పాశ్చాత్య భావములకు దేశములో ఏర్పడియున్న ప్రాబల్యాన్ని నశింపచేయడం ఇతని ప్రయత్నం. కనుక, తన సందేశాన్ని ప్రజానీకాని కందజేయడానికి ప్రజాభాష నవలంబించినాడు.

తాత్త్విక విషయములలో గల్గిన ఆసక్తివల్ల, హిందూమత సమర్థనకు బూనుకొన్నాడు. క్రిశ్చియను మిషనరీలు అనవసరంగా హిందూమతాధిక్షేపణకు బూనియుండడంవల్ల, వారితో వివాదములకితడు పూనుకోవలసివచ్చింది. శశాధరునివంటి ప్రగతి నిరోధవాదులు **(obscurantists)**, బ్రహ్మోలవంటి అభ్యుదయ వాదులు, కూడా, ఆధునికతాపత్తి నెదుర్కొడానికి సమర్థులు కారు. క్రిశ్చియనులతో ఇతని కేర్పడిన వివాదాలను పురస్కరించుకొని, 'హిందూమత లేఖలు' అన్నే గ్రంథాన్నితడు రచించి, యోగేశచంద్రఘోషుకు పంపించెను. హిందూ సంఘాన్ని పీడిస్తున్న సమస్యా పరిష్కారానికి, పునీతమైన హిందూ మతోద్ధరణమే సాధనము. శశాధరుడు ప్రతిపాదించిన విజ్ఞానాభాసవాదము, కేశవచంద్రుని సారసంగ్రహవాదము, రెండూకూడా, అసంబద్ధములైనవే. పెద్దవాడయ్యేకొద్దీ, తాను నిర్వహింపవలసిన మహాకార్యమును గుర్తిస్తూ వచ్చినాడు బంకించంద్ర.

హిందూమతాన్ని పునరుద్ధరించడంవల్లనే, భారతదేశ సమస్య పరిష్కారం

కాగలదనే విశ్వాసం, ప్రబలమయింది. రహస్య గర్భితము, అంతరార్థప్రకాశితము ఐన, గీతామతాన్ని వ్యాఖ్యానించి, ఆధునిక భారతదేశానికి అందించవలసిన అవసర మున్నది. అతడు రచించిన 'ధర్మతత్త్వ' ము, 'కృష్ణచరిత్ర' అనే గ్రంథములలో, తన అభిప్రాయము లన్నిటినీ పొందుపరచెను.

సమాజముయొక్క నైతిక రాజకీయ ప్రవృత్తులను పునరుజ్జీవింప చేయడానికి, మతమొక్కటే తగిన సాధనమని ఇతని నిశ్చయం. "ఉపయోగితా వాదాన్నుండి మతాన్ని మనం విడదీయజాలము" అని నుడివియున్నాడు. సంఘ సంస్కరణ విషయములలో, ఇతనికీ, ఇతర అభ్యుదయ సంస్కర్తలకూ, అభిప్రాయభేదమున్నది. ఒక్కొక్క సమాజ సమస్యనే సంస్కరిస్తూ రావడం నిష్ఫలమన్నాడు. మత నైతిక పునరుజ్జీవనమొక్కటే సమాజానికి నూతన స్వరూపం కల్పింపగలదని, ఇతని భావము. సాంఘికాచారాలను, క్రియాకలాపాలను అధిక్షేపించడంవల్ల ప్రయోజనం సిద్ధించదు. ధర్మశాస్త్రములకంటెను ఎక్కువగా, ఇవియే సమాజాన్ని ఒక సంస్థగా ఏర్పరచడానికి సమర్థములైనవి. అన్నిటికంటెను ముఖ్యముగా ఆవశ్యకమైనది, వ్యక్తివైశిష్ట్య సమగ్ర పరిపోషణ. వ్యక్తిలో కలుగవలసివ ఈ సమరస పరిపుష్టే 'అనుశీలన ధర్మము', (శిక్షణాత్మక మతం). ఉన్నతమైన ఈ స్థితికి, నాలుగు ఆరోహణ దశలున్నవి. ఆత్మప్రీతి, స్వజన ప్రీతి. స్వదేశ ప్రీతి, జగత్ప్రీతి, - అనే ఈ దశలను క్రమంగా సాధించి, అనుశీలన ధర్మస్థితిని, వ్యక్తి పొందగలడు.

దీనికంటెను ఉన్నతమైన, మానవ ప్రీతే ఈశ్వర ప్రీతి. ఆత్మప్రీతికంటెను, స్వజనప్రీతికంటెను, శ్రేష్ఠమైనది స్వదేశప్రీతి. ఇదే మానవుని పట్ల మన విధ్యుక్త ధర్మం. "దేశభక్తే మతము, మతమే ఈశ్వరప్రీతి." అనువాక్యాన్ని, బంకించంద్ర తన ఆదర్శంగా చేసుకొన్నాడు ఇతని మతానికి ఆధారమైన ధర్మశాస్త్రము, భగవద్గీత. ఫలాపేక్షను త్యజించి, నిష్కామకర్మకు బూనుకొమ్మని బోధించే గీత, ఉత్తమోత్తమ ధర్మశాస్త్రము.

శ్రీకృష్ణుడు గీతలో బోధించిన మత సిద్ధాంతాలను మాత్రమేకాక, ఆ బోధనలకు సమాజాభ్యుదయముతోగల ప్రసక్తి ఎట్టిదోకూడా, తన కృష్ణ చరిత్రలో చర్చించియున్నాడు. "తాను సంఘ సంస్కర్తయని శ్రీకృష్ణుడు చెప్పుకోలేదు. నైతికంగా, రాజకీయంగా సమాజాన్ని పునరుద్ధరించడము, సత్యమైన మతవ్యాప్తిగావించి, తదాధారంపై రాజ్యాన్ని స్థాపించడము అతని మహాదాశయాలు. దీనిని సాధించినట్టయితే, సంఘం తనంతట తానే సంస్కారాన్ని పొందుతుంది. అట్టి పరిస్థితి ముందుగా ఏర్పడక, సమాజ సంస్కారం సాధ్యమే కాదు. దీనిని సిద్ధింపజేయక, సాంఘిక సమస్యలకు మనం ప్రత్యేకంగా పూనుకోవడం వల్లనే, చిక్కు లేర్పడుతున్నవి. రాజకీయాభివృద్ధికిగూడా, మతాభివృద్ధే మూలము. కనుక, ప్రతివారూ మతాభ్యుదయానికి పూనుకోవడము అగత్యము. అట్టిది జరిగితే, సంఘ సంస్కారాని కెవ్వరూ పూనుకోనవసరంలేదు.

బంకించంద్రుని అభిప్రాయంలో, - కృష్ణుడు ఆదర్శపురుషుడు, మానవ

వ్యక్తిత్వపు పరాకాష్ఠ, "హిందూమతస్థులలో మహోత్కృష్టుడు, అత్యుదాత్త ప్రజ్ఞాశాలి." వేదాంతులు చెప్పినట్లు భగవంతుడు, అగమ్యగోచరుడు, నిర్గుణుడు' పరతత్త్వము కాడు. శ్రీకృష్ణుడు బోధించినట్లుగా, సకలగుణోపేతుడు, ప్రేమమూర్తి, దయాశీలుడు, ఐనవ్యక్తి భగవంతుడు. హిందూమతమునకు పరమగురువు, పరమాదర్శపురుషుడు, శ్రీకృష్ణుడు.

ధర్మతత్త్వమనే గ్రంథములో శ్రీకృష్ణు డీ విధంగా వర్ణింపబడినాడు. "తన బాహుబల శౌర్యములతో దుష్టులను నిగ్రహించి, ప్రజ్ఞాబలంతో భారతదేశైక్యాన్ని నెలకొల్పి, తన జ్ఞానబలంతో, స్వార్థ నిరపేక్షమైన మతాన్ని స్థాపించిన, భగవంతునికి, నా, నమోవాకములు. వేదములు ప్రమాణములై, శక్తివంతములై యున్న కాలంలో, వేదములే తనమూలశక్తియై, యున్న దేశములో, "ధర్మము వేదములందు లేదు, మానవ కల్యాణమునకు సాధనమైనదే ధర్మము.'' అని నిర్వచించిన శ్రీకృష్ణుడు భగవంతుడే ఐనా, మానవుడే ఐనా, అతనికి నా నమస్కృతులు. బుద్ధుడు, మహమ్మదు, క్రీస్తు, రామచంద్రుడు, - వీరందరూ ఎవరియందు నిహితులై యున్నారో, సమస్తమైన శక్తికి, నీతినిష్ఠకు, సర్వమత సత్యమునకు, అఖండప్రేమకు ఎవడు ఆకరమైయున్నాడో, ఆ శ్రీకృష్ణుడు దేవుడైనా, మానవుడైయున్నా అతనికి నేను నమస్కరిస్తున్నాను." అని ఇతడు వివరించి యున్నాడు.

మానవజీవిత సర్వస్వమూ, బంకించంద్రుడు బోధించిన మతమునందిమిడి యున్నది. సౌఖ్యమును, వైరాగ్యమును కూడా, సంయోజన మొనర్చిన మతమిది. ఫలనిరపేక్షమైన కర్తవ్యాచరణసూత్ర మీ మతము. హిందూ సంఘము, హిందూరాజ్యము ఏర్పడడానికి అవసరమైన నైతిక మూలాధారాన్ని ఇది ప్రతిష్ఠించింది. కేవలం హిందూమత సమన్వయందే ఇతడు పూర్తిగా నిమగ్నుడై, హిందూ సంఘముయొక్క నైతిక రాజకీయ పునరుద్ధరణమందుమాత్రమే, దృష్టి నంతనూ కేంద్రీకరించడంవల్ల, హిందూ సమాజముయొక్క, స్వభావవిస్తృతి వైవిధ్యాన్ని గుర్తించలేకపోయెను.

బంకిం చంద్రుని వలెనే, భూదేవచంద్రముఖోపాధ్యాయ కూడా, నవ్య హిందూ సిద్ధాంతాన్ని సమర్థించినవాడు. ఈ ఉద్యమానికి రక్షకులై నిలిచిన వారిలో, బంకించంద్రకు, శశాధరునికంటె ఎక్కువ సన్నిహితుడు. బంకిం చంద్రుని వలె, ఇతడునూ, పాశ్చాత్య తత్త్వశాస్త్రాన్ని బాగుగా అధ్యయనం చేసినవాడు. భూదేవు, తనరచనలలో, కాంటీని, పలుచోట్ల పేర్కొని యున్నాడు. తన 'సామాజిక ప్రబంధ' మనే గ్రంథములో, ప్రత్యక్ష ప్రమాణ వాదాన్ని పేర్కొని, 'ఇతరులకై నీ జీవితము నుపయోగింపుము'. అనే సూత్రాన్ని సమర్థించియున్నాడు. పాశ్చాత్య తత్త్వశాస్త్రాధ్యయనము వల్ల ఇతనికి కూడా బంకించంద్రుని వలెనే, హిందూ సిద్ధాంతములపై గౌరవాభిమానములధికమైనవి. సర్వమత ధర్మములూ, హిందూ మతములో చేరియున్నవని ఇతని భావము. కనుక తన మతమొక్కటే విశ్వమతమనే విశ్వాస మితనికి స్థిరపడింది. ఈ విశ్వమత లక్షణమే హిందూ మతానికి

చైతన్యాన్ని కలిగించిన ఆధార శక్తి అని ఇతడు నమ్మినాడు. "భారతీయుల సనాతన ధర్మ మెట్టి పరిస్థితులలోను క్షీణించిపోక, అనశ్వరమై నిలిచి యుండడానికి కారణమేమి? సువిశాలమై, అన్ని మతములను గ్రహిస్తూ, అన్ని విధములైన సాధనకు అవకాశము కల్పిస్తూ, అన్ని వర్గముల అన్వేషకులకు ఆశ్రయమై, సమగ్ర దయాః స్వభావము కల మతమై యుండడమే, దీనికి కారణము". అని ఒక చోట వివరించినాడు.

హిందూ మతము యొక్క విశ్వలక్షణాలకు ఈ విధంగా ప్రాధాన్యమిచ్చి నందువల్ల, ఇతర మతములపట్ల ఇతనికి సహనభావము ఏర్పడింది. తన జీవిత చరిత్రలో, "సర్వమత సమన్వయము హిందూ మతము యొక్క ఆశయం కావడం వల్ల, ఇతర మతముల పట్ల ఇతనికి ద్వేషభావం లేదు. కనుక 'విద్యాపత్రిక' బ్రాహ్మ మతస్థులను, మహమ్మదీయులను, క్రైస్తవులను, ఇతర మతస్థులను, విమర్శింపదు." మతము యొక్క విస్తృత ప్రయోజన విషయములోనే కాక, మత లక్షణమును నిష్కర్షగా నిర్వచించుటలో కూడా, ఇతనికి బంకిం చంద్రతో, సంపూర్ణమైన ఏకీభావము కలదు. మానవ జాతి రక్షణ, మానవజాతి శ్రేయము, మత ప్రయోజనములని ఇతని భావము. సామాజిక ప్రబంధము'లో ఇతడిట్లు వ్రాసి యున్నాడు. "మతము మానవుని రక్షించునది గనుక, మానవునకు మతమావశ్యకము. సద్యఃఫలాన్ని, సౌఖ్యాన్ని, మతము కలిగించక పోవచ్చు. కాని, అది మానవునకు రక్షగా నిలిచి, మానవత్వాన్ని, మానవ జాతిని, నిలుపుతుంది". అని వ్రాసినాడు.

బంకిం చంద్రతో ఇతనికింతటి ఏకీభావం కలగడానికి కారణములున్నవి. విద్యా ప్రసారము, దారిద్ర్య నిర్మూలనము సంపత్సమృద్ధి-వీటివల్ల సమాజము యొక్క నైతిక, ఆర్థిక పునరుజ్జీవనం జరుగగలదనే విషయము, ఇరువురి దృష్టికీ గోచరమయింది.

## రామకృష్ణ పరమహంస (1836-86)

దక్షిణేశ్వర యోగియని వ్యవహరింపబడిన రామకృష్ణ పరమహంస జీవ యాత్ర అద్భుతావహమైనది, బంకిం చంద్రుని జీవితయాత్రకు ఇది భిన్నమైనదీను. 1836 లో జన్మించిన రామకృష్ణ ఏబది యేండ్లు మాత్రమే జీవించియుండి 1886 లో దివంగతుడైనాడు. "దరిద్రుడు, విద్యావిహీనుడు, దుర్బల దేహుడు అనాగరకుడు, జాడ్య పీడితుడు, విగ్రహారాధకుడని చెప్పదగినవాడు, మిత్రులు లేనివాడు, ఐన, ఈ హిందూ భక్తుడు" బెంగాలు సమాజ జీవితాన్ని, తన ప్రభావంతో, కూలంకషంగా కలచివేసినాడు. దక్షిణేశ్వరాలయంలో దేవత నారాధిస్తూ, అందే నివసిస్తున్న రామకృష్ణ, ఆలయానికి తండోపతండాలుగా సందర్శనార్థం వచ్చిన సామాన్య ప్రజానీకానికి పవిత్ర పీఠము, జ్ఞానకేంద్రము, ఐనాడు.

ప్రాపంచిక కష్టాలను, దుఃఖాలను, ధైర్యంతో, ఓర్పుతో సహించే శక్తిని ఈ ప్రజానీకానికి కలిగిస్తూ ఆత్మసంతుష్టిని, అంతరంగిక సౌఖ్యమును వారు

సాధించుకొనే మార్గాన్ని ప్రదర్శించినాడు. పాశ్చాత్య విద్యావంతులైన మధ్య తరగతుల వారితని ఆకర్షణకు లోనైరి. ఇతని సాధుస్వభావము, నమ్రప్రవర్తన, మానవత్వము, ఆధ్యాత్మిక రుజుత్వము-లౌకిక దృష్టి గల ఆధునికుల గౌరవమునకు కూడా పాత్రములైనవి. తరువాతి కాలములో వివేకానందుడని ప్రఖ్యాతి గాంచిన నరేంద్రనాథ దత్త, కేశవ చంద్రసేన్-తదితరులు ఇతనిని సందర్శిస్తూ, ఇతని సందేశాలను గ్రహిస్తూ వచ్చిరి. ఇతని సాంగత్యము వల్ల వారిలో దివ్యభావముద్భుద్ధమై వారి దృక్పథాన్ని పరివర్తనం గావించింది. నరేంద్రనాథ వంటివారు ఇతని సహచరులై ఇతని సందేశాన్ని ప్రచారము గాంవిచడానికి బూనుకొన్నారు.

భగవదావేశమునకు లోనైన ముముక్షువు, రామకృష్ణ, అన్ని విధములైన ఆరాధనలు ఏకేశ్వరారాధనమని, వివిధ మతస్థుల భిన్నాన్వేషణలన్నీ ఈశ్వరాన్వేషణములని, నమ్మినాడు. "సర్వమతములవారూ, భిన్నమార్గాలలో అడుగులు వేసుకొంటూ, ఏకైక గమ్యస్థానమైన ఈశ్వరునివైపు నడుస్తున్నారు". అని ఇతడు వివరించినాడు. భారతజాతి స్వత్వమైన ఆధ్యాత్మిక తత్త్వములో స్థిరుడై నిలిచి, వేదాంతమునుండి ఉపనిషత్తులనుండి ఉత్తేజనాన్ని పొంది, అన్ని మతములకూ ధ్యేయమొక్కటే అనే నిర్ణయంతో, అన్ని వర్గాలవారి ఆధ్యాత్మికానుభూతులనూ గ్రహించడానికి బూనుకొన్న మహావ్యక్తి రామకృష్ణపరమహంస. ఒక ముస్లిము సూఫీ ఇతనికి ఇస్లాము మతసిద్ధాంతాలతో పరిచయము కలిగించెను. మరియొకరు బైబిలు చదివి ఇతనికి వినిపించిరి. సిక్కుగురువులనితడు పూజించినాడు. ఆనందపరవశ స్థితిలో, క్రైస్తు, బుద్ధుడు, కృష్ణుడు, జగన్మాతయైనకాళీ, వీరి దృశ్యములు ఇతనికి గోచరించినవి వివేకానంద ఇతనినిట్లు వర్ణించియున్నాడు, "బాహ్యంగా ఇతడు భక్తుడుగా గోచరిస్తాడు. అంతరంగికంగా ఇతడు మహాజ్ఞాని". భావావేశముతోకూడిన ఇతని అనుభూతులు ఈశ్వరసామీప్యమును ఇతనికి కలిగించినవి; మానవుని యందలి దివ్యత్వము ఇతనికి సాక్షాత్కరించింది. ఆత్మానుభూతికి ప్రతిబంధకములైన విషయములన్నీ ఇతని భక్తిశ్రద్ధలవల్ల, పరిత్యక్తములైనవి. మానవత్వంపట్ల దయను, ప్రేమను కలిగించినది ఇతని మతనిష్ఠ, మానవజీవనము, వారిప్రీతి వారికష్టాలు,- ఇవి ఇతని మానవసేవలో మిళితమైపోయినవి"."ఓ జగన్మాతా! పంచముని సేవలోనన్ను నియమించుము". అని ప్రార్థించినాడు. తన దీర్ఘశిరోజములతో మందిరాన్ని తుడిచినాడు. అతడు బోధించినది,- "మానవులకవసరమైనది దయకాదు. సేవ. మానవసేవను భగవత్స్వరూపమని భావింపవలెను". ప్రబలరోగగ్రస్తుడై మరణశయ్యలోనున్న సందర్భములో కూడా, ప్రజలతనిని సందర్శించడానికి గుంపులు కట్టుకొనివచ్చిరి. అతడు వారితో సంభాషించడానికి బూనుకొన్నాడు. అతని నెవరూ నిరోధింపలేక పోయిరి. వారి నిరోధప్రార్థనలకు జవాబుగా, "ప్రాణం నాకు లెక్కలోనిదికాదు. ఒక మానవునికి సహకరించే నిమిత్తం, ఇట్టిదేహాలను ఇరవైవేలు త్యజించడం నాకిష్టమైనది. ఒక్క మానవుని సేవకూడా ఎంతో శోభాయమానమైనది".

***వివేకానంద*** : రామకృష్ణుని మానవహితనిష్ఠను సమర్థించి, బహుళ

ప్రచారము గావించినవాడు అతని ప్రియశిష్యుడైన వివేకానంద. ఇతని జననకాలము 1863. విద్యాభ్యాసం కలకత్తాలో జరిగింది. గంభీరమైన ఆకృతి, వ్యాయామకర్కశమైన దృఢగాత్రము, అందమైనముఖము, ఇతని బాహ్యస్వరూప లక్షణములు. ఇతని సునిశితమైన బుద్ధికి పాశ్చాత్యతత్త్వ శాస్త్రాధ్యయనము విశిష్టమైన రూపురేఖలను దిద్దింది. డెస్కార్టిస్, హ్యూమ్, క్యాంట్, ఫిక్ట్, స్పినోజా, హెగల్ షోపెన్ హార్, కాంటే, డార్విన్, మిల్,- వీరిగ్రంథాలను సూక్ష్మంగా పరిశీలించి, విమర్శకజ్ఞానాన్ని, విశ్లేషణశక్తినీ, పెంపొందించు కొన్నాడు. బ్రహ్మసమాజ సిద్ధాంతము ఇతనిని మొదట ఆకర్షించినది. కాని, ఇతని విజ్ఞాన శాస్త్రాధ్యయనము ఆస్తిక్యవాదములో విశ్వాసాన్ని నశింపజేసింది. ఆ స్థితిలో అతనికి రామకృష్ణ పరమహంసతో సంపర్కంకలిగింది. అప్పుడితనికి పూర్తిగా ఇరవైయేండ్లు కూడా లేవు. ఇతని జీవితయాత్రను పూర్తిగా మార్చి వేసిన సంఘటన, రామకృష్ణుని సందర్శనము. రామకృష్ణయోగికి బద్ధానురక్తుడైన శిష్యుడైపోయినాడు వివేకానంద.

గురువు మరణించునాటికి వివేకానందకు 24 ఏండ్లవయస్సుకూడా పూర్తి కాలేదు. రామకృష్ణుని సందేశాన్ని ప్రసారంగావించే నిమిత్తమై, తన జీవితాన్ని నివేదించుకోడానికి కృతనిశ్చయుడైనాడు. లౌకిక జీవితాన్ని పరిత్యజించి, పరివ్రాజకవృత్తిని గైకొని, హిమాలయారణ్య ప్రాంతాలకు వెళ్లి పోయెను. హిమాలయములలో ఇతడు ఆ రేండ్లకాలం గడపిన ఆత్మనిష్ఠైక జీవితము ఇతనికి సమాధానచిత్తమును, ప్రశాంతతను, నిశ్చిత జ్ఞానాన్నీ కలిగించింది. జీవితాంతంవరకూ నిర్వహించిన ఇతని మహోద్యమానికివి ప్రధాన లక్షణములై నిలిచినవి. పరివ్రాజకుడుగా, భిక్షాశనము మాత్రమే ఉపాధిగా, ఇతడు గావించిన భారతదేశ పర్యటనంవల్ల, సామాన్య జనానీకంయొక్క దరిద్రస్థితి, వారి దురవస్థ బాగుగా పరిచితమయినవి.

"నాకు విశ్వాసమున్న ఏకేశ్వరుడు, సమస్తాత్మల సంయోగము, అన్ని జాతులలోని క్రౌర్యము, జాడ్యము, దారిద్ర్యము, - ఇవన్నీ ఏకమైన ఈశ్వరుడు, నాకు సామాన్య మానవ ప్రజానీకమే." అని ఇతడు దుఃఖావేశ పరవశుడై ఆక్రోశించినాడు. అద్భుతావహమైన ప్రకృతి సృష్టిగా, వివేకానందుడు సిద్ధించి నాడు. రామకృష్ణుని బోధలు, అతని జీవితము, భారతీయ వేదాంతము ననుస రించిన నూతన మతముగా ఏర్పడి, వివేకానందుని బుద్ధి ప్రవృత్తికి సంతుష్టిని, స్వాస్థ్యమును కలిగించినవి. అతని ఆత్మాన్వేషణ పిపాసకు సంతృప్తి కలిగింది. భారతీయ సంప్రదాయముపై ఇతనికిగల గౌరవాభిమానములు, పాశ్చాత్య భావాలవల్ల, ఇదివరకు చలించియుండినవి. రామకృష్ణ బోధ లితని హృదయ ములో వాటిని పునఃప్రతిష్ఠ గావించెను. కాని, నైతికంగానూ, వాస్తవికం గానూ, తనకాలపు భారతదేశ మెంతటి అధోగతిలోనున్నది అనే విషయము అతని దేశ పర్యటనలో ప్రత్యక్షంగా వ్యక్తమయింది.

సంక్షుబ్ధమైన హృదయముతో, ప్రజ్వలించే ఆత్మతో, భారతదేశాన్ని శ్యాన్ని ప్రపంచానికి ప్రదర్శించడానికి నిశ్చయించినాడు. భారత దేశపు దుస్థితిని తొలగించే ప్రయత్నమంతకంటెను ఆవశ్యకమైనది. 1893 లో అతడు అమెరికా వెళ్లి, చికాగోలో జరిగిన ప్రపంచ మత సమావేశములో పాల్గొన్నాడు. భారత మతముయొక్క విశ్వవ్యాపక స్వభావాన్ని, విశాల భావములను' గూర్చి, అతడు గావించిన మహోపన్యాసము, సభ్యుల హృదయాలను, మనస్సులను, పరవశ మొనర్చినవి. సమస్తములైన నదీ ప్రవాహములు సముద్రములో లీనమైనట్లు, వివిధ జాతి మతాలవారు అనుసరించే మార్గాలన్ని సర్వేశ్వరునిలో లీనమైపో తున్నవి." అని అతడు భారతీయ భావాన్ని స్పష్టపరచినాడు.

న్యూయార్కు హెరాల్డ్ పత్రిక ఈ విధంగా ఇతని ఉపన్యాసాన్ని గూర్చి వ్రాసింది. "ప్రపంచమత సమావేశములో పాల్గొన్నవారిలో వివేకానంద మహో న్నతవ్యక్తి అనడానికి సందేహం లేదు. విజ్ఞానవంతమైన భారతదేశానికి మిషనరీ లను పంపడం ఎంత బుద్ధిహీనమైనదో, అతని ఉపన్యాసం విన్న తర్వాత మనకు విశద మయింది". ఉపన్యాసంవల్ల తనకు గలిగిన భావాలను వ్యక్తంచేస్తూ మరి యొక పత్రిక, "వాక్పటుత్వము, అతనికి దైవదత్తమైన స్వత్వము, హృదయ పూర్వకమైన అతని భాషణము, గంభీర స్వరముతో శబ్దాలంకారముల పొందికతో, గావించిన భావవ్యక్తీకరణ విధానము, సభ్యులకెంతటి ఆసక్తిని కలిగించినవో, కాషాయాంబరధారియైన అతనిముఖ వర్చస్సు, గాంభీర్యములు కూడా సభ్యులను అంతగా ముగ్ధులను గావించినవి."

ఉపన్యాసములిస్తూ, వేదాంతసంఘములను స్థాపిస్తూ, శిష్యులను గ్రహిస్తూ వివేకానందస్వామి కొంతకాలం, అమెరికాలో గడిపినాడు. "మానవత్వ ప్రతిష్ఠను హిందూమతము బోధించినంత ఉదాత్త సరణిలో, ప్రపంచమందలి ఏ మతమూ బోధింపదు." అనేది అతని ఉపన్యాసముల సారాంశం.

అమెరికానుంచి అతడు ఇంగ్లాండు వెళ్లినాడు. భారత దేశభక్తుడుగా అతడు విదేశ ప్రభుత్వానికి అనిష్టత చూపినా, మానవజాతిపై అతనికిగల ప్రీతివల్ల, ఇంగ్లాండు దేశీయులపట్ల ద్వేషభావము వహించినవాడు కాడు. "ఇంగ్లీషుజాతిని నేను ప్రేమించినట్లు, మీలో ఎవ్వరూ ప్రేమించడంలేదు." అని ఒకప్పుడు వారితో నుడివియున్నాడు." ఉన్నతమైన వ్యక్తి స్వాతంత్ర్యము, న్యాయబద్ధ మైన ఉన్నత ప్రవృత్తి" ఇంగ్లాండు ప్రజలలో ఇతడు చూచినాడు. "ఆంగ్లజాతి వీరుల జాతి; నిజంగా ఆంగ్లేయులు క్షత్రియులు." అని అతనికి తోచింది. ఇంగ్లాండునుంచి బయలుదేరి యూరోపు ఖండ పర్యటనం గావించి, ఫ్రాన్సు, స్విట్జర్లాండు, జర్మనీ దేశాలను సందర్శించెను.

నాలుగేండ్లకాలం ఈ విధంగా విదేశాలలో పర్యటనం సాగించి, 1897 జనవరి 15 తేదీనాడు కొలంబోలో దిగి, స్వదేశం ప్రవేశించెను. కన్యాకుమారి నుండి కలకత్తావరకు, ఇతని ప్రయాణం దిగ్విజయ యాత్రగా, జరిగింది. పాశ్చా త్యుల ఆధిక్యమును ఆక్షేపించిన భారతీయులలో ఇతడు ప్రథముడు. తన మత

సం[ప్రదాయముల విషయమై సమర్థనవాదమునకు పూనక, విమర్శకుల నధిక్షే పించడానికి [ప్రయత్నించక, తన మతముయొక్క ఆధ్యాత్మిక తత్త్వ సర్వోత్కృష్ట తనూ, అసదృశమైన మహత్త్వమునూ, నిశ్చల ధైర్యంతో [ప్రపంచమునకు నిరూ పించినాడు. పాశ్చాత్య విమర్శకులను, హిందూమత దూషకులను, వారి దేశము లందే ఎదుర్కొని, వారి [ప్రశంసలనూ, గౌరవ [ప్రపత్తులనూ [గహించివచ్చిన భారత వీరుడని [ప్రజలు ఇతనిని అభిమానించిరి. ఈ విజయసాధన, భారతీయులకు ఉత్తేజకమైనది. ఇదివరకు ఏర్పడియున్న ఆత్మ తుచ్ఛీకరణ భావము నశించి, ఆత్మ [ప్రత్యయ భావము ఏర్పడింది.

భగవంతు డతనికి [ప్రసాదించిన స్వల్ప జీవితకాలాన్ని, రామకృష్ణ సంస్థా స్థాపనకు, సందేశ [ప్రసారమునకు దేశోద్ధరణకు, వినియోగించెను. కలకత్తా సమీప మున బేలూరులో ఒక [ప్రధాన కేం[ద్రాన్ని, అలమోరావద్ద మాయావతిలో మరియొక కేం[ద్రాన్ని, నెలకొల్పి, రామకృష్ణ సంస్థలో చేరిన యువకులకు శిక్షణనిచ్చి, వారిని సన్న్యాసులుగా సిద్ధపరచి, మత సాంఘిక సేవకు ఏర్పాట్లు గావించెను. ఈ విధంగా [ప్రాచీనము, పూజనీయము ఐన పరి[వాజక సంస్థ జాతీయ సేవకు వినియుక్తమైనది. ఈ సన్న్యాసులు, పూర్వపు సాధువులవలెనే నిష్ఠా జీవితమునకు బూనుకొనిరి. కాని, పూర్వపు హిందూ వ్యవస్థలోని సాధు వులు లౌకిక వ్యవహారములకు దూరులై యుండగా, ఈ సంస్థలోనివారట్లుకాక, లోకసేవకు పూనుకొనియుండడం వీరి వైశిష్ట్యము. [ప్రజల కష్టములలో తోడ్పడ డం, రోగులకు వైద్యసహాయం గావించడము, ప్లేగు, కలరా, కుష్ఠు - మున్నగు జాడ్యములకు లోనైనవారికి సేవ చేయడము, అనాథ బాలబాలికలను రక్షించ డము, - మున్నగు లోకసేవాకార్యములకు వీరి జీవితము లంకితము గావింపబడి నవి. పాఠశాలలు, దానధర్మశాలలు, మఠములు మొదలైనవి నెలకొల్పబడినవి.

రాజకీయాందోళనలను వివేకానంద వ్యతిరేకించినాడు. ఐనా, బలవం తము, ధైర్యోపేతము, [క్రియాశక్తము, ఐన జాతిగా భారతదేశం అభివృద్ధి పొంద డము ఇతని అభిమతము. జాతీయ జీవన గానమునకు మతం, సంగీతమునకు శృతి వంటిదని ఇతడు వర్ణించియున్నాడు. "అన్ని [క్రియాత్మక రంగములలోను, వీర త్వాన్ని ఉద్బోధపరచే నిష్ఠాత్మకమైన ఆత్మశక్తి [ప్రవృత్తం కావలెనని" ఇతడు ఆశించెను. "పరతత్త్వమునుగూర్చిన ఉజ్జ్వల[పేమ, దుస్థితికిలోనైయున్న [ప్రజా నీకం పట్ల అనివార్యమైన సేవానిరతి, - ఇవి రెండును ఇతని జాతీయోద్య మంలో మేళనం పొందినవి."

ఐనా, సాంఘిక విధానములలోను, సాంఘిక వ్యవహారములలోను, మతా చారనిష్ఠాపరులు [ప్రదర్శించే దాంభిక [ప్రవృత్తి నితడు సహింపలేదు. ఈ కారణం వల్లనే ఇతడు, కులతత్త్వాన్ని, వర్గాభిమానాన్ని, అస్పృశ్యతను, మా[తమేకాక, అన్నివిధములైన అసమాన భావాలనూ ఖండించినాడు. [ప్రపంచములోని [ప్రజ లెల్లరు భగవంతుని సంతానమే కావడంవల్ల, అతని దివ్య[ప్రకృతి [ప్రతి మానవునిలో కూడా, స్వభావసిద్ధమై యున్నది. "దరి[ద్రులు, అనాథులు, పతితులు, పరపీడి

తులు, – అందరూ రండు. మనమందరమూ రామకృష్ణునివారము." బీదలయెడ అతనికిగల సానుభూతి యెట్టిదో అతని వాక్యములనుబట్టి తెలుస్తుంది – "పూజా విధానమునకు సంబంధించిన ప్రక్రియలను పరికరములను, అన్నిటినీ పారవేతాము. శంఖారావము, ఘంటా నినాదము, మంగళహారతి, అన్నీ త్యజింపబడనీ. విద్యావంతులమనే గర్వమంతా నశింపనీ. ఆత్మముక్తి నుద్దేశించిన సాధనలు, అధ్యయనము, సర్వమూ, త్యక్తము కానీ. పల్లె పల్లెకు పయనిస్తూ, దరిద్రులసేవకు మన జీవితాలను వినియోగిద్దాము. దరిద్రసేవ, దీనులసేవ మన ఏకైక కర్తవ్యము."

విద్యావంతులైనవారి నీవిధంగా ఆక్షేపించినాడు. "లక్షలాది ప్రజలు దేశంలో ఆకలితో, అజ్ఞానంతో, బ్రతుకుతున్నంతవరకూ, ప్రతివ్యక్తీ దేశద్రోహి యని నేను భావిస్తాను. ప్రజానీకంయొక్క సేవవల్ల, శ్రమవల్ల మీరు విద్యావంతులై, బాగుపడి, వారిని ఏమాత్రమూ గమనింపకున్నారు. భారతదేశపు భవిష్యత్తు సర్వమూ ప్రజానీకంపై ఆధారపడింది. అగ్రవర్గాలవారు దైహికంగా నైతికంగా నశించిపోయినారు." అని వ్రాసియున్నాడు.

అనువంశీయత (Heredity) ననుసరించి, బ్రాహ్మణునికి విద్యాగ్రహణంలో సహజశక్తిసామర్థ్యములు ఎక్కువ యున్నవని, పంచమునకు లేవని, మీరు వాదించినట్లయితే, బ్రాహ్మణుల విద్యావ్యాప్తికై ద్రవ్యాన్ని ఖర్చుపెట్టరాదు. విద్యకై ప్రత్యేకించిన ధనమంతా, పంచములకై వినియోగించండి. మీరు చేయదలచుకొన్న దానం, అవసరమున్న బలహీనుల కివ్వండి, అది ఫలిస్తుంది" అని వివేకానంద ప్రకటించినాడు. భారతీయుల పిరికితనమును, సోమరితనమును చూచి, ఇతడు తీవ్రమైన ఆగ్రహాన్ని ప్రకటించినాడు. ఈ విషయమై అతడు, తన ఉపన్యాసములలో పదేపదే "మీరు బలవంతులు కావలెను, పౌరుషవంతులు కావలెను. ఇది అన్నిటికంటెను ముఖ్యమైన అవసరము. దేహాన్ని, బుద్ధిని, ఆత్మను బలహీనంగావించే ప్రతి విషయాన్నీ, విషంగా పరిగణించి, పరిత్యజించండి. అట్టిదానిలో ప్రాణం లేదు, సత్యం లేదు. సత్యమొక్కటే బలపోషకమైనది. సత్యమే పవిత్రమైనది, సత్యమే జ్ఞానము". "మనకు ఆత్మవిశ్వాసాన్ని కలిగించేదే మతము. ఆత్మ జాతి గౌరవాన్ని, దరిద్రులకు ఆహారాన్ని, విద్యను ఇచ్చి, మన చుట్టూ వ్యాపించియున్న దురవస్థను, దైన్యాన్ని నిర్మూలించేదే మతము" అని అతని అభిప్రాయం. కేవలం ధ్యానంతో కూడిన సోమరితనాన్ని, జడతాస్వభావాన్ని మతమునుండి విసర్జించవలెను. "రామకృష్ణను ఎవరు లెక్కచేస్తారు ? మీ భక్తి, ముక్తి ఎవరికవసరం ? మీ ధర్మశాస్త్రములు చెప్పే విషయం ఎవరికి ప్రయోజనం ? తమస్సులో నిమగ్నులై యున్న నా దేశీయుల నుద్బోధించి, వారు తమ కాళ్లపై తాము నిలబడేటట్లు చేసి: కర్మయోగమునకు వారు బూనుకొనేటట్లు నేను చేయగలిగితే, సంతోషంతో వేయి నరకముల కైనను పోవడానికి సిద్ధంగా ఉన్నాను" అని ఖండితంగా తన భావాన్ని వ్యక్తపరచినాడు. అన్ని కార్యరంగములలోను, వీరత్వాన్ని ఉద్బోధించే ఆత్మనిష్ఠకు, ఆత్మప్రత్యయానికి ప్రోద్బలం కలిగించండి" అని తన దేశీయులను ఆదేశించినాడు.

వివేకానందుని స్వాతంత్ర్యప్రీతి, అతని వాక్కులలోను, అతడు నిర్వహించిన కార్యములలోనూ వ్యక్తమౌతుంది. "వాక్స్వాతంత్ర్యము, క్రియాస్వాతంత్ర్యము, ఇవి రెండే మానవ జీవితానికి, అభివృద్ధికి, శ్రేయస్సుకు, నియమాలు. ఇవి లోపించిన నాడు, వ్యక్తి, సమాజము, జాతి, పతితం కాక తప్పదు".

ఆవేశపూరితము, దేశభక్తియుతము, ఉన్నతభావ ప్రేరకము, ఐన వాక్యాలలో దేశాన్ని ఈ విధంగా సంబోధించెను; - "ఓ భారతదేశమా, పరుల సంస్థపై ఆధారపడియుండ దలచినావా? ఈ అనుకరణము, ఇతరుల ప్రశంసకై ప్రాకులాడడము, ఈ నిర్వీర్యమైన దాస్యము, ద్వేషింపదగిన, అసహ్యాకరమైన, ఈ హృదయకారిన్యము, ఈ పదవీవ్యామోహము, - ఇవన్నీ నీవు సహిస్తావా? వీరులకు మాత్రమే అర్హమైన స్వాతంత్ర్యాన్ని, లజ్జాకరమైన ఈ పిరికితనమాధారంగా నీవు సాధిస్తావా? నీ సమాజం మహాభ్రాంతి యొక్క నీడ మాత్రమే యని జ్ఞప్తియందుంచుకో. దేశములో నున్న దీనులు, దరిద్రులు, అజ్ఞానులు, చర్మకారులు, ఝాడ కూలీలు, - వీరందరూ నీ రక్తం పంచుకొన్నవారని, నీ సోదరులని జ్ఞప్తియందుంచుకో. ఓ ధైర్యశాలీ, ధైర్యం తెచ్చుకో. నీవు భారతీయుడవని గర్వించుము. నేను భారతీయుడనని, ప్రతి భారతీయుడూ నా సోదరుడని, అభిమానముతో ప్రకటించుకొనుము. భారతభూమియే నా అత్యుచ్చ స్వర్గము. భారతదేశ శ్రేయమే నా శ్రేయము అని ప్రకటించుము".

***మహారాష్ట్ర ప్రాంతములో పునరుద్ధరణ ప్రయత్నము:*** మహారాష్ట్రములో పునరుద్ధరణోద్యమం, సంఘ సంస్కర్తల హేతువాద సిద్ధాంతానికి ప్రతిక్రియగా ఉత్పన్నమయింది. బెంగాలు ప్రాంతంలోని విద్యావంతులు ఆధునికతను అవలంబించుచున్ననాటి కింకను మహారాష్ట్రప్రాంతం సంప్రదాయ వ్యవస్థలో మునిగితేలుతూ ఉండింది. బెంగాలు ఆక్రమణ తర్వాత అరవై సంవత్సరాల తర్వాతగాని, మహారాష్ట్రుల మాతృభూమియైన, బొంబాయి దక్కను, బ్రిటీషు వారి పరిపాలనలోకి రాలేదు. మహారాష్ట్రులు వ్యాపారంలోను, వాణిజ్యంలోను బెంగాలీలవలె ఆసక్తి చూపినవారుకారు. అదికాక, రైతువారీ పట్టా పద్ధతి ఆ ప్రాంతములో అవలంబించియుండడంవల్ల, భూస్వామ్యముగల వర్గం ఉన్నతం కాలేదు. కాని, క్లిష్టమైన రాజస్వ పద్ధతిని నిర్వహించడంలో ప్రభుత్వము ప్రజలపై ఆధారపడవలసివచ్చింది. తత్కారణంగా, గుమాస్తాల సహాయము, జిల్లాలలోని ఇతర క్రింది ఉద్యోగాలకు తగిన సహాయము అవసరమై, మహారాష్ట్రులను, - ప్రధానంగా బ్రాహ్మణులను, - ప్రభుత్వం ఉద్యోగాలలో ప్రవేశపెట్టింది. ఇట్లు నియుక్తులైనవారు, బ్రిటీషువారి సాహచర్యంవల్ల, పాశ్చాత్య పద్ధతులను నేర్చుకొనిరి. ఆంగ్లభాష ఈ విషయములో ఉపయోగకరమైనదని గ్రహించి, కొందరు పాశ్చాత్య విద్యావిధానాన్ని అనుసరించి విద్యావంతులైరి. బాలశాస్త్రి జంభేకర్, లోకహితవాది దేశముఖ్, జ్యోతీబాఫూలే, - ఇత్యాదులీ వర్గములోని వారు. హిందూ సాంఘిక వ్యవస్థను విమర్శించినవారిలో వీరే ప్రథములు.

ఈ సంస్కర్తలవాదం ఎక్కువగా వ్యాప్తి కాలేదు. ఒక చిన్న వర్గం

మాత్రమే దీనిలో ఆసక్తి వహించింది. విద్యావ్యాప్తి స్వల్పమై ఉండడము, మధ్యతరగతి ప్రజలు బలహీనులై ఉండడము, ఇందుకు హేతువులు. 1857 లో బొంబాయి విశ్వవిద్యాలయం స్థాపితమయింది. కాని, ఇరవైయేండ్ల కాలం తర్వాతకూడా మెట్రిక్యులేట్ల సంఖ్య 1100, పట్టభద్రుల సంఖ్య 179, న్యాయ శాస్త్ర పట్టభద్రుల సంఖ్య 53 మాత్రమే. 1880 లో 8 కళాశాలలుమాత్రమే ఆ ప్రాంతంలో ఉండినవి. అందులో ఆరు బొంబాయి నగరంలోనివే. ఉన్నత పాఠశాలల సంఖ్య 48 మాత్రమే. మధ్యమ పాఠశాలల సంఖ్య 177.

ఈ విద్యాలయాల్లో చదివినవారందరూ చిన్న ఉద్యోగముల నాశించిన, బీద కుటుంబములలోని బాలురే. కనుక, పూర్వపు దురభిప్రాయాలను సంప్రదా యస్థుల అభిప్రాయాలను అధిగమించడం వీరికి సాధ్యము కాలేదు. రెనడే, భండార్కర్, అగర్కర్, చందావర్కర్, వంటి సంస్కర్తలు, శతాబ్దములనుండి పాతుకొనిపోయిన భావాల నెదుర్కొనవలసివచ్చింది.

1870 తర్వాత, నూతనశక్తులు క్రియాత్మకులై సంస్కర్తల ఉద్యమానికి విఘ్నం కలిగిస్తూ వచ్చినవి. క్షామములు తరచుగా ఏర్పడి, దేశ దారిద్ర్యాన్ని విస్తరింపచేస్తూ ఉండడంవల్ల పర ప్రభుత్వములో, వారి సంస్కృతిలో ప్రజలకు విశ్వాసం నశించింది. వారిపట్ల దురభిప్రాయంకూడా ఏర్పడింది. భారతీయ సనాతన సంస్కృతియొక్క ఔన్నత్యం, పరిశోధనవల్ల బహిర్గతం కావడంతో, ప్రజల ఆత్మగౌరవ ఆత్మప్రత్యయములకు బలము సిద్ధించినది. భారతదేశ భవిష్య త్తుపై నమ్మకము, పాశ్చాత్య సంస్కృతిపట్ల తిరస్కారభావము ఏర్పడినవి. పర దేశ పరిపాలనపై హేయభావమేర్పడినందువల్ల, మత, సాంఘిక సంస్కరణ ప్రయత్నములు వెనుకబడినవి. రాజకీయములు ప్రజల మనస్సులపై ప్రాబల్యము వహించినవి.

విష్ణుశాస్త్రి చిప్లుంకర్ (మరణం 1882) నిబంధనమాల అనే పత్రికలో ఒక వ్యాసం ప్రకటించెను. బ్రిటీషువారి ఆక్రమణ మన స్వాతంత్ర్యాన్ని అంత మొనర్చింది. స్వాతంత్ర్య నష్టంతో మనకు పవిత్రములైయున్నవన్నీ నశించినవి. మన రాజ్యాలు, మన సంపద, మన విద్య, - అన్నీ క్షీణించినవి" అని దానిలో వ్రాసినాడు. వ్యవసాయము, పరిశ్రమలు, వ్యాపారము, కళలు, - ఇవన్నీ వెనుక బడి పోయినవ"ని తన సంతాపాన్ని వెలిబుచ్చినాడు. స్వాతంత్ర్యనష్టంవల్ల కలిగిన నైతికభ్రష్టత, పర పరిపాలన వల్ల పరిణమించిన చెడుగులన్నిటిలోనూ ప్రబలమైనట్టిది. మన ప్రజలు దాస్యస్థితి నంగీకరించి, ఆత్మగౌరవాన్ని, ఆత్మాభి మానాన్ని, గోల్పోయిన స్థితికి దిగజారిపోయి యున్నారు. మన గుణశీలములు పూర్తిగా భ్రష్టమైనవి" అని ప్రకటించినాడు.

సంస్కర్తలు చెప్పుతున్నట్లుగా, మన మతసంప్రదాయాలు కాని, బాల్య వివాహ, కులతత్త్వాది ఆచారాలు కాని, మన పతనానికి నిజంగా హేతువులు కావు. మనకు కలిగిన ఆపదలన్నిటికీ, పరదేశీయుల పరిపాలనమే మూలము. ఇట్టిప్రబ లమైన సంఘట్టనకు ప్రతిగా, రెనడే ప్రతిపాదించిన హేతువాదమునిలువజాలకపో

యింది. అట్టిపరిస్థితులలో, బాలగంగాధర తిలక్ వంటి ప్రబలనాయకుడు, ప్రతిభావంతుడు సనాతన వ్యవస్థకు రక్షకుడై నిలువడంతో, సాంఘికసంస్కారమునకు అవకాశం లేకపోయింది.

పీష్వాల సేవలోని గొప్ప వంశమునుంచి వచ్చినవాడు తిలక్. మహారాష్ట్ర సామ్రాజ్య వైభవం అత్యుచ్చదశలోనుండిన వాతావరణములో, తిలకు మనస్సు భావాలూ రూపొందినవి. ఆ సామ్రాజ్యప్రభావము ఇతని హృదయములో ఇంకను మెదులుతూనేఉన్నది. వంశముయొక్క సనాతననిష్ఠ, సంస్కృతవిద్యాధ్యయనము, ప్రాచీనభారత చారిత్రాధ్యయనము,- ఇతనికి తనప్రాచీన సంస్కృతిపై భక్తి భావాన్ని స్థిరపరచినవి. హిందూ ఆదర్శములపై హిందూసంస్థలపై ఇతనికిగల ప్రీతి, హిందూమత, తత్త్వశాస్త్రములలో ఇతడు వహించిన అభిమానము కారణములుగా, తిలక్, పాశ్చాత్య సంస్కృతిని తీవ్రంగా విమర్శిస్తూ, భారత సంస్కృతి యొక్క ఔన్నత్యానికి రక్షకుడై నిలిచెను. కనుక, సంఘ సంస్కరణోద్యమాన్ని ఒక వ్యవస్థగా ఏర్పరచడానికి, రెనడే పూనుకోవడంతో, తిలక్ అతనిని బాహాటంగా ఆక్షేపించి, ఆ ఉద్యమాన్ని ప్రతిఘటించి నిలిచెను. సంస్కార విరోధి కాడు తిలక్. కాని అతడు సంస్కరణ ప్రయత్నాలను వ్యతిరేకించడానికి కారణం వేరు. "సంఘ సంస్కారమును, అభ్యుదయాన్ని, వాంఛించని వారెవరు ? సాధించవలసిన ధ్యేయం రెండు పక్షాలవారికిని ఒకటే అనడం నిశ్చయము. కాని, సంస్కరించవలసిన అంశములెట్టివి, సంస్కారము ఏ మార్గముల ననుసరించిజరుగవలెను అనే విషయములో మాత్రమే అభిప్రాయ బేధం కలదు." అని అతడు వ్రాసియున్నాడు.

ఇండియాలో ఆకాలమందున్న పరిస్థితులలో, సంస్కార ప్రయత్నం కేవలము, వినాశాన్నిమాత్రమే తెచ్చిపెట్టుతుంది. సామాజిక నిబంధనలను సడలించడంమాత్రమే జరిపి, వాటి స్థానములో ఇతరములను స్థాపించకపోవడంవల్ల, నష్టంమాత్రమే సిద్ధిస్తుంది. పరప్రభుత్వపు సహాయంతో శాసనరీత్యా సంస్కారాలను ప్రవేశపెట్టడంకంటె, ప్రజలకు సంస్కరణాలపట్ల అభిమానం కలిగించి సాధించడం శ్రేష్ఠమైన పద్ధతి అని ఇతని అభిప్రాయము. అన్ని విధములైన దేశాభ్యుదయాలకూ పరప్రభుత్వమే ప్రతిబంధకమని ఇతని దృఢభావం. కనుక, పరప్రభుత్వాన్ని ప్రతిఘటించడానికి తగిన నిర్మాణ విధానానికి పూనుకోవడమే ప్రస్తుత మవసరమైన కృషి. మత సాంఘిక పునర్నిర్మాణం, ఇప్పుడంత అవసరము కాదు. స్వపరిపాలన సిద్ధించేవరకు, కులభేద నిర్మూలనము, స్త్రీ పురుషులకు సమానములైన స్వత్వాదులను కల్గించడము, ఆవశ్యకము కాదని వాదించినాడు. రాజకీయ స్వాతంత్ర్యానికంటె ముందుగనే సంస్కారాలు అవసరమనేవాదాన్ని అతడు అంగీకరించలేదు. సామాజిక వ్యవస్థలో జరుగవలసిన పరివర్తనాని కతడు వ్యతిరేకి కాడు. కాని, దానిని రాజకీయాభివృద్ధి ప్రయత్నముతో ముడివేయడం అతని అభీష్టముకాదు. అంతేకాక, సంస్కరణోద్యమంవల్ల ప్రజలలో చీలికలు ఏర్పడే అవకాశముకూడా లేకపోలేదు. అట్టి విభేదాలే ఏర్పడితే, స్వాతంత్ర్యోద్యమము వెనుకబడి, ప్రధానమైన మన ఆశయసిద్ధికే భంగము కలుగవచ్చు.

రాజకీయ ప్రయోజనముల సాధనకు, సార్వజనికమైన క్రియాత్మక ప్రయత్నము ప్రధానమైనదని గుర్తించినవాడు తిలక్. కనుక, దేశప్రజలనందరిని ఒక సంస్థ కిందికి తెచ్చుటకు పూనుకొన్నాడు. ఆ ఉద్దేశంతో, సార్వజనీనమైన గణపతి ఉత్సవాన్ని, శివాజీస్మారకోత్సవాన్ని అతడు ప్రారంభించెను. పూర్వులు సాధించిన మహత్కార్యాల స్మరణను ప్రజల మనస్సులలో ఉద్బోధించడము శివాజీ స్మారకదినోత్సవ ప్రయోజనము. హిందూమతము కేవలము ధ్యానమననాదులతోకూడిన, రహస్య గర్భితమైన, పరలోక భావప్రధానమైన మతంకాదని, విద్యావంతులైనవారు క్రియాత్మకాచరణతో కూడిన జీవనమునకు పూనవలసిందని ప్రోత్సహించెను. తన ఈ అభిప్రాయాన్ని ప్రదర్శించి, సమర్థించే ఉద్దేశ్యముతో, భారతీయులు ఆత్మోన్నతికై నిత్యమూ పఠించే భగవద్గీతకు, విపులమైన వ్యాఖ్యానమును రచించి, తన అభిప్రాయాలు గీతాభావాలకు ఎట్లు అనుగుణమైయున్నవో నిరూపించెను. ఈ విధమైన మత విషయక ప్రోద్బలము మహారాష్ట్రులలో గొప్ప సంచలనాన్ని తెచ్చింది. దేశమందలి ఇతర భాగాలలో జరుగుచున్న భారత పునరుద్ధరణ ప్రయత్నాలకు బలంచేకూరింది. కాని, ఒక మతవర్గంవారిలో జరిగిన అభ్యుదయంవల్ల ఇతర మతవర్గాలవారిలో భీతీ, సంశయాలూ ఉత్పన్నంకావడము, దేశదురదృష్టము.

బెంగాలు మహారాష్ట్ర ప్రాంతాలలోని హిందువులలో మత సాంఘిక సంస్కరణోద్యమాలను, ఉత్తర భారతముస్లిముల ఉద్యమాలను, పశ్చిమ భారత పార్సీల ఉద్యమాలను, తదితరుల ఉద్యమాలను, సృష్టికిదెచ్చిన ప్రజల మనఃపరిపాకము, భారతదేశమంతటికీ సాధారణమైనది. దేశపు అన్ని ప్రాంతాలలోను, అన్ని వర్గాలలోనూ, ఒక భావసంచలనం కలిగింది. బెంగాలులోను, మహారాష్ట్రములోను జరిగిన ఈ సంఘటనలు, గుజరాతులో కూడా జరిగినవి. కాఠియవారు ప్రాంతంలోని, మోర్వి అనే చిన్న సంస్థానములో సామవేది బ్రాహ్మణ కుటుంబములో, మూల్ శంకర్ జనించెను (1824). ఇతడు అసాధారణమైన, విశిష్ట సంస్కర్తగా అభివృద్ధిజెంది, తరువాతికాలంలో దయానంద అనే పేరుతో ప్రసిద్ధి చెందినాడు. బాల్యములో ఇతని మనఃప్రవృత్తినిర్దాక్షిణ్యమైనది. ఇతరులకు లోబడియుండని స్వభావమితనిది. విగ్రహారాధనను విసర్జించి, పదునాల్గేండ్ల ప్రాయము నాడే, ఇతడు తండ్రితో, వ్యతిరేకించెను. వివాహ బంధనములనుండి తప్పించుకోడానికై, ఇతడు ఇంటిని వదలిపెట్టి, తన ఆత్మోద్రేకాన్ని, ఆత్మకల్లోలాన్ని ప్రశాంతిపరచుకొనే నిమిత్తం, దేశపర్యటన మారంభించెను. పదునైదేండ్ల కాలం విద్యార్థిగా దేశంలో తిరుగుతూ, జీవిత సంశయాలనన్నిటినీ నిర్మూలించడానికి సమర్థమైన జ్ఞానసిద్ధికై, అన్వేషణ గావించినాడు. ఈ అన్వేషణ ప్రయత్నంలో ఇతడు హిమాలయ పర్వతాంతర్భాగాలలోను, వింధ్య, ఆరావళి, పర్వతాలలోను, ఆ పర్వతాల సానుప్రదేశాలలోను, గంగా, యమునా, నర్మదానదీ తీరప్రాంతాలలోను తిరిగినాడు. సంస్కృతభాష, వ్యాకరణము, తత్త్వశాస్త్రము, మతధర్మశాస్త్రాలు,- వీటన్నిటిలోనూ, అఖండమైన పాండిత్యాన్ని, అధికారాన్ని సాధించు

కొన్నాడు. పిమ్మట, మధురలో రెండున్నర సంవత్సరాల కాలము, అంధుడైన విరజానందస్వామికి శిష్యుడుగా నిలిచి, వేదముల తత్త్వార్థాన్ని గ్రహించెను. భారతీయ ప్రాచీనవిద్యలో అఖండుడైన విద్వాంసుడు విరజానంద. వ్యుత్పత్తిగల అధ్యాపకుడు, హేతువాదముననుసరించిన పర్యాలోచన శక్తిగలవాడు, ఐన, విరజానంద, విగ్రహారాధనను, మూఢవిశ్వాసములతో కూడిన ఆచారాలను, అనేక దేవారాధన పద్ధతిని, వ్యతిరేకించినవాడు. వేదముల తాత్త్వికార్థాన్ని వ్యాఖ్యానించి, దయానందకు బోధించి, హిందూమతమును విశుద్ధిగావించే బాధ్యతనతనిపై మోపెను. హిందూ మతములో చేరియున్న, అసంగత విషయాలను తొలగించడము, మతము అనుసరించిన అపగతులను తప్పించి దానిని సక్రమమార్గములో పునఃస్థాపించడము, ఇతనికి గుర్వాజ్ఞయైనది.

1863 లో, ప్రారంభమైన ఇతని ధర్మప్రవర్తక జీవితయాత్ర, ఇతని మరణ కాలంవరకూ (1883) నిరంతరమైన దీక్షతో సాగింది. ఈ ఇరవై సంవత్సరముల కాలమూ అనన్యసాధ్యమైన శ్రమతో, మహత్ప్రయత్నంతో, సాగిపోయింది. భారతదేశములో పర్యటించడము మత విషయక చర్చలను జరపడము, తన సందేశాన్ని ప్రచారం గావించడము, 'ఆర్యసమాజ' మును స్థాపించడము, గ్రంథములను రచించడము, సంఘ సంస్కారములను ప్రచారం చేయడము,-ఈ విధములైన కార్యక్రమాలన్నీ ఇతడు స్వయంగా జరిపినాడు.

దయానంద సాధారణ వ్యక్తి కాడు. దైవదత్తమైన ఇతని ప్రజ్ఞ, బుద్ధిశక్తి, సాధారణ మానవాతీతములైనవి. సంస్కృత విద్యలో అతనిని మించినవారెందరో లేరు. ఉపన్యాసకుడుగా సభ్యులను వశపరచుకోగలిగినవాడు. సహజమైన సమయస్ఫూర్తిగల దయానంద, సునిశితములైన సమృద్ధములైన వాదనలతో ప్రతిపక్షవర్గంవారిని నిశ్చేష్టులను గావించేవాడు. వెనుకంజ వేయని నిష్ఠురమైన ఇతని శీలం, ప్రబలమైనట్టిది. సహజసిద్ధుడైన ప్రజానాయకుడు. ఆత్మ ప్రత్యయము, నిష్కర్షమైన అభిప్రాయములు, ఇతని సహజ లక్షణములు. ఇతని ప్రవర్తి ఒకప్పుడు ఔద్ధత్యంగాకూడా గోచరించేది. ఇతని భావాలు, ప్రస్ఫుటములైనవి, నిష్కర్షమైనవి. అవాస్తవికతా, అస్పష్టతా, గూఢార్థభావనా, - ఇట్టివాని కితని మనస్సులో, భావములలో, ఆస్కారము లేదు. జాన్ కాల్విన్ (John Colvin) ప్రదర్శించినంత సువ్యక్తతతో, తన మత సిద్ధాంతాలను సూత్రాలను నిర్వచించినాడు. కనుక, ఇతరుల అభిప్రాయములతో సమన్వయం గావించవలసిన ప్రసక్తే లేకపోయింది. మార్టిన్ లూథర్ వంటి, నిష్ఠుర వ్యక్తిత్వ మితనికి స్వభావసిద్ధమైనట్టిది. సమస్తములైన మత సమస్యలను పరిష్కారమొనర్చేది, వ్యక్తియొక్క సదసద్వివేచనశక్తియని ఇతడు నిశ్చయించెను. అసంఖ్యాకములై యున్న హిందూ మత ధర్మశాస్త్రములనుంచి, అధికార గ్రంథాలను ఏరితీసుకోవడం, ఇతని వైయక్తిక నిశ్చయాన్నిబట్టి జరిగింది. తార్కికమైన ఆత్మ నిర్ణయము ఆధారమయింది. అదికాక, ఈశ్వరుని ఏకైకత్వాన్ని ప్రతిపాదించే సిద్ధాంతాలను, శాస్త్రాధారాలను ఎన్నుకోవడం, హిందువుల అనేక దేవతాత్వాన్ని, దేహాంతరప్రవేశ,

కర్మసిద్ధాంతములను ఖండించడం, మానవుడు, ప్రకృతి, దేవుడు, - అనే మూడు భావములకుగల పరస్పర సంబంధ కల్పన, - ఇత్యాదులన్నియు ఇతని పరిశీలన ప్రక్రియవల్లను, తార్కిక విచారమువల్లను, సిద్ధించినవే. సంప్రదాయములపైనను, చరిత్రపైనను, ఇతడాధారపడలేదు.

హిందూమతము, దాని కాధారములైన వేదములు, నిత్యములు, అవికల్పములు, అమోఘములు, దివ్యములు, అని అతని విశ్వాసము. వేదమతమొక్కటే సత్యమైనది, విశ్వవ్యాపకమైనది. దైవ నిర్దిష్టులైనవారు ఆర్యులు ; దైవ నిర్దిష్టమైన ధర్మశాస్త్రము వేదము ; దైవ నిర్దిష్టమైన భూమి భారతభూమి, తక్కిన మతములన్నీ అసమగ్రములే. తక్కిన మతములవారిని హిందూమతమునకు మార్చడం 'ఆర్యసమాజ' కర్తవ్యము.

'ఆర్య సమాజము' పాటించవలసిన సాంఘిక ప్రవృత్తులను నైతిక ప్రవృత్తులను దయానంద క్రోడీకరించెను. ఈ స్మృతి గ్రంథమునుబట్టి జన్మసిద్ధమైన కుల భేదము, సంఘములోని వర్గభేదము, స్త్రీ పురుష తారతమ్య భావము,- అనేవి పరిహరింపబడినవి. ఆధ్యాత్మిక జీవితమునకు, నైతిక జీవితమునకు సంబంధించినంతవరకు, "వేదములపై ఆధారపడుము" - అనునది ఇతని ప్రచార ఘోషణ వాక్యము. ఐనను, పాశ్చాత్య విద్యాధ్యయనము, విజ్ఞానశాస్త్రబోధ, ఆర్థిక సంఘ పరిస్థితులనుబాగుపరచి, పెంపొందించడము అనే విషయములు ఇతనికి అభిమతములు.

ఇతడు బొంబాయిలో స్థాపించిన (1875) ఆర్యసమాజము వేగంగా అభివృద్ధి చెందింది. ఉత్తర భారతములోని పెక్కు ప్రాంతాలలో సమాజ శాఖలు నెలకొన్నవి. పంజాబ్, ఉత్తరప్రదేశ్, రాజస్థానములు సమాజ కార్యక్రమాలకు ప్రధానరంగములైనవి. మధ్యతరగతివారూ, క్రిందివర్గాలవారూ, దీని ప్రభావమున కెక్కువగా లోనైరి. సంఘములో, సంస్కారావశ్యకము నెక్కువగా ప్రబోధించినది సమాజం. కాని, కుల భేదాల నిర్మూలన విషయంలో మాత్రం సమాజ ప్రయత్నం ఫలింపలేదు. భారతీయ ప్రాచీన సంస్కృతిలో ప్రజలకు ఆసక్తి కలిగించడము, సమాజము సాధించిన గొప్ప ప్రయోజనము. ఆర్య మతాన్ని ప్రచారం గావించడానికి, ఉద్రేకపూరితమైన ఉత్సాహంతో పూనుకోనే ప్రయత్నాని కిది ప్రోద్బలమిచ్చింది. ఈ ప్రయోజన సాధన నిమిత్తం, ఆర్యసమాజము విద్యాలయాలను నెలకొల్పి, వాటి నిర్వహణకై ధనాన్ని నిలువచేసి ఇచ్చింది. ఉన్నత విద్యా ప్రసారమునకై కళాశాలలను, ఉన్నత పాఠశాలలను, స్త్రీజన విద్యా సంస్థలను, ప్రాచీన పద్ధతులలో సనాతన విద్యా సంస్థలను, సమాజము స్థాపించింది.

ఆర్యసమాజ కార్యక్రమాలలో కొన్ని వివాదాత్మకములైనవి. దయానంద అవలంబించిన మార్గము ఇతర హిందూ సంస్కర్తలమార్గమునకు విభిన్నమైనది. ఆత్మరక్షణ విధానాన్నివదలి, ఇతర మతఖండనమార్గాన్ని అనుసరించినాడితడు. క్రిశ్చియనులు, ముస్లిములు గావించుచుండిన విమర్శనలకు సమాధానమిస్తూ, హిందూమతాన్ని సమర్థించుచుండినారు ఇతర సంస్కర్తలు. ఇప్పుడితడు

వారి మతములనే తీవ్ర విమర్శకు గురిచేసి, వాటిని సమర్థించుకొనే పని వారికే కలిగించెను. ఇతడు రచించిన, 'సత్యార్థ ప్రకాశ్' అనే గ్రంథము ఇతర మతములను గూర్చిన వివాదములను చర్చలను ఉత్పన్నం గావించింది. కనుక, మత విభేద భావాలు తీవ్రములై పరస్పర ద్వేషభావాలు వృద్ధియైనవి.

ఆర్యసమాజ కార్యక్రమాలలో, తీవ్రమైన మత కలహాలకు దారితీసినది 'గోరక్షణ' ప్రయత్నము. 1882, గోరక్షాసమితి ప్రారంభింపబడింది. ఈ విషయమై ప్రచారకులు నియుక్తులైరి. వధ్యశాలనుండి గోవులను రక్షించే నిమిత్తం ధనమును సేకరించిరి. గోవు హిందువులకు పూజనీయమైనది. అంతేకాక, ఆర్థికంగా, సంఘానికి ఎక్కువ ప్రయోజనకారి కూడ. కనుక, గోరక్షా సమితి ఉద్యమానికి ప్రజాదరణ సిద్ధించింది. కాని, సమాజ ప్రచారకులలో కొందరు అత్యుత్సాహవంతులు సమితి కార్యక్రమ నిర్వహణలో ఉద్రేకమును ప్రదర్శించి, అన్యమతస్థులకు ఆగ్రహము కలిగించిరి. ఉద్యమానికి పలువురు హిందువులేకాక, అనేకులు ముస్లిములు కూడా సానుభూతి సహకారముల నిచ్చుచుండిరి. కాని, అతిసులభ సంవేగులైన (Hypersensitive) ముస్లిము ధర్మశాస్త్రజ్ఞులకు, వారి అనుయాయులైన దరిద్ర వర్గంవారికి, ఆగ్రహం కలిగింది. తత్ఫలితంగా రెండు మతస్థులవారికీ మధ్య తీవ్రములైన దొమ్మికలహాలు చెలరేగినవి. అందువల్ల, రెండు మతస్థుల మధ్యా విభేద భావాలు బలపడినవి.

ఈ విషయమెట్లున్నా,- దయానంద ప్రారంభించిన ఆర్య సమాజోద్యమము హిందువులలో ఆత్మప్రత్యయభావాన్ని ఉద్బోధించింది. భారతీయుల ఆత్మవిశ్వాస, ఆత్మగౌరవాలను బలపరచి, స్వశక్తిపై ఆధారపడవలెననే కోరికను, ప్రయత్నాన్ని కలిగించింది.

"దయానంద సరస్వతి విశాలాశయములు గల వ్యక్తి అని, అతడు నిర్వహించిన కార్యక్రమాలనుబట్టి, వ్యక్తమవుతుంది. మహోన్నతమైన భారతదేశ భవిష్యత్తును స్వప్నంలో సందర్శించిన వాడతడు. మూఢవిశ్వాసాలను విసర్జించి, విజ్ఞానశాస్త్ర సత్ఫలములతో సమృద్ధమై, ఏకైకుడైన భగవంతుని ఆరాధిస్తూ, స్వపరిపాలనకు సమర్థమై, ఇతర సోదర జాతులలో తన స్థానాన్నిపొంది, తన ప్రాచీనమైన వైభవాన్ని మళ్ళీ ప్రతిష్ఠించుకొన్న భారతదేశ భవిష్యత్స్వరూప మతనికి, మనస్సులో స్పష్టంగా గోచరించింది." అని డాక్టర్ గ్రిజ్‌వోల్డ్ (Dr. Griswold) వ్రాసినాడు. ఆంగ్లమిషనరీ గావించిన ఈ ప్రశంస, అమూల్యమైనది. ఆర్యసమాజ కార్యక్రమాలను అభిమానించని సంస్థకు చెందిన, పర మతస్థుని వాక్యాలు కావడంవల్ల, దయానంద సరస్వతియొక్క నిజ స్వరూపము, అతడు నిర్వహించిన కార్యభారంయొక్క విలువ మహోన్నతములని, నిశ్చయమవుతుంది.

## VIII. దివ్యజ్ఞాన సమాజోద్యమము, బ్రహ్మవిద్యాఉద్యమము (థియోసఫీ ఉద్యమము)

ఆర్యసమాజం ప్రతిపాదించిన సిద్ధాంతంకంటెను, ఎక్కువ ప్రాచీనము,

ఎక్కువ రహస్యగర్భితము అయిన, వేరే మతఉద్యమము, ఇదేకాలంలో ప్రారంభించబడింది. విద్యావంతుల సంఘంలో, ఇది ఎక్కువ వ్యాప్తిచెందింది. మాడమ్ బ్లావాట్స్కీ, కల్నల్ ఆల్‌కాట్ (Madame Blavatsky and Col. Alcott) అనేవారు స్థాపించిన బ్రహ్మవిద్యాసంస్థ (Theosophy) ఇది. స్వామీ దయానంద సరస్వతి, ఆర్యసమాజాన్ని స్థాపించిన సంవత్సరమే (1875), ఈ సంస్థ న్యూయార్కులో స్థాపితమయింది. ఈ సంస్థ స్థాపకులు ఇండియావచ్చి (1879 జనవరి) మదరాసు నగరంలోని అడయారులో, తమ సంఘాన్ని స్థాపించుకొన్నారు. (1822 డిశంబర్) దాని శాఖలు భారతదేశమంతటా శీఘ్రంగా వ్యాపించినవి. 1888 లో ఆనీబెసెంటు (Anne Besant) లండనులోని ఈ సంస్థలో ప్రవేశించింది. ఆమె సంఘంలో చేరడం, ఉద్యమానికి మహోపకారకమయింది. బెర్నార్డ్ షా, స్టెడ్, సిన్నెట్, బ్రాడ్లా, (Bernard Shaw, w. T. Stead, A. P. Sinnet, Bradlaugh). మొదలైన అభ్యుదయవాదులు, వివేకులు, శ్రామికసంఘ నాయకులు, ఈమెకు పరిచితులైనవారే. సంఘంలో చేరినపిమ్మట, ఐదు సంవత్సరాలు అధ్యయనంలోనూ, బోధనలోనూ గడిపింది. 1893 లో అమెరికావెళ్ళి, చికాగాలో జరిగిన ప్రపంచ మత సమావేశాన్ని సందర్శించింది. అంతటితో, భారతదేశంలో శాశ్వతనివాసం ఏర్పరచుకోవలెననే నిశ్చయము, ఆమెకు కలిగింది. తన దేశస్థుల కంటెను, భారతీయులు, భారతదేశము, తన భావాలకు ఎక్కువ సన్నిహితములని, ఆమెకుతోచింది. "నాహృదయం మీతోఉన్నది. పూర్వజన్మలో నేను మీదాననే" అని ఆమె ప్రకటించింది. 1893 లో ఆమె ట్యూటికొరిన్ ప్రవేశించింది. నాటి నుంచి ఆమె భారతదేశాన్ని, తుపానువలె ముంచెత్తివేసింది. ప్రతిచోటా, ఈమెకు ఆహ్వానాలూ, ప్రశంసలూ లభించినవి. ఈమె అసాధారణమైన వాగ్ధోరణి, విద్యావంతుల ననేకులను సంఘంలోకి ఆకర్షించింది. భారతీయులెందరో ఈమెను తమ అధ్యాపకురాలిగా, గురువుగా, అంగీకరించినారు. కొందరీమెను అవతారమూర్తి అనికూడ భావించినారు. సంఘ కార్యక్రమాలకు తీవ్రమైన ప్రోద్బలాన్నీ, శక్తినీ, కలిగించింది. సనాతన హిందూమతాన్ని సమర్థిస్తూ, భారతదేశమంతటా ఉపన్యాసాలిస్తూ, విద్యాసంస్థలను నెలకొలుపుతూ, తన బ్రహ్మవిద్యా (దివ్యజ్ఞాన) సిద్ధాంతాన్ని పుస్తకాల ద్వారా, కరపత్రాల ద్వారా, ప్రచారంగావిస్తూ తన సంఘ సిద్ధాంతాలను అభివృద్ధిగావిస్తూ దేశపర్యటనము సాగించింది.

థియోసఫీ సంఘం వారి సిద్ధాంతాలు, విచిత్రమైనవి. మతము, తత్త్వశాస్త్రము, గుహ్యవిద్య - ఈ మూటి యొక్క కలయికవల్ల ఏర్పడినది వీరి సిద్ధాంతము. వీరి మతబోధలో ప్రాధాన్యంవహించిన నాలుగు ప్రధాన సూత్రాలు: (1) దేవుని ఏకైకత్వము. (2) త్రిమూర్త్యాత్మకమైన దేవుని ఆవిర్భావము. (3) దేవతలు, దేవదూతలు, భూతములు, మానవ స్థితికంటెను కిందనున్న అంశాలు - అనే శ్రేణీబద్ధమైన వ్యక్తులు, (4) మానవవాభివృద్ధిలో వివిధ దశలలోని, తరతమ భావాలను గుర్తించిన, విశ్వమానవ సౌభ్రాత్రము.

తాత్త్వికంగా, ఈ సంఘము, ఆదర్శవాదాన్ని సమర్థిస్తుంది. జ్ఞానానికి

మహోత్కృష్టస్థానాన్నిస్తుంది. మానవుని భావప్రవృత్తి యొక్క స్వభావము దివ్యమైనదని విశ్వసిస్తుంది. మానవునిలోనున్న పశుప్రవృత్తిని, బాహ్యాపరిసరాలను, భావం జయించగలుగుతుంది. ఆత్మ నిత్యమైనది, అనశ్వరమైనది. అది ఒక దేహాన్ని విడిచి, ఇంకొక దేహాన్ని ధరిస్తూ, జీవితానుభవాన్ని సంగ్రహణం చేసుకొంటూ, క్రమంగా ఉన్నత స్థానాన్ని చెంది, ప్రపంచవిజ్ఞానాన్నంతటినీ సంపాదించుకొంటుంది. ఆపై, నేర్చుకోవలసినదేమీ ఉండదు. అప్పుడాత్మకిక జన్మమరణాలుండవు. ఇప్పుడు 'అమృతత్వానికది యోగ్యమై ఉంటుంది.

థియోసఫీ అవలంబించిన శాస్త్రము, గుహ్యావిద్య. ప్రసిద్ధులైన నిపుణులు పరిశోధించి, గ్రహించిన వాస్తవవిషయాలందులో ఉన్నవి. విశ్వసృష్టి, మనుజ సృష్టి, ఏర్పడిన విధానము, క్రియాప్రతిక్రియల నియమాలు, పరిణామము, మానవత్వం యొక్క శ్రేష్ఠత, - మొదలైనవన్నీ ఇందులోని భాగాలు.

ఇతర శాస్త్రాలు తర్కంపై ఆధారపడినవి. ఆధారకల్పన, ప్రయోగము, అనుమితి, అనే ప్రక్రియను అనుసరించేవి, ఇతర శాస్త్రాలు. థియాసఫీ సిద్ధాంతానుయాయులు ఈ మార్గాన్ని అనుసరించరు. అతీంద్రియ దృష్టి గల మధ్యస్థులను (మాధ్యమంగా) (media) వాహకులుగా చేసుకొనిరి. వారి అంతరోద్భవవల్ల సిద్ధించిన జ్ఞానము, వీరిసిద్ధాంతానికి అవస్థాపనగా ఏర్పడింది.

హిందువులలో విద్యావంతులైన వారనేకులు ఈ సిద్ధాంతానికి వశులై సమాజంలోచేరినారు. ప్రసిద్ధురాలైన ఒక పాశ్చాత్యస్త్రీ, హిందూమతాన్ని గూర్చి ఉపన్యసిస్తూ, క్రిశ్చియను మిషనరీలు, పాశ్చాత్య రచయితలూ, మూఢ విశ్వాసాలని, ప్రకృతి విరుద్ధాలని ఇది వరలో ఖండించిన విషయాలను సమర్థించడం కొందరిని ఆశ్చర్య పరవశులనుచేసి, సంఘంలోవాళ్లు చేరిపోయేటట్లుగా చేసింది. దీనివల్ల వీరికి ఆత్మశాంతి కలగడమే కాక, తమ మత సంస్కర్తల విమర్శలనుంచి రక్షణకూడా, సిద్ధించింది. ఈ సంఘంవారు ప్రతిపాదించిన గుహ్యా విద్యవల్ల, రహస్య గర్భితమ్ములైన అద్భుత యోగచర్యలు, వాస్తవాలు, సాధ్యాలు, అనే భావము ఏర్పడింది. సర్ విలియంక్రూక్, వంటి శాస్త్రజ్ఞులు గావించిన సమర్థన, వీటికి పోషకమయింది. థియాసఫీ బోధించిన సర్వమోక్షవాదము (Universalism) బుద్ధిశాలురైన వారికనేకులకు సంతుష్టి కలిగించింది. మతాలన్నీ సత్య ప్రతిపాదకాలే, మానవులందరు సోదరులు, అనే భావము అందరి మనస్సులనూ, లోగొన్నది. శ్వేతజాతులవారు తమ ఆధిక్యతను గర్వంగా ప్రతిపాదిస్తూ, హిందూ మతాన్ని అసహ్యాకరమైన విధంగా దూషించి, నిరసిస్తూ ఉన్న కలుషిత వాతావరణంలో, ప్రఖ్యాతి చెందిన, బెసెంటు వంటి ఒక పాశ్చాత్యస్త్రీ, హిందూ మతాన్ని ప్రశంసించడం, హిందూసంఘంలో అభిమాన భావాలను, ఉద్బుద్ధం చేసింది. "హిందూమతాన్ని, హిందూదేశాన్ని, హృదయపూర్వకంగా నేను అంగీకరించినాను. నేను భారతీయురాలినైపోయినాను. ఆధ్యాత్మిక జ్ఞానానికి అత్యున్నతమైన గౌరవాన్ని ఇచ్చిన, నాగరికత, ఆధ్యాత్మిక సత్యాన్ని పూజించి, దానికై సాధన కావించిన నాగరికత భారతీయులది. సనాతన తత్త్వశాస్త్ర

పాండిత్యంతో, సనాతన మతంతో చైతన్య వంతమై ఉండే, భారతదేశ పునర్నిర్మాణానికి, నా జీవితాన్ని ధారపోస్తాను. ప్రపంచంలోని ఇతర దేశములన్నీ ఆధ్యాత్మిక జీవితమంటే ఎటువంటిదో భారతీయుల నుంచి గ్రహించవలసియున్నది." ఈమె వాక్యాలు సూటిగా విద్యావంతుల హృదయాలలోనికి చొచ్చుకొని పోయినవి. అన్నిటి కంటెను ముఖ్యంగా, భారతీయుల మెప్పును, అంగీకారాన్ని సంపాదించిన విషయము, విద్యా విషయకంగా ఈ సంఘము చేసిన సేవ. బనారసులో 'కేంద్రీయ హిందూ కళాశాల'ను స్థాపించడం (1898), ఈ సంఘము పూనుకొని నిర్వహించిన కార్యక్రమాలలో, మిక్కిలి విశిష్టమైనది. హిందూ మత బోధ, ఈ కళాశాలా ప్రణాళికలో ఒక భాగము. ఇంగ్లాండు పౌర పాఠశాల ఉత్తమ లక్షణాలను, ప్రాచీన భారతదేశపు గురుకుల శిక్షా విధానాన్ని, ఈ కళాశాల మేళనమొనర్చి, అనుసరించింది. ఈ విధంగా, చక్కని గురుశిష్య సంబంధము ఈ కళాశాలలో ఏర్పడింది.

బాలురకు, స్త్రీలకు, నిమ్న జాతులవారికీ, థియాసఫీ సంఘము, పాఠశాలల నేర్పరచింది. బాలచమూ సంఘ (Scout movement) కార్యక్రమాలలోకూడ, సంఘం పాల్గొన్నది. బాల్యవివాహాలను ప్రతిఘటించింది. కులతత్త్వ నిర్మూలనము, నిమ్న జాతులవారి ఉద్ధరణము, విధవల పరిస్థితులను బాగుపరచడం,- అనే సంస్కరణోద్యమాలను సంఘం సమర్థించింది. జాతి వర్ణ విభేదాలను, తత్సంబంధమైన దురభిప్రాయాలను, సంఘం నిరసించింది. 1903 నాటికే, బెసెంటు తన రాజకీయ భావాలను ప్రకటించింది. "భారతీయుల అభిప్రాయానుగుణంగా, దేశపరిపాలన జరగవలె. భారతీయ సంప్రదాయాలు, భారతీయుల భావాలు, అభిప్రాయాలు, పరిపాలకులు గుర్తించవలసి ఉంటుంది."

భారతీయుల ఆత్మాభిమానాన్ని, ఆత్మగౌరవాన్ని ఉద్బోధించడంలో, థియోసాఫీ సంఘం ప్రబల సాధనమయింది.

## IX సమాజంపై కలిగిన సంఘట్టనము

పందొమ్మిదో శతాబ్దంలో భారతదేశాన్ని ప్రవాహరూపంలో ముంచివేస్తూ ఉన్న ఆధునిక మానవతా భావము, హిందూమతంలోని ఉత్కృష్ట భావాలు, చక్కగా మేళవించి రామకృష్ణ, వివేకానంద, దయానందులలో నెలకొన్నవి. నూతనమైన ఒక ఉత్తేజనము, దేశంలో వ్యాపించినది. దాని ప్రాబల్యానికి లోనై, మధ్యయుగాల వ్యవస్థా స్వరూపాలు, సడలిపోజొచ్చినవి. ప్రతివ్యక్తీ తన ప్రయోజనాన్ని, సంఘంపట్ల తనకుగల బాధ్యతను, గుర్తించినాడు. తనకు తన కుటుంబానికి, తనకులానికి, వర్గానికి మాత్రమే, ఇంతవరకు పరిమితమై ఉంటూ వచ్చిన, తన సంఘపరిధులు, విశాలములు కాజొచ్చినవి. పూర్వపు అవధులను అతిక్రమించి, వ్యక్తి, విశాల ప్రపంచంతో చేరి, ఒక్క సమగ్ర సంస్థగా ఏర్పడే పరిస్థితి, సిద్ధించింది. జాతిమత భేదాలను అధిగమించి, దేశవాసులందరూ, ఒక జాతికి చెందినవారనే భావము, సంస్కర్తలు దేశంలో తలయెత్తక

పూర్వమే, విద్యావంతుల హృదయాలలో తలచూపినది. కాని, మతాన్నీ, రాజకీయాలనూ వేరు పరచడం లౌకిక సమాజ స్థాపనకు అగత్యమైన ఆధారమనే భావము, కొందరికి మాత్రమే కలిగింది.

సాంఘిక పరివర్తనంతోపాటు, ఆదర్శాలలోను, జీవితాచరణలోను కూడా, మార్పులు రావడం సహజమే. బ్రిటిషుపరిపాలనయొక్క సంఘట్టనంవల్ల మధ్య తరగతులలోని విద్యావంతుల మనోభావాలు, వారి దృక్పథము, పరివర్తన మొందినవి. ఆధునిక భావావరణంవల్ల కలిగిన ఈ పరివర్తనం కారణంగా, జీవితాచరణలలో కూడా కొన్ని అంశాలలో మార్పుకలిగింది. కాని, సమస్త దేశ ప్రజల ఆర్థికస్థితిని, అందులో ముఖ్యంగా గ్రామీణులైన ప్రజానీకంయొక్క ఆర్థిక స్థితిని,- బ్రిటిషు ప్రభుత్వము, ఏ మాత్రమూ మార్చక, జడతాస్థితితో వదలివేసింది. తత్ఫలితంగా వారి అలవాట్లు, ఆచారాలు, ఏ మాత్రమూ, పరివర్తనం పొందక పూర్వపు స్థితిలోనే నిలిచిపోయినవి. రాజారామ్‌మోహన్ రాయ్‌తో ప్రారంభమైన సంస్కరణోద్యమాలు, విద్యావంతులలో మాత్రమే కొంత పరివర్తనాన్ని కలిగించినవి. ప్రజానీకంపై ఈ ఉద్యమాలకేవిధమైన ప్రభావమూ లేక పోయింది కనుక వారు సంప్రదాయ పద్ధతులనే అనుసరిస్తూ, సంప్రదాయ జీవితాన్నే, గడుపుతూ, వచ్చినారు. గ్రామసీమల పరిస్థితులలో, మార్పులను తెచ్చిన పరిపాలనవిధానాలవల్ల, నూతన ఆర్థికాభివృద్ధి సిద్ధించలేదు. వ్యవసాయము, పరిశ్రమలు, నైపుణ్యాను ఉత్పాదన పద్ధతులు, మధ్యయుగకాలపు స్థితిలోనే, నిలిచిపోయినవి. కనుక, మధ్యయుగాల వ్యవస్థ అట్లే నిలిచిపోయింది. పెట్టుబడి వ్యవస్థ, పారిశ్రామిక వ్యవస్థ, అభివృద్ధిచెందక, కుంఠితమైపోయినవి. పరిస్థితులీవిధంగా ఉన్నప్పుడు, సాంఘిక వ్యవస్థ, స్తబ్ధమై నిలిచిపోవడం తప్పనిసరి.

ఆర్థికపరిణామానికి సూచకమైన పట్టణాల అభివృద్ధి మందగించింది. జనాభా అంతా, అత్యధికభాగము గ్రామ సీమలలో కేంద్రీకరించింది. 1881 నుంచి 1911 వరకు, అంటే, 30 సంవత్సరాల కాలంలో, పట్టణాలలోని జనసంఖ్య, జనాభాలో, 10 శాతానికి మించలేదు. కనుక, గ్రామసీమలలోని సంప్రదాయ జీవితము, ఏ విధమైన పరివర్తనానికీ లోనుకాలేదు. మధ్యతరగతులవారితో సహా, పట్టణవాసులుకూడా, ఏకొందరోతప్ప, ప్రాచీన పద్ధతులలోనే జీవిస్తూ వచ్చినారు.

కులవ్యవస్థకు, వృత్తితోను, ఆర్థిక క్రియలతోను, లంకె ఏర్పడి ఉన్నది. ఆర్థిక క్రియాకలాపము పాత పద్ధతులలో నడుస్తూ ఉన్నంతకాలమూ, ఆర్థిక వ్యవస్థలోను, జీవితవ్యవస్థలోను మార్పు కలుగదు. కులతత్త్వము, సంప్రదాయాలు, ప్రబలములై ఉన్నందువల్ల, సంస్కరణానుయాయులైనవారుకూడా, సంప్రదాయ శృంఖలాలనుంచి విముక్తి పొందలేక పోయినారు. ఉదాహరణకు, - బ్రాహ్మసమాజీయులు విగ్రహారాధనను పరిత్యజించినవారు. ఐనా, టాగోరు కుటుంబంవారు, ప్రతి సంవత్సరమూ దుర్గాపూజను ఎక్కువ వైభవంతో, జరుపుతూ వచ్చినారు. ఆర్యసమాజంవారు కుల భేదాలను నిరసించినవారు. ఐనా, కులాంతర వివాహాలకు బూనుకొనే ధైర్యం ఎందరికో లేకపోయింది. పరిస్థితి,

నైతికంగా స్వస్థమైనది కాదు. నైతిక ప్రమాణంలో, ఇది, ద్వైధీభావాన్ని కలిగించింది. గృహంలో పాటించేది ఒకటి, బైట చెప్పేది ఇంకొకటి అయింది.

హిందూ ముస్లిము సంస్కరణోద్యమాలు, తమ మతస్థులను అఖిలభారత సంస్థలుగా, ఏర్పరచడానికి ప్రవృత్తమైనవి. మధ్యయుగకాలంలో, భిన్నభిన్నములుగా వేర్వేరు ప్రాంతాలలో ఛిద్రములైపోయిన, వివిధ సంస్కృతీవర్గాల నన్నిటినీ ఒక సమగ్ర సంఘంగా, ఏర్పరచే ప్రయత్నాన్ని, రెండు మతాలవారూ తమ ఉద్దేశంగా చేసుకొన్నారు. ఈ విధమైన మతాంతరంగిక సంయోజనము పందొమ్మిదో శతాబ్దంలో ఎక్కువగా అభివృద్ధి చెందింది. అన్ని మతాలవారినీ, రాజకీయంగా సంయోజనపరచి, జాతీయసంస్థగా ఏర్పరచే ప్రక్రియకూడా సమవేగంతో అభివృద్ధి చెందుతూ వచ్చింది. దేశంయొక్క ఆర్థిక హీనస్థితి, జనానీకంయొక్క మధ్యయుగాల దృక్పథము, వారి విద్యావ్యాప్తిపట్ల ప్రభుత్వ మవలంబించిన నిర్లక్ష్యభావము, - ఇవి జాతీయ భావాభివృద్ధికి ప్రతిబంధకములై ఉన్నప్పటికీ, విద్యావంతులైనవారిలో అనేకులు ఈ విషయంలో ఒకే భావము, ఒకే విధమైన ప్రతిపత్తి కలవారై ఉండటం జరిగింది. అనేక జాతులకు, భాషలకు, సంస్కృతులకు, మతాలకు ఆకరమై ఉన్న ఈ విశాలదేశంలో, లౌకికమైన ఆధారంపైన మాత్రమే స్వతంత్రమైన ప్రభుత్వం ఏర్పడగలదని, వారు గ్రహించినారు. కాని, పందొమ్మిదో శతాబ్దపు రెండోభాగంలో ఉప్పతిల్లిన అతి భావనాత్మక మతోద్యమాలు, ప్రజల మనస్సులను మత ప్రవాహంవైపు మరల్చడంవల్ల, లౌకికమైన జాతీయోద్యమ శక్తి సన్నగిల్లింది.

మతసంస్కరణోద్యమాభివృద్ధి, హిందూ ఇస్లాము మతాలు రెంటిలోనూ, సమవేగంతో జరుగుతూ వచ్చింది. ఉదారవాదాలూ, సంస్కరణ ప్రతిఘటన ప్రయత్నాలూ, రెండు మతాలలోనూ ప్రబలినవి. వీటికి ప్రేరకశక్తులు, రెంటిలోనూ, సదృశమైనవే. తమ మతం యొక్క ప్రాచీన వైభవాన్ని మళ్ళీ ప్రతిష్ఠించడం ప్రధానాశయము. తమ పూర్వికులు మహాసామ్రాజ్యాలను స్థాపించి, ఉత్తమ కళలను పోషించి, ప్రపంచ రాజ్యాలలో మరువరాని పేరుప్రతిష్ఠలు సంపాదించి ఉన్నారని, చరిత్రవల్ల తెలుసుకొన్నారు. అటువంటి తమ ప్రాచీన ప్రాభవంతో పోల్చిచూచినప్పుడు, తమ ప్రస్తుత స్థితి, శోచనీయమై, లజ్జాకరమై, ఉన్నది. తమ స్వాతంత్ర్యం నశించిపోయింది. తమ రాజ్యాల ప్రాభవగర్వాలను పరజాతులు మట్టిలో కలిపివేసినవి. తమ పరిశ్రమలను నశింపజేసి, ప్రజలను దరిద్రులను చేసి, ఉన్నతవర్గాల వారిని విదేశీయుల ఆదరణకై ప్రాకులాడే బిచ్చగాండ్రగా చేసి, తమ నైతిక ఔన్నత్యాన్ని కుంఠితమొనర్చి, శక్తిసామర్థ్యాలను సన్నగిల జేసినారు, విదేశీయులు. హేయమైన తమ ప్రస్తుత పరిస్థితిని రూపుమాపి, నూతనమైన విశాల జీవనాన్ని సంపాదించుకోడానికై, రెండు మతాల వారూ తొందర పడుతున్నారు.

సాంస్కృతిక మత జీవనముల ప్రవృత్తి, పక్షపాత భావాలను ప్రతిపాదించే దేశచరిత్ర పఠనము, తమ ప్రస్తుత జీవితం పట్ల అసంతృప్తి, - వీటి కారణంగా

తమ భవిష్యజ్జీవితాన్ని ప్రాచీన దృష్టితో చూస్తున్నారు. కనుక, మతవిషయక మైన దృక్పథము, ప్రాచీన చరిత్ర స్మరణవల్ల మలినమైపోయింది. ఆర్థికరంగంలో రెండు మతాల వారికిని అన్యోన్య సహకారం లేకపోవడము, ఆ యా మతవర్గాల వారు, మధ్యయుగంలో వలె, ఒకరికొకరు దూరంగా ప్రత్యేక జీవనాన్ని గడపడం, ఈ విధమైన జీవితవిధానము గ్రామసీమలలో ప్రబలమై ఉండడం, - ఇత్యాదులు కారణాలు కాగా, రెండు మతాల వారినీ కలిపి ఒక సంఘంగా ఏర్పరచే పరివర్తనం సంభవించలేదు. తత్ప్రయత్నం కలుషితమైపోయింది.

అటువంటి పరిస్థితులలో, కులమత తత్త్వవాదం సమృద్ధిగా పెరగడానికి మంచి అదను లభించింది. పరిపాలకులైన విదేశీయులు దీన్ని బాగా పోషిస్తూ రావడంవల్ల, కులమత విభేదాలు దేశంలో పెచ్చుపెరిగినవి. తత్ఫలంగా, హిందూ జాతీయత అని హిందువులు, ఇస్లాము జాతీయత అని ముస్లిములు, భిన్న మార్గా లను అవలంబించినారు. దీనితో రెండుజాతుల వాదం (ద్విజాతి సిద్ధాంతము) ఏర్పడింది. హిందూ జాతీయత, ముస్లిము జాతీయత, అనే పదాలలో స్వవచన వ్యాఘాతం ఉన్నదనే భావము, ఈ వాదాన్ని లేవదీసినవారు గ్రహించలేదు. రాజ్యము అనేది కేవలము దేశానికి, లౌకిక వ్యవహారాలకు, రాజకీయాలకు, మాత్రమే సంబంధించినది. మతము, జాతి, భాష అనేవాటికి దీనితో ప్రసక్తి లేదు. అవి దీనికి అసంబద్ధములు కూడా. కాని, పందొమ్మిదో శతాబ్దంలోని ఇండియా ముస్లిములు, మధ్యయుగాల ముస్లిము ప్రభుత్వా లేర్పడి ఉన్న విదే శాలను, తనుకు ఆదర్శంగా చేసుకోవడం జరిగింది. ఆటోమన్ సామ్రాజ్యము అరబ్బు దేశాలపై ఆధిపత్యం వహించి ఉన్నది. స్వచ్ఛంద ప్రభువులైన కాజారులు ఇరాను దేశాన్ని పరిపాలిస్తున్నారు. మలయా, ఇండోనేషియాలు, బ్రిటీషుడచ్చి పరిపాలనలో ఉన్నవి. ఆధునిక భావాలు అప్పుడప్పుడే, వారి హృదయాలలో ఉదయిస్తున్నాయి. కాని, అంతర్జాతీయ ముస్లిముసంఘ మనెడి భ్రాంతి మూలకమైన వాంఛ, జాతీయభావాన్ని తల యెత్తనీయలేదు. కాబట్టి, మత సాంస్కృతిక విషయాలలో హిందూ ముస్లిములకు గల భేదాలను పురస్కరించుకొని, తమ సామ్రాజ్య ప్రయోజనాలను సాధించుకోవడము, బ్రిటీషు పరిపాలకులకు కష్టమైన పని కాదు. ప్రభువుల ఆదరము, వారు ఆశచూపిన ఉద్యోగాలూ, ఎక్కువ ఆకర్షకాలై, అప్పుడప్పుడే ఉదయిస్తున్న, జాతీయభావాన్ని అణగ ద్రొక్కినవి. అదీకాక, జాతీయభావము ఫలించడానికి, ప్రజలత్యాగము, శ్రమ, ఆవశ్యకాలు. దానివల్ల సిద్ధించే సద్యఃఫలమేదీలేదు. కనక, ప్రలోభం, వీరిని వశం గావించు కొంది. కులమతతత్త్వాల ప్రాబల్యము, ఈ విధంగా రెండు మతాలవారినీ, ఛిద్రం చేస్తూ ఉన్నా, పందొమ్మిదో శతాబ్దమంతటా జాతీయభావము క్రమంగా అభి వృద్ధి చెందుతూ వచ్చింది.

# 10
# విద్య - పత్రికలు

## I విద్య - (1858 - 1905)

ఇండియా సమాజములో పరివర్తనం తెచ్చి, జాతీయభావాన్ని పెంపొందించిన సంఘటనలలో, ఆర్థిక రాజకీయ ప్రభావాలు ప్రాథమికములు. వీటితో, సాంస్కృతిక, ఆదర్శాత్మక భావాలు కలిసి, రెండునూ ఏకంగా జాతీయోద్యమాన్ని ప్రోద్బలం గావించినవి. పందొమ్మిదో శతాబ్దపు ప్రథమభాగంలో, ప్రారంభింపబడిన మత సాంఘిక సంస్కరణోద్యమాలు, ఆ శతాబ్దమంతా, తీవ్రమైన ఉత్సుకతతో నడిచినవి; మనోభావ ప్రవృత్తులలో ప్రధానములైన మార్పులను కలిగించినవి మధ్యయుగాల దృక్పథంతో, ప్రపంచాన్ని చూచే ప్రవృత్తి పూర్తిగా మారిపోయింది. వ్యక్తిగా, సంఘంలోని ఒక భాగంగా మానవుని గుర్తించి, మానవ సమస్యలను పరిశీలించే ప్రక్రియ ఆరంభమయింది. ప్రకృతి, దేవుడు, - అనే వాటిని గూర్చిన భావాలుకూడా, పరివర్తనం పొందినవి.

ప్రాచీన మధ్యయుగాల భారతచరిత్ర పరిశీలనము, సంస్కృత విజ్ఞాన పునరుద్ధరణము, భారతీయులకు ఆత్మ ప్రత్యయాన్ని కలిగించినవి. స్వాతంత్ర్య నష్టంవల్ల ఏర్పడిన నిర్వేదనము, అవమానము తొలగినవి. కాని, ప్రజలలో ఐక్యభావాన్ని, దేశభక్తిభావాన్ని ఉత్పన్నంగావించి, పోషించినది ఆంగ్లవిద్యాప్రభావము.

భారత సమాజములో జరిగిన రెండు ప్రధాన పరివర్తనములకు, బ్రిటీషు పరిపాలన కారణమయింది. మధ్య తరగతిని సృష్టికి తేవడం మొదటిది. ఈ నూతన వర్గంవారి మధ్యయుగ దృక్పథాన్ని మార్చడం రెండవది. ప్రజానీకములోని అధికభాగము, - ముఖ్యంగా గ్రామసీమలలోనివారు, - సాంస్కృతికంగా, బుద్ధి వికాస విషయకంగా వెనుకబడి, సంకుచిత సంప్రదాయాలకు బద్ధులై యున్నారు. మధ్యయుగాల గ్రామీణవ్యవస్థ శిథిలమైపోయినప్పటికీ, దాని స్థానములో ఆధునికార్థిక వ్యవస్థ ఏర్పడలేదు. మత సాంఘిక సంస్కరణోద్యమాలు, విద్యావ్యాప్తి, ప్రబల శక్తులే. కాని, ప్రజల జీవనపరిస్థితులలో విప్లవాత్మకమైన పరివర్తనం కలిగితేతప్ప, సమగ్రమైన సాంఘిక పరివర్తనము జరుగజాలదు. కనుక, గ్రామీణ మధ్యయుగాలవారి ఒత్తిడి మధ్యతరగతి వర్గజీవితంపై భారమై నిలిచింది. కనుక, మనోభావముల విషయములో మధ్య తరగతులవారు, పందొమ్మిదో శతాబ్దపు వాతావరణములోఉన్నా, వీరి భావనాత్మక ప్రవృత్తులూ, సాంస్కృతిక

ప్రవృత్తులూ ప్రాచీన సంప్రదాయాల మార్గాన్నే అనుసరించినవి.

విద్యా సమస్య, మధ్య తరగతులవారిని, ప్రధమంలోనే ఆకర్షించింది. భిన్నాభిప్రాయములు కలవారుకూడా ఆధునిక విద్యయొక్క ఆవశ్యకాన్ని గుర్తించి, పాశ్చాత్య విజ్ఞాన విషయాలను, ఆంగ్ల భాషను బోధించే పాఠశాలలను కళాశాలలను స్థాపించినారు. కాని, ఈ నూతన విషయాలను బోధించడానికి సమర్థులైన అధ్యాపకులు, ఈ సంస్థలను పోషించడానికి అవసరమైన ధనము తగినంత లభింపలేదు. కనుక విద్యావ్యాప్తి విషయములో క్రిశ్చియను మిషనరీల ఉద్యమాలను, ఇతర పాశ్చాత్య సంఘాల సహాయాన్ని వీరు గ్రహించవలసి వచ్చింది.

ఈ విషయములో ప్రభుత్వం వెనుకాడుతూ ఉండినది. 1813 వరకు, విద్యాప్రసార విషయములో ప్రభుత్వము ఎట్టి చర్యకూ పూనుకోలేదు. తర్వాత కూడా, విద్యావ్యాప్తికి పూనుకోవడమా వద్దా, ప్రాధమిక ఉన్నత పాఠశాలలలో సంస్కరింపబడిన దేశీయ విద్యను బోధించవలెనా, లేక, ఆధునిక విద్యను ఆంగ్ల భాషద్వారా బోధించడమా అనే, విషయాలను ప్రభుత్వమింకను నిశ్చయించుకొని ఉండలేదు. ఈ వివాదాన్ని, బెంటింకు నిర్ణయించిన తర్వాత కూడా, సంశయాలింకనూ నిలిచే ఉండినవి. విద్యావ్యాప్తివల్ల, బ్రిటీషు సామ్రాజ్య పరిణామము ఏమౌతుందో అనే ప్రశ్న ప్రభుత్వాన్ని వేధిస్తున్నది. ఆధునిక విద్య వల్ల సామ్రాజ్యము విచ్ఛిన్నంకాగలదనే వాదమూ, బ్రిటీషుసామ్రాజ్యము, విద్య వల్ల బలపడుతుందనే వాదనూ,- ఈ రెండూ పందొమ్మిదో శతాబ్దమంతా, జరుగుతూ వచ్చినవి. తత్ఫలితంగా, 1853 వరకూ, విద్యాసమస్య పరిష్కారంకాక, ప్రభుత్వము పరిస్థితుల నెదురుచూస్తూ ఉన్నది. 1855 నాటికి, 20 కోట్లజనాభాతో ఉన్న భారతదేశమున కంతటికీ, 1474 విద్యాలయాలు మాత్రమే ఏర్పడి, 67569 మంది విద్యార్థులకు మాత్రమే, విద్య లభిస్తూ ఉండినది. ప్రభుత్వము స్వయంగా నిర్వహించేవి, ధన సహాయం గావించేవి, ఇతరులు నిర్వహించేవి,- అన్నీ చేరికూడా, మొత్తం 1474 విద్యాలయాలు మాత్రమే ఏర్పడియుండినవి. ఈ విద్యాలయాలకు ప్రభుత్వము ప్రత్యేకించిన ఖర్చు మొత్తం ఆదాయంలో 1 శాతం.

క్రైస్తవ సంస్థలు నెలకొల్పిన విద్యాలయాలవల్ల ఈ పరిస్థితి కొంత బాగుపడింది. వీరు, 1628 పాఠశాలలను నిర్వహిస్తూ, 64000 మంది విద్యార్థులకు విద్యాదానం గావించేవారు. భారతీయుల ప్రయత్న మీవిషయములో, అత్యల్పమైనది. ఉన్నత విద్యాబోధనకై ఏర్పడిన కొన్ని సంస్థలు, కొన్ని పాఠశాలలు, ప్రాచీన ప్రాధమిక విద్యాశాలలుమాత్రమే, భారతీయుల ఉద్యమ ఫలాలు.

1854 లో, వుడ్ పంపిన సలహాపత్రము, విద్యా విషయములో నూతన యుగాన్ని ప్రవేశపెట్టింది యాభై సంవత్సరాల కాలము ప్రభుత్వాన్ని కలతపెట్టుచుండిన వివాదాలు, చర్చలు, సంశయాలు, - అన్నీ ఈ పత్రంలో వివరింపబడి ఉన్నవి. ప్రభుత్వాభిప్రాయ స్వరూపము ఈ పత్రములో ప్రతిఫలించింది "ఉపయోగకరమైన సాధారణ విజ్ఞానాన్ని ప్రజలలో ప్రసారంగావించి, తన్మూలంగా కలిగే విస్తారమైన నైతికార్థిక సౌఖ్యములను, వారికి సిద్ధింపజేసే ఉత్తమ సాధ

నము విద్యావ్యాప్తియని, ప్రభుత్వము గుర్తించింది. ప్రభుత్వముయొక్క పవిత్ర కర్తవ్యమైన విద్యావ్యాప్తిని, మా సామర్థ్యాన్నిబట్టి నిర్వహించుటకు మేము నిశ్చయించుకొనియున్నాము." అని ప్రౌఢ, ప్రగల్భ వాక్యాలతో, పత్రము, ప్రారంభమయింది. ప్రజల విద్యావిషయకమైన బాధ్యతను, ప్రభుత్వము స్వయంగా వహించే విధానాన్ని వదలివేస్తుందనికూడా, ఈ పత్రము ప్రకటించింది. "సాధారణ విద్యావ్యవస్థను, ప్రభుత్వం పూర్తిగా వహించే విధానము, శీఘ్రమే తొలగిపోతుంది. అట్టి పరిస్థితికై ప్రభుత్వం ఎదురుచూస్తున్నది." "విద్యార్జన కేమాత్రమూ అవకాశాలులేక, తామై పూనుకొనే ఆర్థిక సామర్థ్యం లేనివారై యున్న, ప్రజాసామాన్యానికి ఉపయోగకరమైన, క్రియాత్మక విద్యావకాశాలను కల్పించడం ప్రభుత్వముయొక్క ఆశయమై యున్నది. ఈ సత్ప్రయోజనము, భావికాలంలో ఫలవంతం కావడానికి తగిన చర్యలకు బూనుకొని, వాటిని సక్రమంగా నడపడానికీ, తత్ప్రయత్నానికి అవసరమైన ధనాన్ని మంజూరు చేయడానికీ ప్రభుత్వం సిద్ధపడియున్నది." అని కూడా ఈ పత్రము ప్రకటించింది.

ఈ మహానిశ్చయాన్ని అమలు జరుపుతూ, దేశీయ ప్రాథమిక విద్యాలయాలకు 'సహాయక అనుదానాల' (Grants in aid) పద్ధతిని ప్రభుత్వము, అనువర్తింప జేసింది. కాని, విద్యావ్యయాన్ని అభివృద్ధి చేస్తామనే, వాగ్దానాన్ని పూర్తిచేయడంలో, ప్రభుత్వము, లోభిత్వాన్ని ప్రదర్శించింది. తత్కారణంగా విద్యావ్యాప్తి కుంటుపడింది.

ఈ కాలమంతటా, వాగ్దానాలకు, కార్యాచరణానికి ఏమాత్రమూ పొత్తు కుదరలేదు. రెంటికీ గల అంతరము, బాహాటంగా వ్యక్తమౌతూనే ఉంది. సామాన్య ప్రజలలో సాధారణంగా నెలకొనియున్న ఆర్థిక దురవస్థను బాగుపరచడం ప్రభుత్వము ఆశయంగా చేసుకొని, తదుద్యమంలో, ఒక భాగంగా దేశీయ విద్యా సహకారానికి ప్రారంభించినదని ఊహించవచ్చును. కాని, ఈ ఆశయ ఫలితములంతగా కానరావు. తద్వ్యతిరేకంగా, మధ్యతరగతుల విద్యావ్యాప్తికై ప్రభుత్వము, ఎక్కువశ్రద్ధచూపింది. తత్ఫలితంగా, వారిలో విద్యావ్యాప్తి, వేగంగా అభివృద్ధి పొందింది.

పాశ్చాత్య విద్యావ్యాప్తివల్ల బ్రిటీషు సామ్రాజ్యానికి ముప్పువాటిల్లుతుందనే సంశయవాదాన్ని, వుడ్, నిరాకరించెను. "భారతదేశీయులను విద్యావంతులుగా చేసినందువల్ల మన సామ్రాజ్యానికి హానికలుగుతుందని, నేను విశ్వసించను." "భారతీయులు అసంఖ్యాకంగా విద్యావంతులు జ్ఞానవంతులు కావడమే కాక, మన మతమును కూడ అవలంబించి, తద్వారా మనకు సన్నిహితులైతే, బంధాలు సడలిపోవడానికి మారుగా, మన సామ్రాజ్యమింకను సుస్థిరం కాగలదని, నా విశ్వాసము." అని అతడన్నాడు.

పందొమ్మిదో శతాబ్దవిషయమై మాత్రము, వుడ్, ఊహించింది నిజమయింది. ప్రభుత్వ విధానాలను. ప్రభుత్వమవలంబించిన రాజనీతిని, విద్యావంతులైన భారతీయులు ఎంత తీవ్రంగా విమర్శించినా, బ్రిటీషు సామ్రాజ్యములోని ఒక భాగంగా,

ఇండియా నిలిచియుండడం అవసరమనీ, అది దేశ శ్రేయస్కరమనీ భావించినారు. ఈ అభిప్రాయం తరువాతికాలంలో మారిపోవడానికి, పాశ్చాత్య విద్య కారణంకాదు. పరప్రభుత్వ కారణంగా ఏర్పడిన అపరిహార్యములైన దుష్ట పరిణామాలు, భారతీయులలో అభివృద్ధి చెందిన ఆత్మగౌరవ, జాతీయ ప్రతిష్ఠలు, ఈ మార్పునకు వాస్తవమైన కారణాలు.

ప్రభుత్వసేవకు ఇతర వృత్తులకు అర్హులైన విద్యావంతులను సమకూర్చుకోవడం, వుడ్, పేర్కొనిన రెండవ ప్రయోజనము. "విద్యావ్యాప్తివల్ల బుద్ధిమంతులు, విశ్వాసపాత్రులు, ఐన భారతీయులు మన ప్రభుత్వ పరిపాలనలోని వివిధోద్యోగాలకు లభించి, పాలన వ్యవస్థలోని అన్నిశాఖలూ ఎక్కువ సమర్థవంతములు కాగలవనే అభిప్రాయం నాకెప్పుడూ ఉన్నదే." అని ఇతడు వ్రాసియున్నాడు. విద్యను ప్రోత్సహించడానికై, ఆంగ్లవిశ్వవిద్యాలయాలలో శిక్షణనొందిన వారికి ఎక్కువ అవకాశము ఉద్యోగముల విషయంలో కల్పింపబడింది. ఇట్లు ప్రభుత్వోద్యోగాల సంపాదనకు, జీవితంలో అభ్యుదయం పొందడానికి, ఆంగ్ల విద్యాభ్యాసము, ప్రవేశమార్గంగా సిద్ధించింది. విద్యాప్రయోజనములైన పాండిత్యము, ఉదార భావాభివృద్ధి అనేవి అప్రధానములై, విద్యవలన లభించే లౌకికోపయోగములకు ప్రాధాన్యమేర్పడింది.

విద్యాప్రయోజనములు సిద్ధించడానికి ప్రభుత్వము, రెండు సాధనములను ప్రయోగించింది. విద్యాశాఖానిర్మాణ మొకటి. విద్యా విషయములను నిర్వహించడానికి, దాని పర్యవేక్షణకు, నిర్దేశకులు, పర్యవేక్షకులు (డైరక్టర్లు), (ఇన్‌స్పెక్టర్లు) ఈ శాఖలో నియమితులైరి. విద్యాలయాలను విస్తరణం కావించడం, ఈ అధికారుల కర్తవ్యంకాదు. ప్రభుత్వం నెలకొల్పిన విద్యాలయాలను సక్రమంగా నిర్వహించడం మాత్రమే వీరికర్తవ్యము. ఈ విధానము, మొదటి సాధనము. ఇతరులు నిర్వహిస్తున్న విద్యాలయాలకు, సహాయక అనుదానాలను మంజూరుచేసి, వాటిని విద్యాశాఖ పర్యవేక్షణకు లోబరచి, అవి సక్రమముగా నడచునట్లుచేయడం రెండవది. ఈ మార్గాల ననుసరించి, విద్యాపత్రములో వివరింపబడిన, విధానాలు సక్రమంగా నిర్వహింపబడతాయని ప్రభుత్వము ఆశించింది.

***1857 తర్వాత విద్యావ్యాప్తి :-*** పందొమ్మిదో శతాబ్దపు రెండవ భాగంలో జరిగిన విద్యావ్యాప్తికీ, దేశములో అభివృద్ధిచెందిన జాతీయోద్యమానికీ ప్రత్యక్ష సంబంధమున్నది. 1854 నుండి, 1882 వరకు గల మొదటి అవస్థలో, గణనీయమైన అభివృద్ధి కార్యక్రమాలు జరిగినవి. ఉన్నత పాఠశాల విద్యా, కళాశాలవిద్యా, ఎక్కువగా అభివృద్ధి చెందినవి. ప్రాథమిక విద్యావ్యాప్తి, చాల మందగించి, నిరుత్సాహాన్ని కలిగించింది. విద్యావిధానము ప్రాంతీయశాఖగా ఏర్పడింది. విద్యాసంస్థల విస్తృతిలో భారతీయులెక్కువగా పాల్గొన్నారు. మిషనరీల ఉద్యమానికి నిరుత్సాహం కలిగింది.

విద్యాభివృద్ధిని నిశ్చయించేది ప్రభుత్వము. విద్యాభివృద్ధిని నిర్ణయించేది

దానికై ప్రత్యేకింపబడిన విత్తం. కనుక, విత్తీయ పరిపాలన వ్యవస్థలో కలిగిన మార్పుల ననుసరించి, విద్యా విషయమున జరిగే అభివృద్ధియొక్క వేగము, దాని స్వభావము, నిశ్చయమౌతాయి. 1854 నుండి 1870 వరకు, ప్రభుత్వ విత్తమంతా కేంద్ర ప్రభుత్వాధీనమై ఉండినది. పిమ్మట వికేంద్రీకరణ ప్రక్రియను, మేయో (Mayo) ప్రభువు ప్రారంభించి, విద్యావ్యాప్తికి సంబంధించిన ద్రవ్యాన్ని, ప్రాంతీయ ప్రభుత్వాలకు అప్పచెప్పినాడు. 1882 లో, పంచవార్షిక అనుదానపద్ధతి ననుసరించి కేంద్ర ప్రభుత్వము, ద్రవ్యాన్ని సమకూర్చి ప్రాంతీయ ప్రభుత్వాలకు యివ్వడం ప్రారంభించింది. ఈ ద్రవ్యము చాలకపోయినందువల్ల, సమయోచితము లైన రెండు నూతన పద్ధతులను, ప్రభుత్వము కల్పించింది. గ్రామసీమలలో ప్రాదేశిక విద్యాశుల్కాన్ని నియమించే అధికారాన్ని, ప్రాంత ప్రభుత్వాలకు కలిగించింది. పట్టణములలో విద్యాశుల్కాన్ని వహించే బాధ్యత పురపాలక సంఘాలు వహించినవి. (గ్రామసీమలలో విద్యాశుల్కాన్ని వసూలుచేయడం బెంగాలు ప్రభుత్వం అవలంబించలేదు). అదీకాక, సహాయక అనుదాన పద్ధతిపై పౌరులు ధనాన్ని సేకరించి, పాఠశాలల పోషణకు సహకరించవలసి వచ్చింది. పాఠశాలలలో చదివే విద్యార్థులు, నెలనెలకు రుసుము చెల్లించే పద్ధతి, అమలులోకి వచ్చింది. ఇన్ని పద్ధతులవలంబించినా, విద్యావ్యాప్తికి తగినంత ధనము సమకూరలేదు. ప్రజలలో, సాధారణమై నెలకొనియున్న దారిద్ర్యమే ఇందుకు హేతువు.

విత్తము కొరతపడినందువల్ల, నష్టపడినది ప్రాథమిక విద్యావ్యాప్తి. ఇది నిజంగా దురదృష్టమే. ప్రాచీన పద్ధతిలో, నిర్వహింపబడుచుండిన దేశీయ విద్యాశాలలు, ఇతర సంస్థలు, ప్రభుత్వము నెలకొల్పిన ఆధునిక పాఠశాలలు, – ఈ రెండు సంస్థలూ, డబ్బు కొరతవల్ల దెబ్బతిన్నవి. అట్లు నష్టపడిన విద్యాలయాల్లో, మిషనరీలు నెలకొల్పిన పాఠశాలలుకూడా చేరినవి. 1854 లో ప్రకటింపబడిన శాసపత్రం మిషనరీలకు ముదావహమై యుండినది. అది తమ విద్యాప్రసార కార్యక్రమాలను పెంపొందించే శాసపత్రమని వారు తలచియుండిరి. కాని, 1857లో జరిగిన విప్లవము వీరి ఆశలను భగ్నమొనర్చింది. హిందువులకు, ముస్లిములకు కూడా బాధకలిగించిన మిషనరీల మతప్రచారమే, విప్లవానికి ప్రధానకారణమని, ప్రభుత్వము భావించింది. బోర్డ్ ఆఫ్ కంట్రోలుకు అధ్యక్షుడైన, ఎల్లెన్‌బరో, ఇదివరకే ఈ విషయమై ఇండియా ప్రభుత్వాన్ని హెచ్చరించి ఉండినాడు. "మిషను పాఠశాలలో బోధింపబడుతున్న విద్య, మనం పూనుకొన్న విద్యావ్యాప్తి విధానానికి, భంగకరం కావడమేకాక, సామ్రాజ్య ప్రశాంతికి కూడా భంగకరమైనది." "మిషనరీల సంబంధమున్న పాఠశాలలకు మన ద్రవ్యసహాయాన్ని ఆపివేయడం తప్ప, దేశీయుల మనస్సుల నుపశమింపజేసి, వారికి మనయందు విశ్వాసం కలిగించడానికి తగిన, వేరే మార్గమేమీలేదు, అని ప్రస్తుత పరిస్థితులనుబట్టి నాకు విశ్వాసం కలిగింది. ఆ ప్రయత్నం ప్రారంభించడానికి ఇది తగిన సమయము." అని తాను ప్రభుత్వానికి పంపిన సలహా పత్రాన్ని ముగించినాడు.

మిషినరీలపై ప్రభుత్వాని కేర్పడిన ఈ అపనమ్మకంవల్ల, వారి ప్రాథమిక

విద్యావిభాగాభివృద్ధికి నిరోధమేర్పడింది. ప్రభుత్వము నిర్వహిస్తున్న ప్రాథమిక విద్యావిభాగంకూడా స్వల్పమైనదే. ఇండియా ప్రభుత్వ కార్యదర్శియైన డెర్బీ ప్రభువు, 1854 నాటి విద్యాపత్ర ఫలితాలను పరిశీలిస్తూ, (1859) "ప్రజానీకానికి వారి మాతృభాషలలో విద్య బోధింపబడడం లేదు. ఈ విషయమై అశ్రద్ధ చేయబడింది" - అనే విషయాన్ని ప్రభుత్వము దృష్టికి తెచ్చియున్నాడు. ప్రాథమిక విద్యను ప్రోత్సహించడంలో సహకారానుదాన పద్ధతి విఫలమైనదని అంగీకరిస్తూ, అతడు, "గ్రామ పాఠశాలల నిర్వహణకై పంటపొలాల్పై విద్యాశుల్కాన్ని విధించవలసిందిగా, ఇండియా ప్రభుత్వాన్ని నిర్దేశించెను". సహకార అనుదానాల మూలంగా, ప్రాథమిక విద్యా వ్యాప్తిని పోషించే విధానాన్ని, స్టాన్లీ పంపిన సలహా పత్రం (1859), నిరుత్సాహపరచింది. ఉన్నత పాఠశాలా విద్యను, ఇతర ఉన్నత విద్యలను, పోషించడానికి మాత్రమే, సహకార అనుదానాలు వినియోగం కావలెనని, ఈ నూతన పత్రం సలహా ఇచ్చింది. ఈ విధంగా సార్వజనీనమైన ప్రాథమిక విద్య, మరల నష్టానికి గురిఅయింది. ప్రజానీకానికి ఉపయోగిస్తూ, విద్యా సంస్థకు ప్రాతిపదికగా ఏర్పడవలసిన ప్రాథమిక విద్యకు ఈ విధంగా, ప్రోత్సాహం నశించిపోయింది. కొన్ని ప్రాంతాలలో ప్రాథమిక విద్యా శాలలు పూర్తిగా నిర్మూలమైపోయినవి. ఇతర ప్రాంతాలలో, వాటిని, ప్రభుత్వ విద్యా సంస్థలలో చేర్చుకొన్నారు.

"విద్యా వ్యాప్తికి కావలసిన ద్రవ్యాన్ని అన్ని ప్రాంతాలలోను ఎక్కువ చేసినారు. కాని, ఈ ద్రవ్యంలో, ప్రాథమిక విద్యకు గాను ప్రత్యేకింపబడిన భాగం సక్రమంగా వినియోగం కాలేదు. ఈ విషయం, సంఖ్యాగణన పట్టికల పరిశీలన వల్ల తెలుస్తున్నది. 1854 నుండి కూడా ఈ విధంగానే ప్రాథమిక విద్యకు ప్రోత్సాహం కలుగలేదు. ఎక్కువ ద్రవ్యము ప్రాథమిక విద్యకు వినియోగం కావలసి యున్నదనే సూచనను ప్రభుత్వము, పాటించియుండలేదు". అని దేశ వ్యవహార శాఖలోని అధీన కార్యనిర్వాహకుడైన హోల్వెల్ (Holwell) వివరించి యుండడం ఆశ్చర్యం కాదు.

ప్రాథమిక విద్యా వ్యాప్తి తమ కర్తవ్యమని ప్రభుత్వమెంతగా నొక్కి చెప్పుతూ ఉన్నా, వాస్తవ పరిస్థితి దీనికి, భిన్నమై యుండినది. ప్రాథమిక విద్య యొక్క విలువను గ్రహించని ప్రభుత్వం దానిని, ఆదరించలేదు [సిండ్రెల్లా (Cindrella) గా చూచింది]. తత్ఫలితంగా, దేశీయ పాఠశాలలు చాలవరకు లోపించినవి. వ్యవసాయ పద్ధతులలో అభివృద్ధి, గ్రామీణసహకారసంఘోద్యమము, న్యాయరీత్యా రైతుకు సిద్ధింపవలసిన హక్కులు, రైతు జీవనప్రమాణాభివృద్ధి, - ఇత్యాదులేవీ గ్రామీణులలో విద్యావ్యాప్తి లేనిదే జరుగదని తెలిసి యుండీ కూడా, జనానీకం నిరక్షరాస్యమై యున్నందువల్ల, దేశానికీ ప్రభుత్వానికీ, కలిగే ఆటంకా లెటువంటివో గుర్తించినా కూడా, ప్రభుత్వం ప్రాథమిక విద్యను నిర్లక్ష్యం చేసింది. పురాతనమైన మధ్యయుగాల వ్యవసాయ విధాన మట్లే నిలిచియుంది. 1868 లో, లారెన్స్ ప్రభువు, "మన పరిపాలన వ్యవస్థలో గల

కష్టముల కన్నిటికీ మూలమైనవి, మన ప్రభుత్వ స్థిరత్వానికి భంగం కలిగింపగలవి, ఐన తీవ్రకారణములలో, ప్రజల అజ్ఞానము వంటి ప్రబలమైన దింకొకటి లేదు" అని వ్రాసినాడు. విద్యాశుల్కముపల్ల లభ్యమైన ద్రవ్యము, పురపాలక సంస్థ లిచ్చిన విరాళములు, పౌరుల విరాళములు, ప్రభుత్వమిచ్చిన స్వల్పమైన సహాయక ద్రవ్యము, - వీటిపై ఆధునిక ప్రాథమిక విద్య, ఆధారపడవలసి వచ్చింది. 1881-82 లో ఈ విద్యావిభాగమునకై ప్రభుత్వమిచ్చిన ద్రవ్యం 16.77 లక్షలు. విద్యాశాఖ వెచ్చించిన మొత్తము ద్రవ్యం 70 లక్షలు. 1822-23 లో ఏర్పడిన హంటర్ కమిషన్, ప్రాథమిక విద్య యొక్క ప్రాధాన్యాన్ని, దీనిపట్ల ప్రభుత్వము వహించవలసిన బాధ్యతనూ గుర్తించింది. "ప్రభుత్వానికి ఉన్నత పాఠశాల విద్యతో గల సంబంధము, ప్రాథమిక విద్యా సంబంధముకంటెను భిన్నమైనది. ప్రాదేశిక ప్రజల సహకారము లేకపోయినా, ప్రాథమిక విద్యా భారాన్ని వహించడం ప్రభుత్వము యొక్క బాధ్యత. ఉన్నత విద్యా విషయంలో ప్రాదేశిక ప్రజల సహకార మున్నప్పుడే, ప్రభుత్వం ఆ విద్యకు పూనుకోవలసి ఉంటుంది" అని వారు సలహా ఇచ్చియున్నారు.

బ్రిటీషు ఇండియాలోని తొమ్మిది ప్రాంతాలలో గల 20 కోట్ల మొత్తం జనాభాలో 21 లక్షలు విద్యార్థులు మాత్రమే ప్రాథమిక పాఠశాలలలో చదువు చుండిరి. అనగా ప్రజలలో 1 శాతం మాత్రమే. "ప్రాథమిక విద్య, - అందులోను ముఖ్యంగా, ప్రజానీకం యొక్క దేశభాషాబోధ, - తృప్తికరంగా లేదు, దానిపట్ల తగినంత శ్రద్ధ చూపలేదు" అని ప్రభుత్వమే అంగీకరించక తప్పింది కాదు.

ప్రాథమిక విద్య వెనుకబడి యుండడానికి కారణాలనేకములు. ప్రభుత్వము తన నిశ్చయాలను అమలు జరపకపోవడం, ప్రజలు విద్యకై ఏమాత్రమూ ద్రవ్యం ఖర్చుపెట్టే శక్తిలేని దరిద్రులు కావడం, గ్రామీణ ప్రజలు తమ వృత్తిలో తమకు తోడ్పడుతున్న పిల్లలను బడికి పంపించడానికి సుముఖులు కాకపోవడం, మొదలైనవి కొన్ని కారణములు.

పందొమ్మిదో శతాబ్దములో జరిగిన ప్రథమ విద్యా ప్రసార దశలో, ఉన్నత పాఠశాల విద్యలో, సంతృప్తికరమైన అభివృద్ధి కలిగింది. ఆంగ్ల విద్యాభ్యాసం, వల్ల జీవనోపాధి మార్గాలు సుకరమై యుండడం వల్ల ఉన్నత పాఠశాలలు ఆంగ్ల విద్యనే అవలంబించినవి. ఆంగ్ల విద్యను సంపాదించడానికి ప్రజలుకూడ ఉత్సుకులై యుండడం, గమనింపదగిన విషయము. పశ్చిమోత్తర ప్రాంతాల లెఫ్టినెంటు గవర్నరుగా నుండిన, సర్ విలియం మ్యూయిర్, (Sir William Muir), తన ప్రాంతంలోని ప్రజలు ఆంగ్ల విద్యను అభిమానిస్తున్నారని, ఈ క్రింది విధంగా సాక్ష్యమిచ్చి ఉన్నాడు. "ఆంగ్ల విద్యను అభ్యసించడానికి, దేశీయ ప్రజలు తమంతట తామే పూనుకొని, తత్ప్రయత్నం చేస్తున్నారు. ఇంతకు పూర్వము లేని ఈ పరిస్థితి ఈ కాలంలో ఏర్పడింది." బెంగాలుకు లెఫ్టినెంటు గవర్నరైన సర్ రిచర్డ్ టెంపల్ కూడా "విద్యా సంపాదన గావించి, అభ్యుదయం పొందవలెననే

ఉత్కంఠను బెంగాలీ దేశీయులలో నేను గమనిస్తున్నాను." అని చెప్పినాడు. "తగుమాత్రం ద్రవ్యమున్న ప్రతి బెంగాలీ యువకుడూ, తన జీవిత ప్రధానాశయంగా, ఆంగ్ల విద్యాభ్యాసానికి పూనుకొంటున్నాడు. బీద కుటుంబాలలోని వారు కూడా ఆంగ్ల భాషను నేర్చుకోడానికి, కుతూహలులై ఉన్నారు." అని కూడా ఇతడే వ్రాసినాడు.

బ్రిటిషు పరిపాలన వ్యవస్థలో ఆంగ్ల విద్యావంతుల అవసరమెక్కువయింది. ఆంగ్ల భాషలో చక్కని పరిజ్ఞానమున్న భారత యువకులను తరిఫీదు గావించే ప్రయత్నములో, ప్రభుత్వము, ఉన్నత విద్యాలయాల అభివృద్ధికి తోడ్పడింది. 1865 లో, బెంగాలు విద్యాశాఖా నిర్దేశకుడీక్రింది విధంగా వ్రాసినాడు. "సమాజములో గల అగ్రస్థానాన్ని బట్టి, బీద ప్రజల విద్యావ్యాప్తికి పూనుకోగల ఉన్నత వర్గం వారికి ఉదారమైన పాశ్చాత్య విద్యను బోధించి, వారిని తరిఫీదు చేయడానికి ప్రభుత్వము పూనుకోవడం అవసరము. ప్రయోజనకరమైన ఈ ప్రధానాంశాన్ని, ప్రభుత్వము గమనించవలెను."

విద్యాభివృద్ధి విషయములో, ప్రభుత్వము అధోనిస్యందనవాదము (Downward filtration theory) అనే పద్ధతిని అవలంబించింది. "ఏ వర్గంలోని ప్రజలకైనా, విద్యా సంపాదనకు, కుతూహలం కలుగవలెనంటే, దానికి పై వర్గం వారు విద్యావంతులై యుండడం అవసరము. పై వర్గం వారి, సంపర్కం వల్ల విద్యా ప్రయోజనాన్ని, దానివల్ల సిద్ధించే లాభాలను వీరు గుర్తించగలరు. అప్పుడు వీరిలో కూడా విద్యార్జన కుతూహలం, ఏర్పడుతుంది." అని ప్రభుత్వవాదము. కనుకనే, ఉన్నత వర్గాల వారి విద్యావ్యాప్తికి బూనుకొన్నది ప్రభుత్వము.

***ఆంగ్ల విద్యకు ప్రోద్బలము*** : ఈ విధంగా, ఉన్నత విద్యాభివృద్ధికి ప్రోద్బలమెక్కువైనది. పాశ్చాత్య విద్యార్జనకై మధ్య తరగతుల వారి కుతూహలాసక్తులు, ప్రభుత్వ పరిపాలన శాఖలలోని ఉద్యోగాలకు, విద్యావంతుల అవసరము- ఇవి కారణములై, ఉన్నత విద్య ఎక్కువగా అభివృద్ధి చెందింది. 1955 లో, 169 ఉన్నత పాఠశాలలు దేశములో 18,335 విద్యార్థులకు శిక్షణ నిస్తూ ఉండినవి. 1882 నాటికి, ప్రభుత్వము స్వయంగా నిర్వహిస్తూ ఉండిన పాఠశాలల సంఖ్య 1363 కు పెరిగింది. వాటిలోని విద్యార్థుల సంఖ్య 44,605.

ఈ విషయములో దేశీయుల ప్రయత్నముకూడా స్వల్పమైనది కాదు. 1854 లో, దేశీయులు నిర్వహిస్తూ ఉండిన పాఠశాలలు కొన్నిమాత్రమే. కాని, 1881-82 నాటికి వీటిసంఖ్య 1341 అయింది. ప్రభుత్వపాఠశాలల సంఖ్యకు ఇది సమానమైనది. మిషనరీల పాఠశాలలసంఖ్యకు (757) ఇది రెండింతలు. దేశీయులు పూనుకొని గావించిన ఈ విద్యాభివృద్ధికి కారణము, 1854 లో ప్రకటించిన ప్రభుత్వ విద్యావిధానము. 'ఉన్నత విద్యా వ్యాప్తికి ప్రభుత్వము స్వయంగా పూనుకోదు'. అనే ప్రభుత్వ నీతి, దేశీయులకీ విషయములో ప్రేరకమయింది.

పాశ్చాత్య విద్యకుగల విలువను గుర్తించిన హిందువులు దానిని పోషించుటకు ఎంతటి త్యాగమునకైనా సిద్ధపడిరి. ముస్లిములు మాత్రమే సంశయాత్మకులై

ఈ విషయములో వెనుకబడి యుండిరి. వారి వ్యతిరేకతను తొలగించి, తన అభిప్రాయానుగుణంగా, పాశ్చాత్యవిద్యకు వారు సుముఖులయ్యేటట్లు చేయడానికై సయ్యద్ అహమద్‌ఖాన్ ఉద్యమాన్ని ప్రారంభించియున్నా, అధిక సంఖ్యాకులైన ముస్లిములు పాశ్చాత్య విద్యకు విముఖులై యుండిరి.

పందొమ్మిదో శతాబ్దపు రెండవ భాగంలో, కళాశాలా విద్యాభివృద్ధికూడా వేగంగా అభివృద్ధి చెందింది. పరీక్షలను నిర్వహిస్తూ, ఇతర కళాశాలలనుకూడా తమతో సంయోజనపరచుకొన్న, మూడు విశ్వవిద్యాలయాలు 1857 లో స్థాపితములైనవి. విద్యాబోధనను పర్యవేక్షణ గావిస్తూ, విద్యావిధానాన్ని సక్రమ మార్గములో నిర్దేశించడం, విద్యాశాఖయొక్క ధర్మముగా, 1854 ప్రేషణ పత్రములోని సలహాల ననుసరించి, ప్రభుత్వం నిశ్చయించింది. విశ్వవిద్యాలయాలు కూడా దీనిని అనుసరించి, కళాశాలా విద్యావిషయములో ఆ కర్తవ్యాలనే నిర్వహించినవి. అనగా, కళాశాల విద్యను పర్యవేక్షించి, నిర్దేశించడము. ఉన్నత పాఠశాలలను, కళాశాలలను, స్వయంగా పోషించే బాధ్యతను వహించడము, ప్రభుత్వానికి అభిమతం కాదు. కాని, అప్పటి పరిస్థితుల ప్రాబల్యంవల్ల, కొన్ని విద్యాలయాల బాధ్యతను ప్రభుత్వము, వహించవలసి వచ్చింది. 1857 లో, సాధారణ విద్యకు సంబంధించిన 13 కళాశాలలను, 3 వైద్యకళాశాలలను, ఒక ఇంజనీరింగు కళాశాలను, ప్రభుత్వము స్వయంగా నిర్వహించడము ప్రారంభించింది. 9 సాధారణ విద్యాకళాశాలలను మిషనరీలు నడపుచుండిరి కలకత్తాలోని 'హిందూ విద్యాలయము, అనే కళాశాలను, భారతీయులు ఆంగ్లేయులు కలిసిన ఒక సమితి 1854 వరకు, నిర్వహించింది. ఈ మూడు విశ్వవిద్యాలయాలలోనూ కలిసి, మొదటి మెట్రిక్యులేషన్ పరీక్షలో 219 మంది అభ్యర్థులు ఉత్తీర్ణులైరి

1882 నాటికి దేశములో 72 ఆంగ్ల ప్రాచీన విద్యాకళాశాలలు ఏర్పడినవి. దేశీయ రాజ్యములలోకూడా అనేకములు స్థాపితములైనవి. వీటిలో 53 సాధారణ విద్యాకళాశాలలలో (Arts colleges) 5399 విద్యార్థులు చదువుచుండిరి. 1881-82 నాటికి మెట్రిక్యులేషన్ పరీక్షకు హాజరైన అభ్యర్థుల సంఖ్య 7429. వీరిలో 2778 గురు ఉత్తీర్ణులైరి. నూతనముగా స్థాపింపబడిన కళాశాలలలో, అలిఘరులోని ఆంగ్ల-ప్రాచీన కళాశాల పేర్కొనదగినది. ముస్లిములలో నూతనముగా కలిగిన చైతన్యమునకు ఈ కళాశాల భావిసూచకం. ముస్లిములలో ఉత్పన్నమైన పునరుజ్జీవన ప్రయత్నమునకు ఇది ఫలము. ఈ కళాశాలకాక, ఇతరులు నిర్వహించుచుండిన కళాశాలలు నాల్గు కలవు. లక్నోలోని క్యానింగు కళాశాల ఔధ్ ప్రాంతంలోని భూస్వాముల సహాయంతో స్థాపింపబడింది. మదరాసులోని పచ్చయప్ప కళాశాల, ధార్మికుడైన ఒక హిందువుని స్వార్జిత ద్రవ్యంవల్ల ఏర్పడింది. విజయనగరం మహారాజా స్థాపించిన విజయనగర కళాశాల మూడవది.

1861 లో స్థాపింపబడిన తిన్నెవెల్లి (తిరునెల్వేలి) కళాశాల ఇంకొకటి. 1857-1871 మధ్యకాలంలోను, 1872-82 మధ్యకాలంలోను, ఆంగ్ల విద్యావ్యాప్తి ఏ విధమైనదో ఆ కాలావధి పరీక్షా ఫలితములను బట్టి ఊహింపవచ్చును.

మొదటి కాలావధిలో 46 ఆంగ్ల సాధారణ విద్యా కళాశాలలు, రెండవ కాలావధిలో 72, ఉండినవి. 2666 మంది ఎఫ్. ఏ పరీక్షలోను, 859 మంది బి. ఏ. పరీక్షలోను మొదటి కాలావధిలో ఉత్తీర్ణులైరి. రెండవకాలంలో, 5969 మంది ఎఫ్. ఏ. పరీక్షలోను, 2434 మంది బి. ఏ. పరీక్షలోను, 385 మంది ఎమ్. ఏ. పరీక్షలోను ఉత్తీర్ణత గాంచిరి.

ఉన్నత పాఠశాల విద్యా విషయంలోను, కళాశాలా విద్యావిషయంలోను జరిగిన అభివృద్ధికీ, దేశములో సువ్యాప్తమౌతున్న పునరుజ్జీవన ప్రయత్నానికి ప్రత్యక్షానుబంధ మున్నది. ఈ అనుబంధము పరస్పరమైనది; సంచితమైనట్టిది. ఇది రాజకీయోద్బోధకు ప్రధాన కారణమయింది. ఈ ఉద్బోధమే భారతజాతీయ కాంగ్రెసుగా, రూపము గైకొని 1885 లో, సిద్ధించింది. 1885-86 లో 4 లక్షల మంది విద్యార్థులు, ఉన్నత పాఠశాలలలో చదువుకొనేవారు. వీరిలో, 265,000 మంది విద్యార్థులు పూర్తిగా ఆంగ్ల విద్యనే అవలంబించినవారు. 1881 లోని దేశజనాభాతో పోల్చిచూస్తే, ఆంగ్లభాషతో పరిచయం గలవారి సంఖ్య, కుండెడు నీళ్లలో ఒక నీటి బిందువు వంటిది మాత్రమే అనడం, వాస్తవమే. ఐనా, దేశంలో వారి ప్రభావం అధికమైనది. సంఖ్యను బట్టి మాత్రమే, వారి పలుకుబడిని నిశ్చయింపజాలము. ప్రభుత్వ శాసనాలకు, ప్రభుత్వం అమలు జరిపే ఆదేశాలకు ఆధారాలై యున్న పదవులను, ఉద్యోగములను, ఆక్రమించి, వీరు, పరిపాలన విధానాలలో ప్రాబల్యము వహించి, తన్మూలంగా దేశములో కూడా పలుకుబడి గలవారయిరి. అంతమాత్రమే కాక, న్యాయవాదులు, వైద్యులు, ఇంజనీయర్లు, అధ్యాపకులు, మొదలైన స్థానాలలో నిలిచి, ఆయావృత్తులద్వారా, ప్రజానీకంపై తమ ప్రాధాన్యాన్ని, ప్రభావాన్ని, ప్రసరింపజేసిరి. మరియు, పత్రికా రచయితలు, గ్రంథ రచయితలు, కూడా తమ భావములను, అభిప్రాయములను, ప్రచారం గావిస్తూ, ప్రజలపై ఒక విధమైన భావాధికారాన్ని సంపాదించుకొనిరి. కాని, వీరికిగల ప్రాధాన్యము ప్రభుత్వ ప్రయోజనాలకు అనుకూలించేది కాదు. కనుక, ప్రభుత్వం ఈ వర్గంవారిని అభిమానించలేదు.

1880 లో, రిప్పన్ ప్రభువు ఇండియాకు రావడంతో, విద్యావ్యాప్తికి ప్రోద్బలం కలిగింది. గ్లాడ్‌స్టన్ నాయకుడైన ఉదార ప్రభుత్వములో, కౌన్సిలు అధ్యక్షుడుగా ఉండిన రిప్పన్ ప్రభువు 1868-70 విద్యాశాసనాలను పార్లమెంటు అంగీకరించేటట్లు చేసినాడు. భారతదేశ రాజప్రతినిధిగా వచ్చిన అతని దృష్టిని ప్రథమంగా ఆకర్షించిన సమస్య, విద్యాసమస్య. విద్యా ప్రసారములో అతనికిగల ఆసక్తి, కేవలం అతనికి రాజకీయములలో గల ఉదార దృక్పథంవల్ల మాత్రమే, ఏర్పడింది కాదు. స్థానిక స్వపరిపాలన ప్రభుత్వపు విధానము సక్రమంగా నిర్వహింపబడడం అతని ఆశయము. అట్టి విధానాన్ని అతడు కట్టుదిట్టం చేయడానికి పూనుకొన్నాడు ఈ ప్రయత్నం సఫలం కావడానికి, సార్వజనీనమైన విద్యావ్యాప్తి ఆధారమౌతుంది. తత్కారణంగా, రిప్పన్ ప్రభువు, విద్యావ్యాప్తి తన ప్రథమ కర్తవ్యంగా గ్రహించినాడు.

"సామాన్యమైన విద్యార్జనకుకూడా పూనుకోలేని దరిద్రస్థితిలోనున్న ప్రజానీకానికి, వారి వారి స్థితుల కుపయోగించే క్రియాత్మక విద్యను నేర్పడానికి తగిన చర్యలను గైకొనవలెనని" వుడ్, వ్రాసి, పాతిక శతాబ్దం గడిచింది. "దేశీయ విద్యాలయాలకు తగిన ప్రోత్సాహం కలిగించి, సామాన్యప్రజకు ఉపయోగకరమైన ప్రాతిపదిక విద్యాబోధ జరిగేటట్లు చేయవలసిందని" కూడా, ఇతడు నిర్దేశించి యుండెను. కాని, ప్రాథమిక విద్యపట్ల, నిర్లక్ష్యభావం ఎప్పటి వలెనే అనుసరిస్తూరావడంవల్ల, దేశీయవిద్యాశాలలు చాలవరకు నశించిపోయినవి.

ప్రజా విద్యాభివృద్ధి ఆశించినవిధంగా జరగలేదు. ఈ విషయం మాత్రమే కాక, విద్యావిధాన కార్యక్రమాలనుగూర్చి, విచారణజరుపవలసిన ఇతర కారణాలుకూడా ఉండినవి. తమ విద్యాఉద్యమంలో, ప్రభుత్వం అవలంబించిన విధానం అసంతృప్తికరమైనదని, క్రిశ్చియన్ మిషనరీలు ఆక్షేపించిరి. మత బోధను, మత సంబంధములైన విషయాలను పరిత్యజించి, ప్రయోజనకరమైన లౌకికవిద్యను మాత్రమే పాఠశాలలలో బోధించవలెనని, వుడ్, నిష్కర్షగా తెలియజేసినాడు. ఈ విధానమే 1858 నాటినుండి అమలులో ఉన్నది.

రిప్పన్, ఈ విచారణకు బూనుకోడానికి మరియొక కారణముకూడా ఉన్నది. "ఆధునిక విద్యార్జనగావించిన అల్పవర్గంవారు, విద్యావిహీనులైన ప్రజలలో, ప్రభుత్వంపట్ల దురభిప్రాయాలను కలిగించే ఆపదకూడా, కలుగవచ్చునని" ఇత డూహించినాడు.

కనుక ఇండియా ప్రభుత్వం, 'భారతవిద్యాసమితి' ని 1882 లో ఏర్పరచి, విచారణకు బూనుకొన్నది, సర్ డబ్ల్యూ. డబ్ల్యూ. హంటర్, అధ్యక్షుతలో నియమింపబడిన ఈ సమితిలో, 8 మంది భారతీయులతోసహా 20 మందిసభ్యులుండిరి. 1854 వ నాటి ప్రేషణపత్రములోని నియమాలు ఎంతవరకు కొనసాగి ఫలవంతములైనవి, అనే విషయాన్ని పరిశీలించి, అందులో సూచింపబడిన విధానాలను ఇక ముందు, ఏ పద్ధతిలో అమలుజరుపవలసియున్నది, అనే విషయమై, సలహాలను ఇవ్వడం, ఈ సమితి నిర్వహింపవలసిన కార్యము. విద్యా సంబంధమైన సమస్త విషయాలనూ విచారణగావించి, ఈ సమితి, తన నివేదికను 1883 లో, ప్రభుత్వానికి అందజేసింది.

1854 లో, రచింపబడిన ప్రేషణపత్రం సమగ్రమై ఉన్నదనీ, అందులో సూచించిన విధానములో మార్పులు చేయవలసిన అవసరం లేదనీ, ఈ నివేదిక వివరించింది. కనుక సమితి ఇచ్చిన సలహాలు, 1854 నాటి ప్రేషణ పత్రికలోని సూత్రాలను, ప్రణాళికను, సమర్థించి, బలపరచినవి. "విద్యావిధానం ఎప్పటికైనా సమగ్రం కావలసి ఉంటే, కేవలం బాహ్యాడంబర ప్రదర్శనకు మాత్రమే పూనుకోక, దానిని విశాలమైన జాతీయ సంస్థగా చేసే ప్రయత్నానికి పూనుకోవలెననీ, దానిని నిర్వహించే బాధ్యతను చాలవరకు ప్రజలే పూనుకోవలెననీ, సమితి నివేదిక వివరించింది. ఈ సలహా ననుసరించి, ప్రభుత్వము స్వయంగా విద్యావ్యాప్తి గావించే ఉద్యమ ప్రయత్నాన్ని విరమించుకోవలెననికూడా సూచించింది.

"విద్యా సంస్థలను విస్తరింపజేసే ప్రయత్నమునుండి, ప్రభుత్వం, విరమించుకోవడమే కాక, విద్యావ్యాప్తి విషయంలోకూడా ప్రభుత్వము, స్వయంగా పూనుకోకూడదని తెలిపింది. విద్యా నిర్వహణకు తగిన లోక సంస్థకాని, వ్యక్తి సంస్థకాని, ఈ కార్యక్రమాన్ని వహించినవెంటనే, వారికిబాధ్యత నప్పగించి, ప్రభుత్వం విరమించుకోవలసిందని," ఈ సమితి సలహా యిచ్చింది. ప్రాథమిక విద్యా విషయమై ఈ నివేదిక, "ప్రభుత్వ మింతవరకు జరిపినదానికంటె ఎక్కువ విస్తారంగా, ప్రాథమిక విద్యను పోషించడానికి సమర్థమైన ప్రయత్నం చేయవలసిందనీ, ఈ ప్రయత్నంవల్ల ఆదిమజాతులకు విద్యావకాశం ఏర్పడవలెననీ," సూచించింది. భారతదేశములోని ప్రాథమిక విద్యా నిర్వహణాధికారం, ఇంగ్లాండులోవలె, జిల్లా పరిషత్తులకును, పురపాలక సంస్థలకును, అప్పగించటం ప్రయోజనకరమనికూడా, తెలిపింది. కాని ఇంగ్లాండులోవలె, ప్రాథమిక విద్య, నిర్బంధ విద్యగా, ఏర్పడవలెననే సూచనను సమితి గావింపలేదు. దేశీయ విద్యాలయాలను ప్రోత్సహించి, బాగుపరచి, అవి ఆధునిక ప్రయోజనాల కుపకరించేటట్లుగా పరివర్తనమొందించవలెనని, సమితివారి సలహా.

ప్రాథమిక విద్యావ్యాప్తికి అవసరమైన ద్రవ్యవిషయములో, స్థానిక నిధులే (Local funds) ప్రధానములైన ఆధారమని వీరు నిశ్చయించిరి. స్థానిక ఆదాయవ్యయ పట్టికల ననుసరించి, ప్రాంతీయ ప్రభుత్వాలు, సహాయక అనుదానాల రూపములో సహకరిస్తాయి. స్థానిక ఆస్తులలో సగం మొత్తము కాని, లేక, మొత్తం ఖర్చులో మూడవ వంతు కాని, ఈ ప్రభుత్వాలు సహాయక అనుదానంగా ఇచ్చి, విద్యాసంస్థలకు తోడ్పడతాయి. సమితి ఇచ్చిన ఈ సలహాలు విద్యావ్యాప్తికి ఏ మాత్రమూ సరిపోయినవికావు. కనుక సమితివారి సదుద్దేశాలు కార్యసాధకములుగా పరిణమించలేదు.

ఈ నివేదికకు పిమ్మట ఇరవై సంవత్సరాల కాలములో, ఉన్నత పాఠశాలలకూ కళాశాలలకూ సంబంధించిన విద్యాభివృద్ధి, అంతకు పూర్వం ముప్పై సంవత్సరాలలో జరిగిన దానికంటె, ఎంతో అధికమైనది కళాశాలల సంఖ్య [ఎఫ్. ఏ; బి. ఏ. వృత్తి] 72 నుండి 191 కి, అభివృద్ధి చెందింది. వీటిలో, 145 సాధారణ కళాశాలలు, 46 వృత్తి విద్యలకు సంబంధించినవి. 1882 నాటికంటె కళాశాలల సంఖ్య రెండురెట్లు పెరిగిందని దీనిని బట్టి తెలుస్తుంది. బ్రిటీషు ఇండియాలోని ఆరు ప్రాంతాలలోనూ కళాశాలా విద్యార్థుల సంఖ్య 1881-82 లో 5403. 1901-02 నాటికి, ఈ సంఖ్య 23,009. అనగా పూర్వముకంటె నాలుగు రెట్లు. 1881-82 నాడు, మిషనరీల కళాశాలలు 18. దేశీయులు నిర్వహించినవి, 5, 1901-02 లో, దేశంలో మొత్తం 168 సాధారణ కళాశాలలుండినవి. వీటిలో, 136 బ్రిటీషు రాజ్యభాగములోను, 32 దేశీయ ప్రభువుల రాజ్యాలలోనూ ఏర్పడినవి. వీటిలో విదేశీయుల ఉద్యమము, 1902 నాటికి మిషనరీల ఉద్యమాన్ని అధిగమించింది.

ఉన్నత పాఠశాల విద్య కూడా ఇదేవిధంగా, అభివృద్ధి పొందింది. విద్యాల

యాల సంఖ్య 3916 నుండి 5124 కు పెరిగింది. విద్యార్థుల సంఖ్య 214,077 నుండి, 590,129 కి పెరిగింది. ఎక్కువ భాగం పాఠశాలలు, దేశీయుల ద్రవ్య సహాయముతో నిర్వహింప బడేవి. వీటిలోని అధ్యాపకులందరు దేశీయులే. కాని శతాబ్దాంతము నాటికి కూడా, ప్రాథమిక విద్యా పరిస్థితి శోచనీయ స్థితిలోనే నిలిచింది. 1901-02 నాడు, విద్యావయస్కులైన బాలుర సంఖ్య 180 లక్షలై యుండగా, చదువుతున్న వారి సంఖ్య 30 లక్షలు మాత్రమే. 1881-82 నాడు ప్రభుత్వం ఖర్చు పెట్టిన ద్రవ్యం 16.77 లక్షల రూపాయలు. 1901-02 నాటి ఖర్చు 16.92 లక్షలు. ఈ ఇరవై ఏండ్లలోను, ఖర్చు ఏ మాత్రమూ అధికం కాలేదని దీన్ని బట్టి వ్యక్తమౌతుంది. పైగా, స్థానిక సంస్థలపై విధింపబడిన శుల్కభారం ఎక్కువయింది. 1881-82 లో స్థానిక సంస్థలు భరిస్తూ ఉండిన వ్యయం 24.9 లక్షలు. 1901-02 నాటికిది 46.1 లక్షలయింది. ఐనా, ప్రాథమిక విద్యకు ఈ అధికాదాయమంతా వినియుక్తం కాలేదు. 1901-02 నాటికి అక్షరాస్యుల సంఖ్య, పురుషులలో 10 శాతము; స్త్రీ జనంలో 7 శాతము మాత్రమే. ప్రతి నాలుగు పల్లెలకు, ఒకదానిలో మాత్రమే పాఠశాల ఏర్పడి ఉండినది.

ఇట్లు, నూట యాభై సంవత్సరాల బ్రిటీషు పరిపాలన తర్వాత కూడా, భారతదేశములోని ప్రజానీకం యొక్క జీవిత పరిస్థితి, ఆర్థికంగానూ, విద్యా విషయకంగానూ, చాల వెనుకబడి ఉండినది. నిర్బంధ విద్యా విధానానికి, పూను కొనే అభిప్రాయమే ప్రభుత్వానికి లేదు. పైగా, ఖర్చుతో కూడిన ఈ అంశాన్ని మొదటనే దరిద్రములై యున్న జిల్లా సంస్థలకు, పురపాలక సంఘాలకు, అంట గట్టింది. ప్రభుత్వము ఈ సంస్థలకు ద్రవ్య సహాయాన్ని మాత్రం పెంచలేదు. అంతేకాక, దేశీయ విద్యాశాలలను, ప్రభుత్వము పూర్తిగా నిర్లక్ష్యం చేసింది. అవధిలేని అజ్ఞానము, దుర్భర దారిద్ర్యము అనే మానసిక భౌతిక రోగాలు దేశాన్ని, ఈ కాలమంతటా, పీడించినవి. కనుక, ప్రజలు మూఢవిశ్వాసాలను, సంప్రదాయాలను అంటిపెట్టుకొని ఏ విధమైన ఉద్యమానికీ పూనుకోక, వ్యవసాయ పద్ధతులను అభివృద్ధి పరచుకోలేక, దుస్సహ దారిద్ర్యమునకు, అనారోగ్యమునకు లోనై, తమ పరిస్థితిని బాగుపరచుకోడానికి కూడా చేతకానివారై, జీవచ్ఛవములుగా ఉండడంలో, ఆశ్చర్యంలేదు.

తరతమ భావంతో చూస్తే, మధ్య తరగతుల వారిలో విద్యావ్యాప్తి బాగుగా జరిగింది. విద్యావంతుల సంఖ్యాగణనం సాధ్యం కాదు. కాని, ఉన్నత విద్యలో మొత్తంగా జరిగిన అభివృద్ధీ, జాతీయ వ్యవహార భాగాలన్నిటిలోను మధ్య తరగతుల వారు కార్యశీలురై ప్రవర్తించడమూ, జాతీయ జీవనములో వీరికి ప్రాధాన్యము, పలుకుబడి, క్రమంగా అధికము కావడమూ-అనే సూచనలను బట్టి, విద్యాభివృద్ధి, ఈ సమాజవర్గంలో, వేగంగా సాగిందని నిశ్చయించవచ్చును.

సమాజములోని అన్ని వర్గాలలోనూ, సమానంగా విద్యావ్యాప్తి జరుగ లేదు. హిందువులలో చాల వరకు, మధ్య తరగతుల వారికి మాత్రమే పరిమిత

మయింది. ఈ వర్గం వారిలో కూడా, ఉన్నత స్థాయికి చెందినవారు, విద్యావకాశాలను ఎక్కువగా ఉపయోగించుకోలేదు. కనుక, అట్టి వారి ప్రయోజనార్థం, ప్రభుత్వము ప్రత్యేకములైన ఏర్పాట్లు గావించింది. దీనివల్ల ఈ ఉన్నత స్థాయి వారు, ఇతర మధ్య తరగతుల విద్యావంతుల నుంచి వేరుపడిపోవడం జరిగింది. విదేశీయ ప్రభువుల పట్ల వీరు భక్తి విశ్వాసాలను వహించి యుండడానికి కూడా ఈ పద్ధతి ఉపకరించింది.

ఈ విధానాన్ననుసరించి, ప్రభుత్వము ప్రత్యేక విద్యాలయాలను వీరికై స్థాపించింది. సంస్థానాధిపతులు, సంపన్న వంశీయులు, భూస్వాములు-వీరి పిల్లలకు మాత్రమే ఈ విద్యాలయాలు ఉపయోగించినవి. (1) అజమీరులోని మేయో, కళాశాల, (2) రాజకోటలోని రాజకుమార కళాశాల, ఇండోరులోని డాలీ కళాశాల-ఈ విద్యాలయాలు.

ఆంగ్ల విద్యాలయాలలో చేరినవారు ముఖ్యంగా మధ్య తరగతులవారు. అందులోనూ ఈ వర్గంలోని బీద కుటుంబాల వారికి ఆంగ్ల విద్యావసర మెక్కువ కాబట్టి, ఆంగ్ల పాఠశాలలలో వారి సంఖ్యే అధికము. జమీందారీ సంస్థకు చెందిన ఉన్నత శ్రేణివారు, సాధారణంగా, ధనవంతులై యుండడం వల్ల, ఆంగ్ల విద్య నభ్యసించి, స్వతంత్ర వృత్తులలో కాని, ప్రభుత్వోద్యోగాలలో కాని, ప్రవేశించే అగత్యము వారికి లేదు. కనుక, ఈ కుటుంబాల వారు అధిక సంఖ్యలో కళాశాల విద్యకు పూనుకోలేదు. ధనవంతులు కానట్టి ఇతర కుటుంబాల వారికి, తమ జీవితాన్ని బాగుపరచుకోవలసిన అవసరమున్నందు వల్ల, ఉత్సుకతతో అధిక సంఖ్యలో ఉన్నత పాఠశాలలను, కళాశాలలను ప్రవేశించిరి. వీధి లాంతరు క్రింద కూర్చొని చదువుతున్న విద్యార్థులుకూడా ఆనాడు ఉండిరనడం అతిశయోక్తికాదు. సంపన్న కుటుంబాల యువకుల సంస్కృతినీ, ప్రవర్తననూ పోషించే శిక్షణ సంస్థలుగా, ఇంగ్లాండు విశ్వవిద్యాలయాలు పరిగణింపబడినవి. ఇండియాలోని పరిస్థితి వేరు. ఉద్యోగాలకు, ఇతర జీవనోపాధి వృత్తులకు, తరిఫీదునిచ్చే కేంద్రాలుగా మాత్రమే ఇండియాలోని విద్యాలయాలు ఏర్పడినవి. వీటిని, ఉన్నత విద్యాపీఠములని కాని, పాండిత్యమును, పరిశోధనను పెంపొందించే ఉన్నత విజ్ఞాన కేంద్రాలని కాని, ఎవరూ భావించలేదు.

ఇండియాలోని అక్షరాస్యుల సంఖ్యలో 60 శాతం, జనాభాలోని ఐదవ భాగమైన ఉన్నత వర్గాలలోని వారు. వీరందరూ ప్రధానములైన, 20 కులాల లోని వారే. అందునూ, బ్రాహ్మణులు, వైశ్యులు, కాయస్థులు ఎక్కువ. ఈ మూడుకులాల వారి మొత్తం, హిందువుల జనాభాలో 10 శాతం కంటె తక్కువే. ఐనా, అక్షరాస్యులైన వారి సంఖ్యలో వీరిది 36 శాతం. స్త్రీలను, పురుషులను, మొత్తంగా గణిస్తే, జనాభాలోని 14 శాతం మాత్రమే ఐయుండిన 11 కులాల వారి అక్షరాస్యుల సంఖ్య 50 శాతమై ఉండినది. హిందూ సమాజములోని ఒక చిన్న భాగములో మాత్రమే విద్యావ్యాప్తి జరిగిందని ఈ సంఖ్యలు విశదం చేస్తున్నవి. ఐనా, బ్రిటీషు పరిపాలనకు పూర్వమున్న స్థితి కంటె, ఇప్పటి స్థితి మేలని

తెలుస్తుంది. అక్షరాస్యులు లేని, కులమేలేదని చెప్పవచ్చు. విద్యా ప్రసారం వల్ల కులతత్త్వం కొంత సడలింది. కాని, కలిగిన మార్పు అల్పమైనది; బాహ్యా జీవితానికి మాత్రమే సంబంధించినట్టిది. కుల నిర్బంధాలు, నిష్కర్షలు, కొంచెముగా సడలినవి.

***ముస్లిముల విద్యావ్యాప్తికి ప్రభుత్వ ప్రోత్సాహము :*** ముస్లిము సంఘములో విద్యావ్యాప్తి తృప్తికరంగా జరగలేదు. ముస్లిము సంఘముపట్ల, ప్రభుత్వం వహించిన వ్యతిరేకభావము బ్రిటిషువారి విషయములోను, వారి మతసంస్కృతుల విషయములోను ముస్లిములు వహించిన ద్వేషభావము, కారణములుగా, ముస్లిములు విద్యావిషయములో వెనుకబడిరి. ఉన్నత విద్యాప్రసార మింతకంటెను, తక్కువ. ఆరు పెద్ద ప్రాంతాలలోను కలిసి ముస్లిముల జనసంఖ్య, మొత్తము జనసంఖ్యలో 22.8 శాతం. కాని, పాఠశాలలలో చదువుతున్న విద్యార్థుల సంఖ్యలో ముస్లిము విద్యార్థుల భాగం 14.5 మాత్రమే. పశ్చిమోత్తర ప్రాంతంలోను, ఔధ్ ప్రాంతంలోను ముస్లిము విద్యార్థుల సంఖ్య సాధారణ నిష్పత్తికంటె ఎక్కువ. కాని తక్కిన నాలుగు ప్రాంతాలలోని నిష్పత్తి చాల తక్కువ. హంటర్ రచించిన 'ఇండియా ముస్లిములు' అనే పుస్తకము, విద్యా విషయములో ముస్లిముల హీనపరిస్థితికి ప్రసుత్వం కారణమని వివరించింది. ప్రభుత్వం అంతట ముస్లిములపట్ల తన భావాన్ని మార్చుకొన్నది. ముస్లిము సంఘము వారి విద్యావ్యాప్తికై ఎక్కువ ప్రోత్సాహాన్ని కలిగించవలెననే తీర్మానాన్ని, ప్రభుత్వము ప్రకటించింది. (1871 ఆగష్టు 7) ఒక సంవత్సరం తర్వాత, వెంటనే మరియొక తీర్మానాన్ని ప్రకటించి, 1871 నాటినుంచి ఈ విషయమై జరిగిన అభ్యుదయమెట్టిదో పరిశీలించడానికి పూనుకొన్నది. "ముస్లిములకు వారి భాగమైన ఉన్నత విద్యావకాశాలను పూర్తిగా కల్పించడానికీ, వారి జీవితాని కుపయోగించే విద్యావ్యాప్తికి తగిన ఏర్పాట్లు గావించడానికీ, వారి జాతికి, సంస్కృతికి, అనుగుణమైన ముస్లిము ప్రాచీన విద్యకు భంగము కలిగించనివిధంగా, నూతన విద్యాప్రణాళిక నేర్పరచడానికీ, ప్రభుత్వము నిశ్చయించుకొన్నది."

1872-82 దశాబ్దంనాటికి, కళాశాలలలో చదువుతున్న ముస్లిముల సంఖ్య, మొత్తము విద్యార్థుల సంఖ్యలో 3.65 శాతము. ఆంగ్ల మధ్యమ, ఉన్నత, పాఠశాలలలో వీరిశాతం 9.2. ఇండియాలోని ముస్లిముల సంఖ్యానిష్పత్తి 22.8. వీటిని బట్టి పరిశీలిస్తే, ముస్లిము సంఘములో జరిగిన విద్యావ్యాప్తి తృప్తికరమైనదికాదని విశదమౌతుంది. ప్రజలలో ఒక వర్గానికి మాత్రమే ప్రత్యేకావకాశాలు కల్పించడం హానికరమైనదని" హంటర్ కమిషన్ అంగీకరిస్తూ, స్వశక్తిపై ఆధారపడి, త్యాగానికి పూనుకొని అభివృద్ధికి రావలసిందని, ముస్లిముల నొకవైపు ఉద్బోధిస్తూ "మహమ్మదీయుల విద్యా బాధ్యతను, స్థానిక, పురపాలక, ప్రాంతీయ ప్రభుత్వాల నిధులు ప్రత్యేకంగా వహించవలసిందని" సిఫార్సు గావించినది. మరియు, ముస్లిముల దేశీయ విద్యాశాలలను ప్రోత్సహించడం, ముస్లిము పాఠశాలలకు ప్రత్యేక విద్యాప్రమాణాల నేర్పరచడం, ముస్లిము ప్రాథమిక మాధ్య

మిక పాఠశాలలలో, హిందూస్తానీని బోధన భాషగా నియమించడం, హిందూస్తానీ భాషా బోధనకు ప్రత్యేకమైన ఏర్పాట్లు గావించడం, ముస్లిము సంస్థలు ప్రత్యేకించి యిచ్చిన నిధులను ఆంగ్ల విద్యాలయాల స్థాపనకై, వినియోగించి, ఆ విద్యాలయాలలో ముస్లిములనే, అధ్యాపకులుగా నియోగించడం, ముస్లిములనే పర్యవేక్షకాధికారులుగా నియమించడం, - ఇత్యాదులన్నీ మహమ్మదీయుల విద్యాభివృద్ధికై, హంటర్ కమిషన్ సూచించిన పద్ధతులు. ముస్లిముల విద్యాభివృద్ధి విషయమై ప్రత్యేకాభిమానాన్ని చూపడానికి డఫ్ఫెరిన్ ప్రభుత్వము సమ్మతించి, కమిషన్‌వారి సలహాలను చాలవరకు అంగీకరించింది.

తత్ఫలితంగా, 1891-92 నాటికి, సాధారణ కళాశాలలలోని ముస్లిము విద్యార్థుల సంఖ్య 5.9 శాతము ; వృత్తికళాశాలల్లో 7.5 శాతము, ఉన్నత పాఠశాలలలో 14.0 శాతము, అయింది. ముస్లిముల జన సంఖ్య ఆ కాలములో 21.8 శాతమైఉండినది. ముస్లిముల అక్షరాస్యత శాతం (1886-87లో) మొత్తను జనాభాలోని ముస్లిముల నిష్పత్తికి సమానంగా (అనగా 22.5) ఉండినది. ఉన్నత విద్యాశ్రేణులలో మాత్రము, ముస్లిములకు, హిందువులకు, భేదం ఎక్కువగా ఉండింది.

1903 నాటికి, మొత్తంమీద, ముస్లిముల విద్యావ్యాప్తి కొంత వెనుకబడింది. 22.6 శాతమైయున్న మొత్తం ముస్లిము జనాభాలో, విద్యార్థులసంఖ్య 18.8 శాతం. ఈ మార్పు తీవ్రమైనది కాదు. ఉన్నతవిద్య విషయములోనే తీవ్రమైన భేదం ఏర్పడినది. ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలలోని ముస్లిము విద్యార్థుల సంఖ్య 19.7 శాతము ; ఉన్నత పాఠశాలలలో 14.4 శాతం ; కళాశాలలలో 7.3 శాతం ; వృత్తి విద్యాకళాశాలల్లో 6 4 శాతము ; ఐ ఉండినది. ప్రత్యేక విద్యాసంస్థలలో ముస్లిముల సంఖ్య హిందువుల సంఖ్యా నిష్పత్తికంటె అధికము. అనగా మొత్తములో 72 శాతము.

ముస్లిములకు ప్రభుత్వము చూపిన ప్రత్యేకాభిమానంవల్ల అభివృద్ధి ఎక్కువగా జరిగినదా, అనే విషయము, సంశయంతో కూడినది. విద్యకు ప్రధానమైన ప్రేరణ, ప్రభుత్వోద్యోగ సంపాదనకుగల అవకాశము. కాని, ప్రభుత్వము యొక్క ఆదరంవల్ల, కింది ఉద్యోగాలకు మాత్రమే అవకాశ మేర్పడగలదు. ఐతే ఈ ఉద్యోగాలకు వ్యక్తులను నియోగించే అధికారము, ఆయా శాఖాధికారుల దృక్పథంపై ఆధారపడింది. ఆ ఉద్యోగాలకు, వాస్తవంగా, విశ్వ విద్యాలయాల పట్టాలు అవసరం కాదు. ఈ కారణాలవల్ల ఉన్నత విద్య ముస్లిములకు ఆకర్షణీయము కాలేదు.

అదికాక, విశ్వవిద్యాలయ పట్టభద్రుల సంఖ్యా, విశ్వవిద్యాలయాల్లో కొంత కాలం చదివిన వారి సంఖ్యా అధికమౌతూ వచ్చినందువల్ల, ఉద్యోగాల సంఖ్య కంటె, విద్యావంతుల సంఖ్య అధికమయింది. కనుక, ఖాళీ ఉద్యోగాలకు పోటీ ఏర్పడింది. ఉద్యోగాలకు వినియోగించడంలో, యోగ్యతకు ప్రాధాన్యము తగ్గుతూ వచ్చింది. ముస్లిములకు దేశములోగల ప్రాధాన్యాన్ని అనుసరించి, వారికి తగినన్ని

ఉద్యోగ స్థానాలను ప్రత్యేకించవలసినదనే ఆందోళన ముస్లిములు గావిస్తూ వచ్చిరి. ప్రభుత్వమిందులకంగీకరించడం వల్ల రెండు విధములైన పరిణామము లేర్పడినవి. హిందూ అభ్యర్థులతో బహిరంగంగా పోటీ చేయడానికి ముస్లిములు సమ్మతించ లేదు. విద్యా విషయంలో ప్రమాణాన్ని పెంచుకొనే ప్రయత్నానికి కూడా ముస్లిము యువకులు పూనుకోలేదు. ఇక, ముస్లిముల పట్ల, ఉద్యోగముల విషయములో ప్రభుత్వము చూపుతున్న విశేషాదరణ, హిందువులకు అనిష్టం కలిగించింది.

## II. ఆంగ్ల విద్య - జాతీయోద్యమము

పందొమ్మిదో శతాబ్దములో జరిగిన పాశ్చాత్య విద్యా వ్యాప్తిని పరిశీలించడం వల్ల, భారతీయుల మనస్సును పరివర్తనం గావించడంలో, ఈ విద్యా ప్రభావ మెట్టిదో విశదమయింది. గ్రీకు విద్య యొక్క పునరుజ్జీవనం వల్ల యూరోపులో ఆధునిక యుగం ఏర్పడినట్లుగా, పాశ్చాత్య విద్యవల్ల భారతదేశములో నూతన యుగం ప్రారంభమయింది. మత సాంఘిక సంస్కరణలు, భావనా స్వాతంత్ర్యము, జ్ఞానోదయము, లేక, తార్కిక పరిజ్ఞానము, చారిత్రక దృక్పథము, సాంఘికోద్యమాలకు ప్రేరకమైన దేశభక్తి యనే గుణాత్రము-ఇత్యాది ప్రబల ఉద్రేక శక్తులన్నియూ పాశ్చాత్య సాహిత్యమును-ముఖ్యంగా ఆంగ్ల సారస్వతమును, తత్త్వ శాస్త్రాన్ని, విజ్ఞాన శాస్త్రాన్ని అధ్యయనం చేయడం వల్ల భారతీయులలో సిద్ధించినవి. ఐనా, యూరోపు దేశములో ఏర్పడినంత మార్పు భారతదేశములో కలగక పోవడానికి కారణాలున్నవి. ప్రజల ఆర్థిక పరిస్థితులు-ముఖ్యంగా జనానీకంలో-అభివృద్ధి పొందక స్తబ్ధంగా నిలిచిపోయినవి. పరిపాలకులకు, పాలిత ప్రజకు ఉండవలసిన సన్నిహిత సంబంధం లోపించడం వల్ల, ప్రభుత్వ సంస్థలలో కూడా ఈ రెండు పక్షాలకూ సాహచర్యం ఏర్పడలేదు. కనుక, రాజకీయ కార్యాచరణకు ప్రేరణ లేకపోయింది.

కాబట్టి, ఆధునిక భారత సమాజ పరిణామానికీ, భారత ప్రజల ఐక్యమునకూ పాశ్చాత్య విద్య దోహదం గావించిన విషయము, చారిత్ర్యక దృష్ట్యా వాస్తవమే కాని విద్యా ప్రక్రియ దోషభూయిష్ఠమై యున్నందువల్ల, ఆ దోషాలు వ్యక్తి ప్రవృత్తిలోను, సామూహిక ప్రవృత్తిలోను ప్రతిబింబించినవి.

విద్యా ప్రణాళికలో, సాహిత్యానికి, అధ్యయనానికి మాత్రమే ప్రాధాన్య మేర్పడినందు వల్ల, సాంప్రదాయకమైన పుస్తక పఠనము, అవాస్తవికత-మాత్రమే విద్యార్థులకు సిద్ధించిన విద్యాఫలం. సనాతన భారతీయ విద్యవల్ల సిద్ధించిన ఫలమే, ఆధునిక విద్యవల్లకూడా సిద్ధించింది. దేశ్యములు, అని నిరసన భావముతో భారతీయ భాషలను పోషింపక పోవడము, తత్ఫలితంగా అవి ఆధునిక భావ వ్యక్తీకరణానికి ప్రయోజనములు కాకపోవడము, కారణంగా, ఆంగ్ల భాషాపరిజ్ఞానము లేని ప్రజలు - (వారే అధిక సంఖ్యాకులు) ఆధునిక ప్రపంచములో ప్రవేశించలేక పోయిరి. మధ్య యుగాల ప్రపంచంలోనే నిలిచిపోవలసిన వారైరి. అంతమాత్రమే

కాక, విద్యావంతులకు, వీరికి గల అంతరం అధికమయింది.

ఉన్నత పాఠశాలలలోను, కళాశాలల్లోను, ఆంగ్లము బోధన భాషగా ఏర్పడడంవల్ల, మరియొక దుష్టపరిణామం ఏర్పడింది. బ్రిటీషు పరిపాలనకు పూర్వము, హిందువు లనేకులు పారసీక భాషను, కొంతవరకు అరబ్బీభాషను కూడా అధ్యయనం చేసేవారు. అదేవిధంగా, ముస్లిములుకూడా ఇతర భారతీయ భాషలను చదువుతూ, వ్రాస్తూ ఉండిరి. కొందరు సంస్కృతభాషనుకూడా నేర్చుకొనేవారు. కాని, ఆంగ్లము బోధనభాషగా ఏర్పడిన తరవాత, ఆంగ్లముతో పాటు పారసీక, అరబ్బీ భాషలను కూడా అధ్యయనం గావించడం హిందువులకు కష్టమయింది అదే విధమైన కష్టము ముస్లిములకు కూడా ఏర్పడి, సంస్కృతాధ్యయనం మానివేసిరి. ఒకరి సారస్వతాన్ని మరియొకరు గ్రహించే అవకాశము ఈ విధంగా లోపించడం వల్ల, రెండు మతములవారూ పరస్పరం దూరమై పోవడం జరిగింది. ఐనా, పాశ్చాత్య భావాలను రెండు మతాలవారూ గ్రహించడం వల్ల అభిప్రాయసామ్యం ఏర్పడి, ఈ అంతరం కొంతవరకు తగ్గినదనడం వాస్తవమే.

విదేశ భాషద్వారా విద్యాబోధనం జరగడంవల్ల మానసికపరిణామము లెటువంటివి అనే విషయాన్ని, నిశ్చయించడం కష్టము. కాని, అనవసరంగా జ్ఞాపకశక్తికెక్కువ ప్రాధాన్యము కలగడము స్వతంత్ర పర్యాలోచనశక్తి కుంఠితము కావడము, అనే దుష్ట ఫలితాలు ఏర్పడిన వనడం మాత్రం నిజమే

గత అర్ధ శతాబ్దములో జరిగిన విద్యావ్యాప్తిని పరిశీలించి, దాని ఫలితమును తెలిసికొన్న పిమ్మట, కర్జన్, గావించిన నిర్ణయము, అతని సంశయాలను వ్యక్తం చేస్తుంది. "ఇండియాలో ఆంగ్ల విద్యావ్యాప్తి విషయములో గావించిన ప్రయోగము అసమంజసమైనది, దాని పరిణామము హానికరమైనది, అని బాహాటంగా విమర్శించే వర్గంవారున్నారు. ఈ విద్యాప్రసారము, క్రమశిక్షణ రహితము, అసంతుష్టియుతము, విశ్వాసశూన్యము, ఐన విరుద్ధ మానసికశీల పరివర్తనములను తెచ్చిపెట్టినదని ఈ విమర్శకులు అభిప్రాయ పడియున్నారు".

ఈ అభిప్రాయంతో, కర్జన్, పూర్తిగా అంగీకరింపకపోయినా, భారతీయ విద్యా విధానం ప్రభుత్వాధీనమునకు దూరమై, దేశీయుల హస్తగతమైపోయినదనీ, విద్యావంతులైన భారతీయులు, రాను రాను ప్రభుత్వాన్ని తీవ్రంగా విమర్శించడానికి, ఆక్షేపించడానికి పూనుకొంటున్నారనీ, గ్రహించినాడు. భారతీయ నాయకులు గావించుచున్న ఈ విమర్శనకు అధికారుల భాషలో "ప్రభు విద్రోహ" మనే పేరు సిద్ధించింది. కనుక, ఈ ప్రవృత్తులను పరావర్తనము గావించడానికి తగిన మార్గాన్వేషణానికి బూనుకొన్నాడు. పాశ్చాత్యవిద్యకు, భారతీయ విద్యావంతుల ప్రవృత్తులకు పరస్పర సంబంధమున్నదని గ్రహించినాడు, కనుక విద్యా ప్రమాణములు తగ్గిపోయినవనే మిషతో తన చర్యను సమర్థిస్తూ, విద్యా విధాన విషయములో జోక్యం కలిగించుకోడానికి నిశ్చయించుకొన్నాడు. సిమ్లాలో జరిగిన విద్యాసమావేశములో ఉపన్యసిస్తూ, ప్రాథమిక ఉన్నత పాఠశాల, విశ్వవిద్యాలయ విద్యలలోని దోషములను, లోపములను సూచించి, విశ్వ విద్యాలయ

విద్యనుగూర్చి, ఈ క్రింది విధంగా తన అభిప్రాయాన్ని వెల్లడి చేసెను. "విశ్వ విద్యాలయాలనుండి పట్టాలు పుచ్చుకొనేవారి సంఖ్యమాత్రం, బాగా పెరిగింది. కాని, అధ్యయన విషయాల ప్రమాణములు, పరీక్షా ప్రమాణములు యోగ్యత విషయములో దిగజారిపోయినవి. పాఠ్య పుస్తకాల నిర్ణయము, దోషయుక్తమై ఉన్నది. ద్రవ్య సంపాదనమే ప్రధాన ప్రయోజనంగా, పరీక్షలలో ఉత్తీర్ణులై, యువకులు పట్టాలు పుచ్చుకొంటున్నారు. కళాశాలల్లోని విద్యార్థులు ఒక తరగతి గదినుండి మరియొక తరగతిగదికి, గొర్రెలవలె పోతున్నారు. సెనేటులోని సభ్యుల సంఖ్య పెచ్చు పెరిగింది. సభ్యులను ఎన్నుకోవడములో, విద్యాయోగ్యత తప్ప, తక్కిన అర్హతలన్నీ కారణములైనవి. సిండికేటుకు శాసన రూపమైన అధి కారం శూన్యము. ఇట్లు విశ్వవిద్యాలయ విధానమంతా, తప్పుగా నిర్దేశింపబడిన మార్గాల్లో, శక్తినంతా వ్యర్థం చేస్తూ ఉన్నది. ఈ విధానమంతటనీ ఆవరించి, ప్రబల హానికరమైన 'కంఠస్థ' మనే భూతం, పరిపాలన సాగిస్తూ ఉన్నది." ఈ విధానాన్నంతటినీ, ఒక వాక్యంలో సంగ్రహంగా వివరించినాడు. "వాస్తవమైన మానవ జీవితమునకు, ప్రజ్ఞాజీవితమునకు, శీలపోషణకు, ఆత్మపోషణకు సాధ నమూ, ఆవశ్యకనూ ఐన, ప్రయత్నము చూచాయగాకూడా గోచరించడం లేదు."

ఇతడు గావించిన విమర్శ అతిశయోక్తి అనడం సువ్యక్తమే. ఐనా, ఈ ఆక్షేపణ నిరాధారమైనది కాదు. ఈ విధానాన్ని బాగుపరచడానికి, కర్జన్, సూచిం చిన మార్గము, విద్యా ప్రమాణాన్ని పెంచడానికి ఉద్దేశించినది. కాని కళాశాల విద్యకు పూనుకొనే వారి సంఖ్య మాత్రం, ఈ నూతన విధానం వల్ల తగ్గిపోతుంది. అతడు చెప్పినదాన్ని బట్టి, "మనం దృష్టిలో నుంచుకోవలసినవి విద్యాప్రమాణము, దాని స్వభావము, పట్టభద్రుల సంఖ్య ప్రధానం కాకూడదు." అని తేలింది. భార తీయ ప్రజాభిప్రాయానికీ, కర్జను యొక్క అభిప్రాయానికీ బహిరంగంగా ఘర్షణ ఏర్పడింది. ఇంతవరకూ దేశములో సిద్ధించిన అక్షరాస్యుల సంఖ్య 10 శాతమే ఐయుండడం వల్ల, భారతీయులకు ఇదివరకే అసంతుష్టి ఏర్పడి యున్నది. అక్ష రాస్యత వృద్ధి కావడం దేశానికి ప్రయోజకరమైన విషయము. అట్టి సందర్భంలో, కర్జన్, ఉద్దేశమూ అతడు పూనుకొన్న ఉద్యమమూ, దేశీయుల సంశయానికి హేతువులు కావడం ఆశ్చర్యం కాదు. విశ్వవిద్యాలయ విద్యా విధానాన్ని విచారణ గావించడానికి, కర్జన్, నియమించిన 'ర్యాలే విద్యా సమితి' (Raleigh Education Commission), తన నివేదికలో, విశ్వవిద్యాలయ పరిపాలనను నూతన నంగా ఏర్పాచవలెనని సూచించినది. పరీక్షలు నడపడమే కాక, విశ్వవిద్యాలయాలు, బోధన కార్యక్రమానికి కూడా పూనుకోవడం, సంయోజితములై యున్న కళా శాలలపై ఇంకను అధికంగా పర్యవేక్షణాధికారము వహించడం, నూతన కళా శాలల సంయోజన విషయంలో ఎక్కువ షరతులను నియమించడం-మున్నగు సలహాలను ఈ కమీషన్, చేసింది. 1904 నాటి ఇండియా విశ్వవిద్యాలయ శాస నము, ఈ సలహాలను అంగీకరించి, అమలు జరిపింది. దీనివల్ల, విశ్వవిద్యాలయాల

నియమనాలను మార్చడానికి, త్రోసివేయడానికి, తానై నియమాలను విధించడానికి, ప్రభుత్వానికి అధికారము సిద్ధించింది.

ప్రభుత్వ బాధ్యతను, దేశ బాధ్యతను గుర్తిస్తూ, మిత వాదాన్ని అవలంబించిన గోఖలే వంటి భారతీయ ప్రముఖుడు, విద్యావేత్త కూడా, ఇంపీరియల్ శాసన సభలో ఉపన్యసిస్తూ, భారతీయులకు విద్యావ్యాప్తి విషయములో కలిగిన అసంతుష్టి ఎట్టిదో వివరించెను. "కర్జన్ అమలు జరిపిన విధానం పట్ల, భారతదేశములోని విద్యావంతులు విరుద్ధ భావం వహించినారని" శాసన సభకు తెలియబరచినాడు. విశ్వవిద్యాలయాల నుండి ప్రవహించి వస్తున్న బి. ఏ.ల అసంతుష్టి విద్యా ప్రమాణ విషయంలో ప్రభుత్వం గావించిన విమర్శనను గూర్చి ప్రస్తావిస్తూ "విశ్వవిద్యాలయ పాలక సమితీలను, నూతన విద్యా శాసనములోని నిబంధనల ప్రకారం మార్చడం వల్ల, దేశీయుల ఉన్నత విద్యా వ్యాప్తి ప్రయత్నము భంగపడుతుంది. నూతనంగా ఏర్పడే సమితీలు, సాధింపబోయే ప్రయోజనము, సంశయాత్మకమైనది. కాని, వాటివల్ల హాని మాత్రము వాస్తవంగా, తప్పక జరిగి తీరుతుంది." అని నిష్కర్షగా వాదించినాడు.

కర్జన్, తన ఉపన్యాసంలో ప్రస్తావంగా సూచించిన హితకర సంస్కరణలు, ఆశాజనకములైనవే. కాని, "సంతోషకరమైన ఆ ఆశ, మా హృదయాలలో పుట్టీ పుట్టక పూర్వమే, దానిని చంపివేసినారు. మేమెంతో కాలమునుండి ఆశించి ఎదురుచూస్తున్న ఉత్తమ విధానానికి మారుగా, సంకుచిత భావాలతో, అంధాభిమానంతో కూడిన నిపుణుల పరిపాలనను కొనసాగించే ప్రయత్నమే మరల ప్రారంభించింది".

కర్జన్‌కు, భారతదేశ విద్యావంతులకు ఏర్పడిన ఈ ఘర్షణ కారణంగా, హిందూ కళాశాల స్థాపనతో ప్రారంభించి, పందొమ్మిదో శతాబ్ద మంతటా ప్రవృత్తమౌతూ వచ్చిన భారతీయ విద్యావిధాన ప్రక్రియ, పరిపక్వదశకు వచ్చింది. ప్రతిబంధకముల నెదుర్కొంటూ ఇంతవరకు హిందూకళాశాల సాధించిన విద్యా ప్రయోజనము ప్రజోపకరమైనది కావచ్చు, కాకపోవచ్చు. అందులో శిక్షణ నొందిన విద్యార్థుల సంఖ్యా, విద్యాప్రమాణమూ, అధికమైనవి కాకపోయినా, తదుద్యమ ఫలితాలు మాత్రం, దేశశ్రేయమునకు కారణములైనవి అనడంనిజము. మానసిక స్వాతంత్ర్యాన్ని సిద్ధింపజేయడమే విద్యయొక్క ప్రధాన ప్రయోజనము. స్వాతంత్ర్యాన్ని పొందిన మనస్సు, పరప్రభుత్వ నిర్బంధంలో చిరకాలం చిక్కుకొని ఉండజాలదు. కర్జనుకు, పూర్వపు ప్రభువులు సంశయిస్తూనే, వెను కంజవేస్తూ, భిన్న ప్రయోజనాల నాశించి సృష్టికి దెచ్చిన పాశ్చాత్య విద్యా ప్రభావమనే ఫ్రాంకెన్‌స్టీన్ (Frankeinstein) పిశాచాన్ని, ఉచ్చాటన గావించడానికి ప్రబల సామ్రాజ్యవాదియైన కర్జన్, బూనుకొన్నాడు. విద్యావ్యాప్తివల్ల జరుగబోయే పరిణామాన్ని కొందరాంగ్లేయు లిదివరకే గుర్తించియుండిరి. కాని, అట్టి పరిణామము శ్రేయస్కరమైనదనే మానవత్వము, జ్ఞానము వారికి సహజమై ఉండినది. ఇట్టి భావిదృష్టిగల ఇతరాధికారులు, విద్యావ్యాప్తివల్ల తమ సామ్రా

జ్యానికి పతనం సిద్ధించగలదని గుర్తించి, దానిని భంగపరచడానికి యత్నించిరి. కాని, జాతీయ భావానికి విరుద్ధములైన మార్గాలలో విద్యావిధానాన్ని నడిపే ప్రయత్నము, దానిని అణచిపెట్టే ప్రయత్నము, విఫలం కావడం తప్పలేదు. కర్జన్ ప్రభువుపాతిన విషవృక్ష ఫలాన్ని, అతని తరువాతివారు అనుభవించవలసి వచ్చింది.

## III. భారతీయ పత్రికలు (1860-1900)

1857 వరకు భారతదేశములో జరిగిన పత్రికాభివృద్ధి పూర్వప్రకరణములో వివరింపబడింది. విప్లవం తరువాతికాలంలో జరిగిన పత్రికల అభివృద్ధికి అధిక ప్రాధాన్యమున్నది పందొమ్మిదో శతాబ్దపు మధ్యకాలము, దానికి శైశవావస్థ యని చెప్పవచ్చును. పత్రిక లనేకములు బయలుదేరినవి కాని, అవి చాలకాలం నిలువలేదు. వాటికి ప్రచారంకూడా తక్కువే. చాలవరకు ఆ వారపత్రికలు నాలుగు పేజీలకు మాత్రమే పరిమితమై యుండినవి.

ఈ మధ్యలో, ఆంగ్ల విద్య, దేశములో ప్రసారమౌతూ వచ్చింది. మధ్య తరగతుల వారి అభివృద్ధికిది సూచకము. పాఠశాలా కళాశాలల సంఖ్య పెరిగింది. మొదట, మూడు విశ్వవిద్యాలయాలు మాత్రమే ఉండినవి. అవి 1887 నాటికి, ఐదు ఐనవి సాంఘిక మత సంస్కరణోద్యమాలు ప్రజలలో నూతన సంచల నాన్ని కలిగించినవి సంస్కర్తలకు, సంప్రదాయవాదులకు మధ్య జరుగుతున్న వివాదాలు, చర్చలు, ప్రజలలో ఉద్రేకాన్ని తెచ్చిపెట్టినవి. విప్లవంలో జరిగిన ఘోరాలు, విప్లవ పరిణామాలు బెంగాలు ప్రాంతంలోని రాజకీయ జీవనాన్ని స్పృశింపలేదు. కాని, బ్రిటీషు అధికారుల ప్రవృత్తిలో ఏర్పడిన మార్పు, గ్రామ సీమలలో దిన దినమూ ఎక్కువగుచున్న ఆర్థికదుస్థితియొక్క ఒత్తిడి, ప్రభుత్వ పరిపాలన వ్యవహారములన్నిటనుంచి, భారతీయులకు కలిగిన బహిష్కృతి,—ఇవి దేశీయులలో తీవ్రమైన అసంతుష్టిని తెచ్చిపెట్టిన ప్రధానాంశాలు విదేశాలలో జరుగుతున్న ఉద్రేకపూరిత ఉదంతాలలో భారతీయుల కాసక్తి ఏర్పడింది. జర్మనీ ఐక్యానికి జరుగుతున్న ఉద్యమము, ఇటలీ దేశపు స్వాతంత్ర్యోద్యమము, ఐర్లండు లోని స్వపరిపాలనాందోళనము, ఆఫ్రికాలో పాశ్చాత్య ఆధిపత్య విస్తృతి, ఈజిప్టు సూడాన్ దేశాల బ్రిటీషు ఆక్రమణము, పాశ్చాత్య రాజ్యాలు ఆఫ్రికా ఖండాన్ని పంచుకోవడము-మొదలైన ఉదంతములన్నీ భారతీయుల రాజకీయ దృష్టి నాకర్షించినవి. ఏషియా ఖండములోని చైనా, మరియు, ఆగ్నేయ, పశ్చిమ, మధ్య ప్రాంతాలూ, పాశ్చాత్య సామ్రాజ్యాధిపత్యానికి లోబడిపోయే పరిస్థితి ఏర్పడింది.

ప్రపంచ సంఘటనలు, ఈ విధంగా, వార్తా విషయక అభిలాషను ప్రజలలో ప్రబలం కావించినవి. ఈ అభిలాషను తీర్చగలిగిన సాధనములు వార్తా పత్రికలే. ప్రభుత్వము అమలు జరిపిన నిబంధనల విషయంలోను, ప్రభుత్వమవలంబించిన విధానముల విషయంలోను, ప్రజాభిప్రాయాన్ని తెలుపడానికి, తగిన రాజ్యాంగ

యంత్రము దేశంలో లేదు. ప్రజల కష్ట సుఖాలను ప్రభుత్వపు దృష్టికి తెచ్చే రాజకీయ సంస్థలు కూడా లేవు. కనుక, ప్రజల కోరికలను, వారి ఆక్షేపణలను బహిరంగం కావించడానికి, పత్రిక మాత్రమే సాధనంగా ఏర్పడింది. ఇట్లు, ప్రజాభిప్రాయ ప్రచారం గావించడంలో పత్రికలు, ప్రధాన పాత్రను నిర్వహించినవి.

కాని, పత్రికోద్యమము ఆరంభదశ నుండి కూడా ప్రబల కష్టాలకు గురియైనది. విమర్శనే మాత్రమూ సహించలేదు, ప్రభుత్వము. 1857 కు పూర్వము రాజప్రతినిధిగా నుండిన మెట్‌కాఫ్, 1857 తర్వాత రిప్పన్-వంటి ఉదారహృదయులు తప్ప, తక్కిన ప్రభువులందరూ, పత్రికలను పీడాకరమైనవి గాను, వ్యాకుల కారకములైనవి గాను, గణించి, అసహ్యించుకొనిరి. 'స్వచ్ఛంద పరిపాలన విధానము శ్రేయస్కరమైనదే. దానికి అసంబద్ధమైనవి పత్రికలు' అనే, సర్ జార్జ్ క్యాంప్‌బెల్ అభిప్రాయముతో వీరంగీకరించినారు. పత్రికలు, లేకుండా ప్రభుత్వము నడవడమా, లేక, దేశంలో ప్రభుత్వము లేకుండా పత్రికలు నడవడమా-అనే రెండు పరిస్థితుల్లో, కడపటిదే, తనకంగీకారమని, నుడివిన జెఫ్ఫర్‌సన్ అభిప్రాయము బ్రిటీషు ప్రభువులకు దైవశాపంగా పరిణమించింది.

***ఆంగ్ల పత్రికలు:*** దేశములోని పత్రికా ప్రచురణము, ఆంగ్లపత్రికలతో ప్రారంభమయింది. స్టాండర్డ్, టెలిగ్రాఫ్, కోరియర్, బోంబే టైమ్స్,—ఈ నాలుగు పత్రికలు మేళనమై టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రికగా, 1861 లో స్థాపింపబడింది. మొట్టమొదట వెలువడిన ప్రచురణలో రేవు పట్టణంగా బొంబాయి నగరానికి గల ప్రాధాన్యము, ఇండియా ప్రభుత్వ కేంద్రంగా ఏర్పడడానికి దానికి గల యోగ్యత,—అనే విషయాలను ప్రకటించి, ఈ పత్రిక తన సమర్థతను ప్రదర్శించింది. "వాణిజ్య విషయంలోను, యుద్ధచర్యల విషయంలోనుకూడా సాధన సంపత్తిగలదై, ఏషియా ఖండానికి సహజకేంద్ర స్థానము, వర్తకస్థానము ఐయున్న, బొంబాయి నగరముయొక్క విశాల భవిష్యత్తు ఎంతటిదో అను విషయము, ఎట్టి ఆశావాది ఊహకు కూడా అందరానిది. బొంబాయినగరము సామ్రాజ్య ప్రదర్శినియై ఉండగా, పత్రిక ఇంతవరకూ ప్రాంతీయ ప్రదర్శినియై ఉండినది. దేశములోని ఉదంతముల ననుసరించి, వాటితోసహా ముందుకు నడవడానికి మేము పూనుకొనియున్నాము. కావున, 'టైమ్స్ ఆఫ్ ఇండియా' అనే విశాల ప్రయోజన స్ఫోరకమైన పేరును గ్రహించియున్నాము".

అలహాబాదునుండి పయొనియర్ పత్రిక 1865లో వెలువడింది. ప్రభుత్వము యొక్క అభిప్రాయాలను, ఆంగ్లో-ఇండియనుల భావాలను ప్రకటించడం, ఈ పత్రికయొక్క ప్రయోజనమని, ప్రజలు తలచినారు. 1872 లో, సిమ్లాలో ప్రారంభించి, తరువాత (1876) లాహోరుకు మార్చబడిన 'సివిల్ అండ్ మిలిటరీ గెజట్' అనే పత్రిక, సివిల్ మిలిటరీ సేవలోనున్న ఉద్యోగుల ప్రయోజనార్థము స్థాపితమైనట్టిది. తరువాతి కాలములో, రచయితగా ప్రసిద్ధి చెందిన రడ్‌యార్డ్ కిప్లింగ్ (Rudyard Kipling), ఈ పత్రికకునూ, పయొనియర్ పత్రికకునూ, అధీన సంపాదకుడుగా పనిచేసినాడు. రాబర్ట్‌నైట్ 'ఫ్రెండ్ ఆఫ్ ఇండియా'

పత్రికను కొని, కలకత్తాలోని 24 గురు ఆంగ్ల వర్తకుల సహాయముతో 'స్టేట్స్మన్' పత్రికను స్థాపించెను. 'మద్రాసు మెయిల్' 'మద్రాసు స్టాండర్డ్' అనేవి మదరాసు రాజధానిలోని ఆంగ్లో-ఇండియనుల ప్రయోజనాలను సమర్థించడానికై ఏర్పడిన పత్రికలు. 1877 లో ప్రారంభమైన 'స్టాండర్డ్' పత్రిక, 1892 లో భారతీయుల హస్తగతమై, దేశీయుల అభిప్రాయాలను తీవ్రంగా సమర్థించే స్వతంత్ర, అభ్యుదయవాదపత్రికగా అభివృద్ధి చెందింది.

***భారతీయులు నెలకొల్పిన ఆంగ్ల పత్రికలు*** : పైన పేర్కొన్నవన్నీ ఆంగ్లో-ఇండియను వారపత్రికలు. భారతీయులు నెలకొల్పి, భారతీయుల సంపాదకత్వములో నిర్వహింపబడిన పత్రిక లింతకంటెను ముఖ్యములైనవి. గిరీశచంద్ర ఘోష్, ప్రథమంలో రెండు సంవత్సరాల కాలము సంపాదకుడుగా నిర్వహించిన 'హిందూ పేట్రియట్' పత్రిక, వీటిలో చాల ముఖ్యమైనది. 1855 లో హరీశ చంద్ర ముఖర్జీ, దీనికి సంపాదకత్వం వహించినాడు. తోట పరిశ్రమలను నడపుచుండిన పాశ్చాత్యుల దుండగాలను, నిర్భీతిగా, ప్రకటించి, పీడితులైన రైతుల బాధలను తొలగించిన వాడితడు. అతని మరణానంతరము (1861) క్రిస్టోదాస్ పాల్ ఈ పత్రికకు సంపాదకుడైనాడు. ఆంగ్లవిద్య నభ్యసించిన వారి కితడు తగిన ప్రతిబింబము. బ్రిటీషు పరిపాలనను మెచ్చుకొని, వారి ఉదారవాదాన్ని ఇతడవలంబించినాడు. అతని పలుకుబడికి లోనై, బెంగాలు మధ్యతరగతిలోని ఉన్నతశ్రేణికి చెందిన జమీందారుల ప్రయోజనాలకై, ఈ పత్రిక పాటుపడింది.

పేట్రియట్ పత్రికకు ప్రత్యాఘాతంగా, గిరీశచంద్రఘోష్, "బెంగాలీ" అనే పత్రికను 1868 లో ప్రారంభించెను. రైతుల అభిప్రాయాలను, వారి అవసరాలను ఈ పత్రిక సమర్థిస్తూ వచ్చింది. ఈ పత్రికలో వ్యాసములను ప్రచురించుచుండిన సురేంద్రనాథ బెనర్జీ, 1879 లో దీనిని తన అధీనం చేసుకొని, ఇండియా క●తటికి ముఖ్యమైన స్థానాన్ని దానికి కల్పించినాడు. ప్రభుత్వాన్ని నిర్భయంగా విమర్శిస్తూ, భారతదేశపు ఆవశ్యకములను గూర్చి, నిర్విరామంగా సమర్థించేవాడు.

అభ్యుదయ దృక్పథం గల మరియొక పత్రిక, 'ఇండియన్ మిరర్' అనే పేరుతో, మన్మోహన్ఘోష్ సంపాదకత్వంతో 1861 లో ప్రారంభమయింది. దీనికి ద్రవ్యసహాయ మొనర్చినవారు దేవేంద్రనాథ టాగోర్. కేశవచంద్రసేను కూడా దీనితో చేరి, కొంతకాలం సంపాదకీయాన్ని నిర్వహించెను. తర్వాత, నరేంద్రనాథ్ సంపాదకత్వంలో ఈ పత్రిక ప్రజాదరణపాత్రమయింది. ఘోష్ సోదరులని వ్యవహరింపబడిన, - శిశిరకుమార్, బసంతకుమార్, హేమంతకుమార్ - అనేవారు, 1868 లో 'అమృతబజార్ పత్రికను' జర్నలుగా ప్రారంభించిరి. ఈ పత్రిక 1882 లో కలకత్తాకు మారింది. 'దేశ్యభాషాశాసన' నిబంధనలను తప్పించుకొనే ఉద్దేశంతో, ఇది, 1878 లో ఆంగ్లపత్రికగా మారింది. ప్రభుత్వ కార్యక్రమాలను విమర్శించడంలో, ఈ పత్రిక ఖండితవాదాన్ని అవలంబించింది. 'రెయీస్ రయ్యత్' అనే పత్రికను శంభుచంద్ర ముఖర్జీ 1862 లో ప్రారంభించెను.

మదరాసులో ప్రథమ పత్రికా ఉద్యమము ఫలవంతం కాలేదు. దేశీయ సంఘం ప్రారంభించిన 'క్రెసెంట్', టి. మాధవరావ్, దివాన్‌బహదూర్ రఘునాథరావ్, ఇతరులు, కలిసి ప్రారంభించిన 'దేశీయ ప్రజాభిమతము', 'మద్రాసీ' అనే పత్రికలు ఎంతోకాలం నిలువలేకపోయినవి. కాని, ప్రజాభిప్రాయ ప్రచారానికి ఎక్కువ అవసరమేర్పడి, 1878 లో హిందూ పత్రిక స్థాపింపబడింది. ప్రసిద్ధుడైన జి. సుబ్రహ్మణ్యయ్యర్ నిర్దేశకుడుగా, ఈ పత్రిక శీఘ్రకాలంలోనే ప్రజల మన్ననకు పాత్రమయి, స్థిరపడింది. 'మదరాస్' 'స్టాండర్డ్' మొదట ఆంగ్లో-ఇండియను పత్రికగా బయలుదేరి, తరవాత 1892 లో జి. పిళ్లై హస్తగత మయింది. ఇతడు అభ్యుదయ నీతి ననుసరించి, పత్రికను నడిపినాడు. 'ఇండియన్ షోషియల్ రిఫార్మర్' అనే పత్రికను, సంఘసంస్కరణవాదియైన కె. నటరాజన్ స్థాపించెను.

బొంబాయి రాజధానిలోని దేశీయ వర్తకులు, పార్సీలు, బోహ్రాలు, గుజరాతీలు, వ్యాపార వ్యవహారాల ప్రయోజనార్థము ఒక సంస్థగా ఏర్పడి, టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రికలో తమ సంయుక్తోద్యమాలను, తమ అవసరాలను, అభిప్రాయాలను ప్రకటిస్తూ వచ్చిరి. రూఢివాదము ననుసరించిన ఈ పత్రిక, ప్రభుత్వ కార్యక్రమాలను దృఢంగా సమర్థించేది. ఆంగ్లములో జాతీయ వార్తా పత్రికను నిర్వహించడానికి బొంబాయిలో కూడా ప్రయత్నం జరిగింది. 'వాయిస్ ఆఫ్ ఇండియా' అనే మాసపత్రికను, దాదాభాయి నౌరోజీ 1882 లో ప్రారంభించెను. కొంతకాలానికీ పత్రిక, బెహరాంజీ, ఎమ్. మలబారీ, నిర్వహిస్తూ ఉండిన 'ఇండియన్ స్పెక్టేటర్' పత్రికతో ఏకమై, దానిలో కలిసిపోయింది. 'అడ్వొకేట్ ఆఫ్ ఇండియా' అనే పత్రికను ప్రచురించడానికి, 1886 లో ఫెరోజ్‌షా మెహ్తా, పూనుకొన్నాడు, కాని, దాని గతి ఏమైనదో తెలియదు. ఆంగ్ల విద్యాభ్యాసము బొంబాయి నగరానికీ, కొన్ని పట్టణములకూ మాత్రమే పరిమితమై ఉండినది. ద్విభాషా పత్రికలైన ఇందుప్రకాశ్, ధ్యానప్రకాశ్, సుధారణ్ (నేటివ్ ఒపీనియన్), దేశాభిప్రాయము, తదితరములు, ఆ పట్టణముల అవసరాలకు చాలిఉన్నవి. శతాబ్దం ముగిసే కాలానికి, 11 మరాఠీ - ఆంగ్ల పత్రికలు, 13 గుజరాతీ - ఆంగ్ల పత్రికలు ఏర్పడి యుండినవి. ప్రచారసాధనంగా, ఆంగ్లభాషలో తిలక్ ప్రారంభించిన, 'మహారాటా' పత్రికకు మంచి పలుకుబడి ఏర్పడింది. కాని, 'కేసరి' పత్రికకు కలిగినంత ప్రజాదరణ దీనికి కలుగలేదు.

ఉత్తరప్రదేశ్‌లో, మొట్టమొదటి జాతీయ పత్రిక, 'ఇండియన్ హెరాల్డ్' అనే పేరుతో, ఆంగ్లభాషలో ప్రారంభమయింది. దీనిని ప్రారంభించిన (1879) పండిత అయోధ్యానాథ్, ప్రబలమైన ఆంగ్లో-ఇండియన్ 'పయొనియర్' పత్రికను ప్రతిఘటించి, మూడు సంవత్సరాల కాలము, తన అభిప్రాయాలను, తాను అనుసరించిన పత్రికా నీతిని సమర్థించుకొన్నాడు. 1890 లో, 'ఇండియన్ యూనియన్' అనే మరియొక పత్రికను కూడా, పండిత్, ప్రారంభించెను. సర్దార్ దయాల్‌సింగ్ మజీతియా, పంజాబులో ప్రారంభించిన 'ట్రిబ్యూన్'

పత్రిక, 1881 లో వెలువడింది.

***దేశభాషా పత్రికల అభివృద్ధి :*** 1857 కు పూర్వమునుంచి, దేశభాషా పత్రికలకు, అందును ముఖ్యంగా, ఉర్దూ పత్రికలకు ఎక్కువ పలుకుబడి ఏర్పడి యుండినది. విప్లవ కాలంలో, ఈ పత్రికలు, ప్రధాన పాత్రను నిర్వహించినవి. 1857 తర్వాత, ప్రభుత్వ ప్రతిబంధకాలు, వ్యతిరేకత, తీవ్రములైనప్పటికీ, వీటి అభివృద్ధి, వేగవంతంగా జరిగింది. ఈ పత్రికలకు కలిగిన పలుకుబడి విషయమై ప్రభుత్వము జంకుతూ ఉండినది. అమ్ముడుపోతున్న పత్రికల సంఖ్య ఎక్కువ కాదు. కాని, ఒక పత్రికనే పలువురు చదువుతూ ఉండినందువల్ల, వాటి ప్రభావము, ప్రజలలో ఎక్కువగా ప్రసారమయింది. మరిన్నీ - ఈ పత్రికలను చదువుతున్నవారంతా, ఆంగ్లవిద్యాభ్యాసం వల్ల కలిగిన ఆధునిక భావాలకు లోనైన వారు కారు. కనుక, పత్రికలలో ప్రచురింపబడినదానిని, ఉన్నదున్నట్టుగా నమ్ముతూ ఉండేవారు. పత్రికలలోని విషయములపై వీరు గావించుచుండిన వ్యాఖ్యానాలు, విమర్శలు, సమకాలపు ఆంగ్ల పత్రికలపై జరిగే విమర్శల కంటెను, తీక్ష్ణమైనవి , హృదయాలను రగులుకొల్పేవి.

దేశపత్రికల అభివృద్ధి చరిత్రలో, రెండు అవస్థాదశలను గుర్తించవచ్చు. విప్లవారంభ దశనుండి,లిట్టన్ (Litton) రాజప్రతినిధిగా వచ్చేవరకు జరిగిన అవస్థ మొదటిది (1857-1880). రెండవది రిప్పన్ కాలమునుంచి, కర్జన్ కాలము వరకు జరిగిన కాలానికి సంబంధించినది (1880-1905). మొదటి అవస్థలో, రాజకీయ విషయములనే కాక, మత సాంఘిక విషయాలను కూడా, పత్రికలు ప్రచురించేవి. మత సాంఘిక విషయాలు ప్రధానములైనవని కూడా చెప్పవచ్చు. రాజకీయాలలో, ఈ పత్రికలు సాధారణంగా బ్రిటీషు ప్రభుత్వం పట్ల గౌరవాన్ని, భక్తివిశ్వాసాలను పాటిస్తూ ఉండేవి. కాని, సందర్భముల తీవ్రతను బట్టి, అప్పుడప్పుడు తీవ్ర విమర్శలను కూడా కావించేవి. మొత్తం మీద, బ్రిటీషు వారితో ఏర్పడిన సంబంధము శ్రేయోదాయకమైనదని-అది వాస్తవంగా దైవవరమని కూడా-ఈ పత్రికల అభిప్రాయము. బ్రిటిషు వారి ఉద్దేశాలు మంచివనెడి విశ్వాసము దృఢమై ఉండినది. బ్రిటీషు పార్లమెంటరీ విధానము (ఇంగ్లాండులో), బ్రిటిషు వారి సంస్కృతి, ఏర్పడడానికి ప్రేరణములైన, అంగ్లేయుల ఉదార భావాలనూ, వారి సర్వసమత్వ సూత్రాలనూ, ఈ పత్రికలు ఎక్కువగా ప్రశంసించేవి.

రెండవ అవస్థా దశలో, రాజకీయములకు ఎక్కువ ప్రాధాన్య మేర్పడి, సంఘ సంస్కరణ విషయాలకున్న ఉన్నత స్థానం తొలగింది. విద్యావంతులకు-(ముఖ్యంగా హిందువులకు) బ్రిటీషు అధికారులకు మధ్య పరస్పర సంబంధాలు చెడిసినవి. ప్రభుత్వ విధానాలు, మరింత సూక్ష్మ పరిశీలనకులోనై , ఖండిత నిర్ణయాలకు గురియైనవి. భారతదేశము యొక్క రాజకీయాభివృద్ధి విషయములో బ్రిటీషువారి ఉద్దేశముల పట్ల తీవ్రమైన సంశయమేర్పడి, బలపడింది. బ్రిటీషు వారితో గల సంబంధాలను తెగతెంపులు చేసుకొని, స్వాతంత్ర్యాన్ని సంపాదించుకోవలెననే భావము, బాహ్యంగా వ్యక్తం కాకపోయినా, పరుల అధీనాధికారము

లకు లోబడి యున్నా, అవమానం ప్రబలమై, అప్పుడప్పుడీ భావము, రహస్యంగా వెలువడుతూ ఉండేది.

1857 లో, పత్రికలను ప్రభుత్వాధీనానికి లోబరచడానికై క్యానింగ్, పత్రికా శాసనం ద్వారా ప్రయత్నించెను. కాని, శాసన ప్రయోజనం సిద్ధించలేదు. ఆ తరవాత, పత్రికా విమర్శలకు సమాధానమిచ్చే ఉద్దేశంతో, లారెన్సు, అధికార వార్తా సంస్థను ఏర్పరచడానికి పూనుకొన్నాడు. ఈ పద్ధతి, ఇంకను, రూపొందక ముందే, త్యక్తమైనది. ఐనా, ముద్రణాలయాలను, పత్రికలను, ప్రచురించిన పుస్తకాలను, రిజిష్టర్ చేయవలసిన, నిబంధనలతో కూడిన, శాసనము 1867 అమలు జరిగింది.

'వహాబీలు' అని వ్యవహరింపబడుతూ ఉండిన ముస్లిముల కార్యక్రమాలు ప్రభుత్వానికి భయమును కలిగిస్తూ ఉండినవి. వారి చర్యలకు ప్రతిక్రియగా, ప్రభుత్వము, అపఖ్యాతి హేతువైన 124 A సెక్షనును, ఇండియన్ పీనల్ కోడులో చేర్చింది (1870). రాజద్రోహమనే అభియోగం క్రింద, రచయితలను, ఉపన్యాసకులను, ఈ సెక్షను ననుసరించి, దండించవచ్చు. నార్త్ బ్రూక్ రాజప్రతినిధిగా నున్న కాలములో, ప్రభుత్వానికి పత్రికలకు గల సంబంధము మరింత చెడింది.

ఆనాటికి, ఇండియా పత్రికలకు ఎక్కువ ప్రాబల్యం సిద్ధించి ఉండినది. బెంగాలులో మాత్రమే 58 దేశభాషా పత్రికలుండినవి. వాటిలో ఇరువది పత్రికలు సుస్థిరంగా ఏర్పడి ఉండినవి. చెలామణిలో నున్న మొత్తం పత్రికల సంఖ్య 30,000. వీటిలో, ఈ క్రింది పత్రికలు ప్రధానములైనవి.

'సోంప్రకాశ్' పత్రికను 1858 లో ద్వారకనాథ విద్యాభూషణ్ ప్రారంభించెను. మహావిద్వాంసుడు, సంఘ సంస్కర్త ఐన ఈశ్వరచంద్ర విద్యాసాగర్ యొక్క ఆదర ప్రోత్సాహము లీ పత్రికకు లభించినవి. విద్యాభూషణ్ తర్వాత, బ్రహ్మసమాజ నాయకుడైన శివనాథశాస్త్రి, ఈ పత్రికకు సంపాదకుడైనాడు. సాంఘిక, నైతిక, రాజకీయ విషయములలో ఉదార వాదాన్ని పాటించిన పత్రిక, అనే గొప్ప గౌరవ ప్రతిష్ఠలు, ఈ పత్రిక సంపాదించుకొన్నది. శిశిర కుమారఘోష్ 1868లో స్థాపించిన 'అమృత బజారు' పత్రిక, 1878 దేశ్యభాషా శాసనం అమలు జరుగునంత దాకా, బెంగాలీ భాషలో ప్రచురితమౌతూ ఉండేది. తన అభిప్రాయాలను నిష్కర్షగా, నిర్భయంగా వ్యక్తం చేస్తూ స్వతంత్ర విధానాన్ని పాటించిన పత్రిక ఇది. 'సులభ సమాచారే' అనే పత్రిక, దేశంలో వెలువడిన మొదటి చౌక వెల పత్రిక. దాని వెల ఒక దమ్మిడీ మాత్రమే (నేటి పైసా కాదు) కేశవచంద్రసేనుడు నిర్దేశకుడై, ఇండియా సంస్కరణ సంఘము యొక్క ఆధ్వర్యంలో ప్రచురింపబడిన పత్రిక ఇది. 'సాధారణీ' అనే పత్రిక బంకించంద్ర చటర్జీ ఆశీస్సులతో వెలువడింది.

ఈ వారపత్రికలే కాక, ప్రధానములైన మాస పత్రికలు, పక్ష పత్రికలు, అనేకములు ప్రచారములో ఉండి, విజ్ఞాన ప్రసారానికి తోడ్పడుతుండినవి. సాహిత్యము, విజ్ఞానశాస్త్రము, మతము, - ఈ విషయములకు మాత్రమే సంబంధించి

నవి ఈ పత్రికలు. కలకత్తా పాఠశాల పుస్తక సంఘంవారూ దేశ్య సాహిత్య సంఘమువారూ కలిసి ప్రచురించిన 'రహస్య సందర్భ' (1863) అనే పత్రిక, 'శిక్షాదర్పణము' (1864), దీని స్థానములో ఏర్పడిన ఎడ్యుకేషన్ గెజెట్ (1868), బంకించంద్ర చటర్జీ సంపాదకుడై ఉండిన 'బంగదర్శన్' (1872), రవీంద్రనాథ్‌టాగోర్, తదితర ప్రసిద్ధ రచయితలు సహకరింపగా, ద్విజేంద్రనాథ టాగోర్ ప్రచురిస్తూ ఉండిన భారతి (1877), - ఇత్యాదులు ముఖ్యములైన పత్రికలు.

పత్రికల పలుకుబడి, ప్రభావము, అభివృద్ధి పొందుతూ ఉండడం ప్రభుత్వానికి సమ్మతిగాలేదు. 1875 వ నాటి బెంగాలు ప్రభుత్వ పరిపాలన నివేదికలో ఈ క్రిందివిధంగా ఉన్నది: "బ్రిటీషు ప్రభుత్వంపైనా, పరిపాలన వ్యవస్థపైనా, దోషము ఆరోపింపబడుతూ ఉంది. ఆచరణసాధ్యంకాని సలహాలను పత్రికలు తరచుగా చేస్తున్నవి. ప్రభుత్వం చేసిన ప్రతి కార్యాన్నీ ఆక్షేపించే ప్రవృత్తి ఏర్పడింది. ఏ దానితోనూ తృప్తిచెందని భావప్రవృత్తి వ్యక్తమౌతూ ఉంది. దేశీయుల విషయములో బ్రిటీషువారు ప్రదర్శించే ప్రవర్తనను, భావాన్ని అనుమానముతో గమనిస్తున్నారు. భావనామూలకములైన అభిప్రాయములకు లోనై, అతిశయములైన ఉత్కాంఠలకు పూనుకొనే ప్రవృత్తి ఏర్పడింది. తమ ఉత్కాంఠలు కార్యసాధ్యములగునా, కాదా, అనే వివేకమును ఉదయింపజేసే, ప్రశాంత ప్రభావము దేశములో లేదు. బ్రిటీషు ప్రభుత్వము ప్రకటించిన పరిపాలన సూత్రాల ననుసరించిన, తమ సంపూర్ణమైన హక్కులకై, ఒత్తిడి చేయవలెననే కుతూహలము, సాధారణమై, దేశీయులలో ఏర్పడి, బలపడుతూ ఉన్నది. ప్రభుత్వోద్యోగముల లోను, పరిపాలన వ్యవస్థలోను, తమ భాగానికై ఒత్తిడిచేస్తున్నారు. హిందువులు సాధించియున్న విజ్ఞాన విషయములో అభిమాన మధికమౌతూ, వ్యాప్తమవుతూ ఉంది. ఇది నిజంగా, జాతీయాభివృద్ధికి అనుషంగికంగా ప్రవృత్తమౌతూ ఉన్నది. ఒక విధమైన మనోభావాల అస్తిమితత, మానసికోద్రేకము, ఏర్పడియున్నవని, పరిస్థితిని క్లుప్తంగా వర్ణించవచ్చును."

పశ్చిమ భారతభాగంలోకూడా ఇట్టి పరిస్థితులే ఏర్పడుచుండినవి. 1871 లో, 29 మరాఠీ పత్రికలు, 26 గుజరాతీ పత్రికలు, ఉర్దూ పత్రికలు మూడు, ఒక పారసీక పత్రిక, ఆ రాజధానిలో వెలువడుతూ ఉండినవి. మరాఠీ పత్రికలలో, 'ఇందుప్రకాశ్' (1862), దేశీయాభిప్రాయం (The Native Opinion) (1864), దీనబంధు (1877) పలుకుబడిగల పత్రికలు. అభ్యుదయ రచయితలకు, సంస్కర్తలకు ఈ పత్రిక ప్రచారసాధనంగా ఏర్పడింది. ఈ పత్రికకు వ్యాసములను పంపుతూ, పత్రికా పోషణకు సహకరిస్తూ ఉండినవారిలో ముఖ్యులైనవారు, - రెనడే, భండార్కర్, తెలాంగ్, చందావర్కర్, విష్ణుశాస్త్రి పండిట్, - ఇత్యాదులు. అభ్యుదయ సంస్కర్తయైన, ఫూలే, స్థాపించిన సత్యశోధక సమాజముయొక్క ప్రచారసాధనము 'దీనబంధు' పత్రిక. కృష్ణరావ్ భాలేకర్ ఈ పత్రికకు సంపాదకుడు. వెనుకబడిన జాతులవారి అజ్ఞానము,

దారిద్ర్యము, అనారోగ్యము, – ఈ పత్రిక దృష్టి నాకర్షించినవి. సానుభూతితో, వారి సమస్యలనుగూర్చి, ఈ పత్రిక ప్రచారం చేస్తూ వచ్చింది. రాజకీయ సంస్కరణపట్ల ఈ పత్రికకు అభిమానం లేదు. అట్టి సంస్కరణవల్ల నష్టపడేవారు బీదలనీ, సంస్కరణ సత్ఫలములను అనుభవించేవారు ఉన్నతవర్గాలవారనీ, ఈ పత్రిక అభిప్రాయపడింది. దేశీయాభిప్రాయము అనే పత్రిక ద్విభాషాపత్రిక. రూఢివాదియైన విశ్వనాథనారాయణ మండలిక్, ఈ పత్రికా సంపాదకుడు. 'ఇందుప్రకాశ్' పత్రికా వర్గంవారు ప్రచారం చేస్తున్న, సంస్కరణ విధానాల నితడు తీవ్రంగా ఆక్షేపించి, వాటిని ఖండించడానికి పూనుకొన్నాడు. బెంగాలులోవలెనే, బొంబాయిలోకూడా చౌకవెలకు లభ్యమయ్యే పత్రిక వెలువడింది. పూనానుండి వెలువడుతున్న 'జ్ఞానచక్షు' అను ఈ మరాఠీ వారపత్రికకు సంవత్సరం చందా రూపాయి, రెండణాలు మాత్రమే.

పలుకుబడిగలిగిన ఇతర బొంబాయిపత్రికలలో 'రాస్తగోఫ్తార్', 'గుజరాత్‌మిత్రా' అనునవి ముఖ్యములు. 'గుజరాత్‌మిత్రా' పత్రికలోని, సంపాదకీయములను 'ఉగ్ర సంపాదకీయము' లని వర్ణించినారు. ఐనా, ఈ పత్రిక, స్వస్థతతోకూడిన వివేకాన్ని ప్రజలలో కలుగజేసింది. బొంబాయి రాజధానిలోని పత్రికలనుగూర్చి, డిగ్బీ, ఈ క్రిందివిధంగా వ్రాసియున్నాడు, – "ఆంగ్లీకరణ మొందిన, ఔత్సుక్యవంతులైన బొంబాయి పార్సీలవల్లను, రాజధాని గవర్నరు పరిపాలన రక్షణకు చెందియున్న రాష్ట్రాలలోని ప్రజల యుద్ధ వీర స్వభావము వల్లను, దేశభాషా పత్రికల పరిచయం మనకు కలుగుతున్నది. ఈ పత్రికల స్వభావము, బెంగాలీ పత్రికల స్వభావానికి, విభిన్నమై ఉండడం నిజమే. ఐనా, ఈ పత్రికలను సానుభూతితో చూచినట్లయితే, పరిపాలకులకు వీటివల్ల హాని కలుగుతుందని చింతించడానికి అవకాశం లేదు. 'ఈస్టర్న్ ఇండియా' 'పత్రిక', 'ప్రకాశ్' పత్రిక, – వీటి సంపాదకుల, లలితమార్దవ భాషకంటె, ఈ పత్రికలోని కఠినమైన భాష ఏమాత్రమూ విపత్కరమైనది కాదు."

బొంబాయి ప్రభుత్వ పరిపాలన నివేదిక (1875-76) మరాఠీ పత్రికలను గూర్చి, వ్రాస్తూ, భారతీయుల రాజకీయ విధాన హక్కులకై పత్రికలు గావిస్తున్న వాదనను ఆక్షేపించింది. "ప్రభుత్వము గావించిన కార్యక్రమాల నెన్నిటినో పత్రికలు ఆక్షేపించినవి. ఇండియా ప్రభుత్వ కార్యదర్శియొక్క అధికారములను విస్తరింపచేయడము, ఇండియా కార్యనిర్వాహకవర్గంవారికి నూతనాధికారాలను కల్పించడము, పత్రికా స్వాతంత్ర్యాన్ని ప్రభుత్వము నిరోధింప నున్నదనే వదంతి, ఇంగ్లాండునుంచి ఇండియాకు దిగుమతి చేస్తున్న దూదివస్త్రములపై శుల్కాలను తొలగించడానికి మ్యాన్‌ఛెస్టరు చేస్తున్న ప్రయత్నాలు, – ఇవన్నీ పత్రికలలో స్వేచ్ఛగా, నిరసింపబడినవి." బొంబాయి పత్రికల వ్రాతలు మిత వాదాన్ననుసరించి, పర్యాలోచన యుక్తములై యున్నవి, కాని, పూనా పత్రికలు సర్వదా ప్రభుత్వంపట్ల ద్వేషభావాన్ని ప్రదర్శిస్తున్నవి, అని, 1877-78 నివేదిక తెలిపింది. "ఆంగ్లేయులు తమ క్రౌర్యాన్ని, మోసాన్ని ఉపయోగించి,

సంపన్నులలో శిఖర స్థానాన్ని ఆక్రమించినారు. వారి ఆధిపత్యాధికారాల క్రింద పడియున్న ప్రజలు పైకి లేచి, హిందువుల పిత్రార్జితాన్ని తింటున్న ఆంగ్లేయులను పారద్రోలడం ప్రజల కర్తవ్యము" అని పూనా పత్రికలు వ్రాసినవి.

మదరాసు రాజధానిలో, ఆంగ్లభాషలో ప్రచురింపబడుతూ ఉండిన భారతీయ పత్రికల అభివృద్ధి, మందమై ఉండినది. దేశభాషా పత్రికల పరిస్థితి, నిరుత్సాహకరము. క్రిశ్చియన్ మిషనరీలకు పత్రికలపై ప్రాబల్యమేర్పడి ఉండినది. కాని, వారి పత్రికలు మత ప్రచారానికి మాత్రమే పూనుకొన్నవి. సంఖ్యా విషయములో, వీటి తరువాతివి, ముస్లిము పత్రికలు. పత్రికల మొత్తంలో ఇవి మూడవ వంతు. 1872 నుండి 1875 వరకు మదరాసు గవర్నరుగా నుండిన హోబార్ట్ ప్రభువు, ముస్లిము పత్రికలను ఎక్కువగా ప్రోత్సహించినాడు. ఉర్దూ పత్రికలు చైతన్యవిహీనములని, "స్వతంత్రమైన ఒక్క వాక్యం కూడా వాటిలో లేదని", ఆ కాలంలో అభిప్రాయ మేర్పడింది.

నేటి, ఉత్తరప్రదేశ్, పంజాబ్, రాజస్థాన్, మధ్యప్రదేశ్, బీరార్-వీటి సముదాయమైన ఉత్తర భారతములోని పత్రికలు, బెంగాలు బొంబాయి పత్రికల మార్గాన్ని అనుసరించి, వేగంగా అభివృద్ధి చెందినవి. దేశభాషాపత్రికలలో, ఉర్దూ ప్రాబల్యం వహించింది. ఈ ఉర్దూ పత్రికలన్నిటిలోనూ బ్రిటిషు ప్రభుత్వం పట్ల భక్తి విశ్వాసముల ప్రదర్శనము' ప్రత్యక్షంగా గోచరించేది. బ్రిటిష్‌రాజ్ పట్ల తమకుగల భీతి, లేక, ప్రభుత్వాధికారుల ఆదరణ ప్రయత్నము, ఈ భక్తి ప్రవృత్తికి హేతువైనదని ఊహించవచ్చును. వీటిలో, 1850 ప్రాంతంలో ప్రారంభింపబడిన 'కోహినూర్', 1870 నాటి, అక్బర్-ఇ-ఆమ్, అనే పత్రికలు చేరియున్నవి.

పత్రికాభివృద్ధికి చెందిన ఈ అవస్థా దశలో, దేశీయ పత్రికలను గూర్చి, విలియం డిగ్బీ, ఈ క్రింది విధంగా వ్రాసియున్నాడు. "1875 లో, 374 దేశ్య, ఆంగ్ల-దేశ్య పత్రికలు చెలామణిలో నున్నవి. ఆంగ్ల పత్రికల సంఖ్య 147 మాత్రమే. బెంగాలులో 102, బొంబాయిలో 86, పశ్చిమోత్తర ప్రాంతాలలో 65, మదరాసులో 58, పంజాబు, సింధు, మధ్యప్రాంతాలు, రాజస్థాన్ ప్రాంతాలు కలిసి మొత్తం 63 పత్రికలు, ప్రచారములో ఉండినవి. దేశభాషా పత్రికల చెలామణి విస్తారమైనది. పత్రికలను పఠించేవారి సంఖ్య కూడా, అధికమౌతూ ఉన్నది. రోపర్ లెత్ బ్రిడ్జ్, సూచించినట్లు, "ఒక్క పత్రికా ప్రతి, ఒక గ్రామానికి గాని, లేక, కొన్ని గ్రామముల సమూహానికి గాని అందినా కూడా, పత్రికలోని విషయం సర్వస్వమూ, ఆ పరిసరప్రాంతంలో నివసించే ప్రతి వ్యక్తికీ తెలుస్తుంది".

## IV. 1878 నాటి దేశ్యభాషా పత్రికాశాసనం

అన్ని నిరంకుశ ప్రభుత్వములవలెనే, బ్రిటిషుప్రభుత్వం కూడా పత్రికలకు కలుగుతూఉన్న పలుకుబడిని, అభివృద్ధిని సహించలేకపోయింది. సంశయము, భీతి, మనస్సులో బాగాఏర్పడింది. తీవ్రమైన విమర్శను పత్రికలు ప్రచురించినవెంటనే,

బ్రిటిషుఅధికారవర్గంవారు, ఇతరులైన ఆంగ్లో ఇండియన్ వర్గంవారు, దానిని అప చారంగా, ప్రభుత్వ తిరస్కారంగా భావించి, పత్రికలను నిరోధించడానికి తగిన, తీవ్రమైన చర్య తీసుకోవలసిందని సలహా ఇస్తూ వచ్చిరి. తాము వ్రాసింది విషయ విమర్శమాత్రమే అనీ, ప్రభుత్వంపట్ల తమకు భక్తి విశ్వాసము లున్నవనీ, పత్రికా సంపాదకులు వాదించినా, ప్రభుత్వం వినిపించుకొనే స్థితిలో లేదు. ప్రభుత్వాన్ని గురించి తుంటరితనంగాను, విద్రోహకరంగాను వ్రాసిన వ్యక్తులను, వెంటనే దీర్ఘ విచారణ కార్యక్రమూ లేవీ జరపక, తీక్ష్ణమైన దండన విధించడానికి వీలయ్యే, శాసనాన్ని ప్రవేశపెట్టవలసిందిగా, బెంగాలు లెఫ్టినెంటు గవర్నరైన, సర్ జార్జ్ క్యాంప్ బెల్ (1873) ఇండియా ప్రభుత్వానికి సలహా ఇచ్చెను. 1875 లో, బరోడా మహారాజైన మలహర్ రావ్ గయక్వాడ్ పై అభియోగం మోపి, విచారణ గావించి, అతనిని సింహాసనము నుంచి తొలగించిరి. ఈ విషయమై భారతీయ పత్రికలు ఉద్రేకానికి లోనైనవి. భారతదేశీయ రాజ్యములపై బ్రిటిషుప్రభుత్వానికి, సర్వాధికారం, కలదా అనే విషయాన్ని 'ఇందుప్రకాశ్' పత్రిక చర్చించింది. ప్రభుత్వ వర్గానికి ఇది కంటక ప్రాయమయింది. విద్రోహకరములైన వ్రాతలకు బూనుకొన్న పత్రికలను అణచివేయవలెననే ఘోష మరల ప్రారంభమయింది. ఈ విషయంపై వ్యాఖ్యానం గావిస్తూ, ఇంగ్లాండు పాల్ మాల్ గెజెట్, "పత్రిక లలో ప్రచురింపబడుతున్న వ్రాత లనేకములకు, ప్రభుత్వానికి అవమానము కలి గించే ఉద్దేశం ఉన్నదన్న విషయము వ్యక్తమే. అంతమాత్రమే కాదు. బ్రిటీషు అధికారులను హత్య గావించడం దేశీయుల కర్తవ్యమని సమర్థించక పోయినా, అట్టిది జరిగినట్టయితే, ఉపశమన వాక్యాలతో కప్పివేయడానికి పత్రికలు ప్రయత్నిస్తా యనడంలో సందేహం లేదు". అని వ్రాసింది. ఈ అభిప్రాయముతో ఏకీభవించినాడు ఇండియా ప్రభుత్వ కార్యదర్శి, సాలిస్ బరీ. కనుక ఇండియన్ పీనల్ కోడ్ను అనుసరించి ఆ పత్రికలపై అభియోగం జరుపవలసిందని సలహా ఇచ్చెను. కాని, ప్రస్తుతం అమలులోనున్న శాసనాలను అనుసరించి, అభియోగం, న్యాయ స్థానంలో నిలువజాలదని ప్రభుత్వ న్యాయ సలహాదార్లు, తమ అభిప్రాయమును తెలిపిరి.

లిట్టన్ ప్రభువు ఈ సమస్యను గ్రహించి, ఇండియా పత్రికల యజమానుల నుంచి, జామీను తీసుకోడానికి తగిన నిబంధనను కల్పించడానికి నిశ్చయించెను. "ప్రభుత్వపు చర్యలకు, అధికారుల ఉద్దేశాలకు, సంకల్పాలకు, అపార్థాన్ని కల్పించి, విమర్శించే ప్రవృత్తి ప్రబల మౌతున్నదనీ, అది కొన్ని సందర్భాలలో విశ్వాస భంగకరము, విద్రోహకరముకూడా ఐ యున్నదనీ", వాదించి, దాని నరికట్టే శాసన చర్యకు పూనుకోవలసిందని, బెంగాలు లెఫ్టినెంటు గవర్నరు, ప్రభుత్వాన్ని ఒత్తిడి గావించినాడు. దానితో, ప్రభుత్వము, కార్యాచరణకు పూనుకొన్నది. 1878 మార్చి 14 వ తేది, లిట్టన్ ప్రభువు, కౌన్సిలును ఒత్తిడి గావించి దేశ్య పత్రికా శాసనాన్ని అంగీకరింపజేసెను. ప్రభుత్వానికి వ్యతిరేకము లైన విషయాలను ప్రచురించమని, లేక, పత్రికల చిత్తుప్రతులను ముందుగా

ప్రభుత్వ పరిశీలనకు నివేదింతుమని, పత్రికలు ప్రమాణ పత్రాలను దండనాధికారులకు అర్పింపవలసిన అవసరాన్ని ఈ శాసనం విధించింది. తమ ప్రభుభక్తి విశ్వాసాలను పునరుద్ఘాటిస్తూ, పత్రికలు, ఈ శాసనం అనావశ్యకమైనదని, సమంజసమైనది కాదని, మరల ఆక్షేపించినవి బహిరంగ సభలు జరిపి, ఈ శాసనాన్ని తిరస్కరించినవి. పార్లమెంటు జోక్యం కలుగజేసుకోవలసిందని ప్రార్ధిస్తూ, మహజరును కూడా పంపిరి. గ్లాడ్‌స్టన్ నాయకత్వములో, ఉదార పక్షంవారు ఈ శాసనాన్ని నిరసించి, ఖండించిరి. కడపట, ఇంగ్లాండు ప్రభుత్వం, రూఢి పక్షముల హస్తముల నుంచి ఉదార పక్షమువారి హస్తగతం కావడంతో, రిప్పన్ ప్రభువు ఇండియా రాజప్రతినిధిగా నియమితుడైనాడు. అత డీ శాసనాన్ని పునఃపరిశీలన గావించి, దీనిని సమర్థించే పరిస్థితులు లేవని గ్రహించి, ఇండియా ప్రభుత్వ కార్యదర్శికి ఈ క్రింది విధంగా వ్రాసెను.—"ఇండియా అధి నియమ గ్రంధమునుండి, ఈ దుష్టశాసనం త్వరలో, తొలగిపోతుందనడం, నాకు ఎంతో సంతుష్టిని కలిగించింది. నేను సంప్రదించిన స్థానికాధికారు లనేకులు, పీనల్ కోడులో కొంతమార్పు అవసరమని అభిప్రాయ మిచ్చి ఉండడంవల్ల, ఈ క్లిష్ట సమస్య ఇంత సులువుగా పరిష్కారమౌతుందని నేనూహించి యుండలేదు. ఇండియా ప్రభుత్వంలోని అధికారి, పత్రికా ప్రచురణ మొక కీడుగా భావిస్తున్నాడు. ఈ సమస్య కంతటికీ ఈ దృక్పధమే ఆధారమైనది. పత్రిక అనే కీడు అవసరమే. ఐతే, దానిని నిర్బంధించి ఉంచవలెనని అధికారుల స్వాభిప్రాయము. రాజకీయ విషయాలను స్వేచ్ఛగా చర్చించడంవల్ల సిద్ధించే ప్రయోజనాలు ఎటువంటివో గ్రహించవలెననే భావం నిజంగా వీరికి లేదు". రిప్పన్, సలహా ననుసరించి, ఈ శాసనం రద్దు గావింపబడింది (1882, జనవరి, 19.). భారతదేశ పత్రికల చరిత్రలో నూతన ఘట్ట మారంభమయింది.

***పత్రికలు - జాతీయోద్యమము:*** దురభిప్రాయంతో, లిట్టన్, ప్రవేశపెట్టిన పత్రికాశాసనంఫలితంగా,దేశములోఅసమ్మతి,నిరసనభావము,తుపానువలె చెలరేగినవి. బ్రిటిష్‌ప్రభుత్వముయొక్క ఉద్దేశములను గూర్చిన సంశయాలు తీవ్రమైనవి. ఆందోళనమొక్కటే, ప్రయోజనకారి, అనే విశ్వాసము ప్రబలంగాఏర్పడింది. ప్రభుత్వము మొదటిలో అవలంబించిన ఉపశమన పద్ధతులకు కృతజ్ఞతను చూపుతూ, పత్రికలు, ప్రభుత్వపుచర్యలను తీవ్రముగా విమర్శించడం మానుకొన్నవి. కాని, ఇంతలో పత్రికలను రెచ్చగొట్టే చర్యలను, ప్రభుత్వం మరల ప్రారంభించడము, క్రొత్త సమస్యలను లేవదీయడము, జరిగింది. దానితో ద్వేషభావము, వ్యతిరేకభావము, మరల ఆరంభమైనవి. 1883 నాటి ఇల్బర్ట్ బిల్లు, 1891 నాటి, ఏజ్ ఆఫ్ కంసెంట్ బిల్లు (వివాహోచిత వయస్సును గూర్చినశాసనం) 1892 నాటి, కౌన్సిలు రిఫారం ఆక్టు (శాసనసభ సంస్కరణ చట్టం), మొదలైన ప్రభుత్వవిధానాలవల్ల, ప్రజలలో హృదయోద్రేకము, అసంతుష్టి ఏర్పడినవి. 1893 లో హిందూ ముస్లిముల దొమ్మికలహాలు చెలరేగినవి. అధికారులు ముస్లిములపట్ల చూపుతున్న పక్షపాతంవల్ల కలహాలు ఏర్పడినవని ఒక పక్షంవారు, ముస్లిములహక్కుల

విషయములో జోక్యం కలుగజేసుకోవడంవల్ల ఏర్పడినవని, మరియొకపక్షం వారూ వాదిస్తూ వచ్చిరి. దీనికారణంగా, ప్రభుత్వంపట్ల ప్రజలకు మరింత ఎక్కువగా వ్యతిరేకత ఏర్పడింది. అతి తీవ్రమ్మైన క్షామము లుత్పన్నమ్మై, పందొమ్మిదోశతాబ్దమంతటా అపారమైన జననష్టము కలగడము, 1896 లో ప్లేగు జాడ్యము చెలరేగి విస్తారమై ప్రజలను నాశనమొనర్చడము, ఇవికూడా పరిస్థితులను తీవ్రమొనర్చడానికి కారణాలు. కర్జన్ అవలంబించిన సామ్రాజ్య పరిపాలనవిధానం, అగ్నికి ఆజ్యరూపమయింది.

పత్రికా రచనలలో, ఒక నూతన ప్రవృత్తి - లేక - పూర్వమే ఉండిన ప్రవృత్తికి ప్రాబల్యము, - ప్రధానంగా సిద్ధించింది. ఇంతవరకు ప్రధాన స్థానాన్ని వహించియుండిన, మత సాంఘిక సంస్కరణ సమస్యలపై ఇపుడు శ్రద్ధాసక్తులు లోపించి, పత్రికల దృష్టి రాజకీయ సమస్యలపై కేంద్రీకరించింది. ఈ పరివర్తనం కలగడానికి కారణములు అనేకములు. హిందూముస్లిము వర్గాలలోనివారు తమ మతస్థుల పూర్వవైభవాన్ని, కీర్తినీ, మరల ప్రతిష్ఠించడానికి బూనుకొని, తత్ప్రయత్నాలకు ఎక్కువ ఆసక్తిని చూపుతూ వచ్చిరి. కనుక, సంఘ సంస్కరణను గూర్చిన చర్చలు పత్రికలలో ప్రచురింపబడడం లేదు. ఇది మొదటి కారణం. ప్రపంచ దేశాలలో జరుగుతున్న రాజకీయోదంతాలు రెండవ కారణం. జాతీయ పునరుద్ధరణ ప్రయత్నాలు యూరోపు ఖండాన్ని ప్రచలితం గావిస్తున్నవి. ఇక, జాతీయ జీవనములో వివిధ విభాగాలలోని ప్రయాసలు రానురాను ప్రబలమౌతున్నవి. అట్టి సందర్భములలో, ప్రజాప్రాతినిధ్యము కల్గిన సంస్థలు లేనందువల్ల, పత్రికలు మాత్రమే ప్రజాభిప్రాయ ప్రదర్శనమునకు ప్రధాన సాధనములైనవి. ప్రభుత్వ రాజకీయాలను, ప్రభుత్వపు చర్యలను విమర్శించడానికి, చర్చించడానికి, పత్రికలోని భాగములు ఉపయుక్తములవుతూ, వచ్చినవి. ప్రభుత్వపు కార్యనిర్వాహకవర్గమువారి చర్యల విషయములోను, శాసనరీత్యా జరిపిన చర్యల విషయములోను, ప్రజల అభిప్రాయములు ఎట్టివో, పత్రికలు ప్రభుత్వానికి తెలుపుతూ వచ్చినవి. అంతేకాక, సదుద్దేశములతో ప్రభుత్వము జరిపిన కార్యాలను, దేశ ప్రయోజనముల అభివృద్ధిని కోరి గావించిన చర్యలను, ప్రశంసించడం కూడా, పత్రికలు తమ కర్తవ్యంగా చేసుకొన్నవి.

దీనికి తోడుగా, ప్రజాభిప్రాయాన్ని కూడగట్టుకోవడం, ప్రాంతీయ జాతీయ సమావేశములను ఏర్పరచడము, రాజకీయోద్యమాలను ప్రవర్తింపచేయడము, ప్రజాసంస్థలను నెలకొల్పడము, లోకసంబంధములైన వివాదాలను చర్చించి నిశ్చయించడము, ఇత్యాది ప్రజాకార్యాచరణములన్నిటికీ, పత్రికలు తోడ్పడినవి. విదేశ రాజ్యాంగనీతికి సంబంధించిన ఏ విషయము కాని, ఆంతరంగిక పరిపాలన వ్యవస్థకు సంబంధించిన ఏ అంశము కాని, పత్రికా కార్యభార దృష్టిని దాటిపోలేదు. ఇండియా గౌరవానికి భంగకరమైన ప్రతి అంశము, ఇండియా ఆర్థిక స్థితికి హానికరమైన ప్రతిచర్య, ఆ విషయములలో భారతీయులు పాల్గొనవలసిన ఆవశ్యకము, మొదలైన విషయములన్నీ చర్చనీయాంశములైనవి. రాజకీయ

మైన ప్రతి హక్కు విషయంలోనూ, పట్టుదలతో, తీవ్రతతో, అధికారుల ఆగ్రహాని కేమాత్రమూ లక్ష్యము చేయక, పత్రికలు పోరాటం సాగించినవి. ఈ విధంగా, పత్రికలు తమ రెండవ అవస్థా దశలో, ప్రధానమైన ఒక రాజకీయ సంస్థగా ఏర్పడినవి. దూరప్రదేశములలో నివసించుచుండిన గ్రామీణ ప్రజానీకానికి కూడా, పత్రికా ప్రభావం ప్రసరించి, పత్రికా సంస్థ ప్రజల రాజకీయ విద్యా సాధనంగా సిద్ధించింది.

ప్రజల అవసరాలను, వారి కష్టసుఖాలను, అభిప్రాయాలను, కోరికలను, ప్రభుత్వానికి అందించే మధ్యవర్తి సంస్థగా, ప్రభుత్వానికి ఉపకరించింది. ప్రభుత్వం అవలంబించిన విధానాలూ జరిపిన చర్యలూ, ఇంగ్లాండుకు లాభకరములుగాను, భారతదేశానికి హానికరంగానూ పరిణమించకుండా, ముందుగనే, వాటి విషయమై ప్రజల భావాలు, వారి సంశయాలు, భయాలు ఎటువంటివో ప్రభుత్వానికి స్పష్ట పరుస్తూ వచ్చినవి. రాజకీయ పరాధీనత, జాతీయ గౌరవానికి అసంబద్ధమైనదనే విషయాన్ని పత్రికలు సూచించినవి.

మధ్యతరగతులవారి సామాజిక కార్యకలాపమే, వార్తాపత్రిక లనడం స్వాభావిక సత్యము. వాటి యాజమాన్యము, సంపాదకీయము కూడా ఈ తరగతి వారికే సంబంధించినవి. పత్రికల మూలంగానే మధ్యతరగతి వారు, దేశమంతటా పలుకుబడిని సంపాదించుకొనిరి. అంతమాత్రమే కాక, అఖిలభారతదేశానికి ప్రాతి నిధ్యం వహించే అధికారము, తమకే ఉన్నదని కూడా సాధిస్తూ వచ్చినారు. కాని, ప్రభుత్వము వీరికోరికకు తీవ్రంగా వ్యతిరేకులై ఉండడమేకాక, దానిని పూర్తిగా తిరస్కరించిరి. కాని, పరిస్థితులు బ్రిటిషు వారికి వ్యతిరేకములై ఉన్నవి. కనుక, ఈ తిరస్కారంవల్ల, పత్రికల స్వభావములోను, భావప్రవృత్తిలోనూ, ప్రభుత్వ విరుద్ధమైన పరివర్తన మేర్పడింది. అంతతో, బ్రిటీషు పరిపాలన నుండి దేశానికి విముక్తికావలెనని నిర్బంధపరచడం పత్రికలు ప్రారంభించినవి. పందొమ్మిదోశతాబ్ద మంతటా ఈ కోరిక ఆందోళన రూపములో కాకపోయినా, చల్లగా ప్రచారమౌతూ వచ్చింది.

## XIX. శతాబ్దానంతర పత్రికలు

పందొమ్మిదో శతాబ్దపు కడపటి దశలోని పత్రికల చరిత్రయొక్క పరిశీలనం వల్ల భారతీయులప్పటికింకను బ్రిటనుతో సంబంధాలను త్రెంచుకోడానికి తలచి యుండలేదనే విషయం వ్యక్తమయింది. బ్రిటీషు ఆధిపత్యము, ఇండియాకు శ్రేయస్కరమని తలచియుండిరి. భారతదేశమందలి వివిధ భాగాలకు సంయోజనం కూర్చి, ఆర్థిక సాంస్కృతిక ప్రయోజనాలను బ్రిటీషు ప్రభుత్వము అభివృద్ధి పరచిందని భావించియుండిరి. కాని, పరిపాలన వ్యవస్థ చక్కగాలేదని అనేక పత్రి కలకు అసంతుష్టి ఏర్పడియుండినది. అమిత వ్యయముతో కూడిన విదేశయుద్ధాలు, పరిపాలనయొక్క వ్యయాధిక్యము, అతిభారమైన పన్నులు, సాంఘిక, ఆర్థిక స్వాస్థ్యమునకు ఆధారములైన విద్య, ఆరోగ్యము, వ్యవసాయము మున్నగు

కార్యక్రమాలు వెనకబడియుండడము - ఇత్యాది ప్రభుత్వ పరిపాలన లోపాలను, విదేశరాజ్యాంగ నీతిని, పత్రికలు విమర్శిస్తూ వచ్చినవి. ప్రభుత్వ సేవా శాఖలలోని ఉన్నతోద్యోగాల నుంచి భారతీయులను బహిష్కరించి, అధిక వేతనములపై విదేశీయులను నియమించడం, భారతీయులకు పాశ్చాత్యులకుమధ్య జాతి పక్షపాతమును ప్రదర్శించి, భారతీయుల మనస్సులకు వ్యధ కలిగించడం, రాజ్యాంగ నీతిని ప్రజాపాలన శాసనములను నిశ్చయించడంలో భారతీయులకు స్థానం ఇవ్వకపోవడం, భారతీయుల బుద్ధి సామర్థ్యముపైనా, నైతిక నిష్ఠపైనా, తమకు విశ్వాసం లేదనే భావాన్ని ప్రదర్శించడము, - ఇత్యాది ప్రభుత్వ విధానములన్నీ తీవ్రమైన ఖండిత విమర్శలకు, నిరసనలకు గురియైనవి.

హిందూ ముస్లిముల మధ్య విభేదభావం, అధికమౌతూ దేశములోని వివిధ వర్గాల వారిలో ద్వేషభావము, తీవ్రమవుతూ ఉండడం వల్ల ప్రభుత్వంపట్ల ప్రజలకు అపనమ్మకము వృద్ధియౌతూ వచ్చింది. ఈ సమస్య విషయమై పత్రికల ప్రవృత్తిలో వర్గములు ఏర్పడినవి. హిందువుల నిర్వహణలో ఉన్న పత్రికలు, ముస్లిములు హఠవాదులై హిందువుల మనోభావాలను గుర్తించడం లేదని, ముస్లిములను ఆక్షేపించినవి. రెండు మతవర్గాలవారిని 'విడదీసి పాలించే రాజనీతి' అవలంబించి, ప్రభుత్వము ముస్లిము వర్గంవారిని ప్రోత్సహించి, మతవిభేదాలను పోషిస్తున్నదని, హిందూపత్రికలు విమర్శించినవి. తమకు ప్రభుత్వోద్యోగాల విషయంలో విశేషమైన హక్కుగలదని ముస్లిములు భావించిరి. కనుక వాటిని రక్షించుకోవలెననే ఆతురత, తమకు దేశములో ప్రాధాన్యమున్నదనే భావన, తమకు ద్రవ్యవిషయకంగా నష్టంకలుగవచ్చుననే భయము,- ఇవన్నియు కారణములుకాగా, ముస్లిములు హిందువుల ప్రాబల్యాన్ని ఆక్షేపించిరి. ఏది నిజమైనప్పటికీ, రెండు వర్గాలవారికీ అభిప్రాయభేదము, వ్యతిరేకతా, తీవ్రమౌతూవచ్చినదనడం వాస్తవము. ఈ విభేదము, వాస్తవంగా, పూజలకు, కర్మలకు సంబంధించిన అల్పవిషయములపై ప్రారంభమయింది. కాని, క్రమేణా అది ప్రబలమైన రాజకీయ వివాదంగా పరిణమించింది. రెండువర్గాలలోని వివేకవంతులూ, మతసామరస్యాన్ని గూర్చడానికై చేసిన ప్రయత్నాలు, విఫలములైనవి. రెండు వర్గాలలోనూగల వ్యక్తుల సంకుచిత భావాలు, ఈ విషయంలో ప్రభుత్వము సహాయపడకపోవడము, కొందరు అధికారులు బుద్ధిపూర్వకంగా ప్రతిబంధకములు కల్పించడము-ఇత్యాదులు సామరస్య ప్రయత్నాలను భగ్నమొనర్చినవి.

ఇండియా పత్రికల ప్రయోజకత్వము విస్తృతంగా అభివృద్ధి పొందడం, ప్రజలలో వాటికి పలుకుబడి విస్తరించడం, పందొమ్మిదో శతాబ్దపు కడపటి భాగములో జరిగినవి. ప్రతి ప్రాంతంలోనూ, భారతీయులు నిర్వహిస్తుండిన పత్రికలు, దేశముయొక్క వివిధ భాగాలలోని వార్తలను అభిప్రాయాలను, ఆంగ్ల విద్యాభ్యాసం గావించిన వారి కందరికి అందజేస్తూ, వివిధ ప్రాంతాలలోని వారికందరికీ భావైక్యమును కలిగించినవి. విద్యావంతు లందరు సమాన భావ, సమానాభిప్రాయములు గలవారై, ఒక సంఘము వారిగా ఏర్పడడం, పత్రికా ప్రచారం

వల్ల జరిగింది. ఈ అభిప్రాయాలను, మనోభావాలను, ఇదే విధంగా దేశభాషా పత్రికలు, ఇంతకంటె విస్తృతమైన ప్రజాభాగంలో ప్రసారం గావించినవి. ఇట్లీ రెండు వర్గాల పత్రికలూ (ఆంగ్ల, దేశభాషా పత్రికలు) దేశప్రజను ఒక జాతీయ సంస్థగా రూపొందించినవి. ఇండియాలోని ప్రాంతము లన్నిటిలోను, బెంగాలు పత్రిక లెక్కువగా అభివృద్ధి చెందినవి. 1881 లో, బెంగాలులోని పత్రికల సంఖ్య 76. వీటిలో 28 బెంగాలీ భాషా పత్రికలు. 1905 నాటికి, బెంగాలు పత్రికల సంఖ్య 111 (బెంగాలీలో 65). సురేంద్రనాథ బెనర్జీ, సంపాదకుడుగా నిర్వహిస్తూ ఉండిన 'బెంగాలీ' ఆ కాలపు ఆంగ్లపత్రిక లన్నిటిలోనూ ప్రధానమైనది; పలుకుబడి కలది. దాని తర్వాత, 'అమృతబజార్' పత్రిక, 'హిందూ పేట్రియట్' 'ఇండియన్ మిర్రర్'—పత్రికలు ముఖ్యములైనవి. 'న్యూ ఇండియా' అనే మరి యొక అంగ్లపత్రికను బిపిన్ చంద్రపాల్, 1903 లో ప్రారంభించెను.

1857 నుంచి 1880 వరకూ ప్రచారములో ఉండిన బెంగాలీ వారపత్రికలకు, మరికొన్ని పత్రికలు జతపడినవి. 'సంజీవిని' (1883), 'బంగబాసి' (1890), 'బసుమతి' (1896), అను పత్రికలవి. 'దైనిక్' అనే బెంగాలీ దిన పత్రిక 1885 లో వెలువడింది.

1878-79 కడపటికి, బొంబాయి రాజధానిలో 77 వార్తా పత్రికలు ప్రచారమందుండినవి. శతాబ్దం కడపటి నాటికి పత్రికా సంఖ్య 178 కి పెరిగింది. ఆంగ్ల, ఆంగ్ల-మరాఠీ, ఆంగ్ల-గుజరాతీ, మరాఠీ-గుజరాతీ జర్నల్సు వీటిలో చేరియున్నవి. 'ఇండియన్ స్పెక్టేటర్', 'పూనా హెరాల్డ్', 'మహారాటా', అను ఆంగ్ల పత్రికలు, 'కేసరి హింద్', 'బొంబాయి సమాచార్' అనే గుజరాతీ పత్రికలు, 'కేసరి' అనే మరాఠీ పత్రిక ప్రసిద్ధములైనవి. 'కేసరి' పత్రిక తన మొదటి సంచికలో, "కార్యనిర్వాహక వర్గములోని ప్రతిఅధికారీ, ప్రజాభిప్రాయం పట్ల, జాగ్రత వహించి ఉండేటట్లు చూస్తూ, కాపలాకాస్తూ, జరిగిన ప్రతి అన్యాయాన్నీ బహిరంగ పరుస్తుంది ఈ పత్రిక". అని తన ఉద్దేశాన్ని ప్రకటించింది. ఈ శపథాన్ని సక్రమంగా నిర్వహించి, ఈ పత్రిక, మరాఠీ పత్రికా ఉద్యమములో విప్లవాత్మక పరిణామాన్ని కలిగించింది.

పశ్చిమోత్తర ప్రాంతంలోనూ, ఔధ్‌లోనూ, 1884 లో ప్రచురింపబడిన పత్రికల సంఖ్య 95. వీటిలో, 95 ఉర్దూ, 12 హిందీ, 5 హిందీ-ఉర్దూ పత్రికలు. 1900 నాటికి వీటి సంఖ్య 109. ఇందులో 70 ఉర్దూలోను, 32 హిందీలోను 2 ఉర్దూ-హిందీలోను ప్రచురింపబడేవి. ఉర్దూ పత్రికలు స్తబ్ధములుగా నిలిచి, హిందీ పత్రికా ఉద్యమం అధికమవుతూ రావడం, గమనింప తగిన అంశము.

మదరాసులో, పత్రికా ఉద్యమము ప్రబలంగా సాగిందని నిర్ణయించడానికి తగిన ఆధారములు లభింపలేదు. కాని, తక్కిన ప్రాంతములలో వలెనే ఇక్కడ కూడా సమానాభివృద్ధి జరిగిందని ఊహించవచ్చును. 'స్వదేశ మిత్రన్' అనే తమిళ పత్రికను, జి. సుబ్రహ్మణ్యయ్యరు 1882లో స్థాపించెను. అభ్యుదయ ప్రయోజనాల నన్నిటినీ సమర్థిస్తూ, ఈ పత్రిక, ప్రధానమైన తమిళ పత్రికగా సిద్ధించింది.

'వివేక వర్ధిని' అనే తెలుగు పత్రిక సంఘ సంస్కరణను ప్రధానోద్దేశంగా చేసుకొన్నది. 'ఆంధ్ర ప్రకాశిక', సమస్తమైన సాధారణ విషయములతో పాటు, రాజకీయములను కూడా ప్రచురించింది. 1900 నాడు, దక్షిణ భారతంలో 161 పత్రికలుండినవి (పత్రికలు, జర్నల్సు చేరి). వీటిలో 52 తమిళము, 32 తెలుగు, 17 కన్నడము, 27 మళయాళం, 31 హిందూస్తానీ పత్రికలు. పేర్కొన్న మూడు పత్రికలు కాక, దేశభిమర్, లోకోపకారి, వికటదూత, ప్రపంచ మిత్రన్, కేరళ పత్రిక, మనోరమ, అనేవి ఇతర ముఖ్య పత్రికలు.

పత్రికల పట్ల తన అసమ్మతిని, సంశయాన్ని ప్రభుత్వము ప్రదర్శిస్తూనే వచ్చింది పత్రికలవలంబించిన నూతన ప్రవృత్తిని, ప్రభుత్వము మొదటిలో ఎక్కువగా పట్టించుకోలేదు. ఇండియా పత్రికలలోని వ్రాతల ధోరణి ఆక్షేపణీయమైనదని, 1885 నాటి పత్రికా విచారణ సంఘ నివేదిక తెలియజేసింది. ఐనా, దానికి ప్రాధాన్యమివ్వనవసరం లేదు. బెంగాలీ వ్రాతలో సాహిత్య మార్గాన్ననుసరించిన అతిశయోక్తులు, అత్యుక్తులు, ప్రధానములై, మితవాదిత్వాన్ని పాటింపకుండడం, ఆ వ్రాత లక్షణము అని కూడా, ఆ నివేదిక వివరించింది. "పత్రికలవలంబించిన భావవ్యక్తీకరణ విధాన మే విధంగా ఉన్నా, ప్రభుత్వోద్దేశముల పట్ల అపనమ్మకము, స్వాతంత్ర్య సంపాదనకు ఆతురత, పత్రికలలో గోచరించలేదు. ప్రభుత్వము యొక్క ఉద్దేశాలు, సంకల్పాలు, ఎటువంటివో పత్రికా రచయితలకు తెలియకపోవడమే, వారి వ్రాతలకు ముఖ్య కారణము. కనుక, ప్రభుత్వము పూనుకొనే చర్యలకు సంబంధించిన ఉద్దేశాలను, వివరాలను పత్రికలకు అందించడం తగిన నివారణోపాయము. దానివల్ల మంచి ప్రయోజనం కలుగుతుంది" అని నివేదిక తెలిపింది. ఈ విషయమై, నార్తు బ్రూక్, ఒక ప్రణాళికను కూడా సిద్ధం చేసి యుండెను. కాని, దానిని ఏ కారణం వల్లనో, ప్రభుత్వము ఆచరణలో పెట్టలేదు.

కాని, ఈ సహనభావము త్వరలోనే మారిపోయింది. బెంగాలు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి, పత్రిక లవలంబించి యున్న మాత్సర్యాన్ని గురించి, 1887 లో, ఆక్షేపించినాడు. "దేశభాషా పత్రికలలోని వ్రాతలను పరిశీలించగా, ప్రభుత్వ చర్యలను, ప్రభుత్వోద్దేశాలను ద్వేష భావముతో తిరస్కరించి, దూషించడమే, పత్రికల ప్రధానోద్దేశమై ఉన్నట్లు వ్యక్తమౌతున్నది. ఏ విషయాన్ని గూర్చి చర్చించదలచుకొన్నా, ప్రభుత్వాన్ని దుర్విమర్శకు గురిచేయడానికి, పత్రికలు ముందుగానే నిశ్చయించుకొని ఉన్నట్లుగా గోచరిస్తుంది." 1902 లో, మరల తన ఆక్షేపణను ప్రభుత్వానికి తెలిపియున్నాడు. "రంధ్రాన్వేషణమే కర్తవ్యంగా కుతర్కానికి పూనుకొని వినాశాత్మకమైన విమర్శకు, పత్రికా సంపాదకులు పూనుకొని యున్నారు. మిక్కిలి సమర్థులైన రచయితలు కూడా, ద్వేష భావానికి, మాత్సర్యానికి లోనై, దుర్విమర్శకు పూని యుండడం, శోచనీయమైన దురవస్థ."

బొంబాయి పత్రికలు కూడా, బెంగాలు వాటి వలెనే, ఇదే విధమైన ప్రవ

ణతను (Proclivity) అవలంబించి, ప్రభుత్వపు ఆగ్రహానికి గురియైనవి. దేశ పత్రికలను గూర్చిన ప్రభుత్వ పరిపాలన నివేదిక (1880) ఈ విధంగా వ్రాసింది. "ప్రభుత్వం పట్ల దేశ పత్రికల ధోరణి-సంవత్సరమంతా-ఎప్పటి వలె భక్తి యుక్తంగానే ఉన్నది." కాని, అంతలో క్రొత్తధోరణి ప్రారంభమయింది. కేసరి, మహారాటా, కాల్, అను పత్రికలు రాజకీయ రంగంలో ప్రవేశించి, నూతనయుగ ప్రవేశానికి వైతాళికులైనవి. ఛిప్లుంకరు, అగర్కార్, తిలక్, ఆప్టే, ఖాదిల్కార్, కేల్కారు-ఇటువంటి మేధావంతులైన రచయితలు, దేశభక్తులు, కేసరి పత్రికను మహారాటా పత్రికను, పోషించి, సహకరించినారు. పత్రికా రచన వారికి వృత్తి కాదు. జాతీయతా ధర్మాన్ని ప్రచారం గావించే జీవిత ధ్యేయం వారిది. బ్రిటిషు ప్రభుత్వానికి బద్ధ విరోధియైన తిలక్, ఈ రెండు పత్రికలకు వెనుక ఉన్న ప్రజాశక్తి (1889-1920).

శివరామ మహాదేవ పరంజపి, సంపాదకుడై ఉన్న 'కాల్' ఈ పత్రికాత్రయములో ఒకటి. జాతీయ భావాలను, అభిప్రాయాలను ఈ పత్రిక తీవ్రంగా ప్రచారం గావించింది. ఈ మూడు పత్రికలకు కలిగిన పలుకుబడీ, ప్రాబల్యమూ, ఇందుప్రకాశ్, జ్ఞానప్రకాశ్ వంటి ఇతర పత్రికలను మరుగు పరచినవి. సమాజ దృక్పథాన్ని ఈ పత్రికాత్రయం మార్చివేసింది, సంఘసంస్కరణ ప్రయోజనము వెనుకబడింది. సంప్రదాయ వాదుల ప్రాబల్యము, రాజకీయాల ప్రాబల్యమూ అధికమై, సంస్కర్తలు వెనుకకు తగ్గవలసి వచ్చింది.

కేసరి, కాల్, పత్రికలు తమ స్వతంత్ర భావాల కారణము వల్లను, రాజకీయాలలో అవలంబించిన అభ్యుదయ మార్గాలవల్లను, కష్టాలకు గురికావలసి వచ్చింది. ఇండియా పత్రికల విషయమై, ప్రభుత్వ పరిపాలన నివేదికను పంపిస్తూ బొంబాయి ప్రభుత్వ కార్యదర్శి ఈ విధంగా వ్రాసియున్నాడు, "మత పునరుజ్జీవనోద్యమ ప్రవాహము, హిందూ సమాజాన్ని ఆవరించింది. దాని ననుసరించి, వర్గభేదాలకు సంబంధించిన వైమనస్యము సంఘములో ఉత్పన్నమయింది. లేశమాత్రమైన ఆధారంకూడాలేని ఖండనలు, సంయమనంలేని ఉద్రేకపూరితమైన భాష, పత్రికలలోని వ్రాతల, లక్షణమై ఉన్నది. ప్రభుత్వము నిష్పాక్షికమైన బుద్ధితో, న్యాయంతో ప్రవర్తిస్తూ ఉన్నా, ఈ పత్రికలు తమ దూషణ నంతా, తమ ప్రతిపక్ష మతంపై కాక, ప్రభుత్వంపై ప్రయోగిస్తున్నవి."

1897 బొంబాయి రాజధానిలో ఒక తీవ్రమైన విషమ పరిస్థితి ఏర్పడింది. విశాలంగా వ్యాపించిన క్షామము, అంటురోగాలు, రాజధాని జీవనాన్ని ఉక్కిరి బిక్కిరి కావించినవి. సంశయాలతో, ద్వేషభావాలతో నిండియున్న ఆ వాతావరణంలో, ప్లేగునివారణోద్యమాన్ని నిర్వహించే అధికారి, హత్యగావింపబడెను. ఆంగ్లోఇండియన్ పత్రికలు క్రోధోద్రిక్తములై, బ్రిటీషుప్రభుత్వము ఆపదలో నున్నదని, భీతిని ధగులుకొల్పినవి. ప్రభుత్వము భయోత్పాతానికి వశమైపోయింది. పూనా నగరము దండాత్మక పోలీసు అధికారాక్రాంత మయింది. ఆయుధములకై ఊరంతా గాలింపబడింది. ప్రభుత్వానికి విరుద్ధంగా ప్రచారంచేసి, ప్రజలను హింసా

కాండకు పురికొల్పుచున్నాడనే మిషపై, తిలకును ఖైదుచేసింది ప్రభుత్వము. ఆ అభియోగంపై అతనికి 18 నెలల కఠిన శిక్షను విధించింది. పీనల్ కోడ్‌లోని 124 A. నిబంధనలో మార్పులు గావించి, నియమాలను కఠిన మొనర్చిరి. ఇండియా ప్రభుత్వానికి జాబుల్రాస్తూ, బొంబాయి ప్రభుత్వం, ఈ విధంగా వివరించింది. "ప్రభుత్వమునకు విరుద్ధంగా తీవ్రమైనధోరణి నవలంబించిన పత్రికల చెలామణి ఎక్కువగుతూ ఉండడం, పరిస్థితులన్నిటిలోనూ, అసంతృప్తికరమైనట్టిది. రెండు మార్లు దండనకు లోనైన 'గురాఖి' పత్రిక, ప్రతి దినమూ 5000 ప్రతులను చెలామణిచేస్తూ ఉన్నది. ఈ విధంగానే కేసరి పత్రిక చెలామణి, 12000 నుండి 13000 లకు పెరిగింది. రాజధానిలో ప్రచురింపబడుతున్న పత్రికలన్నిటిలోను విషపూరితము, అతి సాహసాత్మకము ఐన 'కాల్' పత్రిక, 2500 మంది చందా దారులను సంపాదించుకొన్నది. భారతదేశంలోని పత్రికల కింకను పరిపక్వత కలుగ లేదు. వీటికి ప్రేరణమంతా కాంగ్రెసు చేస్తున్నదని, ప్రభుత్వము దోషారోపణ గావించింది.

1903 నాటి, ప్రభుత్వ నివేదిక, భారతీయ పత్రికలను ఈ క్రిందివిధంగా వర్గీకరించింది.

1. "బ్రిటీషు పరిపాలన పట్ల ద్వేషమును వహించి, చిత్ పావన్ బ్రాహ్మణులు నిర్వహిస్తున్న మరాఠీ వార్తా పత్రికలు.

2. కాంగ్రెసు ప్రచారాన్ని పోషిస్తూ, అధికమైన రాజకీయ స్వత్వముల (హక్కులు) కై ఒత్తిడి చేస్తున్న 'యంగ్ ఇండియా' అభిప్రాయాలను ప్రచారం గావిస్తున్న పత్రికలు.

3. చర్చనీయాంశాలను నిష్పాక్షికమైన దృష్టితో, స్తిమితంగా పరిశీలిస్తూ, సమాధానయుక్తము, ప్రభువిశ్వాసయుక్తము, ఐన, భాషా ధోరణిని అవలంబించిన పత్రికలు.

4. బ్రిటీషు ప్రభుత్వ నీతి ప్రవృత్తిని, సర్వదా సమర్థిస్తూ, భక్తియుక్తమైన వాగ్ధోరణిని అవలంబించిన పత్రికలు".

బ్రాహ్మణులు నిర్వహించుచుండిన 'కేసరి' మొదలైన పత్రికలకు బహుళ ప్రచారము, విస్తారమైన పలుకుబడీ, ఉన్నదని ఈ నివేదిక అంగీకరించక తప్పింది కాదు.

ఉత్తర ప్రదేశములలోని పత్రికలకు, బెంగాల్, బొంబాయి, పత్రికలు ఆదర్శములైనవి. ఐనా, భాషా విషయంలో, మితంగా ప్రవర్తించినవి. 'ఔధ్ అక్బర్', రాజారాంపాల్ సింగ్ నిర్వహిస్తూ ఉండిన 'హిందూస్థాన్' అనే హిందీ పత్రిక, 'అలిఘరు విద్యా సంస్థ గెజెట్', హిందూస్థాన్ రివ్యూ, కాయస్థ సమాచార్, అడ్వొకేట్, అనే ఆంగ్ల పత్రికలు,—నిశితమైన బుద్ధిశక్తితో నిర్వహింప బడినవి. 'హిందూస్థాన్ రివ్యూ', 'కాయస్థ సమాచార్', పత్రికలు అందమైన స్వరూపంలో, వెలువడేవి. 'సిటిజన్' పత్రిక ధోరణి ఎప్పటివలెనే, ప్రభుత్వంపై దోషారోపణ గావించేది.

కారొనేషన్ దర్బారును గురించి ఎక్కువ చర్చ జరిగింది. కాని, పత్రిక లేవీ దానిపై ఆసక్తి చూపలేదు. 'సిటిజన్' పత్రిక యొక్కటే దర్బారును "అనావశ్యక సామ్రాజ్య ప్రదర్శనమని" పేర్కొనింది.

"అడ్వొకేట్" పత్రిక కాంగ్రెసు కార్యక్రమాన్ని ప్రశంసించి, దేశములోని ఉదార భావాలకు, అది ఆధారమని తెలిపింది. భారతదేశాన్ని విజిత దేశంగా పరిగణించే, ఆంగ్లో ఇండియన్ పత్రికలను, నిష్కర్షమైన భాషలో, దులిపి వేసింది, అడ్వొకేట్ పత్రిక. కర్జన్ ప్రభువు యొక్క ఉద్యోగ కాలావధిని ప్రభుత్వము ఎక్కువ గావించడం, పత్రికలకు అనిష్టకరమయింది. మిలిటరీ సేవలోని ఉన్నతోద్యోగాల నుంచి, దేశీయులను బహిష్కరించడం, "తీవ్ర ప్రతీకార సామ్రాజ్య నీతి" అని వర్ణితమయింది.

మదరాసు పత్రికల ధోరణి, సమాధాన యుక్తమైనది. హిందూ, మదరాసు స్టాండర్డు పత్రికలు, తక్కిన పత్రికల నమూనాపై ఏర్పడి, తమ అభిప్రాయాలను, భావాలను మిత ధోరణిలో వ్యక్తము గావిస్తూ ఉండినవి. దేశభాషా పత్రికలు కూడా, ప్రభుత్వాన్ని విమర్శించడంలో మార్దవాన్ని ప్రదర్శిస్తూ వచ్చినవి.

# 11

# సామ్రాజ్యనీతి - అది ప్రవృత్తమైన పద్ధతి

## I. బ్రిటీషు పరిపాలనలోని విరోధాభాసము

ఇండియాలో మధ్యతరగతి అభివృద్ధితో, రాజకీయ చైతన్య ప్రబోధ మయింది. పందొమ్మిదో శతాబ్దపు ఆరంభంనుంచి కూడా, ఈ వర్గంవారు లోక వ్యవహారాలలో ఆసక్తి ప్రదర్శిస్తూ వచ్చినారు. ఈ ఉద్యమానికి, ఆంగ్ల, దేశభాషా పత్రికలు ప్రోద్బలం ఇస్తూ వచ్చినవి. పత్రికలసంఖ్య, పత్రికాపఠయితల సంఖ్య కూడా వేగంగా అభివృద్ధి అవుతూవచ్చింది. దీనినిబట్టి, ప్రజలు రాజకీయాలలో శ్రద్ధాసక్తులను చూపుతున్నారని విదితమవుతుంది.

విద్యావ్యాప్తితో, ఈ రాజకీయాసక్తి వృద్ధిపొంది తత్ప్రసార మండలం క్రమంగా విస్తారమవుతూ వచ్చింది. 1858 నుంచి 1885 వరకు రాజకీయో ద్యమం స్థానికమై, ప్రాంతాలకు మాత్రం పరిమితమై ఉండేది. కాని, దేశమంతటా ఒకే విధమైన సమస్యలు ప్రజల మనస్సులను వేధిస్తూ ఉండేవి. రాకపోకల సౌక ర్యాలు, తంతి తపాలాసాధనాలు వృద్ధియైనకొద్దీ, ప్రాంతాలమధ్య సంసర్గ సంబం ధాలభివృద్ధిచెంది, రాజకీయోద్యమము, ప్రాంతాల సరిహద్దులను దాటి వ్యాపించి, జాతీయోద్యమంగా పరిణమించింది.

రాజకీయాసక్తి అభివృద్ధి పొందడం, ప్రజాభిప్రాయమేర్పడడానికి, ప్రజాభి ప్రాయ ప్రసార సాధనాలేర్పడడానికీ, అభిప్రాయ సంఘర్షణలు, ప్రయోజన వైవిధ్యము, ప్రేరకాలని, సాధారణంగా ఒక అభిప్రాయం ఉన్నది. స్వతంత్ర ములై, ప్రజాస్వామ్య ప్రభుత్వాలున్న దేశాలలో, భిన్నాభిప్రాయాలు, భిన్న ప్రజా ప్రయోజనాలు, గల, రాజకీయ పక్షాలమధ్యా, భిన్నవర్గాలమధ్యా, ఈ సంఘర్షణ కలుగుతుంది. పరిపాలకులూ, పాలితప్రజలూ, భిన్న జాతులవారై ఉన్న అధీనరాజ్యాలలో, జాతీయభావము, జాతీయకార్యక్రమము, ప్రజలలో స్వాతంత్ర్యాభిమానాన్ని ఉత్పన్నంచేస్తాయి. పరిపాలన విధానము ఉదారంగా మారవలెనని, అధికారంలో తమకు కూడా ప్రాతినిధ్యము కావలెనని, ప్రజలు ప్రభుత్వాన్ని ఒత్తిడిచేయడానికి పూనుకొంటారు. ప్రజల ఈ ప్రవృత్తిని, విదేశ ప్రభుత్వము; సంశయించడానికి ప్రారంభించడంతో, పాలకులకు పాలిత ప్రజలకు మధ్య, పరిపాలనాధికార విషయమై, ఘర్షణ చెలరేగుతుంది.

ఈ అధికారవిషయమై ఇండియాలో జరిగిన ఘర్షణ రెండు దశలలో జరి గింది. మధ్యయుగ కాలాల వ్యవస్థ నవలంబించి యుండిన భారతదేశం, విజేతల

ఆధిపత్య శృంఖలాల నుంచి, విమోచనం పొందడానికి జరిపిన సంఘర్షణ మొదటి అవస్థాకాలానికి చెందినది. ఈ అవస్థ (దశ) 1858 తో ముగిసింది. దానితో, చాలా వరకు మారిపోయిన దేశపరిస్థితులలో, రెండో దశ ప్రారంభమయింది. క్రమబద్ధమైన పరిపాలన వ్యవస్థను, విజేతలు నెలకొల్పి ఉన్నారు. భద్రతారక్షణకు సంబంధించిన ఏర్పాట్లను గావించుకొని, ప్రజల బాగుకు సంబంధించిన సమస్యలపై ఆసక్తి వహిస్తూ వచ్చినారు. విద్యావ్యాప్తి, సంఘ సంస్కరణము, రాకపోకల సౌకర్యాలను, ఉత్తర ప్రత్యుత్తర సాధనాలను ఏర్పరచడం, వ్యవసాయము, ఆరోగ్య సంరక్షణ, మొదలైన ప్రజా ప్రయోజన విషయాలకు పూనుకొన్నది ప్రభుత్వము.

ప్రజాహిత వ్యవస్థాపన, సంస్కరణము, దేశాభ్యుదయము, అనే ఆహార్యకంతో (బాహ్య వేషంతో), తమ పరిపాలనయొక్క నిజస్వరూపాన్ని కప్పుకొన్నారు, పరిపాలకులు. కనుక, వీరి ప్రభుత్వ పరిపాలనకు, విద్యావంతుల వర్గము, చల్లగా లోబడి పోయింది. పద్దెనిమిదో శతాబ్దంలో వ్యాప్తమై యుండిన అరాజకత్వంనుంచి తమకు విమోచన కలిగించి, భద్రతారక్షణలను దేశంలో స్థాపించిన బ్రిటీషు ప్రభుత్వం తమకు మోక్షసాధనమైనదనే వీరి నమ్మిక. పరప్రభుత్వానికి లోబడడం, పరప్రభుత్వాంగీకారానికి దారితీసింది. బుద్ధి పూర్వకంగాను, సంశయ రహితంగానూ, ఈ అంగీకారము సిద్ధించకపోయినా, స్వలాభం ఇందుకు హేతువైనప్పటికీ, విద్యావంతుల వర్గం వాస్తవంగానే పరప్రభుత్వాన్ని ఆమోదించిందని చెప్పవచ్చు.

కాని, బ్రిటీషుపరిపాలన, తన ప్రకృతికి సహజమైఉన్న సామ్రాజ్య ప్రవృత్తిని అధిగమించలేక పోయింది. ప్రభుత్వమేర్పడింది సామ్రాజ్య ప్రయోజనార్థము. దాని విధానాలను నడిపిందికూడా, సామ్రాజ్య ప్రయోజనమే. ప్రథమదశలో హ్రస్వదృష్టికి లోనై, స్వప్రయోజనాల సాధనకై, విజితదేశాన్ని ఉపయోగించుకొని, స్వలాభాలను పూరించుకొన్నారు పరిపాలకులు. బెంగాలు దివానీని బ్రిటీషు వారు గ్రహించిన రోజులలో, ఈ స్వార్థలాభం పెచ్చు పెరిగింది. ఈ హ్రస్వదృష్టి వల్ల, కాలాంతరంలో తమకు హాని కలుగవచ్చునని ప్రభుత్వము, త్వరలో గ్రహించింది. సామ్రాజ్య ప్రయోజనాలు శాశ్వతంగా, నిరంతరంగా, సిద్ధించవలెనంటే, దేశంలో, తమ ప్రభుత్వం స్థిరంగా నెలకొనవలసి ఉన్నదనే పరిజ్ఞానం కలిగింది. అంతటితో, సమర్థమైన, సక్రమమైన, పరిపాలన వ్యవస్థను ఏర్పరచడానికి ప్రభుత్వం పూనుకొన్నది. దేశంలో శాంతిని నెలకొల్పడం, తమ మాతృభూమియైన ఇంగ్లాండు ఆర్థిక వ్యవస్థా పోషణకు అవసరమైన మార్గాలలో ఇండియాలోని మూల సాధనములను (Resources) పెంపొందించడం, తమ పరిపాలన పద్ధతులను అర్థంచేసుకొని, తమకు సహకరించే యువకుల తరిఫీదుకు తగిన విద్యా విధానాన్ని, – అవసరమైనంతవరకూ – ఏర్పరచడం, – మొదలుగాగల కార్య క్రమాలను ప్రభుత్వంవారు ప్రారంభించినారు. తమ సామ్రాజ్యనీతిని ప్రపంచ దేశాలలో నైతికంగా, సమర్థించుకోవడానికి, పాలితప్రజల అంగీకారాన్ని పొందడానికి,

నాగరక ప్రభుత్వాన్ని ఏర్పరచడం, అవశ్యమయింది. ఇటువంటి దూరదృష్టితో, సమర్థమైన ప్రభుత్వాన్ని నెలకొల్పడానికి తగిన, ఈ చర్యలకు ప్రభుత్వం పూనుకొన్నది. సామ్రాజ్యనీతిని, నిర్దాక్షిణ్యంగా విమర్శించే హాబ్సన్ (Hobson), బ్రిటీషు ప్రభుత్వము ఇండియాలో గావించిన అభివృద్ధిని ఈ క్రింది విధంగా వివరించినాడు. "అలెగ్జాండరు కాలంనుంచి ఇంతవరకు, ఇండియాదేశ మెప్పుడూ అనుభవించని, ప్రశాంతిని శాశ్వతంగా, విస్తృతంగా, నెలకొల్పినాము. న్యాయ పరిపాలన సూత్రాలను ప్రజలందరికీ సమానంగా, ధర్మబద్ధంగా వర్తింపజేసి, న్యాయ పాలన ప్రమాణాన్ని అభివృద్ధి పరచినాము. పన్నుల విధానాన్ని క్రమబద్ధం గావించి, పన్నుల భారాన్ని కొంతవరకు, తగ్గించినాము. దీనివల్ల, దేశీయ ప్రభువుల పీడకచర్యలు, అధికార దుర్వినియోగము, పన్నులు వసూలుచేసే వ్యక్తుల దుండగాలు, నిరోధించబడినవి. ప్రజల విజ్ఞానవ్యాప్తికై ప్రభుత్వ పాఠశాలలు, కళాశాలలు, నెలకొల్పబడినవి. వీటికితోడుగా, ప్రభుత్వ సహకారంతో మిషనరీలు నిర్వహిస్తున్న విద్యాసంస్థలుకూడ విద్యాప్రచారానికి పూనుకొన్నవి. ఈ విద్యా సంస్థలలో క్రిశ్చియను మతవిషయమైన బోధ మాత్రమేకాక, ప్రజలకు ఉపయోగకరములైన పారిశ్రామిక వృత్తులుకూడ నేర్పబడుతున్నవి. రహదారులు, రైల్వేలు, శాఖోపశాఖలుగా విస్తరిల్లిన నీటికాలువలు, - ఇత్యాదులు, రాకపోకల సౌకర్యాలను, రవాణా సాధనాలను వృద్ధిగావించినవి. శాస్త్రీయమైన నీటిపారుదల వ్యవస్థ విస్తారంగా ఏర్పడి, పంటల ఉత్పత్తిని, ఇతోధికం గావించింది. బొగ్గు, బంగారము, ఇతర ఖనిజాలు, వీటికి సంబంధించిన ఉత్పాదన పరిశ్రమ అభివృద్ధి చెందింది. బొంబాయిలోను, ఇతర ప్రదేశాలలోను, ఆధునిక యంత్ర పరికరాలతోకూడిన దూదిమిల్లులు స్థాపించబడినవి. ఇతర యాంత్రిక పరిశ్రమల స్థాపనవల్ల, పెద్ద నగరాలలోని ప్రజల జీవనోపాధికి అవకాశాలేర్పడినవి. తేయాకు, కాఫీ, నీలిమందు, జనుము, పొగాకు, ఇంకా ఇతరములైన పంటలు దేశ వ్యవసాయంలో క్రొత్తగా చేరినవి. మానవత్వానికి తీరనిద్రోహాన్ని తెచ్చిపెట్టిన మత సాంఘిక మూఢ విశ్వాసాలను, ప్రజల అభ్యుదయానికి నిరోధములైన ఇతర పద్ధతులను, క్రమంగా శిథిలం గావిస్తున్నాము. బ్రిటీషు నాగరకతా ప్రభావం ప్రసరించి ఉన్న ప్రదేశాలలో, ఇంతవరకు దృఢంగా పాతుకొనిపోయియుండిన, కులవ్యవస్థ కూడా మారుతూవచ్చింది."

బ్రిటీషు సామ్రాజ్యం ఇండియాలో గావించిన ప్రజాహితకర చర్యలను, హాబ్సన్, ఈ విధంగా ప్రశంసించడం తృణీకరించతగినదేమీకాదు. దానిలో సత్యం లేకపోలేదు. అయినా, మొత్తం మీద ఇండియాకు సిద్ధించిన ఫలిత మెటువంటిది, అనే ప్రశ్న కింకా సమాధానం లేదు. "సివిల్ సర్వీసులోని, మేధావంతులు, అధిక విద్యావంతులు, గౌరవనీయులు, అయిన అధికారులు నిర్వహించిన కార్యభారము, ప్రభుత్వాధికారులు నిస్స్వార్థంతో తమ ప్రజ్ఞాశక్తినంతను వినియోగించి సాధించిన కార్యాలు, ఇండియాదేశ వ్యవహారాలకు, నిర్దేశకులై నడపటంలో, రాజప్రతినిధులు, మైత్రాయిలు, ప్రదర్శించిన రాజనీతి పాండిత్యము,—ఈ అన్నిటివల్లను

భారతదేశానికి సిద్ధించిన ఫలమెటువంటిది ?

బ్రిటీషు సామ్రాజ్యం ప్రజాహితకరములైన కార్యములను చేపట్టిఉండడం నిజమే. భారతీయుల ఐక్యతకు అవసరములైన పరిస్థితులను ఇవి కల్పించినవి. జాతీయభావాన్ని ఉద్బోధించి, పర్యవసానంగా స్వాతంత్ర్య సంపాదనకు కూడా ఇవి ప్రేరకములైన వనటం వాస్తవమే. కాని, ఒక విషయం గుర్తించుకోవలసి ఉంది. సామ్రాజ్య నీతియొక్క సహజ ప్రకృతినిబట్టి ప్రజాస్వామ్య పరిపాలన, స్వప్రభుత్వము, అనేవి దీనికి విరుద్ధము లైనవి. ఇవి భిన్న ప్రకృతులు. కనుక, స్వవినాశానికి తానై పూనుకోదు సామ్రాజ్య నీతి. సామ్రాజ్యనీతికి మూలాధారము భౌతికబలము. దాని ఉపకరణం సైనికశక్తి. సామ్రాజ్యనీతి, సైన్యనీతి, పరస్పర సహాయకములు. తమ ఆధిపత్యానికి లోనై ఉన్న విజితజాతులకు నష్టం కలిగించి మాత్రమే ఇవి రెండూ వర్ధిల్లగలవు. అందునూ, విజితులు, విజేతలు, భిన్నజాతులవారైన సందర్భంలో, మొదటివారు పతితులై పోవడం తప్పదు. ఇది ప్రకృతి సిద్ధమైన విషయము.

## II. సామ్రాజ్య నీతియొక్క 'కొల్లగొట్టి తినేస్వభావము' (Predatory nature)

పందొమ్మిదో శతాబ్దంలో, ఏషియా, ఆఫ్రికా ఖండాలలో సామ్రాజ్యనీతి ప్రవర్తించిన విధానము, దయారహితము, వినాశకరము అయినట్టిది. అటువంటి విధానాన్ని నడిపిన జాతికి కూడా, దానివల్ల సత్ప్రయోజనం సిద్ధించలేదు. సామ్రాజ్య విధానాన్ని అవలంబించినందువల్ల బ్రిటను సంపన్న మయింది, శక్తివంతమయింది. నిజమే. కాని, సామ్రాజ్య విస్తరణకై పోటీపడుతున్న యూరోపు దేశాల మధ్య స్పర్ధకు, ఈర్ష్యకు ఇది కారణమై, అంతర్జాతీయ యుద్ధాలకు ప్రేరకమయింది. యూరపు సామ్రాజ్య దేశాల అంతర్దేశీయ విధానాలు, మారినవి. దేశాల మధ్య స్పర్థ ఎక్కువవుతూ రాగా, యుద్ధభీతికూడా అధికం కాజొచ్చింది. కనుక, సైన్య సన్నాహాల నిరంతరాభివృద్ధి అగత్య మయింది. ప్రజోపయోగకర కార్యాలకై వినియోగించవలసిన, బడ్జెటులోని మొత్తము, యుద్ధ సన్నాహాలకు వెచ్చించవలసిన పరిస్థితి యేర్పడింది.

విద్య, ఆరోగ్య రక్షణ, ప్రజాహిత కార్యాలు,—మొదలైన లోకోపకారక ప్రయత్నాలు కుంఠితము లైనవి. సైన్యాధికార వర్గాలు, ప్రజలలో యుద్ధోన్మాదాన్ని కలిగించి, రాజకీయాధికారాన్ని వశపరచుకోవడానికి ప్రయత్నించినవి. దీనివల్ల, ఆదేశంలోను, విదేశాలలో కూడా ఉదార ప్రక్రియలు, ప్రజాస్వామ్యము, నిరోధించబడినవి. ఈస్ట్ ఇండియా కంపెనీ అవలంబించినటువంటి వాణిజ్య సామ్రాజ్య విధానంవల్ల ఏర్పడే దుష్టపరిణామాలను గురించి, బర్కు, 18 వ శతాబ్దాంతం నాటికే, ఇంగ్లాండు ప్రభుత్వాన్ని హెచ్చరించి ఉన్నాడు. బ్రిటీషు ప్రభుత్వము, 19 వ శతాబ్దంలో, అనుసరిస్తున్న, పారిశ్రామిక సామ్రాజ్యనీతిని గూర్చి కూడా, కొందరు బుద్ధిమంతులు ప్రభుత్వాన్ని హెచ్చరించే ఉన్నారు. రిచ్చర్డు కాబ్డెన్, జార్జు కారన్‌వాలీస్ లూయీ, జాన్ బ్రైట్' అంథోనీ ట్రల్లాప్,

జాన్ స్టూవర్ట్‌మిల్, ఎల్‌ఫ్రెడ్ స్కీవెన్‌బ్లంట్, జాన్ ఏ. హాబ్సన్,—మొదలైన ప్రసిద్ధులుకూడా, ప్రభుత్వాన్ని హెచ్చరించినవారే. సామ్రాజ్యనీతికి వ్యతిరేకంగా, చాలామంది వ్రాసిన వాటినుంచి, మచ్చుకు రెండు మాత్రమే ఇక్కడ ఉదహరించ బడుతున్నవి. ఇండియాను గూర్చిన జాబులో కాబ్డెన్, ఈ క్రింది విధంగా వ్రాసినాడు (1858, మే, 16).

"ఇండియాలో జరుగుతున్న దానినిబట్టి, మనజాతి గుణశీలములు క్షీణించి పోతున్నవి. మన స్వాతంత్ర్యంపట్ల మనజాతికిగల ప్రేమ నశించిపోతున్నది. ఇండియాలో, నిరంకుశంగా, కసాయివాని వృత్తికి పూనుకొని ఉన్న మనశీలానికి, ఇంగ్లాండులో కూడా, హాని కలగకపోవడం సాధ్యమా ? ఏషియాఖండ దండయాత్రవల్ల, ఆక్రమణల వల్ల, ప్రాచీన గ్రీకు రోమను జాతులవారు భౌతికంగా, నైతికంగా భ్రష్టులై పోలేదా ? మనకుగూడా అట్టి దుర్గతియే మరొకమార్గంలో—పట్టదా ?"

జె. ఏ. హాబ్సన్, ఈ క్రింది విధంగా వ్రాసినాడు. సామ్రాజ్యనీతి, దానికి పోషకములై ఉన్న సైన్య, రాజనీతి, విత్త సాధనాలు,—ఇవే ప్రభుత్వంయొక్క ప్రయోజనాలుగా సిద్ధించినవి. ప్రభుత్వవిధానాన్నంతటినీ, ఇవి మాత్రమే ఏర్పరచి, నడపుతున్నవి. ప్రజా వ్యవహారా లన్నిటికీ ఇవి మాత్రమే సూచకములై, వాటి ధోరణిని, స్వభావాన్ని ఏర్పరుస్తున్నవి. ఊహాకల్పితములైన అమిత లాభాలకు, ఆపదలకు, ఆకరములైన సలహాలను సూచనలను, నిరంతరంగా ప్రజలలో వ్యాపింప జేస్తున్నవి. తత్కారణంగా, ప్రస్తుతం జరగవలసిన అంతర్దేశీయ పౌరవ్యవహారాలు, ప్రభుత్వ విధానాలు భీతికిలోనై మరుగుపడి పోయినవి. దీనివల్ల ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వంలో కలిగిన శీఘ్రమైన, అమితమైన పరివర్తనం ప్రత్యక్షగోచరమై ఉన్నది. ప్రజా ప్రాతినిధ్య సంస్థల అధికారం తగ్గిపోయింది. భిన్న రాజకీయ పక్షాలవారు ప్రతిపాదించిన అర్థవంతములైన విధానాలపై, ప్రజలు స్వేచ్ఛగా, బుద్ధిపూర్వకంగా, హేతుబద్ధంగా, తమ అభిప్రాయాలను ఎన్నికలలో తెలిపే అవకాశాలు నశించినవి. పార్లమెంటులోని ప్రజాప్రతినిధుల సభలో, ప్రతిపక్షవర్గంవారు తమ అభిప్రాయాలను, తమవ్యతిరేక భావాన్ని తెలిపే అధికారం క్రమంగా, లోపిస్తూ వచ్చింది. అధికారాన్ని వహించిఉన్న ప్రభుత్వంలోకూడా, ఈ బాహ్యశక్తులే కేంద్రాధిముఖములై ప్రవృత్త మవుతూ, ప్రభుత్వ స్వాతంత్ర్యాన్ని అరికట్టుతున్నవి". సామ్రాజ్య నీతికి, ప్రజా ప్రభుత్వానికి, సమాన భావ మెప్పుడూ ఉండదు. భావంలోను రాజ్యాంగనీతిలోను, ప్రవృత్తివిధానంలోనూ, ఇవి రెండూ పరస్పర విరుద్ధము లైనట్టివి.

సామ్రాజ్య విధానానికానాడు తీవ్రమైన వ్యతిరేకాభిప్రాయము, ఇంగ్లాండులోని ఉదారవాదులలో ఉండేదని, ఈ ఉదాహృత భాగాలనుబట్టి విశద మవుతున్నది. పందొమ్మిదో శతాబ్దంలో, రెండు విధములైన అభిప్రాయా లొకేసారి వ్యాప్తమై ఉండేవి. ప్రజాస్వామ్య ప్రభుత్వానికి స్వాతంత్ర్యానికి సంబంధించిన అభిప్రాయాలు, దేశంలో సాంఘిక రాజకీయ సంస్కరణలకు ప్రోత్సాహమిస్తూ

వచ్చినవి. పార్లమెంటు సంస్కరణలు, దండన విధులకు మానవతనాపాదించడం, శ్రామికుల జీవన పరిస్థితులను బాగుపరచడం, స్త్రీజనమునకు రాజకీయ స్వాతంత్ర్యాన్ని కల్పించడం, స్థానిక ప్రభుత్వాల పునర్వ్యవస్థీకరణము,—మొదలైన రూపాలలో ఈ భావాలు రూపొందినవి. విదేశ రాజ్యాంగ విషయంలో ఈ ఉదార భావాలు 'వలస రాజ్య సంస్కర్తలు' ప్రత్యేక వాదులు (Separatists), 'Little Englanders' చిన్న ఇంగ్లాండులవారు, మొదలైన సంఘాల స్థాపనకు కారణములైనవి. ఇది ఒక పక్షము.

ఇంకొకవైపు, సామ్రాజ్యాధిపత్యము 19 వ శతాబ్దంలో అత్యధికమైన విస్తృతిని కూడా పొందుతూ ఉన్నది. ఏషియా, ఆఫ్రికాలోని విస్తారభాగాలు సామ్రాజ్యాధిపత్యంలో చేరిపోయినవి. 1870 - 1900 మధ్యకాలంలో, సామ్రాజ్యం వశపరచుకొన్న భూభాగము, 4,754,000 చదరపు మైళ్లు. 1902 నాటి అంచనా ననుసరించి ఈ భూభాగంలోని ప్రజాసంఖ్య 880 లక్షలు. 1933-34 లో, బ్రిటీషు సామ్రాజ్య విస్తీర్ణము (బ్రిటీషు దీవులు కాక), 132.71 లక్షల చదరపు మైళ్లు. అందులోని ప్రజాసంఖ్య 44.9 కోట్లు. ఈ విశాల సామ్రాజ్యంలోని శ్వేతజాతుల సంఖ్య 2.56 కోట్లు మాత్రమే. ఇతర జాతుల వారి సంఖ్య 42.4 కోట్లు. అయినా, 2.56 కోట్ల శ్వేతజాతులవారు నివసిస్తున్న భూభాగము, 42.4 కోట్ల ఇతర జాతులు నివసిస్తున్న భాగానికంటె ఎక్కువ విశాలమైనది.

**రెండు సామ్రాజ్యాలు :** బ్రిటీషు మహాసామ్రాజ్యము రెండు వర్గాలుగా విభజించబడింది. శ్వేతజాతులవారి రాజ్యాలు, వలస రాజ్యాలు, అనేవే యీ రెండు. బ్రిటను రాజ్యాంగంలో ఈ రెండు భాగాలకు గల ప్రయోజనం వేరు. కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలండ్, దక్షిణాఫ్రికా అనేవి, శ్వేత రాజ్యాలు. బ్రిటీషు పత్రికలు, ప్రజలు, రాజనీతివేత్తలు, పార్లమెంటు కూడా, ఈ శ్వేత భాగం పట్ల విశిష్టమైన ఆసక్తిని, శ్రద్ధను, వహించినవి. ఈ రాజ్యాలను సామ్రాజ్యంలోని భాగాలుగా నిలిపిఉంచడం తగినది కాదేమో అనే సంశయం కూడా చాలా మంది ఆంగ్లేయులకు కలిగింది. ఈ రాజ్యాలకు స్వపరిపాలనాధికారాన్ని కల్పిస్తూ, మాతృభూమి అయిన ఇంగ్లాండునుంచి అవి విడిపోకుండా ఉండే ఏర్పాట్లు గావించడం మంచిదని, ఎడ్వర్డు గిబ్బన్, వేక్‌ఫీల్డ్ వంటివారు తలచినారు. ఇంగ్లాండు ప్రభుత్వాన్ని ఇందుకంగీకరింపజేసే ఉద్యమానికి కూడా వీరు పూనుకొనినారు. స్వతంత్ర పరిపాలనకు సమర్థములై ఉన్న రాజ్యాలకు, అటువంటి శాసనాధికారాన్ని ప్రభుత్వము స్వయంగా కల్పించవలెనని కూడా కొందరు వాదించినారు. కాబ్డెన్, జార్జ్ కారన్‌వాల్ లూయీ, - వంటి ప్రత్యేక వాదులీ వర్గంలోనివారు. ఈ రాజ్యాలు, ఇంగ్లాండు దేశము మెడలో కట్టుకొన్న గుదిబండల వంటివని, డిస్రేలీ వంటివాడు కూడా ఒకప్పుడభిప్రాయపడినాడు.

వలస రాజ్యాలతో కూడిన సామ్రాజ్యంవల్ల ప్రయోజనం లేదని, పర్యవసానంగా అవి విడిపోతాయని, కొందరు పర్యాలోచనశీలురైన బుద్ధి

మంతులు తలచినారు. కాని, మూడో జార్జి చక్రవర్తి, అతని సలహాదారులైన 'బ్యూట్' 'నార్త్' అనే వాళ్లూ చేసిన తప్పును ఇప్పటి సంస్కర్తవాదులు చేయ దలచుకోలేదు. కనుక, వలస రాజ్యాలకు స్వయం పరిపాలనాధికారాన్ని కల్పించి ఆ రాజ్యాల ప్రజలకు ఉపశమనం కలిగించే ప్రయత్నానికి పూనుకోవడం జరిగింది.

అంతటితో 1868 మొదలుకొని, శ్వేతరాజ్య భాగాల విషయంలో నూతన సామ్రాజ్య విధానం ప్రారంభమైంది. నూతన సామ్రాజ్యమనే భావాన్ని మొదటి సారిగా, లేవదీసిన వాడు సర్ ఛార్లెస్ డిల్క్. 'గ్రేటరు బ్రిటన్' (విస్తృతమైన బ్రిటన్) అనే గ్రంథంలో, ఈ భావాన్ని ఇతడు వివరించినాడు (1868). తన స్వభావ సిద్ధమైన ఔత్సుక్యంతో, డిస్రేలీ ఈ నూతన భావాన్ని గ్రహించినాడు.

'ఇంగ్లాండు యొక్క విస్తృతి' (Expansion of England) అనే గ్రంథాన్ని, సర్ జాన్ సీలీ 1883 లో రచించి, 'చిన్న ఇంగ్లాండు' (Little England) అనే భావాన్ని హేళన గావించినాడు. 'సీలీ' గ్రంథానికి పలుకుబడి యేర్పడింది. జే. ఏ. ఫ్రూడ్ (Froude) 'ఓషియానా' (Oceana) అనే గ్రంథంలో దూర సముద్రాలతో ఏర్పడి, వృద్ధి బొందుతున్న నూతన ఇంగ్లాండు దేశాలను గూర్చి ముచ్చటించినాడు. సామ్రాజ్య నీతికి దృఢంగా బద్ధుడైనవాడు ఛేంబర్లిన్. బ్రిటిషు జాతిలోను, బ్రిటిషు సామ్రాజ్యంలోను ఇతనికి అపారమైన విశ్వాసము. "పరిపాలక జాతులన్నిటిలోను ప్రపంచమెన్నడూ చూడని మహోన్నతమైనది బ్రిటీషు పరిపాలక జాతి" యని యితని అభిప్రాయము.

వలస రాజ్యాలనన్నిటినీ స్వయంపరిపాలక కక్షులుగా (Units) చేసి, వాటినన్నిటినీ బ్రిటీషు రాష్ట్రమండలిలోని (Common wealth) భాగస్థ సభ్యులుగా చేయడం, ఈ నూతన సామ్రాజ్య నీతియొక్క ఉద్దేశము. అప్పుడీ వలస రాజ్యాలు, ఇంగ్లాండుతో చేరి, స్వతంత్ర రాజ్యాల జ్యోతిర్మండలంగా ఏర్పడ తాయి.

1910 నాటికి, ఈ నూతన సామ్రాజ్య సంస్కర్తల స్వప్నము, వాస్తవంగా పరిణమించింది. బ్రిటీషు ప్రభుత్వము 'ఉత్తర అమెరికా శాసన' ప్రకారము, కెనడాకు అధినివేశరాజ్య ప్రతిష్ఠను కలిగించింది. ఐదేండ్ల తర్వాత, కేప్ కాలనీకి బాధ్యతాయుత ప్రభుత్వం సిద్ధించింది. 1890 లో, పశ్చిమాస్ట్రేలియాకు, 1893 లో నేటాలు రాష్ట్రానికి, బాధ్యతాయుతప్రభుత్వా లేర్పడినవి. 1910 లో, ఆస్ట్రేలియా రాష్ట్ర మండలి శాసనం ప్రకారము, ఆస్ట్రేలియా సమాఖ్యసంఘంగా ఏర్పడింది. దక్షిణాఫ్రికాలో జరిగిన రక్తపాతంతో కూడిన యుద్ధాల అనంతరము, 1904 లో, ట్రాంస్‌వాల్, ఆరెంజ్ స్వతంత్ర రాజ్యాలు, స్వయంపరిపాలన రాష్ట్రాలుగా బ్రిటీషు సామ్రాజ్యంలో చేరినవి.

శ్వేతజాతులవారి రాజ్యాలకు వర్తింపజేసిన రాజ్యాంగ సూత్రాలను, స్వార్థప్రయోజనానికై యేర్పడిన ఇతర వలస రాజ్యాలకు వర్తింపచేయలేదు ఇంగ్లాండు ప్రభుత్వము. పందొమ్మిదో శతాబ్దపు పూర్వార్ధంలో, ఈస్ట్ ఇండియా

కంపెనీ ద్వారా, భారతదేశాన్ని పరిపాలించింది బ్రిటీషు ప్రభుత్వము. ఇండియా దేశ పరిపాలనలో తనకు గల బాధ్యతను, అప్పుడప్పుడు, పార్లమెంటు ప్రదర్శించిందే తప్ప, ఎక్కువ ఆసక్తిని చూపలేదు. కంపెనీ ప్రభుత్వము, తన యిష్టప్రకారమే భారతదేశ పరిపాలనను సాగిస్తూ వచ్చింది. వారన్ హేస్టింగ్సుపై బర్క్ గావించిన మహాభియోగ తీర్మాన మొకటి, ప్రభుత్వం చూపిన ఆసక్తికి నిదర్శనము. ప్రభుత్వ న్యాయవాది ప్రదర్శించిన మహత్తర వాగ్ధోరణికి తగిన ప్రయోజనము, ఈ తీర్మానంవల్ల సిద్ధించలేదు. ఇరవై యేండ్ల కొకసారి ప్రభుత్వ శాసనాన్ని ప్రకటించేముందు, పార్లమెంటు జరిపిన విచారణలు కంపెనీ పక్షం వారికీ, వ్యతిరేక పక్షం వారికీ జరిగిన బలాబల నిర్ణయాలు, మాత్రమే. బ్రిటీషు వర్తకులు, పారిశ్రామిక యజమానులు, ఒకరినిమించి ఇంకొకరు ఈర్ష్యాపరులై, స్వలాభం కొరకు భారతదేశాన్ని ఉపయోగించుకోడానికై పూనుకొని, ఈ విచారణల ఫలితాన్ని నిర్ణయిస్తూ వచ్చినారు. ఇండియా చట్టం ప్రకారం, పిట్, ఏర్పరచిన కంట్రోల్ బోర్డు, ఉన్నత రాజకీయ సమస్యలు తప్ప, తక్కిన పరిపాలన విషయాల నన్నిటినీ కంపెనీ డైరెక్టర్లకే వదలివేసింది.

కంపెనీ పరిపాలన, సుమారు వంద సంవత్సరాలు జరిగింది, అటు తరవాత జాన్ స్టూవర్టుమిల్ ప్రతిఘటించినప్పటికీ లెక్కచేయకుండా, భారత ప్రభుత్వ బాధ్యత, కంపెనీ వారినుంచి ఇంగ్లాండు రాజుకు మార్చి వేయబడింది (1858).

ఈస్ట్ ఇండియా కంపెనీ ఇట్లా మరుగుపడి పోగా, నూతన పారిశ్రామిక సామ్రాజ్య విధానావస్థ (దశ) ప్రారంభమయింది. బ్రిటీషు మూలధనాన్ని, ఇండియాకు తీసుకొని పోయి, రైల్వేలలోను, పంటతోటల పెంపకంలోనూ, పెట్టుబడిగా వినియోగించినారు. హాబ్సన్ మాటలలో "సామ్రాజ్య వృక్షాన్ని పోషించే మూలనాళము", ఈ పెట్టుబడి. 'హేతువాద విరుద్ధములైన అంశాలు సామ్రాజ్య నీతికి ప్రేరకశక్తులు', అనే షుంపీటరు (Schumpeter), సిద్ధాంత మీ విషయంలో సత్యం కాలేదు. ఆర్థిక లాభాల నుద్దేశించిన సహేతుక వాణిజ్య ప్రయోజనాలు బ్రిటీషు ఇండియా సామ్రాజ్య నీతికి ప్రేరక శక్తులైనవి. "ఇతర జాతుల వారిని తనలో ఇముడ్చుకొనే ప్రకృతి ఆంగ్ల జాతికి లేదు. వారి రాజ్య విస్తృతికి గల ఉద్దేశము పూర్తిగా ఆర్థిక విషయాలకు సంబంధించినది మాత్రమే." అని నోవెల్స్ (Knowles) తెలిపియున్నాడు. ఎగుమతి దిగుమతుల రెండు విధానాలలో కూడా పెట్టుబడి దారులకు రక్షణను కల్పించింది, సామ్రాజ్యాధికారము. అధీన రాజ్యంలో (ఇండియాలో) వారు పెట్టుబడి పెట్టే ధనానికి కూడా రక్షణ నిచ్చింది ప్రభుత్వము.

ఆర్థిక ప్రయోజనమనే ప్రధానోద్దేశానికి, రాజ్య ప్రాబల్యము, జాత్యభిమానము, ప్రతిష్ఠ, అనే ఇతరోద్దేశాలు కూడా తోడైనవి. సంస్కార విహీనులుగా ఉన్న ఇండియా దేశీయులకు నాగరకతను ప్రసాదించి, వారి నుద్ధరించడం, తమకు దైవ నియుక్త కార్యమని, కంపెనీ వారు తమ పరిపాలనను సమర్థించుకొని ఉండడం, ఇందులకు నిదర్శనము. తమ పరిపాలన వల్ల సిద్ధించిన ఫలితము

లాంగ్లేయులకనేకులకు సంతుష్టి కలిగించినవి. ప్రభుత్వం సాధించిన కార్యములు వారికి గర్వ కారణములు కూడా అయినవి.

హాబ్సన్, ఏక పక్ష పరిశీలన గావించి, వివరించిన ప్రజోపయోగ కార్యాలను ఆధారంగా చేసుకొని, ఆంగ్లేయులు తాము మహాకార్యమును సాధించిన వారివలె గర్వపడినారు. పతకమునకు రెండోవైపు ఏమున్నదో వీళ్ళు చూడ లేదు. కాని, దానిని గమనించినవాడు కాబ్డెన్. హాబ్సన్ వంటి రచయితలు రెండు పక్షాల విషయాలనూ బహిరంగం గావించినారు.

బ్రిటీషు ప్రభుత్వాన్ని మెచ్చుకొన్నవారు, సమర్థకులు, ప్రశంసించుచుండిన, హితకర కార్యములన్నీ, ఈ నూతన సామ్రాజ్య విధానం వల్ల మరుగు పడి పోయినవి. స్వార్థపరమైన దేశశోషణము, ప్రజానీకాన్ని దరిద్రంగా చేయడము, వారి ప్రతిష్ఠను భగ్నమొనర్చడం, మొదలైనవన్నీ ఈ నూతన సామ్రాజ్యం వల్ల కలిగిన ఫలితాలు. సామ్రాజ్య నీతి నవలంబించిన బ్రిటన్, తన ఆధిపత్యంలో ఉన్న భారతదేశాన్ని, తన అనుచరదేశంగా చేసుకొన్నది. తన ప్రభువైన ఇంగ్లాండు ప్రయోజనార్థము, శ్రమించి, కష్టపడే కింకర ధర్మము, భారతదేశానికి సిద్ధించింది. ఇంగ్లాండు ఆర్థిక స్తోమతను పోషించడం, బ్రిటీషు సామ్రాజ్యం యొక్క కీర్తి ప్రతిష్ఠలను పెంపొందించడం, ఈ దేశం నిర్వహించవలసిన ధర్మాలుగా విధించబడినవి.

ఈ విధంగా, సామ్రాజ్య నీతిలో, మంచి చెడుగులు, అభ్యుదయ, స్తబ్ధతలు, - కలిసి ఉన్నవి. బ్రిటీషు పరిపాలనవల్ల యేర్పడిన మంచి, కలిగిన అభ్యుదయము, అధికములై, స్వల్పమైన దుష్టఫలితాలను మరుగుపరుస్తున్నవని, విద్యావంతులైన దేశీయులు 1858 వరకు భావిస్తూవచ్చినారు. దేశీయులందరికి సమానంగా ఉద్యోగావకాశాలు కల్పిస్తామని చేసిన ఉదార వాగ్దానాన్ని, ప్రభుత్వం నిలుపుకోలేదు. న్యాయపరిపాలన వ్యవస్థలో లంచగొండితనము అధికమైనది. ఈ వ్యవస్థ వృథా కాలయాపనం జేసి, ప్రజలను పీడిస్తుంది. రైతులు మోయలేని పన్నుల భారంతో నశించిపోతున్నారు. పరిపాలన నియమాలను, నిబంధనలను, అమలు జరపడంలో, అధికారులవలంబిస్తున్న క్రౌర్యానికి అడ్డులేదు. ఆంగ్లేయులు దేశీయులపట్ల చూపే అహంభావ, నిరసనభావాలు, వారి ప్రత్యేకతా, అన్నిటికన్నా సహించరాని అవమానంగా ఉన్నది. ఇన్ని దుష్టపరిస్థితులేర్పడి ఉన్నప్పటికీ, బ్రిటీషు ప్రభుత్వము ప్రజలబాగును పెంపొందిస్తుందని ఆశిస్తూ, తమ భక్తి విశ్వాసాలకు ప్రభుత్వం అర్హమైనదని విశ్వసిస్తూ, మధ్యతరగతి విద్యావంతులు, ఇంతవరకు భ్రాంతికి లోనై ఉన్నారు.

## III. సామ్రాజ్య పరిపాలనయొక్క అయోగ్యత

సామ్రాజ్య భావం అత్యున్నతస్థాయిలో ప్రవృత్తమవుతూ ఉన్నది. కాని, తన ఆధీనానికి లోబడి ఉన్న విస్తార ప్రజానీకాన్ని పరిపాలించే యోగ్యత, దిన దినానికి క్షీణిస్తూ వచ్చింది. 1857 లో, జరిగిన విప్లవము, బ్రిటీషువారి ధైర్యాన్ని

చలింపచేసి, వారిని భయావహులను గావించింది. దీనికి, ప్రతిక్రియగా, ఇండియా లోనూ, ఇంగ్లాండులోనూ కూడా భారతదేశ పరిపాలనను బిగించివేసే ప్రయత్న మారంభమయింది. కాని, ఈ ప్రయత్న ఫలితాలు, కొంతకాలానికి, విరుద్ధములుగా పరిణమించినవి. ఇండియా ప్రభుత్వంలో, కేంద్రీయ ప్రభుత్వానికి ఎక్కువ ప్రాధాన్య మేర్పడింది. అధికారమంతా, కేంద్రంలో నిహితమయింది. సైన్యంలోని బ్రిటీషు భాగాన్ని బలపరచినారు. ఇండియా పరిపాలన వ్యవస్థలో గవర్నర్ జెన రల్ అధికారాన్ని అభివృద్ధి గావించినారు. అతని పరిపాలన వ్యాప్తికూడా విస్త రించింది. కేంద్రంలోని కార్యనిర్వాహక శాఖయొక్క అధికారాన్ని అభివృద్ధి గావించేనిమిత్తము, శాసన సభల బాధ్యతను, అధికారాన్ని తగ్గించడం జరిగింది. ఇంకొక ప్రభుత్వ సంస్థయేదీ, కార్యనిర్వాహక శాఖకు అడ్డురాకుండా ఉండ టానికి, శాసనసభల విషయంలో ఈ చర్య తీసుకోవలసి వచ్చింది. అనుసూచిత జిల్లాల విషయంలో, శాసనసభా ప్రసక్తి లేకుండా శాసనాలు గావించే అధికారం, గవర్నరు జెనరలుకు ఏర్పడింది. పీల్ కమీషన్ వారు గావించిన సలహాలు పూర్తిగా బ్రిటీషు సైన్యభాగానికి వర్తింప జేస్తామని ప్రభుత్వం హామీయిచ్చింది. ఈ విధంగా బ్రిటీషు సైనికులయొక్క అతిశయాధిక్యతలు స్థిరపడినది.

ఇక, ఇంగ్లాండులో నెలకొల్పబడిన అత్యుచ్చ భారత ప్రభుత్వ విషయంలో కూడా, మార్పు లేర్పడినవి. అధికారమంతా, కేంద్రీకరణ విధానానికిలో బడింది. ఇండియా సెక్రెటరీకి గల, పర్యవేక్షణాధికారము, ఆధిపత్యము అధికములై, ఇండియాలోని గవర్నర్ జెనరల్ యొక్క ఆధిపత్యాధికారాలు దాని ననుసరించి తగ్గించబడినవి. ఇంగ్లాండు ప్రభుత్వంలో గవర్నర్ జెనరలుకు ఇదివరకు ఉండిన, అధికార సంబంధం తగ్గిపోయింది. కంట్రోలు బోర్డుకు డైరెక్టర్ల బోర్డుకుకూడా ఇండియా ప్రభుత్వ విషయంలో ఇదివరకు ఆధిపత్యముండేది. ఇప్పుడు 1858 శాసనం ప్రకారము, ఆ ఆధిపత్యం రద్దు చేయబడి, బోర్డుల అధికారమంతా ఇండియా సెక్రెటరీ లో నిహితమయింది. ఇట్లా, ఇంగ్లాండులోని ఇండియా ప్రభుత్వంపై గల నిరోధాలు తొలగిపోయి, సెక్రెటరీ కార్య నిర్వహణము, నిరా టంకమయింది. తరవాత, ఇండియా పరిస్థితులనుగూర్చిన జ్ఞానమూ, ఇండియాలో అనుభవమూగల, ఉద్యోగ విశ్రాంతి దీసికొన్న అధికారులతో 'ఇండియా కౌన్సిలు' స్థాపిత మయింది. ఇండియా సమస్యలను పరిష్కరించడంలో, అవసరమైన స్థానిక పరిజ్ఞానం ఈ కౌన్సిలు సభ్యులవల్ల సెక్రెటరీకి సిద్ధించింది. విత్తసంబంధమైన అధికారాన్ని సెక్రెటరీ వహించడంవల్ల, ఇండియా ప్రభుత్వపు ఖర్చులను పరిశీ లించడానికి, దానిని హద్దులలో ఉంచడానికి, అవకాశం ఏర్పడింది. ఈ ఏర్పా ట్లన్నిటినీ నిష్కర్ష గావిస్తూ, రాయల్ టైటల్స్ ఆక్టు 1877 లో ప్రకటించ బడింది. గవర్నరు జెనరల్, అతని కౌన్సిలు, ఇండియా సెక్రటరీ అధీనానికి లోబడి ఉన్నారని, అత్యుచ్చాధికారమంతా సెక్రెటరీపదవిలో నిహితమై ఉన్నదని ఈ శాసనము నిష్కర్షగా నిశ్చయించింది.

1870 లో, ఇంగ్లాండు ఇండియాల మధ్య, టెలిగ్రాఫులైను సూటిగా

ఏర్పడడంవల్ల ప్రభుత్వ పరిపాలనలో జరిగిన ఈ పరివర్తనలు సాధ్యమైనవి. సూయెజ్ కాలువ యేర్పడడంవల్ల, ఇంగ్లాండు ఇండియాల మధ్యగల దూరం తక్కువై, ఓడ ప్రయాణకాలం కూడా తక్కువయింది. ఆవిరి ఓడల సౌకర్యం కూడా యేర్పడినందువల్ల రెండు దేశాల రాకపోకలకూ సులువైనది. ఈ కారణాలవల్ల, ఇంగ్లాండుకు ఇండియా ప్రభుత్వ నిర్వహణము సుకరమయింది.

ఇండియా ప్రభుత్వంపై అధికారాలు ఇండియా కార్యదర్శికి ఎక్కువ కావడమే కాక, అతని అధికారాలపై ఉండిన నిరోధాలుకూడా బలహీనమైనర్పబడినవి. ఇండియా పరిపాలన విషయంలో పార్లమెంటు ఆసక్తి వహించడం లేదు. కార్యదర్శి గావించిన నిశ్చయాలతోను, నిర్ణయాలతోను, పార్లమెంటు జోక్యం కలిగించుకోవడం మానివేసింది. ఇండియా కౌన్సిలు, సలహాదారుల స్థితికి వచ్చింది. కనుక, ఇండియా ప్రభుత్వ కార్యదర్శి వైభవోపేతుడైన మొఘల్ సార్వభౌముడుగా ఏర్పడినాడనడం, అస్వాభావికంగా, కల్పితమైనది కాదు.

ఇండియా పరిపాలన ఇంగ్లాండు రాజు వహించినప్పటినుంచి, దానికి బలము, స్థైర్యము, సిద్ధించినవనే అభిప్రాయ మేర్పడింది. ఈ పరిపాలన ఇట్లే చిరకాలం నిలిచి ఉంటుందనికూడా, బాహ్య విషయాలను బట్టి ఊహించడం జరిగింది. కాని, బాహ్య లక్షణాలు వాస్తవ సూచకాలు కావని, ప్రభుత్వ సౌధం దుర్బలమైన అస్తిభారంపై ఏర్పరచబడిందని, సూక్ష్మపరిశీలనవల్ల గోచరమవుతుంది.

ఇండియాలో ప్రభుత్వము వహించి, నిర్వహించవలసిన బాధ్యతలు అనేకములు. అవి కష్టసాధ్యములు. కాని, ప్రభుత్వానికిగల అధికారాలు పరిమితములై ఉండడం వల్ల ఈ బాధ్యతలను నిర్వహించడానికి, చాలినవికావు. అధికారాలన్నిటినీ, ఇంగ్లాండు ప్రభుత్వం, ఈర్ష్యతో, ఇండియా కార్యదర్శికి హస్తగతం, కావించింది. కాని, ఇంగాండులోనున్న ఈ కార్యదర్శికి ఇండియా ప్రజలతో ఏ మాత్రమూ ప్రత్యక్ష సంపర్కం లేనందువల్ల వారి అభిప్రాయాలను, కోరికలను, భావాలను తెలుసుకొనే అవకాశము లేకపోయింది. తెలుసుకోగలిగిన గవర్నరు జెనరల్‌కు అధికారాలులేవు. ఈ పరిస్థితులవల్ల ఏర్పడినవి చిక్కులు.

ఇండియా కార్యదర్శి నిరంకుశ ప్రభువైనాడు. ఇండియా ప్రజలకు, తత్త్వతఃకాని, కార్యతఃకాని, అతడు బాధ్యుడుకాడు. అంతేకాదు. పార్లమెంటుకుకూడా బాధ్యతవహించనంతటి స్వాతంత్ర్యం, ఇతనికి సిద్ధించి ఉండడం విచిత్రమైన పరిస్థితి.

తత్త్వతః, ప్రభుత్వాధికారమంతా పార్లమెంటులో నిహితమైఉన్నా, ఇంగ్లాండులోకాని, ఇండియాలోకాని, పరిపాలనను తన అధీనంలో ఉంచుకొనే శక్తి కార్యతః లోపించింది. ఇండియా ప్రభుత్వ శాసన విధానము సర్వస్వమూ ఇండియా ప్రభుత్వ కార్యదర్శి అధీనమై ఉన్నది. పార్లమెంటు దీని విషయమై శ్రద్ధవహించలేదు. ఇండియా ఆదాయాన్ని గురించికాని, వ్యయాన్ని గురించికాని, పార్లమెంటు పట్టించుకోలేదు. ఇండియా కార్యదర్శి వేతనము, అతని కార్యాలయ

వ్యయము ఇండియాయే భరిస్తూ ఉండడంవల్ల, ఆ భారము పార్లమెంటుపై పడలేదు. కనుక, ఇండియా ఆదాయవ్యయాలను పరిశీలించే బాధ్యతను పార్లమెంటు వహించలేదు. ఇండియా వ్యవహారాలను గురించి, అప్పుడప్పుడు పార్లమెంటు తీర్మానాలను వాగితం గావించేది. కాని, వాటిని ప్రభుత్వం గమనించిన పాపాన కూడా పోలేదు. 1889, 1891 సంవత్సరాలలో, అపీము వర్తకాన్ని గురించి, పార్లమెంటు రెండుసార్లు తీర్మానాలు గావించింది. అల్లే, 1893లో సివిల్ సేవా ఉద్యోగాలకు, ఏక సమయంలో పరీక్షలు జరిపేవిషయంలో కూడా, పార్లమెంటు ఒక తీర్మానాన్ని గావించింది. కాని, ప్రభుత్వ మీ తీర్మానాలపై ఎటువంటి చర్యనూ తీసుకోలేదు. ఇవి పై దానికి నిదర్శనాలు. ఇండియా పరిస్థితులను గూర్చి, మాంటేగూ, చెమ్స్‌ఫోర్డులు (Montague and Chelmsford) ఈ కింది విధంగా ప్రకటించినారు. "భారతదేశానికి సంబంధించిన విషయాలలో పార్లమెంటు చూపిన ఆసక్తి సమగ్రజ్ఞానంపై ఏర్పడనూలేదు, అది పట్టుదలతో సమర్ధించబడనూలేదు."

భారతదేశ వ్యవహారాల విషయంలో పార్లమెంటుకు గల అధికారం దృఢమైనది కానందువల్ల, అధికారము సర్వస్వమూ ఇండియా కార్యదర్శి హస్తాలలో కేంద్రీకరించింది. అంతటితో, ఇండియా ప్రభుత్వం పూర్తిగా అతని అధీన ప్రభుత్వంగా రూపొందింది. శాసన నిర్మాణ విషయంలో తన కౌన్సిలుకు గల అధికారాన్ని గూర్చి సమర్థించిన 'మేయో'కు, ఇండియా కార్యదర్శి ఈ కింది విధంగా జవాబిచ్చినాడు.

"ఇండియా వ్యవహారాల విషయాలను నడపడంలోను వాటిని అధీనంలో ఉంచుకోవడంలోను గల తుది నిర్ణయము, అధికారము, సర్వస్వమూ ఇంగ్లాండు ప్రభుత్వంలో నిహితములై ఉండడం ప్రభుత్వం పాటిస్తున్న రాజ్యాంగ సూత్రము. ఇంగ్లాండు ప్రభుత్వము ఇండియాలో ఏర్పరచిన సంస్థలలోకాని, ఆ సంస్థలలో, నియోగించబడిన అధికారులలోకాని, ఈ అధికారాలు, నిర్ణయాలు, నిహితములై ఉండలేదు." "అంతేకాక, ఇండియాలో స్థాపితమైఉన్న ప్రభుత్వము ఇంగ్లాండు లోని సామ్రాజ్య ప్రభుత్వానికధీనమై ఉన్నది. ఆచరించవలసిన విషయాలను, ఆచరించకుండా విడువవలసిన విషయాలను ఆదేశించే అధికారం ఉన్నత ప్రభుత్వానికి ఉన్నప్పుడే మరొకటి అధీన ప్రభుత్వము కాగలదు. ఉన్నత ప్రభుత్వంయొక్క సలహాదారుల ఉపదేశాన్ని అనుసరించి, నిర్ణయమైన ప్రభుత్వ విధానాలను అమలు పరచడంలో, ప్రభుత్వోద్యోగులు తమ పదవిని, అధికారాన్ని ఉపయోగించవలసిన మార్గాలను నిర్దేశాలను అధీన ప్రభుత్వ లోని ఉద్యోగులు పాటించేటట్లు సంవిధానరీత్యా, చేయడంకూడా ఉన్నత ప్రభుత్వంయొక్క అధికారమై ఉన్నది. సామ్రాజ్య ప్రభుత్వము పంపిన నిర్దేశాలు శాసనసంబంధమైనవేనా ? అనే ప్రశ్నకు ఈ విషయంతో సంబంధంలేదు."

ఇండియా ఆర్థిక ప్రయోజనాలపట్ల కొంత అభిమానం చూపదలచిన నార్త్‌బ్రూక్ ప్రభువుకు సెక్రెటరీ ఈ విధంగా తెలిపియున్నాడు. "విత్తసంబంధమైన ప్రభుత్వనీతి విషయంలోకూడా, ఇంగ్లాండు రాణి వహించిఉన్న ఆధిపత్యం

ప్రవర్తిస్తుంది." [కనుక తప్పక పాటించదగినది.]

ఈ అభిప్రాయాన్ని, రాజ్యాంగ విధానంలోని ఒక నిబంధన ననుసరించి, సమర్థించినాడు. కాని, క్రియాత్మకంగా ఈ నిబంధన కెప్పుడూ ప్రవృత్తిలేదు. పార్లమెంటును ఒప్పించవలసిన బాధ్యత, ఇండియా కార్యదర్శిపై ఉన్నదని, ఆ కారణంగా "అతిదూరంలో ఉన్న ఇండియా ప్రభుత్వంపై ఆ బాధ్యతను వేయడం" సమంజసంకాదని, ఆయన సమాధానమిచ్చినారు. వాస్తవంగా, ఈ సమాధానము సరియైనదికాదు.

1894 లో ఇండియా కార్యదర్శిగా ఉన్న సర్ హెన్రీ ఫౌలరు, ఈ తగాదాను, నిష్కర్షగా తేల్చివేసినాడు. "బ్రిటీషు మంత్రిమండలి, ఐక్యంగా వహించే బాధ్యత, పరిపాలన విషయాలకు మాత్రమేకాక, శాసన నిర్మాణ విషయాలకు కూడా వర్తిస్తుంది. ఈ బాధ్యత విభజించరానిది, కనుక, ఈ రాజ్యాంగ సూత్రము, ఇండియా కార్యనిర్వాహక సమితికి కూడా వర్తిస్తుంది." అని గవర్నరు జెనరలుకు తెలియ జేసినాడు. "ఇంకా, ఈ విషయాలలో, అభిప్రాయ భేదమేర్పడినట్లయితే, ఇండియా ప్రభుత్వసభ్యులు, ఇష్టమైతే, తమ అభిప్రాయాలను వ్రాసిపెట్టి, ప్రభుత్వాభి ప్రాయానుసారం నడుచుకోవచ్చు. లేదా, తమ రాజీనామాలను రాజప్రతినిధికి అందించవచ్చు."

ఈ విధంగా, ఇండియా ప్రభుత్వంయొక్క శాసనిక, విత్తీయ, పరిపాలక విషయాలలో నిశ్చయాలను తీసుకొనే అధికారసర్వస్వమూ, ఇంగ్లాండు ప్రభుత్వం లాగివేసి, ఇండియాప్రభుత్వ కార్యదర్శిని, నియంతగా చేసింది, ఇండియా వ్యవహారాలతో ప్రత్యక్ష సంబంధము, బాధ్యత ఏమాత్రమూలేని ఇండియా కార్యదర్శి, ఇండియా దేశాని కంతటికీ అత్యుచ్చాధికారిగా ఏర్పడినాడు, ఇక, ఇండియాలోని ప్రభుత్వమంటేనో, అభ్యుదయ నిరోధకులైన వర్గాలవారి ప్రాబల్యానికి, నిరోధకులైన అధికారుల ప్రాబల్యానికి,లోనై ఉన్నది. అధికార వర్గంలోనివారు, ఇతర పాశ్చాత్యవర్తకులు, తోటలయజమానులు, పరిశ్రమల యజమానులు, ప్రభుత్వాన్ని తమ పలుకుబడిలో పెట్టుకొని, తమ ఇష్టానుసారంగా నడపుతూ వచ్చినారు. ఇల్బర్టు బిల్లు వివాదము దీనికి నిదర్శనము.

ఇటువంటి పరిస్థితులలో, దీర్ఘకాలిక ప్రణాళికను ఏర్పరచడానికి, ఇండియాలో ఏర్పడిఉన్న క్లిష్ట పరిస్థితుల విషయంలో తగిన శాసనిర్మాణం చేయడానికి, ప్రభుత్వం అసమర్థమై ఉండేది. దినదినమూ పుట్టుకొనివస్తున్న సమస్యలలోనే మునిగి ఉండేది. సంవిధానాన్నిబట్టి, ఇంగ్లాండు ప్రభుత్వంకూడా, తగిన రాజ్యాంగనీతిని, నిర్దేశించడానికి అసమర్థమైనదే.

ఇండియా ప్రభుత్వ పరిపాలనను పునఃపరిశీలన గావించే మార్గాలను, సాధనాలను కల్పించడానికి పార్లమెంటు పూనుకోలేదు. ఇండియాలో వృద్ధిచెందుతున్న జాతీయభావానికి, మన పరిపాలన సఫలం కాకపోవడానికిగల కారణాలలో ఇది ముఖ్యమైనది. సక్రమమైన పరిపాలనను ఏర్పరచి, దేశంలో క్రమాభివృద్ధి కలిగించే యోచనకు కూడా పార్లమెంటు పూనుకోలేదు".

## IV. జాతి విరోధము

1857 విప్లవం వరకు, పరిపాలక వర్గంవారు తాము ఉన్నత జాతీయులమని భావిస్తూ వచ్చినారు. భారతప్రజలు, తమ బలహీనతను గుర్తించి, అణగి ఉండేవారు. ఈ విధంగా రెండు వర్గాల వారిమధ్య, పోషక పోష్యవర్గభావము, రక్షక రక్షితభావము ఏర్పడిఉండేవి. "గర్వము, దురభిమానము, దురభిప్రాయము, అహంభావము ఉన్నప్పటికి కూడా, ఈ పరస్పర సంబంధంలో ద్వేషభావము, అసహన భావము, ఏర్పడియుండలేదు". అని కాటన్ వ్రాసియున్నాడు.

విప్లవానంతరము, ఆంగ్లేయుల ప్రవృత్తిలోను, ఇండియాలో ఉన్న ఇతర పాశ్చాత్యుల ప్రవృత్తిలోను, అధికమైన పరివర్తనము కలిగింది. విప్లవకాలంలో ఘోరాలు జరిగినవని భావింపబడి ప్రచారం పొందిన వార్తలు, అతిశయోక్తులతో కూడి, విస్తృతములై, పాశ్చాత్యుల మనస్సులలో ఉద్రేకాన్ని, భయాన్ని ఉద్భవింపజేసినవి. వీరు ఇంగ్లాండుకు పోయి, అక్కడి ప్రజలలో క్రోధాగ్నిని, ప్రతిక్రియా భావాన్ని రగులు కొల్పినారు. ఎల్జిన్ ప్రభువు తన పత్రికలో ఈవిధంగా వ్రాసియున్నాడు. "అధమ జాతులతో నివసించడమనేది ఘోరమైనది. నేను తూర్పు దేశాలకు వచ్చినప్పటి నుంచి ఇంతవరకు వింటూ ఉన్న స్త్రీ పురుషుల మాటలను బట్టిచూస్తే, క్రీస్తుమతమనేది ఎప్పుడైనా ప్రపంచంలో అడుగు పెట్టిందా, అనే సంశయము కలుగుతుంది. అసహ్యాము, తిరస్కారము, ఉగ్ర క్రౌర్యము, ప్రతీకారము,—ఇవి నాకు ఇండియనులలోను, చైనావారిలోను కనబడేవి".

ట్రెవిలియన్, 1866లో వ్రాస్తూ, ఈ విధంగా ఆక్రోశించినాడు. "మన ప్రకృతిలోని అగాధాంతరంగాలలో, నిగూఢములై, మనకింతవరకూ గోచరం కాకపోయిన విషణ్ణములు, అపత్కారములు ఐన, మానవ ప్రాథమిక సహజ ప్రవృత్తులు, పైకుబికి వచ్చినవి. అమితమైనదయ, మితిలేని క్రోధము, గొప్పజాతి నాక్రమించినవి. ఈ విరుద్ధ ప్రవృత్తులను గూర్చి, ఇదివరలో, బ్రైట్, మనలను హెచ్చరించినాడు. దయ, దాక్షిణ్యము, మానవ జీవిత లక్షణములైన, దివ్యత్వము, ప్రతిష్ఠ, అనేవి సాధారణ సమయాలలో గుర్తించబడిన నిత్యసత్యాలు. ఈ మహా జీవితసూత్రాలన్నీ,-మన ఆధిపత్యము మళ్లీ ఏర్పడి, మనకు తృప్తికరమైన ప్రతీకారం జరిగేవరకూ-విస్మరించబడుతున్నవి." ట్రెవిలియన్ గావించిన ఈ ప్రకటన సత్యమని, ఆంగ్లో-ఇండియన్ పత్రికలుకూడా, సాక్ష్యమిచ్చినవి. 1858 సెప్టెంబరు 8 నాడు, 'ఫ్రెండ్ ఆఫ్ ఇండియా' పత్రిక,-ఈ విధంగా వ్రాసింది. "మన పరిపాలనకు (బ్రిటీషు) ఇండియా ప్రజలు అర్హులుకారని, నిర్వివాదంగా, సిద్ధాంతమైనది. ఈ ప్రజలు మృగాలకన్నా ఏమాత్రమూ అధికులుకారు. కనుక, వీరిని పరిపాలించడంలో, రక్షక పోషణ విధానాన్ని విసర్జించి, ఇకముందు నుంచి, ఇనుప దండాన్ని ప్రయోగించడమే సరియైన మార్గమని, నిశ్చయించబడింది."

కల్నల్, ఈవాన్ బెల్, రచించిన 'విప్లవకాలంలో వ్రాసిన జాబులు' అనే గ్రంథాన్ని సమీక్షిస్తూ, ఈ పత్రిక, "క్రీస్తుమతస్థుడు-విగ్రహారాధకుడూ,-సాగ్జన్

జాతివాడు,– పశియాజాతివాడు,–వెలుగు,–చీకటి,–ఇట్టిద్వంద్వాలు ఒక్కచోట ఏవిధంగా నిలిచియుండగలవు.' అని వ్రాసింది. ఇండియాదేశాన్ని ఏ మార్గాన్నను సరించి, అధీనంలో ఉంచుకోవలెననే విషయాన్ని గురించి, ఈ పత్రిక ఈ కింది విధంగా వ్రాసింది. "అసత్య సిద్ధాంతాన్ని అనుసరించి, జరిపిన, అన్ని విధాలైన చర్యలూ, అసత్యమైనవే. మన సైనికాధికారము ఏ మాత్రమూ సడలేందుకు వీలు లేదు. ప్రభుత్వ కార్య నిర్వహణలో దాక్షిణ్య ప్రదర్శన, బాహ్యాంగాకూడా పనికి రాదు. తాత్కాలికంగానైనా దాక్షిణ్యప్రవృత్తిని త్యజించవలసి ఉంది. 3000 సంవత్సరాలుగా నిర్బంధపాలనకు అలవాటుపడిన ఏషియాజాతి, బలవంతులను మాత్రమే గుర్తిస్తుంది. కనుక, తమ ఆయుధబలము అప్రతిహతమైనదని పరిపాల కులు నిరూపించక తప్పదు." ఇండియాదేశము అధమ జాతుల నివాసము, అది విజితదేశము, బ్రిటీషు సామ్రాజ్యంలోని ఒక భాగము, అనే సత్యాన్ని గుర్తించి, దేశాన్ని పరిపాలించవలసిందిని ఈ పత్రిక ప్రభుత్వానికి బోధించింది.

ఇటువంటి తీవ్రమైన ద్వేషభావమే, ఆంగ్లేయు లందరూ,——అధికారవర్గము అనధికార వర్గంకూడా,——వహించినారు. "విశ్వాస ఘాతుకులైన, రక్తపిపాసువు లైన ముస్లిములు, అనే దూషణవాక్యాలు, సాధువైన హిందువు, అనే వెటకారపు మాట,——సర్వదా వల్లిస్తూఉండడం, ఆంగ్లేయు లందరికీ పరిపాటి అయిపోయింది. అధికారుల విషయంలో మాత్రం, ఈ తీవ్రక్రోధము, క్రమంగా తగ్గుతూ వచ్చింది. విప్లవకాలం నాటి ఉదంతాల ప్రభావము వీరి అభిప్రాయాలను, ప్రవర్తనను, పాడు చేయలేదు. కాని, పూర్వపు వ్యవస్థ మాత్రం పూర్తిగా మారిపోయింది. "దేశప్రజపై పూర్వమున్న నమ్మకము, అభిమానము, వారిపై ఆసక్తి, ప్రభు త్వాని కిప్పుడు లేవు".

విప్లవంవల్ల ఉద్బుద్ధములైన ఉద్రేకాలు తగ్గిపోయినా, ప్రభుత్వ వర్గాలవారి కఠిన ప్రవృత్తిలో మార్పురాలేదు. వీరి ఆత్మప్రత్యయము ప్రచలితమై పోయింది. "విజేతలు, విజితులు, ఎన్నటికీ, ఆత్మవిశ్వాసంతో, సమాధానంతో, కలిసి జీవించ లేరు". అని కాబ్డెన్ వచించినాడు.

భావినిగూర్చి భయము, దేశీయులనుగూర్చి సంశయము, పరిపాలకుల మనస్సులలో నాటుకొని పోయినవి. సామ్రాజ్యరక్షణ భద్రతలే, రాజ్యాంగ విధానముల కన్నిటికీ ప్రేరకము లైనవి. మన్రో, ఎలిఫిన్‌స్టన్, మాల్‌కాం, మెట్ కాఫ్, పూర్వతరాల ఉన్నతాధికారులు, భారతదేశము స్వతంత్ర రాజ్యంగా, ఏర్పడుతుందని కలలు గనేవాళ్ళు. అటువంటి వ్యక్తు లిప్పుడులేరు. "స్వపరిపాలన విధానానికి సంబంధించిన శిక్షణను అధమజాతుల వారికి కలిగించే భావము, పూర్వపు ఉదారవర్గాల వారికి ఉండేది. అటువంటి భావ మిప్పుడు తిరస్కృతమై పోవడం, సువ్యక్తమే. దేశంలోని కొత్త భాగాన్నైదైనా, మనరాజ్యంలో కలుపు కొనే ఉద్దేశమున్నప్పుడు అటువంటి ఉదారభావాలు మనఉపన్యాసాలకు ఉపయో గిస్తాయి". పర్యవసానంగా, ఇండియాకు స్వాతంత్ర్యము, లభిస్తుందని బెవిరిడ్జ్ ఆశించియున్నాడు. ఇండియా సామ్రాజ్యము శాశ్వతమైనది కాదని, కార్లైలు,

భావిని నిశ్చయించినాడు ఇండియాకు స్వయం పరిపాలన సిద్ధించవలసిందే, కాని, అది శీఘ్రంలో కాదని, డిల్కీ, వాదించినాడు. కాని, ఈ అభిప్రాయాలేవీ పరిపాలకులు గమనించలేదు ; తమ పరిపాలన పద్ధతులను విధానాలను మార్చుకోలేదు. సమర్థమైన ప్రభుత్వమే కాని, స్వయంప్రభుత్వం కారాదు అనేది, వారికి ప్రచారవాక్యంగా ఏర్పడింది.

ప్రభువులలో ఏర్పడిన ఈ మార్పు, పరిపాలన విధానంలో వ్యక్తమౌతూ వచ్చింది. సామ్రాజ్యప్రయోజనమే ఉద్దేశంగాగల ఆర్థికరాజకీయ విధానాలకు ప్రాధాన్య మేర్పడింది. వాటివల్ల ప్రజలకు కలిగే హానినిగూర్చి, ప్రభుత్వం గమనించనేలేదు. సామ్రాజ్య రక్షణ నుద్దేశించి, ప్రజలను వేరువేరు వర్గాలుగా విడదీసే ప్రవృత్తి పెరిగింది. సైన్యంయొక్క పునర్నిర్మాణంలోకూడా ఈ పద్ధతే అవలంబించబడింది. సైన్యంలోని భారతీయ భాగము, సామ్రాజ్య ప్రయోజనాల కుపయోగించినా, 1857 లో కలిగిన ఆపద మళ్ళీ సంభవించకుండా ఉండే పద్ధతులను, ప్రభుత్వము, అనుసరించింది. బ్రిటీషువారి ఆధిక్యాన్ని, ప్రతిష్ఠను, నిలుపుకోవడానికి గాను, భారతీయసైనికుల మనస్సులలో 'హీనభావ ప్రవృత్తులను' (Inferiority Complex) కల్పించవలసి వచ్చింది. అందుకై, నిరంతరంగా ఇటువంటి విషభావాలను వారికి నూరిపోస్తూ వచ్చినారు. దీనికితోడుగా, బ్రిటీషు సామ్రాజ్యంయొక్క మహోన్నత బలాన్ని ప్రశంసిస్తూ, భారత సైనికులను భీతావహులను గావించడానికి ప్రయత్నాలు జరుగుతుండేవి. పరిపాలకులు తమ కంటెను ఉత్తమజాతివారనే భావము ప్రజలలో దృఢంగా నాటుకొనేందుకు ప్రయత్నాలు జరిపినారు. భారతీయులకు నైతిక యోగ్యత లేదనే కారణంచూపి, ఉన్నతోద్యోగాలనుంచి వారిని బహిష్కరించినారు. దేశంలోని మత విభేదాలను, సామరస్యరాహిత్యాన్ని కారణాలుగా చూపి, ప్రజాప్రాతినిధ్య సూత్రాన్ని ప్రవేశపెట్టడం సాధ్యంకాదని, దానిని త్రోసివేసినారు.

జాతీయ సంయోజనానికి, జాతీయాభివృద్ధికి దోహదమొనర్చి, ప్రజోపకారకములైన ప్రభుత్వవిధానాలుకూడా రూపొందకపోలేదు. కాని, అవి భారతదేశాన్ని ఉద్దేశించి, జరిగినవికావు. వాటి విషయంలోకూడా సామ్రాజ్య ప్రయోజనాలే ప్రాబల్యం వహించినవి. ప్రభుత్వము నిర్ణయాలు తీసుకోవడంలోకూడా ప్రజాభిమతము, ప్రజాభిప్రాయము అసంబద్ధములైనవనే పాలకుల నిశ్చయము, శాంతి భద్రతల రక్షణ, న్యాయపరిపాలన, న్యాయాన్ని అందరికీ సమానంగా వర్తింపజేయడం, - అనేవి తత్వతః ఉత్తమమైనవే. కాని, సామ్రాజ్య ప్రయోజనాల సాధన కివి ప్రాథమికాధారములైనవి. రైల్వేల నిర్మాణము, ఉత్తర ప్రత్యుత్తర సాధనాల ఏర్పాట్లు, - ఇవి ప్రధానంగా యుద్ధనీతికి, వాణిజ్యనీతికి, అవసరములైన సౌకర్యాలు. ఇంగ్లాండుకు అవసరములైన ముడిసరకుల సరఫరా నిమిత్తము, వ్యవసాయక విధానాలను, బాగుపరచడమయింది. ఇంగ్లాండు పరిశ్రమలను రక్షించే ప్రయోజనానికై, భారతదేశ పరిశ్రమలను అణచివేయవలసి వచ్చింది. పరిపాలన రంగంలోని క్రింది ఉద్యోగులకు తగిన వ్యక్తులవసరమై, ఉన్నతవిద్య

పోషించబడింది. కాని, విద్యావ్యాప్తివల్ల దేశ స్వాతంత్ర్య విషయమైన భావాలుత్పన్నమవుతున్నవని గమనించిన వెంటనే, విద్యాభివృద్ధికి ఆటంకము కల్పించబడింది. విద్యావంతుల వర్గము, "సూక్ష్మాతిసూక్ష్మమైన స్వల్పవర్గము, ఎవరికీ ఇది ప్రాతినిధ్యం వహించదు." అని తిరస్కరించడం జరిగింది. బ్రిటీషు ప్రాబల్యానికి ఈ వర్గంవల్ల ఎప్పటికైనా ఆపదరావడం తప్పదని, వీళ్ళపై అపనమ్మకము స్థిరపడింది.

పందొమ్మిదో శతాబ్దపు రెండోభాగమంతా, అసంతుష్టికి ఆకరమైనది. విదేశ ప్రభుత్వంపట్ల, ఇదివరలో ఉంటూవచ్చిన భ్రాంతి నశిస్తూవచ్చింది. 1858 మొదలు 1885 వరకు వ్యక్తులు, ప్రాంతీయసంస్థలు, అక్కడక్కడ, తమ ఆక్షేపణలను వ్యక్తపరుస్తూనే వచ్చినారు. ఈ ప్రాంతీయ సంస్థల నన్నిటినీ చేర్చి, విశాలమైన జాతీయ సంస్థగా ఏర్పరచవలెననే ప్రయత్నానికి దేశనాయకులు అప్పటినుంచే పూనుకోవడం జరిగింది.

పర ప్రభుత్వాన్ని మౌనంగా, సమ్మతించిన ప్రజలు, దానిని తొలగించుకొనే ప్రయత్నానికి పూనుకొన్నారు. ఇంతటి సమగ్రమైన పరివర్తనము రావడానికి, 25 సంవత్సరాల కాలం పట్టింది. ఈ పరివర్తనము రావడానికి అనేక కారణాలు జత పడినవి. భారతీయ పునరుజ్జీవనమనే భావము, తన ప్రాచీన వ్యవస్థయొక్క గౌరవ ప్రతిష్ఠలను మళ్ళీ సంపాదించుకోవలెననే కాంక్ష, దేశభవిష్యత్తులో విశ్వాసము, - ఇది ఒక చైతన్యము. స్వతంత్ర భారతము ప్రపంచానికి అందించవలసిన పవిత్ర సందేశమున్నదనే ఆత్మవిశ్వాసము, రెండోది. ఈ ఆత్మాభిమాన, ఆత్మ విశ్వాసాలు, తన ఆత్మీయతకు భంగకరములైనటువంటి, విరోధశక్తులను ఎదుర్కొనే ఐక్యతను సిద్ధింపజేసినవి. భారతదేశం యొక్క ఆత్మగౌరవంపై, ఆర్థికాభ్యుదయంపై సాంఘిక సంయోజనంపై, రాజకీయ భవిష్యత్తుపై - ఇన్ని ప్రాణనాడులపైనా, బహుముఖంగా పడుతున్న ఆపత్తులనుంచి, కాచుకొనవలసి వచ్చింది. అంటే, దేశంయొక్క దేహాన్ని, ఆత్మను, నశింపజేయటానికి పూనుకొన్న, సామ్రాజ్య నీతియొక్క సమగ్ర శక్తిని ఎదుర్కొని, ఆత్మరక్షణ గావించుకోవడానికి ప్రజలు పూనుకోవలసిన పరిస్థితి ఏర్పడింది.

1857 నాటి విప్లవంవల్ల, ఆంగ్లేయులు భారతీయులకు విరోధులైనారని పరిపాలకులు ప్రత్యేక వర్గంగా ఏర్పడి, పాలిత ప్రజకు దూరంగా నివసించేపద్ధతి, విపరీతంగా విస్తరించినదని, ఇదివరలో వివరించబడింది. ఇటువంటి విరుద్ధ పరిస్థితులకు ప్రోద్బలంగావించిన కారణాలు ఎన్నో ఉన్నవి. సామ్రాజ్య భావము కారణంగా, ఆంగ్లేయులలో గర్వము, ప్రజలపట్ల దురభిప్రాయము, ఏర్పడినవి. ఆయుధబలం వల్ల తాము దేశాన్ని జయించి, ఆక్రమించడం దేవుడు మెచ్చుకొన్నాడని, వీరు భావించినారు. అధమజాతుల వారిని నాగరకులుగా చేసి, వాళ్ళను రక్షించే బాధ్యత తమకు దైవకల్పితమైనదని, కనుకనే తమకు దేవుడు విజయాన్ని కలిగించి, తన సమ్మతిని సూచించినాడనీ, వీరు విశ్వసించినారు.

ఈ భావాన్ని రెండు వర్గాల వారు ప్రచారం గావించినారు. ఒక వర్గం

వారు మత ప్రచారానికి పూనుకొన్నవారు. ఛార్లెస్ గ్రాంట్ ఈ ప్రచారానికి పూనుకొన్న వారిలో ఒకడు. ఇతని తరవాత వచ్చిన విలియమ్ వార్డు, అభిప్రాయాన్ని బట్టి, భారతదేశంలో నైతిక పరివర్తనాన్ని తీసుకొని రావడానికి గాను, భగవంతుడు నియమించిన సాధనమే బ్రిటీషు వాళ్ళు. బ్రిటీషు సామ్రాజ్య నిర్మాణాన్ని భగవంతు డనుమతించినాడనడానికి, బ్రిటీషువారి విజయమే సూచన అని, తమిళబాషకు గొప్పసేవ చేసిన కాల్డ్వెల్లు అభిప్రాయము. అత్యుచ్చ సామ్రాజ్యంలో కలిసి పోవడంవల్ల భారతదేశం యొక్క అదృష్టం ఫలించిందని, 'కురళ్' అనువాదకుడైన, పోప్, నిర్వచనము. ఏషియా ఖండమంతా పాశ్చాత్య సర్వోచ్చతా ప్రభావానికి లోనుకావడానికి, దైవ సంకల్పితమైన బ్రిటీషు సామ్రాజ్యము పవిత్ర సాధనం కాగలదని, మార్ష్మన్, భవిష్యత్తును సూచించినాడు. ఇండియా చరిత్రను పాఠ్యగ్రంథంగా రచించేందుకాయనను కలకత్తా విశ్వవిద్యాలయము నియమించింది. జాతి ఆధిక్యాన్ని సమర్థిస్తూ సిద్ధాంతాలను గావించి, ప్రచారం చేసిన వారు రెండో వర్గంవారు. శ్వేతజాతులు, పశ్చిమ, లేదా, నార్డిక్ జాతులవారు, నల్ల జాతుల వారితో కూడిఉన్న ఏషియా, ఆఫ్రికా, మొదలైన దేశాలపై, ఆధిపత్యము వహించడం ప్రకృతి సిద్ధమైన విషయమని, సిద్ధాంతాలను లేవదీసి సమర్థించినారు. హూస్టన్ చేంబర్లన్, నార్డిక్-ట్యూటానిక్ జాతులను మహోత్కర్షంగా స్తుతించినాడు. 'అతీత మానవుణ్ణి' (Superman), నీచే (Nıetyche), అనే తత్త్వవేత్త అతిశయంగా శ్లాఘించియున్నాడు. కవులు, సాహిత్య రచయితలు, ఇంగ్లాండు యొక్క పవిత్ర కర్తవ్యాన్ని చాటి, ప్రజాదరణను సంపాదించినారు. ఈ కర్తవ్యాన్ని వీరు 'శ్వేతజాతుల వారి దేవవాణి' యని వ్యవహరించినారు.

"నిరంతరంగా విస్తరించే ఇంగ్లండు, సువిశాలమైన ప్రాచ్యభూభాగంలో దాని సింహాసనము, తన ఔన్నత్యాన్ని తానే గ్రహించలేని, ఏకైకమైన ఒకేఒక దీవి, ఇంగ్లండు". అని టెన్నిసన్ కవి, తన మాతృదేశాన్ని కీర్తించినాడు. రడ్యార్డు కిప్లింగ్, తన దేశీయుల నీ విధంగా ఉద్బోధించినాడు,—

"శ్వేతజాతుల దివ్యకర్తవ్యభారాన్ని వహించండి ;
ఉత్తమమైన, మీ, సంతానాన్ని ప్రపంచంపై పంపించండి.
మీకు వశులైన దేశీయుల సేవా నిరతికై
మీ సంతతిని, దేశాంతరాలకే బద్ధులను చేయండి ;
వన్య మృగములై, సంభ్రమోన్మత్తులై
విషణ్ణజాతులై, సద్యః గ్రస్తములై
అర్ధ పిశాచములై, అర్ధ శిశువులై
సంభ్రమిస్తున్న జన సామాన్యాన్ని
పాలించే యుద్ధవీరులను పంపించండి".

ఇంగ్లాండు దేశంయొక్క ఆర్థిక సమృద్ధి, కీర్తి విస్తారంగా పెంపొందిన కాలము, విక్టోరియా యుగము. దినదినాభివృద్ధి చెందుతున్న సంపద, విస్తృతం మవుతున్న

ఇంగ్లాండు దేశ ప్రాబల్యము, క్రిస్టల్ ప్యాలెస్ ఎగ్జిబిషన్‌లో (1851) ప్రదర్శిత మైనవి. ప్రపంచంలోని నాలుగో వంతు భూభాగాన్ని, ఇంగ్లాండు సామ్రాజ్యము, 19 వ శతాబ్దంనాటికి, ఆక్రమించింది. ప్రపంచ జనాభాలోని నాలుగోవంతు ఈ సామ్రాజ్యంలో ఇమిడి పోయింది. వీళ్ళలో 75 శాతము భారతదేశీయులు. తక్కిన ఏషియా భాగాలలోని వాళ్ళు 14 శాతం మాత్రమే. ప్రపంచచరిత్రలో జరిగిన ఇటువంటి అద్భుతకర సామ్రాజ్య స్థాపనాన్ని తలచుకొని 4 5 కోట్ల మంది ఆంగ్లేయులు గర్వించి, సంచరించడంలో ఆశ్చర్యం లేదు.

బ్రిటిషు నౌకావిభాగానికి, సముద్రాధిపత్యము సిద్ధించింది. ప్రపంచంలోని, వివిధ దేశాల బజార్లను, ఇంగ్లాండు వస్తువులు నింపివేసినవి. ప్రపంచానికి, లండన్ నగరము విత్తకేంద్రంగా, ఏర్పడింది. విజ్ఞానశాస్త్రంలోను, సాంకేతికశాస్త్రంలోను, బ్రిటను అన్ని దేశాలకంటే ముందున్నది. విదేశప్రభుత్వాలకు కూడా, బ్రిటీషు రాజ్యాంగవేత్తలు, న్యాయవిధానాన్ని ఏర్పరచినారు. డాన్ పశిఫికో గ్రీస్ దేశంపై మోపిన దావా (claim) విషయమై, ఇంగ్లాండు పూనుకొని, (1850) గ్రీసు దేశపు రాకపోకల మార్గాలను నిరోధించేటట్లుగా, పామర్‌స్టన్, ఆజ్ఞాపించినాడు. ఇంతకూ, డాన్ పశిఫికో, ఇంగ్లాండు దేశ పౌరుడౌనో కాదో, సందేహాస్పదమైన విషయమే. జర్మనీలోను, ఇటలీలోను జరుగుతున్న ఐక్యోద్యమాలలోకూడా, కలుగజేసుకొని, ఆ ఉద్యమాలను ప్రోత్సహించినాడు, పామర్‌స్టన్.

సూయెజ్ కాలువ కంపెనీలో ఈజిప్టుకున్న వాటాల 'ఖేదివ్' ను, డిస్రేలీ కొన్నాడు. దానితో, బ్రిటిషు సామ్రాజ్యానికి సముద్ర రహదార్లు, ఏర్పడడమే కాక, ఈజిప్టు వ్యవహారాలలో కలగజేసుకొనే అధికారంకూడా, బ్రిటనుకు సిద్ధించింది. 1877 లో, విక్టోరియా మహారాణి, వార్షికోత్సవాన్ని జరుపుతూ, ఆమెను భారతదేశ సమ్రాజ్ఞిగా, ప్రకటించినాడు. పర్వతమయమైన ఆఫ్గన్ ప్రాంతాన్ని బ్రిటిషువారి పలుకుబడి కిందికి తెచ్చేందుకుగాను, ఆఫ్ఘనిస్తానుపై, యుద్ధం ప్రారంభించినాడు.

డిస్రేలీ తరవాత, పదవికి వచ్చిన మంత్రులు ఆఫ్రికాజాతుల నాయకుల అభిప్రాయాలను లెక్కించక, తమ యిష్టం వచ్చిన ప్రకారము, భూభాగాల నాక్రమించినారు. దక్షిణాఫ్రికాలోని, బోయెర్లు (Boers), రిపబ్లిక్ రాష్ట్రాలను ఏర్పరచుకొన్నారు. ఆ రాష్ట్రాలలోని వజ్రపు గనులు, బంగారు గనులు, ఇంగ్లాండు దృష్టి నాకర్షించినవి. అంతతో, కేప్‌నుంచి కెయిరో వరకూ విస్తరించే బ్రిటీషు ఆధిపత్యాన్ని ఏర్పరచే యోజనను, సెశిల్‌రోడ్స్ (Cecil Rhodes) రూపొందించినాడు. బోయెరు జాతులవారిపై యుద్ధం ప్రకటించడానికి, మిషలు వెదకుతూ వచ్చినారు. ఏదో నెపంచూపి, 1899 లో, నేటాలును, ఆరెంజ్ స్వతంత్ర రాష్ట్రాన్ని తమ కేప్ కాలనీలో కలుపుకొనినారు.

సామ్రాజ్యశక్తి ఈ విధంగా ప్రపంచంలో స్వచ్ఛంద విహారాన్నిగావిస్తూ ఉండినది. దాని ప్రవృత్తికి ఇండియాదేశం, చక్కని రంగభూమిగా ఏర్పడింది. దీని ప్రవృత్తి చాలా విధములైనటువంటిది. అధీనజాతులపై ప్రభుత్వాధిక్యాన్ని

నొక్కి ప్రదర్శించడం, దురహంభావంతో కూడిన ప్రత్యేకతను వహించడం, భారతీయుల పట్ల తిరస్కార భావంతో ప్రవర్తించి, వారిని బుద్ధిపూర్వకంగా నొప్పించడం, బీదజనులను క్రూరంగా పీడించడం, అధికార బాధ్యతలుగల పదవులన్నిటినుంచి, భారతీయులను బహిష్కరించడం, ప్రజాప్రాతినిధ్య పరిపాలన సంస్థల నిర్వహణకు తగిన యోగ్యత, సామర్థ్యము, భారతీయులకు లేవని, తామే నిశ్చయించడం,—ఈ విధంగా బ్రిటీషుసామ్రాజ్యశక్తి అనేక విధాలుగా, స్వేచ్ఛగా, ప్రవృత్తమయింది.

ఈస్ట్ ఇండియా కంపెనీ పరిపాలన ప్రథమ దశనుంచి కూడా బ్రిటిషువారి వైభవ ప్రదర్శనానికి మార్గమేర్పడింది. కంపెనీ అధికారులు, మొఘలు నవాబుల ప్రాభవ వైభవ ప్రదర్శనను, వారి ప్రభుతా జీవన పద్ధతులను అనుకరిస్తూ వచ్చినారు. ఈ సంప్రదాయము 19 వ శతాబ్ద మంతటా, పాటించబడుతూ వచ్చింది. ఎర్ర చొక్కాల చప్రాసీలు, వంగి వంగి సలాములు చేసే భృత్యబృందము, తలకు మించిన జీవన విధానము,—ఇవి వీరి సంప్రదాయ లక్షణాలుగా ఏర్పడినవి.

బ్రిటీషువారి సామాజిక ప్రత్యేకత, భారతీయ విరుద్ధములైన భావాలు, ఇండియన్ సివిల్ సర్విస్ అభ్యర్థులకు పాఠ్యభాగము లైనవి. అవి, ఈ భావాలను పోషించినవి. హెయిల్‌బరీ కళాశాలలోని విద్యార్థులకు, జేమ్స్‌మిల్స్ రచించిన 'ఇండియా చరిత్ర' పాఠ్య గ్రంథము. ఇండియా విషయాలను తెలుసుకోగోరిన ఆంగ్లేయులకీ గ్రంథమే, చాలకాలం వరకు, ఆధారంగా ఉంటూ వచ్చింది.

విప్లవానంతరకాలంలో, బ్రిటిషువారికి ముస్లిముల పట్ల ఏర్పడిన ద్వేషభావము, హిందువులపై నున్న వ్యతిరేక భావాన్ని మరుగు పరచింది. సర్ హెన్రీ ఎలియట్, రచించిన 'ఇండియా దేశ చరిత్ర' చేసిన కీడు ఇంతింతనరానిది. హిందూ ముస్లిముల సంబంధాలను విషపూరితం గావించిన ఈ గ్రంథము, బ్రిటిషువారి దురభిప్రాయాలకు దోహదం గావించి, బలపరచింది. మధ్యయుగ కాలంలోని రచయితలకు, చారిత్రక విషయాలకు, ఈ గ్రంథమే, మూలసాధనంగా ఏర్పడినందువల్ల, తరవాత వచ్చిన గ్రంథాలుకూడా ఈ దురభిప్రాయాలనే వ్యాప్తిగావించినవి.

హిందూ సంస్కృతిని, హిందూ శీలాన్ని నిరసించడంలో, మిల్, మూల గ్రంథాలనన్నీ ఉపయోగించుకొని, తన భాషాసామర్థ్యాన్ని, నైపుణ్యాన్ని ప్రదర్శించినాడు. భారతదేశచరిత్రలో, అతనికి కనబడినవి, "విద్రోహాలు విప్లవాలు, సామూహికవధలు, ఘోరములైన ఆక్రమణలు" మాత్రమే. "దుర్బలంతో, స్వేచ్ఛా వృత్తితోకూడిన హేయమైన పరిస్థితి, భారతరాజకీయాలలో అతనికి గోచరించిన" విషయము. "హిందువుల వంటి నిర్వీర్యులైన ప్రజలకు అటువంటి ప్రభుత్వమేర్పడడం సహజమయినదే." "మానవతను అధోగతికీడ్చే దుష్టమైన పరాధీనతతో కూడిన వ్యవస్థ హిందూసమాజ లక్షణము" "మానవశ్రేయస్సును, పురోగమనాన్ని నిరోధించడానికి సమర్థమైన, ప్రబలమైనసంస్థ, భారతదేశంలోని కులవ్యవస్థ. చాపల్యంవల్లకాని, స్వార్థపరత్వం వల్లకాని, ఏర్పడిన మరి ఏ సంస్థ కూడా, మానవాభ్యుదయాన్ని నిరోధించడంలో కులతత్వానికి సాటిరాదు.

హిందూమతానికాధారమైయున్న హింసాత్మకము, విస్తారముఅయిన మూఢ విశ్వాసము, మానవత్వాన్ని, పీడించి, అధోగతికీడ్చింది. ఇటువంటిది, ప్రపంచ మానవజాతిలోని ఏభాగంలోను సంభవించలేదు. నైతిక ప్రవృత్తిలో, హిందువులు ముస్లిములుకూడా ఒకే విధమైన దుర్వ్యసనాలకు లోనైయున్నారు. కపట ప్రవృత్తి, అనృత వాదము, విశ్వాసఘాతుకతా,—ఇవి రెండు మతాల వారికీ సమానమైనవే. ఇతరుల హృదయభావాలను లక్ష్యపెట్టక పోవడం, వ్యభిచారము, ఆత్మగౌరవాన్ని అమ్ముకోవడానికైనా సిద్దపడటం,— ఇవి రెండు మతవర్గాల లోనూ, సువ్యక్తంగా గోచరమయ్యే దుర్లక్షణాలు".

ఎలియట్, ఈ గ్రంథానికి వ్రాసిన మొదటి పీఠికలో, ముస్లిము పరిపాల నను గురించిన నిర్ణయాలను సంగ్రహంగా వివరించినాడు, -

"సామాన్య ప్రజానీకము, అగాధమైన దుస్థితిలోనూ, నిరాశలోనూ మునిగిపోయినది. ఈ చరిత్ర సంచికలోని ఉద్ధృత భాగాలలో గోచరించే విష యాలు సూచక మాత్రములే అయినా, వాస్తవ పరిస్థితిని ప్రదర్శిస్తున్నవి. ముస్లి ములతో వివాదం పెట్టుకొన్నందువల్ల హిందువులను నరకడం, ఉత్సవాలు, పూజలు, పవిత్ర స్నానాలు, - మొదలైన వాటన్నింటినీ నిషేధించడం, విగ్రహా లను విరగగొట్టడం, దేవాలయాలను ధ్వంసమొనర్చడం, బలవంతంగా ముస్లిం మతంలో కలుపుకోవడం, బలాత్కార వివాహాలను జరిపించడం, దేశభ్రష్టులను గావించడం, ఆస్తులను లాక్కోవడం, హత్యలు, సామూహికవధలు గావించడం, క్రూరప్రభువుల విషయలాంపట్యము, త్రాగుడు, - ఇత్యాదులన్నింటినీ పరిశీలించి నప్పుడు, వర్ణించబడిన చిత్రము సమగ్రంకాదని, విస్తారమై ఉన్న గ్రంథాలనుంచి, పత్రాలనుంచి మనమే ఈ విషయాలను సేకరించుకోవలెనని, వ్యక్తమవుతున్నది. ఈ విషయాలను వ్రాసియుంచిన పర్షియన్ చరిత్రకారులకు, సద్గుణాలపట్ల అభి మానంకాని, దుశ్చర్యలపట్ల అసహ్యంకాని, ఉన్నట్లు కనపడదు. ఇతరజాతుల వారు కూడా ఘోరచర్యలను గావించినారు. కాని, ఆ చర్యలపట్ల ఆగ్రహాన్ని అసహ్యాన్ని ప్రదర్శించే వ్యక్తులు వారిలో కొందరైనా ఉన్నారు."

ఈ చరిత్రను కూర్చడంలోగల ఉద్దేశాన్ని, ఈ క్రింది విధంగా వివరిస్తాడు:-

పర్షియనులు రచించి ఇచ్చిన, చరిత్రలను చదవడంవల్ల, దేశీయులైన ప్రజ లకు మన పరిపాలనలోని మార్దవము, మన మనుసరిస్తున్న న్యాయసమత్వము, అర్థంకావడమేకాక, ఈ ప్రభుత్వంవల్ల తమకు కలిగే విస్తృత ప్రయోజనాలు కూడా ఎటువంటివో, వారు గ్రహించగలుగుతారు. వాటినుంచి మనము విష యాన్ని గ్రహించదలచుకొంటే, మహమ్మదీయ యుగాన్ని గూర్చి తెలియని ఇతరులు తొందరపడి, ప్రకటించిన అభిప్రాయాలను విడిచిపెట్టవలసి ఉంటుంది. వైభవోపేతములైన కార్యములను గావించి, కొన్ని యుద్ధ విజయాలను సాధించి, నేడు గౌరవింపబడుతున్న చారిత్రక పురుషులను వాస్తవ విషయాల ఆధారంగా పరిశీలిస్తే, వాళ్ళ నిజస్వరూపం బైటపడుతుంది. వాళ్ళను కప్పివేసియున్న ప్రశంస లను, అలంకారాత్మక వర్ణనలను, తీసివేసి, నిజమైన వెలుతురులో వాళ్ళను పరీ

ఉస్తే, వాళ్ళు మానవజాతి శాపవాక్యాలకు గురికావడంతప్పదు. మన ప్రభుత్వ పరిపాలనలో అత్యధికమైన వ్యక్తి స్వాతంత్ర్యాన్ని, అనేకములైన రాజకీయ హక్కులను, విజిత జాతులవారి కెన్నడూ ఏర్పడనివిధంగా, అనుభవిస్తూ ఉన్న బెంగాలీబాబూలు, ఈ చరిత్రలను చదవడం మంచిది. దేశభక్తినిగూర్చి, తమకు కలిగిన అవమానకరమైన స్థితినిగూర్చి, ఇకముందు ఆడంబరమైన భాషలో ఉపన్య సించడానికి సాహసించరు. ఈ గ్రంథంలో సూచించబడియున్న ఏ ఒక్క గ్రంథా న్నైనా, ఈ యువక బ్రూటసులు, ఫోషియానులు, పరిశీలిస్తే త్వరలో వాస్తవ స్థితిని, గ్రహించగలుగుతారు. తాము పునఃప్రతిష్ఠించడానికి ఆతురపడుతున్న ఆ అంధకార యుగంలో, వీరి పిచ్చి ఊహాలనేమాత్రం నోటరానిచ్చియుండినా, ఆ కాలపు ప్రభువులు వీరిని కొరతవేయడమో, లేదా, కరగిన సీసాన్ని చెవులలో పోయడమో చేసి ఉండేవారు. గమనించకపోవడానికీ, ఉదాసీనంగా ఉండడానికీ ఆనాటి ప్రభుత్వము బ్రిటీషుప్రభుత్వం కాదని వీరికి తెలిసేది. ముక్తశుల్క భూము లను మన ప్రభుత్వం వెనుకకు తీసుకొంటూ ఉన్నదనే ఆక్షేపణకూడా మనకింక వినరాదు. ఈ ప్రాచీన చరిత్రలలోని ఏ పుటలో చూచినాకూడా 'పట్టాభూమి' అనేపేరే కనబడదు. న్యాయశాస్త్రాన్నిబట్టి, క్రియాత్మక ఆచరణనుబట్టి చూచినా, భూమిని ప్రభుత్వం గ్రహించడమనే విషయ మాకాలంలో సర్వ సాధారణమైన విషయమని, వీరికి తెలుస్తుంది. వీరి పూర్వులైన మొఘల్ సార్వభౌములు నిర్మించిన మహా సౌధాలవంటి వాటిని, మళ్ళీ, నిర్మించవలెననే కుతూహలము, ఏ ఉత్కాంఠా పరునకైనా ఉన్నట్టయితే, ఈ చరిత్రలను చదవడంవల్ల, ఆ కుతూ హలం పూర్తిగా నశించిపోతుంది. రాజనగరులు, ముఖమండపాలు, దేవాల యాలు, గోరీలు తప్ప, అనుకరించడానికి అర్హములైనవేవీ లేవు. ఢిల్లీ సామ్రా జ్యాన్ని పరిపాలించిన సార్వభౌములలో ముగ్గురిని మినహాయిస్తే, తక్కిన వారె వ్వరూ ప్రజల బాగును, ప్రజల సౌఖ్యాన్ని తలచనుకూడాలేదు, అంతేకాక, వీళ్ళు నిర్మించిన కొన్ని సరైయిలు (సత్రాలు) వంతెనలుతప్ప, (అవికూడా, సార్వభౌముని తాత్కాలిక నివాసాల మార్గాలలో) కేవలం స్వార్థపరత్వంతో జర గని, ఏ నిర్మాణమూలేదు. వారు గావించిన నిర్మాణాల అద్భుత సౌందర్యాన్ని, అతిశయమైన సున్నితత్వాన్ని, కించపరచడం నా ఉద్దేశంకాదు. అవి నిజంగా అద్భుత నిర్మాణాలే. కాని, వాటి నిర్మాణానికి ఆత్మ ప్రతిష్ఠాపనమే, ఆడంబర ప్రదర్శనమే, ప్రధానహేతువులు. పైన సూచించినవి కొన్నితప్ప, తక్కిన దొక్కటి కూడా ప్రజోపయోగకరమైనదికాదు."

ఈ భారత ప్రజావిరుద్ధ భావాల ఫలితాలు ప్రబల హానికరమైనవని, ప్రభుత్వం లోని సభ్యులు, ఇండియా సందర్శనార్థం వచ్చిన ఇతరులుకూడా గమనించి, విమ ర్శించినారు. 1860 నాడే, సర్ ఛార్లెస్ వుడ్, ఈ విషయమై, తన వ్యాకులతను, క్యానింగ్‌కు జాబులద్వారా తెలియజేసి యున్నాడు. ఇటీవల ప్రబలంగా వ్యాపి స్తున్న జాతి విరోధ భావాలను, క్యానింగు, అరికట్టగలడని, తాను ఆశిస్తున్నానని, 1860 సెప్టెంబరు 2 వ నాడు, వుడ్, మళ్ళీ వ్రాసినాడు.

న్యాయస్థానానికి వచ్చిన యూరోపియనులు, ఇండియనులు, ప్రతికక్షులుగా ఉన్న వ్యాజ్యేములలో, ఇద్దరు న్యాయాధిపతులు, జాతి పక్షపాతాన్ని పాటించి, తీసుకొన్న తప్పు నిర్ణయాలు, ఆపత్కారములైనవని ఆక్షేపిస్తూ, ఇతడు మళ్ళీ, క్యానింగు ప్రభువుకొక జాబు వ్రాసినాడు (1861 అక్టోబరు 9). న్యాయాధిపతియైన ఎల్జిన్‌కు ఒక జాబువ్రాస్తూ "మన అధికారులు దేశీయులపట్ల దయాదాక్షిణ్యాలను, పూర్వంవలె చూపుతూ ఉండడంలేదని వింటున్నాను. దీని కారణంగా, ఉత్తమ జాతివారని మనం ఆపాదించుకొంటున్న ఆధిక్యత, దేశీయుల దృష్టిలో, పతనమైపోతూ ఉంది. ఇంగ్లీషు పెద్దమనిషికి సహజంగా ఉండవలసిన యోగ్యత, ఉత్తమజాతి కవసరమైన యోగ్యత, రెండూ నశించిపోతున్నవి."

రడ్, అనే ఆంగ్లసైనికుడు దేశీయుణ్ణి, హత్యగావించిన అభియోగ విచారణ దీర్ఘంగా జరిగిన పిమ్మట, న్యాయాధిపతియైన ఎల్జిన్, హంతకునికి మరణశిక్ష విధించి, దండనను జరిపించినాడు. దేశంలోని ఆంగ్లేయులు తెచ్చిన ఒత్తిడికి లొంగిపోక, న్యాయాన్ని పరిపాలించినందుకుగాను, అతనిని అభినందిస్తూ, వుడ్, అతనికి వ్రాసినాడు. "తక్కువతరగతికి చెందిన ఆంగ్లేయులు, దేశీయులను తక్కువ జాతివారని, హీనంగాచూస్తూ, స్వేచ్ఛాపరులై మితిలేక వారిని పీడిస్తున్నారు. ఈ ప్రవర్తన వారికి స్వాభావికమైపోయింది." అని ఇతడు తన సంతాపాన్ని వెలిబుచ్చినాడు.

'రడ్', కేసు విషయమై ఎల్జిన్, ఇండియా కార్యదర్శికి వ్రాస్తూ "పాశ్చాత్యులకు, దేశీయులకు న్యాయ విధానాన్ని సమానంగా వర్తింపజేయడం కష్టతమమని", ఒప్పుకొన్నాడు. సర్ జాన్ లారెన్స్, ఈ విధమైన అభిప్రాయాన్ని వ్యక్తం చేసినాడు. "రెండు వర్గాల వారికీమధ్య, పెద్ద అంతరం ఏర్పడింది. ఇది ఇంకా పెద్దదవుతూ ఉంది. విప్లవము, విప్లవానంతర పరివర్తనలు, ఈ పరిస్థితులకు కారణాలు. ఇండియాలోని మన పరిపాలనకు ఇది అత్యంతము హానికరమైనదని నేను అనుకొంటున్నాను".

ఇంకొక జాబులో, అతడీవిధంగా వ్రాసినాడు. "ఆంగ్లేయులకు దేశీయులకు విరుద్ధ భావప్రవృత్తు లేర్పడడానికి మత భేదము గొప్ప కారణమనడం నిజమే. జాతి, వర్ణ సాంఘికాచార భేదాలు కూడా కారణాలే. కాని, వీటన్నిటి కంటె, ప్రబలమైన కారణం, మనవారి ప్రవర్తన. మన దేశపు వ్యక్తుల ప్రవర్తన వల్లనే, మంచికాని, చెడుకాని, సిద్ధించగలదు."

ఆంగ్లోయిండియన్ వర్గం వారిని గురించి, లిట్టన్ ప్రభువుకు వ్రాస్తూ, సాలిస్‌బరీ ప్రభువు ఈ విధంగా వివరించినాడు. "డబ్బును నిక్కచ్చిగా లెక్కపెట్టుకోవడంలోను, హ్రస్వదృష్టిలోను, ఆంగ్లో-ఇండియనులకు, దక్షిణ అమెరికనులకు, జమైకాలోని శ్వేత వర్ణ భూస్వాములకు ప్రబలమైన సాదృశ్య మున్నది. మూడు వారాల అనంతరము 'ఫుల్లర్' కేసు విషయమై చర్చిస్తూ "ఫుల్లర్ కేసు విషయంవల్ల, దేశీయులకు సంబంధించిన ఇతర న్యాయ స్థాన నిర్ణయాలను నేను

జాగ్రత్తగా పరిశీలించవలసి వచ్చింది. ఆ నిర్ణయాలలోని, అన్యాయము, నన్ను భయభ్రాంతుని గావించింది. తన సైసును (గుర్రాన్ని మాలీసు చేసేవాడు) చంపినందుకై (బుద్ధి పూర్వకంగా కాదు), ఫుల్లరుకు 30 రూపాయలు జరిమానా విధించబడింది. దీనిని, ఉన్నత న్యాయస్థానం కూడా అనుమతించింది. కాని, ఇటీవలనే నాలుగణాలు దొంగిలించినందుకై, ఒక దేశీయునికి దేశాంతర వాస శిక్ష విధించబడింది." అని ఇండియా ప్రభుత్వ కార్యదర్శి కితడు వ్రాసి యున్నాడు. ఒక మాసం తరవాత, మళ్ళీ ఈ విధంగా వ్రాసినాడు. "తక్కువ వర్గాల దేశీయులపై మన వాళ్ళు జరుపుతున్న క్రూర రాక్షస చర్యలు, అత్యున్నత వర్గానికి చెందిన దేశీయుల పట్ల మన వాళ్ళవలంబిస్తున్న అతి నిష్ఠాప్రవృత్తి,- వీటి కారణంగా, మన పరిపాలనను ఇప్పటికన్నా కూడా ఎక్కువగా దేశీయులు వ్యతిరేకించక పోవడం నిజంగా ఆశ్చర్యకరమైన విషయము. ఇండియాలో మనం ఎదుర్కోవలసిన అమితమైన ఆపద అంతా, శ్వేతజాతి వల్లనే ఏర్పడుతున్నదని నాకు పూర్తిగా విశ్వాసమేర్పడింది."

అనధికార వర్గంలోని ఆంగ్లేయుల ప్రవర్తన క్రమంగా దుష్టమవుతున్నదని జార్జి హ్యామిల్టనుకు తెలియజేస్తూ, కర్జన్ ప్రభువు, ఆంగ్లాధికారులు కూడా, ప్రజలను దూరంగా ఉంచి, ముభావంగా వర్తిస్తున్నారని వివరించినాడు. ఇంగ్లాండు ప్రయోజనమునందాసక్తి ఎక్కువయ్యేకొద్దీ, దానికనుగుణంగా నైతిక ప్రమాణము, ఇక్కడ క్షీణిస్తూ ఉన్నది. దేశీయులు కూడా ఈ విషయాన్ని గ్రహించి నారు. ఆంగ్లేయ ప్రభువుల ప్రవృత్తి పూర్వమున్నట్టు లేదని పత్రికలలో కూడా వ్రాస్తున్నారు. రెండు వర్గాల వారికీ గల పరస్పర సంబంధం బాగు పడడానికి మారుగా, క్రమంగా చెడిపోతూఉన్నది. ఇతర లోపాలెటువంటివైనా, "కర్జన్ అన్యాయాన్ని సహించేవాడు కాడు." అపరాధులను దండించి న్యాయాన్ని పరిపాలించే స్వభావమతనిది", ఈ కారణంవల్ల, ఆంగ్లోయిండియన్ పత్రికల ఆగ్రహానికితడు గురి అయినాడు. ఆ పత్రికలితనిపై తీవ్రమైన దాడి సాగించినవి.

అత్యున్నతాధికారులు తెలిపిన విషయాలతోపాటు, ఈ విషయమై ఇతరుల సాక్ష్యంకూడా చేర్చవచ్చు కాబ్డెన్, ఒక జాబులో బ్రైట్‌కు ఈ విధంగా తెలిపి యున్నాడు. "ఇండియానుంచి తిరిగివచ్చిన కొందరు స్త్రీలను కలుసుకోవడం, తటస్థించింది. వీరి భర్తలు సైన్యంలో అధికారులై ఉండడంవల్ల, వీళ్ళ సైనిక శిబిరాలలో నివాసం చేసివచ్చినారు. మన ఇండియా ప్రజలను గురించి వీరు 'నిగ్గరు' అనే పదాన్ని ఉపయోగిస్తారు." ఇంకొక జాబులో అతడు, "ఇండియా ప్రభుత్వాన్ని సంస్కరించడమనే విషయం, ఆశారహితమై పోయింది. ఇటీవల జరిగిన ఉదంతాలు, రెండు జాతులకూ మధ్య గొప్ప అంతరాన్ని కలిగించినవి." ట్రెవిలియన్ ఈ విధంగా వ్రాసినాడు. "దేశీయులు సాధారణంగా, మూడో తరగతిలో రైలు ప్రయాణం చేస్తారు. మొదటి తరగతిలో ప్రయాణం చేయడానికి స్తోమత కలిగిన, సంపన్న హిందువులుకూడా, ఆంగ్లసాహేబుల దుష్టప్రవర్తనకు భయపడి మానుకొంటారు." ఆంగ్లేయులు ఇండియనులను దూషించడం, వారిని కొట్టడం,

కూడా చేస్తున్నారని, ట్రెవిలియన్, ఇతరులు కూడా వ్రాసినారు. అటువంటి దృశ్యాన్ని ట్రెవిలియను స్వయంగా చూసినాడు. సోన్‌పూరులో జరిగిన ఉత్సవ సందర్భంలో, ఒక ఆంగ్లతోటల యజమాని, ధనవంతులైన, మంచిదుస్తులలో ఉన్న భారతీయులను కొరడాతో కొట్టిన దృశ్యాన్ని ఇతడు కళ్ళారా చూసినాడు. ఈ విషయాలను గురించి, ఇతడీవిధంగా వ్రాసియున్నాడు. "విజేతల వర్గమునకూ, విజితులైనవారి వర్గానికీ, సామరస్యము ఐక్యతా ఏర్పడడం సాధ్యము కానిదని, ఈ దేశంలో ఎక్కువకాలం నివసించేకొద్దీ, బాగా వ్యక్తమవుతూ వస్తుంది. ఈ రెండు వర్గాల సామరస్యము, 'యుటోపియను' " అనికూడా ఇతడు వర్ణించినాడు. "మన జాతి ప్రకృతిలో గాఢంగా పాతుకొనియున్న జాత్యభిమానము, దౌర్జన్యప్రవృత్తి ప్రత్యక్షంగా చూడడం బాధకలిగిస్తుంది. అత్యుత్తమమైన విద్యాసంస్కారాల వల్ల తప్ప, ఈ దుష్ప్రవృత్తి లొంగిపోదు. ఆంగ్ల సమాజశ్రేణిలో, కిందికిపోయే కొద్దీ ఈ దుష్టస్వభావము, ఎక్కువగా ప్రత్యక్షమౌతుంది."

'సర్ సయ్యద్ అహమద్‌ఖాన్ జీవితము' అనే గ్రంథంలో గ్రహాం(Graham) ఒక ఉదంతాన్ని వివరించియున్నాడు. ఈ విషయం నిజమని, జస్టిస్ గ్రహాం, మహమద్ కూడా ధ్రువపరచినారు. ప్రధానన్యాయాధిపతియైన సర్ ఛార్లెస్ టర్నర్‌తో సహా, మదరాసు క్లబ్బును సందర్శించడానికి, అహమద్‌ఖాన్ వెళ్లినాడు. క్లబ్బు సభ్యుడొకడు అహమద్‌ఖాన్ సమక్షంలోనే, "దేశీయుల కీ క్లబ్బులో ప్రవేశం లేదని చెప్పి, అహమద్‌ఖాన్‌ను బైటనే ఉంచి, తలుపు మూసినాడు. ప్రసిద్ధులు, గౌరవనీయులు ఐన, రెనడే, జస్టిస్ చందావర్కరు వంటి వారుకూడా రైలు ప్రయాణాలలో, అల్పులైన బ్రిటీషుసైనికుల అవమాన ప్రవర్తనకు గురికావలసి వచ్చింది.

జి. ఎఫ్. ఆబిట్, ఇండియాలో తనకు గలిగిన అనుభవాల నీ విధంగా వర్ణిస్తాడు. "లండను నగర పరిసరాలలో జనించిన యువకులు, ఇండియా ప్రభుత్వోద్యోగాలలో ఉండడం చూచినాను. ప్రసిద్ధ భారతీయ సంపన్నుల పట్ల వీరు బహిరంగంగా ప్రదర్శించే ప్రవర్తన, ఇంగ్లాండులోని పెద్దమనిషియైనవా డెవ్వడూ కూడా తన భృత్యుని పట్ల కూడా చూపడు". రైల్వేలు, హోటళ్లు, క్లబ్బులు, బంగళాలు, అధికార కార్యాలయాలు, - వీటిలో, ఆంగ్లేయులు భారతీయులను ధిక్కారంతో తిరస్కరిస్తారు. "అసభ్యమైన వీరి ప్రవర్తన, ప్రత్యక్షంగా చూచినవారు తప్ప, ఇతరులు నమ్మజాలనంతటి నీచమైనట్టిది".

యూనియన్ థియోలాజికల్ సెమినార్‌కు, అధ్యక్షుడైన, డాక్టర్ ఛార్లెస్ కత్‌బర్ట్‌హాల్, న్యూయార్కులోని న్యాయవాదుల క్లబ్బులో ఉపన్యసిస్తూ (జాన్యుయరి 1908) "అత్యుత్తమ మేధావంతులు, శీలవంతులు, అయిన, భారతీయులను, నాకు అధిక గౌరవనీయులైన వారిని గూడా, ఆంగ్లేయులు అమర్యాదతో చూడడం నేను స్వయంగా చూచినాను" అని చెప్పియున్నాడు.

ఆంగ్లేయులు భారతీయులను నిందించడం, వారిని కొట్టి బాధించడం, మొదలైనవాటిని గురించిన ఉదంతాలతో ఆ కాలపు వార్తాపత్రికలు నిండిపోయి

నవి. బ్రిటీషువారు నిర్వహిస్తూ వచ్చిన దినపత్రికలు, దోషులైన ఆంగ్లేయులను, సర్వదా, సమర్థించినవి. న్యాయస్థానాలలో వారి సమర్థనార్థము, ద్రవ్యాన్ని వసూలుచేసి, వారి పక్షంగా జరిమానాలను కూడా ఈ పత్రికలే చెల్లిస్తూవచ్చినవి. "తన జాతి వారితో నిలిచియున్నవారెవ్వరూ, దేశీయుల గుంపులకు భయపడ నక్కరలేదు" అని ఆంగ్లో-ఇండియన్ పత్రిక, కర్జన్ ప్రభువుకు సలహా యిచ్చింది. ఆంగ్లేయుల పట్ల, కర్జన్‌కు సానుభూతి లేదు, నిజమైన రాజనీతివేత్త కుండవలసిన లక్షణాలు, బ్రిటీషు జాతియొక్క సహజప్రవృత్తులు ఇతనికి లేవని కూడా, అతనిని ఈ పత్రికలు దూషించినవి.

ఆంగ్లో - ఇండియను పత్రికలన్నిటిలోనూ, సమత్వభావాన్ని అవలంబిస్తూ వచ్చిన 'ఫ్రెండ్ ఆఫ్ ఇండియా' పత్రికకూడా, ఇల్‌బర్టు బిల్లు వివాదము బయలుదేరడంతో, అభ్యుదయ విరుద్ధ మార్గాన్నవలంబించింది. జాతి విభేదాన్ని సమర్థిస్తూ, ప్రభుత్వాని కీవిధంగా హితబోధ గావించింది. "బ్రిటీషు రాష్ట్రమండలి ప్రయోజనాలకు భంగంకలగని మార్గంలో, సామ్రాజ్యంలోని వివిధ జాతుల హక్కులను, విశేషాధికారాలను, ఆచారాలను గౌరవించడం ప్రభుత్వం యొక్క బాధ్యత."

ఆంగ్లేయులు భారతీయులపట్ల ప్రదర్శిస్తున్న అవమానకర ప్రవృత్తిని, ఆంగ్లేయులు దేశీయులపై ప్రయోగిస్తున్న హింసాత్మక దౌర్జన్యాన్ని నిరసిస్తూ దేశీయ పత్రికలు, ప్రజల ఆగ్రహాన్ని, వారి నైరాశ్యాన్ని ప్రదర్శిస్తూ వచ్చినవి. 'బెంగాలీ' పత్రికలోని కొన్ని ఉదాహరణలు భారతీయులీవిషయమై చూపిన ప్రతిక్రియాభావాలను విశదంచేస్తున్నవి పరిపాలకులువహించిన ప్రవృత్తిని గురించి,—

"పరిపాలకులకు, పాలితప్రజలకు, గల అంతరం విస్తృతమయింది. పరిపాలక వర్గంవారు ప్రజల మనోభావాలను పూర్వం వలె, ఇప్పుడు గ్రహించడంలేదు. పాలకులపై పూర్వముండిన విశ్వాసం పాలితప్రజలలో నశించింది" అని వ్రాసింది. తరవాత ఇంకొక సంచికలో, ఈ కింది విధంగా వ్రాసింది. "ప్రజల కష్టాలు ఊహా కల్పితములని భావించిన అధికారీతంత్రప్రభుత్వము, ఆ కష్టాలను గురించి విచారణ గావించడానికి కూడా పూనుకోలేదు. తాను ప్రజల విషయంలో గావించినదంతా సక్రమమైనది, ఉచితమైనది, అనే కల్పితభావావేశానికి ప్రభుత్వం వశమైపోయింది. దేశ పరిపాలన సర్వస్వమూ, ఆంగ్లేయుల ప్రయోజనమే ప్రధానోద్దేశంగా జరుగుతున్నదేకాని, ఇండియనుల ప్రయోజనానికై కాదు."

దేశంలోని అస్తవ్యస్తపరిస్థితులనుబట్టి, దేశీయులలోను, ఆంగ్లాధికారులలోను, సర్వత్రా ప్రబలమైన అసంతుష్టి ఏర్పడింది. వ్యవహారాలు ఛిద్రములై విడిపోయినవనే భావన, ఏదో ఆపద ఆవరించుకొని వస్తున్నదనే శంక, విస్తారంగా వ్యాపించింది."

ఒక బ్రిటీషు సైనికుడు ఇద్దరు ముస్లిము శ్రామికులను, ఒక చాకలిదానినీ, బుద్ధి పూర్వకంగా, జంకుకొంకులు లేకుండా హత్యగావించినాడు. ఈ విషయమై 'బెంగాలీ' పత్రిక ఈ విధంగా వ్రాసింది. "ఆంగ్లేయుని అభిప్రాయంలో

శ్వేతజాతులవారు మాత్రమే మానవులు. నల్ల జాతివారు, ద్వేష్యములైన మృగములు. 1857 తర్వాత, ఇండియనులు ఇంకను ఎక్కు[illegible] మృగములైనారు.'' హంతకులైన ఆంగ్లేయులను దోషముక్తులుగా గావించే బ్రిటీషు జూరీ వర్గంపై 'బెంగాలీ' పత్రిక, ఈ విధంగా తప్పుమోపింది:- "బ్రిటీషు ఇండియాలోని పాశ్చాత్య ప్రజలు ఇంతవరకు, లెక్కలేనన్ని హత్యలు గావించినారు. కాని, ఆ హంతకులలో ఇద్దరికి మాత్రమే,- మూరు, రడ్,- మరణదండన విధించబడింది. పాశ్చాత్య హంతకులకు సిద్ధించియున్న ఈ రక్షణకు మనం బ్రిటీషు జూరీవారికి రుణపడి యున్నాము. న్యాయపరిపాలనవడు వీరికి ముఖ్యంకాదు. తమజాతివారి ప్రతిష్ఠను రక్షించడమే వీరికి ప్రధానమైన కర్తవ్యము"

ఫుల్లరు హత్యగావించిన కేసు విషయంలో, దండనాధికారి 30 రూపాయలు జరిమానా విధించినాడు. 'హత్య' అనే మాటకు బదులుగా, 'బుద్ధిపూర్వకంగా గావించిన దేహహాని' అనే న్యాయశాస్త్ర పదాన్ని ప్రయోగించి, హంతకుణ్ణి 30 రూపాయలతో వదలివేసినాడు. దండనాధికారి గావించిన నిర్ణయంలో తప్పేమీ గోచరించడంలేదని, ఉన్నత న్యాయస్థానం కూడా, తన అంగీకారాన్ని ప్రకటించింది. 'బెంగాలీ' పత్రిక ఈ విషయమై దూసుకొనిపోయే హేళన వాక్యాలతో, హృదయచ్ఛేదకమైన తీవ్రవిమర్శను ప్రకటించింది. "కొరడాలతో కొట్టి ప్రజలను బాధించేవారికి, నిజరూప ప్రతిమలను (statues), హంతకులకు దేవాలయాలను, నిర్మించి, వారినామములను, చిరస్థాయిగా చేయవలెను." అని వెటకారంగా వ్రాసింది. అసంఖ్యాకంగాఉన్న ఇటువంటి ఉదాహరణలన్నీ పాలకులకు, ప్రజలకు, పరస్పరం కల వైమనస్య మెంత తీవ్రమైనదో వ్యక్తం కావిస్తున్నవి. 19 వ శతాబ్దమందలి బ్రిటీషు సామ్రాజ్య ప్రవృత్తి, మానవసమత, జాతిసహకారము, అనే ఆదర్శాలకు, విరుద్ధమైనట్టిదని ఇవి నిరూపిస్తున్నవి. ప్రజలకు సమాధానం చెప్పవలసిన బాధ్యతలేని ఈ ప్రభుత్వం, ఎంతోదూరంలోఉన్న ఇంగ్లాండు ప్రభుత్వాధికారానికి లోబడి యున్నప్పుడు, భారతదేశాన్ని పరిపాలించడానికి, సైన్యశక్తి మాత్రమే సాధనం కాకతప్పదు. కనుక,న్యాయశాస్త్ర సూత్రాలతోను, సివిల్ సంస్థల రూపంతోను కప్పిపుచ్చినప్పటికీ, బ్రిటీషువారి ఇండియా పరిపాలన, స్వభావాన్నిబట్టి, సైన్యపరిపాలనమే. సైనిక పరిపాలనలో, ప్రజలు లోబడి యుండవలెనంటే, సైనికవిధానం ప్రబలమైనదిగాను, ప్రజలకు జంకు కలిగించే టటువంటిదిగాను, ఉండడం అవసరము. కనుక, పాలకవర్గానికి చెందిన శ్వేతజాతులవారి ఆధిక్యాన్ని, అధీన ప్రజలైన నల్లజాతివారు గ్రహించేటట్లుచేయడం తప్పనిసరి. దీనినిబట్టి, పరపీడనము, రభసప్రవర్తన, దురహంకార ప్రదర్శన, క్రౌర్యము, మొదలైన దుర్లక్షణాలు సామ్రాజ్య ప్రవృత్తికీ, సామ్రాజ్య సిద్ధాంతానికీ సహజ లక్షణాలుగా ఏర్పడినవి. ఆత్మగౌరవంగల ఏ కొందరోతప్ప, తక్కిన పాశ్చాత్యులందరూ, ఈ సామ్రాజ్య హారవాదాన్ని సమర్థించి, పోషించినవారే.

అనధికార వర్గంవారితో పాటు, అధికారవర్గంలోని ఆంగ్లేయులుకూడా,

భారతజాతిపట్ల విరుద్ధ భావానికి లోనై పోవడం, నిజంగా, హాని సూచకమైన దుర్లక్షణము.' అని కాటన్, 1904 నాడే తెలిపియున్నాడు. "భారతదేశ ప్రజావర్గాలన్నీ ఒక వైపునా, అధికార వర్గ, అనధికార వర్గ ఆంగ్లేయులందరునూ ఇంకొక వైపునా, పరస్పరం దూరులై నివసించే పరిస్థితులు ఇప్పు డేర్పడియున్నవి".

భారతీయులలో జ్ఞానోదయం కలగటానికి, తమకు జరుగుతున్న అవమానాన్ని గుర్తించి, ఖేదపడటానికి, నిరాశాభావ ముదయించటానికి,—రెండు వర్గాల మధ్య యేర్పడిన, ఈ విభేద భావమే ముఖ్యకారణము. బ్రిటీషు పరిపాలనకు సంబంధించిన ఇతర విషయాలన్నీ, ఇంత ప్రబలమైనవి కావు. నీచాతినీచుడైన బ్రిటీషు సైనికుడు, వర్తక గుమాస్తా, తోటల యజమాని భృత్యుడు, రైల్వే టికెట్టు కలెక్టరు,—ఇత్యాదుల అవమానకర ప్రవర్తనలనుంచి, ఉత్తమోత్తముడైన భారతీయ ప్రముఖునికి కూడా దేశంలో రక్షణ లేదనే అభిప్రాయము ప్రజలలో స్థిరపడి పోయింది. దేశీయుల ఆత్మగౌరవ ప్రతిష్ఠలకు ఈ నీచులవల్ల కలుగుతున్న భంగానికి హద్దు లేకపోయింది. అంతటితో, తీవ్రమైన ఆగ్రహము, సహజంగా ఉత్పన్న మయింది. ఈ దుష్టపరిస్థితులకు విరగడ లేనందువల్ల నైరాశ్యము, దాని ననుసరించి, అతి సాహసభావము, హింసాత్మక భావాలకు ప్రోద్బలం కలిగించినవి.

భారతీయులెందరో ఇంగ్లాండును సందర్శించి, అక్కడి ఆంగ్ల ప్రజల మర్యాద ప్రవర్తనను గమనించి, ఆంగ్ల కుటుంబాల ఆతిథ్యాన్ని కూడా పొందియున్నారు. ఇంగ్లాండులోని ఆంగ్లేయుల ప్రవృత్తికి, ఇండియాలోని ఆంగ్లేయుల ప్రవృత్తికి గల విస్తారమైన భేదము ప్రత్యక్షంగా వారికి గోచరించింది. ఇండియాలోని ఆంగ్లేయుల దుష్ప్రవర్తనకు, వారి దౌర్జన్యానికి, వారి చర్యలకు ప్రజల సర్వవిధములైన కష్టాలకూ, సామ్రాజ్య విధాన పరిపాలనమే కారణము. ఈ దుష్ట సామ్రాజ్య పరిపాలనను నిర్మూలించక తప్పదనెడి ఉత్కాంక్ష ప్రజలలో ఏర్పడడం, అనివార్యమయింది.

## V. భారతీయుల కష్టనిష్ఠూరాలు

ఆంగ్లేయుల ప్రవర్తన కారణంగా, భారతీయుల మనస్సులలో ఏర్పడిన ప్రతిక్రియారూపమైన, అసమాధాన భావానికి, రెండు విధాలైన కష్టాలు ప్రోద్బలం కలిగించినవి. ఒకటి, ప్రభుత్వమవలంబించిన ఆర్థిక విధానము. ప్రజల రాజకీయ కాంక్ష రెండోది. ప్రభుత్వము యొక్క ఆర్థిక విధానాలు ఎటువంటివో పూర్వ ప్రకరణంలో వర్ణించబడినవి. ప్రజల దారిద్ర్యము, సర్వసాధారణమైన వారి దుస్థితి, పదేపదే ఏర్పడుతున్న క్షామ పరిస్థితుల వల్ల వారనుభవించే కష్టాలు, ఇవి అన్నీ కూడా విస్తృతమైన, తీవ్రమైన అసంతుష్టిని కలిగించినవి.

పల్లెసీమలు జీవిత మూలాధారములై ఉన్న మధ్య తరగతుల వారికి ఈ కారణాల వల్ల అలజడి కలిగింది. భారత రాజకీయ నాయకులకు, గ్రామసీమల వ్యవసాయ విషయాలేమాత్రమూ తెలియవని, అధికార తంత్రంలోని బ్రిటీషు అధి

కారులు ఎత్తిపొడుస్తూ వచ్చినారు. కాని, వాస్తవంగా, ప్రజానీకానికి, సన్నిహితులై, వారి శ్రేయస్సును కోరియున్నవారు భారతీయ నాయకులే; విదేశీయులైన ప్రభుత్వాధికారులు కారు. ప్రభువుల ఆగ్రహానికి జంకక, ప్రజానీకం యొక్క కష్టాలను నిర్మూలించడానికి పూనుకొన్న వారు విద్యావంతులైన దేశ నాయకులే.

ప్రభుత్వంపై గల రెండో ఆరోపణ రాజకీయ సంబంధమైనది. ప్రభుత్వం చేస్తున్న అన్యాయాలు, చూపుతున్న పక్షపాతము, ప్రజాభిప్రాయాన్ని, ప్రజల కోరికలను మన్నించకపోవడం, మొదలైనవి దేశనాయకుల మనఃప్రవృత్తిని మార్చినవి ప్రభుత్వాధికార ధిక్కారము విషయమై సంప్రతింపులు, ప్రభుత్వాన్ని ఎదుర్కోవడానికి సన్నాహాలు జరుగుతున్నవనే వదంతి, 19 వ శతాబ్దం కడపటికే ప్రజావ్యాప్తమైనది. భారతీయుల ప్రార్థనలను, కర్జన్, నిరసన భావంతో త్రోసివేయడం, భారతీయుల గుణశీలాలను లాఘవపరచడం, విద్యావంతులైన భారతీయుల పలుకుబడిని క్షీణింప చేసే చర్యలను ప్రారంభించడం, మొదలైనవన్నీ స్వాతంత్ర్యోద్యమానికి ప్రోద్బలం కలిగించినవి.

సామ్రాజ్య ప్రయోజనాలకు ప్రథమ స్థానము కల్పించడం, స్వపరిపాలనకు భారతీయులు 'అయోగ్యుల'ని నిశ్చయించడం,- ఈ రెండు నిర్ణయాలను ఆధారంగా చేసుకొని, బ్రిటీషు రాజ్యనీతి ఇండియా పరిపాలన వ్యవస్థను నిర్మించింది. ఈ నిర్ణయాల ప్రేరణపై, పరిపాలన విధానం రెండు మార్గాలలో ప్రవర్తించింది. ఆంతరంగికము, బాహ్యామునైన, విద్రోహశక్తుల నెదుర్కోవడానికి సమర్థమైన సైన్య సన్నాహాన్ని సిద్ధపరచుకొని, దానిపై ఆధారపడి పరిపాలనను సాగించడం మొదటి వ్యవస్థ సమర్థమైన పరిపాలన యంత్రాన్ని సిద్ధపరమకోవడం, రెండవ వ్యవస్థ. విరోధివర్గంవారి శక్తిసామర్థ్యాల కనుగుణమైనదిగా సైన్య వ్యవస్థ ఏర్పడవలసి ఉన్నది. కనుక, 1857 విప్లవ అనుభవాన్ని అనుసరించి, సైన్య సంస్థ యొక్క పునర్నిర్మాణానికి, ప్రభుత్వము పూనుకొన్నది.

అప్రతిహతమైన సైన్య బలంకాని, మతవర్గ, విభేదాలుకాని, సామ్రాజ్యం చిరస్థాయిగా నిలిచి ఉండడానికి ఆధారాలు కాజాలవు. ప్రజానీకం యొక్క మనఃపూర్వకమైన విధేయతా, విశ్వాసాలు, ప్రభుత్వం స్థిరపడటానికి తప్పక అవసరము లవుతాయి. అటువంటి విధేయత, విశ్వాసము, ప్రజాహితకరమైన పరిపాలన మూలంగానే సిద్ధించగలవు.

పరిపాలన వ్యవస్థను చక్కపరచి, ప్రజల మేలును నిజంగా ప్రభుత్వం వహించినదనే విశ్వాసము కలిగించి, వారి ఆర్థిక నైతికాభ్యుదయానికి ప్రభుత్వం పూనుకొన్నప్పుడే, ప్రజల అభిమానము, లభ్యమవుతుంది. ప్రజాహితాన్ని ఉద్దేశించి, సమర్థమైన పరిపాలన వ్యవస్థ నేర్పరచడం, అభ్యుదయ సాధకములైన కార్యాలను ప్రారంభించడం,—అన్న రెండూ, సామ్రాజ్య ప్రయోజన సాధనకు ప్రజల సంతుష్టి సాధనకు, ఆవశ్యకములైనవి.

ఇట్లు, బ్రిటిషు పరిపాలన, ఉభయ సంకటమైన ఇక్కట్టులలో పడింది.

సామ్రాజ్యానికి సంబంధించిన సమస్య లోకవైపున లాగుతూఉంటే, అధీన ప్రజల బలత్కారానికి సంబంధించిన అవసర కార్యాలు ఇంకొకవైపు లాగుతున్నవి. ప్రపంచ దేశాలలో (19 వ శతాబ్దము) సామ్రాజ్యవాదము, ఉదారవాదము, పరస్పరము ఘర్షణ పడుతూ ఉండినవి. అయినా, భారతదేశంలో మాత్రము, సామ్రాజ్యవాద మొక్కటే స్వేచ్ఛావిహారం గావిస్తూ వచ్చింది ఇండియాను ఆక్రమించిన సామ్రాజ్య విధానాన్ని, సైన్యబలము, సివిల్ సేవావ్యవస్థ, రక్షిస్తూ వచ్చినవి. వీటికితోడుగా, ఇంకొకబలాన్ని కూడా సమకూర్చుకొన్నారు పరిపాలకులు. ప్రజలలోగల సాంఘిక, మత విభేదాలను రెచ్చగొట్టి, తత్ఫలమైన అనైక్యతను, స్వప్రయోజనార్థము ఉపయోగించుకొనిరి. పరిపాలన విమోచనాన్ని ఆశయంగా చేసుకొనియున్న భారతీయులు, పరప్రభుత్వానికి ఆధారాలై ఉన్న ఈ మత, వర్గ సంస్థలను పడగొట్టడానికి పూనుకొన్నారు. మత సామరస్యాన్ని గూర్చుటకు, కేంద్రాపగమన ప్రవృత్తులను (centrifugal tendencies) తొల గించడానికి, స్వపరిపాలన కాధారమైన ఏకత్వాన్ని కూర్చడానికి జాతీయోద్యమం ప్రయత్నిస్తున్నది

*బ్రిటీషు పరిపాలన కాధారమైన సైన్యవ్యవస్థ :* "సామ్రాజ్య నీతి యొక్క ఆదర్శరూపము." అనే గ్రంథంలో విన్‌స్లో "సైన్యవాద, సామ్రాజ్య వాదములు రెండూ, ఒకేవిధమైన భావప్రవృత్తులలో ఏర్పడినవి." అన్నాడు. బ్రిటీషురాజ్యము ఇండియాలో విస్తరించిన ప్రక్రియాచరిత్ర, ఈ వాక్యార్థాన్ని సమగ్రంగా నిరూపిస్తుంది. బ్రిటీషువారు ఇండియాను జయించి, ఆక్రమించడం, సైన్యం సాధించిన మహాకార్యము ఇండియా సామ్రాజ్య నిర్మాణము, బ్రిటీషు పరిపాలకుల శక్తి, నైపుణ్య, సంకల్పాలకు స్మారకచిహ్నము. బ్రిటీషు సామ్రా జ్యాన్ని దేశం నలువైపులా ప్రసరింపచేయటానికి తగిన ఉత్తేజనాన్నిచ్చింది, బ్రిటీషు సైన్యసంస్థ. పరిపాలన వ్యవస్థ నేర్పరచడానికి అవసరమైన ఉపక్రామక శక్తిని కూడా, సైన్యసంస్థే కలిగించింది. కారన్‌వాలిస్, స్వయంగా సైనికుడు. కనుక గవర్నరు జెనరల్ పదవిని, సైన్యాధ్యక్ష పదవినికూడా, తానే వహించ గలిగినాడు. క్లైవు మొదలుగా, డల్హౌసీవరకు, సివిలు అధికారవర్గానికి, సైన్యాధి కార వర్గానికీ, ఎప్పుడూ ఏదోవిధమైన ప్రతిస్పర్ధకారణము, కలుగుతూనే ఉండేది. ఇరవైయ్యో శతాబ్దారంభంలో కూడా ఈ స్పర్ధబహిర్గతమై వ్యాపించింది. సైన్యా ధ్యక్షుడైన, కిచినరు, తో ఏర్పడిన వివాదంలో, గవర్నరు జెనరలైన, కర్జన్‌కు, గర్వభంగమయింది.

బ్రిటీషు ప్రభుత్వము నియమించిన సంవిధాన సూత్రాలెన్ని ఉన్నా, ప్రభు త్వం యొక్క నిలకడ, సైన్య సంస్థపై, ఆధారపడి ఉన్నదన్న విషయము,-పైన వివరించబడిన విషయాలను బట్టి వ్యక్తమవుతుంది. బ్రిటీషు పరిపాలన స్వభావాన్ని బట్టి, తత్కార్యభారం వహించిన వారందరూ, సర్వదా అప్రమత్తులై ఉండడం ఆవశ్యకం. 'క్రాన్‌బ్రూక్'కు వ్రాస్తూ, లిట్టన్, "మన అధీనంలో ఉన్న ఇండియా ప్రజలకు, మనపై అభిమానం లేకపోవడం నిజమే." అని తెలిపియున్నాడు.

"రైతు సమూహం చైతన్యంలేని మట్టిముద్దవంటిది. ప్రజాభిప్రాయానికి ప్రతినిధులైన విద్యావంతులు విద్రోహప్రచారకులు. దేశీయ ప్రభువులనేకులు, అవిశ్వసనీయులు. రాజ్యంలోని అధికారుల దుష్ప్రవర్తనవల్ల దేశంలోని వారందరికీ అసంతృప్తి యేర్పడింది." అని సూచించినాడు. ఇంకా, "కుట్రచేయటానికి తగిన అవకాశం లభిస్తే, దేశీయరాజులు దానికిలోబడక నిలువలేరు." అనికూడా తెలిపియున్నాడు. హైదరాబాదు సాలారుజంగ్ పర్షియా దేశంతోను, కాశ్మీరు మహారాజా రష్యాతోను, కుట్రలు జరుపుతున్నారనే సంశయంకూడా ప్రభుత్వానికి కలిగింది. సామ్రాజ్యాన్ని ముంచివేసే పర్వత ప్రపాతమును, ఆపగలిగినది బ్రిటీషు సైన్య సంస్థ యొక్కటే.

1857 విప్లవం తరవాత సైన్యంయొక్క పునర్వ్యవస్థీకరణకు, ప్రభుత్వం పూనుకొన్నది. భారతీయులపై విశ్వాసం లేనివారై, తమ పరిపాలనకు ఏ విధమైన ఆపదా కలుగకుండా, అప్రతిహతమైన సైన్యాన్ని ఏర్పరచుకొన్నారు. దాని ఆధారంపై, పరిపాలన విధానము సర్వస్వమూ ఏర్పడిందనే విషయం, దీన్ని బట్టి విశదమవుతుంది.

1857 కు పూర్వం పాశ్చాత్యవిభాగము, భారతీయ విభాగము, అని రెండు విభాగాలతో సైన్యసంస్థ ఏర్పడియుండినది. ఇండియా సేవకై నియమించబడిన ఇంగ్లాండు రాజ్ఞియొక్క రెజిమెంట్లు, ఇండియాలో సమకూర్చుకొన్న పాశ్చాత్య రెజిమెంట్లు చేరి, పాశ్చాత్య సైన్యవిభాగంగా ఏర్పడినది. 1856లో సైన్యంలోని అత్యధిక భాగం భారతీయులది. ప్రతి పాశ్చాత్య సైనికునికీ, 7 లేక 9 మంది, దేశీయ సైనికులుండేవారు. విప్లవంలో ప్రధాన పాత్ర వహించిన బెంగాలు సైన్య శాఖలోని సైనికులు, ప్రధానంగా, ఉన్నత వర్గాలవారు. ఔధ్ ప్రాంతపు బ్రాహ్మణులు, రాజపుత్రులు ముఖ్యులు. విప్లవానికి ఈ అగ్రవర్గాలవారే కారకులని ఊహించి, ప్రభుత్వం సైన్య వ్యవస్థను పూర్తిగా మార్చి వేయడానికి పూనుకొన్నది. అవసరములైన మార్పులను సూచించడానికి, జెనరల్, పీల్, అధ్యక్షుతలో ఒక కమిషన్ నియుక్తమయింది. ఈ కమిషన్ గావించిన నివేదిక 1959 లో ప్రకటించబడింది. 1862 నాటికి ; ఆ నివేదికలోని సలహాలన్నీ, చాల వరకు, అమలు జరిగి, ఇండియా సైన్యం కొత్త సంస్థగా సిద్ధించింది.

సైన్యంలోని దేశీయ భాగంవల్ల అపాయంరాకుండా చేయడానికి, బ్రిటీషు సైనికభాగాన్ని, బలకరంగా చేయడం, వీరవలంబించిన ప్రధానసూత్రము, ప్రతి బ్రిటిషు సైనికునికి, ఇద్దరు దేశీయసైనికులుండేటట్లుగా, మొదటిమార్పు జరిగింది. బెంగాలుసైన్యంలోని నిష్పత్తి ఒకరికిద్దరు, బొంబాయి మదరాసు సైన్యశాఖలలోని నిష్పత్తి ఇద్దరికి ఐదుగురు, - ఈ విధంగా మార్పులు జరిగినవి. మొత్తం మీద, 65000 మంది పాశ్చాత్యసైనికులు, 140,000 మంది దేశీయసైనికులు, - చేరి నూతన సైన్య సంస్థ ఏర్పడింది. తర్వాత 1885 లో ఈ సంఖ్యలను 73500, 154,000 అయ్యేటట్లు పెంచినారు. రష్యనుల భయంవల్ల ఈ అభివృద్ధి అవసరమయింది. 1893 నాటికి పాశ్చాత్య, దేశీయ సైనికుల నిష్పత్తి క్రమంగా

2 : 5 గా ఏర్పడి, 19వ శతాబ్దమంతా ఈ నిష్పత్తి యిట్లే నిలిచియుండినది.

పాశ్చాత్య సైన్య భాగంలోని రెండు వర్గాలను ఐక్యం గావించడం, రెండవ మార్పు. యుద్ధరంగ సైనికులు, స్థానిక సైనికులు, ఈ మార్పువల్ల ఏకశాఖగా ఏర్పడినారు. మొత్తం పాశ్చాత్య సైన్యమంతా బ్రిటీషు సైన్యభాగంగా ఏర్పడింది. మందుగుండు సామగ్రీ, తుపాకులూ, ఉన్న స్థావరాలనుంచి, దేశీయ సైన్యాలను బహిష్కరించడం మూడవమార్పు. కాని, పాశ్చాత్యసైనికుల ఆరోగ్యానికి భంగ కరములైన స్థావరాల్లో మాత్రము, దేశీయసైన్యాన్నే నియమించక తప్పలేదు. ఈ విధంగా, పాశ్చాత్య సైన్యభాగం యొక్క ఆఘాతశక్తి అధికమై, దేశీయ సైన్యశక్తి క్షీణించినది, సైనికశిక్షణ నిచ్చేవిధానంలోకూడా, పాశ్చాత్యులకు ఉత్తమ విధానాన్ని పాటించి, దేశీయ సైన్యాన్ని సామాన్యస్థితిలోనే ఉంచినారు. దేశీయసైన్యం యొక్క ప్రతిష్ఠను తగ్గించి, ప్రధాన స్థానంనుంచి, సహాయక స్థానానికి త్రోసివేసినారు. ఇట్లా, పాశ్చాత్య సైన్యభాగానికి, దేశీయ సైన్య భాగం క్రిందై పోయింది.

ఇంతకంటే కూడా ప్రధానమైన, కుటిలమైన మార్పు, సైన్యశాఖల సంయోజనకు, సైనికస్థానాల భర్తీలకు సంబంధించినది. దేశీయసైనికులను విశ్వసించకూడదనే నిశ్చయము విప్లవం వల్ల ఏర్పడింది. దేశీయసైన్యంపై విశ్వాసాన్ని, భరవసాను ఉంచడమే, సమంజసమైన విధానమని మేజర్ జెనరల్ హ్యాన్‌కాక్, వంటి సైన్యాధికారులు విశ్వసించి యుండిరి. కాని, తద్వ్యతిరేకాభిప్రాయంకల వారి సంఖ్య కూడా అధికమవుతూ వచ్చింది. కమిషనుకు పీల్ పంపిన నివేదికలో, జెనరల్ టక్కరు, వ్యతిరేకుల అభిప్రాయాలను వివరించినాడు. "ఇండియాలో మన ఆధిక్యాన్ని సైన్య బలంతోనే నిలుపుకోవలసి ఉంది. ఇక్కడి వివిధజాతుల వారిని, రాష్ట్రాల వారిని సైన్య శక్తివల్లనే జయించవలసి ఉంది. ఎటువంటి పరిస్థితులలోనైనా, దేశీయులు మన ప్రభుత్వానికి సుముఖులై, మన పరిపాలనను హృదయ పూర్వకంగా అంగీకరిస్తారని, అభిప్రాయపడడం సాధ్యం కాదు. సామాన్య పరిజ్ఞానము, అనుభవంకూడా అటువంటి ఆశకు వ్యతిరేకంగానే ఉన్నది. ఇండియాను నాగరకదేశంగా మార్చి, జాతీయసంస్థను నెలకొల్పినప్పుడు, మనం దేశాన్ని వదలిపోవలసి ఉంటుంది. అంతవరకూ, ఇటీవలనే మన అనుభవానికి వచ్చినట్లుగా, అస్థిరమైన పరిస్థితులలోనే మనము నివసించవలసి వస్తుంది, కనుక, సైన్యంలోని వివిధవర్గాలవారినీ, వర్ణాలవారిని, కూర్చి, ప్రత్యేకభాగాలుగా ఏర్పరచడం అత్యావశ్యకమని, పరిస్థితులవల్ల నిశ్చితమవుతుంది. అటువంటి వ్యవస్థ నేర్పరచడంవల్ల, తూర్పు రాజ్యాల ఆపదనుంచికూడా మనకు రక్షణ సిద్ధిస్తుంది." దీనిననుసరించి, భిన్నజాతులవారితోను, భిన్నకులాలవారితోను సైన్యవ్యవస్థ రూపొందించబడవలెననీ, ఈ ప్రత్యేక వర్గాల వారందరూ వివిధశాఖలలో చెదరిపోయి, ఉండవలెనని, పీల్‌కమిషన్, సలహాయిచ్చింది. ఒకేకులంవారినికాని, ఒకేవర్గంవారిని కాని, ఒక్క సైన్యశాఖలోనే నియమించేపద్ధతి ఇంతటితో నశించిపోయింది. వేర్వేరు ప్రాంతాలకు, జాతులకు, వర్గాలకు, కులాలకు, మతాలకు,

చెందిన సైనికులనుచేర్చి, ఒకదళంగా ఏర్పరచడంవల్ల, ఇందులో ఏ వర్గమైనా తిరుగుబాటుచేసిన పక్షంలో, వారిని, సుకరంగా, నిరాయుధులను గావించే సౌకర్యం సిద్ధించింది. ఈ విధంగా, కులభేదాల ననుసరించిన ప్రాతినిధ్యము, రాజకీయాలలో ఏర్పడటానికి పూర్వమే, సైన్య సంయోజనంలో ఈ ప్రయోగం జరిగింది. ఈ విధమైన సైన్య సంయోజనంలో, ముస్లిములకు హిందువులకు సమత్వంకూడా కలిగే జాగ్రత్తనువహించింది ప్రభుత్వము. కంపెనీలు, దళాలు, ఇత్యాదుల చేరికవల్ల రెజిమెంట్లు ఏర్పడినవి. 8 వర్గాలతోకూడిన ఒక అశ్వికదళంలో, 3 సిక్కులవి, 3 మహమ్మదీయులవి, 2 హిందువులవి. ఈ విధంగా అన్నిదళాలూ, ఏర్పడినవి. హిందువెవ్వడూ గొప్పవాడైనా, కాకపోయినా, - కమీషన్ అధికారిగా నియమించబడలేదు. కూచ్ బీహార్ మహారాజాను కమీషన్ అధికారపదవికి నియమించవలెనని డఫ్ఫెరిన్ గావించిన, ప్రతిపాదన తిరస్కరించబడింది. అది ఒక నిదర్శనంగా ఏర్పడి, చిక్కులను తెస్తుందని ప్రభువులు వాదించి, సలహాను త్రోసివేసినారు.

విభజించి సామ్రాజ్యాన్ని పరిపాలించడమనేది, రోమనుల ఆదర్శసూత్రము. (Divide etimpera) ఈ విధానాన్నే ఎలిఫిన్‌స్టన్ బలపరచినాడు. 1853 నుంచి 1866 వరకు ఇండియా ప్రభుత్వ కార్యదర్శిగా నుండిన సర్ చార్లెస్‌వుడ్, 'మనది కూడా ఆ విధానమే కావలె'నని, దాని నంగీకరించినాడు. "సమానమైన భావము అందరికీ కలగకుండా చూడండి. సైనికులు సంఘాలుగా చేరడం, ఒకరితో ఒకరు భ్రాతృత్వం కలిగించుకోవడం జరగకుండా, జాగత్తపడండి". అని వుడ్ సైనికాధికారులకు పంపిన సందేశము. ఈ సందేశాన్ని వారు సమగ్రంగా పాటించినారు. "దేశీయ సైనికులను సైనికోద్యోగులను, మన మెంతవరకు విశ్వసించవచ్చు". అనే ప్రశ్నకు సమాధానం లభించింది. భారతీయ సైనిక వర్గాలు అధీనస్థితిలోకి తీసుకొని రాబడినవి. బాధ్యత, విశ్వాసాలతో కూడిన పదవులనుంచి భారతీయులందరినీ బహిష్కరించినారు.

## సివిల్ సేవా ఉద్యోగాలలో పక్షపాతము

సివిల్ సేవలోని ఉద్యోగాల విషయంలో కూడా పరిస్థితు లటువంటివే. అధీన ఉద్యోగాలలో మాత్రమే పడిఉండండని, భారతీయులను, కారన్‌వాలీస్ శపించినాడు. కాని, అందులో కొంత ఎక్కువ బాధ్యతగల ఉద్యోగాలకు, భారతీయులను నియోగించినాడు బెంటింకు. 1833 శాసనపత్రం కాని, విక్టోరియారాజ్ఞి 1858 లో చేసిన ప్రకటన గాని, ఈ పరిస్థితిని మార్చలేక పోయినవి. అందులోని వాగ్దానాలు, వాగ్రూపంగానే నిలిచిపోయినవి.

ఉన్నతోద్యోగాలలోని భారతీయుల సంఖ్య 19 వ శతాబ్దంలో,— అత్యల్పము. ఉద్యోగాలకు జరిగే పోటీపరీక్షలను, ఇంగ్లాండులోను ఇండియాలోను జరపవలసిందని, దానివల్ల భారతీయు లెక్కువగా పరీక్షనిచ్చి, ఉద్యోగాలు సంపాదించుకోగలరని, జాతీయనాయకులు ఒత్తిడి గావిస్తూ వచ్చినారు. అటువంటి

సదవకాశం భారతీయులకు కలిగించడం, పాలకులకు రుచించలేదు.

ఉన్నత సేవాసంస్థలను, అందును ముఖ్యంగా పరిపాలన వ్యవస్థకు సంబంధించిన వాటిని, ఏర్పరచడంలో, అనుసరించబడిన సూత్రాలు విచిత్రములైనవి. కనుక, అవి భారతదేశానికి క్రొత్తవి. ఇంగ్లండులోని ఉన్నతసేవాసంస్థలకు వర్తించిన సూత్రాల వంటివి కూడా, కావివి. ఇండియా సివిల్ సర్వీస్ అధికారులు (I. C S.) కేవలం ప్రభుత్వానికధీనులై ఉండి, ప్రభుత్వపు ఆదేశాలను నిర్వహించే వారు మాత్రమేకాదు. ప్రభుత్వ నీతిని, విధానాలను, రచించి, ప్రభుత్వాన్ని నడిపే అంగాలు వీరు. గవర్నరుల కార్యనిర్వాహక సంఘ సభ్యులను, రాజప్రతినిధి కార్యనిర్వాహక సభ్యులను, ఇండియా ప్రభుత్వ కార్యదర్శియొక్క సమితి సభ్యులను, ఇండియా ప్రాంతీయ, కేంద్ర శాసనసభ్యులను, ఈ వర్గంలోనుంచి ప్రభుత్వం ఎన్నుకొంటూ వచ్చినది. న్యాయ పరిపాలన శాఖలోని అత్యున్నత స్థానాలకు కూడా, వీరిలో కొందరు నియోగించబడినారు. గవర్నరు జెనరల్ పదవి, గవర్నరుల పదవులు, మినహా,—ఈ సివిల్ సర్వీసువారు ఆశించని పదవే ఇండియాలో లేదు. అన్ని పదవులకూ వీరు యోగ్యులే. ప్రభుత్వ వ్యవహారాలలో వీరికికలిగిన ప్రాబల్యాన్ని బట్టే, ప్రభుత్వానికి అధికారీతంత్ర ప్రభుత్వమని (Bureaucracy) వ్యవహారం సిద్ధించింది.

భారతీయులను ఉన్నతాధికారాలలో నియోగించడం, గవర్నరుజెనరలుకు ఇండియా కార్యదర్శికి కూడా సమ్మతంకాదు. భారతీయుల శీలం అధమమైనదని, ఛార్లెస్ వుడ్ అభిప్రాయము. "విద్యలోను, చురుకుదనంలోను భారతీయులు తక్కువ కాకపోయినా, గుణశీలాల విషయంలోను, నైతిక ధైర్యంవిషయంలోను, అయోగ్యులు బాధ్యతతో కూడిన పదవులను నిర్వహించడానికి ఇవి ముఖ్యంగా అవసరాలు".

సివిల్‌సర్వీస్ ఉద్యోగాలసమస్యను నార్త్‌కోట్, లారెన్స్ అభిప్రాయాన్ని కోరుతూ పంపిన సందర్భంలో జవాబీవిధంగా వచ్చింది. "రాజ్యనీతి, ప్రజాహితకరమైన ప్రభుత్వము, మనకు తరవాత సహాకరించినప్పటికీ ఇండియాను మొదట మనం జయించింది సాయుధబలంతో. ఆ బలంతోనే మనం ఇండియాను నిలుపుకోవలసి ఉంది. మన పరిపాలన స్థిరంగా నిలవవలెనంటే, ఆంగ్లేయులే గౌరవము, అధికారము, గల పదవులనువహించి, సర్వదా, ప్రథమశ్రేణి నాక్రమించి, యుండవలెను".

"పోటీ పరీక్షలలో ఉత్తీర్ణులు కావడానికి ఆవశ్యకమైన యోగ్యత లెన్ని ఉన్నా, ఉత్తమ పరిపాలకులుగా, ప్రభుత్వ విధాన నిర్వాహకులుగా రాణించడానికి తగిన సహజశక్తి సామర్థ్యాలు బెంగాలీలకు గానీ, ఇతరులకుగానీ లేవు" అని లారెన్సు తన అభిప్రాయాన్ని వ్యక్తం గావించినాడు.

ఆంగ్ల అభ్యర్థులకు పోటీ పరీక్షలు ఆవశ్యకమని సమర్థిస్తూ డూక్ ఆఫ్ ఆర్గైల్, ఈ విధంగా వివరించినాడు.—"పోటీ పరీక్షలలో ఉత్తీర్ణులైన వారంతా,

రాజ్యపరిపాలనకు తగిన సహజప్రవృత్తికలవారని, అధికార సామర్థ్యం కలవారని చెప్పజాలము. కాని, అభ్యర్థుల వంశాన్ని, రాజకీయాశ్రయాన్ని పురస్కరించుకొని ఉద్యోగాలను సంపాదించుకోవడం కంటె, పరీక్షలలోని యోగ్యతను బట్టి సంపాదించుకోవడం మంచిదని తోస్తుంది. ఇండియా సామ్రాజ్యాన్ని సంపాదించడానికి, దానినింతవరకు రక్షించి నిలుపుకో గలగటానికి ఆవశ్యకములైన, యోగ్యతలు వాళ్ళు నింకా ఆశ్రయించుకొనే ఉన్నవి కనుక, పోటీ పరీక్షలు ఇంగ్లీషు జాతిలోని ఈ యువకుల తరతమ భావాలను నిర్ణయించడానికి ఉపయోగిస్తాయి". దీనికి జవాబుగా, నార్త్‌బ్రూక్, ఈ విధంగా వ్రాసినాడు, "బహిరంగ పరీక్షలు ఇండియాకు తగినవి కావు. దేశీయులను ప్రభుత్వసేవలోకి తీసుకోవడానికి తగిన సాధనములు పరీక్షలు కావు. దేశీయులు పరీక్షలలో పోటీచేసే అవకాశాన్ని ఏమాత్రమూ కల్పించకూడదు". ఈ విషయమై లిట్టన్, ఈవిధంగా వ్రాసినాడు,—"ప్రభుత్వోద్యోగాలకు తమకు హక్కు గలదనే దేశీసుల భ్రాంతి మూలకవాదనను నేను సహించలేను". ప్రాచ్యదేశస్థుని, ప్రభుత్వ ప్రధాన న్యాయవాదిగా (Advocate general) నియోగించడం సాలిస్‌బరీకి ఇష్టం కాలేదు. ఇదివరలో భారతీయులు ఉన్నత న్యాయస్థాన న్యాయాధ్యక్షులుగా నియుక్తులై ఉన్నారు. కాని, ప్రభుత్వ న్యాయవాద పదవికి భారతదేశస్థుడు నియమింపబడడం, ఇండియాలోని ఆంగ్లేయుల కిష్టం లేదు. ఈ ప్రస్తావన వచ్చినప్పుడంతా వీరు గొడవ చేసేవారు. "భారతీయుని, ఈ పదవిలో నియోగిస్తే ఇతని అధీనంలో పని చేయడానికి పాశ్చాత్యు లంగీకరించరని" సాలిస్‌బరీ వాదించినాడు

ఇండియా ప్రభుత్వ కార్యదర్శియైన డ్యూక్ ఆఫ్ ఆర్గైల్, ఇండియా సివిల్ సర్వీస్‌లోకి, భారతీయులను ప్రవేశింపజేసే విషయమై, పరీక్షల అర్హతానర్హతలను గూర్చి, చర్చిస్తూ, అభిప్రాయాన్ని ఈ కిందివిధంగా వివరించినాడు. "ఇండియా దేశీయుల విషయంలో, ఈ సూత్రంపై ఆధారపడడం క్షేమకరం కాదు. వీరి విషయంలో కేవలం మేధాశక్తి, ప్రభుత్వ పరిపాలనకు సూచకం కాదు, అనే సంగతి సర్వవిదితమైనదే. ఇండియాలోని కొన్ని జాతులవారు, - విద్యావిషయంలో వెనుకబడిఉన్నా, విద్యావంతులైన ఇతర జాతులవారికంటె, శక్తి, ధైర్య స్థైర్యాలు, పరిపాలన దక్షత, ఇత్యాది విషయాలలో ఎంతో ముందున్నారు. పోటీ పరీక్షలో ఉత్తీర్ణులయ్యే అవకాశము, సిక్కులకంటే, పఠానుల కంటె, బెంగాలీల కెక్కువ. అంతేకాక, పోటీ పరీక్షలో ఉత్తీర్ణుడైన కలకత్తా పట్టభద్రుణ్ణి తీసుకొనివచ్చి, యుద్ధవీరుల జాతులకు చెందినవారిపై అధికారిగా నియోగించడం, మిక్కిలి అపాయకరమైన ప్రయోగము" (experiment). న్యాయ నిబంధనలనుబట్టి, న్యాయ సమతనుబట్టికూడా, ఇండియనులకు ఉన్నతోద్యోగాల అవకాశం కల్పించవలసి ఉంది. న్యాయ సూత్రాలను ఈ విషయంలో పాటించకపోవడానికి కారణాలను వివరిస్తూ, లిట్టన్, కాన్‌బ్రూక్‌కు, ఈ కింది విధంగా వ్రాసియున్నాడు, - "భారతీయులను ప్రభుత్వసేవలో తీసుకోవడానికి,

1833 శాసనము, స్వాతంత్ర్యం కలిగించే ఉన్నదని మీరు సూచించియున్నారు. ఆ స్వాతంత్ర్యము, తత్త్వతః పరిమితం కానటువంటిదే. కాని, ఈ విషయాన్ని కార్యనిర్వాహకవర్గంయొక్క అభిప్రాయానికి వదలివేయడం శాసనంయొక్క ఉద్దేశమై ఉంది. తాత్త్వికమైన స్వాతంత్ర్య మేర్పడే ఉన్నా, శాసనాన్ని ఆచరణలో పెట్టే విషయంలో అపరిమితమైన స్వాతంత్ర్యము, కార్యనిర్వాహక వర్గానికి ఈ శాసనమే కలిగించింది. శాసన పరిశీలనంవల్ల ఈ విషయం స్పష్టమౌతుంది" అని వ్రాసి, పరిస్థితులను సంగ్రహంగా వివరిస్తాడు ; -

"(a) అత్యావశ్యకము, ఔదార్యము, రాజ్యాంగనీతి, ఆర్థిక పరిస్థితి, - అన్న విషయాలను పురస్కరించుకొని, ఇండియా సివిల్ పరిపాలన వ్యవస్థలో పూర్వంకంటె అధికంగా, భారతీయులకు ప్రవేశం కలిగించడం, మంచిదని భావించబడుతున్నది.

(b) ఈ విషయమై పార్లమెంటు ఇచ్చియున్న వాగ్దానాలు, - అస్పష్టమైయున్నా కూడా విస్తారమైనవే.

(c) కాని, ఇంతవరకు, ఆ ఆశయాలను నెరవేర్చడం కాని, వాగ్దానాలను చెల్లించడంకాని, జరగలేదు. ఆ విషయమై ఎటువంటి ప్రయత్నంకూడా జరిగియుండలేదు.

(d) వాగ్దానాలను చెల్లించకపోవడానికి ఆ వాగ్దానాల అస్పష్ట స్వభావమే ముఖ్యకారణం."

ప్రభుత్వసేవలో ఉన్న పాశ్చాత్యాధికారుల వ్యతిరేక భావము, ఇతర ప్రతిబంధకాలు మొదలైనవాటిని పేర్కొని, లిట్టన్ ఈ విధంగా తన అభిప్రాయాన్ని వ్యక్తం గావించినాడు. "భారతీయుల కోరికను, ఆశలను, బూటాటకంతో, తప్పించుకొనే ప్రయత్నానికి పూనుకోవడంవల్ల లాభం లేదు. వాటిని తీర్చడం సాధ్యంకాదు; అది జరగనిపని కూడా. కర్ణపేయంగా చేసిన తియ్యటి వాగ్దానాల అర్థాన్ని, భావాన్ని భగ్నం గావించి, దాన్ని కప్పిపుచ్చడానికై, కుయుక్తులకు బూనుకొని, శాసనం నిరర్థకమైనదనే భావాన్ని కలిగించి, ఆచరణకు అయోగ్యమైనదిగా చేయడంకంటె, సూటియైన మార్గాన్ని అనుసరించడం సమంజసము. తొందరపడి, సందిగ్ధమైన విధంగా, గావించిన ఈ వాగ్దానాలను స్పష్టం చేయడం అవసరము. వాటి ప్రభావాన్ని తగ్గించదలచుకొన్నట్లయితే, జాగ్రత్తగా వాటిని పరిమితం చేయండి. కాని, చేయడంలో, పరిమితికి లోబడిన వాగ్దానాలను అర్థవంతంగా చేసి, వాటికి వాస్తవికతను కలిగించండి." అని యీ విధంగా తన సలహాలను, అభిప్రాయాలను తెలియజేసియున్నాడు.

ఈ విషయాన్ని సమగ్రంగా పరిశీలించి, వాస్తవికాంశాలను నిశ్చయించడానికి సంవత్సరాలు పట్టింది. కడపటికి, దీని ఫలితంగా, నియమబద్ధమైన సివిల్ సర్వీస్ స్థాపించబడింది. కాని, ఈ పదవులలో ప్రవేశించిన వ్యక్తులు కర్తవ్యాలను నిర్వహించలేకపోయినారు. అంతటితో, ఈ సివిల్ సర్వీస్ చట్టము, వ్యవహార దూరస్థమైపోయింది. అంతటితో 1886 లో, పంజాబ్ గవర్నర్, ఐచ్చిసన్,

(Aitchison) అధ్యక్షతలో, పబ్లిక్ సర్వీస్ కమిషన్ (లోకసేవాయోగము) నియుక్తమయింది. కమీషన్ గావించిన ముఖ్య సలహాలు, -

(1) ఒప్పందపు సివిల్ సర్వీస్‌లోనికి ప్రవేశం కలిగించే పద్ధతిని పాటించడం, (2) ఈ సర్విస్ ప్రత్యేకంగా నియామకమై ఉన్న పదవుల సంఖ్యను తగ్గించడం, (3) వాటిలో కొన్నిటిని, నూతన ప్రాంతీయ సివిల్ సర్వీస్‌లోకి మార్చడం; ఈ నూతన ప్రాంతీయ సర్వీసులో, పరిపాలన వ్యవస్థ, న్యాయపాలన, పోలీసు, విద్యాశాఖ, నిర్మాణశాఖ, ఇతర శాఖలు, - వీటికి చెందిన పదవులనుకూడా చేర్చడం, - అనే పద్ధతులను అవలంబించవలెనని కమిటీవారి నివేదిక తెలిపింది.

కార్యనిర్వాహక శాఖలోని ఉద్యోగాలకు పోటీ పరీక్షల మూలంగా అభ్యర్థుల నెన్నుకోవలసి ఉంటుంది. ఈ పద్ధతివల్ల ఇండియా సివిల్ సర్వీస్‌లోనికి భారతీయులకు ప్రవేశం కలిగించడానికి మారుగా ప్రవేశమార్గాలు నిరోధించబడినవి. దానికంటె తగ్గుస్థాయిలో ఉన్న పదవులను తక్కువ వేతనాలతో, తక్కువ అధికారంతో, దేశీయులకు ఏర్పరచి, తద్ద్వారా, వారిని తృప్తి పరచింది ప్రభుత్వము. "చెవులను రంజింపచేయడానికి మాత్రమే చేసిన వాగ్దానం కనుక, భారతీయుల ఆశలను భగ్నం కావించింది."

సివిల్ సర్వీస్‌లో ప్రవేశించే అవకాశాన్ని కల్పించడానికి, ఇంగ్లాండులోను, ఇండియాలోను, ఒకే సమయంలో పోటీ పరీక్షలను జరపడానికి నిశ్చయించుకొని, పార్లమెంటు 1893 లో, తీర్మానాన్ని అంగీకరించింది. దాదాభాయి గావించిన ప్రయత్నాల కారణంగా, ఈ తీర్మానానికి పార్లమెంటు ఒప్పుకొంది. ఇండియా ప్రభుత్వంయొక్క అభిప్రాయంకోసం, ఈ తీర్మానాన్ని ఇండియా ప్రభుత్వ కార్యదర్శి, కింబర్లీ ప్రభువుకు పంపించింది. పరిపాలన వ్యవస్థనుంచి, పాశ్చాత్య అధికారుల సంఖ్యను తగ్గించడం, బ్రిటీషు పరిపాలన క్షేమానికి అసంబద్ధమైనట్టిది అని వాదిస్తూ, పార్లమెంటు తీర్మానంపై తన వ్యాఖ్యానాన్ని కిందివిధంగా వ్రాసినాడాయన. "22 కోట్ల ప్రజలు నివసించియున్న 943,000 చదరపుమైళ్ల విస్తృతమైన భూభాగంలో, సక్రమము, ప్రశాంతము అయిన, ప్రభుత్వం ఏర్పడటానికి సివిల్ సర్వీసు ఉద్యోగుల పరిపాలన దక్షత, యోగ్యత ఆధారములైనవి. ఈ అధికారులు నిర్వహించవలసిన ప్రయాసకర కర్తవ్యాలను కొనసాగించటానికి, ఉత్తములైన వ్యక్తులను ఎన్నుకోవడం అత్యంత ప్రధానమైన విషయము. బ్రిటీషు పరిపాలనయొక్క ప్రాబల్యము సర్వస్వము వారిపై ఆధారపడి ఉంది. వారి పలుకుబడినేమాత్రము తగ్గించినా, వారి సామర్థ్యము ఏమాత్రం క్షీణింపచినా, దేశంలో అరాజకత్వ మేర్పడుతుంది. అంతకుపూర్వపు అరాజకపు పరిస్థితులనుంచి దేశాన్ని రక్షించడానికి మన సైన్యం పడిన ప్రయాస అంతా విఫలమవుతుంది. కనుక, సివిల్ సర్వీసులో తగినంతమంది పాశ్చాత్యాధికారు లుండడం, అత్యావసరమని ఆధారసూత్రమే నిరూపిస్తూ ఉన్నది. ఇంగ్లాండు ఇండియాలలో ఒకే సమయంలో పరీక్షలు జరగడంవల్ల, అసమర్థులైన దేశీయులు ప్రవాహారూపంలో, ప్రభుత్వసేవలో ప్రవేశించడం, బ్రిటిషురాజ్య భద్రతకు భంగం కలగడం, జరుగు

తాయనే శంకకు అవకాశమెంతైనా ఉన్నది."

1904 నాటి బడ్జెట్ ఉపన్యాసంలో, కర్జన్, ప్రభుత్వనీతిని సమర్థించినాడు. సామ్రాజ్య సివిల్‌సర్వీస్, ఆంగ్లేయుల అధీనంలోనే ఉండవలెనని నిశ్చితాభిప్రాయము. "ఈ మహాకర్తవ్య నిర్వహణాని కావశ్యకములైన ఆనువంశీయత (Heredity), పాలనశిక్షణలు, విద్యాసంస్కారము, రాజ్యసూత్రాల పరిజ్ఞానము, మనః ప్రవృత్తి, శీలస్థైర్యము, - మొదలయిన వన్నియు ఆంగ్లేయులకు సిద్ధములై ఉన్నవి. ఉత్కృష్ట వ్యక్తులతో ఏర్పడిన ఈ విశేషవర్గాన్ని (Corps-de-Elite) మినహాయించి, ఇతర ఉద్యోగ స్థానాలలో, సాధ్యమైనంతవరకు, భారతీయులను నియోగించవచ్చును. ఈ సూత్రాన్ని వర్తింపజేయడంలో కూడా, విశేషశాఖల ప్రయోజనాన్ని గుర్తుంచుకోవలసి ఉంటుంది. విజ్ఞానశాస్త్ర పాండిత్యము, సాంకేతిక శాస్త్ర విశిష్టజ్ఞానము, అత్యావశ్యకమైన శాఖలలోను, ప్రత్యేకమైన బాధ్యతను వహించవలసిన ఇతరశాఖలలోను, పాశ్చాత్యుల నధికభాగం భారతీయులలో సహా కలవడం అగత్యమవుతుంది. కొన్నిసందర్భాలలో పాశ్చాత్యులే ప్రధాన భాగమై ఉండటంకూడా అవసరము."

ప్రభుత్వముయొక్క అసమర్థతను ప్రకటించి, కార్యాచరణాన్ని నిరాకరించడం (Non possumus attitude) ఇండియాలోని ప్రజాభిప్రాయాన్ని ఉద్రేకపరచింది. బ్రిటీషుపరిపాలన యేర్పడిన ఒక శతాబ్దం తరవాతకూడా, కార్యనిర్వాహక, సైనిక రాజకీయ శాఖలలోని కీలకస్థానాలనన్నిటనీ, ఆంగ్లేయులే అంటిపెట్టుకొని, ఉండడంవల్ల, బ్రిటీషువారి వాగ్దానాలపట్లను, వారి ప్రకటనల పట్లను, భారతీయులకు విశ్వాసం నశించింది. బ్రిటీషువారి ఉద్దేశాల విషయంలో ఏర్పడియున్న భ్రాంతి నశించి, నైరాశ్య మేర్పడింది. సామ్రాజ్యగర్వం పరిపాలకుల కన్నులను కప్పివేయడంవల్ల, తాముచేస్తున్న వాదము లెంత అసంబద్ధములైనవో గుర్తించలేక పోయినారు.

**ఇల్బర్ట్ బిల్లు వివాదము :** సామ్రాజ్య సేవలోని ఉన్నతపదవుల విషయమై భారతీయుల హక్కులను గూర్చిన వివాదం జరుగుతున్నది. అటువంటి సందర్భంలో జరిగిన ఒక సంఘటన, పరిపాలకుల జాతి దురహంకారాన్ని అంతటినీ పైకి తెచ్చింది. ఇండియా నివాసులైయున్న పాశ్చాత్యులపై, భారతీయ న్యాయాధిపతులకు క్షేత్రాధికారమున్నదా, అనే (Jurisdiction) ప్రశ్నకు ఈ సంఘటన సంబంధించినది. ఒప్పందపుసేవకు చెందిన భారతీయాధికారుల క్షేత్రాధికారాన్ని, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్‌లోని ఒక ప్రకరణము, నిర్బంధంగావించి, (Restricted), అధికారాన్ని పరిమితంచేసి ఉంది. ఇది న్యాయరీత్యా అసంగతమైనటువంటిది. కనుక, దీనిని సరిదిద్దే నిమిత్తము, న్యాయపాలన సభ్యుడైన సర్ కూర్ట్నీ ఇల్బర్ట్ (Sir Courtny Ilbert) ఒక ప్రతిపాదనను ప్రవేశపెట్టినాడు. విప్లవానంతరయుగంలో, ఆంగ్లేయులకు దేశీయులతో సమానతను సూచించే మాటను ఉచ్చరించడంకూడా ప్రమాదకరమైనదే. ఒకే పద్ధతిపై ఉద్యోగాలకు

ఎన్నికై, ఒకే సర్వీసుకు చెందిఉన్నవారైనా, భారతీయాధికారులకు ఆంగ్లేయాధికారులతో సమానమైన అధికారం కల్పించబూనడం, - ఆంగ్లసామెత ననుసరించి, "ఎద్దుముందట ఎర్రగుడ్డను చూపడం"వంటిది. ఆంగ్లోఇండియనులు రాబర్టు ప్రభువు ప్రకటించిన భావాన్ని ప్రతిజ్ఞగా, గ్రహించి, బిల్లుకు విరోధులైనారు. "ఇండియా దేశీయుణ్ణి ఎంత ఉన్నతపదవిలో మనము నిలిపినప్పటికీ, ఆ పదవి బ్రిటీషు అధికారులతో సమానత్వాన్ని అతనికి కలిగించలేదు." - అని రాబర్టు ఇదివరలో వ్రాసియుండినాడు. దీనిననుసరించి, బిల్లును ప్రతిఘటించడానికి ఆంగ్లోఇండియనులు పూనుకొన్నారు.

తమపై వచ్చిన అభియోగాలను, ఇంతవరకూ యూరోపియను దండనాధికారులు, యూరోపియను న్యాయాధిపతులు మాత్రమే విచారణచేయడం జరుగుతూ వచ్చింది. అటువంటి విశిష్టమైన హక్కును ఈ బిల్లుద్వారా తొలగించడానికి ప్రయత్నించినాడు ఉదారవాదియైన రిప్పన్ ప్రభువు. ఉన్మాదాత్మకమైన ఆందోళనను ప్రారంభించింది ఆంగ్లోఇండియన్ వర్గము. బహిరంగసభలు జరిపి, తీవ్రమైన భాషలో బిల్లును నిరసించినారు. బ్రిటీషువారి వ్యక్తి స్వాతంత్ర్యానికి హానికలుగగలదని, బ్రిటీషు మూలధనం మాయమైపోగలదని, భయభ్రాంతులను కలిగించి, ప్రభుత్వాన్ని బెదరించడానికి పూనుకొనినారు.

జిడ్డువంటివాడు, సర్పమువంటి మాయావి, అబద్ధములైన నిందలు మోపేవాడు, - మొదలైన పదాలతో బెంగాలీలను (బెంగాలీబాబులు) దూషించినారు. బర్ద్వాన్ విభాగానికి కమీషనరుగానుండిన, బీమ్స్, బెంగాలుప్రభుత్వ కార్యదర్శికి, ఈ కింది విధమైన జాబును వ్రాసినాడు

"దేశీయులను, నాదేశంవారితో సమానమైన పదవులలో ఉండటానికి సమ్మతించడమే మా హృదయాలను దహించి వేస్తున్నది. జీవనఘర్షణలో, ఇదివరకే, ప్రతికూల పరిస్థితులలోనున్న ఆంగ్లేయుడు, దేశీయ దండనాధికారులచే దోషిగా విచారణ గావింపబడడం, అతనిని కుంగదీయకతప్పదు. ఇదివరకే మోయలేని భారంతో కుంగిఉన్నదానిపై గడ్డిపోచవేయడం కూడా సహించరానిదే."

ఈ విషయమై దండయాత్రవంటి ఆందోళన ప్రారంభమయింది. 'రక్షణ సమితు' లేర్పడినవి. ప్రభుత్వవిధానంపై గావించిన విమర్శలతో పత్రికలు నిండిపోయినవి. కలకత్తాలోను, పరిసరపట్టణాలలోను బహిరంగసభలు జరిగినవి. రాజప్రతినిధికి, ఇండియా ప్రభుత్వ కార్యదర్శికి, పార్లమెంటుకు, మహజర్లు పంపబడినవి. ఇంగ్లాండులోని పౌరులకు ఈ విషయాన్ని వివరించిడానికిగాను, ఒక ఏజెంటును పంపడంకూడా, జరిగింది. ఉద్యోగంనుంచి విశ్రాంతి దీసుకొన్న సర్ జేమ్స్ స్టీఫెన్స్, సెటన్‌కార్, వంటివారు ఈ ఆందోళనకు సహకారాన్నందజేసినారు.

ఇంకొకవైపు, బ్రిటనుప్రభుత్వాన్ని వహించియుండిన ఉదారవర్గంవారు, వారిపత్రికలు, ఈ బిల్లును సమర్థిస్తూ అందులోని న్యాయరక్షణకై పూనుకొనినారు. బిల్లును ఉపసంహరించుకొన్నట్టయితే, "దేశంలో అసంతుష్టి పెరగడం, ప్రభుత్వంపట్ల అపనమ్మకము, ద్రోహభావము అధికంకావడం తప్పదని," బ్రైట్,

హెచ్చరించినాడు.

ఈ బిల్లుకు ఆధారమైన ప్రభుత్వవిధానము నూతనమైనదికాదు. పార్లమెంటు ఇదివరకే దీనిని నిశ్చయించియున్నది. ఇండియా ప్రభుత్వకార్యదర్శి పదవిలో ఉన్న చాలామంది దీనిని సమర్థించియున్నారు. లిట్టన్ 1879 లో, రచించిన సూత్రాలను వర్తింపజేసిరయే ఈ బిల్లు ఏర్పడింది, - అని, రిప్పన్, వివరించినాడు. తాను, స్వయంగా ఈ విధానాన్ని సమర్థిస్తున్నానని, అందుకుగల కారణాలను వివరించియున్నాడు. "న్యాయబద్ధమైన ప్రవృత్తి జాతికి అత్యుచ్ఛ్రయాన్ని కలిగిస్తుందని, నేనొక గ్రంథంలో చదివియున్నాను. మహాసామ్రాజ్యాన్ని శాశ్వతంగా రక్షించి స్థిరపరిచేవి, సైన్యబలము, సైనికుల శౌర్య సాహసాలుకావు. ధర్మన్యాయ బద్ధములైన న్యాయపాలన విధానము, న్యాయరక్షణపట్ల మనకుగల గౌరవ ప్రపత్తులు మాత్రమే సామ్రాజ్యాన్ని రక్షించే మహాశక్తులు, అనే నిర్ణయము చరిత్రాధ్యయనంవల్ల నాకు ఏర్పడింది." అని రిప్పన్ ఉద్బోధించినాడు. కాని, ఉదారవర్గంవారి హెచ్చరికలు నిష్ఫలములైనవి. హేతువాదాన్ని, న్యాయాన్ని, అనుసరించవలసిందని భారతీయులు గావించిన ప్రార్థనలు వ్యర్థములైపోయినవి

ఆంగ్లేయుల విశేషపు హక్కులను రక్షించేనిమిత్తము బిల్లును ప్రభుత్వం మార్చవలసివచ్చింది. ఈ ఉదంతము, పరిపాలక జాతికి, దుష్కీర్తినీ, అప్రతిష్ఠను, తెచ్చిపెట్టింది. పాశ్చాత్యులకు, భారతీయులకు సమానతను కలిగించడానికై తీసుకొన్న ఇంత స్వల్పమైనచర్య, ఆంగ్లోఇండియన్ వర్గంవారిలో ఇంతటి విస్తృతమైన విద్వేషాన్ని ప్రేరేపించడం, అత్యాశ్చర్యకరమైనది. వీరి ఆందోళనకు ప్రభుత్వం, తలవంచి, లొంగిపోయి, అవమానానికి గురికావడం, అంతకంటె విచిత్రమైన విషయము.

## VI. ప్రాతినిధ్య ప్రభుత్వము

దేశంలోని విద్యావంతులకు, పరిపాలక ప్రభుత్వానికి జరుగుతున్న వివాదాలలో అతి ముఖ్యమైనది ప్రాతినిధ్య ప్రభుత్వానికి సంబంధించినది. ప్రభుత్వ పరిపాలనలో, దేశీయులు పాల్గొనే అవకాశం కలిగించే ప్రజా ప్రాతినిధ్య సంస్థలను ఏర్పరచ వలెనని, ప్రభుత్వాన్ని విద్యావంతులు ఒత్తిడిచేస్తూ వచ్చినారు. 1857కు పూర్వము, దీర్ఘదృష్టిగల ఆంగ్లేయు లనేకులు, జెరిమీ బెంథామ్‌యొక్క ఉదార తత్త్వవాదాన్ని అనుసరించినవారు, అధీన రాజ్యాలవల్ల బ్రిటీషు వాణిజ్యానికి ప్రయోజనం కలగదని గ్రహించిన పర్యాలోచన శీలురు,—మొదలైన వాళ్ళంతా బ్రిటీషు ప్రభుత్వ రక్షణలోనున్న ఇండియా, ఎన్నడో ఒకనాడు స్వతంత్రదేశంగా ఏర్పడుతుందని, విశ్వసించేయున్నారు. బ్రిటీషు పరిపాలన, ఇండియాకు పరమ శ్రేయమైనదని వారెప్పుడూ భావించలేదు. కనుక, బ్రిటీషు సామ్రాజ్యం నుంచి భారతదేశం విడిపోతుందన్న భావంవల్ల వా రలజడి చెందనూలేదు.

కాని, 1857 అనంతరము, ఇట్టి ఉదారాభిప్రాయాలుగల వ్యక్తులసంఖ్య

ముఖ్యంగా, ప్రభుత్వవర్గం వారిలో తగ్గిపోయింది. ఐనప్పటికీ, కాబ్డెన్, బ్రైట్, హాబ్సన్‌వంటి ఉదార వర్గనాయకులు, సామ్రాజ్యాధిపత్యాన్ని ఖండిస్తూ వచ్చినారు. ఇండియాను శాశ్వతంగా పరిపాలించగల సామర్థ్యం బ్రిటను దేశానికి కలదని హాబ్స్‌కు నమ్మకం లేదు. దానినతడు వ్యక్తం చేసినాడు కూడ. పార్లమెంటు కధీనమై యున్న బ్రిటీషు సార్వభౌముడు, ఏషియాలో నున్న కోట్ల కొలది విజాతీయ జాతులను పరిపాలించడానికి చేసే ప్రయత్నము, తప్పక విఫలమవుతుందని, కాబ్డెన్ అభిప్రాయము. కనుక, "హిందూస్థాన పరిపాలన, భూభాగం లోని వారిచే జరగవలసి ఉన్నది. ఏ జాతి వారైనా, తమ వర్గము, తమ జాతి, తమ వర్గమువారి పాలనకు, ఇష్టపడతారు. ఆ పరిపాలన,—మన అభిప్రాయ ప్రకారం మంచిది కాకపోయినా వారికి బాధలేదు. తాము నివసించే భూభాగానికి ప్రతిధ్రువస్థమై (Antipodes) యున్న ప్రాంతంలోని విజాతీయులు, తాత్కాలికంగా, తమకు కల్పించే ఉత్తమ ప్రభుత్వాని కంటె, తమ జాతివారి ప్రభుత్వ మెటువంటిదైనా వీరి కభ్యంతరం లేదు. ఇది మానవ స్వభావము" అని, ఇతడు తన అభిప్రాయాన్ని వివరించియున్నాడు.

"విజ్ఞానాత్మకమైన రాజ్యాంగ నీతి నవలంబించి, నాగరకమైన సహాయాన్నిస్తూ, సహజమైన మార్గంలో స్వయంపరిపాలక ప్రభుత్వ స్థాపనకు, దేశ పరిస్థితుల కనుగుణమైన పరిశ్రమల స్థాపనకు పూనుకోవడం విదేశ ప్రభుత్వంయొక్క ఆశయమైతే, అటువంటి ప్రభుత్వాన్ని సమర్థించవచ్చు" అని హాబ్సన్ అభిప్రాయ పడినాడు. ఇతడు పేర్కొన్న రెండు షరతులూ బ్రిటీషు పరిపాలనలో, లోపించినవి. కనుక, ఇండియాను సామ్రాజ్యంలోని భాగంగా నిలుపుకొనే శక్తి సామర్థ్యాలు బ్రిటీషు ప్రభుత్వానికి లేకపోయినవి.

స్వపరిపాలనాభివృద్ధికి సంబంధించిన విషయమై, హాబ్సన్, "పాశ్చాత్య ప్రభుత్వ పద్ధతుల పరిజ్ఞానాన్ని, అసంఖ్యాకులై యున్న భారత ప్రజలకు కలిగించే ఉద్దేశం ప్రభుత్వాధికారులకు లేదు; ఇంతవరకూ అటువంటి పనికి పూనుకొని యుండలేదు. బ్రిటిషు ప్రభుత్వంయొక్క అధీనంలో, పురపాలక సంస్థల విషయం లోను, ఇతర ప్రజాసంస్థల విషయంలోను, ఈవిషయమై గావించిన ప్రయత్నాలు విఫలములైనవని, అందరూ విశ్వసిస్తున్నారు" అని వివరించినాడు.

1857 తరవాత సార్వత్రికంగా ఏర్పడిన అసంతృప్తిభావము ప్రాచీన పద్ధతులలో నిరంకుశంగా జరుగుతున్న పరిపాలన ఫలితంగా అధికమై, దేశమంతటా వ్యాపిస్తూ వచ్చింది. దేశ ప్రజలపై విశ్వాసముంచి, దూరదృష్టితో వారి సంకల్పానుసారంగా, శాసనసభలను ప్రజాప్రాతినిధ్యంపై ఏర్పరచడం, రాజకీయ వివేకమనే భావము, ప్రభుత్వానికింకా కలుగలేదు. ప్రజాప్రాతినిధ్యాన్ని గురించిన ఈ ప్రజలకోరిక, రాజకీయ కార్యక్రమాలన్నిటిలోనూ, ప్రతిధ్వనిస్తూ, కాలం గడచేకొద్దీ, విస్తృతమవుతూ వచ్చింది. ఈ కోరిక స్వాభావికమైనది కావడంవల్ల, కొందరు అధికారులుకూడా దీనిని సమర్థించినారు. సర్ ఛార్లెస్ ట్రెవిలియన్, సెలెక్టు కమిటీ ఎదుట సాక్ష్యమిస్తూ 1873 లో, ఈక్రింది విధంగా వివరించినాడు.

"ఇతర దేశాల పరిపాలనలో వర్తింపచేయబడిన పరిపాలన సూత్రమే, భారతదేశంలోకూడా వర్తించవలెననీ, ప్రజా ప్రాతినిధ్యము, ప్రభుత్వము విధించే పన్నులకు అనుగుణమై ఉండవలెననీ నా అభిప్రాయము." వారి దేశంయొక్క ఆదాయాన్ని వారే సేకరించుకొని, వినియోగించుకొనే అధికారం వారికి కలిగించడం సమంజసమని ఆయన వాదించినాడు. "అటువంటి విధానము భారతదేశానికంతటికీ స్వపరిపాలన శిక్షణనిచ్చే విద్యాసంస్థగా ఏర్పడగలదు. ఇరవై కోట్ల ప్రజానీకంగల భారతదేశంతో మనకు సంబంధమేర్పడింది. ఈ సంబంధంవల్ల, స్వపరిపాలన విధాన పరిజ్ఞానంవారికి సిద్ధించినట్లయితే, మన ఆశయము, మన తుది ప్రయత్నము సఫలమవుతాయి. అటువంటి ప్రయోజనసిద్ధికి, ఈ మార్గము, దీర్ఘమైనదే అయినా, సమర్థమైనట్టిది."

ట్రెవిలియన్ ఒక్కడేకాక, ఇటువంటి అభిప్రాయాలను వ్యక్తం గావించినవారింకా కొందరున్నారు. కాని, వారి సలహాలు, వాదనలు అరణ్యరోదనములై పోయినవి. అధికారం నిర్వహిస్తున్నవారి అభిప్రాయాలు, ప్రయోజనాలు వేరు. కనుక, పరిస్థితులు మారి, తప్పనిసరి పరిస్థితు లెదురైనంతవరకు ప్రజల కోరికలు, మృతప్రాయములై నిలిచిపోయినవి. కాబట్టి, ఆపై నలభై సంవత్సరాల వరకు, స్వపరిపాలన విధానాన్ని ప్రారంభించడానికి ప్రభుత్వంవారు ప్రయత్నించలేదు నూతన సామ్రాజ్య విధానమేర్పడిన అనంతర కాలంలో (1861), స్వపరిపాలన ప్రభుత్వమనే ప్రశ్న, - పూర్తిగా తిరస్కరించబడింది. శ్వేతజాతుల విషయంలోతప్ప, ఇతర జాతుల విషయంలో ఈప్రశ్నకు ప్రభుత్వవర్గంలో ఆస్కారమే లేదు. సామ్రాజ్య శాసనసభను విస్తరింపజేసే ప్రతిపాదన విషయమై, క్యానింగు, ఇండియా ప్రభుత్వ కార్యదర్శియైన, వుడ్‌కు వ్రాస్తూ (1853), "దేశీయులను ప్రవేశపెట్టడం, నాకు అభీష్టమైనదే. అయినా, అట్లా సభ్యత్వం పొందే వ్యక్తి, ప్రభుత్వం నియమించినవాడై ఉండవలెనేకాని పాశ్చాత్య సంస్థ కాని, దేశీయ సంస్థకాని, ఎన్నుకొని పంపిన వ్యక్తిని సభ్యుడుగా చేర్చుకోవడం, కార్యసాధ్యంకాని విషయము." అని తన అభిప్రాయాన్ని సూచించియున్నాడు. ఇండియా మొత్తానికే ఒకటిగా ఏర్పడియున్న, సాధారణ శాసనసభను రద్దుచేసి, ప్రతి రాజధానికినీ, ప్రత్యేకములైన శాసన సంఘాలను ఏర్పరచవలసిందని, సలహా యిచ్చినాడు. కాని, తరవాతకాలంలో ఉన్నత శాసనసభను రద్దుచేయకుండా నిలిపి ఉంచడానికి, దానిలో "ఆంగ్లీయత పొందని దేశీయులకు వ్యావహారిక భాగాన్ని కల్పించడానికి" అంగీకరించినాడు.

ప్రాతినిధ్యంతో కూడిన సంస్థలు ఇండియాలో కార్యకారులు కాజాలవని, కార్యనిర్వాహక ప్రభుత్వానికి బాహ్యములైన అంశాలు హానికరము కాగలవని, వుడ్, అభిప్రాయపడినాడు. కాని, సుప్రీం శాసనసభను, పరివర్తన మొనరించడానికి, మదరాసు, బొంబాయి రాజధానులకు శాసన పరిషత్తులను ఏర్పరచడానికి, కడపటికి ఒప్పుకొన్నాడు. బెంగాలు, పశ్చిమోత్తర ప్రాంతాలు, పంజాబు, - వీటిలో ప్రాంతీయ పరిషత్తుల నేర్పరచే, అధికారము, గవర్నర్

జెనరల్‌కు కలుగ జేసినాడు.

శాసన నిర్మాణము నిమిత్తం ఏర్పడియున్న కార్యనిర్వాహక సభల సలహా సంఘాలే విస్తరింపబడినవై, శాసనసభలుగా ఏర్పడినవి. శాసన నిర్మాణ కార్య క్రమంలో, దేశీయులను చేర్చుకోవడం ఆవశ్యకమై ఉన్నందువల్ల, సామంత రాజ్యాల ప్రభువులు, లేక, వారిమంత్రులు, లేక, భూసంపదగల వర్గాలవారి ప్రతి నిధులు, శాసన సభ్యులుగా నియామకులవుతూ వచ్చినారు. ఈ పద్ధతి, మొదటి రోజులలో అవలంబించబడినది. సర్ సయ్యద్ అహమద్ ఖాన్, సర్ జ్యోతీంద్ర మోహన్ టాగోర్, ఇంకా యితరులు, ప్రభుత్వనియామక సభ్యులుగా పరిషత్తు చర్చలలో పాల్గొనినారు.

ఈ పరిషత్తులకు మరి యేవిధమైన ఆధిపత్యమూ లేదు. ప్రభుత్వమవలం బించిన కార్యనిర్వహణాన్ని గూర్చి, చర్చించే అధికారంకూడా వీరికిలేదు. ఈ విధంగా, పరిమితమై యుండిన ఆధిపత్యానికికూడా, సంవిధానం ద్వారా సిద్ధించి యున్న స్థానాన్ని పురస్కరించుకొని, ప్రభుత్వం, హద్దుల నేర్పరుస్తూ వచ్చింది. కార్యనిర్వాహక విషయాలలోను, శాసననిర్మాణ విషయంలోనూ, ఇండియా వ్యవహారాలన్నిటిలోనూ తుదినిర్ణయ నిర్దేశాలు, ఇండియా ప్రభుత్వ కార్యదర్శి అధీనంలో ఉండడం, ఇందుకు ముఖ్యకారణము.

శాసన పరిషత్తులను ప్రజాస్వామ్యములుగా చేసే ప్రయత్నము, తరవాత ముప్పై సంవత్సరాలదాకా, జరగలేదు. శాసన పరిషత్తు లేర్పడిన ఒక సంవత్సరం తరవాతకూడా, నిజమైన ఇండియా ప్రజాభిప్రాయానికి ప్రాతినిధ్యం కలగడం సాధ్యంకాదని, వుడ్, ఎల్జిన్‌కు, వ్రాసియున్నాడు. "ఇంగ్లాండు ఆధిపత్యానికి లోబడి, నడపబడే నిరంకుశ ప్రభుత్వ మొక్కటే ఇండియా పరిస్థితులకు తగిన ప్రభుత్వము."

బాధ్యతాయుతములైన శాసనపరిషత్తుల నిర్మాణవిషయంలో, అధికారు లిటువంటి హఠవాదానికి పూనుకొనిఉండగా, ఇండియాలోని వ్యతిరేక సంఘట నలు ప్రబలములౌతూ వచ్చినవి. తత్పర్యవసానంగా, ప్రజలకోరికలను ప్రభుత్వం గమనించవలసి వచ్చింది. 1870 - 80 ప్రాంత కాలము అధికమౌతున్న దుస్థితికి, అలజడికి ఆకరమైనది. శతాబ్దంలో, ఎన్నడూ కలుగనట్టి దురంత క్షామము లేర్ప డినవి. దేశీయ ప్రభువులతో సంబంధంకూడా ప్రభుత్వానికి వ్యాకులాన్ని కలిగిస్తూ వచ్చింది. ఆ రాజ్యాల ఆంతరంగిక వ్యవహారాలలో బ్రిటీషువారు అధికంగా జోక్యం కలుగ జేసుకొంటూ వచ్చినారు. ప్రభుత్వానికి సహాయకవర్గంగా భావించ డానికి మారుగా, దేశీయ ప్రభువులను అధీనస్థితికి దెచ్చినారు. మలహార్ రావ్ గయక్వాడ్‌ను 1875 లో పదవీభ్రష్టుని గావించడంవల్ల, ప్రజాభిప్రాయం కలుషిత మయింది. ఫ్రాంసును జర్మనీ జయించడం, ప్రాగ్దేశాలను రష్యా ఆక్రమించడం,- వీటి ప్రభావం భారతదేశంలోకూడా, ప్రసరించింది. ప్రపంచంలో జరిగిన ఈ సంఘ టనలలో, బ్రిటనుకూడా ప్రవేశించి, ఇండియాకుకూడా వీటితో సంబంధం కల్పిం చింది. మధ్య ఏషియాలో దండయాత్రలు, ఆఫ్గనిస్థానుతో జరిపిన దురంతము

లైన యుద్ధాలు, బాల్కాను ప్రాంతంలో కూడా యుద్ధానికి పూనుకొంటారనే భయము, - మొదలైనవన్నీ ఇండియాలో వ్యతిరేకభావాన్ని ఉద్రేకపరచినవి. ముస్లిముల సంశయాలు, భయాలు, వీటివల్ల ఉద్రిక్తములై, ప్రపంచ ఇస్లామిక్ ఉద్యమాన్ని లేవదీసినవి.

ఇండియాలో ఏర్పడినటువంటి తీవ్రపరిస్థితిని గూర్చి, హ్యూమ్ 1872 లో నార్త్ బ్రూక్‌ను హెచ్చరించినాడు. "మనకు, మన వినాశానికి మధ్య, సైనికుల ఆయుధములు మాత్రమే ఉన్నవి. సామ్రాజ్యంయొక్క భవిష్యత్తు త్రాసులో నిలిచి, ఇటో ఆటో, మొగ్గటానికి సిద్ధమైయున్నది." "మనప్రజల అభిప్రాయాల పట్ల, వారి కోరికలపట్ల, కొంత గౌరవభావాన్ని క్రమంగా పరిపాలన వ్యవస్థలో ప్రవేశింపజేయవలసిన అవసరాన్ని గురించి, తాము యోచించవలసిందని ప్రార్థిస్తున్నాను." అని గవర్నర్ జెనరల్‌కు హితబోధ గావించినాడు.

కాని, హ్యూమ్ సలహాలు, ప్రభువు చెవులలో, దూరలేదు. భారతదేశానికి స్వపరిపాలన కల్పించడమనే సూత్రాన్ని, ఇంగ్లీషు పాలకవర్గము, అంగీకరించ దలుచుకోలేదు. బాధ్యతాయుత ప్రభుత్వానికి భారతీయులు యోగ్యులుకారని, లిట్టన్, ఇదివరకే ప్రకటించియున్నాడు. 1880 లో, సర్ రిచర్డ్ టెంపల్, "విద్యావంతులైన దేశీయులుకూడా స్వపరిపాలనను కాంక్షిస్తున్నారు. రాజకీయాధికారాన్ని ప్రాతినిధ్య సంస్థలను ఆశిస్తున్నారు. కాని, ఈ విశేషాధికారాలను వారికి కల్పించడం, ప్రస్తుత కార్యాత్మక రాజకీయాలకు సాధ్యమైనది కాదు." అని వ్రాసియున్నాడు.

దేశాన్ని గూర్చిన పర్యాలోచనశక్తి, దేశంయొక్క ప్రయోజనాలను గూర్చి వాదించే సామర్థ్యము, విద్యావంతులలోనే, నిహితమైయున్నది; వీరిని ప్రజలు తమ సహజ ప్రతినిధులుగా అంగీకరించి, తమ నిష్ఠావిశ్వాసాలను వారిపై యుంచియున్నారు; కనుకనే, వీరి ప్రయత్నాలు జాతీయోద్యమంగా పరిణమించినవి, - అని ఈ విధంగా, కాటన్, గావించిన వాదన తిరస్కృతమయింది. "విద్యావంతుల సంఘము, ప్రభుత్వంపై భక్తి విశ్వాసాలు కలిగియున్నది కనుకనే, బ్రిటీషు పరిపాలనయొక్క లాభాలను వారు గుర్తించగలిగినారు; బ్రిటీషువారి ఔన్నత్యాన్ని క్రిందుబరచవలెననే ఉద్దేశ్యంకూడా వారికి లేదు. ప్రభుత్వాధికారం నుంచి బహిష్కరించబడియున్నందున వారికి వ్యతిరేకభావం ఏర్పడింది. ప్రభుత్వం గంభీరంగా ఇచ్చిన వాగ్దానాలు పునరుక్తములైనవేకాని, ఆచరణలోకి రాలేదు. బుద్ధిపూర్వకంగా, అధికారులు, వాటిని అమలు జరుపలేదు. పాశ్చాత్యులు భారతీయులను నిరసన భావంతో, తిరస్కరిస్తున్నారు. ప్రజలుకోరుతున్న ఉత్తమ ప్రయోజనాలను దురహంకారంతో తిరస్కరించి, త్రోసివేస్తున్నారు. ప్రజల వ్యతిరేకత కంతటికీ ఇవి కారణాలు." అని కాటన్ చేసిన వాదము నిష్ప్రయోజనమయింది.

ఇండియా ప్రభుత్వ కార్యదర్శిగా ఉన్న 'హార్టింగ్‌టన్' కు 1881 లో, రిప్పన్, ఈ విధమైన సలహాను పంపినాడు. "ఎన్నికలలో, ఉత్తీర్ణులైన వ్యక్తు

లను కొంతమందిని శాసన పరిషత్తులలో ప్రవేశింపజేయడం, వాంఛనీయమైన సంస్కరణము. ఇండియా దేశస్థులకు, దీనివల్ల, రాజకీయ పరిజ్ఞాన మేర్పడుతుంది. ప్రజల అభిప్రాయాలను, ఉద్దేశాలను, తెలుసుకొనే అవకాశం ప్రభుత్వానికి సిద్ధిస్తుంది. అంతేకాక, ప్రభుత్వంయొక్క నిజమైన ఉద్దేశాలను ప్రజలకు వివరించి, వారి దురభిప్రాయాలను తొలగించే సాధనం కూడా ఇందువల్ల, ఏర్పడగలదు". కాని హార్టింగ్టన్, ఈ సలహాను త్రోసి పుచ్చినాడు.

ఈ మధ్యలో, రాజకీయాందోళన ప్రబల శక్తిమంతము, వేగవంతము, కాజొచ్చింది. ఇండియా సివిల్‌సర్వీసు పరీక్షలకు వయస్సును తగ్గించిన విషయమై, ఆక్షేపిస్తూ, సమస్త భారతాభిప్రాయాన్ని సంయోజన పరచే నిమిత్తము, 1877-78 లో, సురేంద్రనాథ బెనర్జీ, భారతదేశ పర్యటనకు పూనుకొన్నాడు. ప్రాంతీయ రాజకీయ సంస్థలు, బహిరంగసభలు జరిపి, ప్రభుత్వచర్యను ఆక్షేపించినవి. రాజకీయోద్యమానికి ప్రాముఖ్యం వహించిన, భారత జాతీయ కాంగ్రెసు, బాధ్యతాయుత ప్రభుత్వ విషయమై ప్రజల ఆశలను, ఉత్కాంక్షలను, తీవ్రంగా ప్రచారం చేయసాగింది. మొదటి సమావేశంలో ఈ విషయమై తీర్మానాన్ని పారితం గావించింది. "ప్రజలచే ఎన్నుకొనబడిన వ్యక్తులను, ఎక్కువ నిష్పత్తిలో ప్రవేశపెట్టి, సుప్రీం శాసనసభను, ప్రస్తుత స్థానిక శాసన పరిషత్తులను సంస్కరించడం అత్యావసరము". ఇటువంటి తీర్మానాలనే ప్రతి సంవత్సరము, కాంగ్రెసు ఆమోదిస్తూ వచ్చింది.

కాని, అధికారీతంత్రానికి లోనై యున్న, ప్రభుత్వ మెటువంటి ప్రతిక్రియ చర్యకూ పూనుకోలేదు. పరిస్థితులను పునరావర్తనం గావిస్తూ ఈ కిందివిధంగా వ్రాసియున్నాడు. "ఓ కానెల్ పద్ధతిలో సంఘా లుత్పన్నములైనవి. గుప్త కూటములు స్వాభావికము లైనవి. అభ్యుదయవాదుల ఆందోళన ప్రక్రియలన్నీ ఇండియాలో, ప్రయోగింపబడుతున్నవి. వివేచన, న్యాయము, మితవాదిత్వము, —— అన్నవి కెల్టిక్ పార్లమెంటుయొక్క లక్షణాలు కాజాలవనే విషయం తెలిసినదే. అటువంటప్పుడు, బెంగాలు బాబూల పార్లమెంటు ఎట్లా ఉంటుందో ఊహించుకోవచ్చు." కాంగ్రెసు సంస్థయొక్క ఉద్దేశాలు, వారవలంబించే పద్ధతులు, ఎలాంటివన్న విషయాన్ని, ఇతని కార్యదర్శి నిశ్చయించి, ఈ విధంగా వివరించియున్నాడు. "తెలివి, చురుకుదనము గల బెంగాలీబాబుల ఒక అల్పవర్గము ఒకరిద్దరు ఆంగ్లేయుల సహాయంతో, రాజకీయాందోళనను లేవదీసి, సంయోజనపరచి, దేశంలోని అన్నిభాగాలలోనూ వ్యాపింపజేయడానికి ప్రయత్నిస్తున్నది." కాంగ్రెసు సంస్థనుగూర్చి వారి అభిప్రాయమిటువంటిది. ఇండియా రాజకీయ వ్యవస్థలో మార్పు తేవడం, కార్యసాధ్యమైనది కాదనే విషయము ఇండియానుగూర్చి తెలిసినవారందరూ గుర్తించగలరు, అని రూఢివాదవర్గంవారి ప్రచారసాధనమైన ప్రముఖ పత్రిక, - 'లండన్ టైమ్సు'- వ్రాసింది.

అలీఘర్ మహమ్మదీయ కళాశాలాధ్యక్షుడైన, బెక్, సర్ సయ్యద్ అహ

షుద్ ఖానుకు సలహాదారుడు, ఆంతరంగిక మిత్రుడు. ఇతడు ప్రతిపాదించిన నాలుగు కారణాలు, ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వా లేర్పడడానికి, దుర్లంఘ్యము లైన ప్రతిబంధకాలైనవి. భారత జాతీయ కాంగ్రెసు భావాన్ననుసరించిన ప్రాతినిధ్య ప్రభుత్వము కేవలం ఆభాస ప్రాతినిధ్యంగా ఏర్పడుతుందని అతడు భావించి నాడు. ఆంగ్ల విద్యావంతులైనవారికి మాత్రమే, ఇటువంటి ప్రాతినిధ్యం సహిస్తుంది. కనుక, ప్రజానీకంలో అత్యల్ప శాతమై ఉన్న ఈ విద్యావంతుల ప్రాతినిధ్యంతో ఏర్పడిన ప్రభుత్వము, ఒక విధమైన అల్పజన పరిపాలనమవుతుంది.

బెక్ సలహాననుసరించి, ప్రాతినిధ్య ప్రభుత్వ నిర్మాణాన్ని ప్రతిఘటిస్తూ, విద్యావంతులైన ముస్లిముల సంఘమొకటి యేర్పడింది. ఇండియా దేశము ఒక జాతికాదు ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వమేర్పడితే, అధికసంఖ్యాకులైన హిందువుల వర్గము అల్పవర్గమైన ముస్లిములను అణచివేస్తుంది కనుక, పరిపాలన విధానము, అధికారము, పాశ్చాత్యుల అధీనమైఉండడం ముస్లిముల శ్రేయస్సుకు అనుకూలమైనది.

రాజకీయ పురోభివృద్ధికి ఇందరు ప్రబల విరోధులున్నా, ప్రత్యక్షంగా దేశంలో కనబడుతున్న విషయాలను చూడకుండా ప్రభుత్వాధికారులు పూర్తిగా కండ్లు మూసుకొని ఉండలేకపోయినారు. బాధ్యతాయుత ప్రభుత్వాని కున్ముఖమై యున్న ప్రయత్నాలను వ్యతిరేకించి నిలిచినా, ఉదాసీనభావంతో ఉండడం సాధ్యంకాదని గుర్తించినారు. ప్రాతినిధ్య ప్రభుత్వ భావాన్ని "బాబూ పార్లమెంటు" అని హేళనజేసిన' డఫ్ఫెరిన్ కూడా, ఇప్పుడు తన భావాన్ని మార్చుకోవలసి వచ్చింది. ఎన్నికలలో వచ్చిన వ్యక్తులను శాసనపరిషత్తులలో ప్రవేశింప జేసే విషయమై, తానొక ప్రణాళికను తయారుచేసి, ఇండియా ప్రభుత్వ కార్యదర్శికి పంపుతున్నానని నార్త్‌బ్రూకు ప్రభువుకు వ్రాసియున్నాడు.

ఆ పైన పదిరోజుల తరవాతే, 'క్రాస్' కు వ్రాస్తూ "గలభానంతటనీ లేవదీస్తున్నది బెంగాలీబాబూలు మాత్రమేకారు. విద్యావంతులైన భారతీయులందరూ, ముస్లిములతోసహా, ఇందులోచేరి ఉన్నారు. తమదేశ వ్యవహారాలలో తమ అభిప్రాయాలు కూడా గమనించబడవలెనని ఆతురతతోనున్నారు. వీరందరూ అలజడికి పూనుకొని, యున్నారు." "అయినా, నిరంకుశ ప్రభుత్వమైన మన పరిపాలక వర్గము రెండులక్షల పైనికులతోకూడిన సైన్యసహాయంతో ఇంకా కొంత కాలం, వీరికోరికలను నిర్లక్ష్యం చేయగలదు. కాని, అట్లా చేయగలగడం కొంత కాలంమాత్రమే." అనికూడా తన జాబుకడపట చేర్చినాడు.

కేంబ్రిడ్జి ట్రినిటీ కళాశాల అధ్యక్షునికి కూడా ఈ విషయమై ఇతడొక జాబును వ్రాసియున్నాడు. "ఇండియా దేశాన్ని పరిపాలించడం రోజురోజుకూ కష్టమౌతూ వస్తూ ఉంది. అది ఇప్పుడు ప్రత్యేకమైన భూభాగంగాలేదు. భారత దేశమొక శక్తివంతమైన భూ ఖండంగా ఏర్పడినది. ప్రబలమైన ఆక్రమణశక్తి ఇండియా ప్రవేశద్వారంలో కాచుకొని ఉన్నది. ఇంకొకవైపు, ఉన్నత విద్యావంతుల వర్గము,—కొన్ని విషయాలలో,—సమర్థమైన మేధావంతుల వర్గం ఒకటి,

గత 30 సంవత్సరాలలో సృష్టికి వచ్చింది. తమ దేశ వ్యవహారాలను నిర్వహించడంలో తనుకు ప్రవేశ మేర్పడవలెనని వీరు ఒత్తిడి చేస్తూఉండడం స్వాభావికమైనదే. కనుక, రెండు విధాలచూచినా, పూర్వపు మంచిరోజులలో, నిర్వాతప్రదేశాలలో జరిగినట్లుగా, పరిపాలన వ్యవస్థ సాగడం లేదు" ఇంకా, గౌరవనీయుడైన, ఎ మెకంజీకి ఈ విధంగా వ్రాసియున్నారు. "మేధావంతులైన ఉన్నత విద్యావంతుల సంఖ్య దేశీయులలో అభివృద్ధి చెందడంవల్ల, 'హోమ్‌రూల్' వంటి ఒక ఆందోళన అతివేగంగా దేశంలో ఉత్పన్నమౌతూ ఉంది. 'హోమ్‌రూల్' ఉద్యమానికి సదృశమ్మైన, సంఘాలు, గుప్తకూటాలు, అభ్యుదయ వాదుల ఇతరమైన సాధన సామగ్రి, అన్నియు సిద్ధముల్లైయున్నవి".

శాసన పరిషత్తుల సంస్కరణ విషయంలో డఫ్ఫెరిన్ సంశయాత్మకుడై ఉంటూ వచ్చినాడు. ప్రాతినిధ్య ప్రభుత్వ విషయమై భారతీయుల కోరికలపట్ల తన భావమెటువంటిదో, కలకత్తాలో జరిగిన, సెంట్ ఆండ్ర్యూ విందులో, వ్యక్తంగావించినాడు (30-11-1888). అతడు నొక్కిచెప్పిన అంశాలు.

1. "ఇండియా ఒక సామ్రాజ్యము. అది ఒక జాతి కాదు. విభిన్న మతాలను, ఆరాధన పద్ధతులను అవలంబించి, వివిధముల్లైన భాషలను వ్యవహరిస్తూ, పరస్పర ప్రతికూలముల్లైన దురభిప్రాయాలతో, పరస్పర విరుద్ధముల్లైన సాంఘిక ప్రవృత్తులతో, ద్వేషభావంతో భిన్న ఆర్థిక ప్రయోజనాలతో, - కూడిఉన్న విభిన్న జాతులవారి సామ్రాజ్య మీదేశము".

2. "ఇండియాలో రెండు ప్రబల రాజకీయ పక్షాలేర్పడి ఉండడం, స్పష్టంగా గోచరించే ఇంకొక విశేషము. హిందూ ముస్లిముల వర్గాలే కాక, సిక్కులు, క్రిశ్చియన్లు, ఆంగ్లో-ఇండియన్లు అనే అల్ప సంఖ్యాకవర్గాలుకూడా ఇందులో ఉన్నవి".

3. బ్రిటీషు మూలధన మీదేశంలో అధికంగా, పెట్టుబడిరూపంలో నిలిచి ఉంది. కనుక, బ్రిటీషువారి ప్రయోజనాలు,-ప్రభుత్వానికి, ఇతరులకు చెందినవి,- విస్తారముల్లై ఉన్నవి.

4. గ్రేట్‌బ్రిటనుకుగల అంతర్జాతీయ సంబంధాలలో, ఇండియా, గొప్ప పాత్రను నిర్వహిస్తున్నది

5. ఇండియా ప్రజానీకంలోని అత్యధికభాగం, నిరక్షరాస్యతకు లోనై ఉన్నది. విద్యాభ్యాసం గావించినవారి జ్ఞానంకూడా ప్రాథమికమైనట్టిదే.

"20 కోట్ల ప్రజలలో, కొన్నివేల మంది మాత్రమే, తమకు సంబంధించిన ఆర్థికరాజకీయ సమస్యలలోగల గహనములు, జటిలములు అయిన, చిక్కులను గ్రహించకలిగి యున్నారు.

డఫ్ఫెరిన్ తన సిద్ధాంతానికై గ్రహించిన ఈ ఆధారవచనాలలోనే ఒక ప్రశ్న ఇమిడి ఉన్నది. భారతదేశం వంటి మహోన్నతము, బహురూపయుక్తము అయిన, సామ్రాజ్యాన్ని (multiform empire), రక్షించి, ఉద్ధరించేబాధ్యతను

భగవంతుడు ఆంగ్లేయులపై మోపినాడు. కనుక, భగవంతునికి, నాగరక ప్రపంచానికి కూడా సమాధానం చెప్పవలసిన బాధ్యత తమపై ఉన్నది. అటువంటి సందర్భాలలో, అత్యల్పమైన ఒక దేశీయ వర్గంవారికి ఈ బాధ్యతను అప్పగించి, బ్రిటీషు ప్రభుత్వము తృప్తిపడగలదని బుద్ధిమంతు డెవడైనా ఊహించగలడా ?" అనేది ఈ ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానం కూడా ఇతడే సిద్ధపరచియుంచినాడు. "గుత్తులు గుత్తులుగా ఏర్పడియున్న వివిధజాతులవారితో, వారి బహుముఖములైన ప్రయోజనాలతో, అపరిమితమైన ప్రజాసంఖ్యలో, కూడియున్న యీదేశంలో, ఇప్పటి పరిస్థితులలో, వాస్తవమైన ప్రాతినిధ్య ప్రభుత్వము, ఏర్పడజాలదు. ఏదో ఒక దాన్ని ఏర్పరచినా, అది ప్రయోజనకరము కాబోదు. కనుక, అసాధారణమై, రాగద్వేష రహితమై నిర్వికల్పమైన, బాహ్య ప్రభుత్వము, దేశాన్ని పాలించడం కంటె గొప్పవరము, వేరే ఉండదు. బ్రిటీషువారి ఆదర్శవాక్యము న్యాయము. సామ్రాజ్యంలోని ప్రతివర్గంవారి హక్కులను, ప్రతిష్ఠలను, ఇతరవర్గాలవారితో సామరస్యం పొందేవిధంగా మార్చి, శాంతిని నెలకొల్పగల శక్తి సంకల్పాలు బ్రిటీషువారికి మాత్రమే ఉన్నవి. కనుక, వివిధ వర్గాలను సుసంబద్ధమొనర్చి, సామరస్యాన్ని కలిగించి, దేశంలో శాంతిని ప్రతిష్ఠించడానికి పూనుకొన్న బ్రిటీషు ప్రభుత్వము, దైవ సంకల్పసిద్ధి." ఇవి అతని అభిప్రాయాలు. దీనినిబట్టి, దేశ వ్యవహారాలపై తమకు సిద్ధించియున్న ఆధిపత్యాన్ని, బ్రిటీషువారు వదలుకో దలచలేదని, దేశంలోని విభిన్న జాతుల క్షేమాన్ని, ప్రయోజనాలను, విద్యావంతుల అల్పవర్గ పరిపాలనకు అప్పగించడం, వారి అభిమతం కాదని విశద మవుతుంది.

దేశంలో ఏర్పడియున్న వర్గ భేదాలను, అభిప్రాయ భేదాలను చూచి, డఫ్ఫెరిన్ మురిసిపోతున్నాడు. కాని ఈ సమస్యలు ఏర్పడటానికి బ్రిటీషు ప్రభుత్వమే మూలకారణమనే విషయాన్ని గూర్చి, యోచించడాని కతనికి బుద్ధిపుట్ట లేదు. ఒకవేళ అటువంటి సమస్యలు తమంతట అవే ఏర్పడినా, వాటిని పరిష్కారం గావించే బాధ్యత, సుసంగతమైన ప్రభుత్వంపై ఉన్నదనే సామాన్య జ్ఞానంకూడా కలుగలేదు. అదీకాక, బ్రిటీషు ప్రభుత్వంవల్ల సిద్ధించబోయే లాభాలను అద్భుత వాగ్ధోరణితో వర్ణించినవాడు, దేశంలోని ప్రజలందరు బ్రిటీషు పరిపాలనపట్ల విముఖులై ఉండటానికి హేతువేమో వివరించలేదు. ప్రజలు అసంతుష్టితో ఉన్నారని ఇతడే అంగీకరించియున్నాడుకదా ! అంతేకాక, ఆంగ్లేయులు అహంభావంతో దేశీయులను తిరస్కరిస్తూ ఉండడము, అధిక వేతనంలోగల బాధ్యతాయుత అధికార పదవులనుంచి భారతీయులను బహిష్కరించి ఉండడం, తమ వ్యవహారాలను తామే నిశ్చయించుకోవడానికి దేశీయులకు అవకాశ మివ్వకపోవడం, – మొదలైన అననుకూలములైన విషయాల నెందుకు ప్రస్తావించలేదు ?

డఫ్ఫెరిన్, అనుకొన్న శాసనపరిషత్తుల సంస్కరణ అతి పరిమితమైనటువంటిది. "దేశ పరిపాలన విషయంలో అతనికి కావలసినది, బాధ్యతగల దేశీయులైన పెద్ద మనుష్యుల సహకారము." "ప్రాంతీయ పరిషత్తులను ఉదార సంస్థలుగా

ఏర్పరచడం," అతని ఉద్దేశము. అయినా, రాజ్యాంగనీతిని నిశ్చయించే అధికారము మాత్రం కార్యనిర్వాహక వర్గంలోనే, నిహితమై ఉంటుందని సూచించినాడు. పరిషత్తుల విషయంలో, ప్రజల అభిప్రాయం తీవ్రమై ఉన్నదనే విషయం మాత్రము, ఇతడు గ్రహించినాడు. కనుక, శాసనసభలకు ప్రజలను ఎన్నుకొనే సూత్రాన్ని అంగీకరించ వలసినదని, ఇండియా ప్రభుత్వ కార్యదర్శికి, తన ప్రతిపాదనను పంపినాడు. అయినా, ఒక ముఖ్య విషయాన్ని మాత్రం ప్రజాప్రతినిధుల ఆధిపత్యానికి తేదలచుకోలేదు. "సామ్రాజ్యంయొక్క రక్షణ భద్రతలకు, తమ నిలుకడకు మూలమైయున్న సామ్రాజ్యాధికారాన్ని కేంద్రప్రభుత్వంకాని, ప్రాంతీయ ప్రభుత్వాలుకాని, ఏమాత్రమూ వదలుకోడానికి వీలులేదు. పరిపాలక వర్గంవారైన తమ స్థాన భద్రతకు, అనాగరకులై, వెనుకబడియున్న వివిధ వర్గాలవారి క్షేమానికి అత్యావశ్యకమైయున్న కార్యనిర్వహణాధికారాన్ని దేశీయుల వశంగావించడం జరగనిపని."

"సంవిధాన ప్రక్రియలో మార్పులు కావించవలసిన సమయం ఏర్పడింది. విద్యావంతుల వర్గంనుంచి తగినంతమందిని, నియామకంద్వారాను, ఎన్నికల ద్వారాను, గ్రహించి, వారిని పరిపాలన వ్యవస్థలో ప్రభుత్వమునకు సహకరించునట్లుగా, సంస్కరణ జరుగవలెను. విస్తృతములైయున్న ప్రజావర్గాల అభిప్రాయములను, భావాలను కోరికలను తెలుసుకొనే మార్గాలుగా ఈ దేశీయ సభ్యులేర్పడగలరు. ప్రజల బాధ్యతను వహించియున్న మనకు ఈ విధమైన సౌకర్యము, పరిషత్తుల సంస్కరణవల్ల సిద్ధిస్తుంది." శాసన పరిషత్తులను విశాలం గావించడం, భారతీయులకు ప్రభుత్వంతో సంబంధము కల్పించడం, - అన్న మార్పులను మాత్రమే తీసుకొని రావడానికి పూనుకొన్నాడని, దీనివల్ల విశదమవుతుంది.

ఇటువంటి పరిమితమైన సంస్కరణకు కూడా, ఇండియా కార్యదర్శి అంగీకరించలేదు. డఫ్ఫెరిన్ తర్వాత, పదవికి వచ్చిన ల్యాన్స్‌డౌన్ (Lansdowne) ఈ సంస్కరణలకై ఒత్తిడి చేసినాడు. ఇండియా ప్రభుత్వ కార్యదర్శియైన 'క్రాస్', ఈ విధంగా అతనికి జవాబిచ్చినాడు. "'ప్రజావర్గ ప్రాతినిధ్యం', కష్టంకాక పోవచ్చు. కాని, 'ప్రజల' ప్రాతినిధ్యం ఏర్పరచడం, సాధ్యంకాని పని. బెంగాలీ బాబులు ప్రాతినిధ్యం వహించేది తమకేగాని, ప్రజలకుగాను కాదు. అటువంటి ప్రయత్నము మన భారతదేశ పాలనకే ముప్పు తెస్తుంది."

కట్ట కడపటికి, ప్రజాప్రాతినిధ్య విషయమై ప్రభుత్వము శాసన నిర్మాణానికి 1892 లో పూనుకోవలసి వచ్చింది. ఆ సమయంలో, భారతప్రభుత్వ సహాయ కార్యదర్శిగానున్న కర్జన్, శాసనోద్దేశాలను ఈ కింది విధంగా విశదం గావించినాడు. భారతదేశంలోని అగ్రవర్గాలవారి అభిప్రాయాలను, ఉద్దేశాలను ప్రభుత్వానికి తెలియబరచే విధానాన్ని, ఏర్పరచడం, శాసనంయొక్క ముఖ్యోద్దేశము. వాస్తవమైన ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వాన్ని ఏర్పరచడానికాని, ప్రభుత్వ నిర్వహణంలో భారతీయులకు భాగం కల్పించడంకాని, శాసనోద్దేశంకాదని, స్పష్టం చేయబడింది. నోరులేని కోటానుకోట్ల భారతదేశ ప్రజల పక్షంలో, ప్రజాప్రతినిధుల

ప్రభుత్వం ఏర్పడడం కార్యసాధ్యమైనది కాదని ఇతని నిశ్చయము.

ఇట్లా శాసనోద్దేశాలు అత్యంతము పరిమితములు. నూతన పరిషత్తుల అవధులు కూడా సంకుచితములైనవే. అధికంగాచేరే సభ్యుల సంఖ్య పరిమితమైనది. వారి నియామకంకూడా ప్రభుత్వమే చేస్తుంది. బడ్జెటును గురించినచర్చ దానిపై వచ్చే ప్రశ్నల అవకాశము, సర్వమూ పరిమితమే కావడంవల్ల ఈ సభలకు రాజకీయ పరిజ్ఞానం కలిగే అవకాశంకూడా స్వల్పమైనదే. ప్రజాభిప్రాయము, ఈ శాసనాన్ని తీవ్రంగా విమర్శించింది. ఫెరోజషా మెహ్తా, డబ్ల్యూ. శి. బెనర్జీ, సురేంద్రనాథ బెనర్జీ, ఆర్. శి. దత్తు, మొదలైన భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షులు, ఇండియా పత్రికలు, ప్రత్యక్షములైన ఎన్నికలను జరపవలసిందని, పరిషత్తుల కార్యక్రమాలను విస్తృతం గావించవలసిందని, ఒత్తిడి చేయసాగినారు.

ఇండియా పరిపాలన వ్యవస్థను సమర్థవంతంగా, శక్తివంతంగా చేయడానికి కర్జన్ తన శక్తి నంతటినీ వినియోగించినవాడే. ప్రభుత్వము, శక్తి సంపన్నమై సమర్థవంతమై యుండవలెననటం ఇతని ఆశయము. దాని ననుసరించి, ప్రభుత్వ కార్య నిర్వాహక శాఖలన్నిటిలోను తదభిముఖ మార్గాలను ప్రవేశపెట్టినాడు. ఆ యా శాఖల కర్తవ్యాలను విస్పష్టం గావించినాడు. కాని, ప్రభుత్వ నిర్వహణము సక్రమంగా నెరవేరడమనే విషయంతప్ప, రూఢివాదబద్ధమైన ఇతని దృష్టి, తక్కిన విషయాలపై ప్రసరించలేదు ప్రజలందరికీ సమానమైన న్యాయపరిపాలనము, కళంకరహితమైన పరిపాలనవ్యవస్థ, పరిపాలకుల అభిప్రాయానుగుణమైన ప్రజల శ్రేయస్సు, ఇండియా ప్రయోజనాల విషయంలో ఇంగ్లాండులోని కొందరి రాజకీయ నాయకుల ఆసక్తి, – ఇవి అతడు సాధించడానికి పూనుకొన్న సమస్యలు. "రెండువందల సంవత్సరాల తరవాతకూడా, విజేతల దృష్టిలో సుందరమైన ఒక దృశ్యంగా మాత్రమే గోచరిస్తున్నది భారతదేశము. ఆత్మరక్షణలేనిదై, అగతికమైయున్న ఈ దేశాన్ని విజేతలు అర్థంచేసుకోలేదు. దేశంయొక్క తత్త్వమేమాత్రమూ వారి కవగాహనకాలేదు." అని ఇతడు వచించియున్నాడు. కాని, ఎంత మంచి పరప్రభుత్వమైనా స్వప్రభుత్వంతో సమానం కాజాలదని ఇతడు గ్రహించలేక పోయినాడు. విద్యావంతుల వర్గానికి ఆగ్రహం కలిగించినానని ఇతడు గుర్తించినాడు. ఇతడు ప్రతిపాదించిన రాజకీయ సంస్కరణలో, స్వపరిపాలన బీజములు లేవని విద్యావంతులు గ్రహించడంవల్ల, వారు వ్యతిరేకులైనారు. రాజకీయ విశిష్టాధికారాలను, సంస్కరణలను ఏర్పరచడం దేశ ప్రయోజనాలకు హితకరమైనది కాదని, రాజనీతికి, వివేచనకు వ్యతిరేకమైనదని ఇతడు భావించినాడు. "విశాలమైన జాతీయైక్యము సిద్ధించవలెననే, ఉత్కంఠను బూనియున్న భారతీయులపట్ల నాకు దృఢమైన సానుభూతి ఉన్నది. కాని, రాజకీయాల ద్వారా భారతదేశానికి కష్ట విమోచనము సిద్ధిస్తుందని నేను భావించను." అని ఇతడు తన హృదయాన్ని ప్రదర్శించినాడు.

కనుక, అసంతృప్తికరము, అతి పరిమితము కూడా అయిన 1892 నాటి శాసనంలో పదిహేడేండ్ల దాకా ఎటువంటి మార్పూ కలుగలేదు. విప్లవం జరిగి,

యాభైయేండ్లు గడిచినవి. ఇండియా భవిష్యత్తును గురించి, మెకాలే, గావించిన ఉదారసూచన జరిగి 75 సంవత్సరాలు గడిచిపోయినవి. ఐనా, ఇండియా దేశానికి స్వపరిపాలన అనే విషయము, స్వప్నంగానే నిలిచిపోయింది. ఉపన్యసించడానికి, చర్చించడానికి పూజ్యమైన విషయంగా ఏర్పడిందేకాని, కార్యరూపంగా ఏర్పడే విషయం కాకపోయింది.

***విభేదాల ఆధారంగా పరిపాలన :*** ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వాన్ని ఏర్పరచక పోవడానికి పరిపాలకులు కొన్ని కారణాలను పేర్కొనియున్నారు. ఇండియా ఏకైకమైన జాతికాదు. ఎన్నికల ఆధారంగా ప్రభుత్వాన్ని ఏర్పరచే పద్ధతి భారత దేశానికి నూతనమైనది. కనుక, అటువంటి రాజకీయ సూత్రము ప్రాచ్యసంప్రదాయాలకు, ప్రాచ్యభావాలకు వర్తించేదికాదు. ఇవి, వారు చూపిన కారణాలు. నూటయాభై సంవత్సరాలు పరిపాలన సాగించిన బ్రిటీషువారికి, ఈ ప్రతిబంధకాలను తొలగించవలెననే అభిప్రాయం కలుగలేదు. అది తమ బాధ్యత అని కూడా వాళ్ళు గుర్తించలేదు. ఐనా, తాము జయించిన, వెనుకబడిన జాతులను, నాగరకులుగా చేసి, స్వపరిపాలనకు తగిన శిక్షణ నివ్వడం, తమకు దైవనియమితమైన సామ్రాజ్య కర్తవ్యమని ఘోషిస్తూనే వచ్చినారు కదా ! ప్రజల సుఖజీవనానికి ప్రతిబంధకాలైయున్న ఆంతరంగిక పరిస్థితులను మార్చి, నిరోధక శక్తులను నిర్మూలించి, ప్రజలలో సామరస్యాన్ని, సుసంబద్ధమైన ఐక్యతను స్థాపించడం, సాధారణమైన ప్రతి ప్రభుత్వానికీ ప్రథమ కర్తవ్యమనే సూత్రాన్ని వీరుగమనించిన వారుకారు. వివిధ జాతులవారిని ఒక రాష్ట్రప్రజగా ఏర్పరచి, ఆ రాష్ట్రాలను పోషించిన నిదర్శనాలు చరిత్రలో ఎన్నో ఉన్నవి. అస్థిరములు, స్వతంత్రములు, శతాధికములు అయి ఉన్న చిన్న చిన్న రాజ్యాలనన్నిటినీ ఐక్యపరచి, జర్మను జాతిగా ఏర్పరచినది, ప్రష్షియారాజ్యము. చిన్న రాజ్యమైన పేయిడ్మాండ్ (Peidmond) ఈ విధంగానే ఇటలీ జాతిని ఏర్పరచింది. కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికాలో వ్యాపించి ఉన్న, వివిధ జాతులవారిని, వివిధ సంస్కృతుల వర్గాలను, ముక్కలను చేర్చి, వారి పరస్పర రాజకీయ వైషమ్యాలను తొలగించి, సుసంగతములైన కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా జాతులుగా స్థాపించింది బ్రిటీషు ప్రభుత్వమే. అటువంటప్పుడు, ఇండియా విషయంలో మాత్రం వీరి వాదమేవిధంగా సమర్థనీయమవుతుంది.

ఐనా, వాదంకోసము ఇండియాలో రెండు పెద్దమత వర్గాలు ఉన్నవని, దేశంలోని వ్యవహారభాషలు అనేకములని, 20 కోట్లనుంచి 35 కోట్లవరకు విస్తరించిన జనాభా దేశంలో ఉన్నదని, వారిలో జాతి, మత, సంస్కృతి విభేదాలున్నవని అంగీకరిద్దాము [ఇవి నిజంగా అతిశయోక్తులే]. కాని, వివేచనతో కూడిన, ప్రజాహితకరమైన పరిపాలన వ్యవస్థను నెలకొలిపి, ప్రజలలోని జాతి, మత, సంస్కృతులకు అతీతమైన రాజకీయ భావాన్ని వారిలో కలిగించి, వారినొక రాజకీయ సంస్థగా ఏర్పరచడం ప్రభుత్వానికి సాధ్యం కాని విషయమా ?

అమెరికా సంయుక్తరాష్ట్రాలలో, కెనడాలో, రష్షియాలో సాధించబడిన

కార్యము, భారతదేశంలో సాధ్యంకాకపోవడమెట్లా? అందునా, రాజకీయైక్యతకు ప్రోద్బలం కలిగించే అంశాలు పెక్కులు సిద్ధమై ఉన్నప్పుడు, తత్ప్రయత్నము సుకరంకాదా ?

ఈ ప్రశ్నలకు సమాధానం స్పష్టమైనదే. కెనడా మొదలైన దేశాలలోని ప్రభుత్వానికి దేశప్రజలతో సహజసిద్ధమైన సంబంధమున్నది. పాలకులు, పాలిత ప్రజలు ఒక్క జాతినుంచి పరిణమించినవారే. ప్రయోజనాలుకూడా సమానములైనవే. కనుక, దేశపు ఆంతరంగిక ఐకమత్యాన్ని సిద్ధింపచేసుకొన్నది ప్రభుత్వము. ఇండియా విషయం వేరు. ప్రజల ప్రయోజనాలు, ప్రభుత్వం యొక్క ప్రయోజనాలు భిన్నములు మాత్రమేకావు; పరస్పర విరుద్ధములైనవి కూడా. జాతి, మతము, భాష, సంస్కృతి, సంప్రదాయాలు ఈ అన్ని విషయాలలోను పరిపాలకులు దేశీయులకు విభిన్నులైనవారు. అంతేకాదు, మానసిక ప్రవృత్తులలోను, మనస్తత్వంలోను, ఆంగ్లేయులు విలక్షణులు, అత్యంతం, విభిన్నులు. ఇంకొక ముఖ్యవిషయము. స్వప్రయోజనము, ఉద్యోగ నిర్వహణకర్తవ్యము, అన్న కారణాలవల్ల ఆంగ్లేయులు ఇండియాకు వచ్చి, తాత్కాలిక నివాసమేర్పరచుకో వచ్చు. కాని, అతని గృహము, - అంటే భౌతిక, భావనాత్మక, భావాత్మకమైన గృహము ఇండియాలో లేదు. మరెక్కడనో ఉన్నది. భారత ప్రజల ఆశలు, ఉత్కాంతులు, ప్రయత్నాలు, క్లేశాలు,- వీటన్నిటితో ఆంగ్లేయునికి సంబంధం లేదు. వారి హృదయాలనుకూడా గ్రహించలేడు. భారతీయుల మధ్య నివసిస్తాడు. అంతేకాని, భారతీయులలో ఒకడుగా మెసలుకోలేడు.

అటువంటి పరిస్థితులలో, సామ్రాజ్య భావము తీవ్రంగా, ఆత్మప్రయోజ నౌన్నత్యానికి ప్రోద్బలం కలిగిస్తూ ఉండగా బ్రిటీషువారు ఇండియా ప్రయోజనాన్ని గమనించక పోవడం ఆశ్చర్యకరమైన విషయుంకాదు. కనుకనే, ప్రజలలో సామరస్యాన్ని నెలకొలిపి, పరస్పర విశ్వాసాన్ని కలిగించవలసిన ప్రాథమిక కర్తవ్యానికి కూడా, పరదేశ ప్రభుత్వం పూనుకోలేదు. దానికి వ్యతిరేక మార్గాన్ననుసరించి, వర్గానికి వర్గానికీ మధ్య, మతానికి మతానికీ మధ్యగల అంతరాన్ని ప్రయత్నపూర్వకంగా ఎక్కువ చేసినారు. ఒక దేశపు ప్రజలలోని విభేదాలను స్వప్రయోజనార్థం ఉపయోగించుకొని, ఆ దేశాన్ని జయించడం, పిమ్మట ఆ విభేదాలను పోషించి, తన ఆక్రమణను కొనసాగించడం, అన్న విధానము సామ్రాజ్య నీతియొక్క ప్రథమ సూత్రము. దీనినే బ్రిటీషువారు ఇండియాపట్ల విజయవంతంగా అవలంబించినారు.

భారతదేశంలో విభేదాలుండడం వాస్తవమే. దేశంలోని ప్రజలను ఒక జాతిగా సంయోజన పరచే దేశభక్తి, అనే అనుబంధం లేదనడంకూడా వాస్తవమే. కనుకనే, భారతీయులు పరదేశీయులకు సాధనములై, తమ వినాశాన్ని తామే తెచ్చుకోవడం జరిగింది. మొదట హిందూముస్లిము ప్రభువులున్నూ, వారి పతనానంతరము ముస్లిములున్నూ, సామ్రాజ్య ప్రభువులచేతిలోని బొమ్మలై, వారాడించినట్లాడినారు. 1857 లో జరిగిన విప్లవానంతర కాలంలో, మెకాలేకాలం

వరకు హిందువులు, ప్రభుత్వానికి ఆదరణ పాత్రులైనారు. బ్రిటీషుప్రభుత్వానికి ముస్లిములే ప్రధాన శత్రువులని భావించడంవల్ల, విప్లవంలోని భారతీయుల చర్యలు కుమార్గాములైనవి. అంతట, గాలి ఇంకొకవైపు ప్రసరించింది. మత సాంఘిక సంస్కరణోద్యమాలలో వ్యక్తమైన హిందూ పునరుజ్జీవనము, హిందూ సారస్వత పునరుద్ధరణము, ప్రాచీన హిందూ విజ్ఞానవైభవ, పునఃస్థాపన ప్రయత్నము, హిందూ విద్యావంతులలో ఉద్బుద్ధమైన జాతీయభావము, తత్ఫలితంగా ఉత్పన్నమైన రాజకీయోద్యమము, పత్రికల మూలంగాను ఇతర మార్గాలలోను ప్రారంభమైన రాజకీయాందోళనలు, మొదలైనవన్నీ బ్రిటీషు పరిపాలకులలో కలవరం పుట్టించినవి. ఈ వ్యాకులాన్ని, సర్ రిచ్చర్డ్ టెంపల్, ఇట్లా వర్ణించి యున్నాడు. "తమజాతి వంశముల ప్రతిష్ఠలో గౌరవాభిమానాలు కలవారై యీ బ్రాహ్మణులు, దివ్యాంశసంభూతులమనే విశ్వాసానికిలోనై, తాము పవిత్రులమనే భావాన్ని తామే వహించి, మేధాశక్తి బుద్ధిశక్తుల విషయంలో, అధికులమను కొంటూ వచ్చినారు. బ్రాహ్మణుల సంప్రదాయాలకు బద్ధమైయున్న జగన్నాథుని రథచక్రాలు మానవ బలులను నశింపజేసిన విధంగా, మన ప్రభుత్వము, దురభిప్రాయ, దురభిమానాలను, మూఢవిశ్వాసాలను, పురాతన యుగాలనాటి అభిప్రాయాలను నశింపజేయడం, వీరు సహించలేకున్నారు".

కనుక, ప్రభుత్వము తన ఆదరాన్ని ముస్లిములవైపు మరలించింది. 'వహాబీ ఉద్యమం' అని వ్యవహరించబడిన అపాయకరమైన ముస్లిముల ప్రయత్నము అంతమొందించబడింది బ్రిటీషువారికి ముస్లిములపై గల సంశయాలను తొలగించడానికి, ప్రభువులపట్ల ముస్లిములకు భక్తిభావాన్ని కలిగించడానికి, ముస్లిము నాయకులు పూనుకొన్నారు. సర్ సయ్యద్ అహమద్ ఖాన్, అమీర్ ఆలీ, అబ్దుల్ లతీఫ్ ఖాన్ మొదలైన ప్రముఖులు ఈ ప్రయత్నాన్ని సాగిస్తున్నారు. హిందువులు, అందునా ముఖ్యంగా బెంగాలీబాబులు, బ్రిటీషు అధికారులకు అసహ్యంగా, శనిగ్రహోల్లాగా, కనిపిస్తున్నారు. హిందువులపై ద్వేషభావము బ్రిటీషువారికి రోజురోజుకూ ఎక్కువవుతూ వుంది.

బ్రిటీషువారికి ఆదరపాత్రులైనవారు హిందువులైనా, లేక ముస్లిములైనా, ప్రభుత్వంయొక్క ఉద్దేశమొక్కటే. ఈ రెండువర్గాలవారినీ పరస్పరం వ్యతిరేకులుగా ఉంచడం ప్రధానమైన ఆశయము. రెండు పక్షాలవారిపైనా ఆధిపత్యం వహించి, ప్రభుత్వాధికారాన్ని వహించిన, మూడోవర్గంపై ఈ రెండు పక్షాలవారూ చేరి, దాడిచేయక పోవడమే వీరు కోరుకొనే ప్రయోజనము. కనుక, ఈ రెండు వర్గాలవారికీ సమాన ప్రయోజనం ఏర్పడకూడదు. మత వైషమ్యము, దేశంలో ఉండడం బ్రిటీషువారి కెంత మోదావహమైనదీ, తమ ప్రభుత్వ విధానాల సహాయంతో, చర్యలతో ఈ వైషమ్యాన్ని ఏ విధంగా వీరు దోహదం చేస్తూ పోషించిందీ [ప్రయత్నపూర్వకంగా కూడా] చారిత్రక పత్రాలనుబట్టి నిశ్చయంగా తెలుస్తున్నది.

ఎల్లిన్‌కు వ్రాసిన జాబులో, వుడ్, ఈ విధంగా వివరించియున్నాడు, -

"ఒక మతవర్గాన్ని ఇంకొక మతవర్గంపై ప్రయోగిస్తూ, మన ప్రభుత్వాన్ని పోషించి రక్షించుకొన్నాము. ఈ పద్ధతినే ముందునూ అనుసరిస్తాము. కనుక, ప్రజలందరూ ఒకే భావానికి రాకుండాఉండేటట్లుగా, చేయదగినదంతా చేయండి. సైనికులలో పరస్పర భ్రాతృభావ మేర్పడకూడదని, వారిలో ఏర్పడకుండా చూడవలెనని, నేను మొదటినుంచీ జాగ్రత వహించియున్నాను. ఇండియాలోని జాతులను, వర్గాలను, పరస్పరం సాధ్యమైనంత దూరంగా ఉంచడం, మనమవలంబించవలసిన నీతిలో ప్రాథమికమైనది. అట్లు ఒకరికొకరికి సంబంధము లేకపోతే, ఇదివరలో జరిగిన ప్రమాదమున కవకాశమేర్పడదు. పశ్చిమోత్తర ప్రాంతాలలో జరుపవలసిన సాధారణమైన కార్యాలను, అక్కడి సైన్యంతోనే జరిపించండి. పంజాబులోకూడా పద్ధతి ఇట్టిదే. ప్రాచ్యభాగంలో అలజడి ఏర్పడితే, దాన్ని అణచడానికి, పంజాబు సైన్యాన్ని సిద్ధంగా ఉంచండి. సిక్కుల నణచడానికి ప్రాచ్యభాగంలోని సైన్యాన్ని ఉపయోగించండి" ఇంకొక జాబులో, వుడ్, జ్ఞానివలె ఉపదేశిస్తాడు, - "మన స్థానాన్ని బలపరుచుకోవడంలో, ఏ సాధనాన్ని ఉపయోగించడానికైనా వెనుదీయరాదు. ఫలితమే ముఖ్యము; సాధనం కాదు. దేశములోని వివిధ జాతులకు సహజంగా ఏర్పడియున్న ద్వేషభావమే, మనకు ప్రధానమైన బలము. దానిపై ఆధారపడండి. భారతదేశమంతా ఏకమై ప్రతిఘటిస్తే, మన మెంతకాలం నిలువగలము."

టర్కీ దేశానికి ఇండియాతోగల సంబంధాన్ని, ఇండియా ముస్లిములకు, ఆటోమన్‌క్యాలిఫ్, పట్లగల సానుభూతినీ గూర్చి చర్చిస్తూ, లిట్టన్, సాలిస్‌బరీని ఈ విధంగా హెచ్చరించినాడు, - "ఇండియాలోని బ్రిటీషు సామ్రాజ్యము, ముస్లిం రాజ్యమనే విషయం, తథ్యము. దానిని విస్మరించడానికి వీలులేదు. కనుక, ముస్లిము ప్రజల భావాలు, మన సామ్రాజ్యానికి రక్షకశక్తులై యుండవలెనా, లేక, అపకార శక్తులై యుండవలెనా, అన్న విషయము, ఇంగ్లాండు మహారాజ్ఞియొక్క ప్రభుత్వము అవలంబించే రాజనీతిపై ఆధారపడుతుంది."

తన అఖిలభారత పర్యటనంలో, సురేంద్రనాథ బెనర్జి, రాజకీయాందోళనను వ్యాప్తిగావించడము, 1877-78 లో, అఖిలభారత జాతీయ కాంగ్రెసు ఏర్పడడము, - ఇవన్నీ అధికార కపోతాల గూటిలో, కళవళపాటును కలిగించినవి. అంజుమన్ - ఇ - ఇస్లామ్, నివేదించుకొన్న మహజరును, డఫ్ఫెరిన్‌కు పంపిస్తూ, రీయే ప్రభువు, ఈ విధంగా వ్రాసియున్నాడు. "హిందువులతో పోటీ చేయడం, మహమ్మదీయులకు అననుకూలము, నష్టదాయకమూ, అనడం నిస్సంశయము. వారి కేవిధంగానైనా, సహాయం చేయవలెనని నేను ఆసక్తుడనై ఉన్నాను. ప్రభుత్వోద్యోగాలలో, ఎక్కువ సంఖ్యను చేర్చుకోవడం, భావ్యంగా తోచడం లేదు." బెంగాలు లెఫ్టినెంటు గవర్నరైన సర్ రివర్స్ థాంసన్, "మహమ్మదీయులకు ఉద్యోగావకాశాలను కలిగించడంలో, ప్రభుత్వం చేస్తున్న సహాయా" న్ని ప్రశంసిస్తూ, ప్రభుత్వ రాజనీతి, ఈ విషయంలో మారినందుకు, తన సంతోషాన్ని వ్యక్తం చేసినాడు. మహమ్మదీయుల విద్యావ్యాప్తి విషయమై

ప్రభుత్వము అంగీకరించిన తీర్మానాన్ని హృదయపూర్వకంగా ఆమోదించినాడు సర్. డబ్ల్యూ. హెచ్. గ్రెగొరీ. అతడు డప్ఫెరిన్‌కు ఈ విధంగా వ్రాసియున్నాడు ; - "ఈ తీర్మానంవల్ల సత్ఫలితాలు సిద్ధిస్తాయని నాకు విశ్వాసమున్నది. బ్రాహ్మణులు, బాబూలు, లేవదీసిన ఆందోళనకు, ముస్లిములు పూర్తిగా దూరులై ఉండడంవల్ల, మన నీతి సఫలమౌతున్నదని భావించవచ్చు. భారత ప్రజలందరిలోను అత్యంత ధైర్యశాలులరు, ఒకప్పుడు విపత్కారులు ఐన, ఈ వర్గము వారితో మన సఖ్య సంబంధాన్ని సన్నిహితం చేసుకోవడం గొప్ప విషయము. మరిన్ని, 1857లో తమకు తగిన శిక్ష జరిగిందని, ముస్లిములందరు ఐక్యకంఠంతో అంగీకరిస్తున్నారుకూడా. పౌరుషవంతుల పద్ధతిలో శిక్షను శాంతంగా, అనుభవించినారు. ఇప్పుడు మనపై ఆధారపడి, హిందువుల ఆధిపత్యంనుంచి రక్షణ కోరుతున్నారు." ఒక సంవత్సరం తర్వాత, గ్రెగొర్, మరల గవర్నర్ జెనరల్‌కు ఈ విధంగా వ్రాసినాడు ; - "బాబూలుకాని, బ్రాహ్మణులుకాని, అధికారం వహిస్తే, తమ క్షేమాత్రమూ ఆదరణ ఉండదని ముస్లిములు గ్రహించిఉన్నారు. కనుక. మనతో కలిసి ఉండడమే తమకు శ్రేయమని వారికి బాగా అర్థమయింది" తరువాతి సంవత్సరం, డప్ఫెరిన్‌ను ఈ క్రింది విధంగా అభినందించినాడు ; "యుక్తాయుక్త పరిజ్ఞానముతో ముస్లిములను సరిచేసుకొని, మన 'రాజ్' (ప్రభుత్వం) పట్ల వారికి గాఢానుబంధం కలిగించియుండడం, సంతుష్టికరమైన విషయము. బాబూలు మనపట్ల ప్రదర్శిస్తున్న ద్వేషాన్ని ఇకమీదట చిరునవ్వుతో స్వీకరించవచ్చు."

పశ్చిమోత్తరప్రాంతాల లెఫ్టినెంటు గవర్నర్, కాల్విన్, డప్ఫెరిన్‌కు, ఈ విధంగా వ్రాసెను. "హిందువుల ఆధిక్యమును నెలకొల్పడానికై కాంగ్రెసు పూనుకొనియున్నదని, ఈ ప్రాంతములోని ముస్లిముల అభిప్రాయము. కనుకనే, వారు కాంగ్రెసు సంస్థపై తీవ్ర విరోధభావంతో ఉన్నారు." జాతీయోద్యమమనే తత్త్వము, ఇండియాకు పూర్తిగా అసంబద్ధమైనదని, ఇతని అభిప్రాయము. ముస్లిములెన్నడూ దానితో ఏకీభవించరని ఇతడు విశ్వసించినాడు.

పరస్పర విరోధములతో కూడిన ఈ మతాలవారు, ప్రక్క-ప్రక్కనే దేశములో నివసించుచుండడం, ఇండియాలో మన రాజకీయస్థానానికి మిక్కిలి బలకరమైన పరిస్థితి. ఇది స్పష్టంగా వ్యక్తమౌతున్న సత్యము" అని సర్ జాన్ స్ట్రాచీ, ఒప్పుకొన్నాడు. ఇండియా ప్రభుత్వ కార్యదర్శియైన, జార్జ్ ఫ్రాన్సిస్ హ్యామిల్టన్, రాజప్రతినిధియైన కర్జన్‌కు, ఈ విధంగా వ్రాసియున్నాడు, - "పాశ్చాత్య పద్ధతులను క్రమంగా అనుసరించి, ఏర్పడే రాజకీయాందోళన విధానమే, మన భారతదేశ పరిపాలనకు కలుగబోయే నిజమైన ఆపద. అటువంటి ఆపద ఇప్పుడప్పుడే కలుగదు. సుమారు యాభైయేండ్ల తరువాత కలిగే అవకాశమున్నది. కనుక విద్యావంతుల సంఘాన్ని, విభిన్నాభిప్రాయాలుగల రెండు వర్గాలుగా మనం విభజించగలిగితే, మన స్థానానికి బలం సిద్ధిస్తుంది. విద్యావ్యాప్తిమూలంగా, మన ప్రభుత్వ విధానంపై ఏర్పడియున్న వైషమ్యము, గూఢంగా, నిరంతరం

జరిగే అవకాశం తగ్గిపోగలదు."

అత్యున్నత పదవులలో ఉన్న అధికారుల అభిప్రాయాలివి. ఇట్టి ఉదాహరణలింకను, అసంఖ్యాకమైయున్నవి. డఫ్ఫెరిన్, ఇదివరకే, తన అభిప్రాయాన్ని, గూఢంగా, క్రాస్‌కు, తెలిపియున్నాడు. "నేనీ దేశం చేరడంతోనే, మహమ్మదీయుల అభిమానాన్ని సంపాదించినాను. వారు మనకు స్నేహపరులై యున్నారు. ఇండియాలోని ప్రతి పట్టణమందునూ, ముస్లిము జనాభా అభినందన పత్రాలను, ఆహ్వాన పత్రాలను సమర్పిస్తున్నారు". క్రాస్ కూడా ఇదే పద్ధతిలోనే డఫ్ఫెరిన్‌కు ఈ విధంగా తెలియజేసినాడు. "మత విషయకమైన ఈ విభేదాన్ని ఈ విధంగా కలిగించడం మనకు చాల లాభకరము. మీరు నియమించిన విచారణ సంఘము (Committee of Enquiry) యొక్క ఫలితం శుభప్రదమౌతుందని ఆశిస్తున్నాను."

శాసన పరిషత్తులను విస్తరింపజేయడం 1892 లో ప్రారంభము కాగా, సభ్యులను నియామకం గావించవలసిన సమస్య ఏర్పడింది. సామ్రాజ్య శాసన సభలో ఈ విషయమై ఉపన్యసిస్తూ, లాన్స్‌డౌన్ ప్రభువు, యూరోపులోని పార్లమెంటు సభల లక్షణములతో కూడిన సంస్థల నేర్పరచడం ప్రభుత్వము యొక్క ఉద్దేశం కాదని వివరించినాడు. ఈ సభలకు నియమింపబడే సభ్యులు వాస్తవంగా ప్రజా ప్రతినిధులే. ఐనా, వీరు ప్రాతినిధ్యం వహించేది ప్రజావర్గాలకు, మత వర్గాలకే కాని, ఆయా ప్రదేశాలకు, ప్రజల సంఖ్యకు కాదు." ఈ విధంగా, మత సంస్థలకు, వివిధ వర్గాలకు ప్రత్యేక ప్రాతినిధ్యం ఇండియాలో ప్రారంభింపబడింది. విభిన్న ప్రయోజనాలతో, వర్గాలతో, మత సంస్థలతో, సంస్కృతులతో, ఒక ముద్దగా ఏర్పడియున్న భూభాగంగా, ఇండియా దేశాన్ని, పరిగణించిరేకాని, రాజకీయైక్యము గల ఒక వ్యవస్థగా, చూడలేదు. అట్టి ఐక్యము, అస్తిత్వము, ఈ దేశానికి లేవు ; వాటిని సంపాదించుకొనే ఆంతర శక్తి కూడా లేదని ప్రభుత్వము నిశ్చయించుకొంది.

అప్రమాణములైన ఈ భావములకు వ్యతిరేకంగా, రూఢి పక్షమునకు చెందిన ఒక ఆంగ్లేయుడు (Conservative member) నేషనల్ రివ్యూ పత్రికలో ఇట్లు వ్రాసియున్నాడు ;—"హిందూ ముస్లిములకు స్పర్థ ఉన్నదని ప్రభుత్వం చెప్పడం, తమకు అనుకూలమైన ఒక వంచన. వాస్తవిక విషయాలపై నుండి దృష్టిని మరల్చడానికి ఈ పన్నాగము ఉపకరించింది. రాజకీయ వ్యవస్థా సంస్కరణాన్ని దాటివేసే ప్రయత్నమిది. ఈ రెండు మతాల వారికీ వైషమ్యం లేదని నేను సమర్థించడం లేదు. కాని, ఇది అత్యంతమైన అతిశయోక్తియని మాత్రం దృఢంగా చెప్పగలను. కాంగ్రెసు సభ్యులు మానవులుగా ఒక సంస్థగా ఏర్పడియున్నారు. జాతీయ భావం వారికందరికీ సమానమైనదే. ఒక దేశపు ప్రజలుగా ఒకే న్యాయ సూత్రాలకు బద్ధులై, ఒకే రాజ్యానికి పన్నులు చెల్లిస్తూ, ఒకే ప్రభుత్వ ప్రభావం వల్ల సిద్ధించే సుఖదుఃఖాలకు పాల్పడి, ఒకే విధమైన ఉత్తేజనములకు లోనై, ఒకే హక్కులను, ఒకే విధమైన భారవిమోచనను కాంక్షించే

వారై, ఈ కాంగ్రెసు సభ్యులందరూ ఒక్క మానవ సంస్థగా ఏర్పడియున్నారు. ఈ కారణాలు దేశములోని ప్రజలను, ఒక జాతీయ సంస్థగా మేళనమొనర్పజాలక పోతే, మరి ఏ కారణనులు అట్టి పనికి సమర్థములౌతాయో ఊహించడం కష్టము."

*దేశీయ ప్రభువులతో మైత్రి :* బ్రిటీషు ప్రభుత్వము యొక్క ఆధిక్యమును దేశములో నిలిపియుంచడానికి, హిందూ ముస్లిము విభేదాలు సమర్థములైనవి కావని కాబోలు, బ్రిటీషు సామ్రాజ్య వాదులు మరియొక బలాన్ని కూడా సంపాదించుకొని, సామ్రాజ్యాన్ని స్థిరపరచుకోదలచిరి. కొన్ని విశేష సందర్భాల్లో ముస్లిములు తమ్ము విడనాడవచ్చునసే సంశయం ఉండనే ఉన్నది. మత సంబంధమైన ఉద్రేక కారణం ఏర్పడితే, మళ్లీ 1857 నాటి సంఘటన ఏర్పడవచ్చు. ఈ జంకు కేవలం ఊహామాత్రమైనది కాదు. ఇంగ్లాండు యొక్క అంతర్జాతీయ ప్రయోజనాల రక్షణార్థం, ఆటోమన్ క్యాలిఫేట్‌తో సంఘర్షణ ఏర్పడవచ్చు. అట్టి సందర్భమే తటస్థిస్తే, ముస్లిములు సమస్థితిని గోల్పోయి అలజడి చేస్తారు. 19 వ శతాబ్దపు కడపటి భాగంలో, ఇట్టి పరిస్థితికి అవకాశం ఏర్పడింది. ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్, ఈజిప్టు దేశాలతో ఇంగ్లండుకు ఘర్షణ ఏర్పడే సందర్భాలు ఉత్పన్నములైనవి. ఆర్మీనియన్ క్రైస్తవులకు గ్లాడ్‌స్టన్ సహాయ పడడం, ఈ దేశాలతో యుద్ధాన్ని తెచ్చియుండేది. అట్టి పరిస్థితే ఏర్పడియుంటే, ఇంగ్లాండుకు, ఇస్లాముకు సంఘర్షణ అనివార్యమయ్యేది.

కనుక, కష్ట పరిస్థితులలో తమ పక్షములో నిలిచే మరియొక విశ్వాస పాత్రమైన వర్గాన్ని, భారతదేశంలో కనిపెట్టి, దానిని, తమ కనుకూలంగా పోషించుకోవలసిన అవసరం, బ్రిటీషు వారికి ఏర్పడింది. ప్రజానీకం ఇందుకు పనికిరాదు. దరిద్రులు, అజ్ఞానులు, ఐన ఈ ప్రజల ప్రయత్నమంతా కూటికి సంపాదించుకోవడంలోనే వ్యర్థమౌతున్నది. విద్యావంతులైన మధ్యతరగతుల వారు, రాజకీయ చైతన్యం కలవారే, కాని, ఏ మాత్రమూ నమ్మదగిన వారు కారు అసంతుష్టితో కుతకుతలాడుతూ, ప్రభుత్వము ఇవ్వలేని వాటికై ఒత్తిడి చేస్తున్నారు.

ఇక మిగిలియున్న వారు దేశీయ రాజులు, సర్దారులు, జమీందార్లు, మాత్రమే. కాని, వారికి విశేషాధికారములిచ్చి, వారి భక్తి విశ్వాసాలను సంపాదించుకోవడంలో ఒక ప్రమాదముంది. లిట్టన్ చెప్పినట్లుగా, కుట్ర చేయడానికి అవకాశం కలిగితే, దేశీయ రాజులు దానికి లోబడకపోరు. ఐనా, పరిపాలకుల అభిమానము, తమ ప్రయోజనములకు లాభకరమని వారెరుగుదురు, 1857 నాటి, విప్లవ సందర్భములో, విప్లవానికి దూరంగా నిలిచి, ఈ పరిజ్ఞానాన్ని నిరూపించినారు. డల్హౌసీ అవలంబించిన విధానం వారికి బెదురు పుట్టించింది. ఔధ్ తాలుకుదార్ల విషయములో క్యానింగు తీసుకొన్న మొదటి నిర్ణయము వారి ఆశలను భగ్నం కావించింది. కనుక, తమ భవిష్యత్తును గురించిన వ్యాకులంతో, రాజులు సంశయాత్మకులై ఉన్నారు.

ఇట్టి సందర్భములలో, రాజ సంఘము వారి విషయంలో ఒక విధానాన్ని

రచించవలసిన అవసరం ఏర్పడింది. కుట్రలకు పూనుకొనే ప్రవృత్తిని, నిరోధిస్తూ, బ్రిటీషు ప్రభుత్వానికి భక్తియుక్తులుగా, సహకరించే వారిగా, చేసే విధాన రచనకు పూనుకొన్నారు. అన్ని విధముల్తైన ప్రమాదాలను తొలగించి, రాజుల ఉత్కాంఠా ప్రయత్నములను నిరోధించి, తమ అధీశుడైన బ్రిటీషు ప్రభువును భక్తి విశ్వాసములతో అనుసరించి యుండే విధానాన్ని నిర్మించినారు. ఈ విధానాన్ని, లీ వార్నర్, 'అధీన సమాఖ్య' (Subordinate union) అని వ్యవహరించెను. సార్వభౌమత్వము, రాజపరమాధికారము, సంధిగత అధికారాల లక్ష్యార్థములు, యుద్ధనీతి విచారములు, అనెడి సూత్రములు ఆధారంగా ఈ అధీనతా నీతి కల్పింపబడినది. రాష్ట్రమునకు సంబంధించిన, ఆంతరంగిక బాహ్యా వ్యవహారములు రెంటికీ, ఈ నీతి వర్తిస్తుంది. దేశీయ రాజ్యాలను బ్రిటీషు సామ్రాజ్యములో కలిసి పోయిన భాగములుగా చేయడం, ఈ విధానము యొక్క ఉద్దేశ్యము.

1858 తర్వాత, దేశీయరాజ్య భాగాలు తప్ప తక్కిన భాగమంతా, అన్ని విధముల్తైన మార్పులకు లోనగుచుండినది. రాజకీయ పరిపాలన విషయక, ఆర్థిక శక్తులు బ్రిటీషు రాజ్యభాగములో గొప్ప పరిమాణాన్ని కలిగించినవి. అట్టి సందర్భములలో, దేశీయ ప్రభువుల పాలనలోనున్న ప్రాంతాలు ప్రత్యేకములుగా, మధ్యయుగ వ్యవస్థకులోనై, వెనుకబడి యుండడం వీలు పడదు. కనుక మార్పు అవసరమయింది.

1857 లో ఆరువందలకు పైగా, దేశీయ ప్రభుత్వాలుండినవి. వీటికి, ఈస్ట్ ఇండియా కంపెనీతో గల సంబంధాలు పలువిధముల్తైనవి. హైదరాబాదు వంటి రాష్ట్రాలు, సార్వభౌమ స్వత్వములు గలవిగా ప్రవర్తిస్తూ, బ్రిటీషు ప్రభుత్వానికి మిత్ర రాజ్యములని పరిగణింపబడుతూ, దానితో సమాన ప్రతిష్ఠను వహించినవి. ఇతర రాజ్యాల హక్కులు ఇంత విస్తారముల్తైనవి కాకపోయినా, బ్రిటీషు ప్రభుత్వానికి అధీనముల్తైనవి కావు. వీటిలో, అనేకములు బ్రిటీషు వారు కల్పించినవే కనుక, అవి మాత్రం వీరి అధీనములో ఉన్నవి. ఈ రాజ్యాల హక్కులు, కర్తవ్యాలు, సంధి పత్రాలలో చేరియుండడమే కాక, ఆ రాజ్యాలతో గావింపబడిన కరారులలోను, వచన బంధములలో కూడా నిహితముల్తైనవి. అంతేకాక, అభిసమయముపైనను, రూఢిపైనను (Convention and usage) కూడా అవి ఆధారపడినవి.

ఇండియా ప్రభుత్వ పరిపాలన కంపెనీ వారి నుంచి ఇంగ్లాండు సామ్రాజ్య అధీనానికి, బదిలీఐన సందర్భంలో, ఇదివరకూ కంపెనీకి, రాజులకు మధ్య ఒప్పందమై యుండిన కరారులు, వచనబంధాలు, సనదులు - ఇత్యాదులన్నీ మరల ప్రభుత్వం కూడా స్థిరపరచింది. దేశీయ రాజులకు, సర్దారులకు గల సంశయాలను, సందేహాలను తీర్చడం ప్రభుత్వము యొక్క ఉద్దేశము. కాని, పరిస్థితులు మారి యుండడం వల్ల, వీటిని సమగ్రంగా పరిపాలించడం సాధ్యం కాలేదు. కనుక, మూల ఉద్దేశాలను ప్రభుత్వానికి అనుకూలంగా వ్యాఖ్యానం చేయవలసి వచ్చింది. ఈ విధంగా గావించిన మార్పులను ప్రభుత్వము సమర్థించడం కూడా జరిగింది.

పార్లమెంటు అధికారాలను పరిమిత పరచడం సాధ్యం కాదు. దేశీయ రాష్ట్రాలను సుసంబద్ధం గావించిన సామ్రాజ్య పరమాధికారము ఇంగ్లాండు రాజులో నిహితమై యుంది. ఈ ఆంతరంగిక కల్లోలాల నుండి, బాహ్యములైన దాడుల నుండి ఈ రాజ్యాలను రక్షించే బాధ్యతను కూడా ప్రభుత్వం వహించి యున్నది. కనుక, వీటిని నిర్వహించే నిమిత్తం రాజ్యాల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలుగ జేసుకోవడం తప్పదు. ఈ విధంగా తమ నీతిని ప్రభుత్వము సమర్థించుకొన్నది.

ఈ విధమైన అనేక మార్గాల ననుసరించి బ్రిటీషు ప్రభుత్వము యొక్క రాజ్యాధీన శక్తులు (Controlling powers) విస్తరిస్తూ వచ్చినవి. దానితో, ఈ రాజుల ప్రతిష్ఠ కూడా తదనుగుణంగా క్షీణించింది. దేశరాజులు వహించవలసిన బాధ్యతలు ఇందువల్ల అధికమైనవి.

బ్రిటనురాజుకు భక్తి విశ్వాసముల నర్పించడం, - అనగా పరిపాలన గావించుచున్న రాజుపట్ల గాఢాభిమానము వహించడం మొదటిది. సమస్తమైన గౌరవము, మర్యాద, సార్వభౌముని యందే నిహితమై ఉండడంవల్ల, అతడు ప్రసాదించే బిరుదులను, అభివందనాలను (Salutes), అలంకరణాలను (Decorations), పదవులను (Ranks), విశేషాధికారాలను (Privileges), గ్రహించడం, దేశీయ రాజుల కర్తవ్యము రాజుల వారసుల మాన్యతను (Recognition) గుర్తించే అధికారము కూడా ఇంగ్లాండు సార్వభౌమునిదే. కనుక, అట్టి మాన్యతను, అతడుకాని, లేక అతని ప్రతినిధిగా వైస్‌రాయికాని, ప్రసాదిస్తాడు. ఈ హక్కుల ననుసరించి, బ్రిటీషు ప్రభుత్వము, వారసత్వ విషయములో ఏర్పడిన వివాదాలనన్నీ పరిష్కారంగావిస్తూ, వారసులు యుక్తవయస్కులుకానట్టి సందర్భాల్లో రాష్ట్రపాలనను తానే నిర్వహిస్తుంది. కల్లోలాలుకాని, విప్లవాలుకాని, ఏర్పడిన సందర్భములో రాజును పదవిచ్యుతుని గావించే అధికారంకూడా బ్రిటీషు ప్రభుత్వానికి ఉన్నది. ఈ విధానానికి 'సామ్రాజ్యాధికారము' (Paramountcey) అని వ్యవహారము.

విదేశరాజ్యాలతోను, దేశంలోని ఇతర రాష్ట్రాలతోను సంబంధించిన విదేశ రాజ్యాంగ వ్యవహారముల విషయంలో, దేశీయరాజులకు అంతర్జాతీయ ప్రతిష్ఠ లేదు. విదేశ ప్రభుత్వాలతో ఏవిధమైన కరారులనుకాని, ఒప్పందములనుకాని, జరిపే అధికారంలేదు. ఇండియాలోని ఇతర రాష్ట్ర ప్రభుత్వాలతో అధికార సంబంధాలను కలిగించుకొనే అధికారం కూడా లేదు. దేశీయ రాష్ట్రాలలోనున్న ప్రజలు కూడా బ్రిటీషు ప్రభువుయొక్క రక్షణలోనున్నవారే, కనుక, వారి విషయములో కూడా బ్రిటీషు రాజ్యంలోని న్యాయసూత్రాలే వర్తిస్తాయి. విదేశాలకు ప్రజలు వెళ్ళిన సందర్భంలోకూడా, బ్రిటీషు న్యాయపాలనకు వారు బద్ధులై యుంటారు.

దేశ రక్షణ విషయములో సర్వాధికారమూ సామ్రాజ్య ప్రభుత్వము వహిస్తున్నది. కనుక, అత్యవసర పరిస్థితులేర్పడిన సందర్భాలలో, రాష్ట్రాలలోని మూలస్థాధన సంపత్తినంతటినీ ఉపయోగించుకొనే అధికారము ప్రభుత్వానికున్నది.

అంతేకాక, ప్రభుత్వము నియమించిన సంఖ్య ననుసరించి, సేవా సైన్యాన్ని పోషించవలసిన బాధ్యత కొన్ని రాష్ట్రాలు వహించవలసియున్నది. ఈ సైన్యమునకు సంబంధించిన పరిపాలనాధికారము, సాంకేతికాధికారము, బ్రిటీషు సైన్యాధికారులు వహించి, ఈ సైన్యాలను, రాష్ట్ర రక్షణకు, దేశరక్షణకు, సమానంగా ఉపయోగించవచ్చు. సైన్య సంబంధమైన వ్యవహారాలలో దేశ రాష్ట్రాలకు గల ఆధిపత్యము, ఈ విధంగా సంకుచిత మొనర్చబడింది. ఆ యా రాష్ట్రాలు పోషించవలసిన సైన్య పరిమితినికూడా, బ్రిటీషు ప్రభుత్వమే నిర్ణయించింది

ఈ రాష్ట్రాలను రక్షించే బాధ్యతను బ్రిటీషు ప్రభుత్వము, వహించియున్నందువల్ల, ఈ రాష్ట్రాలలోని సంచారమార్గాలు, - రైల్వేలు, టెలిగ్రాఫులు, తపాలా, - కూడా బ్రిటీషు ప్రభుత్వమునకే అధీనములై ఉంటాయి.

దేశరాజులతో ఏర్పరచుకొన్న కరారులను, ఒప్పందములను వ్యాఖ్యానించడంలో, సామ్రాజ్య ప్రభుత్వము, రాష్ట్రాల స్వయం పరిపాలనాధికారాన్ని కూడా పూర్తిగా తగ్గించివేసింది. ఉదాహరణగా,- రాష్ట్రాన్ని విభజన గావించే ప్రయత్నాన్ని, ఆపివేసే అధికారం, బ్రిటీషు ప్రభుత్వానికి ఉన్నది. న్యాయరీత్యా నియమింపబడిన రాజుకు, విరుద్ధంగా జరిగిన విప్లవాన్ని అణచివేయడం, దుష్పరిపాలనను నిరోధించడం, అమానుషములైన ఆచారాలను ఆపడం, ప్రకృతి సూత్రములకు విరుద్ధములైన నేరములను నిర్మూలించడం, ప్రజానైతిక ప్రవృత్తికి భంగకరములైన చర్యలను నిరోధించడం, అన్ని మతముల విషయములోను సహనభావాన్ని నెలకొల్పడం,మొదలైన విషయములన్నిటిలోనూ,సామ్రాజ్య ప్రభుత్వం కలుగజేసుకొనే అధికారాన్ని వహించింది. న్యాయపరిపాలనను వర్తింపజేసే విషయములో, బ్రిటీషురాజ్యములోని ప్రజలపై సామ్రాజ్య ప్రభుత్వము స్వయంగా క్షేత్రాధికారాన్ని వహించినది. రాష్ట్రాలలోని, సైన్యస్థావరాలలో, నివసించే ప్రజల విషయంలోను, అందలి సమస్త వస్తువుల విషయంలోను, అతీత ప్రాదేశిక క్షేత్రాధికారాన్ని వహించింది (Extra terricorial Jurisdiction).

ఇట్లు సాలిస్‌బరీ చెప్పిన విధంగా, దేశరాజులు తమ రాష్ట్రాలను పరిపాలించుకొనే విషయములో సామ్రాజ్యప్రభుత్వము నియమించిన ప్రతినియుక్తులుగా (Deputies) ఏర్పడిరి. బ్రిటీషు సామ్రాజ్యానికి ఆపదను తెచ్చిపెట్టగల శక్తి సామర్థ్యములు పూర్తిగా నాశమొనర్చబడినవి.

ఐనా, ఇంకా తృప్తికాలేదు. "భారతీయ సంపన్న వర్గంవారిని పూర్తిగా వశపరచుకొని, వారిని సామ్రాజ్య ప్రయోజనార్థం ఉపయోగించుకోవడం," లిట్టన్ యొక్క ఉద్దేశము. "సామ్రాజ్యాన్ని సుసంఘటిత మొనర్చడానికి, రక్షించడానికి అనుగుణమైన విధంగా, సామంత రాజ్యాలతోను, దేశీయ ప్రభువులతోను, మనకుగల సంబంధాలను వారు అంగీకరించేటట్లు మార్చడం అవసరము" ఈ రాజుల రాజకీయాధికారాలను పెంచడం ఇతని ఉద్దేశంకాదు. వారి చిత్తవృత్తులకు రంజకములైన విధానములను పాటించి, వారిని తమకు వశ్యులను గావించుకోవడం,- ఇతని ప్రయత్నము. "ప్రాచ్యదేశాలలో గౌరవప్రాభవ

ప్రదర్శనాలకు ప్రాధాన్యమెక్కువ. ప్రాగ్భాగాభిముఖంగా పోయేకొద్దీ, ఈ ఆడంబరం అతిశయిస్తుంది కనుక, దేశరాజుల అహంకార భావానికి, దోహద క్రియ గావించవలసిన అవసరమున్నది"

అట్టి ఆడంబర ప్రదర్శనలలో ఎక్కువ ఆకర్షణీయమైనది, ఇంగ్లాండు రాజ్ఞి గావించిన ప్రకటన. "మా ప్రస్తుత రాజ్యభాగాన్ని విస్తరింపజేసే అభిప్రాయం మాకు లేదు." ఇది మొదటిది. డల్‌హౌసీ అమలుపరచిన "వ్యపగత సిద్ధాంతాన్ని" (Doctrine of Lapse) రద్దుపరచి, వారసులను దత్తత చేసుకొనే సనదులను ఇయ్యడం రెండవది. దేశీయ రాజ్యాల చారిత్రక వంశాలవారు, తమ రాష్ట్రాలను నిరంతరంగా పరిపాలించుకొనే స్వత్వాన్ని, ఈ రెండు ప్రకటనల మూలంగా, మరల సంపాదించుకొన్నారు. తమ రాజ్య విషయకమైన వ్యాకులత్వము ఈ విధంగా తొలగిపోవడంతో, దేశ రాజులు తమ కరారుల విషయములో ప్రభుత్వం గావించిన వ్యాఖ్యానాన్ని చల్లగా, అంగీకరించిరి. ప్రతిష్ఠకు, అధికారానికి, ఈ వ్యాఖ్యానము భంగకరమే. ఐనా, తమ రాజ్యాలు తమకు దక్కినందువల్ల, సంతుష్టులై, బ్రిటిషు రాజ్యాన్ని భారతదేశంలో నిలిపే ప్రయత్నంలో, తమ భక్తి విశ్వాసాలను అర్పించడానికి సంసిద్ధులైరి.

ఈ విధంగా, అప్రతిహతములుగా కనిపించే బలిష్ఠములైన దుర్గాలను, సామ్రాజ్య రక్షణార్థం ఏర్పరచుకొని, రాజకీయశక్తి మూలకమైన మత్తతకు లోనయిపోయింది బ్రిటిషు ప్రభుత్వము. జాతి దురభిమానావేశానికి లోనైయున్న ప్రభుత్వము, దేశములో ఉత్పన్నమై వ్యాప్తి చెందుతున్న పరివర్తన స్వభావ మెటువంటిదో గ్రహింపలేకపోయింది. నోరులేని కోట్లకొలది ప్రజలకు రక్షకులైన తమ ఉద్దేశములు, చర్యలు, వారికి హితకరములైనవనే భ్రాంతిమూలక విశ్వాసంతో ఉన్న బ్రిటీషు పాలకులు, ఆ ప్రజలు లోనైయున్న దుస్థితిని, వారి కష్టములను గుర్తించలేని అంధులైరి. ప్రజల కష్టాల కన్నిటకీ వారి ఆచారాలు, అలవాట్లే కారణములని, వారి బాగుకొరకై తాము పూనిన కార్యములన్నిటికీ అవే ఆటంకములైనవని, చెప్పుతూ, తప్పును ప్రజలపైనే మోపిరి. అధికారులు వహించిన ఆత్మనిష్ఠాపరత్వాభిమానము (Self righteous pride) ఇందుకు కారణము రాజకీయంగా ప్రజానీకం నిశ్చేతనమై ఉండడంవల్లను, బ్రిటీషు రాజ్యానికి ఏ విధమైన హానిని కలిగించడానికీ ప్రజలు అసమర్థులై ఉండడంవల్లను, బ్రిటీషు వారికి, వారి విషయమై ఏ జంకూ లేదు. కనుక, వారి అభ్యుదయానికై ఎట్టి ప్రయత్నమూ చేయవలసిన అవసరమూ లేదు. దేశీయ రాజుల ప్రాబల్యమూ శక్తి సామర్థ్యాలూ నశింపచేయబడినవి. నిరర్థకములైన కొన్ని విశేష గౌరవాలు, అభిమానవాక్యాలు వారిపై ప్రయోగించి వారిని వశపరచుకొన్నారు. కనుక, వారివల్ల కూడా తమ సామ్రాజ్యాని కేవిధమైన అపకారమూ జరగదు.

ఇక, మధ్యతరగతుల వర్గమొక్కటే మిగిలినది. వారిలో, ముఖ్యంగా విద్యావంతుల వర్గం బ్రిటీషు ప్రభుత్వానికి వ్యతిరేకమై, వ్యాకులం కలిగిస్తూ, ఉంది. వీరి సహకారం లేనిదే, పరిపాలన వ్యవస్థ సరిగా జరగ

దనే విషయము ప్రభుత్వమిదివరకే గుర్తించింది. కనుక, వారి సద్భావము అవసరమయింది. విద్యావిహీనులైన ప్రజలు, ఈ విద్యావంతుల పలుకుబడికి లోబడినట్టయితే, క్లిష్ట పరిస్థితులేర్పడవచ్చు. అట్టి అవకాశము కూడా లేకపోలేదు. కనుక, విద్యావంతుల వర్గాన్ని సంతుష్టి పరచడం ముఖ్యము. ఐనా, ప్రభుత్వ విధానాలను గూర్చి, విద్యావంతులు గావిస్తున్న విమర్శలు సహింపరానివై యున్నవి. వారు కోరుతున్న రాజకీయ సంస్కరణలు సామ్రాజ్య ప్రయోజనాలకు విరుద్ధములైనట్టివి. వారు ప్రతిపాదిస్తున్న సంస్కరణ వల్ల, బ్రిటీషు వారి రాజకీయార్థిక ఆధిపత్యమే నశించి పోగలదు. అంతేకాక బ్రిటను దేశపు ప్రయోజన సాధనకై, మహా ప్రయత్నంతో స్థాపించిన సామ్రాజ్యానికే భంగం కలుగవచ్చు. కనుక, ఈ విద్యావంతుల ప్రవృత్తిని, నిరోధించవలెను. వీరిని సాధించడానికి, రెండు మార్గాలుగా ప్రయుక్తమయ్యే, నీతిని అవలంబింపవలసి యున్నది. విద్యావంతుల వర్గం స్వల్పమైనదైనందువల్ల ప్రజాప్రాతినిధ్యమున కర్హమైనది కాదని, వారు కోరుచున్న సంస్కరణలు, కార్య సాధ్యములైనవి కావని, హేతువాదము ననుసరించి, వారి నంగీకరింప చేయడం ఆవశ్యకము. మరిన్నీ, భారతదేశమింతవరకు, స్వచ్ఛందములైన రాజకీయ సంప్రదాయాలను అనుసరించినది. ప్రజాస్వామ్య ప్రభుత్వ ప్రక్రియలు, పద్ధతులు, దేశీయుల అనుభవములో లేనివి. కనుక, ప్రజాప్రాతినిధ్య విధానముపై ఏర్పడే ప్రభుత్వ స్వభావము విదేశీయమైనట్టిది కనుక అది భారత దేశానికి అసంబద్ధమైనది.

అదీకాక, దేశములోని ప్రజలలో ఐక్యములేదు. జాతి, మత, సంస్కృతులకు సంబంధించిన విభేదాలుండడంవల్ల, జాతీయభావం ఉత్పన్నమయ్యే అవకాశంకూడా లేదు. అని పార్శ్వికంగా ప్రభుత్వమువారు వాదించి, విద్యావంతుల వర్గాన్ని తమ అభిప్రాయాలకు ఉన్ముఖంగా చేసుకోడానికి యత్నించినారు. ఈ వాదానికి బలకరంగా, హిందూ ముస్లిములకు పరస్పరం ఏర్పడియున్న మత విభేదాలను కూడా ప్రయోగించిరి. పరిపాలన విధానాల సహాయంతో రాజకీయైక్యమును కూర్చడంకూడా సాధ్యంకాదు. దేశములో పలుముఖములైయున్న సంస్కృతులు, మతములు, రాజకీయైక్యమును నిరోధిస్తున్నవి. ఈ వాదములు, విద్యావంతులైన ముస్లిములకు సంతుష్టిని కలిగించినవి. వీరికి కావలసియున్న తాత్కాలిక ప్రయోజనాలు, సద్యఃఫలములైన లాభాలు, హిందువుల అభిప్రాయాలకు, ఆశయాలకు వ్యతిరేకములైనట్టివి. ఈ రెండు వర్గాలవారికి కలిగిన విభేదము, మత సంబంధమైనదికాదు. వీరికి పరస్పరం జరిగిన దీర్ఘ వివాదాలలో, మత విషయక ప్రసక్తేగాలేదు. ఇస్లాము మతమునకు పోషకులైన ముస్లిము పురోహితులు, జాతీయోద్యమాన్ని, వాస్తవంగా, సమర్థించినారు. శాసనసభల ప్రాతినిధ్యము, ఉద్యోగాలు, ప్రభుత్వంవారి ఆదరణ, - ఇత్యాది లౌకిక ప్రయోజనముల కొరకే, ఈ వివాదం హిందూ ముస్లిముల మధ్య జరుగుతూ ఉండినది.

ఇటువంటి పరిస్థితులను ఆధారంగా చేసుకొని బ్రిటీషు ప్రభుత్వము, పరిహార సమర్పణ దినాన్ని (Day of Reckoning) వెనక వేస్తూవచ్చింది. 'పరుల

మంచి ప్రభుత్వం స్వప్రభుత్వానికి సాటిరాదు'. అనే ప్రాచీన సత్యవాక్కు, ఇండియా విషయములో కూడా సమంజసమైనదని వీరు గ్రహించలేదు. మధ్యతరగతి వర్గానికి దేశములో ఉన్న పలుకుబడి ప్రభావము లెటువంటివో సరిగా గ్రహించలేకపోయిరి. మధ్యతరగతి వర్గము, సంఖ్యలో అత్యల్పమైనదే ఐనా, దేశానికి హృదయస్థానము, ప్రజ్ఞాస్థానము అనే విషయము వీరికి బోధపడలేదు. ఏ రాజకీయ వ్యవస్థకూడా మార్పు చెందక, నిర్వికల్పంగా ఉండజాలదనే ప్రకృతి సత్యాన్ని చరిత్రనుండి కూడా వీరు గ్రహించలేదు. ప్రపంచదేశాలలో కలుగుతున్న పరివర్తనలను బట్టి చూస్తే, ఇండియా సామ్రాజ్యము కూడా, పతనం కావడానికి సిద్ధమై ఉన్నదన్న విషయమూ అర్థంకాలేదు. ఇండియాలోని మత భేదాలు సామ్రాజ్య వినాశాన్ని రక్షింపజాలవనే జ్ఞానమూ కలుగలేదు. వారి మొండితనము హ్రస్వదృష్టి, అతిశయమైన అహంకారము,- వీరికి అతి విశ్వాసభావాన్ని కలిగించినవి. కనుకనే, కాలదేశపరిస్థితులను గమనించక, భవిష్యద్వ్యవస్థకు ప్రయత్నించక, మూర్ఖపు పట్టుదలతో నిలిచినారు.

బ్రిటీషు పరిపాలన చిరకాలం నిలిచి ఉండదని గుర్తించిన వివేకవంతులు, ఆంగ్లేయులలో కొందరుండిరి. ఎన్నడో ఒకనాడు స్వాతంత్ర్యానికి అంగీకరించడం తప్పదని వారు గుర్తించియుండిరి. మరికొందరు ఉదారాశయములు కలవారైనా, దేశములోని అతిక్లిష్టసమస్యలవల్ల అస్తవ్యస్తతకులోనై, భవిష్యత్తునుగూర్చి నిష్కర్షగా నిర్ణయించలేకపోయిరి. కాని, పరిపాలన వర్గమువారుమాత్రం, తమ పట్టుదలను వదలదలచుకోలేదు. ఇండియాపై, తమ పరిపాలనను సడలించడానికి ఉద్దేశించలేదు. బ్రిటీషువారి ప్రయోజనాలను సాధించుకోవడానికి రాజకీయాధిపత్యము ఆవశ్యకంకాదని స్పష్టమౌతూ వచ్చినా, వీరుమాత్రం సామ్రాజ్య ప్రతిష్ఠను, ప్రదర్శించడం మానుకోలేదు.

కార్లైలు గావించిన హెచ్చరిక 18 వ శతాబ్దపు ఫ్రాన్సు దేశానికి మాత్రమే కాక, ఇతరత్రాకూడా సమానంగా వర్తిస్తుందన్న విషయం వీరు మరచిరో, లేక, అది అప్రస్తుతమని తలచిరో తెలియదు. "ఇరవై ఐదుమిలియన్ల హృదయాలను పీడిస్తున్న, ఆకలిబాధ, చలిబాధ, న్యాయబద్ధమైన అత్యాచార భారము - ఇవి ఫ్రెంచి విప్లవానికి ప్రేరకములైన ముఖ్యకారణాలు. తత్త్వశాస్త్ర వాదుల ప్రతిహత తత్త్వాలు, అపహతములైన ఈ తత్త్వవాదుల దురహంకారాలు, విప్లవ హేతువులుకావు. అన్నిదేశాలలోను, అన్ని విప్లవాలలోను, ప్రజల దుస్థితులే, కారణములు కాగలవు" అని కార్లైలు వ్రాత.

ఈ కాలపు విప్లవవాదులలో గొప్పవాడైన, లెనిన్, చెప్పిన సత్యాన్ని కూడా, వీరు జాగ్రత్తగా గమనించలేదు. "ప్రజలున్నచోట రాజకీయాలు బయలు దేరుతాయి. ప్రజలసంఖ్య వేలకొలది మాత్రమే ఐనప్పుడు రాజకీయములు తీవ్ర రూపాన్ని దాల్చవు. కాని, ప్రజాసంఖ్య మిలియను లైనప్పుడు, తీవ్రమైన రాజకీయాలు ప్రారంభమౌతాయి." అని లెనిన్ చెప్పినాడు.

ఇండియాలోకూడా, ఆకలి, గుడ్డలకరువు, ప్రభుత్వపు పీడన, కోట్లకొలది ప్రజల హృదయాలను వేధించి, అతి సాహసకార్య ప్రేరకములైన ఉద్రేకాల నుత్పన్నం గావిస్తున్నవి. ఉత్తమ జీవితాశను కలిగిస్తున్న, వ్యక్తులను అనుస రించేటట్లు చేస్తున్నవికూడా, ఈ దుస్థితులే. భవిష్యత్తులోని శుభాన్ని ప్రజలకు సూచిస్తున్న నాయకులకు నైతిక స్థైర్యాన్ని కలిగించినవి కూడా ఇవే. ప్రపంచ జనాభాలోని ఐదవ భాగమైన, ప్రజానీకంయొక్క అసంతుష్టి, ప్రపాతరూప ములో వస్తూఉండగా, కెన్యూట్ గావించిన సూచనతో, ఈ ప్రవాహాన్ని ఆపడం సాధ్యంకాదు. ప్రవాహాన్ని పాయలుగా చీల్చి, ప్రవహింపచేసి, కొంతకాలం వినా శాన్ని తప్పించుకోవచ్చు. అంతేకాని, ఆ ప్రవాహవేగాన్ని శాశ్వతంగా ఆపలేము. దాని గమ్యస్థానంనుంచి దానిని ఆపియుంచలేము.

# 12
# రాజకీయోద్యమము

## I. మధ్య తరగతుల వారి కార్యభారము

పందొమ్మిదో శతాబ్దపు రెండవ భాగంలో బ్రిటీషువారు అనుసరించినది యాదృచ్ఛికనీతి. కనుక దానిది అనిశ్చిత స్వభావము. రాజకీయారంభశక్తి విదేశ పరిపాలకుల హస్తములనుంచి జారిపోసాగింది. లండనులో ప్రతిష్ఠితమైన బ్రిటీషు సామ్రాజ్య శక్తి కేంద్రీకృతం కావడము, అయోసదృశమైన అధికారితంత్ర ప్రభుత్వము దీనికి ఆధారమై నిలువడము, అప్రతిహతంగా, అచలంగా, గోచరించే సైన్యశక్తి పునర్వ్యవస్థ పొందడము, – మొదలైనవన్నీ, ఒక పక్షంలో జరిగిన కార్యాలు. విస్తారమైన భారతీయ ప్రజానీకము, దరిద్రులు, నిరక్షరాస్యులు, ఆయుధ విహీన మొనర్చబడినవారు, భేదోపాయ ప్రయోగమువల్ల చీలిపోయిన వర్గాలు, – ఇత్యాదులతో ఏర్పడిన నిశ్చేతనమైన మట్టిముద్ద, రెండవపక్షము. ఈ రెంటికీ మధ్యనున్నది అభివృద్ధి చెందుతున్న మధ్య తరగతి వర్గము. అల్ప సంఖ్యాకము, దేశపు వివిధభాగాలలో వికీర్ణము, పట్టణములలోమాత్రమే సంకీర్ణము ఐన, ఈ మధ్య తరగతివారు, ఆధునిక భావాలను అవగాహన చేసుకొని, రాజకీయార్థిక విషయములలో, విమర్శాత్మక దృష్టిని అలవరచుకొని యుండిరి. కార్యతః, వీరిని ఆవరించియున్నది, మధ్యయుగాల వ్యవస్థకు లోనైయున్న, విస్తృతమైన వ్యావసాయిక జనవర్గము. మధ్యయుగకాలపు సంబంధబాంధవ్యాలు, కులములు, వీరితో అనుబంధాలను కలిగించియున్నవి. ఆచారములు, దైనికచర్యలు, భావనాత్మక ప్రతిక్రియలు,– ఇత్యాదులలో, ఈ మధ్యతరగతుల వారిపై, ప్రజానీకం యొక్క ప్రభావప్రాబల్యములు అధికములు. సంప్రదాయానుబంధాలను పూర్తిగా త్రెంచుకోవడం సాధ్యముకాదు. అట్టిది అసహజము. వారు నూతనంగా కనుగొన్న భారతజాతి ప్రాచీన ప్రాభవము, వీరికి ఆత్మ ప్రత్యయాన్ని, ప్రతిష్ఠ భావనను, కలిగించింది. సనాతన సంప్రదాయ వ్యవస్థలో, ఉన్నత జీవితాదర్శములు గోచరించినవి. అవి వీరి ప్రస్తుత జీవితానికి కూడా, సుస్థిరములైన ఆధారములైనవి. ఐనా, ప్రాచీనమైన దంతయు విలువగలదికాదు. కనుక, ప్రాచీన సంప్రదాయములలో వర్జింపదగినవేవి, అవలంబించి పోషింపదగినవేవి, ప్రాచీనములైన వాటిని ఆధునికతతో మేళవించి, ప్రవృత్తికి అర్హములైన ఆదర్శముల నేర్పరచుకొనడమెట్లు, అనే ప్రశ్నలకు సమాధానము త్వరలో లభించేదికాదు. ఈ సమస్యలను తార్కికరీగా కూడా పరిష్కరింపలేము. వాస్తవ జీవితపరిస్థితుల ఆధారముపై

వాటికి రూపురేఖలను కల్పించుకొనవలసి యున్నది.

లౌకికము, ప్రజాస్వామ్యము, జాతీయదృక్పథము, అనే, భావాలను, అవలంబించిన ఈ వర్గము, అసమతలమైన మార్గంలో నడిచి, క్రమంగా మధ్యతరగతిగా పరిణామంచెందింది. ఐనా, ప్రతిమానవునికీ, సమానమై, ప్రకృతి సహజమై ఉన్న స్వాతంత్ర్యకాంక్ష దేశములోని అన్నివర్గాల వారినీ, సంక్షోభపెట్టింది. ఎట్టి అనిశ్చయములు, సందేహములు, భయములు, పిరిమనస్సుల నావహించియున్నా, దేశ ప్రభుత్వము ప్రజా ప్రభుత్వమై ఉండవలెననీ, ప్రతివ్యక్తికీ ఆ ప్రభుత్వపరిపాలనలో తగిన భాగము ఏర్పడవలెననీ, కోరుతున్నారు.

ఇది అపూర్వమైన పరిస్థితికాదు. రాజకీయ స్వాతంత్ర్యము అన్నివిధములైన సామాజిక వ్యవస్థలతోనూ చేరియుండవచ్చు; చేరియుండినది కూడా. సామంత పరిస్థితి, అర్ధదాస్య-అర్ధస్వతంత్రవ్యస్థ, మూఢ విశ్వాస నిబద్ధమైన వ్యవస్థ, అనేక మతవ్యవస్థ, అర్ధనిరక్షరాస్య వ్యవస్థ, - మొదలైన సాంఘిక వ్యవస్థలన్నిటిలోనూ, రాజకీయ స్వాతంత్ర్య విధానం ఏర్పడవచ్చు ప్రజలలో నైతిక పరిపూర్ణత ఏర్పడి, సాంఘికలోపములన్నీ నశించి, సార్వత్రికమైన అక్షరాస్యత ఏర్పడునంతవరకూ, స్వాతంత్ర్యము వేచి యుండనక్కరలేదు.

కనుక, తన దుర్బలత్వ మెంతఉన్నా లెక్కించక, ఇండియా సమాజంలోని మధ్య తరగతి వర్గము, బ్రిటీషు ఆధిపత్యాన్ని ఎదిరించి నిలిచింది. సందర్భములు కూడా సహకరించినవి. భారతీయులతోచేరి, ఏకమై పోవడానికి పరిపాలకులు నిరాకరించిరి. వారి ప్రభుత్వము భారతీయ సమాజంలో కలిసిపోయేదికాదు. భారత ప్రకృతికి విరుద్ధమైనట్టిది. అసహజము, బాహ్యము ఐన ఈ అంశము, భారత రాజకీయ వ్యవస్థలో బలాత్కారంగా వచ్చికూర్చున్నది. భారతజాతితో ఐక్యమొందడానికి ఆంగ్లేయులు నిరాకరించినందువల్ల, భారతజాతి అవ్యవస్థమైయున్నంతవరకే, వారు ఈ దేశంలో తమ వ్యవహారాలను సాగించుకోగలరు. తన జాతీయైక్యమును భారతదేశం గుర్తించిన వెంటనే, తన ప్రకృతికి హానికరమైయున్న ఈ విజాతీయాంశాన్ని బహిర్గత మొనర్పకపోదు.

మరిన్నీ, బాహుబలంవల్ల సంపాదించుకొన్న రాజ్యాన్ని నిలుపుకోడానికి నైతికసమర్థన మావశ్యకము. సంగీనములతో (Bayonets) దేనినైనా సాధించవచ్చును కాని, వాటిపై కూర్చొని ఉండలేము. పాలిత ప్రజల మాన్యత, అంగీకారము, సద్భావము,- అనువాటి నాధారంగా చేసుకొని, పరిపాలనను సమర్థింపవలసి ఉంటుంది. ప్రజల సంకల్పాన్ని తిరస్కరిస్తే, తత్ఫలింతగా ప్రతిభటనం ప్రారంభమౌతుంది. బలాత్కారాన్ని, హింసాపద్ధతిని, విసర్జించి, ప్రజాసంకల్పాన్ని వికసింపజేస్తే, స్వయం పరిపాలన సంకల్పము, తప్పక ఉద్భవిస్తుంది. కనుక, ఏవిధంగా, చూచినా, పరప్రభుత్వమును వినాశం గావించే బీజములు, ప్రకృతి సిద్ధంగా, దానియందే నిహితమైయుంటాయి.

## II. ప్రాథమిక రాజకీయ సంస్థలు

భారతీయ వ్యక్తిత్వంలోని రాజకీయ చైతన్యము, రామ్ మోహన్‌రాయ్ కాలమునాటికే, వ్యక్తమైయున్నది. అతడు ప్రారంభించిన ఉద్యమాన్ని, ఉదార వాదులు, రూఢవాదులు కూడా కొనసాగిస్తూ వచ్చిరి. వీరిలో అభ్యుదయవర్గం వారి కార్యక్రమము ఎక్కువ చురుకుగా సాగింది. 1828 లోనే, వీరు అకెడెమిక్ అసోసియేషన్ (Academic Association) ప్రారంభించి, ఆ సభలలో మత నైతిక సమస్యలనేకాక, సాంఘిక రాజకీయ విషయములనుకూడా, చర్చిస్తూ ఉండిరి. 1838 నాటికి 'సాధారణ విజ్ఞానార్జన సంఘము' ను స్థాపించి, దానిలో, జూరీ విచారణ, పత్రికా స్వాతంత్ర్యము, ప్రభుత్వ శాఖలలోని నిర్బంధసేవ, -మొదలైన సమస్యలను చర్చించేవారు. ఆ తరవాత, 1842 లో, ద్వారకనాథ టాగోరు, ఇంగ్లాండునుంచి, జార్జ్ థాంసన్ (George Thompson) అనే వ్యక్తిని తనతో తెచ్చి, రాజకీయోద్యమ వ్యవస్థను ఏర్పరచే కార్యమును అతని కప్పగించెను. దాస్య నిరుద్ధోద్యమాన్ని ఇంగ్లాండులో ఏర్పరచి, ఆందోళన గావించడంలో, థాంసన్, అనుభవం కలవాడు.

ఇండియా రావడంతోనే, ఇతడు కలకత్తాలో బహిరంగ సభలు జరపడానికి ఆరంభించెను. తత్ఫలితంగా, 1843 లో, బెంగాలు బ్రిటీషు ఇండియా సొసైటీ స్థాపింపబడినది. ప్రజల జీవన పరిస్థితులకు, న్యాయపరిపాలనకు, సంస్థలకు, దేశములోని మూల సాధనములకు, సంబంధించిన వివరాలను, విషయ పరిజ్ఞానాన్ని సేకరించి, ప్రజలలో వీటిని ప్రసారము గావించడం, ఈ సంఘము పూనుకొన్న ఉద్దేశాలలో ఒకటి. ప్రజల శ్రేయోభివృద్ధిని కలిగించి, ఇండియాలోని అన్ని వర్గాల ప్రయోజనాలను అభివృద్ధిగావించి, వారి హక్కులను సాధించడానికి, తగిన సాధనాలను సమకూర్చడానికి శాంతియుతమార్గంలో న్యాయపద్ధతిలో ప్రయత్నించడం, రెండవ ఉద్దేశము. 1838 లో, కలకత్తాలోని, భూ సంపదగల వ్యక్తులు 'భూస్వాముల సంఘము' అను సంస్థను స్థాపించి, తమ హక్కులను రక్షించుకొనే ప్రయత్నానికి పూనియుండిరి. ముక్తశుల్కములైన తమ భూములను ప్రభుత్వము లాగుకొనే ప్రయత్నాన్ని, దావాలువేసి, నిరోధించడం వారు మొదట పూనుకొన్న ఉద్యమము.

అగ్ర వర్గాలకు చెందిన భూస్వాములు, మధ్యతరగతికి చెందిన అభ్యుదయవాదులుకూడా, ఈ విధంగా రాజకీయాందోళనలో చేరియుండిరి. ఈ రెండు వర్గాలవారూ ఏకమై, 1851 లో 'బ్రిటిష్ ఇండియన్ అసోసియేషన్' స్థాపించిరి. రాధాకాంతదేవ్ ఈ సంఘానికి మొదటి అధ్యక్షుడు; దేవేంద్రనాథ టాగోర్ మొదటి కార్యదర్శి. ప్రాదేశిక పరిపాలన వ్యవస్థలోను, ప్రభుత్వ పద్ధతిలోనూ, మార్పులు కావలెనని వీరు కోరుతూ వచ్చిరి. "పూర్వపు పరిపాలన వ్యవస్థ విషయములోను, భావి పరిపాలన విషయములోను, ప్రజల భావము లెట్టివై యున్నవో, బ్రిటీషు పౌరులకు తెలియపరచవలెను", అని వీరు నిశ్చయించుకొనిరి. 1853 నాటి, శాసపత్రం విడుదలకాక పూర్వము, బ్రిటీషు ప్రభుత్వము

జరిపిన విచారణ సందర్భంలో ఈ సంఘమువారు ఒక మహాజరును పార్లమెంటుకు పంపియుండిరి. అందులో, ఇతర ప్రతిపాదనలతో పాటు, శాసన పరిషత్తులకు ప్రతినిధులను, ప్రజలు ఎన్నుకొనవలెననే ప్రతిపాదనకూడా ఉన్నది.

ఇట్టి ప్రయత్నాలే ఇండియాలోని ఇతర భాగాలలోకూడా జరుగుతూ ఉండినవి బొంబాయిలో, 'లోకహితవాది' దేశముఖ్, ఇండియాలో ఒక పార్లమెంటు ఏర్పడవలెననీ, దానిలో ప్రతి పట్టణానికి, జిల్లాకు ప్రాతినిధ్యం సిద్ధించవలెననీ, వాదిస్తూ ఉండెను. 1852 ఆగస్టులో, జగన్నాథశంకర్ శేట్, దాదాభాయి నౌరోజీ, నౌరోజీ ఫెర్డున్‌జీ, భావూదాజీ, మొదలైన ప్రముఖులు 'బొంబాయి అసోసియేషన్' స్థాపించిరి. "ప్రజల కోరికలను తెలిసికోవడం, ప్రజల బాగుకై జరుపవలసిన కార్యములను అధికారులకు సూచించడం, ప్రస్తుతం నెలకొనియున్న దుష్ట పరిస్థితుల నిర్మూలనమును కోరుతూ, ఇండియా ప్రభుత్వానికి, ఇంగ్లాండు ప్రభుత్వానికి, మహాజర్లు పంపడం, ప్రజలందరికీ సాధారణంగా వర్తించే ప్రయోజనాలను ప్రవేశపెట్టవలసిందని ప్రభుత్వాన్ని మహాజర్లద్వారా ఒత్తిడి చేయడము,- ఇత్యాదులు ఈ సంఘముయొక్క ఆశయాలు.

దుష్పరిపాలనను గూర్చి, నిష్కర్షములైన నిశ్చిత ఆరోపణలను ప్రభుత్వముపై మోపి, 1853లో, ఈ సంఘం, పార్లమెంటుకు ఒక విన్నప పత్రాన్ని పంపుతూ, కార్యాత్మకములైన సంస్కరణలు సూచించింది. శాసన పరిషత్తులను పునఃవ్యవస్థగావించడము, ఉన్నతోద్యోగాలకు భారతీయులను గ్రహించడము, విశ్వవిద్యాలయాలను స్థాపించడము, అనే సలహాలు కూడా ఈ పత్రములో ఉన్నవి.

మదరాసు రాజధానిలో కూడా, ఇట్టిదే ఒక సంస్థ 'మదరాసు దేశీయ సంస్థ' అనే పేరుతో,-1853 శాస పత్రం వచ్చిన వెంటనే,-స్థాపింపబడింది. "రాజధానిలోని ప్రజల కష్టాలను, వారి అవసరాలను, పార్లమెంటు దృష్టికితెస్తూ, ఈ సంఘంకూడా, ఒక విన్నప పత్రాన్ని, పంపింది. ప్రజలకుగల కష్టాలలో పన్నుల భారం ప్రధానమైనదిగా పేర్కొనబడింది." "జమీందారీ పద్ధతిలోనూ, రైతువారీ పద్ధతిలోనూ కూడా ప్రభుత్వము తెచ్చిపెట్టిన మార్పులు, అసహ్యాకరమైనవి. ఈ రెండు మార్పులు కూడా, అన్యాయానికి, అత్యాచారానికి, సాధనములుగా ఏర్పడినవి. అందులోను, రైతువారీ పద్ధతివల్ల వ్యవసాయవర్గంవారు, అత్యంతమైన దారిద్ర్యానికి, దిక్కులేనిస్థితికి పాల్పడినారు." అని పార్లమెంటుకు తెలిపినారు. "న్యాయస్థానాలసంఖ్య స్వల్పమై యుండడము, కాలవిలంబము, వ్యయము అధికమై యుండడము, ప్రజలకు కష్టమును కలిగిస్తున్నవి." అని తమ ఆక్షేపణను తెలిపినారు. "రహదారుల నిర్మాణము, వంతెనల నిర్మాణము, నీటి సాగుబడి కార్యములు, ప్రజల విద్యావ్యాప్తికి తగిన సౌకర్యాలు, - ఇత్యాదులు ప్రజల ముఖ్యావసరములు! పరిపాలన వ్యవస్థయొక్క ఖర్చులను తగ్గించవలసిన అవసరమున్నది. ప్రజల క్షేమమును గూర్చి, దేశముయొక్క ఆర్థిక సమృద్ధికి అనుకూలపడే స్థానిక ప్రభుత్వాన్ని ఏర్పరచడం ప్రధానవిషయము."

ఈ విధంగా ఇండియా ప్రభుత్వం కంపెనీవారి హస్తములనుంచి ఇంగ్లాండు రాజు ఆధీనములోనికి పోకపూర్వమే, విద్యావంతులవర్గము, ప్రజాభిప్రాయాన్ని వ్యవస్థీకరించి, పరిపాలనలోని లోపాలను, దోషాలను ప్రదర్శించడానికి ప్రారంభించి ఉండినది. పాశ్చాత్య పద్ధతులపై రాజకీయాందోళనను ప్రయోగించడానికి కూడా ప్రారంభించిరి. తమ కష్టనివారణకై ఇండియా ప్రభుత్వాన్ని, ఇంగ్లాండు ప్రభుత్వాన్ని, కూడా కదలించవలసిన అవసరాన్ని వీరు గుర్తించిరి,

19 వ శతాబ్దపు ఉత్తరార్ధంలో, బ్రిటీషు పరిపాలకులకు, ఇండియా మధ్య తరగతులవారికీ, జరిగిన సంఘర్షణ ప్రక్రియలో, రెండు అవస్థాకాలములున్నవి. మొదటి అవస్థ 1885 లో, భారత జాతీయకాంగ్రెసు స్థాపనతో, ముగిసింది. ఈ మొదటి అవస్థలో, రాజకీయోద్యమానికి సక్రమవ్యవస్థ ఏర్పడి ఉండలేదు. ప్రారంభ శక్తిలేనిదై, తాత్కాలికోద్రేకములకు లోనై ఉండినది. వ్యతిరేక చర్యలు జరిగి, ఉద్రేకమును కలిగించినప్పుడు మాత్రమే ప్రతిక్రియాచరణము గావించి, ఉద్రేకకారణము నశించిన వెంటనే, ఈ ఉద్యమముకూడా చల్లబడుతూ ఉండినది. ఈ అవస్థాదశలో, మధ్యతరగతివారు ప్రబలురుకారు. కనుక, వారి రాజకీయ కార్యక్రమానికి కూడా, ఒక ప్రణాళిక, ఐక్యము సిద్ధించి ఉండలేదు. కాని, 1885 పిమ్మట, దీనికి బలము, ఆత్మప్రత్యయము, అధికమైనవి. రెండవ దశావస్థలో, రాజకీయోద్యమాన్ని కూడగట్టుకొనే ప్రయత్నానికి, కాంగ్రెసు, కేంద్రంగా ఏర్పడింది. ఆందోళనకు వేగశక్తి అధికమయింది. బాధ్యతాయుత స్వపరిపాలనను సాధించడం ధ్యేయంగా ఏర్పడింది.

## III. జాతీయోద్యమారంభ దశ

19 వ శతాబ్దపు రెండవ భాగంలో, బ్రిటిషు సామ్రాజ్యనీతి విస్తారంగా అధికమై, సుదూరవ్యాప్తమైన పరిణామములను కలిగించిందని, గుర్తుంచుకోవడం అవసరము. ఏషియాలోను, ఆఫ్రికాలోను, ఇంగ్లాండు పూనుకొన్న సామ్రాజ్య యుద్ధాల ఫలితంగా, ఇండియాపై భార మధికమై, దేశపు ఆర్థిక సాంఘికాభివృద్ధులను కుంఠితమొనర్చింది. ఈ బ్రిటిషు సామ్రాజ్య విస్తృతి, ముస్లిము రాజ్యాలపై జరిగినందువల్ల, ఇండియాలోని ముస్లిములకు బాధకలిగింది. పర దేశములలోని తమ మతానుయాయులకు కలిగిన దురవస్థల కారణంగా, వీరిలో మతోద్రేకము ఉత్పన్నమయింది. తత్ఫలితంగా, ముస్లిము మతభావన ఘనీభవించి, అతీత క్షేత్రానుబంధాలకు దారితీసింది (Extra territorial linkages).

ఇక భారతదేశంలో, పరిపాలక వర్గం వారి మనఃప్రవృత్తిలో మార్పు కల్గడము వల్లను, సామ్రాజ్య దురహంకారము పెరగడం వల్లను, మధ్య తరగతుల వారు, తమ అవమానకర పరిస్థితిని, తమ అధీన స్థితిని గ్రహించి ఖిన్నులైనారు. కనుక వీరికి కోపం పెరుగుతూ వచ్చింది. సాంఘిక అసామ్యత విషయమై అసమా

ధాన చిత్తులై యున్న మేధావంతుల వర్గము, ప్రధానంగా ప్రాతినిధ్య ప్రభుత్వ మును గూర్చి, సివిల్ మిలిటరీ సేవలలో జరిగిన అన్యాయమును గూర్చి, ఘర్షణ పడుతూ ఉండిరి. ప్రభుత్వం అవలంబించిన స్వేచ్ఛా వాణిజ్య విధానం వల్ల, ఇంగ్లాండు ఆర్థిక ప్రయోజనములు రక్షితములై, ఇండియా ఆర్థిక ప్రయోజనము లకు హాని కలిగించినందువల్ల వర్తక సంఘము వారు ఉద్రేకమునకు లోనై ఉండిరి. వర్తకుల ఉద్యమములన్నీ, ప్రభుత్వము కల్పించిన పరిపాలన ప్రతిబంధక ముల కారణంగా, కుంఠితమై పోయినవి. ఇక ప్రజానీకం, వారి ఆర్థిక పరిస్థితి దుఃఖభూయిష్ఠమైనది. వారి జీవన ప్రమాణము సాధారణ స్థితికి కూడా అధమమై నట్టిది. పదేపదే ఏర్పడిన క్షామములవల్ల వారి దుస్థితి అంతులేనిదయింది. ఇట్లు దేశమంతటా సాధారణమై ఉన్న దురవస్థకు తోడుగా, ప్లేగు అంటువ్యాధి అక స్మాత్తుగా బయలుదేరి, అసంఖ్యాకమైన ప్రజను పొట్టబెట్టుకొని, దేశమంతటా భయోత్పాతాన్ని రేపింది (1892 నుండి). పరిస్థితులింత తీవ్రములై యున్న సమ యములో, మత సంస్కర్తలు బయలుదేరిరి. మతమును గూర్చిన, నిజభావాన్ని ప్రజలలో ఉద్బోధపరచి, తోడి మానవులపట్ల తమకు గల కర్తవ్యాన్ని ప్రబోధింప సాగిరి. మత సంస్కరణోద్యమము, సాహిత్య పునరుజ్జీవనానికి ప్రేరణ శక్తి అయింది. జాతీయతా భావనను, దరిద్రసోదరుల విషయంలోను, పరాధీనులైన దీనుల విషయంలోను సానుభూతిని, ఈ ఉద్యమం ఉత్తేజనం గావించింది. కవులు, నవలా రచయితలు, వ్యాసరచయితలు, పత్రికా రచయితలు, చరిత్రకారులు- అందరూ జాతీయ చైతన్య వికాసానికి ప్రోద్బలం కావించిరి.

పాశ్చాత్య దేశములలో జరిగిన పరప్రభుత్వ విమోచనోద్యమాలు, ఐర్లం డులో జరిగిన స్వయంపరిపాలనోద్యమము, ఇటలీలో జరిగిన ఐక్యఉద్యమ, స్వాతం త్రోద్యమాలు - వీటిని గురించిన పరిజ్ఞానాన్ని రచయితలు, వక్తలు, ప్రజలలో ప్రచారము గావించిరి.

మ్యాజినీ,గ్యారిబాల్డి, క్యావోర్, విలియం వాలేస్ (స్కాట్‌లండ్ వీరుడు), వీరిని గూర్చి, 'సోమ్‌ప్రకాశ్' పత్రిక వరుసగా వ్యాసములను ప్రకటించింది. ఇటలీ దేశపు పునరుజ్జీవనమును గూర్చి, సిక్కుల చరిత్రను గూర్చి సురేంద్రనాథ బెనర్జీ 1875 లో వరుసగా ఉపన్యాసములిచ్చి, సిక్కు నాయకుల ధైర్యస్థైర్యములను గూర్చి, అత్యుదాత్తంగా ప్రశంసించినాడు. థోర్యూ, టాల్‌స్టాయ్, అగస్టికాంటే మున్నగు మహాపురుషుల అభిప్రాయములను ఇతరులు విస్తృతి గావించిరి. బంకిం చంద్ర చటర్జీ (1838-94) తన అసదృశమైన ప్రతిభను వినియోగించి, భావనా త్మక రచనల ద్వారా దేశభక్తిని ప్రజలలో ప్రబోధం గావించెను.

ఈ విధంగా ఉద్బుద్ధమైన చైతన్యం కార్యకారిగా పరిణమించింది. 'జాతీయ సంస్థ' (National society) స్థాపితమయింది. దానికి రాజనారాయణ బోసు, నాబాగోపాల్ మిత్తర్, మార్గదర్శకులైన జ్యోతులు. ఒక పాఠశాలను. ముద్ర ణాలయాన్ని, వ్యాయామశాలను ప్రారంభించిరి. వారు ప్రారంభించిన 'హిందూ

'మేళ', ప్రతి సంవత్సరమూ నిర్వహింపబడుతూ వచ్చింది. హిందూ ఆధిక్యము, ప్రాచీన, ఆధునిక - సంస్కృతులు, బెంగాలీ భాషా సారస్వతములు ఇత్యాది విషయములపై వారు ఉపన్యాసములను నిర్వహిస్తూ వచ్చిరి. "మిలేసబే భారత సంతాన్" (భారత సంతతివారంతా ఐక్యము కండి) అనే మకుటముతో గేయాలు పాడటం ప్రారంభమయింది. పాశ్చాత్య దేశ పర్యటనము నుంచి మరలి వచ్చిన వివేకానందస్వామి, తన ఉపన్యాసాలలో స్వాతంత్ర్య సంపాదనకై, గంభీర స్వరంతో ప్రజలను మేల్కొల్పినాడు. "మేల్కొనండి, ధైర్యం వహించండి, ప్రజానీకాన్ని సేవించండి" అని యువ భారతాన్ని ఉత్తేజన పరచినాడు.

ముస్లిము ప్రజానీకాన్ని నడపుతూ ఉండిన ముస్లిము ఉలామాలు, బ్రిటీషు పరిపాలనకు విరోధులు. విస్తారమైన పలుకుబడి కలిగి, ముస్లిముల మాన్యతకు పాత్రమైయున్న 'దేవబంద్' విద్యాలయము, బ్రిటీషు ఆధిపత్యాన్ని క్షీణింపజేసే ఉద్యమాల కన్నిటికీ సహాయంగా నిలిచి, స్వాతంత్ర్య కాంక్షకు బలం చేకూరుస్తూ వచ్చింది.

1851 లో, బ్రిటీషు ఇండియన్ అసోసియేషన్ స్థాపితమై ఉండినది. కాని, దానిని ప్రజాస్వామ్య పద్ధతులలో నిర్వహించడానికి, అమృత బజార్ పత్రికా స్థాపకుడైన శిశిరకుమారఘోష్ ప్రయత్నించెను. కాని ఆ ప్రయత్నం సఫలం కాలేదు. అంతట, సురేంద్రనాథ బెనర్జీ అతని మిత్రులైన ఆనందమోహన బోస్, (కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయపు మొదటి గణితశాస్త్ర శ్రేష్ఠుడు), బ్రహ్మసమాజ నాయకుడైన శివనాథశాస్త్రి, కృష్ణమోహన బెనర్జీ, కలిసి, 1876 లో, "భారతీయ సంఘాన్ని" స్థాపించిరి ఈ సంఘ శాఖలు, బెంగాలు జిల్లాలలో ఏర్పడినవి. ఇతర ప్రాంతాలలోని రాజకీయ సంస్థలతో దీనికి సంబంధములు ఏర్పడినవి.

ఈ సంఘపు ఆధ్వర్యంలో, సురేంద్రనాథ బెనర్జీ, భారతదేశ పర్యటనం గావించి, (1877-88), దేశ పత్రికా శాసనాన్ని ఖండించి, నిరసించడానికీ, లైసెన్సు చట్టాన్ని ఖండించడానికీ, రైతుల హక్కులను రక్షించడానికీ ప్రజా కార్యక్రమాలను ప్రారంభించెను. 1880 లో, ఇంగ్లాండులో జరిగే ఎన్నికలకు ముందు, ఇండియా ప్రజల సమస్యలను బ్రిటీషు ప్రజల దృష్టికి తెచ్చే నిమిత్తం లాల్ మోహన ఘోష్, ఇంగ్లాండుకు పోయినాడు

"చిరకాలంగా అలవాటు పడియున్న జడతను, నిరుత్సాహాన్ని విసర్జించి, భారత జాతి పునస్సృష్టికి అవసరమైన, ఆసక్తిని, శక్తిని ప్రదర్శించవలసిందని, ప్రజలను" బెంగాలీ పత్రిక ఉద్బోధించింది. "ఇండియాలోని ముఖ్య పట్టణాలలో బహిరంగ సభలు జరిపి, భారతీయుల సమస్యలను చర్చించి, ప్రజల అవసరాలను, కోరికలను, ప్రపంచానికి తెలియ చేస్తామని, ఈ పత్రిక ప్రకటించింది. భారతదేశ సమస్యలను గూర్చిన వ్యాసాలను రచించి, భారతదేశంలో అన్ని భాగాలకూ పంపి, ఇండియాపట్ల, సానుభూతిగల మహనీయుల నందరినీ, కూడగట్టుకొని, విదేశాల లోని ఉదార వ్యక్తులతో కూడా, ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి, భారతదేశము లోని ఐక్య సంస్థతో వారికి అనుబంధమును కల్పించే మహా ప్రయత్నమునకు

బూనుకొన్నది ఈ సంఘం. ఇండియాలో నున్న భారతదేశ మిత్రులు, ఇంగ్లాండు లోని మిత్రులు, ఈ విధంగా ఐక్య సంస్థగా ఏర్పడితే, ఆ సంస్థ యొక్క శక్తిని అడ్డగించే వారుండరు".

## IV. సామ్రాజ్య నీతి పునరుజ్జీవనము (Imperialism Redivivus)

1870 తర్వాత సామ్రాజ్య నీతిని పునరుద్ధరించి, సామ్రాజ్య విధానాలకు నూతన చైతన్యము కలిగించడము బ్రిటిషు వారి ప్రయత్నము. స్వపరిపాలనను సాధించడం దేశీయ విద్యావంతుల ప్రబల ప్రయత్నము. ఈ రెండు శక్తులును రాజకీయోద్యమ పరిణామాభి వృద్ధికి హేతువులైనవి. ప్రజల కోరికలను కొంతకు కొంత మన్నించి, వారిని తృప్తిపరచడం, రాజనీతియని బ్రిటీషు వారు, అప్పుడప్పుడు అనుకొనేవారు. కనుకనే, ప్రభుత్వ పరిపాలన శ్రేణికి ప్రథమ సోపానమైన ప్రాదేశిక స్వపరిపాలనకు సంబంధించిన సంస్కరణలు, విధిలేక, ప్రారంభింపబడినవి. పట్టణములలోను, జిల్లాలలోను అయిష్టంగా ప్రారంభించిన ఈ మార్పులు రాజకీయాభివృద్ధి యని, ప్రభుత్వం స్వయంగా తెచ్చి పెట్టిన విప్లవాత్మకమైన ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వమని, పరిపాలకులు, ఆత్మప్రశంస గావించుకొనేవారు. ఇట్లు, ప్రజల హక్కుల విషయమై పాలకులకు, పాలిత ప్రజకు జరిగిన ఘర్షణలతో శతాబ్దపు కడపటి భాగం, సాగిపోయింది. హక్కులకై ప్రజలు ఒత్తిడి చేయడం, ప్రభుత్వం తిరస్కరించడం, ఈ విధంగా కాలం గడిచిపోయింది.

1857 నుండి 1874 వరకు, ఇంగ్లాండులోని రాజకీయ విధానాలను నిర్ణయించినవాడు, విగ్గు పక్షంవారి (Whigs - ప్రజాస్వామ్యవాదులు) నాయకుడైన పామర్‌స్టన్. బ్రిటీషువారి ఆధిక్యతను ప్రపంచ సముద్రములపై ప్రతిష్ఠించడానికి, స్వాతంత్ర్య సంపాదనకై పోరాడుతున్న వర్గాలవారి రక్షక శక్తిగా, బ్రిటను యూరోపుఖండ వ్యవహారములలో పాల్గొనడానికి, బ్రిటనుకు ప్రతిద్వంద్వియైన, రష్యా దేశాన్ని పైకి రానీయక నిరోధించడానికి, బ్రిటనుకు ప్రతిస్పర్ధులైనవారి చేతులలో, ఆటోమన్, సామ్రాజ్యం పడకుండా రక్షించడానికి ఉత్సుకుడై, పామర్‌స్టన్ పలువిధములైన చర్యలకు బూనుకొన్నాడు. కాని, భారత దేశ విషయములలో మాత్రము, ఈ విధానము వర్తించలేదు. ఇండియా సరిహద్దులలో అలజడికి, అవకాశమివ్వక, దేశములో శాంతి భద్రతలకు తగిన చర్యలను గావిస్తూ, సామ్రాజ్య ప్రయోజనముల కుపయుక్తమయ్యే పద్ధతిలో దేశమును అభివృద్ధి గావించడం ఇతడనుసరించిన రాజకీయ నీతి.

1874 లో, రూఢివాదవర్గం ప్రభుత్వాన్ని వహించి, 1905 వరకు పరిపాలన గావించింది. పిమ్మట ఉదారపక్షంవారు రెండుసార్లు అధికారములోనుండిరి [1880-1886 ; 1892-1895]. రూఢివాద పక్షమువారు ప్రారంభించిన నవ్య సామ్రాజ్య విధానానికి ప్రేరకశక్తి, డిస్రేలి. సామ్రాజ్య విస్తరణకు ఉత్తేజనం కలిగించినవాడుకూడా ఇతడే. ఇతడు బూనిన సామ్రాజ్య పురోభివృద్ధి విధానానికి, ఇండియా గవర్నర్ జెనరల్స్ ఏజెంట్లుగా పనిచేసినారు. కనుక, సామ్రాజ్య

యుద్ధ యాత్రలలో ఇండియాను దింపి, దుర్బలమైయున్న ఇండియా విత్త వ్యవస్థపై దుర్భరమైన క్రొత్త భారాన్ని మోపి, అభ్యుదయ కార్యాలకు పోషణ లేకుండాచేసి, ఆర్థికాభివృద్ధిని నిర్లక్ష్యంచేసి, పరిపాలకవర్గానికి ప్రజలకు మధ్య వైషమ్యాన్ని అధికము గావించిరి.

పరిపాలన వ్యవస్థా పునర్నిర్మాణము, కేంద్రప్రభుత్వపు దుబారా ఖర్చుల వల్ల ఏర్పడిన ఆర్థిక క్లేశములను దిద్దుకోవడము, ప్రజల ఆర్థిక దురవస్థకు నివారణోపాయములను వెదకడము, - అనే కార్యములతో, విప్లవానంతరకాలం గడిచిపోయింది. శాసనసభలకు, న్యాయపరిపాలనకు, రక్షణ సేనలకు సంబంధించిన నూతన న్యాయములు, 1861 లో, గావింపబడెను. 1853 లో స్థాపింపబడిన శాసన పరిషత్తులు, తమకు నియతమై ఉన్న అధికారములను అతిక్రమించెను. ఆ కారణంతో, 1861 నాటి నూతన పరిషత్తుల శక్తులను తగ్గించి, హద్దులోనుంచిరి. పరిషత్తులు ప్రభుత్వానికి సలహా ఇచ్చే సంఘములు మాత్రమే అని సభ్యులు గ్రహించేటట్లు చేసింది ప్రభుత్వము. 1861 నాటి, ఉన్నత న్యాయస్థానాల శాసనము ఆధారంగా ప్రభుత్వము, సుప్రీం న్యాయస్థానాన్ని, సదర్ దివానీని, ఫౌజ్దారీ అదలత్‌ను రద్దుచేసి, ఉన్నత న్యాయస్థానాలను స్థాపించిరి. తమ క్షేత్రాధికారములోని అధీన న్యాయాలపై అధీశణాధికారాన్ని వహించి, న్యాయాలయాలు అనుసరింపవలసిన పద్ధతులను, విచారణక్రమములను ఏర్పరచే అధికారాలు, ఉన్నత న్యాయస్థానాలకు సిద్ధించినవి. అదే సంవత్సరం (1861) మరియొక శాసనంద్వారా, సైన్యముయొక్క సంయోజనం పూర్తిగా మారిపోయింది. దేశీయసైనికుల బలం తగ్గిపోయి, బ్రిటీషు సైనికుల భాగము, బలవంతం కావడానికి తగిన చర్యలన్నీ జరిగినవి. సంఖ్యాబలము, వ్యూహాబలము, అధికారబలము, ఆఘాతశక్తి, ఈ విషయములన్నిటిలోనూ, దేశీయ సైన్య భాగం దుర్బలమై, అధీన సైన్యంగా మారిపోయింది.

ప్రజానీకము లోనైన హీన దరిద్ర స్థితి, దినదినము పెరుగుచున్న పన్నుల భారము, - ఆర్థిక సమస్యకు సంబంధించిన ముఖ్య విషయాలు. వ్యక్తియొక్క ఆదాయాన్నిబట్టి ప్రజల దురవస్థ ఎటువంటిదో గ్రహించవచ్చును. అధికారులు గావించిన లెక్కలనుబట్టి, వ్యక్తియొక్క తలసరి ఆదాయము, సరాసరి సంవత్సరానికి 30 రూపాయలు. ఈ సమయంలోనే ధరలుకూడా అధికమౌతూఉండినవి. దేశమంతటా ఈ పరిస్థితి సాధారణమై యుండినదని సంఖ్యలు వ్యక్తం చేస్తున్నవి. 1860 లో, రూపాయకు 50 సేర్ల బియ్యం, బెంగాలులో లభించేది. 1870 నాటికి, 20.8 సేర్లు మాత్రమే ఐనది. 1890 లో 18.3 సేర్లు, 1905 లో, 13.2 సేర్లు, - ఈ విధంగా ధరలు పెచ్చుపెరిగిపోయినవి. అర్ధ శతాబ్దకాలములో ధరలు నాలుగురెట్లు పెరిగినవి. కాని, సగటు సరాసరి ఆదాయం పాతికభాగం కూడా అధికం కాలేదు.

దీనికి తోడుగా, 1857 నాటి విప్లవం ఖర్చులన్నీ ఇండియాపై మోపడం వల్ల విత్త పరిస్థితిలో అరాజకత్వం సిద్ధించింది. క్షామ పరిస్థితులు, ప్రభుత్వవ్యవస

యొక్క అతి వ్యయము, - ముఖ్యంగా సైన్యపు ఖర్చులు, - ఇత్యాదులన్ని విత్త పరిస్థితిని మరింత హీనస్థితికి తెచ్చినవి. బ్రిటీషువారు సాగించిన సామ్రాజ్య దండయాత్రల వ్యయభారాన్ని ఇండియాపై మోపడం అన్నిటికంటెను అన్యాయమైన విషయము. ఆఫ్గను యుద్ధాలు (1878-80), చైనా యుద్ధము (1839-40), పర్షియన్ దండయాత్ర (1856), పెరాకీ దండయాత్ర (1875),- మున్నగు సామ్రాజ్య విస్తరణోద్యమాల భారమంతా, ఇండియా వహించవలసి వచ్చింది. ప్రతి సంవత్సరము, ప్రభుత్వపు బడ్జెట్టులో, లోటు ఏర్పడుతూవచ్చింది. పంటలు నాశమైనందువల్ల, రాజస్వము తగ్గిపోయి, ప్రభుత్వాదాయం తగ్గింది. 1860 నుండి, దేశములోని ఏదో ఒక భాగములో, క్షామము లేర్పడుచున్నందువల్ల వ్యవసాయను పాడై, క్రొత్తసమస్య లేర్పడినవి. క్షామ పీడితులైన ప్రజలకు, పరిహారమార్గముల నేర్పరచవలసివచ్చింది. తత్కారణంగా, వ్యయభారమింకను అధికమయింది. ప్రభుత్వ రుణం, పెరిగిపోతూ వచ్చింది. 1870 నాటికి, 102 మిలియన్ల పౌనుల రుణం ఏర్పడింది.

ఈ విధంగా పెరిగిపోతున్న వ్యయాన్ని నిర్వహించే నిమిత్తము పన్నులను పెంచింది ప్రభుత్వము. ఆదాయపు పన్ను 1 నుండి 2½ శాతమునకు, పిమ్మట 3 శాతమునకు అధికమయింది ఉప్పుపన్ను మదరాసులో రెండురెట్లు, బొంబాయిలో మూడురెట్లు, (అనగా 281 శాతం), ఇతర ప్రాంతాలలో 50 శాతము, - ఈ విధంగా అధికం అయింది.

వెండి ధర పడిపోవడం వల్ల, రూపాయియొక్క మారకపురేటు తగ్గి, ఇండియాకోశంపై, భారమధికమయింది. ఇది ప్రభుత్వానికి కలిగిన మరియొక ఆర్థిక సమస్య. మరిన్ని, విదేశవాణిజ్యానికి సంబంధించిన ప్రభుత్వ విధానాలు ఇండియాకు నష్టకారకమైనట్టివి. రవాణా సౌకర్యములలో కలిగిన విప్లవాత్మకమైన మార్పులవల్ల, ఇండియా విదేశ వాణిజ్యము ఎక్కువగా వృద్ధిపొందింది. 1834-35 నుండి, 1838-39 వరకు గల పంచవర్ష కాలనులో 1864 లక్షల రూపాయలుగా ఉండినది, 1868-69 నాటికి 10697 లక్షలు, 1877 నాటికి 11,400 లక్షలు, - ఈ విధంగా, విదేశ వాణిజ్యము అభివృద్ధి చెందింది. కాని, ఈ అభివృద్ధివల్ల, ఇండియా ప్రజల ఆర్థికస్థితి, దీని కనుగుణంగా, అధికమైనదా యనే విషయము, సందేహాత్మకమైనది. ఇండియా ఆర్థిక వ్యవస్థ, ఇంగ్లాండు దేశపు ఆర్థిక వ్యవస్థకు అధీనమై, ఇంగ్లాండు ప్రయోజనాలను సాధిస్తూ ఉండిన దనడంమాత్రం, వాస్తవము. ఒకప్పుడు, దేశములో తయారైన వస్తువులను విదేశాలకు ఎగుమతిచేస్తూ ఉండిన ఇండియాదేశము, ఇప్పుడు ముడి సరకులను మాత్రమే ప్రపంచానికి అందించే స్థితికి వచ్చింది. దూది వస్త్రాల మిల్లులు తప్ప, తక్కిన, ఏ, ఆధునిక పరిశ్రమలనూ, అభివృద్ధికానీయలేదు ప్రభుత్వము. ఈ దూది మిల్లులుకూడా, ఈర్ష్యాపరులైన ఇంగ్లాండు పరిశ్రమదారుల పోటీకి నిలువలేక, కష్టముల పాలైనవి.

## V. ఇండియా అసంతుష్టి

*1*. **నీలిమందు కల్లోలాలు** : 1858 లో, ఇంగ్లాండు రాజు, ఇండియా పరిపాలనను వహించిననాటినుండి కూడా, (1858) భారతీయులకు ఆంగ్లేయులకు సంఘర్షణలు జరుగుతూ వచ్చినవి. నీలిమందు పంట యజమానులు రైతులపై జరుపుతూ ఉండిన అత్యాచారాలవల్ల ఏర్పడిన కలతలు మొదటివి ఈ ఆంగ్లేయులు, పంటను పండించే రైతులపట్ల అమానుషము, అత్యాచారము ఐన విధంగా ప్రవర్తింవడం కలహాలకు కారణమైనది. ఎక్కువ ధరలకు అమ్ముడుబోతూ ఉండిన నీలిమందు, ఈస్ట్ ఇండియావారి వ్యాపార వస్తువులలో ప్రధానభాగమై ఉండినది. 1870 లో, కంపెనీ, స్వయంగా పంటపండించడానికి పూనుకొన్నది. వెస్ట్ ఇండీసునుండి, తోట పెంపకందార్లను తెచ్చి, వారికి తగినంత ద్రవ్యాన్ని అడ్వాంసుగా ఇచ్చి, నీలిమందు సరఫరాను, కంపెనీ, ప్రోత్సహించింది. ఈ పాశ్చాత్యులు తాము స్వయంగా తోటల వ్యవసాయానికి పూనుకోక, స్థానికులైన రైతులకు ముందుగా డబ్బిచ్చి, పంటలు పండించేవారు. ఈ విదేశీయులు న్యాయ విధానానికి లోబడని దుర్జనులు, దుండగీడులు. వీరినుంచి డబ్బును సంచకారంగా తీసుకొన్న రైతు, వాస్తవంగా, వీరికి దాసుడై పోయినాడు పంటదారులు, దాసజనాన్ని పీడించినట్టుగా రైతులను పీడిస్తూ, దౌర్జన్యాన్ని, మోసాన్ని ప్రయోగించి, వారినుండి పంటలను బలాత్కారంగా గ్రహించేవారు. ఈ పరిస్థితినిగురించి, మెకాలే ప్రభువు ఈ విధంగా వ్రాసియున్నాడు. "అనేకములైన చెడుగులీ వ్యవస్థలో ఉన్నవి. అత్యంతమైన అన్యాయము తరచుగా జరుగుతూ ఉంది. న్యాయసూత్రములను వర్తింపజేసి కొందరిని,- న్యాయాన్ని పాటించక దౌర్జన్యానికి పూనుకొని కొందరిని,- ఈ విధంగా రైతులను తమ స్వాధీనంచేసుకొని, ఈ పంటదార్లు, వారిని దాస్యస్థితిలో ఉంచియున్నారు. భూములతో కూడా అందలి పనివారిని కూడా విక్రయం గావించుకొనే- గులాము విక్రయ పద్ధతికి (Predial) ఇది ఏ మాత్రమూ తీసిపోదు".

ఫరిద్‌పూర్ దండనాధికారియైన డబ్ల్యూ. ఇ. ల్యాటూర్(W. E. Latour) నీలిమందు విచారణ సమితి ఎదుట సాక్ష్యమిస్తూ "ఈ నీలిమందు పంటల పద్ధతి, "రక్తపాత పద్ధతి" అని నుడివియున్నాడు. "నీలిమందు పంటను సాగుచేయడం ప్రస్తుతపు షరతులనుబట్టి, రైతుకు లాభకరమైనదికాదు పంటను పండించే విషయంలో రైతుకు స్వేచ్ఛా సంకల్పములు లేవు. వ్యవసాయానికి తగిన ప్రతిఫలంలేదని తెలిసీకూడా, రైతు, పంటను పండించి యజమానికి అందించవలసిన పరిస్థితి ఏర్పడియున్నది",- అని విచారణ సంఘం వివరించింది.

మోసకారులైన యజమానులను శిక్షించవలసిందని మెకాలే కోరియున్నాడు. కాని, ప్రభుత్వంలో వీరికి సహాయులుండడంవల్ల, వీరిపై ఎట్టిచర్యకూ ప్రభుత్వం పూనుకోలేదు. కట్టకడపటికి కష్టములు, హింసలు భరింపరానివై, రైతులు 1859 లో తిరుగబడిరి. నీలిమందు సాగుచేయుడానికి సంచకారములను నిరాకరించి, పంటదారుల ఇండ్లను, ప్రభుత్వకార్యాలను నాశమొనర్చిరి. గ్రామ

సీమలలో తిరిగే పాశ్చాత్యులను కొట్టి, వారి సరఫరాలను ఆపివేసి, పొలాలలోని నీలిమందు పంటలను నాశనంచేసి, కర్మాగారాలను దోచుకొని, కాల్చి, ధ్వంసం కావించిరి. ఈటెలు, కత్తులు, లాఠీలు, ధరించి, గుంపులుగా రైతులు గుమిగూడిరి. 'వహిబీరఫీకే మండల్' ఉత్తర బెంగాలులోని రైతులను సమర్థించింది. బిశ్వాస్ సోదరులు మధ్య బెంగాలులో నాయకత్వం వహించిరి.

మధ్యతరగతి విద్యావంతులు, పత్రికల ద్వారా, బహిరంగ సభలద్వారా, రైతుల వ్యాజ్యాన్ని సమర్థించిరి. 'హిందూ పేట్రియట్' పత్రికా సంపాదకుడైన హరిశచంద్రముఖర్జీ, వీరి దురవస్థను గురించి, విశదంగా వ్రాస్తూ, వారనుభవించిన ఘోరాలను, హింసలను, హృదయ విదారక చర్యలను, వర్ణించెను. పంటదారులు జరిపిన అత్యాచారాలను వివరిస్తూ, జెస్సోర్‌నుంచి, నాడియానుంచి, జాబులు ప్రకటింపబడినవి. పంటదారులుగావించిన అమానుష చర్యలను వర్ణిస్తూ, వారిపై గల ద్వేషభావాన్ని వ్యక్తంచేస్తూ, గేయాలు రచితములైనవి.

దీనబంధుమిత్రా రచించిన 'నీల్ దర్పణ్' అనే నాటకము ప్రజలను ఎక్కువగా ఆకర్షించి ప్రసిద్ధిచెందింది. దీనిని, మైకేల్ మధుసూదనదత్తా, ఆంగ్ల భాషలోనికి అనువదించెను. ఈ అనువాదానికి సహకరించిన, రెవరెండ్ లాంగ్‌పై పంటదార్లు తెచ్చిన అభియోగములో ప్రభుత్వము అతనికి 1000 రూపాయలు జరిమానాను, ఒక మాసశిక్షను విధించింది. ఈ అభియోగ విచారణ, అసాధారణమైన ప్రజాకల్లోలాన్ని, ఉద్రేకాన్ని కలిగించెను. "ఢిల్లీ విప్లవం తర్వాత, తనకు అధిక వ్యాకులతను కలిగించినది, ఈ కల్లోల మొక్కటే" అని క్యానింగు అంగీకరించినాడు. నదీ మార్గంలో పయనిస్తున్న క్యానింగుకు, రెండు ప్రక్కల తీరములలోనూ, వేలకొలది ప్రజలు నిలబడి, న్యాయంకొరకు ఘోషపెట్టుతుండడం, ఒక దినం ప్రయాణమంతటా కనబడింది. ఇంత అసంఖ్యాకంగా ప్రజలందరూ, సగౌరవంగా, క్రమబద్ధంగా నిలబడి, 'సాహేబ్, న్యాయము' అని ఆక్రోశించడం, అతనికి ఆశ్చర్యం కలిగించింది. "ఇంత నిశితమైన బుద్ధితో ఈ కార్యక్రమాన్ని నిర్వహించిన ప్రజలను, చాల జాగ్రత్తతో చూడవలసి యున్నది". అని అతడు అనుకొన్నాడు.

ఈ కల్లోలాలను అణచివేసే ప్రయత్నం, శీఘ్రంగా జరిగింది. నీలిమందు జిల్లాల పర్యవేక్షణకు అనుభవజ్ఞులైన, ఉన్నతోద్యోగులను ప్రభుత్వం నియమించింది. పరిస్థితులను పరిశీలించడానికి విచారణ సంఘాన్ని ఏర్పరచింది. నీలిమందు పంట వ్యవసాయము రైతులకు నష్టదాయకమైనదని, పంటయజమానులు తమపై హింసాత్మక చర్యలను జరుపుతున్నారని, రైతులు గావించిన అభియోగములు రెండూ సత్యములైనవని, విచారణ సంఘం నిర్ణయించి, ప్రభుత్వానికి తమ నిర్ణయాన్ని నివేదించింది. పంటదారులు అవలంబిస్తున్న బలాత్కార పద్ధతులను తక్షణం ఆపవలసిందని, ప్రభుత్వానికి సలహా యిచ్చింది. ప్రభుత్వం ఈ సలహాను ఆమోదించి, బలత్కార పద్ధతిని అంతం గావించింది. "రైతుల స్వతంత్ర విధానము ప్రజల మనస్సులలో స్థిరపడింది."

నీలిమందు కల్లోలము ఒక భాగంలో, ఒక ప్రత్యేకమైన దురవస్థకు సంబంధించిన సంఘటన. దేశమంతటా, వ్యవసాయదారు లనుభవిస్తుండిన బాధకు ఇది యొక నిదర్శనం మాత్రమే. దేశములో, సార్వత్రికమై, సర్వసాధారణమైన ఆర్థిక దురవస్థలో, ఇది కేవలము, ఒక అంశము మాత్రమే.

**2. సివిల్ సేవకు సంబంధించిన సమస్య :** నీలిమందు కలహాలకు సంబంధించిన ఆందోళనకు పిమ్మట విద్యావంతులను కలవరపెట్టినది, సివిల్ సర్వీస్ పరీక్షలకు సంబంధించిన సమస్య. పరీక్ష వయస్సును తగ్గించడంఇందుకు కారణము.

ఉన్నతోద్యోగ విషయములో, భారతీయులపట్ల విభేదభావం, ప్రదర్శింపబడదని ప్రభుత్వము, పదేపదే, ప్రకటిస్తూవచ్చింది. కాని, కార్యతః ఎట్టి ప్రయోజనమూ ఈ హామీలవల్ల సిద్ధించలేదు. కాని, 1853 లో, ప్రభుత్వాదరణద్వారా ఉద్యోగాలు లభించే విధానం తొలగి, పోటీపరీక్షలు ప్రారంభించడంతో, భారతీయులకు ప్రవేశమార్గం ఏర్పడింది. 19 వ శతాబ్దపు మధ్యకాలంలో భారతీయ యువకుడు, ఈ పరీక్షా విషయమై పడవలసిన ఇబ్బందులను గమనిస్తే, ఈ ఉద్యోగావకాశము ఎంత స్వల్పమైనదో, విశదమౌతుంది. బ్రిటీషు విశ్వ విద్యాలయాలలో సుశిక్షితులైన ఆంగ్లేయ యువకులతో పోటీ చేయడానికై, భారతీయ యువకుడు, అధిక ద్రవ్యమును వెచ్చించి, సుదూర ప్రయాణమునకు ఓర్చి, ఇంగ్లాండుకు పోవలసి వచ్చేది. ఇంకను అనేక ప్రతికూలము లుండివవి. ఆంగ్లభాష, భారతీయుని మాతృభాషకాదు. ఉన్నత విద్యాస్థానములైన, ఇండియా విశ్వవిద్యాలయాలలోని ప్రమాణాలు, ఇంగ్లాండు వాటి ప్రమాణాలకు సాటిరావు. అదీకాక, ఇంగ్లాండు పరిసరాలు, ఆచారాలు, వాతావరణము, పూర్తిగా విభిన్నములు, కష్టసహానములు. ఐనప్పటికీ, కొందరు భారతీయ యువకులు వీటినన్నిటినీ సహించి, పరీక్షలలో ఉత్తీర్ణులైరి. 1853 లో పరీక్షా ప్రవేశమునకు విధింపబడియుండిన వయస్సు 23. 1859 లో దానిని 22కు, 1866లో 21 కి, 1876 లో 19 సంవత్సరాలకు తగ్గించి వేసిరి. వయస్సు తగ్గించడం, భారతీయ యువకులకు ప్రతిబంధకము కాగలదని, అంతతో వీరు, ఐ. సి. యస్. పరీక్షకు పోవడం ఆగుతుందని, ప్రభుత్వోద్దేశము.

ఈ లోగా, భారతీయుల అభిప్రాయాన్ని కొంత ఉపశమన పరచడానికీ, విక్టోరియా రాజ్ఞి 1858 శాసపత్రంలో, గావించిన వాగ్దానాన్ని నెరవేర్చడానికీ బూనుకొని, ప్రభుత్వం ఈ ఉద్యోగాల విషయములో ఒక పెద్ద మార్పు తెచ్చింది. ఐ. సి. ఎస్. పరీక్షకు పోనవసరం లేకుండా, భారతీయులను ఈ ఉద్యోగాలకు నియమించే అధికారం, గవర్నర్ జెనరలుకు 1870 శాసనంద్వారా లభించింది. కాని, 1879 వరకు, ఈ శాసనాన్ని అమలు జరుపలేదు. 1879 లో గవర్నర్ జెనరల్‌గా వచ్చిన, లిట్టన్ ప్రభువు, ఐ. సి. ఎస్. ఉద్యోగాలను, భారతీయులకు పూర్తిగా లేకుండాచేసెను. బాహాటంగా లేదని చెప్పడమే, సత్యమైన మార్గమని ఇతడు నిశ్చయించి, ఈ ఉద్యోగాలనుంచి భారతీయులను బహిష్కరించి, వారికి మరియొక ఉద్యోగావకాశాన్ని, ఏర్పాటుచేసే ప్రతిపాదన గావించెను. కాని, ఈ

ప్రతిపాదన ఇదివరకు ప్రభుత్వం పలుమార్లు గావించియుండిన వాగ్దానాలకు, శాసపత్రాలకు విరుద్ధముకావడంవల్ల, ఇంగ్లాండులోని ప్రభుత్వము దీని నంగీకరించలేదు. ఐనా, ఈ ప్రతిపాదనను, పరోక్షవిధంగా అమలుజరిగే, ఏర్పాటు గావించింది. సాంవిధిక సివిల్‌సర్వీస్ (Statutory Civil Service) అనే వ్యవస్థను క్రొత్తగా ఏర్పరచి, దానికి ప్రతి సంవత్సరము నియమిత సంఖ్యలో, ఉన్నత వంశజుల నుంచి వ్యక్తులను నియమించే పద్ధతిని, ప్రభుత్వం నిశ్చయించింది. అట్లు ఈ ఉద్యోగాలకు నియమితులైన వారి సంఖ్య, ఇండియా ప్రభుత్వ కార్యదర్శి నియమించే ఉద్యోగులసంఖ్యలో, ఆరవ భాగానికి మించరాదు.

మధ్య తరగతి యువకులను ఐ. సి. ఎస్. సర్వీసు నుంచి బహిష్కరించడానికి, ప్రభుత్వ మీ పన్నాగమును పన్నినదని గ్రహించి, ఈ నూతన ప్రణాళికను ఆక్షేపిస్తూ, విద్యావంతులు వ్యతిరేకులై నిలబడిరి. ఈ ఉద్యోగ విధానాన్ని గురించి, 'బెంగాలీ' పత్రిక ఈ విధంగా వ్యాఖ్యానం గావించింది; - "ఈ ఉద్యోగ పథకం విపరీతమైన బూటకమని, మేము నిశ్చయించుకొని యుంటిమి. భారతదేశ విద్యావంతుల సంఘము కూడా, మా అభిప్రాయంతో ఏకీభవించి యున్నదని ఇప్పుడు గుర్తించినాము. ఐ. సి. ఎస్. పోటీ పరీక్షలు ఇండియాలో జరుపవలెనని భారత ప్రజలు ఆశించి యుండిరి. కాని ఈ నూతనవిధానం, పోటీ పరీక్షను పూర్తిగా తొలగించి, ఉద్యోగాలకు వ్యక్తులను నియమించేపద్ధతికి, పూనుకొన్నది. అధికార స్థానాల స్వార్థసాధనకు, ఇది తప్పక దారి తీస్తుంది."

ఐ. సి. ఎస్. పరీక్షకు నియమితమైన వయస్సును 19 సంవత్సరాలకు తగ్గించడం, ఇంకా ఎక్కువగా విమర్శకు గురిఅయింది. భారతదేశములోని విద్యావంతులందరు ఏకమై వయస్సును పెంచవలసిందని ఏకగ్రీవంగా కోరే అవకాశం ఇందువల్ల సిద్ధించింది. ఈ పరీక్షలో ఉత్తీర్ణుడై, ఉద్యోగములో ప్రవేశించియుండిన సురేంద్రనాథ బెనర్జీని, క్షుద్రమైన మిషపై, ప్రభుత్వము, ఉద్యోగంనుండి తీసివేసింది. పిమ్మట ఇతడు ప్రజాసేవలో ప్రవేశించి, ఇండియా అసోసియేషనుకు జీవంగా, ఆత్మగా ఏర్పడినాడు. అపమార్గములో ప్రవృత్తమైన, ఈ ప్రభుత్వ విధానాన్ని ప్రతిఘటించడానికి నిశ్చయించుకొన్నాడు. ఇండియన్ అసోసియేషనును, అఖిల భారతోద్యమానికి కేంద్రంగాచేసి, 'ఐక్య భారత' మనే భావానికి కార్యరూపాన్ని కల్పించినాడు. బెంగాలు ప్రజానాయకుల మనస్సులను ఆకర్షించి, వశపరచుకొన్న 'మ్యాజీనీ' (Mazzini) ఉద్యమము, ఇతనికి ఉత్తేజక శక్తిగా ఏర్పడింది.

ఈ ఉద్యమాన్ని కొనసాగించడానికై, బెనర్జీ, అఖిలభారత పర్యటనము ప్రారంభించెను. ప్రబలమైన ప్రజాభిప్రాయాన్ని దేశములో ఏర్పరచడం, దేశమున కంతకూ సమానములై యున్న రాజకీయ ప్రయోజనములు ఆధారంగా, అన్ని ప్రాంతాలలోని విద్యావంతులనూ సంయోజనపరచడం, హిందువులకు ముస్లిములకు సఖ్యమును కూర్చడం, అనేవి ఇతడు బూనుకొన్న పర్యటనకు ఉద్దేశాలు. ఉత్తరప్రదేశ్‌లోని బెనారస్, అలహాబాద్, లక్నో, కాన్‌పూర్, ఆగ్రా,

అలిఘర్, మీరట్, ఢిల్లీ పట్టణాలు, పంజాబులోని అమృతసర్, లాహోర్ నగరాలు, బొంబాయి రాజధానిలోని సింధ్, అహమ్మదాబాద్, పూనాలు, మదరాసు, – ఇవన్నియు ఇతడు పర్యటించి, ప్రచారం సాగించెను. "విభిన్నములైన జాతులకు, మతములకు నిలయమైన భారతజాతి సమస్తము, మొదటిసారిగా, ప్రజారంగములో ప్రవేశించి, సర్వులకు సమానమైన ప్రయోజనాన్ని సాధించే, ఐక్య ప్రయత్నానికి పూనుకొన్నది."

ఈ ఆందోళన ఫలితంగా, ప్రభుత్వం, ఛార్లెస్ ఐచ్చిసన్ అధ్యక్షతలో, 'పబ్లిక్ సర్విస్ కమిషన్' స్థాపించింది (1886). ఈ కమీషన్ గావించిన సలహాల ననుసరించి, నూతనంగా నెలకొల్పబడి యుండిన, సాంవిధిక సివిల్ సర్వీసును రద్దు చేసి, ఐ. సి. ఎస్. పరీక్ష వయస్సును 23 సంవత్సరములుగా విధించింది. ప్రభుత్వ సేవావ్యవస్థ, మూడు కక్ష్యలుగా విభజింపబడింది. సామ్రాజ్య, ప్రాంతీయ, అధీన సేవలు అను, మూడు భాగము లేర్పడినవి. ఇంగ్లాండులో జరిగే పోటీ పరీక్షల ఆధారంగా, సామ్రాజ్య సేవకు వ్యక్తులను గ్రహిస్తారు. తక్కిన రెండు భాగాల లోని ఉద్యోగాలకు, ప్రాంతీయ ప్రభుత్వాలు భారతీయులను నియోగిస్తాయి. సామ్రాజ్యసేవా కక్షలోని కొన్నిస్థానాలు, ప్రాంతీయ ఉద్యోగుల కొరకు ప్రత్యేకింపబడినవి. యోగ్యతనుబట్టి, సేవాకాలాన్ని బట్టి, ఈ ఉద్యోగులు వాటికి అర్హు లౌతారు. ఈ విధంగా, ప్రభుత్వపరిపాలన వ్యవస్థలోని కీలక స్థానములు లభ్యమయ్యే అవకాశము, చాలకాలందాకా, భారతదేశ సంతానానికి దూరమయింది.

***3. దేశభాషా పత్రికా శాసనము :*** శాసనపరిషత్తుల సంస్కరణము, ఉన్నత సేవలను దేశీయమొనర్చడం, అనెడి సమస్యలు, దూరకాలావధికి సంబంధించినవి. కాని, ప్రభుత్వానికీ ప్రజలకూ, తీవ్ర భేదాభిప్రాయాన్ని కలిగించేసమస్యలు, ఇంతలో ఉత్పన్నమైనవి. నార్త్‌బ్రూక్ ఉద్యోగాన్ని విరమించుకొన్న తర్వాత, లిట్టన్ కాలమునుంచి ఈ తీవ్రసమస్యలు ప్రారంభమైనవి. దేశ భాషా పత్రికలను అధికారులెన్నడూ అభిమానించలేదు. వాటిపట్ల సంశయాలూ, సందేహాలూ ఎప్పుడూఉన్నవే. ప్రభుత్వ వైఖరి ఇట్లు విరోధంగాఉన్నా, 1858 నుండి ఈ పత్రికలు, అభివృద్ధిచెందుతూ వచ్చినవి. ఈ పత్రికలు తీవ్రవిమర్శక ధోరణిని అలవరచు కొన్నవి. 'ప్రభుత్వ విద్రోహమని' కూడా, అధికారులు తలచియుండిరి. ఈ పత్రికలను చదివేవారంతా, సాధారణంగా, ఆంగ్లభాషా పరిచయంలేనివారే. ఆంగ్లపత్రికలను చదవనందున, ప్రభుత్వముయొక్క అభిప్రాయములు, ఉద్దేశములు ఎటువంటివో తెలుసుకొనే అవకాశం వీరికిలేదు. కనుక, ప్రభుత్వ విమర్శలు మాత్రమే ఈ విధంగా, ప్రజలలో వ్యాప్తమౌతున్నందువల్ల ప్రభుత్వ స్థైర్యానికి ఆపద కలుగగలదనే భీతి ప్రభుత్వాధికారులకు ఏర్పడింది. కనుక, "దేశ భాషా పత్రికలు అవలంబించిన విద్రోహక ప్రచారము, ప్రజావిప్లవాన్ని, బాహాటంగా ప్రోత్సహిస్తున్నదని," లిట్టన్ ప్రభువు, ఇండియా ప్రభుత్వ కార్యదర్శికి, అతి గూఢంగావ్రాసి, ఈ పత్రికలను అణచివేయడానికి తగిన శాసనాన్ని, అమలుపరచే

అనుమతిని, అతిత్వరలో సంపాదించినాడు. లండన్ నుండి, ఆమోదపత్రము, తనకు అందిన రెండు గంటలలోపుననే, 1878, నాటి, శాసనాన్ని పారితం (Pass) గావించినాడు. భారతీయులు దీనికి తమ ఆక్షేపణను తెలుపుతూ, బహిరంగ సభలు జరిపి, ఈ శాసనాన్ని రద్దు చేయవలసిందని కోరుతూ, పార్లమెంటుకు విన్నపములను పంపిరి. రిప్పన్, గవర్నర్ జెనరల్‌గావచ్చి, ఈ శాసనాన్ని ఉపసంహరించేవరకూ ఈ ఆందోళన సాగుతూనే ఉండినది.

*4 లిట్టన్ గావించిన ఇతర పరిపాలనోపాయాలు :* ఐ. సి. ఎస్. పరీక్షకు వయస్సును తగ్గించడం, పత్రికా స్వాతంత్ర్యాన్ని నిరోధించడం,- అనేవి మాత్రమే కాక, లిట్టన్ గావించిన అసహ్యాకరములైన కార్యములింకనూ కలవు, 1878 లో, ఇతడు గావించిన ఆయుధశాసనము, ప్రత్యేకము భారతీయులకు మాత్రమే హానికరమై, పక్షపాతముతో కూడిన 'న్యాయసూత్రం' కావడంవల్ల, ప్రజలలో కలిగిన ఆగ్రహోద్రేకాలు, సమర్థనీయములైనవే. ఇంగ్లాండునుంచి దిగుమతిగావించే వస్తువులపై ఉన్న, ముఖ్యంగా దూది వస్త్రాలపై- సమస్తశుల్కాలను,- రద్దు చేసి, ఇంగ్లాండు మిల్లులకు రక్షణ కల్పించడం కూడా ఇతడు గావించిన ఘనకార్యమే.

ఇదివరకెన్నడూ చూడని తీవ్రతతో, క్షామములుప్పతిల్లి ప్రజలను వేధించు చున్న సమయములో, విక్టోరియారాజ్ఞి అధికారమహోత్సవాన్ని (Jubilee) జరిపి, ఆమెను ఇండియా సమ్రాజ్ఞిగా ప్రకటించడము, ఆ సమయమందే జరిగింది. అమితవ్యయముతో కూడిన దండయాత్రలు, పశ్చిమోత్తర సరిహద్దు ప్రాంతాలలో జరిగే ఆపదను గుర్తింపకపోవడము,- అనే విషయాలు ఇండియా ప్రజల మనోభావాలపట్ల, వీరెంతటి నిర్దయవహించి యుండిరో, వ్యక్తము గావిస్తున్నవి.

ఇంతకు పూర్వము ఇరువది సంవత్సరాల కాలములో ప్రభుత్వము అనుసరించియుండిన విదేశరాజ్యాంగనీతి, లిట్టను ఇండియా వచ్చేనాటికి, మారిపోయింది. ఎల్జిన్, మేయో, నార్త్‌బ్రూక్,- వీరందరు, అతి సాహసకార్యములను పూనక, "నైపుణ్యముతో కూడిన క్రియావిరమణము" (Masterly inactivity) అనే రాజనీతిని అవలంబించియుండిరి. కాని, ఈ నూతన గవర్నర్ జెనరల్, ఇతని ప్రభువులు సిద్ధాంతీకరించిన 'పురోగమన నీతిని' (Forward Policy) అవలంబించి, ఆఫ్ఘనిస్థానంపై యుద్ధం ప్రకటించి, సరిహద్దు ప్రాంతాలలోని జాతులవారితో, నిరంతరమైన, యుద్ధాన్ని దేశానికి తెచ్చిపెట్టినాడు.

"భారతదేశములో ఇంతకాలమూ జరిగిన బ్రిటీషు పరిపాలనలో, ఇంతటి నిరర్థకమైన, దుష్కీర్తికరమైన, పరిపాలన మరియొకటిలేదని" లిట్టన్ ప్రభుత్వాన్ని గురించి, సంగ్రహంగా వర్ణించవచ్చు. "ఇంతకు పూర్వమెన్నడూ లేని విధంగా, సంశయము, సందేహము, భీతి,- అనే భావాలు ఒక్కసారిగా, ప్రభుత్వశక్తినావహించి, తదనుగుణములైన కార్యములను చేయించియుండడం" అసదృశమైన విచిత్రము.

1880 లో, లిట్టన్ ఉద్యోగ విరమణ గావించడంతో (Resigned),

'బెంగాలీ' పత్రిక ఈ విధంగా వ్రాసింది.

"లిట్టన్, దమననీతిని అనుసరించి గావించిన ప్రజానిగ్రహ చర్యలు, ఈ దేశములో, ప్రజాభిప్రాయాన్ని, ప్రజాశక్తిని, మేల్కొల్పినవి. అట్లు జరగడం దేశానికి, మహోపకారము. కనుక ఈ కీర్తి అతనికే దక్కుతుంది. ఇట్టి సేవ భారత దేశానికి గావించిన ఈ ప్రభువుపట్ల, దేశం కృతజ్ఞత ప్రదర్శిస్తున్నది".

1880 లో, ఉదారవాదుల పక్షమువారు (Liberals) ఇంగ్లాండు ప్రభుత్వాధికారాన్ని వహించడంతో, రిప్పన్ ప్రభువును ఇండియా రాజప్రతినిధిగా పంపిరి. ఇతని పూర్వపు ప్రభువు స్వచ్ఛందంగా జరిపిన పరిపాలనవల్ల కలిగిన హానిని, ఇతడు చక్కచేస్తాడని, ప్రజలు ఆశించియుండిరి. అందులకితడు సద్భావముతోనే పూనుకొన్నాడు. అసహ్యాకరమైన దేశపత్రికా శాసనాన్ని ఉపసంహరించుకొని, ప్రజాభిప్రాయాన్ని ఉపశమింప జేసినాడు. ఆఫ్గను యుద్ధాన్ని విరమింప జేసెను. జిల్లాలలోను, అందలి విభాగాలలోను, పురపాలక పట్టణాలలోను, ఒక విధమైన స్థానిక స్వయంప్రభుత్వాలను ఏర్పరచినాడు. కాని, దురదృష్టంవల్ల, ఇతడు పూనుకొన్న ఒక సత్కార్యం నెరవేరలేదు. దోషులైన పాశ్చాత్యులను, భారతీయ న్యాయాధికారులు, న్యాయాధీశులు, విచారణగావించే అధికారాన్ని కలిగించడానికై క్రిమినల్ కోడ్‌ను సంస్కరించడానికి బూనుకొన్న ఇతని ప్రయత్నము, పాశ్చాత్యుల తీవ్ర ప్రతిఘటనకు గురిఅయింది. ఆ కారణంవల్ల తన ప్రతిపాదనను ఇతడు మార్చుకోవలసి వచ్చింది.

## V. స్థానిక స్వయం ప్రభుత్వము

అభ్యుదయ నిరోధకములైన విధానములను, లిట్టన్, అనుసరించి, దేశానికి హాని కలిగించియున్నా, భారతదేశములోని విద్యావంతులకు బ్రిటీషు వారిపట్లగల విశ్వాసము పూర్తిగా నశించలేదు. బ్రిటీషు వారు సదుద్దేశములు కలవారనీ, ప్రజల పట్ల సమాన భావాన్ని పాటిస్తారనీ, వారు గావించిన వాగ్దానాలను, స్వపరిపాలన విషయమైన సంస్కరణలను, జరుపుతారనీ ప్రజలు నమ్మియుండిరి. దేశ పత్రికా శాసనాన్ని, రిప్పన్, ఉపసంహరించడము, స్థానిక ప్రభుత్వాలలో స్వపరిపాలన పద్ధతులను ప్రవేశ పెట్టడము, వీరి ఆశాభావాన్ని బలపరచినవి.

రాజధాని నగరాలలో, చిరకాలంగా, పురపాలక సంస్థలు ఏర్పడి యుండినవి. ఈ పద్ధతిని ఇతర పట్టణములకు కూడా, 1842 లో వ్యాపింపజేసిరి. తరవాత అపరోక్ష శుల్కాలను విధించే అధికారము ప్రాంతీయ ప్రభుత్వాలకు 1850 లో లభించింది. 1870 నాటి అన్వయ ప్రాప్తి నియమాలను (Devolution Rules) అనుసరించి, వివిధ కార్యక్రమాలకై ప్రత్యేకింపబడిన ద్రవ్య నిధులను వినియోగించే బాధ్యత, స్థానిక సంస్థలకు చెందింది. కనుక, విద్య, ఆరోగ్య రక్షణ, వైద్య సహాయము, పుర నిర్మాణ కార్యక్రమాలు, మొదలైన వాటిని, ఆయా వాటికి నియతమైన నిధులతో ఈ సంస్థలు నిర్వహిస్తూ, ప్రాదేశిక శుల్కాలను, రుసుములను విధించి వసూలు చేసుకొనే అధికారాన్ని కూడా పొందినవి.

1857 నాటి విప్లవం వల్ల కలిగిన విత్త సంబంధమైన చిక్కులను పరిష్కరించుకొనే మార్గాలను, పద్ధతులను, అన్వేషించవలసి వచ్చింది. రహదారులకు, నిర్మాణ కార్యాలకు సంబంధించిన బాధ్యతను స్థానిక సంస్థలపై వేయవలెనని విత్తశాఖా సభ్యుడైన జేమ్స్ విల్సన్ ప్రతిపాదించెను.

పట్టణములలోని పోలీసు సిబ్బందిని, పురాభివృద్ధిని, విద్యను, ఇతర స్థానిక ప్రయోజనాలను పోషించడానికి అవసరమైన ద్రవ్యం నిమిత్తము, ఆదాయాన్ని సమకూర్చుకోవలసిందని, పట్టణ సంస్థలకు ప్రోత్సాహం కలిగిస్తూ, లారెన్స్, 1864 లో, ఒక తీర్మానాన్ని పారితం గావించెను. "ఇండియాలో మేము వహించియున్న పదవిని పురస్కరించుకొని, ప్రతి కర్తవ్యాన్ని, విధానాన్ని పరిశీలించిచూడగా, దేశ వ్యవహారాలను సాధ్యమైనంతవరకు, ప్రజలకే అప్పచెప్పడం శ్రేయస్కరమనే, భావము మాకు ఏర్పడింది." అని ఈ తీర్మానము ఆడంబరంగా ప్రకటించింది.

ఈ విధంగా 1870 నాటికి, దేశములోని ముఖ్యపట్టణములన్నీ, పురపాలక సంస్థలుగా ఏర్పడినవి. ఈ పురపాలక సంస్థలకు పన్నులను చెల్లించే వ్యక్తులు, ఎన్నికలద్వారా సభ్యులను ఎన్నుకొనవలసిందని, శాసనము లనేకములు ఏర్పడినవి. కాని, ఎన్నికల విధానముమాత్రం, అమలు కాలేదు. ప్రసుప్తావస్థలోనే నిలిచిపోయింది. అధికారుల ప్రాభవం సర్వత్రా వ్యాపించింది. 1880 నాటికి, కలకత్తా బొంబాయి నగరాలలో మాత్రమే, పురపాలక సంస్థలు ప్రజా ప్రాతినిధ్యము ననుసరించి, ఏర్పడినవి. తక్కిన ప్రదేశాలలో, స్థానిక పరిపాలన వ్యవస్థ, స్థానిక శుల్క విధానము, ఏర్పడియున్నాకూడా, ఈ సంస్థల ఆధిపత్య అధికారము లన్నీ, అధికారుల చేతులలో భద్రముగా నిలిచియుండినవి. అట్టి దశలో రిప్పన్, కలుగజేసుకొని, ప్రాంతీయ ప్రభుత్వాలతో సంప్రదించి, స్థానిక స్వయం ప్రభుత్వాల విషయమై 1882 లో, తీర్మానాన్ని ప్రకటించెను. ఇంతవరకు, పట్టణములకు, నగరములకు మాత్రమే, పరిమితమైయుండిన స్వపరిపాలన సంస్థలు, విస్తరింపబడి, గ్రామసీమలకుగూడా, వర్తింపబడెను. తాలూకాలపైన, తహసీలలపైనా, క్షేత్రాధికారం కల జిల్లాబోర్డులు స్థాపింపబడినవి. వాటికి నియంత్రణాధికారములుకూడా సిద్ధించినవి. "రాజకీయ పరిజ్ఞానాన్ని ప్రజలకుగూడా కలిగించే సాధనములుగా" ఈ సంస్థలు ఏర్పడడం అభిమతము. కనుక, బోర్డులలో, అధికార సభ్యుల సంఖ్య మూడవవంతుకు అతిక్రమించకూడదని, నిశ్చయింపబడెను. ఈ పద్ధతి పట్టణములలోని సంస్థలకు, గ్రామీణములైన జిల్లా బోర్డులకుకూడా వర్తించింది. అనధికార సభ్యుల సంఖ్యను, ఎన్నికలద్వారా, భర్తీ చేసే పద్ధతి ఏర్పడింది. ఈ తీర్మానంలోని పరిపాలన నీతిని అమలుజరపడానికై, ప్రాంతీయ ప్రభుత్వాలు స్థానిక స్వయం ప్రభుత్వ శాసనాలను పారితం గావించినవి (1883-84).

రాజకీయ చైతన్యాన్ని వృద్ధి పరచడము, అధికారాన్ని వినియోగించే శిక్షణను ఇవ్వడము, ఈ తీర్మానము యొక్క ఆశయమని సుస్పష్టమైనది.

ప్రభుత్వ పరిపాలనను సాగిస్తున్న అధికారీతంత్ర వర్గం వారు శాసనము యొక్క ఉదార ప్రవృత్తిని గమనించి భయపడిరి. కనుక, కార్యరూపములో దానిని ప్రవృత్తి పరచడంలో మార్పులు గావించుకొనిరి. ఈ బోర్డులకు "నియమితము లైన కార్యక్రమాలు పరిమితములై యుండడము, అధికారములు స్వల్పమై యుండడము, ప్రజాప్రాతినిధ్యము సమగ్రం కాకపోవడము", మరిన్ని అధికారీ తంత్రవర్గము బుద్ధి పూర్వకంగా పూనుకొనియున్న అనుదార ప్రవృత్తి, కారణ ములై, ఈ సంస్థలు సక్రమంగా, నడవలేదు. ఉదారాశయములతో 'రిప్పన్' ప్రారంభించిన రాజకీయ ప్రయోగము, ఫలవంతం కాలేదు.

## VI. ఇల్బర్ట్ బిల్లు

రాజకీయముల ప్రభావమెట్టిదనే విషయాన్ని రిప్పన్‌హయాములో, జరిగిన ఇల్బర్ట్ బిల్లు వివాదము, మనకు బోధిస్తుంది. న్యాయ పరిపాలనకు మాత్రమే సంబంధించిన ఈ విషయము వాస్తవంగా, చాల అప్రధానమైనది. రాజధానిలోని భారతీయ దండనాధికారులు భద్రతా రక్షణల న్యాయాధిపతులుగా వర్తించడానికి సమర్థులై యుండిరి. కనుక, తమ క్షేత్రాధికారములోనున్న యూరోపియనుల విషయములో కూడా వీరి అధికారము వర్తిస్తుంది. ఇది 1857 లోనున్న పరిస్థితి. ఈ క్షేత్రాధికారాన్ని, 1872 నాటి 'అపరాధ ప్రక్రియా సంహిత' (Criminal Procedure code) నిరర్థకంచేయుచుండినది. ఈ సంహితప్రకారము మూడు నెలల కారాగార శిక్ష, లేక వేయి రూపాయల జరిమానాకు లోబడిన, పాశ్చాత్య అప రాధులకు సంబంధించిన అభియోగములను పాశ్చాత్య న్యాయాధికారులే విచారణ జరిపి నిర్ణయించవలెనని, ఉండినది. 1881-82 లో, ఈ సంహిత, శాసనసభలో తుది చర్చకు వచ్చింది. పాశ్చాత్యులను భారతీయ న్యాయాధిపతులు విచారణ గావించే ప్రశ్నను తాను శాసనసభలో చర్చనీయాంశంగా ప్రతిపాదిస్తానని, మహా రాజా, జ్యోతీంద్ర మోహన్ టాగోర్, సూచనను పంపించినాడు. సంహిత పారిత మైన అనంతరం, ఈ ప్రశ్నను చర్చకు తెస్తామని ప్రభుత్వము హామీ ఇచ్చింది.

కాని, బిల్లు పారితం కాకపూర్వమే, బెంగాల్ సివిల్ సర్వీస్ అధికారియైన బి. ఎల్ గుప్తా, న్యాయశాస్త్ర సంబంధమైన లోపము ఇందులో ఉన్నదని ప్రభు త్వము దృష్టికి తెచ్చెను. ఐ. శి. ఎస్. సంస్థకు చెందిన భారతీయాధికారులకు పాశ్చాత్యులపై క్షేత్రాధికారము లేకున్న విషయము న్యాయశాస్త్ర రీత్యా, అపవాదమనే విషయాన్ని ప్రభుత్వానికి తెలియజేసినాడు, గుప్తా. భారతీయ ఐ. శి. ఎస్. అధికారులపై అపరాధ ప్రక్రియ సంహిత మోపియున్న నిరోధాలను, తొలగించవలసిందని బెంగాలు లెఫ్టినెంట్ గవర్నర్ ఆష్లీఈడెన్ కేంద్ర ప్రభుత్వా నికి వ్రాసియుండెను. ప్రాంతీయ ప్రభుత్వాలు, అధిక సంఖ్యలో – ఈ సలహాను ఆమోదించినవి; ఈ విషయము ఇండియా ప్రభుత్వ కార్యదర్శి అభిప్రాయమునకు పంపగా, అతడు కూడా ఈ సలహాను అంగీకరించెను. అంతట, న్యాయశాఖా సభ్యుడైన, సర్ కూర్టినే ఇల్బర్ట్, ఈ విషయాన్ని, ప్రతిపాదన రూపంలో సిద్ధ

పరచి, శాసనసభలో ప్రవేశపెట్ట దలచెను. భారతీయ దండనాధికారుల విషయములో వ్యతిరేకమై, పక్షపాత దోషమునకు లోనైయున్న న్యాయశాస్త్ర అపవాదాన్ని తొలగించడానికి మాత్రమే ఉద్దేశించినది ఈ బిల్లు. ఏ వర్గంవారికీ, ఇతరులెవ్వరికీ హాని కలిగించనిది.

కాని, యూరోపియనులు ఇది తమకు అవమానకరమైనదిగా భావించిరి. భారతీయులతో తమకు సమాన ప్రతిపత్తిని కల్గించి, తమ వర్గములోని అపరాధులను భారతీయ న్యాయాధిపతుల విచారణకు పాల్పరచడానికి పూనుకొన్న ఈ బిల్లు, సహింపరాని అవమానమని వీరు భావించిరి. హింసాకాండను, విప్లవాన్ని, లేవదీస్తామని, ప్రభుత్వాన్ని బెదిరిస్తూ, తీవ్రమైన, దౌర్జన్యమైన ఆందోళనను లేవదీసిరి.

భారతీయ విద్వాంసవర్గము, ఆందోళనయొక్క ఉగ్రతకు ఆశ్చర్యపడి, గవర్నర్ జెనరల్‌కు ఏవిధమైన కష్టాన్నీ కలిగించడాని కిష్టపడక, సంయమనాన్ని ప్రదర్శించిరి. భారతీయుల హృదయ భావాలను 'బెంగాలీ' పత్రిక ఈ విధంగా చిత్రించింది. "మహత్తరమైన ఒక నీతి సూత్రము బలికానున్నది. ఆంగ్లేయులు భారతదేశాన్ని న్యాయసూత్రాలతో పరిపాలిస్తారా, లేక, ఆయుధ బలంతో పరిపాలిస్తారా అనే విషయము నిశ్చయింప బడుతుంది."

ఈ విషయాన్ని మరొకమారు ప్రస్తావిస్తూ ఈ విధంగావ్రాసింది. "భౌతిక శక్తిపై ఆధారపడిన రాజనీతి నవలంబించి భౌతిక శక్తితో ఇంతటి మహాసామ్రాజ్యాన్ని, చాలకాలం నిలుపుకోగలమని ఊహించడం కేవలము, అన్యాయమైనది మాత్రమేకాదు, హాస్యాస్పదమైనది కూడా. బ్రిటీషువారి ఆధిక్యముయొక్క అస్తిభారము మారవలసియున్నది. భారతదేశాన్ని, న్యాయసూత్రముల ననుసరించి, పరిపాలిస్తామనీ, విజేతల ఆధిక్యాహంభావ ప్రవృత్తిని పరిత్యజిస్తామనీ, శాసనములద్వారా, భారతప్రజలకు పార్లమెంటు ఆశ్వాసంకలిగించింది. ఆ విషయాన్నే, పునరుద్ఘాటిస్తూ, పదేపదే బాహాటమైన ప్రకటనలు గావించింది. అట్టి సందర్భములో, ఇప్పుడు, జాత్యాధిక్యతను, విజేతలహక్కులను, ప్రస్తావించడం కూడా బ్రిటీషు ప్రభుత్వానికీ, బ్రిటనుజాతికీ అప్రతిష్ఠను తెస్తుంది."

కాని, పాశ్చాత్యులూ, అంతకంటె ఎక్కువగా, ఆంగ్లో - ఇండియనులూ గావించిన ఆందోళన సఫలమయింది. బిల్లులో మార్పు వచ్చింది. ఎంతటి చిన్న అభియోగమైనా, యూరోపియను అపరాధులను, యూరోపియను న్యాయాధిపతులే విచారణ గావించడం, జూరీవర్గంలో సగంమంది పాశ్చాత్యులు, లేక అమెరికనులు ఉండడం, జరిగే విధంగా, చట్టము మార్చబడింది. ఇట్లు ఉన్నతజాతివారైన ఆంగ్లేయుల విశిష్టాధికారాలు రక్షింపబడినవి. న్యాయపరిపాలన వ్యవస్థకు అపవాదం కలిగినా, వారికేబాధాలేదు ; బ్రిటీషువారి న్యాయనిష్ఠకూ బాధలేదు. ఆంగ్లో-ఇండియనులు గావించిన ఆందోళన భారతీయుల కొక విషయాన్ని బోధపరచింది. బ్రిటీషు సామ్రాజ్యముయొక్క బృహద్దేహానికి మట్టికాళ్లున్నవనే విషయము, ఆంగ్లో-ఇండియనులు బహిరంగం గావించిరి.

బిల్లులో కలిగిన మార్పులవల్ల ఇండియా ప్రజలకు నిరాశ ఏర్పడింది. శ్వేతజాతులవారి ఆందోళనకు భారతదేశం లొంగిపోయిందని ప్రజలు వ్యాఖ్యానం గావించిరి. జాతి ప్రాధాన్యాన్ననుసరించి ఏర్పడిన జ్యూరీలు బూటకములని వారికి తెలుసు. గత యాభై సంవత్సరాల కాలంలో విచారణకు వచ్చిన అత్యధికాభియోగములలో, యూరోపియను జ్యూరీలు ఎంతటి అన్యాయములైన, లజ్జాకరములైన నిర్ణయములిచ్చియున్నారో, ఎట్లు యూరోపియను అపరాధులకు పక్షపాతం చూపియున్నారో, చరిత్రలో చేరవలసిన విషయాలు. ఈ ఉదంతాలు చరిత్రలో గాఢాంధకార ఘట్టములుగా ఏర్పడతాయి. అత్యుత్తమ గుణశీలురైన సర్ ఎడ్వర్డు రయాన్, సర్ బార్న్సీ పీకాక్ వంటి ఆంగ్ల న్యాయాధిపతులుకూడా ఈ విషయాన్ని ఖండించియున్నారు. యూరోపియనులు అత్యాచారాలు చేసియున్నారని, ప్రత్యక్షంగా రుజువైన సందర్భాలలోకూడా, ఏవిధంగా న్యాయము నశింపచేయబడిందో, వీరు స్వయంగా చూచియున్నారు. ఎంతటి ఘోరం గావించినా, ఏపాపం చేసినా, ఆంగ్లేయుడు శిక్షింపబడడనే ప్రజాఘోష, పల్లెపల్లెకు, పట్టణ పట్టణమునకు, ప్రసారమయింది. మెకాలేకూడా తన నైతిక స్థైర్యాన్ని పురస్కరించుకొని, గంభీర స్వరంతో, – "ప్రజానీకముయొక్క సహజములైన హక్కులను నశింపజేసి, కొందరి సౌకర్యాలనుమాత్రమే రక్షించే స్వాతంత్ర్యం, స్వాతంత్ర్యమే కాదు; అది మితిమీరిన హింసాచర్య." అని తన అసహ్యాన్ని వ్యక్తం గావించియున్నాడు.

## VI. ఆపత్తికి భారతీయుల అనుక్రియ

భారతీయులకు ఆంగ్లేయులకు, సమాన పౌరత్వాన్ని కలిగించడానికి, ప్రభుత్వము పూనుకొన్న ఇంత స్వల్ప విషయమై, – విక్టోరియా రాజ్ఞి ప్రకటన దీనికి సమర్థమైయున్నాకూడా, శ్వేతజాతులవారిలో ఇంతటి వైషమ్య ముత్పన్నము కావడం, పరిస్థితియొక్క ఆంతరంగిక స్వరూపాన్ని వ్యక్తం చేస్తుంది. తమ మాతృదేశములో తమకు ఏర్పడియున్న అధమ స్థానము, విదేశాధికారులు తమ పట్ల ప్రదర్శించుచున్న నిందా తిరస్కార ప్రవర్తన, స్వతంత్రమైన పౌరత్వాన్ని సంపాదించడానికి తాము పడవలసిన అనంతములైన కష్టములు, ఎట్టివో, భారతీయులకు బాగుగా తెలిసివచ్చింది. బిల్లు ఇంకను చర్చలోనున్న రోజులలోనే, దేశములోని ప్రజాసంస్థలు ఏకమై, బిల్లును సమర్థిస్తూ ఒక మహజరును సుప్రీం కౌన్సిలుకు పంపియుండిరి. ఇట్టి ఉద్దేశంతోనే, బొంబాయిలోకూడా ఒక బహిరంగసభ జరిగింది. కాని ఇవన్నియు నిష్ఫలములైనవి. రాజకీయాధికారాలను, సాధించుకోడానికి విన్నపపత్రాలు, మహజర్లు ఏమాత్రమూ చాలవని, భారతీయులకు అర్థమయింది. అఖిల భారత సంస్థ నేర్పరచి, నిరంతరంగా, ఆందోళన సాగిస్తూ, శాశ్వతమైన శ్రేయస్సును దేశానికి సిద్ధింపచేయడానికి యోగ్యములైన, గొప్ప ఆశయాలను, ఉద్దేశాలను ప్రజలకు వివరించి, వారు గుర్తించేటట్లు

చేయడం అవసరమని" నిశ్చయించిరి. ఈ విధంగా రాజకీయ సంఘర్షణను సాగించడం అగత్యమయింది. స్థానిక వ్యవహారముల విషయమునమాత్రమే కాక, ప్రజలందరికీ సమానములైన జాతీయ వ్యవహారముల విషయమునకూడా, ప్రజలే అధికారంవహించి, వాటిని తామే నిర్వహించడం అవసరమని, అట్టి అధికారాన్ని సంపాదించుకోడానికి తగిన సమయం వచ్చినదని, ప్రజానాయకులు గుర్తించిరి. భారతదేశమున కంతటికీ, బాధ్యతవహించగల విశాల రాజకీయ సంస్థ ఏర్పడి, ప్రజాభిప్రాయాన్ని సమకూర్చుకొని, తమ ఆందోళనలో, ప్రజానీకాన్నికూడా, చేర్చుకొన్నప్పుడే దేశానికి రాజకీయాధికారము లభించగలదు.

బొంబాయి, మదరాసు, పత్రికలు ఈ భావాలను ఆసక్తితో సమర్థించి, ప్రచారానికి బూనుకొన్నవి. ప్రజలకు గల కష్టాలు ఒక్క ప్రదేశానికి మాత్రమే పరిమితమైనవి కానందున, పరిస్థితులను సమర్థతతో నిర్వహించగల అఖిలభారత సంస్థ ఆవశ్యకమని, ఈ పత్రికలు వివరించినవి. ప్రధానములైన జాతీయ సమస్యలనుగూర్చి చర్చించడానికై, ఢిల్లీ దర్బారు జరిగే సందర్భము, అన్ని ప్రాంతాల వారికీ అనుకూలమై యుంటుందని వివరిస్తూ, పూనా సార్వజనిక సభాసభ్యుడైన జోషీ, వివిధ ప్రాంతాలలోని ప్రజానాయకులకు ఆహ్వానపత్రికలను పంపించినాడు. (1876), జాతీయ సమావేశం జరుగవలెనని, ఒక సలహా 1832 లో కూడా పునరుక్తంగావించెను. "దేశపు వివిధ భాగాలలోని ప్రజాసంస్థలు పంపిన ప్రతినిధులందరూ సమావేశమై ఒక జాతీయకాంగ్రెసును లేదా ప్రాంతీయకాంగ్రెసులను స్థాపించి, వివిధాభిప్రాయాలను చర్చించడానికి అభ్యంతరమేమి ? ఇంతవరకు, మన ప్రజాసంస్థలన్నీ, పరస్పర సహకారము, సంయోజనము, లేనివై, భిన్నమార్గాలలో నడిచినవి. ఈ సంస్థలన్నీ సుసంబద్ధములైనప్పుడే మన ఉద్యమానికి నిజమైన ప్రజాప్రాతినిధ్యం సిద్ధిస్తుంది. దేశ సమస్తానికీ ప్రాతినిధ్యం వహించిన జాతీయకాంగ్రెసు ఏర్పడడానికి ఇది తగిన సమయము. అట్టి సంస్థ ఏర్పడి, ప్రతిసంవత్సరమూ సమావేశమై, దేశములోని భిన్నజాతులవారికి అనుబంధాలను స్థిరపరచి, ఐక్యభావాన్ని కలిగించి, రాజకీయ సమస్యల విషయమై అన్ని ప్రాంతాలలోని సంస్థలునూ ఏకకట్టుగా కృషిచేసే ఉద్యమాన్ని ఆరంభింపవలసి యున్నది". అని ఇతడు పలువురకు వ్రాసియున్నాడు.

ఇల్బర్టు బిల్లు విషయములో తీవ్రమైన ఆందోళన జరుగుతున్న సందర్భంలో ప్రభుత్వము, సురేంద్రనాథ బెనర్జీని ఖైదుగావించడం, ప్రజలను మరింత ఎక్కువగా ఉద్రిక్తులను గావించింది. సురేంద్రనాథ్, బిల్లువిషయమై పత్రికలో ప్రకటించిన వ్యాసం, ఇందుకు కారణము. ప్రభుత్వం పూనిన మొండిపట్టుదలకు, దురహంభావానికి సరియైన సమాధానం చెప్పవలెనని, విద్యావంతులు పూనుకొనిరి.

ఇండియాలోను, ఇంగ్లాండులోను రాజకీయాందోళనను సాగించేనిమిత్తం, నిధిని సమకూర్చడానికి, "ఒక పవిత్రజాతీయసంస్థను స్థాపించి, దానిలో అన్ని వర్గాలవారూ,- జమీందార్లు, రైతులు, వర్తకులు,- సమావేశమై జాతీయ

ప్రయోజనములను సాధించడానికి, ఆ సంస్థను సమాన ఆధారపీఠంగా చేసుకోవలెను", అని నిశ్చయించిరి. దేశపు అన్ని భాగములనుండి ప్రతినిధులను ఆహ్వానించి, ప్రతి సంవత్సరమూ సమావేశాన్ని జరిపి, "ప్రజాసేవ విషయమైన చైతన్యాన్ని దేశములో ప్రసరింపచేయడము, ప్రజాభిప్రాయాన్ని క్రోడీకరించి, దానికొక స్వరూపాన్ని కల్పించడము",- ఇత్యాది కార్యక్రమాన్ని, నిర్వహించడానికి, ప్రోగుచేసిన నిధి, వినియోగింపబడుతుంది.

అట్టి జాతీయ ప్రథమసమావేశం కలకత్తాలో 1883 డిసెంబర్ 28 నుండి 30 తేదీవరకు జరిగింది. ప్రజాప్రతినిధి పరిషత్తులు, సాధారణ- సాంకేతిక విద్యావ్యాప్తి, అపరాధవర్గ న్యాయశాఖపరిపాలన, ప్రభుత్వసేవలో భారతీయులకు అధికావకాశము,- మొదలైన విషయములు ఈ సమావేశములో చర్చించబడినవి. ఇల్బర్ట్ బిల్లు ఆందోళనకు భారతీయులిచ్చిన సమాధానమిది. "దేశములో అన్ని వైపులా ప్రతిధ్వనించి, ప్రజలను మేల్కొల్పే శంఖారావము" అని ఇది వర్ణితమయింది. "జాతీయ పార్లమెంటు నిర్మాణానికి ఇది ప్రథమదశ", అని, బ్లంట్, ఈ సమావేశాన్ని గూర్చి వ్రాసియున్నాడు.

వివిధ రాజకీయవర్గాలకు ఐక్యముకూర్చడము, జాతీయ సంస్థ నిధికి ద్రవ్యము సమకూర్చడము ప్రయోజనములుగా చేసుకొని, సురేంద్రనాథ బెనర్జీ ఉత్తర భారత పర్యటనకు మరల పూనుకొనెను (1884). ఇండియానుండి, రిప్పన్ ప్రభువు వెళ్లిపోయే సందర్భమును అవకాశంగా చేసుకొని, దేశమంతటా ప్రదర్శనలు జరిగినవి. భారతదేశములో జాతీయ భావానికి సిద్ధించిన శక్తి ఎట్టిదో, అధికారులకు వ్యక్తం గావించింది ఈ ప్రదర్శన.

ఆశ్చర్యచకితుడైన ఆక్లండ్ కాల్విన్, ఈ విధంగా తన విస్మయాన్ని ప్రదర్శించెను. "ప్రపంచ దృష్టికి గోచరమైయుండిన ఈ భూభాగంలోని, శుష్కకళేబరాలకు ప్రాణం వచ్చింది". కలకత్తా కార్పొరేషన్ అధ్యక్షుడైన సర్ హెన్రీ హ్యారిసన్,- "ఇండియాలోని విద్యావంతులు, దేశప్రజకు కర్తలుగా, మార్గదర్శకులుగా, అనుదేశకులుగా, వార్తాహారులుగా, ఇదివరకే ఏర్పడియున్నారు. పాఠశాలలు, పత్రికలు, న్యాయస్థానాలు, ప్రభుత్వ కార్యాలయాలు, ఏ వర్గంవారి అధీనములో ఉంటాయో, ఆ వర్గంవారి ననుసరించే భావిభారత జాతి యోచిస్తుంది, ఆచరణకు పూనుకొంటుంది, అనే సత్యాన్ని సులభంగా గ్రహించవచ్చు. భారత జాతి భావాలకు, అభిప్రాయాలకు, ఈ వర్గంవారు ప్రాతినిధ్యం వహించడం, భవిష్యత్తు నిశ్చయించింది. ప్రజలు వీరికి సాధనములై, వీరి బోధనలనే ప్రతిధ్వనింప చేస్తారు. కనుక, 'యువభారతం' అని మనం వ్యవహరిస్తున్న ఈ భారత ప్రజావర్గం (విద్యావంతుల వర్గం) రాజకీయ విషయములో, అత్యల్పమైనదని, పరిగణనీయంకాదని, ఊహించడం సరికాదు. ఈ రెండు లక్షలమంది హృదయాలలో, కుతకుతలాడుతున్న జాతీయభావాలు, పైకి ప్రవహించి [అప్పుడే ప్రవహించుచున్నవి కూడా], 20 కోట్ల ప్రజల హృదయాలను నింపివేస్తాయి. విద్యావంతుల విషయములో మనము తీసుకొనే చర్యలు, కార్యాలు, వారితోనే

ఆరంభమై వారితోనే సమాప్తమౌతాయని భావించడం కంటెను గొప్పపొరపాటు మరియొకటి ఉండదు". అని తన జాతివారిని హెచ్చరించి యున్నాడు.

భారత జాతీయసమావేశము మొదటిసారి 1883 లో జరిగింది. 1885 డిసెంబరులో జరిగిన రెండవ సమావేశానికి ఏర్పాట్లు గావించినవి కలకత్తాలోని మూడు జాతీయ సంస్థలు. భూస్వాముల ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించిన, బ్రిటిష్ ఇండియను అసోసియేషన్, మధ్యతరగతివారి భారతీయసంఘము, అమీర్ ఆలీ కార్యనిర్వాహకత్వం వహించిన కేంద్ర మహమ్మదీయసంఘము, - ఇవి మూడునూ చేరి ఈ రెండవసమావేశాన్ని నిర్వహించినవి. బెంగాలు, ఉత్తర భారతము, బొంబాయి ప్రాంతాలనుండి వచ్చిన ప్రతినిధులు ఈ సమావేశములో పాల్గొన్నారు. చర్చించబడిన విషయములన్నిటిలోను, శాసన పరిషత్తుల సంస్కరణ విషయము ప్రాధాన్యం వహించింది.

**2. పూనా సార్వజనిక సభ :** బెంగాలులోవలెనే, పశ్చిమ భారతదేశంలో కూడా, రాజకీయ చైతన్యము అభివృద్ధి చెందుతూవచ్చింది. ప్రజల అభిప్రాయాలను, కోరికలను ప్రభుత్వానికి నివేదించేనిమిత్తం, 'సార్వజనికసభ' 1870 లో స్థాపింపబడింది. గొప్ప భూస్వాములు, వర్తకులు, బ్యాంకర్లు, ప్రభుత్వోద్యోగముల నుండి విశ్రాంతిగైకొన్నవారు, న్యాయవాదులు, కళాశాలా అధ్యాపకులు, మహారాష్ట్ర రాజ్యముల పరిపాలకులు కొందరు, - ఈ సంస్థలో సభ్యులైరి. 1871 లో, ఉద్యోగరీత్యా పూనాకు బదిలీయై వచ్చిన మహాదేవ గోవిందరెనడీ ఈ సంస్థకు, మార్గదర్శకుడు, ఆశయకర్త, నాయకుడుగా, సహకరించెను సంస్థయొక్క కార్యక్రమాలకు ఉత్తేజనముకలిగించి, వాటిని సక్రమ మార్గంలో ప్రవృత్త మొనర్చినవి, ఇతని భావాలే. ప్రజలలో సరియైన అభిప్రాయాలను, భావాలను కలిగించడం, ఈ సంస్థయొక్క ప్రధానాశయము. ఇండియా ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన సమస్యలను పరిశీలించుటకు కూడా, ఈ సంస్థ తన దృష్టిని మరల్చి, ప్రజల ఆర్థిక దురవస్థను ప్రభుత్వమునకు తెలిపియున్నది. బ్రిటిషు పౌరులు అనుభవిస్తున్న హక్కులతో సమానమైనవాటిని, భారతదేశ ప్రజలకు కూడా కలిగింపవలెనని, విక్టోరియా మహారాజ్ఞికి, విన్నపపత్రాన్ని ఈ సభ, పంపించింది. శాసనపరిషత్తులకు సభ్యులను నియమించడానికి బదులుగా, ఎన్నికల ద్వారా, పరిషత్తుల నేర్పరచడం సమంజసమైనదనీ, అది ప్రజల అభిమతమనీ, ప్రభుత్వానికి విన్నవించింది. ఈ సభ 1878 లో ఒక పత్రికనుస్థాపించి, - భూమి విషయమైన సంస్కరణలు, వ్యావసాయిక బ్యాంకుల ఏర్పాటు, విద్యావ్యాప్తి, పన్నుల తగ్గింపు, ప్రభుత్వపు ఖర్చుల తగ్గింపు, న్యాయ పరిపాలనవ్యవస్థ పరివర్తనము, - ఇత్యాది విషయములను సమర్థిస్తూ ప్రచారంగావిస్తూ వచ్చింది.

ఫెరోజ్‌షా మెహ్తా, కె. టి. తెలాంగ్, బదురుద్దీన్ త్యాబ్జీ, - ఈ నాయకులుచేరి, 'బొంబాయి రాజధాని సంఘాన్ని' ఏర్పరచిరి. రాజకీయ కార్యక్రమాలను క్రమపద్ధతిలో సాగించడము, ప్రజలకు అభిమతములైన అభిప్రాయాలను ప్రభుత్వానికి తెలుపుతూ ఉండడము, ఈ సంఘముయొక్క ప్రయోజనములుగా

నిశ్చయించుకొని, కార్యాచరణాన్ని ప్రారంభించిరి.

ప్రాంతీయములైన ఈ రాజకీయ కార్యక్రమాలవల్ల, అఖిల భారత రాజకీయ సంస్థ ఏర్పడడానికి తగిన వాతావరణము, పరిస్థితులు, దేశములో ఏర్పడినవి. ప్రాంతాలలో వివిధములైన రాజకీయసంస్థలను, దేశపు వివిధ ప్రదేశాలలో చెదరియున్న రాజకీయ చైతన్యంగల వ్యక్తులను, ఒక సంస్థగాచేర్చి, దేశప్రజనంతనూ, తన ఆవరణములోనికి గ్రహించగల మహాసంస్థ ఏర్పడవలసిన సమయం వచ్చింది. జాతీయసభను స్థాపించి, దానిద్వారా భారతజాతి కోరికలను, అవసరములను వ్యక్తము గావించడానికి, కాలము, పరిణతి చెందింది.

ప్రభుత్వముపట్ల, ప్రజలకు ఇంతటి వైషమ్యభావము, ఇంతకుముందెప్పుడూ ఏర్పడియుండలేదు; పాలిత ప్రజల విషయములో ప్రభుత్వానికి ఇంతటి వైముఖ్యము, నిరభిమానము, పూర్వమెప్పుడూలేదు. మధ్య తరగతి విద్యావంతుల సంఘము విస్తృతిని పొందియుండినది. మాతృదేశంపట్ల తమకుగల కర్తవ్యాన్ని, ధర్మాన్ని, చక్కగా గుర్తించినారు. వివిధ ప్రాంతాలలో జరిపియున్న రాజకీయ కార్యక్రమాలు, వీరికిగల స్వాతంత్ర్యభావానికి, ఈ సంఘమునకు గల ప్రాబల్యానికి, నిదర్శనములైనవి. శాసనపరిషత్తులని వ్యవహరించబడుతున్న ప్రభుత్వ సంస్థల నిజస్వరూపము, వీరికి బోధపడింది. కనుక, ఇకముందు వంచింపబడే అవకాశంలేదు. 'బెంగాలీ' పత్రిక, ఈ విధంగా వ్రాసింది, —

"కలకత్తా పరిసరాలలో నివసించుచున్న ముగ్గురు నలుగురు దేశీయ ప్రభువులను (Rajas) గవర్నర్ జెనరల్, కాలావధులననుసరించి పిలిచి, వీరితోను, ఇతర యూరోపియను సహచరులతోను, కౌన్సిలుబోర్డు సభలను జరుపుతాడు. ఇదే పద్ధతిలో, తమ ప్రాంతాలలోని, చిన్న చిన్న రాజులను చేర్చుకొని, బొంబాయి, మదరాసు గవర్నర్లు కూడా - సభలను నడుపుతారు. విదేశప్రభువు లింతవరకూ భారతీయులను దగ్గరకు చేరనీయక ప్రత్యేకంగా నిలిచియుండిన పరిస్థితినిబట్టి చూస్తే, - భావం ఇప్పుడు కొంత మారినట్టు గోచరిస్తుంది. అంతవరకు మంచిదే. కాని, పరదేశాధిపత్యము, ప్రజల సంకల్పము చేరి, ప్రభుత్వాధికారంలో పాల్గొంటున్నాయని, ఈ సభలనుబట్టి ఎవరూ భావించలేరు."

ప్రజాప్రతినిధులను ప్రభుత్వ పరిపాలనలో చేర్చుకొనవలెననే విషయాన్ని, ప్రజాభిప్రాయము పూర్తిగా సమర్థిస్తూ ఉంది. ప్రజాభిప్రాయాన్ని ప్రతిఫలింపచేస్తున్న పత్రికలు దీనిని, బలపరుస్తున్నాయి. రాజకీయసంస్థలు ఇండియాలోను, ఇంగ్లాండులోను కూడా, ఈ విషయాన్ని ప్రభుత్వముల దృష్టికి తెస్తున్నాయి. భారతీయ ప్రజానాయకులు, దేశమంతటా, బహిరంగసభలలో, ఈ విషయాన్ని ఉద్ఘాటిస్తున్నారు. భారతీయుల ఉత్కాంఠులపట్ల సానుభూతిగల ఆంగ్లేయులు కూడా, ఈ విషయం అత్యంతము అగత్యమైనదని, ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నారు. అట్టివారిలో, హెన్రీకాటర్, అలన్ ఆక్టేవియస్ హ్యూమ్, వంటివారున్నారు. ఇండియా ఆశయాలను సమర్థించడంలో వారికి రెండు ఉద్దేశములున్నవి. భారతప్రజలకు స్వపరిపాలన సిద్ధించడం న్యాయమైనది, సమంజసమైనది, అని

వారు భావించడం, మొదటిది. బ్రిటీషువారికి, భారతీయులకు గల సంబంధం తెగి పోకూడదని, స్వయంప్రభుత్వ సంపాదనకై, ప్రజలు తెగించి, హింసాకాండకు పూనుకొనే పరిస్థితిని ప్రభుత్వము కల్పించరాదనడం, రెండవది. సదుద్దేశాన్ని గురించి కాటన్ ఈ విధంగా వ్రాసియున్నాడు. "మన ప్రభుత్వము అవసరమనీ, దానిని తొలగించడం సాధ్యంకాదనీ గుర్తించి, విద్యావంతులు మన ఉనికిని సహిస్తున్నారు. మన ప్రభుత్వ పరిపాలన దేశాని కిదివరలో అధికమైన సేవ చేసిందని కూడా, వారు గుర్తిస్తున్నారు. కాని, ప్రభుత్వముయొక్క ఉత్తేజనంవల్లనే దేశములో అనేకములైన మార్పులు కలిగినవి. ఈ మార్పులకు అనుగుణంగా, ప్రభుత్వ విధానాలు ఏర్పడవలెనని మాత్రమే వారు కోరుతున్నారు. అట్టి ప్రభుత్వాన్ని సాధించడానికి కృతనిశ్చయులై యున్నారు. రాజకీయములలో వాస్తవమైన సమానత్వము తమకు సిద్ధించవలెనని వారికోరిక. నామ మాత్రమైన సమానత్వంలో వారిని శాంతింపజేయలేము. తమ దేశ పరిపాలన వ్యవహారాలలో తమ అభిప్రాయాలకు స్థానం లభించడము, ప్రభుత్వ పరిపాలనకు సంబంధించిన అధికారాలలో తమ భాగము, వారు కోరుచున్న విషయాలు."

యాలన్ ఆక్టేవియన్ హ్యూమ్ (1829-1912), 1846 నుండి, ఇండియా ప్రభుత్వసేవలో ఉండిన అధికారి. ఇండియా ప్రభుత్వ కార్యదర్శిగానున్నకాలంలో, ఇతనికీ, లిట్టనుకూ అభిప్రాయభేదము లేర్పడినవి. తన అభిప్రాయాల నితడు నిర్భీతిగా వ్యక్తం గావించినాడు. దానిని సహింపక, లిట్టన్, ఇతనిని అవమానకరంగా, క్రూరంగా, ఆ పదవినుంచి తొలగించెను. (1879). 1882 లో ఇతడు, సర్వీసు నుంచి విశ్రాంతి తీసుకొన్నాడు. ఇండియా ప్రజలకు, బ్రిటీషు ప్రజలకు గల ప్రయోజనములు సదృశమైనవని, రెండు ప్రజావర్గాలకు సమాన లాభం చేకూర్చేదిగా పరిపాలన విధానం, ఏర్పడవలెనని, ఇతడు మొదటినుంచీ తలచియుండినవాడు. బ్రిటను స్థాపించిన శాంతి (Pax Brittania) ప్రజల ఆర్థిక సమస్యను పరిష్కరింపలేదని కూడా ఇతడు గ్రహించినాడు. క్షామములు కలిగించిన వినాశం వల్ల రైతులు హతాశులై ఉండడం, ప్రజలతో ప్రభుత్వాని కే మాత్రమూ సంపర్కము లేకపోవడము, పాలిత ప్రజకు, పరిపాలకులకు మధ్య పరస్పర అభిప్రాయ ప్రసారమునకు మార్గములు లేకపోవడము, ప్రజల అవసరాలను, భావాలను, ప్రజలకు తెలియజేయగల సంవిధాన వ్యవస్థ దేశములో లేకపోవడము - మొదలైనవన్నీ, హ్యూమ్ గ్రహించినాడు. బ్రిటీషు రాజ్యం క్రమంగా, నిస్సత్వమై పోతున్నదని ఇతడు 1872 నాడే నార్త్‌బ్రూక్‌కు వ్రాసియున్నాడు......

"మన పరిపాలన ఎంత అస్థిరమైనదో మీరు గ్రహింపలేకపోవచ్చు. దోళాందోళితమై యున్న మన సామ్రాజ్యము యొక్క భవిష్యత్తు, ఎటు మొగ్గుతుందో చెప్పలేము. మన దృష్టికి గోచరము కానంతటి మబ్బు తునక పెద్దదై, మహామేఘంగా ఏర్పడి, దేశములో అరాజకత్వాన్ని, వినాశాన్ని ఎప్పుడు కురిపిస్తుందో చెప్పలేము". అని వ్రాసి యున్నాడు.

1870 ప్రాంతంలో, ఇండియాలో అంతటా ఆర్థిక దురవస్థ, అసంతుష్టి, వ్యాప్తమై యుండినవి. ప్రభుత్వ కార్యదర్శిగా నుండిన హ్యూముకు, పరిస్థితులు తెలియ వచ్చినవి. "విప్లవ రూపమైన ఆపదకు మన మా నాడు గురియై యుంటి మని, లభించిన సాక్ష్యాన్ని, నిదర్శనాలను బట్టి, నాకు విశ్వాసం కలిగింది. (లిట్టన్ ప్రభువు దేశము నుండి పోవుటకు 15 మాసముల క్రిందటి విషయం అది). నా చేతికి వచ్చిన ప్రబల సాక్ష్యమట్టిది. అనేకములైన విషయములను గుర్తించి యుండిన ఏడు సంపుటాలను నేను చూడటం తటస్థించింది. దేశములో ఏర్పడి యున్న దుష్ట పరిస్థితుల వల్ల, సామాన్య ప్రజల జీవితములు హతాశములైనవని, అధమవర్గ ప్రజలకు విశ్వాసం ఏర్పడింది. ఆకలికి మాడి, అన్నానికి అలమటించి, చావడం తప్ప, వీరికి వేరు గతి కలిగింపని పరిస్థితులివి. కనుక, వీరు బ్రతుకదలచు కొన్నట్టయితే, పరస్పరం సహాయంగా నిలిచి, ఏదో కార్యాచరణానికి పూనుకో వలసి ఉంటుంది. ఈ సంపుటములను పరిశీలించడం వల్ల తెలియ వచ్చిన సారాంశ మిది. ఈ బీద ప్రజలు పూనుకోవలసిన కార్యక్రమము - హింసాకాండ - అని, వాచ్యము చేయనవసరం లేదు." అని ఇతడు వ్రాసియున్నాడు. ఇతడు గావించిన హెచ్చరికను, సూచించిన భవిష్యత్తును, దక్కన్ దొమ్మి కలహాలు రుజువు పరచి నవి. కనుక, రానున్న ప్రళయాన్ని అడ్డుకొనే ప్రతిక్రియలకు బూనుకోవలెనని హ్యూమ్ నిశ్చయించడం స్వాభావికమైనదే. జాతీయోద్యమానికి సక్రమమైన వ్యవస్థ కలిగించడం ప్రధానమైన ప్రతిక్రియ. ఈ వ్యవస్థకు ఆధారంగా మూడు ఆశయాల నేర్పరచుకొన్నాడు.

దేశము జనాభాలోని విభిన్న వర్గాలన్నిటినీ మేళవించి, ఏకైకమైన జాతీయ సంస్థగా ఏర్పరచడం మొదటి ఆశయము. ఇట్లేర్పడిన జాతీయ సంస్థకు, ప్రధాన జీవిత విషయములన్నిటిలోనూ పునరుజ్జీవనం కలిగించడము - అనగా - ఆధ్యాత్మిక నైతిక, సాంఘిక, రాజకీయ విషయములు - రెండవది. భారత జాతికి అన్యాయము హానికరము, ఐ, యున్న, పరిస్థితులన్నీ మారిపోయేటట్లు చేసి, ఇండియాను ఇంగ్లాండును చేర్చి, ఒక సంఘముగా సిద్ధింప చేయడం, మూడవది.

వివిధ ప్రాంతాలలోని రాజకీయ నాయకులు, అఖిల భారతీయ సంస్థా నిర్మాణమునకై చేస్తూ ఉన్న ప్రయత్నానికి, ఉత్సాహముతో, హ్యూమ్, సహాయ పడినాడు. తత్ఫలితంగా, కార్యక్రమం వేగవంతమయింది. కలకత్తా విశ్వవిద్యా లయంలో పట్టభద్రులైన యువకులకు ఇతడొక జాబు వ్రాసియున్నాడు. ఒక సంఘాన్ని ఏర్పరచుకొని, కొన్ని కార్యక్రమాలను నిష్కర్షగా నిశ్చయించుకొని, దేశసేవకు పూనవలసిందని వారిని ఉద్బోధిస్తూ, ఈ క్రింది విధంగా మందలించి యున్నాడు. "మన చిన్న సేవాసైన్యము యోగ్యతలోను, క్రమశిక్షణలోను, అనన్య సామాన్యమైనది, స్వయంసమర్థమైనది కావలెను. (Sui generio). కాని ఇందులో మీరు చర్చించుకోవలసిన ముఖ్య ప్రశ్న ఒకటి ఉన్నది. విద్యావిష యంలో మీరుసాధించిన పాండిత్యాన్ని అటుంచి, ఈ సేవా సైన్యంలో చేరవలసిన

వారికి తప్పక అవశ్యకములైన గుణములు, స్వార్థరాహిత్యము, నైతిక స్థైర్యము, ఆత్మనిగ్రహము, పరహిత కార్యాచరణలో నిజమైన ఆసక్తి- అనేవి, మీలో ఉన్న వని ఎందరు నిరూపింపగలరు ? ప్రతి దేశానికి, దాని యోగ్యతననుసరించిన ప్రభుత్వం లభిస్తుంది. అనగా, ప్రజల అర్హతను బట్టి, తదనుగుణమైన ప్రభుత్వము ఏర్పడుతుంది. ప్రజలలో ఉత్తమ శ్రేణికిచెందిన వ్యక్తులని గుర్తింపబడిన మీరు, ఉన్నత విద్యాప్రాప్తినందిన మీరు, మీకూ మీ దేశానికీ తగిన స్వాతంత్ర్యాన్ని సంపాదించడానికి కృతనిశ్చయులై, తత్సాధనకై పూనుకోకపోతే, అన్ని అభ్యుదయాశలూ నశించినట్టే."

భారత నాయకులతో సంప్రతించి, హ్యూమ్, 1884 లో, తాను వివరించిన మూడు ఆశయాలను ఆధారంగా చేసుకొని, భారత జాతీయ సంస్థ నిర్మాణానికి పూనుకొన్నాడు. జాతీయ సంస్థయొక్క ఉద్దేశాలనీవిధంగా వివరించినాడు, "బ్రిటీషు రాజ్ఞి యొక్క ఆమోదంతో, పార్లమెంటు ఇండియాపరిపాలన సూత్రాలను విధించియున్నది. ఆ సూత్రాలను ఇండియా పరిపాలనపట్ల పాటించక పోవడము, ఆ సూత్రాలకు విరుద్ధమైన చర్యలుగావించడము, జరిగినది. ఈ లోపాలను, దోషాలను, వీటికి కర్తలైనవారిని,- వారెవ్వరైనాసరే,- సంవిధానరీత్యా ప్రతిఘటించడము, ఈ సంస్థయొక్క ముఖ్యోద్దేశము."

భారతదేశంలోని ప్రజాభిప్రాయాన్ని కేంద్రీకరించడానికై, ఈ సంస్థ యొక్క విధానం దేశమంతటా వ్యాప్తంగావింపబడినది. ప్రజల కోరికలను, సంస్థ ఈ విధంగా వ్యక్తపరచింది. "ప్రస్తుత మేర్పడియున్న, ఇండియా కౌన్సిలు పూర్తిగా ఉాశితం కావలెను. లేదా, పూర్తిగా పరివర్తన మొందవలెను. న్యాయపరిపాలనశాఖనుండీ ఇతర పరిపాలనశాఖలనుండీ, భారతీయులను బహిష్కరించియుండడం, రాజస్వాదాయాన్ని వినియోగించడంలో, భారతీయుల అభిప్రాయాలకు స్థానం లేకపోవడము, ప్రస్తుత శాసనపరిషత్తులను ప్రజాప్రాతినిధ్య సంస్థలుగా మార్పునొందించడము, - అనే ముఖ్య విషయాలనుగూర్చి భారతీయుల భావములను ఉద్ఘాటిస్తూ, అధికారికమైన గొప్ప మహజరును నూతన పార్లమెంటుకు పంపడం, మొదట చేయవలసిన ప్రయత్నము."

ఈ రాజకీయ సమావేశాన్ని గురించి, హ్యూమ్ గవర్నర్ జెనరల్ డఫ్ఫెరిన్‌తో చర్చించి, అతని అనుమతిని పొందినాడని, తెలుస్తుంది. ప్రజల నిజాభిప్రాయాలను తెలుసుకొనవలెననే ఆసక్తి, డఫ్ఫెరిన్‌కు, ఉండినది. అట్టి అభిప్రాయ సంగ్రహణకు ఈ రాజకీయ సమావేశం సాధనమౌతుందని అతడుకూడా అభిప్రాయ పడినాడు.

అంతట, హ్యూమ్ ఇంగ్లాండు వెళ్లి, ఇండియాపట్ల అభిమానంగల వ్యక్తులతో ఈ విషయం చర్చించినాడు. తాముకూడ, సహకరిస్తామని ఇతనిని వారు ప్రోత్సహించగా, ఆశ్వాసితుడై, భారత సంస్థ పూనాలో ఏర్పాటుచేసిన సమావేశంలో (డిశెంబర్ 25) పాల్గొనడానికై, ఇండియా మరలివచ్చెను. ఇండియా

లోని అన్ని ప్రాంతాలనుండి, ఈ సంస్థకు, సహాయ పోషణలు లభించినవి. 'భారత జాతీయ కాంగ్రెసు' అనే పేరుతో, జాతీయ సంస్థ ఏర్పడింది. సమావేశరంగాన్ని, కట్టకడపటి తరుణంలో, పూనానుండి బొంబాయికి మార్చుకొన్నారు.

కాంగ్రెసు సమావేశానికి తగిన ఏర్పాట్లను, బొంబాయి రాజధాని సంఘము నిర్వహించింది. 'గోకులదాస్ తేజపాల్' సంస్కృత కళాశాలలో, కాంగ్రెసు సభలు జరిగినవి. 72 మంది ప్రతినిధులు దేశములోని అన్ని భాగములనుంచి, సమావేశానికి హాజరైరి. కలకత్తా ప్రసిద్ధ న్యాయవాదియైన డబ్ల్యూ సి. బెనర్జీ, అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. విప్లవం జరిగి ముప్పై ఏండ్లు పూర్తి కాలేదు. నూతనాశయాలతో ఉత్తేజితులై, నవ్యభారతదేశ దర్శనముతో ఉత్సుకులై భారతీయులందరు ఏకమై, ఒక నూతన జాతీయ సంస్థగా ఏర్పడి, ప్రారంభించిన మహోద్యమము అరవై ఏండ్లలో తన ధ్యేయాన్ని చేరుకొన్నది.

1885 లో, జరిగిన కాంగ్రెసు ప్రథమ సమావేశంతో, భారతదేశమంతటా నూతన చైతన్యం ప్రస్ఫుటంగా వ్యక్తమయింది. భారతదేశ చరిత్రలో, ఇది మహోదంతము. మొదటిసారిగా దేశములో, రాజకీయైక్యము, సిద్ధించింది. దీనిని ఏర్పరచింది, కేంద్రములోని దేశీయ ప్రభుత్వము కాదు ; పరప్రభుత్వమూ కాదు. దేశములోని అన్ని భాగాలకు, అన్ని వర్గాలకు చెందిన ధైర్యశాలులైన, దూర దృష్టిగల భారతమాత సంతానము. వీరందరు బొంబాయిలో సమావేశమై, పరస్పరం సంప్రదించుకొని, భారతదేశ భవిష్యత్తునుగూర్చి, చర్చించుకొనిరి. భారత దేశ భవిష్యత్తును పూర్తిగా విదేశ ప్రభువుల హస్తముల కప్పగించి యుండమనీ, తమ దేశీయుల భావి జీవితాన్ని తామే నిర్ణయించుకొంటామనీ, పరిపాలకులను హెచ్చరించిరి. ఎట్టి శక్తులూ తమ ప్రయత్నాన్ని అడ్డగింపజాలవని, ప్రభుత్వానికి నిష్కర్షగా తమ నిశ్చయాన్ని స్పష్టం గావించిరి. కాంగ్రెసు ఈ విధంగా, దేశానికి ఆదర్శాన్ని ప్రదర్శించింది. దేశం, కాంగ్రెసు నిర్దేశాన్ని అంగీకరించింది. ప్రజల ఆశలు, ఉత్కంఠులు, కాంగ్రెసు సంస్థలో ప్రతిఫలించినవి కాంగ్రెసు గావించిన తీర్మానము, ఇండియా ప్రజలకు జరిగిన అపకృతికి, అవమానానికి, - ప్రతిక్రియగా ఏర్పడిన ప్రజల ఆక్రందనము; దాస్యవిమోచనకై, గావింపవలసిన యుద్ధానికి శంఖారావము. బ్రిటీషు పరిపాలనయొక్క దయాదాక్షిణ్యములపై ప్రజలు, ఉంచియుండిన విశ్వాసము, ఒక తరం గడవడంతో, స్వయంపరిపాలన అభ్యర్థనగా పరిణమించింది.

భారత జాతీయ కాంగ్రెసుయొక్క ఉద్భవము, భారతదేశ చరిత్రలో అపూర్వమైన అద్భుత సంఘటన. నూతనయుగము, రాజకీయైక్యతతో కూడిన నూతన ఘట్టము, కాంగ్రెసుతో ప్రారంభమయింది. ఈ నూతనశక్తి బాహ్య శక్తులవల్ల ఏర్పడిందికాదు. ప్రయత్నపూర్వకమైన ప్రజల సంకల్పము, ఈ విధంగా వ్యక్తమయింది. ప్లాసీయుద్ధము నాటినుండి గడిచిన నూరు సంవత్సరాలలో, కలిగిన ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక పరివర్తనల ఫలితంగా, పరిణతిచెందిన నూతన సమాజానికి, భావవ్యక్తీకరణ, సాధన కేంద్రంగా, కాంగ్రెసు సిద్ధించింది.

భారతీయులందరినీ, వైయక్తికంగాను, సామూహికంగానూ, బాధించుతున్న ప్రక్రియలన్నీ పరిణతిచెంది, కాంగ్రెసు సంస్థను ఉత్పన్నం గావించినవి.

కాని, కాంగ్రెసుయొక్క భవిష్యత్తు ఎట్టిదైయుండునో అన్న ప్రశ్నకు సమాధానం, 1885 నాడు లభింపదు. ఇతర రాజకీయ సంస్థలవలెనే, ఇదికూడా అనేకములైన ప్రతిబంధకాలను దాటవలసియున్నది. అనేక విధములైన కష్టాలను ప్రజల ఉదాసీన ప్రవృత్తిని, ప్రభుత్వముయొక్క ఆగ్రహాన్ని, ఇంకనూ ఇతరములైన క్లిష్టపరిస్థితులను సమర్థతతో, ఓర్పుతో సహించి, క్రమంగా ప్రబల సంస్థగా ఏర్పడవలసియున్నది. బ్రిటీషు మహాసామ్రాజ్యాన్ని ఎదిరించి నిలిచే సామర్థ్యము, సిద్ధించవలసియున్నది.

కాంగ్రెసు ఉద్యమము, నిరాడంబరంగా ప్రారంభించింది. మొదటి సమావేశములోని ఉపన్యాసాలు, తీర్మానాలు, మృదుభాషలో రచితములైనవి. బ్రిటీషుపరిపాలకుల పట్ల అధికమైన గౌరవ మర్యాదలను ప్రదర్శించినవి. అధ్యక్షోపన్యాసం, ప్రభుత్వానికి మృదుమార్గములో, స్మృతిని కలిగించింది. "ప్రభుత్వ పరిపాలనను విస్తృతమొనర్చి, దానిలో, ప్రజల స్వత్వమైన భాగాన్ని వారికి కలిగించవలసిందని మాత్రమే, కాంగ్రెసు, భక్తి విశ్వాసములతో ప్రభుత్వాన్ని, అభ్యర్థిస్తూ ఉన్నది.

శాసనపరిషత్తుల సంస్కరణలకు సంబంధించిన ముఖ్యమైన ప్రతిపాదనను గావించిన సభ్యుడు, కె. టి. తెలాంగ్. ఎస్. సుబ్రహ్మణ్యయ్యర్ దీనిని బలపరచినాడు. ఎన్నికలలో వచ్చిన సభ్యులతో పరిషత్తులేర్పడడము, చర్చనీయాంశములపై ప్రశ్నించే అధికారము సభ్యులకు కలిగించడను, ఆదాయవ్యయ పత్రాన్ని (Budget) పరిషత్తుల చర్చకు విధేయపరచడము, పశ్చిమోత్తర ప్రాంతంలోను, ఔధ్‌లోను, పంజాబులోను కూడా, శాసనపరిషత్తులనేర్పరచడము, పరిషత్తులలో అధిక సభ్యుల ఆమోదాన్ని పొందిన ఆక్షేపణలను పరిశీలించడానికి పార్లమెంటు ప్రజాసభలో, స్థాయీ సమితి ఏర్పరచడము,- మొదలైన విషయములన్నీ ఈ తీర్మానములో ఉన్నవి.

***1. కాంగ్రెసు లక్ష్యములు.*** ఉద్రేకము, కల్లోలంతో కూడిన ఉత్సాహము, ఇత్యాది ప్రవృత్తులు, రాజకీయ విప్లవ సందర్భాలలో ప్రదర్శింపబడడం సాధారణము. కాని, కాంగ్రెసు సంస్థ ఉద్భవసమయములో అట్టి ప్రవృత్తు లేవీ గోచరం కాలేదు. మొదటి సమావేశానికి వచ్చిన ప్రతినిధుల సంఖ్య 72 మాత్రమే. ఆ తర్వాత క్రమంగా ఎక్కువమంది ప్రతినిధులు సమావేశాలలో, పాల్గొంటూ వచ్చిరి. కలకత్తాలో జరిగిన రెండవ సమావేశమునకు 434 గురు ప్రతినిధులు హాజరైరి. మూడవ సమావేశానికి, మదరాసులో 607 మంది, హాజరైరి. ఈ అభ్యర్థులందరూ, సాధారణంగా, వివిధ స్వతంత్ర వృత్తులకు సంబంధించినవారు, న్యాయవాదులు, ఉపాధ్యాయులు, ప్రజా ప్రచారకులు, పత్రికా సంపాదకులు,- మున్నగువారే ఎక్కువగా దీనిలో ప్రవేశించినవారు. వ్యాపారస్థులు, చాలవరకు, కాంగ్రెసు సభలకు పోలేదు. భూస్వాముల వర్గము-అత్యధికభాగము,- కాంగ్రెసు

ఉద్యమానికి దూరంగా నిలిచింది. ముస్లిము వర్గము, రెండు పక్షాలుగా ఏర్పడింది. సర్ సయ్యద్ అహమద్ ఖాన్ నాయకత్వం క్రిందనున్న వర్గము, కాంగ్రెసును వ్యతిరేకించి, విరుద్ధంగా ప్రవర్తించింది. ఐనప్పటికీ, కాంగ్రెసు సమావేశములకు వచ్చిన, ముస్లిం ప్రతినిధుల సంఖ్య క్రమంగా వృద్ధి అవుతూ వచ్చింది. బొంబాయి సమావేశానికి హాజరైన ముస్లిము లిరువురే. కలకత్తా సమావేశానికి ముప్పై ముగ్గురు, మదరాసులో 81 మంది, హాజరైరి. 1890 లో జరిగిన ఆరవ కాంగ్రెసు సమావేశములో అభ్యర్థుల మొత్తము సంఖ్య 702. అందులో 156 గురు ముస్లిములు.

మొదటి సమావేశాలలో, సభ్యత, చిత్తస్వాస్థ్యము ఆత్మసంయమనము, చక్కగా పాటింపబడినవి. ఉపన్యాసాలలోను తీర్మానాలల్లోను, విప్లవాత్మక ధోరణిలేదు. బ్రిటీషు పరిపాలనవల్ల సిద్ధించిన లాభాలను పేర్కొని, బ్రిటీషు ప్రభుత్వంపట్ల భారతీయులకు గల భక్తి విశ్వాసములను పునరుక్తం గావిస్తూ, బ్రిటీషు సామ్రాజ్యములో ఒకభాగంగా నిలిచియుండడం భారతీయుల అభిమతమని వ్యక్తం గావిస్తూ వచ్చినవి, ఆ కాలపు అధ్యక్షోపన్యాసాలు.

కాంగ్రెసు కోరికలు, ప్రార్థనార్థకములతోను, దైన్యభావ ప్రదర్శక వాక్యములతోను, కూర్చబడినవి. ధిక్కారసూచక శబ్దంకాని, ఆపత్తి సూచకధ్వనికాని, ఆ భాషా ప్రయోగంలో, ప్రయుక్తంకాలేదు. ఐనా, ఆదినుండీకూడా, ప్రాథమికములైన సంవిధాన సూత్రముల మార్పునుద్దేశించి, ప్రయత్నం గావిస్తూ వచ్చినది కాంగ్రెసు. కేంద్ర శాసనసభను, ప్రాదేశిక శాసన పరిషత్తులను విస్తరించడము, ఎన్నికలలో వచ్చిన ప్రజా ప్రతినిధులకు ఎక్కువ ప్రాధాన్యము కల్పించడము, సభ్యుల అధికారాలను, ధర్మాలను, విస్తృతం గావించడము, - అనే సంస్కరణలకై, మొదటి సమావేశమునుంచి కూడా కాంగ్రెసు ఒత్తిడిచేస్తూ వచ్చింది. బాధ్యతారహితమైన ప్రభుత్వ విధానాన్ని మార్చి, ప్రజాప్రతినిధులతో సంప్రదించి, వారి సహకారంతో జరిపే ప్రభుత్వ విధానం ఏర్పడవలెననడం, కాంగ్రెసు అభ్యర్థనయొక్క ప్రధానోద్దేశము. ఈ తీర్మానము, తరువాత జరిగిన ప్రతి సమావేశంలోనూ, పునరుక్తమై ఉద్ఘాటింపబడుతూ వచ్చింది.

వాస్తవానికి, కాంగ్రెసు సంస్థ మధ్య తరగతులవారి ప్రయత్న ఫలితమే ఐనా, అన్ని వర్గాల ప్రజల అవసరాలనూ, అది తనదిగా చేసుకొన్నది. సివిల్, మిలిటరీ సేవలలో, - అందును ముఖ్యంగా ఉన్నత పదవులలో, - ఉద్యోగావకాశాలు భారతీయులకు సిద్ధింపవలెనని ప్రభుత్వాన్ని కోరడములో, మధ్యతరగతి వారి ప్రయోజనం సమర్థింపబడింది.

భూస్వాములు ప్రభుత్వానికి చెల్లించే రాజస్వ విషయము శాశ్వత పరిష్కారం కావలెనని, రైతులు భూస్వాములకు చెల్లించే భాటకములు, శాశ్వతంగా, నిశ్చితం కావలెనని కోరడములో, గ్రామీణ వ్యవసాయదారుల ప్రయోజనాలకు చేయూత నిచ్చింది. పల్లెలలోని బీదప్రజలను పీడిస్తున్న, వనసంబంధమైన న్యాయ సూత్రాలను (Forest laws) కాంగ్రెసు ఆక్షేపించింది. ప్రజలందరికీ అత్యావశ్యక

మైన ఉప్పుపై, పన్నును విధించడంవల్ల బీదప్రజల అత్యల్ప సంపాదనపై భారం పడుతుందని గ్రహించి, కాంగ్రెసు సంస్థ ఉప్పుపన్నును వ్యతిరేకించింది. అదికాక, సైన్యవ్యయమును భారతదేశంపై మోపడంలో గల అన్యాయమును, భారతదేశ ఆర్థిక స్థితికి హానికలుగునట్లుగా, విదేశీ ద్రవ్యమారకాన్ని త్రిప్పుకోవడము, పరిపాలన వ్యయం మితిమీరి యుండడము, పన్నుల భారం అధికమై యుండడం, శుల్కపద్ధతి, ఉత్పాదన శుల్కము, - మొదలైన సమస్యలన్నీ, విత్తసంబంధమైన కాంగ్రెసు తీర్మానములో, చేర్చబడినవి. శుల్క సంబంధమైన తీర్మానము వర్తకుల కుపకరించేది.

ప్రజానీకంయొక్క విద్యా విషయమై ప్రభుత్వము నిర్లక్ష్యం ప్రదర్శించినదని, కాంగ్రెసు, ఆ విషయానికి ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చింది. న్యాయ పరిపాలన, న్యాయస్థానాల నిర్వహణము, సంస్కరింపబడవలెననీ, న్యాయ నిర్ణయ వర్గము, కార్య నిర్వాహకవర్గము, వేరు శాఖలుగా ఏర్పడవలెననీ, కాంగ్రెసు కోరింది. అంతేకాక, స్థానిక స్వయం ప్రభుత్వముల విషయములో గల దోషాలను కూడా చూపి, వాటి సంస్కరణను కోరింది. సంఖ్యా పరిమాణాన్నిబట్టి కాంగ్రెసు సంస్థ చిన్నదే. దానికి ధనము, అధికారము, లేవు. కాని, ప్రజల మనస్సులకు హృదయాలకు కూడా, ప్రతినిధి, కాంగ్రెసు సంస్థ. భారతదేశము యొక్క రాజకీయ, సాంఘిక, ఆర్థిక వ్యవస్థలకు, సంబంధించిన శ్రేయస్సు కాంగ్రెసు చర్చలలో ప్రస్ఫుటమయింది. విశాలము, ఉన్నతము, స్వతంత్రము, ఐన ప్రజాజీవితము వీరి తీర్మానాలకు ఉత్తేజకమైనది. నవ్య భారతదేశానికి నిదర్శన చిహ్నము కాంగ్రెసు. దేశముయొక్క నైతిక వ్యక్తిత్వానికి అది నిదర్శనము. కాలం గడచినకొద్ది, భారత రాజకీయ ఆశలకూ, ఉత్కంఠలకూ అది మూలస్వరూపంగా సిద్ధించింది. స్వాతంత్ర్య సిద్ధికి అనుకూలించిన సాధనమయింది.

***2. భారత ప్రజలపై కాంగ్రెసు సంఘట్టనము :*** కాంగ్రెసు అవలంబించిన క్రియాశక్తమైన, ఆదర్శధ్యేయము, దేశములోని వివిధవర్గాలలోను, బ్రిటీషు వారిలోను, విభిన్నములైన ప్రవృత్తులకు కారణమైనది. దేశములో ఇంకను మిగిలియున్న సాంప్రదాయిక జమీందారీవర్గము, నూతనముగా ఏర్పడిన భూసంపన్నులు, - ఈ వర్గములకు చెందిన హిందువులు ముస్లిములుకూడా, - కళవళపడజొచ్చిరి. పూర్వపు రాజకీయ వ్యవస్థ, ఈ వర్గముల పుట్టుకకు, రక్షణ పోషణలకు ఆధారమై యుండినది. కాంగ్రెసువారు బూనుకొన్న ఉద్యమంవల్ల వీరి భావిస్థితి అనిశ్చితము, అవ్యవస్థితము అయ్యే అవకాశమున్నది. కనుక, స్వాభావికంగా వీరు తమ పెంపుడుతల్లి ఐన బ్రిటీషు ప్రభుత్వమును ఆలంబనముగా చేసికొని, దానికి దృఢబద్ధులైరి.

వర్తక సంఘమునకు సద్యః ఫలమును కలిగించే విధానము అవసరము. శాశ్వత పరిస్థితి ఏర్పడి, తమ వర్తకము సరిగా జరగడం ముఖ్యావసరము. దీనిని వర్తకులు చక్కగా గ్రహించినవారు. బ్రిటీషు ప్రభుత్వ మింతవరకు, తమ

వ్యాపార వాణిజ్య ప్రయత్నములను కుంఠితమొనర్చి, అభివృద్ధికి విరోధులై, ఇంగ్లాండును పోషించియుండడం గుర్తున్నది. కనుక, దేశపు ఆర్థికస్థితిని బాగు చేయడానికి, సామాన్య ప్రజలను నలిపివేయుచున్న దారిద్ర్య నిర్మూలనానికి బూనుకొన్న కాంగ్రెసు సంస్థపై, వర్తకులు తమ భవిష్యత్తును చేర్చినారు.

ఇక మిగిలియున్నది, అనంతమైన ప్రజానీకము. పొలాలపై, పనిచేసే శ్రామికులకు, వ్యవసాయదార్లకు, గుత్తదార్లకు, తామే రక్షకులమని, ఈ బీదల ప్రయోజనములను తామే సురక్షితం చేస్తున్నామని, ప్రభుత్వాధికారులు ఆత్మ ప్రశంస గావించుకొంటూ ఉండిరి. వాస్తవ పరిస్థితి దీనికి వ్యతిరేకమైనదని, దాదాభాయి నౌరోజీ, నిరూపించినాడు. వడ్డీ వ్యాపారస్థులు, భూకామందులు, ప్రభుత్వపు గులాములు, వీరందరూ, స్వప్రయోజనార్థము, గ్రామీణ ప్రజానీకాన్ని ఉపయోగించుకొని, బాగుపడియున్నారు. అత్యాశాపరులైన భూకామందుల నుంచి, వడ్డీ వ్యాపారస్థుల నుంచి రైతువర్గాన్ని రక్షించడానికి కొంత ప్రయత్నము, ఆలస్యంగా జరిగింది. కాని, భూముల పరిపాలన వ్యవస్థ సర్వస్వము, దానికి సంబంధించిన చట్టములు, దోషభూయిష్ఠములై యున్నందువల్ల, ఈ ప్రయత్నములకు ఎట్టి ఫలమూ కలుగలేదు.

ప్రజానీకంలో సార్వత్రికమై వ్యాపించియున్న, అజ్ఞానం కారణంగా, కాంగ్రెసు సంస్థయొక్క ఉద్యమాన్ని ప్రజలు అవ్యక్తంగా మాత్రమే అర్థము చేసుకో గలిగిరి. ఐనా, గణుతింపదగిన పట్టుదలతో వీరి ప్రయోజనాలను తనదిగా గ్రహించి, వారి కష్టములను తొలగించడానికి కాంగ్రెసు పోరాడింది. కనుక, కాంగ్రెసు సంస్థ తమ హితైషియనీ, తమ ప్రతినిధియనీ ప్రజలు గ్రహించి, ఈ సంస్థతో ఏకీభవించిరి.

కాంగ్రెసు సంస్థ అవలంబించిన అర్థగర్భితమైన విధానము, ఆత్మసంయమనముతో కూడిన ఉపన్యాస ధోరణి, ప్రతిపాదించిన అభ్యర్థనల మితత్వము,- వీటి అంతరార్థాన్ని సూక్ష్మగ్రాహ్యులైన వ్యక్తులు అవగాహన చేసుకోగలిగినారు. 1885-86 శీతాకాలములో ఇండియా పర్యటనం గావించిన పార్లమెంటు సభ్యుడు స్లాగ్ (Slagg), ఇండియా రాజకీయ పరిస్థితిని సరిగా అర్థముచేసుకొని, ప్రజల కోరికలను గాంభీర్యముతో అంగీకరించడం హితకరమని, తన దేశీయులను హెచ్చరించెను. "కాంగ్రెసుకుగల మహత్తరమైన ప్రాధాన్యాన్ని తేలికగా తీసుకోవడం అవివేకము. బెల్షజార్ ప్రాసాదపు గోడలపై ఉన్న వ్రాతవంటిది, ప్రస్తుత పరిస్థితి." అని అతడు సూచించియున్నాడు. మరియొక పార్లమెంటు సభ్యుడు, సామ్యుయెల్ స్మిత్, ఇండియాను సందర్శించి, స్లాగ్ చెప్పిన మాటలను ప్రతిధ్వనింపజేసినాడు. "దేశీయుల రాజకీయాధికారాలను విస్తృతి గావించడానికి అవసరము, సమయము, సిద్ధించినవి. దేశపరిపాలన వ్యవస్థలో, ఉత్తములైన దేశీయులను అధిక సంఖ్యలో గ్రహించడం ఆవశ్యకము. ఇదిదానికి తగిన సమయము."

***3. కాంగ్రెసు ఉద్యమంపట్ల ప్రభుత్వపు ప్రతిక్రియ*** : ప్రభుత్వ ప్రతిక్రియ ఎట్టిది ? కాంగ్రెసు గావించిన ప్రథమయుద్ధ ఘోషణతో కూలిపోవడానికి బ్రిటీషు

సామ్రాజ్యం, జెరికో, గోడవంటిది కాదు. 19 వ శతాబ్దపు కడపటి దశాబ్దాల కాలంలో, బ్రిటీషు సామ్రాజ్య బల ప్రతిష్ఠలు ఉచ్ఛ్రయస్థితిలో నుండినవి. 'చిన్న ఇంగ్లాండులు' అనే వాదమునకు చెందినవారు, దుర్బలులై పోయిరి. ఉదారవర్గంలోని అధికభాగం, సామ్రాజ్యనీతికి లోబడి పోయింది. ఇండియా ప్రభుత్వ కార్యదర్శి, సర్వతంత్ర స్వతంత్రుడైనాడు. ఇండియా సామ్రాజ్యాధికార సూత్రములన్నీ అతనికి హస్తగతమైనని. లండనులో ఇతడు గావించిన నిర్ణయాలను, నిశ్చయాలను, పరిపాలనలో ప్రవేశపెట్టి, వాటిని అమలుజరిపే సాధనమాత్రంగా ఏర్పడింది, ఇండియాలోని ప్రభుత్వము.

రాజకీయ సంఘటనలను గూర్చి ఇండియాప్రభుత్వ కార్యదర్శికి తెలుప వలసిన బాధ్యత, ఇండియా ప్రభుత్వముదే. కనుక, కాంగ్రెసు కార్యక్రమాలలో కొంత కుతూహలం ప్రదర్శించింది. ఉద్యమ విధానంపట్ల కొంత ఆసక్తికూడా వహించింది. 1886 లో, కలకత్తాలో జరిగిన కాంగ్రెసు సమావేశ సందర్భంలో హాజరైన ప్రతినిధులకు, డప్ఫెరిన్, ఆహ్వానసభ నేర్పరచినాడు. తరువాతి సంవత్సరం జరిగిన సమావేశములో మదరాసు గవర్నరుకూడా, ఇట్టి గౌరవాన్నే ప్రదర్శించెను. కాంగ్రెసు సమావేశాలను సందర్శించడానికి ప్రభుత్వాధికారులు కూడా అనుమతింపబడిరి. కాని, 1888 నాటికి, ప్రభుత్వ ప్రవృత్తి, పూర్తిగా మారిపోయింది.

బాధ్యతాయుత ప్రభుత్వమును గూర్చిన అభ్యర్థనను, తీర్మానములను, పునరుక్తిగావించు చుండడము, ప్రభుత్వచర్యలను ఉపన్యాసములలో విమర్శించడము, విదేశ యుద్ధములకు బూనుకొన్న సామ్రాజ్య నీతిని ఖండించడము, - మొదలైన కాంగ్రెసు చర్యలు, బ్రిటీషు పరిపాలకులకు,- రుచించలేదు. రాజకీయాందోళనను నిరంతరంగా నడిపించే ఉద్దేశముతో కాంగ్రెసు విడుదల కావిస్తున్న కరపత్రములు ప్రజల దురవస్థలను ప్రచారము చేయుచుండడము, పరిపాలకులను చిక్కులలో పెట్టింది. ఈ సంఘటనలు, అసంతుష్టిని ఎక్కువ గావించి, ప్రజలలో తీవ్రతను కలిగిస్తూ ఉండినవి. ఐర్లండులో జరిగిన 'స్వపరిపాలనోద్యమానికి' సదృశమైనది ఈ విధానము. డప్ఫెరిన్ ప్రవృత్తిలో ఉద్రేకం గోచరించింది. కాంగ్రెసు కార్యనిర్వాహకుడైన హ్యూమ్‌పై, తన అసహ్యాన్ని వ్యక్తపరచినాడు. సర్ హెన్రీ మేయిన్‌కు ఈ విషయమై వ్రాస్తూ, "హ్యూమ్ అనే పేరుగల వ్యక్తియొకడు, ఈ దుష్టప్రవర్తనలకు ప్రేరకుడు. ఈ అధిక ప్రసంగిని, రిప్పన్, గౌరవంతో ఆదరించి ఉండినాడు. ఇండియా స్వపరిపాలనోద్యమానికంతకు, ఇతడే ప్రేరకుడు. ఇతడు ఉపాయశాలి, మతి స్వాస్థ్యం కొంత తక్కువ, దురభిమాని, నియమరహితుడు, సత్యంపట్ల జాగ్రతలేనివాడు",- అని ఈ విధంగా, హ్యూమ్‌ను గూర్చి, దురభిప్రాయం కలిగించెను. ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వానికి భారతీయులు అర్హులు కారని, మేయిన్ కూడా అంగీకరించి, తనకి విషయములోగల కారణాలను ఈ విధంగా వివరించెను.

"విద్యావంతులైన భారతీయులు సాధింపబూనిన ఆదర్శము ఏ మాత్రమూ,

కార్యసాధ్యమైనదికాదు. కనుక దానిని గూర్చి విచారించడం వ్యాకులతను కలిగిస్తుంది. 18 కోట్ల ప్రజలు తమకు తామేవిధంగా పరిపాలించుకోగలరు? బాధ్యతాయుత ప్రభుత్వము, ప్రజాప్రాతినిధ్య ప్రభుత్వము, అను మాటలను ఇంతటి విస్తారమైన ప్రజానీకానికి అనువర్తింపజేయడం, అర్థరహితమైనది. మన ప్రజాస్వామ్య ప్రభుత్వభాషను విద్యావంతులైన దేశీయులు నేర్చి వాడుచున్నారే కాని, వారు ఏర్పరుప బూనుకొన్నది, కేవలం సంకుచితమైన అల్పసంఖ్యాక ప్రభుత్వం మాత్రమే. విశ్వవిద్యాలయాలలో చదివి వచ్చినవారి సంఖ్య 5000 కు మించినది కాదని నేనెరుగుదును. 180 మిలియను ప్రజలను, 5000 మంది వ్యక్తులు పరిపాలించడానికి అనుకూలించే పరిపాలనయంత్రాంగము, ఒక సంపన్న వర్గాన్ని సృష్టింపక తప్పదు. అందులోనూ, ఇందలి సంపన్న వర్గము, శక్తివంత మైనది కూడా కాదు, ప్రజాప్రతినిధి వర్గమూకాదు; ఎట్టి సాంఘిక సంస్కరణనూ అభిమానించేదీ కాదు".

నార్త్‌బ్రూక్‌కు, డప్ఫెరిన్, ఈ విధంగా వ్రాసియున్నాడు;- "అభ్యుదయ సంస్కరణల విషయమైన ప్రజలకోరికకు ఏమాత్రం ప్రోత్సాహాన్ని నేనివ్వడం లేదు. ఆశలను, ఆపేక్షలను కలుగజేసినట్టయితే, వాటిని పూర్తిచేయడం సాధ్యం కాకపోవచ్చు".

బెంగాలీ అభ్యుదయవర్గం వారిని గూర్చి, ఇంగ్లాండు రాజ్ఞికి, గవర్నర్ జెనరల్, ఈ విధంగా వ్రాసియున్నాడు. "సమగ్రములైన సంవిధాన సంస్థలను ఏర్పరచవలసిందని, ఈ వర్గంవారు, నిరంతరంగా ఘోషపెట్టుతున్నారు. కాని, వీరి పలుకుబడి అత్యల్పమైనది. వీరి సంఖ్య కూడా అల్పమైనదే. కనుక, ఈ చిన్న కూటము, ఇంతవరకు సాధించిందేమీలేదు." ఈ విధంగా తమ రాజ్ఞికి విన్నవించిన ఈ సత్యసంధుడే, జూబిలీ ఉత్సవములో ఉపన్యసిస్తూ, దేశీయులను తనకు ప్రసన్నులను కావించుకొనే నిమిత్తం, ఈ విధంగా పల్కియున్నాడు;-

"మనము పునఃపరిశీలన గావించుచున్న ఈ కాలావధిలో విద్యావ్యాప్తి సత్ఫలాన్ని ప్రసాదించింది. ఉత్తమ విద్యావంతులు, మేధావులు, సత్పురుషులు ఐన, దేశీయులు దేశమంతటా వ్యాపించియున్నారు. వీరి హృదయ పూర్వకమైన సహకారంతో, భక్తిశ్రద్ధలతో, ఉత్తమ దేశక్షేమాన్ని సాధించడం, మా ఆశయము. మా పరిపాలన వ్యవస్థ ఏర్పడియున్న విశేష పరిస్థితులను బట్టి, ఈ విద్యావంతుల సలహాలు, సహాయము, ఏకీభావము, పరిపాలన ధర్మములు సక్రమంగా నెరవేర డానికి ఆవశ్యకములు. తమ దేశమునకు సంబంధించిన పరిపాలన వ్యవహారములను నిర్వహించడంలో, తాము కూడా ఇంగ్లీషు పరిపాలకులతో ఎక్కువగా చేరియుండ వలెనని వారు కోరడం, సహజమైనదే. ఈ విషయమై నా ఆమోదము, సద్భావము వారికి ఉన్నది. తద్భిన్నమైన ఎట్టి ఇతర భావనా, నాకులేదు. ఉన్నత విద్యా వంతులు, ప్రాభవవంతులు, ప్రజల విశ్వాసానికి పాత్రులు ఐన, సద్వంశీయులను, శాసనసభలకు పరిషత్తులకు, అనుషంగంగా గ్రహించడానికి, హ్యాలిఫాక్స్ ప్రభువు, ఇంతకు పూర్వమే, వివేచన పూర్వకంగా, నిశ్చయించియున్నాడు. హేతు

వాదాను గుణంగా, రాజకీయ ప్రతిష్ఠను విశాలమైన పద్ధతిలో పర్చరచి, భారతీయు లకు దాని నిర్వహణలో సక్రమ భాగం కలిగించడం నాకూ అభిమతమైనదే. నా పదవీ కాలావధిలో, దీనిని నెరవేర్చడానికి పరిస్థితు లనుకూలిస్తే, నేను సంతో షిస్తాను".

ఒక నెల తర్వాత, ఇండియా ప్రభుత్వ కార్యదర్శి, క్రాసుకు, ఈ విధంగా వ్రాసియున్నాడు. "గలభానంతటినీ లేపుతున్నది బెంగాలీ బాబూలు మాత్రమే కాదని, మీరు గ్రహించవలసియున్నది. తమ దేశపరిపాలన విషయములో తమ అభిప్రాయాలను గ్రహించి, అనుసరించవలసిందని, విద్యావంతులైన దేశీయు లందరూ, కుతూహలపడుతూ ఈ కల్లోలాన్ని సాగిస్తున్నారు. ఇందులో మహమ్మదీయులు కూడా చేరినారు". ఐనా, బ్రిటీషు ఆధిపత్యాన్ని సర్వోచ్చ స్థితిలో నిలిపి ఉంచడానికితడు నిశ్చయించుకొన్నాడు. కనుకనే, "ఇంగ్లీషు న్యాయపరిపాలన పద్ధతి, ఇంగ్లీషుపరిపాలన సమర్థత మాత్రమే, ఇండియా ప్రజలకు శ్రేయస్సును కలిగించి రక్షించునవి, అనే మీ అభిప్రాయంతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. కనుక, ఎట్టి పరిస్థితులలోనైనా, ఈ రెండు ముఖ్యాంశాలను (న్యాయపరిపాలన, ప్రజాపరిపాలన) సర్వోత్కృష్ట స్థితిలో, సర్వతంత్ర స్వతంత్ర స్థితిలో రక్షించుకోవడం, ప్రధానమైన కర్తవ్యము". "శిశు సహజప్రవృత్తిని పాటించుచున్నది". "ఈటన్, హ్యారో పాఠశాలల చర్చాసంఘము", "ఎక్కువగా గలభాచేసే అవివేకులు యాజమాన్యం వహించిన గర్భోన్మాదగ్రస్తుల కూటము", "సూక్ష్మాతి సూక్ష్మమైన అల్పవర్గ సహకారంగల బాబూ పార్లమెంటు,"- అని ఈ విధమైన తన సహజ ప్రశంసావాక్యములను, కాంగ్రెసు సంస్థపై, ఇతడు కురిపించినాడు.

భారతజాతీయ కాంగ్రెసు విషయమై, రాగద్వేష రహితమైన అభి ప్రాయాన్ని వహించిన, ల్యాన్స్‌డౌన్, 1890 లో ఈ విధంగా తన అభిప్రాయాన్ని వ్యక్తపరచెను,-

"ఉత్కర్ష నొందిన ఉదారపక్షము" అని యూరోపులో వ్యవహరింపబడ డానికి అర్హమైన సంస్థగాను, విస్తృతరూఢి వాదపక్షానికి భిన్నమైనదిగాను, కాంగ్రెసు సంస్థను, ఇండియా ప్రభుత్వం, గుర్తిస్తూ ఉన్నది. సంవిధానపు పరి మితులలో నిలిచి, ఈ రెండువర్గాలు తమ ధర్మాలను నిర్వహిస్తూ ఉన్నంతవరకు, ప్రభుత్వం వీటిపట్ల నిష్పక్షపాతమైన, తటస్థ విధానాన్ని అనుసరిస్తూ ఉంటుంది".

కాంగ్రెసు క్రమంగా పడిపోతున్నదని తన సంతోషాన్ని వెలిబుచ్చుతూ, హ్యామిల్టన్, ఇండియా రాజ ప్రతినిధియైన ఎల్జినుకు, వ్రాసియున్నాడు. కాంగ్రెసు సభ్యుల శీల ప్రవృత్తులు, సందేహాస్పదములైనవని, ఆ సంస్థ విద్రోహ సంఘమని, ఇండియా ప్రభుత్వ కార్యదర్శి హ్యామిల్టన్, అభిప్రాయము.

అయోగ్యమూ, అసమంజసము ఐన, ఈ అభిప్రాయానికీ, హ్యామిల్టన్ ప్రద ర్శించిన అనుచిత సంతోష ప్రదర్శనకూ, సామ్రాజ్యనీతికి అభిమాన దూతయైన, కర్జన్, మెరుగులు దిద్దినాడు. కాంగ్రెసు సంస్థకు మరణ మాసన్నమై యున్నదని,

ఔత్సుక్యాన్నీ, తృప్తినీ, ప్రదర్శించెను. "పతనానికి సిద్ధమైయున్నది కాంగ్రెసు. ఇండియాలో, నేనుండగనే దీని చావును చల్లగా చూడగలగడం, నా ఉత్కంఠ లన్నిటిలోనూ శ్రేష్ఠమైనది." అని తన ఉదారాశయాన్ని వెలువరచినాడు.

## VIII. పాలకులకు, పాలితులకు ఏర్పడిన సంఘర్షణ

సామ్రాజ్య శక్తికి, పాలిత ప్రజలకు, గల పరస్పర సంబంధములో సహజంగా నిహితమైయున్న సంఘర్షణ, కాంగ్రెసు ఉదయంవల్ల, ఘనీభవించింది. ఇది స్వాభావిక ప్రవృత్తి. ఈ సంఘర్షణలో ఒక నైతిక ప్రశ్న, ఇమిడియున్నది. భారతీయ ప్రజలు తన కధీనులై, విధేయులై ఉండవలెనని, నిర్బంధపరచడం బ్రిటీషు సామ్రాజ్యమున కేవిధంగా న్యాయమైనది? దీనిని నైతికముగా సమర్థించడమెట్లు?

బ్రిటీషు ప్రభుత్వం, ఈ విధంగా సమర్థించు కొంటుంది;- ఇండియా అనేది ఒక జాతివారితో కూడిన దేశంకాదు. ఇండియా అనేపదము, భౌగోళికమైన, భూభాగాన్ని నిర్దేశిస్తుందేకాని, ఒక జాతి ప్రజనుకాదు. పలువిధములైన వంశములు, మతవర్గాలు, జాతులు, మత సంస్థలు, సంస్కృతులు, తమకు నివాసంగా, ఏర్పరచుకొన్న ఒక భూభాగమిది. వీరందరూ ఒక సంఘముగా, సంయోజితమైయున్నవారు కారు. సామాజికము, నైతికము ఐన, ఐక్యత వీరికిలేదు. ఇంతకు పూర్వము, ఈ దేశాన్ని పరిపాలించిన వారి కెట్టి నైతికాధికారంకలదో, బ్రిటీషు వారికి కూడా, అట్టి నైతికాధికారమే కలదు. ప్రాచీన విదేశీయులు ఏ న్యాయాన్ని పురస్కరించుకొని ఈ దేశాన్ని ఆక్రమించిరో, ఆ న్యాయమే, బ్రిటీషువారిపట్ల కూడా వర్తిస్తుంది. 'ఆయుధబలము' అనే ఈ న్యాయం రెండు పక్షములకూ సమానమైనదే. పూర్వ పరిపాలకులు నెలకొల్పిన విధంగా, బ్రిటీషువారు కూడా శాంతి భద్రతలను నెలకొల్పినారు. అంతకంటె శ్రేష్ఠమైన పరిపాలన వ్యవస్థ, న్యాయ శాసనము, న్యాయపరిపాలన వ్యవస్థ, సమర్థమైన కార్యనిర్వాహక వర్గము, బ్రిటీషు ప్రభుత్వం నెలకొల్పింది. జాతీయైక్యము దేశములో లేని సందర్భంలో, పరస్పర విరుద్ధములై, సమన్వయములేని ఇరవైకి మించిన వర్గాలకు ప్రభుత్వం ఏ విధంగా, బాధ్యత వహిస్తుంది? ఇది వీరి సమర్థన.

స్థిరంగా పాదుకొనిపోయి ఉన్న అధికారీ తంత్ర ప్రభుత్వము, సమాజములోని అంతఃక్షోభ ఎటువంటిదో ఏ మాత్రమూ గ్రహింపలేదు. తమ చుట్టూ జరుగుతున్న సామాజిక విప్లవాన్ని గుర్తించలేని అంధులుగా ఉండిరి. ప్రపంచములోని ప్రాగ్భాగము, ఎన్నటికీ, మార్పు చెందనట్టిదని, వీరిభావము. కనుక, పరస్పర కలహాలకు, యుద్ధాలకు లోనైయున్న రాజులకు, జాతి వర్గాలకు మధ్య సక్రమ వ్యవస్థను, న్యాయపరిపాలనను నెలకొల్పిరి. పరిపాలన జరుపవలసిన మహా భారాన్ని వహించడం, శ్వేత జాతులవారికి దైవ నియామకమైన కర్తవ్యము, అని వీరి విశ్వాసము. ఆంగ్ల విద్యావంతులైన నూతన వర్గంవారికి దేశంలో ప్రాధాన్యం లేదని, సంఖ్యా పరిగణననుబట్టి, వీరు నిరూపించిరి. విశ్వ విద్యాలయ ఆవరణమ్ములో ప్రవేశించిన దేశీయు లెంతమంది ? అని వీరు ప్రశ్నింపసాగిరి.

ఇంతటి అత్యల్పమైన వర్గం, నోరులేని కోటానుకోట్ల ప్రజల కోరికలకు, అభిప్రాయాలకు, ప్రాతినిధ్యం వహించడమెట్లు? ఈ అల్పవర్గంలో చేరిన వారం దరూ, నగర వాసులైన న్యాయవాదులు, పత్రికాసంపాదకులు, గుమాస్తాలు. గ్రామ సీమలలోని చిన్న పల్లెలలో కష్టించుచున్న రైతులు, చేతి పనివాండ్రు, అసం ఖ్యాకులు. ఈ రెండు ప్రజావర్గాలకు మధ్యగల అంతరము, అగాధమైనది, విస్తార మైనది. ఈ ప్రజానీకంయొక్క జీవన విధానము వారి అవసరాలు, కష్టాలు, ఈ నగర వాసుల కేమీ తెలియవు. అట్టి వీరు, ప్రజానీక పక్షం వహించి, వాదించ డానికి యోగ్యులుకారు భారతీయ నాయకులు పునరుక్తంచేస్తున్న, రాజకీయ వాక్యాలన్నీ, ఆంగ్ల గ్రంథాలనుంచి గ్రహించినవే. అవి ఇండియా ప్రజాజీవిత పరిస్థితులకు సంబద్ధముకానివి. దేశములోని రాజకీయ పరిస్థితిని ఈ విధంగా నిర్ధా రణ గావించి, అధికారీతంత్ర వర్గంవారు, కాంగ్రెసు కార్యక్రమాలు నిరర్థకము లైనవని, తిరస్కారభావంతో, త్రోసిపుచ్చిరి. "విశాలమైన ప్రజాహితమును, లోకోపకారాన్ని దేశములో సిద్ధింప చేయడానికి, కాంగ్రెసు పూనుకొని యున్నది; నిజమైన ప్రజా సేవే, దీని అభిప్రాయము; ప్రజాప్రాతినిధ్య పరిపాలన వ్యవస్థను విస్తృతి గావించి, ప్రజలకు దానితో సంబంధ మేర్పరచడం కాంగ్రెసు ప్రయ త్నము." అని హ్యూమ్ గావించిన వాదనను, ప్రభుత్వము అంగీకరించలేదు. అధి కారీతంత్ర ప్రభుత్వానికి ప్రముఖుడైన సర్ ఆక్ లండ్ కాల్విన్, 'పయొనియర్' పత్రికలో తమ అభిప్రాయాలను ఆవేశముతో, ఈ విధంగా వివరించినాడు;- నీ లేఖలను జాగ్రత్తగా, మరల, మరల, చదివినాను. ఇండియాలోని ఆంగ్లేయాధి కారులు అన్యాయపరులు, దయాదాక్షిణ్య రహితులు, సరియైన విషయ పరిజ్ఞానం లేనివారు, యుక్తాయుక్తములను గణింపక కార్యాచరణకు బూనుకొనేవారు, - అని ఈ విధంగా ఆంగ్లేయులను, ప్రజల ఆగ్రహానికి గురిచేస్తూ ఉన్న భాగాలు, తరచుగా, నీ లేఖనలలో ఉన్నవి."

"మనకు ప్రత్యక్షంగా గోచరమౌతున్న ఇండియా పరిస్థితులెట్టివి; విద్యా వ్యాప్తికి పూర్వమును, తర్వాతను, ఇండియా పరిస్థితు లెటువంటివి; దుర్బలులైన ప్రజల హితార్థం నిష్పక్ష పాతమైన న్యాయపరిపాలన వ్యవస్థను నిర్బంధించి ఏర్ప రచడంవల్ల కలిగిన ఫలితాలు; రహదారులతోను రైల్వేలతోను, దేశపు వివిధ భాగాలకు సంబంధమేర్పడి యుండడము; ప్రపంచంలోని వివిధ వాణిజ్యరంగాల్లో, వర్తక బజారులలో, ఇండియాకు ప్రవేశం కలిగించడంవల్ల సిద్ధించిన ఫలితాలు; మత సహనము ఇండియాలో ఏర్పడియున్న విషయము, సంవత్సరాలుగా ఇండియా లో ఏర్పడియున్న శాంతి భద్రతలు; ఇండియాలోని పత్రికా స్వాతంత్ర్యము; ప్రజల హితమే పరిపాలనము యొక్క ఆశయంకాని ప్రభువుయొక్క వైయక్తిక ప్రాభవ వైభవములు కావనే జ్ఞానము, మొదటిసారిగా ఇండియాకు కలగడం,- మొదలైన విషయములేవీ గుర్తింపబడినట్టు, నీ వ్రాతలో ఒక్క అక్షరంకూడా ప్రదర్శించడం లేదు. కాంగ్రెసు సంస్థకు నాయకులైనవారే, ఈ లేఖనలకు బాధ్యులని, కాంగ్రెసు విమర్శకుల అభిప్రాయము."

"ప్రాచీన భారతీయ సంస్కృతి ఆధారంగా గల ఐక్యము, దేశాన్ని ఒక జాతిగా సిద్ధింప జేసింది. అందులో ఇతర సంస్కృతులు కూడా చేరియుండడం, వింతకాదు. అవి అన్నీ, భారత జాతిలోని భాగాలే దేశ విస్తృతిలో తప్ప. ఇట్టి పరిస్థితి ప్రపంచ చరిత్రకు నూతనమైనది కాదు. ఇట్టి సంస్కృతి గల, ఈ ప్రజకు సార్వజనీనమైన సంకల్పము ఏర్పడి, జాతి ప్రతిష్ఠను సిద్ధింపజేసినది. రాజకీయైక్య చైతన్యం ఏర్పడింది." ఇది, భారతదేశము, గవర్నర్ జెనరలుకు ఇచ్చిన సమాధానము. కాంగ్రెసు అధ్యక్షు లీ విషయాన్ని పదేపదే ఉద్ఘాటిస్తూ వచ్చిరి. 1890 లో ఫిరోజ్‌షా మెహతా, ఈ విధంగా వాదించినాడు. "భారతజాతి సర్వస్వాన్నీ, ఆధారంగా చేసుకొని, కాంగ్రెసు సభ్యులు, ఆ జాతి వ్యక్తులుగా సమావేశమౌతున్నారు. ఒకే పరిపాలనలోని సుఖదుఃఖాల ప్రభావానికి వీరు లోనై ఉన్నారు. ప్రజలందరికీ సమానములైన హక్కుల సంపాదనకై ప్రజలందరికీ సమానమైయున్న భారాన్ని తొలగించడానికై, వీరిని ప్రేరణ మొనర్చుచున్న శక్తులు ప్రజలందరికీ సమానములైనవే. ఈ కారణం వల్లనే ఈ సంస్థకు 'భారత జాతీయ కాంగ్రెసు' అనే పేరు సిద్ధించింది. ఆ కారణంవల్లనే భారత జాతి తన భావాలను కాంగ్రెసు ద్వారా, వ్యక్తం గావిస్తున్నది." ఈ జాతీయ చైతన్యానికి, కాంగ్రెసు వ్యక్త చిహ్నము, నికాయము అని, ఈ దృక్పథాన్ని బట్టి అర్థమౌతుంది.

## IX. బ్రిటీషు ప్రభుత్వ విధానాలు

1. బ్రిటీషువారు, ఈ వాదాన్ని అంగీకరించలేదు. ఇండియా అనేది, నామమాత్రమైనదేయని, కేవలం భౌగోళిక భాగమే అని, విశ్వసిస్తూ వచ్చిరి. పరిపాలన విధానాలను నిశ్చయించడంలో తమకు తామే బాధ్యులై, భారతీయుల అభిప్రాయాలను గ్రహించడానికి భారతీయులను చేర్చుకోవడానికి, నిరాకరించిరి. సహజసిద్ధమైన విధానమొకటి యూరోపు సామ్రాజ్య ప్రభుత్వాలకు గలదని, దాని ప్రయోజనములు ద్వివిధములని, చైలీ (Chailley) ఊహించి యున్నాడు. ప్రాచ్యదేశ సమస్యల నితడు పరిశీలించిన వాడు, 'ఫ్రెంచ్ కలోనియల్ స్కూల్' కు చెందిన ప్రసిద్ధ ప్రచారకుడు, సభ్యుడు. "చౌక వేతనానికి లభించే పారిశ్రామికులను, యూరోపియన్ ఉద్యమాలకు సరఫరా చేయడం, సామ్రాజ్య ప్రభుత్వము యొక్క మొదటి ప్రయోజనము "విదేశీయుల ప్రభుత్వాన్ని, విదేశీయుల పరమాధిక్యమును, అంగీకరించేటట్లు, అధీన ప్రజలను తయారు చేయడం రెండవ ప్రయోజనం." నీలిమందు, జనుము, తేయాకు మొదలైన తోటల పెంపకము, పరిశ్రమలు, బ్రిటీషు వారి ఉద్యమాలు. వీటిలో ఉపయోగింపబడిన వారు చౌకగా లభించిన దేశీయ పరిశ్రామికులు. మరిన్నీ, ఇంగ్లాండు పరిశ్రమల అభివృద్ధికి అవసరములైన ముడిసరకులను, ఇండియాలోని చౌక పరిశ్రామికులను ఉపయోగించి, ఉత్పన్నం గావించడానికి అనుకూలంగా ఇండియా ఆర్థిక వ్యవస్థ నిర్మింపబడింది. ఈ రెండవ ప్రయోజనాన్ని సాధించడానికి, సక్రమమైన పరిపాలన వ్యవ

స్థను ఏర్పరచడము, ప్రజల భావాలను గ్రహించి వారిని, మంచి మాటలచే, తమకు సుముఖం గావించుకోవడము ఆవశ్యకములైనవి. ఈ ప్రయోజనాన్ని బ్రిటీషు వారు, ప్రశంసనీయమైన విధంగా సాధించుకొన్నారు, అని చైలీ అభిప్రాయం. విద్యావంతుల వర్గాన్ని మాత్రమే వశపరచుకోలేకపోయిరి. కాని, వారి సంఖ్య జనాభాలో, 2 శాతం కూడా కానందువల్ల బ్రిటీషు వారికి కష్టం లేదు.

సామ్రాజ్య ప్రభుత్వము యొక్క "సహజనీతి"ని, ద్వివిధంగానూ, ప్రయోగించినారు. తమ అభిప్రాయాను గుణమైన లక్షణములతో కూడిన మంచి ప్రభుత్వాన్ని ఏర్పరచడము, పాలిత ప్రజల హృదయ భావాలకు నొప్పి కలిగింపక పోవడము-అను రెండును, వీరు నిర్వహించిరి. అట్టి విధానం వల్ల తమ పరిపాలన చిరకాలం సాగుతుందని ప్రజలు తమ ఆధిక్యమును ఎల్లకాలము అంగీకరించి, విధేయులై ఉంటారని భావించిరి. దేశములో శాంతిభద్రతలను రక్షించడం, ఆంతరంగిక కల్లోలములు కలుగకుండ నిరోధించడము, వ్యక్తుల ప్రాణాలకు ఆస్తులకు రక్షణలు కలిగించడము, విదేశీయుల దండయాత్రల నుంచి దేశాన్ని కాపాడడము, ఇవి వీరనుకొన్న, మంచి ప్రభుత్వము యొక్క లక్షణాలు. శాసన సంహితలు, సివిల్ సేవా విధానము, న్యాయస్థానాలు, పోలీసు సిబ్బంది - ఇత్యాదులను ఏర్పాటు గావించడంతో, శాంతి భద్రతల రక్షణ దేశములో స్థిరపడింది.

ప్రభుత్వం సాధారణంగా సాగడానికి అవసరములైన ఈ ప్రాథమిక పరిస్థితులేర్పడడంతో, బ్రిటీషువారు తృప్తి చెందిరి. ప్రజల కష్టాలను తొలగించవలసిన ధర్మము కూడా, ప్రభుత్వం నెరవేర్చవలెననే భావం వీరికి కలుగలేదు. అట్టి అవసరము కూడా వీరికి లేదు.

ఈ కాలావధిలోని పరిస్థితులను గూర్చి పెర్సివాల్ స్పీయర్ ఈ విధంగా వ్రాసియున్నాడు. "ఇండియాను పరిపాలించడం అనే కార్యము, శ్వేతజాతులవారు వహిస్తున్న, దైవనియామకకర్తవ్యమని, బ్రిటీషు పాలకుల భావము. ప్రపంచములో ఒక నూతన వ్యవస్థను సృష్టించడము, మానవజాతి చరిత్రలో నూతన యుగానికి ప్రజలను, సిద్ధముచేయడము,- అనే ఉన్నత కర్తవ్యాలను నెరవేర్చే అవకాశాన్ని భగవంతుడు తమకు కల్గించియున్నాడని వీరు గ్రహించలేదు. భావిదృష్టిని, మహత్తరమైన ఆశను, విస్మరించి,- దేశములో క్రమవ్యవస్థ నేర్పరచడము, న్యాయ పరిపాలన గావించడము, మారుతల్లి జాగ్రతను వహించి దేశాన్ని పరిపాలించే చర్యలకు పూనుకోవడము,- వీటికి మాత్రమే పూనుకొన్నారు."

ప్రజల విశ్వాసమును గోల్పోయిన, బాధ్యతలేని సామ్రాజ్యాన్ని ఏ విధముగానైనా నిలబెట్టుకోవడమే, పరిపాలకుల ప్రథమలక్ష్యంగా ఏర్పడింది. జాతీయ భావాలు, ప్రభుత్వానికి వ్యతిరేకములై, ప్రబలమైన శక్తిని చేకూర్చుకొంటూ ఉండడం కూడా, వీరు గుర్తింపజాలక పోయిరి. రిప్పన్ విరమించుకొన్న నాటి నుంచి, కర్జన్ ప్రభువును వెనుకకు పిలిపించుకొనేవరకు,- ఇరవైయేండ్ల కాలం, ఈ విధంగానే గడిచింది.

***2. ప్రజాశ్రేయమునకు సంబంధించిన సమస్యలు :*** తమ పరిపాలనను

రక్షించుకోవడము, సామ్రాజ్య ప్రయోజనాలను సిద్ధింప చేసుకోవడము, - ఈ రెండు విషయాలే బ్రిటీషు ప్రభుత్వానికి ఆవశ్యకములైన లక్ష్యములు. ఇండియా దేశపు ఆర్థిక వ్యవస్థ, సాంఘిక సంస్కరణ, రాజకీయ పరిస్థితుల అభివృద్ధి,- ఇత్యాది ప్రాథమిక ప్రజాశ్రేయస్కర సమస్యలేవియు, వీరి దృష్టికి రాలేదు. కాంగ్రెసు ప్రార్థనలు, అత్యవసరములైన అభ్యర్థనలు, మున్నగునవి, అనిష్టకరములైన తొందరలని, త్రోసివేసిరి. వ్యవసాయ కార్యక్రమాలలో మునిగియున్న విశాల ప్రజానీకము యొక్క దురవస్థలను తొలగించడానికి వీరు తీసుకొన్న చర్య లత్యల్పములు. ఉత్తర భారతములో జమీందారీ ప్రాంతములలోనున్న రైతులకు, పట్టాదారీ విధానాన్ని ఏర్పరచి, కొంత ఆశ్వాసము కలిగించినారు. ఇది, బెంగాలు, పంజాబు, ఔధ్ ప్రాంతాలలో మాత్రమే జరిగింది. వడ్డీ వ్యాపారస్థుల ద్రోహచర్యలనుంచి రైతులకు రక్షణ కలిగించే నిమిత్తము, భూములను అన్యాక్రాంతముచేసే పద్ధతిని నిరోధిస్తూ, శాసనములు గావించిరి. వ్యవసాయ పరిశీలన సమితివారు గావించిన సలహాలు, వోయెల్కర్ (Dr. Voelker) 1889-90 లో, గావించిన నివేదిక, పాటింపబడలేదు. వ్యవసాయ శాఖలు, ఈ శాఖలవారు ప్రయోగములకై (Experiments) నియమించుకొన్న క్షేత్రాలు, తప్ప తక్కిన మార్పులేవీ జరుగలేదు. "ఇండియాలోని వ్యవసాయాన్ని అభివృద్ధిగావించే, విషయంలో, బ్రిటీషు ప్రభుత్వము శంకించుచుండడము, విముఖమై యుండడము, కారణములై, వ్యవసాయ పద్ధతులేమాత్రమూ, బాగుపడలేదు."

పరిశ్రమల విషయము కూడా ఇట్టిదే. ఇండియాలో నున్న మూలధనమే స్వల్పము. దానిని పరిశ్రమలలో వినియోగించడానికి ప్రజలు జంకుతూ ఉండిరి. వీటికి తోడుగా, ప్రభుత్వము పరిశ్రమలను ప్రోత్సహించడానికి మారుగా, నిరుత్సాహపరచిందని, జె. జె. తాతా విషయము, నిదర్శనమై ఉన్నది. దూది వస్త్రాలు తేయాకు, జనుము, బొగ్గు, కాగితము-వీటికి సంబంధించిన పరిశ్రమలు దేశములో ఏర్పడినవి కాని, ఇవి యన్నీ, బ్రిటీషు వారి అధీనమునకు, నిగ్రహమునకు లోనై ఉన్నవి. రైల్వేలు, అరణ్యాలు, మొదలైనవి, ప్రభుత్వ యాజమాన్యంలో ఉన్నవి. 1900 నాటికి, 25,000 మైళ్ల రైల్వేలు నిర్మితములైనవి. కనుక, ఇవి మాత్రం వేగంగా అభివృద్ధికి వచ్చినవి. సైన్య సంచాలన విషయములో, రైల్వేల ప్రాథమిక ప్రాధాన్యాన్ని, డల్‌హౌసీ, తన 1853 నాటి, ప్రఖ్యాత నిర్దేశ పత్రములో సూచించినాడు. ఇండియాలోని అంతర్భాగాల నుండి, ముడిప్రత్తిని, ఇతరనములైన సరకులను రేవు పట్టణములకు శీఘ్రకాలంలో చేర్చడానికి, ఇంగ్లాండు నుంచి దిగుమతి గావించిన వస్తువులను, ఇండియా బజార్లకు సరఫరా చేయడానికి, రైల్వేలు నిర్వహిస్తున్న ప్రయోజనాన్ని, ఆ నిర్దేశ పత్రములో వివరించినాడు.

రైల్వేల విషయములో వహించిన శ్రద్ధ, నీటి పారుదల విషయంలో వహించలేదు ప్రభుత్వము. ప్రధానంగా వ్యావసాయికమైన దేశంలో, విస్తారములైన ప్రదేశాలు శాశ్వత జలాధారాలు లేనివి. అటువంటి సందర్భంలో, నీటి పారుదల కార్యక్రమాలు ప్రధానం వహించవలసింది న్యాయము. కాని, రైల్వేలు ప్రభు

త్వానికి సాధించే కార్యాలు, ఇతర కారణాలవల్ల ముఖ్యమైనవి. ప్రజారోగ్యము, పురపరిశుభ్రత, గృహ నిర్మాణము, జీవన పరిస్థితుల అభివృద్ధి-ఇత్యాదుల విషయములో ప్రభుత్వము చూపిన శ్రద్ధ, ఇంకను అల్పమైనది. కాబట్టి, 1871-1911 మధ్యకాలంలో, ఇండియా దేశ జనాభా 20 కోట్ల నుండి 30 కోట్లకు పెరిగింది. కాని, మరణ సంఖ్య కూడా అధికమయింది. విద్యావ్యాప్తిని గురించి, పూర్వ ప్రకరణములో వివరింపబడినది. ఐనా, 1885 నుండి 1901 వరకు, అక్షరాస్యుల సంఖ్య చెప్పదగినంతగా ఎక్కువ కాలేదని, మరల జ్ఞాపకము చేయుచున్నాను.

*3 ప్రభుత్వాన్ని ప్రజాస్వామ్యం గావించడము* : బ్రిటీషువారు స్థాపించిన శ్రేయోప్రభుత్వను, ఇంతవరకు వర్ణింపబడిన విషయములతో మాత్రమే సంతృప్తి చెందింది. మరి, ప్రజల స్వయంప్రభుత్వము మాట ఎంతవరకు వచ్చింది ? విప్లవం తర్వాత గడిచిన ముప్ఫైయేండ్ల కాలంలోనూ, సామ్రాజ్యాధిపత్యంలో జరిగిన ఉదారపాలన, నాలుగేండ్ల రిప్పన్ హయాముకు సంబంధించింది. అదికూడ, సామ్రాజ్య నాటకములో ఒక వినోద ప్రదర్శనంగా, గడచిపోయింది. స్థానిక పరిపాలనకు, ప్రజాప్రాతినిధ్య సూత్రాన్ని వర్తింప చేయడానికి, రిప్పన్ పూనుకొని, ఆ విధానాన్ని ప్రారంభించినాడు. కాని, అధికారితంత్ర వర్గంవారు, దానిని జరుగనీయలేదు. సివిల్ సర్వీస్‌లోని ఉన్నతోద్యోగాలకు భారతీయులను నియమించవలసిందని, శాసన పరిషత్తులకు బహిరంగ ఎన్నికల ద్వారా సభ్యులను గ్రహించవలసిందని, భారతీయ నాయకులు గావించిన ప్రార్థనలు, తిరస్కరింపబడినవి. స్థానిక పరిస్థితులనుబట్టి ఆవశ్యకమేర్పడి, ఇండియా ప్రభుత్వం కొన్ని మార్పులను గావించడానికి నిశ్చయించిన సందర్భములలో,- ఇంగ్లాండులోని అధికారులు ఈ ప్రతిపాదనలను త్రోసివేసిరి. వాస్తవమైన సంస్కరణలను గావించక, వేరేవిధంగా ప్రజలను 'బుజ్జగించడానికి' ప్రయత్నం గావించినారు.

శాసన పరిషత్తులలో భారతీయులు పాల్గొనే ప్రయత్నము శోచనీయంగా పరిణమించింది. 1861 లో, శాసన పరిషత్తుల పునర్నిర్మాణం జరిగింది కాని శాసన పరిషత్తులనే వ్యవహారానికి అవి అర్హములైనవి కావు. ప్రభుత్వముయొక్క సంకల్పాలను దాఖలుచేసే సంస్థలుగా మాత్రమే సిద్ధించినవి. కేంద్ర ప్రభుత్వముయొక్క కార్యనిర్వాహక సమితిని విస్తృతి గావించి, దానికి శాసనసభ యని పేరుపెట్టియుండడం ఇందుకు నిదర్శనం. గవర్నర్ జెనరల్‌యొక్క సమితి సభ్యులుకాక, పండ్రెండు మందికి మించకుండా ఇతర సభ్యులను గవర్నర్ జెనరల్ నియమించేవాడు. ఇందులోకూడా, సగంమంది మాత్రమే, అనధికార వర్గానికి చెందినవారు. కనుక, ప్రభుత్వ సభ్యుల సంఖ్య అత్యధికంగా సిద్ధించింది. ఇక, ఈ శాసన సభ నిర్వహించవలసిన కృత్యములుకూడా పరిమితములైనవే. ప్రభుత్వ రాజస్వము, ఋణములు, సైన్యము,- మొదలైన ప్రధాన విషయాలను, గవర్నర్ జెనరల్ అనుమతితోతప్ప, చర్చించే అధికారం శాసన సభకు లేదు. శాసన సభలు గావించిన నిర్ణయాలను నిషేధించి, త్రోసివేసే అధికారంకూడా గవర్నర్ జెనరల్‌కు ఉన్నది. క్రొత్త అధ్యాదేశాలను (Ordinances) చేసే అధికారం కూడా

అతనికి కలదు.

ఇండియా ప్రభుత్వంచేసిన ఏ శాసనాన్నైనా బ్రిటీషు సార్వభౌముడు నిషేధించవచ్చు. కాని, పార్లమెంటు ఇండియాలో చేసే శాసనాన్ని నిషేధించే అధికారము అతనికి కూడా లేదు. భారతదేశ కేంద్రశాసనసభలో చర్చింపబడే శాసన ప్రతిపాదనలను, గవర్నర్ జెనరల్ సమితివారు తయారుచేసి, ఇంగ్లండుకు పంపగా ఇంగ్లండులోని స్వతంత్రన్యాయసమితి దానిని పరిశీలించి, శాసనస్వరూపాన్ని ఏర్పరచి, ఇండియా శాసనసభకు పంపడం జరుగుతూ ఉండినది. దీనిని బట్టి, ఇండియా శాసనసభయొక్క శాసన నిర్మాణాధికారం ఎంత పరిమితమై ఉండినదో, ఎంత సంకుచితమై ఉండినదో విశదమౌతుంది. ఇంగ్లాండునుంచి ఇండియాకు దిగుమతియగుతున్న వస్తువులపై శుల్కాలను రద్దుచేయడం. - ఇంగ్లాండు ప్రభుత్వం గావించిన నిర్ణయము· ఇండియా ప్రభుత్వంయొక్క నిస్సహాయస్థితి ఎట్టిదై యుండినదో దీనిని బట్టి గ్రహించవచ్చు. శాసన పరిషత్తులను మ్యాక్‌డొనెల్ ప్రభువు ఈ విధంగా వర్ణించియున్నాడు (1888).

"1861 నాటి శాసనంవల్ల ఏర్పడిన శాసనపరిషత్తుల స్వభావం ఇది. అవి న్యాయములను (laws) నిర్మాణంగావించే ఉద్దేశముతో ఏర్పాటుగావించిన సమితులు. కార్యనిర్వాహక ప్రభుత్వము, ఈ సమితియొక్క సలహాలను, సహకారాన్ని పొంది శాసనాలను నిర్మిస్తుంది".

ఈ పరిషత్తులు గావించిన న్యాయాలను గురించి, అతడీవిధంగా వ్రాసియున్నాడు. "శాసనపరిషత్తులలో గావించిన చట్టములు, వాస్తవంగా ప్రభుత్వము గావించిన ఆదేశాలే అని వర్ణించడం తప్పుకాదు. తమముందు ప్రతిపాదింపబడియున్న అంశములను తప్ప, వాటి పూర్వాపరాలనుగాని, వాటి నిషేధ ప్రతిషేధాలనుగాని చర్చించే అధికారం, ఈ శాసనపరిషత్తులకు లేదు. ప్రజల కష్టాలను విచారించడానికిగాని, వాటి విషయమై వివరములను అడగడానికిగాని, కార్యనిర్వాహక వర్గమువారి ప్రవర్తనను గూర్చి ప్రశ్నించడానికిగాని, సభలకు అధికారంలేదు. పరిపాలనలో జరిగిన చర్యలను ఆక్షేపించడానికి కూడా అధికారం లేదు. వాటిని గూర్చి సమర్థించడానికి వీలులేదు. చర్చనీయాంశంగా పరిషత్తు ఎదుట పెట్టిన విషయంతప్ప మరే విషయాన్ని ప్రశ్నించడానికి అధికారంలేదు".

అగ్రవర్గాలకు చెందిన సర్దారులు, కులీనులు, భూస్వాములు, సంపన్న వర్తకులు, న్యాయవాదులు, ప్రభుత్వానికి విశ్వాసపాత్రులైన పత్రికాసంపాదకులు, - మొదలైనవారిని ఈ శాసన పరిషత్సభ్యులుగా నియమించిరి. "తమ మాతృదేశ ప్రభుత్వ పరిపాలనలో, భారతీయులకు భాగమేర్పడే హక్కు గుర్తింపబడినదని" ఇట్టి సభ్యులను పురస్కరించుకొని వాదించడం, దేశాన్ని హేళన చేయడంతప్ప వేరుకాదు.

ముప్ఫైఏండ్లగా, పరిషత్తుల సంస్కరణకై భారతీయులు ఒత్తిడి చేస్తున్నారు. పరిషత్తుల సంఖ్యను, దాని కర్తవ్యాలను విస్తృతం కావించవలసిందని, ఎన్నికలలో పాల్గొనే యోగ్యత, అర్హతగల ప్రజలే, పరిషత్సభ్యులను ఎన్నుకొనే

పద్ధతి అవలంబింప బడవలెనని, కాంగ్రెసు, ప్రతిసంవత్సరము, తీర్మానములను పంపుతూనే ఉంది. పురపాలక సంఘ సభ్యులు, జిల్లాపరిషత్తుల సభ్యులు, వాణిజ్య మండలము, విశ్వవిద్యాలయాలు, – ఈ సంస్థలను నియోజక వర్గంగా ఏర్పరచి పరిషత్తులకు ఎన్నికలు జరుపవలసిందని ఒక సలహా ఇచ్చింది. లేదా, విద్యా యోగ్యతను, లేక, సంపత్తి యోగ్యతను ప్రభుత్వమే నిర్ణయించి, దాని ప్రకారం నియోజక వర్గాన్ని ఏర్పరచి, ఎన్నికలను జరుపవచ్చుననేది మరియొక సలహా. ఇట్లు పరిషత్తులకు ఎన్నికైన సభ్యులు, నియోజకవర్గంగా ఏర్పడి, కేంద్ర శాసనసభకు సభ్యులను ఎన్నుకొనవచ్చును. ఈ విధమైన ప్రణాళికను కాంగ్రెసు సూచించింది. శాసనపరిషత్తులను పునర్నిర్మాణం గావించే ఆవశ్యకాన్ని గురించి, కలకత్తా ఇండియన్ అసోసియేషన్‌వంటి రాజకీయసంస్థలు, బహిరంగ సభలు జరిపి, తమ అభిప్రాయాన్ని ప్రభుత్వానికి తెలియజేసినవి.

ప్రజలను వంచించడానికై ఏర్పడినవి, ఈ పరిషత్తులని, ఇవి ప్రవాహముల వంటివని, విమర్శించినవి పత్రికలు. ఈ పరిషత్తులను పూర్తిగామార్చి, నూతన పరిషత్తులను ఏర్పరచవలసిందని, ప్రజాభిప్రాయాన్ని విశదపరిచినవి. వాణిజ్య మండలాలు, ఇతర ప్రజాసంస్థలు కూడా, ప్రజల అభ్యర్థనను పునరుద్ఘాటించినవి.

పరిషత్తుల విషయములో ప్రజాభిప్రాయము తీవ్రమై ఉన్న విషయాన్ని డఫ్ఫెరిన్, గుర్తించెను. భారతీయులను ఎన్నికల ద్వారా పరిషత్సభ్యులుగా గ్రహించే విధానాన్ని బలపరుస్తూ, ఇండియా ప్రభుత్వ కార్యదర్శికి తన ప్రతిపాదనను పంపిస్తూ, ఈ విధంగా తన అభిప్రాయాన్ని తెలియబరచెను."సామ్రాజ్యాధికారములోని ముఖ్యాంశాలను కేంద్ర ప్రభుత్వం కాని, ప్రాంతీయ ప్రభుత్వాలు కాని వదలుకోవడం సాధ్యం కాదు. నాగరకతా విషయంలోను, విద్యా విషయంలోను వెనుకబడియున్న వివిధ జాతుల వారి రక్షణార్థము మన సామ్రాజ్యాధికారం శాశ్వతంగా, నిలుకడగా ఉండడానికి ఈ అధికారాలు అత్యావశ్యకములు కనుక, వాటిని శాసన సభలకు అప్పగించడం, కుదరదు. కాని, సంవిధాన పరివర్తన విషయమై నూతన చర్యకు బూనుకోవలసిన సమయం వచ్చింది. ప్రభుత్వ నియామకం ద్వారాను, ఎన్నికల ద్వారాను, విద్యావంతులైన సభ్యులను గ్రహించి వారిని పరిపాలన విషయంలో మనతో కూడా, సహకరించేటట్లు చేసే విధానం అవలంబించవలసిన అవసర మేర్పడింది. దేశములోని వివిధ వర్గాల వారి శ్రేయమునకు ఈ సభ్యులు బాధ్యత వహించి, ప్రజల అభిప్రాయాలను వారి కోరికలను ప్రభుత్వానికి అందజేసే వాహక మార్గములుగా ఏర్పడగలరు."

పరిషత్తులను విస్తరింప జేయడము, పరిషత్తుల కర్తవ్యాలను ఎక్కువ కావించడము, ఎన్నికల విధానాన్ని అంగీకరించడము – మొదలైన మార్పులు, ప్రాతినిధ్య ప్రభుత్వాన్ని ఏర్పరచడానికై బూనుకొన్నవి కావు. అధికారాన్ని ప్రజల కప్పగించడానికి కూడా ఏర్పడినవి కావని, డఫ్ఫెరిన్, వ్రాతనుబట్టి, వ్యక్తమౌతుంది. ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోడానికి, సభ్యులు సాధనంగా

ఏర్పడగలరు, అనే ప్రభుత్వ ప్రయోజనమే ఈ ప్రయత్నానికాధారము.

నూతన సంవిధాన వివరాలను గూర్చి, ఇండియా ప్రభుత్వ కార్యదర్శి, గవర్నర్ జెనరలూ చర్చలు జరుపుతున్న సమయంలో, ఇండియా వ్యవహారము లందాసక్తి వహించిన 'బ్రాడ్లా' (Bradlaugh), కాంగ్రెసు ప్రార్థనపై, పార్లమెంటు ప్రజాసభలో ఒక ప్రతిపాదనను ప్రవేశపెట్టెను (1890). కాంగ్రెసు ప్రణాళిక ననుసరించి, ఈ ప్రతిపాదన రచితమయింది. దీనివల్ల పరిస్థితులు తలక్రిందైనవి. ప్రభుత్వము స్వయంగా ఒక ప్రతిపాదనను కులీన సదస్సులో (House of lords) ప్రవేశపెట్టడానికి నిశ్చయించుకొన్నది. పలుమార్లు కాలయాపనం గావించిన పిమ్మట, కట్టకడపటికి, కర్జన్, ఈ బిల్లును పార్లమెంటు ప్రజాసభలో (1892) ప్రవేశపెట్టెను. బిల్లు యొక్క లక్ష్యములిట్లు వివరింప బడినవి.

1 (a) అన్ని శాసన పరిషత్తులలోను విత్తసంబంధమైన విమర్శనకు అధికారము, (b) చర్చనీయాంశముపై ప్రశ్నలను అడిగే అధికారము, 2. పరిషత్సభ్యుల సంఖ్యను విస్తరింప చేయడం-అనే విశేషాధికారాలను సిద్ధింప చేయడం-ఈ బిల్లు యొక్క లక్ష్యములు.

పరిషత్తుల కర్తవ్యాలను విస్తరింపజేయడం, ప్రభుత్వ కార్యక్రమంలో పాల్గొనే అవకాశాన్ని కల్పించడం-అనే విషయాలను, కర్జన్, తన ఉపన్యాసములో ప్రస్తావించినాడు. కాని, అతడు భావించి యుండినది వేరు. ప్రత్యేకములైన కొన్ని అగ్రవర్గాల వారి భావాలను, అభిప్రాయాలను సేకరించుకోడానికి, అవకాశాలను వృద్ధి పరచుకోవడం మాత్రమే ఈ సంస్కరణ లక్ష్యం. పార్లమెంటులో కర్జన్ గావించిన ఉపన్యాసాన్ని బట్టి, ప్రభుత్వ పరిపాలనలో భారతీయులకు ప్రవేశం కలిగించడము, ప్రజా ప్రాతినిధ్య ప్రభుత్వముల నేర్పరచడానికి, ఉద్దేశ్యం కాదని, విశదమౌతున్నది. నోరులేని, నిరక్షరాస్యులైన కోట్ల ప్రజలతో ఏర్పడియున్న ఇండియా దేశానికి, ఏ విధమైన ప్రతినిధి ప్రభుత్వాన్ని నిర్మించడమూ సాధ్యంకాదని, ఇతడు నిష్కర్షగా చెప్పినాడు.

పార్లమెంటు సభ్యులనేకులు కాంగ్రెసు దృక్పథాన్ని వివరించిరి, కాని, ప్రభుత్వాన్ని అంగీకరింపజేయలేక పోయిరి. చర్చలో మాత్రము, సభ్యులందరు ఆసక్తివహించిరి. కడపటికి, బిల్లును ఆమోదించి, అధినియమగ్రంథంలో చేర్చిరి.

ఎన్నికల విషయములో, శాసనము, మౌనం వహించింది. ప్రభుత్వము అంగీకరింపకపోవడం ఇందుకు కారణం. ఇండియా ప్రభుత్వ కార్యదర్శి అనుమతితో, గవర్నర్ జెనరల్‌కు పరిషత్సభ్యుల సంఖ్యను అధికం (12 నుండి 16 వరకు) గావించడానికి, అనుమతి లభించింది. 16 గురు సభ్యులలో పదిమంది మాత్రమే, అనధికారవర్గంవారు నియామకమగు చుండడంవల్ల, శాసనసభలోని ప్రభుత్వవర్గము, అధికసంఖ్యాకమై ఉంటుంది. నాలుగు ప్రాంతీయ పరిషత్తులలోని అనధికార సభ్యుల సిఫార్సుపై, నలుగురు సభ్యులు, నియామకమౌతారు. కలకత్తా వాణిజ్యమండలి యొక్క సిఫారసుపై ఒక సభ్యుడు, తక్కిన ఐదుగురు సభ్యులూ, గవర్నర్ జెనరల్ నియామకంపై, సభలో చేరడం జరుగుతుంది. బహ్మాండ

మైన ఈ విధానము అత్యుత్తమమైనదని, భావించిన మాంటేగు, ఛేమ్స్ ఫర్డులు, దీనిని 'విప్లవాత్మకమైన సంవిధానము అని పేర్కొన్నారు.

ఆదాయవ్యయ పత్రాన్ని (బడ్జెట్టును) గూర్చి చర్చించడము, దానిపై ప్రశ్నలు వేయడము,- సభ్యులకు కొత్తగా ఏర్పడిన అధికారము. కాని బడ్జెట్టుపై ఓటుచేసే అధికారం మాత్రంలేదు, 1892 ఫిబ్రవరి 2 వ తేదీనాడు, కేంద్రశాసన సభలో ఉపన్యసిస్తూ, ల్యాన్స్‌డౌన్ ప్రభువు, ఈ శాసనసభల స్వభావాన్ని "అభ్యుదయ విధాన పరివర్తనము" అని తన అభిప్రాయాన్ని ప్రకటించినాడు. ఎన్నికల పద్ధతిని అంగీకరించకపోవడంలో ప్రభుత్వాభిప్రాయాన్ని సమర్ధిస్తూ, ఈ విధంగా వివరించెను. "దేశములోని ఏ భాగాన్ని పరిశీలించినా కూడా ప్రజల భావనలకు, అలవాట్లకు ఎన్నికల పద్ధతి పూర్తిగా విదేశీయమైనదని తెలియకపోదు. ఒకవేళ అట్టి విధానాన్ని అవలంబించినట్లయితే, నిజంగా ప్రాతినిధ్యం వహించడానికి అర్హులైన వ్యక్తులు ముందుకురారు; ఎన్నికలకు నిలబడరు. కనుక, నిజంగా ప్రజలకు ప్రతినిధులైన సభ్యుల సేవాసహకారాలను పరిషత్తులకు లభించేటట్లు చేయడం ప్రభుత్వముయొక్క ఉద్దేశము. ఇట్లు నియామకం గావింపబడిన సభ్యులు వివిధ ప్రదేశాలకు, ప్రజల సంఖ్యకు, ప్రతినిధులై ఉండరు. కాని, వివిధవర్గాలకు, వివిధ ప్రజాస్వరూపాలకు ప్రాతినిధ్యం వహిస్తారు".

మతతత్త్వంపై ప్రజాప్రాతినిధ్యం ఏర్పడే విధానానికి, ఈ విధంగా, 1892 నాటి శాసనము, అంకురార్పణం గావించింది. అనంతరకాలంలో, సంవిధానాన్ని మరల సంస్కరించే ప్రయత్నానికి ప్రభుత్వము, పూనుకొనేనాటికి, ఈ మతతత్త్వ ప్రాతినిధ్యబీజం, అంకురించి, పెరిగి, మహావృక్షంగా ఏర్పడింది. భారతీయుల లక్ష్యము, ఈ శాసనంవల్ల సిద్ధించలేదు. ఎన్నికల నియమము నిరాకరింపబడడం ప్రజాభిప్రాయానికి నిరుత్సాహకరమయింది. బడ్జెట్ చర్చ, దానికి సంబంధించిన ప్రశ్నలు పరిమిత మొనర్పబడడం కూడా తృప్తికరంగాలేదు. కనుక, శాసనాన్ని సంస్కరించవలసిందని, ప్రజానాయకులు మరల ప్రార్థించిరి. కాని, ప్రయోజనం కలుగలేదు.

## X. ఆర్థికంగా, నైతికంగా, దేశములో జరిగిన అభివృద్ధిపై చర్చ

(a) *బ్రిటీషువారి సమర్థన:-* ప్రజల నైతికాభివృద్ధి అనే ఫలితాలనుబట్టి, ఏ ప్రభుత్వమైనా శ్రేయోదాయకమైనదా, మంచిదా, అనే నిర్ణయాన్ని గావించవలసి ఉంటుంది. ఈ ప్రశ్నపై, భారత జాతీయ నాయకులకు, బ్రిటీషు ప్రభుత్వ సమర్థకులకూ, దీర్ఘమైన చర్చలు పూర్వం జరిగినవి.

సామ్రాజ్యవాద విరోధులైన హాబ్సన్, వంటివారు, భారత దేశాభిమానులైన డిగ్బీవంటి లోక ప్రచారకులు, మార్క్సు సిద్ధాంతాను యాయులైన స్ట్రాచీ, పామీదత్తు వంటివారు,- బ్రిటీషువారైనప్పటికీ, తమ దేశీయులకు విరుద్ధంగా, తమ నిర్ణయాలను వ్యక్తం గావించి ఉన్నారు.

దారిద్ర్యము సర్వసాధారణమై దేశములో నెలకొనియున్నా, మొత్తం

మీద బ్రిటీషువారి నిర్దేశంవల్ల, భారతదేశం ఆర్థికంగా పురోభివృద్ధి పొందిందని, బ్రిటీషు పరిపాలన సమర్థకులు అభిప్రాయపడినారు. కాని, పూర్వపు వ్యవస్థతో, బ్రిటీషువారి పాలన కాలాన్ని పోల్చిచూస్తే, ప్రజలదారిద్ర్యము, దురవస్థ, అధికమై ఉన్నదని, రెండవ పక్షంవారు దృఢంగా విశ్వసిస్తున్నారు.

ప్రస్తుత కాలములోని ఆర్థిక పరిస్థితులు పూర్వ ప్రకరణములో వర్ణితములైనవి. చర్చలను పునరుక్తం చేయకపోయినా, ఆర్థికపరిస్థితులను గూర్చిన వివిధాభిప్రాయాలను పరిశీలించి, రాజకీయోద్యమంపై వాటి ప్రభావమెట్టిది ? అని నిశ్చయించడం మాత్రం అవసరము.

ఉద్యోగ విశ్రాంతిని పొందిన జార్జ్ చెస్నీ, జాన్, రిచ్చర్డ్ స్ట్రాచీ, రిచ్చర్డ్ టెంపల్, జె డి. రిస్, లోవాట్ ఫ్రేజర్, పెర్సివాల్ గ్రిఫ్ఫిత్స్, తదితరులు రచించిన గ్రంథములు బ్రిటీషు పరిపాలన సమర్థకుల అభిప్రాయములకు ఆదర్శ స్వరూపములు.

స్ట్రాచీ సోదరులు 1882 లో, ఈ విధంగా వ్రాసియున్నారు. "బ్రిటీషు ప్రభుత్వం గావించిన నిర్మాణ కార్యక్రమాలవల్ల సిద్ధించిన ప్రయోజనము, ప్రభుత్వము, వ్యయపరచిన అధిక ద్రవ్యసహాయంవల్ల ప్రజలకు సిద్ధించిన సౌఖ్య సంపదలు, లెక్కింపరానివి. విస్తృతమైన దేశాభివృద్ధి జరిగింది. విద్యావిషయములోను, ఆర్థికాభివృద్ధిలోను, అభ్యుదయ విషయములన్నిటిలోను, భారతదేశములో జరిగినంతటి శీఘ్రమైన అభివృద్ధి, మరియే ఇతర దేశములోనూ జరుగలేదు. ఇవియన్నియు వాస్తవ విషయములు కావడంవల్ల, చర్చకు అవకాశమేలేదు."

1868 లో ప్రథమంగా వెలువడిన ('ఇండియన్‌పాలిటీ') 'ఇండియా రాజకీయ వ్యవస్థ' అనే గ్రంథంలో చెస్నీ, ఈ విధంగా తన అభిప్రాయాలను వెళ్ళగ్రక్కినాడు. "పూర్వపు ఏ రాజ్యంతో పోల్చిచూచినా, నేటి ఇండియా, ఆర్థిక విషయములో అసాధారణమైన సమృద్ధితో ఉన్నది. ఎగుమతి దిగుమతి, వాణిజ్యము, ముడిసరకుల అధికోత్పాదన, తయారైన ఇంగ్లీషు వస్తువుల వినియోగాభివృద్ధి, అమూల్యలోహముల నిలువ, అన్నిటికంటెను ముఖ్యమైన రైల్వే ప్రయాణ సౌకర్యాభివృద్ధి,- మొదలుగాగల కార్యరూప పరిణామములను బట్టి పరిశీలిస్తే, నేటి భారతదేశం, ఇంగ్లీషు ప్రమాణప్రకారం, బీదదేశంగా, కనబడినప్పటికీ, పూర్వ మెప్పుడూలేని సంపదతో వర్ధిల్లుతూఉంది."

గవర్నర్ జెనరల్ కౌన్సిలులో అధికసభ్యుడై యుండిన, రీస్, భారతీయ విమర్శకులను, తన హృదయ సంతుష్టియగునట్లుగా ఖండించి, తన నిశ్చయాలను ఈ క్రింది విధంగా వివరిస్తాడు.

"నావలెనే, ఇండియాను ముప్పై ఏండ్లకు పైగా చూచిఉన్నవారికి ఈ శతాబ్దపు భారతదేశములోని ఉత్తమ జీవనప్రమాణము, ప్రత్యక్షంగా కనబడుతుంది. పూర్వముకంటెను, ఉత్తమమైన జీవన సౌకర్యము లేర్పడినవి. మంచి వస్త్రాలు, మంచి ఇండ్లు, మట్టి కుండలకు బదులుగా ఇత్తడిపాత్రలు,- ఇత్యాదులన్నీ ప్రజలు అనుభవిస్తున్నారు. ఆదాయం పెరిగిందని, పరిస్థితులు బాగుపడిన

వని, ఇవి చక్కగా సూచిస్తున్నవి."

ఇతర అధికారుల అభిప్రాయాలలో, లారెన్సు ప్రభువుయొక్క అభిప్రాయాలు గమనింపదగినవి. "ఏ దేశీయ ప్రభువుల పరిపాలనలోకానీ చూడనట్టి, అర్థికాభ్యుదయాన్ని, సౌఖ్యాన్ని, భారతప్రజలు నేడు అనుభవిస్తున్నారు, అనే విషయం నిర్వివాదమైనది." అధోవర్గాల ప్రజల పరిస్థితులను విచారణ గావించడానికై, డప్ఫెరిన్, నియమించిన (1887) విచారణ సంఘ నివేదికను, ప్రభుత్వము, అతిరహస్యంగా దాచిపెట్టింది. విచారణములో తేలిన వాస్తవ విషయాలు ప్రభుత్వానికి అవమానకరములై యుండడం, ఇందుకు కారణము. కాని, ఈ నివేదికపై ప్రభుత్వము ప్రకటించిన తీర్మానము, సత్యాన్ని మరుగుపరచి, ప్రజల కళ్ళలో దుమ్ముచల్లింది. "సాధారణ సంవత్సరాలలో [అనగా, క్షామములు లేనప్పుడు] కఠిన జీవనానికి తగినంత ఎక్కువగా ఆహారం లభిస్తూఉన్నది." అని తీర్మానము.

మూడవదశాబ్దిక 'నైతిక ఆర్థికాభ్యుదయ నివేదిక' ఈ విధంగా వివరిస్తుంది. "రైతుల ఆర్థిక పరిస్థితిలో క్రమాభివృద్ధి ఉన్నదా, అనే విషయాన్ని ప్రమాణంగా చేసుకొని పరిశీలిస్తే, తగినంత సామాన్యార్థిక స్థితి రైతులకు కలదని చెప్పవచ్చును."

ఇండియా పరిపాలనను స్వయంగా, సాగిస్తున్న పరిపాలకులు, ప్రభుత్వ సభ్యులు, ఈ విషయమై గావించిన ప్రకటనలలో, ఇండియా ప్రభుత్వ కార్యదర్శియైన, సర్. హెన్రీఫౌలర్, ప్రకటించిన అభిప్రాయం గమనింపదగినది. పార్లమెంటు ప్రజాసభలో (1894 ఆగష్టు 15) అతడీవిధంగా వివరించినాడు. "ప్రస్తుతం ఇండియాలోఉన్న ప్రభుత్వ పరిపాలన యంత్రాన్ని, సమగ్రంగా, ఉపయోగించి, భారతదేశ ప్రజల ఆర్థిక పరిస్థితిని, ఇండియా ప్రభుత్వము అభివృద్ధి గావించినదా లేదా, అనే ప్రశ్న ఇప్పుడు చర్చనీయాంశము. బ్రిటీషు సార్వభౌమత్వానికధీనమైన ప్రాంతంగా ఉండినందువల్ల, భారతదేశం బాగుపడిందా, లేక, చెడిపోయిందా అనే ప్రశ్న ఇది. ప్రభుత్వ పరిపాలన ఎటువంటిదనే విషయాన్ని నిర్ణయించడానికి ఈ ప్రశ్న ప్రమాణం కాగలదు. ఇండియాలో విస్తారమైన దారిద్ర్యం ఉన్నదనడం వాస్తవమే. కాని ఈ దారిద్ర్యము బ్రిటీషు పరిపాలన కాలములో క్షీణించిందేకాని, ఎక్కువకాలేదు,- అనే విషయం ముఖ్యంగా గమనింపదగింది. ఇండియా దారిద్ర్యమును బ్రిటీషు పరిపాలనకు అంటగట్టడం, సాధ్యంకాదు. దేశములోని వాస్తవ పరిస్థితులు తద్వ్యతిరేకతను ప్రత్యక్షంగా నిరూపిస్తాయి."

(b) ***ఇండియా ఇచ్చిన ప్రతి సమాధానము*** : తాము సాధించిన ఈ మహాకార్యములతో సంతుష్టి చెందియున్న బ్రిటీషు పరిపాలకులు, తమ ప్రభుత్వంలోని లోపములను ప్రదర్శించువారిని సహింపలేకున్నారు. వీరి పరిపాలనవల్ల కలిగిన ఆర్థిక వినాశాన్ని సూచించినా, సామ్రాజ్యవిధానముయొక్క దుష్ట పరిణామాలను ప్రదర్శించినా, వీరికి కష్టంగా ఉంది.

దేశములోని విద్యావంతులు కూడా, ఈ చెడుగులను త్వరగా గ్రహింప

లేదు. వాటి నిజస్వరూపాన్ని గుర్తించడానికి, కొంతకాలం పట్టింది. దేశములో పూర్వము జరిగిన ఆంతరంగిక యుద్ధాలు, 18 వ శతాబ్దములోని అరాజక పరిస్థితులు వీరి మనస్సులలో మెదులుతూ, భయభ్రాంతులను గావిస్తూ ఉండినవి. ప్రస్తుత పరిపాలనవల్ల ఇతర కష్టము లెన్నియున్నా, శాంతిభద్రతలు దేశములో ఏర్పడియుండడము, క్రమపరిపాలన జరిగిపోవుచుండడము, వీరికి ఉపశమనం కలిగించినవి. కాని, నిషేధరూపమైన పోలీసు ప్రభుత్వధర్మము ఎంత సమర్థంగా, నిపుణంగా జరిగినా, అది ఎంత అవసరమైనదైనా, దానితో మాత్రమే సంతుష్టిచెంది ప్రజలు చిరకాలం ఉండలేరు. మనస్సు, హృదయము లేని చరాస్తిగా ప్రజలను ప్రభుత్వం భావిస్తూఉండడం వీరి ఆత్మగౌరవానికి కష్టమనిపించింది. నిర్ణయములు గావించడంలో, తమ ఇష్టానిష్టములు, కోరికలు, భావములు, అప్రస్తుతములని ప్రభుత్వము త్రోసివేయుచుండడం ప్రజలు సహింపలేకపోయిరి. తమ సంకల్పాన్ని పూర్తిగా నిర్లక్ష్యపరచడమేకాక, తమ ఆర్థిక ప్రయోజనాలను పరుల లాభార్థం బలివేసి, తమ ఉత్కాంఠలను కుంఠిత మొనర్చినప్పుడు అసంతృప్తి, అసంతుష్టి ఎక్కువ కాకపోవు. అట్టి సందర్భమేర్పడినప్పుడు, సమర్థపరిపాలనవల్ల సిద్ధించిన సౌకర్యములన్నీ, విస్మృతములౌతాయి.

మధ్యయుగాల స్వచ్ఛంద ప్రభుత్వాల కంటెను, బ్రిటీషు పరిపాలన ఉత్తమమైనదని, 18 వ శతాబ్దంలో ఉండిన అవ్యవస్థ కంటెను, అరాజకత్వము కంటెను మేలైనదని ప్రజలు తలచియున్నప్పటికీ, 1857 విప్లవానంతరం, ఆ భావం మారిపోయింది. ప్రజల ఆవశ్యకాలను బ్రిటీషు ప్రభుత్వము తీర్చలేక పోయింది. కనుక, బ్రిటీషు పరిపాలనవల్ల పొందిన ప్రయోజనాలను గుర్తిస్తూ, బ్రిటీషు ప్రభుత్వముతో సంబంధము, అభిలషణీయమైనదని ఉద్ఘాటిస్తూ, బ్రిటీషు సార్వభౌమ పదవికి తమ భక్తి విశ్వాసాలను అర్పిస్తూ,- తమ దురవస్థలను ప్రభుత్వానికి తెలుపుకోవడం అవసరమని దేశనాయకులు భావించిరి. ప్రజల కష్టాలనుగూర్చి తెలియడంతోనే, ఉదారహృదయులైన తమ ప్రభువులు వాటిని తప్పక నివారిస్తారనే విశ్వాసం, వీరికి ఉండింది. బ్రిటీషు పరిపాలన, వస్తుతః లాభకరమైనదనీ, కొన్ని రాజకీయార్థిక లోపాలు మాత్రమే, ప్రభుత్వవ్యవస్థలోఉన్న లోపములనీ, వీరు నిజంగా నమ్మియుండిరి. ప్రభుత్వశాసన సభలలో ప్రజాభిప్రాయానికి స్థానంలేక పోవడము, ఉన్నతోద్యోగాలలో భారతీయులకు అవకాశం కలిగించక పోవడము, అనేవి వీరు భావించిన రాజకీయలోపాలు. వ్యక్తి ఆదాయము జాతీయాదాయము స్వల్పమై యుండడము, క్షామాలు, రైతుల ఋణగ్రస్తత, ప్లేగు, అంటురోగాలు,- వీటివల్ల జీవిత ప్రమాణం సన్నగిల్లి, మరణసంఖ్య పెరుగుతూ రావడం,- ఇత్యాది దురవస్థలవల్ల ద్యోతకమవుతున్న ప్రజాదారిద్ర్య, దేశదారిద్ర్యము, ఆర్థిక సంబంధమైన లోపము. మరిన్నీ ముఖ్యంగా, ఇండియానుండి ఇంగ్లాండుకు ప్రవాహరూపములో పోతున్న ద్రవ్యపరివహనము (Drain), ఈ దేశ దారిద్ర్యానికి ప్రధాన కారణమని, ప్రజల నిశ్చితాభిప్రాయము.

(c) *దాదాభాయి నౌరోజీ గావించిన విమర్శ* : ప్రభుత్వం అవలంబించి

యున్న ఆర్థిక విధానాన్ని ఖండితంగా, నిష్కర్షగా, విమర్శించినవాడు దాదా భాయి నౌరోజీ. పారసీక మత పురోహిత కుటుంబములో జన్మించి (1825), బొంబాయి ఎలిఫిన్‌స్టన్ విద్యాసంస్థలో చదివి, 1845 లో విద్యాభ్యాసం పూర్తిగావించుకొని పదిసంవత్సరాలకాలం ఉపాధ్యాయవృత్తిలో పనిచేసినాడు. 1855 లో వ్యాపారములో ప్రవేశించి, లండను నగరములోని, 'శ్యామా అండ్ కంపెనీ' వ్యవహారాలను నిర్వహించే నిమిత్తము, ఇతడు ఇంగ్లాండు వెళ్లినాడు. 1874 లో, ఇతడు బరోడా మహారాజుకు దివానుగా పనిచేయుచుండినాడు. కాని బ్రిటీషు స్థానికరాయబారితో కలిగిన భేధాభిప్రాయకారణంవల్ల, ఆ ఉద్యోగాన్ని వదలివేసెను. అంతట ఇంగ్లాండు వెళ్ళి, తన జీవితమంతా ప్రజాసేవలో గడిపినాడు. 'లండన్ ఈస్ట్ ఇండియా సంఘము'లో "ఇండియాపట్ల, ఇంగ్లాండు కర్తవ్యాలు" అనే శీర్షికగల ఉపన్యాసాన్ని చదివినాడు (1867). ఇండియాలోని బ్రిటీషు పరిపాలన ఇండియాకు, ఇంగ్లాండుకు లాభదాయకమైనదా" అనే ప్రశ్నను ఆ ఉపన్యాసములో ప్రస్తావించి, దానికి జవాబును ఈ విధంగా ఇచ్చియున్నాడు. "ప్రస్తుతపు బ్రిటీషు పరిపాలనలో, ఇండియా రక్తాన్ని, నిరంతరంగా పీల్చివేయుచుండడంవల్ల, దేశములోని సారము, శక్తి క్షీణించిపోక తప్పదు. దేశ పోషణకు తగిన అభివృద్ధి మార్గాలను ఇదివరకే తీసుకొనకపోయి యుండినట్లయితే, ఇకముందైనా ఆర్థిక మూలసాధనాలను పెంపొందించకపోతే దేశము యొక్క ఆరోగ్యస్థితి బాగుపడదు".

ఈ వాక్యాలలో అతడు దేశముయొక్క ఆర్థిక దారిద్ర్యమునకు, ద్రవ్య పరివహనమునకు గల సన్నిహిత సంబంధాన్ని సూచించి ఉన్నాడు ఈ సమస్యకు సంబంధించిన విస్తార పరిశీలన, ఇతని జీవితకాలమంతా జరిగింది. ఈ విషయముపై అతడు గావించిన తీవ్రపరిశోధన, పరప్రభుత్వముయొక్క పరిపాలన భారము, కారణములుగా బ్రిటీషువారి చర్యలపట్ల ఇతని భావం వ్యతిరేకమయింది. వీరి పరిపాలనవల్ల, దేశములో ఏర్పడిన సౌకర్యాలు నిష్ప్రయోజనములనే భావం కలిగింది. ఇండియా విత్తపరిస్థితిని గురించి, పరిశీలించడానికేర్పడిన విచారణ సంఘము ఎదుట ఇతడు సాక్ష్యమిచ్చియున్నాడు. "ఇండియా దారిద్ర్యము" అనెడి తన ప్రసిద్ధవ్యాసాన్ని పునఃపరిశీలన గావించి, బొంబాయిలోని ఈస్ట్ ఇండియా శాఖాసంఘములో చదివినాడు. ఇండియాదేశపు ఆర్థిక దురవస్థకంతటికి, ఈ ద్రవ్యపరివహనమే కారణమని నిరూపించెను. "ఇండియాదేశ ప్రయోజనాలను గుర్తింపక, ప్రకృతి విరుద్ధమైన ఈ పరివహన విధానాన్ని అవలంబించి, ఇంగ్లాండు యొక్క ప్రయోజనార్థము ఇండియా ప్రజను శ్రమింపచేస్తూ ఉన్న బ్రిటీషు పరిపాలననీతి, తప్పుత్రోవలో అసహజమైన, ఆత్మవినాశకరమైన జాడలో నడుస్తూ ఉంది".

బ్రిటీషు పరిపాలనయొక్క ఆర్థిక స్వభావాన్ని గురించి, పూర్తిగా వ్యతిరేకాభిప్రాయాన్ని తెలిపినాడు.

"ప్రజల ప్రాణాలకు, ఆస్తికి రక్షణ ఏర్పడియున్నదని చెప్పడం, ఒక కట్టు

కథ. అట్టి రక్షణ ఏ మాత్రమూ లేదనడమే సత్యము". ఒక విధంగా చూస్తే, అట్టి రక్షణ ఉందనే భ్రాంతికలుగుతుంది. అనగా, ప్రజలు ఒకరినొకరు బాధించుకోవడం, దోచుకోవడంలేదు. దేశములోని స్వచ్ఛందులైన వ్యక్తులు గావించే హింసలులేవు. ఈ విధమైన ప్రాణరక్షణ, ధనరక్షణ ఏర్పడియుండడం వాస్తవమే. దీని విషయమై దేశ మెప్పటికీ కృతజ్ఞతను చూపుతుంది. కాని, ఇంగ్లాండు దేశముగావిస్తున్న దోపిడి నుంచి రక్షణలేదే! ఈ దోపిడినుంచి భద్రత అనేది ప్రజలకేమాత్రమూలేదు. తత్ఫలితంగా ప్రాణరక్షణకూడా లేదు. ఇండియా ఆస్తికి భద్రత ఏది? ఇంగ్లాండు యొక్క ఆర్థిక పరిస్థితి భద్రమై ఉన్నది. ఈ భద్రతను ప్రభుత్వము సమర్థమైన ఆయుధబలంతో సాధించుకొంటూ ఉంది. 30,000,000 పౌనుల మొదలు, 40,000,000 పౌనులదాకా, ఇండియా ఆస్తిని ఇంగ్లాండుకు దోచుకొనిపోతూ, ఇండియాలో తిష్ఠవేసి భక్షించివేస్తూ, ఇంగ్లాండు సురక్షితమై ఉన్నది. కనుక, ఆంగ్లపరిపాలననీతి శాశ్వతమైన, దినదినాభివృద్ధి చెందుతున్న విదేశీయ ఆక్రమణ అనేది వాస్తవస్థితి. క్రమంగా, పూర్తిగా దేశాన్ని నాశనము గావించే పరాక్రమణమిది".

"ప్రాచీనకాలపు దుష్ట విదేశదండయాత్రలేవీ కలిగింపని దురవస్థను, ప్రస్తుత ఇంగ్లీషు పరిపాలన దేశానికి తెచ్చిపెట్టింది. దేశక్షేమానికి అత్యావశ్యకమైన ఆర్థిక రక్తాన్ని, 30 కోట్ల పౌనులనుండి 40 కోట్ల పౌనులదాకా, ప్రతి సంవత్సరం పీల్చివేస్తూ, దానితో సహా, దేశములోని "ఉన్నత వివేచనశక్తిని" కూడా హరించుకొని పోతున్నది".

"కనుక, దేశప్రజల ప్రాణాలకు, ఆస్తులకు భద్రత, రక్షణ ఏమాత్రమూ లేదని, వాటితోపాటు 'విజ్ఞానము' 'వివేచన' అను వానికికూడా రక్షణలేదని, నేను మనవి చేస్తున్నాను. దేశములోని కోట్లకొలది ప్రజలకు 'అరగడుపు' 'వస్తు', 'క్షామము', 'రోగము', అనునవే, జీవితముగా ఏర్పడియున్నవి".

ద్రవ్యపరివహనమును గూర్చిన తన వాదానికి సమర్థకంగా, సాలిస్‌బరీ వాక్యాలను ఉదాహరించెను. "ఇండియా ఆదాయాన్ని అత్యధికంగా ఇంగ్లాండుకు ఎగుమతిచేస్తూ, దానికి తగిన ప్రత్యక్ష ప్రతిఫలాన్ని ఇండియాకు ఇవ్వకపోవడం వల్ల, ఇండియా ఆర్థిక వ్యవస్థకు కలిగిన గాయం (హాని), పెద్దదవుతూ ఉన్నది. ఇండియా రక్తాన్ని పీల్చడం అనివార్యమైతే, రక్తం సాంద్రమై ఘనీభవించియున్న భాగానికిగాని, రక్తము సమృద్ధిగా ఉన్న భాగానికిగాని కత్తిని ప్రయోగిస్తే, మీ రక్తపిపాస తీరుతుంది. రక్తము కరవై, నీరసించియున్న భాగాలను (రైతు వర్గాన్ని) కత్తితో చీల్చినందువల్ల మీ ప్రయోజనం సిద్ధింపదు". అని సాలిస్‌బరీ తనదేశీయులకు చెప్పియున్నాడు.

వెల్బీ కమీషన్ సమావేశమైయున్న సందర్భములో,- గోపాలకృష్ణగోఖలే, దీన్షా ఎడల్జీ వాచా, సురేంద్రనాథ బెనర్జీ, సుబ్రహ్మణ్య అయ్యర్,- దేశనాయకులు, కమీషన్ ఎదుట సాక్ష్యమివ్వడానికై, ఇంగ్లాండు వెళ్ళిరి. దాదాభాయి నౌరోజీ, ఈ అవకాశాన్ని పురస్కరించుకొని, ఇండియాకు జరుగుతున్న అన్యా

యాలను బ్రిటీషు ప్రజలదృష్టికి తెచ్చే ఉద్దేశంతో, దేశవ్యాప్తమైన ఉపన్యాసోద్యమానికి బూనుకొన్నాడు. ఈ ఉద్యమం కొనసాగిన పిమ్మట 'లండన్ ఇండియా సొసైటీ' ఆశ్రయంలో సభజరిపి, ఒక తీర్మానాన్ని అంగీకరించి, బ్రిటీషు ప్రభుత్వానికి పంపినారు. బ్రిటీషువారు అవలంబించియున్న అన్యాయ విధానాలను వారనుసరిస్తున్న మార్గాలను మార్చడానికి నలభై సంవత్సరాలుగా పాటుపడి, ప్రయోజన సిద్ధిని పొందక, హతాశుడై యున్న దాదాబాయియొక్క మనోవేదనను, ఈ తీర్మానము, వ్యక్తంచేస్తున్నది. తీర్మాన మీవిధంగా రచితమైయున్నది;-

"ఒకటిన్నర శతాబ్దంగా, భారతదేశము లోనైయున్న అన్ని కష్టాలలోను, దుర్భర దురవస్థలలోను, ఇటీవల జరిగిన సంఘటనలు, అత్యంత విషాదకరములైనవి. దినదినానికి పెరుగుతున్న దారిద్ర్యం వల్ల ఏర్పడుతున్న క్షామములు; ప్లేగు వంటి అంటు జాడ్యములు; ఆత్మ వినాశకరమైన, బుద్ధిహీనమైన సరిహద్దు యుద్ధములు; ఏ జాతులకు గాని, అందును ఇంగ్లాండు నాగరకతకు అయోగ్యమైన రాక్షస కృత్యములకు బూనుకొని, గ్రామ సీమలను ధ్వంసం గావించిన సైన్య చర్యలు; విద్రోహమనెడి మిషతో, వివేచన రహితంగా, ఆత్మవినాశకరంగా, దేశీయులను ఖైదుగావించడము; విద్యావంతులైన భారతీయులు ప్రభుత్వం పట్ల విశ్వాసం లేనివారని అజ్ఞానంతో ప్రభుత్వం గావించే ఘోషలు; ఇండియా దేశ పత్రికల స్వాతంత్ర్యాన్ని నిరోధించడం; ప్రభుత్వం అవలంబించియున్న స్వచ్ఛంద ప్రవృత్తి; పరిపాలన వ్యవస్థ యొక్క అసమర్థత, అసమగ్రతలు; ఈ దుష్ట పరిస్థితులన్నిటికీ, అన్యాయము, బ్రిటీషు ప్రజానీతికి విరుద్ధము, ఐన, ఇండియా ప్రభుత్వ వ్యవస్థే మూలకారణము. ఈ అన్యాయ వ్యవస్థ, నిరంతరంగా నిరంతరాభివృద్ధితో, ఇండియా దేశరక్తాన్ని పీల్చి వేస్తున్నది. రాజకీయ వంచనను ఎడతెగని కపటోపాయాలను ఆధారంగా చేసుకొని, తన పరిపాలన వ్యవస్థను కొనసాగించు కొంటున్నది. బ్రిటీషు వారి గౌరవానికి, పేరు ప్రతిష్ఠలకు అయోగ్యమైన విధానమిది. ఇండియా ప్రభుత్వ విధానము, బ్రిటీషు ప్రజల అభిమతాలకు, బ్రిటీషు సార్వభౌముని అభిమతానికి, పూర్తిగా విరుద్ధమైనది. బ్రిటీషు స్వభావానికి విరుద్ధము, అన్యాయ బద్ధము ఐన ప్రస్తుత ఇండియా ప్రభుత్వ వ్యవస్థను పూర్తిగా పరివర్తన మొనరించి, న్యాయబద్ధమైనదిగా, నిజమైన బ్రిటీషు సంస్థగా ఏర్పరిస్తే తప్ప, దుష్పరిపాలన ఫలితంగా ఇండియా దేశమునకు వినాశము, బ్రిటీషు సామ్రాజ్యమునకు విపత్తు తప్పవు."

ప్రభుత్వాధికారుల ధిక్కారముల వల్లను, ఇండియాలోని తీవ్ర పరిస్థితుల వల్లను, దాదాభాయి నౌరోజీ విసిగిపోయి-ఈ విధమైన నిశ్చయాన్ని, వ్యక్తం గావించెను. "ప్రభుత్వాధికారులు తమ వేషాన్ని, ప్రజాహిత కాంక్ష యనే నటనను నిర్భయంగా, నిస్సంకోచంగా వదలివేసి, తమ రాక్షస స్వరూపాన్ని ప్రజలకు గోచరింప చేస్తున్నారు. ప్రభుత్వ పరిపాలనలో ఏదో వంచన, ద్రోహము ఉన్నదని ప్రజలు కూడా గుర్తించినారు. భయంకరమైన సంఘర్షణకిక అవధిలేదు."

శాంతియుతమైన మార్గములో ప్రభుత్వ వ్యవస్థ ఏర్పడే అవకాశం లేన

ప్పుడు, ప్రజలు విప్లవానికి పూనుకొంటారనే నిశ్చయానికి, దాదాభాయి కూడా వచ్చినాడు. లండన్ ఇండియా సొసైటీ సమావేశములో మాట్లాడుతూ, 1904 జూన్ 1 వ తేదీనాడు, ఈ విధంగా తన అభిప్రాయాన్ని ప్రకాశం గావించినాడు. "శాంతియుతమైన ప్రజా విప్లవముతో రక్షించుకోడానికి సాధ్యము కానినాడు, ఈ అవమానకరమైన, కపట భూయిష్ఠమైన, వినాశకరమైన వ్యవస్థను తొలగించుకోడానికి, ఒక్క మార్గమే మిగిలి యున్నది. సామ్రాజ్యాన్ని ఛిద్రము గావించే విధాన మొక్కటే, తగిన మార్గము. బ్రిటీషు సామ్రాజ్యాధికారములో ఇండియాకు స్వయం పరిపాలన ప్రభుత్వం ఏర్పడడమే, దీనికి తగిన ప్రతిక్రియ. ప్రాథమికమైన ఈ ప్రతిక్రియ సిద్ధించిననాడు ప్రస్తుత వ్యవస్థలోని ప్రతిదోషము, ప్రతి లోపము, తనంతట అదే చక్కబడుతుంది."

కర్జన్ అవలంబించిన 'విభజన రాజనీతి', బెంగాలు విభజనకు దారి తీసింది. ఈ కారణం వల్ల, 1806 లో జరిగిన కాంగ్రెసు సమావేశములో, సభ్యులు ఉద్రేక పూరితులైనారు. అప్పుడు, దాదాభాయి నౌరోజీ 'స్వరాజ్య' సాధనకు పూనుకోవలసిందని ప్రోత్సహించెను. దేశములో ఐక్యతను సాధించవలసిందని, ఉద్రేకంతో ప్రజలను ప్రార్థించినాడు.

"ఐక్యముతో నిలబడి, దీక్షతో పరిశ్రమించి, స్వరాజ్యాన్ని సాధించండి. దారిద్ర్యమునకు, క్షామాలకు, కాటకములకు లోనై నశిస్తున్న కోట్లకొలది ప్రజలు, కడుపుకు చాలని గంజితో అలమటించి పోతున్న ప్రజలు, స్వరాజ్య సిద్ధి వల్లనే రక్షింపబడతారు. తన ప్రాచీన వైభవాన్ని, ప్రాభవాన్ని, ఇండియా మరల సంపాదించుకొని, ఉత్తమ ప్రపంచ నాగరక దేశాలలో ఒకటిగా నిలబడేటట్లు చేయడానికి స్వరాజ్యమొక్కటే సాధనము."

క్రియా శక్తియుతమైన దాదాభాయి నౌరోజీ, జీవితయాత్ర 19 వ శతాబ్దపు ఉత్తరార్ధ భాగాన్ని ఆక్రమించింది. ఇండియా దేశముపై బ్రిటీషు సామ్రాజ్య పరిపాలనకు సంబంధించిన అతని అభిప్రాయాలు, భావాలు, ప్రజాభిప్రాయంలో కలిగిన మార్పులో ప్రతిఫలిస్తాయి. బ్రిటీషు పరిపాలన వల్ల సిద్ధించిన సౌకర్యాల వల్ల, మొదటి రోజులలో విదేశ ప్రభుత్వంపై అభిమాన మేర్పడింది. ఇండియా దేశాన్ని రక్షించడానికి, నిజంగా దైవసంకల్పంతో వీరు పూనుకొన్నారని దేశం విశ్వసించింది. కాని, సంవత్సరాలు, దశాబ్దాలు, గడచిన కొద్దీ-ఈ భావన క్షీణిస్తూ వచ్చింది. శతాబ్దాంతము నాటికి, ప్రస్తుత ప్రభుత్వ వ్యవస్థను అంతమొనర్చి' స్వయం పరిపాలన ప్రభుత్వాన్ని స్థాపించుకోవలెననెడి కోరిక, ప్రజల మనస్సులను ఆవేశించింది.

'వృద్ధ మహాత్ముడని' వ్యవహరింపబడిన దాదాభాయి నౌరోజీ, రాజకీయార్థిక రంగములలో, ఆ నాడు ప్రబలాధిపత్యం గల మహావ్యక్తి. అతని నిర్దేశాన్ని దేశం అనుసరించింది. అతడు ఖండించిన పరిపాలన దోషాల విషయములో, అందరికీ ఏకాభిప్రాయమున్నది. ప్రజలను పీడించి పిప్పిచేస్తున్న దుస్సహదారిద్ర్య స్వభావము, ఇండియా ద్రవ్యాన్ని బ్రిటీషు ప్రభుత్వం ప్రవాహ రూపంలో

ఇంగ్లాండుకు తీసుకొనిపోయి, ఈ దారిద్ర్యాన్ని దేశములో సృష్టించడము,-అనే విషయాలివి.

(d) ***ఆర్థిక నైతిక వాదములు :*** ద్రవ్య పరివహనం వల్ల ఏర్పడే దుష్ట ఆర్థిక పరిణామాలు, ఇట్లు ప్రవాహ రూపంలో బైటకిపోతున్న మొత్తము, ఎట్టిదై యున్నవనే విషయము, సంఖ్యా పరిగణనలతో కూడా, భారతీయార్థిక శాస్త్ర వేత్తలు నిరూపించి ఉన్నారు. ఆర్థికములైన చిక్కులు మాత్రమేకాక, రాజకీయ నైతిక వివాదాలు కూడా, ఈ ద్రవ్య పరివహనములో నిబద్ధమై యున్నవి. బ్రిటీషు పరిపాలన ప్రయోజనమేమి? ; ఇండియాపై పరిపాలన సాగించడం బ్రిటీషు వారికి ఏ విధంగా న్యాయమైనది ; ప్రభుత్వం ఋణములు గావించడానికి అవసర మేమి ; – విదేశీయ మూలధనాన్ని ఇండియాలో పెట్టుబడి పెట్టి, తద్వారా ఇండియాకు నష్టం కలిగించి, దిగుమతులకు మించిన ఎగుమతులను నిరంతరంగా చేయవలసిన పరిస్థితిని కల్పించి తత్ఫలితమైన దారిద్ర్యాన్ని దేశములో కలిగించడ మెందుకు – బ్రిటీషు సామ్రాజ్య ప్రయోజనములకై పూనుకొన్న యుద్ధముల ఖర్చులను దండయాత్రల ఖర్చులను ఇండియాపై మోపడమెట్లు న్యాయమైనది ; అతి వ్యయముతో కూడిన ఒప్పందపు సివిల్ సర్వీసును, మితిమీరిన సైన్య బలాన్ని పెంచుతూ ప్రభుత్వపు ఖర్చులను పెంచడమెందులకు – మొదలైన ప్రశ్న లన్నిటినీ, సమగ్రంగా, సాంగోపాంగంగా చర్చించి, భారతదేశము యొక్క జవాబుగా బ్రిటీషు ప్రభుత్వానికి పంపడం జరిగింది. ప్రజల శ్రేయోభివృద్ధికై, బ్రిటీషు వారిచ్చిన సాంకేతికశాస్త్ర నైపుణ్యము, సత్య సంధత, విజ్ఞానము, అమూల్యములైనవని, వాటికి ద్రవ్యరూపంలో విలువ కట్టడం అసంబద్ధమని, వారు గావించిన వాదమునకు కూడా తగిన సమాధానమిచ్చియున్నారు. వెల్బీ కమీషన్ ఎదుట సాక్ష్యమిస్తూ గోఖలే, దీనికి తగిన విధంగా జవాబిచ్చియున్నాడు – "అమిత ధన నాశము మాత్రమే విదేశీయ వ్యవస్థ వల్ల సిద్ధించిన దుష్ట పరిణామం కాదు. నైతిక విషయంలో జరిగిన పరిణామం అంతకంటెను దుష్టమైనది. ప్రస్తుత ప్రభుత్వ విధానమునకు లోనై, భారత జాతి తన వ్యక్తిత్వాన్ని, నైతిక ప్రతిష్ఠను పోగొట్టు కొన్నది. జాతి యొక్క స్వభావమే కుంఠితమై, సంకుచితమై పోతూ ఉంది. మా జీవిత కాలమంతా, అధమత్వమనే వాతావరణంలో గడపవలసి ఉన్నది. ప్రస్తుత ప్రభుత్వ వ్యవస్థను సంతృప్తి పరచడానికై మాలోని ఉత్తమోత్తములైన వ్యక్తులు కూడా, తలవంచుకొని నడవవలసి వచ్చింది. అభివృద్ధికి వచ్చి, ఔన్నత్యాన్ని పొందవలెననే ఔత్సుక్యము భారత జాతికి లేకుండా చేసింది బ్రిటీషు పరిపాలన. ఈటన్ లోను, హ్యారోలోనూ చదివే ప్రతి విద్యార్థీ, తాను కూడా ఒక రోజు గ్లాడ్‌స్టన్, నెల్సన్, వెల్లింగ్టన్, వంటి, వ్యక్తిగా కాగలడని భావిస్తాడు. కనుక, అట్టి అభ్యుదయ సాధనకై, తన శక్తి సామర్థ్యములంతనూ వినియోగించి, ప్రయత్నిస్తాడు. అట్టి అవకాశము మాకు లేకుండా చేసియున్నారు. మా మానవత, వ్యక్తిత్వము, అభివృద్ధి చెంది, తన యోగ్యతకు తగిన ఉన్నతిని పొందే అవకాశము, ప్రస్తుత ప్రభుత్వ విధానంలో మాకు లభింపదు. స్వయం పరిపాలక దేశములలోని ప్రజలు

భావించే నైతికౌన్నత్యాన్ని మేము భావించుకొనే స్థితిలో లేము. మాకుగల పరిపాలన శక్తి సామర్థ్యాలు, యుద్ధ సామర్థ్య నైపుణ్యము, ఉపయోగములో లేనివై, క్రమంగా నశించిపోక తప్పదు. కట్టకడపటికి, మా దేశములో మేము, కట్టెలు కొట్టడము, నీళ్లు తోడడము మాత్రమే చేస్తూ, జాతి నశించి పోయే అంతవరకు బ్రతుకు నీడ్వవలసి యున్నది. మా జీవిత మీ విధంగా అచ్చులుగా ఏర్పడి, భావి ప్రజలు కూడా అట్టి వారే ఔతారు."

దారిద్ర్యమును, ద్రవ్య పరివహనమును గురించి, దాదాభాయి నౌరోజీ ప్రారంభించిన వివాదము, ప్రసార మండలములలో నిరంతరం వృద్ధి చెందుతూ, దేశము అన్ని వైపులకూ వ్యాపించింది. పత్రికలు, ఉపన్యాసాలు, అసంఖ్యాకములైన కరపత్రాలు, వార్తా పత్రికలు, పుస్తకాలు, వేలకొలదిలో జరిగిన బహిరంగ సభలు, సమావేశాలు, కాంగ్రెసు సంస్థ-అన్నీ ఈ అభిప్రాయాలను ప్రజలలో ప్రసారం గావిస్తూ వచ్చినవి. ఈ ప్రబల ప్రచారం వల్ల, దేశ ప్రజలందరూ ఈ అభిప్రాయానికి బద్ధులైపోయిరి. దేశమంతటా ఇట్లు వ్యాపించిన, ఈ స్వాతంత్ర్య భావము జాతీయ చైతన్యానికి ఒక రూపాన్ని ఏర్పరచింది. ప్రజలలో అంతటా, అమితంగా వ్యాపించియున్న దారిద్ర్యము, దీనికి పరదేశ పరిపాలనమే కారణమనెడి సార్వజనీన విశ్వాసము-ఈ రెండే రాజకీయోద్యమానికి ప్రేరకములైన ముఖ్య కారణాలు.

పరిపాలకులు మాత్రం, ఉద్యమాన్ని తిరస్కార భావంతో చూచి, నిర్లక్ష్యముతో నుండిరి. పార్లమెంటు ప్రజాసభలో, కర్జన్, ఈ విధంగా ఉపన్యసించెను. (1892). "ఇండియా కాంగ్రెసు సంస్థ యొక్క ప్రణాళికలు, విధానాలు, రూప రహితమైన ఈ అవశేషాన్ని (ప్రజానీకాన్ని) ఏ మాత్రమూ స్పృశింపక వదలివేసినవి. కాంగ్రెసు సంస్థ ప్రాతినిధ్యం వహిస్తున్న నిర్వాచన క్షేత్రాలు, అత్యల్పములైనవి, దేశపు జనాభాలో అల్పాత్యల్పములైనవి అని, వర్ణించడం తప్పదు." గణాంక సంఖ్యల ఆధారంగా వాదించినందు వల్ల, పరిపాలకుల దృష్టి, నిరుద్ధమైనది. విశాలంగా చూడలేకపోయిరి.

కర్జన్ అభిప్రాయాన్ని సమర్థించిన అధికార వర్గం వారు, అనధికార వర్గం వారు కూడా, ఇండియాలో ఉన్న జాతిమత విభేదాలను అతిశయోక్తులతో వర్ణించిరి ఈ సమర్థకుల అనుభవం కేవలము పశ్చిమ యూరోపు దేశాలకు మాత్రమే సంబంధించినది. ఆ దేశాలలో జాతిమత భేదాలు స్వల్పము. ఇది యొక కారణము. తాము వహించిన సామ్రాజ్య నీతిని సమర్థించుకోవడం తమ నైతిక బాధ్యతగా భావించి, పాలిత ప్రజల అననుకూలములైన అభ్యర్థలను ప్రోత్సహించడానికి ఇష్టపడని వారైరి. సమాజములోని అన్ని వర్గాలూ ఐక్యమై యుండిన దేశము, చరిత్రలో ఎందునూ లేదు. అట్టి ఐక్యము ఏ దేశములోనూ ఉండదు. అది ప్రజా ప్రకృతికి అస్వాభావికమైనది. ఆంగల్స్, స్యాగ్జన్స్, జూట్స్, డేన్స్, నార్మన్స్, మొదలైన అన్ని జాతులతోనూ, అన్ని మతములతోనూ ఉన్న 'బ్రిటిష్ దీవులు' అనే భూభాగము, సంయుక్త రాజ్యంగా (United kingdom) ఏర్పడింది.

ఇప్పటికీ కూడా, ఇంగ్లీషు వారు, స్కాట్స్, వెల్ష్, ప్రొటెస్టెంట్స్, రోమన్ క్యాతొలిక్స్ - అనే వివిధ వర్గాలు ఈ రాజ్యములో ఉన్నవి. పందొమ్మిదో శతాబ్దపు మధ్య కాలం వరకూ జర్మనీ ఇటలీ దేశాలు, భౌగోళికమైన పేర్లు మాత్రమే. పంద్రెండవ శతాబ్దము నుంచి రష్యా ఒక జాతిగా ఏర్పడుతూ వచ్చింది.

మధ్యయుగ కాలమునుంచి ఆధునికకాలం వరకూ జరిగిన ప్రపంచదేశముల అభివృద్ధిసర్వస్వమూ, సామంతవ్యవస్థనుంచి మారుతూవచ్చినదని స్పష్టంగా చరిత్రను బట్టి విశదమౌతుంది. ఆ సామంతవ్యవస్థ భిన్నజాతుల, భిన్న మతభావాల అనుబంధాలతో ఏర్పడియుండినది. రక్తసంబంధము, కుటుంబము, వంశము, గోత్రము, పంథాభిమానబద్ధమైన మతము, దానికి ప్రత్యేకములైన కట్టడి, పూజావిధానములు, ఇత్యాదులతో ఏర్పడియుండిన సమాజ వ్యవస్థలు క్రమంగామారి, పరిసర ప్రాంతీయ భావము, పరస్పర సహకారభావము, సమాన ఆర్థిక ప్రయోజనములు, జాతీయ భావము, - అనే పద్ధతిలో క్రమపరిణామాన్ని పొందుతూ వచ్చినవి.

ఈ ప్రక్రియను, రాజ్యశక్తి గాఢంగా ప్రోత్సహించింది. ఫ్రాన్సుదేశాన్ని, ఆ దేశరాజులు ఐక్యంగా సిద్ధింపజేసిరి. ఆ దేశములోని పట్టణాలను, చిన్న పరిపాలన భాగాలను సహాయంగా తీసుకొని, సామంతరాజుల రాష్ట్రాలను పడద్రోసి, దేశానికి ఐక్యమునుచేకూర్చి, ఫ్రెంచిజాతిని స్థాపించినవారు ఫ్రాన్సు సార్వభౌములు. తమలోతాము కలహించుకొంటూ ఉండిన అసంఖ్యాకములైన చిన్న చిన్న రాజ్యాలనన్నిటినీ ఐక్యంగావించి, ఆధునిక జర్మను జాతిని, హోహెన్‌జోలెన్స్, స్థాపించినారు. ఇటలీ దేశముయొక్క ఐక్యమును సాధించినవారు పెయిడ్-మాంట్స్ రాజులు (Paid montse Kings). మెయిజీ (Meiji) యుగానంతరము, ప్రభుత్వంచేసిన ప్రయత్నాలవల్ల జపాను ఒక జాతిగా సిద్ధించింది. ప్రథమ ప్రపంచ యుద్ధానంతరం, కెమాల్ అటార్క్ ఏర్పరచిన రాజ్యముయొక్క నిర్దేశముల ననుసరించి, జాతీయ పంథాలో నడిచి, టర్కీ ఆధునిక జాతిగా సిద్ధించింది.

బ్రిటీషుపరిపాలన ఇండియాలో తద్విపరీతమైన విధానమునవలంబించడం విషాదకరమైన విషయము. సామాజిక వ్యవస్థను సంయోజన పరచడానికిమారుగా, ప్రత్యేకవర్గములుగా ఏర్పడిపోయే ప్రవృత్తులకు దోహదం గావించింది. బ్రిటీషు పరిపాలన ఫలితములు, బ్రిటీషుప్రభుత్వ వ్యవస్థవల్ల కలిగిన అనూహ్యములైన పరిణామాలు, పరోక్షకారణములై, దేశములో ఐక్యభావము, ఆధునికత, ఏర్పడడం వాస్తవమే. ఇవి తమంతట అవి, స్వాభావికంగా ఏర్పడిన పరిణామాలు. కాని, ప్రభుత్వం మాత్రము, బుద్ధిపూర్వకంగా అవలంబించినది, భేదోపాయనీతి.

ఇట్లు, విరుద్ధములైన పరిస్థితులలో, పరప్రభుత్వ పరిపాలన ఫలితముగా ఉత్పన్నములైన శక్తులు, నూతనంగా ఉద్భవించిన స్వాతంత్ర్యభావముతో చేరి, భారతీయ జాతీయోత్పత్తికి ప్రేరకములైనవి. జాతీయైక్యమునకు ఆవశ్యకములైన పరిస్థితులన్నీ, ప్రకృతి సిద్ధములై ఉన్నవి. భౌగోళికమైన వ్యక్తిత్వము, అవిచ్ఛిన్నమైన చరిత్ర, ఉత్కృష్టమైన సంస్కృతివైశిష్ట్యము అనేవి పరిస్థితులు. మధ్యతరగతి విద్యావంతుల జాతీయచైతన్యాన్ని బలపరచి, మధ్యయుగాంత భావాలకు

లోనైన వర్గాల అపగమ ప్రవృత్తులను నిరోధించడానికి అవసరమైయుండినది ప్రభుత్వపోషణ మాత్రమే కాని, ప్రభుత్వమాప్రయత్నానికి విరుద్ధముగా ప్రవర్తించింది. ప్రభుత్వమే ఇట్టిప్రవృత్తులకు వారిని ప్రోత్సహిస్తున్న సందర్భాలలో, సంఘంలోని మధ్యయుగాల సాంప్రదాయిక శక్తులను ప్రతిఘటించి, జాతీయభావాన్ని అలవరచుకోవడం, ఈ వర్గాలకు సాధ్యమైనపనికాదు. కనుకనే, రాజకీయచైతన్యం గల సంఘాలు ఎంత పట్టుదలతో కృషిచేసినా, ఐక్యసిద్ధికై భారతజాతీయకాంగ్రెసు నిరంతరకృషి సాగించినా, జాతీయోద్యమములో, చీలికలు రావడంతప్పలేదు.

## XI. ముస్లిము ప్రతిక్రియ

కాంగ్రెసు ఉద్యమం అధికారులను కలవరపరచింది. కనుక, వారు కొన్ని హిందూవర్గాలను, ముస్లిములను భయభ్రాంతులను చేయడానికి ప్రారంభించిరి. సర్ సయ్యాద్ అహమ్మద్ ఖాస్ ఈ వర్గాలకు నాయకత్వం వహించి, కాంగ్రెసు ఉద్యమానికి దూరంగా ఉండవలసిందని ముస్లిములకు బోధింపసాగెను. ఉత్తర ప్రదేశములోని, హిందూ భూస్వాముల సహకారముతో కాంగ్రెసుకు వ్యతిరేకంగా, 'ఇండియా దేశభక్తుల సంఘము' అనే పేరుతో ఒక సంస్థను స్థాపించెను. కాని, ఈ సంస్థ ఎంతోకాలం నిలవలేదు. అంతట, అలిఘరు వర్గంవారు, బ్రిటీషుపరిపాలనకు సహాయంగా ముస్లిము మతస్థులను ఐక్యపరచే ప్రయత్నానికి, పూనుకొనిరి. కాని, ఈ విషయంలో కూడా, వీరంతగా కృతార్థులుకాలేదు.

సంప్రదాయవర్గానికి చెందిన నాయకులూ, ఉలమాలూ సర్ సయ్యాద్ కు, వ్యతిరేకులు. విద్యావంతులు, విజ్ఞానవంతులు ఐన, ముస్లిములనేకులు కాంగ్రెసుతో ఏకీభవించిరి. దురదృష్టంవల్ల, రెండు మతస్థులవారికీ సంబంధములు విషమించి, 1880 తర్వాత, అనేక ప్రదేశాలలో దొమ్మికలహాలు జరిగినవి. కాంగ్రెసును అధిక్షేపించడానికి, అధికారితంత్ర వర్గంవారికి అవకాశం లభించింది. ప్రజాప్రాతినిధ్య సంస్థల నేర్పరచడానికి యోగ్యమైన సామరస్యం దేశములో లేదని ప్రభుత్వాధి కారులు కాంగ్రెసును ఆక్షేపించిరి. 'లండన్ స్టాండర్డ్' పత్రిక ఈ విధంగా వ్రాసింది. "బాధ్యతాయుతములైన పదవులకు దేశీయులను నియమించడంలో మనం అవలంబించిన పరిపాలన విధానమూ, విద్యాయోగ్యత కలదనే ఆధారం పై దేశీయులను ఈ పదవులకు మనం నియమించడమూ, మితిమీరిపోయింది. అది ఆపత్కరమైన విధానము. ఇండియాను మనం ఆయుధబలంతో నిగ్రహించి నాము. ఆయుధబలంతోనే నిలుపుకోవలసి ఉన్నది. ఇండియా దేశములో,- వాస్తవంగా అనేక దేశముల కూడికయైన దేశంలో,- శాంతిని నెలకొల్పినాము. కాని, అంతఃకలహాలు, మాటిమాటికి, మన చిత్తవ్యగ్రతకు భంగం కలిగిస్తున్నవి".

బ్రిటీషుప్రభుత్వం అవలంబించిన భేదోపాయనీతే, ఈ మతకలహాలకు కారణము. కాంగ్రెసు గావిస్తున్న రాజకీయాభ్యర్థనలను సహింపలేని అధికారులు బుద్ధిపూర్వకంగా అనుసరిస్తున్న విభేద పద్ధతి ముస్లిములను ప్రోత్సహిస్తున్నది; బ్రిటీషువారి ప్రోద్బలంవల్లనే జాతీయోద్యమాన్ని ముస్లిములు అడ్డగిస్తున్నారు;

అని కాంగ్రెసు బదులు చెప్పింది. అమృత బజారు పత్రిక ఈ విధంగా వ్రాసింది. "ముస్లిముల ఆదరణను సంపాదించుకోడానికై ప్రభుత్వం కుతూహల పడుతున్న దని ప్రజలకు నమ్మకం కలిగించినారు. మరియొకవైపు, పరోక్ష మార్గంలో ముస్లిములను ప్రోత్సహించి, వారిని వీపుతట్టి, అభయహస్త మిచ్చినారు. ఈ రెండూ ప్రభుత్వకార్యాలే".

మతతత్వాలకు ప్రతిక్రియ గావించే ప్రయత్నానికి బూనుకొని, అధ్యక్షుడైన ఫిరోజ్‌షామెహ్తా ద్వారా కాంగ్రెసు ఈ ప్రకటన గావించింది. "కాంగ్రెసు సభ్యులందరు, ఈ దేశములోని పౌరులైన కారణంవల్ల, ప్రజా సర్వస్వానికి సమానమైన జాతీయ భావాన్ని ఆధారంగాచేసుకొని, వ్యక్తి స్వాతంత్ర్యముతో ఈ సంస్థలో చేరియున్నారు." 1887 కాంగ్రెసు సమావేశానికి అధ్యక్షుడైన బదురుద్దీన్ త్యాబ్జీ, ఈ ప్రకటన గావించెను. "దేశములో తమతోసహా నివసిస్తున్న ఇతర జాతి వర్గాలతో, మత వర్గాలతోకలిసి, చేయిచేయి కలిపి, సర్వ ప్రజలకూ సమానములైన సత్ప్రయోజనములను సాధించడానికై, ముస్లిములెందుకు ప్రయత్నింప కూడదో నాకు మాత్రం అర్థంకావడంలేదు."

## XII. అతివాద పక్షము ఏర్పడడము

అధికారవర్గంవారి తిరస్కారభావమూ, విరోధభావమూ, ఎక్కువగా ఉన్నా, రాజకీయోద్యమం క్రమంగా బలపడి, విస్తృతమయింది. భారత జాతీయ కాంగ్రెసు ప్రతిసంవత్సరము సమావేశాలు జరిపి, ప్రభుత్వము గావిస్తున్న దోషాలను, ఆ వ్యవస్థలోని లోపాలను ప్రజలదృష్టికి తెస్తూవచ్చింది. వివిధ ప్రాంతాలలో రాజకీయ సమావేశాలు ఏర్పాటుగావించి, కాంగ్రెసు తీర్మానాలను వివరించి, ప్రజలలో వ్యాప్తి గావిస్తూ వచ్చింది. దేశంలోని ఆంగ్ల భాషా పత్రికలు, దేశ భాషా పత్రికలు, రాజకీయ నాయకుల భావాలను అభిప్రాయాలను వివరిస్తూ, చర్చిస్తూ ప్రజలకు రాజకీయోద్యమ పరిజ్ఞానాన్ని కలిగిస్తూ వచ్చినవి. ముద్రణాలయములు, రాజకీయ సారస్వతాన్ని ముద్రించి, దేశములో వెదజల్లుతూ వచ్చినవి. రాజకీయ ప్రచారకులు, కార్యకారులు, దేశమంతటా పర్యటనంగావించి, బహిరంగ సభలు, వర్గీయ సభలు, జరిపి, ఉద్యమంయొక్క ఆశయాలను ప్రసారం గావించి, ప్రజలలో రాజకీయ చైతన్యాన్ని పెంపొందించిరి.

పరిస్థితు లిట్టి అవ్యవస్థస్థితిలో ఉన్న సందర్భాన్ని, ప్రభుత్వం వహించియున్న ప్రవృత్తి నిరుత్సాహకరమై యుండడాన్ని గమనించి, హ్యూమ్ భారత జాతి నీవిధంగా ప్రార్థించినాడు. "మనస్వత్వములైన న్యాయాన్ని, స్వాతంత్ర్యాన్ని, హక్కులను సంపాదించుకోడానికై, కాబ్డెన్, అతని ఉత్తమ బృందము అనుసరించిన మార్గంలో - మేము జరుపబోయే రాజకీయ యుద్ధంలో, మన మాతృదేశమైన పవిత్రో భారతదేశంపై జీవించే ప్రతివ్యక్తీ, మాకు సహవాసిగా,- సహాయకుడుగా, అవసరమైతే సైనికుడుగా, ఉంటాడని మేము ప్రార్థిస్తున్నాము." కాంగ్రెసు అవలంబించిన పరిమిత పద్ధతిని అతిక్రమించిన మార్గమిది. రాజకీయాం

దోళనను, దేశం అన్నివైపులం ప్రసరింప చేయడానికి బూనుకొన్న ప్రయత్నము. బహిరంగ సభలుజరిపి, అన్ని వర్గాల ప్రజలనుండి విరాళాలు వసూలుచేసి, నిధిని సమకూర్చుకొన్నారు. పట్టణములలోను, జిల్లాలలోను ఉపన్యాసాలిచ్చి, ప్రజలకు ఉద్యమ ప్రయోజనాలను బోధించడానికై, వక్తలను పంపిరి. రాజకీయ సారస్వతం ప్రజలలో పంపిణీ పెట్టడం జరిగింది. "కాంగ్రెసు ప్రశ్నోత్తర శిక్ష". "మౌల్వీ ఫరీదుద్దీనుకు, గ్రామఖర్తస్పురపు రాంబఖ్షుకు జరిగిన సంవాదము" అనే రెండు కరపత్రాలు ప్రకటింపబడినవి. భూస్వామ్య పద్ధతిలోని చెడుగులు, స్వచ్ఛంద ప్రభుత్వంవల్ల కలిగేహాని, ఈ పత్రములలో విస్తరంగా వివరింపబడినవి. ప్రజాప్రతినిధుల ప్రభుత్వమొక్కటే, ఈ దురవస్థలకు తగిన విరుగడ అని, ఈ పత్రములు వాటించి దేశ ప్రజల దృష్టి నెక్కువగా ఆకర్షించినవి. అంతతో ప్రభుత్వపు పెంపురాల గూటిలో కలవర మారంభమయింది.

విదేశములలో, అందును ముఖ్యంగా, ఇంగ్లాండులో రాజకీయ ప్రచార మావశ్యకమనే విషయం 1880 నాడే గుర్తింపబడింది. విలియం వెడ్డర్ బర్న్ అధ్యక్షుడుగా, విలియండిగ్బీ కార్యదర్శిగా, దాదాభాయి నౌరోజీ, ఇతర ఆంగ్లేయ ప్రముఖులు సభ్యులుగా, భారతజాతీయ కాంగ్రెసుయొక్క బ్రిటీషు సమితి ఏర్పడింది. 'ఇండియా' అనే పత్రికను, కాంగ్రెసు అభిప్రాయ ప్రచారమునకై స్థాపించిరి.

జాతీయ నాయకులైన తిలక్, అరవిందఘోషులు, హ్యూమ్ ప్రారంభించిన కార్యక్రమాన్ని ఉపయోగించుకొని తమ ప్రచారాన్ని ప్రారంభించిరి. కాంగ్రెసు అవలంబించిన కార్యక్రమ విధానం గంభీరమైనదైనా అతి స్తిమితమైనదని, అధిక విద్యావంతులైన, సంపన్న వృత్తులవారి నిర్దేశమునకు లోబడి ఉన్నదని, వీరికి అసంతృప్తి కలిగింది. ప్రభుత్వంపట్ల కాంగ్రెసు ప్రదర్శిస్తున్న ప్రార్థన పద్ధతి, దైన్యభావము వీరికి నచ్చలేదు. క్రియాత్మక శక్తితో కూడిన ఆందోళనకు బూనుకొనవలెనని వీరి ఉద్దేశము. కాంగ్రెసు పద్ధతులు అసమగ్రములని ఆక్షేపిస్తూ, అరవిందఘోష్ 'ఇందుప్రకాశ్' పత్రికలో వరుసగా వ్యాసములను ప్రకటించెను. "పాత వ్యవస్థకు వెలుగునిచ్చేజ్యోతి" (New lamps for old) అనే శీర్షికతో ఈ వ్యాసములు వెలువడినవి. శాసనసభల విస్తృతి, ఐ. సి. ఎస్. పరీక్షలు రెండు దేశాలలోనూ ఒకే సమయములో జరగడము,- అనే విషయాలు "ఇంద్ర జాలక్రియల వంటివి." అని ఇతడు విమర్శించెను. "బ్రిటీషు పరిపాలన వల్ల మనకు సిద్ధించిన సౌకర్యాలు, న్యాయ దయామూర్తియైన ఇంగ్లాండుమాత యొడిలో భారతదేశాన్ని అచింత్య నీయుడైన భగవంతుడు చేర్చియుండడము." ఇత్యాది భావాలను అరవిందఘోష్ హేళన గావించినాడు. "ఆంగ్లో- ఇండియన్ జెరికో ప్రాకారాలింకను స్థిరంగా నిలిచేఉన్నవి. వాటిలో ఒక చీలికకూడా ఏర్పడలేదు. దారిద్ర్యాంధకారము దేశము సమస్తాన్నీ దట్టంగా, విస్తృతంగా ఆవరిస్తూ ప్రబల మౌతున్నది." అని హెచ్చరించినారు.

కాంగ్రెసు విధానం, అరవిందుకు, అమితమైన విసుగు కలిగించింది. "మధ్య

తరగతుల అభిప్రాయ ప్రచార సాధనము, ప్రజాకార్యక్రమ విషయములో కుటిల మార్గానుసారి అని కాంగ్రెసును విమర్శించెను. విశాలమైన, స్వార్థరహితమైన ఆశయములకు పూనుకొన్నదనడం, అప్రామాణికమైనది." అని కూడా విమర్శించి యున్నాడు. "గురుతరములైన సమస్యలను వదలి, తళుకు బెళుకు ఆట వస్తువులతో ఆటలాడుకొంటున్నది కాంగ్రెసు." అని ఇతని తీవ్రవిమర్శ. "దేశములోని అనంతమైన ప్రజానీకము, ఏ మాత్రమూ స్పృశింపబడి యుండలేదు. శ్రామిక వర్గమే ఈ సమస్యకంతకును కీలకస్థానము. దేశములోని ఈ కార్మిక శక్తి నంతటినీ సంయోజనపరచి, సామాన్య ప్రజానీకంలోని వ్యక్తి విలువను, ఆంతరశక్తిని, సహస్రాధికం గావించడానికి యోగ్యమైన,సమర్థమైన, ఫలవంతమైన విధానాన్ని కాంగ్రెస్, అవలంబించవలసి యున్నది." ఈ విధంగా అరవిందఘోష్ గావించిన ఉద్ఘోషకు సమాధానంగా, తిలక్, ప్రబలోద్యమానికి పూనుకొన్నాడు. ఇంతవరకూ చల్లగా, ప్రశాంతంగా ప్రవహిస్తూ ఉండిన రాజకీయ ప్రవాహాన్ని, తిలక్ అరవిందఘోష్‌లు వేగవంత మొనర్చిరి.

లాన్స్‌డన్ ఇండియానుండి వెళ్ళిపోవడానికి పూర్వమే, నూతనోద్యమాల భావిసూచనలు గోచరమైనవి.దుర్భరక్షామములు, ప్లేగు, మతవిషయకమైన దొమ్మి కలహాలు చెలరేగి దేశాన్ని భయభ్రాంతం గావించినవి. అదే సమయములో, మత పునరుద్ధరణభావాలు ప్రవాహరూపంలో నలువైపులా వ్యాపించి, దేశాన్ని ముంచివేయసాగినవి. భారత ప్రాచీన సంస్కృతినిగూర్చిన అభిమానగర్వము, ఆత్మగౌరవము, ప్రజల హృదయాలను ఆవేశించినవి. వివేకానందుడు గావించిన దిగ్విజయంవల్ల భారతదేశమునకు గొప్ప భవిష్యత్తు ఉన్నదనే ఆశ ఉదయించింది. పశ్చిమదేశ సంస్కృతిపై ఏర్పడియుండిన ఆధిక్యభావం సడలిపోయింది.

ప్రపంచరంగంలో, సుమారు 75 ఏండ్లకాలం ప్రపంచ వ్యవహారాలలో ప్రబల నాయకత్వం వహించియుండిన బ్రిటనుకు, ఇతర దేశములతో స్పర్ధ ఏర్పడింది. తన ప్రాబల్యానికి భంగం కలిగే పరిస్థితులు తటస్థమైనవి. పారిశ్రామిక రంగంలో, అమెరికా జర్మనీలు బ్రిటనును అధిగమించి, ప్రపంచ వర్తక వాణిజ్యములలో, పోటీ చేయడానికి ఆరంభించినవి. జర్మనీ సార్వభౌముడైన, కెయిజర్ విల్‌హెల్మ్ II, యువకుడు, అధికోత్సాహుడు. ఇంతకాలము రాజ్యమును త్రిప్పుచుండిన బిస్మార్క్ ప్రాబల్యాన్ని త్రోసివేసి, ప్రభుత్వ పరిపాలనకు స్వయంగా పూనుకొన్నాడు. సముద్రాంతర రాజ్య విస్తృతికి ప్రయత్నిస్తున్న జర్మనీ, బ్రిటను ప్రాబల్యానికి ప్రతిబంధకంగా సిద్ధించింది. రష్షియన్ ప్రభుత్వ యంత్రము, దయాదాక్షిణ్యములను చూపక పశిఫిక్ సముద్రతీరం వైపు తూర్పుగా సాగివస్తూ ఉన్నది. కాని, పునరుజ్జీవనం గాంచిన జపాన్ అచ్చట రక్షక శక్తిగా నిలిచిఉన్నది. జపాను అభివృద్ధివల్ల ఏషియాలో నూతన వాతావరణం, ఏర్పడుతున్నదనే సూచనను యూరోపు రాజ్యాలు గుర్తించినవి.

1893 లో, ఎల్జిన్, ఇండియావచ్చి, నూతన పరిస్థితులను ఎదుర్కొన్నాడు. నూతన రాజకీయ నాయకులు, రంగములో ప్రవేశించి, పాతవారిని వెనుకకు నెట్టి

వేయడానికి సిద్ధపడుతూ ఉండిరి. వీరిలో బాలగంగాధర తిలక్ ప్రముఖుడు. తన జీవితాన్ని దేశసేవకు అంకితం గావించవలెనని, యువకుడుగానున్న కాలంలోనే, నిశ్చయించుకొనియుండెను. స్నేహితులతో కలిసి, ఒక పాఠశాలను, 'మహారాటా' అనే ఆంగ్ల పత్రికను, 'కేసరి' అనే మరాఠీ పత్రికను స్థాపించెను. ప్రజలకు రాజకీయ విషయములను బోధించి, ప్రజాభిప్రాయాన్ని సంయోజనపరచడం ఇతని లక్ష్యము. ప్రభుత్వ విధానాలను నిర్భీతిగా విమర్శిస్తున్న ఈ పత్రికలకు శీఘ్ర కాలంలోనే విస్తృత ప్రజాభిమతం సిద్ధించింది. 1890 లో ప్రభుత్వము నిర్మాణం గావింపబూనుకొన్న 'వివాహోచిత వయస్సు' శాసనాన్ని (Age of consent Bill) వ్యతిరేకించడంతో, తిలక్‌ను, దేశప్రజ గుర్తించింది. హిందువుల మత సాంఘిక విషయాలలో ప్రవేశించడానికి విదేశీయ ప్రభుత్వానికి హక్కు లేదని ఇతడు వాదించినాడు. 1893 లో, గోరక్షణోద్యమాన్ని ప్రారంభించెను. ప్రభుత్వం, ముస్లిములను ప్రోత్సహించి, వారికి సహాకరిస్తున్నదనే అనుమానం ఈ ఉద్యమ ప్రారంభానికి హేతువు.

అదే సంవత్సరమే, ప్రాచీన మహారాష్ట్ర సంప్రదాయమైన గణపతి ఉత్సవాన్ని పునఃప్రతిష్ఠించి, దానిని రాజకీయ సంస్థగా తీర్చెను. ఉపన్యాసాలు, భజనసంఘాలు, ఉత్సవాలు ప్రారంభమైనవి. రాజనారాయణబోసు, అతని స్నేహితులు, ఇంతకుపూర్వం బెంగాలులో ఏర్పరచిన 'హిందూమేలా' లక్ష్యాను లతో, తిలకు ప్రారంభించిన గణపతి ఉత్సవలక్ష్యాలు సదృశములైనవి. రాజకీయము లలో పాల్గొంటున్న విద్యావంతుల ప్రభావములోనికి ప్రజానీకాన్ని తెచ్చి, దేశ భక్తిని వారిలో మేల్కొల్పి, క్రమశిక్షణను, ధైర్యాన్ని వారికి కలిగించడం వీరి లక్ష్యము. 1895 లో, తిలక్, శివాజీ ఉత్సవాన్ని, ప్రారంభించెను. వీరభావాన్ని, శౌర్య సాహసాలను ప్రజలలో పునరుజ్జీవింపజేసి, పర ప్రభుత్వ దాస్యశృంఖలాల నుండి బైటపడవలెననే ఉత్కంఠను వారిలో మేల్కొల్పడం, శివాజీ ఉత్సవ ప్రయోజనము.

ఈ రెండు ఉత్సవాలూ ప్రజలలో అమితమైన ఉత్సాహాన్ని కలిగించి, వారిలో రాజకీయ భావాలను ప్రచారము గావించినవనడం వాస్తవమే. గ్రీకు దేశములో, జరుగుచుండిన ఒలింపియన్, పిథియన్ ఉత్సవాలు ప్రజలను ఉత్సాహ పరచి వారిలో ఐక్యమును కూర్చినట్లే, ఈ ఉత్సవాలుకూడ తత్ప్రయోజనాన్ని సాధించునని, తిలక్ అభిప్రాయము. ఒక ఉత్సవము హిందూ మతమునకు సంబంధించినది. రెండవది, మహారాష్ట్రుల ప్రాచీన ఉచ్ఛ్రియకాలాన్ని ప్రజల స్మరణకు తెచ్చునట్టి మహావీరపూజ. కనుక, ఈ రెంటినీ ఆధారంగా చేసుకొని, ప్రజలలో అత్యుత్సాహాన్ని కలిగింపగలిగినాడు, తిలక్.

తిలక్ జాతీయభావ నిష్ఠాపరుడనడం, నిస్సందేహమైన విషయము. విభజన విషయములో జరిగిన ఆందోళనకుపూర్వము, తర్వాతకూడా, అతడు గావించిన దేశసేవ ఇందుకు తార్కాణము. కాని, హిందువులలో రెనడేవంటి ఉదార వాదులు, ముస్లిములు, ఇతని కార్యక్రమాన్ని గురించి, చేసిన విమర్శకూడా అర్థ

రహితమైనది కాదు. రాజకీయాలతో, మతాన్ని ముడిపెట్టడం, ఆపదకు మూలమౌతుంది. తదనంతరకాలములో జరిగిన ఉదంతాలే దీనికి నిదర్శనాలు. ఏది ఎట్లున్నా, అనేక మతసంఘాలతో కూడియున్న దేశములో ఇట్టి ఉద్యమము, దురభిప్రాయాలకు అవకాశం, కలిగిస్తుందనడములో సందేహము లేదు.

ప్రజల దేశభక్తిని మేల్కొల్పడం అతని ప్రధానాశయము. ఆ ప్రయత్నము సఫలమయింది. ప్రజల మనస్సులపై తిలకుకు ప్రాబల్యం ఏర్పడింది. 1896, 97 లలో, క్షామములుప్పతిల్లి మహారాష్ట్ర దేశాన్ని తీవ్రబాధలకు గురిచేసినవి. 1897 లో, ప్లేగు వ్యాపించింది. వీటివల్ల అపారమైన ప్రజానష్టం కలిగింది. ప్లేగు కమీషనరుగా ఉండిన, ర్యాండ్ (Rand) దుర్జన ప్రవృత్తి కారణంగా, ఎవరో అతనిని హత్యగావించిరి. అతని సహచరుడైన లెఫ్టినెంటు ఐరెస్టుకు (Ayerest) కూడా ఆ గతే పట్టింది. తిలకు రచనలు ఈ హత్యలకు కారకములనే అభియోగ మతనిపై మోపి, ప్రభుత్వం 18 నెలల కఠిన కారాగార శిక్షను విధించింది. రాజకీయ కార్యక్రమంలో ఇతనికి సహాయకులుగా నుండిన 'నాథు' సోదరులను, ప్రభుత్వం ఖైదుచేసి, ప్రాకృతిక నియమనం క్రింద (Absolute Regulation) నిర్బంధములో నుంచిరి. కాని కొంతకాలానికి, హత్యకు కారకులైన దోషులు పట్టుబడి ఉరిశిక్షకు గురియైరి.

తిలకును కారాగారంలో బంధించి ఉంచడం వల్ల ప్రభుత్వము పట్ల ద్వేషము నిరసన భావము, దేశమంతటా వ్యాపించినవి. బెంగాలీ పత్రిక ఈ విధంగా వ్రాసింది. "కారాగారంలో ఉండినందువల్ల తిలకుకు ప్రజాగౌరవం ఏ మాత్రమూ, తగ్గదు. అతడనుభవించిన కారాగార శిక్ష వల్ల ప్రజాభిమానం, ఇంకా వృద్ధి చెందుతుంది. ప్రజాసేవకు అతని శక్తి అభివృద్ధి చెందుతుంది. ఏ మాత్రమూ కళంకము లేనివాడై కారాగారము నుండి బైటికి వస్తాడని ప్రజల అభిప్రాయము. ఇంతకంటెను శోచనీయమైన తప్పిదాన్ని, ఇంతవరకూ, ఏ ప్రభుత్వమూ చేయలేదు. ప్రభుత్వం పట్ల ప్రజలకుగల నిరభిమాన ప్రవృత్తిని అణచి వేయడానికి ప్రయత్నించి, అంతకంటెను విస్తారమైన ద్వేషాన్ని దేశములో కలుగజేసింది ప్రభుత్వము."

కాంగ్రెసు అధ్యక్షుడైన సర్ శంకరన్ నాయర్, ఈ విధంగా వ్రాసినాడు. "తన అభీష్టాను సారంగా సంకల్పించుకొని, ప్రభుత్వము, ప్రజల వ్యక్తి స్వాతంత్ర్యాన్ని, ఆస్తిని హరించి వేయగలదు. కాని, చర్చా స్వాతంత్ర్యాన్ని, నిరోధించే కార్యము అత్యంత శోచనీయమైనట్టిది."

ఇట్టి పరిస్థితిలో, కర్జన్ ప్రభువు ఇండియా గవర్నర్ జెనరల్‌గా దేశములో ప్రవేశించెను. ఆక్స్ఫర్డు విశ్వవిద్యాలయములో శిక్షణ పొంది వచ్చిన మేధావి కర్జన్. అసాధారణమైన శక్తి సామర్థ్యములు కలవాడు. వ్యవస్థా నిర్మాణములో సామర్థ్యము, కార్యనిర్వహణములో అక్షయమైన శక్తిసంపద కలవాడు. విస్తారమైన అధ్యయనం వల్లను, ఆసియా దేశముల పర్యటనం వల్లను తన కర్తవ్య నిర్వహణకు ఆవశ్యకములైన జ్ఞానాన్ని సంపాదించి యున్నవాడు కర్జన్ ఇండియా

ప్రభుత్వ కార్యాలయములో అపర కార్యదర్శిగా పనిచేసి, ఇండియా పరిపాలన సమస్యలతో పరిచయమున్న వాడు. సహజసిద్ధమైన శక్తి సామర్థ్యములు, దీక్షతో సంపాదించుకొన్న విజ్ఞానము – ఇతనికి ఉండడం వల్ల, ఇతని పదవీకాలం విజయ వంతంగా సాగిపోతుందని, అందరూ ఊహించిరి. కాని, దురదృష్టం వల్ల ఆశించిన దానికి, సూటిగా వ్యతిరేకములైన పరిస్థితులు ఏర్పడెను. దీనికి కారణములు నిగూఢములైనవి కావు. 19 వ శతాబ్దపు కడపటి దశలోని అంతర్జాతీయ రాజకీయ రంగాన్ని కర్జన్ పరిశీలించినాడు. బ్రిటీషు సామ్రాజ్య వీధిపై మేఘములు వ్యాపిస్తూ ఉండడం గమనించినాడు. ఆంటిని పటాపంచలు గావించడం, తనకు దైవం విధించిన కర్తవ్యమని భావించినాడు. తనకత్యంతము ప్రీతికరమైన బ్రిటీషు సామ్రాజ్యంపై, దృష్టి సారించిన శత్రువును నిర్జించే, రక్షకుడు తానే, అని భావించుకొని, దానికి సిద్ధపడినాడు.

అత్యంతము ఆత్మదురభిమానియై కర్జన్ ఇండియాలో ప్రవేశపెట్టిన విధానములన్నిటికీ, సామ్రాజ్య మూలాంధారాన్ని బలపరచడమే లక్ష్యమయింది. పరిపాలన వ్యవస్థ దుర్బలమై ఉండడానికి, కారణం సర్వస్వమూ అధికారుల అస మర్థత, సామ్రాజ్యచైతన్య లోపము, అని, ఇతని నిశ్చయము. కార్యారంభశక్తి, వ్యవహారనిర్దేశక శక్తి ప్రభుత్వహస్తములనుండి, జారిపోవుచుండినవి. పరిపాలన యంత్రాంగంలో బిగువు తప్పింది. అధమ జాతులవారిపై ఆధిపత్యం వహించ డానికి ఆవశ్యకములైన రక్షకభావము, జాగ్రత, న్యాయము, ఉత్తమవివేచన,– మొదలైనవి ప్రభుత్వాధికారులలో, లోపించియున్నవి. కనుక, పరిపాలన వ్యవస్థకు నూతనచైతన్యం కలిగించడం ఆవశ్యకమని, కర్జన్, నిశ్చయించినాడు.

తాను భారతదేశముపై పునఃప్రతిష్ఠ గావింపనున్న రక్షక బాధ్యత, భారతీయుల ఆత్మగౌరవభావమునకు, స్వయంపరిపాలన కాంక్షకు విరుద్ధమైనదని, కర్జన్, గ్రహించలేకపోయెను. కర్జన్ వహించిన ఈ ప్రవృత్తికి, భారత ప్రజల రాజకీయాభ్యర్థనకు గల అంతరం అగాధమై ఉన్నందున, పరస్పర దురభి ప్రాయాలు, ఘర్షణలు ఏర్పడడం, అనివార్యము. కర్జన్‌చేసిన ప్రతికార్యమూ, మంచిదైనా, చెడ్డదైనా కూడా, జాతి ఆధిక్యము ఆధారంగా జరిగినది కావడంవల్ల భారతీయ భావానికి విరుద్ధమయింది. కలకత్తా పురపాలక సంస్థను, విశ్వవిద్యాల యాలను ప్రభుత్వాధికారమునకు లోబరచడం దేశీయవిద్యావంతులు అసత్య వాదులని అధిక్షేపించడం, ఉన్నత పదవుల బాధ్యతలను నిర్వహించడానికి భారతీయులు యోగ్యులుకారని చెప్పడం, భారత జాతీయకాంగ్రెసును గూర్చి అవమానకరంగా మాట్లాడడము, అన్నిటికంటెను ముఖ్యంగా, ప్రజల సంకల్పము నకు విరుద్ధంగా దౌర్జన్యంతో బెంగాలును విభజించడము,– ఇత్యాది చర్యలవల్ల వైయక్తికంగా అతనిపై ప్రజలకు అనిష్టభావమేర్పడడం మాత్రమేకాక, విద్యా వంతుల సంఘంలోని అధికభాగం వారు బ్రిటీషు పరిపాలనకు శాశ్వతంగా వ్యతి రేకులైపోయిరి. కాని, బెంగాలు విభజనవల్ల, జాతీయ స్వాతంత్ర్య సంఘర్షణలో నూతన అధ్యాయం ప్రారంభమయింది. ఈ విషయం తరువాతి సంపుటిలో వర్ణింప బడుతుంది.

# 13
# సాహిత్య పునరుజ్జీవనము

సాంఘిక జీవితాన్ని చిత్రించేది సాహిత్యము. ప్రజల అభీష్టాలను, కాంక్షలను, సంశయాలను చిత్రిస్తుంది, కనుక, సమాజంలో జరిగిన పరివర్తనలను ప్రతిఫలింపచేసే అమూల్యమైన, చరిత్ర సాహిత్యము. పందొమ్మిదో శతాబ్దంలో భారత సమాజంలో కలిగిన సాంఘిక, వైజ్ఞానిక పరివర్తనముల చరిత్ర, మనకు ఆనాటి వివిధ భాషల సారస్వతములో లభిస్తుంది. సమాజ జీవితములో జరుగుతూ ఉండిన విప్లవానికి విశ్వసనీయమైన సాక్ష్యము, ఆనాటి సారస్వత రచనలు ప్రదర్శిస్తాయి.

పాశ్చాత్య సంఘటనవల్ల దేశజీవితంలో కలిగిన పరిణామాలను మొదటి సారిగా ప్రదర్శించింది, బెంగాలీ సారస్వతము. క్రమంగా దేశంలోని తక్కిన భాషలుకూడా, పాశ్చాత్య ప్రభావానికి లోనై, తత్సదృశములైన అభివృద్ధిని గాంచినవి; బ్రిటీషు ఆధిపత్యము ఇండియాలో ఏర్పడినందువల్ల, అన్నివర్గాల ప్రజలు తత్ప్రభావ ప్రాబల్యాలకు లోనైనప్పటికీ, సమాజమందలి అన్నివర్గాలలోను కలిగిన మార్పులు సమానములుకావు. ప్రజానీకం విషయములో, మధ్యయుగాల వ్యావసాయక వ్యవస్థ, పారిశ్రామిక వ్యవస్థ, అనేకవిధములైన మార్పులకు లోనయినవి. ఐనా, సాంఘికాచారములలోను, మత విషయక ప్రవృత్తులలోను, అభ్యుదయ పరివర్తనం జరగలేదు. సామాన్య ప్రజలు నిరక్షరాస్యులై యున్నందువల్ల, ఆ కాలములో జరిగిన వైజ్ఞానిక ప్రవృత్తులు వారి నేమాత్రమూ స్పృశింపలేదు. చిరకాలంగా వారనుసరిస్తూ ఉండిన వృత్తులలోగానీ, వస్తూత్పత్తి పద్ధతులలోగాని, మార్పులేవీ సిద్ధింపలేదు. ఆర్థిక వ్యవస్థ స్తబ్దమై నిలిచినది. ప్రజల జీవన విధానములు కాని, ప్రజా సాహిత్యంకాని, సంప్రదాయ విధానములను విడువలేదు.

మధ్యతరగతుల వారు మాత్రం, నూతనములైన ఆర్థిక వైజ్ఞానిక పరిసరములలో అభివృద్ధి చెందుతూ వచ్చిరి. ఈ వర్గములోని యువకులు, అధిక సంఖ్యలో, ఆంగ్ల విద్యాభ్యాసానికి కుతూహలంతో, ఆసక్తితో, పూనుకొంటూ ఉండిరి. భావగ్రహణకు ఆతురములైయున్న వారి మనస్సులు, నూతన భావాలను, ఇతోధికంగా గ్రహింపసాగినవి. మధ్యయుగ కాలములకు అజ్ఞాతములైన నవ్యభావాలు వీరి మనస్సులలోపడి, అంకురించి, పర్యాలోచన ప్రవృత్తిని మారుస్తూ వచ్చినవి. నూతన జీవనపద్ధతులు నూతన విద్యా విధానము,- ఈ రెంటియొక్క ప్రభావము మధ్యతరగతి సంఘాన్ని ఆధునికంగా మార్చినవి. ఈ నూతన సంఘముయొక్క

మనోధర్మ వైవిధ్యాన్ని, అభిప్రాయ వైవిధ్యాన్ని ఆనాటి సాహిత్యము, తనలో ప్రతిఫలింప జేసింది.

ఈ విధంగా పరిణమించిన పాశ్చాత్యీకరణంవల్ల, మధ్య తరగతులవారికీ, సామాన్య ప్రజానీకానికీగల అంతరం, విశాలమయింది. ఇది నూత్నమైన సంఘటన కాదు. సైన్యము, కులీనవంశాలు, విద్వాంసులు,- వీరితో కూడిన సమాజ వర్గానికి, వర్తకులు, కార్మికులు, రైతులు,- వీరితోకూడిన సమాజవర్గానికి అంతరము సిద్ధించియుండినదని, మొదటి సంపుటిలో వివరింపబడియున్నది. ఇట్టి ఆర్థిక సంబంధమైన విభేదం ఉండినప్పటికీ, పూర్వం అన్ని వర్గాలకూ సాంస్కృతికంగా సుసంయోజితమైన ఐక్యము ఏర్పడియుండినది. ఒక జాతికిచెందిన వేర్వేరు వంగడములకు గల భేదముల వంటివి ఈ భేదములు. కాని, ఈ నూతన సమాజ విషయములో ఒక విలక్షణమైన అంశముకలదు. పాశ్చాత్య దృక్పథమును అలవరచు కొన్న మధ్య తరగతులవారికిని, ప్రాచీనపు అచ్చులలో పోసిన జీవనపద్ధతులలో మునిగియున్న ప్రజానీకానికిని, గల దూరం విశాలమయింది.

## I. బెంగాలీ సారస్వతము

బెంగాలీ భాషా సారస్వతముల అభివృద్ధిలో ఈ ద్వైవిధ్యం స్పష్టంగా గోచరమౌతుంది. పాశ్చాత్య భావాల ప్రభావం ప్రసరింపకపూర్వం, విద్వాంసులు, సంపన్నులు, రచిస్తూ ఉండిన సాహిత్యమునకు, సామాన్య ప్రజల సాహిత్యము నకు గూడా, వర్ణనీయ వస్తువులు, రచనాలక్షణములు సదృశములైనవే. వస్తువు, రూపము,- అను విషయములోని భేదములు ఎక్కువ భిన్నములు కావు.

రాజసభలను, జమీందారులను ఆశ్రయించి, యుండిన కవులు కులీన వర్గ మునకు సంబంధించిన సంప్రదాయ కావ్యములను రచించేవారు. పద్దెనిమిదో శతాబ్దంలో, భాషా సంస్కృతులను పోషించిన రెండు కేంద్రాలు బెంగాలులో ఉండి నవి. రాజా కృష్ణచందరాయ్ పరిపాలించుచుండిన, నాడియా (కృష్ణగర్), ఒక కేంద్రము. రెండవది ఢక్కాలోని విక్రమ పురము. ఈ సాహిత్యకేంద్రానికి పోష కుడు రాజా రాయ్ వల్లభ్. భరతచంద్రకవి, నాడియారాజాకు ఆశ్రితుడు. జయ నారాయణకవి, అతని సోదరుని పుత్రికయైన ఆనందమాయి, రాజా రాయ వల్లభుని ఆశ్రయించినవారు. 'విద్య, - సుందరుల' ప్రసిద్ధగాథను 'ఆనందమంగళ' అనే కావ్యంగా రచించి, భరత చంద్రకవి ప్రసిద్ధిబొందెను. హరిలీలా కావ్యాన్ని రచించి, జయనారాయణకవి కీర్తిగాంచెను. ఉదాత్తశైలిలో సంప్రదాయ కావ్యా లను రచించిన కడపటి కవులు వీరు.

'కవివలులు' అనే గేయ రచయితలు, గేయనాటకములను, యాత్రలను, భక్తిగీతములను, కీర్తనలను, మరి యితర తప్పా, పంచి, ధావ్, మున్నగు నీతి బోధక శతకాలను రచించిన కవులు, ప్రజాకవులు. వీరి రచనలన్నీ సామాన్య ప్రజలకుద్దేశింపబడినవి. పద్దెనిమిదో శతాబ్దములో కవివలుగా ప్రసిద్ధిచెందినవారిలో, రామప్రసాద్, హరుఠాకూర్, హరేకృష్ణ దీర్ఘాంగి, రామబాసు, నిత్యానంద

వైరాగి, ముఖ్యులు. యాత్రా రచయితలలో కృష్ణకమల గోసాయి ప్రసిద్ధుడు.

సాధారణ ప్రజాకుటుంబములలోని కష్టసుఖాలు, సంతోషదుఃఖాలు, - ఇత్యాదులు ఈ గేయాలలోని ఇతివృత్తములు. భర్తయెదుట సిగ్గుపడుతు బదులు మాటాడక నిలబడియున్న నూతన బెంగాలీ వధువు, పిల్లలపైగల తల్లి మమత, గృహస్థ జీవితములోని కష్ట సుఖాలు, పండుగ దినముల సంతోషము, ఆత్మ త్యాగము, ఆత్మార్పణము, జీవిత దుఃఖసహనము, మొదలైన మానవ ప్రకృతులను చిత్రించిన కథలు, లోకాంతర జీవితమునుగూర్చిన అభీష్టము, విధి బలీయమనెడి విశ్వాసము, మొదలైన హృదయ ప్రవృత్తులు ఈ గేయాలలో వర్ణితములైనవి.

ఈ రెండు వర్గాల కవుల రచనలకుకూడా, ఇతివృత్తం, సదృశమైనదే. మత విషయాలకు ప్రాధాన్య మెక్కువ. వేదాంతము, నీతి బోధకములైన కథలు, పౌరాణిక గాధలు, మహాపురుషుల జీవితాలు, రాధాకృష్ణులకు సంబంధించిన ప్రణయగాథలు, ఇత్యాదులు సాధారణంగా కవులు గైకొన్న ఇతివృత్తములు. మానవ జీవితములోని సుఖదుఃఖాలు, వైషయిక ప్రణయానికి సంబంధించిన వ్యత్యయములు, సంపదయొక్క అనిత్యస్వభావము, - ఇత్యాది లౌకిక విషయములుకూడా కొన్ని కావ్యాలకు ఇతివృత్తములైనవి. ఈ రెండు వర్గాల లోని కవులూ ఒకే ఇతివృత్తములను, భిన్న భిన్న కావ్యాలుగా చిత్రించియున్నా, రచనా విధానంమాత్రం ఒక అచ్చులోనిదే. స్త్రీ పురుష సంబంధం దైవ నియమితమైనది, వారి జీవితం దైవ సంకల్పముపై ఆధారపడియున్నది, అని వారి భావము. దేవతల విషయములో గావించిన అపరాధానికి వెంటనే తగిన శిక్షణ జరుగుతుందనీ, పశ్చాత్తాపంవల్ల భగవంతుడు ప్రీతుడై మానవుల అభీష్టాలను సిద్ధింపచేస్తాడనీ, వీరి విశ్వాసము. జీవితం అశాశ్వతమైనది కనుక, మానవుడు సుఖదుఃఖాలను, నష్టాలను ఓర్పుతో సహించియుండవలెననీ, సంపూర్ణమైన భక్తి శ్రద్ధలతో ఆత్మార్పణ గావించుకోవడంవల్ల భవబంధములనుండి విముక్తుడౌతాడనీ, కవులు తమ రచనలలో బోధిస్తూ వచ్చిరి.

మానవుల ప్రణయ జీవితము విప్రలంభాలతోను, కష్టాలతోను, సాగి, కడపట నాయికా నాయకుల సమాగమంతో సుఖాంతమయ్యేవిధంగా, ఇతివృత్తములు పోషింపబడినవి. ఈ కాలపు కవులు ప్రణయ సన్నివేశాలను, ఇంద్రియ లోలుపతను, ప్రదర్శించేటట్లుగా, స్వేచ్ఛగా వర్ణించియున్నారు. స్త్రీ పురుషుల సంబంధంపట్ల, నైతిక ప్రవృత్తిని పాటింపలేదు. కపటోపాయాలు, వంచనలు, వాగ్దాన భంగము, అవినీతికరమైన ఇంద్రియతృప్తి - ఇత్యాదులు దోషములుగా వీరు పరిగణింపలేదు. ఈ ప్రయత్నముల సాఫల్యముతో ఇతివృత్తము, అంతము కావడమే కవులు ఉద్దేశించిన కావ్యప్రయోజనము. ఇక, సంఘంపట్ల వ్యక్తికిగల బాధ్యత, తన కుటుంబానికి, తన కులానికి పరిమితమైయుండినది. వీటికి వెలుపలనున్న మానవ సంఘానికికూడా, వ్యక్తిబాధ్యత కొంత కలదని, అంగీకరింపబడింది. క్రమబద్ధమైన శ్రేణీ రూపములో సమాజం ఏర్పడియుండడము, సామంత

పద్ధతి, – ఆ కాలపు వ్యవస్థలు. ఒక వర్గానికి మరియొక వర్గానికి లౌకిక వ్యవహార ములలో పోటీ లేనందున, వర్గ వైషమ్యం తక్కువ. వర్గాలమధ్య ఈర్ష్యలు, ఘర్షణలు లేవు. లౌకిక వ్యవహారముల విషయములలో, రాజుయొక్క అధికా రాన్నీ, మత విషయములలో పురోహితుని అధికారాన్నీ, ప్రజలు మారు మాటాడక అంగీకరించి, వాటికి బద్ధులై యుండిరి. పురుషుని ప్రయోజనార్థమై జీవితాంతంవరకు కష్టించడం స్త్రీల బాధ్యత. సంఘములో వారికిగల స్థానమట్టిది. 'స్రీమంత సౌధాగర్' కథలో, లాహాణభర్తయైన ధంపతి, ఖుల్లానా అనే యువ తిని ప్రేమించి వివాహం చేసుకొంటాడు. ఈ రెండవ భార్యకు సేవచేయడానికై మొదటి భార్యను నియమిస్తాడు. భక్తితో భర్త ఆజ్ఞను శిరసావహిస్తుంది. కాని, కొంతకాలానికి పరిచారిక గావించిన దుర్బోధతో లాహాణ, తన ప్రవృత్తిని మార్చుకొంటుంది. పరిచారిక ప్రభావము తగ్గిపోవడము, లాహాణ పశ్చాత్తాపానికి లోనుకావడము, మరల భర్త అనుగ్రహానికి పాత్రము కావడము, అను ఉదంతా లతో కథ ముగుస్తుంది.

నాయికా నాయకులుగా చిత్రింపబడిన వారు వ్యక్తులు కారు ; సంఘము లోని వ్యవస్థలకు నిదర్శనములు. పూర్తిగా దుర్జనులైన వారిగా లేదా సమగ్ర సజ్జనులైన వారిగా ఈ పాత్రలు చిత్రింపబడినవి. సుగుణ దుర్గుణాల వైవిధ్యము, కలయిక, ఈ పాత్రల చిత్రణములో కానరావు. శ్రేష్ఠమైన సౌజన్యము, అత్యంత మైన దుర్జనత్వము, అనెడి రెండు భేదాలు మాత్రమే కవులు గ్రహించినవి. ఆదర్శప్రాయమైన చిత్రాలను రచించే ప్రవృత్తి, ప్రకృతి వర్ణనలలో కూడా కన బడుతుంది. వసంత ఋతు ఆవిర్భావం సంతోషకాలము. పుష్ప వికాససమృద్ధి, కోకిల పాటలు, భృంగారావము, పుష్పసుగంధ ప్రసారకమైన మలయానిలయం, అశ్వర్థవృక్ష వికసనము, చిగుళ్లతో శోభాయమానమై యున్న మామిడి చెట్లు– ఇత్యాది ప్రకృతి దృశ్యాలు భావనాత్మకంగా వర్ణింపబడినవి. అలోల్ చిత్రంలోని విషయాలనే గ్రహించి, భరతచంద్ర అలంకార భూయిష్ఠమైన భాషలో, శ్రావ్య మైన కవిత్వాన్ని రచించినాడు. ఈ చిత్రాన్నే కొద్ది మార్పులతో ఇతర కవులు కూడా వర్ణించియున్నారు.

ఈ కవుల భావనాదృష్టి ఆంతరంగికమైనది; కనుక ఊహా ప్రధానమైనది. ప్రకృతికి అతీతములైన విషయములు, భావనాత్మకాదర్శాలు, వీరి అభీష్ట వస్తు వులు. కాబట్టి, వ్యక్తిత్వము, వాస్తవికతా వీరి లక్షణములు కావు. పద్దెనిమిదో శతాబ్దపు కడపటికి, నిషిద్ధములు, అసభ్యములు, నీచములు, ఐన విషయవర్ణనలకు కవిత్వం దిగజారిపోయింది.

రాజాస్థాన కవుల రచనలలోనూ, ప్రజాకవుల రచనలలోనూ కూడా గోచర మగుచున్న భేదం కేవలం శబ్ద విన్యాసమునకు చెందినది మాత్రమే. భరతచంద్ర, జయనారాయణ కవులిద్దరు విద్వాంసులు. వారి కవిత్వములో సంస్కృత ప్రాబ ల్యము, సమాస జటిలతా, సిద్ధించినవి. సంస్కృత ప్రయోగాలను వివేచనతో ప్రయోగించిన సందర్భాలలో వర్ణిత భావాలకు గాంభీర్యము, శక్తి యేర్పడినవి.

తక్కిన భాగాలలోని రచన ఆడంబరమునకు, పాండిత్య ప్రకర్షకు ఆకరమయింది.

భరతచంద్రుని అనంతర కాలం ప్రతిభా దరిద్రమైనది. ఆస్థాన కవులలో కాని, ప్రజాకవులలో కాని, భరతచంద్ర, జయనారాయణ, రామ్ ప్రసాదుల వంటి ప్రతిభావంతులు, లేరు. భావనాశక్తి క్షీణించింది. రచనాశక్తి కుంటువడింది. ప్రాచీన సంప్రదాయ కవితా ప్రవంతి కలుషితమౌతూ, సన్నగిల్లుతూ వచ్చింది. పాశ్చాత్యుల పరిపాలనకు బెంగాలు, లోబడి పోవడం ఆఘాతమై, కవితాశక్తి చైతన్యమును గోల్పోయింది.

ఈ విధంగా ప్లాసీ యుద్ధానంతరం అర్ధశతాబ్ద కాలం బెంగాలీ సాహిత్యం క్షీణించింది. భరతచంద్రుని తరువాత వచ్చిన, 'కామిని కుమార' రచయితయైన కాళీ కృష్ణదాసు, 'జీవన తారా' రచయితయైన వసిక చంద్రరాయ్-మున్నగు వారు పూర్వపు కావ్యాలలోని ఇతివృత్తాలనే, అదే రచనా పద్ధతినే అవలంబించి, కావ్యాలను రచిస్తూ వచ్చిరి. కాని, భరతచంద్రుడు ప్రదర్శించిన భావనాదృష్టి, భావౌన్నత్యము వీరికి లేకపోయినవి. కాని, వీరిభాష ఎక్కువ సరళమైనది. రచనా నైపుణ్యం కూడా అధికమే. నిషిద్ధమైన ప్రణయగాథలకు ప్రాధాన్యమిచ్చిన రచనలచే, లౌకిక సారస్వతాభివృద్ధికి త్రోవచూపినారు.

'తప్పా'లను రచించిన రామనిధి గుప్త, శ్రీధర కథక్, రామ్‌బాసూ కవివాల్, దాశరథి రాయ్, కృష్ణకమల గోస్వామి, 'ధాపు' లను రచించిన మధుకాణ్, మున్నగు ప్రజాకవులు, పల్లెలలోను, పట్టణాలలోను, తమ రచనలను చదివి, వినిపించి, సామాన్య ప్రజలను రంజింప జేసేవారు.

## II. బెంగాలీ సారస్వతారంభము

19 వ శతాబ్దారంభము మొదలుకొని, బెంగాలీ సారస్వతములో నూతన వ్యవస్థ ఏర్పడుతూ వచ్చింది. నూతన సారస్వత యుగం ప్రారంభమయింది. ఇంత వరకు, సారస్వత రంగంలో, ఏకైక స్థానాన్ని ఆక్రమించి యుండిన పద్యకావ్య రచనకు ప్రాధాన్యం తగ్గిపోయింది. ప్రజానీకాన్ని ఉత్తేజనపరచే శక్తి లేనందు వల్ల ఈ కావ్యాలకు ప్రయోజనం లేకపోయింది. ఉదంతాలను, సమాచారాలను ప్రసారం గావించడానికి సాధనమైన వచన రచన వేగంగా అభివృద్ధి చెందుతూ వచ్చింది. యాభై సంవత్సరముల కాలావధిలో భావ వ్యక్తీకరణమునకు సమర్థమైన నమ్మమైన సుసాధనంగా, సిద్ధించింది వచనరచన. ఈ వచన రచనాభివృద్ధి వల్ల, ప్రజల యోచన ప్రక్రియ కూడా మార్పు చెందింది. మధ్యయుగాల భావాలు వెనుకబడినవి. ఆధునిక భావాలు ప్రజల మనస్సులను ఆక్రమిస్తూ వచ్చినవి.

వర్తక వ్యవహారములకు ఉపయుక్తమవుతూ ఉండిన పారసీక శబ్ద ప్రధానమైన బెంగాలీ వచనము ; సూర్య పురాణ, దేవ సమరతంత్ర, సహజీయ విభాగాలు,-మున్నగు మత గ్రంథములలో వాడియున్న పురాతన వచన రచన ; న్యాయశాస్త్రము, తర్కము, ఇత్యాదులు రచింపబడిన వచనము-ఈ విధమైన వచన భేదాలు పూర్వములో ఉండినవి. కాని, గంభీరములైన విషయములను,

విజ్ఞాన విషయాలను, రచించడానికి తగిన వచనరచన పందొమ్మిదో శతాబ్దములో ప్రారంభమైనది.

కంపెనీ వారి నియమనాలను బెంగాలీలోనికి అనువదించవలసిన సందర్భములో ఇట్టి వచనమునకు ఆవశ్యక మేర్పడింది. దివానీ అదలత్, న్యాయస్థానాలలో ఉపయోగించడానికై న్యాయపరిపాలన నియమనాలు, జొనాథన్ డంకన్, అధీశుణలో 1785 లో, అనువదింపబడినవి. దండన్యాయ ప్రక్రియా సంహిత (criminal code) నీల్ బెంజమిన్ ఎడ్మన్‌స్టన్, అధీశుణలో అనువదింపబడింది. (1791). కారన్ వాలీస్ సంహితను, హెన్రీపిట్స్ ఫాస్టర్ బెంగాలీ భాషలోనికి అనువదింప జేసెను (1793).

ఫోర్ట్ విలియమ్ కళాశాల స్థాపింపబడిన తరువాత, దేశభాషలను అభివృద్ధి గావించే ప్రయత్నం ప్రారంభమయింది. సివిల్ సర్వీస్ ఉద్యోగాలను నిర్వహించే ఆంగ్ల యువకులకు న్యాయశాస్త్రము, నీతి, న్యాయ పరిపాలన పద్ధతి, విజ్ఞాన శాస్త్రము, అనే ఇతర విషయాలతో పాటు, దేశ భాషలను నేర్పడము, ఈ కళాశాలను, స్థాపించడంలో ప్రయోజనము. దేశ భాషలలో తగినంత సామర్థ్యాన్ని సంపాదించి ఈ యువకులు ఆ భాషలలో పండితులైన వారి యెదుట తమ జ్ఞానాన్ని ప్రదర్శించేవారు.వివిధ విషయాలను దేశ భాషలలో వీరికి బోధించడానికై, ఆ యా భాషలలో ఈ విషయ గ్రంథాలను రచించడానికి కళాశాల పూనుకొన్నది. డా. గిల్‌క్రిస్ట్, విలియం క్యారీ,-ఈ గ్రంథములను రచింపజేసే బాధ్యతను వహించిరి. హిందూస్థానీ, పారసీక, అరబ్బీ భాషా పుస్తకాల రచనకు గిల్‌క్రిస్ట్ పూనుకొన్నాడు. బెంగాలీ పుస్తకాల రచనకు, ఇతర భాషా పుస్తకాలకు క్యారీ బాధ్యత వహించెను. వీరి అధీశుణలో పనిచేయడానికి పండితులు, మున్షీలు, నియమింపబడిరి.

పాఠ్య గ్రంథాలను బెంగాలీ భాషలో రచించిన విద్వాంసులలో మృత్యుంజయ విద్యాలంకార్, రామరామ బాసు, చందీచరణ మున్షీ, రాజీవలోచన ముఖోపాధ్యాయ,-అనేవారు ప్రసిద్ధులు. ఈ రచయితలలో రెండు వర్గములుండినవి. పండితుల వర్గమొకటి ; మున్షీల వర్గం రెండవది. పండిత వర్గంవారు ఆడంబరమైన సంస్కృతాన్ని అధికంగా ఉపయోగిస్తూ వచ్చిరి. మున్షీలు పారసీక భాషా ప్రయోగాలను ఎక్కువగా వాడుతూ వచ్చిరి. అధీశుకులైన వారు సంస్కృత భాషాభిమానులైనందున, బెంగాలీ సారస్వతం చాలకాలం వరకు సంస్కృత భాషా ప్రాబల్యానికి లోనై యుండినది. కడపటికి, పండిత భాషకు వ్యవహార భాషకు ఒక విధమైన సమన్వయం సిద్ధించి, మధ్యస్థమైన భాషా విధానము, సారస్వత రచనకు తగిన సాధనమయింది. అలంకారాలకు, అతి పాండిత్యానికి, శబ్దాడంబరానికి, ప్రధానమై యుండిన శైలి నశించింది. స్వాభావికము, నవ్యము, సరళము, భావముల అర్థ వైవిధ్యాన్ని వ్యక్తపరచడానికి సమర్థము ఐన, వచన శైలి ఏర్పడింది.

### III. పందొమ్మిదో శతాబ్దపు బెంగాలీ సారస్వతము

బెంగాలీ వచనరచన ఏర్పడడానికి క్రిశ్చియన్ మిషనరీ సంస్థలు కూడా తోడ్పడినవి. క్యారీ, మార్ష్‌మన్, పార్డ్, అనువారు చూపిన త్రోవలో వచనరచనకు బూనుకొన్న వారిలో, సెరంపూర్ మిషనరీలు ముఖ్యులు. అనేకులు వీరి ననుసరించి, వచన గ్రంథాలను రచించి యున్నారు. వ్యాకరణాలు, నిఘంటువులు, ఆంగ్ల సారస్వత భాగాల అనువాదాలు, వీరు ముఖ్యముగా రచింపజేసిన గ్రంథాలు. మానవ దేహశాస్త్ర, దేహరచనా శాస్త్రములతో కూడిన విజ్ఞాన సర్వస్వ ప్రథమ సంపుటిని, ఫెలిక్స్ క్యారీ ప్రకటించెను. ప్రాథమిక దశలోనే క్రిశ్చియను మతము నవలంబించి, మత పురోహితత్వాన్ని గైకొన్న కాళీమోహన్ బెనర్జీ, 'విద్యా కల్ప ద్రుమ' మనెడి విజ్ఞాన సర్వస్వాన్ని పదమూడు సంపుటాలలో ప్రకటించెను. జీవిత చరిత్రలు, దేశచరిత్రలు, విజ్ఞానశాస్త్ర, తత్త్వశాస్త్ర గ్రంథాలు అనేకములు ప్రకటింపబడినవి.

సెరంపూర్ మిషన్‌వారు నిర్వహించిన 'సమాచార దర్పణ్', రామమోహన్‌రాయ్ నడపుతూ ఉండిన 'సంబంద్ కౌముది', రాజేంద్రలాల్ మిత్రా వెలువరుస్తూ ఉండిన 'వివిధార్థ సంగ్రహ', దేవేంద్రనాథటాగోర్ ప్రచురిస్తూ ఉండిన 'తత్త్వబోధినీ పత్రిక' ఈశ్వరచంద్రగుప్తా సంపాదకత్వం వహించియుండిన 'సంబంద్ ప్రభాకర్',- అనే పత్రికలు భాషాభివృద్ధికి ఎక్కువగా సహకరించినవి.

పాశ్చాత్య విజ్ఞాన ప్రసారమునకు బూనియుండిన విద్యాసాంస్కృతిక సంస్థలు కూడా సారస్వత రచనలో పాల్గొన్నవి. విద్యార్థులకు చౌకధరలలో పాఠ్యపుస్తకాలను సరఫరాచేసే నిమిత్తం స్థాపింపబడిన కలకత్తా పాఠశాలా పుస్తకసంఘము (1717) ప్రధానమైనది. దేశచరిత్రలు, భూగోళశాస్త్రము, నీతిశాస్త్రము, మొదలైన వివిధ విషయాల ఆంగ్లగ్రంథముల అనువాదనకు బహుమతులను ఏర్పాటుచేసి, గ్రంథప్రకటనను ప్రోత్సహించిన మరియొకసంస్థ, "దేశభాషాసారస్వత సంఘం"(1851). డేనియలు డిఫోరచనయైన "రాబిన్‌సన్‌క్రూసో" సెయింట్ పయరీ రచించిన "పాల్-వర్జినియా" ఛార్లెస్ ల్యాంబ్‌యొక్క "షేక్సిపియర్ నాటకకథలు" ఎలిజబెత్ రచనయైన "సైబీరియా ప్రవాసములు" అనే గ్రంథములు ఈ సంస్థ ప్రకటించినవాటిలో ముఖ్యములైనవి.

సాంఘిక, మత, రాజకీయోద్యమాలుకూడా, సారస్వతాభివృద్ధికి ప్రోద్బలమిచ్చినవి. మతగేయాలు తత్త్వశాస్త్ర గ్రంథాలు, వివాదాత్మకములైన వ్యాసాలు ప్రకటింపబడినవి.

పందొమ్మిదో శతాబ్ద ప్రథమార్ధంలో బెంగాలీ భాషలో ప్రచురింపబడిన గ్రంథాలను, అధికశ్రమకు బూనుకొని, క్రోడీకరించిన జేమ్స్‌ల్యాంగ్, 1400 పుస్తకాలను, కరపత్రాలను లెక్కించియున్నాడు. బెంగాలీ సారస్వతం ఎంత విస్తారంగా అభివృద్ధిచెందినది, బెంగాలీభాష ఏ విధంగా పోషింపబడినది,- అనే విషయాలను ఈ సంఖ్య తెలుపుతుంది. గణితశాస్త్రము, విజ్ఞానశాస్త్రము, వైద్యశాస్త్రము, న్యాయము, భాషాశాస్త్రము, దేశచరిత్రలు, తత్త్వశాస్త్రము, మత

విషయక సారస్వతము,- ఇత్యాది వివిధ విషయములపై రచింపబడిన గ్రంథము లన్నీ జేమ్స్‌లాంగ్ పేర్కొనియున్నాడు.

ఈ గ్రంథములన్నీ ప్రామాణికములైనవి కావనడం వాస్తవమే. వీటిలో అధికభాగం నిరర్థకమైనదే. కాని, విలువగల గ్రంథములుకూడా, అనేకములున్నవి. భాషాసామర్థ్యాన్ని ప్రదర్శించడానికివి నిదర్శనములగు చున్నవి. ఆంగ్లము రాజకీయభాషగా మాత్రమేకాక, పాఠశాల కళాశాలల భాషగా ఏర్పడియున్న ప్పటికీ కూడా, బెంగాలీభాష ఇంతవేగంగా వికాసం పొందడం, ప్రజలకు మాతృ భాషపై గల తీవ్రమైన అభిమానాన్ని వ్యక్తంగావిస్తుంది. బెంగాలీ భాషను రాజ్య భాషగా ఏర్పరచి, ఉన్నత విద్యాబోధకు సాధనంగా చేసియుండినట్లయితే భాష ఎంతో అభ్యుదయాన్ని పొందియుండేది. 1860 తర్వాత, జపానీసుభాష పొందిన వికాసము ఇందులకు నిదర్శనం కాగలదు.

ఈ యుగములోని రచయితలలో, రామ్‌మోహన్‌రాయ్ అగ్రగామియని, నాయకుడని గ్రహింపవలసియున్నది. బెంగాలీ వచనరచన, అతనికాలమునాటికే ప్రారంభమైయుండినా, అది అప్పటికింకను ప్రయోగాత్మక దశలోనేయుండి, పాఠశాల పుస్తకరచనకు మాత్రమే ఉపయుక్తమైనది. ఉన్నత భావవ్యక్తీకరణకు, గంభీరమైన సాధనంగా, భాషనుదిద్ది తీర్చిన, కీర్తి, రామమోహనునిది. ఉపనిషత్తు లను, దేశభాషలలో రచించినాడు. క్రిశ్చియన్ మిషనరీలు హిందూమతముపై గావిస్తూ ఉండిన దండయాత్రలను ఎదుర్కొని, హిందూమతాన్ని సమర్థిస్తూ బెంగాలీ భాషలో రచనలు గావించియున్నాడు. అంతేకాక, హిందూసమాజములోని దుష్టాచారములను ఖండిస్తూ ఇతడు వ్రాసిన వ్యాసములన్నీ బెంగాలీ వచనము లోనే ఉన్నవి.

బెంగాలీ వచన సారస్వతానికి 'పిత' అని ఇతనికి వ్యవహారం సిద్ధించింది. వచన రచయితలలో, కాలమునుబట్టి ఇతడు మొదటివాడనే కారణంవల్ల సిద్ధించింది కాదు ఈ ప్రతిష్ఠ. వచనరచనలో, అతడు ప్రదర్శించిన ప్రతిభా సామర్థ్యములను బట్టి ఏర్పడింది. ఇతని పూర్వులు, కేవలం గ్రంథాలను క్రోడీకరించినవారు, అను వాదకులు మాత్రమే. వస్తువు విషయములో కాని, శైలి విషయములో కాని, వారికి అపూర్వకల్పనా శక్తిలేదు. సారళ్యము, అర్థసౌలభ్యము, వశీకరణ సమర్థము, క్రమబద్ధము, ఆప్యాయనకరము, రాగద్వేషస్ఫూర్తి రహితము, ఐన వచన శైలిని రామ్‌మోహన్‌రాయ్ వాడియున్నాడు. అతడు రచించిన విషయములు, నైతిక సాంఘిక ప్రధానములైన గంభీర విషయములు. ఐనప్పటికీ, శబ్దాలంకారాదులను విసర్జించి, సూటియైన సరళభాషలో, సులభగ్రాహ్యమైన విధంగా, వ్రాసి యున్నాడు. భారతీయ ధర్మశాస్త్రములలో నిబద్ధములైయున్న సనాతన సత్యా లను, హేతుబద్ధమైన విమర్శక దృష్టితో పరిశీలించి, వచనములో, ఆ గంభీర విషయములను పొందుపరచియున్నాడు.

అతని రచనలలో అధికభాగం వచనమే. ఐనా, కవితారచనలో కూడా అతడు ఇంత సమర్థుడే. భగవద్గీతనతడు పద్యరూపములో అనువదించెను. ప్రార్థన

మందిర ప్రయోజనమునకై భక్తిగీతాలను రచించెను. ఒక శతాబ్దకాలంలో, విస్తార నదీరూపంగా పరిణమించిన బెంగాలీ సారస్వతాన్ని పోషించిన మూలాధారాలెన్నియున్నా, రామమోహనరాయ్ ప్రతిభనుండి ఉద్భవమైన సాహిత్యవాహిని పవిత్రమైన జీవనాధారమనడం వాస్తవము.

భారతీయుల మనస్సులలో ఏర్పడిన క్షోభ, పాశ్చాత్యాఘాతము కారణములుగా అనేకములైన నిర్మాణాత్మక ఉద్యమాలు, శతాబ్దపు రెండవ భాగంలో, ఉత్పన్నములైనవి. పాశ్చాత్యభావాలు, భారతీయ సంప్రదాయాలూ, రెండూ చేరి, ఆ కాలపు భారతీయుల మనోభావాలకు, రూపకల్పన గావించినవి. అంత వరకు అభివృద్ధిచెందియుండిన, విస్తృతమైన పాశ్చాత్యతత్త్వశాస్త్రము, విజ్ఞాన శాస్త్రము, సారస్వతము,- ఇవన్నీ ఆంగ్లవిద్యాసంస్థలలో శిక్షితులైన భారతీయులకూ, ఇతర విధంగా పాశ్చాత్యప్రభావమునకు లోనైనవారికి, మానసిక వికాస దోహదమును గావించినవి. డెస్‌కార్టిస్, స్పైనోజాల హేతువాద సిద్ధాంతము, హ్యూమ్ ప్రతిపాదించిన అజ్ఞేయతావాదము, బెంథామ్, మిల్లుల ప్రయోజకతావాదము, క్యాంట్‌యొక్క, అతీంద్రియ తత్త్వశాస్త్రము, కాంటే తర్కించిన ప్రత్యక్ష ప్రమాణవాదము, ఇతర సమకాలీన తత్త్వశాస్త్రజ్ఞుల వాదములు,- వీరు అధ్యయనం గావించినవారు. ఆధునిక యుగములో జరిగిన, విజ్ఞానశాస్త్ర పరిశోధనముల ఆధారంపై, యూరోపుఖండములో ఏర్పడిన విజ్ఞానము వీరినెక్కువగా ఆకర్షించింది. వీరి ప్రకృతి పరిశీలన దృష్టిని పరివర్తన మొందించడమేకాక, విజ్ఞాన సాధనప్రక్రియలో, ప్రాపంచిక దృక్పథంలో, విశ్వమునుగూర్చిన మనోప్రవృత్తిలో, ఈ పాశ్చాత్య విజ్ఞానము, విప్లవాత్మకమైన పరిణామాన్ని తెచ్చింది.

ఈ నూతన విజ్ఞానోదయం కలిగిన అనంతరం, ర్యూసో ప్రారంభించిన భావనా స్వాతంత్ర్య విప్లవం, బయలుదేరింది. తత్త్వశాస్త్ర దృక్పథాన్ని మార్చడమేకాక, ఇది సారస్వత శాఖలన్నిటిలోను విప్లవాన్ని తెచ్చింది. కవిత, నాటక రచన, కల్పనాసృష్టి, చరిత్ర, సామాజిక శాస్త్రము,- అన్నీ నూతన పంథా ననుసరింప నారంభించెను. పందొమ్మిదో శతాబ్దపు భారతదేశము, ముఖ్యంగా ఈ భావనా స్వాతంత్ర్యోద్యమ ప్రభావానికి లోనయింది. యూరోపులో, అంతవరకు ఆరాధింపబడుతూ ఉండిన నిస్సారమైన హేతువాదంపై, ద్వేషభావం ఏర్పడింది. విప్లవాత్మక మనోధర్మము సృష్టికి వచ్చింది. కాని, పరస్పర విరుద్ధభావాలతో, క్లిష్టత ఏర్పడింది. ప్రస్తుత పరిస్థితులను ఆక్షేపిస్తూ, భావనాత్మకమైన ప్రాచీన సువ్యవస్థను కాంక్షించింది. సమాజంలోని అసహజ ప్రవృత్తులకు వ్యతిరేకమైన, ప్రకృత్యారాధన ప్రారంభమయింది. కేవలం, క్రియాశూన్యమైన తార్కికవాదాన్ని పరిత్యజించి, క్రియాత్మకమైన ఆచరణకు, ఈ వాదం, ప్రాధాన్యమిచ్చింది. హేతువాదమునకూ, సిద్ధాంతములకూ, కట్టుబడియున్న మనస్సులకు, బంధ విమోచనం కలిగించడానికి బూనుకొన్నది.* అధికార దాస్యమునుంచి, వ్యక్తికి స్వాతంత్ర్యం లభించే మార్గాన్ని, సూచించింది. ఐనా, ప్రాచీన సామాజిక వ్యవస్థపట్ల, నూతన గౌరవాన్ని కూడా కలిగించింది. ప్రాచీనకాలపు సరళజీవితాన్ని, ఆ కాలపు వీరత్వాన్ని

కీర్తించింది. మతముయొక్క బాహ్యాడంబరాన్ని, ఆరాధన పద్ధతులను ఒకవైపు విమర్శిస్తూ, మరియొకవైపు అతీంద్రియానుభూతిని, అంతర్బోధను సమర్థించింది. మానవ జీవితములో, ఒత్తిడి, ఘర్షణ, ఈ విధంగా ఏర్పడడంవల్ల క్రియాశక్తి, అపూర్వకల్పనా సామర్థ్యము, ఉత్పన్నమైనవి. వ్యక్తిత్వాన్ని, అంతః ప్రవృత్త క్రియాశక్తిని, వైయక్తికదృష్టిని, పెంపొందింపజేస్తూ, నైతికవ్యవస్థ యొక్క సార్వత్రికతను, చారిత్రిక ప్రక్రియయొక్క అవిచ్ఛిన్నతను, ప్రకృతి నియమాలకు, కార్యకారణ సంబధమునకు గల పరమాధికారమును సమర్ధించింది, ఈ భావనా స్వాతంత్ర్య సిద్ధాంతము.

ఈ పాశ్చాత్య ఆధునిక భావప్రభావను భారతదేశాన్ని ఆవరించింది. ప్రాచీన వ్యవస్థలోని శిథిలభాగాలు ఈ వేగానికి ఆగలేక కూలిపోయినవి. కాని, సారవంతమైన సనాతన భాగము కదలలేదు. సంప్రదాయాన్ని గ్రుడ్డిగా విశ్వసించే ప్రవృత్తి, మారిపోయింది. మానవ సమస్యలను క్రియాత్మక దృష్టితో ఎదుర్కొనే చైతన్యం, ఉద్భవించింది. కేవలం అలవాటుపైనా, ఆచారంపైనా ఆధారపడి యున్న భారతీయుల విశ్వాసాన్ని, చలింపజేసింది. ఆధునిక జీవిత పరిస్థితుల కనుగుణ మగునట్లుగా, ప్రాచీన విశ్వాసాలను మార్చి, సంస్కరించి, ప్రస్తుత జీవితంతో అనుసంధించే ప్రబోధాన్ని కలిగించింది. ప్రాచీనపు విలువలను పునః పరిశీలన గావించి, ప్రాక్పశ్చిమ భావాలకు సంయోజనంకూర్చే ప్రవృత్తిని, భారతీయుల మనస్సులలో జనింపజేసింది.

ఈ పాశ్చాత్య భావాఘాతానికి మొట్టమొదట గురియైనది, భారతీయ మత సిద్ధాంతము. అచ్చటినుంచి, ఈ ప్రభావం సారస్వతంపై ప్రసరించింది. తత్ఫలితంగా, సారస్వతంలో, సంపూర్ణమైన పరివర్తనం కలిగింది. భగవంతుడు, మానవుడు, ప్రకృతి, - అనే ప్రధాన జీవితాధారముల విషయములో, నూతన భావ ప్రవృత్తి ఏర్పడింది. పాశ్చాత్య సాహిత్యమునుంచి, నూతన ఇతి వృత్తములను గ్రహించడమేకాక, దేశీయ సాహిత్యంనుంచి, ప్రాచీన గాథలనుకూడా, తీసుకొని, వాటికి నూతన సాహిత్య రూపాలను కల్పిస్తూ వచ్చినారు రచయితలు. ప్రాచీన ఛందో రూపములను కావ్యములలో ఉపయోగిస్తూ, ఆంగ్ల కవితలోనున్న వానికి సదృశములైన నూతన ఛందస్సులనుకూడా, కల్పిస్తూవచ్చిరి. సమగ్రమైన వచన సారస్వతము కూడా సృష్టికి వచ్చింది.

ఆంగ్ల సారస్వతాన్ని బెంగాలు అత్యాతురతతో పఠించింది. షేక్స్పియర్ మొదలుకొని, స్విన్‌బర్న్ వరకూ ఉత్పన్నమైన ఆంగ్లకవితనూ, డేనియల్ డిఫో, మొదలు థామస్ హార్డీ, వరకు, వృద్ధిచెందిన వచన సారస్వతాన్నీ, బెంగాలీలు చక్కగా చదివినారు. కనుక, ఆంగ్ల భావాలను, కావ్యరూపాలను అవలంబించి, కావ్యాలు, నాటకాలు, నవలలు, ఇతర సారస్వతరూపాలు, వీరు సృష్టించిరి. ఇతి వృత్తము, సారస్వత దృక్పథం, ప్రక్రియలు,- ఇత్యాది విషయములలోనే కాక, శైలి, శబ్దవిన్యాసము, ఛందస్సు, కావ్యరూపము మొదలైన విషయములలో కూడా రచయితలు ఆంగ్ల సారస్వత ప్రభావానికిలోనైరి. ఐనా, పాశ్చాత్య

సారస్వతాన్ని గ్రుడ్డిగా వీరు అనుకరించలేదు. ఇతివృత్తములు, పాత్రలు, కావ్య వాతావరణము, రచనలోని ఆంతరంగిక ప్రవృత్తులు, విలువలను ఆదర్శాలను గ్రహించడంలో ఉచితజ్ఞత,- ఇత్యాది విషయములలో భారత జాతీయతను విడనాడలేదు. రామాయణ మహాభారతములు, భగవద్గీత, పురాణములు, సంస్కృత కావ్యాలు, పారసీక అరబ్బీ భాషలలోని కావ్యాలు, ప్రణయగాథలు, దుర్బలరక్షక కార్యాలు, వీర సాహసములకు ఆకరములైన పూర్వగాథలు, భారత చరిత్రలోని ఉత్తమ ఘట్టములు,- మున్నగునవన్నియూ వీరి నూతన రచనలకు వస్తువును, రంజకత్వమును సిద్ధింపజేసినవి.

ఇట్లు దేశములోని వివిధభాషల సారస్వతములలో, భారతీయ సంస్కృతి సర్వస్వమూ ప్రతిఫలించింది. వివిధ జాతుల కవులు, వివిధ మతానుయాయులైన రచయితలు, రచించిన ఈ నూతన సారస్వతములో, భారతజాతియొక్క సార్వజనీనమైన చైతన్యము, సర్వసమానమైన మనోప్రవృత్తి, వ్యక్తరూపం గైకొన్నది.

ప్రాచీన సంప్రదాయ విద్యా విధానములో శిక్షితులైన పూర్వ విద్వాంసులు, ఒక ప్రత్యేకవర్గముగా ఏర్పడియుండిరి. నూతన రచయితలు ఆ అవధులకు లోబడలేదు. నూతన భావాలను గ్రహించే అవకాశములుండి, ఆధునిక ప్రభావానికి లోనై, తమ ప్రతిభను, శక్తిని, పోషించుకొన్నవారందరూ, ఈ నూతన రచనలకు బూనుకొన్నారు. వీరందరూ చాలవరకు, మధ్యతరగతిలోనివారే. లౌకిక వృత్తులలో ప్రవర్తిస్తూ, అభిమానంతో సారస్వతసృష్టికి బూనుకొన్న ఈ రచయితలు అన్ని మతాలలోను, అన్ని కులాలలోను ఉన్నారు. హిందువులు, ముస్లిములు, క్రిశ్చియనులు, తదితరులు కూడా వీరిలో గలరు. పండితులకు మౌల్వీలకు ఇంతవరకు, మాత్రమే పరిమితమైయుండిన సారస్వతస్వామ్యం ఈ విధంగా భగ్నమయింది. భారతదేశ రాజకీయ వ్యవస్థ మారిపోయినప్పుడే, ఈ పండితులకు, మౌల్వీలకు, రాజాస్థానాల ఆదరణ లోపించింది.

నూతన భావాలు, యోచనలు, ఈ నవ్య సారస్వతములో ప్రతిబింబించినవి. వీటిని దేశములో వ్యాపింపజేసి, సాంఘిక చైతన్యాన్ని ప్రజలలో స్థిరపరచడానికి కూడా, నూతన సారస్వతం, సహకరించింది. ప్రాచీన సంప్రదాయాలనుంచి, ప్రజల మనస్సులను మరల్చడమేకాక, నూతన భావాలను, విలువలను గ్రహించడాని కవసరమైన, మానసిక ప్రక్రియలనుకూడా ఉత్పన్నం గావించినవి. మత విషయములలో, విమర్శధాటికి నిలువలేక, హఠవాదం తొలగిపోయింది; ఆత్మానుభవము, పవిత్ర జీవితము, శ్రద్ధ, జీవితములో ప్రధానములై, కేవల మతానుసరణం లోపించింది ; నైతిక ప్రవృత్తి ఆచరణలో ఏర్పడి, సిద్ధాంతమూలకమైన మత తత్త్వం నశించింది ; సంఘసేవ, సమాజాభివృద్ధి అనేవి ప్రధానములై, పరలోక భావన తొలగింది; ప్రాపంచిక జీవితం, బంధములను కల్గించేది కనుక, దానిని తుచ్ఛముగా చూడవలెనేనే విరక్తి భావం మారిపోయింది. మానవజీవిత సౌఖ్యానికి సహకరించే సాధనం ప్రకృతి; అది దైవశక్తికి ప్రత్యక్ష నిదర్శము, ఆనందదాయకమైనది, అనే భావంతో మానవుడు ప్రకృతిని చూడసాగినాడు.

నూతన మానవత, సారస్వతంలో ప్రతిఫలించింది. మానవుని, దివ్యత్వానికి, ప్రతిష్ఠకు, క్రొత్త ప్రాధాన్యం సిద్ధించింది. సర్వమానవ సమానత్వము, స్త్రీ పురుషుల సమానత సమర్థింపబడినవి. కుటుంబము, కులము, వంగడము,- వీటి అధికారమునుంచి వ్యక్తికి స్వాతంత్ర్యం లభించవలెననే అభిప్రాయము, ఈ నూతన సారస్వతములో ఉద్ఘాటింపబడింది. అన్నిటికంటెను ముఖ్యంగా జాతీయైక్యము పట్ల, చైతన్యం ఉద్భవించింది. దేశభక్తి, దేశాభిమానం అనెడి భావాలు వ్యక్తి సంకల్పాన్ని ఆవేశించి, అతని సాంఘిక ప్రవర్తనను మార్చినవి. పరప్రభుత్వమునకు అధీనమైయున్న భారత జాతిస్థితి, స్వాతంత్ర్యేచ్ఛ, మనస్సును సంక్షోభపరిచినవి. ఈ మానసిక సంక్షోభను వ్యక్తపరచడానికి, సారస్వతం సాధనమయింది. నూతన కళాసృష్టిలో, రచయిత, తన భావోద్వేగాన్ని ప్రతిఫలింపజేసినాడు.

మహావిప్లవం జరిగిన అనంతరము, అర్ధ శతాబ్ద కాలంలో సృష్టికి వచ్చిన కవితలో, నాటకాలలో, వచన కావ్యాలలో భావపరివర్తన యొక్క పరిణత స్వరూపం గోచరిస్తుంది. అంతకు పూర్వపుకాలావధిలో, బెంగాలీకవిత ఇంకను ప్రాచీన పద్ధతిలోనే నడుస్తూ ఉండినది. కాని, 'సంబద్ ప్రభాకర్' పత్రికాసంపాదకుడైన ఈశ్వరచంద్రగుప్తా ప్రచురించిన నూతన పద్యరచనలో, భావపరివర్తనం, బాగా గోచరిస్తుంది. ఇతని సహచరుడైన, రంగల్ బెనర్జీ (1826-87) రచించిన కావ్యాలలో భావనా ప్రాధాన్యము, ఆదర్శ వీరపురుష లక్షణములు, మాతృదేశ ప్రేమ,- మొదలైన ఉత్తమ లక్షణములు పోషింపబడినవి. రాజపుత్ర చరిత్రను ఆధారంగా చేసుకొని, ఇతడు రచియించిన 'పద్మినీ ఉపాఖ్యానము', రసపుత్ర స్త్రీల వీర సాహస కార్యములకు, శాశ్వత కీర్తిప్రతిష్ఠలను సిద్ధింపజేసింది. ఆంగ్ల కవుల రచనా ప్రక్రియలను, పద్ధతులను అవలంబించి, ఇతడు రచించిన - 'కర్మదేవి', 'శూరసుందరి', కావ్యాలు దేశభక్తి భావాన్ని పోషించినవి.

వీర కావ్యాలను పురాణ కవితా మార్గములో రచించడానికి బూనుకొన్న బిహారులాలుకు, హేమచంద్ర బంధోపాధ్యాయ, సమకాలికుడు. (1834-1904). 'వీరబాహు కావ్యము', 'భారత సంగిత్', అనే వీర కావ్యాలను రచించి, వాటి ద్వారా, ప్రాచీన భారత గౌరవాన్ని, స్వాతంత్ర్యాన్ని, ఔన్నత్యాన్ని సాధించవలసిందని, యువకులను ప్రబోధించెను. 'ఆశాకణన్' (ఆశాకణము) అనే కావ్యములో "బంగారు కాంతులను వెదజల్లుతున్న ప్రాగ్దేశము" అని భారత దేశాన్ని కీర్తించినాడు. "సింహాసనమును మగల అధిష్ఠించిన భరతమాత,- ప్రాకృతిక శక్తి ప్రదర్శకమైన మందహాసముతో వదనము దేదీప్యమానమైయుండ, - భారతమాత సంతానం ఆనందంతో, మేళతాళములతో చిందులు ద్రొక్కుతున్నారు." అని ఈ విధంగా ప్రజల నుద్బోధించినాడు.

హేమచంద్రుని వలెనే, నవీనచంద్రసేనుడు (1848-1909) కూడా, భారత జాతి పునరుద్ధరణ స్వప్నాలను, కన్నవాడు. 'రైవతక', 'కురుక్షేత్ర', 'ప్రభాస్' అనే కావ్యత్రయంలో ఇతడు, శ్రీకృష్ణుని జీవితయాత్రను చిత్రించి

నాడు. భారతజాతి యొక్క అవమానకరమైన స్థితికి మూలములైన కారణములను, ఈ కావ్యత్రయం చర్చించి, తన్నివారణోపాయాన్ని సూచించింది.

"దేశములో ఒక్కమతం, ఒక్కజాతి, ఒక్క రాజ్యం, ఒక్క న్యాయం, ఏర్పడనీ, లోకకల్యాణమనే సిద్ధాంత మొక్కటే ప్రతివ్యక్తికీ ఆదర్శసూత్రం కానీ", అని అతడు ఘోషించినాడు.

ఆ కాలపు సమకాలిక రచయితలందరిలోను, ప్రతిభావంతుడైన, సారస్వత రచయిత, మైకేల్ మధుసూదనదత్తా, (1828-73). ఇతని విద్యావ్యాసంగం, హిందూకళాశాలలో (1837-42) జరిగింది. కళాశాలలో ఉండగనే, ఆధునిక భావప్రభావమునకులోనై, తలిదండ్రులతో ఘర్షణపడి, గృహత్యాగము గావించి, స్వమతాన్ని పరిత్యజించి, క్రీస్తుమతాన్ని అవలంబించెను. ఇతని జీవితమంతా, కష్ట పరంపరలతో గడిచిపోయింది. దేశభ్రష్టత, విషాదాంతంగా పరిణమించిన వివాహము, విడాకులు, ప్రయోజనరహితమైన యూరోపునివాసము, దేశపునరాగమనము, దారిద్ర్యము, రుజామరణములు, ఈ విధంగా ఇతని జీవితయాత్ర ముగిసింది. అతని జీవితాన్ని కృతార్థంగావించిన కాలము, నాలుగేండ్లు మాత్రమే. (1858-62) అతనిలోని క్రియాత్మకశక్తి ఈ నాలుగేండ్లలో ఫలించింది. శర్మిష్ఠ, పద్మావతి, కృష్ణకుమారి, అనే నాటకాలు, తిలోత్తమ, 'మేఘనాథబధ్' అనెడి వీరకావ్యాలు, 'వజ్రాంగన' అనే అసంపూర్ణకావ్యము, దానికనుబంధమైన 'వీరాంగన' ఇవి అతని అత్యుత్తమ, రచనలు. వీరకావ్యము, భావగీతము, నాటకము, వీరగాథ, చతుర్దశపది (Sonnet) ఇత్యాది పద్యరచనలో, తనకుగల అపూర్వసామర్థ్యాన్ని ప్రదర్శించియున్నాడు. నూతన ఛందస్సులను, అను ప్రాసలను, ప్రవేశపెట్టెను. అంత్యప్రాసరహిత పద్యములు (Blank verse), ద్వ్యక్షరషట్పది (Alexandrine), ఏకాదశాక్షర అష్టపదులు (Ottavarima) మున్నగు విదేశీయ ఛందస్సులను చక్కగా, బెంగాలీలో వాడినాడు. ప్రాచీన బెంగాలీ ఛందస్సులలో, పాదములకూర్పులో, పద్యస్వరూపములో,- ఇతడు నూతన ప్రయోగములను గావించియున్నాడు. ప్రాచీన భారతవ్యవస్థపై ఇతనికి గల బద్ధానురాగం, ఇతని కావ్యరచనకు ఇతివృత్తములను, సమకూర్చింది. భారతీయుల ప్రాచీన సారస్వతము, భారతదేశచరిత్ర, రామాయణ మహాభారతములు, కాళిదాసుని కావ్యాలు, వైష్ణవగేయాలు, రాజపుత్ర వీరసాహస కార్యాలు,- ఇత్యాది భారతజాతేతి వృత్తములే, ఇతడు తన కావ్యరచనకు ఆధారంగా జేసుకొన్నవి. ఈ ఇతివృత్తాలకు నూతన స్వరూపం, కల్పించినాడు. నాయకపాత్రలను పోషించడంలో, సంప్రదాయముల నతిక్రమించడానికి, జంకిన వాడుకాడు. ప్రజలు సాధారణంగా విశ్వసించియుండిన విలువలను, విమర్శించ డానికి కూడా భయపడలేదు. మానవ జీవితాన్నిగూర్చిన ఆధునిక భావాలను గ్రహించడం అవసరమని, అవి, ప్రయోజనకరములని ఇతడు ఉద్ఘాటించినాడు. అతని 'శర్మిష్ఠ' నాటకమునుగూర్చి ఒక పండితుడు, "సంస్కృత వ్యాకరణ సూత్రములన్నిటికీ ఈ నాటకము అపకారం చేసింది". అని విమర్శించినాడు. అతని

మహాకావ్యములలో, బెంగాలీ ఛందోరీతులను గమనించక, వాటిని సమర్థతతో మార్చుకొన్నాడు. బెంగాలు సమాజములోని కపట ప్రవృత్తిని, నైతిక భ్రష్టతను వేళాకోళాత్మక ప్రహసనాలలో ఖండించియున్నాడు. భారతీయ నాటక సంప్రదాయానికి విరుద్ధంగా, విషాదాంత మార్గాన్ని అవలంబించి, కృష్ణకుమారి నాటకాన్ని రచించెను అతని అత్యుత్తమ రచనయైన "మేఘనాథ్ బధ్" రచనా విషయమై, ఒక స్నేహితునితో ఈ విధంగా తన హృదయాన్ని, రహస్యంగా, తెలిపియున్నాడు. "గ్రీకు కథలను నేను గ్రహించను. కాని, గ్రీకురచయిత రచించేటట్లు రచిస్తాను, లేదా, అట్లు రచించడానికి ప్రయత్నిస్తాను" పాత్రపోషణ విషయములో వాస్తవికతను చిత్రించడానికి ప్రయత్నించినాడు. ప్రాచీన కావ్య నాయకులకు మానవత్వాన్ని ఆపాదించినాడు. వాల్మీకి చిత్రించిన రావణ పాత్రనుమార్చి, దుష్ప్రవృత్తిని తొలగించి, తన కావ్యములో చిత్రించినాడు. ధైర్యసాహసోపేతుడైన యుద్ధవీరుడు, కుమారుని పట్ల అధికానురాగంగల తండ్రి,- ఇతని రచనలోని రావణుడు. కావ్యనాయకుడు మేఘనాథుడు. శౌర్యము, గాంభీర్యము, వీరోచిత లక్షణములుగల మేఘనాథుడు, లక్ష్మణునిచే, వంచనవల్ల హతుడైనాడు. మాయయొక్క కపటోపాయాల ఆధారంగా, లక్ష్మణు డితనిని సంహారిస్తాడు. రాముడు కూడా మానవదౌర్బల్యం కలవాడే ఐనా, సాధుస్వభావం గల సజ్జనుడు.

భావనా స్వాతంత్ర్య సంప్రదాయము ననుసరించిన పాశ్చాత్య కవుల పంథాలో నడిచిన మహాకవి మధుసూదనదత్. వారి వలెనే, ప్రకృతిని, హితకర మైన మిత్రముగా, ఇతడును భావించినాడు. మానవుని మానవునిగా గ్రహిస్తాడే కాని, దేవదూతగా కాని, రాక్షసునిగా కాని, గుర్తించడు. మానవ భావావేశాలు, కోరికలు, మానవులందరికీ ప్రకృతి సిద్ధములైనవే. మానవతా పరిపూర్ణతను సాధించడానికి, ప్రతి మానవుడూ ప్రయత్నించి ఘర్షణ పడతాడు. ఇది మానవ స్వభావము. దీనిననుసరించే, మధుసూదనదత్తు సారస్వత రచన జరిగింది.

మధుసూదన దత్తు తర్వాత వచ్చిన కవులలో రవీంద్రనాథ టాగోరు ప్రసిద్ధుడు. కాని, ఇతని ప్రతిభా సామర్థ్యములు పరిణతి గాంచినది ఇరవైయో శతాబ్దంలో. టాగోర్ రచనల ప్రభావము దేశమంతటా వ్యాపించింది. అతని కీర్తి ప్రపంచ దేశములందంతటా ప్రసారమయింది.

పాశ్చాత్య ప్రభావమే బెంగాలీ వచనరచనకు కారణము. పత్రికారచన, దేశ చరిత్ర, జీవిత చరిత్ర, వ్యాసములు, మత చర్చ, ఆంగ్లము నుంచి, సంస్కృతము నుంచి అనువాదాలు, ఇతర గంభీర సారస్వత రచన,-వీటికై ప్రథమ దశలో వచనరచన, ఉపయుక్త మయింది. తర్వాతి దశలో, భావవ్యక్తీకరణమునకు సమర్థ మైన సాధనంగా ఏర్పడింది. అక్షయకుమార దత్తా (1820-86), ఈశ్వర చంద్ర విద్యాసాగర్ (1820-91) బంకించంద్ర ఛటర్జీ (1838-94) - మొదలైన వారి ప్రయత్నముతో, ఈ వచనం ఏర్పడింది. దేవేంద్రనాథ టాగోర్ నిర్వహించిన

తత్త్వ బోధినీ పత్రికకు సంపాదకుడుగా, దత్తా, తాను రచించిన వ్యాసములలో నైతికోన్నతి, మతాభిమానము, సంస్కరణాభిలాష-, మొదలైన భావాలను విస్తారంగా పోషించి యున్నాడు. మహావిద్వాంసుడు, సంస్కృత కళాశాలాధ్యక్షుడు ఐన, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, బెంగాలీ భాషలో, ఇంతవరకు గుర్తింపబడని శక్తిని ఉపయోగించి, స్త్రీజనాభ్యుదయ ప్రచారము గావించెను. ఈ రచయితల శైలిని గూర్చి, రొమేశ్‌చంద్రదత్, ఈ విధంగా అభిప్రాయాన్ని వ్యక్తం గావించినాడు.

"అక్షయ కుమారుని శైలిలో, పర్వత నిర్ఝరము యొక్క వేగము, శక్తి, ప్రాకృతిక సౌందర్యము, గోచరిస్తాయి. బెంగాలీభాషపై అధికారం గల విద్యాగురుస్థానం, విద్యాసాగరునిది. ఆధునిక బెంగాలీ వచన రచనను వీరిరువురే, తీర్చి దిద్దినారు." కాని, ఆ శతాబ్దములోని వారిలో, విస్తారమైన సారస్వత సృష్టిగావించి వచనరచనకు అధికారం, వహించినవాడు బంకించంద్ర ఛటర్జీ అని చెప్పవచ్చును. ఇతని జన్మకాలం, 1838. కలకత్తా విశ్వవిద్యాలయములో మొదటిసారిగా పట్టభద్రులైన యిరువురిలో, ఇతడొకడు. డిప్యూటీ కలెక్టరుగా నియోగింపబడి, ప్రభుత్వ గౌరవాలను పొందినాడు. ఇతని మరణకాలం 1894. ఇతడు ప్రచురించిన 'దుర్గేశనందిని' అనే ప్రథమ చారిత్రక నవలతో ఇతని సారస్వతయాత్ర ప్రారంభమౌతుంది. అటు పిమ్మట, క్రమంగా, ఇతని నవలలు వెలువడుతూ వచ్చినవి. ఇతడు 1882 లో ప్రచురించిన 'ఆనందమఠ్' అనే నవల ప్రఖ్యాతిగాంచినది. భారత స్వాతంత్ర్యోద్యమంలో; జాతీయ గీతముగా ఉపయోగింపబడి స్వాతంత్ర్య సిద్ధికి, తరువాత స్వతంత్ర భారతమునకూ, జాతీయ స్తోత్రగీతముగా సిద్ధించిన "వందేమాతరమ్" అనే పద్యము, ఈ దుర్గేశనందిని నవలలోగలదు. ఇతడు బెర్హాంపూరులో నున్న కాలములో, పలువురు రచయితలను సమావేశపరచెను. భూదేవ ముఖర్జీ, దీనబంధుమిత్రా, గురుదాస బెనర్జీ, ఇత్యాదులుచేరి, ఒక సంఘముగా ఏర్పడి, జాతీయ సమస్యలను, సంఘ సంస్కరణను, సంస్కృతిని, సారస్వతాన్ని గూర్చి చర్చించేవారు. 'వంగదర్శన్' అనే పత్రికను వెలువరచడానికి, ఇతడే ముందుగా బూనుకొన్నాడు. బెంగాలీ భాషా సారస్వతములను అభివృద్ధి చేయడంలో, ఈ పత్రిక ఎక్కువ కృషి చేసినది. ఈ పత్రికా లక్ష్యాన్ని, బంకించంద్ర, ఈ విధంగా తానే వివరించియున్నాడు. ఆంగ్లీకృతమై పోయియున్న మనము మరల భారతీయులంకావడం, మా ఆశయము. ప్రజానీకానికి అర్థమయ్యే భాషలో, వారికి జ్ఞానోదయం కలిగించడం, ఈ పత్రికకు ప్రధానలక్ష్యము."

వయస్సు మళ్ళినకొద్దీ, మతములో ఆసక్తి ఏర్పడింది. హిందూమత విషయకమై తన అభిప్రాయాలను, హిందూధర్మములో సారభూతములైనవని, తనకు తోచిన అంశాలను, 'కృష్ణచరిత్ర,' 'ధర్మతత్త్వ' అనే తన రచనలలో, వివరించెను. అతడు ప్రదర్శించిన నవ్య హిందూధర్మము, సనాతనమైన హైందవ ప్రతిష్ఠను పునరుజ్జీవింప జేస్తుందని, అతని ఆశయము. సమాజములోని ప్రత్యేకములైన భిన్నాంశాలను, సంస్కరింప బూనడంవల్ల ప్రయోజనం కలుగదని, అతని అభి

ప్రాయము. ప్రాచీనుల ఆధ్యాత్మిక ఆదర్శాలను, పునః, సంఘములో ప్రతిష్ఠించ డంతో, తక్కిన సంస్కారాదులన్నియూ సిద్ధించి, సంఘ వ్యవస్థ పవిత్రంకాగలదని అతడాశించినాడు.

షేక్స్పియర్, స్కాట్, విల్కీకాలిన్స్, బుల్వర్ లిట్టన్, తదితర ఆంగ్లేయ రచయితలు,- వీరి ప్రభావము బంకించంద్రుని, నవలలో గోచరిస్తుంది. భావనాత్మక స్వాతంత్ర్యము, పాశ్చాత్య భారతౌన్నత్య ప్రశంస,సాంఘిక దురాచార ఖండన, రాజకీయ పరాధీనతపై విసుగుగల, జాతీయగౌరవసమర్థనము, ఉత్తమ కార్య సాధనంపట్ల సాహసము,- ఇత్యాది ఉదారభావము లితని రచనకు ప్రేరకశక్తులు. ప్రాచీన భారత వైభవముపై, అభిమానమును కలిగించినవి ఇతని రచనలు. ఆత్మ త్యాగముతో కూడిన శౌర్య సాహసములు ప్రదర్శించిన వీరవరులుగా, తన కథానాయకులను చిత్రించినాడు. కార్యశక్తికి కేంద్రమైన శ్రీకృష్ణుని ఆధారంగా చేసుకొని, తన మత సిద్ధాంతాలను ప్రతిపాదించెను. ఈ కారణములవల్ల, బంకిం చంద్రుని నవలలను ప్రజలు అభిమానించిరి. ఆధునిక రచయితలందరిలోనూ, బంకిం చంద్రకు, దేశములో ఏర్పడిన ప్రభావ మధికము. "అతడు కేవలం నవలారచ యితకాడు. నూతన మార్గాన్వేషకుడు, నూతన మార్గ నిర్మాత." అని డాక్టర్ సుకుమారసేన్, ఇతనిని ప్రశంసించియున్నాడు.

బెంగాలులోను, దేశమందలి ఇతర ప్రాంతాలలోను, జరిగిన ప్రాచీన విజ్ఞాన పునరుజ్జీవనోద్యమాలవల్ల, అనూహ్యమైన పరిణామ మొకటి కలిగింది. హిందూసమాజం ఆత్మనిష్ఠాపరమై, బాహ్య ప్రపంచమునకు దూరమైపోయే అంత రంగిక ప్రవృత్తికి లోనయినది. హిందూసంఘమునకు భిన్నములైన ఇతర మత వర్గాలను విస్మరించే స్థితికి వచ్చింది. తన వ్యవహారములలోనే నిమగ్నమై, తన సమాజ శ్రేయస్సును మాత్రమే గమనిస్తూ రావడంవల్ల, దేశములో విశాలమైన జాతీయ దృక్పథం యేర్పడే అవకాశానికి, భంగం కలిగింది. జాతీయ భావా భివృద్ధికి, దోహదం జరుగలేదు.

## IV. మరాఠీ సారస్వతము

పీష్వాల రాజ్యం బ్రిటీషు వారికి హస్తగతమై పోవడంతో, అంతకు పూర్వం బెంగాలు రాష్ట్రానికి బాధ కలిగించిన ఆర్థిక, సాంఘిక, రాజకీయాంశాలు, బొంబాయి రాజధానిలో కూడా, ఏర్పడినవి. మరాఠీ భాషా సారస్వతములు కూడా, బెంగాలు భాషా సారస్వతములు లోనైన పరివర్తనానికి, లోనైనవి. బ్రిటీషు ఆక్రమణకు పూర్వము, ఇతర మధ్య యుగాల సారస్వతాల వలెనే, మరాఠీ సారస్వతము కూడా, చాలవరకు, పద్యరూపమై ఉండినది. మత విషయా లను, నైతిక ప్రవృత్తులను పోషించి, ప్రజలకు విజ్ఞానం కలిగించడం ఆ రచనలకు లక్ష్యమై ఉండినది. గ్రామీణుల ప్రణయ గాథలను, సాహసికార్యాలను వర్ణించిన కావ్యములు కూడా వ్యాప్తిలో ఉండినవి. మధ్యయుగపు ప్రథమ దశలో, 'నాథ్', 'మహానుభావ', 'వర్కారీ' అనువారు, ఈ కావ్యములలో మతధర్మ వ్యతిరేకము

లైన భావాలను పోషిస్తూ, కుల తత్త్వము యొక్క సూత్రాలను ప్రచారం గావించే వారు. భగవంతుని ఉద్దేశించిన ప్రణయ గీతాలను, భక్తి గేయాలను, రచించేవారు. పదహారో శతాబ్దం అనంతరం, నూతన సారస్వతయుగము ప్రారంభ మయింది. ఇస్లాము మతభావాల ప్రభావంవల్ల, హిందువుల సంప్రదాయమార్గాలూ, విశ్వాసాలూ, మారజొచ్చినవి. భూస్వాములు, వర్తకులు, సంపన్నులు కావడం కూడా, సారస్వతాభివృద్ధికి దోహదమొనర్చింది. సారస్వత సృష్టికి, కవితాప్రతిభకు నూతనవికాసం కలిగింది. ఈ నూతనోద్యమానికి ప్రారంభకుడు, ఏకనాథ్. ఇతని ననుసరించి, ముక్తేశ్వర్, తుకారాం రామదాస్ వంటి ప్రతిభావంతులు, కావ్య రచనకు బూనుకొనిరి.

మతవిషయక కావ్యాలు, ప్రాచీనకావ్యాలు, లౌకిక విషయకమైన ప్రజా కావ్యాలు, అనే రెండు విధములైన రచనలు, పద్నెనిమిదో శతాబ్దములో వ్యాప్తికి వచ్చినవి. రామవిజయ, హరివిజయ, పాండవప్రతాప్, శివలీలామృత, అనే కావ్యాలను శ్రీధర పండితుడు రచించెను. యథార్థదీపిక, భీష్మప్రతిజ్ఞ, కాళియ మర్దన్, మున్నగు పౌరాణిక పద్యకావ్యాలను రచించినవాడు, వామన పండిత్; రామాయణ మహాభారతములకు అనుకరణములైన మహాకావ్యాలను, మోరో పంతు రచించెను. పౌరాణిక గాథలను విస్తృతమొనర్చి, నూతన కావ్యాలను కూడా ఇతడు రచించినాడు. అనేక విషయములను ఇతివృత్తములుగా గ్రహించి, 'కేకావళి' వంటి లఘుకావ్యాలను రచించినాడు, మోరోపంతు. ఇతనిది విస్తారమైన సారస్వతసృష్టి. ప్రాచీనకావ్యపద్ధతిని అనుసరించినవారిలో, అమృతరావ్, మహీపతి రఘునాథపండిత్, అనేవారు ప్రసిద్ధులు. కవులనేకులు వీరి మార్గముననుసరించిరి. 'లావణీలు' ప్రణయగీతాలు 'పవడాలు', చారిత్రిక వీరగాథలు, రచించిన ప్రజా కవులు, రెండవ వర్గమువారు. లావణీలు వైషయిక ప్రధానమైనవి. ఇంద్రియ స్వేచ్ఛా ప్రవృత్తిని మొరటుగా వర్ణించిన గేయాలివి. లావణీ రచయితలలో, ప్రసిద్ధుడైన రామజోషీ రచనలలో మాత్రమే ఈ దోషములేదు. ఖండోబా దేవునికి జీవితములను అంకితం గావించిన 'మురళీలు' అనే దేవదాసీ కన్యలు, ఈ లావణీలను పాడుచుండినారు. పల్లెలలో నాటకములను ప్రదర్శిస్తూ దేశ పర్యటనగావించే, చారణబృందములు, గోంధాలీలు, లావణీలను గానంచేస్తూ, ప్రజానీకాన్ని, రంజింపజేసేవారు.

వీరగాథా రచన శివాజీకాలములో ప్రారంభమయింది. శివాజీ తల్లియైన, జీజాబాయి ప్రోత్సాహంతో అగ్నిదాస్, మొదటి వీరగాథను రచించెను. అఫ్జల్ ఖాన్ వృత్తాంతము ఈ గాథా వస్తువు. పీష్వాల రాజ్యపరిపాలన కాలములో గాథారచన విస్తారంగా అభివృద్ధిచెందింది. దేశ, జాతి, వైలక్షణ్యములను ప్రదర్శించే ఈ గాథలు ప్రజామోదానికి ప్రజాభిమానానికి, పాత్రములైనవి. సరళ స్వభావులైన, మహారాష్ట్ర దేశపు రైతులు, వ్యవహరించే సాధారణభాషలో, వీరగాథలు రచింపబడినవి. దైనిక జీవితంలోను, గ్రామీణపరిసరాలలోను స్వాభావికంగా గోచరించే సన్నివేశాలు, దృశ్యాలు, గాథలలో రమ్యంగా వర్ణింపబడియున్నవి.

సరళమైన ఛందోరీతుల నవలంబించి, సామాన్య ప్రజల మనోభావాలను చిత్రించినారు, గాథారచయితలు.

తమ సహజ కవితాప్రేరణవల్ల కొందరు, గాథలను రచించినారు. తమకు ఆశ్రయులైనవారి ప్రోద్బలంతో ఇతరులు గాథారచనకు బూనుకొనిరి. అగ్నిదాస్, తులసీదాస్, యమాజీలు, శివాజీకి ఆశ్రితులు. కడపటి పీష్వాకు ఆశ్రితుడైనవాడు అనంతఫండి. గంగాహైబాతి, హోనాజీ, ప్రభాకర్ అనే రచయితలను పీష్వాలు, ఇతర సర్దారులు గౌరవించి సత్కరించినారు. కనుక, ఈ రచయితలు వీరిని మితిమీరి ప్రశంసించియుండడం, స్వాభావికమైనదే. వీరగాథా కావ్యములు బ్రిటీషు పరిపాలనారంభము వరకు, రచింపబడుతూ వచ్చినవి. నశించిపోయిన మహారాష్ట్ర వైభవ ప్రాభవాలను స్మరించుకొని, తదావేశమునకులోనై, గాథా రచయితలు, కావ్యాలను రచించిరి. రాజ్యవినాశ, స్వాతంత్ర్య వినాశంవల్ల కలిగిన మనోవ్యథయంతా, ఈ గాథలలో ప్రతిఫలించింది. పరప్రభుత్వమునకు లోబడిపోయిన ప్రజల సంశయాలు, అనిశ్చితత్వము, జంకు,- మొదలైన హృదయ స్పందనములన్నీ ఈ కావ్యాలలో, స్పష్టంగా గోచరమౌతున్నవి.

సారస్వతమని చెప్పుకోదగిన వచన రచన, ఇంకను సృష్టికిరాలేదు. సంస్కృతములోని కథలకు, పుక్కిటి పురాణాలకు కొన్ని అనుసరణములు మాత్రమే వచనములో రచింపబడినవి. భేతాళపంచవింశతి, సింహాసన బత్తీసి, పంచోపాఖ్యానము మొదలైనవి, ఈ వచనరచనలు. మహారాష్ట్ర రాజ్య స్థాపనతో 'బఖార్లు', 'కైఫీయతులు', రచింపబడినవి. చారిత్రక ఉదంతాలను, చారిత్రక పురుషుల జీవితాలను, వర్ణించే రచనలివి. వీటిని రచించినవారు, రాజాస్థానాలలోను, మంత్రుల కార్యాలయాలలోను పనిచేస్తూ ఉండిన గుమాస్తాలు. వీటిలోని భాష సంస్కరింప బడినదికాదు. వర్ణితములైన ఉదంతములన్నీ, వాస్తవములని కూడా చెప్పలేము. సభాచద్ రచించిన 'భావు సహేబంచి బఖార్' 'పానీపచ్చి బఖార్' 'శివచరిత్ర', అనునవి, చిట్నీస్ రచించిన జీవిత చరిత్రలు, ఈ రచనలలో ఉత్తమములైనవి.

మరాఠా పరిపాలకుల కాలమునాటి జాబులు, ప్రేషణపత్రములు, సర్కారు పత్రాలు,- వీటిలోని వచనము మరియొక విధమైనది. రజపుత్రరాజుల ఆస్థానములు, ముఘలు గవర్నరుల ఆస్థానములు, ముఘల్ సార్వభౌముని దర్బారు,- ఇత్యాదులకు నియోగింపబడిన రాజకార్యవేత్తలు వ్రాసిపంపిన జాబులు, సందేశాలు, పత్రాలు, వచనములోనున్నవి. పీష్వాలు వారికి పంపిన ఆదేశాలు, సింధియా, హోల్కర్, భోంస్లేలు, నానాఫర్నవీస్ మున్నగువారు పంపిన సందేశాలు, మొదలైన ప్రభుత్వ పత్రములన్నిటిలోనూ, పారసీక శబ్దములకు ప్రాధాన్యమధికము.

బ్రిటీషువారి ఆక్రమణకు పూర్వపు మరాఠీ సారస్వతములో, మతవిషయక రచన అధికము. భావగీతాలు, వీరగాథలు, మాత్రమే లౌకిక విషయములకు సంబంధించిన కావ్యాలు. జ్యోతిశ్శాస్త్రము, గణితము, వైద్యము, పరిపాలన

వ్యవహారాలు, మొదలైన విషయాలుకూడా, పద్యరూపములో రచితములై యున్నవి. కంఠస్థము గావించే సౌకర్యాన్ని గమనించి, వీరీ పద్ధతిని అవలంబించి యుండవచ్చు. భాష అసంస్కృతమైనది, మార్దవము, లాలిత్వములేనిది; పారసీక పదము లెక్కువగా ఉన్నవి.

19 వ శతాబ్దారంభమునుంచి, వచన రచనలో నూతన విధానములు ప్రారంభమైనవి. నూతన వచనకు ప్రారంభకులు క్రిశ్చియన్ మిషనరీలు.

1805 లో, క్యారీ, మొదటి మరాఠీ వ్యాకరణాన్ని రచించెను. తర్వాత, వైజనాథ్ అనే పండితుని సహకారంతో, మరాఠీ-ఇంగ్లీష్ నిఘంటువును, రచించెను. సెరంపూర్ ముద్రణాలయం, 'సింహాసన్ బత్తీసి' అనే మొదటి మరాఠీ పుస్తకాన్ని 1814 లో ప్రచురించింది. బొంబాయి గవర్నర్‌గానుండిన, మౌంట్ స్టూవర్ట్ ఎల్‌ఫిన్‌స్టన్, ఉదారుడైన విద్యాభిమాని; విజ్ఞాన సారస్వతములు, ప్రజలలో వ్యాపింపవలెననే ఆశయం కలవాడు. బొంబాయి దేశీయ విద్యాసంస్థను స్థాపించి (1820) దానికి 50,000 రూపాయలను అనుదానంగా ఇచ్చెను. ఈ సంస్థ, పాఠశాలలను స్థాపించి, ప్రాదేశిక భాషలలో పాఠ్యగ్రంథములను రచింపచేయడానికి బూనుకొన్నది. ఈ కార్యక్రమానికి క్యాప్టెన్ జెర్విసు పూనుకొన్నాడు. గణితశాస్త్రము, పదార్థ విజ్ఞానశాస్త్రము, చరిత్ర, వ్యాకరణము, కథలు, మొదలైన విషయములపై మరాఠీ భాషలో పుస్తకములు వెలువడినవి. 'సర్వేక్షణము' (Surveying), క్షేత్రగణితము, దేహారచనా శాస్త్రము, రోగ వర్గీకరణము, ఔషధశాస్త్రము, – ఇత్యాది ఆంగ్లగ్రంథములకు మరాఠీ భాషలో, అనువాదములు వెలువడినవి.

1822 లో స్థాపితమైన పాఠశాలా పుస్తక సంఘం, బహుమానాల విధానాన్ని ప్రవేశపెట్టి, పుస్తక రచనను ప్రోత్సహించింది. పాఠశాలా పుస్తకములను మాత్రమేకాక, యుక్త వయస్కులైన వారికి ఉపకరించే గంభీర విషయములను గూర్చిన, పుస్తకములను కూడా రచింపజేసింది. గోల్డ్‌స్మిత్ రచించిన 'రోము దేశ చరిత్ర', మాల్‌కాం, రచించిన 'పర్షియా', విల్క్స రచించిన 'అరబ్బుల చరిత్ర' 'చైనా చరిత్ర', పదార్థ విజ్ఞాన శాస్త్రము, రసాయన శాస్త్రము, నీతిశాస్త్రము, గుజరాతు చరిత్ర, ఆర్మ్ వ్రాసిన 'హిందూస్థాన్ చరిత్ర', 'ఐన్-ఇ-అక్బరీ', 'సికిందర్ నామా',-ఇత్యాది విదేశ భాషా గ్రంథాలను అనువదించడానికి, ఈ విద్యా సంస్థ నిశ్చయించుకొన్నది.

మరాఠీ వచనరచనకు, ఈ విధంగా, అస్తిభార మేర్పడింది. ఇతర భాషా గ్రంథాలకు అనుసరణలను మరాఠీ భాషలో వ్రాయడంలో, భాషాసారళ్యం ప్రధానమయింది. పాతబడిన ప్రయోగాలను, కఠిన పదాలను విసర్జించి, పరిశుద్ధతా వాదానికి అవకాశమివ్వక, చక్కని వ్యవహార భాష నుపయోగించి, పుస్తకములు రచితములైనవి. సరియైన మరాఠీ పదములు లభించని సందర్భాలలో, ఆంగ్ల పదములనే గ్రహించిరి. విజ్ఞాన శాస్త్రములను, సాంఘిక శాస్త్రములను చేకూర్చిన 'సారసంగ్రహము అనే గ్రంథము 1831 లో ప్రచురింపబడింది. భూగోళశాస్త్ర,

భూగర్భ శాస్త్రములకు, సంబంధించిన పుస్తకం, 1832 లో వెలువడింది.

ప్రకృతి తత్త్వశాస్త్రము, సంవాద శైలిలో అనువదింపబడింది. విలియం హెన్రీబాల్ రచించిన 'యాంత్రిక విజ్ఞాన శాస్త్రా'నికి (Mechanics) వ్యాస రూపానువాదం వెలువడింది. విశుద్ధ, ప్రయుక్త గణిత శాస్త్రములకు ఉపన్యాస రూపములో అనువాదం ప్రచురింపబడింది. ఇంగ్లాండు దేశచరిత్ర, వర్ణనాత్మక వ్యాసము, ఇంగ్లాండు వర్ణన, హిందూమత పునర్విమర్శ, (John Wilson)-మున్నగునవి, దేశభాషలో వెలువడినవి.

1833 లో ప్రభుత్వ విద్యా విధానములో, మార్పు జరిగింది. అపగత మార్గాన్ని అనుసరించి, ప్రభుత్వము దేశభాషల నాదరించడం మానుకొని, ఆంగ్ల భాషను ప్రోత్సహింప నారంభించింది. బొంబాయి విద్యా సంస్థకు అధ్యక్షుడైన సర్ ఎర్స్కిన్ పెర్రీ, ఆంగ్లభాషా వ్యాప్తికి బూనుకొని, దేశ భాషా పుస్తక ప్రచురణకు, ద్రవ్య సహాయాన్ని తగ్గించి వేసెను. భారతీయ రచయితలు, ఈ ప్రభుత్వ చర్యకు, సమాధానంగా తామే పుస్తక రచనకు బూనుకొనిరి. బాలశాస్త్రి జంభేకర్, దాదోబా పాండురంగ, పరశురాంతాత్యా గోడ్బోలే,-దేశ భాషా పుస్తక రచనకు ప్రారంభించిరి. మరాఠీ పాఠ్యపుస్తకములనేకములు జంభేకర్ రచించి నాడు.

మరాఠీ భాషా పఠనములో అభిరుచి కలిగించే ఉద్దేశంతో పత్రికా ప్రచురణ నారంభించిరి. 'బొంబాయి దర్పణ్' అనే మొదటి మరాఠీ వార్తా పత్రికను బాల శాస్త్రి జంభేకర్, 1832 లో స్థాపించి యుండెను. 'దిగ్దర్శన్' అనే రెండవ పత్రిక 1840 లో వెలువడింది. 'ప్రభాకర్' పత్రికను, భావుమహాజన్ 1841 లో ప్రచురించెను. 'శత పత్రేన్' అనే వ్యాసాలను వరుసగా ఈ పత్రికలో, లోకహితవాది, ప్రకటించినాడు. సాంఘిక దురాచారాలను బహిరంగపరుస్తూ, సాంఘిక రాజకీయ విషయాలలో హేతుబద్ధమైన దృక్పథాన్ని అలవరచుకోవలెనని, ఈ వ్యాసాలు ప్రజలనుద్బోధించినవి. 'ధ్యాన ప్రకాశ' పత్రిక పూనా నుండి వెలువడుతూ వచ్చింది (1849). మిషనరీల ప్రచారాన్ని నిరోధించడానికై, 'విచారల హరి' అనే పత్రికను కృష్ణ శాస్త్రి ఛిప్లుంకర్, ప్రారంభించెను (1852). మరాఠీ వచనరచనాభివృద్ధికి, ఈ పత్రికలన్నీ తోడ్పడినవి.

నిఘంటువులు, వ్యాకరణాలు, రచింపబడడంతో, భాషకు, ప్రమాణ రూపాన్ని ఏర్పరచడానికి, సౌకర్య మేర్పడింది. ప్రాచీన మరాఠీ సారస్వత పునరుద్ధరణం జరిగింది. ఆధునిక విద్యవల్ల, ప్రసారమౌతూ ఉండిన, ఆధునిక భావ వాతావరణము, భావ స్వాతంత్ర్యాన్నీ, జిజ్ఞాసనూ, పెంపొందించింది. అనేకములైన ఆంగ్ల గ్రంథములకు అనువాదాలు ఏర్పడినవి. విజ్ఞానశాస్త్ర, ఆర్థికశాస్త్ర, సాంకేతికశాస్త్ర గ్రంథాలు, మరాఠీ భాషలో రచితములైనవి. సంస్కృత గ్రంథాలను, మరాఠీ భాషలో, అనువదించిరి.

భాషా సారస్వతములలో, సాధింపబడిన కార్యక్రమము, విస్తారమైనది కాక పోవచ్చు. కాని, నూతన సారస్వత సృష్టి వేగంగా జరుగుతూ రావడం శుభ

సూచకమని, రెనడే, చెప్పి యున్నాడు. "మరాఠీ సారస్వతాభివృద్ధి జరుగవలసిన వివిధ మార్గములన్నీ ప్రారంభమైనవి. ప్రాచీన కావ్యాల ప్రచురణము తృప్తికరంగా జరిగింది. సంస్కృత గ్రంథాలను, ఆంగ్ల గ్రంథాలను అనువదించే కార్యక్రమం ప్రారంభమయింది. ఇంతవరకు సాధించిన విజయాని కంటె, అభ్యుదయమునకై గావింపబడిన ప్రయత్నం, ఆశాజనకమై యున్నది." అని, రెనడే, పలికి యున్నాడు.

శతాబ్ద మధ్యకాలం నాటికి, స్వతంత్ర రచన ప్రారంభమయింది. వినాయక జనార్దన కీర్తనె, 'తోర్లే మాధవరావ్' అనే మొదటి నాటకాన్ని రచించెను (1861). బాబా పద్మాంజీ, అనే క్రీస్తు మతానుయాయి, తాను రచించిన, 'యమునా పర్యటన' అనే నవలలో క్రీస్తు సందేశాన్ని ప్రశంసిస్తూ, భర్తృహీనయైన హైందవ స్త్రీ దురవస్థను, ఆమె దుఃఖాలను వర్ణించినాడు. భావనా స్వాతంత్ర్యమును, మానవ హృదయ వేదనలను, చిత్రించిన నవలలనేకములు, వెలువడినవి. సమకాలపు సాంఘిక సమస్యలను, ఈ నవలలు పరోక్ష మార్గంలో పరిష్కరించడానికి, ప్రయత్నించినవి. దైవము, అదృష్టము, అనే భావాలు, ప్రకృత్యతీతమైన భావనలు, ఈ ప్రథమ రచనలలో ఇంకను, ప్రధానములై యుండినవి. విశిష్ట ప్రయోజనముల నుద్దేశించిన రచనలు, తర్వాత వెలువడుతూ వచ్చినవి. ఇట్టి నవలా రచయితలలో ప్రసిద్ధుడైన వాడు, హరినారాయణ ఆప్టే (1864-1919). వాస్తవ జీవితము నుండి పాత్రలను గ్రహించి, వారి మనోభావాలను వింగడించి, వారి జీవిత సమస్యలను చర్చించి యున్నాడు. బాల్య వివాహము, వైధవ్య దురవస్థ, సమిష్టి కుటుంబము, స్త్రీల హీనస్థితి, స్త్రీల పట్ల పురుషులు ప్రదర్శించే అహంభావ ప్రవృత్తి,-ఇత్యాది సాంఘిక దురాచారములు, దుష్ట ప్రవృత్తులు, అతడు రచించిన కథలలో చిత్రింపబడినవి. సంప్రదాయ జీవిత వ్యవస్థకు, ఆధునిక జీవిత వ్యవస్థకు గల సంఘర్షణ, అతని రచనలకు ప్రధానేతి వృత్తములు. చారిత్రక నవలలను కూడా ఇతడు రచించియున్నాడు. సారస్వత వచన రచనా వికాసమునకు ఆప్టే ప్రభావం ఎక్కువగా సహకరించింది.

మహారాష్ట్ర సారస్వత వికాసానికి నూతన ఘట్టం 1874 లో ఆరంభమయింది. ఇంతవరకు రచయితలందరు, చాలవరకు, సంస్కృత గ్రంథముల అనువాదాన్ని, ప్రసిద్ధ ఆంగ్ల గ్రంథముల అనువాదాన్ని, చేస్తూ వచ్చిరి. ఈ రచయితల భావాలలో మాత్రమే కాక వీరి భాషలో కూడా విదేశీయ ప్రభావం గోచరిస్తుంది. 1874 లో విష్ణుశాస్త్రి ఛిప్లుంకర్, రచించిన 'నిబంధన మాల' మరాఠీ సారస్వత రంగంలో ప్రవేశించి, పఠితలకు ఆశ్చర్యం కలిగించింది. భావనా ప్రధానములైన గంభీర విషయములను కూడా, వ్యక్తము గావించడానికి మరాఠీ వచనమెట్లు సమర్థమైయున్నదో, ఛిప్లుంకర్ రచనలవల్ల తెలియవచ్చింది.

మరాఠీ భాష, కవిత, చరిత్ర, మూఢ విశ్వాసము, అనువాద శిల్పము, జాన్‌సన్ జీవిత చరిత్ర, దేశ పరిస్థితి-మొదలైన వివిధములైన విషయాలపై ఇతడు వ్రాస్తూ వచ్చినాడు. "హేళనతోను, ఖండనలతోను కూడిన అతని రచనలు,

గంభీరమైన శైలి, వివిధ విషయక సమగ్ర పరిజ్ఞానము, సంస్కృత మరాఠీ సార స్వతములలో అతనికి గల పాండిత్యము - ఇవి, పాఠకులను పరవశమొనర్చినవి." విదేశ భావ శృంఖలాలకు బద్ధులై యున్న విద్వాంసులకు, ఇతని రచనలు విమోచనం కలిగించినవి. రాజకీయ భావాలకు, రాజకీయోద్యమానికి, మహారాష్ట్ర దేశంలో, అర్ధ శతాబ్దకాలం మార్గదర్శకములై యుండిన 'కేసరి' 'మహారాష్ట్ర' పత్రికలను, స్థాపించినవాడు కూడా ఛిప్లుంకరే.

ముప్పైరెండేండ్ల వయస్సుకే, ఛిప్లుంకర్ ఇహలోకయాత్ర ముగిసింది. (1882). అతని అనంతరం, అగర్కార్, తిలక్, శివరాం మహాదేవపరంజపి, మున్నగువారు, అతడు ప్రారంభించిన భాషాసేవను కొనసాగించిరి. కేసరీపత్రిక స్థాపింపబడిన నాటినుండి, అగర్కార్ దానికి సంపాదకుడుగా ఏడేండ్లు కార్యక్రమం నిర్వహించినాడు. అదే కాలములో 'సుధారక్' అనే పత్రికను కూడా ఇతడు నిర్వహించినాడు. సాంఘిక విషయములలోను, రాజకీయములలోను కూడా ఇతడు అభ్యుదయవాది. తన అభిప్రాయాలను నిర్భీతిగా ప్రచురించేవాడు. తిలక్ రాజకీయోద్యమంలో నిమగ్నుడై, పాశ్చాత్య పరిపాలనతో పోరాటం సాగిస్తూ ఉండినాడు. నిర్భయము, బిరుసుదనము, ఖండితవాదిత్వము అనే ఇతని సహజ లక్షణములు, ఇతని భాషలో కూడా ప్రతిబింబించినవి. భగవద్గీతకు వ్యాఖ్యానంగా, గీతారహస్యమనే గ్రంథాన్ని రచించినాడు. శంకరులు ప్రతిపాదించిన వైరాగ్యమును ఇతడంగీకరింపలేదు. స్వార్థనిరపేక్షతో ప్రతివ్యక్తి తన కర్తవ్యాన్ని నిర్వహించడం శ్రేయమని, గీతను ఆధారంగా చేసుకొని, సిద్ధాంతీకరించినాడు. ఛిప్లుంకర్, అగర్కార్, తిలక్,- వీరి రచనలు ఇతర రచయితలకు ఉత్తేజనము కలిగించినవి. శ్రీపద్కృష్ణ- కొల్హాత్కర్, హాస్యప్రధానములైన వ్యాసములను రచించడములో ప్రసిద్ధిచెందినారు. శివరాంపరంజపి సారస్వత వ్యాసాలను, కేల్కార్ విమర్శక వ్యాసాలను, రాజవాడే చారిత్రక వ్యాసాలను రచించిరి.

అనేకులు జీవితచరిత్రలను, దేశచరిత్రలను, వ్రాస్తూ వచ్చిరి. పాశ్చాత్య మహనీయుల జీవితచరిత్రలు,- (కవులు, నాటకకర్తలు' రాజకీయవేత్తలు, రాజులు,) - భారతచరిత్రలోని మహనీయుల జీవితచరిత్రలు, రచింపబడినవి. రాజవాడే, వాసుదేవశాస్త్రిఖారె, పరాస్నీస్, అనే రచయితలు చరిత్ర గ్రంథాలను రచించిరి. ఆధునిక భావాల ప్రభావంతో, పాశ్చాత్య విధానమునను సరించి, రచింపబడిన కావ్యాలు, నాటకాలు, కూడా వెలువడినవి. 'కేశవసుత్' అనే కృతకనామంతో, ప్రఖ్యాతిగాంచిన, కృష్ణాజీ కేశవదామ్లే, వర్డ్స్వర్త్, వంటి ఆంగ్లభావకవుల ప్రభావానికిలోనైన రచయిత. వ్యక్తి ప్రతిష్ఠను, స్వాతంత్ర్యమును, సమత్వభావమును, మానవత్వమును,- ఇతడు తన రచనలలో సమర్థించినాడు. తుతారి, జపుర్జా, నవశిపాయి, అనే ఇతని కావ్యాలు నవ్యభావాల నుద్బోధించినవి. ఇతని సమకాలికులైన,- రెవరెండ్ తిలక్, రెండాల్కార్, వినాయక్, తాంబే, గడ్కారీ, ఠోమ్రే,- అనే కవులు ప్రకృతి యొక్క వివిధ

ధర్మాలను వర్ణించినారు.

సంస్కృత నాటకములు, ఆధారంగా, కిర్లోస్కర్ రచించిన నాటకాలు ప్రజాభిమతమునకు పాత్రములైనవి. ఇతని అనుయాయులలో, దేవల్ ముఖ్యుడైన, రచయిత. అసమాన వయస్కులైన వారికి జరిపే వివాహాములనితడు ఖండించినాడు. ఇతడు రచించిన 'శారద' అనే నాటకం ప్రశంసా పాత్రమయింది.

## V. ఉర్దూ - హిందీ సారస్వతం

ఉత్తర భారతములోని నూతన పరిస్థితుల ప్రేరణవల్ల ఉర్దూ, హిందీ భాషలు వేగంగా వికాసాన్ని పొందుతూ వచ్చినవి. ఉర్దూ భాష సహజ పరిణామాన్ని పొందుతూ వచ్చింది. కాని, వ్యావహారిక భాషలలో దేనిని సారస్వత భాషగా గ్రహింపవలెననే సమస్య, హిందీ విషయములో ఉదయించినందువల్ల, సారస్వాతాభివృద్ధికి ఆటంకమేర్పడింది. విస్తారమైన ఉత్తమ సాహిత్యము, బ్రజ్ భాషలో ఉండడంవల్ల, సారస్వతాభివృద్ధికి అదే తగినదని, రచయితల అభిప్రాయము. 'ఖారీబోలీ' అనే వ్యావహారిక భాష సున్నితమైనది కానందువల్ల కావ్యరచనకు, అనుకూలింపదని వీరి భావన. వచన రచన విషయంలో, అట్టి సంశయానికి అవకాశం కలుగలేదు. 'బ్రజ్' భాషలోను, ఇతర హిందీ వ్యావహారిక భాషల్లోనూ, వచన సారస్వతము, ఏర్పడియుండలేదు. ఇక రెండవపక్షంలో, ఫోర్ట్ విలియం కళాశాల ప్రారంభమైన నాటినుంచీ, పుస్తకములనేకములు 'ఖారీ బోలీ' భాషలో రచింపబడినవి. గంభీరములైన భావములను వ్యక్తము చేయడానికి కూడా ఈ భాష సమర్థమైనదని, ఇందువల్ల నిరూపితమయింది.

ఈ వచన రచనాశైలిని తమ రచనలలో ఉపయోగించినవారిలో, సదాసుఖలాల్, లల్లూజీలాల్, సదల్‌మిశ్రా, ఇన్షాఅల్లాఖాన్ ఇన్షా,- మొదలైనవారు ప్రథములు. క్రమంగా, ఈ భాష అభివృద్ధి చెందుతూ 19 వ శతాబ్దపు మధ్యకాలానికి స్థిరపడింది. అభివృద్ధికూడా వేగంగా జరుగుతూవచ్చింది. కవితావిషయం మాత్రం, వివాదములో నిలిచిపోయింది. తత్ఫలితంగా హిందీ శక్తివంతమైన స్వతంత్ర సాహిత్య భాషగా ఇరువదియవ శతాబ్దంలో ఏర్పడింది. వచన రచన విషయములో మాత్రం, పత్రికలు, చారిత్రక రచనలు, వ్యాసాలు, నాటకాలు, భాషాభివృద్ధికి తగిన పరిస్థితులను సిద్ధముచేసినవి. శైలీవైవిధ్యాన్ని ప్రదర్శించి, వచన రచన గావించడానికి ప్రయత్నించినవారిలో, రాజా శివప్రసాద్ ముఖ్యుడు. (1823-95). భారతదేశ చరిత్రను మూడు సంపుటములలో రచించినాడు. ఇందులో పారసీక పదముల ప్రయోగమధికం. రాజాలక్ష్మణ సింగుకు సంస్కృత శబ్ద భూయిష్ఠమైన రచన అభిమతము. భారతేందు హరిశ్ చంద్ర, మధ్యమరీతి ననుసరించినవాడు. ఆంగ్ల నాటకములను ఆదర్శంగా చేసుకొని, ఇతడనేక హిందీ రూపకములను రచించియున్నాడు.

ప్రాచీన సంప్రదాయ కవితనే అవలంబిస్తూ, బ్రజ్ భాషలో హిందీ కవిత్వం వెలువడుతూ వచ్చింది. కాని, శ్రీధర పథక్ (1859-1928) ప్రాచీన సంప్రదాయ కవితామార్గాన్ని విసర్జించి, ఖారీబోలీ భాషను అవలంబించి, 'ఏకాంతవాసీ

యోగి' అనే కావ్యాన్ని రచించెను. అనేకులితనిని అనుకరిస్తూ వచ్చిరి. క్రమంగా కవితా రచనకు కూడా 'ఖారీబోలీ' సారస్వత భాషగా సిద్ధించింది. ఉర్దూ విషయములో ఇట్టి ప్రతిబంధకములేవీ కలుగలేదు. అదివరకే ఉర్దూ కవిత బాగుగా అభివృద్ధి చెందియుండినది.

'ఘలీబ్' రచనలు - పద్యము, వచనము కూడా,- భావి సారస్వత వికాసానికి సూచకములైనవి. జాబులలో అతడుపయోగించిన సరళవ్యవహారశైలి, ఆధునిక భావ వ్యక్తీకరణకు తగిన ఆదర్శమైనది. శబ్దార్థములకు గల ప్రాధాన్యమును గుర్తించి, సహజ స్ఫోరకములైన అలంకారములను మాత్రమే ఉపయోగించి, కవితను రచించినాడు. నిరర్థకములైన సంప్రదాయములను విడనాడినాడు. ఈ విధంగా భావికవితా వికాసానికి మార్గాన్ని, ఘలీబ్, ప్రదర్శించెను.

1857 అనంతరం, ఏర్పడిన సాంఘిక వ్యవస్థ, శేషించియుండిన ముఘల్ వంశ వినాశము, ఆధునిక పరిపాలన వ్యవస్థ, ఆర్థిక పరిస్థితులలో కలిగిన పరివర్తనము నూతన విద్యా ప్రసార భావప్రసారములు,- ఇత్యాదులన్నియు, ఉత్తర ప్రాంతాలలోని సాంఘిక జీవనస్థితిని పరివర్తన మొనర్చినవి. ప్రపంచము, సమస్యలు, విషయములు, ఆసక్తులు,- అన్నియు ప్రజలకు క్రొత్తగా గోచరించినవి. 'గజల్' ఏర్పరచిన అవధులు, ఈ కవులకు అనుకూలించలేదు. కనుక, మథ్నావీ, ముసద్దస్, ఛందోరీతులను కవులు అభిమానించిరి. వర్షాకాలము, శీతకాలము, వేసవి,- ఇత్యాది ప్రకృతి ధర్మవైవిధ్యము, నదీప్రవాహము, పర్వతశ్రేణి,- ఇత్యాది ప్రకృతి దృశ్యములు,- కవితా వస్తువులైనవి. భావనాత్మకములు, వర్ణనాత్మకములు, నీతి బోధకములు, దేశభక్తి ప్రధానములు ఐన, రచనలు సాధారణములైనవి.

నూతన పరిస్థితుల ప్రాబల్యంవల్ల, ప్రాచీన సాంప్రదాయిక కవితపై విసుగు జనించింది. కనుక, నూతన మార్గాన్ని అనుసరించింది, ఉర్దూ సారస్వతము. కృత్రిమములైన ప్రాచీన పద్ధతులను విసర్జించి, సరళశైలిని అవలంబించిన, సర్ సయ్యద్ అహమ్మద్ ఖాన్, "మన భాషా సారస్వతముల వికాసమునకు ప్రతిబంధకములు, భ్రాంతి మూలకములు ఐన, సంప్రదాయాలను తొలగించి, ప్రాచీన విజ్ఞానాన్ని పాశ్చాత్య సారస్వతమునకు, విజ్ఞాన శాస్త్రమునకు, అనుగుణంగా చేయవలసిందని," కోరియున్నాడు. "ఈ సంప్రదాయ సారస్వతం, మనకు అసత్యాన్ని, ముఖస్తుతిని, నేర్పుతున్నది. ప్రకృతి సౌందర్యాన్ని మరుగుపరచి, వాస్తవికతను నశింపజేసి, అయోగ్యములైన ఆవేశాలను ప్రేరేపిస్తుంది. ఆంగ్ల సారస్వతాన్ని చదివే భాగ్యం కలిగినందువల్ల, మన సారస్వతములోని దోషాలను గుర్తింప గలుగుతున్నాను," అని, నాజిర్ అహమద్ వ్రాసియున్నాడు.

మహమద్ హుస్సేన్ అజాద్, అల్తాఫ్‌హుస్సేన్ ఆలీ,- ఈ ఇరువురు, నూతన సారస్వత సంస్థను, లాహోరులో నెలకొల్పిరి. ఉర్దూ సారస్వతాభివృద్ధి ఈ సంస్థయొక్క లక్ష్యము. క్రొత్తవిషయాలపై, నూతన శైలిలో, అజాద్, కవితారచన గావించినాడు. షామ్ - కి అమద్ (సాయంసంధ్యోదయం),

మధ్నావీ- హుబ్బీ- వతన్ (మాతృదేశ ప్రేమ), ఖవాబీ అమన్ (శాంతిస్వప్నం) దాద్-ఇ-ఇన్‌సాఫ్ (న్యాయప్రశంస), జమీస్తాన్ (చలికాలం),- ఇత్యాదు లితని రచనలు.

హాలీ సారస్వత రచన, ఇంకను విస్తారమైనది. కవిత్వములోవలెనే, వచన రచనలోను, విమర్శలోనూ, కూడా ఇతడు సమర్థుడు. దేశభక్తి కావ్యాలు, భాషా ప్రశంస, ప్రకృతి వర్ణనలు, సంఘ సంస్కరణ కావ్యాలు, నీతిబోధక కావ్యాలు, విలాపగీతాలు,- మున్నగునవి ఇతనిరచనలు. భారతదేశ ప్రాచీన వైభవ ప్రశంస, ప్రస్తుత దైన్యస్థితియొక్క ఆవేదన,- ఈ రెండూ షిక్వా-ఇ-హింద్ (ఇండియా ఆర్తధ్వని) అనే కావ్యములో చిత్రితములై యున్నవి. ఇస్లాము మతాభివృద్ధి వినాశాలను, కరుణరసాత్మకంగా వర్ణించిన, ముసద్దాస్-ఇ-హాలీ, అనే విలాప గీతం, ఇతని రచనలన్నిటిలోనూ శ్రేష్ఠమైనది. ఈ రచనవల్ల, ఇతనికి శాశ్వతమైన కీర్తి సిద్ధించింది.

ఈ కాలపు ఇతర కవులు కూడా, ఆధునిక భావాలకు ఉద్బోధకులైరి. మీరట్‌లోని మహమ్మద్ ఇస్మేల్ (1846-1907) ప్రకృత్యారాధకుడైనకవి. దుర్గాసాహీ సురూర్ (1873-1910) అనేక విషయములను వర్ణించిన కవి. చారిత్రిక, మత విషయక కావ్యాలు ఇతని రచనలలో, ప్రధానములైనవి. సమాజ స్థితిగతులను గూర్చి హేళన కావ్యములను అక్బర్ (1846-1921), రచించెను.

నూతన ఉర్దూ వచన రచన, ఫోర్టు విలియం కళాశాలలో మొదట ప్రారంభ మయింది. ఈ ఆశ్రయంలోవృద్ధికి వచ్చినవారిలో, మీర్ అమ్మాన్, అతని సహో ద్యోగులు ముఖ్యులు. పారసీక పుస్తకములను ఉర్దూలో అనువదించడం, వీరు నిర్వహించిన ముఖ్యకార్యము. శాస్త్రీయమైన వచన రచనను, వ్యాసరచనకు తగిన వచనమును, దిద్దినవాడు ఢిల్లీ వాస్తవ్యుడైన, ఆచార్య రామచంద్ర.

అజాద్, కూర్చిన ఉర్దూ సారస్వత చరిత్ర, ప్రఖ్యాతి కెక్కింది. సాడీ, ఘలిబ్, సయ్యద్ అహమద్ ఖానుల జీవిత చరిత్రలను, హాలీ, రచించెను. నవలా రచయితయైన నాజీర్ అహమద్, న్యాయశాస్త్ర గ్రంథాలను అనువదించెను. చరిత్రలు, విమర్శలు, తత్త్వశాస్త్రము, ధర్మశాస్త్రము,- అనువానిని షిబ్లీ రచించినాడు. రామచంద్రకు శిష్యుడైన జకాఉల్లా, చరిత్రను, ఆంగ్ల విజ్ఞాన గ్రంథాల అనువాదాలను రచించెను.

హాస్యరచనలు, హేళన కావ్యాలు, నవలలు, కథలు,- మొదలైన వానిని రచించి, సృష్ట్యాత్మక వచన భాషను పోషించినవారిలో ఈ కింద పేర్కొనబడిన వారు ముఖ్యులు,- 'ఔధ్ పంచ్' పత్రికా సంపాదకుడైన సజ్జద్ హుస్సేన్, సమయస్ఫూర్తిలో హాస్యరచనలో సమర్థుడు. ఔధ్ సమాజస్థితిని, 'ఫిసానా-ఇ-అజద్ (4 సంపుటాలు)' అనే కావ్యంలో రమణీయంగా చిత్రించినవాడు రతన్ నాథ్ ధార్ సర్షార్. చారిత్రిక కల్పనా రచనలను గావించిన అబ్దుల్‌హాలీం, ఆక ర్షకమైన నూతన ఉర్దూ శైలిని సృష్టించినాడు.

## VI. తమిళ - తెలుగు సారస్వతములు

ఆర్య భాషలలో ఉత్పన్నములైన నూతన ప్రవృత్తులు, ద్రావిడ భాషలైన తమిళ, తెలుగు, కన్నడ, మళయాళములలో కూడా జనించినవి. విస్తారమైన సాహిత్యంగల ప్రాచీన భాష, తమిళం. ప్రాచీనకాలంలోనే, తమిళులకు పాశ్చాత్యులతో సంపర్కమేర్పడింది. పదహైదో శతాబ్దంలో, పోర్చుగీసువారు, ఇండియా ప్రవేశించి, తూర్పు పశ్చిమ తీరాలలో, నెలకొని, ఇండియా స్త్రీలను వివాహమాడి, తమిళ మళయాళ భాషలను నేర్చుకొని, దేశీయులతో కలిసిపోయిరి. వారి వెంటనే, జీససుసంస్థకు చెందిన క్రిశ్చియను మిషనరీలు, ఇండియా ప్రవేశించిరి. తమిళ వచన భాషను సిద్ధపరచుకొని, నిఘంటువులను, వ్యాకరణములను రచించిరి. వారిలో, రాబర్ట్ డి నోబిలి (1577-1656) ప్రథముడు. ఇతని తర్వాత వచ్చినవాడు, కాంస్టాంటీన్ జోసెఫ్ బెస్చి (1700) బహు భాషా పరిజ్ఞానం కలవాడు. జోసెఫ్ జీవితాన్ని 'తెంబవాణీ' అనే కావ్యంగా రచించెను. 'పరమార్థగురుకథై' అనే వచన గ్రంథాన్ని కూడా, ఇతడు రచించెను. వీరి తర్వాత, ప్రొటెస్టంట్ మిషనరీలు, తమిళనాడు ప్రవేశించిరి. బర్తొలమ్యూ జేగెన్‌బాగ్ (Bartholomew Ziegenbalg) (1683-1719) ఇండియాచేరి (1706), తమిళ ముద్రణాలయాన్ని స్థాపించెను.

ఈ మిషినరీల వెంబడి, వర్తకులు, సామ్రాజ్య నిర్మాతలు, వచ్చిరి. ఇండియాపై ఆధిపత్యాన్ని సాగించుకోడానికై పోర్చుగీసులు, డచ్చివారు, ఫ్రెంచివారు, ఆంగ్లేయులు ఒకరితో నొకరు పోటీపడుచుండిరి. పద్దెనిమిదో శతాబ్దములో ఆంగ్లేయులు ఫ్రెంచివారిని దేశీయ ప్రభువులను జయించి, రాజ్యాన్ని స్థాపించడంతో, తక్కిన విదేశీయుల కలహాలన్నీ అంతమొందినవి.

అంతట, ఈస్ట్ఇండియా కంపెనీ స్థాపితమయింది. కలకత్తాలోని ఫోర్ట్ విలియం కళాశాల మాదిరిపై, మదరాసులో ఫోర్ట్‌సెంట్ జార్జ్ కళాశాల 1812 లో స్థాపింపబడింది. కంపెనీ ఉద్యోగములోనుండిన యూరోపియనులు ఈ కళాశాలలో తమిళ భాషను నేర్చుకొనుచుండిరి. తమిళ గ్రంథాలయాన్ని స్థాపించి, తమిళ పుస్తకములను ప్రచురించడానికి ఆరంభించిరి.

ఈ కళాశాలలో భాషా బోధకులుగా చేరిన పండితులు, పాశ్చాత్యదృక్పథాన్ని అలవరచుకొన్న వారిలో ప్రథములు. ప్రాచీన కావ్యాలను పరిశీలించి, విమర్శాత్మకములైన, నూతన ప్రతులను సిద్ధపరచిరి. ఆంగ్ల గ్రంథాలను తమిళమున కనువదించిరి. వ్యాకరణములను, నిఘంటువులను తయారు చేయడంలో పండితులు సహకరించిరి. క్రమంగా స్వతంత్ర సారస్వత రచనకు అనుకూలమైన ఆధునిక వచన భాష ఏర్పడింది. తమిళములో గొప్ప విద్వాంసుడైన, మీనాక్షీ సుందరంపిళ్లై (1815-76) మాతృభాషలో గ్రంథరచన గావించడానికి విద్యార్థులను ప్రోత్సహించెను. ఇతని శిష్యుడైన వేదనాయకంపిళ్లై (1826-89) మొదటి తమిళ నవలను రచించినవాడు. ఇతనికి మరియొక శిష్యుడైన స్వామినాథయ్యర్ (1855-1942) తమిళసారస్వతమును పునరుజ్జీవింపచేసిన మూల పురుషుడని

ప్రసిద్ధి. ప్రాచీన తమిళ గ్రంథములను ఇతడు విశదపరచి, తర్వాత తరాల వారికి ఉత్తేజనం కల్పించినాడు. సుబ్రహ్మణ్య భారతి కూడా ఇతని ప్రభావానికి లోనైనవాడే. ఆంగ్ల సంస్కృతములలోని కథలకు, గాథలకు, అనువాదములు రావడంవల్ల పాఠకులకు చదివేఅవకాశం ఎక్కువయింది. సాంఘిక విషయాలను, భావనాత్మక విషయాలను ఆధారంగా చేసుకొని, స్వతంత్ర నవలలను రచించడం ఆరంభమయింది. షేక్స్పియర్, బెన్‌జాన్‌సన్, గోల్డ్‌స్మిత్, షెరిడన్ మున్నగు ఆంగ్లేయుల రచనలకు అనుసరణములైన నాటకములు, తమిళములో రచితములైనవి. చారిత్రిక, సాంఘిక, భావనాత్మక, దేశ భక్త్యాత్మక భావములు సారస్వత రచనకు అభిమత ఉద్దేశ్యములైనవి.

వచన రచనా వికాసమునకు, ఆధునిక భావప్రసారమునకు పత్రికలు కూడా సహకరించినవి. ఆంగ్ల విద్యావ్యాప్తి వల్ల పాశ్చాత్య సారస్వతముపై అభిరుచి, ఆధునిక యోచనా ప్రవృత్తిని అలవరచుకొనే కాంక్ష, జనించినవి. నూతన వర్గమునకు చెందిన విద్వాంసులు, రచయితలు సంఘములో బయలుదేరి, ఆధునిక తమిళ సారస్వత సృష్టిని గావించిరి.

తెలుగు సారస్వత వికాసమునకు కూడా, ఈ నూతన ప్రవృత్తులే, కారణములైనవి. 19 వ శతాబ్ద మధ్య భాగం వరకు, తెలుగు సారస్వతం క్షీణదశలో ఉండినది. సహజ కవితాసృష్టికి, కవులు పూనుకోలేదు. పాండిత్య ప్రకర్షకే ప్రాధాన్య మేర్పడియుండినది. సజీవమైన సహజ కవితాసృష్టి ఏనాడో ఆగిపోయింది. కృత్రిమ రచనలకు, తుచ్ఛ శృంగార పోషక కావ్యరచనకు, కవితాశక్తి దాస్యమొనర్చింది. 1850 నుండి 1900 వరకు గల కాలంలో సారస్వత పరివర్తనం జరుగుతూ వచ్చింది. సంప్రదాయ విధానమునకు, ఆంగ్ల ప్రభావానికి ఘర్షణ జరుగుచున్న కాలమిది. కవిత్వ విషయములో, పాతపద్ధతే అనుసరింపబడుతూ ఉండినది. అదే ఉత్తమమైనదని కవుల భావము. మహాభారత రామాయణకథలే, చర్విత చర్వణంగా, కవులు రచిస్తూ వచ్చిరి. ద్వ్యర్థి కావ్యములు, శబ్దానుప్రాసలు, కవుల అభిమత పద్ధతులు. అష్టావధాన శతావధానాలు పాండిత్య ప్రదర్శకములు. చిన్నయసూరి రచియించి ఇచ్చిన కృతకవచనము, పండితులకు ఆదరణీయమయింది. కృతక శబ్దాలంకారములతో, ప్రయత్న పూర్వకంగా తయారుచేసిన ఈ వచనశైలికి, వ్యవహారభాషకు, విస్తారమైన అంతరం ఏర్పడింది.

1880 ప్రాంతంలో, సాంఘిక సంస్కరణ సందర్భములో భాషా విషయికమైన ఒక నూతనోద్యమం ప్రారంభమయింది. ఈ ఉద్యమాన్ని బయలుదేరదీసినవాడు, కందుకూరి వీరేశలింగం (1848-1919). సాంఘిక దురాచారములను హేళన గావించే ఉద్దేశముతో 'హాస్య సంజీవిని' పత్రికను ప్రారంభించెను. నూతన సారస్వత శిల్పమును పోషించే నిమిత్తం 'వివేకవర్ధిని' పత్రికను స్థాపించెను. నవలలు, వ్యాసాలు, నాటకాలు, శాస్త్ర గ్రంథాలు తెలుగులో మొదట రచించినవా డితడే. ఇతనితో నూతన సారస్వత యుగం ఏర్పడింది. కృత్రిమమైన చిన్నయసూరి భాషను విసర్జించి, సరళమైన, సహజమైన, ప్రామాణికవచన

భాషను, వీరేశలింగం సృష్టించినాడు.

ఆధునిక భాషా శైలిని పోషించిన వారిలో గురుజాడ వెంకటప్పారావు, గిడుగు వెంకటరామ మూర్తి, కొమర్రాజు వెంకట లక్ష్మణ రావు, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు ముఖ్యులు. తెలుగు సారస్వతము యొక్క పునరుజ్జీవనమునకు వీరు మార్గదర్శకులు. పరివర్తన కాలమునకు పూర్వము, వ్యవహారములో నుండిన సరళ, సహజ భాషను పునరుద్ధరించడానికి, వీరు ప్రయత్నించిరి. నవ్య సాహిత్యానికి, నవ్య సారస్వత యుగానికి తగిన పరిస్థితులను వీరు, సిద్ధపరచి యుంచిరి.

వివిధ సారస్వతోద్యమముల పరిశీలనను బట్టి, ఒకే విధమైన భావ ప్రవృత్తులకు దేశములోని ప్రజలందరూ లోనై యుండిరని, విశదమగుచున్నది. పాశ్చాత్య భావాలను, పాశ్చాత్య దృక్పథాన్ని, భావ వ్యక్తీకరణ సాధనములను గ్రహించడానికి, భారతీయులు ఆసక్తులై యుండిరి. కాని, తమ సహజత్వమైన సనాతన సంప్రదాయమునకు బద్ధులై యుండిరి. ప్రాచీన వ్యవస్థలోని అంశాలను మార్చడానికి, కొన్నిటిని పరిత్యజించడానికి కూడా సిద్ధపడిరి; కాని, ప్రాచీన వ్యవస్థను పూర్తిగా ఖండించడానికి అంగీకరింపలేదు. తమ సంస్కృతికి శాశ్వత పోషణను కలిగించడానికి సమర్థమై, ఉన్నతాశయములతో కూడినదై యున్న సనాతన వ్యవస్థను రక్షించుకొంటూ, నూతన సామాజిక వ్యవస్థను ఏర్పరచుటకు ఆవశ్యకములైన అంశాలను పాశ్చాత్యుల నుంచి గ్రహించడానికి, భారత జాతి సిద్ధపడింది. ప్రాచీన సంస్కృతిలోని ప్రధాన విషయములను విడువక, ప్రాక్పశ్చిమ సంస్కృతులను సమన్వయ పరచడానికి పూనుకోవడం వల్ల, మత వ్యవస్థలోను, భావ ప్రవృత్తులలోను, వైవిధ్యం సిద్ధించింది. ఐనా, ప్రజలందరిలోను, సమానమైన దృక్పథము, సమానములైన సామాజిక భావములు, అభిప్రాయములు దేశములో ఏర్పడినవి. జాతీయ చైతన్యోదయానికి ఆవశ్యకమైన పూర్వ పరిస్థితి ఈ విధంగా సిద్ధించింది.

# సవరణలు

| పేజి | పంక్తి | సవరణ |
|---|---|---|
| 7 | 24 | లభించకుండాచేయగా |
| 8 | 14 | రాలేదని |
| 12 | 27 | నియమనాలను |
| 17 | 3 | ఫోండ్‌జీవాఫ్ |
| 21 | 8 | అసంతుష్టికి |
| 21 | 12 | వెలివేసినారు. |
| 28 | 17 | ముఖ్యులైనవారున్నూ |
| 33 | 3 | సహకారంతో |
| 34 | 14 | సహాయాన్నిచ్చినారు. |
| 51 | 4 | పదవులన్నిటికీ |
| 54 | 5 | గౌరవింపబడుతూవచ్చినవి. |
| 58 | 9 | భయభ్రాంతీ |
| 80 | 5 | విముక్తులైన |
| 88 | 10 | యుద్ధచర్యకు |
| 104 | 26 | సర్దారులూ |
| 106 | 19 | చైతన్యశక్తి. |
| 110 | 6 | విపత్పరిణామానికి |
| 129 | 20 | వాస్తవిక సంఖ్య |
| 138 | 31 | సామాన్యజనంతో |
| 141 | 32 | గావించిన |
| 145 | 25 | దేశీయమైన |
| 153 | 22 | సంప్రదాయపరమైన |
| 163 | 7 | పరిస్థితులవల్ల |
| 164 | 31 | ఇదివరకే |
| 171 | 7 | సమానలక్షణాలూ |
| 174 | 3 | ఇంకనూ |
| 184 | 3 | నడపడానికి కానీ |
| 189 | 13 | వారికి |
| 190 | 13 | భావస్ఫూర్తి |
| 190 | 34 | ప్రభావాన్ని నెరపి |
| 198 | 20 | ప్రామాణ్యమెట్టిదైనా |
| 208 | 22 | విద్యాసంస్థల |
| 211 | 32 | పరిపాలనాభివృద్ధీ |
| 213 | 25 | పాలకులు |
| 224 | 14 | గ్రామ పాఠశాలను |
| 225 | 29 | భారతదేశంలో |
| 226 | 35 | విజ్ఞానాన్ని నిరాదరించడము |
| 229 | 6 | అధ్యయనంచేసిన |
| 238 | 10 | శిల్పప్రవర్తనలను |
| 242 | 20 | నేరం విషయంలో |
| 246 | 15 | మన దేశప్రజలలో |
| 255 | 31 | ప్రభావపు తాకిడి |
| 259 | 35 | పెడదారి పట్టించినాడు. |
| 270 | 9 | చేసింది. |
| 273 | 3 | ప్రతిష్ఠించడానికై |
| 281 | 17 | (Paradoxical) |
| 291 | 10 | విధానమేర్పడింది. |
| 317 | 5 | (Inequities) |
| 319 | 30 | తమ డబ్బు |
| 320 | 7 | వస్తు వినిమయ |
| 321 | 8 | వృద్ధిచేయడానికి ఎక్కడా |
| 322 | 1 | విచారణవల్ల |
| 325 | 7 | క్షేత్ర అన్యాక్రాంత |
| 326 | 1 | దుర్భరమైన [illegible]డి. |
| 330 | 3 | ప్రజాసంఖ్యాభివృద్ధి |
| 330 | 23 | దుర్భరమై |
| 336 | 6 | ఎగుమతి |
| 364 | 20 | అత్యవసరములైన |
| 367 | 11 | అసంతుష్టితో |
| 375 | 11 | వహాబీలు |

| పేజి | పంక్తి | సవరణ |
|---|---|---|
| 382 | 15 | మత విషయక |
| 391 | 33 | అంగీకరించినట్లయితే |
| 394 | 22 | ఆధిపత్యం |
| 397 | 24 | ముస్లిములు. |
| 398 | 36 | ఆధికారికంగా |
| 399 | 6 | వ్యావసాయిక |
| 404 | 24 | సంస్కరణానికి |
| 407 | 24 | వైయక్తిక న్యాయము |
| 418 | 2 | (Challenge) |
| 419 | 28 | మేలు జరిగింది |
| 420 | 31 | గ్రంథాలు. |
| 426 | 17 | బోధించడము |
| 431 | 19 | లోబడడము |
| 436 | 27 | సమత్వాలపై |
| 438 | 13 | సుఖతత్వ |
| 441 | 4 | సాధనలకు |
| 442 | 25 | మతనిష్ఠ. |
| 444 | 15 | స్వత్వము. |
| 444 | 18 | గాంభీర్యములు |
| 460 | 5 | సిర్వేదము |
| 464 | 1 | పరిపాలన |
| 479 | 8 | అసంతుష్టమైన |
| 481 | 7 | ఉదారహృదయులు |
| 488 | 18 | ఆదరణకై |
| 492 | 16 | మూలంగానే |
| 498 | 16 | పొందడానికి |
| 503 | 28 | కేంద్రాభిముఖములై |
| 503 | 31 | విరుద్ధములైనట్టివి |
| 513 | 12 | పరిపాలించవలసిందని |
| 522 | 28 | వీళ్లు |
| 528 | 19 | బ్రిటిష్‌వారు. |
| 530 | 9 | క్షీణించినది. |
| 532 | 34 | డ్యూక్ |
| 537 | 21 | ఉంచడానికి |
| 537 | 30 | వివరించడానికి |
| 560 | 21 | పాక్షికంగా |
| 564 | 11 | అర్ధస్వతంత్రవ్యవస్థ |
| 570 | 21 | పోరాడుతున్న |
| 571 | 15 | స్థాపించింది. |
| 571 | 36 | ప్రభుత్వవ్యవస్థ |
| 573 | 36 | ప్రభుత్వ కార్యాలయాలను |
| 588 | 15 | ఆక్టేవియస్ హ్యూమ్ |
| 608 | 5 | మాత్రం లేదు. |
| 611 | 28 | భారతీయులకు |
| 621 | 35 | హెచ్చరించినాడు. |
| 631 | 1 | పందొమ్మిదో |
| 633 | 12 | రామ్‌మోహన్‌రాయ్ |